శుభమస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

శ్రీ పరమేశ్వరాంశ సంభూతులగు,
శ్రీవిద్యారణ్యస్వాములవారిచే రచియింపంబడినట్టియు,
అజ్ఞానాంధకారప్రచండ భాస్కరాయమాణమై నట్టియు,
శ్రీపరతత్వమును కరతలామలకంబుగ గోచరింపజేయునట్టి

# శ్రీవేదాంతపంచదశి.

శ్రీ బ్రహ్మవిద్యావిరాజితుండును,
కొత్తపట్టణ నివాసియు నగు బ్రహ్మశ్రీ,
మంత్రి * లక్ష్మీనారాయణశాస్త్రిచే
సంస్కృత వ్యాఖ్యానమునకు సమ్మతముగా రచియింపబడిన
ఆంధ్రటీకా తాత్పర్యసహితము.

ఈ గ్రంథము,
పండితసార్వభౌములగు
అన్నవరపు - వేంకటరాఘవ శాస్త్రులవారిచే,
బరిష్కరింపబడినది.

*Revised edition.*

ఏతద్గ్రంథ స్వాతంత్ర్యమును బొందిన
బరరాడు * త్యాగరాయశాస్త్రులచే
స్వకీయ
గీర్వాణభాషారత్నాకర ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె.

1912.

**Registered copy Right.**

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



R65
35E2V



శిష్యబృందసహిత శ్రీవిద్యారణ్యస్వామీ.

☞ ఈగ్రంథము గవర్న్మెంటువారి ఆజ్ఞప్రకారముగ రిజిస్టర్ చేయబడియున్నది. కాబట్టి ఇతరులు ముద్రింపఁగూడదు.

LIBRARY
Jangamawadi Math, Varanasi
No. ...519...

ఈగ్రంథక్రయము రూ. ౫=౦=౦

తపాలాఖర్చు ౦=౮=౦

ఇట్లు,

ఏతద్గ్రంథ స్వాతంత్ర్యమునుబొందిన

# బరూరు - త్యాగరాయశాస్త్రులు.

(౨౧౬) నెం. గోవిందప్పనాయనివీధి. మదరాస్.

వలయువారు- మదరాస్‌లో బరూరు - త్యాగరాయశాస్త్రులపేర వ్రాసి తెప్పించుకొనవచ్చును.

 

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుభమస్తు.

# శ్రీ వేదాంత పంచదశీపీఠిక.

శ్రీపరమేశ్వరాంశ సంభూతులును వైదికమార్గప్రవర్తకులు నగు శ్రీవిద్యారణ్యస్వాములవారు, లోకమందు పరమకృపాయత్తచిత్తులై చతుర్వేదభాష్యమును రచియించి, కాశికివెళ్లి యావేదభాష్యమును వ్యాసమహామునికిజూపి, ఆవేదవ్యాసమునీంద్రునివలన సమ్మతగౌరవములనుబొందిరి. ఆమహాత్ములగు విద్యారణ్యులు, ఇన్నూరుసంవత్సరములపర్యంతము వ్యవహారమందు ప్రవర్తించి, పిమ్మట పర్వతగుహాలో ప్రవేశించిరి. మరియు,ఆవిద్యారణ్యస్వాములు భూపరిపాలనను జేయుచు, తనమహిమవలన తానునివసించియుండెడిపట్టణమందు సువర్ణవర్షమును గురిపించిరి. పిమ్మట తనభూమండలమునంతయు, శ్రీబుక్కరాజునకిచ్చి, ఆబుక్కరాజునకు మంత్రిగానుండిరి. మరియు:ఆమహాత్ములగువిద్యారణ్యులు, తాను వ్యవహారమందుండిన కాలమందు ఒక్కొక్క శాస్త్రములో నానావిధ చిత్రవిచిత్రమహాగ్రంథములను రచియించిరి. వారుఈప్రకారముగా సర్వశాస్త్రములయందును రచియించినగ్రంథములు, (౧౨౦౦) గలవు. మరియు, ఆమహాత్ములగు విద్యారణ్యులు, తనయోగబలమువలన అప్పుడప్పుడు స్వర్గాదిలోకములకు వెళ్ళివచ్చుచుండెను. అక్కాలమందు బ్రహ్మదేవునకు ఒకవిధమైనవ్యాధిగలిగెను. అతనికి అశ్వినీదేవతలు ఔషధమిచ్చినను, ఆవ్యాధినివర్తింపకుండగా, అప్పుడశ్వినీదేవతలు బ్రహ్మదేవునకు శ్రీవిద్యారణ్యగురునియొక్క ప్రభావమును జెప్పి, యాబ్రహ్మదేవునియనుమతినిబొందివచ్చి, ఈభూలోకమందుండెడి శ్రీవిద్యారణ్యగురుని, బ్రహ్మలోకమునకు దోడ్కొనిపోయిరి. అప్పుడు, శ్రీవిద్యారణ్యగురుండు, ఒకానొక యోషధిని బ్రహ్మదేవునిచేత సేవింపజేసి, అతనివ్యాధినిమాన్పి, మరల నీభూలోకమునకువచ్చిరి. ఈప్రకారముగా శ్రీవిద్యారణ్యగురునియొక్క విచిత్రచారిత్రమును, నేను పెద్దలవల్ల వింటిని. అట్టిసర్వజ్ఞసార్వభౌముడగు శ్రీవిద్యారణ్యగురుండు, జననమరణాదిలక్షణసంసారమోహ సముద్రమందు జిక్కుబడి మిణకరించెడిజనుల నుద్ధరించెడికొరకు, వివరణోపన్యాసాది మహాగ్రంథములను నిర్మించి, పిమ్మట శ్రీపరతత్త్వమును కరతలామలకంబుగ గోచరింపజేయునట్టి, సర్వోపనిషత్సారభూతమగు శ్రీవేదాంతపంచదశియనెడి ప్రకరణగ్రంథమును రచియించెను. ఆపంచదశికి శ్రీవిద్యారణ్యమునిశిష్యుడగు రామకృష్ణపండిత సార్వభౌముండు, సంస్కృతవ్యాఖ్యానము జేసెను. సంస్కృతభాషా పరిచయము లేనివారికి, తద్వ్యాఖ్యానగతాభిప్రాయము దెలియదనిదలచి,ఒకానొక రహస్య కారణముచేత ఈ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పంచదశికి, నేనాంధ్రటీకను రచియించి, శ్రీకృష్ణదేవునకు సమర్పించవలెనని, అంతర్యామియగు శ్రీకృష్ణభగవంతునివలన ప్రేరేపింపబడినవాడనై తత్పంచదశీవ్యాఖ్యాభిప్రాయమును కొంచమైనను వదలక నాయిష్టదైవమగు శ్రీకృష్ణదేవుని పాదకమల స్మరణము జేయుచు సమగ్రముగా ప్రతిపదటీకాతాత్పర్యములను వ్రాసితిని. ముద్రింపించుటకు ధనములేమిచేత చందాదారుల నేర్పరుచుకొని ముద్రింపించితిని. ఇంతఘనకార్యము నిర్విఘ్నానాయాసములతోటి శీఘ్రముగా సఫలమగుటకు, శ్రీకృష్ణదేవునికృపారసమే కారణమగును. శ్రీభగవద్భక్తులగుజనులు ఈపంచదశినిసేవించి, తదర్థానుసంధానపరులై, జీవబ్రహ్మైక్యలక్షణముగల అపరోక్షజ్ఞానమునుబొంది కృతార్థులగుదురని చెప్పుటకు, నాకు లేశమైనను సందియములేదు. ఈవేదాంత శాస్త్రమంతు ఆనందమయకోశను ఈశ్వరరూపముగాను, జీవునియొక్క కారణశరీరముగాను బ్రతిపాదింపబడుచున్నది. ప్రకృతి, విశుద్ధసత్వప్రధానగా బరిణమించి, మాయాశబ్దముచేత జెప్పబడుచున్నదనియు, ఆప్రకృతియే మలినసత్వప్రధానముగా బరిణమించి అవిద్యాశబ్దముచేత జెప్పబడుచున్నదనియు, ఈమాయా అవిద్యలు రెండునుం జేరి, ఆనందమయకోశమగుననియు, ఈశ్వరరూపమగు ఆనందమయాంశము మహాకారణశరీరమనియు, జీవోపాధియగు ఆనందమయాంశము కారణశరీరమనియుం జెప్పబడునని తెలియవలెను.

—※ ఈగ్రంథమందలి కఠినపదముల కర్థము. ※—

౧ అహంప్రత్యయము-నేననెడివిషయము. నేననెడిజ్ఞానము.
౨ అవయవము-అంగము.
౩ అంశము-భాగము. అవయవము.
౪ అదృష్టము- కనబడనిది. పుణ్యవిశేషము.
౫ అనిర్వచనీయము- నోటిచేతజెప్పుటకు శక్యముగానిది.
౬ అభావము-లేమి.
౭ అపసిద్ధాంతము-సిద్ధాంతభంగము)
౮ అజ్ఞుడు-తెలియనివాడు. (వాడు
౯ అల్పజ్ఞుడు - కొంచెము దెలిసిన
౧౦ అవ్యక్తము - ఇంద్రియములకుగోచరించనిది.
౧౧ అంతఃకరణము- అంతరింద్రియము. మనోబుద్ధి చిత్తాహంకారరూపము.
౧౨ అపరోక్షము- ప్రత్యక్షము.
౧౩ అనుబంధచతుష్టయము- ౧. అధికారి. ౨. విషయము, ౩.సంబంధము, ౪. ప్రయోజనము.
౧౪ అండజము - గ్రుడ్డువలనబుట్టిన జంతువు.
౧౫ అధ్యాసము-ఒకవస్తువునందుగల ధర్మములు మరియొక వస్తువునందున్నట్లు భ్రాంతిచేదోచుట.
౧౬ ఆకాంక్ష-ఎచ్చట, ఎందుకు,ఎటువంటిది. అనియిట్లు తర్కించుట.)
౧౭ ఆరోపము=కల్పనము.
౧౮ ఆంతరము-లోపట.
౧౯ ఆంతరింద్రియము= అంతఃకరణము-మనోబుద్ధిచిత్తాహంకారరూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పము.

౨౦ ఆరోపించుట-కల్పించుట.

౨౧ ఉపాదానకారణము- ఘటాదికార్యముయొక్క ఉత్పత్తిస్థితిలయము లకు ఆధారమగు మృత్తిక మొదలగునది.

౨౨ ఉద్భిజ్జము-భూమిని పెకలించుకొనిబుట్టెడివృక్షాదికము.

౨౩ కర్మము-చేయబడునది.

౨౪ కర్తృ-చేసెడివాడు.

౨౫ కర్త-చేసెడివాడు.

౨౬ కరణము-సాధనము.

౨౭ కామ్యము-కోరదగినది.

౨౮ కాముకుడు-కోరెడివాడు.

౨౯ కార్యము-చేయదగినది.

౩౦ కామనా కోరిక.

౩౧ కామము-ఇచ్ఛ.

౩౨ క్రియ-చేయుట, కర్మము.

౩౩ జ్ఞాతము-ఎరుగబడినది.

౩౪ జ్ఞాతతా-ఎరుగబడుట.

౩౫ జ్ఞానము-ఎఱుక.

౩౬ జ్ఞానతా-ఎరుగుట.

౩౭ జ్ఞాని-బ్రహ్మవేత్త.

౩౮ జ్ఞానితా-జ్ఞానిభావము.

౩౯ జ్ఞాతృ-ఎరిగెడివాడు.

౪౦ జ్ఞేయము-తెలియదగినది.

౪౧ చిత్తు-చైతన్యము- పరమాత్మ-బ్రహ్మము-కూటస్థుడు-ఆత్మ.

౪౨ చిదాభాసుడు-చిత్తుయొక్క ప్రతిబింబము-జీవుడు. (చుట.

౪౩ ఛిదిక్రియ- ఛేదనక్రియ - ఛేదిం

౪౪ జరాయుజము - మానివలనబుట్టిన మనుష్యుడు మొదలగుజంతువు.

౪౫ జీవన్ముక్తి-జీవించియుండియే సంసారబంధమువలనవిడువబడుట.

౪౬ తూష్ణీంభావము జాగ్రదవస్థయందు సంకల్పము లేనిసమయము.

౪౭ ద్రవ్యము - గుణములకు ఆశ్రయమైనభూమి మొదలగునది. ధనము

౪౮ దుర్ఘటము - సాధ్యముగానిది.

౪౯ ధ్యాత- ధ్యానమును జేయువాడు.

౫౦ ధ్యాతృ-ధ్యానమును జేయువాడు.

౫౧ ధ్యానము-ధ్యానించుట.

౫౨ ధ్యేయము-ధ్యానింపదగినది. అనగా ధ్యానింపబడునది.

౫౩ ధర్మము-వస్తుస్వభావము.

౫౪ ధర్మి-ధర్మమునకు ఆధారవస్తువు

౫౫ నిరవయవము-అవయవము లేనిది.

౫౬ నిమిత్తకారణము-ఘటమువంటి కార్యమును జేసెడి కుమ్మరివాని వంటివాడు.

౫౭ నిరంశము-అవయవము లేనిది.

౫౮ నిస్సంగుడు- సంబంధము లేనివాడు. ఆసక్తిలేనివాడును.

౫౯ పరోక్షము - ప్రత్యక్షమందు లేనిది.

౬౦ ప్రధానాదికము - మాయ మొదలగునది.

౬౧ పరిచ్ఛిన్నము-మితిగలది.

౬౨ పరిచ్ఛేదము-మితి.

౬౩ ప్రతియోగి- విరుద్ధధర్మములుగలది. విరుద్ధధర్మములుగలవాడు

౬౪ పురుషుడు - కూటస్థసహితచిదాభాసుడు. మానవుడు.

౬౫ పరిహారము- దోషము లేదనిపడిచిపెట్టుటకుదగిన సమాధానము.

౬౬ ప్రమాత- కూటస్థసహితబుద్ధిస్థితచిదాభాసుడు.

౬౭ ప్రమాతృ- కూటస్థసహితబుద్ధిస్థితచిదాభాసుడు.

౬౮ ప్రమాణము- చిదాభాసునితోగూడిన అంతఃకరణవృత్తిరూపము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౬౯ ప్రమేయము-ప్రమాణమునకువిషయమగు ఘటాదిరూపము.

౭౦ ప్రాగభావము- పూర్వము లేనిది.

౭౧ ప్రియమోదప్రమోదములు - ఇష్టవస్తువును చూచుటచేత గలిగెడి సుఖవృత్తి, ప్రియమగును. ఆయిష్టవస్తువులభించుటచేత గలిగెడి సంతోషము, మోదమగును. ఆయిష్టవస్తువు ననుభవించుటచేత గలిగెడి సంతోషము, ప్రమోదమని చెప్పబడును.

౭౨ బాధ-లేమి.

౭౩ భోక్తవ్యము-అనుభవింపదగినది

౭౪ భావము-ఉండుట.

౭౫ భోగ్యము. అనుభవింపదగినది.

౭౬ భోక్త-అనుభవించెడివాడు.

౭౭ భోగము-అనుభవము. భోగించుట.

౭౮ ముముక్షువు-మోక్షేచ్ఛగలవాడు.

౭౯ మృత్తిక-మెత్తనిమట్టి.

౮౦ మిథ్య-అసత్యము.

౮౧ మనోరాజ్యము - మనస్సుచేతవిషయములను విశేషముగాతలచుట.

౮౨ మాత్ర- (అ) అనెడి యొకలఘ్వక్షరము నుచ్చరించుటకుదగినకాలము.

౮౩ రజతము-వెండి.

౮౪ లింగం- శాస్త్రమందు చెప్పబడినహేతువు.

౮౫ వాసనలు - అహంకార మమకారాదులను గలిగించుటకు కారణములై సూక్ష్మరూపముగా కారణశరీరమందుండునవి.

౮౬ విశిష్టము- ధర్మముతోగూడినది.

౮౭ విషయాకరించుట- ప్రత్యక్షముగానెరుగుట.

౮౮ వ్యష్టి-ఒకవృక్షము మొదలగునది.

౮౯ విశేష్యము- ముఖ్యవస్తువు.

౯౦ విశేషణము - విశేష్యముయొక్క అవయవ రూపము. విశేష్యత్వమును దెలుపునది.

౯౧ వృత్తి-బుద్ధిప్రవర్తనము - అనగా బుద్ధివృత్తి.

౯౨ వ్యావృత్తము - విడువబడుట.

౯౩ వ్యక్తము- ఇంద్రియములచేతబ్రత్యక్షముగా దెలియబడునది.

౯౪ విషయీ-ఆత్మ.

౯౫ వేద్యత్వము-జ్ఞాన విషయత్వము-అనగా జ్ఞానముచే దెలియబడుట.

౯౬ విదేహముక్తి- దేహమునువిడచి, స్వస్వరూపముగా నుండుట.

౯౭ సత్తు-సత్యవస్తువు.

౯౮ సంసారము - దేహమనుష్యాదియోనులయందుబుట్టుచు జచ్చుచుండుట.

౯౯ సావయవము - అవయవములతో గూడినది. అనగా నవయవము గలది.

౧౦౦ సాంశము-డిటో.

౧౦౧ సంసర్గము-కూడిక.

౧౦౨ సామానాధికరణ్యము - ఏకత్వము. అనగా భేదము లేమి.

౧౦౩ సద్వితీయము - రెండవవస్తువుతో గూడినది.

౧౦౪ సంగము-కూడిక. ఆసక్తి.

౧౦౫ స్వయం-తాను.

౧౦౬ సత్యం-సత్యమైనది.

౧౦౭ సంవేదనము-జ్ఞానము.

౧౦౮ సంవిత్కర్మత్వము-జ్ఞానవిషయత్వము-అనగాజ్ఞానముచే ఘటాదికమువలెనే నెరుగబడుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీరస్తు.

# విషయసూచిక.





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



బహూరు - త్యాగరాయశాస్త్రీతి

పూర్వాశ్రమ ప్రసిద్ధాభిధాన

రాజయోగి - శ్రీవాసుదేవానంద సరస్వతీస్వామీ.

కలియుగ గతాబ్దాః ౫౦౧౭ నళసంవత్సరే తులామాసే

షష్ట్యబ్దపూర్తిః - రాజయోగాశ్రమ ప్రవేశః.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుభమస్తు.

శ్రీకృష్ణసద్గురుపరబ్రహ్మణేనమః

ఆంధ్రటీకాతాత్పర్యసహిత

# శ్రీవేదాంతపంచదశి.

## ప్రత్యక్తత్త్వవివేకప్రారంభము.

అవతారిక. శ్రీవిద్యారణ్యగురుండు, తానుప్రారంభించుటకు ఇచ్ఛయించిన గ్రంథమునకు, పరిసమాప్తిప్రవృద్ధి గమనములుగలిగెడికొరకు, శిష్టాచార పరిప్రాప్తమైన ట్టియు, తనచేతననుష్ఠింపబడునట్టి, ఇష్టదేవతా గురునమస్కారలక్షణమగు మంగళాచరణమును, శిష్యశిక్షకొరకు, ఇప్పుడొక శ్లోకముచేత జేయుచున్నాడు.

శ్లో॥ నమఃశ్రీశంకరానందగురుపాదాంబుజన్మనే।
సవిలాసమహామోహగ్రాహగ్రాసైకకర్మణే॥ ౧.

టీక. సవిలాసమహామోహ గ్రాహగ్రాసైకకర్మణే=సవిలాస - కార్యవర్గము తోగూడిన, మహామోహ - మూలాజ్ఞానమనెడి, గ్రాహ- మొసలిని, గ్రాస- మ్రింగుటయే, ఏక - ముఖ్యమైన, కర్మణే - వ్యాపారముగాగల, శ్రీశంకరానందగురుపాదాంబుజన్మనే = శ్రీ - అష్టైశ్వర్య సంపన్నుడైన, శంకరానందగురు - శంకరానందగురుని యొక్క, పాద-పాదములనెడి, అంబుజన్మనే-కమలద్వయముకొరకు, నమః-నమస్కారము, (అస్తు) అగుగాక.

తాత్పర్యము. శ్రీశంకరానంద గురువులయొక్క, పాదపద్మములకు నమస్కరించుచున్నాను. ఆపాదపద్మ మెటువంటిదనగా, కార్యవర్గముతోగూడిన మూలాజ్ఞానమనెడి మొసలినిమ్రింగుటయే, ముఖ్యవ్యాపారముగాగలది యగుననితాత్పర్యము.

శం - అనగా సుఖమగును. అట్టి సుఖమును గలిగించెడివాడు శంకరుడగును. అనగా, సకలజగంబునకు ఆనందముగలిగించెడి పరమాత్మయే, శంకరుడని తెలియవలయును. ఇట్లు, శ్రు॥ ఏషహ్యేవానందయాతి॥ అనెడి శ్రుతిజెప్పుచున్నది. మరియు, ఆనందమనగా ప్రత్యగాత్మయగును. ఆప్రత్యగాత్మ, నిరతిశయమగు ప్రేమకు ఆస్ప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుడగుటచేత, బరమానందరూపుడగును. గనుక, శంకరానందుడనగా, ప్రత్యగభిన్న పరమాత్మయని తెలియవలెను. అట్టి పరమాత్మనే, గురుడని చెప్పబడెను. ఇట్లు శ్రు॥ సదీక్షయాచార్యమూర్తిస్థః॥ అనెడిఆగమవాక్యము చెప్పుచున్నది. ఇట్లు చెప్పుటచేత శిష్యులప్రతిబంధక పాపములనుపోగొట్టుటకు, శంకరానందగురుడు సమర్థుడని తెలియవలెను. మరియు, శంకరానందగురుడు, అణిమాద్యష్టైశ్వర్య సంపన్నుడని చెప్పుట చేత, భక్తులకి ఇష్టమును సంపాదింపుటయందు, సామర్థ్యముగలదని సూచింపబడెను. ఈ శ్లోకమందు శంకరానందమనెడి, రెండు పదములకుగల సామానాధికరణ్యము చేత, జీవబ్రహ్మములకు ఏకత్వలక్షణవిషయము చెప్పబడెను. ఇట్లు చెప్పుటచేత, జీవునకు పరబ్రహ్మరూపభావమువల్ల బరిపూర్ణ సుఖముగలుగుట, సూచించబడెను. మరియు, మూలాజ్ఞానమును నశింపజేయుటచేత, నిశ్శేషదుఃఖనివృత్తి లక్షణమైన ప్రయోజనము, మొదటనే సూచింపబడెనని తెలియవలెను.

అవతారిక. ఇప్పుడు, నూతనప్రయోజనకథనపూర్వకముగా, గ్రంథారంభమును జేయుచున్నాడు.

శ్లో॥ తత్పాదాంబురుహద్వంద్వ సేవానిర్మలచేతసాం।
సుఖబోధాయతత్వస్యవివేకోయంవిధీయతే॥ ౨.

టీక. తత్పాదాంబురుహద్వంద్వసేవానిర్మలచేతసాం=తత్ - ఆశంకరానందగురునియొక్క, పాద- పాదములనెడి, అంబురుహద్వంద్వ- కమలద్వయముయొక్క, సేవా - సేవించుటచేత, నిర్మల - కామక్రోధాదిరహితమైన, చేతసాం - చిత్తముగలవారికి, సుఖబోధాయ- అనాయాసముగా తత్వజ్ఞానోదయమయ్యెడికొరకు, తత్వస్య- ఆరోపితస్వరూపముగాని బ్రహ్మముయొక్క, వివేకః-వివేచనము, విధీయతే - విధింపబడుచున్నది. అనగా జేయబడుచున్నదనుట.

తాత్పర్యము. ఆశంకరానందగురునియొక్క పాదకమలద్వయమును సేవించెడి జనులకు, కామక్రోధాదిరహితమైన పరిశుద్ధచిత్తముగలుగును. అట్టి పురుషులకు అనాయాసముగా, తత్వజ్ఞానము పుట్టించుట కొరకు, ఈశ్లోకమందు జెప్పబోయెడి ప్రకారము అఖండసచ్చిదానందస్వరూపమగు పరబ్రహ్మము విభజించి తెలుపబడును. అపరబ్రహ్మము, కల్పితముగాని వాస్తవస్వరూపమగును. మరియు, పంచకోశాదిలక్షణముగల జగంబంతయును, మాయాకల్పితమగును. అట్టి జగంబువల్ల బ్రహ్మతత్వమును విభజించి యెరిగెడి వివేకము, ఈ గ్రంథమందు జెప్పబడునని యభిప్రాయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. జీవబ్రహ్మములకు ఏకత్వలక్షణవిషయమును దెలిపెడికొరకు, జీవునకు సత్యజ్ఞానానందరూపమును దెలుపదలచి, ఇప్పుడు జ్ఞానమునకు అభేదమును బ్రతిపాదించుచు నిత్యత్వమును సాధించుచున్నాడు.

శ్లో॥ శబ్దస్పర్శాదయో వేద్యావైచిత్ర్యాజ్జాగరేపృథక్।
తతోవిభక్తాతత్సంవిదైకరూప్యాన్నభిద్యతే॥ 3.

టీ. జాగరే - జాగరితావస్థయందు, వేద్యాః-జ్ఞానముచేత నెరుగదగిన, శబ్దస్పర్శాదయః - శబ్దస్పర్శరూపరసగంధములు, వైచిత్ర్యాత్ - నానావిధములుగా నుండుటవల్ల, పృథక్ - పరస్పరముగా భేదింపబడుచున్నవి. తతః- ఆశబ్దస్పర్శాదులకంటె, విభక్తా - బుద్ధిచేత విభజింపబడిన, తత్సంవిత్ =తత్ -ఆశబ్దస్పర్శాదులయొక్క, సంవిత్ - జ్ఞానము, ఐకరూప్యాత్ - జ్ఞానము జ్ఞానమని యేకాకారముగానుండుటవల్ల, నభిద్యతే - పరస్పరముగా భేదింపబడదు.

తా. ఇంద్రియములచేత పదార్థములను బొందెడి సమయము, జాగరితావస్థయని చెప్పబడును. అట్టి జాగరితావస్థయందు, జ్ఞానముచేత నెరుగబడెడి, శబ్దస్పర్శరూపరసగంధములైదును, పంచభూతములయొక్క గుణములగును. ఆశబ్దస్పర్శాదిగుణములకు, ఆకాశవాయ్వగ్ని జలభూములనెడి పంచభూతములును ఆధారములై యున్నవి. మరియు, ఆశబ్దస్పర్శాదులును, ఆకాశాదిపంచభూతములును, నానావిధములుగా నుండుటవల్ల, గోవు గుఱ్ఱము మొదలగువానివలె, పరస్పరముగా భేదింపబడుచున్నవి. మరియు ఆశబ్దస్పర్శాదివిషయములను ఎరిగెడి జ్ఞానమును బుద్ధిచేత వేరుగాజేసినయెడల, జ్ఞానము జ్ఞానము జ్ఞానము, అని యిట్లు ఏకాకారముగా బ్రకాశించుచు, ఆకాశమువలె, భేదింపబడకున్నది. కనుక వివాదమునకు నాధారమగు సంవిత్తు ఉపాధిపరామర్శములేక ఆకాశమువలె స్వాభావికభేదములేనిదగుననియు, శబ్దసంవిత్తు, స్పర్శాదిసంవిత్తువలె సంవిత్సామాన్యమగుటవలన స్పర్శాదిసంవిత్తువలన భేదింపబడదనియు నిట్లు అనుమానప్రమాణముచేతనూహించి తెలియవలెను. మరియు ఒక్కటియేయగుసంవిత్తునకు అకాశమునకువలె ఔపాధికభేదముచేతనైనను భిన్నము సిద్ధించుచుండగా వాస్తవభేదకల్పనమందు ఆసంఖ్యాకములగు సంవిత్తులు వ్యవహారము సంభవించుటచేత అట్టి సంవిద్గౌరవము బాధకమగును - కనుక, ఒక్కటియగు సంవిత్తునకెంతమాత్రమైనను భేదకల్పనము జేయరాదని యభిప్రాయము. సంవిత్తనగా జ్ఞానమగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఈచెప్పిన న్యాయమును స్వప్నావస్థయందును జూపుచున్నాడు.

శ్లో॥ తథాస్వప్నేఽత్రవేద్యంతు నస్థిరంజాగరేస్థిరం।
తద్భేదోఽతస్తయోస్సంవిదేకరూపానభిద్యతే॥ ౪.

టీ. స్వప్నేపి - స్వప్నావస్థయందును, తథా - ఆప్రకారమేయగును. అత్ర- ఈస్వప్నావస్థయందు, వేద్యం - జ్ఞానముచేతనెరుగదగిన వస్తుసమూహము, నస్థిరం- మరియొకసమయమందు గనబడదు. జాగరేతు - జాగరితావస్థయందో, వేద్యం - ఎరుగదగిన వస్తుసమూహము, స్థిరం - మరియొకకాలమందు గనబడును. అతః - అందువల్ల, తద్భేదః = తత్ - ఆస్వప్నజాగరితావస్థలకు, భేదః - భేదముగలదు. తయోః - ఆస్వప్నజాగరితావస్థలయొక్క, సంవిత్ - జ్ఞానము - ఏకరూపాసతీ - ఏకాకారమగుచు, నభిద్యతే - భేదింపబడదు.

తా. మరియు, జాగరితావస్థయందు, శబ్దస్పర్శాదివిషయములకు పరస్పరభేదముగలిగియున్నట్లు, స్వప్నావస్థయందును ఆప్రకారమే విషయములకు బరస్పరభేదము గలిగియున్నది. మరియు జాగరితావస్థయందు సర్వవిషయముల నెరిగెడి జ్ఞానమునకు ఏకాకారత్వము గలిగియున్నట్లు స్వప్నావస్థయందును సర్వవిషయముల నెరిగెడి జ్ఞానమునకు ఏకాకారత్వము గలిగియున్నది. అందుచేత సర్వవిషయములను ఎరిగెడి జాగరితావస్థయందుగల జ్ఞానమును బుద్ధిచేత విభజించి చూచినట్లు, సర్వవిషయముల నెరిగెడి స్వప్నజ్ఞానమును బుద్ధిచేత విభజించి చూచినయెడల భేదింపబడదు. ప్రశ్నము ?. అయితే స్వప్నజాగరితావస్థలయందు విషయములకు భేదము సమానమనియు ఆరెండవస్థలయందును ఆయాసర్వవిషయముల నెరిగెడి జ్ఞానమునకు ఎంతమాత్రము భేదములేదనియుం జెప్పితిరి. అట్లయిన యెడల, స్వప్నావస్థయనియు జాగరితావస్థయనియు ఇట్టి భేదవ్యవహారముగలుగుటకు గారణమేమి ?. ఉత్తరము. శ్రోత్రాది ఇంద్రియములు ఉపసంహరింపబడినప్పుడు, జాగరితసంస్కారమువల్ల గలిగిన విషయస్ఫురణము, స్వప్నమని చెప్పబడును. అట్టి స్వప్నావస్థయందు గనబడెడి వస్తుసమూహము, ప్రతీతిమాత్రశరీరముగలదగుటవలన - మరియొకకాలమందు కనబడమిచే, అస్థిరమని చెప్పబడును. జాగరితావస్థయందు గనబడెడి వస్తుసమూహము మరియొకకాలమందు గనబడుచుండుటచేత, స్థిరమని చెప్పబడును. ఇట్టి స్థిరాస్థిరలక్షణవిషయ భేదముచేత ఆస్వప్నజాగరితావస్థలకు భేదముగలదు. ప్ర॥ అయితే, స్వప్నజాగరితావస్థలకు భేదమున్నయెడల ఆస్వప్నజాగరితావస్థలయందుగల జ్ఞానములకును భేదముగలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గరాదాయేమి?. ఉత్తరము. స్వప్నజాగరితావస్థలయందుగల సర్వవిషయములవెరిగెడి జ్ఞానము, జ్ఞానము జ్ఞానమని యిట్లు, ఏకాకారముగా నున్నందున జ్ఞానభేదములేదు.

అవ. ఇట్లు, జాగరిత స్వప్నావస్థలయందుండెడి జ్ఞానమునకు, ఏకత్వమును సాధించి, అట్టిజ్ఞానముతోటి సుషుప్త్యవస్థయందుగల జ్ఞానము నైక్యము జేయుట కొరకు, ఇప్పుడు సుషుప్తికాలమందుగల జ్ఞానమును సాధించుచున్నాడు.

శ్లో॥ సుప్తోత్థితస్యసౌషుప్తతమోబోధోభవేత్స్మృతిః।
సాచావబుద్ధవిషయాఽవబుద్ధంతత్తదాతమః॥ ౫.

టీ. సుప్తోత్థితస్య=సుప్త-సుషుప్తినుంచి, ఉత్థితస్య - మేల్కనిలేచినవానికి, సౌషుప్తతమోబోధః=సౌషుప్త - సుషుప్తికాలసంబంధమయిన, తమః - అజ్ఞానము యొక్క, బోధః - జ్ఞానము, స్మృతిః - స్మరణము, భవేత్ - అగును. సాచ - అస్మృతి, అవబుద్ధవిషయా=అవబుద్ధ - అనుభవింపబడిన, విషయా - విషయముగల దియగును. తత్తమః - ఆయజ్ఞానము - తదా - అసుషుప్తికాలమందు అవబుద్ధం - అనుభవింపబడెనని నిశ్చయింపవలెను.

తా. సుషుప్తినుంచి మేల్కనిలేచినవాడు, సుషుప్తియందు గొంచెమయిన నెరుగకుంటినని, ఆసుషుప్తికాలమందు, అజ్ఞానము నెరిగిన జ్ఞానమును దలచుచు న్నాడు. ఈతలంపు స్మృతియే యగుగాని, అనుభవముగాదు. ప్ర. అదియేమి?. ఉ. జ్ఞానముచేత బ్రత్యక్షముగా గ్రహింపబడిన విషయము అనుభవమగును. గనుక, ఆసుషుప్తికాలసంబంధమగు అజ్ఞానము నిప్పుడు ఇంద్రియజన్యజ్ఞానమువల్ల గ్రహింప బడమిచేత సుషుప్తియందు గొంచెమైన నెరుగకుంటినని, ఇప్పుడు స్మరించెడితలంపు, స్మృతియే యగును. ప్ర. సరి. ఇది స్మృతియే యగును. అందువల్ల లాభమేమి?. ఉ. పూర్వము అనుభవములేకనే స్మృతిగలుగదనెడి న్యాయము, లోకప్రసిద్ధమైయున్నది. కనుక, ఈస్మృతివల్ల, బూర్వము సుషుప్తి కాలమందు, జ్ఞానముచేత అజ్ఞానము అనుభ వింపబడినట్లు స్పష్టమాయెను. మరియు, గొంచెమైన నెరుగకుంటిననెడి జ్ఞానము, స్మృతిస్వభావమును గలిగియున్నందున, అదినాతల్లియని తలంచెడి స్మృతివలె, అను భవపూర్వకముగలదియగునని తెలియవలెను.

శ్లో॥ సబోధోవిషయాద్భిన్నోఽనబోధాత్స్వప్నబోధవత్।
ఏవంస్థానత్రయేప్యేకాసంవిత్తద్వద్దినాంతరే॥ ౬.

టీ. సః - ఆ, బోధః - సుషుప్తిసంబంధ అజ్ఞానానుభవము, విషయాత్ - అజ్ఞానముకంటె, భిన్నః - అన్యమగును. స్వప్నబోధవత్ - స్వప్నజ్ఞానమువలె,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బోధాత్ - మరియొక జ్ఞానమువల్ల, న - భేదింపబడదు. ఏవం-ఈప్రకారము, స్థాన త్రయేపి - ఒకదినమందుగల మూడవస్థలయందును, సంవిత్ - జ్ఞానము, ఏకా-ఒక్కటియేయగును. దినాంతరే-మరియొకదినమందును, తద్వత్ - ఆప్రకారమేయగును. అనగా జ్ఞానమనెడి వస్తువు ఒక్కటియేయగుననుట.

తా. అనుషుప్తికాలసంబంధ అజ్ఞానానుభవరూపమైన జ్ఞానము, తనవిషయమైన అజ్ఞానముకంటె భిన్నమైనదగును. మరియు, ఘటజ్ఞానము ఘటముకంటె అన్యమైనట్లు, అనుషుప్తియందుగల అజ్ఞానము నెరిగినజ్ఞానము, ఆ అజ్ఞానముకంటె భిన్నమగును. మరియు, ఆ యజ్ఞానానుభవరూపజ్ఞానము స్వప్నావస్థయందుగల జ్ఞానమువలెనే, జాగరితజ్ఞానమువల్ల భేదింపబడదు. ప్ర. అయితే, అట్లు భేదింపబడమికి కారణమేమి?. ఉ. స్వప్నజాగరితావస్థలయందుగల జ్ఞానమునకు, ఏబోధస్వభావలక్షణముగలదో, అట్టి బోధస్వభావలక్షణము, సుషుప్త్యవస్థయందుగల జ్ఞానమునకును గలిగియున్నది. గనుక, భేదింపబడదు. ఇట్లు ఒకదినమందుగల మూడవస్థలయందును జ్ఞానమనెడివస్తువు ఒక్కటియేయగును. ఇట్లు, సర్వజంతువులయందును, సర్వకాల సర్వావస్థలయందును, జ్ఞానమనెడి వస్తువు, అద్వితీయముగానున్నదని తెలియవలెను. ఈప్రకారమే, మరియొకదినమందును, జ్ఞానము అద్వితీయముగానుండునని తెలియవలెను. వాక్యం॥ సర్వంవాక్యంసావధారణం॥ అనెడి న్యాయమువల్ల, ఒకదినమందువలెనే, మరియొకదినమందును, జ్ఞానమొకటియేయుండునని యభిప్రాయము.

శ్లో॥ మాసాబ్దయుగకల్పేషుగతాగమ్యేష్వనేకధా।
నోదేతినాస్తమేత్యేకాసంవిదేషాస్వయంప్రభా॥ ౭

టీ. అనేకధా- అనేకప్రకారములుగా, గతాగమ్యేషు-భూతభవిష్యత్కాలములైన, మాసాబ్దయుగకల్పేషు=మాస-మాసములయందును, అబ్ద - సంవత్సరములయందును, యుగ-యుగములయందును, కల్పేషు-కల్పములయందును జ్ఞానమునకు భేదము లేదు. ఏకా - ఒక్కటియైన, సంవిత్-జ్ఞానము, నోదేతి- పుట్టదు. అస్తం - వినాశమును, నైతి-పొందదు. ఏషా - ఈఅద్వితీయమైన జ్ఞానము, స్వయంప్రభా -స్వయముగా ప్రకాశించుచుండును.

తా. మరియు, ఒకదినమందుగల మూడవస్థలయందును, జ్ఞానవస్తువునకు భేదములేక, ఏకాకారత్వముగలిగియున్నట్లు, మరియొకదినమందును జ్ఞానవస్తువునకు భేదములేక ఏకాకారత్వముగలిగియుండును. మరియు, ఈప్రకారమే యనేకవిధములగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గా గడచిపోయినట్టియు, ఇకజరుగబోవునట్టి, చైత్రాదిమాసములయందును, ప్రభవాది సంవత్సరములయందును, కృతాదియుగములయందును, బ్రాహ్మాదికల్పములయందును, భేదములేక జ్ఞానము ఏకాకారముగానుండును. ప్ర. అయితే, ఇట్లు జ్ఞానమునకు ఏకత్వమును సాధించుటచేత ఫలమేమి ?. ఉ. ఇట్లు, సర్వకాల సర్వావస్థలయందును, అద్వితీయముగానున్న జ్ఞానమనెడి వస్తువు, పుట్టదు. నాశమును పొందదు. ప్ర. అదియేమి? ఉ. సర్వదేహములయందుండెడి జ్ఞానవస్తువు, ఒక్కటియేయగుటచేత, ఒకదేహమందుగల జ్ఞానవస్తువు, జననమరణకాలములందు బుట్టి నశించునని చెప్పిన యెడల, సర్వదేహములయందుండెడి జ్ఞానవస్తువు, బుట్టి నశించుచుండవలయును. అట్లు ఒకడు బుట్టినప్పుడు, అందరుబుట్టినట్లును, ఒకడు జచ్చినప్పుడు అందరు జచ్చినట్లును గనబడలేదు. గనుక అద్వయమైన జ్ఞానమనెడి వస్తువు, జననమరణాదివికారములను బొందక, సర్వకాల సర్వావస్థలయందును, ఏకాకారముగా నుండునని తెలియవలెను. మరియు, ఇట్టిజ్ఞానవస్తువునకు జననమరణములుగలుగునని చెప్పెడి విషయమై, అందుకు సాక్షిలేదు. సాక్షిలేని జననమరణాదులను అంగీకరింపరాదు. మరియు, తనయుత్పత్తి వినాశములకు, తానేసాక్షియని చెప్పుట యుక్తముగాదు. మరియు, ఇట్టిజ్ఞానవస్తువు యొక్క యుత్పత్తివినాశనములను ఎరుగుటకు, మరియొకజ్ఞానవస్తువులేదు. ప్ర. అయితే, యీజ్ఞానమును ఎరుగుటకు, మరియొకజ్ఞానము లేనియెడల, గ్రహించెడివస్తువు లేకపోవుటవల్ల, ఈ జ్ఞానము స్వప్రకాశవస్తువు గానందున, జగంబునకు గ్రుడ్డితనము సంభవించునాయేమి ?. ఉ. ఈజ్ఞానవస్తువు, స్వయముగా ప్రకాశించునదియగును. మరియు, * (ఈజ్ఞానవస్తువు, మరియొక జ్ఞానవస్తువుచేత ఎరుగబడకుంచుండగా, అపరోక్షత్వమువల్ల, వ్యతిరేకముచేత ఘటమువలె ప్రకాశించునదియగును) * ఈఘట దృష్టాంతము, వ్యతిరేకదృష్టాంతమగుటవల్ల, వ్యతిరేకముచేతనని చెప్పబడెను. మరియు, ఈ చెప్పబడినవాక్యమందు, అపరోక్షత్వమనునది హేతువగును ఈజ్ఞానవస్తువు, మరియొకజ్ఞానవస్తువుచేత ఎరుగబడదనునది, విశేషణమగును. ఈ రెంటిని జేర్చి, విశేషణ సిద్ధహేతువని చెప్పబడును. ఈ హేతువును, విశేషణసిద్ధము గానిదానినిగా జెప్ప రాదు. ప్ర. అదియేమి ?. ఉ. ఈజ్ఞానవస్తువు, తనచేతనే తాను, ఎరుగబడునని చెప్పిన యెడల, ఈ జ్ఞానవస్తువునకు కర్మృకర్తృభావములు రెండును గలిగియున్నవని చెప్పవలసివచ్చును. ఏకవస్తువునకు కర్తృకర్తృభావములు రెండునుగలిగియున్నవని- చెప్పుట, న్యాయవిరోధమగును. గనుక, ఈజ్ఞానవస్తువు, తనచేతనే తాను, ఎరుగబడునని చెప్పరాదు. మరియు, ఈజ్ఞానవస్తువు, మరియొక జ్ఞానముచేత ఎరుగబడునని చెప్పిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యెడల, ఆదిమరియొక యదిమరియొక జ్ఞానముచేత నెరుగబడుననని, యిట్లు అనవస్థా దోషము ప్రాప్తించును. అందువల్ల, ఈ జ్ఞానవస్తువు మనకుతెలియనని, ఏదోఒకానొక జ్ఞానముచేత, ఎరుగబడుననియుం జెప్పరాదు. గనుక, స్వప్రకాశ స్వభావముచేత ప్రకాశించెడి, యీజ్ఞానవస్తువువల్లనే, సర్వజగంబు ప్రకాశింపబడుచున్నందున, జగంబునకు గ్రుడ్డితనము గలుగుననెడి ప్రసంగమును జేయరాదని యభిప్రాయము.

శ్లో॥ ఇయమాత్మాపరానందః పరప్రేమాస్పదంయతః।
మానభూవంహిభూయాస మితిప్రేమాత్మనీక్ష్యతే॥ ౮.

టీ. ఇయం - ఈజ్ఞానవస్తువు, ఆత్మా - ఆత్మశబ్దముచేత వ్యవహరింపబడును, యతః - ఏకారణమువల్ల, పరప్రేమాస్పదం=పర- నిరుపాధికమైన, ప్రేమ- స్నేహమునకు, ఆస్పదం - విషయమో, (అతః) ఆకారణమువల్ల, పరానందః - పరమసుఖస్వరూపుడగును, హి - ఏకారణమువల్ల, ఆత్మని - తనవిషయమై, మాభూవమితిన - నేనులేకపోతిననునదిలేదు, భూయాసం - సర్వదానేనుండువాడ నగుదునుగాక, ఇతి - ఇట్లని, ప్రేమ - స్నేహము, ఈక్ష్యతే - చూడబడుచున్నదో, అనగా - సర్వజనులచేత ననుభవింపబడుచున్నదో.

తా. ప్ర. సరి. ఈజ్ఞానవస్తువునకు నిత్యత్వస్వప్రకాశస్వభావములు గలుగుగాక. అందువల్ల లాభమేమి?. ఉ. ఈ అద్వితీయమైన జ్ఞానవస్తువు, ఆత్మయనెడి శబ్దముచేత వ్యవహరింపబడును. ఆత్మయనగా, తనస్వరూపమగును. గనుక, బూర్వోక్తప్రకారము, ఈ ఆత్మ, నిత్యత్వస్వప్రకాశస్వభావము గలిగియున్నాడు. మరియు, నిత్యత్వ స్వప్రకాశ స్వభావముగల ఈజ్ఞానవస్తువే, ఆత్మయగుటకుదగునుగాని, నిత్యజ్ఞానస్వప్రకాశస్వభావములులేని, ఘటాదిజడపదార్థమును, ఆత్మయని చెప్పరాదు. మరియు, ఈజ్ఞానస్వరూపుడైన ఆత్మవస్తువునకు, నిత్యత్వజ్ఞానస్వభావములను సాధించుటచేత, సత్యత్వము సాధింపబడినట్లేయగును. నిత్యత్వముకంటె, అన్యమైన సత్యత్వములేదు. ఇట్లు॥ వా॥ నిత్యత్వంసత్యత్వం తద్యస్యాస్తితన్నిత్యంసత్యం॥ అనివాచస్పతి మిశ్రులుచెప్పిరి. మరియు, ఈ జ్ఞానవస్తువైన ఆత్మ, నిరతిశయస్నేహమునకు విషయుడై యున్నందున, పరమానందస్వరూపుడగుననియు, జడస్వరూపమైన ఘటాదిపదార్థము, నిరతిశయస్నేహవిషయముగామిచేత, ఆఘటాదిపదార్థము పరమానందరూపముగానేరదనియు, ఇట్లు అనుమానప్రమాణముచేత యోచించి, ఆత్మ పరమానందస్వరూపుడని, నిశ్చయించవలెను. ప్ర. అయితే, నన్నుకాల్చనా, నేనెందుకు; అని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యిట్లు, ఆత్మయగు తనయందు ద్వేషము గనబడుచుండగా, ఆత్మ, స్నేహమునకు విషయుండనియే చెప్పరాదు. అట్లైనప్పుడు, ఆత్మకు బరమస్నేహవిషయత్వ మెట్లుసిద్ధించును?. ఉ. నన్నుకాల్చనా, నేనెందుకు, అనియిట్లు నీవుచెప్పినద్వేషము, దుఃఖసంబంధక నిమిత్తమువల్ల కలిగినదగును. గనుక, ఆవిషయమును, ఇక్కడనీవుచెప్పి ఆక్షేపించరాదు. ఆత్మయందుగల పరమస్నేహవిషయత్వము, సర్వానుభవసిద్ధమై యున్నది. ప్ర అదియెట్లు?. ఉ. నాకెప్పుడును నాశములేకపోవుగాక యనియు, నాకుసర్వదా శాశ్వతమైనస్థితి కలుగుగాకయనియు, ఇట్లు ప్రతివాడును, ఆత్మయగు తనవిషయమై, పరమస్నేహభావమును గలిగియున్నాడు. గనుక, ఆత్మ, పరమస్నేహవిషయుడనుట, సర్వానుభవసిద్ధమగును.

శ్లో॥ తత్ప్రేమాత్మార్థమన్యత్ర నైవమన్యార్థమాత్మని।
అతస్తత్పరమం తేనపరమానందతాత్మనః॥ ౯.

టీ. అన్యత్ర - పుత్రభార్యాదులయందేస్నేహముగలదో, తత్ప్రేమ - ఆస్నేహము, ఆత్మార్థం - తనప్రయోజనముకొరకే యగును. ఏవం - ఈప్రకారము, ఆత్మని - తనయందుగలస్నేహము, అన్యార్థం - పుత్రభార్యాదిప్రయోజన నిమిత్తము కొరకైనది, న - కాదు. అతః - అట్టినిరుపాధికత్వమువల్ల, తత్ - ఆత్మవిషయమైన స్నేహము, పరమం-మిక్కిలి యతిశయమైనదగును. తేన-అట్టి నిరతిశయస్నేహ విషయత్వముచేత, ఆత్మనః-ఆత్మకు, పరమానందతా-పరమానందస్వరూపముసిద్ధమగును.

తా. ప్ర. అయితే - ఆత్మప్రేమాస్పదుడగుటవలన హేతువునకు స్వరూపాసిద్ధిలేకపోయినను భార్యాపుత్రాదులయందును ప్రేమయుండుటచేత బరమప్రేమాస్పదుడగుటకు ప్రమాణములేనందున హేతువునకు విశేషణాసిద్ధి గలుగుచుండలేదాయేమి?. ఉ. భోగ్యపదార్థములు శేషములని చెప్పబడును. గనుక, భార్యాపుత్రాదులు, ఆత్మకు శేషములగుటవల్ల, తనకంటె ఇతరులగు, ఆభార్యాపుత్రాదులయందు, యేస్నేహము గలదో ఆస్నేహము తనప్రయోజనముకొరకేయగుగాని ఇతరులయొక్క ప్రయోజనము కొరకుగాదు. ఆభార్యాపుత్రాదులు ఆత్మకు శేషములగుటవల్ల వారియందు స్నేహముగలిగియున్నదేగాని అది యాత్మకుస్వాభావికము గాదు. మరియు ఈప్రకారముగా ఆత్మయందుగలస్నేహము ఇతరులయొక్క ప్రయోజనముకొరకు గాదు. ప్ర. అదియేమి? ఉ. ఆత్మ అన్యవస్తువునకు శేషముగామిచేత ఆత్మయందుగల స్నేహము అన్యనిమిత్తకమైనదిగాదు. ఆత్మనిమిత్తకమైనదేయగును. ఇది నిరుపాధిక స్నేహమని చెప్పబడును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్టి నిరుపాధికస్నేహమునకు, ఆతఁడు విషయుఁడైయున్నందున ఆత్మ పరమానందస్వరూపుడగుననుట, సిద్ధమాయెను.

అవ. ఈయేడు శ్లోకములచేత చెప్పబడిన యర్థమును ఇప్పుడు సంక్షేపించి చూపుచున్నాడు.

శ్లో॥ ఇత్థంసచ్చిత్పరానంద ఆత్మాయుక్త్యాతథావిధం ।
పరబ్రహ్మతయోశ్చైక్యం శ్రుత్యంతేషూపదిశ్యతే॥ ౧౦.

టీ. ఇత్థం - ఈముందు చెప్పినప్రకారము, యుక్త్యా-యుక్తిచేత, ఆత్మా-ప్రత్యగాత్మ, సచ్చిత్పరానందః=సత్ - సద్రూపుడును, చిత్ - చిద్రూపుడును, ఆనందః-ఆనందస్వరూపుడునగును. పరబ్రహ్మచ-పరబ్రహ్మంబును, తథావిధం - సత్యజ్ఞానానందస్వరూపమేయగును. తయోః-ఆప్రత్యగాత్మ పరబ్రహ్మములకు, ఐక్యం- ఏకరూపత్వము, శ్రుత్యంతేషు - వేదాంతములయందు, ఉపదిశ్యతే - చెప్పబడుచున్నది.

తా. ఈపైన చెప్పబడిన, ౩ - ౪ - ౫ - ౬ - ౭ శ్లోకములచేతి; జ్ఞానమునకు నిత్యత్వమునుసాధించి, ౮ - ౯ - శ్లోకములచేత, ఆ జ్ఞానమునకే ఆత్మత్వమును సాధించుటవల్ల, ఆతఁడకు, సచ్చిద్రూపత్వము సాధింపబడెను. మరియు, ౮ - ౯ - శ్లోకములచేతనే ఆత్మకు పరమానందరూపత్వము సమర్థింపబడెను. అందువల్ల, ఈఆత్మ, (తత్త్వమసి)=అదినీవైతివి. అనెడిమహావాక్యమందుగల (త్వం)=నీవు అనెడి పదార్థభూతుఁడగు సచ్చిదానంద రూపుడగును. ప్ర. అయితే, యీచెప్పినప్రకారము సచ్చిదానందస్వరూపుడైన ఆత్మను, యుక్తిచేతనే యెఱిగినయెడల ఉపనిషత్తులచేత ప్రయోజనములేనందున, ఆయుపనిషత్తులకు అప్రామాణ్యముకలుగదాయేమి? ఉ. ఈముందు చెప్పబడిన ఆత్మలక్షణప్రకారమే ఆపరబ్రహ్మంబును సచ్చిదానందస్వరూపమేయగును. ఆపరబ్రహ్మము (తత్త్వమసి) అనెడిమహావాక్యమందుగల (తత్) అది యనెడి పదార్థముచేత చెప్పదగినదియగును. ఆయాత్మబ్రహ్మములైన త్వంపదార్థతత్పదార్థములకు ఏకత్వరూపమగు అఖండైకరసత్వము ఉపనిషత్తులయందు చెప్పబడుచున్నది. గనుక ఉపనిషత్తులవల్ల ప్రయోజనములేదని చెప్పరాదు.

శ్లో॥ అభానేనపరంప్రేమభానేనవిషయేస్పృహా ।
అతోభానేప్యభాతాసౌపరమానందతాత్మనః॥ ౧౧.

టీ. అభానే-ఆత్మయొక్క పరమానందరూపత్వముస్ఫురించనిపక్షమందు, పరం-నిరతిశయమైన, ప్రేమ-స్నేహము, న-ఆత్మయందుండదు. భానే-పరమానందరూప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్వము స్ఫురించెడిపక్షమందు, విషయే-సుఖసాధనమగు స్త్రీపుష్పాదికమందు, స్పృహా-ఇచ్ఛ, న-కలుగదు. అతః-ఆకారణమువల్ల, ఆత్మనః-ఆత్మయొక్క, అసౌ-ఈ, పరమానందతా-పరమానందరూపత్వము, భానేపి-స్ఫురణమందును, అభానా - అస్ఫురణత్వము గలిగియున్నది.

తా. ప్ర. అయితే, ఆత్మయొక్క పరమానందరూపత్వము స్ఫురించుచున్నదో, స్ఫురించలేదో, చెప్పుము. స్ఫురించనిపక్షమందు, ఆత్మయందు పరమస్నేహముగలిగియుండదు. అదియుమగాక, విషయసౌందర్య జ్ఞానముచేత స్నేహము గలుగుచున్నది. అట్టిస్నేహముగలుగుటకు తగినసౌందర్యము, ఆత్మయందున్నట్లు కనబడలేదు. గనుక, ఆత్మయందు పరమస్నేహము గలిగియుండదు. మరియు, ఆత్మయొక్క పరమానందస్వరూపము స్ఫురించుచున్నయెడల, సుఖసాధనమైన స్త్రీపుష్పాదివిషయమందైనను, ఆవిషయజన్యసుఖమందైనను, జనులకు ఇచ్ఛకలుగరాదు. జనులకు స్త్రీపుష్పాదివిషయను భాపేక్షగలుగుచున్నందున, ఆత్మయొక్క పరమానందరూపత్వము, స్ఫురించుచున్నదని చెప్పరాదు. మఱియు, విషయసుఖము అనిత్యమగును. సాధనముచేత, కలుగునదియగును. పరాధీనమగును. ఆత్మస్వరూపమైన పరమానందత్వము నిత్యమగును. విషయసాధనమువల్ల కలుగునదికాదు. స్వాభావికస్థితిగలదియగును. అటువంటిశాశ్వతమైన ఆత్మయొక్క పరమానందరూపము, జనులకుస్ఫురించుచున్నయెడల, స్త్రీపుష్పాదివిషయ సుఖాపేక్ష, ఎప్పటికినికలుగదు గనుక, ఆత్మకుపరమానందరూపము లేదని చెప్పరాదాయేమి?. ఉ. ఆత్మయొక్క పరమానందస్వరూపము స్ఫురించుటయందును, స్ఫురించకుండుటయందును, ఈ రెండుపక్షములయందును ప్రత్యేకముగా దోషముచెప్పితివి. ఆత్మయొక్క పరమానంద స్వరూపత్వము, స్ఫురింపుచుండియు, స్పష్టముగాస్ఫురింపకున్నది. గనుక, ఆత్మకు పరమానందస్వరూపత్వము లేదని చెప్పరాదు.

శ్లో॥ అధ్యేతృవర్గమధ్యస్థపుత్రాధ్యయనశబ్దవత్ ।
భానేప్యభానం భానస్య ప్రతిబంధేనయుజ్యతే॥ ౧౨.

టీ. అధ్యేతృవర్గమధ్యస్థపుత్రాధ్యయనబ్దవత్ = అధ్యేతృవర్గ- వేదపాఠకుల సమూహముయొక్క, మధ్యస్థ-మధ్యమందుండెడి, పుత్ర-పుత్రునియొక్క, అధ్యయనశబ్దవత్- వేదాధ్యయనధ్వనివలె, భానేపి- ఆనందముయొక్క సామాన్యస్ఫురణమందును, అభానం- విశేషాకారముగా స్ఫురింపమికలుగుచున్నది. భానస్య-ఆనందస్ఫురణముయొక్క, ప్రతిబంధేన-చెప్పబోయెడి ప్రతిబంధముచేత, యుజ్యతే-విశేషాకారముగా స్ఫురింపమి పొందబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే ఒక్కటియైన ఆనందమునకు స్ఫురణ అస్ఫురణత్వములు రెండును ఏకకాలమందెట్లుగలుగును?. ఉ. ౧. ఇట్టిస్ఫురణ అస్ఫురణత్వములు రెండును లోకమందుగనబడనందున అయుక్తమనిచెప్పెదవో. లేక, ౨. ఇట్టిస్ఫురణ అస్ఫురణత్వములు రెండునుగలుగుటకు న్యాయములేదనిచెప్పెదవో. ఈరెండువిధములలో మొదటివిషయమై చెప్పెద వినుము. అనేకబాలురు వేదమునుచదువుచుండగా ఆ బాలుర సమూహములోనున్న యొకబాలునియొక్క వేదాధ్యయనధ్వని చక్కని స్ఫురణప్రకాశముగలిగియున్నను బాహ్యస్థలమందుండెడితండ్రికి ఆబాలునిఅధ్యయనధ్వని సామాన్యముగా తెలియబడునే గాని ఇదినాపుత్రునియొక్క అధ్యయనధ్వనియని విశేషాకారముగా తెలియబడదు. అటువలెనేఆత్మయొక్క ఆనందము సామాన్యాకారముగా స్ఫురించుచుండియు విశేషాకారముగా స్ఫురించుటలేదు. గనుక, ఒకవిషయమునకు స్ఫురణాస్ఫురణత్వములు రెండును ఏకకాలమందు లోకమందు కనపడలేదని చెప్పరాదు. ఇకను రెండవపక్షమునకుసమాధానమును చెప్పెద వినుము. ఆత్మయొక్క ఆనందము, సామాన్యముగా స్ఫురించుచున్నను ఇకను చెప్పబోయెడి లక్షణముగల ప్రతిబంధముచేత విశేషాకారముగా స్ఫురింపకున్నది. కనుక ఇట్టి స్ఫురణాస్ఫురణములు గలుగుటకు న్యాయములేదని చెప్పరాదు.

శ్లో॥ ప్రతిబంధోస్తిభాతీతివ్యవహారార్హవస్తుని।
తన్నిరస్యవిరుద్ధస్యతస్యోత్పాదనముచ్యతే॥ ౧౩.

టీ. అస్తి-కలదు, భాతి-ప్రకాశించుచున్నది. ఇతి-ఈప్రకారమైన, వ్యవహారార్హవస్తుని=వ్యవహార-వ్యవహారమునకు, అర్హ-తగిన, వస్తుని-వస్తువిషయమై, తం-ఆవ్యవహారమును, నిరస్య-నిరాకరించి, విరుద్ధస్య-విరుద్ధమైన, తస్య-ఆ వ్యవహారముయొక్క, ఉత్పాదనం-ఉత్పత్తి, ప్రతిబంధః-ప్రతిబంధమని, ఉచ్యతే-చెప్పబడును.

తా. ప్ర. అయితే, ఈప్రతిబంధమెద్ది?. ఉ. ఉన్నది. ప్రకాశింపుచున్నది. అనియిట్లు వ్యవహరింపదగిన వస్తువిషయమై ఆవ్యవహారమును ఆవస్తువును నిరాకరించి, అందుకువిరుద్ధమైన, ౧-లేదు. ౨-ప్రకాశింపలేదనెడి ఇట్టివిపరీతవ్యవహారముగలుగుటయే ప్రతిబంధమని చెప్పబడును.

అవ. పైనచెప్పిన లక్షణముగల ప్రతిబంధమునకు కారణమును దృష్టాంతదార్ష్టాంతికములయందు ఇప్పుడు క్రమముగా జూపుచున్నాడు,

శ్లో॥ తస్యహేతుస్సమానాభిహారఃపుత్రధ్వనిశ్రుతౌ।
ఇహానాదిరవిద్యైవవ్యామోహైకనిబంధనం॥ ౧౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. పుత్రధ్వనిశ్రుతౌ=పుత్ర-పుత్రునియొక్క, ధ్వని-అధ్యయనధ్వనియొక్క, శ్రుతౌ-వినుటయందు, తస్య-అప్రతిబంధమునకు, సమానాభిహారః - అనేకులతోకలసి పఠించుట, హేతుః-కారణమగును. ఇహ-ఇక్కడ, అనగా దార్ష్టాంతికమందు, వ్యామోహైకనిబంధనం=వ్యామోహ - విపరీతజ్ఞానములకు, ఏక-ముఖ్యమైన, నిబంధనం - కారణమైనట్టియు,అనాదిః ఉత్పత్తిలేని,అవిద్యైవ-అజ్ఞానమేప్రతిబంధకారణమగును.

తా. పుత్రునియొక్క అధ్యయనధ్వనినివినెడి లక్షణముగల దృష్టాంతమందు, బహుజనులతోకలసిపఠించుటయే, ప్రతిబంధమునకుకారణమగును. ఇక్కడ దార్ష్టాంతికమందు, అవిద్యయే, ప్రతిబంధమునకు కారణమగును. ఆ అవిద్యయనునది, విపరీతజ్ఞానములకు ముఖ్యకారణమై, ఉత్పత్తిలేక, యనాదిగానున్నదని తాత్పర్యము.

అవ. ఇప్పుడు, ప్రతిబంధహేతుభూతమైన అవిద్యను ప్రతిపాదించుటకొరకు, దానికి కారణభూతమైన ప్రకృతిని తెలుపుచున్నాడు.

శ్లో॥ చిదానందమయబ్రహ్మ ప్రతిబింబసమన్వితా।
తమోరజస్సత్త్వగుణాప్రకృతిర్ద్వివిధాచసా॥ ౧౫.

టీ. చిదానందమయబ్రహ్మప్రతిబింబసమన్వితా=చిదానందమయ - జ్ఞానానందరూపమగు, బ్రహ్మ-పరబ్రహ్మముయొక్క, ప్రతిబింబ-ప్రతిబింబముతోటి, సమన్వితా - కలిసియుండునట్టియు, తమోరజస్సత్త్వగుణా-తమోరజస్సత్త్వగుణములయొక్క-సామ్యావస్థయైనట్టిది, ప్రకృతిః-ప్రకృతియని చెప్పబడును. సా-ఆప్రకృతి, ద్వివిధా-రెండువిధములుగానున్నది యగును.

తా. ౧. సత్త్వము. ౨. రజము. ౩. తమము, అనెడి పేర్లుగల మూడుగుణములను సమానముగానుండెడి అవస్థయే, ప్రకృతియనిచెప్పబడును. ఆప్రకృతి, జ్ఞానానందస్వరూపమగు పరబ్రహ్మముయొక్క ప్రతిబింబముతోటి కలిసియుండును. అట్టిప్రకృతి రెండువిధములుగానున్నదని తెలియవలెను.

శ్లో॥ సత్త్వశుద్ధ్యవిశుద్ధిభ్యాంమాయావిద్యేచతేమతే।
మాయాబింబోవశీకృత్యతాంస్యాత్సర్వజ్ఞఈశ్వరః॥ ౧౬.

టీ. సత్త్వశుద్ధ్యవిశుద్ధిభ్యాం=సత్త్వశుద్ధి-విశుద్ధసత్త్వముచేతను, అవిశుద్ధిభ్యాం - మలినసత్త్వముచేతను, తేచ-ఆరెండువిధములైనవి, మాయావిద్యే=మాయా-మాయయనియు, అవిద్యే-అవిద్యయనియు,మతే-సమ్మతములగును. మాయాబింబః-మాయయందు ప్రతిఫలించిన చిదాత్ముడు, తాం-ఆమాయను, వశీకృత్య-స్వాధీనముచేసికొని, సర్వజ్ఞః-సర్వజ్ఞత్వాది గుణములుగల, ఈశ్వరః-ఈశ్వరుడు, స్యాత్ - అగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే, ఆప్రకృతియొక్క రెండువిధములెవ్వి?. ఉ. ప్రకాశరూపముగలది సత్వగుణమగును. మరియు, మరియొకగుణముతోటి కలియని సత్వగుణము, విశుద్ధసత్వమని చెప్పబడును. మరియు, రజస్తమోగుణములతోటి కలసిన సత్వగుణము మలినసత్వమని చెప్పబడును. గనుక, ఆమూలప్రకృతి, విశుద్ధసత్వమనియు, మలినసత్వమనియు, ఇట్లు రెండువిధములుగానున్నది. విశుద్ధసత్వగుణప్రధానముగలది మాయయనియు, మలినసత్వగుణప్రధానముగలది అవిద్యయనియుంజెప్పబడును. ప్ర. అయితే, యిట్లు, మాయకును, అవిద్యకును భేదము జెప్పుటవల్ల ప్రయోజనమేమి?. ఉ. ఇట్లు ఆమూలప్రకృతి, విశుద్ధసత్వగుణప్రధానముచేత మాయయనియు, మలినసత్వగుణప్రధానముచేత అవిద్యయనియు ఇట్లు రెండువిధములుగా భేదమునుగలిగియున్నది. గనుక, మాయాఅవిద్యలు రెండును ప్రకృతియొక్క అవస్థావిశేషములని తెలియవలెను. మరియు, సత్వగుణము, జ్ఞానప్రకాశరూపముగలదియగును. రజస్తమోగుణములు రెండును అజ్ఞానఅప్రకాశరూపములను గలిగియుండును. మరియు, మాయయందుప్రతిబింబించిన బ్రహ్మచైతన్యము, ఆమాయను, తనస్వాధీనముజేసికొని సర్వజ్ఞత్వాదిగుణములనుగలిగి యీశ్వరుడని చెప్పబడును.

శ్లో॥ అవిద్యావశగస్త్వన్యస్తద్వైచిత్ర్యాదనేకధా।
సాకారణశరీరంస్యాత్ ప్రాజ్ఞస్తత్రాభిమానవాన్॥ ౧౭.

టీ. అవిద్యావశగస్తు - అవిద్యయందు ప్రతిబింబించి అవిద్యావశమునుపొందిన చిదాత్ముడో, అన్యః - జీవుడాయెను. తద్వైచిత్ర్యాత్ = తత్ - ఆ యవిద్యయొక్క, వైచిత్ర్యాత్ -అవిశుద్ధిభేదమువల్ల, అనేకధా- నానావిధములుగలవాడగుచున్నాడు. సా-ఆయవిద్య, కారణశరీరం-కారణశరీరము, స్యాత్-అగును. తత్ర-ఆకారణశరీరమందు, అభిమానవాన్ - నేననెడియభిమానముగలజీవుడు, ప్రాజ్ఞః-ప్రాజ్ఞుడని చెప్పబడును

తా. మరియు, బ్రహ్మచైతన్యమే, అవిద్యయందుప్రతిబింబించి, యాప్రతిబింబము, అవిద్యయొక్క వశమందువర్తింపుచుండుట చేత, జీవుడనిచెప్పబడును. మరియు, ఆజీవునకుఉపాధిభూతమైనయవిద్య, మలినసత్వభేదమువల్ల, నానావిధములుగానున్నది. గనుక, ఆయవిద్యావశమందున్న ప్రతిబింబరూపజీవుడును, దేవమనుష్యపశ్వాదిభేదముచేత నానావిధములుగలవాడగుచున్నాడు. మరియు, ఆయవిద్య, కారణశరీరమగును. ఆయవిద్య, స్థూలసూక్ష్మశరీరాదికమునకు కారణరూపముగానున్నందున, కారణశరీరమని చెప్పబడును. మరియు, ఆయవిద్య, ప్రకృతియొక్క అవస్థావిశేషమగుటవల్ల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కారణమనియు బ్రహ్మతత్త్వజ్ఞానముచేతనశింపబడుచున్నందున శరీరమనియుంజెప్పబడుచున్నది. ఆకారణశరీరమందు తాదాత్మ్యాధ్యాసముచేతనేన నెడియభిమానముగలజీవుడు ప్రాజ్ఞుడనిచెప్పబడును. ప్ర. అయితే, ప్రాజ్ఞశబ్దమునకు అర్థమేమి?. ఉ. వినాశములేని ప్రజ్ఞగలవాడైనందున, ప్రజ్ఞుడనియు, ఆప్రజ్ఞుడే, ప్రాజ్ఞుడనియుంజెప్పబడునని తెలియవలెను.

అవ. ఇట్లు కారణశరీరమునుదెలిపి, ఇకను సూక్ష్మశరీరమును దెలుపుటకొరకు అందుకు కారణమైన యాకాశాదిసృష్టిక్రమమును జెప్పుచున్నాడు.

శ్లో॥ తమఃప్రధానప్రకృతేస్తద్భోగాయేశ్వరాజ్ఞయా।
వియత్పవనతేజోఽంబుభువోభూతానిజజ్ఞిరే॥ ౧౭.

టీ. తద్భోగాయ=తత్-అప్రాజ్ఞులకు, భోగాయ-సుఖదుఃఖసాక్షాత్కారసిద్ధికొరకు, తమఃప్రధానప్రకృతేః=తమఃప్రధాన-తమోగుణప్రధానమైన, ప్రకృతేః- ప్రకృతివల్ల, ఈశ్వరాజ్ఞయా=ఈశ్వర-ఈశ్వరునియొక్క, ఆజ్ఞయా-ఆజ్ఞచేత, వియత్పవనతేజోఽంబుభువః=వియత్ - ఆకాశంబును, పవన-వాయువును, తేజః-అగ్నియును, అంబు-జలమును, భువః-భూమియు నెడి, భూతాని-ఐదుసూక్ష్మభూతములు, జజ్ఞిరే - పుట్టినవి.

తా. మరియు, ఆకారణశరీరోపాధికులగు ప్రాజ్ఞులనెడిజీవులకుసుఖదుఃఖరూపభోగసిద్ధిగలుగుటకొరకు, ఈశ్వరునియొక్క ఆజ్ఞచేత, తమోగుణప్రధానమగు ఉపాదానకారణభూతపూర్వోక్తప్రకృతివల్ల, ౧-ఆకాశము, ౨, వాయువు, ౩-అగ్ని, ౪-జలము, ౫-భూమి-అనెడి, ఈసూక్ష్మభూతములైదును పుట్టినవి. ప్ర. అయితే ఈశ్వరశబ్దమునకు అర్థమేమి? ఉ. శిక్షించుటమొదలగు శక్తితోగూడి, సర్వజగదాధారుడైనవాడు ఈశ్వరుడనితెలియవలెను. ప్ర. సరి, ఇక్కడ, ఆజ్ఞయనగానేమి?. ఉ. వీక్షణపూర్వకముగా సృష్టింపవలెననెడి సంకల్పరూపము, ఆజ్ఞయగును. ఈయీశ్వరాజ్ఞయే, నిమిత్తకారణభూతమనియుందెలియవలెను.

అవ. ఇట్లు పంచభూతసృష్టినిదెలిపి, ఇకనాభూతములవల్లబుట్టిన కార్యములనుదెలుపదలచి, మొదట జ్ఞానేంద్రియసృష్టిని జెప్పుచున్నాడు.

శ్లో॥ సత్త్వాంశైఃపంచభిస్తేషాంక్రమాద్ధీంద్రియపంచకం।
శ్రోత్రత్వగక్షిరసనఘ్రాణాఖ్యముపజాయతే॥ ౧౮.

టీ. తేషాం-ఆయాకాశాదిసూక్ష్మభూతములయొక్క, పంచభిః-ఐదైన, సత్త్వాం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సత్త్వైః - సత్త్వగుణభాగములచేత, క్రమాత్ - క్రమముగా, శ్రోత్రత్వగక్షిరసనఘ్రాణాఖ్యం=శ్రోత్ర - శ్రోత్రేంద్రియంబును, త్వక్-త్వగింద్రియంబును, అక్షి-చక్షురింద్రియంబును, రసన-జిహ్వేంద్రియంబును, ఘ్రాణ-ఘ్రాణేంద్రియమనెడి, ఆఖ్యం, పేర్లుగల, ధీంద్రియపంచకం = ధీంద్రియ-జ్ఞానేంద్రియములయొక్క, పంచకం-పంచకము, ఉపజాయతే-పుట్టుచున్నది. అనగా పుట్టెనమట.

తా. ఆయాకాశాది పంచసూక్ష్మభూతములయొక్క, సత్త్వగుణభాగములగు అయిదింటిచేతను, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములనెడి పేర్లుగల, అయిదుజ్ఞానేంద్రియములు క్రమముగాబుట్టినవి. ప్ర. అదియెట్లు?. ఉ. ఆకాశముయొక్క సత్త్వగుణభాగమువల్ల, ౧- శ్రోత్రేంద్రియముపుట్టెను. వాయువుయొక్క సత్త్వగుణభాగమువల్ల, ౨- త్వగింద్రియముబుట్టెను. అగ్నియొక్క సత్త్వగుణభాగమువల్ల ౩- చక్షురింద్రియముబుట్టెను. జలముయొక్క సత్త్వగుణభాగమువల్ల, ౪- జిహ్వేంద్రియముబుట్టెను. పృథ్వియొక్క సత్త్వగుణభాగమువల్ల, ౫- ఘ్రాణేంద్రియముబుట్టెను. ఇట్లు ఒకొ్కకభూతముయొక్క సత్త్వగుణభాగమువల్ల, ఒకొ్కకజ్ఞానేంద్రియముచొప్పున క్రమముగా జ్ఞానేంద్రియములైదునుబుట్టెను. గనుకనే యేయేభూతమువల్ల, నేయేయింద్రియముబుట్టెనో ఆయాయింద్రియము ఆయాభూతగుణమును గ్రహించుచున్నదని తెలియవలెను.

శ్లో॥ తైరంతఃకరణంసర్వైర్వృత్తిభేదేనతద్ద్విధా।
మనోవిమర్శరూపంస్యాద్బుద్ధిస్స్యాన్నిశ్చయాత్మికా॥ ౨౦.

టీ. తైస్సర్వైః. ఆపంచభూతములయొక్క పంచసత్త్వగుణభాగములచేత, అంతఃకరణం-అంతరింద్రియమనెడి ద్రవ్యముబుట్టెను. తత్-ఆయంతఃకరణము, వృత్తిభేదేన-పరిణామభేదముచేత, ద్విధా-రెండువిధములుగలది, (భవతి) అగుచున్నది. విమర్శరూపం-సంశయరూపమగువృత్తిగలది, మనః-మనస్సు, స్యాత్-అగును. నిశ్చయాత్మికా-నిశ్చయస్వరూపమగువృత్తిగలది, బుద్ధిః-బుద్ధి, స్యాత్- అగును.

తా. మరియు, ఆపంచసూక్ష్మభూతములయొక్క, సత్త్వగుణభాగములైదును కలిసివర్తించుటచేత, ఆపంచసత్త్వగుణభాగముయొక్క మొత్తమువల్ల, అంతఃకరణమనెడి ద్రవ్యముపుట్టెను. మరియు ఆయంతఃకరణము వ్యాపారభేదమువల్ల రెండువిధములుగానున్నది. ప్ర. అయితే వ్యాపారభేదమువల్లగలిగిన యారెండువిధములెవ్వి?. ఉ. సంశయవృత్తియే స్వరూపముగాగలయంతఃకరణము, మనంబుఅనిచెప్పబడును. నిశ్చయవృత్తియే స్వరూపముగాగలయంతఃకరణము, బుద్ధియనిచెప్పబడును. గనుక, అంతఃకరణము మనోబుద్ధులకు రెంటికిని ఉపాదానకారణభూతముగానున్నదని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మరియు పంచభూతములయొక్క పంచసత్త్వగుణభాగముల మొత్తముచేత అంతఃకరణము పుట్టుటవల్లనే అంతఃకరణము జ్ఞానేంద్రియపంచకముచేత గ్రహింపబడెడి సర్వపదార్థములయొక్క గుణదోషములను యెరుగుచున్నదని గ్రహింపవలెను. మరియు, సత్త్వగుణభాగముల మొత్తముచేతపుట్టినందున ఈయంతఃకరణము సర్వభూతసత్త్వగుణముల యొక్క సాధారణకార్యమని చెప్పబడును. మరియు, ఒక్కొక సత్త్వగుణభాగమువలన ఒక్కొకజ్ఞానేంద్రియము పుట్టినందున జ్ఞానేంద్రియములైనను అసాధారణకార్యములని చెప్పబడును.

శ్లో॥ రజోంశైఃపంచభిస్తేషాంక్రమాత్కర్మేంద్రియాణితు।
వాక్పాణిపాదపాయూపస్థాభిధానానిజజ్ఞిరే॥ ౨౧.

టీ. తేషాం -ఆయాకాశాదిపంచభూతములయొక్క, పంచభిః-అయిదైన, రజోంశైః-రజోగుణభాగములచేత, క్రమాత్-క్రమముగా, వాక్పాణిపాదపాయూపస్థాభిధానాని=వాక్-వాగింద్రియము, పాణి-పాణీంద్రియము, పాద-పాదేంద్రియము, పాయు-పాయ్వింద్రియము, ఉపస్థ-ఉపస్థేంద్రియమునవెడి, అభిధానాని - పేళ్లుగల కర్మేంద్రియాణి-కర్మేంద్రియములు, జజ్ఞిరే పుట్టినవి.

తా. మరియు ఆపంచసూక్ష్మభూతములయొక్క రజోగుణభాగములచేత, ౧. వాక్కు, ౨. పాణి, 3. పాదము, ౪. పాయువు, ౫. ఉపస్థలనెడి పేర్లుగల, అయిదుకర్మేంద్రియములు క్రమముగాబుట్టెను. ఈయింద్రియములైదున్నూ, క్రియలనుకలిగింపుచున్నందున కర్మేంద్రియములని చెప్పబడును. ఈకర్మేంద్రియములైదును వొక్కొకభూతముయొక్క రజోగుణభాగమువలన ఒక్కొకటిపుట్టినందున అసాధారణకార్యములని చెప్పబడుచున్నవి. కనుక, ఆకాశరజోంశమువలన, ౧. వాగింద్రియముపుట్టెను. వాయురజోంశమువలన, ౨. పాణీంద్రియముపుట్టెను. అగ్నిరజోంశమువలన, 3. పాదేంద్రియముపుట్టెను. జలరజోంశమువలన, ౪. పాయురింద్రియముపుట్టెను. భూమిరజోంశమువలన, ౫. ఉపస్థేంద్రియము పుట్టెనని తెలియవలెను.

శ్లో॥ తైస్సర్వైస్సహితైఃప్రాణోవృత్తిభేదాత్సపంచధా।
ప్రాణోపానస్సమానశ్చోదానవ్యానౌచతేపునః॥ ౨౨.

టీ. తైస్సర్వైస్సహితైః - ఆరజోభాగములుకలసిన మొత్తముచేత, ప్రాణః - ప్రాణవాయువుపుట్టుచున్నది. సః-ఆప్రాణవాయువు, వృత్తిభేదాత్ -ప్రాణనాదివ్యాపారభేదమువలన, పంచధా-అయిదువిధములుగలదియగుచున్నది. తేపునః-ఆపంచవిధ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు, ప్రాణః-ప్రాణమనియు, అపానః-అపానమనియు, సమానశ్చ-సమానమనియు, ఉదానవ్యానౌ చ=ఉదాన-ఉదానమనియు, వ్యానౌచ-వ్యానమనియుం జెప్పబడును.

తా. మరియు, కలసి కారణత్వమును పొందిన, పంచసూక్ష్మభూతములయొక్క రజోగుణభాగములైదింటిచేతను ప్రాణవాయువు పుట్టెను. ఆ ప్రాణవాయువు వ్యాపారభేదమువల్ల అయిదు భేదములు గానున్నది. ప్ర. ఆభేదములెవ్వి? ఉ. ౧, ప్రాణము. ౨. అపానము. ౩. సమానము. ౪. ఉదానము. ౫ వ్యానము. అనియిట్లు అయిదు భేదములు గానున్నదని తెలియవలెను. ఈ ప్రాణవాయువు పంచభూతరజోగుణములయొక్క సాధారణకార్యమని చెప్పబడును.

శ్లో॥ బుద్ధికర్మేంద్రియప్రాణపంచకైర్మనసాధియా।
శరీరం సప్తదశభిస్సూక్ష్మం తల్లింగముచ్యతే॥ ౨౩.

టీ. బుద్ధికర్మేంద్రియప్రాణపంచకైః=బుద్ధి - జ్ఞానేంద్రియములయొక్కయు, కర్మేంద్రియ-కర్మేంద్రియములయొక్కయు, ప్రాణ-ప్రాణములయొక్కయు, పంచకైః-పంచసంఖ్యలతోటియు, మనసా-మనస్సుతోటియు, ధియా, బుద్ధితోటియుకూడా, సప్తదశభిః- పదియేడింటిచేత, సూక్ష్మం-సూక్ష్మమైనది, శరీరం-శరీరమగుచున్నది. తత్-ఆ సూక్ష్మశరీరము, లింగం-లింగశరీరమని, ఉచ్యతే-వేదాంతములయందు చెప్పబడుచున్నది.

తా. ఈ పైన చెప్పబడిన జ్ఞానేంద్రియములైదును కర్మేంద్రియములైదును ప్రాణాదివాయువులైదును మనోబుద్ధులు రెండును, ఇవియన్నియు చేరగా పదియేడగుచున్నవి. ఈ పదియేడును చేరి సూక్ష్మశరీరమగును. ఈసూక్ష్మశరీరమే, వేదాంతశాస్త్రమందు లింగశరీరమని చెప్పబడును.

అవ. ఇట్లు సూక్ష్మశరీరమును దెలిపి, ఆ సూక్ష్మశరీరమందుగల యభిమానత్వముచేత ప్రాజ్ఞేశ్వరులకుగలిగిన యవస్థాంతరమును ఇప్పుడు చూపుచున్నాడు.

శ్లో॥ ప్రాజ్ఞస్తత్రాభిమానేన తైజసత్వం ప్రపద్యతే।
హిరణ్యగర్భతామీశస్తయోర్వ్యష్టిసమష్టితా॥ ౨౪.

టీ. ప్రాజ్ఞః-అవిద్యోపాధికుడగుజీవుడు, తత్ర-ఆలింగశరీరమందు, అభిమానేన-నేననియభిమానించుటచేత, తైజసత్వం- తైజసనామకత్వమును, ప్రపద్యతే-పొందుచున్నాడు. ఈశః-ఈశ్వరుడు, తత్ర-ఆసూక్ష్మశరీరమందు, అభిమానేన- నేననియభిమానించుటచేత, హిరణ్యగర్భతాం-హిరణ్యగర్భసంజ్ఞకత్వమును, ప్రపద్యతే-పొందుచున్నా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డు. తయోః- ఆజీవేశ్వరులకు, వ్యష్టిసమష్టితా=వ్యష్టి - వ్యష్టిత్వంబును, సమష్టితా-సమష్టిత్వంబును (భవతి) అగుచున్నది.

తా. పూర్వము చెప్పబడిన మలినసత్వప్రధాన అవిద్యోపాధికుడగు ప్రాజ్ఞుడనెడిజీవుడు ఆలింగశరీరమందు నేననియభిమానించుటచేత తైజసుడనెడి పేరుగలవాడాయెను. ఆలింగశరీరము తేజశ్శబ్దముచేత చెప్పదగిన అంతఃకరణముతోటి చేరియున్నది. గనుక ఆలింగశరీరము తేజోరూపమగును. అందుయభిమానముగలజీవునకు తైజసుడనెడిపేరుగలిగెను. మరియు, విశుద్ధసత్వప్రధానమాయోపాధికుడగు యీశ్వరుడు ఆ లింగశరీరమందు నేననియభిమానించుటచేత ఆయీశ్వరునకు హిరణ్యగర్భుడనెడి పేరుగలిగెను.
ప్ర. అయితే, జీవేశ్వరులగు తైజసహిరణ్యగర్భులకు లింగశరీరమందుగల యభిమానము సమానమైయుండగా ఆజీవేశ్వరులకు పరస్పరభేదకారణమేమి? ఉ. జీవునకు వ్యష్టిత్వమగును. ఈశ్వరునకు సమష్టిత్వమగును. ఒకదేహమును వ్యష్టియనియు సర్వదేహములను సమష్టియనియుం దెలియవలెను. జీవుడొకదేహమందు నేననియభిమానించుటచేత వ్యష్టిరూపాభిమానియగును. ఈశ్వరుడు సర్వదేహములయందును నేననియభిమానించుటచేత సమష్టిరూపాభిమానియగును. ఇట్టి యభిమానభేదము గలిగియుండుటచేత ఆ తైజసహిరణ్యగర్భులగు జీవేశ్వరులకును భేదముగలిగియున్నదని యభిప్రాయము.

శ్లో॥ సమష్టిరీశస్సర్వేషాం స్వాత్మతాదాత్మ్యవేదనాత్।
తదభావాత్తతో న్యేతుకథ్యంతే వ్యష్టిసంజ్ఞయా॥ ౨౫.

టీ. ఈశః-హిరణ్యగర్భుడు, సర్వేషాం-సర్వజీవులయొక్క, స్వాత్మతాదాత్మ్యవేదనాత్=స్వాత్మతాదాత్మ్య-ఏకత్వముయొక్క, వేదనాత్-జ్ఞానమువలన, సమష్టిః-సమష్టిశబ్దముచేతచెప్పబడును, తతః-ఆహిరణ్యగర్భునికంటె, అన్యేతు-ఇతరులైనజీవులు, తదభావాత్=తత్-ఆయేకత్వజ్ఞానముయొక్క, అభావాత్-లేమివల్ల, వ్యష్టిసంజ్ఞయా-వ్యష్టిశబ్దముచేత, కథ్యంతె-చెప్పబడుచున్నారు.

తా. ప్ర. అయితే జీవేశ్వరులకు వ్యష్టిసమష్టిరూపత్వములు గలుగుటకు కారణమేమి? ఉ. సర్వలింగశరీరోపాధికులగు సర్వజీవులయొక్క యేకత్వజ్ఞానము యీశ్వరునకుగలిగియుండుటచేత ఆ యీశ్వరుడైన హిరణ్యగర్భుడు సమష్టిరూపుడగుచున్నాడు. ఆట్టిస్వస్వరూపభూత సర్వజీవైకత్వజ్ఞానము జీవునకులేదు. ఆకారణమువలన యీశ్వరునికంటె నన్యులగు తైజసులనెడిజీవులు వ్యష్టిరూపులగుచున్నారు. అనగా సర్వలింగశరీరోపాధివల్ల యీశ్వరుడు సమష్టిరూపుడాయెననియు, ఒకలింగశరీరోపాధివల్ల జీవుడు వ్యష్టిరూపుడాయెననియుం దెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇకను స్థూలశరీరాద్యుత్పత్తిసిద్ధికొరకు పంచీకరణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ తద్భోగాయపునర్భోగ్యభోగాయతనజన్మనే।
పంచీకరోతిభగవాన్ ప్రత్యేకంవియదాదికం॥ ౨౬.

టీ. భగవాన్-పరమేశ్వరుడు, పునః-మరల, తద్భోగాయ=తత్-ఆజీవులయొక్క, భోగాయ-భోగముకొరకు, భోగ్యభోగాయతనజన్మనే=భోగ్య- అన్నపానాదులయొక్కయు, భోగాయతన-చతుర్విధభూతశరీర సమూహముయొక్కయు, జన్మనే-ఉత్పత్తికొరకు, వియదాదికం - ఆయాకాశాదిసూక్ష్మభూతపంచకమును, ప్రత్యేకం-ఒక్కొకటిని, పంచీకరోతి-అయిదు గాజేయుచున్నాడు.

తా. ౧. సమగ్రైశ్వర్యము, ౨. వీర్యము, ౩. కీర్తి, ౪. తేజస్సు, ౫. జ్ఞానము, ౬. వైరాగ్యము, ఈయారుగుణములును సమగ్రము గాగలవాడు భగవంతుడని, శ్లో॥ ఐశ్వర్యస్యసమగ్రస్యవీర్యస్యయశసశ్శ్రియః । జ్ఞానవైరాగ్యయోశ్చైవషణ్ణాంభగఇతీరితః॥ ఇట్లు చెప్పబడును. మరియు, ౧ ఉత్పత్తి, ౨. ప్రళయము, ౩. జీవులయొక్క రాకయు, ౪. జీవులయొక్కపోకయు, ౫. విద్యయు, ౬. అవిద్యయు, ఈయారింటిని యెఱిగినవాడు భగవంతుడని, శ్లో॥ ఉత్పత్తించవిలయంచైవ భూతానామాగతింగతిం। వేత్తివిద్యామవిద్యాంచసవాచ్యోభగవానితి॥ ఇట్లు చెప్పబడును. అట్టి భగవంతుడైన పరమేశ్వరుడు మరల ఆజీవులయొక్క భోగముకొరకే చతుర్విధభూతశరీరసమూహములును,అన్నపానాదులును,గలిగెడి నిమిత్తమై ఆకాశాదిసూక్ష్మభూతపంచకమును ఒక్కొకటిని అయిదు గాజేసెను. అనగా అపంచీకృతభూతములకు పంచభూతాత్మకత్వముగలుగునట్లుజేసెనని తెలియవలెను. ప్ర. అయితే చతుర్విధభూతశరీరసమూహమెద్ది? ఉ. మావివల్లబుట్టెడిమనుష్యాదిశరీరములు, ౧. జరాయుజములని చెప్పబడును. మరియు గ్రుడ్డువల్లబుట్టెడి పక్ష్యాదిశరీరములు, ౨. అండజములని చెప్పబడును. చెమటనీటివలనబుట్టెడి పేలు మొదలగువానిశరీరములు, ౩. స్వేదజములని చెప్పబడును, భూమివలనబుట్టెడి వృక్షాదులు, ౪. ఉద్భిజ్జములని చెప్పబడును. ఇదియే చతుర్విధభూతసమూహమని తెలియవలెను.

శ్లో॥ ద్విధావిధాయచైకైకంచతుర్ధాప్రథమంపునః।
స్వస్వేతరద్వితీయాంశైర్యోజనాత్పంచపంచతే॥ ౨౭.

టీ. ఏకైకం - ఒక్కొకసూక్ష్మభూతమును, ద్విధావిధాయ-రెండేసిభాగములుగాజేసి, పునః-మరల, ప్రథమం-మొదటిమొదటిభాగమును, చతుర్ధావిధాయ-నాలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గేసిభాగములుగాఁజేసి, స్వస్వేతరద్వితీయాంశైః=స్వస్వ-తనతనకంటె, ఇతర-అన్యములైన నాలుగు నాలుగుభూతములయొక్క, ద్వితీయాంశైః - రెండవ రెండవస్థూలభాగములతోఁ, యోజనాత్ - మొదటిమొదటిభాగాంశములగు నాలుగునాలుగులో నొక్కటినిజేర్చుటవలన, తే - ఆయాకాశాదిసూక్ష్మభూతములైదును, పంచపంచ-ప్రత్యేకముగా పంచపంచస్వరూపములగుచున్నవి.

తా. ప్ర అయితే, ఒక్కొక భూతమునకు పంచపంచవిధము ఎట్లు గలుగునో చెప్పుము?. ఉ. పూర్వముజెప్పబడిన ఆకాశాదిపంచసూక్ష్మభూతములు అపంచీకృతభూతములని చెప్పబడును. ఆయపంచీకృతసూక్ష్మభూతములయొక్క సత్త్వరజోగుణాంశములవల్ల పదియేడు అవయవములుగల సూక్ష్మశరీరము పుట్టినవిధము ఇదివరకు చెప్పబడెను. మరియు, తమోగుణప్రధానములగు ఆయపంచీకృతసూక్ష్మభూతములు ఒక్కొకటి రెండేసిభాగములై మరల ప్రథమప్రథమభాగములు ప్రత్యేకముగా నాలుగేసిభాగములై తనతనకంటె ఇతరములైన నాలుగునాలుగు భూతములయొక్క ఏయేద్వితీయస్థూలభాగములుగలదో, దానిదానితోఁగూడా ప్రథమప్రథమభాగాంశములగు నాలుగునాలుగింటిలో నొక్కకటిని చేర్చుటవలన, ఆయాకాశాది పంచభూతములు ఒక్కొకటి, అయిదైదుగా యగుచున్నది. ఇట్లు పరమేశ్వరుడు పంచీకరించెననియు ఇదియే పంచీకరణమనియుం దెలియవలెను.

అవ. ఇట్లు పంచీకరణమునుదెలిపి ఆపంచీకరింపబడిన స్థూలభూతములచేత పుట్టిన కార్యములను ఇప్పుడుజూపుచున్నాడు.

శ్లో॥ తైరండస్తత్ర భువనంభోగ్యభోగాశ్రయోద్భవః।
హిరణ్యగర్భఃస్థూలేఽస్మిన్ దేహేవైశ్వానరోభవేత్॥ ౨౭.

టీ. తైః-ఆపంచీకరింపబడిన స్థూలభూతములచేత, అండః-బ్రహ్మాండము పుట్టుచున్నది. తత్ర-ఆబ్రహ్మాండమందు, భువనం-లోకసమూహంబును, భోగ్యభోగాశ్రయోద్భవః=భోగ్య-భుజించుటకు యోగ్యములగు అన్నాదులయొక్కయు, భోగాశ్రయ-ఆయాలోకోచితశరీములయొక్కయు, ఉద్భవః ఉత్పత్తి, తైః-ఆస్థూలభూతములచేతనే ఈశ్వరాజ్ఞవల్ల నగుచున్నది. అస్మిన్-ఈ, స్థూలే-స్థూలమనెడి, దేహే-దేహమందు, హిరణ్యగర్భః-హిరణ్యగర్భుడనెడి యీశ్వరుడు ప్రవర్తించుచు, వైశ్వానరః- వైశ్వానరుడనెడి సంజ్ఞగలవాడు, భవేత్ - అగును.

తా. అట్లు పంచీకరింపబడిన స్థూలభూతములచేత బ్రహ్మాండముపుట్టెను. ఆబ్రహ్మాండమందు ౧. భూలోకము, ౨. భువర్లోకము, ౩. సువర్లోకము, ౪. జనోలోక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము, ౫. మహాలోకము, ౬. తపోలోకము, ౭. సత్యలోకము, ఈయేడులోకములును పైభాగమందున్నవి. మరియు, ఆబ్రహ్మాండమధ్యమందు భూలోకముక్రింద, ౧. అతల లోకము, ౨. వితలలోకము, ౩. సుతలలోకము, ౪. రసాతలలోకము, ౫. తలాతల లోకము, ౬. మహాతలలోకము, ౭. పాతాళలోకము, అనెడియాయేడులోకములు గలిగియున్నవి. ఆయాలోకములయందు ప్రాణులచేత భుజించుటకు యోగ్యములైన అన్నపానాదులును ఆయాలోకములకుదగిన స్థూలశరీరములును ఇవియన్నియు పంచీకృతస్థూలభూతములచేతనే యీశ్వరాజ్ఞవల్లపుట్టుచున్నవి. మరియు హిరణ్యగర్భుడనెడి యీశ్వరుడు సర్వస్థూలదేహములయందును సమష్టిరూపముగానుండి వైశ్వానరుడనెడి పేరుగలవాడాయెను.

శ్లో॥ తైజసావిశ్వతాంయాతా దేవతిర్యఙ్నరాదయః।
తేపరాగ్దర్శినఃప్రత్యక్తత్త్వబోధవివర్జితాః॥ ౨౯.

టీ. (అస్మిన్ స్థూలదేహే) ఈస్థూలదేహమందు, తైజసాః-తైజసులనెడిజీవులు ప్రవర్తించుచు, విశ్వతాం-విశ్వనామకత్వమును, యాతాః-పొందిరి. దేవతిర్యఙ్నరాదయః - దేవపశుమనుష్యాదిరూపవంతులగు, తే-ఆవిశ్వులనెడిజీవులు, ప్రత్యక్తత్త్వబోధవివర్జితాస్సంతః-జ్ఞానములేనివారగుచు, పరాక్ -బాహ్యశబ్దాదులనే, దర్శినః-చూచుచున్నారు.

తా. మరియు, తైజసులనెడిజీవులు ఒక్కొకస్థూలదేహమందు వర్తించుచు విశ్వులనెడిపేరుగలవారగుచున్నారు. ఆ విశ్వులనెడిజీవులు దేవమనుష్యపశ్వాదిరూపవంతులగుచు ప్రత్యగాత్మరూపమగు పరబ్రహ్మముయొక్క జ్ఞానములేనివారై బాహ్యములగు శబ్దాదివిషయములనే జూచుచున్నారుగాని ప్రత్యగాత్మనుజూడలేదు. ఇట్లు, శ్రు. పరాంచిఖానివ్యతృణత్స్వయంభూస్తస్మాత్పరాక్పశ్యతినాంతరాత్మన్। అనెడి శ్రుతిచెప్పుచున్నది. ప్ర. అయితే తార్కికాదులు దేహముకంటె అన్యుడైన ఆత్మను యెరుగుచుండగా యెవ్వరును ఆత్మనెరుగరని యెట్లుచెప్పితివి?. ఉ. ఆతార్కికాదులు ఆత్మనెరిగినను శ్రుతిసిద్ధమైన ఆత్మతత్త్వమగు పరబ్రహ్మస్వరూపము నెరుగరు.

శ్లో॥ కుర్వతేకర్మభోగాయకర్మకర్తుంచభుంజతే।
నద్యాంకీటాఇవావర్తాదావర్తాంతరమాశుతే।
వ్రజంతేజన్మనోజన్మలభంతేనైవనిర్వృతిం॥ ౩౦.

టీ. భోగాయ-ఆజీవరాశి మనుష్యాదిశరీరమునుపొంది సుఖాద్యనుభవముకొరకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డు, కర్మ- ఆయాశరీరోచితకర్మమును, కుర్వతే - చేయుచున్నది. (పునశ్చ) మరల, కర్మ-కర్మమును, కర్తుం-చేయుటకొరకు, భుంజతే-దేవాదిశరీరములచేతనాయాకర్మఫలములను జీవరాశియనుభవింపుచున్నది. నద్యాం-నదీప్రవాహమందు, ఆవర్తాత్-ఒకనీటిసుడినుంచి, ఆవర్తాంతరం-మరియొకనీటిసుడిని పొందిన, కీటాఇవ-పురుగులవలె, తే - ఆ జీవులు, ఆశు-శీఘ్రముగా, జన్మనః-ఒకజన్మమునుంచి, జన్మ - మరియొకజన్మమును, వ్రజంతే-పొందుచున్నారు. నిర్వృతిం-సుఖమును, నలభంతే-పొందుచున్నవారుకారు.

తా. మరియు, ఆజీవులకు శ్రుతిసిద్ధమైన తత్త్వజ్ఞానము లేమిచేత మనుష్యాదిశరీరములను పొంది సుఖాదులననుభవించుటకొరకు ఆయాదేహములచేత చేయదగిన కర్మములను జేయుచున్నారు. మరల కర్మములను జేయుటకొరకే దేవాదిశరీరములను పొంది ఆయాకర్మఫలముల ననుభవించుచున్నారు. మరియు ఆయాకర్మఫలములను దేవాదిశరీరములచేతననుభవించనియెడల జనులకు ఆయాకర్మఫలేచ్ఛలేక ఆయాకర్మములననుష్ఠించకుండవలయును. అట్లుగాక ఫలాపేక్షచేత కర్మములను జేయుచున్నారు. కనుక, దేవాదిశరీరములచేత ఆయాకర్మఫలానుభవముగలుగుచున్నదని తెలియవలెను. ఈప్రకారము నదీప్రవాహమందు ఒకనీటిసుడినుంచి మరియొకనీటిసుడినిపొందెడిపురుగులవలె ఆజీవులు ఒకజన్మమునుంచి మరియొకజన్మమును శీఘ్రముగాపొందుచు కొంచమైనను సుఖములేక సంసారమందు ప్రవర్తించుచుజననమరణాదిమహాద్దుఃఖమునుపొందుచున్నారు.

అవ. ఇట్లు, జీవులకు సంసారప్రాప్తినిజెప్పి, ఆసంసారమునివర్తించెడి యుపాయమునుజూపుటకొరకు, ఇప్పుడు దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ సత్కర్మపరిపాకాత్తేకరుణానిధినోద్ధృతాః।
పాప్యతీరతరుచ్ఛాయాంవిశ్రామ్యంతియథాసుఖం॥ ౨౧

టీ॥ తే-ఆపురుగులు, సత్కర్మపరిపాకాత్ = సత్కర్మ-పూర్వజన్మకృత పుణ్యముయొక్క, పరిపాకాత్ - పరిపక్వమువల్ల, కరుణానిధినా-విశేషకరుణగల ఒకానొక పురుషునిచేత, ఉద్ధృతాస్సంతః- నదీప్రవాహమునుంచి బాహ్యమునకు నెత్తబడినవగుచు, తీరతరుచ్ఛాయాం=తీర-నదీతీరమందుగల, తరుచ్ఛాయాం- చెట్లునీడను, ప్రాప్య-పొంది, యథాసుఖం-సుఖముగలుగునట్లుగా, విశ్రామ్యంతి-విశ్రమించుచున్నవి.

తా. ఆనదీప్రవాహమందుగల నీటిసుడులయందు తల్లడించెడిపురుగులు తమ పూర్వజన్మకృత పుణ్యపరిపాకమువల్ల కరుణగల ఒకానొకపురుషునిచేత బాహ్యస్థలమునకు నెత్తబడుచున్నవి. అట్లుయెత్తబడినపురుగులు ఆయేటిగట్టునందుగల చెట్లునీడను పొంది తమకుసుఖముగలుగునట్లుగా విశ్రమించుచున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఈదృష్టాంతమందుగల యర్థమును దార్ష్టాంతికమందుజూపుచున్నాడు.

శ్లో॥ ఉపదేశమవాప్యైవమాచార్యాత్తత్త్వదర్శినః।
పంచకోశవివేకేనలభ్యతేనిర్వృతింపరాం॥ ౩౨.

టీ. ఏవం-ఈప్రకారము, అనగా పూర్వజన్మకృత పుణ్యపరిపక్వవశమువల్లన నుట. తత్త్వదర్శినః-ప్రత్యగభిన్నబ్రహ్మ సాక్షాత్కారవంతుడైన, ఆచార్యాత్ - గురుని వలన, ఉపదేశం-వేదాంతవాక్యార్థశ్రవణమును, అవాప్య-పొంది, పంచకోశవివేకేన= పంచకోశ-పంచకోశములయొక్క, వివేకేన - వివేచనముచేయుటచేత, పరాం-అధిక మైన, నిర్వృతిం-మోక్షసుఖమును, లభంతే-జీవులుపొందుచున్నారు.

తా. పూర్వోక్తదృష్టాంతమందువలెనే, పూర్వజన్మకృతపుణ్యపరిపక్వవశముచేత ప్రత్యగభిన్న బ్రహ్మ సాక్షాత్కారవంతుడైన గురునివల్ల, ఇకమీదచెప్పబోయెడి తత్త్వ మస్యాది వాక్యార్థరూపమగు ఉపదేశమునుపొందును. అట్టియుపదేశరూపమైన జ్ఞాన సాధన శ్రవణముచేత అన్నమయాదిపంచకోశములను ఆత్మకంటె భిన్నములైనవానినిగా నెరిగెడి వివేకముగలుగును. ఇకచెప్పబడెడి పంచకోశవివేకముచేత జీవులకు మోక్షసు ఖముగలుగుచున్నది.

శ్లో॥ అన్నంప్రాణోమనోబుద్ధిరానందశ్చేతిపంచ తే।
కోశాస్తైరావృతఃస్వాత్మావిస్మృత్యాసంసృతింవ్రజేత్॥ ౩౩.

టీ. అన్నం-అన్నమయమనియు, ప్రాణః-ప్రాణమయమనియు, మనః-మనో మయమనియు, బుద్ధిః-విజ్ఞానమయమనియు, ఆనందశ్చ- ఆనందమయమనియు, ఇతి- ఇట్లనెడిపేర్లుగలవి, తే-ఆ, పంచ -అయిదైన, కోశాః-కోశములగును. తైః-ఆకోశము లచేత, స్వాత్మా-స్వస్వరూపభూతుడైనయాత్మ, ఆవృతస్సన్-కప్పబడినవాడగుచు, వి స్మృత్యా-తనస్వరూపమునుమరచుటచేత, సంసృతిం-సంసారమును, వ్రజేత్-పొందును.

తా. ప్ర. అయితే ఆయన్నమయాదిపంచకోశములెవ్వి? ఉ. ౧. అన్నమ యమనియు, ౨. ప్రాణమయమనియు, ౩. మనోమయమనియు, ౪. విజ్ఞానమయమ నియు, ౫. ఆనందమయమనియు, ఈపేర్లుగలవైదును పంచకోశములగును. ఆఅయి దుకోశములచేత ఆత్మస్వరూపము కప్పబడియున్నది. అట్లు కప్పబడుటచేత తననిజ రూపమగు అద్వితీయపరిపూర్ణానందాది స్వభావమునుమరచి భ్రమించి, తనయందు మ నుష్యత్వాది దేహధర్మములను ఆరోపించుకొని జీవుడుజననమరణాది ప్రాప్తిరూపమై న సంసారమునుపొందుచున్నాడు. పట్టుపురుగు మొదలగుజంతువులు తమదేహమందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంచివంటియొకకోశమునుపుట్టించుకొనును. అట్టికోశము ఆపట్టుపురుగు మొదలగు జంతువులనుకప్పి ఆజంతువులకు దుఃఖహేతువగుచున్నది. అటువలెనే అన్నమయాదిపంచకోశములును ఆత్మనుకప్పి అద్వితీయానందాది స్వభావములను మరుగుపరచి జీవునకుదుఃఖహేతువులగుచున్నవి. అందుచేత అన్నమయాదులకు కోశమనెడి పేరుగలిగెనని యభిప్రాయము.

అవ. ఇప్పుడు ఆపంచకోశములస్వరూపమును క్రమముగాజెప్పుచున్నాడు.

శ్లో॥ స్యాత్పంచీకృతభూతోత్థోదేహస్థూలోన్నసంజ్ఞకః।
లింగేతురాజసైఃప్రాణైఃప్రాణఃకర్మేంద్రియైస్సహ॥ ౩౪.

టీ. పంచీకృతభూతోత్థః=పంచీకృత-పంచీకరింపబడిన, భూత-స్థూలభూతములవల్ల, ఉత్థః-పుట్టిన, స్థూలః-స్థూలమనెడి. దేహః-శరీరము, అన్నసంజ్ఞకః- అన్నమయకోశము, స్యాత్-అగును. ప్రాణస్తు-ప్రాణమయకోశమో, లింగె- సూక్ష్మశరీరమందువర్తించెడి, రాజసైః - రజోగుణకార్యములైన, ప్రాణైః- పంచప్రాణములచేతను, కర్మేంద్రియైస్సహ-పంచకర్మేంద్రియములతోటికూడా, స్యాత్-అగును.

తా. పంచీకృత పంచమహాస్థూల భూతములవల్లబుట్టిన ఈస్థూలదేహము, అన్నమయకోశమగును. మరియు, లింగదేహమందువర్తించెడి, ౧. ప్రాణము. ౨. అపానము. ౩. సమానము. ౪. ఉదానము. ౫. వ్యానములనెడి పంచవాయువులును, ౧. వాక్కు, ౨, పాణి, ౩. పాదము, ౪. పాయువు, ౫. ఉపస్థలనెడి పంచకర్మేంద్రియములును, ఈపదియుంజేరి ప్రాణమయకోశమగును.

శ్లో॥ సాత్త్వికైర్ధీంద్రియైస్సాకంవిమర్శాత్మామనోమయః।
తైరేవసాకంవిజ్ఞానమయోధీర్నిశ్చయాత్మికా॥ ౩౫.

టీ. విమర్శాత్మా - సంశయవృత్తిరూపమగుమనస్సు, సాత్త్వికైః - పంచభూతములయొక్క సత్త్వగుణకార్యములగు, ధీంద్రియైః - జ్ఞానేంద్రియములతోటి, సాకం- కూడినదగుచు, మనోమయః - మనోమయకోశమగును. నిశ్చయాత్మికా - నిశ్చయవృత్తిరూపమగు, ధీః- బుద్ధి, తైరేవ- ఆజ్ఞానేంద్రియములతోటి-సాకంసతి- కూడినదగుచు, విజ్ఞానమయః-విజ్ఞానమయకోశమగును.

తా. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములనెడి జ్ఞానేంద్రియపంచకముతోగూడిన సంశయవృత్తిరూపమగుమనస్సు మనోమయకోశమగును. మరియు, ఆజ్ఞానేంద్రియపంచకముతోగూడిన నిశ్చయవృత్తిరూపమగుబుద్ధి, విజ్ఞానమయకోశమని చెప్పబడును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ కారణే సత్త్వమానందమయో మోదాదివృత్తిభిః।
తత్తత్కోశైస్తు తాదాత్మ్యాదాత్మా తత్తన్మయో భవేత్॥ ౩౬.

టీ. కారణే- కారణశరీరమందుగల, సత్త్వం- మలినసత్త్వగుణము, మోదాదివృత్తిభిః-ప్రియమోదప్రమోద వృత్తులతోఁగూడినదగుచు, ఆనందమయః-ఆనందమయకోశమగును. ఆత్మాతు-ప్రత్యగాత్మయో, తత్తత్కోశైః - ఆయాకోశములతోఁగూడి, తాదాత్మ్యాత్-తాదాత్మ్యాభిమానమువల్ల, తత్తన్మయః-ఆయాకోశమగువాఁడు, భవేత్-అగును.

తా. మరియు, కారణశరీరరూపమగు అవిద్యయందు, ఏమలినసత్త్వగుణముగలదో, ఆమలినసత్త్వగుణము, ప్రియమోదప్రమోదములనెడి సుఖవిశేషవృత్తులతోఁగూడినదై, ఆనందమయమనెడి కోశమగును. ఇష్టవస్తువును చూచినమాత్రముచేతనే కలిగెడి సుఖవృత్తి, ప్రియమని చెప్పబడును. ఆయిష్టవస్తువు, తనకు లభించినప్పుడు గలిగిన సుఖవృత్తి మోదమని చెప్పబడును. ఆలభించిన యిష్టవస్తువును అనుభవించుటచేత గలిగిన సుఖవృత్తి ప్రమోదమని చెప్పబడును. ప్ర. అయితే, స్థూలదేహాదులకు ఇట్లు అన్నమయాది పంచకోశములయొక్క పేర్లుగలిగిన యెడల, శ్రు॥ సవా ఏష పురుషోన్నరసమయః, తస్మాద్వా ఏతస్మాదన్నరసమయాదన్యోఽంతర ఆత్మా ప్రాణమయోఽన్యోఽంతర ఆత్మా మనోమయః॥ ఇత్యాదిశ్రుతులచేత, ఆత్మ, అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయుఁడని యెందుకు చెప్పబడెను?. ఉ. స్థూలదేహాదులకు అన్నాదులచేత వికారత్వము గలిగినందున, ఆస్థూలదేహాదులకు అన్నమయ ప్రాణమయాది నామములు గలిగెను. ప్రత్యగాత్మయో, ఆయాకోశములతోఁటి సంబంధమువల్ల, అది నేననెడి తాదాత్మ్యాభిమానముచేత అన్నమయాదికోశమయుఁడాయెనని శ్రుతిచేత చెప్పబడెను. అనగా వ్యవహారకాలమందు అన్నమయాది పంచకోశప్రాధాన్యముగలిగియుండుటవల్ల ఆత్మయు అన్నమయాదిశబ్దములచేత చెప్పబడుచున్నాఁడని యభిప్రాయము.

శ్లో॥ అన్వయవ్యతిరేకాభ్యాం పంచకోశవివేకతః।
స్వాత్మానం తత ఉద్ధృత్య పరం బ్రహ్మ ప్రపద్యతే॥ ౩౭.

టీ. అన్వయవ్యతిరేకాభ్యాం-అన్వయవ్యతిరేకములచేత, పంచకోశవివేకతః= పంచకోశ-పంచకోశములయొక్క, వివేకతః-వివేకమువల్ల, అనగా పంచకోశములను ప్రత్యగాత్మకంటె భిన్నముగాచేయుటచేతననుట. స్వాత్మానం-ప్రత్యగాత్మను, తతః-ఆపంచకోశములనుంచి, ఉద్ధృత్య-బుద్ధిచేత నెత్తి, అనగా చిదానందస్వరూపమును నిశ్చయించియనుట. పరంబ్రహ్మ-పంచకోశవిలక్షణ పరబ్రహ్మమును, ప్రపద్యతే-జీవుఁడు పొందుచున్నాఁడు, అనగా బ్రహ్మమేయగుచున్నాఁడనుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే, ఇట్టియాత్మకు బ్రహ్మత్వమెట్లుగలుగును.? ఉ. ఇకజెప్పఁబో యెడి అన్వయవ్యతిరేకములచేత పంచకోశములకంటె ప్రత్యగాత్మను బుద్ధిచేతభిన్నముగాజేసియైనను, లేక తనస్వరూపమగు ప్రత్యగాత్మకంటె పంచకోశములను బుద్ధిచేత భిన్నముగాజేసియైనను స్వస్వరూపమగు ప్రత్యగాత్మను ఆపంచకోశములనుంచి బుద్ధిచేత నెత్తి బ్రహ్మమునుపొందుచున్నాడు. అనగా ప్రత్యగాత్మకు చిదానందరూపమును నిశ్చయించుటచేత పంచకోశములకంటె అన్యమగు ప్రత్యగాత్మరూప పరబ్రహ్మమేపురుషుడగుచున్నాడని యభిప్రాయము.

అవ. పైనచెప్పబడిన అన్వయవ్యతిరేకములను ఇప్పుడుజూపుచున్నాడు.

శ్లో॥ అభానేస్థూలదేహస్యస్వప్నేయద్భానమాత్మనః।
సోన్వయోవ్యతిరేకస్తద్భానేఽన్యానవభాసనం॥ ౩౮.

టీ. స్వప్నే-స్వప్నావస్థయందు, స్థూలదేహస్య-అన్నమయకోశముయొక్క, అభానేసతి-ప్రతీతిలేకపోవుచుండగా, ఆత్మనః-ఆత్మయొక్క, యద్భానం-స్వప్నసాక్షిత్వముచేతయేస్ఫురణముగలదో, సః-అది, అన్వయః-ఆత్మకన్వయమగును. స్వప్నే-స్వప్నావస్థయందు, తద్భానేసతి- ఆత్మయొక్కస్ఫురణముగలుగుచుండగా, అన్యానవభాసనం=అన్య-స్థూలదేహముయొక్క, అనవభాసనం-అప్రతీతి, వ్యతిరేకః- స్థూలదేహమునకు వ్యతిరేకమగును.

తా. స్వప్నావస్థయందు స్థూలదేహమగు అన్నమయకోశము స్ఫురించకయుండగా జ్ఞానస్వరూపుడగు ప్రత్యగాత్మకు స్వప్నసాక్షిత్వముచేత యేస్ఫురణముగలదో, అదియాత్మకన్వయమగును. మరియు, ఆస్వప్నావస్థయందే స్వప్నసాక్షిత్వముచేత ఆత్మయొక్కస్ఫురణముగలుగుచుండగా,స్థూలదేహముస్ఫురించకుండుటయే స్థూలదేహమునకు వ్యతిరేకమగును. ఈప్రకరణమందు అన్వయమనగా అనువృత్తియనియు, వ్యతిరేకమనగా వ్యావృత్తియనియుం దెలియవలెను. స్వాభావికముగా సర్వావస్థలయందు వర్తించుచుండుటయే అనువృత్తియగును. ఒకయవస్థయందు తోచుచుండి మరియొకయవస్థయందు నివర్తింపబడుటయే వ్యావృత్తియని చెప్పబడును.

అవ. ఇట్లు స్థూలదేహమునకు అనాత్మత్వమును దెలిపెడి యన్వయవ్యతిరేకములను జెప్పి, లింగదేహమునకు అనాత్మత్వమును దెలిపెడి యాయన్వయవ్యతిరేకములను ఇప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ లింగాభానేసుషుప్తౌస్యాదాత్మనోభానమన్వయః।
వ్యతిరేకస్తుతద్భానేలింగస్యాభానముచ్యతే॥ ౩౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. సుషుప్తౌ-సుషుప్త్యవస్థయందు, లింగాభానేసతి=లింగ- సూక్ష్మదేహము యొక్క, అభానేసతి- స్ఫురణము లేకపోవుచుండగా, ఆత్మనః-జ్ఞానరూపుడగు ఆత్మయొక్క, భానం-స్ఫురణము, అన్వయః-అన్వయము, స్యాత్-అగును. సుషుప్తౌ-సుషుప్త్యవస్థయందు, తద్భానేసతి=తత్-ఆయాత్మయొక్క, భానేసతి- స్ఫురణముగలుగుచుండగా, లింగస్య-సూక్ష్మదేహముయొక్క, అభానం-అస్ఫురణము, వ్యతిరేకః-సూక్ష్మదేహమునకు వ్యతిరేకమని, ఉచ్యతే-చెప్పబడుచున్నది.

తా. మరియు, సుషుప్త్యవస్థయందు సూక్ష్మదేహము స్ఫురించకపోవుచుండగా ఆసుషుప్త్యవస్థాసాక్షిత్వము చేత,ఆత్మ స్ఫురించుచున్నాడు. ఆట్టిస్ఫురణమే, జ్ఞానస్వరూపుడగు ఆత్మకన్వయమగును. మరియు, ఆసుషుప్త్యవస్థయందే, సాక్షిత్వము చేత ఆత్మయొక్క స్ఫురణముగలిగియుండగా, సూక్ష్మదేహము స్ఫురించకపోవుటయే సూక్ష్మదేహమునకు వ్యతిరేకమగును. ఈయన్వయవ్యతిరేకములవల్ల, సూక్ష్మదేహము ఆత్మకాదనుట స్పష్టమాయెను.

శ్లో॥ తద్వివేకాద్వివిక్తాస్స్యుఃకోశాఃప్రాణమనోధియః।
తేహితత్రగుణావస్థాభేదమాత్రాత్పృథక్కృతాః॥ ౪౦.

టీ. తద్వివేకాత్= తత్-ఆలింగశరీరముయొక్క, వివేకాత్-వివేచనమువల్ల, ప్రాణమనోధియః = ప్రాణ - ప్రాణమయంబును, మనః - మనోమయంబును, ధియః-విజ్ఞానమయంబులనెడి, కోశాః-కోశములుమూడును, వివిక్తాః-ఆత్మకంటె భిన్నములుగాజేయబడినవి, స్యుః- ఆయెను, హి- ఏ కారణమువల్ల, తే- ఆమూడుకోశములును, తత్ర-ఆలింగశరీరమందు, గుణావస్థాభేదమాత్రాత్=గుణ-సత్వరజస్సులయొక్క, అవస్థాభేదమాత్రాత్-అవస్థావిశేషమువల్ల, పృథక్కృతాః-భేదముగానిర్దేశింపడినవో.

తా. ప్ర. అయితే, పంచకోశములను ఆత్మకంటె భిన్నముగాజేయుటకు జెప్పబూని, లింగదేహమును జెప్పుటవల్ల, ప్రకరణవిరోధముకాదాయేమి?. ఉ. ప్రాణమయమనోమయ విజ్ఞానమయకోశములుమూడును, సత్వరజోగుణములయొక్క స్థితివిశేషమువల్ల, ఆలింగదేహమందు భిన్నముగాచెప్పబడినవి. కనుక, లింగదేహమును, ఆత్మకంటె భిన్నముగాజేయుటవల్ల, ప్రాణమయమనోమయ విజ్ఞానమయకోశములుమూడును, ఆత్మకంటె భిన్నములుగాచేయబడినవి. అందుచేత ప్రకరణవిరోధములేదు.

అవ. ఇప్పుడు, ఆనందమయకోశమును ఆత్మకంటె భిన్నముగాజేయుటకు ఉపాయమును జెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ సుషుప్త్యభానేభానంతుసమాధావాత్మనోఽన్వయః।
వ్యతిరేకస్త్వాత్మభానేసుషుప్త్యనవభాసనం॥ ౪౧.

టీ. సమాధౌ-సమాధ్యవస్థయందు, సుషుప్త్యభానేసతి=సుషుప్తి -సుషుప్తియందుండెడి కారణశరీరరూప అజ్ఞానముయొక్క, అభానేసతి- స్ఫురణములేకపోవుచుండగా, ఆత్మనస్తు-ఆత్మయొక్కయే, భానం-స్ఫురణము, అన్వయః- ఆత్మకన్వయమగును. ఆత్మభానేసతి=ఆత్మ-ఆత్మయొక్క, భానేసతి-స్ఫురణముగలుగుచుండగా, సుషుప్త్యనవభాసనంతు=సుషుప్తి-సుషుప్తియందుండెడి కారణశరీరరూప అజ్ఞానముయొక్క, అనవభాసనంతు-అస్ఫురణత్వమే, వ్యతిరేకః - కారణశరీరరూప అజ్ఞానమునకు వ్యతిరేకమగును.

తా. మరియు కారణశరీరమే ఆనందమయకోశమగును. ఇకను చెప్పబోయెడి సమాధ్యవస్థయందు సుషుప్తియందుండెడి కారణదేహరూప అజ్ఞానముయొక్క స్ఫురణములేకపోవుచుండగా, అప్పుడు ఆత్మకే స్ఫురణముగలిగియున్నది. అట్టిస్ఫురణము ఆత్మకన్వయమగును, మరియు, ఆసమాధ్యవస్థయందు ఆత్మస్ఫురణముగలిగియుండగా అజ్ఞానప్రతీతిలేమియే అజ్ఞానమునకు వ్యతిరేకమగును. ఈచెప్పబడిన అన్వయవ్యతిరేకములవల్ల అన్నమయాదిపంచకోశములును, ఆత్మగావని స్పష్టమాయెను. మరియు అన్నమయాదిపంచకోశములును ఆయాయవస్థలయందు స్ఫురించక నివర్తింపబడుచున్నది. అట్లు ఆయాకోశములు నివర్తింపబడినను ప్రత్యగాత్మ సర్వావస్థలయందును నివర్తింపబడక సర్వదావర్తింపుచున్నాడు. అందువలన ప్రత్యగాత్మ అన్నమయాదికోశములకంటె అన్యుడగును. మరియు ఏపదార్థములు నివర్తింపబడుచుండగా ఏదినివర్తింపబడదో అదిపుష్పములవల్ల దారమువలెను, ఖండాదివ్యక్తులవలన గోత్వమువలెను ఆయాపదార్థములవలన భేదింపబడుచున్నది. అటువలెనే ప్రత్యగాత్మయు అన్నమయాదికోశములకంటె అన్యుడగునని యూహించితెలియవలెను.

అవ. ఈచెప్పిన అర్థమును ప్రతిపాదించెడి, శ్రు॥ అంగుష్ఠమాత్రఃపురుషోంతరాత్మా, ఇత్యాదివాక్యము మొదలుకొని, శ్రు॥ తంవిద్యాచ్ఛుక్రమమృతం॥ అనిచెప్పెడివాక్యాంతమువరకుగల కఠశ్రుత్యర్థమును ఇప్పుడుజెప్పుచున్నాడు.

శ్లో॥ యథాముంజాదిషీకైవమాత్మాయుక్త్యాసముద్ధృతః।
శరీరత్రితయాద్ధీరైఃపరంబ్రహ్మైవజాయతే॥ ౪౨.

టీ. యథా-ఏప్రకారముగా, ముంజాత్-ముంజగడ్డివల్ల, ఇషీకా-లోపలనుండెడి మెత్తనిలేతగడ్డిపరక, యుక్త్యా-ఉపాయముచేత, సముద్ధ్రియతే- ఎత్తబడుచున్నదో,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏవం-ఈప్రకారము, ఆత్మాపి-ప్రత్యగాత్మయు, యుక్త్యా- అన్వయవ్యతిరేకలక్షణో పాయములచేత, శరీరత్రితయాత్ -శరీరత్రయమునుంచి, ధీరైః-అధికారులచేత, సము ద్ధృతశ్చేత్ - బుద్ధిచేత నెత్తబడినయెడల, పరంబ్రహ్మైవ- పరబ్రహ్మమే, జాయతే - అగుచున్నాడు.

తా. ముంజయనెడి గడ్డియొక్క గర్భమందు మెత్తనిలేతగడ్డి యుండును. ఆ లేతగడ్డిపరకనుకప్పియుండెడి ముంజగడ్డియొక్క పెద్దయాకులనువిభజించి భిన్నముగా జేసెడియుక్తిచేత ఆలేతముంజగడ్డిని వెలుపటికి నెత్తవచ్చును. అటువలెనే, స్థూలసూ క్ష్మకారణములనెడి మూడుదేహములయందుండెడి ప్రత్యగాత్మను, ఆమూడుదేహము లనుంచి అన్వయవ్యతిరేకలక్షణోపాయములచేతబ్రహ్మచర్యాదిసాధన సంపన్నులగు య ధికారులు బుద్ధిచేతనెత్తుచున్నారు. ఇట్లు ఈప్రత్యగాత్మను మూడుదేహములవల్ల బు ద్ధిచేతభిన్నముగాజేసినయెడల, ఈప్రత్యగాత్మయే పరబ్రహ్మమగుచున్నాడు. ఆపరబ్ర హ్మమునకును ఈప్రత్యగాత్మకును సత్యజ్ఞానానంద స్వరూపలక్షణము ఏకరూపమైయు న్నది. అందుచేత ఈప్రత్యగాత్మయే పరబ్రహ్మమగునని తెలియవలెను.

శ్లో॥ పరాపరాత్మనోరేవంయుక్త్యాసంభావితైకతా।
తత్త్వమస్యాదివాక్యైస్సాభాగత్యాగేనలక్ష్యతే॥ ४३.

టీ. ఏవం-ఈచెప్పినప్రకారము, పరాపరాత్మనోః=పర-పరమాత్మకును, అప రాత్మనోః - జీవాత్మకును, ఏకతా-అభిన్నత్వము, యుక్త్యా- లక్షణసామ్యాద్యుపా యములనుజూపుటచేత, సంభావితా- అంగీకరింపచేయబడెను. సా-ఆయేకత్వము, త త్త్వమస్యాదివాక్యైః - తత్త్వమస్యాదివాక్యములచేత, భాగత్యాగేన-విరుద్ధాంశము లను విడుచుటచేత, లక్ష్యతే-లక్షణావృత్తివలన బోధింపబడుచున్నది.

తా. ప్ర. అయితే, యింతవరకుచెప్పిన గ్రంథసందర్భముచేతనే సఫలమైన తత్వ జ్ఞానము నిరూపింపబడెను. కనుక, ఇకమీద గ్రంథమునుచెప్పవలసిన పనియేమి ?. ఉ. ఈ పైనచెప్పినప్రకారము స్వరూపలక్షణసామ్యమును జూపుట మొదలగు ఉపా యములచేత, తత్త్వంపదార్థములగు పరమాత్మ జీవాత్మలకు ఏకత్వమంగీకరింపబడెను. మరియు, ఆపరమాత్మ జీవాత్మలకు విరుద్ధాంశములగు మాయఅవిద్యలనెడి ఉపాధులు గలిగియున్నవి. తత్త్వమస్యాదివాక్యములచేత ఆవిరుద్ధాంశములను విడుచుటవలన ఆ యేకత్వము లక్షణావృత్తిచేత బోధింపబడుచున్నది. కనుక ఆవిషయమై యికనుచెప్ప వలసియున్నదని యభిప్రాయము. ఇక్కడ జీవాత్మయనగా ప్రత్యగాత్మయని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇప్పుడు, తత్త్వమసి, అనెడివాక్యమందుగల, తత్పదమునకు వాచ్యార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ జగతోయదుపాదానంమాయామాదాయతామసీం।
నిమిత్తంశుద్ధసత్వాంతాముచ్యతేబ్రహ్మతద్గిరా॥ ౪౪.

టీ. యత్-ఏసచ్చిదానందలక్షణమగు, బ్రహ్మ-పరబ్రహ్మము, తామసీం- తమోగుణప్రధానమైన, మాయాం-మాయను, ఆదాయ-ఉపాధిగాగ్రహించి, జగతః-చరాచరప్రపంచమునకు, ఉపాదానం-అధ్యాసమునకాధారంబును, శుద్ధసత్వాం- విశుద్ధసత్వప్రధానమగు, తాం-అమాయను, (ఆదాయ) ఉపాధిగాగ్రహించి, నిమిత్తం-ఉపాదానాదికమునెరిగెడికర్తయు, (భవతి) అగుచున్నదో, (తద్బ్రహ్మ) ఆయుభయకారణరూపబ్రహ్మము, తద్గిరా=తత్-తత్తనెడి, గిరా-పదముచేత, ఉచ్యతే- చెప్పబడుచున్నది.

తా. సచ్చిదానందలక్షణ పరబ్రహ్మము తమోగుణప్రధానమగు మాయను ఉపాధిత్వముగాగ్రహించి, చరాచరప్రపంచమునకును ఉపాదానకారణమయెను. మరియు ఆపరబ్రహ్మమే, విశుద్ధసత్వప్రధానమగుమాయనుఉపాధిత్వముగాగ్రహించి నిమిత్తకారణమగుచున్నది. అట్టియుభయకారణరూపమగు బ్రహ్మము (తత్త్వమసి) అదినీవైతివి అనెడివాక్యమందుగల, (తత్=అది) అనెడిపదముచేత చెప్పబడుచున్నది.

అవ. ఇప్పుడు, త్వంపదమునకు వాచ్యార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ యదామలినసత్వాంతాంకామకర్మాదిదూషితాం।
ఆదత్తేతత్పరంబ్రహ్మత్వంపదేనతదోచ్యతే॥ ౪౫.

టీ. తత్పరంబ్రహ్మ-ఆపరబ్రహ్మము, యదా - ఏకాలమందు, కామకర్మాదిదూషితాం=కామకర్మాది- కామకర్మాదులచేత, దూషితాం-దూషింపబడునదియు, మలినసత్వాం- మలినసత్వగుణప్రధానమైన, తాం-అవిద్యాశబ్దముచే జెప్పదగిన ఆమాయను, ఆదత్తే-ఉపాధిగాగ్రహించునో, తదా-ఆకాలమందు, త్వంపదేన-త్వమనెడిపదముచేత, ఉచ్యతే - చెప్పబడుచున్నది.

తా. మరియు, ఆసచ్చిదానందస్వరూప పరబ్రహ్మమే, మలినసత్వగుణప్రధానమగు అవిద్యాశబ్దముచే జెప్పదగినమాయను ఉపాధిత్వముగా ఏయవస్థయందు గ్రహించునో, ఆయవస్థయందు (తత్త్వమసి) అదినీవైతివి, అనెడి వాక్యమందుగల, త్వంపదముచేత చెప్పబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు, తత్, త్వం, అనెడి రెండుపదార్థములను చెప్పి, ఇప్పుడు వాక్యార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ త్రితయీమపితాంముక్త్వాపరస్పరవిరోధినీం।
అఖండసచ్చిదానందంమహావాక్యేనలక్ష్యతే॥ ౪౮.

టీ. పరస్పరవిరోధినీం=పరస్పర-అన్యోన్యముగా, విరోధినీం-భేదముగల, త్రితయీం-త్రివిధమైన, తాం-ఆమాయను, ముక్త్వా-విడిపించి, అఖండం-భేదములేని, సచ్చిదానందం- సత్యజ్ఞానానందరూప పరబ్రహ్మను, మహావాక్యేన- (తత్త్వమసి) యనెడి వాక్యముచేత, లక్ష్యతే-లక్షణావృత్తివలన బోధింపబడుచున్నది.

తా. ౧. తమోగుణప్రధానమనియు, ౨. విశుద్ధసత్వగుణప్రధానమనియు, 3. మలినసత్వగుణప్రధానమనియు, ఇట్లు మూడువిధములుగా జెప్పబడినమాయ పరస్పరవిరోధగుణములను గలిగియున్నది. కనుక, అమూడువిధములుగాజెప్పబడినమాయను విడిపించి భేదములేని సచ్చిదానందస్వరూప పరబ్రహ్మము (తత్త్వమసి) అనెడి మహావాక్యముచేత లక్షణావృత్తివలన బోధింపబడుచున్నదని చెప్పబడెను.

శ్లో॥ సోయమిత్యాదివాక్యేషువిరోధాత్తదిదంతయోః।
త్యాగేనభాగయోరేకఆశ్రయోలక్ష్యతేయథా॥ ౪౯.

టీ. సోయం- ఆదేవదత్తుడేవీడనెడి, ఇత్యాదివాక్యేషు- ఇత్యాదివాక్యములయందు, తదిదంతయోః- అయాదేశకాల వైశిష్ట్యలక్షణధర్మములకు, విరోధాత్-విరోధమగుటవల్ల, భాగయోః-విరుద్ధాంశములయొక్క, త్యాగేన-పరిత్యాగముచేత, ఏకః-ఒక్కటియైన, ఆశ్రయః-దేవదత్తస్వరూపము, యథా-ఏప్రకారముగా, లక్ష్యతే- లక్షణావృత్తిచేత బోధింపబడుచున్నదో.

తా. ప్ర. అయితే, ఇట్లు లక్షణావృత్తిచేత వాక్యార్థబోధనమెక్కడ కనబడుచున్నదో చెప్పుము ? ఉ. (సోయందేవదత్తః) పూర్వము గంగాతీరమందు జూచిన దేవదత్తుడే, ఇప్పుడు ఈకావేరీతీరమందు జూడబడెను. ఇట్టి యర్థముగల వాక్యములయందు, ఆదేశకాలములకును, ఈదేశకాలములకును, విరోధముగలిగియున్నది. అట్టి విరుద్ధధర్మములతో దేవదత్తుడు గూడియున్నప్పుడు వాడేవీడని ఐక్యమును చెప్పరాదు. కనుక, ఆదేవదత్తునియందుగలవిరుద్ధాంశములగు ఆదేశకాలవయస్సులను ఈదేశకాలవయస్సులను విడిపించినయెడల ఆదేవదత్తుడే వీడని దేవదత్తునిస్వరూపమొక్కటియే లక్షణావృత్తిచేత బోధింపబడుచున్నది. ఈలక్షణావృత్తిస్వరూపమును తృప్తిదీపమునందు, ౭౪. శ్లోకతాత్పర్యమువల్ల తెలిసికొనవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఈదృష్టాంతమందుగల యర్థమును దార్ష్టాంతికమందుజూపుచున్నాడు.

శ్లో॥ మాయావిద్యేవిహాయైవముపాధీపరజీవయోః।
అఖండసచ్చిదానందంపరంబ్రహ్మైవలక్ష్యతే॥ ౪౭.

టీ. ఏవం-ఈప్రకారము, పరజీవయోః- పరమాత్మజీవాత్మలకు, ఉపాధీ- ఉపాధిరూపములైన, మాయావిద్యే-మాయాఅవిద్యలనురెంటిని, విహాయ - విడిపించి, అఖండం-భేదములేని, సచ్చిదానందం-సత్యజ్ఞానానందస్వరూపమగు, పరంబ్రహ్మైవ - పరబ్రహ్మమే, లక్ష్యతే-మహావాక్యమువల్ల లక్షణావృత్తిచేత బోధింపబడుచున్నది.

తా. వా. సోయం దేవదత్తః=పూర్వముగంగాతీరమందు చూడబడిన దేవదత్తుడేవీడు, అనెడి ఇత్యాదివాక్యములయందు విరుద్ధాంశములగు దేశకాలాదులనువిడిపించి లక్ష్యార్థభూతమైన ఒకదేవదత్తునిస్వరూపమే ఏప్రకారముగా గ్రహింపబడునో, అటువలెనే పరమాత్మ జీవాత్మలకు ఉపాధిరూపములైన మాయా అవిద్యలనురెంటినివిడిపించి, అఖండసచ్చిదానందస్వరూపపరబ్రహ్మమే, తత్త్వమస్యాది మహావాక్యములవల్ల లక్షణావృత్తిచేత బోధింపబడుచున్నది.

అవ. ఇప్పుడు పూర్వవాది ఆక్షేపించుచున్నాడు.

శ్లో॥ సవికల్పస్యలక్ష్యత్వేలక్ష్యస్యస్యాదవస్తుతా।
నిర్వికల్పస్యలక్ష్యత్వంనదృష్టంనచసంభవి॥ ౪౮.

టీ. సవికల్పస్య-సవికల్పబ్రహ్మమునకు, లక్ష్యత్వేసతి- వాక్యమువల్ల లక్షణావృత్తిచేత బోధ్యత్వముగలుగుచుండగా, లక్ష్యస్య-లక్షణావృత్తిచేతబోధింపబడెడి బ్రహ్మమునకు, అవస్తుతా - మిథ్యాత్వము, స్యాత్ - అగును. నిర్వికల్పస్య-నిర్వికల్పబ్రహ్మమునకు, లక్ష్యత్వం- లక్షణావృత్తిచేత బోధ్యత్వము, నదృష్టం-లోకమందెక్కడనైనను కనబడలేదు. నచసంభవి-సంభావితమైనదియుంగాదు.

తా. ప్ర. అయితే, ఓ అద్వైతసిద్ధాంతీ, తత్త్వమస్యాది మహావాక్యములవలన లక్షణావృత్తిచేత బోధింపబడెడిబ్రహ్మము, ౧. సవికల్పమో, లేక, ౨. నిర్వికల్పమో చెప్పుము. సవికల్పమనిచెప్పితివేని, విపరీతముగాకల్పించబడిన నామజాత్యాదిరూపములతోటి కూడివర్తించునది సవికల్పమనబడును. అట్టిసవికల్పబ్రహ్మము, వాక్యమువల్ల లక్షణావృత్తిచేత బోధింపబడుచున్నదంటివేని, అట్టిబ్రహ్మమునకు వస్తుత్వముసిద్ధింపకతుదకు మిథ్యాభావముకలుగును. కనుక, సవికల్పబ్రహ్మమునకు లక్ష్యత్వమును చెప్పరాదు. మరియు, బ్రహ్మమునిర్వికల్పమని చెప్పితివేని నామజాత్యాదికములేనిది నిర్వి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కల్పమని చెప్పబడును, అట్టినిర్వికల్పవస్తువు లోకమందెక్కడనైనను వాక్యమువల్ల లక్ష ణావృత్తిచేత బోధింపబడినట్లు కనబడలేదు. మరియు, లక్ష్యత్వధర్మముగల దానికి నిర్వికల్పత్వము విరోధమగుటవల్ల లక్షణావృత్తిచేత నిర్వికల్పవస్తువు బోధింపబడునని చెప్పుటయు సంభావితముగాదు. కనుక, నిర్వికల్పబ్రహ్మమునకును లక్ష్యత్వముకూడదు.

అవ. ఇట్లుపూర్వవాది యాక్షేపించగా, ఈచోద్యమును చేయరాదని యిప్పు డుసిద్ధాంతి వికల్పపూర్వకదోషమునుజెప్పుచు ఆదోషముచేత పూర్వవాదిచేసిన చోద్య మునుదూషించుచున్నాడు.

శ్లో॥ వికల్పోనిర్వికల్పస్యసవికల్పస్యవాభవేత్ ।
ఆద్యేవ్యాహతిరన్యత్రానవస్థాత్మాశ్రయాదయః॥ ౫౦.

టీ. వికల్పః-నీచేతచేయబడిన వికల్పమనెడిదోషము, నిర్వికల్పస్య-నిర్వికల్పము నకు, భవేత్-అగునో, సవికల్పస్య - సవికల్పమునకు, భవేద్వా-అగునో, (బ్రూహి) చెప్పుము, ఆద్యే-నిర్వికల్పపక్షమందు, వ్యాహతిః-విరోధమగును. అన్యత్ర-సవికల్పప క్షమందు, అనవస్థాత్మాశ్రయాదయః=అనవస్థా-అనవస్థాదోషంబును, ఆత్మాశ్రయ- ఆత్మాశ్రయదోషంబును, ఆదయః- అన్యోన్యాశ్రయచక్రకాపత్తిదోషములును గలుగు చున్నవి.

తా ఉ. ఓయి పూర్వవాదీ, లక్ష్యత్వము సవికల్పబ్రహ్మమునకో, లేక నిర్వికల్పబ్రహ్మమునకో అనియిట్లు నీవుశంకించి ఆరెంటికిని లక్ష్యత్వముగూడదని వికల్పము జేసితివి. నీవుచేసినవికల్పము నిర్వికల్పమునకో, లేక సవికల్పమునకో చెప్పుము. మరియు, లక్షణావృత్తిచేత వాక్యమువల్ల బోధించుట మొదలగువ్యవహారములకు నిర్వికల్పవస్తువువిషయముగాదని నీవేవిరోధమునుజెప్పితివి. కనుక నీవుచేసినవికల్పము నిర్వికల్పకమునకని చెప్పరాదు. మరియు, నీచేజేయబడిన వికల్పము సవికల్పకమునకనియంటివేని ౧. ఆత్మాశ్రయదోషంబును, ౨. అన్యోన్యాశ్రయదోషంబును, ౩. చక్రకాపత్తిదోషంబును, ౪. అనవస్థాదోషంబును, ఈదోషములన్నియుంగలుగుచున్నవి. అదియెట్లనగా జెప్పెదవినుము. వికల్పముతోగూడివర్తించునది సవికల్పమని చెప్పబడును. సవికల్పమునకు వికల్పమనెడి స్థలమందును, వికల్పముతోగూడి వర్తించుచున్నదనెడి స్థలమందునుగల తృతీయాంతవికల్పపదముచేతను ప్రథమాంతవికల్పపదముచేతను ఒకటేవికల్పముచెప్పబడునో, లేక రెండువికల్పములుచెప్పబడునోచెప్పుము. ఒకవికల్పమేయని యంటివేని తానొకటియే వికల్పాశ్రయవిశేషణత్వముచేత ఆశ్రయమగును. తదాశ్రితము వికల్పమునినయెడల అప్పుడు ఆత్మాశ్రయదోషముసంభవించును. మరియు రెండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వికల్పములనియంటివేని అప్పుడు తృతీయాంతశబ్దముచేత నిర్దేశింపబడిన వికల్పమునకును సవికల్పరూపమగుటవల్ల తదాశ్రయమునకును సవికల్పత్వమగుటవల్ల తద్విశేషణభూతమగు వికల్పము, ప్రథమాంతశబ్దనిర్దిష్టమేయగునో, లేక ఆరెంటికంటె అన్యమో చెప్పుము. ప్రథమాంతశబ్దనిర్దిష్టమని చెప్పినయెడల అన్యోన్యాశ్రయదోషము ప్రాప్తించును. ఆరెంటికంటె అన్యమని చెప్పినయెడల ధర్మివిశేషణీభూతమగువికల్పము ప్రథమాంతశబ్దనిర్దిష్టమో, లేక ఆమూటికంటె అన్యమో చెప్పుము. ప్రథమాంతశబ్దనిర్దిష్టమని చెప్పినయెడల చక్రకాపత్తిదోషము ప్రాప్తించును. ఆమూటికంటె అన్యమని చెప్పినయెడల దానికన్యము దానికన్యమనియిట్లు అనవస్థాదోషము సంప్రాప్తమగును.

అవ. ఈచెప్పబడిన వికల్పపూర్వకదూషణము ఇక్కడమాత్రమే గాక, అంతటను ఇటువంటివికల్పపూర్వకదూషణము వ్యాపించుచున్నదని ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఇదంగుణక్రియాజాతిద్రవ్యసంబంధవస్తుషు।
సమం తేనస్వరూపస్యసర్వమేతదతీవ్యతాం॥ ౫౧.

టీ. ఇదం-ఈవికల్పదూషణరాశి, గుణక్రియాజాతిద్రవ్యసంబంధవస్తుషు=గుణ-గుణవస్తువునందును, క్రియా-క్రియావస్తువునందును, జాతి-జాతివస్తువునందును, ద్రవ్య-ద్రవ్యవస్తువునందును, సంబంధవస్తుషు-సంబంధవస్తువునందును, సమం-సమానముగావ్యాపించుచున్నది. తేన- అట్టిహేతువుచేత, ఏతత్-ఈ, సర్వం-గుణాదికమంతయును, స్వరూపస్యేతి-వస్తుస్వరూపమునకని, ఇష్యతాం-ఇచ్ఛయింపబడుగాక, అనగా, గుణాదులన్నియును వస్తుస్వరూపమందు వర్తింపుచున్నవని తెలియవలెననుట.

తా. ఈపైనచెప్పబడిన వికల్పదూషణరాశి, ౧. గుణము, ౨. క్రియ, ౩. జాతి, ౪. ద్రవ్యము, ౫. సంబంధము, అనెడి ఈ అయిదు వస్తువులయందును సమానముగా వ్యాపించుచున్నది. అదియెట్లనగా జెప్పెదవినుము. గుణము నిర్గుణవస్తువునందు వర్తించునో, లేక సగుణవస్తువునందు వర్తించునో జెప్పుము. మరియు, క్రియ, నిష్క్రియావస్తువునందు వర్తించునో, లేక, క్రియగలవస్తువునందువర్తించునో జెప్పుము. నిర్గుణనిష్క్రియావస్తువులయందు గుణక్రియలు వర్తించునని చెప్పుట విరోధమగును. కనుక, అట్లు చెప్పరాదు. మరియు, సగుణవస్తువునందు గుణమువర్తించుననియు, క్రియగలవస్తువునందు క్రియవర్తించుననియుం జెప్పినయెడల పూర్వోక్తవికల్పదూషణప్రకారము, ౧. ఆత్మాశ్రయము, ౨. అన్యోన్యాశ్రయము, ౩. చక్రకాపత్తి, ౪. అనవస్థ లనెడి ఈనాలుగుదోషములును ప్రాప్తించుచున్నవి. ఈప్రకారమే జాతిద్రవ్యసంబంధవస్తు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వులయందును ఆత్మాశ్రయాదిదోషములుగలుగుచున్నవని తెలియవలెను. ప్ర. ఓ యద్వైతసిద్ధాంతీ ఇప్పుడునీవుచెప్పినది మొండివాదమగునేగాని సరియైనవుత్తరమెట్లగును? ఉ. ఓయిపూర్వవాదీ నీవుచేసినవికల్పము సరియైనదికాదు. కనుక, గుణక్రియాదులన్నియు వస్తుస్వరూపమందు వర్తింపుచున్నవనితెలుసుకొనుము. ఇదియేసరియైన వుత్తరమగును.

శ్లో॥ వికల్పతదభావాభ్యామసంస్పృష్టాత్మవస్తుని।
వికల్పితత్వలక్ష్యత్వసంబంధాద్యాస్తుకల్పితాః॥ ౫౨.

టీ. వికల్పతదభావాభ్యాం=వికల్ప-వికల్పముచేతను, తదభావాభ్యాం-వికల్పాభావముచేతను, అసంస్పృష్టాత్మవస్తుని=అసంస్పృష్ట-స్పృశింపబడని, ఆత్మవస్తుని-పరమాత్మవస్తువునందు, వికల్పితత్వలక్ష్యత్వసంబంధాద్యాః=వికల్పితత్వ- వికల్పితత్వము, లక్ష్యత్వ - లక్ష్యత్వము, సంబంధాద్యాః - సంబంధాదులను, కల్పితాస్తు - కల్పింపబడినవేయగును.

తా. ప్ర. సరి. లోకవస్తువులయందు ఈలాటిదోషములుగలుగుగాక. ఇట్లుచెప్పుటచేత ప్రకృతమందు లాభమేమి? ఉ. వికల్పముచేతను, వికల్పాభావముచేతను, పరమాత్మవస్తువు స్పృశింపబడదు. అట్టిపరమాత్మవస్తుస్వరూపమందు, ౧. వికల్పితత్వము, ౨. లక్ష్యత్వము, ౩. సంబంధము, ౪. ద్రవ్యము, ౫. గుణము, ౬. జాతి, ౭. క్రియ, ఇవియన్నియు కల్పించబడినవేయగునని తెలియవలెను. లక్ష్యత్వము సవికల్పమనకో నిర్వికల్పమనకో అనియిట్లుముందుచెప్పినప్రకారము విషయాకరింపబడుట వికల్పితత్వమనబడును. లక్షణావృత్తిచేతయెరుగబడుట లక్ష్యత్వమనబడును. సంబంధమనగా సంయోగమగును. మరియు, గంధముమొదలగుగుణములకు ఆశ్రయమైన భూమిమొదలగునది ద్రవ్యమనబడును. మరియు, సమవాయికారణము ద్రవ్యమని తార్కికులచేత తెలుపబడెను. మరియు, కర్మవ్యతిరిక్తత్వెనుగుచుండగా శుక్లత్వము మొదలగుజాతిమాత్రమునకు ఆశ్రయమైన శుక్లాదికము గుణమనిచెప్పబడును. మరియు, నిత్యముగానుండునదియు, ఏకముగానుండునదియు అనేకవృత్తులయందు సామాన్యముగానుండెడి ఘటత్వముమొదలగునది జాతియనిచెప్పబడెను. మరియు, ఒకపదార్థముతోటి మరియొకపదార్థమునుచేర్చుటకును, అట్లుచేర్చినపదార్థములను వేరుగాచేయుటకును అసమవాయికారణజాతీయమగు కర్మము క్రియయనిచెప్పబడెను. ఈచెప్పబడినవన్నియు పరమాత్మవస్తుస్వరూపమందు కల్పించబడినవేయగునని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ ఇత్థంవాక్యైస్తదర్థానుసంధానంశ్రవణంభవేత్।
యుక్త్యాసంభావితత్వానుసంధానంమననంతుతత్॥ ౫౩.

ఇత్థం-ఈచెప్పినప్రకారముగా, వాక్యైః-తత్త్వమస్యాదివాక్యములచేత, తదర్థానుసంధానం=తత్-ఆవాక్యములయొక్క, అర్థ-అర్థమగు జీవబ్రహ్మైక్యలక్షణముయొక్క, అనుసంధానం-అనుసంధానము, శ్రవణం-శ్రవణము, భవేత్-అగును. యుక్త్యా-యుక్తిచేత, సంభావితత్వానుసంధానం=సంభావితత్వ-వాక్యార్థోపపత్తియొక్క, అనుసంధానం-అనుసంధానము, సంభావితమైనదనెడి జ్ఞానమనుట. (యత్) ఏదిగలదో, తత్తు-అదియే, మననం- మననమని చెప్పబడును.

తా. ప్ర అయితే, ఇంతవరకుజెప్పిన గ్రంథసందర్భము చేత ఫలితమేమి?. ఉ. నలుబదినాల్గవశ్లోకము మొదలుకొని చెప్పబడినప్రకారము, తత్త్వమస్యాదివాక్యముల చేత, ఆవాక్యార్థమగుజీవబ్రహ్మైక్యలక్షణమునుఅనుసంధించుటయేశ్రవణమగును. మరియు, రెండవశ్లోకము మొదలుకొని నలుబదిమూడవశ్లోకాంత్యమువరకుగల గ్రంథసందర్భము చేత చెప్పబడినప్రకారము యుక్తిచేత ఆతత్త్వమస్యాదివాక్యమువల్ల వినబడిన యర్థమును సరియైనదని పొందబడుచుండెడి జ్ఞానమెద్దిగలదో, అదియే మననమని తెలియవలెను.

అవ. ఇప్పుడు నిదిధ్యాసనమును జెప్పుచున్నాడు.

శ్లో॥ తాభ్యాంనిర్విచికిత్సేర్థేచేతసఃస్థాపితస్యయత్।
ఏకతానత్వమేతద్ధినిదిధ్యాసనముచ్యతే॥ ౫౪.

టీ. తాభ్యాం- ఆశ్రవణమననములచేత, నిర్విచికిత్సే- సంశయములేని, అర్థే-విషయమందు, స్థాపితస్య-స్థాపింపబడిన, చేతసః-ధారణావంతమగుచిత్తమునకు, యత్-ఏ, ఏకతానత్వం-ఏకాకారవృత్తిప్రవాహవత్వముగలదో, ఏతత్-ఇది, నిదిధ్యాసనం-నిదిధ్యాసనమని, ఉచ్యతే-చెప్పబడుచున్నది. హి-ఈవిషయము యోగశాస్త్రమందు ప్రసిద్ధమనుట.

తా. మరియు, పూర్వోక్తశ్రవణమననములచేత సంశయములేని ఆత్మస్వరూపమందు చిత్తముస్థాపింపబడుటచేత ధారణావంతమని చెప్పబడును. ఇట్లు, "సూత్రం॥ దేశసంబంధశ్చిత్తస్యధారణా॥ అనియోగశాస్త్రమందు పతంజలిచేతజెప్పబడెను. అట్లు స్థాపింపబడిన ఆత్మస్వరూపమును నిరంతరము ధ్యానించుటచేత ప్రవాహమువంటి యేకాకారవృత్తిత్వము చిత్తమునకుగలుగును. ఇట్లుచిత్తముయొక్క యేకాకారవృత్తిప్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాహవంతమే నిదిధ్యాసనమనిచెప్పబడును. ఇట్లు, సూత్రం॥ ప్రత్యయైకతానతాధ్యానం॥ అనిపతంజలిచేత యోగశాస్త్రిమందు చెప్పబడెను.

అవ. ఇప్పుడు ఆనిదిధ్యాసనమునకే పరిపాకదశారూపమైన సమాధిని జెప్పుచున్నాడు.

శ్లో॥ ధ్యాతృధ్యానేపరిత్యజ్యక్రమాద్ధ్యేయైకగోచరం।
నివాతదీపవచ్చిత్తంసమాధిరభిధీయతే॥ ౫౫.

టీ. చిత్తం-చిత్తము, ధ్యాతృధ్యానే, ధ్యాతృధ్యానములను రెంటిని, క్రమాత్-క్రమముగా, పరిత్యజ్య, విడిచి, ధ్యేయైకగోచరంసత్=ధ్యేయ - ధ్యేయము, ఏక -ఒకటియే - గోచరంసత్ -విషయముగలదియగుచు, నివాతదీపవత్=నివాత-గాలిలేనిప్రదేశమందుండెడి, దీపమువలె నిశ్చలముగాయెప్పుడువుండునో, (తదా) అప్పుడు, సమాధిః-సమాధియని, అభిధీయతే-చెప్పబడుచున్నది.

తా. మరియు, నిదిధ్యాసనమందు, ౧. ధ్యాత, ౨. ధ్యానము, ౩. ధ్యేయము, అనెడి ఈమూడును స్ఫురించుచుండును. అట్లు ధ్యానింపుచుండగా, ఏకాలమందు చిత్తముఅభ్యాసవశమువల్ల క్రమముగా ధ్యాతృధ్యానములను రెంటినివిడిచి ధ్యేయమొకటియే విషయముగలదియగుచు ఆధ్యేయమువంటిదియై యుండునో అప్పుడు సమాధియనిచెప్పబడును. మరియు, వాయువులేని ప్రదేశమందునిశ్చలముగావర్తింపుచుండెడి దీపమువలె సమాధ్యవస్థయందు చిత్తమునిశ్చలముగానుండునని తెలియవలెను. ధ్యాత యనగా ధ్యానించెడివాడగును. ధ్యానమనగా ధ్యానించుటయగును. ధ్యేయమనగా ధ్యానింపబడునదియగును. ఇక్కడ ధ్యేయమనగా ఆత్మయగును.

శ్లో॥ వృత్తయస్తుతదానీమజ్ఞాతా అప్యాత్మగోచరాః।
స్మరణాదనుమీయంతేవ్యుత్థితస్యసముత్థితాత్॥ ౫౬.

టీ. ఆత్మగోచరాః=ఆత్మ - ప్రత్యగాత్మయే, గోచరాః - విషయముగాగల, వృత్తయస్తు - చిత్తవృత్తులు, తదానీం - ఆసమాధికాలమందు, అజ్ఞాతాఅపి - తెలియబడకున్నను, వ్యుత్థితస్య - సమాధినుంచిలేచినవానికి, సముత్థితాత్ - కలిగెడి, స్మరణాత్-స్మృతివల్ల అనగాయింతకాలమువరకు సమాధిగలవాడనైతిననెడి స్మృతివల్లననుట, అనుమీయంతే-ఉన్నట్లు వూహింపబడుచున్నది.

తా. ప్ర. అయితే సమాధియందు చిత్తవృత్తులున్నట్లు తోచుటలేదు. అందుచేనక్కడ ధ్యేయమొకటియే విషయముగానున్నదనియైనను నిశ్చయించుటకు శక్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మెట్లగును?. ఉ. ఆసమాధియందు చిత్తవృత్తులున్నట్లు అనుమానప్రమాణముచేత ఊహించబడుచున్నది. ప్ర. అదియెట్లు?. ఉ. ఆసమాధికాలమందు ఆత్మనువిషయముగాగల చిత్తవృత్తులు అప్పుడుమనకు తెలియబడకున్నను సమాధినుంచిలేచినవాడు ఇంతకాలమువరకు నేనుసమాధిగలవాడనైతినని స్మరించుచున్నాడు. ఈస్మృతివలన సమాధియందు చిత్తవృత్తులున్నట్లు తెలియబడుచున్నవి. ఆసమాధియందు చిత్తవృత్తులు లేనియెడల, సమాధినుంచిలేచినవానికి ఈస్మృతిగలుగదు. మరియు, ఎద్దియెద్దిస్మరింపబడునో అద్దియద్ది తత్పూర్వమనుభవింపబడియుండునని యెడిన్యాయము లోకప్రసిద్ధమైయున్నది. కనుక సమాధియందు ఆత్మనువిషయముగాగల చిత్తవృత్తులున్నట్లు తెలియవలెను.

శ్లో॥ వృత్తీనామనువృత్తిస్తు ప్రయత్నాత్ప్రథమాదపి।
అదృష్టాసకృదభ్యాససంస్కారసచివాద్భవేత్॥ ౫౭.

టీ. వృత్తీనాం-ధ్యేయమునువిషయముగాగల వృత్తులయొక్క, అనువృత్తిస్తు-ప్రవాహరూపముగా నునికియో, అదృష్టాసకృదభ్యాస సంస్కారసచివాత్—అదృష్ట- పుణ్యకర్మవిశేషముతోటియు, అసకృత్-మరలమరలచేయబడిన, అభ్యాస- సమాధ్యభ్యాసముచేత కలిగినట్టి, సంస్కార - భావనయనెడి సంస్కారవిశేషముతోటియు, సచివాత్-కలసియుండెడి, ప్రథమాదపి- సమాధిపూర్వకాలసంబంధమైన, ప్రయత్నాత్-ప్రయత్నమువలన, భవేత్-అగును.

తా. ప్ర. అయితే, సమాధికాలమందు చిత్తవృత్తినికలిగించెడి ప్రయత్నములేనప్పుడు, ధ్యేయమొకటియే విషయముగాగల చిత్తవృత్తులు ప్రవాహాకారముగానున్నవని యెట్లుచెప్పవచ్చును?. ఉ. సూత్రం॥ కర్మాశుక్లకృష్ణం యోగినస్త్రివిధమితరేషాం॥ అనెడి పతంజలిసూత్రప్రకారము, యోగికి అశుక్లకృష్ణమనెడిపేరుగల ఒకపుణ్యవిశేషముగలదు, ఆపుణ్యవిశేషము అదృష్టమనిచెప్పబడును. మరియు, మాటిమాటికిని చేయబడినసమాధ్యభ్యాసముచేత గలిగినభావనయే, సంస్కారవిశేషమనిచెప్పబడును. ౧. ఆ అదృష్టము, ౨. సంస్కారవిశేషము, ఈరెండును సహకారికారణములనబడును. మరియు, సమాధికి పూర్వకాలమందుచేయబడిన ప్రథమప్రయత్నము ఆసహకారికారణద్వయముతో చేరియుండును. అట్టిసహకారికారణద్వయముతోచేరియున్న సమాధి పూర్వకాలసంబంధ ప్రథమప్రయత్నమువల్ల ఆసమాధికాలమందు ఆత్మయే విషయగాగల చిత్తవృత్తులు ప్రవాహరూపముగానున్నవని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ యథాదీపోనివాతస్థఇత్యాదిభిరనేకధా।
భగవానిమమేవార్థమర్జునాయన్యరూపయత్॥ ౫౮.

టీ. దీపః - దీపము, నివాతస్థస్సన్ - వాయువులేని ప్రదేశమందున్నదగుచు, యథా-ఏప్రకారముగాచలింపదో, ఇత్యాభిః- అనెడియిత్యాదివాక్యములచేత, అనేకధా-నానాప్రకారముగా, భగవాన్-భగవంతుడు. ఇమ మేవ-ఈనిర్వికల్పక సమాధిరూపార్థమునే, అర్జునాయ- శిష్యునికొరకు, న్యరూపయత్ - నిరూపించినవాడాయెను.

తా. ప్ర. అయితే, ఈసమాధి, పూర్వాచార్యులచేత నిరూపింపబడినట్లు కనబడలేదేమి?. ఉ. శ్లో॥ యథాదీపోనివాతస్థోనేంగతేసోపమాస్మృతా॥ అనెడియిత్యాది శ్లోకములచేత నానాప్రకారముగా శ్రీభగవంతుడైనకృష్ణదేవుడు ఈనిర్వికల్పక సమాధి రూపమగునర్థమునే తనశిష్యుడైన అర్జునునకుజెప్పెను. కనుక, సర్వలోకగురుడగు శ్రీభగవంతునిచే జెప్పబడినందున నిరూపింపబడలేదనిచెప్పరాదు.

అవ. ఈసమాధివలనగలిగెడి నూతనఫలమును ఇప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ అనాదావిహసంసారేసంచితాఃకర్మకోటయః।
అనేనవిలయంయాంతి శుద్ధోధర్మోవివర్ధతే॥ ౫౯.

టీ. అనాదౌ-అనాదియైన, ఇహ-ఈ, సంసారే - సంసారమందు, సంచితాః-సంపాదింపబడిన, కర్మకోటయః=కర్మ-పుణ్యపాపలక్షణములయొక్క, కోటయః-కోట్లు, అనగా అపరిమితకర్మములనుట. అనేన-ఈనిర్వికల్పకసమాధిచేత, విలయం-నాశమును, యాంతి-పొందుచున్నవి. శుద్ధః-పరిశుద్ధమైన, ధర్మః-అవిద్యానివర్తక బ్రహ్మసాక్షాత్కారసాధన భూతధర్మము, వివర్ధతే-వృద్ధిబొందుచున్నది.

తా. మరియు, అనాదిగా, ఈసంసారమందు సంపాదింపబడిన అపరిమితపుణ్యపాపలక్షణకర్మములన్నియు ఈసమాధిచేత నశింపబడుచున్నవి. ఇట్లు॥ శ్రు॥ క్షీయంతేచాస్యకర్మాణి తస్మిన్దృష్టేపరావరే॥ అనెడి ఇత్యాదిశ్రుతులును, శ్లో॥ జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేతథా॥ అనెడి ఇత్యాది స్మృతులుంజెప్పుచున్నవి. మరియు, ఈసమాధివలన కార్యవర్గముతోగూడిన మూలాజ్ఞానము నిశ్శేషముగా నశింపబడి బ్రహ్మసాక్షాత్కారసాధనభూతమగు జ్ఞానము వృద్ధిబొందుచున్నది.

శ్లో॥ ధర్మమేఘమిమంప్రాహుస్సమాధింయోగవిత్తమాః।
వర్షత్యేషయతోధర్మామృతధారాస్సహస్రశః॥ ౬౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. యోగవిత్తమాః - బ్రహ్మసాక్షాత్కారవంతులు, ఇమం-ఈనిర్వికల్పకసమాధిని, ధర్మమేఘం-ధర్మమేఘమునుగా, ప్రాహుః-చెప్పుచున్నారు. యతః-ఏకారణమువల్ల, ఏషః-ఈనిర్వికల్పకసమాధి, ధర్మామృతధారాః=ధర్మ-ధర్మలక్షణములైన, అమృతధారాః - అమృతధారలను, సహస్రశః - సహస్రసంఖ్యాకములుగా, వర్షతి-వర్షించుచున్నదో.

తా. ప్ర. అయితే, ఈసమాధివల్ల ఇంతఫలముగలుగుటయందు ప్రమాణమేమి? ఉ. బ్రహ్మజ్ఞానులగుమహాత్ములు ఈనిర్వికల్పకసమాధిని. ధర్మమేఘమనుగాజెప్పుదురు. ప్ర. అట్లుచెప్పుటకు కారణమేమి? ఉ. మేఘమువర్షబిందువులను వర్షించినట్లు ఈ నిర్వికల్పకసమాధి, పుణ్యలక్షణములైన అమృతధారలను, సహస్రసంఖ్యాకములుగా వర్షింపుచున్నది. ఇట్లు॥ శ్రు॥ క్షణమేకంక్రతుశతస్యాపి॥ అనెడిశ్రుతిజెప్పుచున్నది.

అవ. ఇప్పుడు ఈసమాధివల్ల పరమప్రయోజనమును జెప్పుచున్నాడు.

శ్లో॥ అమునావాసనాజాలేనిశ్శేషంప్రవిలాపితే ।
సమూలోన్మూలితేపుణ్యపాపాఖ్యేకర్మసంచయే ॥ ౬౧.

టీ. అమునా-ఈనిర్వికల్పకసమాధిచేత, వాసనాజాలే=వాసనా - అహంకారమమకారకర్తృత్వాద్యభిమానహేతుభూతసంసారములయొక్క, జాలే-సమూహము, నిశ్శేషం-శేషములేనట్లుగా, ప్రవిలాపితేసతి-నశింపబడినదైయుండగాను, పుణ్యపాపాఖ్యే-పుణ్యపాపములనెడిపేర్లుగల, కర్మసంచయే-కర్మరాశి, సమూలోన్మూలితేసతి= సమూల-అజ్ఞానముతోకూడా, ఉన్మూలితేసతి-పెళ్లగించబడినదైయుండగాను, అనగా నశింపబడుచుండగానను ట.

తా. మరియు, అహంకారమమకారకర్తృత్వభోక్తృత్వాద్యభిమానములను కలిగించుటకు కారణములైనవి వాసనలనిచెప్పబడును. ఆవాసనాసమూహము, జ్ఞానమునకు విరోధియగును. ఆవాసనాసమూహమే సంసారమనిచెప్పబడును. అట్టివాసనాసమూహమంతయు ఈసమాధిచేత నిశ్శేషముగానశింపబడును. మరియు, పుణ్యపాపములనెడి అపరిమితకర్మరాశియంతయు, అజ్ఞానసహితముగా ఈ సమాధిచేత నశింపబడును. అట్లునశింపబడుచుండగా.

అవ. ఇప్పుడు ఫలితమును జెప్పుచున్నాడు.

శ్లో॥ వాక్యమప్రతిబద్ధంసత్ప్రాక్పరోక్షావభాసితే।
కరామలకవద్బోధమపరోక్షంప్రసూయతే॥ ౬౨.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. వాక్యం - తత్త్వమస్యాదిమహావాక్యము, అప్రతిబద్ధంసత్ - కర్మవాసనల చేత ప్రతిబంధములేనిదగుచు, ప్రాక్-పూర్వము, పరోక్షావభాసితే=పరోక్ష-పరోక్షత్వముచేత, అవభాసితే - ప్రకాశింపబడుచుండెడి బ్రహ్మస్వరూపమందు, కరామలకవత్=కర-అరచేతియందుండెడి, ఆమలకవత్-ఉసిరికపండు స్పష్టముగాకనబడినట్లు, అపరోక్షం- ప్రత్యక్షముగా బ్రహ్మస్వరూపమును ప్రకాశింపజేయుటకు సమర్థమైన, బోధం-జ్ఞానమును, ప్రసూయతే- కలిగించుచున్నది.

తా. పైనచెప్పినప్రకారము సమాధివల్ల కర్మవాసనాసమూహమంతయు నిశ్శేషముగా నశించినపిమ్మట, తత్త్వమస్యాదిమహావాక్యము, కర్మవాసనాప్రతిబంధములేనిదగుచు, పూర్వము పరోక్షముగా ప్రకాశింపబడుచున్న బ్రహ్మతత్త్వమందు, అరచేతియందుండు ఉసిరికపండు స్పష్టముగాకనబడినట్లు, ప్రత్యక్షముగాబ్రహ్మస్వరూపమును ప్రకాశింపజేయుటకు సమర్థమైన (అహం బ్రహ్మాస్మి) అనెడి ఈయాకారమగు జ్ఞానమును పుట్టించుచున్నది.

అవ. ఇప్పుడు పరోక్షజ్ఞానఫలమును జెప్పుచున్నాడు.

శ్లో॥ పరోక్షంబ్రహ్మవిజ్ఞానంశాబ్దం దేశికపూర్వకం।
బుద్ధిపూర్వకృతంపాపంకృత్స్నందహతివహ్నివత్॥ ౬౩.

టీ. దేశికపూర్వకం-గురువువల్లపొందబడినట్టియు, శాబ్దం-తత్త్వమస్యాది వేదాంతవాక్యమువల్లకలిగిన, పరోక్షం - పరోక్షరూపమగు, బ్రహ్మవిజ్ఞానం - బ్రహ్మజ్ఞానము, బుద్ధిపూర్వకృతం=బుద్ధిపూర్వ-జ్ఞానపూర్వకముగా, కృతం-చేయబడిన, కృత్స్నం-సకలమగు, పాపం-పాపకర్మమును, వహ్నివత్-అగ్నివలె, దహతి-దహించుచున్నది.

తా. మరియు, ఆచార్యద్వారా లభింపబడినట్టి, తత్త్వమస్యాదిమహావాక్యమువల్లకలిగిన పరోక్షబ్రహ్మజ్ఞానము, (బుద్ధిపూర్వకముగా) తెలిసిచేయబడిన సమస్తపాపములను. అగ్నివలెదహించుచున్నది. బుద్ధిపూర్వకముగా చేయబడిన పాపములనుదహించునని చెప్పుటచేత, సర్వపాపములను దహించునని తెలియవలెను.

అవ. ఇప్పుడు అపరోక్షజ్ఞానఫలమును జెప్పుచున్నాడు.

శ్లో॥ అపరోక్షాత్మవిజ్ఞానంశాబ్దందేశికపూర్వకం।
సంసారకారకాజ్ఞానతమసశ్చండభాస్కరః॥ ౬౪.

టీ. దేశికపూర్వకం-గురువువల్లపొందబడినట్టియు, శాబ్దం-మహావాక్యజన్యమగు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అపరోక్షాత్మవిజ్ఞానం=అపరోక్ష-అపరోక్షమగు, ఆత్మ-ప్రత్యగాత్మయొక్క,విజ్ఞాన-సంశయవిపర్యయరహితజ్ఞానము, సంసారకారణాజ్ఞానతమసః=సంసార-సంసారమునకు, కారక-కారణమగు, అజ్ఞాన-అజ్ఞానమనెడి, తమసః-చీకటికి, చండభాస్కరః-మధ్యాహ్నకాలీన సూర్యునివంటిదగును. అనగాబాహ్యతమస్సును మధ్యాహ్నకాలీన సూర్యుడునశింపజేసినట్లు,అజ్ఞానమనెడితమస్సును అపరోక్షజ్ఞానమునశింపజేయుననుట.

తా. మరియు, ఆచార్యునివల్ల తత్త్వమస్యాది వేదాంతవాక్యవిచారద్వారాకలిగిన బ్రహ్మసాక్షాత్కారరూపమగు అపరోక్షజ్ఞానము, సంసారకారణమైన అజ్ఞానమనెడిచీకటికి మధ్యాహ్నకాలీన సూర్యునివంటిదగును. అనగా బాహ్యతమస్సును మధ్యాహ్నకాలీనసూర్యుడు నశింపజేసినట్లు,అహంబ్రహ్మాస్మి-అనెడిఈయాకారముగాగల అపరోక్షజ్ఞానము అజ్ఞానమునునశింపజేసి, పురుషునకు సర్వసంసారవిముక్తిని కలిగించుచున్నదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు గ్రంథాభ్యాస ఫలమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఇత్థంతత్త్వవివేకంవిధాయవిధివన్మనస్సమాధాయ ।
విగళితసంసృతిబంధఃప్రాప్నోతిపరంపదం నరోనచిరాత్ ॥

టీ. నరః-మనుష్యుడు, ఇత్థం-ఈచెప్పినప్రకారము, తత్త్వవివేకం=తత్త్వ-ఆత్మబ్రహ్మైక్యలక్షణముయొక్క, వివేకం-పంచకోశవివేచనమును, విధాయ-చేసి, విధివత్-శాస్త్రోక్తప్రకారముగా, మనః-మనస్సును, సమాధాయ-ఆఆత్మబ్రహ్మైక్యలక్షణమందుస్థిరీకరించి, విగళితసంసృతిబంధస్సన్=విగళిత-అపరోక్షజ్ఞానముచేత నివర్తింపబడిన, సంసృతిబంధస్సన్-సంసారబంధముగలవాడగుచు, పరంపదం-పరమానందస్వరూపమోక్షమును, నచిరాత్-శీఘ్రముగా, ప్రాప్నోతి-పొందుచున్నాడు. అనగా సత్యజ్ఞానానందలక్షణపరబ్రహ్మమే పురుషుడగుచున్నాడనుట.

తా. ఈ ప్రత్యక్తత్త్వవివేకమందు పైనచెప్పబడినప్రకారముగా నరుడు, పంచకోశములను విభజించి, ఆత్మబ్రహ్మైక్యలక్షణమగు పరతత్త్వవిచారణముజేసి, ఆపరతత్త్వమందు శాస్త్రోక్తప్రకారముగా మనస్సునుస్థిరీకరించి, పిమ్మట అపరోక్షజ్ఞానముచేత సర్వసంసారవిముక్తుడై, పరమానందస్వరూపమోక్షమును శీఘ్రముగాపొందుచున్నాడు. అనగా సత్యజ్ఞానానందలక్షణ పరబ్రహ్మమే పురుషుడగుచున్నాడని యభిప్రాయము.

ఇతి ప్రత్యక్తత్త్వవివేకః.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గద్య॥ ఇది, శ్రీపరమేశ్వరగురుచరణ వరప్రసాదలబ్ధ బ్రహ్మవిద్యావిరాజిత మంత్రివంశపయఃపరావార పరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్యపుత్ర లక్ష్మీనారాయణామాత్య ప్రణీతంబైన ఆంధ్రటీకా తాత్పర్యసహిత శ్రీవేదాంతపంచదశియందు ప్రత్యక్తత్త్వవివేకమనెడి ప్రథమప్రకరణము సమాప్తమాయెను.

శ్లో॥ ప్రత్యక్తత్త్వవివేకస్యటీకా బ్రహ్మైక్యబోధినీ ।
నారాయణాఖ్యవిదుషా కృష్ణపాదసమర్పితా ॥
సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

---

శ్రీకృష్ణసద్గురుపరబ్రహ్మణేనమః.

పంచభూతవివేక ప్రారంభము.

---

అవ. శ్రు॥ సదేవసోమ్యేదమగ్రఆసీదేకమేవాద్వితీయం॥ అనెడి శ్రుతిచేత జగదుత్పత్తికంటె పూర్వమందు సర్వజగత్కారణమగు సద్రూపఅద్వితీయ బ్రహ్మమొక్కటియేయున్నట్లు వినబడుచున్నది. ఆనిర్గుణపరబ్రహ్మము అవాఙ్మానసగోచరమగును. అందుచేత ఆపరబ్రహ్మమును (స్వతః) పొందుటకు శక్యముగాదు. మరియు, ఆకాశాదిపంచభూతములును ఆపరబ్రహ్మమువల్లగలిగిన కార్యములగును. ఆపంచభూతములును బ్రహ్మమునకు ఉపాధిరూపములుగానున్నవి. కనుక కార్యములగు పంచభూతస్వరూపమును విభజించుటచేత, తత్కారణమగు బ్రహ్మమును తెలుపుటకొరకు ఉపోద్ఘాతముగా, శ్రీవిద్యారణ్యగురుండు పంచభూతవివేకమును ప్రారంభించుచున్నాడు.

శ్లో॥ సదద్వైతంశ్రుతంయత్తత్పంచభూతవివేకతః।
బోద్ధుంశక్యంతతోభూతపంచకంప్రవివిచ్యతే॥ ౧.

టీ. సత్-సద్రూపమైనట్టియు, అద్వైతం-రెండవదిలేనట్టి, యత్-ఏబ్రహ్మము, శ్రుతం-సృష్టికంటె పూర్వమందున్నట్లు వినబడుచున్నదో, తత్-ఆబ్రహ్మమును, పంచభూతవివేకతః=పంచభూత-పంచభూతములయొక్క, వివేకతః- విభజనలక్షణజ్ఞానమువల్ల, బోద్ధుం-తెలియుటకొరకు, శక్యం-శక్యమగును. తతః-ఆకారణమువల్ల, భూతపంచకం-పంచభూతసమూహము, ప్రవివిచ్యతే-సద్రూపబ్రహ్మముకంటె భిన్నముగా జేయబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. సృష్టికి పూర్వమందు సద్రూపమద్వితీయమగు ఏనిర్గుణబ్రహ్మమొక్కటి యేయున్నట్లు శ్రుతివల్లవినబడుచున్నదో, ఆబ్రహ్మమును పంచభూతవిభజనలక్షణజ్ఞానమువల్ల బోధించుటకు శక్యమగును. కనుక, ఈప్రకరణమందు, బుద్ధిచేత పంచభూతసమూహము సద్రూపబ్రహ్మముకంటె భిన్నముగా చేయబడును.

అవ. అవిషయమై, ఆకాశాది పంచభూతములకు గుణములవల్ల భేదమును దెలుపుటకొరకు, ఇప్పుడు పంచభూతగుణములను చెప్పుచున్నాడు.

శ్లో॥ శబ్దస్పర్శౌరూపరసౌగంధోభూతగుణాఇమే।
ఏకద్విత్రిచతుఃపంచగుణావ్యోమాదిషుక్రమాత్॥ ౨.

టీ. శబ్దస్పర్శౌ-శబ్దస్పర్శములును, రూపరసౌ-రూపరసములును, గంధః-గంధంబును, ఇమే-ఈయైదును, భూతగుణాః=భూత-పంచభూతములయొక్క, గుణాః-గుణములగును, వ్యోమాదిషు-ఆకాశాదులయందు, క్రమాత్-క్రమముగా, ఏకద్విత్రిచతుఃపంచగుణాః=ఏక-ఒకగుణంబును, ద్వి-రెండుగుణములును, త్రి-మూడుగుణములును, చతుః-నాలుగుగుణములును, పంచగుణాః-అయిదుగుణములును గలిగియున్నవి.

తా. ౧, శబ్దము, ౨ స్పర్శము, ౩. రూపము, ౪. రసము, ౫. గంధము, ఈయైదును పంచభూతములయొక్క గుణములగును ప్ర. అయితే, ఈయైదుగుణములును పంచభూతములకు గలిగియుండునో, లేక, ఒక్కొకభూతమునకు ఒక్కొకగుణముగలిగియుండునో జెప్పుము. ఉ. ఈరెండువిధములలో, నేవిధముగానైనను పంచభూతములకు గుణములు గలిగియుండలేదు. ప్ర. అయితే, మరియెట్లు? ఉ. ఆకాశమునకు శబ్దమొక్కటి యేగుణమగును. వాయువునకు శబ్దస్పర్శములురెండును గుణములగును. అగ్నికి శబ్దస్పర్శరూపములు మూడును గుణములగును. జలమునకు శబ్దస్పర్శరూపరసములునాల్గును గుణములగును. భూమికిశబ్దస్పర్శరూపరసగంధములైదును గుణములగునని తెలియవలెను.

అవ. ఆపంచభూతగుణస్వరూపములను ఇప్పుడుక్రమముగాజెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రతిధ్వనిర్వియచ్ఛబ్దోవాయౌబీసీతిశబ్దనం।
అనుష్ణాశీతసంస్పర్శోవహ్నౌభుగుభుగుధ్వనిః॥ ౩.

టీ. వియచ్ఛబ్దః=వియత్-ఆకాశమందుగల, శబ్దః-శబ్దగుణము, ప్రతిధ్వనిః-ప్రతిధ్వనిరూపమగును. వాయౌ-వాయువునందు, బీసీతి-బీసీయనెడి, శబ్దనం-అనుకరణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధ్వనియు, అనుష్ణాశీతసంస్పర్శః=అనుష్ణ-ఉష్ణము లేనట్టియు, అశీత-శైత్యము లేనట్టియు, సంస్పర్శః-స్పర్శంబును గలిగియున్నవి. వహ్నౌ-అగ్నియందు, ౧. భుగుభుగుధ్వనిః= భుగుభుగు-భుగుభుగ నెడి, ధ్వనిః-అనుకరణధ్వనియు.

తా. మరియు, ఆకాశమునకు శబ్దమే గుణమగును. ప్ర. అదియెద్ది? ఉ. అది యాకాశమందు, ప్రతిధ్వనిరూపముగా నుండును. మరియు, వాయువునకు శబ్దస్పర్శములు రెండును గుణములగును. ప్ర. అవియెవ్వి? ఉ. ౧. బీసీ యనెడి అనుకరణధ్వనియు, ౨. ఉష్ణశీతస్వభావములేని స్పర్శగుణంబును, వాయువునందు గలిగియున్నవి. మరియు, అగ్నికి, శబ్దస్పర్శరూపములు మూడును గుణములగును. ప్ర. అవియెవ్వి? ఉ. భుగుభుగుమనెడి అనుకరణధ్వని అగ్నియందుగల శబ్దగుణమగును.

శ్లో॥ ఉష్ణస్స్పర్శః ప్రభా రూపం జలే బులుబులుధ్వనిః।
శీతస్స్పర్శః శుక్లరూపం రసో మాధుర్యమీరితం॥ ౪.

టీ. (అగ్నౌ) అగ్నియందుగల, స్పర్శః-స్పర్శగుణము, ఉష్ణః - ఉష్ణమగును. ప్రభా-తేజస్సు, రూపం-రూపమగును. జలే-జలమందు, బులుబులుధ్వనిః=బులుబులు-బులుబుల నెడి, ధ్వనిః-అనుకరణధ్వనియు, శీతః-చల్లనిదగు, స్పర్శః- స్పర్శగుణంబును, శుక్లరూపం=శుక్ల-తెల్లనిదగు, రూపం-రూపంబును, మాధుర్యం-తీపిదియగు, రసః-రసగుణంబును, ఈరితం-చెప్పబడెను.

తా. మరియు, అగ్నియందు, ౨. ఉష్ణమగుస్పర్శగుణంబును, ౩. తేజోరూపంబును గలిగియున్నవని తెలియవలెను. మరియు, జలమందు శబ్దస్పర్శరూపరసములనెడి నాలుగుగుణములు గలిగియున్నవి. ప్ర. అవియెవ్వి?. ఉ. ౧. బులుబులు అనెడి అనుకరణధ్వనియు, ౨, చల్లనిస్పర్శంబును, ౩. తెల్లనిరూపంబును, ౪. తీపియగురసంబును, ఈనాలుగుగుణములును జలమందుగలవని తెలియవలెను.

శ్లో॥ భూమౌ కడకడాశబ్దః కాఠిన్యం స్పర్శ ఇష్యతే।
నీలాదికం చిత్రరూపం మధురామ్లాదికో రసః॥ ౫.

టీ. భూమౌ-భూమియందు, కడకడాశబ్దః - కడకడాయనెడి యనుకరణధ్వనియు, కాఠిన్యం-కఠినమగు, స్పర్శః-స్పర్శగుణంబును, నీలాదికం- నలుపుమొదలగు, చిత్రరూపం-చిత్రరూపంబును, మధురామ్లాదికః=మధుర- తీపియు, అమ్ల-పులుసును, ఆదికః-మొదలుగాగల, రసః-రసగుణంబును, ఇష్యతే-ఇచ్ఛయింబడుచున్నది. అనగా నున్నవియనుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మరియు, భూమియందు శబ్దస్పర్శరూపరసములనెడి గుణములుగలిగి యున్నవి. ప్ర. అవియెవ్వి ?. ఉ. ౧, కడకడాయనెడి అనుకరణధ్వనియు, ౨. కాఠిన్యమగుస్పర్శంబును, ౩. నలుపుతెలుపుమొదలగు చిత్రరూపంబును, ౪. తీపి పులుసు మొదలగు రుచిగలరసగుణంబును, భూమియందుగలిగియున్నవి.

శ్లో॥ సురభీతరగంధౌద్వౌగుణాస్సమ్యగ్వివేచితాః।
శ్రోత్రంత్వక్చక్షుషీజిహ్వాఘ్రాణంచేంద్రియపంచకం॥౬.

టీ. (భూమా) భూమియందు, ద్వౌ-రెండైన, సురభీతరగంధా=సురభి-సుగంధంబును, ఇతరగంధా - ఇతరగంధమును గలిగియున్నవి. గుణాః = పంచభూత గుణములు, సమ్యక్-లెస్సగా- వివేచితాః విభజించిచెప్పబడెను. శ్రోత్రం.శ్రోత్రేంద్రియంబును, త్వక్చక్షుషీ=త్వక్-త్వగింద్రియంబును, చక్షుషీ-చక్షురింద్రియంబును, జిహ్వా-జిహ్వేంద్రియంబును, ఘ్రాణంచ ఘ్రాణేంద్రియంబును, ఇంద్రియపంచకం-ఈయైదును జ్ఞానేంద్రియవర్గమగును.

తా. మరియు, ఆభూమియందు, ౫. సుగంధఇతరగంధములనెడి ద్వివిధమైన గంధ గుణములుగలిగియున్నది. ఈ యైదుగుణములును భూమియందుగలవని తెలియవలెను. ఇట్లుపంచభూతములయందుగల గుణములను చక్కగావిభజించిచెప్పుటచేత, గుణభేద మువల్ల ఆపంచభూతములకును పరస్పరభేదముగలిగియున్నట్లు స్పష్టమాయెను. ఇకనా పంచభూతకార్యములవల్ల, ఆపంచభూతములకుగల పరస్పరభేదమును గ్రహించవలయు ను. ప్ర. అదియెట్లు ?. ఉ. ౧. శ్రోత్రము, ౨. త్వక్కు, ౩. చక్షువు, ౪. జిహ్వ, ౫. ఘ్రాణమనెడి, ఈయింద్రియములైదును జ్ఞానేంద్రియములగును. ఈజ్ఞానేంద్రియ ములైదును ఒక్కొకభూతముయొక్క సత్వగుణాంశమువల్ల నొక్కొక యింద్రియము క్రమముగా బుట్టినట్లు ప్రత్యక్తత్వవివేకమందు చెప్పబడెను. కనుక జ్ఞానేంద్రియములు పంచభూతములయొక్క కార్యములగును. ఈభూతములయొక్కకార్యములు ప్రత్యేక ముగానుండుటచేత, ఈకార్యభేదమువల్ల పంచభూతములకును పరస్పరభేదమున్నట్లు స్పష్టమాయెను.

శ్లో॥ కర్ణాదిగోళకస్థంతచ్ఛబ్దాదిగ్రాహకంక్రమాత్ ।
సౌక్ష్మ్యాత్కార్యానుమేయంతత్ప్రాయోధావేద్బహిర్ముఖం ॥

టీ. తత్-అజ్ఞానేంద్రియపంచకము, కర్ణాదిగోళకస్థంసత్=కర్ణాది-చెవిమొదలగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవయవములయొక్క, గోళకస్థంసత్ - గోళకము లనెడిస్థలమందున్నదగుచు, క్రమాత్ - క్రమముగా, శబ్దాది - శబ్దస్పర్శాదివిషయమును, గ్రాహకం - గ్రహించునదియగుచున్నది. తత్ - ఆజ్ఞానేంద్రియపంచకస్వరూపము, సౌక్ష్మ్యాత్ - సూక్ష్మభూతకార్యత్వముచే దుర్లక్ష్యమగుటవల్ల, కార్యానుమేయం = కార్య - కార్యమువల్ల, అనుమేయం - ఊహింపదగినదగును. తత్ - ఆజ్ఞానేంద్రియపంచకము, ప్రాయః - తరుచుగా, బహిర్ముఖం - బాహ్యప్రదేశమునుగురించి, ధావేత్ - పరుగెత్తును.

తా. ప్ర. అయితే, ఆజ్ఞానేంద్రియపంచకముయొక్క స్థానవ్యాపారములెవ్వి? ఉ. చెవిమొదలగు అవయవములలోపల నొకొక్కయింద్రియముండి, శబ్దస్పర్శాదివిషయమును ప్రత్యేకముగా గ్రహించుచున్నది. ప్ర అయితే, ఆ జ్ఞానేంద్రియములుండుటయందు ప్రమాణమేమి? ఉ ఆజ్ఞానేంద్రియములైదును అపంచీకృత పంచభూతకార్యములగుటవల్ల సూక్ష్మరూపమునుగలిగియున్నవి. అందుచేత, ఆయాయింద్రియరూపము కనబడదు. అయినను, ఆయాయింద్రియముచేసెడిపనివలన ఆయాయింద్రియమున్నట్లు అనుమానప్రమాణముచేత వూహించియెరుగవలెను. ప్ర. ఆయనుమానమెట్లు? ఉ. లోకమందుక్రియలన్నియు ఒకొక్కసాధనమువలన కలుగుచున్నవి. కనుక, ఛేదనాదిక్రియలనుబట్టి గొడ్డలి మొదలగు సాధనములను ఎరిగినట్లు శబ్దస్పర్శాదివిషయగ్రహణమునుబట్టి ఆయాజ్ఞానేంద్రియమున్నదని యూహించితెలిసికొనవలెను. ప్ర. అయితే, ఈజ్ఞానేంద్రియములకు స్వభావమేమి? ఉ ఈజ్ఞానేంద్రియములైదును సాధారణముగా బాహ్యప్రదేశమునకు పరుగెత్తుచున్నవి. ఇట్లు, శ్రు॥ పరాంచిఖానివ్యతృణత్స్వయంభూస్తస్మాత్పరాఙ్పశ్యతినాంతరాత్మన్॥ అనెడి శ్రుతిజెప్పుచున్నది.

అవ. ప్రాయశ్శబ్దముచేత సూచింపబడెడి, ఒకానొకప్పుడింద్రియములకుగల ఆంతరవిషయగ్రహణము నిప్పుడుజెప్పుచున్నాడు.

శ్లో॥ కదాచిత్పిహితే కర్ణే శ్రూయతే శబ్ద ఆంతరః।
ప్రాణవాయౌ జాఠరాగ్నౌ జలపానేఽన్నభక్షణే॥ ౮.

టీ. కదాచిత్ - ఒకానొకప్పుడు, కర్ణే - చెవులు, పిహితేసతి - మూయబడుచుండగా, ప్రాణవాయౌ - ప్రాణవాయువునందును, జాఠరాగ్నౌ - జఠరాగ్నియందునుగల, ఆంతరః - గర్భములోని, శబ్దః - శబ్దము, శ్రూయతే - వినబడుచున్నది. జలపానే - జలముద్రాగుటయందును, అన్నభక్షణే - అన్నమును భక్షించుటయందును.

తా. ఒకానొకప్పుడు, చెవియొక్కరంధ్రమును మూయుచుండగా గర్భములో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గానుండెడి ప్రాణవాయుజఠరాగ్నులయందుగల శబ్దమును శ్రోత్రేంద్రియముగ్రహించుచున్నది. మరియు, జలమును త్రాగునప్పుడును అన్నమును భక్షించునప్పుడును,

శ్లో॥ వ్యజ్యంతే హ్యంతరాస్స్పర్శా మీలనే చాంతరం తమః।
ఉద్గారే రసగంధౌ చేత్యక్షాణామాంతరగ్రహః॥ ౯.

టీ. అన్తరాః-గర్భములోని, స్పర్శాః-స్పర్శములు, వ్యజ్యంతే- తెలియబడుచున్నవి. మీలనేకృతేసతి - కన్నులుమూయబడుచుండగా, ఆన్తరం - దేహములోని-తమః-చీకటి, వ్యజ్యంతే-తెలియబడుచున్నది. ఉద్గారేసతి - వాంతిగలుగుచుండగానైనను, త్రేపులుగలుగుచుండగానైనను, రసగంధౌచ-రసగంధములురెండును, వ్యజ్యేతే-తెలియబడుచున్నవి. ఇతి-ఈప్రకారము- అక్షాణామ్ - జ్ఞానేంద్రియములకు, ఆన్తరగ్రహః=ఆన్తర-దేహములోనివిషయములయొక్క,గ్రహః - జ్ఞానముకలుగుచున్నది.

తా. మరియు జలమును త్రాగునప్పుడును, అన్నమును భక్షించునప్పుడును, గర్భములోనిస్పర్శములను త్వగింద్రియము గ్రహించుచున్నది. మరియు, కన్నులుమూయుచుండగా దేహములోని చీకటిని చక్షురింద్రియము గ్రహించుచున్నది. మరియు వాంతి, త్రేపుగానికలిగినప్పుడు, రసనేంద్రియము రసమును, ఘ్రాణేంద్రియము గంధమును, గ్రహింపుచున్నది. ఇట్లు జ్ఞానేంద్రియములకు ఆన్తరవిషయగ్రహణమొకానొకప్పుడు గలిగియున్నదని యభిప్రాయము.

అవ. ఇట్లు జ్ఞానేంద్రియవ్యాపారములనుదెలిపి, కర్మేంద్రియములులేవనెడివాదినిగురించి, ఆకర్మేంద్రియములున్నవని సమర్థించుటకొరకు, కర్మేంద్రియవ్యాపారములను జెప్పుచున్నాడు.

శ్లో॥ పంచోక్త్యాదానగమనవిసర్గానన్దకాః క్రియాః।
కృషివాణిజ్యసేవాద్యాః పంచస్వన్తర్భవంతిహి॥ ౧౦.

టీ. ఉక్త్యాదానగమనవిసర్గానన్దకాః=ఉక్తి- వచించుటయు, ఆదాన-గ్రహించుటయు, గమన-వెళ్లుటయు, విసర్గ- పురీషవిసర్జనముచేయుటయు, ఆనన్దకాః-ఆనన్దించుటయనెడి, పంచ-అయిదైన, క్రియాః - క్రియలు, ప్రసిద్ధములుగానున్నవి. కృషివాణిజ్యసేవాద్యాః=కృషి - వ్యవసాయంబును, వాణిజ్య- వర్తకంబును, సేవాద్యాః-సేవాదిక్రియలను, పంచసు- ఆఅయిదింటియందె - అన్తర్భవంతిహి- అన్తర్భూతములగుచున్నవిగదా.

తా. ౧, వచించుటయు, ౨, తీసుకొనుటయు, ౩, నడచుటయు, ౪, మలము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నువిడుచుటయు, ౫, ఆనన్దించుటయు జలమును విడుచుటయు, ఈఅయిదుక్రియలును ప్రసిద్ధములైయున్నవి. ప్ర. అయితే కృషివర్తకసేవాద్యనేక క్రియలుగలిగియుండగా అయిదుక్రియలనియెట్లు చెప్పవచ్చును? ఉ. కృషివర్తకసేవాది క్రియలన్నియు పూర్వోక్తపంచక్రియలలోనే చేరియున్నవి గనుక క్రియలైదనిచెప్పవచ్చును.

శ్లో॥ వాక్పాణిపాదపాయూపస్థైరక్షైస్తత్క్రియాజనిః।
ముఖాదిగోళకేష్వాస్తేతత్కర్మేంద్రియపంచకం॥ ౧౧.

టీ. వాక్పాణిపాదపాయూపస్థైః=వాక్-వాక్కును, పాణి- హస్తంబును, పాద-పాదంబును, పాయు-పాయువును, ఉపస్థైః-ఉపస్థలనెడి,అక్షైః-ఇంద్రియములచేత, తత్క్రియాజనిః=తత్క్రియా-ఆవచించుట మొదలగుక్రియలయొక్క,జనిః - ఉత్పత్తి, భవతి-అగుచున్నది. తత్కర్మేంద్రియపంచకం=తత్కర్మేంద్రియ- ఆకర్మేంద్రియములయొక్క,పంచకం-పంచకము, ముఖాదిగోళకేషు=ముఖాది-నోరు మొదలగు నవయవములయొక్క, గోళకేషు-స్థానములయందు,ఆస్తే-ఉంటున్నది.

తా. ప్ర. అయితే ఆపంచక్రియలనుగలిగించెడి యింద్రియములెవ్వి? ఉ. ౧. వాక్కు, ౨. పాణి, ౩. పాదము, ౪. పాయువు, ౫. ఉపస్థలనెడి పేర్లుగల కర్మేంద్రియములచేత పూర్వోక్తపంచక్రియలును క్రమముగాగలుగుచున్నవి. ప్ర. అదియెట్లు? ఉ. ౧. వాగింద్రియమునకువచించుటయే వ్యాపారమగును. ౨. పాణీంద్రియమునకు గ్రహించుటయే వ్యాపారమగును. ౩. పాదేంద్రియమునకు గమనమే వ్యాపారమగును. ౪. పాయ్వింద్రియమునకు మలవిసర్జనమే వ్యాపారమగును. ౫ ఉపస్థేంద్రియమునకు జలవిసర్జనము, ఆనందించుటయు వ్యాపారమగునని తెలియవలెను.

అవ. ఇప్పుడు ఈచెప్పబడిన పదియింద్రియములకు ప్రేరకత్వముచేత నధికారియగు మనస్సుయొక్క వ్యాపారస్థానమును చెప్పుచున్నాడు.

శ్లో॥ మనోదశేంద్రియాధ్యక్షంహృత్పద్మగోళకేస్థితం।
తచ్చాంతఃకరణంబాహ్యేష్వస్వాతంత్ర్యాద్వినేంద్రియైః॥

టీ. మనః - మనస్సు, దశేంద్రియాధ్యక్షం = దశేంద్రియ - పదియింద్రియములకు, అధ్యక్షం - అధికారియగును. తత్ - ఆమనస్సు, హృత్పద్మే - హృదయకమలమందు, గోళకే-గోళకమనెడిస్థానమందు, స్థితం-ఉంటున్నది. బాహ్యేషు-బాహ్యస్థలములయందు, ఇంద్రియైర్వినా-ఇంద్రియములతోటితప్ప, అస్వాతంత్ర్యాత్-స్వాతంత్రగమనములేమివలన, తత్-ఆమనస్సు, అంతఃకరణం- అంతరింద్రియమని చెప్పబడును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మరియు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములగు పదింటికిని మనస్సు అధికారి యగును. ఆమనస్సు హృదయకమలమందుండును. ఆమనస్సు జ్ఞానేంద్రియములతోగూడి బాహ్యస్థలములకు వ్యాపించునే గాని స్వాతంత్ర్యముచేత తనంతట బాహ్యస్థలములను వ్యాపింపనేరదు. అందుచేత మనస్సు అంతరింద్రియమని చెప్పబడుచున్నది.

అవ. ఆ మనస్సునకుగల అధికారమును యిప్పుడు చూపుచున్నాడు.

శ్లో॥ అక్షేష్వర్థార్పితేష్వేత ద్గుణదోషవిచారకం।
సత్వంరజస్తమశ్చాస్యగుణావిక్రియతేహితైః॥ ౧౩.

టీ. అక్షేషు ఇంద్రియములు, అర్థార్పితేషుసత్సు=అర్థ - విషయములయందు, అర్పితేషుసత్సు-స్థాపింపబడుచుండగా, ఏతత్ -ఈమనస్సు, గుణదోషవిచారకం=గుణ-సుగుణములయొక్కయు, దోష - హేయగుణములయొక్కయు, విచారకం-విచారణ కారియగును. సత్వం-సత్వగుణంబును, రజః-రజోగుణంబును, తమశ్చ-తమోగుణంబును, అస్య-ఈ మనస్సుయొక్క, గుణాః-గుణములగును. హి-ఏకారణమువలన, తైః-ఆసత్వరజస్తమోగుణములచేత, విక్రియతే-వికారముగా జేయబడుచున్నదో.

తా. ఇంద్రియములన్నియును ఆయావిషయములయందు స్థాపింపబడుచుండగా అప్పుడీమనస్సు, ఇది మంచిదనియు, ఇది మంచిదికాదనియు, ఇట్లు విషయములయందుగల గుణదోషములను విచారించుచుండును. అందుచేత సర్వేంద్రియములకును మనస్సు అధికారియని తెలియవలయును. ప్ర. ఓయి? ఆత్మయును చక్షురాదీంద్రియములు సర్వజ్ఞానకారణములగుచుండగా వేరెగా మనస్సు నెందుకంగీకరింపవలెను. ఉ. ఆత్మ ప్రమాతయగుటచేత సర్వజ్ఞానసాధారణుడగుటవలన కేవలాత్మవలననే గుణదోషవిచారరూపమైన విశేషజ్ఞానము కలుగనేరదు. రూపాదిజ్ఞానమును పుట్టించుటచేతనే చరితార్థములగుటవలన చక్షురాదులవలనను విశేషజ్ఞానముగలుగదు. అనుభవ సిద్ధమైన వస్తుగతగుణదోషవిచారము మరియొకదానిచేత సంభవించదు గనుక ఆవశ్యకముగమనస్సునంగీకరింపవలయును. ప్రమాతయనగా, కూటస్థసహితబుద్ధిస్థచిదాభాసుడని తెలియవలయును. మరియు సత్వరజస్తమములనెడి మూడుగుణములును మనస్సునకుకలిగియున్నవి. ఆమూడు గుణములచేత ఆమనస్సు వికారమునుపొందుచుండును. ఈ ఇంద్రియంబుల స్వరూపవ్యాపారంబులు అత్యావశ్యకంబులగుటవలన నీక్రింద స్పష్టంబుగా జెప్పబడును.

## జ్ఞానేంద్రియములు ౫.

శ్రోత్రేంద్రియము, ఇది సర్వశబ్దంబులను గ్రహించును, ఆశబ్దంబు లౌకికంబనియు,

SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 5512
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వైదికంబనియు, ద్వివిధంబు. ప్రాకృతరూపంబులగు అష్టాదశభాషలు లౌకికంబనంబడును. సంస్కృతరూపవేదశాస్త్రాదులు వైదికంబనంబడును. తిరుగ నీలౌకిక వైదికంబులు అనంతవిధంబులు. ఇన్నిశబ్దంబుల నేదిగ్రహింపుచున్నదోయది శ్రోత్రేంద్రియంబు. ఇది కర్ణంబులోనుండు నడిమిద్వారంబుచే నవచ్ఛిన్నంబగు నాకాశప్రదేశంబునాశ్రయించియున్నది. ఆకర్ణశష్కుల్యవచ్ఛిన్నంబగు నాకాశప్రదేశంబే శ్రోత్రేంద్రియంబని చెప్పినయెడల, సుషుప్తి, మూర్ఛ, మృతదేహంబులయందుండు కర్ణశష్కుల్యవచ్ఛిన్నాకాశప్రదేశంబులవలనగూడ శబ్దంబులు గ్రహింపబడవలయును. అట్లు గ్రహింపబడడములేదు. కనుక ఆకర్ణశష్కుల్యవచ్ఛిన్నాకాశప్రదేశంబునకంటె భిన్నంబై శబ్దగ్రహణశక్తిగలదై సూక్ష్మంబైయుండు యొకవస్తువు శ్రోత్రేంద్రియంబని చెప్పబడును. దీనికి యధిష్ఠానదేవతదిక్కు. ఈయధిష్ఠానదేవతచేత ప్రేరేపింపబడిన యాశ్రోత్రేంద్రియంబు పూర్వోక్తశబ్దంబులనన్నిటిని గ్రహింపుచుండును. ఇట్లు సర్వేంద్రియములను నూహింపందగినది.

## త్వగింద్రియము.

త్వగింద్రియము ఇది. స్పర్శంబులను గ్రహించును. ఆస్పర్శంబు, శీతంబనియు, ఉష్ణంబనియు, శీతోష్ణంబనియు, మృదువనియు, కఠినంబనియు, నైదువిధంబులు, ఇందొక్కొక్కటి యనంతవిధంబులు. ఇది స్థూలదేహంబును సర్వత్రవ్యాపించియుండును. స్పర్శగ్రహణశక్తిగలదై సూక్ష్మంబైయుండు వస్తువగును. దీనికి వాయువు అధిష్ఠానదేవత.

## చక్షురింద్రియము.

చక్షురింద్రియము ఇది సర్వరూపముల గ్రహించును. ఆరూపంబులు, తెలుపు, నలుపు, ఎఱుపు, పసుపు, ఆకుపచ్చ, శబళము, అనగా (మిశ్రవర్ణము.) హ్రస్వము, దీర్ఘము,స్థూలము,సూక్ష్మము, అనిదశవిధంబులు, ఇందొక్కొక్కటి యనంతవిధంబులు. ఇది కంటియొక్క గ్రుడ్డును ఆశ్రయించుకొనియున్నది. ఆనల్లగ్రుడ్డుకువేరై రూపగ్రహణశక్తినిగలదై సూక్ష్మంబైన యొకవస్తువు చక్షురింద్రియమనంబడును. దీనికి సూర్యుం డధిష్ఠానదేవత.

## రసనేంద్రియము.

రసనేంద్రియము- ఇది ఉప్పు, పులుసు, కారము, తీపు, వగరు, చేదు, అనునీయాఱురసంబుల నెఱుంగునది. ఇది కొననాలుకను ఆశ్రయించుకొనియున్నది. అయి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నను ఆలోచనాలుకవు వ్యతిరిక్తంబై రసగ్రహణశక్తిగలదై సూక్ష్మబైయుండు ఒక వస్తువగును. దీనికి వరుణుండధిష్ఠానదేవత.

## ఘ్రాణేంద్రియము.

ఘ్రాణేంద్రియము, ఇది సుగంధము, దుర్గంధము, మిశ్రగంధము, అనుసీమూటి నెఱుంగునది. ఇది నాసికాగ్రంబు నాశ్రయించియున్నది. కనుక నానాసికాగ్రవ్యతిరిక్తంబై గంధగ్రహణశక్తిగలదై సూక్ష్మంబైన యొకవస్తువు. దీనికధిష్ఠానదేవత లశ్విసీదేవతులు. జ్ఞానేంద్రియంబుల స్వరూపవ్యాపారాదు లిట్టివనితెలియవలెను.

## కర్మేంద్రియంబులు ౫.

## అందు వాగింద్రియము.

లౌకికవైదికశబ్దంబులన్నియూ దేనిచే నుచ్చరించబడుచున్నదో అదివాగింద్రియంబనంబడును. ఇది నాలుక-తాలుమూలంబులు - ఉత్తరోష్ఠాధరోష్ఠంబులు - కంఠహృదయంబులు-బ్రహ్మరంధ్రంబులను నీయెనిమిదిస్థానంబుల నాశ్రయించియున్నది. ఈయష్టస్థానంబులే వాగింద్రియంబనిచెప్పినయెడల, సుప్తి-మృతి- మూర్ఛాదులయందుకూడ నాస్థానంబులచే శబ్దంబులుచ్చరింపబడవలయును. అట్లుచ్చరింపబడుటలేదు. కనుక నాయష్టస్థానవ్యతిరిక్తంబై వచనగ్రహణశక్తిగలదై సూక్ష్మంబైయుండు నొకవస్తువు వాగింద్రియంబనంబడును. దీనికధిష్ఠానదేవత చతుర్ముఖుండు. ఆయధిష్ఠానదేవతచేత బ్రేరేపింపబడిన వాగింద్రియంబు సమస్తశబ్దంబులనుచ్చరింపుచుండును. ఇట్లు సర్వేంద్రియంబులను నూహింపదగినది.

## పాణీంద్రియము.

విడుచుట-గ్రహించుట-యను క్రియలుసేయునది పాణీంద్రియంబనంబడును. అది అరచేతి నాశ్రయించుకొనియున్నది. ఆయరచేతికి వ్యతిరిక్తంబై హానోపాదానక్రియాశక్తిగలదై సూక్ష్మమైన యొకవస్తువగును. దానికధిష్ఠానదేవత ఇంద్రుడు.

## పాదేంద్రియము.

గమనాగమనాదిక్రియలుసేయునది పాదేంద్రియంబనంబడును. అది అరికాలి నాశ్రయించియుండును. ఆయరికాలికి వ్యతిరిక్తంబై గమనాగమనాది క్రియాశక్తిగలదై సూక్ష్మంబైన యొకవస్తువగును. దీనికధిష్ఠానదేవత ఉపేంద్రుడు.

## పాయురింద్రియము.

పురీషవిసర్జనము మొదలైన క్రియలుసేయునది పాయురింద్రియంబనంబడును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అది గుదమునాశ్రయించియున్నది. ఆగుదవ్యతిరిక్తమై పురీషవిసర్జనాది క్రియాశక్తి గలదై సూక్ష్మంబైనయొకవస్తువగును. దానికధిష్ఠానదేవత మృత్యువు.

## ఉపస్థేంద్రియము.

శుక్లమూత్రంబులను విసర్జనంబుసేయునది ఉపస్థేంద్రియంబనబడును. అది యోనిలింగంబులనాశ్రయించియున్నది. ఆయోనిలింగవ్యతిరిక్తంబై శుక్లమూత్రవిసర్జనాది క్రియాశక్తిగలదై సూక్ష్మంబైన యొకవస్తువగును. దానికధిష్ఠానదేవత ప్రజాపతి ఇట్లు కర్మేంద్రియస్వరూప వ్యాపారాదికంబని తెలియవలెను.

## పంచవాయువులలక్షణము.

ప్రాణవాయువనగా-ఉచ్ఛ్వాసము దేనివలనజేయబడుచున్నదో అది ప్రాణవాయువనంబడును. దానికి స్థానము హృదయము విశిష్టుండధిష్ఠానదేవత. ఆయధిష్ఠానదేవతవలన ప్రేరేపింపబడిన ప్రాణవాయువు ఉచ్ఛ్వాసమునుజేయుచుండును.

## అపానవాయువు.

అపానవాయువనగా నిశ్వాసముదేనిచేత చేయబడుచున్నదో అది అపానవాయువనంబడును. దానికిస్థానము గుదము. విశ్వకర్తయధిష్ఠానదేవత. ఆయధిష్ఠానదేవతచేత ప్రేరేపింపబడిన అపానవాయువు నిశ్వాసమునుజేయుండును.

## వ్యానవాయువు.

వ్యానవాయువనగా శరీరంబు నుద్ధరించుకొని ఇంద్రియాదులకు బలంబిచ్చుచునేదియున్నదో అది వ్యానవాయువనంబడును దీనికిస్థానంబు శరీరమాద్యంతంబగును- విశ్వయోనియధిష్ఠానదేవత. ఆయధిష్ఠానదేవతచేత ప్రేరేపింపబడిన వ్యానవాయు వింద్రియాదులకు బలంబిచ్చుచు శరీరంబునుద్ధరింపుచుండును.

## ఉదానవాయువు.

ఉదానవాయువనగా సుషుప్త్యవస్థయందు సకలేంద్రియంబుల నుపసంహరించుకొని తనకుకారణంబైన అజ్ఞానంబులయింపుచు జాగ్రదవస్థయందు నానాయింద్రియంబుల నానాగోళకంబులయందునిలుపుచు, ఉత్క్రమణకాలంబునందు సకలేంద్రియంబులనుగ్రహించుకొని లోకాంతరంబునకుబోవునది ఉదానవాయువనంబడును. దీనికిస్థానంబు కంఠంబు. అజుండధిష్ఠానదేవత. ఆయధిష్ఠానదేవతచేత ప్రేరేపింపబడిన ఉదానవాయువు, పైనజెప్పినవ్యాపారంబులనెల్ల జేయుచుండును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## సమానవాయువు.

సమానవాయువనగా భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యంబులనెడి నాలుగువిధంబులైన ఆహారంబులను జఠరాగ్నితోగూడుకొని పచనంబుజేసి శరీరంబునకు పుష్టిని ఎద్దికలుగజేయుచున్నదో అది సమానవాయువనంబడును. దీనికి స్థానంబు నాభిప్రదేశంబు. జయుండధిష్ఠానదేవత. ఆయధిష్ఠానదేవతచేత ప్రేరేపింపబడిన సమానవాయువు జఠరాగ్నితోగూడుకొని భక్ష్యభోజ్యాదులను పక్వంబుజేసి శరీరంబునకు బుష్టినికలుగజేయుచుండును. ఇవిగాక నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయంబులనెడి పంచఉపవాయువులుగలవు. ఇందు నాగవాయువు వాంతిజేయించును. కూర్మవాయువు కంటిరెప్పలుమూయుటకును తెరచుటకును కారణంబైయుండును. కృకరవాయువు తుమ్ముననట్లుచేయును. దేవదత్తవాయువావలించునటులచేయును. ధనంజయవాయువు శరీరమును పోషింపజేయును. ఈవాయువులైదును పూర్వోక్త వాయువులలో నంతర్భూతంబులగును. కనుక నావాయువులకు స్థానంబులను దేవతలను ఏవిచెప్పబడెనో వీనికిని అవియేనని తెలియవలెను.

## అంతఃకరణచతుష్టయము.

మనస్సనగా సంకల్పవికల్పంబులు దేనిచేజేయబడుచున్నవో అది మనస్సనిచెప్పంబడును. దానికిస్థానము కంఠాంతము. చంద్రుడధిదేవత. ఆయధిష్ఠానదేవతచేత ప్రేరేపింపబడిన మనస్సు సంకల్పవికల్పంబులంజేయుచుండును.

బుద్ధియనగా నిశ్చయంబుదేనిచేతజేయబడుచున్నదో అదిబుద్ధియనిచెప్పంబడును. దానికి స్థానంబు ముఖంబగును. చతుర్ముఖుండధిష్ఠానదేవత. ఆయధిష్ఠానదేవతచే ప్రేరేపింపబడిన బుద్ధి నిశ్చయమునుజేయుచుండును.

అహంకారంబనగా నభిమానంబు దేనిచేత గలుగుచున్నదో అది అహంకారమనంబడును. దీనికి స్థానంబు హృదయంబగును. రుద్రుండధిష్ఠానదేవత. ఆయధిష్ఠానదేవతవలన ప్రేరేపింపబడిన అహంకారంబభిమానంబుజేయుచుండును.

చిత్తంబనగా ధారణముదేనిచేతజేయబడుచున్నదో అదిచిత్తమగును. దానికి స్థానంబునాభియగును. క్షేత్రజ్ఞుడగు జీవుండధిష్ఠానదేవత. ఆయధిష్ఠానదేవతవలనప్రేరేపింపబడిన చిత్తంబు ధారణమును జేయుచుండును.

అవ. గుణములచేత మనస్సునకుగలుగుచుండెడి వికారములను చెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ వైరాగ్యంక్షాంతిరౌదార్యమిత్యాద్యాస్సత్త్వసంభవాః।
కామక్రోధౌలోభయత్నావిత్యాద్యారజసోత్థితాః॥ ౧౪.

టీ. వైరాగ్యం-విరక్తియు, క్షాంతిః-ఓర్పుతనంబును, ఔదార్యం-ఉదారత్వంబును, ఇత్యాద్యాః-ఇవి మొదలగు సద్గుణములన్నియు, సత్త్వసంభవాః=సత్త్వ-సత్త్వగుణమువల్ల, సంభవాః - పుట్టినవగును. కామక్రోధౌ-కామకోపములును, లోభయత్నౌ=లోభ - లుబ్ధగుణంబును, యత్నౌ - విషయసుఖమును పొందుటకు ప్రయత్నించుటయు, ఇత్యాద్యాః-ఇవి మొదలగు సంసారసాధకగుణములన్నియు, రజసః-రజోగుణమువల్ల, ఉత్థితాః-పుట్టినవగును.

తా. మనస్సునకుగల వైరాగ్యము, ఓర్పు, ఉదారత్వము, మొదలగు సద్గుణములన్నియు సత్త్వగుణమువల్లబుట్టినవగును. మరియు, మనస్సునకుగల కామక్రోధలోభప్రయత్నాదులగు దేహాభిమాన సంసారసాధకగుణములన్నియు, రజోగుణమువల్ల కలిగినవగును.

శ్లో॥ ఆలస్యభ్రాంతితంద్ర్యాద్యావికారాస్తమసోత్థితాః।
సాత్త్వికైఃపుణ్యనిష్పత్తిఃపాపోత్పత్తిశ్చరాజసైః॥ ౧౫.

టీ. ఆలస్యభ్రాంతితంద్ర్యాద్యాః = ఆలస్య - సోమరితనంబును, భ్రాంతి-భ్రమించుటయు, తంద్ర్యాద్యాః-నిద్రించుట మొదలగు, వికారాః-వికారములు, తమసః-తమోగుణమువల్ల, ఉత్థితాః-పుట్టినవగును. సాత్త్వికైః - సాత్త్వికగుణములచేత, పుణ్యనిష్పత్తిః- పుణ్యముగలుగును. రాజసైః - రాజసగుణములచేత, పాపోత్పత్తిశ్చ - పాపముగలుగును.

తా. మరియు, సోమరితనముచేత పనులుజేయక మందముగానుండుటయు, భ్రమించుటయు, అధికముగా నిద్రించుటయు, సోలుటయు ఇవి మొదలగు మనస్సునొక్క వికారగుణములన్నియు, తమోగుణమువల్ల గలిగినవగును. ప్ర. అయితే, ఈ గుణములవల్ల ఫలమేమి?. ఉ. వైరాగ్యాదిసాత్త్వికగుణములచేత పుణ్యముగలుగును. మరియు, కామక్రోధాదిరాజసగుణములచేత పాపముగలుగును.

శ్లో॥ తామసైర్నోభయంకింతువృథాయుఃక్షపణంభవేత్।
అత్రాహంప్రత్యయీకర్తేత్యేవంలోకవ్యవస్థితిః॥ ౧౬.

టీ. తామసైః - తామసగుణములచేత, ఉభయం- పుణ్యపాపములు రెండును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న. కలుగవు. కింతు-మరియేమనగా, వృథా-వ్యర్థముగా, ఆయుఃక్షపణం=ఆయుః-ఆయుస్సుయొక్క, క్షపణం-నాశము, భవేత్ - అగును అత్ర-ఇక్కడ, అహంప్రత్యయీ=అహం-నేననెడి, ప్రత్యయీ. తెలివిగలబుద్ధి, కర్తా-ప్రభువగును. ఇత్యేవం - ఈ ప్రకారముగా, లోకవ్యవస్థితిః- లోకమర్యాదయగును.

తా. మరియు మనస్సునందుగల సోమరితనము నిద్రమొదలగు తామసగుణ వికారములచేత పుణ్యపాపములు రెండునుగలుగవు. మరియేమనగా వ్యర్థముగా ఆయుష్కాలము నశించును. మరియు ఈచెప్పబడినవన్నియు, బుద్ధియందుండుటచేత, అంతరింద్రియమగు మనస్సునకును, బాహ్యేంద్రియములగు శ్రోత్రాదులకును, ఆబుద్ధి ప్రభువగును. (అహం) నేననెడితెలివిగల కర్తయేబుద్ధియగునని తెలియవలెను. ఈప్రకారమే లోకమందును, కార్యకారి ప్రభువని చెప్పబడుచున్నాడు. మరియు అహమనెడి తెలివిగల ఈబుద్ధియే అహంకారమగుననియు, అహంకారబుద్ధులురెండును ఏకరూపమేయగుననియు, మనోచిత్తములురెండును ఏకరూపమేయగుననియుందెలియవలెను.

అన. ఇట్లు జగత్తుయొక్క స్థితినిదెలిపి, ఆజగత్తు పంచభూతకార్యమని ఎరుగుటకొరకు ఇప్పుడు జ్ఞానోపాయమును జెప్పుచున్నాడు.

శ్లో॥ స్పష్టశబ్దాదియుక్తేషుభౌతికత్వమతిస్ఫుటం।
అక్షాదావపితచ్ఛాస్త్రయుక్తిభ్యామవధార్యతాం॥ ౧౭.

టీ. స్పష్టశబ్దాదియుక్తేషు=స్పష్ట-స్పష్టములైన, శబ్దాది - శబ్దస్పర్శరూపరసగంధములతోటి, యుక్తేషు-కూడియున్న ఘటాదివస్తువులయందు, భౌతికత్వం- పంచభూతకార్యత్వము, అతిస్ఫుటం-మిక్కిలి స్పష్టముగాదెలియబడుచున్నది. అక్షాదావపి-శ్రోత్రాదిఇంద్రియవర్గమందును, శాస్త్రియుక్తిభ్యాం-శాస్త్రియుక్తులవల్ల, తత్-ఆ పంచభూతకార్యత్వము, అవధార్యతాం- ఎరుగబడుగాక, అనగా ఎరుగవలెననుట.

తా. ఘటాదివస్తువులన్నియు శబ్దస్పర్శరూప రసగంధములనెడి పంచభూతగుణములను గలిగియుండుటచేత, ఆఘటాదులన్నియు పంచభూతములవల్ల గలిగినట్లు మిక్కిలి స్పష్టమాయెను. కనుక, లోకమందుగల ఘటాదిదృశ్యపదార్థములన్నియు, పంచభూతములయొక్క కార్యములనియెరుగవలెను. ప్ర. అయితే. ఇంద్రియాదులన్నియు పంచభూతకార్యములగుటెట్లు ?. ఉ. శాస్త్రిముచేతను అనుమానప్రమాణముచేతను నిశ్చయింపవలెను. ప్ర. అదియెట్లు ?. ఉ. శ్రు॥ అన్నమయంహిసోమ్యమనః ఆపోమయఃప్రాణస్తేజోమయీవాక్॥ ఇత్యాదిశాస్త్రిము, మనస్సుమొదలగుఇంద్రియము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లన్నియు పంచభూతకార్యములని చెప్పుచున్నది. ప్ర. సరి. అనుమానప్రమాణ మెట్లు? ఉ. మృత్తికాన్వయవ్యతిరేకానువిధాయి అగుఘటము మృత్తికాకార్యమై కనబడుచున్నదనియు, ఏయేకార్యముఅన్వయవ్యతిరేకానువిధాయియో, ఆయాఘటాది కార్యము తనకు నుపాదానకారణమైన మృత్తికాదికమువల్ల కలిగినట్లు కనబడుచున్నదనియు, అటువలెనే శ్రోత్రము మొదలగు సకలేంద్రియములకును ఆయాభూతాన్వయ వ్యతిరేకానువిధాయిత్వముగలిగియుండుటచేత శ్రోత్రాది ఇంద్రియములన్నియు భూతకార్యములగుటకు తగునని తెలియవలెను. ఈ చెప్పబడిన పంచభూతాన్వయ వ్యతిరేకానువిధాయిత్వము ఛాందోగ్యశ్రుతియందు, శ్రు॥ షోడశకళస్సోమ్యపురుషః॥ ఇత్యాదివాక్యములచేత మనస్సునకు చెప్పబడియున్నది. ఇటువలెనే అంతటను అన్వయవ్యతిరేకానువిధాయిత్వమును గ్రహించవలెను. ఇట్టి అనుమానప్రమాణముచేత మనస్సుశ్రోత్రము మొదలగు సకలేంద్రియములను పంచభూతకార్యములగునని నిశ్చయించవలెను. మరియు, శ్రోత్రేంద్రియము ఆకాశభూతమువల్లబుట్టుటచేత, ఆయాకాశగుణమగు శబ్దమునుమాత్రమే గ్రహింపుచున్నదనియు, ఆశ్రోత్రేంద్రియము ఇతరభూతములవల్ల బుట్టమిచేత నితరభూతగుణములగు స్పర్శాదులనుగ్రహించుటలేదనియు, నిట్లుయుక్తిచేత యోచించి సకలేంద్రియములను భూతకార్యములనుగా నిశ్చయింపవలెను.

అవ. ఇట్లు పంచభూత తత్కార్యములను విభజించిచూపి, శ్రు॥ (సదేవసోమ్యేదమగ్రఆసీత్ ఏకమేవాద్వితీయం) సృష్టికిపూర్వమందీజగత్తంతయు రెండవది లేని ఒక్కటియేయగు సద్వస్తువుగానేయుండెననుట. ఇట్లు అద్వితీయబ్రహ్మమును ప్రతిపాదించెడి ఇత్యాదిశ్రుతిని వ్యాఖ్యానింపదలచి, ఆశ్రుతియందుగల, (ఇదం) ఇది, అనెడిపదమునకు అర్థమునిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ ఏకాదశేంద్రియైర్యుక్త్యా శాస్త్రేణాప్యవగమ్యతే।
యావత్కించిద్భవేదేతదిదంశబ్దోదితంజగత్॥ ౧౮.

టి. ఏకాదశేంద్రియైః - మనస్సు మొదలగు పదునొకండింద్రియములచేతను, అనగా ప్రత్యక్షప్రమాణముచేతననుట. యుక్త్యా-అనుమానోపమాన ప్రమాణములచేతను, శాస్త్రేణాపి- ఆగమఅర్థాపత్త్యాది ప్రమాణజ్ఞానములచేతను, యావత్-ఎంతమాత్రము, కించిత్ - కొంచమైన, జగత్-ప్రపంచము, అవగమ్యతే- తెలియబడుచున్నదో, ఏతత్-ఈజగత్తంతయు, ఇదంశబ్దోదితం=ఇదంశబ్ద - ఇదియ నెడియర్థముగల శబ్దముచేత, ఉదితం-చెప్పబడినది, భవేత్-అగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ౧. ప్రత్యక్షము, ౨. అనుమానము, ౩. ఉపమానము, ౪. ఆగమము, ౫. అర్థాపత్తి, ౬. అనుపలబ్ధి, ౭. సంభవము, ౮. ఐతిహ్యము అనెడి అష్టవిధప్రమాణములచేత ఎంతమాత్రపుజగంబెరుగబడుచున్నదో ఆజగత్తంతయు, శ్రు॥ సదేవసోమ్యేదమగ్ర ఆసీత్॥ అనెడి శ్రుతియందుగల, (ఇదం)ఇదియనెడి అర్థముగలశబ్దముచేత చెప్పబడెను. ప్ర. అయితే, ప్రత్యక్షప్రమాణమెట్టిది?. ఉ. తాను స్వయముగాగాని ఒకఁడుజూపినగానిజూచి ఇది ఇట్టిపదార్థమని తెలిసికొనుటయే ప్రత్యక్షప్రమాణమగును. ప్ర. సరి. అనుమానప్రమాణమెట్టిది?. ఉ. ఒకవస్తువుతోటి సంబంధించినమరియొకవస్తువునుజూచి అట్టివస్తువు అచ్చటనుండునని ఊహించితెలుసుకొనుటయే అనుమానప్రమాణమగును. ప్ర. ఇందుకునుదాహరణమేమి?. ఉ. అగ్నితోటి సంబంధముగలపొగనుజూచి ఆపొగయున్నస్థలమునకు సమీపమందు అగ్నియున్నదని ఊహించుటయే అనుమానప్రమాణమునకు ఉదాహరణమగును. ప్ర. సరి. ఉపమానప్రమాణమెట్టిది?. ఉ. ఒకవస్తువువంటి మరియొకవస్తువునుజూచి ఆవస్తువుగూడ ఈప్రకారమే ఉండునని తెలిసికొనుటయే ఉపమాన ప్రమాణమగును. ప్ర. ఇందుకుదాహరణమేమి?. ఉ. ముఖము చంద్రునివలెనున్నదనివిని, పిమ్మటచంద్రునిజూచి ఈప్రకారమే ముఖమును సంతోషకరముగానుండునని తెలిసికొనుటయే ఉపమానప్రమాణమునకు ఉదాహరణమగును. ప్ర. సరి. ఆగమప్రమాణమెట్టిది?. ఉ. ఇతరప్రమాణములచేత గోచరముగాని బ్రహ్మవస్తుస్వరూపమును వేదవాక్యములవల్లను బ్రహ్మసాక్షాత్కారవంతులగు ఋషులవాక్యములవల్లను బ్రహ్మస్వరూపమిట్టిదని నిర్ణయించుటయే ఆగమప్రమాణమగును. మరియు, వేదవాక్యములవల్ల స్వర్గాదిలోకములున్నవని యెరుగుటయు, ఆగమప్రమాణమేయగును. మరియు, ఒకదేశమందుగల ఒకవస్తువునొకడుజూచివచ్చి, ఆవస్తుస్వరూపమునుజెప్పగా వానివాక్యమువల్ల ఆవస్తుస్వరూపమునెరుగుట శబ్దప్రమాణమగును. ఈశబ్దప్రమాణము, ఆగమప్రమాణములో జేరినదేయగును. ప్ర. సరి. అర్థాపత్తిప్రమాణమెట్టిది?. ఉ. కొన్నిలక్షణములంబట్టి ఈయంశమిట్లుండవచ్చునని నిర్ణయించి తెలిసికొనుటయే అర్థాపత్తి ప్రమాణమగును. ప్ర. ఇందుకుదాహరణమేమి?. ఉ. ఒకడు పగటియందన్నము తినకున్నను బలిసియున్నాడనెడి వాక్యమునువిని బొత్తుగా నాహారమును భక్షించనియెడల బలియుట తటస్థించదనియు, వీడు రాత్రికాలమందన్నముతిని యుండునని నిర్ణయించుటయే అర్థాపత్తిప్రమాణమునకు నుదాహరణమగును. ప్ర. సరి. అనుపలబ్ధిప్రమాణమెట్టిది?. ఉ. ఒకపదార్థమొకస్థలమందు లేకపోవుటచేత, లేదని తెలిసికొనుటయే, అనుపలబ్ధిప్రమాణమగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్ర. ఇందుకుదాహరణమేమి ?. ఉ. భూమిమీద ఘటములేకపోవుటచేత ఇక్కడ ఘటాభావమని తెలిసికొనుటయే అనుపలబ్ధి ప్రమాణమునకుదాహరణమగును. ప్ర. సరి. సంభవప్రమాణమెట్టిది ?. ఉ. శతసంఖ్యలలో దశసంఖ్యలున్నవనియు, సహస్ర సంఖ్యలలో శతసంఖ్యలున్నవనియు, లక్షసంఖ్యలలో సహస్రసంఖ్యలున్నవనియు, గ్రహించుటయే, సంభవప్రమాణమగును. ప్ర. సరి. ఐతిహ్యప్రమాణమెట్టిది?. ఉ. ఒకచెట్టునందు బ్రహ్మరక్షస్సున్నదని యొకడేకాలమందో చెప్పగా ఆమాటనుక్రమము గానందరువిని ఆచెట్టుదగ్గిరకువచ్చినప్పుడు ఆమాటను జ్ఞప్తికితెచ్చుకొని భయమును పొందుటయే ఐతిహ్యప్రమాణమగును. ఇట్లు అష్టప్రమాణస్వరూపముల నెఱుంగ వలయు.

అవ. ఇట్లు (ఇదం) శబ్దార్థమును జెప్పి ఆశ్రుత్యర్థమునిప్పుడు తానే వివరించుచున్నాడు.

శ్లో॥ ఇదంసర్వంపురాసృష్టేరేకమేవాద్వితీయకం।
సదేవాసీన్నామరూపేనాస్తామిత్యారుణేర్వచః॥ ౧౯.

టీ. సృష్టేః - జగత్తుపుట్టుటకంటె, పురా - పూర్వమందు, ఇదంసర్వం - ఈ జగత్తంతయు, అద్వితీయకం - రెండవదిలేనట్టిదియు, ఏకమేవ-ఒక్కటేయగు, సదేవ-సద్రూపబ్రహ్మమే, ఆసీత్ - ఆయెను. అనగా బ్రహ్మముగానే ఉండెననుట. నామ రూపే-నామరూపములు రెండును, నాస్తాం - లేవు. ఇతి-ఇట్లని, ఆరుణేః -ఉద్దాలక మునియొక్క, వచః - వాక్యమగును.

తా. సృష్టికి పూర్వమందీ జగంబంతయు రెండవదిలేని ఒక్కటేఅగు సద్రూపబ్రహ్మముగానేయుండెననియు, అప్పుడు నామరూపములుగల ఈప్రపంచములేదనియు నిట్లు అరుణునియొక్క పుత్రుడగు ఉద్దాలకమునీంద్రుడు, శ్రు॥ సదేవసోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం॥ అనెడి వాక్యముచేత తెలిపెను.

అవ. శ్రు. ఏకమేవాద్వితీయం॥ అనెడిమూడుపదములచేత, సద్వస్తువునందు స్వగతాదిభేదత్రయమును నివారింపజేయుటకొరకు నిప్పుడులోకమందు స్వగతాదిభేదత్రయమును జూపుచున్నాడు.

శ్లో॥ వృక్షస్యస్వగతోభేదఃపత్రపుష్పఫలాదిభిః।
వృక్షాంతరాత్సజాతీయోవిజాతీయశ్శిలాదితః॥ ౨౦.

టీ. వృక్షస్య-వృక్షమునకు, పత్రపుష్పఫలాదిభిః=పత్ర-ఆకులచేతను, పుష్ప-పు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ష్పములచేతను, ఫలైః-భిః - పండులు మొదలగువానిచేతను, స్వగతః=స్వ - తనను, గతః - పొందిన, భేదః - భేదమగును. వృక్షాంతరాత్ - మరియొకవృక్షమువల్ల, సజాతీయః - సజాతీయభేదమగును. శిలాదితః - బండ మొదలగుపదార్థములవల్ల, విజాతీయః- విజాతీయభేదమగును.

తా. వృక్షమునందుగల పత్రపుష్పఫలాదులచేత ఆవృక్షమునకు స్వగత భేదమగును. ఒకవృక్షమునకు మరియొకవృక్షముచేత సజాతీయ భేదమగును. మరియు, బండ మొదలగువస్తువులవల్ల వృక్షమునకు విజాతీయభేదమగును. ఇట్లు లోకమందు ప్రతివస్తువునకును స్వగత సజాతీయవిజాతీయములనెడి మూడుభేదములు గలిగియున్నవని తెలియవలెను.

అవ. ఇట్లు అనాత్మవస్తువునందు మూడుభేదములంజూపి, ఈమూడుభేదములు సద్వస్తువైన బ్రహ్మమందును వ్యాపించుననిని, శ్రు॥ ఏకమేవాద్వితీయం॥ అనెడిమూడుపదములచేత ఆమూడుభేదములను శ్రుతి నివారింపజేయుచున్నదని ఇప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ తథాసద్వస్తునో భేదత్రియంప్రాప్తంనివార్యతే।
ఐక్యావధారణద్వైతప్రతిషేధైస్త్రిభిఃక్రమాత్॥        ౨౧.

టీ. తథా-ఆప్రకారము. సద్వస్తునః-పరమాత్మవస్తువునకు, ప్రాప్తం-ప్రాప్తించెడి, భేదత్రయం - స్వగతాదిభేదత్రయము, ఐక్యావధారణద్వైతప్రతిషేధైః=ఐక్య- ఏకత్వమును దెలుపునట్టియు, అవధారణ-ఒక్కటియేయని అవధారణార్థమును దెలుపునట్టియు. ద్వైతప్రతిషేధైః - రెండవవస్తువు లేదని దెలుపునట్టి, త్రిభిః-ఏకమేవాద్వితీయమనెడి మూడుపదములచేత, క్రమాత్ - క్రమముగా, నివార్యతే - నివారింపబడుచున్నది.

తా. వస్తుత్వసామాన్యత్వముచేత అనాత్మవస్తువగు వృక్షమునందు స్వగతసజాతీయ విజాతీయభేదములు మూడునుగలిగినట్లు సద్వస్తువగు పరమాత్మయందును ప్రాప్తించెడిఆమూడుభేదములను (ఒక్కటియేరెండవదిలేదనెడి) ఐక్యావధారణద్వైతనిషేధార్థములనుదెలిపెడి, శ్రు॥ ఏకమేవాద్వితీయం॥ అనెడిమూడుపదములచేత క్రమముగా శ్రుతి నివారింపజేయుచున్నది.

అవ. పరమాత్మకు అవయవములు లేమిచేతఆపరమాత్మవస్తువునందు స్వగతభేదమును శంకించుటకు శక్యముకాదని ఇప్పుడుజెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ సతో నావయవాశ్శంక్యా స్తదంశస్యానిరూపణాత్।
నామరూపేనతస్యాంశౌ తయోరద్యాప్యనుద్భవాత్॥ ౨౨.

టీ. తదంశస్య=తత్ - ఆపరమాత్మయొక్క, అంశస్య- అవయవముయొక్క, అనిరూపణాత్ -నిరూపణములేమివల్ల, సతః-పరమాత్మకు, అవయవాః-అవయవములు, శంక్యాః - శంకింపదగినవి, న- కావు. తయోః - ఆనామరూపములకు, అద్యాపి-ఇప్పుడును, అనగా సృష్టికిపూర్వకాలమందనుట. అనుద్భవాత్-ఉత్పత్తిలేమివల్ల, అంశౌ- అవయవములు, న-కావు

తా. ఆసద్వస్తువగుపరమాత్మ, నిరవయవుడగును. మరియు, ఆపరమాత్మకు, అవయవములు గలవనుటయందు, నేవిధమైనప్రమాణము లేదు. కనుక, ఆపరమాత్మయందు స్వగతభేదముగలదని శంకించుటకు శక్యముగాదు. ప్ర. అయితే, ప్రపంచముయొక్క నామరూపములురెండును సద్వస్తువునకు అవయవములగునని చెప్పరాదా యేమి?. ఉ. సృష్టికి పూర్వమందుజగత్తుకు నామరూపములు రెండును లేవు. కనుక, ఆనామరూపములురెండును, సద్వస్తువులయొక్క అవయవములని చెప్పరాదు.

శ్లో॥ నామరూపోద్భవస్యైవ సృష్టిత్వాత్సృష్టితఃపురా।
నతయోరుద్భవస్తస్మాన్నిరంశం సద్యథావియత్॥ ౨౩.

టీ. నామరూపోద్భవస్యైవ=నామరూప- నామరూపములయొక్క, ఉద్భవస్యైవ - ఉత్పత్తికే, సృష్టిత్వాత్ - సృష్టిత్వమగుటవల్ల, సృష్టితః - సృష్టికంటె, పురా- పూర్వమందు, తయోః- ఆనామరూపములకు, ఉద్భవః-ఉత్పత్తి, న-లేదు, తస్మాత్ - అందువల్ల, వియత్ - ఆకాశము, యథా - ఏప్రకారముగా, నిరంశం - నిరవయవమో, (తథా)ఆప్రకారము, సత్ - సద్వస్తువు, నిరంశం - నిరవయవమగును.

తా. ప్ర. అయితే, సృష్టికిపూర్వమందు నామరూపములులేక పోవుటకు కారణమేమి?. ఉ. నామరూపములయొక్క ఉత్పత్తియే, సృష్టియగుటవల్ల సృష్టికిపూర్వమందు ఆనామరూపములురెండును లేవు. కనుక, సద్వస్తువగు పరమాత్మ, ఆకాశమువలెనే, అవయవములేని వస్తువగుటవల్ల, స్వగతభేదములేనిదగుటకు తగునని తెలియవలెను. ఇట్లు సద్వస్తువునందు స్వగతభేదములేమిచేతనే, శ్రు॥ ఏకమేవాద్వితీయం॥ అనెడిశ్రుతి, ఏకశబ్దముచేత ఆస్వగతభేదమును నివారించుచున్నదని యభిప్రాయము.

శ్లో॥ సదంతరం సజాతీయంన వైలక్షణ్యవర్జనాత్।
నామరూపోపాధిభేదంవినా నైవ సతోభిదా॥ ౨౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ॥ వైలక్షణ్యావర్జనాత్=వైలక్షణ్య - విలక్షణత్వముయొక్క - వర్జనాత్ - లేమివలన, సదంతరం - మరియొకసద్వస్తువు . సజాతీయం - సజాతీయమైనది - న - కాదు. సతః - సద్వస్తువునకు, నామ రూపోపాధిభేదంవినా=నామరూప - నామరూపములయొక్క, ఉపాధిభేదంవినా - ఉపాధిభేదముతప్ప, భిదా - మరియొకభేదము, నైవ - లేనేలేదు.

తా ప్ర. సరి. సత్తునకు స్వగతభేదములేకపోవుగాక. సజాతీయభేదమైనను లేదాయేమి?. ఉ. సజాతీయమనగా, మరియొకసద్వస్తువని చెప్పవలయును. ఈసద్వస్తువుకంటె మరియొక సద్వస్తువు భేదమునుపొందని కారణమువల్ల, సత్తునకు సజాతీయభేదమును నిరూపించుటకు శక్యముగాదు. ప్ర. అయితే (సత్) అనెడిశబ్దమునకు ఉన్నదియని యర్థమగును. ఘటమున్నది. వస్త్రమున్నది. ఇత్యాదివ్యవహారములచేత సత్తునకుభేదమెట్లుగలిగెను? ఉ. ఆకాశమునకు ఘటమఠాద్యుపాధులచేత ఘటాకాశమఠాకాశములనెడి ఉపాధినిమిత్తక భేదములుగలిగినట్లు, సత్తునకును నామరూపవంతములైన ఆయాఘటాద్యుపాధులచేత భేదముగలిగెనేగాని వాస్తవముచేత సత్తునకు (స్వతః) భేదములేదు. కనుక, ఆయాఘటాది ఉపాధిని విమర్శించినపిమ్మట ఆకాశమునకు భేదముతోచనట్లు, నామరూపోపాధిని విమర్శించినయెడల సద్వస్తువునకు సజాతీయభేదములేనేలేదని స్పష్టముగాదోచును. కనుకనే, శ్రు॥ ఏకమేవాద్వితీయం॥ అనెడిశ్రుతి, ఏవ, అనెడి పదముచేత సజాతీయభేదములేదని నిరాకరించుచున్నదని యభిప్రాయము.

శ్లో॥ విజాతీయమసత్తత్తునఖల్వస్తీతిగమ్యతే।
నాస్యాతఃప్రతియోగిత్వంవిజాతీయాద్భిదాకుతః॥ ౨౫.

టీ. విజాతీయం - సద్వస్తువుకంటె నన్యమైనవిజాతీయవస్తువు, అసత్ - అసత్యవస్తువగును. తత్తు-అదియో, అస్తీతి-ఉన్నదని, నగమ్యతేఖలు - తెలియబడదుగదా. అతః - అందువల్ల, అస్య - ఈసద్వస్తువునకు, ప్రతియోగిత్వం - విరోధిత్వము, న - కాదు. విజాతీయాత్ - ఆయసత్యవస్తువువల్ల, భిదా - సత్తునకుభేదము, కుతః - ఎక్కడిది, అనగా లేనేలేదనుట.

తా. ప్ర. సరి. అగుగాక. సత్తునకు విజాతీయమువల్లనైనను భేదముగలుగదాయేమి?. ఉ. విజాతీయమనగా అన్యవస్తువగును. సత్తుకంటే నన్యవస్తువు, అసత్తని చెప్పబడును. అసత్తనగా లేనిదగును. మాయయు, మాయాకార్యమగు జగదాదికమంతయు అసత్యమగును. మరియు, అసత్యమై కనబడుచుండెడి వస్తువు మిథ్యయనిచెప్ప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడును. అట్టిమిథ్యారూప అసత్యవస్తువు లేనిదగుటచేత, అది సద్వస్తువునకు విరోధి గాదు. కనుక, విరోధిగాని యట్టిమిథ్యారూపమగు జగదాదికముచేత సత్తునకు విజాతీయభేదములేనేలేదు కనుకనే, శ్రు॥ ఏకమేవాద్వితీయం॥ అనెడిశ్రుతి, అద్వితీయ పదముచేత సత్తునకు విజాతీయభేదములేదని నిరాకరించుచున్నది.

అవ. ఇట్లు చెప్పుటచేత గలిగినఫలమును జెప్పుచు స్తంభమును దృఢముగా స్థాపించుటకొరకు భూమినిత్రవ్వుటయనెడి*స్థూణానిఖనన*న్యాయముచేత సద్వస్తువునకే అద్వితీయత్వమును దృఢీకరించుటకు ఇప్పుడు పూర్వపక్షమును జెప్పుచున్నాడు

శ్లో॥ ఏకమేవాద్వితీయంసత్సిద్ధమత్రతు కేచన ।
విహ్వలాఅసదేవేదంపురాసీదిత్యవర్ణయన్॥ ౨౬.

టీ. సత్-సద్వస్తువు, అద్వితీయం- రెండవదిలేనిదనియు, ఏకమేవ-ఒక్కటియే యైనదనియు, సిద్ధం- నిశ్చితమైనది. అత్రతు - ఈవిషయమందో, కేచన - కొందరు వాదులు, విహ్వలాస్సంతః - విహ్వలులైనవారగుచు, పురా - సృష్టికిపూర్వమందు, ఇదం-ఈజగంబంతయు, అసదేవ - శూన్యముగానే, ఆసీదితి-ఉండెనని, అవర్ణయన్- వర్ణించినవారైరి.

తా. ఈపైనచెప్పినప్రకారము సృష్టికిపూర్వమందు సద్వస్తువైన పరమాత్మకు సజాతీయవిజాతీయ స్వగతభేదములులేవనుట స్పష్టమాయెను. కనుకనే సృష్టికి పూర్వమందు రెండవదిలేని సద్వస్తువొక్కటియేయున్నదని, శ్రు॥ ఏకమేవాద్వితీయం॥ అనెడిశ్రుతి, సిద్ధాంతముజేసెను కొందరు బౌద్ధమతస్థులు విహ్వలచిత్తముగలవారై, శ్రు॥ సదేవసోమ్యేదమగ్రఆసీత్॥ అనెడి శ్రుతిసిద్ధార్థసద్వస్తు స్థితిగలిగియుండగా సృష్టికి పూర్వమందు ఈజగంబంతయు శూన్యముగానేయుండెనని వర్ణించిరి.

అవ. ఇప్పుడు విహ్వలశబ్దార్థమునకు దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ మగ్నస్యాబ్ధౌయథాక్షాణివిహ్వలానితథాస్యధీః।
అఖండైకరసంశ్రుత్వానిష్ప్రచారాబిభేత్యతః॥ ౨౭.

టీ. అబ్ధౌ - సముద్రమందు, మగ్నస్య - మునిగినవానియొక్క, అక్షాణి - ఇంద్రియములు, యథా - ఏప్రకారము, విహ్వలాని - భయముచేతనిశ్చేష్టితములగునో, తథా - ఆప్రకారము, అస్య - ఈశూన్యవాదియొక్క, ధీః-బుద్ధి, అఖండైకరసం= అఖండ-భేదములేని, ఏకరసం-సద్రూపబ్రహ్మవస్తువును, శ్రుత్వా-విని, నిష్ప్రచారాసతీ- సంచారములేనిదగుచు, అతః - ఈసద్వస్తువువల్ల, బిభేతి-భయమునుపొందుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. సముద్రమందు మునిగినవానియొక్క శ్రోత్రాదీంద్రియములు భయము చేత నిశ్చేష్టితములైనట్లు, ఈశూన్యవాదియొక్కబుద్ధియు, అఖండైకరససమాప్రబ్రహ్మవస్తువును, శ్రు॥ సదేవసోమ్యేదమగ్రఆసీత్ ఏకమేవాద్వితీయం॥ అనెడిశ్రుతిచేత విని, ఆకారముతోఁగూడినవస్తువునందు సంచరించినట్లు ఈ అద్వితీయసద్వస్తువునందు సంచరింపజాలక ఈసద్వస్తువువల్ల భయముగలదాయెను.

అవ. ఈయర్థమందు ఆచార్యసమ్మతిని ఇప్పుడుజూపుచున్నాడు.

శ్లో॥ గౌడాచార్యానిర్వికల్పే సమాధావన్యయోగినాం।
సాకారబ్రహ్మనిష్ఠానామత్యంతంభయమూచిరే॥ ౨౭.

టీ. గౌడాచార్యాః - గౌడాచార్యులు, నిర్వికల్పే-నిర్వికల్పమగు, సమాధౌ-సమాధియందు, సాకారబ్రహ్మనిష్ఠానాం=సాకారబ్రహ్మ - సవికల్పబ్రహ్మముయొక్క, నిష్ఠావాం-నిష్ఠగల, అన్యయోగినాం - ఇతరయోగులకు, అత్యంతం-మిక్కిలియధికమైన, భయం-భయమును, ఊచిరే-చెప్పిరి.

తా. సాకారబ్రహ్మధ్యాననిష్ఠులగు ఇతరయోగులకు నిర్వికల్పకసమాధియందు మిక్కిలిభయముగలిగియున్నదని గౌడాచార్యులు చెప్పిరి.

అవ. ఏవాక్యముచేతచెప్పిరనగా ఆవార్త్తికమునిప్పుడు పఠింపుచున్నాడు.

శ్లో॥ అస్పర్శయోగోనామైషదుర్దర్శస్సర్వయోగిభిః।
యోగినోబిభ్యతిహ్యస్మాదభయేభయదర్శినః॥ ౨౮.

టీ. అస్పర్శయోగః - అస్పర్శయోగమనెడి, నామ - ప్రసిద్ధిగల - ఏషః-ఈ నిర్వికల్పకసమాధి, సర్వయోగిభిః - సాకారధ్యాననిష్ఠులచేత, దుర్దర్శః - పొందుటకు శక్యముగానిదగును. హి-ఏకారణమువల్ల, యోగినః-సాకారధ్యాననిష్ఠులు, అభయే-భయములేనినిర్వికల్పకసమాధియందు, భయదర్శినః - భయహేతుత్వమునుకల్పించినవారగుచు, అస్మాత్-ఈనిర్వికల్పకసమాధివల్ల, బిభ్యతి-భయమునుపొందుచున్నారో.

తా. ఈనిర్వికల్పకసమాధి అస్పర్శయోగమనెడి ప్రసిద్ధిగలదియగును. ఈనిర్వికల్పకసమాధిని సాకారధ్యాననిష్ఠులగు ఇతరయోగులుపొందజాలరు. ప్ర. అయితే, వారుపొందజాలమికి కారణమేమి ?. ఉ. నిర్జనప్రదేశమందు బాలురుభయహేతుత్వమునుకల్పించుకొని భయమునుపొందినట్లు సాకారధ్యాననిష్ఠులగు ఇతరయోగులును,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్భయమైన ఈనిర్వికల్పకసమాధియందు భయమునుకల్పించుకొని ఈనిర్వికల్పకసమాధివల్ల భయమునుపొందిరని గౌడాచార్యులుచెప్పిరి.

అవ. ఈయర్థమును శ్రీశంకరాచార్యులును చెప్పిరని ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ భగవత్పూజ్యపాదాశ్చ శుష్కతర్కపటూనమూన్।
అహుర్మాధ్యమికాన్ భ్రాంతానచింత్యేఽస్మిన్ సదాత్మని॥ ౩౦.

టీ. భగవత్పూజ్యపాదాశ్చ-శ్రీశంకరాచార్యులును, అచింత్యే-చింతించుటకు శక్యముగాని, అస్మిన్-ఈ, సదాత్మని-సద్రూపపరమాత్మవిషయమై, శుష్కతర్కపటూన్=శుష్కతర్క-శుష్కించినతర్కములచేత, పటూన్-సమర్థులగు, అమూన్-ఈ, మాధ్యమికాన్-బౌద్ధులను, భ్రాంతాన్-భ్రమించినవారినిగా, ఆహుః-చెప్పిరి.

తా. మరియు అవాఙ్మానసగోచరుడైన ఈసద్రూపపరమాత్మవిషయమై సాకారధ్యాననిష్ఠులగు బౌద్ధులుభ్రమించిరనియు, శుష్కతర్కములచేత సమర్థులవలె ఆ బౌద్ధులువాదించెదరనియు, ఇట్లు శ్రీశంకరాచార్యులుచెప్పిరి.

అవ. ఆశంకరాచార్యవార్తికము నిప్పుడుపఠింపుచున్నాడు.

శ్లో॥ అనాదృత్యశ్రుతిం మౌర్ఖ్యాదిమే బౌద్ధాస్తమస్వినః।
ఆపేదిరే నిరాత్మత్వమనుమానైకచక్షుషః॥ ౩౧.

టీ. తమస్వినః-తాపసులగు, ఇమే-ఈ, బౌద్ధాః-శూన్యవాదులు, మౌర్ఖ్యాత్-మూర్ఖత్వమువల్ల, శ్రుతిం-శ్రుతిని, అనాదృత్య-నిరాకరించి, అనుమానైకచక్షుషః=అనుమాన - అనుమానమే, ఏక-ముఖ్యమైన, చక్షుషః-నేత్రముగాగలవారగుచు, నిరాత్మత్వం-శూన్యభావమును, ఆపేదిరే-పొందిరి.

తా. ఈతాపసులగు బౌద్ధులు, మూర్ఖత్వముచేత, శ్రు॥ సదేవసోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం॥ అనెడి ఇత్యాదిశ్రుతినినిగ్రహించి అనుమానమేముఖ్యనేత్రముగా గలవారగుచు బుద్ధికిసాక్షియగు ఆత్మనంగీకరింపక శూన్యభావమునుపొందిరని శ్రీశంకరాచార్యులుచెప్పిరి.

అవ. ఇప్పుడు సిద్ధాంతి, శూన్యవాదమునువికల్పించి దూషించుచున్నాడు.

శ్లో॥ శూన్యమాసీదితి బ్రూషే సద్యోగం వా సదాత్మతాం।
శూన్యస్యనతుతద్యుక్తముభయం వ్యాహతత్వతః॥ ౩౨.

టీ. శూన్యం - శూన్యము, ఆసీదితి - ఉండెననెడివాక్యముచేత, శూన్యస్య -

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శూన్యమునకు, సద్యోగం=సత్ - సత్తాజాతితోటి, యోగం - సంబంధమును, బ్రూషే-చెప్పుచున్నావో, సదాత్మతాం - సద్రూపభావమును, బ్రూషే-చెప్పుచున్నావో, (బ్రూహి) చెప్పుము. తదుభయంతు-ఆరెండును, శూన్యస్య-శూన్యమునకు, వ్యాహతత్వతః - విరోధమగుటవల్ల, నయుక్తం - యుక్తముకాదు.

తా. ఓశూన్యవాదీ నీవు సృష్టికిపూర్వమందు శూన్యమేఉండెనని చెప్పితివి. శూన్యమనగాలేనిదగును. ఉండెననగా, సత్తనెడిశబ్దముయొక్క అర్థమగును. శూన్యమేఉండెననెడిఈవాక్యముచేత శూన్యమునకు, ౧. సత్తాజాతితోటి సంబంధమును చెప్పెదవో, లేక ౨. సద్రూపభావమును చెప్పెదవో చెప్పుము. శూన్యమనునది అభావమగుటవల్ల, ఈరెండువిధములును శూన్యమునకువిరోధములగును. కనుక శూన్యము సత్తాజాతితోటి సంబంధముగలిగియున్నదనియైనను, సద్రూపత్వమునుబొందియున్నదనియైనను చెప్పుటయుక్తముకాదు.

అవ. ఆవిరోధమునేదృష్టాంతపూర్వకముగా నిప్పుడుజూపుచున్నారు.

శ్లో॥ నయుక్తస్తమసాసూర్యోనాపిచాసౌతమోమయః।
సచ్ఛూన్యయోర్విరోధిత్వాచ్ఛూన్యమాసీత్కథంవద॥ ౩౩.

టీ. సూర్యః-సూర్యుడు, తమసా-చీకటితోటి, యుక్తః-కూడియుండువాడు, న-కాడు. అసౌ - ఈసూర్యుడు, తమోమయశ్చాపి - అంధకారస్వరూపుడును, న-కాడు. సచ్ఛూన్యయోః=సత్ - ఉండెడివస్తువునకును, శూన్యయోః - లేనిదానికిని, విరోధిత్వాత్ - విరోధముగలిగియుండుటవల్ల, శూన్యం - శూన్యము, కథం - ఎట్లు, ఆసీత్ - ఉండెనో, వద - చెప్పుము. అనగా శూన్యముండెననిచెప్పరాదనుట.

తా. అంధకారమునకును సూర్యునకునువిరోధమగును. కనుక సూర్యుడంధకారముతోగూడియుండడు. మరియు సూర్యుడంధకారస్వరూపుడును కాడు. అటువలెనే సత్తనగానుండెడివస్తువగును. శూన్యమనగాలేనిదగును. అట్టిసద్వస్తువునకును శూన్యమునకును విరోధమగుటవల్ల, శూన్యమెట్లుండెనో చెప్పుము. అనగా శూన్యముండెనని చెప్పరాదనియభిప్రాయము.

శ్లో॥ వియదాదేర్నామరూపేమాయయాసువికల్పితే।
శూన్యస్యనామరూపేచతథాచేజ్జీవ్యతాందిరం॥ ౩౪.

టీ. వియదాదేః - ఆకాశాదిభూతపంచకముయొక్క, నామరూపే-నామరూపములురెండును, మాయయా - మాయాశక్తిచేత, సువికల్పితే-బ్రహ్మమందుకల్పించ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడినది. శూన్యస్య - శూన్యముయొక్క, నామరూపేచ - నామరూపములు రెండును, తథా చేత్ -మాయచేత బ్రహ్మమందుకల్పించబడెనని అంటివేని, చిరం-దీర్ఘకాలము, జీవ్యతాం-జీవింపబడు గాక.

తా. ప్ర. అయితే, మీఅద్వైతమత ప్రకారము నిర్వికల్పబ్రహ్మమందు ఆకాశాది పంచభూతములుండుట విరోధముకాదాయేమి?. ఉ. నిర్వికల్ప బ్రహ్మమందు ఆకాశాదిపంచభూతములయొక్క నామరూపములను మాయాశక్తికల్పించినది. కనుక, విరోధములేదు. ప్ర. అయితే, అట్లైనయెడల శూన్యముయొక్క నామరూపములను రెంటిని సద్వస్తువునందు మాయాశక్తి కల్పించినదని చెప్పవచ్చునుగదా? ఉ. ఓబౌద్ధుడా, అట్లైనయెడల నీవుదీర్ఘాయుష్మంతుడవుగమ్ము. అనగా అట్లుచెప్పినయెడల బౌద్ధునియొక్క శూన్యరుతమపసిద్ధాంతమాయెనని సిద్ధాంతి యభిప్రాయము.

శ్లో॥ సతోపినామరూపే ద్వేకల్పితే చేత్తదావద।
కుత్రేతినిరధిష్ఠానోనభ్రమః క్వచిదీక్ష్యతే॥ ౩౫.

టీ. సతోపి-సద్వస్తువునకును, ద్వే-రెండైన, నామరూపే - నామరూపములు, కల్పితేచేత్ - కల్పించబడినవని యంటివేని, తదా-అప్పుడు, కుత్రేతి - ఎచ్చటకల్పించబడినవని చెప్పెదవో, వద - చెప్పుము. నిరధిష్ఠానః - ఆధారవస్తువులేని, భ్రమః - భ్రాంతి, క్వచిత్ - ఎచ్చటను, నేక్ష్యతే లోకమందుకనబడలేదు.

తా. ప్ర. అయితే, మీ అద్వైతమతమందు వస్తుసంబంధములైన నామరూపములు రెండును లేమిచేత శూన్యముయొక్క నామరూపములు రెండును బ్రహ్మమందు మాయచేత కల్పించబడినట్లు సద్వస్తువునకు నామరూపములును కల్పించబడినవేయని యంగీకరించరాదాయేమి?. ఉ. ఓబౌద్ధుడా, సద్వస్తువగు నిర్వికల్పబ్రహ్మమందు ఆకాశాది పంచభూతములయొక్క నామరూపములను రెంటిని మాయాశక్తి కల్పించినదని చెప్పితిమేగాని, సద్వస్తువునకు నామరూపములు కల్పించబడినట్లు చెప్పలేదు. మరియు, సద్వస్తువునకు నామరూపములు కల్పించబడినవని నీవుచెప్పెడిపక్షమందు ఆసద్వస్తువుయొక్క నామరూపములు రెండును, ౧. ఆసద్వస్తువునందే కల్పించబడినవో, లేక, ౨. శూన్యమందు కల్పించబడినవో, లేక, ౩. జగంబునందు కల్పించబడినవో చెప్పుము. లోకమందు అన్యములైన రజతాదివస్తువులయొక్క నామరూపములు రెండును, అన్యములైన శుక్తికాదులయందు భ్రాంతిచేత నారోపింపబడుచున్న వేగాని, రజతాదులయొక్క నామరూపములురెండును, ఆరజతాదులయందే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భ్రాంతిచేతనారోపింపబడినట్లు కనబడలేదు. కనుక, సద్వస్తువుయొక్క నామరూపము లురెండును, ఆసద్వస్తువునందే కల్పించబడినవని చెప్పరాదు. మరియు, శూన్యమనునది స్వరూపము లేనిదగును. అట్టి అభావమగు శూన్యము భ్రాంతికి నాధారవస్తువుకానే రదు. కనుక, సత్తుయొక్క నామరూపములు రెండును శూన్యమందు కల్పించబడినవని చెప్పరాదు. మరియు, సద్వస్తువగు బ్రహ్మమువల్ల జగంబుపుట్టెను. అట్టిజగంబునందు సద్వస్తువుయొక్క నామరూపములు రెండును భ్రాంతిచేత కల్పించబడినవని చెప్పిన యెడల, ఆసద్వస్తువుయొక్క నామరూపారోపణమునకు జగంబు ఆధారమైయుండె నని చెప్పవలసివచ్చును. అట్లుచెప్పరాదు. ప్ర. అదియేమి?. ఉ. కారణమగు సద్వస్తువువల్ల బుట్టినజగంబు తనకుకారణమైన సద్వస్తువుయొక్క నామరూపములను తనయందారోపించుకొనుటకు నాధారముకాజాలదు. కనుక, ముందుచెప్పబడిన మూ డుపక్షములును యుక్తములుగావు. ప్ర. అయితే, సద్వస్తువునకు నామరూపములు రెండును కల్పించబడెడివిషయమై ఆధారవస్తువు లేకపోయినను ఆ సద్వస్తువుయొక్క నామరూపములు రెండును భ్రాంతిచేత కల్పించబడెనని చెప్పుటవల్ల దోషమేమి?. ఉ. లోకమందు భ్రాంతికి నిమిత్తమైన ఆధారవస్తువులేకనే, అట్టిభ్రాంతి ఎచ్చటను కన బడలేదు. కనుక, సద్వస్తువునకు నామరూపములు కల్పించబడెనని చెప్పరాదని యభిప్రాయము.

శ్లో॥ సదాసీదితిశబ్దార్థభేదేవైగుణ్యమాపతేత్।
అభేదేపునరుక్తిస్స్యాన్మైవంలోకేతథేక్షణాత్॥ ౩౬.

టీ. సత్ - ఉండునది, ఆసీత్ - ఉండెను. ఇతి - ఇట్లనెడి, శబ్దార్థభేదే= శబ్ద - రెండుపదములయొక్క, అర్థభేదే - అర్థభేదపక్షమందు, వైగుణ్యం - అద్వైత విరోధము, ఆపతేత్ - ప్రాప్తించును. అభేదే - అర్థభేదములేనిపక్షమందు, పునరుక్తిః - పునరుక్తిదోషమును, స్యాచ్చేత్ - కలుగుననియంటివేని, లోకే - లోకమందు, తథా - అప్రకారము, ఈక్షణాత్ - దోషములేని పునరుక్తి ప్రయోగములు కనబడు చుండుటవల్ల, మైవం - ఇట్లు ఆక్షేపింపరాదు.

తా. ప్ర. అయితే, ఓఅద్వైతసిద్ధాంతీ, సృష్టికిపూర్వమందు శూన్యముండెనని చెప్పితిమి. అందుకు మీరుసహింపక శూన్యమెట్లుండునని ఆక్షేపించి విరోధమును చెప్పితిరి. మరియు, మీరు సృష్టికిపూర్వమందు సత్తేయుండెనని, శ్రు॥ సదేవసోమ్యే దమగ్రఆసీత్॥ అనెడి శ్రుతిని వర్ణించితిరి. అశ్రుతియందుగల, (సత్ ఆసీత్) అనెడి రెండుపదములకును ఉండునది ఉండెనని యర్థమగును. ఆరెండుపదములకును అర్థభే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దముకలదో లేదో చెప్పుము. అర్థభేదమున్నయెడల రెండువస్తువులగుటచేత అద్వైతో హానియగును. మరియు అర్థభేదములేనియెడల పునరుక్తి దోషముకలుగును. కనుక మేమువర్ణించిన అర్థమునకెట్లు విరోధమునుచెప్పితిరో అటువలెనే మీరువర్ణించిన అర్థమునకును దోషములేదాయేమి? ఉ. ఓశూన్యవాదీ, పూర్వోక్త శ్రుతియందుగల (సత్ ఆసీత్) ఉండునది ఉండెననెడి రెండుపదములకును అర్థభేదములేదు. కనుక, అద్వైతవిరోధములేదు. ప్ర. అయితే, ఆరెండుపదములకును ఏకార్థత్వము గలిగెడి పక్షమందు చెప్పినది మరలచెప్పుటయనెడి, (పునరుక్తిదోషము) కలుగదాయేమి? ఉ. లోకమందిట్టి ప్రయోగపదములుండుటవల్ల పునరుక్తిదోషములేదని తెలిసికొనుము.

శ్లో॥ కర్తవ్యంకురుతేవాక్యంబ్రూతేధార్యస్యధారణం।
ఇత్యాదివాసనావిష్టంప్రత్యాసీత్సదితీరణం॥ ౩౭.

టీ. కర్తవ్యం - చేయదగినకార్యమును, కురుతే - చేయుచున్నాడు. వాక్యం- వాక్యమును, బ్రూతే - చెప్పుచున్నాడు. ధార్యస్య - ధరించదగిన పదార్థముయొక్క, ధారణం-ధారణమగుచున్నది. అనగా ధరించదగినదానిని ధరించుచున్నాడనుట. ఇత్యాదివాసనావిష్టం ప్రతి = ఇత్యాది - ఇవిమొదలగు లౌకికవాక్యప్రయోగములయొక్క, వాసనావిష్టంప్రతి-సంస్కారముతోగూడినశిష్యునిగురించి, సత్ -ఉండునది, ఆసీదితి- ఉండెనని, ఈరణం - చెప్పుటయగును.

తా. ప్ర. అయితే లోకమందిట్టి ప్రయోగములయందు పునరుక్తి దోషములేని స్థలమెద్ది? ఉ. చేయదగినకార్యమును చేయుచున్నాడనియు, వాక్యమునుచెప్పుచున్నాడనియు, ధరించదగినదానిని ధరించుచున్నాడనియు, నిట్లు లోకమందు ప్రయోగములుగలవు. ఈప్రయోగములయందు పునరుక్తిదోషమును చెప్పరాదు. ప్ర. సరి. లోకమందిట్టి ప్రయోగములుండుగాక, ఇట్లు చెప్పుటచేత శ్రుతియందు లాభమేమి? ఉ. ఇట్టి లోకవ్యవహారసంస్కారముతోగూడిన శిష్యునిబోధించుటకొరకు, ముందు చెప్పబడిన శ్రుతియందు (సత్ ఆసీత్) ఉండెడివస్తువు ఉండెననిచెప్పబడెను. కనుక, పునరుక్తిదోషములేదు.

శ్లో॥ కాలాభావేపురేత్యుక్తిఃకాలవాసనయాయుతం।
శిష్యంప్రత్యేవతేనాత్రద్వితీయంనహిశంక్యతే॥ ౩౮.

టీ. కాలాభావే=కాల-అద్వితీయ వస్తువునందు భూతకాలముయొక్క, అభావేసతి-అభావమగుచుండగా, పురేత్యుక్తిః - సృష్టికి పూర్వమందనిచెప్పుట, కాలవాస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నయా - కాలసంస్కారముతోఁటి, యుతం - కూడియున్న, శిష్యంప్రత్యేవ - శిష్యుని గురించియేయగును. తేన-అట్లుచెప్పుటచేత, అత్ర-ఈసద్వస్తువునందు, ద్వితీయం-రెండవవస్తువు, నహిశంక్యతే-శంకింపబడదు.

తా. ప్ర. అయితే, అద్వితీయవస్తువునందు పూర్వకాలములేదు. అట్లులేనప్పుడు, శ్రు॥ సదేవ॥ ఇత్యాదిశ్రుతిచేత, (అగ్రఆసీత్) పూర్వమందుండెనని యెట్లుచెప్పబడెను? ఉ. అద్వితీయవస్తువునందు కాలములేకపోయినను, కాలసంస్కారములో గూడియున్న శిష్యుని బోధించెడి నిమిత్తమై (అగ్రఆసిత్) సృష్టికిపూర్వమందుండెనని శ్రుతి చెప్పెను. కనుక దోషములేదు. ప్ర. అయితే, జగదుత్పత్తికి పూర్వమందు జగంబులేదని చెప్పుటచేత బ్రహ్మమునకు ద్వితీయవస్తువుతోఁటి సంబంధము కలుగదాయేమి? ఉ. ద్వైతసంస్కారముతో గూడియుండెడి శిష్యుని బోధించెడి నిమిత్తమై శ్రుతి ప్రవర్తించి సృష్టికిపూర్వమందు సద్వస్తువొక్కటితప్ప, మరియొద్దియులేదని తెలిపెను. అందుచేత బ్రహ్మము సద్వితీయమని శంకించుట అధికప్రసంగమగును.

అవ. ఇప్పుడు సిద్ధాంతరహస్యమును జెప్పుచున్నాడు.

శ్లో॥ చోద్యం వా పరిహారో వా క్రియతాం ద్వైతభాషయా।
అద్వైతభాషయా చోద్యం నాస్తి నాపి తదుత్తరం॥ ౩౯.

టీ. చోద్యంవా - చోద్యమైనను, పరిహారోవా - పరిహారమైనను, ద్వైతభాషయా - వ్యవహారదశచేత, క్రియతాం-చేయబడుగాక. అద్వైతభాషయా-అద్వైతదశచేత, చోద్యం - చోద్యము, నాస్తి-లేదు. తదుత్తరమపి=తత్-ఆచోద్యమునకు, ఉత్తరమపి-సమాధానమైనను, న - లేదు.

తా. వ్యవహారదశయందు పూర్వపక్షసిద్ధాంతములు చేయబడుచుండును. అద్వైతదశయందు పూర్వపక్షమైనను, అందుకుసమాధానమైననులేదు. అనగా, పరమార్థమందు అద్వైతస్వరూపమే వాస్తవమని యభిప్రాయము.

అవ. పరమార్థమందు ద్వైతములేదని, ఇప్పుడు స్మృతి ప్రమాణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ తదా స్తిమితగంభీరం న తేజో న తమస్తతం।
అనాఖ్యమనభివ్యక్తం సత్కించిదవశిష్యతే॥ ౪౦.

టీ. తదా - పరమార్థదశయందు, స్తిమితగంభీరం=స్తిమిత-నిశ్చలమైనట్టియు, గంభీరం-దురవగాహమైనట్టియు, అనగా మనస్సుచేత విషయీకరించుటకు శక్యముగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విదనుట. నతేజః-తేజోభావమునకు ఆధారముకానట్టియు, నతమః-తమస్సుకంటె విలక్షణమైనదియు అనగా నావరించనిదియనుట. తతం-వ్యాప్తమైనట్టియు, అనాఖ్యం-వ్యాఖ్యానించుటకు శక్యముగానట్టియు, అనభివ్యక్తం - చక్షురాది ఇంద్రియముల చేత గ్రహించబడనట్టియు, సత్ - శూన్యవిలక్షణమైనట్టియు, కించిత్ - ఇదియని నిర్దేశించుటకు శక్యముగాని నిర్వికల్ప బ్రహ్మవస్తువు, అవశిష్యతే - శేషింపబడుచున్నది. అనగా ద్వైతనిషేధావధిత్వముచేత మిగులుచున్నదనుట.

తా. పరమార్థమగు అద్వైతదశయందు సకలద్వైతమును నిషేధించుటచేత ద్వైతనిషేధమునకు అవధిగా సద్వస్తువగు నిర్వికల్పబ్రహ్మము శేషించియుండును. ఆనిర్వికల్పబ్రహ్మవస్తువు నిశ్చలమైనదగును. మనస్సుచేత విషయీకరించుటకు శక్యముగానిదగును. తేజోభావమునకు నాధారముకానిదగును. అంధకారముకంటె విలక్షణమైనదగును. అనగా ఆవరణస్వభావములేని వ్యాపకమగును. వాక్కుచేత జెప్పుటకు శక్యముగానిదగును. నేత్రాదీంద్రియములచేత విషయీకరించుటకు శక్యముగానిదగును. శూన్యముకంటె నన్యమైనదగును. కనుకనే ఇదియనుటచేత నిర్ణయించుటకు శక్యముగానిదగును. ఇటువంటి సద్వస్తువగు బ్రహ్మము పరమార్థమందు శేషించియుండునని స్మృతిజెప్పుచున్నది. కనుక పరమార్థమగు అద్వైతదశయందు ద్వైతములేదని తెలియవలెను.

అవ. ఇప్పుడు పూర్వవాది శంకించుచున్నాడు.

శ్లో॥ ననుభూమ్యాదికంమాభూత్పరమాణ్వంతనాశతః।
కథంతేవియతోఽసత్వంబుద్ధిమారోహతీతిచేత్॥ ౬౧.

టీ. నను - ఓయీ, భూమ్యాదికం - భూమిమొదలగు భూతచతుష్టయము, పరమాణ్వంతనాశతః=పరమాణ్వంత - పరమాణురూపములచేత, నాశతః=నశించుటవలన, మాభూత్ -సృష్టికిపూర్వమందు లేకపోవుగాక. వియతః-ఆకాశముయొక్క, అసత్వం - లేమి, తే-నీయొక్క, బుద్ధిం - బుద్ధిని, కథం - ఎట్లు, ఆరోహతి - ఎక్కుచున్నది. అనగా నాశ్రయించుచున్నదనుట. ఇతిచేత్ ఇట్లంటివేని చెప్పెదవినుము.

తా. ఓ అద్వైతసిద్ధాంతీ, పృథివ్యప్తేజో వాయువులనెడినాలుగుభూతములును పుట్టినవగుటచేత ననిత్యములగును. కనుక ఆభూతములు నాలుగును ప్రళయకాలమందు పరమాణురూపములగుచు తుదకు నశించును. అందువల్ల నా నాలుగుభూతములును సృష్టికిపూర్వమందులేనివేయగును. ఆకాశమునకు నుత్పత్తిలేమిచేత నాయాకాశము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిత్యమగును. అట్టియాకాశము సృష్టికిపూర్వమందు లేదనెడి విషయము, నీబుద్ధిని యెట్లాశ్రయించెనో జెప్పుము.?

అవ. ఇట్లు పూర్వవాదియడుగగా సిద్ధాంతిదృష్టాంతావష్టంభముచేత నాశంకను పరిహరించుచున్నాడు.

శ్లో॥ అత్యంతంనిర్జగద్వ్యోమయథాదౌబుద్ధిమాశ్రితం।
తథైవసన్నిరాకాశంకుతోనాశ్రయతేమతిం॥ ౭౨.

టీ. అత్యంతం- మిక్కిలి, నిర్జగత్ - జగంబులేని, వ్యోమ-ఆకాశము, ఆదౌ - సృష్టికి పూర్వమందున్నట్లు, బుద్ధిం-నీబుద్ధిని, యథా - ఏప్రకారము, ఆశ్రితం - ఆశ్రయించియుండెనో, తథైవ - ఆప్రకారమే, నిరాకాశం - ఆకాశములేని, సత్-సద్వస్తువు, కుతః - ఎందువల్ల, మతిం - నీబుద్ధిని, నాశ్రయతే- అశ్రయింపదు.

తా. ఓయి పూర్వవాదీ, సృష్టికి పూర్వమందు భూమ్యాది జగంబులేని యాకాశముమాత్రమేయున్నట్లు, నీబుద్ధికిదోచెను. అటువలెనే సృష్టికిపూర్వమందు ఆకాశములేనిసద్వస్తువుమాత్రమేయున్నట్లు నీబుద్ధికితోచకుండుటకుకారణమేమో జెప్పుము.

శ్లో॥ నిర్జగద్వ్యోమదృష్టంచేత్ప్రకాశతమసీవినా।
క్వదృష్టంకించతేపక్షేనప్రత్యక్షంవియత్ఖలు॥ ౭౩.

టీ. నిర్జగత్ - జగంబులేని, వ్యోమ - ఆకాశము, దృష్టంచేత్ - కనబడుచున్నదంటివేని, ప్రకాశతమసీవినా - ప్రకాశాంధకారములను రెంటిని విడిచించి, క్వ- ఎచ్చట. దృష్టం-కనబడుచున్నది. అనగా కనబడుచుండలేదనుట. కించ-ఇదియునుంగాక, తే- నీయొక్క, పక్షే - మతమందు, వియత్ - ఆకాశము, నప్రత్యక్షంఖలు - ప్రత్యక్షముకాదుగదా.

తా. ప్ర. న్యాయం॥ నహిదృష్టేతదనుపపన్నం॥ అనెడిన్యాయప్రకారము కనబడుచున్నదానిని లేదనిచెప్పరాదు. గనుక జగంబులేని ఆకాశము కనబడుచుండలేదాయేమి? ఉ. ప్రకాశాంధకారములను రెంటిని విడిపించి యాకాశమెక్కడను కనబడలేదు, అనగా ప్రకాశాంధకారముల నాశ్రయించియే ఆకాశము కనబడుచున్నదిగాని ప్రకాశాంధకారములు తోచనిసమయమందు ఆకాశము కనబడనేరదని యభిప్రాయము. ఇదియునుంగాక నీమతమందాకాశము ప్రత్యక్షముగ మిచేత నీసిద్ధాంతమపసిద్ధాంతమగును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ సద్వస్తుశుద్ధంత్వస్మాభిర్నిశ్చిత్తైరనుభూయతే।
తూష్ణీంస్థితౌనశూన్యత్వం శూన్యబుద్ధేశ్చవర్జనాత్॥ ౨౪.

టీ. శుద్ధం - పరిశుద్ధమైన, సద్వస్తుతు - బ్రహ్మవస్తువో, నిశ్చిత్తైః - అమనస్కులమగు, అస్మాభిః - మాచేత, తూష్ణీంస్థితౌ - తూష్ణీంస్థితియందు, అనుభూయతే - ప్రత్యక్షముగా ననుభవింపబడుచున్నది. తూష్ణీంస్థితౌ-తూష్ణీంభావమందు, శూన్యబుద్ధేశ్చ - శూన్యబుద్ధియొక్క, వర్జనాత్ - లేమివల్ల, శూన్యత్వం - శూన్యత్వము, న - సంభవింపదు.

తా. ప్ర. అయితే, ప్రత్యక్షముగాకపోవుట, సద్వస్తువునందును సామ్యము గాదాయేమి? ఉ. తూష్ణీంభావమందు అమనస్కులమగు మాచేత సద్వస్తువు ప్రత్యక్షముగా ననుభవింపబడుచున్నది. ప్ర. అయితే, తూష్ణీంభావమందితర మెద్దియు స్ఫురింపమిచేత అప్పుడు శూన్యమేనని చెప్పరాదాయేమి. ఉ. ఆతూష్ణీంభావమందు శూన్యమేననెడి శూన్యవిషయమైన బుద్ధిలేమివల్ల నక్కడ శూన్యత్వము సంభవింపదు.

శ్లో॥ సద్బుద్ధిరపిచేన్నాస్తిమాస్త్వస్యస్వప్రభత్వతః।
నిర్మనస్కత్వసాక్షిత్వాత్సన్మాత్రంసుగమంనృణాం॥ ౨౫.

టీ. సద్బుద్ధిరపి - సద్వస్తువిషయమైన బుద్ధియు, నాస్తిచేత్ - లేదంటివేని, అస్య - ఈసద్వస్తువునకు, స్వప్రభత్వతః - స్వప్రకాశత్వము గలిగియుండుటవల్ల, మాస్తు - సద్వస్తువిషయమైన బుద్ధిలేకపోవుగాక. నిర్మనస్కత్వసాక్షిత్వాత్ = నిర్మనస్కత్వ - అమనస్కత్వముయొక్క, సాక్షిత్వాత్ - సాక్షియగుటవల్ల, నృణాం - జనులకు, సన్మాత్రం - సద్వస్తుమాత్రము, సుగమం - అనాయాసముగా తెలియ తగినది.

తా. ప్ర. అయితే తూష్ణీంభావమందు సద్వస్తువిషయమైన బుద్ధిలేమిచేత అప్పుడు సద్వస్తువున్నట్లైనను ఘటింపబడదుగదా? ఉ. ఈసద్వస్తువు స్వప్రకాశరూపమగుటవల్ల ఆతూష్ణీంభావమందు సద్వస్తువిషయమైన బుద్ధిలేకపోవుట మాకిష్టమేయగును. ప్ర. అయితే తనవిషయమైన బుద్ధిలేనప్పుడు ఆసద్వస్తువును పొందుటకుశక్యమెట్లగును? ఉ. ఆతూష్ణీంభావమందు మనోరాహిత్యమును గురించిసద్వస్తువు బోధస్వరూపముచేత సాక్షిగానున్నది. అట్టిఅమనస్కత్వ సాక్షిత్వము సద్వస్తువునకు గలిగియుండుటవల్ల, అప్పుడుసద్వస్తువున్నదని, జనులుసులభముగా నెరుగగలరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు నిష్ప్రపంచ రూపుడైనసాక్షికి తూష్ణీంభావమందు స్ఫురణమును జూపి, ఈదృష్టాంత బలముచేత సృష్టికి పూర్వమందు నాప్రకారమే సద్వస్తువున్నట్లు ఎరుగుటకు శక్యమగునని ఇప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ మనోజృంభణరాహిత్యే యథా సాక్షీ నిరాకులః।
మాయాజృంభణతః పూర్వం సత్తథైవ నిరాకులం॥ ౭౮.

టీ. మనోజృంభణరాహిత్యే సతి=మనోజృంభణ- మనోవిజృంభణముయొక్క, రాహిత్యే సతి - అభావమగుచుండగా, యథా-ఏప్రకారము, సాక్షీ - ప్రత్యగాత్మ, నిరాకులః - నిర్వికారముగా స్ఫురించుచున్నాడో, తథైవ-ఆప్రకారమే, మాయాజృంభణతః=మాయా-మాయయొక్క, జృంభణతః - విజృంభణముకంటె, పూర్వం - పూర్వమందు, సత్ - సద్వస్తువు, నిరాకులం - నిర్వికారముగా నుండెనని తెలియవలెను.

తా. తూష్ణీంభావమందు మనంబునకువృత్తులులేమిచేత సాక్షియైన ప్రత్యగాత్మ నిర్వికారముగా స్ఫురించినట్లు, సృష్టికిపూర్వమందును మాయకు విజృంభణములేమిచేత అప్పుడు సద్వస్తువును నిర్వికారముగా నుండెనని తెలియవలెను. విశేషాకారముగా పరిణమించుటయే విజృంభణమని తెలియవలెను.

అవ. మాయకులక్షణమేమనగా నిప్పుడుజెప్పుచున్నాడు.

శ్లో॥ నిస్తత్త్వా కార్యగమ్యాస్య శక్తిర్మాయాగ్నిశక్తివత్।
నహి శక్తిం క్వచిత్కశ్చిద్బుధ్యతే కార్యతః పురా॥ ౭౭.

టీ. అగ్నిశక్తివత్=అగ్ని- అగ్నియొక్క, శక్తివత్ - స్ఫోటాదికార్యజనన సామర్థ్యమువలె, నిస్తత్త్వా-సద్వస్తువుకంటెనన్యస్వరూపములేనట్టియు, కార్యగమ్యా= కార్య- ఆకాశాదికార్యచిహ్నమువల్ల, గమ్యా-తెలియదగినదియు, అస్య - ఈసద్వస్తువుయొక్క, శక్తిః-ఆకాశాదికార్య జననసామర్థ్యము, మాయా - మాయయని చెప్పబడును. కార్యతః - కార్యముగలుగుటకంటె, పురా - పూర్వము, శక్తిం-ఆమాయావస్తుసామర్థ్యమును, క్వచిత్ - ఎచ్చటైనను, కశ్చిత్ - ఎవ్వడైనను, నబుధ్యతేహి- ఎరుగడుగదా.

తా. బ్రద్దలుచేయుట మొదలగు గురుతుగలకార్యమును గలిగించెడి యుష్ణశక్తి అగ్నియందున్నట్లు ఈసద్వస్తువునందు ఆకాశాది చిహ్నముగలకార్యమును గలిగించెడిశక్తియొకటిగలదు. ఆశక్తి మాయయనిచెప్పబడును. ఆమాయ తనకాధారమగు సద్వస్తువుకంటె నన్యమైన స్వరూపములేనిదగును. ఆకాశాదికార్యచిహ్నముచే నెరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గదగినదగును. ప్ర అయితే కార్యచిహ్నముచేతనే శక్తినెరుగవలెననుటను వ్యతిరేక ముఖముగా దృఢీకరింపుము ? ఉ. ఆయాకార్యమును చేయుటకంటె పూర్వమందు నాయాశక్తి నెచ్చటైన నెవ్వడైన నెరుగజాలడు.

అవ. ఇట్లు కార్యచిహ్నమువల్ల శక్తినెరుగవలెనని జెప్పి ఇప్పుడు శక్తికి స్వరూపము లేదని చెప్పుచున్నాడు.

శ్లో॥ నసద్వస్తుసతశ్శక్తిర్నహివహ్నేస్స్వశక్తితా।
సద్విలక్షణతాయాంతుశక్తేఃకింతత్వముచ్యతాం॥ ౪౭.

టీ. సతః - బ్రహ్మవస్తువుయొక్క, శక్తిః-మాయాశక్తి, సద్వస్తు - సద్వస్తువు, న-కాదు. స్వశక్తితా=స్వ-తానే, శక్తితా-శక్తియగుట, వహ్నేః-అగ్నికి, నహి-కనబడలేదుగదా. అనగానగ్ని, తానేశక్తియగుటలేదనుట, శక్తేః-మాయకు, సద్విలక్షణతాయాంతు=సత్ -సద్వస్తువుకంటె, విలక్షణతాయాంతు- అన్యమగుటయందో కింతత్వం - ఏమిస్వరూపము, ఉచ్యతాం - చెప్పబడుగాక.

తా. మరియు, సద్వస్తువగు బ్రహ్మమందుండెడి మాయాశక్తి, ౧. సద్వస్తువో, లేక ౨. అసద్రూపమో చెప్పుము. ఆమాయాశక్తిని సద్వస్తువని చెప్పినయెడల సద్వస్తువగు బ్రహ్మముకంటె నభిన్నమని చెప్పవలసివచ్చును. అట్లభిన్నమైనయెడల నామాయకుశక్తియనెడి పేరుగలుగరాదు. మరియు అగ్నియందుగల ఉష్ణశక్తి, తేజోరూపమగు అగ్నియేయైనట్లు కనబడలేదు. గనుక, సద్వస్తువునందుగల మాయాశక్తిని, సద్వస్తువేయని చెప్పరాదు. మరియు నామాయాశక్తిని అసత్తనిచెప్పెడిపక్షమందు, ౧. మనుష్యులకు కొమ్ముగలదనెడి మాటవలె కేవలశూన్యమో, లేక ౨. సద్వస్తువగు బ్రహ్మముకంటె నన్యమోజెప్పుము.

శ్లో॥ శూన్యత్వమితిచేచ్ఛూన్యంమాయాకార్యమితీరితం।
నశూన్యంనాపిసద్యాదృక్తాదృక్తత్వమిహేష్యతాం॥ ౪౮.

టీ. శూన్యత్వమితిచేత్ - శూన్యభావమనియంటివేని, మాయాకార్యం = మాయా- మాయయొక్క, కార్యం- కార్యము, శూన్యమితి - శూన్యమని, ఈరితం - చెప్పబడెను. నశూన్యం - శూన్యముగానట్టియు, నాపిసత్ - సత్తుగానట్టి, తత్వం - స్వరూపము, యాదృక్ - ఎటువంటిదో, తాదృక్ - అటువంటిస్వరూపము, ఇహ - ఇక్కడ, అనగా నీమాయకనుట. ఇష్యతాం - ఇచ్ఛయింపబడుగాక. అనగా చెప్పబడుననుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఓపూర్వవాదీ ఆమాయాస్వరూపము శూన్యమనిచెప్పితివేని మాయాకార్యమగు నామరూపాదికము శూన్యమనిచెప్పబడును. మరియు నామాయాస్వరూపము శూన్యమై అశూన్యమునకు నానురూపములు గలుగుననిచెప్పితివేని ముప్పదినాలుగవశ్లోకమందు జెప్పినప్రకారము దీర్ఘూణాయుపత్రింతుడవుగమత్రి. అనగా శూన్యమునకు నామరూపములు గలవని చెప్పెడి బౌద్ధునిమతమపసిద్ధాంతమాయెనని సిద్ధాంతియభిప్రాయము. కనుక మాయాస్వరూపము మనుష్యులకు కొముత్రిగలదనెడిమాటవలె, కేవలశూన్యముగాదు. అందుచేత మాయాస్వరూపమును సద్వస్తువుకంటె నన్యమేనని చెప్పవలెను. గనుక శూన్యముగానట్టియు సద్రూపముగానట్టి రూపమెటువంటిదో, అట్టిస్వరూపముగలది మాయయనితెలియవలెను. అనగా సత్యాసత్యశబ్దములచేత జెప్పుటకు యోగ్యతలేనిది మాయాస్వరూపమని యభిప్రాయము.

అవ. ఈయర్థమందు శ్రుతిప్రమాణము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ నాసదాసీన్నోసదాసీత్తదానీంకింత్వభూత్తమః।
సద్యోగాత్తమసస్సత్వంనస్వతస్తన్నిషేధనాత్॥ ౫౦॥

టీ. అసత్ - ఆమాయ శూన్యమైనది, నాసీత్ - కాదు. సత్-సద్రూపము, నోఆసీత్ - కాదు. కింతు - మరియేమనగా, తదానీం-అప్పుడు అనగాసృష్టికిపూర్వమందనుట. తమః - గాఢాంధకారరూపముగా, అభూత్-ఉండెను. సద్యోగాత్ = సత్ - సద్వస్తువుతోటి, యోగాత్ - సంబంధమువల్ల, తమసః-ఆయంధకారమునకు, సత్వం-ఉండెననెడిసద్వస్తు ధర్మముగలిగెను. తన్నిషేధనాత్ = తత్ -ఆసద్రూపస్వభావముయొక్క, నిషేధనాత్ -నిషేధమువల్ల, స్వతః-స్వంతముగా, న-మాయకుస్థితిలేదు. అనగా సద్రూపత్వములేదనుట.

తా. ఆమాయాశక్తి సద్రూపముగాదనియు, శూన్యముగాదనియు శ్రుతిజెప్పుచున్నది. మరియేమనగా, ఆమాయాశక్తి సృష్టికిపూర్వమందు సుషుప్తియందువలె గాఢాంధకారరూపముగానుండెనని, శ్రు॥ నాసదాసీన్నోసదాసీత్తమ ఆసీత్తమసాగూఢమగ్రే॥ అనెడి ఇత్యాదిశ్రుతిజెప్పుచున్నది. ప్ర అయితే మాయ, వస్తువుగానియెడల నీశ్రుతియందు, (తమఆసీత్) అంధకారముగానుండెనని ఆమాయకు, స్థితియెట్లుచెప్పబడెను? ఉ. ఆయంధకారము సద్వస్తువగు బ్రహ్మముతోగూడియుండుటచేత, ఆయంధకారరూపమాయకు (ఉండెననెడి) సద్రూపధర్మము చెప్పబడెనేగాని ఆమాయకుస్వంతముగా సద్రూపత్వములేదు. గనుక, మాయ వస్తువుగాదు. ప్ర. అయితే, ఆమాయకుస్వంతముగా ప్రత్యేకస్థితిలేకపోవుటకు కారణమేమి?. ఉ. ఆయంధకార

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రూపమగు మాయాశక్తి, సత్యవస్తువుగాదని, శ్రుతిచేతనిషేధింపబడెను. అందుచేత నామాయశక్తికి స్వంతముగా ప్రత్యేకస్థితిలేదని తెలియవలెను.

అవ. ఇట్లుచెప్పుటచేత గలిగినఫలము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ అతఏవద్వితీయత్వంశూన్యవన్నహిగణ్యతే।
నలోకేచైత్రతచ్ఛక్త్యోర్జీవితంలిఖ్యతేపృథక్॥ ౫౧.

టీ. అతఏవ-అందువల్లనే మాయకు, శూన్యవత్-శూన్యమునకువలెనే, ద్వితీయత్వం - వస్తుత్వము, నహిగణ్యతే-గణింపబడదు, అనగా నంగీకరింపబడదనుట. లోకే - లోకమందు, చైత్రతచ్ఛక్త్యోః=చైత్ర - చైత్రుడనెడిపురుషునకును, తత్ - ఆ చైత్రునియొక్క, శక్త్యోః - శక్తికిని, జీవితం - స్థితి, పృథక్-భిన్నముగా, నలిఖ్యతే-లిఖింపబడుచుండలేదు. అనగా నేర్పడలేదనుట.

తా. ఏకారణమువల్ల మాయాశక్తికి స్వంతముగా ప్రత్యేకస్థితిలేదో, ఆకారణమువల్ల శూన్యమునకు వస్తుత్వముసిద్ధింపనట్లు, మాయకును వస్తుత్వరూపమగు ద్వితీయత్వమంగీకరింపబడదు. ప్ర. అయితే, అసత్యమైనమాయకు ద్వితీయత్వము నంగీకరింపరానివిషయమై దృష్టాంతమేమి?. ఉ. లోకమందు చైత్రుడనెడిపురుషునకును, వానిదేహస్థితశక్తికిని, జీవితకాలము భిన్నముగాలిఖింపబడుచుండలేదు. గనుక, మాయాశక్తికి ద్వితీయశబ్దముచేత జెప్పదగినవస్తుత్వ మంగీకరింపబడదని యభిప్రాయము.

శ్లో॥ శక్త్యాధిక్యేజీవితంచేద్వర్ధతేతత్రవృద్ధికృత్।
నశక్తిఃకింతుతత్కార్యంయుద్ధకృష్యాదికంతథా॥ ౫౨.

టీ. శక్త్యాధిక్యేసతి=శక్తి-శక్తియొక్క, ఆధిక్యేసతి - ఆధిక్యతగలుగుచుండగా, జీవితం - జీవనసాధనము, వర్ధతేచేత్-వృద్ధిబొందుచున్నదంటివేని, తత్ర-ఆజీవితవృద్ధియందు, వృద్ధికృత్ - వృద్ధినికలుగజేయునది, శక్తిః-శక్తి, న-కాదు. కింతు-మరియేమనగా, తత్కార్యం=తత్- ఆశక్తియొక్క, కార్యం-కార్యమగు, యుద్ధకృష్యాదికం=యుద్ధ - యుద్ధముచేయుటయు, కృష్యాదికం - కృషిచేయుట మొదలగునదియునగును. తథా-ఆప్రకారము, అనగాదార్ష్టాంతికమందనుట.

తా. అయితే, శక్త్యాధిక్యతగలుగుచుండగా జీవితత్వము వృద్ధిబొందుచున్నట్లు కనబడుచున్నది. గనుక, శక్తికిని భిన్నముగా జీవితత్వమును చెప్పరాదాయేమి? ఉ. జీవితత్వమును వృద్ధిజేయుటకు కారణమైనదిశక్తిగాదు. ప్ర. అయితే, ఆశక్తికా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్య మెద్ది ?. ఉ. యుద్ధము చేయుంటయు, పైరుబెట్టుట మొదలగు కార్యములు, శక్తి కార్యములగునని తెలియవలెను.

అవ. ఈదృష్టాంతమందుగల యర్థమును దార్ష్టాంతికమందు జూపుచున్నాడు

శ్లో॥ సర్వథాశక్తిమాత్రస్యనపృథగ్గణనాక్వచిత్।
శక్తికార్యంతునైవాస్తిద్వితీయంశక్యతేకథం॥ ౨౩.

టీ. సర్వథా - సర్వవిధములచేతను, శక్తిమాత్రస్య - శక్తిమాత్రమునకు, క్వచిత్ - ఎచ్చటను, పృథక్ - ప్రత్యేకముగా, గణనా - వ్యవహారము, న - లేదు. శక్తికార్యంతు=శక్తి - మాయాశక్తియొక్క, కార్యంతు - కార్యమైననామరూపాదికమో, నాస్త్యేవ - లేనేలేదు. ద్వితీయం - రెండవవస్తువు, కథం-ఎట్లు, శక్యతే- శక్యమగును అనగా రెండవవస్తువు కలదని చెప్పుటకు సాధ్యముగాదనుట.

తా. పైనచెప్పబడిన దృష్టాంతప్రకారము కేవలశక్తిమాత్రమునకు ద్వితీయశబ్దముచేత జెప్పదగినవస్తుత్వము సంభవింపదు. గనుక, సృష్టికిపూర్వమందు మాయాశక్తిచేత సద్వస్తువునకు సద్వితీయత్వము సంభవింపదు. రెండవవస్తువుతోటిసంబంధమే. సద్వితీయత్వమగునని తెలియవలెను. ప్ర. సరి. శక్తిచేత సద్వస్తువునకు సద్వితీయత్వము లేకపోయినను, ఆమాయాకార్యమైన జగంబుచేత సద్వితీయత్వము గలుగదాయేమి ?. ఉ. అప్పుడు మాయాకార్యమైన జగంబులేమిచేత సద్వస్తువునకు సద్వితీయత్వము గలుగునని చెప్పుటకు శక్యముగాదు.

శ్లో॥ నకృత్స్నబ్రహ్మవృత్తిస్సాశక్తిఃకింత్వేకదేశభాక్।
ఘటశక్తిర్యథాభూమౌస్నిగ్ధమృద్యేవవర్తతే॥ ౨౪.

టీ. సా-ఆ, శక్తిః-మాయాశక్తి, కృత్స్నబ్రహ్మవృత్తిః - బ్రహ్మమంతటప్రవర్తనముగలది, న - కాదు. కింతు-మరియేమనగా, ఏకదేశభాక్=ఏకదేశ - ఒకప్రదేశమును, భాక్ - పొందినదగును. భూమౌ-భూమియందు, ఘటశక్తిః-ఘటమును గలిగించెడిశక్తి, స్నిగ్ధమృద్యేవ=స్నిగ్ధ - మెత్తని, మృద్యేవ - మట్టియందే, యథా-ఏప్రకారముగా, వర్తతే-వర్తించుచున్నదో.

తా. ప్ర. అయితే, సద్వస్తువైన బ్రహ్మముయొక్కమాయాశక్తి, ౧. బ్రహ్మమందంతట వర్తించుచున్నదో, లేక, ౨. ఒకభాగమందు వర్తించుచున్నదోజెప్పుము. అంతటవర్తించుచున్నదని చెప్పితివేని ముక్తులచేత పొందదగిన బ్రహ్మములేదనెడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రసంగము గలుగును. మరియు నొకభాగమందు వర్తించుచున్నదంటివేని, బ్రహ్మము నిరవయవమని చెప్పుటకు విరోధము కాదాయేమి ?. ఉ. ఆమాయాశక్తి, బ్రహ్మమందంతట వర్తించుచున్నదనెడి పక్షమంగీకరింపబడదు. గనుక, భూమియందు మెత్తని మట్టియందే ఘటమును కలిగించెడి శక్తివర్తించుచున్నట్లు, బ్రహ్మమందొకభాగమందే మాయాశక్తి వర్తించుచున్నదని తెలియవలెను. నిరవయవమనగా అవయవము లేదని యర్థము.

అవ. మాయాశక్తి, బ్రహ్మమందొకభాగమందు వర్తించుచున్నదనెడి విషయమై ఇప్పుడు శ్రుతిప్రమాణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ పాదోఽస్యసర్వాభూతానిత్రిపాదస్తిస్వయంప్రభః।
ఇత్యేకదేశవృత్తిత్వంమాయాయావదతిశ్రుతిః॥ ౫౫.

టీ. సర్వభూతాని-సర్వభూతములును, అస్య-ఈబ్రహ్మముయొక్క, పాదః-ఏకపాదమగును. అనగా నేకభాగమందు సర్వభూతములను వర్తించుచున్నవనుట. అస్య-ఈబ్రహ్మముయొక్క, స్వయంప్రభః - స్వప్రకాశ నిర్వికల్పస్వరూపము, త్రిపాత్-భాగత్రయము, అస్తి-కలదు. ఇతి-ఇట్లనెడి, శ్రుతిః-వేదవాక్యము, మాయాయాః-మాయకు, ఏకదేశవృత్తిత్వం=ఏకదేశ - ఒకభాగమందు, వృత్తిత్వం-ప్రవర్తనమును, వదతి-చెప్పుచున్నది.

తా. శ్రు॥ పాదోఽస్యసర్వాభూతాని త్రిపాదస్యామృతందివి॥ అనెడి ఈ శ్రుతి, బ్రహ్మమందు మాయాశక్తి, యేకభాగమందు ప్రవర్తించుచున్నదని చెప్పుచున్నది.

అవ. ఈవిషయమై, శ్రుతియేగాక స్మృతియుంగలదని చెప్పుచున్నాడు.

శ్లో॥ విష్టభ్యాహమిదంకృత్స్నమేకాంశేనస్థితోజగత్।
ఇతికృష్ణోఽర్జునాయాహజగతస్త్వేకదేశతాం॥ ౫౬.

టీ. అహం - నేను, ఏకాంశేన-ఏకభాగముచేత, ఇదం-ఈ, కృత్స్నం-సర్వజగంబును, విష్టభ్య - విశేషముగా స్తంభనముచేసి, స్థితః - ఉన్నవాడనగుదును. ఇతి-ఇట్లని, జగతః - జగంబునకు, ఏకదేశతాం - ఏకభాగస్థితిని, కృష్ణః - భగవంతుడు, అర్జునాయ - అర్జునునికొరకు, ఆహ - చెప్పెను.

తా. నేనొకభాగముచేత నీసర్వజగంబును స్తంభనముచేసియున్నానని, శ్రీభగవంతుడైన కృష్ణదేవుడు అర్జునునకు శ్రీగీతాశాస్త్రములో విశ్వరూపాధ్యాయమందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెప్పెను. ఇట్లుచెప్పుటచేత బ్రహ్మమందు మాయాశక్తి, యేకభాగమందే వర్తించు చున్నదని తెలియవలెను.

అవ. మాయాశక్తిలేని బ్రహ్మమునకు రూపముండుట యందిప్పుడు ప్రమాణ మును జెప్పుచున్నాడు.

శ్లో॥ సభూమింవిశ్వతోవృత్వాహ్యత్యతిష్ఠద్దశాంగులం ।
వికారావర్తిచాత్రాస్తిశ్రుతిసూత్రకృతోర్వచః॥ ౫౭.

టీ. అత్ర - మాయాసంబంధములేని యీబ్రహ్మమునకు రూపముండెడి విష యమై, సః-ఆపరమేశ్వరుడు, విశ్వతః-అంతటను, వృత్వా - వ్యాపించి, దశాంగులం, బ్రహ్మాండమును, హ్యత్యతిష్ఠత్ - అతిక్రమించియుండెనని చెప్పెడి వాక్యంబును- వికారావర్తిచ=వికార- వికారమందు, అవర్తిచ - వర్తించని నిర్వికల్పరూపముగల దని చెప్పెడి వాక్యంబును, శ్రుతిసూత్రకృతోః - శ్రుతిసూత్రకారులయొక్క, వచః- వాక్యమై, అస్తి - ఉన్నది.

తా. నిర్గుణుడగునాపరమాత్మ, భూమినియంతటను వ్యాపించి బ్రహ్మాండము నతిక్రమించియున్నాడని, శ్రు॥ సభూమింవిశ్వతోవృత్వాహ్యత్యతిష్ఠద్దశాంగులం॥ ఈ శ్రుతిజెప్పుచున్నది. మరియు, వికారమందువర్తింపని నిర్వికల్పరూపము బ్రహ్మమునకు గలదని, సూ॥ వికారావర్తిచతథాహిస్థితిమాహ॥ అనెడి బ్రహ్మసూత్రంబును జెప్పు చున్నది. అనగా నీశ్రుతి సూత్రములు రెండును మాయారహితమైన నిర్గుణబ్రహ్మము నకు నిర్వికల్పస్వరూపమును చెప్పుచున్నవని యభిప్రాయము.

శ్లో॥ నిరంశేప్యంశమారోప్యకృత్స్నేంశేవేతిపృచ్ఛతః ।
తద్భాషయోత్తరంబ్రూతేశ్రుతిశ్శ్రోతృహితైషిణీ॥ ౫౮.

టీ. నిరంశేపి- నిరవయవమందును, అంశం-అవయవమును, అరోప్య- కల్పించి, కృత్స్నే - బ్రహ్మమందంతట వర్తించుచున్నదో, అంశేవా - ఏకభాగమందు వర్తిం చుచున్నదో, ఇతి - ఇట్లని, పృచ్ఛతః - అడిగెడివానికి, శ్రోతృహితైషిణీ=శ్రోతృ - వినెడివానికి, హిత- మేలును, ఏషణీ - కోరెడి, శ్రుతిః- శ్రుతి, తద్భాషయా-ఆవ్యవ హారముచేత, ఉత్తరం - సమాధానమును, బ్రూతే - చెప్పుచున్నది.

తా. ప్ర. అయితే, మాయాశక్తి, బ్రహ్మమందొకభాగమందు వర్తించుచున్న దని చెప్పినయెడల, నప్పుడు బ్రహ్మమవయవసహితమగుటచేత నిరవయవమని చెప్పు టకు విరోధమగును. అట్టివిరోధమునకు పరిహారమేమి ?. ఉ. నిరవయవస్వరూపమం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దవయవమును కల్పించి, మాయాశక్తి బ్రహ్మమందంతట వర్తించునో, లేక యొకభాగమందు వర్తించునో యనియిట్లడిగెడివానికి సర్వదా శుభమును గోరుచుండెడి శ్రుతియు, ఆట్టివ్యవహారముచేత మాయాశక్తి బ్రహ్మమందొకభాగమందు వర్తించుచున్నదని సమాధానమును జెప్పెనుగాని, బ్రహ్మమందు వాస్తవమైన నిరవయవత్వము లేమివల్ల విరోధములేదు. అనగా బ్రహ్మమవయవముగలది యనియైనను, నిరవయవమనియైననుం జెప్పుటకు శక్యముగానిదని యభిప్రాయము.

అవ. ఎందుకొరకు బ్రహ్మమందు మాయాశక్తియున్నదని సమర్థింపబడెనో, యావిషయము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ సత్తత్త్వమాశ్రితాశక్తిఃకల్పయేత్సతివిక్రియాః।
వర్ణాభిత్తిగతాభిత్తౌచిత్రంనానావిధంయథా॥ ౪౯.

టీ. భిత్తిగతాః=భిత్తి-గోడను, గతాః-పొందియున్న, వర్ణాః - ఎరుపుపసుపు మొదలగు వర్ణములుగల ధాతువిశేషములు, భిత్తౌ-ఆగోడయందు, నానావిధం - నానావిధమైన, చిత్రం- చిత్రమును, యథా-ఏప్రకారముకల్పించునో, (తథైవ) ఆప్రకారమే, సత్తత్త్వం = సత్-బ్రహ్మముయొక్క, తత్త్వం - స్వరూపమును, ఆశ్రితా - ఆశ్రయించిన, శక్తిః - మాయాశక్తి. సతి - బ్రహ్మమందు, విక్రియాః- కార్యవిశేషములను - కల్పయేత్ - కల్పించెను.

తా. గోడనుపొందియున్న యెరుపుపసుపు మొదలగు రంగులుగల ధాతువిశేషము లాగోడయందు నానావిధమగు చిత్తరువును కల్పించినట్లు సద్వస్తుస్వరూపము నాశ్రయించియున్న మాయాశక్తియు, నాసద్వస్తువగు బ్రహ్మమందు వికారరూపకార్యవిశేషములను కల్పించెనని తాత్పర్యము.

అవ. అందుప్రథమకార్యవిశేషము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ అద్యోవికారఆకాశస్సోవకాశస్వరూపవాన్।
ఆకాశోస్తీతిసత్తత్త్వమాకాశేప్యనుగచ్ఛతి॥ ౫౦.

టీ. ఆద్యః-మొదటిదగు, వికారః- కార్యవిశేషము, ఆకాశః.ఆకాశమగును. సః - ఆయాకాశము, అవకాశస్వరూపవాన్ - అవకాశ - అవకాశమే, స్వరూపవాన్ - స్వరూపముగలదియగును. ఆకాశః - ఆకాశము, అస్తీతి - ఉన్నదనెడి, సత్తత్త్వం - సద్వస్తుస్వభావము, ఆకాశేపి - ఆకాశమందును, అనుగచ్ఛతి - అనువర్తించు చున్నదనుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. అట్టి కార్యములలో మొదటి కార్యమాకాశమగును. అయాకాశమవకాశ స్వరూపము గలదియగును. ప్ర. అయితే, అకాశము బ్రహ్మకార్యమని చెప్పుటకు కారణమేమి? ఉ. (ఆకాశమున్నది) అనెడి వ్యవహారమందు, ఉన్నదియనెడి వ్యవహారహేతువెద్దిగలదో, యదియే, సద్వస్తుస్వభావమగును. ఆసద్వస్తుస్వభావమాకాశమందు స్వాభావికముగా వర్తించుచున్నది. కారణధర్మములు కార్యమందుండుట, స్వాభావికమగును. గనుక, కారణమైన సద్వస్తువుయొక్క స్వభావము, కార్యమైన యాకాశమందుండుటచేత నాయాకాశము బ్రహ్మముయొక్క కార్యమగునని తెలియవలెను.

శ్లో॥ ఏకస్వభావంసత్తత్వమాకాశో ద్విస్స్వభావకః।
నావకాశస్సతివ్యోమ్నిసచైషోపిద్వయంస్థితం॥ ౬౧.

టీ. సత్తత్వం - సద్వస్తుస్వరూపము, ఏకస్వభావం=ఏక-ఒక్కటియేయగు, స్వభావం- స్వభావముగలదియగును. ఆకాశః - ఆకాశము, ద్విస్స్వభావకః=ద్విః-రెండైన, స్వభావకః-స్వభావములుగలదియగును. సతి- సద్వస్తువునందు, అవకాశః- అవకాశస్వభావము, న- లేదు. వ్యోమ్ని - ఆకాశమందు, సచ - ఆసద్వస్తుస్వభావంబును, ఏషోపి- ఈయవకాశస్వభావంబును, ద్వయం- స్వభావద్వయము, స్థితం - స్థితినిపొందుచున్నది.

తా. ప్ర. సరి. ఆకాశము బ్రహ్మముయొక్క కార్యమేయగును అందువల్లనేమి? ఉ. సద్వస్తువైన బ్రహ్మ మేకస్వభావముగలదియగును. ఆకాశము రెండు స్వభావములు గలదియగును. ప్ర. ఆస్వభావములెవ్వి? ఉ. సద్వస్తువునందు (సత్) ఉన్నదియనెడి స్వభావమొక్కటియేగలదుగాని, యవకాశస్వభావములేదు. మరియు నాకాశమందు, ౧. సద్వస్తువ్వభావతయు. ౨. అవకాశస్వభావంబును, ఈరెండు స్వభావములునుగలిగియున్నవి.

అవ. మరియొకవిధముచేత సదాకాశములకు ఏకద్వి స్వభావత్వములను సాధించుచున్నాడు.

శ్లో॥ యద్వాప్రతిధ్వనిర్వ్యోమ్నోగుణో నాసౌప్రతీక్ష్యతే।
వ్యోమ్నిద్వౌసద్ధ్వనీతేనసదేకంద్విగుణంవియత్॥ ౬౨.

టీ. యద్వా - మరియొకపక్షమందు. ప్రతిధ్వనిః - ప్రతిధ్వని, వ్యోమ్నః - ఆకాశముయొక్క, గుణః- గుణమగును. అసౌ-ఈశబ్దగుణము, నప్రతీక్ష్యతే - సద్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్తువునందుకనబడలేదు. వ్యోమ్ని - ఆకాశమందు, సద్ధ్వనీ=సత్ - సద్వస్తుస్వభావంబును' ధ్వనీ-ప్రతిధ్వనియు, ద్వౌ- ఈరెండుస్వభావములును గలిగియున్నవి. తేన- ఆకారణముచేత, సత్ - సద్వస్తువు, ఏకం - ఏకస్వభావముగలదియగును. వియత్ - ఆకాశ, ద్విగుణం - రెండుస్వభావములు గలదియగును.

తా. ఆకాశమునకు ప్రతిధ్వనిరూపమైన శబ్దగుణముగలదని పూర్వము చెప్పబడెను. ఆప్రతిధ్వనిరూపశబ్దగుణము సద్వస్తువునందులేదు. ఆకాశమందు, ౧. సద్వస్తుస్వభావము, ౨. శబ్దగుణము, ఈరెండునుగలిగియున్నవి. ఆకారణముచేత సద్వస్తువగు బ్రహ్మమేకస్వభావము గలదియగుననియు, ఆకాశము రెండు స్వభావములంగలదియగుననియుం దెలియవలెను.

శ్లో॥ యాశక్తిఃకల్పయేద్వ్యోమసాసద్వ్యోమ్నోరభిన్నతాం।
ఆపాద్యధర్మధర్మిత్వంవ్యత్యయేనావకల్పయేత్॥ ౬౩.

టీ. యాశక్తిః - ఏమాయాశక్తి, వ్యోమ - ఆకాశమును, కల్పయేత్ - సద్వస్తువునందుకల్పించెనో, సా-ఆమాయాశక్తి, సద్వ్యోమ్నోః=సత్- బ్రహ్మమునకును, వ్యోమ్నోః - ఆకాశమునకును, అభిన్నతాం - అభేదమును, ఆపాద్య- సంపాదించి, అనగా కల్పించియనుట. ధర్మధర్మిత్వం - ధర్మధర్మిభావమును, వ్యత్యయేన - విపరీతముగా, అవకల్పయేత్ - కల్పించెను.

తా. ప్ర. అయితే, ఆకాశము బ్రహ్మముయొక్క కార్యమైనయెడల, (ఆకాశముయొక్కస్థితి) అనెడివ్యవహారమందు సద్వస్తువాకాశముయొక్క ధర్మముగాదోచుటకు కారణమేమి?. ఉ. ఏమాయాశక్తి సద్వస్తువైన బ్రహ్మమందాకాశమునుకల్పించెనో, ఆమాయాశక్తి, మొట్టమొదట సద్వస్త్వాకాశములకు రెంటికిని అభేదమునుకల్పించి, పిమ్మటసద్వస్త్వాకాశములకు ధర్మధర్మిభావమును విపరీతముగా కల్పించెను. అనగా సద్వస్తువును ధర్మముగాను, ఆకాశమును ధర్మినిగాను, ఇట్లు విపరీతముగాకల్పించెనని తెలియవలెను. అట్టిమాయాకల్పనమువల్ల (ఆకాశముయొక్క స్థితి) అనెడివ్యవహారమందు, సద్వస్తువు, ఆకాశముయొక్క ధర్మముగాదోచుచున్నదేగాని, అట్లుతోచుట వాస్తవముగాదని యభిప్రాయము. ధర్మమనగా స్వభావమనియు, ధర్మియనగా ధర్మమునకాధారమైన కారణవస్తువనియుం దెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ సతోవ్యోమత్వమాపన్నంవ్యోమ్నస్సత్తాంతులౌకికాః।
తార్కికాశ్చావగచ్ఛంతి మాయాయాఉచితం హితత్॥

టీ॥ సతః - సద్వస్తువునకు, వ్యోమత్వం - ఆకాశరూపభావము, ఆపన్నం - ప్రాప్తించెను. లౌకికాః - ప్రాణులును, తార్కికాశ్చ - తార్కికులును, వ్యోమ్నః - ఆకాశమునకు, సత్తాంతు - సద్రూపధర్మజాతనియు, అవగచ్ఛంతి - విపరీతముగా నెరుగుచున్నారు. తత్ - ఆవిపరీతదర్శనహేతుత్వము, మాయాయాః - మాయకు, ఉచితంహి - తగినదేగదా.

తా. ప్ర. అయితే, మాయచేత విపరీతకల్పన మెట్లుచేయబడెను ? ఉ. వస్తుతత్వవిచారణము జేయుచుండగా మృత్తికకు ఘటరూపత్వము ప్రాప్తించునట్లు, సద్వస్తువునకు ఆకాశరూపత్వము ప్రాప్తించెను. ఆవిపరీతత్వముచేత ప్రాణులును, శాస్త్రజ్ఞులలో తార్కికులును (ఆకాశముయొక్కస్థితి) అనెడి వ్యవహారమందు సద్వస్తువును ఆకాశధర్మముగా దలచుచున్నారు, స్థితియనగా నునికియగును. ఉనికియనెడి వ్యవహారహేతువాకాశమందెద్దిగలదో, అది సద్వస్తుస్వభావమగును. (ఆకాశముయొక్కస్థితి) అనెడి వ్యవహారమందు (స్థితి) అనెడి సద్వస్తుస్వభావ మాకాశధర్మమునుగా తార్కికాదులు దలచుచున్నారని తెలియవలెను. ప్ర, అయితే, ఒకవస్తువు మరియొకవిధముగా దోచుటకు కారణమేమి ? ఉ. ఒకవస్తువు మరియొకవిధముగా విపరీతజ్ఞానముచేత దోచుచున్నది. అట్టివిపరీతజ్ఞానహేతువు మాయయేయగును. అట్టివిపరీతజ్ఞానహేతుత్వము మాయకు ఉచితమేయగును.

అవ॥ ఇప్పుడు, లౌకికన్యాయముచేత మాయకు విపరీతజ్ఞానహేతుత్వమును స్పష్టీకరించుచున్నాడు.

శ్లో॥ యద్యథావర్తతేతస్యతథాత్వంభాతిమానతః।
అన్యథాత్వంభ్రమేణేతిన్యాయోయంసార్వలౌకికః॥ ౬౫.

టీ. యత్ - ఏశుక్తికాదివస్తువు, యథా - ఏశుక్తికాదిరూపముచేత, వర్తతే - వర్తించుచున్నదో, తస్య - ఆశుక్తికాదివస్తువునకు, తథాత్వం - శుక్తికాదిరూపత్వము, ప్రమాణతః - వాస్తవమువల్ల, భాతి - స్ఫురించుచున్నది. అన్యథాత్వం - రజతాదిరూపత్వము, భ్రమేణ - భ్రాంతిచేతదోచును. ఇతి - ఇట్లనెడి, అయం - ఈ, న్యాయః - న్యాయము, సార్వలౌకికః - సర్వలోకప్రసిద్ధమగును.

తా. లోకమందు ఏశుక్తికాదివస్తువు, ఏశుక్తికాదిరూపముచేత వర్తించుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్నదో, ఆశుక్తికాదివస్తువునకు ఆశుక్తికాదిస్వరూపము ప్రమాణమువల్ల వాస్తవముగా తెలియబడుచున్నది. మరియు, ఆశుక్తికాదివస్తువు భ్రాంతిచేత రజతాదిరూపముగా దోచుచున్నదనెడి, యీన్యాయము సర్వలోకప్రసిద్ధమగును. శుక్తియనగా ముత్త్యపుచిప్పయగును. రజతమనగా వెండియగును.

అవ. ఇట్లు భ్రాంతిచేత విపరీతజ్ఞానమునుజూపి, ఆభ్రాంతి, నివర్తించెడి యుపాయము నిప్పుడుజెప్పుచున్నాడు.

శ్లో॥ ఏవంశ్రుతివిచారాత్ప్రాగ్యథాయద్వస్తుభాసతే।
విచారేణవిపర్యేతితతస్తచ్చింత్యతాంవియత్॥ ౬౬.

టీ. ఏవం - ఈచెప్పబడినప్రకారము, శ్రుతివిచారాత్=శ్రుతి - శ్రుత్యర్థముయొక్క, విచారాత్ - విచారణముకంటె, ప్రాక్ - పూర్వము, యత్ - ఏ, వస్తు-సద్రూపబ్రహ్మవస్తువు, యథా - ఏయాకాశాదిరూపముగా, భాసతే - భ్రాంతిచేత దోచుచున్నదో, (తత్) ఆసద్వస్తువు, విచారేణ- శ్రుత్యర్థవిచారణముచేత, విపర్యేతి, ఆకాశాదిభావమునువిడిపించి సద్రూపబ్రహ్మమేయగుచున్నది. తతః - అందువల్ల, తత్ - ఆయాకాశము, చింత్యతాం - విచారింపబడుగాక.

తా. ఈపైనచెప్పబడిన ప్రకారము, శ్రుత్యర్థవిచారణము జేయనిపూర్వమందు ఏసద్వస్తువైన బ్రహ్మము మాయాభ్రాంతిచేత, ఏయాకాశాదిరూపముగా వర్తించుచున్నదో, ఆబ్రహ్మము, శ్రుత్యర్థవిచారణముచేత నాకాశాదిభావమును విడిపించి సద్రూపమగు బ్రహ్మమేయగుచున్నది. గనుక శ్రుత్యర్థవిచారణమును జేయుటచేత వస్తువుయొక్క యథార్థజ్ఞానము గలుగుటవల్ల నాయాకాశస్వరూపమును విచారించవలెను.

అవ. అవిచారస్వరూపమునే యిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ భిన్నేవియత్సతీశబ్దభేదాద్బుద్ధేశ్చభేదతః।
వాయ్వాదిష్వనువృత్తంసన్నతువ్యోమేతిభేదధీః॥ ౬౭.

టీ. శబ్దభేదాత్=శబ్ద - శబ్దములయొక్క, భేదాత్ - భేదమువల్లను, బుద్ధేశ్చ-బుద్ధియొక్క, భేదతః - భేదమువల్లను, వియత్సతీ - ఆకాశసద్వస్తువులు రెండును, భిన్నే - పరస్పరభేదముగలవియగును. వాయ్వాదిషు - వాయువు మొదలగు భూతములయందు, సత్ - సద్వస్తువు, అనువృత్తం - స్వాభావికముగా ననువర్తించుచున్నది. వ్యోమతు - ఆకాశమో, న - అనువర్తించుచుండుటలేదు, ఇతి - ఈప్రకారమైనజ్ఞానము, భేదధీః - భేదబుద్ధియగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ౧. ఆకాశము, ౨ సత్తు, ఈరెండును పర్యాయశబ్దములుకాని హేతువుచేత పరస్పరముగా భేదముగలవియగును. ప్ర అట్లు భిన్నములగుటకు కారణమేమి? ఉ. ౧. ఆకాశము, ౨. సత్తు, ఈరెండుశబ్దములును ఒకవస్తువుయొక్క పేర్లుగామిచేత అర్థభేదముగలవియగును. అట్టి శబ్దభేదమువల్లను, బుద్ధిభేదమువల్లను, ఆయాకాశసద్వస్తువులురెండును పరస్పరభేదముగలవియగును. ప్ర. సరి. బుద్ధిభేదమెట్టిది?. ఉ. వాయువు (ఉన్నదనియు) అగ్ని (ఉన్నదనియు) ఇట్లు సర్వభూతములయందును స్వాభావికముగా సద్వస్తువర్తించియున్నదనియు, ఇట్లు వాయ్వాదిభూతములయందాకాశము వర్తించియుండలేదనెడి, యేజ్ఞానముగలదో, అదియే భేదబుద్ధియగును. ఈ చెప్పబడిన శబ్దభేదబుద్ధిభేదములనెడి రెండుహేతువులవల్ల, ఆకాశసద్వస్తువులు రెండును పరస్పరభేదము గలవియగునని యోచించవలయును.

అవ. ఇట్లు, సదాకాశములకు రెంటికిని భేదముసాధించి (ఆకాశముయొక్క స్థితి) అనెడి వ్యవహారమందు భ్రాంతిచేత విపరీతముగాదోచెడి ధర్మిధర్మభావమునకు విచారణచేత వ్యత్యయము నిప్పుడుజూపుచున్నాడు.

శ్లో॥ సద్వస్త్వధికవృత్తిత్వాద్ధర్మి వ్యోమ్నస్తుధర్మతా।
ధియాసతఃపృథక్కారే బ్రూహివ్యోమకిమాత్మకం॥ ౬౮.

టీ. సద్వస్తు - బ్రహ్మవస్తువు, అధికవృత్తిత్వాత్ - స్వాభావికముగా సర్వభూతములయందనువర్తించియుండుటవల్ల, ధర్మి - ధర్మియగును. వ్యోమ్నస్తు - ఆకాశమునకో, ధర్మతా - ధర్మత్వమగును- ధియా - బుద్ధిచేత, సతః- ఆకాశమందుండెడి సద్వస్తువునకు, పృథక్కారే సతి - భేదముగలిగించుచుండగా, వ్యోమ - ఆకాశము, కిమాత్మకం - ఏస్వరూపముగలదియో, బ్రూహి - చెప్పుము.

తా. రూపరసాదులయందు స్వాభావికముగా వర్తించుచున్న ద్రవ్యమునకు ధర్మిత్వముగలిగినట్లు, ఆకాశవాయ్వాది సర్వభూతములయందును స్వాభావికముగా వర్తించునన్న సద్వస్తువునకు ధర్మిత్వముగలిగియున్నది. మరియు, రసాదులవల్ల నివర్తింపబడెడి రూపమునకు ధర్మత్వముగలిగినట్లు, వాయ్వాదిభూతములవల్ల నివర్తింపబడిన ఆకాశమునకు ధర్మత్వమగును, ప్ర. అయితే ఘటముకంటె భిన్నమైన రూపమునకు వాస్తవత్వమెట్లుగలిగియున్నదో, అటువలెనే సద్వస్తువుకంటె భిన్నమైన ఆకాశమునకును వాస్తవత్వము గలుగరాదాయేమి ?. ఉ. ఘటమునకు కారణమైన మృత్తికను బుద్ధిచేత భిన్నముచేయగా ఘటస్వరూపమే లేనియట్లు, (ఆకాశమున్నది) అని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యిట్లు వ్యవహరించుటకు కారణమైన ఆకాశమందుండెడి సద్వస్తువును బుద్ధిచేతిభిన్నముగాజేసినయెడల, ఆయాకాశమునకు స్వరూపమేలేదు. గనుక, సద్వస్తువుకంటె అన్యమైన ఆకాశమును నిరూపించుటకు శక్యముగాదు. ముందుజెప్పినప్రకారము సద్వస్త్వాకాశములకు రెంటికిని భేదమునెరిగి, యీశ్లోకమందు చెప్పినప్రకారము యోచించినయెడల, (ఆకాశముయొక్కస్థితి) అనెడి వ్యవహారమందు భ్రాంతిచేత సద్వస్తువునకుదోచెడి ధర్మత్వము నివర్తించును. మరియు, ఈవిచారణచేత ఆకాశమునకు భ్రాంతివల్లదోచెడి ధర్మిత్వంబును నివర్తించుచున్నది.

శ్లో॥ అవకాశాత్మకంతచ్చేదసత్తదితిచింత్యతాం।
భిన్నంసతోఽసచ్చ నేతివక్షిచేద్వ్యాహతిస్తవ॥ ౬౯.

టీ. తత్ - సద్వస్తువుకంటె భిన్నమైన ఆయాకాశము, అవకాశాత్మకంచేత్ - అవకాశస్వరూపముగలది యంటివేని, తత్ - ఆయాకాశము, అసదితి - లేనిదియని, చింత్యతాం - చింతింపబడుగాక, సతః - సద్వస్తువుకంటె, భిన్నం - ఆకాశము భిన్నమగుననియు, అసత్ - లేనిది, నచ - కాదనియు, ఇతి - ఈప్రకారము, వక్షిచేత్ - చెప్పితివేని, తవ - నీకు, వ్యాహతిః - విరోధమగును.

తా. ప్ర. అయితే, సద్వస్తువుకంటె భిన్నమైనఆయాకాశమవకాశస్వరూపమును గలిగియుండగా నిరూపించుటకు శక్యముగాకపోవుటెట్లు?. ఉ. సత్తనగా నుండునదియగును. అట్టిసద్వస్తువుకంటె అన్యమైనయాకాశము లేనిదే యగుగాని సత్యముగాదు. మరియు, సద్వస్తువుకంటె ఆకాశమన్య మేయగుననియు, అసత్యముగాదని యంటివేని ఇట్లుచెప్పుటచేత నీవాక్యమువల్ల నీకేవిరోధమగును. అనగా సత్యవస్తువుకంటె భిన్నమైనదానిని అసత్యమనియే చెప్పవలయుగాని, సత్యమని చెప్పరాదని యభిప్రాయము.

శ్లో॥ భాతీతిచేద్భాతునామభూషణంమాయికస్యతత్।
యదసద్భాసమానంతన్మిథ్యాస్వప్నగజాదివత్॥ ౭౦.

టీ. భాతీతిచేత్ - ఆయాకాశముతోచుచున్నదని అంటివేని, భాతునామ - తోచుచుండుగాక. మాయికస్య - మాయావంతునకు, తత్ - ఆస్ఫురణము, భూషణం - ఆభరణమగును. యత్ - ఏవస్తువు, అసత్ - స్వరూపముచేత లేనిదగుచు, భాసమానం - ఉన్నట్లుతోచుచుండునో, తత్ - అది, స్వప్నగజాదివత్ = స్వప్న - స్వప్నమందు కనబడెడి, గజాదివత్ - ఏనుగు మొదలగువానివలె, మిథ్యా - మిథ్యయగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే ఆయాకాశములేనిదైనయెడల ఉన్నట్లుతోచుచుండుట విరోధముకాదాయేమి. ఉ. తుచ్ఛములైన నరవిషాణాదులకంటె భిన్నత్వముగలిగి యుండుటవల్ల ఆయాకాశమున్నట్లుదోచినను, ఆయాకాశములేనిదానినిగా జెప్పుట చేత విరోధములేదు. మరియు స్వరూపముచేత వాస్తవముగా లేకనే యున్నట్లుతో చుచుండుట, మాయావంతునకు భూషణమగును. మరియు, ఏవస్తువుస్వరూపముచే తలేనిదగుచు, ఉన్నట్లు తోచుచున్నదో, అది స్వప్నమందుకనబడెడి ఏనుగుమొద లగు వానివలె మిథ్యయేయగును. ఇది మిథ్యావస్తువునకు లక్షణమగును. ఇట్టిమిథ్యా లక్షణము ఆకాశమందుండుటచేత ఆయాకాశము స్వరూపముచేత లేకనేయున్నట్లు తోచుచున్నది. గనుక, నాయాకాశమును మిథ్యయని తెలియవలెను.

శ్లో॥ జాతివ్యక్తీదేహిదేహౌగుణద్రవ్యేయథాపృథక్।
వియత్సతోస్తథైవాస్తుపార్థక్యంకోత్రవిస్మయః॥ ౭౧.

టీ. జాతివ్యక్తీ - జాతివ్యక్తులును, దేహిదేహౌ- దేహిదేహములును, గుణద్రవ్యే - గుణద్రవ్యములును, యథా - ఏప్రకారము, పృథక్ - భిన్నములగునో, తథైవ - అప్రకారమే, వియత్సతోః - ఆకాశసద్వస్తువులకు, పార్థక్యం - భిన్నత్వము, అస్తు - అగుగాక, అత్ర - ఈవిషయమందు, విస్మయఃకః - ఆశ్చర్యమేమి. అనగా నిదియొక యాశ్చర్యవిషయముగాదనుట.

తా. ప్ర. అయితే, నియమముగా కూడివర్తించెడి రెండువస్తువులకు భేదమెచ్చటైనం గనబడలేదేమి?. ఉ. అనేక ఘటాదివ్యక్తులయందుండునదియు ఒకటియై యునదియు నిత్యముగానుండునదియైన ఘటత్వము మొదలగునది జాతియనబడును. నానా విధముగానుండెడి ఘటపిండము మొదలగునది వ్యక్తియనబడును. అట్టిజాతివ్యక్తులు రెండును కలసియున్నను ఆరెంటికి భేదముగలిగియున్నది. మరియు, జీవదేహములు రెండును ఏకీభూతముగానున్నను, ఆరెంటికిని భేదముగలిగియున్నది. మరియు, గంధ ము మొదలగు గుణంబును, భూమి మొదలగు ద్రవ్యంబును, ఈరెండును కలసివర్తించు చున్నను ఆరెంటికిని భేదముగలిగియున్నది. అటువలెనే ఆకాశసద్వస్తువులకు రెంటి కిని భేదముగలిగియున్నదని తెలిసికొనుము. ఇక్కడాశ్చర్యమేమియులేదు.

శ్లో॥ బుద్ధోపిభేదోనోచిత్తేనిరూఢింయాతిచేత్తదా।
అనైకాగ్ర్యాత్సంశయాద్వారూఢ్యభావోస్యతేవద॥ ౭౨.

టీ. భేదః ఆకాశసద్వస్తువులకుగల భేదము, బుద్ధోపి- తెలియబడినను, చిత్తే,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాచిత్తమందు, నిరూఢిం - నిశ్చయమును, నోయాతిచేత్ - పొందకలేదనియంటివేని-తదా - అప్పుడు. తే - నీకు, అస్య - ఈభేదముయొక్క, రూఢ్యభావః - నిశ్చయములేమి, అనైకాగ్ర్యాత్ - చిత్తైకాగ్రతలేమివల్లనో, సంశయాద్వా - సంశయమువల్లనో, వద - చెప్పుము.

తా. ప్ర. అయితే-ఆకాశసద్వస్తువులకు రెంటికిని పరస్పరభేదముగలదని తెలియబడినను, నామనస్సునకు నిశ్చయముగలుగలేదేమి ?. ఉ. నీకుచిత్తైకాగ్రతలేమివల్లనో, లేక, సంశయమువల్లనో, నిశ్చయముగలుగలేదు. ఆరెండు కారణములలో ఏకారణమువల్ల నీకు నిశ్చయముగలుగలేదో చెప్పినయెడల, అందుకు పరిహారమును చెప్పెదనని యభిప్రాయము.

శ్లో॥ అప్రమత్తోభవధ్యానాదాద్యేఽన్యస్మిన్వివేచనం।
కురుప్రమాణయుక్తిభ్యాంతతోరూఢతమోభవేత్॥ ౭౩.

టీ. ఆద్యే - చిత్తైకాగ్రతలేనివిషయమై, ధ్యానాత్ - ధ్యానమువల్ల, అప్రమత్తః - సావధానచిత్తముగలవాడవు, భవ - అగుము. అన్యస్మిన్ - సంశయముగలవిషయమై, ప్రమాణయుక్తిభ్యాం - ప్రమాణయుక్తులచేత, వివేచనం - వేరుచేయుటను, కురు - చేయుము. తతః - అట్లుచేయుటవల్ల, రూఢతమః - మిక్కిలినిశ్చయింపబడినది, భవేత్ - అగును.

తా. నీకు చిత్తైకాగ్రతలేనియెడల ధ్యానముచేత సావధానచిత్తముగలవాడవగుము. ప్రవాహమువంటి యేకాకారచిత్తవృత్తిగలిగియుండుటయే ధ్యానమని చెప్పబడును. ఇట్లు, సూత్రం॥ ప్రత్యయైకతానతాధ్యానం॥ అనియోగశాస్త్రమందు పతంజలిచేత జెప్పబడెను. మరియు, సంశయముగలిగియున్నయెడల ప్రమాణయుక్తులచేత ఆకాశసద్వస్తువులను రెంటిని వివేకపూర్వకముగా నాలోచింపుము. అట్లుచేసితివేని ఆకాశసద్వస్తువులు రెండును పరస్పరముగా భిన్నములగుననెడి నిశ్చయము నీకు చక్కగాగలుగును. అరువదియేడవ (౬౭) శ్లోకమందు చెప్పినప్రకారము, శబ్దభేదబుద్ధిభేదములచేత సద్వస్త్వాకాశములు రెండును భిన్నములగునని తెలియుటయే ప్రమాణమగును. మరియు, అరువదియొనిమిదవశ్లోకమందు జెప్పినప్రకారము సద్వస్తువన్నిభూతములయందును. స్వాభావికముగా వర్తించియున్నదనియు, అట్లాకాశమితరభూతములయందు వర్తించియుండలేదని యాలోచించుటయే యుక్తియగునని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ ధ్యానాన్మానాద్యుక్తితోఽపిరూఢేభేదేవియత్సతోః।
నకదాచిద్వియత్సత్యంసద్వస్తుఛిద్రవన్నచ॥ ౭౪.

టీ. ధ్యానాత్ - ధ్యానమువల్లను, మానాత్ - ప్రమాణమువల్లను యుక్తితోఽపి- యుక్తివల్లను, వియత్సతోః - ఆకాశసద్వస్తువులయొక్క, భేదే- భేదము, రూఢేసతి- నిశ్చయింపబడినదగుచుండగా, కదాచిత్ - ఎప్పటికిని, వియత్ - ఆకాశము, సత్యం- సత్యము, న - కాదు. సద్వస్తు - బ్రహ్మవస్తువును, ఛిద్రవత్ - అవకాశముగలది, (నభవతిచ) కాదు.

తా. ప్ర. అయితే, అట్లాకాశసద్వస్తువులకు భేదముగలదనెడి నిశ్చయము గలుగుటవల్లలాభమేమి? ఉ. పైశ్లోకమందు చెప్పబడిన ధ్యానప్రమాణయుక్తులచేత ఆకాశసద్వస్తువులకు భేదముగలదనెడి నిశ్చయముగలుగుచుండగా, ఎప్పటికి నాకాశము సత్యముగాక, సర్వదామిధ్యయయ్యే తోచుచుండును, మరియు సద్వస్తువగు బ్రహ్మంబును అవకాశరూపముగల ఆకాశమువంటిది కానేకాదు. ఇట్లువాస్తవజ్ఞానముగలుగుటయే లాభమగునని యభిప్రాయము.

అవ. ఇప్పుడు ఫలితమును జెప్పుచున్నాడు.

శ్లో॥ జ్ఞస్యభాతిసదావ్యోమనిస్తత్త్వోల్లేఖపూర్వకం।
సద్వస్త్వపివిభాత్యస్యనిచ్ఛిద్రత్వపురస్సరం॥ ౭౫.

టీ. జ్ఞస్య - పండితునకు, సదా - ఎల్లప్పుడును, వ్యోమ - ఆకాశము, నిస్తత్త్వోల్లేఖపూర్వకం - మిధ్యారూపజ్ఞానపూర్వకముగా, భాతి-తోచుచున్నది. అస్య - ఈపండితునకు, సద్వస్త్వపి - బ్రహ్మవస్తువును, నిచ్ఛిద్రత్వపురస్సరం - నిరవకాశస్వభావపూర్వకముగా, విభాతి - ప్రకాశించుచున్నది.

తా. ఆకాశసద్వస్తువులకు రెంటికిని పరస్పరభేదముగలదని యెరిగినపండితునకు, (సర్వదా) ఆకాశము మిధ్యారూపజ్ఞానపూర్వకముగా దోచుచుండును. మరియు, ఈపండితునకు సద్వస్తువైన బ్రహ్మము నిరాకాశపూర్వకముగా ప్రకాశించుచుండును.

శ్లో॥ వాసనాయాంప్రవృద్ధాయాంవియత్సత్యత్వవాదినం।
సన్మాత్రాభిబోధయుక్తంచదృష్ట్వావిస్మయతేబుధః॥ ౭౬.

టీ. వాసనాయాం-ఆకాశమిధ్యాత్వసద్వస్తుసత్యత్వరూపమగు సంస్కారము పవృద్ధాయాం - వృద్ధిబొందుచుండగా, బుధః - ఆకాశసద్వస్తుస్వరూపములను తెలి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సినవాడు, వియత్సత్యత్వవాదినం=వియత్ - ఆకాశముయొక్క, సత్యత్వ - సత్యత్వ మునుగురించి, వాదినం - వాదించెడువానిని, సన్మాత్రాబోధయుక్తంచ = సన్మాత్ర - అవకాశములేని సద్వస్తువుయొక్క, అబోధయుక్తంచ - జ్ఞానాభావముతోగూడిన వానిని, దృష్ట్వా - చూచి, విస్మయతే - ఆశ్చర్యమును పొందుచున్నాడు.

తా. ప్ర. అయితే, ఆకాశము మిథ్యయనియు, సద్రూపబ్రహ్మము వస్తువనియు, నిట్లు సర్వదా చింతించెడివానికి లాభమేమి?. ఉ. ఆకాశము మిథ్యయనియు స్వరూపబ్రహ్మమేవస్తువనియు, ఇట్లు సర్వదాచింతించుటవల్ల ఆకాశముమిథ్యయనెడి దృఢజ్ఞానముగలుగును. అట్టిదృఢజ్ఞానియగు పండితుడు, ఆకాశము సత్యమని వాదించెడివానిని జూచియు, అవకాశములేని సద్వస్తువుయొక్క స్వరూపజ్ఞానములేని వానినిజూచియు, ఆశ్చర్యమును బొందుచున్నాడు.

అవ. ఈచెప్పిన న్యాయము నితరభూతములయందును జూపుచున్నాడు,

శ్లో॥ ఏవమాకాశమిథ్యాత్వేసత్సత్యత్వేచ వాసితే।
న్యాయేనా నేనవాయ్వాదేః సద్వస్తుప్రవివిచ్యతాం॥ ౭౭.

టీ. ఏవం-ఈప్రకారము, ఆకాశమిథ్యాత్వే=ఆకాశ - ఆకాశముయొక్క మిథ్యాత్వే-మిథ్యాత్వంబును, సత్సత్యత్వేచ=సత్ - సద్వస్తువుయొక్క, సత్యత్వేచ - సత్యత్వంబును, వాసితేసతి - చిత్తమందుదృఢముగా నివసించుచుండగా, అనేన - ఈ, న్యాయేన - న్యాయముచేత, వాయ్వాదేః - వాయువుమొదలగు భూతసంఘము వల్ల, సద్వస్తు - బ్రహ్మవస్తువు, ప్రవివిచ్యతాం - భిన్నముచేయబడుగాక. అనగా సద్వస్తువును బుద్ధిచేత విభజింపవలెననుట.

తా. ఈపైనచెప్పబడిన ప్రకారము, ఆకాశముమిథ్యయనియు, సద్వస్తువైన బ్రహ్మమే సత్యమనియు, ఇట్టి దృఢనిశ్చయము గలిగినపిమ్మట, పూర్వోక్తన్యాయముచేత వాయువు మొదలగు సర్వభూతములయందుగల సద్వస్తువును, బుద్ధిచేతనాయాభూతములవల్ల విభజించి భిన్నముగానున్నట్లు జూడవలెనని యభిప్రాయము.

శ్లో॥ సద్వస్తున్యేకదేశస్థామాయాతత్రైకదేశగం।
వియత్తత్రాప్యేకదేశగతోవాయుఃప్రకల్పితః॥ ౭౮.

టీ. మాయా - మాయాశక్తి- సద్వస్తుని - బ్రహ్మమందు, ఏకదేశస్థా= ఏకదేశ - ఒకభాగమందు, స్థా-ఉన్నదగును. తత్ర - ఆమాయయందు, వియత్ - ఆకాశము, ఏకదేశగం=ఏకదేశ - ఒకభాగమును, గం - పొందినదగును. తత్రాపి -

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆయాకాశమందును, ఏకదేశగతః=ఏకదేశ - ఒకభాగమును, గతః- పొందినదిగా, వాయుః - వాయువు, ప్రకల్పిత - కల్పించబడెను.

తా. ప్ర. అయితే, వాయువాకాశకార్యమగును. గనుక, తనకు కారణముగాని సద్వస్తువుతోటి వాయువునకు సంబంధమున్నట్లు తోచుటలేదు. అందుచేత వాయువుమొదలగు భూతములవల్ల సద్వస్తువును విభజించి యెరుగుట అప్రయోజకముగాదాయేమి? . ఉ. వాయువునకు సద్వస్తువుతోటి సాక్షాత్తుగా సంబంధములేకపోయినను పరంపరగా సంబంధముగలదు. అదియెట్లనగా చెప్పెదవినుము. సద్వస్తువునందొక భాగమందు మాయాశక్తియున్నది. ఆమాయయందొకభాగమందు ఆకాశమున్నది. ఆయాకాశమందొక భాగమందు వాయువున్నది. గనుక, వాయ్వాదిభూతములవల్ల సద్వస్తువును బుద్ధిచేత విభజింపవలయుననియభిప్రాయము.

అవ. ఇట్లు సద్వస్తువాయువులకు సంబంధమునుజూపి, ఆసద్వస్తువాయువులయొక్క స్వభావములవల్ల నారెంటియొక్క భేదజ్ఞానముకొరకు వాయువునందు దోచెడిధర్మములను జెప్పుచున్నాడు.

శ్లో॥ శోషస్పర్శౌగతిర్వేగో వాయుధర్మాఇమేమతాః।
త్రయస్స్వభావాస్సన్మాయావ్యోమ్నాంయే తేపివాయుగాః॥ ౭౯

టీ. శోషస్పర్శౌ- శోషస్పర్శములును. గతిః-గమనంబును, వేగః- వేగంబును, ఇమే - ఈనాలుగును, వాయుధర్మాః=వాయు - వాయువుయొక్క, ధర్మాః-స్వభావములుగా, మతాః-సమ్మతములగును. సన్మాయావ్యోమ్నాం=సత్ - సద్వస్తువుయొక్కయు, మాయా-మాయయొక్కయు, వ్యోమ్నాం-అకాశముయొక్కయు, యెపిత్రయః - యేమూడైన, స్వభావాః - స్వభావములుగలవో, తేపి - ఆమూడుస్వభావములును, వాయుగాః - వాయువును పొందియున్నవి.

తా. ౧. శుష్కింపజేయుటయు, ౨. స్పర్శము, ౩. గమనము, ౪. వేగము, ఈనాలుగును వాయువుయొక్క ధర్మములగును. మరియు, సద్వస్తుమాయా ఆకాశములయొక్క మూడుధర్మములును వాయువునందున్నవని తెలియవలెను.

అవ. ఆమూడుధర్మములెవ్వియనగా జెప్పుచున్నాడు.

శ్లో॥ వాయురస్తీతిసద్భావస్సతో వాయౌపృథక్కృతే।
నిస్తత్త్వరూపతామాయాస్స్వభావో వ్యోమగోధ్వనిః॥ ౮౦.

టీ. వాయుః - వాయువు, అస్తీతి - కలదనెడి వ్యవహారహేతువగు సద్భా

పత్వము, సద్భావః=సత్-సద్వస్తువుయొక్క, భావః- ధర్మమగును. వాయౌ - వాయువు, సతః-సద్వస్తువుకంటె, పృథక్కృతే సతి-బుద్ధిచేత భిన్నముచేయబడుచుండగా నిస్తత్త్వరూపతా - మిథ్యారూపత్వము, మాయాస్వభావః - మాయాధర్మమగును. ధ్వనిః - వాయువందుగల శబ్దము, వ్యోమగః - ఆకాశమునుపొందినదగును. అనగా ఆకాశధర్మమగుననుట.

తా. వాయువున్నదనెడి వ్యవహారకారణసద్రూపత్వము, వాయువునందెద్దిగలదో అది, ౧. సద్వస్తువుయొక్క ధర్మమగును. మరియు, అట్టిసద్వస్తువుకంటె వాయువును బుద్ధిచేతభిన్నముచేయగా, వాయువునందు, ఏమిథ్యాస్వరూపముగలదో, అది మాయయొక్క ధర్మమగును. మరియు, వాయువునందుగల శబ్దము, ౩॥ ఆకాశధర్మమగును. ఈచెప్పబడిన సద్వస్తుమాయాకాశ ధర్మములుమూడును వాయువునందున్నవని యభిప్రాయము.

అవ, ఇప్పుడు పూర్వవాది, ఆక్షేపించుచున్నాడు.

శ్లో॥ సతోనువృత్తిస్సర్వత్రవ్యోమ్నో నేతిపురేరితం।
వ్యోమానువృత్తిరధునాకథంనవ్యాహతంవచః॥ ౭౧.

టీ. సర్వత్ర-సర్వభూతములయందును, సతః - సద్వస్తువునకును, అనువృత్తిః-అనువర్తనముగలిగియున్నదనియు, వ్యోమ్నః - ఆకాశమునకు, నేతి - అనువర్తనము లేదనియు, పురా - పూర్వము, ఈరితం - చెప్పబడెను. అధునా - ఇప్పుడు, వ్యోమానువృత్తిః=వ్యోమ- ఆకాశముయొక్క, అనువృత్తిః- అనువర్తనము చెప్పబడెను. వచః - ఈవాక్యము, కథం - ఎట్లు, నవ్యాహతం - దోషముకలదిగాదు. అనగా దోషయుతమగును.

తా. ఓ అద్వైతసిద్ధాంతీ, పూర్వమాకాశసద్వస్తువులకు భేదమును దెలుపునప్పుడు, అరువదియేడవశ్లోకమందు, వాయ్వాదిభూతములయందు సద్వస్తువర్తించియున్నదనియు, ఆకాశము వర్తించియుండలేదనియుం జెప్పితిరి. ఇప్పుడిక్కడ, ఆకాశము వాయువునందు వర్తించియున్నదని చెప్పితిరి. ఇట్లు చెప్పుటచేత పరస్పర విరోధము గలుగుచున్నది.

అవ. ఇట్లు పూర్వవాది శంకించగా, సిద్ధాంతిపరిహారమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఛిద్రానువృత్తిర్నేతీతిపూర్వోక్తిరధునాత్వియం।
శబ్దానువృత్తిరేవోక్తా వచసో వ్యాహతిఃకుతః॥ ౭౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఛిద్రానువృత్తిః=ఛిద్ర-అవకాశస్వరూపముయొక్క, అనువృత్తిః- అనువర్తనము, నేతీతి - లేదని, పూర్వోక్తిః- పూర్వమందు జెప్పబడెను. అధునాతు - ఇప్పుడో, శబ్దానువృత్తిరేవ=శబ్ద - శబ్దముయొక్క, అనువృత్తిరేవ - అనువర్తనమే, ఉక్తా-చెప్పబడెను. వచసః - ఈవాక్యమునకు, వ్యాహతిః - విరోధము, కుతః - ఎక్కడిది. అనగా విరోధములేదనుట,

తా. ఓపూర్వవాదీ, ఆకాశముయొక్క అవకాశలక్షణస్వరూపము వాయ్వాదులయందు వర్తించియుండలేదని, పూర్వమరువది యేడవశ్లోకమందు జెప్పబడెను. ఇప్పుడో, ఆకాశముయొక్క గుణమగుశబ్దమే వాయువునందు వర్తించియున్నదని చెప్పబడెను. గనుక, ఈవాక్యమువల్ల విరోధములేదని తెలిసికొనుము.

అవ. ఇప్పుడు పూర్వవాది, ఒకచోద్యమును చేయుచున్నాడు.

శ్లో॥ ననుసద్వస్తుపార్థక్యాదసత్త్వంచేత్తదాకథం।
అవ్యక్తమాయావైషమ్యాదమాయామయతాపినో॥ ౮౩.

టీ. నను - ఓయీ, సద్వస్తుపార్థక్యాత్=సద్వస్తు-బ్రహ్మవస్తువుకంటె, పార్థక్యాత్ - వాయువన్యమగుటవల్ల, అసత్త్వంచేత్ - మిథ్యాభావమైనయెడల, తదా-అప్పుడు, అవ్యక్తమాయావైషమ్యాత్ = అవ్యక్త - ఇంద్రియము గోచరముగాని, మాయా-మాయారూపముకంటె, వైషమ్యాత్ -వాయురూపమన్యమగుటవల్ల, అనగా ఇంద్రియగోచరమగుటవల్లననుట. అమాయామయతాపి- మాయామయరహితత్వంబును, కథం-ఎట్లు, నో-లేదు, అనగావాయువు మాయామయము గాదనుట.

తా. ప్ర. అయితే, ఓ అద్వైతసిద్ధాంతీ, సద్వస్తువగు బ్రహ్మముకంటె వాయువన్యమగుటవల్ల, ఆవాయువునకు మిథ్యాలక్షణమైన మాయామయత్వమును జెప్పితిరి. అట్లైనయెడల మాయాస్వరూపము అవ్యక్తమగును. వాయుస్వరూపము వ్యక్తమగును. గనుక, మాయాస్వరూపమగు అవ్యక్తత్వముకంటె వాయురూపమగు వ్యక్తత్వము అన్యమగుటవల్ల, ఆవాయువు మిథ్యాలక్షణమైన మాయామయత్వముగలదికాదని చెప్పరాదాయేమి ?. ఇంద్రియగోచరముగానిది (అవ్యక్తమనియు, ( ఇంద్రియగోచరమైనది) (వ్యక్తమనియుం) జెప్పబడును.

అవ. ఈచోద్యమును సిద్ధాంతి పరిహరించుచున్నాడు.

శ్లో॥ నిస్తత్త్వరూపతైవాత్రమాయాత్వస్యప్రయోజికా।
సాశక్తికార్యయోస్తుల్యావ్యక్తావ్యక్తత్వభేదినోః॥ ౮౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అత్ర - ఇక్కడ, మాయాతస్య - మాయామయత్వమునకు, నిస్తత్త్వరూపతైవ - మిథ్యారూపత్వమే, ప్రయోజికా - ప్రయోజనముగాగలదియగును. సా - ఆ మిథ్యారూపత్వము, వ్యక్తావ్యక్తత్వభేదినోః=వ్యక్త - వ్యక్తలక్షణముచేతను, అవ్యక్తత్వ - అవ్యక్తలక్షణముచేతను, భేదినోః - భేదముగల, శక్తికార్యయోః - మాయామాతత్కార్యములయందు, తుల్యా - సమానమగును.

తా. మాయామయత్వమందు మిథ్యాలక్షణమే ప్రయోజనమగుగాని, అవ్యక్తభావము ప్రయోజనముగాదు ఆమిథ్యాలక్షణము మాయయందును, మాయాకార్యమైన ప్రపంచమందును సమానముగానున్నది. గనుక, వాయువును మాయామయముగాని దానినిగా జెప్పరాదని యభిప్రాయము.

శ్లో॥ సదసత్త్వవివేకస్యప్రస్తుతత్వాత్సచింత్యతాం।
అసతోఽవాంతరోభేదఆస్తాంతచ్చింతయాత్రకిం॥ ౭౫.

టీ. సదసత్త్వవివేకస్య = సత్ - సద్వస్తుస్వరూపముయొక్కయు, అసత్వ - మిథ్యారూపముయొక్కయు, వివేకస్య - వివేచనమునకు, ప్రస్తుతత్వాత్ - ఇప్పుడు ప్రకృతమగుటవల్ల, సః - ఆవివేచనము, చింత్యతాం - చింతింపబడుగాక. అసతః - మిథ్యారూపమగు మాయాతత్కార్యముయొక్క, అవాంతరః - మధ్యమందుగలిగిన వ్యక్తావ్యక్తత్వరూపమగు, భేదః - భేదము, ఆస్తాం - ఉండుగాక. అత్ర - ఇక్కడ, తచ్చింతయా=తత్ - అవ్యక్తావ్యక్తత్వరూపముయొక్క, చింతయా - విచారణముచేత, కిం - ప్రయోజనమేమి. అనగా ప్రయోజనములేదనుట.

తా. ప్ర. అయితే, మాయయందును, మాయాకార్యమైన ప్రపంచమందును మిథ్యారూపలక్షణము సమానమైయుండుగా, మాయకు అవ్యక్తరూపంబును, ప్రపంచమునకు వ్యక్తరూపంబునుం గలుగుటకు కారణమేమి?. ఉ. ప్రస్తుతమందు సద్వస్తువగు బ్రహ్మస్వరూపమిట్టిదనియు, మిథ్యాలక్షణముగల మాయాతత్కార్యస్వరూపమిట్టిదనియుం దెలియుటకు విచారణమును జేయుచుంటిమి. గనుక, అట్టివిచారణమునే శేయవలయుగాని, మాయాతత్కార్యమునకుగల, అవ్యక్తవ్యక్తిరూపభేదమును విచారించుటవల్ల ఇక్కడ ప్రయోజనములేదు. అనగా మిథ్యాలక్షణముగల మాయాతత్కార్యరూపమునకు వ్యక్తావ్యక్తత్వరూపభేదము మధ్యమందు గలిగెనని యభిప్రాయము.

అవ. ఇప్పుడు ఫలితమును జెప్పుచున్నాడు.

శ్లో॥ సద్వస్తుబ్రహ్మశిష్టోంశోవాయుర్మిథ్యాయథావియత్।
వాసయిత్వాచిరంవాయోర్మిథ్యాత్వంమరుతంత్యజేత్॥ ౭౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. సద్వస్తు - వాయువునందుగల సద్వస్తువు, బ్రహ్మ - బ్రహ్మరూపమగును శిష్టః-మిగిలిన, అంశః - మిథ్యారూపాదికము వాయుస్స్వరూపమగును. (సః) అ, వాయుః - వాయువు, యథావియత్ - ఆకాశమువలెనే, మిథ్యా - మిథ్యయగును. వాయోః - వాయువుయొక్క, మిథ్యాత్వం - మిథ్యాభావమును, చిరం - బహుకాలము, వాసయిత్వా - బుద్ధియందునిలిపి, మరుతం - వాయువుసత్యమనెడి బుద్ధిని, త్యజేత్ - విడువవలెను.

తా. (వాయువున్నదని) అనెడివ్యవహారమునకు కారణమైనసద్వస్తువువాయువునందెద్దిగలదో, అది బ్రహ్మరూపమగును. ఇట్లు వాయువునందుగల సద్వస్తువును బుద్ధిచేత భిన్నముచేయగా, మిగిలిన మాయాకాశ ధర్మాత్మకమగు మిథ్యారూపాధికమంతయు వాయువుయొక్క స్వరూపమగును. అనగా, మాయాధర్మమగు, ౧. మిథ్యాభావంబును ౨. ఆకాశధర్మమగు శబ్దంబును, వాయువుయొక్క స్వకీయధర్మములగు, ౩. శోషత్వంబును, ౪. స్పర్శంబును, ౫ గమనంబును, ౬. వేగంబును, ఇవియన్నియు వాయువుయొక్క స్వరూపమని తెలియవలెను? వాయువునందుగల సద్వస్తువును బుద్ధిచేత భిన్నముజేయగా, మిగిలిన వాయుస్స్వరూపమంతయు మిథ్యయగుటవల్ల, ఆకాశమువలెనే ఈవాయువును మిథ్యయేయగునని తెలియవలెను. ఇట్లు వాయువుయొక్క మిథ్యాభావమును బహుకాలమువరకు బుద్ధియందుంచుకొని, పిమ్మట వాయువు సత్యమనెడి బుద్ధిని విడువవలెనని యభిప్రాయము.

అవ. వాయువునందు జెప్పబడిన విచారణ నగ్నియందుజూపుచున్నాడు.

శ్లో॥ చింతయేద్వహ్నిమప్యేవంమరుతోన్యూనవర్తినం।
బ్రహ్మాండావరణేష్వేషాన్యూనాధికవిచారణా॥ ౭౭.

టీ. మరుతః - వాయువుకంటె, న్యూనవర్తినం=న్యూన - అల్పత్వముచేత, వర్తినం - వర్తించెడి, వహ్నిమపి - అగ్నినియు, ఏవం- ఈప్రకారము, చింతయేత్ - చింతింపవలెను. ఏషా - ఈ, న్యూనాధికవిచారణా=న్యూన - అల్పత్వముయొక్కయు, అధిక - అధికత్వముయొక్కయు, విచారణా - విచారణము, బ్రహ్మాండావరణేషు=బ్రహ్మాండ - బ్రహ్మాండముయొక్క, ఆవరణేషు - ఆవరణములయందున్నది.

తా, మరియు, వాయువుకంటె తక్కువగా వర్తించెడి అగ్నినియు, ఈచెప్పిన ప్రకారమే విచారించవలెను. ప్ర. అయితే (౭౮) డెబ్బదియెనిమిదవ శ్లోకమందు ఆకాశాది భూతములకు అల్పత్వాధికత్వ భావములున్నట్లు తెలియబడెను. ఈయల్ప


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్వాధికత్వములు లోకమందెచ్చటైనం గనబడలేదేమి?. ఉ. ఆకాశాది భూతములకు అధికత్వాల్పత్వములు బ్రహ్మాండావరణములయందు గలిగియున్నవని తెలియవలెను.

శ్లో॥ వాయోర్దశాంశతోన్యూనోవహ్నిర్వాయౌప్రకల్పితః।
పురాణోక్తంతారతమ్యందశాంశైర్భూతపంచకే॥ ౭౭.

టీ. వహ్నిః - అగ్ని, వాయోః - వాయువుయొక్క, దశాంశతః - భాగదశకమువల్ల, న్యూనస్సన్ = - తక్కువదియగుచు, వాయౌ - వాయువునందు, ప్రకల్పితః - కల్పించబడెను. అనగా వాయువునందుగల పదిభాగములలో నొకభాగమందే అగ్ని యున్నదనుట. భూతపంచకే - ఆకాశాది భూతపంచకమందు, దశాంశైః - దశభాగములచేత, తారతమ్యం - అల్పత్వాధికత్వరూపభేదము, పురాణోక్తం = పురాణ - పురాణములయందు, ఉక్తం - చెప్పబడెను.

తా. ప్ర. అయితే, వాయువుకంటె ఎంతమాత్రపు భాగముచేత అగ్నితక్కువై వర్తించుచున్నదో జెప్పుము?. ఉ. వాయువును పదిభాగములుచేయగా ఒకభాగ ప్రదేశమందుమాత్రమే అగ్నివర్తించుచున్నదని తెలియవలెను. ఇట్లు అగ్నిభూతము వాయువునందు కల్పించబడుటచేత ఆయగ్నిభూతము వాస్తవముకాదు. ప్ర. అయితే, ఈయల్పత్వాధికత్వవములు మీచేతనే కల్పించబడెనా ఏమి?. ఉ. ఆకాశాది పంచభూతములకును దశభాగములచేతగల తారతమ్యము పురాణములయందు జెప్పబడియున్నది. ప్ర. అయితే, ఆపురాణములయందెట్లు చెప్పబడెనో జెప్పుము. ఉ. బ్రహ్మాండావరణముకంటె భూమియొక్క ఆవరణము పదిభాగములెక్కువనియు, ఆభూమియొక్క ఆవరణముకంటె జలావరణము పదిభాగములెక్కువనియు, ఆజలావరణముకంటె అగ్నియొక్క ఆవరణము పదిభాగములెక్కువనియు, అగ్నియొక్కఆవరణముకంటె వాయువుయొక్క ఆవరణము పదిభాగములెక్కువనియు, ఆవాయువుయొక్క ఆవరణముకంటె ఆకాశముయొక్క ఆవరణము పదిభాగము లెక్కువనియు, ఇట్లు పురాణములయందు జెప్ప బడెను. గనుక, ఆకాశమందుగల దశభాగములలో ఒకభాగప్రదేశమందుమాత్రమే వాయువువర్తించుచున్నదనియు, వాయువునందుగల దశభాగములలో ఒకభాగప్రదేశమందుమాత్రమే అగ్నిభూతము వర్తించుచున్నదనియు, అగ్నియందుగల దశభాగములలో ఒకభాగ ప్రదేశమందుమాత్రమే జలభూతము వర్తించుచున్నదనియు, జలమందుగల దశభాగములలో ఒకభాగ ప్రదేశమందుమాత్రమే భూమి వర్తించుచున్నదనియు, భూమియందుగల దశభాగప్రదేశములలో ఒకభాగప్రదేశమందు మాత్రమే బ్రహ్మాండము వర్తించుచున్నదనియుం దెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇప్పుడగ్నియొక్క స్వరూపమును జెప్పుచున్నాడు.

శ్లో॥ వహ్నిరుష్ణఃప్రకాశాత్మాపూర్వానుగతిరత్రచ।
అస్తివహ్నిస్సనిస్తత్త్వశ్శబ్దవాన్స్పర్శవానపి॥ ౮౯.

టీ. వహ్నిః - అగ్ని, ఉష్ణః - ఉష్ణశక్తిగలదియు, ప్రకాశాత్మా=ప్రకాశ - తేజమే, ఆత్మా-స్వరూపముగలదియునగును. అత్రచ - ఈయగ్నియందును, పూర్వానుగతిః=పూర్వ-కారణధర్మముల యొక్క, అనుగతిః - అనువర్తనముగలిగియున్నది. సః- ఆ, వహ్నిః - అగ్ని, అస్తి-కలదనియు, నిస్తత్త్వః- మిథ్యాస్వరూపమైనదియు, శబ్దవాన్ - శబ్దగుణముగలదనియు, స్పర్శవానపి - స్పర్శగుణముగలదనియుం జెప్పబడుచున్నది.

తా. ప్ర. అయితే, అగ్నియొక్క స్వరూపమెట్టిది ?. ఉ. ఉష్ణశక్తిగల తేజోరూపమగ్నియొక్క స్వరూపమగును. మరియు, వాయువునందువలెనే, ఈ యగ్నియందును కారణధర్మములు వర్తించియున్నవి. ప్ర అగ్నియందుగల, అకారణధర్మములెవ్వి ?. ఉ. (అగ్నిఉన్నది) అనెడి వ్యవహారమునకు కారణమైన వస్తువు, ఆ అగ్నియందెద్దిగలదో, అది సద్వస్తుధర్మమగును. మరియు, అగ్నియందుగల సద్వస్తువును బుద్ధిచేత భిన్నముజేయగా, మిగిలిన మిథ్యారూపమగు అగ్నిస్వరూపమంతయు మాయాధర్మమగును. మరియు, అగ్నియందుగల శబ్దగుణము ఆకాశధర్మమగును. మరియు, అగ్నియందుగల స్పర్శగుణము వాయుధర్మమగునని తెలియవలెను.

అవ. ఇట్లు అగ్నియందు కారణధర్మములు అనువర్తించుచున్నవని చెప్పుచు అగ్నియొక్క స్వకీయధర్మము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ సన్మాయావ్యోమవాయ్వంశైర్యుక్తస్యాగ్నేర్నిజోగుణః।
రూపంతత్రసతస్సర్వమన్యద్బుధ్యావివిచ్యతాం॥ ౯౦.

టీ. సన్మాయావ్యోమవాయ్వంశైః=సత్ - సద్వస్తువగు బ్రహ్మముయొక్కయు, మాయా - మాయయొక్కయు, వ్యోమ - ఆకాశముయొక్కయు, వాయు -వాయువుయొక్కయు, అంశైః - అంశములతోటి, యుక్తస్య - కూడియున్న, అగ్నేః - అగ్నియొక్క, నిజః - స్వకీయమైన- గుణః - గుణము, రూపం - రూపమగును. తత్ర- ఆధర్మసమూహమందు, సతః - సద్వస్తువుకంటె, అన్యత్ - ఇతరమైన, సర్వం- సకలధర్మరాశి, బుధ్యా - బుద్ధిచేత, వివిచ్యతాం - భిన్నముచేయబడుగాక. అనగా భిన్నముగా జేయవలెననుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఇట్లు సద్వస్తుమాయాకాశ వాయుధర్మములతోఁగూడిన అగ్నియొక్క స్వంతగుణము రూపమగును. అట్టిధర్మములయందు సద్వస్తువుకంటె అన్యమగు ధర్మరాశినంతయు, మిథ్యయనిదలచి, ఆధర్మరాశినంతయు సద్వస్తువుకంటె భిన్నముగా జేయవలెను. ఇట్లు చేయుటచేత అగ్నిస్వరూపమంతయు మిథ్యయనెడి నిశ్చయము గలుగును.

అవ. ఇట్లగ్నియొక్క మిథ్యాభావనిశ్చయము గలిగినపిమ్మట, జలములు మిథ్యయని చింతింపవలెనని ఇప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ సతోఽవివేచితేవహ్నౌమిథ్యాత్వేసతివాసితే।
ఆపోదశాంశతోన్యూనాఃకల్పితాఇతిచింతయేత్॥ ౯౧.

టీ. సతః - సద్వస్తువుకంటె, వివేచితే - భిన్నముగాజేయబడిన, వహ్నౌ - అగ్నియందు, మిథ్యాత్వే - మిథ్యాభావము, వాసితేసతి - చిత్తమునందు దృఢముగా నాటబడినదాయుండగా, దశాంశతః - భాగదశకమువల్ల, న్యూనాస్సంతః - తక్కువైనవగుచు, ఆపః - జలములు, కల్పితాఇతి - అగ్నియందు కల్పించబడినవని, చింతయేత్ - ధ్యానింపవలెను.

తా. పూర్వోక్తప్రకారము, సద్వస్తువుకంటె అగ్నిస్వరూపమును బుద్ధిచేత భిన్నముగాజేసి ధ్యానించుటవల్ల, అగ్నిభూతము మిథ్యయనెడి నిశ్చయముగలిగిన పిమ్మట, జలములు అగ్నియందు కల్పించబడినవనియు, ఆజలములు అగ్నిభూతమందు గల దశభాగములలో ఒకభాగప్రదేశమందు మాత్రమే కల్పించబడినవనియుం జింతింపవలెను.

అవ. ఈజలమునకును కారణధర్మస్వధర్మములను విభజించిచూపుచున్నాడు.

శ్లో॥ సంత్యాపోమూశ్శూన్యతత్వాస్సశబ్దస్పర్శసంయుతాః।
రూపవత్యోన్యధర్మానువృత్త్యాస్స్వీయోరసోగుణః॥ ౯౨.

టీ. అన్యధర్మానువృత్త్యా=అన్యధర్మ - సద్వస్తువు మొదలగువాని ధర్మముల యొక్క, అనువృత్త్యా - అనువర్తనముచేత, అమూః - ఈ, ఆపః-జలములు, సంతః-వున్నవనియు, శూన్యతత్వాః - మిథ్యారూపములనియు, సశబ్దస్పర్శసంయుతాః = సశబ్ద - శబ్దములోఁగూడివర్తించెడి, స్పర్శ-స్పర్శముతోటి, సంయుతాః - కలసియున్నవనియు, రూపవత్యః - రూపగుణమునుకలిగియున్నవనియుం జెప్పబడుచున్నవి, స్వీయః - స్వకీయమైన, గుణః- గుణము, రసః- రసమగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. జలములున్నవనెడి వ్యవహారమునకు కారణమైనవస్తువు, ఆజలములయం దెద్దిగలదో, అది, ౧. సద్వస్తు, ధర్తమగును. మరియు, ఆజలములయందుగల సద్వస్తువును బుద్ధిచేత భిన్నముజేయుగా మిగిలిన మిథ్యారూపమద్దిగలదో, అది, ౨. మాయా ధర్తమగును. మరియు, ఆజలములయందుగల, శబ్దగుణము, 3. ఆకాశధర్తమగును. మరియు, ఆజలములయందుగల స్పర్శగుణము, ౪. వాయుధర్తమగును. మరియు, ఆ జలములయందుగల రూపగుణము, ౫. అగ్నిధర్తమగును. ఇట్లు జలమందు అయిదు కారణధర్తములుగలిగియున్నవి. మరియు, ఆజలముయొక్క స్వాంతగుణమురసమగును.

అవ. వివేకధ్యానములచేత జలములకు మిథ్యాత్వమును నిశ్చయించినపిమ్మట, భూమియొక్క మిథ్యాత్వమును చింతింపవలెనని ఇప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ సతోవివేచితాస్వప్సుతన్మిథ్యాత్వేచవాసితే।
భూమిర్దశాంశతోన్యూనాకల్పితాప్స్వితిచింతయేత్॥ ౯3.

టీ. అప్సు - జలములు, సతః - సద్వస్తువుకంటె, వివేచితాసు - బుద్ధిచేత భిన్నముగాజేయబడుచు, తన్మిథ్యాత్వేచ=తత్ - ఆజలములయొక్క, మిథ్యాత్వేచ - మిథ్యాభావంబును, వాసితేసతి - నిశ్చయింపబడినదౌచుండగా, దశాంశతః - భాగ దశకమువల్ల, న్యూనా - తక్కువగు, భూమిః - భూమి, అప్సు - జలములయందు, కల్పితేతి - కల్పించబడెనని, చింతయేత్ - ధ్యానింపవలెను.

తా. ఆజలభూతమందుగల సద్వస్తువుకంటె, మిగిలిన జలస్వరూపమును బుద్ధిచేత భిన్నముగాజేసి, ఆజలరూపమును మిథ్యయని తలంచవలయును. ఇట్లువివేకధ్యానములచేత జలములు మిథ్యయనెడి నిశ్చయముగలిగినపిమ్మట, ఆజలములయందుగల దశభాగములలో నొకభాగప్రదేశమందు మాత్రమే భూమికల్పించబడెనని చింతింపవలెను.

అవ. ఆభూమిని మిథ్యయని చింతించుటకొరకు, ఆభూమియొక్క ధర్తములను విభజించి చూపుచున్నాడు.

శ్లో॥ అస్తిభూస్తత్వశూన్యాస్యాంశబ్దస్పర్శౌసరూపకౌ।
రసశ్చపరతోగంధోనైజస్సత్తావివిచ్యతాం॥ ౯౪.

టీ. పరతః - సద్వస్తువు మొదలగువానివల్ల, భూః - భూమి, అస్తి - వున్నదనియు, తత్వశూన్యా - మిథ్యాస్వరూపమనియుం జెప్పబడుచున్నది. అస్యాం - ఈ భూమియందు, సరూపకౌ - రూపయుతోగూడి వర్తించుచుండెడి, శబ్దస్పర్శౌ - శబ్దస్ప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్శములును, రసశ్చ- రసగుణంబునుంగలిగియున్నవి. గంధః - గంధము, నైజః - స్వకీయగుణమగును. సత్తా - ఈభూమియందుండెడి సద్వస్తుధర్మము, వివిచ్యతాం, భిన్నముచేయబడు గాక.

తా. (భూమియున్నది.) అనెడి వ్యవహారమునకు హేతువగువస్తువు, ఆభూమియందెద్దిగలదో, అది, ౧. సద్వస్తుధర్మమగును, మరియు, ఆభూమియందుగల సద్వస్తువును బుద్ధిచేతభిన్నముచేయగా, ఆభూమియందుగల మిథ్యారూపము ౨. మాయాధర్మమగును. మరియు, ఆభూమియందుగలశబ్దగుణము, ౩. ఆకాశధర్మమగును. మరియు, ఆభూమియందుగల స్పర్శగుణము, ౪. వాయుధర్మమగును. మరియు, ఆభూమియందుగల రూపగుణము, ౫. అగ్నిధర్మమగును. ఆభూమియందుగల రసగుణము, ౬. జలధర్మమగును. ఇట్లు కారణధర్మములు భూమియందు గలిగియున్నవి. మరియు, భూమియొక్క స్వకీయగుణము, గంధమగును. ఈచెప్పబడిన ఏడింటిలో భూమియందుగల సద్వస్తువును మాత్రము బుద్ధిచేత భిన్నముగాచేయవలయును.

అవ. సద్వస్తువును భిన్నముగాజేయుటచేత ఫలముం జెప్పుచున్నాడు.

శ్లో॥ పృథక్కృతాయాంసత్తాయాంభూమిర్మిథ్యావశిష్యతే।
భూమేర్దశాంశతోన్యూనం బ్రహ్మాండం భూమిమధ్యగం॥ ౯౫.

టీ. సత్తాయాం - సద్వస్తుధర్మము, పృథక్కృతాయాంసత్యాం - బుద్ధిచేత భిన్నముజేయబడుచుండగా, భూమిః - భూమి, మిథ్యా-మిథ్యయగుచు, అవశిష్యతే- శేషింపబడుచున్నది. అనగా మిగులుచున్నదనుట. భూమేః - భూమియొక్క, దశాంశతః - భాగదశకమువల్ల, న్యూనంసత్ - తక్కువైనదగుచు, బ్రహ్మాండం - బ్రహ్మాండము, భూమిమధ్యగం - భూమధ్యమునుపొందియున్నది.

తా. ఆభూమియందుగలసద్వస్తువును బుద్ధిచేత భిన్నముజేయగా, భూమి మిథ్యారూపమైతోచుచుండును. ఇట్లు భూమి మిథ్యయనెడి నిశ్చయముగలిగినపిమ్మట, ఆభూమధ్యమందు బ్రహ్మాండము కల్పించబడెననియు, ఆబ్రహ్మాండము భూమియొక్క దశభాగములలో ఒకభాగప్రదేశమందు మాత్రమే యున్నదనియుం జింతింపవలెను.

అవ. ఇట్లు పంచభూతములవల్ల సద్వస్తువును బుద్ధిచేతవిభజించి, ఇకనాపంచభూతకార్యములగు బ్రహ్మాండాదులవల్ల సద్వస్తువును బుద్ధిచేత విభజించుటకొరకు, ఆబ్రహ్మాండాదులయొక్క స్థితిని జెప్పుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మాండమధ్యేతిష్ఠంతిభువనానిచతుర్దశ।
భువనేషువసంత్యేషుప్రాణిదేహాయథాయథం॥ ౯౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. బ్రహ్మాండమధ్యే - బ్రహ్మాండమధ్యమందు. చతుర్దశ - పదునాలుగు భువనాని - లోకములు, తిష్ఠంతి - స్థితినిపొందుచున్నవి. ఏషు-ఈ, భువనేషు-లోక ములయందు, యథాయథం - ఆయాలోకమునకు దగినట్లు, ప్రాణిదేహాః=ప్రాణి - జీవులయొక్క, దేహాః - దేహములున్నవి.

తా. ఆబ్రహ్మాండమధ్యమందు పదునాలుగులోకములున్నవి. ఈపదునాలుగు లోకములయందును ఆయాలోకమునకు దగినశరీరములు ప్రాణులకు గలిగియున్నవి. ఈబ్రహ్మాండంబును, పదునాలుగులోకంబులును, శరీరంబులును ఘటాది సకలపదార్థ ములును, ఇవియన్నియు పంచభూతకార్యములగుటవల్ల భౌతికములని చెప్పబడును.

అవ. అభౌతికములయందుగల సద్వస్తువును బుద్ధిచేత భిన్నముగాజేయుటవల్ల ఫలమును జెప్పుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మాండలోకదేహేషు సద్వస్తుని పృథక్కృతే।
అసంతోఽండాదయో భాంతు తద్భానేఽపీహ కా క్షతిః॥ ౯౭.

టీ. బ్రహ్మాండలోకదేహేషు=బ్రహ్మాండ - బ్రహ్మాండమందును, లోక - పదు నాలుగులోకములయందును, దేహేషు - ఆయాశరీరములయందునుగల, సద్వస్తుని - బ్రహ్మవస్తువు, పృథక్కృతేసతి- భిన్నముచేయపడుచుండగా, అండాదయః- బ్రహ్మాం డాదులు, అసంతః - వాస్తవముగాలేనివగుచు, భాంతు - తోచుచుండుగాక. తద్భా నేఽపి - ఆబ్రహ్మాండాదికము తోచుచున్నను, ఇహ - ఈ అద్వైతబ్రహ్మజ్ఞానమునకు, కాక్షతిః - హానియేమి. అనగా బాధలేదనుట.

తా. బ్రహ్మాండలోకదేహములయందుగల సద్వస్తువును బుద్ధిచేత భిన్నముచేయ గా, ఆబ్రహ్మాండాదులు వాస్తవముగాలేకనే, వున్నట్లు తోచుచున్నను, ఈఅద్వైత బ్రహ్మవిద్యకు బాధకములేదని యభిప్రాయము.

అవ. బాధలేదనెడి యభిప్రాయమునే ఇప్పుడు స్పష్టీకరించుచున్నాడు.

శ్లో॥ భూతభౌతికమాయానాం సమత్వేఽత్యంతవాసితే।
సద్వస్త్వద్వైతమిత్యేషా ధీర్విపర్యేతి న క్వచిత్॥ ౯౮.

టీ. భూతభౌతికమాయానాం=భూత - ఆకాశాదులయొక్కయు, భౌతిక - బ్రహ్మాండాదులయొక్కయు, మాయానాం - మాయయొక్కయు, సమత్వే-ఏకత్వము అనగా మిథ్యాభావమనుట, అత్యంతవాసితేసతి- చిత్తమందు దృఢముగలుగునట్లు నివ సింపబడుచుండగా, సద్వస్తు-బ్రహ్మవస్తువు, అద్వైతమితి - అద్వైతరూపమనెడి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏషా - ఈ, ధీః-బుద్ధి, క్వచిత్ - ఎప్పటికిని - నవిపర్యేతి - విపరీతమునుపొందదు. అనగా చెడదనుట.

తా. ఈముందుచెప్పబడిన ప్రకారము, ఆకాశాదిపంచభూతములకును, ఆభూతకార్యములగు బ్రహ్మాండలోకదేహాదులకును, వీనియన్నిటికిని కారణమగు మాయకును మిథ్యాభావమును వివేకధ్యానములచేత చిత్తమందు మిక్కిలి దృఢముగా నివసించెడి పర్యంతమభ్యసింపవలెను. అట్లు మిథ్యాభావము దృఢమగుచుండగా సద్వస్తువునకు అద్వైతభావబుద్ధి, ఎప్పటికినినశింపదని యభిప్రాయము.

శ్లో॥ సదద్వైతాత్పృథగ్భూతేద్వైతేభూమ్యాదిరూపిణి।
తత్తదర్థక్రియాలోకేయథాదృష్టాతథైవసా॥ ౯౯.

టీ. సదద్వైతాత్=సత్ - సద్రూపమగు, అద్వైతాత్ - అద్వితీయవస్తువుకంటె, భూమ్యాదిరూపిణి=భూమ్యాది - భూమిమొదలగునదియే, రూపిణి-రూపముగాగల, ద్వైతే - ద్వైతము, పృథగ్భూతేసతి భిన్నముగా చేయబడినదాచుండగా, తత్తదర్థక్రియా = తత్తదర్థ - ఆయాపదార్థములయొక్క, క్రియా - ప్రయోజనము, లోకే - లోకమందు, యథా - ఏప్రకారముగా, దృష్టా - అదివరకు జూడబడెనో, అనగా అనుభవింపబడెనోయనుట- తథైవ- ఆప్రకారమే, సా. ఆయాపదార్థప్రయోజనము, (దృష్టా) చూడబడినది.

తా. ప్ర. అయితే, ఈపూర్వోక్తప్రకారము సద్వస్తువును భిన్నముజేయుటచేత, భూమ్యాదులులేకపోవుచుండగా, జ్ఞానికి వ్యవహారలోపముకాదాయేమి? . ఉ. అద్వితీయబ్రహ్మముకంటె అన్యమైన భూమ్యాదిరూపముగల ద్వైతమందు, ఆయాపదార్థప్రయోజనము అదివరకు ఏప్రకారముము జూడబడెనో. ఆప్రకారమే బ్రహ్మజ్ఞానోత్పత్తియైనపిమ్మటయు, ఆయాపదార్థప్రయోజనము జ్ఞానిచేత ఎరుగబడుచున్నది. గనుక, జ్ఞానికి వ్యవహారము లోపించదు. అనగా వివేకముచేత ద్వైతమునకు మిథ్యాభావమును నిశ్చయించినను, భూమ్యాది ద్వైతముయొక్క స్వరూపమును నశింపజేయమిచేత, జ్ఞానికి వ్యవహారలోపముగలుగదని యభిప్రాయము.

శ్లో॥ సాంఖ్యకాణాదబౌద్ధాద్యైర్జగద్భేదోయథాయథా।
ఉత్ప్రేక్ష్యతేనేకయుక్త్యాభవత్వేషతథాతథా॥ ౧౦౦.

టీ. సాంఖ్యకాణాదబౌద్ధాద్యైః=సాంఖ్య - సాంఖ్యులచేతను, కాణాద - తార్కికులచేతను, బౌద్ధాద్యైః - బౌద్ధులు మొదలగువారిచేతను, జగద్భేదః=జగత్ -

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జగత్తుయొక్క, భేదః - భేదము, యథాయథా- ఏయేప్రకారముగా, అనేకయుక్త్యా- అనేకవిధయుక్తిచేత, ఉత్ప్రేక్ష్యతే - వర్ణించబడెనో, తథాతథా - ఆయాప్రకార ముగా, ఏవః - ఈజగద్భేదము, భవతు - మాకునగుగాక.

తా. ప్ర. అయితే. సద్వస్తువైన బ్రహ్మమునకు అద్వితీయరూపమైనయెడల సాంఖ్యాదివాదులు జెప్పెడి జగద్భేదమును మీరు నివారింపజేయమికి కారణమేమి?. ఉ. సాంఖ్యతార్కిక బౌద్ధాదివాదులచేత, యేయేప్రకారముగా, జగద్భేదము వర్ణింప బడెనో, ఆయాప్రకారమే మాకును వ్యావహారికమందు జగద్భేదముగలిగియున్నది. గనుక, సాంఖ్యాదివాదులు జెప్పెడి జగద్భేదమును మేము నివారింపజేయుటకు ప్రయత్నింపము.

శ్లో॥ అవజ్ఞాతంసదద్వైతంనిశ్శంకైరన్యవాదిభిః।
ఏవంకాక్షతిరస్మాకంతద్ద్వైతమవజానతాం॥ ౧౦౧:

టీ. నిశ్శంకైః- భయములేని, అన్యవాదిభిః-సాంఖ్యాదులచేత, సదద్వైతం= సత్ - సద్రూపమగు, అద్వైతం- అద్వితీయవస్తువు, అవజ్ఞాతం- అనాదరింపబడెను. ఏవం- ఈప్రకారము. అనగా శ్రుతియుక్త్యనుభవములచేననుట. తద్ద్వైతం=తత్- ఆసాంఖ్యాదులయొక్క, ద్వైతం- ద్వైతమును, అవజానతాం- అనాదరణముజేసెడి, అస్మాకం - మాకు, కాక్షతిః - లోపమేమి అనగా లోపములేదనుట.

తా. ప్ర. అయితే, సాంఖ్యాదులుజెప్పెడి ప్రమాణసిద్ధమగు సద్వస్తుభేదమును మీరు పూర్వపక్షమెట్లుచేయవచ్చును?. ఉ. సద్వస్తువుయొక్క అద్వైతరూపము, శ్రుత్యాదిప్రమాణములచేత సిద్ధాంతమైయున్నది. అట్టిఅద్వైతమును సాంఖ్యాదివా దులు కొంచెమైనను భయములేక అనాదరణముజేసిరి. మేము శ్రుతియుక్త్యనుభవ ములచేత, ఆసాంఖ్యతార్కికాదులయొక్క ద్వైతమును, అనాదరణముజేయుచున్నా ము. అందువల్ల మాకులోపములేదు.

శ్లో॥ ద్వైతావజ్ఞాసుస్థితాచేదద్వైతేధీఃస్థిరాభవేత్।
స్థైర్యేతస్యాఃపుమానేషజీవన్ముక్తఇతీర్యతే॥ ౧౦౨.

టీ. ద్వైతావజ్ఞా=ద్వైత - ద్వైతముయొక్క, అవజ్ఞా - అనాదరణము, సుస్థితాచేత్ - మిక్కిలిస్థిరత్వమునుపొందినయెడల, అద్వైతే- అద్వితీయబ్రహ్మస్వ రూపమందు, ధీః-బుద్ధి, స్థిరా-నిశ్చలమైనది, భవేత్ - అగును. తస్యాః - ఆఅద్వైత



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుద్ధికి, స్థైర్యేసతి - స్థిరత్వముగలుగుచుండగా, ఏషః - ఈ, పుమాన్ - పురుషుడు, జీవన్ముక్తఇతి - జీవన్ముక్తుడని, ఈర్యతే - చెప్పబడుచున్నాడు.

తా. ప్ర. అయితే, ఇట్లు ద్వైతమును అనాదరించుటచేత ప్రయోజనమేమి?. ఉ. ద్వైతము మిథ్యయనెడి జ్ఞానముచేత అద్వైతముయొక్క అనాదరణము మిక్కిలి దృఢమగుచుండగా, అద్వైతబ్రహ్మస్వరూపమందు బుద్ధి, స్థిరముగానిలుచును. అట్టి అద్వైతబుద్ధికి స్థిరత్వముగలుగుచుండగా ఈపురుషుడు జీవన్ముక్తుడని చెప్పబడును. గనుక, ద్వైతమును అనాదరించుటచేత జీవన్ముక్తిలక్షణ మహత్ప్రయోజనము గలుగుచున్నదని యభిప్రాయము. జీవించియుండియే సంసారబంధమువల్ల విడువబడినవాడు జీవన్ముక్తుడని చెప్పబడును.

అవ. కేవలజీవన్ముక్తి ప్రయోజనమేగాక, ద్వైతముయొక్క అనాదరణముచేత విదేహముక్తియుంగలదని, శ్రీభగవద్వాక్యము నిప్పుడుదహరించుచున్నాడు.

శ్లో॥ ఏషాబ్రాహ్మీస్థితిఃపార్థనైనాంప్రాప్యవిముహ్యతి।
స్థిత్వాస్యామంతకాలేపిబ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥ ౧౦౩.

టీ. హేపార్థ - ఓఅర్జునుడా, ఏషా - ఈచెప్పబడినది. బ్రాహ్మీస్థితిః - బ్రహ్మనిష్ఠయగును. ఏనాం - ఈబ్రహ్మనిష్ఠను, ప్రాప్య - పొంది, నవిముహ్యతి-మోహమునుపొందడు. అంతకాలేపి - అంత్యసమయమందైనను, అస్యాం - ఈబ్రహ్మనిష్ఠయందు, స్థిత్వా - ఉండి, బ్రహ్మనిర్వాణం - విదేహముక్తిని, ఋచ్ఛతి - పొందుచున్నాడు.

తా. ఓ అర్జునా, ఈచెప్పబడినది బ్రహ్మజ్ఞాననిష్ఠయగును. ఈబ్రహ్మనిష్ఠను పొందినవాడు మోహమునుపొందడు. మరియు, అంతకాలమందైనను ఈ బ్రహ్మనిష్ఠయందున్నవాడు, విదేహముక్తిని పొందుచున్నాడు. అని యిట్లు శ్రీభగవంతుడు శ్రీగీతాశాస్త్రమందు ద్వితీయాధ్యాయములో జెప్పెనని తాత్పర్యము.

అవ. ఈ భగవద్వాక్యమందుగల అంతకాలశబ్దముచేత ప్రాణహానియనెడి అర్థముచెప్పబడెననెడి శంకను నివారించుటకొరకు, ఇప్పుడు తాను చెప్పతలచినయంతకాల శబ్దార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ సదద్వైతేఽనృతద్వైతేయదన్యోన్యైక్యవీక్షణం।
తస్యాంతకాలస్తద్భేదబుద్ధిరేవనచేతరః॥ ౧౦౪.

టీ. సదద్వైతే=సత్ - బ్రహ్మరూపమగు, అద్వైతే-అద్వైతమందును, అనృ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తద్వైతే=అనృత - మిథ్యారూపమగు, ద్వైతే - ద్వైతమందును, యత్ - ఏ, అన్యోన్యైక్యవీక్షణం=అన్యోన్యస్య-అన్యోన్యాధ్యాసలక్షణముకల, ఐక్యవీక్షణం-ఐక్యజ్ఞానము గలదో, తస్య- ఆఐక్యభ్రమయొక్క, అంతకాలో నామ - అంతకాలమనగా, తద్భేదబుద్ధిరేవ=తత్ - ఆఅద్వైతద్వైతములయొక్క, భేదబుద్ధిరేవ - సత్యమిథ్యారూపభేదబుద్ధియే యగును. ఇతరః - ప్రాణహాని, నచ - కాదు.

తా. సద్వస్తురూపమగుఅద్వైతమందును, మిథ్యారూపమగు ద్వైతమందును, అన్యోన్యాధ్యాసలక్షణముగల, ఏయైక్యభ్రమగలదో, ఆఐక్యభ్రమకు అంతకాలమనగా, ఆఅద్వైతద్వైతములయొక్క సత్యమిథ్యారూపభేదబుద్ధియే యగుగాని, ప్రాణహాని కాదు, ఇట్లు పూర్వోక్త భగవద్వాక్యమందుగల అంతకాలశబ్దమునకు అర్థమని తెలియవలెను.

అవ. ఇప్పుడు, ఆఅంతకాలశబ్దమునకు లోకప్రసిద్ధార్థమును గ్రహించినను దోషములేదని చెప్పుచున్నాడు.

శ్లో॥ యద్వాంతకాలఃప్రాణస్యవియోగోస్తుప్రసిద్ధితః।
తస్మిన్కాలేపినభ్రాంతేర్గతాయాఃపునరాగమః॥ ౧౦౫.

టీ. యద్వా - మరియొకపక్షమందు, ప్రసిద్ధితః - లోకప్రసిద్ధివల్ల, ప్రాణస్య-ప్రాణముయొక్క, వియోగః - వియోగము, అంతకాలః - అంతకాలశబ్దార్థము, అస్తు - అగుగాక. తస్మిన్కాలేపి - ఆఅంతకాలమందును, గతాయాః - నశించిన, భ్రాంతేః - భ్రాంతికి, పునః - మరల, ఆగమః - రాక, న-లేదు.

తా. మరియొకపక్షమందు పూర్వోక్తభగవద్వాక్యమందుగల అంతకాలశబ్దమునకు మరణకాలమని అర్థముచేసినను, పూర్వము వివేకముచేత నశించిన ద్వైతభ్రాంతి, ఆమరణకాలమందైనను మరల కలుగదని యభిప్రాయము,

అవ. ఈయర్థమునే ఇప్పుడు స్పష్టముగాజెప్పుచున్నాడు.

శ్లో॥ నీరోగఉపవిష్టోవారుగ్ణోవావిలుఠన్భువి।
మూర్ఛితోవాత్యజత్యేషప్రాణాన్భ్రాంతిర్నసర్వథా॥ ౧౦౬.

టీ. ఏషః - ద్వైతభ్రాంతిలేని ఈజ్ఞాని, నీరోగస్సన్- వ్యాధిలేనివాడగుచు, ఉపవిష్టోవా - కూర్చున్నవాడైనను, రుగ్ణస్సన్- వ్యాధిగలవాడగుచు, భువి - భూమియందు, విలుఠన్వా - పొర్లాడుచున్నవాడైనను, మూర్ఛితోవా - మూర్ఛనుబొందిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాడైనను, ప్రాణాన్ - ప్రాణములను, త్యజతు - విడుచుగాక. సర్వధా - సర్వ విధములచేతను, భ్రాంతిః - ద్వైతభ్రమ, న-లేదు.

తా. ద్వైతభ్రాంతిలేని ఈబ్రహ్మవేత్త, రోగములేక కూర్చుండి ప్రాణములను విడిచినను, మరియు, వ్యాధిపీడితుడై భూమియందు పొర్లాడుచు ప్రాణములను విడిచినను, మూర్ఛనుపొంది ప్రాణములను విడిచినను, ఆతనికి సర్వవిధములచేతను, ద్వైతభ్రాంతిలేదని తెలియవలెను.

శ్లో॥ దినేదినే స్వప్నసుప్త్యోరధీతే౽పిస్మృతేప్యయం।
పరేద్యుర్నానధీతస్స్యాత్తద్వద్విద్యానన శ్యతి॥ ౧౦౪.

టీ. దినేదినే- ప్రతిదినమందు, అధీతే- చదువబడినవేదము, స్వప్నసుప్త్యోః- స్వప్నసుషుప్త్యవస్థలయందు, విస్మృతేపి-మరచిపోబడినను, అయం- ఈపురుషుడు, పరేద్యుః- మరుసటిదినమందు, అనధీతః- వేదమునుచదువనివాడు, నస్యాత్ -కాడు. తద్వత్ - అటువలెనే, విద్యా - బ్రహ్మజ్ఞానము, ననశ్యతి - నాశనమునుపొందదు.

తా. ప్ర. అయితే, మరణకాలమందు, మూర్ఛాదికముచేత జ్ఞానము నశించుచుండగా, భ్రాంతికాదాయేమి?. ఉ. ప్రతిదినమందును చదువబడినవేదము, స్వప్నసుషుప్త్యాద్యవస్థయందు మరచిపోబడినను, ఆపురుషుడు పరదినమందు వేదమునుచదువనివాడుకాడు. ఆప్రకారమే, మరణకాలమందు మూర్ఛాదులచేత బ్రహ్మస్వరూపానుసంధానము లేకపోయినను, జ్ఞానము నశించదని తెలియవలెను.

అవ. జ్ఞానమునకు నాశములేదనెడి యర్థమునే ప్రతిపాదించుచున్నాడు.

శ్లో॥ ప్రమాణోత్పాదితావిద్యాప్రమాణంప్రబలంవినా।
ననశ్యతినవేదాంతాత్ప్రబలంమానమీక్ష్యతే॥ ౧౦౫.

టీ. ప్రమాణోత్పాదితా=ప్రమాణ - వేదాంతప్రమాణముచేత, ఉత్పాదితా - పుట్టించబడిన, విద్యా-బ్రహ్మజ్ఞానము. ప్రబలం- బలవంతమైన, ప్రమాణంవినా- ప్రమాణములేకనే, ననశ్యతి - నాశమునుపొందదు. వేదాంతాత్ - వేదాంతప్రమాణముకంటె, ప్రబలం - బలముగల, మానం - ప్రమాణము, నేక్ష్యతే - చూపబడలేదు.

తా. బ్రహ్మజ్ఞానము వేదాంతప్రమాణముచేత పుట్టినదగును. అట్టి బ్రహ్మజ్ఞానము బలవంతమైన మరియొకప్రమాణములేకనే నశింపదు. మరియు వేదాంతప్రమాణముకంటె బలవంతమైన ప్రమాణము మరియొకటి కనబడలేదు. గనుక, బ్రహ్మజ్ఞానమెప్పటికిని నశింపదనితాత్పర్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఈప్రతిపాదింపబడిన అర్థము నిప్పుడు ఉపసంహరించుచున్నారు.

శ్లో॥ తస్మాద్వేదాంతసంసిద్ధంసదద్వైతంనబాధ్యతే।
అంతకాలేప్యతోభూతవివేకాన్నిర్వృతిస్థ్సితా॥ ౧౦౯.

టీ. తస్మాత్ - అందువల్ల, అంతకాలేపి - మరణకాలమందైనను, వేదాంత సంసిద్ధం=వేదాంత - ఉపనిషత్ప్రమాణముచేత, సంసిద్ధం - సిద్ధించిన, సదద్వైతం - సద్రూపమగు అద్వైతము, నబాధ్యతే - బాధింపబడదు అతః - ఆకారణమువల్ల, భూతవివేకాత్ =భూత - పంచభూతములయొక్క, వివేకాత్ - విభజనలక్షణజ్ఞానా భ్యాసమువల్ల, నిర్వృతిః - మోక్షము, స్థితా - కలుగుచున్నది.

తా. ఆకారణముచేత మరణకాలమందైనను, వేదాంతప్రమాణముచేత సిద్ధించిన అద్వైతబ్రహ్మవిద్య నశింపదు. గనుక, ఈపంచభూతవివేకమును అభ్యసించుటవల్ల మోక్షముగలుగుచున్నదని తెలియవలెను.

ఇతి* శ్రీవేదాంతపంచదశ్యాం పంచభూతవివేక స్సమాప్తః.

గద్య* ఇది, ఇతిశ్రీపరమేశ్వరగురుచరణ వరప్రసాదలబ్ధ బ్రహ్మవిద్యా విరాజిత కాశ్యపసగోత్ర పవిత్ర మంత్రివంశపయఃపారావారపరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్యపుత్ర లక్ష్మీనారాయణామాత్యప్రణీతంబైన ఆంధ్రటీకాతాత్పర్యసహిత శ్రీవేదాంత పంచదశియందు పంచభూతవివేకమనెడి ద్వితీయప్రకరణము సంపూర్ణమాయెను.

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

---

శ్రీకృష్ణసద్గురు పరబ్రహ్మణేనమః.

## పంచకోశవివేకప్రారంభము.

---

అవ. ఇప్పుడు శ్రీవిద్యారణ్యగురుఁడు, తైత్తిరీయోపనిషత్తాత్పర్య వ్యాఖ్యానరూపమైన పంచకోశవివేకమనెడి గ్రంథమును ప్రారంభించుచున్నవాడగుచు, శిష్యులకు ప్రవర్తనసిద్ధికొరకు ప్రయోజనవస్తువును సూచింపుచు, తానుజేయుటకిచ్ఛయించినగ్రంథమును మొదటనే ప్రతిజ్ఞాపూర్వకముగా దెలుపుచున్నాడు.

శ్లో॥ గుహాహితంబ్రహ్మయత్తత్పంచకోశవివేకతః।
బోద్ధుంశక్యంతతఃకోశపంచకంప్రవివిచ్యతే॥ ౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. యద్బ్రహ్మ - ఏబ్రహ్మము, గుహాహితం - గుహయందుండెనని దెలుప బడెనో, తత్ - ఆబ్రహ్మమును, పంచకోశవివేకతః=పంచకోశ - పంచకోశముల యొక్క, వివేకతః - విభజనలక్షణజ్ఞానమువల్ల, బోద్ధుం- బోధించుటకు, శక్యం- సాధ్యమగును. తతః - అందువల్ల, కోశపంచకం=కోశ - అన్నమయాది కోశములయొక్క, పంచకం - పంచకము, ప్రవివిచ్యతే - ప్రత్యగాత్మకంటె భిన్నముగావిభజించి చూపబడుచున్నవి.

తా. శ్రు॥ యోవేదనిహితం గుహాయాంపరమేవ్యోమన్॥ అనెడి శ్రుతిచేత, ఏపరబ్రహ్మము అన్నమయాది పంచకోశములనెడి గుహాయందుండెనని చెప్పబడనో, ఆపరబ్రహ్మమును పంచకోశవివేకముచేత నెరుగుటకు శక్యమగును. ఆఅన్నమయాదిపంచకోశములును, ప్రత్యగాత్మస్వరూపముకంటె భిన్నముగావిభజించి, ఈప్రకరణమందు జూపబడుచున్నవని యభిప్రాయము.

శ్లో॥ దేహాదభ్యంతరఃప్రాణఃప్రాణాదభ్యంతరంమనః।
తతఃకర్తాతతోభోక్తాగుహాసేయంపరంపరా॥ ౨.

టీ. దేహాత్ - అన్నమయకోశముకంటె, ప్రాణః - ప్రాణమయకోశము, అభ్యంతరః - అంతరమగును. అనగా లోపలనుండునది యగుననుట. ప్రాణాత్ - ప్రాణమయకోశముకంటె, మనః- మనోమయకోశము, అభ్యంతరం- అంతరమగును. తతః - ఆమనోమయకోశముకంటె, కర్తా - విజ్ఞానమయకోశము, (అభ్యంతరః) అంతరమగును. తతః - ఆవిజ్ఞానమయకోశముకంటె, భోక్తా - ఆనందమయకోశము, (అభ్యంతరః) అంతరమగును. సేయం- ఆఈ, పరంపరా- పరంపరాకారముగానున్న పంచకోశరూపము, గుహా - గుహాశబ్దముచేత జెప్పబడుచున్నది.

తా. ప్ర. అయితే, గుహయనగానెద్ది. ఏగుహయందుండు బ్రహ్మము పంచకోశవివేకముచే నెరుగబడునో జెప్పుము?. ఉ. ఈస్థూలదేహము, ౧. అన్నమయకోశమనిచెప్పబడును. ఈఅన్నమయకోశముకంటెలోపల, ౨. ప్రాణమయకోశము గలదు. ఆప్రాణమయకోశముకంటె లోపల, 3. మనోమయకోశముగలదు. ఆమనోమయకోశముకంటె లోపల, ౪. విజ్ఞానమయకోశముగలదు. ఆవిజ్ఞానమయకోశముకంటె లోపల, ౫. ఆనందమయకోశముగలదు. ఇట్లు ఒకటివెంబడి మరియొకటి పరంపరాకారముగానున్న పంచకోశస్వరూపమే, శ్రుతియందు గుహాశబ్దముచేత చెప్పబడుచున్నది. గనుక, పంచకోశస్వరూపమునే గుహయని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇప్పుడు, అన్నమయకోశస్వరూపమును జూపుచు, దానికి అనాత్మ భావమును జూపుచున్నాడు.

శ్లో॥ పితృభుక్తాన్నజాద్వీర్యాజ్జాతో న్నేనైవవర్ధతే।
దేహస్సోన్నమయో నాత్మాప్రాక్ చోర్ధ్వంతదభావతః॥ 3.

టీ. పితృభుక్తాన్నజాత్=పితృభుక్త-మాతాపితృలచేత భుజింపబడిన, అన్న-అన్నమువల్ల, జాత్ - కలిగిన, వీర్యాత్ - వీర్యమువల్ల, జాతః - పుట్టిన, దేహః-స్థూలదేహము, అన్నేనైవ - అన్నముచేతనే, వర్ధతే - వృద్ధిబొందుచున్నది. సః - ఆ స్థూలదేహము, అన్నమయః=అన్న-అన్నముయొక్క, మయః-వికారమగును. అనగా కార్యమగుననుట. ప్రాక్ - పుట్టుటకుపూర్వమందును, ఊర్ధ్వంచ - మరణమునకు పిమ్మటయు, తదభావతః=తత్ - ఆస్థూలదేహముయొక్క, అభావతః - లేమివల్ల, సః - ఆస్థూలదేహము, ఆత్మా-ప్రత్యగాత్మ, న - కాదు.

తా. తల్లిదండ్రులచేత భుజింపబడిన యవవ్రీహ్యాదిలక్షణముగల అన్నముమొదలగు పదార్థములవల్ల వీర్యముబుట్టుచున్నది. ఆవీర్యమువల్ల దేహముబుట్టుచున్నది. అట్లు పుట్టినదేహము, పాలుమొదలగు అన్నముచేతనే వృద్ధిబొందుచున్నది. అట్టిస్థూలదేహము అన్నముయొక్క కార్యమగుటవల్ల అన్నమయమని చెప్పబడును. ఆస్థూలదేహము, జన్మమునకు పూర్వమందును, మరణమునకు పిమ్మటయు లేనికారణమువల్ల, అది ఆత్మగాదు, అనగా, వివాదమునకు ఆధారమైన స్థూలదేహము కార్యమగుటవల్ల, ఘటాదులవలెనే ఆత్మగాదని యభిప్రాయము.

శ్లో॥ పూర్వజన్మన్యసన్నేతజ్జన్మసంపాదయేత్కథం।
భావిజన్మన్యసత్కర్మనభుంజీతేహసంచితం॥ ౪.

టీ. పూర్వజన్మని - పూర్వజన్మమందు, అసత్ - ఆత్మత్వముచేత సమ్మతమైనదేహములేకపోవుచుండగా, ఏతజ్జన్మ- ఈజన్మమును, కథం-ఎట్లు, సంపాదయేత్-సంపాదించును. అనగా సంపాదించుటకు శక్యముగాదనుట. భావిజన్మని - పరజన్మమందు, అసత్ -ఆత్మత్వముచేత సమ్మతమైనశరీరము లేకపోవుచుండగా, ఇహ - ఈజన్మమందు, సంచితం - సంపాదింపబడిన, కర్మ-కర్మము, నభుంజీత - అనుభవింపబడక క్షయించును.

తా. ప్ర. అయితే, నీవుచెప్పినహేతువనుగాక. దేహమును ఆత్మయనిచెప్పెడివారికి బాధకములేమిచేత, ఈ హేతువు అప్రయోజకముగాదాయేమి?. ఉ. ఈ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్థూలదేహమును ఆత్మయని చెప్పినపక్షమందు ఈదేహరూపుడగు ఆత్మ, పూర్వజన్మ మందు లేమిచేత, ఈజన్మముగలుగుటకు కారణమైనకర్మము (అదృష్టము) లేకపో యినను, ఈజన్మమును అంగీకరింపవలసివచ్చును. అనగా జన్మహేతువగు కర్మము లేకనే జన్మముకలుగునని యంగీకరించుట, (అకృతాభ్యాగమదోషము) అని చెప్ప బడును. మరియు, ఈ దేహరూపుడగు ఆత్మ, పరజన్మమందు లేమిచేత, ఇప్పుడు ఈజన్మమందుజేయబడిన పుణ్యపాపకర్మమును అనుభవించెడువాడు లేమివల్ల, కర్మము అనుభవింపబడకనే క్షయించును. అనగా భోగములేకనే కర్మక్షయమగుట, (కృతవి ప్రణాశదోషము) అనిచెప్పబడును. గనుక, ఈదేహమే ఆత్మయని చెప్పినపక్షమం దు, ఇట్లు ౧. అకృతాభ్యాగమము. ౨. కృతవిప్రణాశములనెడి రెండుదోషములు సంభవించుచున్నవి. గనుక, ఆత్మను కార్యభావమును అంగీకరింపరాదు. అందుచేత కార్యమైన దేహమును ఆత్మయనిచెప్పరాదని యభిప్రాయము.

అవ. ఇట్లు, అన్నమయకోశమునకు అనాత్మత్వమునుజూపి, ఇప్పుడు ప్రాణ మయకోశస్వరూపమును జూపుచు, దానికి అనాత్మత్వమును దెలుపుచున్నాడు.

శ్లో॥ పూర్ణోదేహేబలంయచ్ఛన్నక్షాణాంయఃప్రవర్తకః।
వాయుఃప్రాణమయోనాసావాత్మాచైతన్యవర్జనాత్॥ ౫.

టీ. యః-ఏవాయువు, దేహే - దేహమందు, పూర్ణస్సన్ - అంతటవ్యాపిం చినదగుచు, బలం - సామర్థ్యమును, యచ్ఛన్ - వ్యానరూపముచేనిచ్చుచు, అక్షా ణాం- చక్షురాదిఇంద్రియములకు, ప్రవర్తకస్సన్- ప్రేరేపించునదియగుచు, (వర్తతే) వర్తించుచున్నదో, (సః) ఆవాయువు, ప్రాణమయః - ప్రాణమయకోశమనిచెప్ప బడును, అసౌ-ఈవాయువు, చైతన్యవర్జనాత్=చైతన్య - చైతన్యముయొక్క, వర్జ నాత్ - లేమివల్ల, ఆత్మ-ప్రత్యగాత్మ, న-కాదు.

తా. ఏవాయువు దేహమందు పాదము మొదలుకొని శిరస్సుపర్యంతము పూర్ణ ముగావ్యాపించి, వ్యానరూపముచేత దేహమునకు బలమిచ్చును, చక్షురాది ఇంద్రియ ములను ప్రేరేపించుచున్నదో, ఆవాయువు ప్రాణమయకోశమని చెప్పబడును. ఈ వాయువు చైతన్యముగాక, జడస్వభావమును గలిగియుండుటచేత, ఘటాదులవలెనే ఆత్మ గాదని తెలియవలెను.

అవ. ఇప్పుడు మనోమయకోశస్వరూపమును జూపుచు, దానికిని అనాత్మత్వ మును దెలుపుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ అహంతాంమమతాం దేహే గేహాదౌ చకరోతియః।
కామాద్యవస్థయా భ్రాంతో నాసావాత్మామనోమయః॥ ౬.

టీ. యః - ఏమనస్సు, దేహే - దేహమందు, అహంతాం - నేననెడిభావ వంబును, గేహాదౌ - గృహాదులయందు, మమతాం - నాదియనెడి యభిమానంబును. కరోతి - చేయుచున్నదో, అసౌ - ఈమనస్సు, (మనోమయః) మనోమయకోశమగును, కామాద్యవస్థయా - కామక్రోధాదివృత్తిని గలిగియుండుటచేత, భ్రాంతః - చలన స్వభావముగలమనస్సు, అనగా నియతిరూపములేనిదగుట. నాత్మా - ప్రత్యగాత్మ గాదు.

తా. మరియు, ఏమనస్సు, దేహమందు నేననెడి భావంబును, గృహాదులయందు నాదియనెడి అభిమానంబును జేయుచున్నదో, ఆమనస్సు, మనోమయకోశమని చెప్ప బడును. ఈమనస్సు కామక్రోధాది వృత్తినిగలిగి, నియతరూపముగలదిగామిచేత, వికారిభావము పొందియుండుటవల్ల, దేహమువలెనే ఆత్మగాదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు కర్తృశబ్దముచేజెప్పదగిన విజ్ఞానమయకోశస్వరూపమును జూపుచు, దానికిని అనాత్మత్వమును దెలుపుచున్నాడు.

శ్లో॥ లీనాసుప్తౌవపుర్బోధే వ్యాప్నుయాదానఖాగ్రగా।
చిచ్ఛాయోపేతధీర్నాత్మా విజ్ఞానమయశబ్దభాక్॥ ౭.

టీ. చిచ్ఛాయోపేతధీః = చిచ్ఛాయా - చిదాభాసునితోటి, ఉపేత - కూడిన, ధీః - బుద్ధి, సుప్తౌ - సుషుప్తికాలమందు, లీనాసతీ - విలయమునుపొందుచు, బోధే - జాగరితకాలమందు, ఆనఖాగ్రగా - గోటికొనపర్యంతము, వర్తించుచున్నదగుచు, వపుః - శరీరమును, వ్యాప్నుయాత్ - వ్యాపించియుండునో, (సా - ఆబుద్ధి) విజ్ఞాన మయశబ్దభాక్ - విజ్ఞానమయశబ్దముచేత చెప్పబడును. (అసావపి) ఈబుద్ధియు, నాత్మ - ప్రత్యగాత్మగాదు.

తా. చిదాభాసునితోగూడిన బుద్ధి, సుషుప్తికాలమందు లయించుచు, జాగరితకాలమందు గోటికొనపర్యంతము శరీరమును విశేషముగా వ్యాపించివర్తించుచుండును. ఆబుద్ధి, విజ్ఞానమయకోశమని చెప్పబడును. ఈబుద్ధియు, విలయాద్యవస్థలను గలిగియుండుటచేత ఘటాదులవలెనే ఆత్మగాదని తెలియవలెను.

శ్లో॥ కర్తృత్వకరణత్వాభ్యాంవిక్రియేతాంతరింద్రియం।
విజ్ఞానమనసీఅంతర్బహిశ్చైతేపరస్పరం॥ ౮.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అంతరింద్రియం - అంతఃకరణము. కర్తృత్వకరణత్వాభ్యాం=కర్తృత్వ - కర్తృరూపముచేతయు. కరణత్వాభ్యాం - కరణరూపముచేతయు, విక్రియేత - వికారమునుపొందును. అనగా పరిణమించుచున్నదనుట. ఏతే - ఈకర్తృకరములురెండును, విజ్ఞానమనసీ- విజ్ఞానమనోమయయలని చెప్పబడుచున్నవి. (ఏతేచ) ఈవిజ్ఞానమనస్సులురెండును, పరస్పరం - ఒకటొకటి, అంతర్బహిర్భావములయందు వర్తించుచున్నవి.

తా. ప్ర ఆయితే, మనోబుద్ధులకురెంటికిని అంతఃకరణరూపత్వమందు భేదములేనియెడల, మనోమయవిజ్ఞానమయములలెడి రెండురూపములుగా రెండుకోశములను కల్పించుట యుక్తమెట్లగును ?. ఉ. అంతరింద్రియమనెడి (అంతఃకరణము) నేననెడి కర్తృరూపముగా పరిణమించి, బుద్ధియాయెను. కరణరూపముగా పరిణమించి మనస్సు ఆయెను. ఆరెంటిలో బుద్ధి, దేహమునకులోపల నేననెడి (అహం) భావముచేతవర్తించుచున్నది. మనస్సు దేహమునకు వెలుపట గృహాదులయందు వర్తించుచు, నాదియని అభిమానించుచున్నది. గనుక, మనోమయ విజ్ఞానమయముల నెడి రెండుకోశములను కల్పించుట యుక్తమేయగును.

అవ. ఇప్పుడు, భోక్తృశబ్దముచేత జెప్పదగిన ఆనందమయకోశమునకు అనాతనాత్మభావమును జూపుటకొరకు, దానిస్వరూపమును జెప్పుచున్నాడు.

శ్లో॥ కాదిదంతర్ముఖావృత్తిరానందప్రతిబింబభాక్।
పుణ్యభోగేభోగశాంతౌనిద్రారూపేణలీయతే॥ ౯.

టీ. పుణ్యభోగే=పుణ - పుణకర్మముయొక్క, భోగే - ఫలానుభవకాలమందు, కాచిత్ - ఎప్పుడైనను, వృత్తిః-బుద్ధివృత్తి, అంతర్ముఖాసతీ - అంతర్ముఖముగలదగుచు, ఆనందప్రతిబింబభాక్- ఆనంద - ఆత్మస్వరూపమగు ఆనందబింబముయొక్క, ప్రతిబింబభాక్ - ప్రతిబింబమునుపొందుచున్నది. భోగశాంతౌసత్యాం - పుణ్యకర్మఫలభోగము క్షయించుచుండగా, నిద్రారూపేణ - నిద్రారూపముగా, లీయతే - ఆవృత్తియే లయించుచున్నది.

తా. పుణ్యకర్మఫలానుభవకాలమందు ఒకానొకప్పుడు బుద్ధివృత్తి, బాహ్యాభావమును విడిపించి, అంతర్ముఖముగలదగుచు ఆత్మస్వరూపమగు ఆనందబింబముయొక్క ప్రతిబింబమును పొందుచున్నది. ఆవృత్తియే, పుణ్యకర్మఫలభోగము క్షయించినతోడనే నిద్రారూపముగా లీనమగుచున్నది. అట్టివృత్తి, ఆనందమయమని చెప్పబడునని యభిప్రాయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇప్పుడు, ఆఆనందమయమునకు అనాత్మత్వమును జెప్పుచున్నాడు.

శ్లో॥ కాదాచిత్కత్వతో నాత్మాస్యాదానందమయోప్యయం।
బింబభూతోయఆనందఆత్మాసౌసర్వదాస్థితేః॥ ౧౦.

టీ. అయం - ఈ, ఆనందమయోపి - ఆనందమయుండును, కాదాచిత్కత్వతః - ఒకానొకప్పుడు దోచుటవల్ల, ఆత్మా - ప్రత్యగాత్మ, నస్యాత్ - కాదు. బింబభూతః - ఆనందమయకోశమునకు కారణభూతమగు, యః - ఏ, ఆనందః - ఆనందము గలదో, అసౌ - ఈఆనందబింబము, సర్వదా - ఎల్లప్పుడును, స్థితేః - ఉండుటవల్ల, అనగా నిత్యముగానుండుటచేననుట. ఆత్మా - ప్రత్యగాత్మయగును.

తా. పైనచెప్పబడినది ఆనందమయమైనను, ఇది అనిత్యస్వభావముగలదగు చు, ఒకానొకప్పుడు స్ఫురించుచుండుటచేత మేఘాదిపదార్థమువలెనే ఆత్మగాదు. ప్ర. అయితే, స్థితినిపొందియుండెడి ఆనందమయాదివస్తువులకన్నిటికిని ఆత్మభావము లేదని నిరాకరించినయెడల, ఆత్మలేదనెడి ప్రసంగముగలుగదాయేమి?. ఉ. ౧. ప్రియము, ౨. మోదము, ౩. ప్రమోదము, అనెడి సుఖవిశేషవృత్తులచేత జెప్పదగిన ఆనందమయము, బుద్ధ్యాదులయందు ప్రతిబింబభావముచేత వర్తించుచున్నది. అట్టి ఆనందమయమనెడి ప్రతిబింబమునకు కారణభూతమైన ఆనందబింబమెద్దిగలదో, ఆ ఆనందబింబము సర్వకాలసర్వావస్థలయందును, నిత్యశుద్ధబుద్ధముక్తనిష్కళనిష్క్రియ నిర్గుణ పరిపూర్ణచైతన్య స్వరూపముగలిగి యుండుటచేత, ఇదియే ఆత్మయగును. గనుక, వివాదమునకు ఆధారమైన ఆనందబింబము నిత్యత్వమును గలిగియుండుటచేత ఆత్మయగుటకు దగుచున్నదనియు, ఆత్మగాని దేహాదికోశపంచకము నిత్యముగాదని యు, ఇట్లు అనుమానప్రమాణముచెత యోచించి ఆనందమయమునకు కారణమైన ఆనందబింబమును ఆత్మగా నెరుగవలయును. మరియు, ఆకాశాదులు ఉత్పత్తినిగలిగి యుండుటచేత, ఆయాకాశాదులకు నిత్యత్వము లేదని తెలియవలెను. ఇష్టవస్తువుజూచుటచేత కలిగినసంతోషము. ౧. ప్రియమని చెప్పబడును. ఆయిష్టవస్తువులభించుటచేత కలిగెడుసంతోషము. ౨. మోదమనిచెప్పబడును. ఆయిష్టవస్తువును అనుభవించెడిచే తకలిగెడిసంతోషము. ౩. ప్రమోదమని చెప్పబడును.

అవ. ఇప్పుడు పూర్వవాది, ఒకచోద్యమును చేయుచున్నాడు.

శ్లో॥ నను దేహముపక్రమ్యనిద్రానందాంతవస్తుషు।
మాభూదాత్మత్వమన్యస్తునకశ్చిదనుభూయతే॥ ౧౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. నను - ఓయీ, దేహం - అన్నమయకోశమును, ఉపక్రమ్య - ప్రారంభించి, అనగా మొదలుకొనియనుట. నిద్రానందాంతవస్తుషు=సిద్ధానందాంత - ఆనందమయకోశాంత్యమువరకుగల, వస్తుషు - వస్తువులయందు, ఆత్మత్వం - ఆత్మభావము, మాభూత్ - లేకపోవుగాక. అన్యస్తు - పంచకోశవిలక్షణవస్తువు, కశ్చిత్ - ఎద్దియును, నానుభూయతే - అనుభవింపబడలేదు.

తా. ఓ అద్వైతసిద్ధాంతీ, ఇదివరకు మీరుజెప్పిన హేతువులచేత, దేహము మొదలుకొని ఆనందమయకోశాంత్యమువరకు అనుభవింపబడెడి వస్తువులకు ఆత్మభావము సిద్ధింకపోయినను పోనిమ్ము. ఆపంచకోశములకంటె అన్యమగు ఆత్మవస్తువు, ఎద్దియో అనుభవింపబడలేదు. గనుక, పైశ్లోకమందు జెప్పబడినప్రకారము ఆనందబింబమునకు ఆత్మభావము సంభవింపనేరదు. అని యిట్లు పూర్వవాది, ఆక్షేపించెనని తాత్పర్యము.

అవ. ఇందుకు సిద్ధాంతి, పరిహారమును జెప్పుచున్నాడు.

శ్లో॥ బాఢంనిద్రాదయస్సర్వేఽనుభూయంతేరచేతరః।
తథాప్యేతేనుభూయంతేయేనతంకోనివారయేత్॥ ౧౨.

టీ. బాఢం - నీవుచెప్పినది సత్యమగును. నిద్రాదయః - ఆనందమయాదులైన, సర్వే-పంచకోశములును, అనుభూయంతే అన్యునిచేత అనుభవింపబడుచున్నవి. ఇతరః - పంచకోశములకంటె అన్యుడగుఆత్మ, నచ - అనుభవింపబడలేదు. తథాపి - అట్లు అనుభవింపబడకున్నను, యేన - ఏ అనుభవబలముచేత, ఏతే - ఈపంచకోశములును, అనుభూయంతే - అనుభవింపబడుచున్నవో, తం - ఆ అనుభవమును, కః- ఎవడు, నివారయేత్-నివారింపజేయును. అనగానెవ్వడునునివారింపజేయజాలడనుట.

తా. ఓయి పూర్వవాదీ, అన్నమయప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయములనెడి పంచకోశములును, అన్యునిచేత అనుభవింపబడుచున్నవనియు, ఆపంచకోశములకంటె అన్యుడగు ఆత్మ, అనువింపబడలేదనియుం జెప్పితివి. నీవుచెప్పినట్లు ఆత్మ, అనుభవింపబడెడివాడుగాడు. ప్ర. అయితే, ఆత్మ, అనుభవింపబడనియెడల, పంచకోశములకంటె అన్యుడైనఆత్మగలడని, యెట్లుఅంగీకరింపవచ్చును?- ఉ. అట్లు, ఆత్మ, పంచకోశములవలె, అనుభవింపబడకున్నను, ఏ అనుభవబలముచేయువల్ల, ఈపంచకోశములును అనుభవింపబడుచున్నవో, అట్టిఅనుభవమును నివారింపుటకు ఎవ్వడును సమర్థుడుగాడు. గనుక, ఆఅనుభవమే ఆత్మ, అగును. అట్టి ఆత్మను అవశ్యము అంగీకరింపవలెనని యభిప్రాయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ స్వయమేవానుభూతిత్వాద్విద్యతేనానుభావ్యతా।
జ్ఞాతృజ్ఞానాంతరాభావాదజ్ఞేయోనత్వసత్తయా॥ ౧౩.

టీ. స్వయమేవ-తానే, అనుభూతిత్వాత్ - అనుభవరూపుడగుటవల్ల, అనుభావ్యతా- అనుభవింపబడెడిస్వభావము, నవిద్యతే- లేదు. జ్ఞాతృజ్ఞానాంతరాభావాత్ = జ్ఞాతృజ్ఞానాంతర - ఇతరజ్ఞాతృజ్ఞానములయొక్క, అభావాత్ - లేమివల్ల, అజ్ఞేయః- జ్ఞానవిషయుడుగాడు. అసత్తయాతు-లేమిచేత, న- అనుభవింపబడలేదనిచెప్పరాదు.

తా. ప్ర. అయితే, పైనచెప్పబడిన పంచకోశములకంటె అన్యుడైన ఆత్మ, ఉన్నయెడల అనుభవింపబడవలెను. అట్లు అనుభవింపబడలేదు. అందుచేత, ఆత్మ, లేడనిచెప్పరాదాయేమి?. టీ. ఆనందమయాదిపంచకోశములకును, ఆత్మ, సాక్షియై యున్నాడు. అట్టి సాక్షికి అనుభవరూపత్వమే యుండుటవల్ల, అనుభవింపబడెడి స్వభావములేదు. గనుక. అనుభవింపబడడు. ప్ర. అయితే, ఆత్మ, అనుభవరూపుడై నను, ఆఅనుభవరూపత్వమందు అనుభవింపబడెడి స్వభావములేకపోవుటకు కారణమేమి?. ఉ. ఆత్మనుయెరుగుటకు, ఇతరములైన జ్ఞాతృజ్ఞానములురెండునులేవు. ఆ కారణమువల్ల, ఆత్మకు అనుభవరూపత్వమేయగుగాని, అనుభవింపబడెడి స్వభావము లేదు. గనుక, పంచకోశములవలె, ఆత్మ, జ్ఞానవిషయుడుగాడు. ప్ర. అయితే, అన్యములైన జ్ఞాతృజ్ఞానములురెండును లేమిచేత, ఆత్మ, ఎరుగబడలేదో, లేక, తాను లేమిచేత ఎరుగబడలేదో జెప్పుము?. ఉ. ఆనందమయాదిపంచకోశములకును, ఆత్మ, సాక్షిగానున్నాడని ముందుచెప్పబడెను. గనుక, ఆత్మ, లేమిచేత ఎరుగబడలేదని చెప్పరాదు. అనగా, ఆత్మ, లేనియెడల, పంచకోశములును అనుబవింపబడవని య భిప్రాయము. మరియు, ఆత్మనెరిగెడి ఇతరములైన జ్ఞాతృజ్ఞానములురెండును లేని కారణమువల్లనే, పంచకోశములవలె, ఆత్మ, ఎరుగబడలేదని తెలియవలెను. జ్ఞాతృ, అనగా ఎరిగెడివాడగును. జ్ఞానమనగా ఎరుకయగును.

అవ. అనుభవరూపుడైన ఆత్మకు, అనుభవింపబడెడి స్వభావములేదనెడి విషయమై, ఇప్పుడు దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ మాధుర్యాదిస్వభావానామన్యత్రస్వగుణార్పిణాం।
స్వస్మింస్తదర్పణాపేక్షానోనచాస్త్యన్యదర్పకం॥ ౧౪.

టీ. అన్యత్ర - తనతోగూడిన శనగలుమొదలగు పదార్థములయందు, స్వగుణార్పిణాం= స్వ-తనయొక్క, గుణ-మాధుర్యాదిగుణములను, అర్పిణాం - సమర్పిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెడి, మాధుర్యాదిస్వభావానాం=మాధుర్యాది - తీపిమొదలగు ధరత్రములే, స్వభావానాం - సహజముగాగల బెల్లము మొదలగు వస్తువులకు, స్వస్మిన్-తనస్వరూపమైన బెల్లము మొదలగు లక్షణముగలవస్తువునందు, తదర్పణాపేక్షా=తత్ - ఆమాధుర్యాదులయొక్క, అర్పణ - సంపాదనమందు, అపేక్షా-ఇచ్ఛ, నో, లేదు. అర్పకం-బెల్లము మొదలగువస్తువులకు మాధుర్యాదిగుణములను గలిగించెడి, అన్యచ్ఛ - మరియొకవస్తువును, నాస్తి - లేదు.

తా. బెల్లము మొదలగు వస్తువులు మాధుర్యాదిగుణములను సహజముగా గలిగియున్నవి. ఆబెల్లము మొదలగువస్తువులు, తమతోకలిసినశనగలు మొదలగు పదార్థములయందు, తమమాధుర్యాది గుణములను సమర్పించుచున్నవి. అట్టివస్తువులకు, తమస్వరూపమైన బెల్లము మొదలగు లక్షణమందు మాధుర్యాదిగుణములను దేనిచేతసంపాదింపవలెనో, అనెడి, యీరూపముగల అపేక్షలేదు. మరియు, ఆబెల్లము మొదలగు వస్తువులకు మాధుర్యాదిగుణములను సంపాదించెడి మరియొకవస్తువులేదు.

అవ. ఇప్పుడు దృష్టాంతసహితముగా ఫలితమును జెప్పుచున్నాడు.

శ్లో॥ అర్పకాంతరరాహిత్యేప్యస్త్యేషాంతత్స్వభావతా।
మాభూత్తథానుభావ్యత్వంబోధాత్మాతునహీయతే॥ ౧౭.

టీ. అర్పకాంతరరాహిత్యేపి=అర్పకాంతర - మాధుర్యాధులను సమర్పించెడి మరియొకవస్తువుయొక్క, రాహిత్యేపి- అభావమైనను, ఏషాం - ఈబెల్లము మొదలగు వస్తువులకు, తత్స్వభావతా - మాధుర్యాదిస్వభావము. అస్తి-కలదు. తథా - ఆప్రకారమాత్మకు, అనుభావ్యత్వం - అనుభవవిషయత్వము, (అనగా అనుభవింపబడుట) మాభూత్ - లేకపోవుగాక. బోధాత్మాతు- అనుభవరూపమో, నహీయతే- చెడదు. అనగా సిద్ధమేననుట.

తా. బెల్లము మొదలగువస్తువులకు మాధుర్యాదిగుణములును సంపాదించెడి మరియొకవస్తువు లేకపోయినను, ఆబెల్లము మొదలగు వస్తువులకు మాధుర్యాదిస్వభావముగలిగియున్నది. అటువలెనే, ఆత్మ, ఇతరజ్ఞాతృజ్ఞానములచేత అనుభవింపబడకున్నను, ఆ ఆత్మకు అనుభవరూపత్వము గలిగియున్న దేయగునని యభిప్రాయము.

అవ. ఈచెప్పబడిన అర్థమందు శ్రుతిప్రమాణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ స్వయంజ్యోతిర్భవత్యేషపురోస్మాద్భాసతేఖిలాత్।
తమేవభాంతమన్వేతితద్భాసాభాస్యతేజగత్॥ ౧౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఏషః - ఈఆత్మ, స్వయంజ్యోతిః - స్వప్రకాశస్వరూపుడు, భవతి - అగుచున్నాడు. అస్మాత్ - ఈ, అఖిలాత్ - సర్వప్రపంచముకంటె, పురః - ముందట, భాసతే - ప్రకాశించుచున్నాడు. భాంతం - స్వప్రకాశస్వరూపుడగు, తమేవ - ఆ ఆత్మనే, అన్వేతి - సర్వప్రపంచమాశ్రయించి తోచుచున్నది. తద్భాసా = తత్ - ఆఆత్మయొక్క, భాసా - స్వప్రకాశరూపముచేత, జగత్ - సర్వజగత్తు, భాస్యతే - ప్రకాశింపబడుచున్నది.

తా. ఈదేహమందుండెడి, యీప్రత్యగాత్మ, స్వయముగా ప్రకాశించుచున్నాడనియు, ఈసర్వప్రపంచమునకు ముందట ప్రకాశించుచున్నాడనియు, ఆస్వప్రకాశరూపుడగు ఆత్మనే ఆశ్రయించి, సర్వప్రపంచము తోచుచున్నదనియు, ఆఆత్మయొక్క స్వప్రకాశత్వముచేత ఈసర్వప్రపంచము ప్రకాశింపబడుచున్నదనియుంజెప్పెడి, శ్రు॥ అత్రాయంపురుషస్స్వయంజ్యోతిర్భవతి. అస్మాత్సర్వస్మాత్పురతస్సువిభాతి. తమేవభాంతమనుభాతిసర్వం. తస్యభాసాసర్వమిదంవిభాతి॥ ఇత్యాదిశ్రుతులు, ఆత్మకు స్వప్రకాశత్వమును, బోధించుచున్నవి. ఈస్వప్రకాశత్వమునే, అనుభవరూపత్వముగా తెలియవలెను.

శ్లో॥ యేనేదంజానతేసర్వంతంకేనాన్యేనజానతాం।
విజ్ఞాతారంకేనవిద్యాచ్ఛక్తంవేద్యేతుసాధనం॥ ౧౭.

టీ. యేన - ఏసాక్షిచైతన్యరూపుడగు ఆత్మచేత, ఇదం - ఈ, సర్వం - సర్వప్రపంచమును, జానతే - ప్రాణులెరుగుచున్నారో, తం - ఆసాక్షియగు ఆత్మను, అన్యేన - జడరూపమగు, కేన - దేనిచేత, జానతాం - పురుషులెరుగుదురు. అనగా నెరుగజాలరనుట. విజ్ఞాతారం - దృశ్యము నెరిగెడి ఆత్మను, కేన - ఏదృశ్యరూపముచేత, విద్యాత్ - ఎరుగవచ్చును. అనగా దేనిచేతను ఎరుగుటకుశక్యముగాదనుట. సాధనంతు - జ్ఞానసాధనమనస్సుబో, వేద్యే - ఎరుగదగిన ప్రపంచవస్తువునందు, శక్తం - సామర్థ్యముగలదగును.

తా. మరియు, ఏసాక్షిచైతన్యరూపుడగు ఆత్మచేత, ఈ సర్వప్రపంచమును ప్రాణులెరుగుచున్నారో, అట్టిసాక్షియైన ఆత్మను, ఇతరజడపదార్థములచేత పురుషులెరుగజాలరనియు, సర్వదృశ్యము నెరిగెడి ఆత్మను, మరియేదృశ్యరూపముచేతనైనను ఎరుగుటకు శక్యముగాదని, శ్రు॥ యేనేదంసర్వంవిజానాతితంకేన విజానీయాద్విజ్ఞాతారమరేకేన విజానీయాత్॥ ఇత్యాదిశ్రుతిజెప్పుచున్నది. ప్ర. అయితే, మనస్సుచేత, ఆత్మ, ఎరుగబడడా'యేమి? ఉ. జ్ఞానసాధనమైనమనస్సు, ఎరుగదగినవిషయమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఎరుగుటయందు సామర్థ్యముగలదేయగుగాని, జ్ఞాతయగుప్రత్యగాత్మ నెరుటయందు సామర్ధ్యముగలదిగాదు. ఇట్లు, శ్రు॥ నైవవాచానమనసా॥ అనెడిశ్రుతి, ఇంద్రియమనస్సులచేత, ఆత్మ, ఎరుగబడదని చెప్పుచున్నది. మరియు, ఆత్మ, తనచేతనే తాను ఎరుగబడునని చెప్పినయెడల, అప్పుడు, ఆత్మకు, కర్తృత్వకర్మత్వములు రెండును గలిగియున్నవని చెప్పవలసివచ్చును. అట్లుచెప్పుట, విరోధమగును. గనుక, ఆత్మ, తనచేతనే తాను, ఎరుగబడుననియుంజెప్పరాదు. ఇట్లుజెప్పుటచేత, ఆత్మ, స్వప్రకాశత్వముచేత అనుభవరూపుడేయగుగాని, ఇతరజ్ఞాతృజ్ఞానములచేత అనుభవింపబడెడువాడు గాడని యభిప్రాయము. ఎరిగెడివాడు కర్తయనియు, ఎరుగబడునది కర్మమనియుం దెలియవలెను.

శ్లో॥ సవేత్తివేద్యంతత్సర్వంనాన్యస్తస్యాస్తివేదితా।
విదితావిదితాభ్యాంతత్పృథగ్బోధస్వరూపకం॥ ౧౮.

టీ. సః-ఆఆత్మ, వేద్యం - ఎరుగదగినది, (యద్యత్) ఎద్దియెద్దిగలదో, తత్సర్వం - ఆసకలమగు, వేద్యం - దృశ్యమును, వేత్తి - ఎరుగుచున్నాడు. తస్య - ఆయాత్మకు, అన్యః - ఇతరుడైన, వేదితా - జ్ఞాత, నాస్తి - లేడు బోధస్వరూపకం - బోధస్వరూపకమగు, తత్ - ఆప్రత్యగాత్మయనెడి పరబ్రహ్మము, విదితావిదితాభ్యాం=విదిత - జ్ఞానముచేనెరుగబడెడి దానికంటెను, అవిదితాభ్యాం - అజ్ఞానముచేత కప్పబడినదానికంటెను, పృథక్ - అన్యమైనదగును.

తా. మరియు, ఏయేదృశ్యరూపమగు జగత్తుగలదో, ఆయాసర్వజగత్తును ఆత్మ, ఎరుగుచున్నాడు. ఆఆత్మను ఎరుగుటకు, మరియొకజ్ఞాతలేడు. ఆప్రత్యగాత్మయనెడి పరబ్రహ్మము, బోధస్వరూపకమగును. మరియు, జ్ఞానముచేత ఎరుగబడెడి వస్తువు, (విదితమని) చెప్పబడును. అజ్ఞానముచేత కప్పబడినవస్తువు, (అవిదితమని) చెప్పబడును. అట్టివిదితఅవిదితములనెడి రెంటికంటెను, ఆపరబ్రహ్మము బోధస్వరూపత్వమువల్ల అన్యమగుననితెలియవలెను. ఇట్లని. శ్రు॥ సవేత్తివేద్యంనచతస్యాస్తివేత్తా। అన్యదేవతద్విదితాదథో అవిదితాదధి॥ ఇత్యాదిశ్రుతులు, ఆత్మకు స్వప్రకాశత్వమునే బోధించుచున్నవి. ఈస్వప్రకాశత్వమునే, ఆత్మకు అనుభవరూపమునుగా దెలియవలెను.

అవ. ఇప్పుడు పరిహాసపూర్వకముగా ప్రశ్నోత్తరమునుజెప్పుచున్నాడు.

శ్లో॥ బోధేప్యనుభవోయస్యనకథంచనజాయతే।
తంకథంబోధయేచ్ఛాస్త్రంలోష్టంనరసమాకృతిం॥ ౧౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. యస్య - ఏమందబుద్ధిగలవానికి, బోధేపి - ఘటాదిస్ఫురణరూపమందును, అనుభవః - సాక్షాత్కారము. కథంచన - ఎట్లును, నజాయతే - గలుగదో, తం- ఆ, నరసమాకృతిం=నర - మనుష్యునితోటి, సమ - సమానమైన, ఆకృతిం- ఆకారము వంటి ఆకారముగల, లోష్టం - మట్టిగెడ్డను, అనగా మట్టిగెడ్డవంటి జడబుద్ధిగలమనుష్యునియనుట. శాస్త్రం - శాస్త్రము, కథం - ఎట్లు, బోధయేత్ - బోధించును. అనగా బోధింపజాలదనుట.

తా. ప్ర, అయితే, విదితఅవిదితములనెడి రెంటికంటె నన్యమైన బోధస్వరూపబ్రహ్మము, అనుభవింపబడలేదేమి?. ఉ. ఘటాదిదృశ్యపదార్థమునకు విశేషణముగానుండి, ఆఘటాదిదృశ్యపదార్థము నెరిగినజ్ఞానమే. బోధస్వరూపకమగును. అట్టిబోధానుభవము జనులకులేనియెడల, ఘటాదివిదితపదార్థంబును, సాక్షాత్కారముకానేరదు. గనుక, అట్టిబోధానుభవము జనులకుగలదని, అవశ్యమంగీకరింపవలెను. మరియు, ఏమందబుద్ధిగలవానికి, ఘటాదిస్ఫురణరూపమందును, ఆఘటాదిసాక్షాత్కారముకలుగదో, అట్టిమనుష్యుడు, మట్టిగెడ్డవంటివాడగును. అటువంటి మూఢబుద్ధిగలవానిని, ఎట్లునుశాస్త్రము బోధింపజాలదు. గనుక, ఘటాదిపదార్థము సాక్షాత్కారమగుటకు కారణమైనజ్ఞానమునకే బోధస్వరూపత్వముగలిగియున్నదని తెలియవలెను.

అవ. అట్టిబోధ, నాచేనెరుగబడలేదనెడిమాటయే, విరోధమగునని యిప్పుడు దృష్టాంతసహితముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ జిహ్వామేస్తినవేత్యుక్తిర్లజ్జాయై కేవలంయథా।
నబుద్ధ్యతేమయాబోధోబోద్ధవ్యఇతితాదృశీ॥ ౨౦.

టీ. మే - నాకు, జిహ్వా - నాలుక, అస్తివా - ఉన్నదో, నాస్తివా - లేదో, ఇతి - ఇట్లనెడి, ఉక్తిః - సంభాషణము, యథా - ఏప్రకారము, కేవలం - ముఖ్యముగా, లజ్జాయైః - సిగ్గునుగలిగించెడికొరకు కారణమగుచున్నదో, (తథా) ఆప్రకారము, మయా - నాచేత, బోధః - బోధ, నబుద్ధ్యతే - ఎరుగబడలేదు. బోద్ధవ్యః - మరలబోధింపదగినదగును. ఇతి - ఇట్లనిచెప్పెడివాక్యంబును, తాదృశీ - అటువంటిదే యగును. అనగా సిగ్గును గలిగించుటకు కారణమగుననుట.

తా. నాకు. నాలుకయున్నదో లేదో, అనెడిసంభాషణము, ముఖ్యముగా సిగ్గునుకలిగించుటకు కారణమగునేగాని, బుద్ధిమంతస్వభావమును దెలుపజాలదు. అనగా నాలుకలేనియెడల, నాకునాలుకగలదో, లేదో, అనెడి సంభాషణమును చేయు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టకు శక్యముగాదని యభిప్రాయము. అటువలెనే, నాచేత, బోధ, ఎరుగబడలేదని యు, ఇకమీద మరల బోధింపదగినదని, వ్యవహరించుటయు, సిగ్గునుగలిగించుటకు కారణమగుచున్నది. అనగా, బోధచేతతప్ప, వ్యవహరించుటకు శక్యముగాదని యభిప్రాయము.

శ్లో॥ యస్మిన్‌యస్మిన్నస్తిలోకేబోధస్తత్తదుపేక్షణే।
యద్బోధమాత్రంతద్బ్రహ్మేత్యేవంధీర్బ్రహ్మనిశ్చయః॥ ౨౧.

టీ. లోకే - జగత్తునందు, యస్మిన్‌యస్మిన్ - ఏయేఘటాదిలక్షణవిషయమందు, బోధః - జ్ఞానముగలదో, తత్తదుపేక్షణే = తత్తత్ - ఆయాఘటాదివిషయముయొక్క, ఉపేక్షణే - అనాదరణము, (కృతేసతి) చేయబడుచుండగా, యద్బోధమాత్రం - ఘటాదికమందంతటను వ్యాపించియుండెడి యేస్ఫురణముగలదో, తత్ - ఆస్ఫురణము, బ్రహ్మేతి - బ్రహ్మమనెడి, ఏవం - ఈరూపముగల, ధీః - బుద్ధి, బ్రహ్మనిశ్చయః - బ్రహ్మనిశ్చయమగును. అనగా బ్రహ్మమును తెలియుటయగుననుట.

తా. ప్ర. సరి - ఇవ్విధమైనది, ఆబోధయగుగాక. అట్లైనను ప్రకృతమందు బ్రహ్మము నెరిగెడివిషయమై లాభమేమి? ఉ. లోకమందు, ఏయేఘటాదిలక్షణవిషయమందు జ్ఞానముగలదో, ఆయాఘటాదివిషయమును ఉపేక్షజేయుచుండగా, ఆయాఘటాదికమందు అంతటనువ్యాపించియుండెడి, ఏబోధరూపమగు స్ఫురణముగలదో అట్టిస్ఫురణమే బ్రహ్మమనెడిబుద్ధి, బ్రహ్మమును తెలియుటయగును.

శ్లో॥ పంచకోశపరిత్యాగేసాక్షిబోధావశేషతః।
స్వస్వరూపంసఏవస్యాత్ శూన్యత్వంతస్యదుర్ఘటం॥ ౨౨.

టీ. పంచకోశపరిత్యాగే=-పంచకోశ - పంచకోశములకు, పరిత్యాగే. అ - నాత్మభావనిశ్చయము, ( కృతేసతి ) చేయబడుచుండగా, సాక్షిబోధావశేషతః= సాక్షి - ఆపంచకోశసాక్షిరూపమగు, బోధ - బోధయొక్క, అవశేషతః - అవశేషణమువల్ల, అనగా బోధమిగులుటవల్లననుట. సఏవ - ఆసాక్షిరూపమగుబోధయే, స్వస్వరూపం=స్వ - తనయొక్క, స్వరూపం - నిజరూపమగుబ్రహ్మము, స్యాత్ - అగును. తస్య - ఆసాక్షిబోధకు, శూన్యత్వం - శూన్యభావము దుర్ఘటం - సంపాదింపదగినదికాదు.

తా. ప్ర. అయితే, ఘటాదివిషయాపేక్షచేత, ఆయాఘటాదిపదార్థానుభవరూపమగు బ్రహ్మముతెలియబడినయెడల, ఈపంచకోశవివేకమువల్ల ప్రయోజనమే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మి? ఉ. పంచకోశములకును అనాత్మభావము నిశ్చయింపబడుచుండగా, ఆ పంచకోశములకును సాక్షిరూపమగు బోధయే మిగులుచున్నది. అట్లు మిగినబోధయే, తన స్వరూపమగు బ్రహ్మముగును. గనుక, ఆబ్రహ్మము, దేహమందు ప్రత్యగాత్మ రూపముగా నున్నదనెడి జ్ఞానమువల్ల సంసారము నివర్తింపబడునేగాని, మరియొకవిధమైన జ్ఞానముచేత సంసారము నివర్తింపబడదు. అందుచేత పంచకోశవివేకము వ్యర్థమైనదిగాదు. ప్ర. అయితే, అనుభవసిద్ధములైన అన్నమయాది పంచకోశములకును ఆత్మభావము లేదని బుద్ధిచేతనిశ్చయించినయెడల, మిగులునది శూన్యము కాదాయేమి? ఉ. ఆపంచకోశ సాక్షిరూపమగుబోధకు శూన్యభావమును సంపాదించుటకు శక్యముగాదు. అనగా, సాక్షిరూపమగుబోధకుశూన్యభావమును చెప్పరాదనియభిప్రాయము.

అవ. ఆబోధకు శూన్యత్వము ఘటింపనివిధము నిప్పుడు దెలుపుచున్నాడు.

శ్లో॥ అస్తితావత్స్వయంనామవివాదావిషయత్వతః।
స్వస్మిన్నపివివాదశ్చేత్ప్రతివాద్యత్రకోభవేత్॥ ౨౩.

టీ. వివాదావిషయత్వతః=వివాద - వివాదమునకు, అవిషయత్వతః - నిర్విషయత్వముగా, స్వయంనామ-తానసెడిశబ్దముచేతజెప్పదగిన స్వస్వరూపము, తావత్-లౌకికవైదికులమతమందు, అస్తి-ఉన్నది. స్వస్మిన్నపి- తనస్వరూపమందును, వివాదశ్చేత్ - వివాదముగలిగినయెడల, అత్ర - ఈవిషయమై, కః- ఎవడు, ప్రతివాదీ-విరోధి, భవేత్ - అగును. అనగా ఎవ్వడును ప్రతివాదిలేడనుట.

తా. తానసెడి శబ్దముచేత జెప్పదగిన, తనయొక్క స్వరూపము, లౌకికవైదికులమతమందుఉన్నదేయగును. ప్ర. అట్లున్నదని చెప్పుటకుకారణమేమి?. ఉ. తన స్వరూపము, వివాదమునకు విషయముగామిచేత, లౌకికవైదికులమతమందు, తానసెడి శబ్దముచేజెప్పదగిన స్వస్వరూపము ఉన్నదేయగును. ఆనగా, ఇప్పుడునేనుంటినసెడి నిశ్చయమే ప్రతివానికి గలిగియున్నదేగాని, ఇప్పుడునేను, లేనసెడితలంపు, ఎంత మూఢునకైనను గలిగియుండదని యభిప్రాయము. మరియు, తనస్వరూపమందును వివాదముగలిగి, యిప్పుడు నేనుంటినో, లేనో, యసెడి సంశయముచేత వాదించెడివాడెవ్వడును లేడు.

శ్లో॥ స్వాసత్త్వంతునకస్మైచిదోప్రచతేవిభ్రమంవినా।
అతఏవశ్రుతిర్బాధంబ్రూతేచాసత్త్వవాదినః॥ ౨౪.

టీ. విభ్రమంవినా - ఒకభ్రాంతిదశనువిడిపెంచి, స్వాసత్త్వంతు=స్వ - తన

యొక్క, అసత్త్వంతు - అభావమో, కస్మైచిత్ - ఎవనికొఱకును, నరోచతే - ఇష్టమగుచున్నదికాదు. అతఏవ - అందువల్లనే, అసత్త్వవాదినః - శూన్యవాదికి, శ్రుతిశ్చ - శ్రుతియు, బాధం - బాధను, బ్రూతే - చెప్పుచున్నది.

తా. ప్ర. అయితే, తాను, లేననెడివాదియే, ఇక్కడప్రతివాది, కారాదా యేమి ?. ఉ. తాను, లేననివాదించెడివాడు, ఎవ్వడునులేడు. ఒకభ్రాంతిదశయందు తప్ప, ఇతరదశయందు తనయొక్క అభావము, ఎవ్వనిచేతను అంగీకరింపబడదు. ప్ర. ఏకారణమువల్ల, ఇట్లు మీచేత నిశ్చయింపబడెను ?. ఉ. ప్రతివాదును, తానుండియే వ్యవహరించుచున్నాడుగాని, తానులేకనే వ్యవహరించుచున్నవాడులేడు. గనుక, తనయొక్క అభావమును ఎవ్వడును అంగీకరింపడని నిశ్చయించితిమి. అందుచేతనే బ్రహ్మములేదనిచెప్పెడి శూన్యవాదికి, బాధకలదని, శ్రుతియుంజెప్పుచున్నది.

అవ. ఆశ్రుతి, ఏద్దియనగా నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ అసద్బ్రహ్మేతిచేద్వేదస్వయమేవభవేదసత్ ।
అతోఽస్యమాభూద్వేద్యత్వంస్వసత్త్వంత్వభ్యుపేయతాం॥౨౫.

టీ. బ్రహ్మ - బ్రహ్మము, అసదితి - లేదని, వేదచేత్ - ఎరిగినయెడల, స్వయమేవ - తానే, అసత్ -శూన్యము, భవేత్ -అగును. అనగాలేకపోవుననుట. అతః - ఆకారణమువల్ల. అస్య - ఈబోధస్వరూపుడగు ఆత్మకు, వేద్యత్వం - అనుభవింపబడెడిస్వభావము, మాభూత్ - లేకపోవుగాక. స్వసత్త్వంతు=స్వ-తనయొక్క, సత్త్వంతు - ఉనికియో, అభ్యుపేయతాం - సిద్ధమగుగాక.

తా. పురుషుడు, తానేబ్రహ్మమగుటవల్ల, బ్రహ్మములేదని యెరిగినవాడు, తానేలేకపోవునని, శ్రు॥ అసన్నేవ॥ ఇత్యాదిశ్రుతి, బాధనుజెప్పుచున్నది. ప్ర. అయితే, ఇట్లుచెప్పుటచేత ఫలమేమి ?. ఉ. ఈచెప్పిన కారణమువల్ల పంచకోశములకు సాక్షిత్వముగానుండెడి బోధస్వరూపుడగు ప్రత్యగాత్మకు, ఇతర జ్ఞాతృజ్ఞానములు రెండును లేమిచేత, అనుభవింపబడెడి స్వభావములేదు మరియు, ఇట్టిబోధరూపుడగు ఆత్మ, పురుషునియొక్క స్వరూపమగుటవల్ల, అట్టి ఆత్మయొక్కస్థితిని అవశ్యముగా అంగీకరింపవలెను.

అవ. ఇప్పుడు, ఆత్మకు స్వప్రకాశత్వమును జెప్పుటకు ఇష్టముగలవాడై, ఆయాత్మ, ఇతర జ్ఞాతృజ్ఞానములచేత ఎరుగబడనివాడైనయెడల, ఎటువంటివాడనెడి ప్రశ్నమును కలిగించుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ కీదృక్ తర్హీతిచేత్పృచ్ఛేదీదృక్తానాస్తితత్రహి।
యదనీదృగతాదృక్చతత్స్వరూపంవినిశ్చిను॥ ౨౯.

టీ. తర్హి - అట్లైనయెడల, కీదృగితి -ఆయాత్మయొక్క స్వరూపమెటువంటి దని, పృచ్ఛేచ్చేత్ - అడిగితివేని, తత్ర - ఆయాత్మస్వరూపమందు, ఈదృక్తా -ఇటువంటిదనెడిస్వభావము, నాస్తిహి - లేనేలేదు. అనీదృక్ - ఇటువంటిదనిజెప్పుటకు సాధ్యముగాని స్వరూపంబును, అతాదృక్చ - అటువంటిదనిజెప్పుటకు సాధ్యముగాని స్వరూపంబును, యత్ - ఎద్దియో, (తత్) ఆస్వరూపము, తత్స్వరూపం=తత్ - ఆయాత్మయొక్క, స్వరూపం - స్వరూపమునుగా, వినిశ్చిను- నిశ్చయించుకొనుము.

తా. ప్ర. అయితే, ఆత్మకు వేద్యత్వములేనియెడల, ఆయాత్మస్వరూపమెటువంటిదో జెప్పుము. ఆఆత్మస్వరూపము, ఇట్టిదనియైనను, అట్టిదనియైనను జెప్పినయెడల, ఆరూప విశిష్టత్వముచేతనే ఆత్మకువేద్యత్వముగలుగును, ఆద్వివిధరూపములలో ఒకరూపమునైనను ఆత్మకుగలదని యంగీకరించనియెడల, శూన్యభావముసిద్ధించును. గనుక, ఆత్మకు, ఎట్టిస్వరూపమును చెప్పెదవో జెప్పుము ?. ఉ. ఓపూర్వవాదీ, నీవు చెప్పినట్లు, ఇట్టిది; అట్టిది, అనెడిశబ్దములచేత జెప్పదగినరూపమును ఆత్మకు అంగీకరించినయెడల, ఆరూపముచేతనే ఆత్మకు వేద్యత్వముగలుగును. గనుక, ఆద్వివిధరూపములలో ఒకరూపమునైనను ఆత్మకు జెప్పరాదు. అందువల్ల, ఇట్టిది, అట్టిది, అనెడి శబ్దములచేత జెప్పదగని స్వరూపమెట్టిదో, అట్టిస్వరూపమును ఆత్మకు నిశ్చయించుకొనుము. వేద్యత్వమనగా, ఎరుగబడుటయని యర్థము.

శ్లో॥ అక్షాణాంవిషయస్త్వీదృక్పరోక్షస్తాదృగుచ్యతే।
విషయీనాక్షవిషయస్స్వత్వాన్నాస్యపరోక్షతా॥ ౨౭.

టీ. అక్షాణాం - ఇంద్రియములకు, విషయః - ప్రత్యక్షమైన ఘటాదికము, ఈదృక్ - ఇట్టిదనిచెప్పబడును. పరోక్షః-ఇంద్రియములకు ప్రత్యక్షముగాని పుణ్యాదికము, తాదృక్ - అట్టిదని, ఉచ్యతే- చెప్పబడుచున్నది. విషయీతు- ఆత్మయో, అక్షవిషయః - ఇంద్రియములకు కనబడెడివాడు, న - కాదు. అస్య - ఈఆత్మకు, స్వత్వాత్ - తనవల్ల, పరోక్షతా - పరోక్షత్వము, న-లేదు.

తా. ప్ర. ఓ అద్వైతసిద్ధాంతీ, ప్రతిజ్ఞామాత్రముచేతనే కార్యసిద్ధిగాదు. ఇట్టిదట్టిదిగాని స్వరూపమెద్దియో జెప్పుము ?. ఉ. ఓపూర్వవాదీ, లోకమందు ఇంద్రియములకు ప్రత్యక్షమైన ఘటాదిపదార్థము, ఇట్టిదనెడి శబ్దముచేత జెప్పబడుచున్నది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇంద్రియములకు ప్రత్యక్షము గాని పుణ్యాదికము, అట్టిదనెడి శబ్దము చేత జెప్పబడుచున్నది. ద్రష్టయగు ఆత్మయో, చక్షురాదిఇంద్రియములకు ప్రత్యక్షమయ్యెడివాడు గామిచేత, ఇట్టివాడని చెప్పబడడు. తనచేతనే తనకు పరోక్షత్వములేమిచేత అట్టివాడని యుంజెప్పబడడు. అనగా, (అహం) నేనని ప్రత్యక్షముగా స్ఫురించుచుండుట చేత ఆత్మకు, తనచేతతనకు పరోక్షత్వములేదని యభిప్రాయము. గనుక, ఇట్టిదిఅట్టిది, అనెడిశబ్దముల చేత జెప్పదగనిస్వరూపముగలవాడు, ఆత్మయనుట సిద్ధమాయెను.

అవ. ఇప్పుడు, శూన్యమనెడి రెండవపక్షమును ఫలమునుజూపెడి నెపము చేత పరిహరించుచున్నాడు.

శ్లో॥ అవేద్యోప్యపరోక్షోతః స్వప్రకాశో భవత్యయం।
సత్యంజ్ఞానమనంతం చేత్యస్తీహ బ్రహ్మలక్షణం॥ ౨౭.

టీ. అయం - ఈప్రత్యగాత్మ, అవేద్యోపి - ఇంద్రియజన్యజ్ఞానము చే నెరుగబడెడువాడు గాకపోయినను, అపరోక్షః - అపరోక్షత్వముగా ప్రకాశించుచున్నాడు. అతః - అందువల్ల, స్వప్రకాశః-స్వయముగా ప్రకాశించుచున్నవాడు, భవతి-అగుచున్నాడు. బ్రహ్మలక్షణం=బ్రహ్మ- పరమాత్మయొక్క, లక్షణం - స్వరూపలక్షణమగు, సత్యం - సత్యత్వంబును. జ్ఞానం - చిద్రూపత్వంబును, అనంతంచ - పరిపూర్ణత్వంబును, ఇహ - ఈప్రత్యగాత్మయందు, అస్తి - కలదు.

తా. ఈప్రత్యగాత్మ, ఇంద్రియజన్యజ్ఞానము చేత ఎరుగబడెడివాడుగాకపోయినను, సాక్షాత్ప్రత్యక్షముగా, (అహం) నేనని స్ఫురించుచుండుటచేత, స్వప్రకాశుడగును. * జ్ఞానవిషయత్వములేకనే అపరోక్షముగా ప్రకాశించుచుండుటవల్ల, ఈఆత్మ, సంవేదనమువలె స్వప్రకాశుడగునని యభిప్రాయము * ఈవాక్యమందు, జ్ఞానవిషయత్వములేకనే యనునది, విశేషణమగును. అపరోక్షమనునది హేతువగును. ఈ రెంటి విశిష్టి విశేషణసిద్ధహేతువని చెప్పబడును. మరియు, సంవేదనమనునది స్వప్రకాశత్వమునకు దృష్టాంతమగును. ఈ చెప్పబడిన హేతువును విశేషణసిద్ధముగాని దానినిగా జెప్పరాదు. ప్ర. అదియేమి?. ఉ. ఆత్మకు జ్ఞానవిషయత్వము గలుగుచుండగా, కర్తృకర్మభావములు రెండును ఆత్మకుగలిగియున్నవని చెప్పవలసివచ్చును. ఇట్లుచెప్పుట విరోధమగును. ప్ర. అయితే, ఆత్మకు జ్ఞానవిషయత్వముగలదని చెప్పి, స్వస్వరూపము చేత కర్తృత్వముగలిగియుండుననియు, విశిష్టరూపము చేత కర్మత్వము గలిగియుండుననియు, ఇట్లు అంగీకరించినయెడల విరోధమేమి?. ఉ. అట్లు అంగీకరించినయెడల, గమనక్రియయందును, ఒకదేవదత్తునకే, స్వస్వరూపము చేత కర్తృత్వముగలిగియున్న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దనియు, విశిష్టరూపముచేత కర్తృత్వముగలిగియున్న దనియు, ఇట్లు అధికప్రసంగము చేయవలసివచ్చును. గనుక, అట్లుచెప్పరాదు. మరియు, పైనచెప్పబడిన సంవేదనదృష్టాంతమును, సాధనహీనత్వముగల దానినిచెప్పరాదు. ప్ర. అదియెట్లు ?. ఉ. సంవేదనమునకు మరియొక సంవేదనాపేక్షగలిగియుండునని చెప్పినయెడల, దానికి మరియొకటి దానికిమరియొకటియని, యిట్లు అనవస్థాదోషము సంప్రాప్తమగును. కనుక, సంవేదనమునకు మరియొకసంవేదనాపేక్ష గలిగియుండదు. మరియు, తార్కికమతమందు ఘటజ్ఞానముచేత ఘటము ప్రకాశింపబడుచున్నదనియు, ఆఘటజ్ఞానము అనువ్యవసాయమనెడి మరియొకజ్ఞానముచేత బ్రకాశింపబడుచున్నదని చెప్పబడెననియు, అందుచేత స్వప్రకాశత్వమందు సంవేదనదృష్టాంతము సాధనహీనత్వముగలదనియు జెప్పరాదు. ప్ర. అదియేమి ?. ఉ. ఆతర్కమతమందు జెప్పబడినపద్ధతి, ఒకానొకవిధముగానున్నదియేగాని, జ్ఞానము మరియొకజ్ఞానముచేత బ్రకాశింపబడుటలేదు. ప్ర. అట్లైనను, ఈ జ్ఞానస్వరూపుడైన ఆత్మకు బ్రహ్మత్వమెట్లుసిద్ధించును ?. ఉ. శ్రు॥ సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ, అనెడిశ్రుతిచేత, బ్రహ్మము, సద్రూపమనియు, చిద్రూపమనియు, అనంతమనియు, ఇట్లు బ్రహ్మస్వరూపలక్షణము చెప్పబడెను. ఆబ్రహ్మస్వరూపమగు, సత్యజ్ఞానానంతలక్షణము, ఈప్రత్యగాత్మయందున్నది. కనుక, ఈఆత్మకు బ్రహ్మత్వము, సత్వసిద్ధమైయున్నది. సంవేదనమనగా జ్ఞానమనియర్థము.

అవ. ఇప్పుడు, ఆత్మకు సత్యత్వమును ఉపపాదించుటకొరకు, సత్యత్వలక్షణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ సత్యత్వంబాధరాహిత్యంజగద్బాధైకసాక్షిణః।
బాధఃకింసాక్షికోబ్రూహిహ్యసాక్షికఇష్యతే॥ ౨౯.

టీ. బాధరాహిత్యం=బాధ-బాధయొక్క, రాహిత్యం- లేమి, అనగా బాధశూన్యత్వమనుట. సత్యత్వం - సత్యత్వమగును. జగద్బాధైకసాక్షిణః=జగత్-స్థూలసూక్ష్మశరీరాది లక్షణముగల జగత్తుయొక్క, బాధ - లేమికి, ఏక - ముఖ్యమైన, సాక్షిణః - సాక్షిత్వముచేత వర్తించుచుండెడి ఆత్మయొక్క, బాధః - అభావము, కింసాక్షికః - ఏసాక్షిగలదో, బ్రూహి - చెప్పుము. అనగా ఆత్మయొక్కలేమికి సాక్షిలేదనుట, అసాక్షికస్తు - సాక్షిలేనిబాధయో, నేష్యతే - అంగీకరింపబడదు.

తా. బాధశూన్యత్వము, సత్యత్వముయొక్క లక్షణమగును. బాధింపబడనిది సత్యమనియు, బాధింపబడునది మిథ్యయనియు, వాక్యం॥ సత్యమబాధ్యంబాధ్యం మి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధ్యేతితత్త్వవేకః॥ ఇట్లు పూర్వాచార్యులచేత సత్యత్వలక్షణము జెప్పబడియున్నది. బాధయనగా లేమియగును. ప్ర. సరి. ఇట్లుచెప్పుటచేత ప్రస్తుతమందులాభమేమి?. ఉ. స్థూలసూక్ష్మశరీరాది లక్షణముగల జగత్తునకు సుషుప్తి మూర్ఛాసమాధ్యవస్థల యందు, ఏబాధగలదో, అట్టిజగద్బాధకు సాక్షిత్వముచేత ఆత్మవర్తించుచున్నాడు. అట్టి ఆత్మయొక్క బాధకు సాక్షిలేదు. కనుక, ఆత్మకు బాధలేదని తెలియవలెను. ప్ర. అయితే, సాక్షిలేకపోయినను, ఆత్మకుబాధకలదని, అంగీకరింపరాదాయేమి?. ఉ. సాక్షిలేనిబాధ, అంగీకరింపబడదు. సాక్షిలేనిభాధ నంగీకరింతమని చెప్పుట, అధిక ప్రసంగమగును.

అవ. ఈచెప్పబడినయర్థమునిప్పుడుదృష్టాంతముచేత స్పష్టముజేయుచున్నాడు.

శ్లో॥ అపనీతేషుమూర్తేషుహ్యమూర్తంశిష్యతేవియత్।
శక్యేషుబాధితేష్వంతేశిష్యతెయత్తదేవతత్॥ ౩౦.

టీ. మూర్తేషు-గృహములయందుండెడి ఘటాదిపదార్థములు, అపనీతేషుసత్సు- గృహాదులనుంచితెచి పారవైవబడుచుండగా, అమూర్తం - తెవిచిపారవైచుటకు శక్యముకాని, యత్-ఏఆకాశము, శిష్యతే - ఆగృహాదులయందు శేషింపబడుచున్నదో, (తథా) ఆప్రకారము, శక్యేషు - నిరాకరించుటకు శక్యములైన దేహేంద్రియాదులు, బాధితేషుసత్సు- ఆత్మగాడని నిరాకరింపబడుచుండగా, అంతే-అంతమందు, యత్ - ఏబోధరూపము, శిష్యతే - సర్వనిరాకరణ సాక్షిత్వముచేత శేషింపబడుచున్నదో, తదేవ - ఆబోధస్వరూపమే, తత్ - ఆపరబ్రహ్మమగును అనగా ప్రత్యగాత్మ యగుననుట.

తా. గృహాదులయందుండెడి ఘటాదిపదార్థములు, ఆగృహాదులనుంచి తెచి పారవైవబడుచుండగా, తుదకు, తెచిచిపారవైచుటకు శక్యముగాని ఆకాశమే, ఆగృహాదులయందు పరిపూర్ణముగా మిగులుచున్నది. ఈప్రకారమే, బోధస్వరూపుడైన తనకంటె అన్యములైన దేహేంద్రియాదులు, శ్రు॥ నేతినేతి॥ ఇదియాత్మగాదిది యాత్మగాదనిజెప్పెడి శ్రుతిప్రకారము, బుద్ధిచేత నిరాకరింపబడుచుండగా, అంత్యమందు సర్వమును నిరాకరించుటకు సాక్షిభావముచేత, ఏబోధమిగులుచున్నదో, ఆబోధయే, బాధలేనియాత్మయని తెలియవలెను.

శ్లో॥ సర్వబాధేనకించిచ్చేద్యన్నకించిత్తదేవతత్।
భాషాఏవాత్రభిద్యంతేనిర్బాదంతావదస్తిహి॥ ౩౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. సర్వబాధేసతి=సర్వ - స్థూలసూక్ష్మశరీరాది సర్వప్రపంచమునకు, బాధే సతి - మిథ్యాభావముగలుగుచుండగా, కించిత్ - కొంచెమైనను, నచేత్ - లేదంటి వేని, నకించిత్ - కొంచమైనను లేదనెడివిషయముగల, యత్ - ఏజ్ఞానముగలదో, తదేవ - అజ్ఞానమే, తత్ - ఆబ్రహ్మమగును. అత్ర - ఈప్రత్యగాత్మయందు, భాషాఏవ - కొంచెమైననులేదనెడి యిత్యాదిశబ్దములే, భిద్యంతే - భేదింపబడుచున్నవి. నిర్బాధం - బాధలేని సాక్షిచైతన్యము, తావదస్తిహి - అంతటనున్న దేననుట.

తా. ప్ర. అయితే, తోచుచుండెడి స్థూలసూక్ష్మశరీరాది సర్వప్రపంచమును ఆత్మగాదని బుద్ధిచేత నిరాకరించినయెడల, కొంచెమైనను మరియొకటి మిగిలియుండ దు. అట్లు ఏదియును మిగులకపోవుచుండగా, ఏబోధమిగులుచున్నదో, అదియే ఆత్మయని యెట్లుచెప్పవచ్చును? ఉ. కొంచమైనను మిగులలేదని చెప్పెడివారికిని, అట్లుచెప్పుటకు స్వభావవిషయమైన, ఒక జ్ఞానముగలదని అవశ్యమంగీకరింపవలెను. అట్టి సర్వా భావజ్ఞానమే, మాకుసమ్మతమైన ఆత్మస్వరూపమగును. గనుక, కొంచెమైనను మరి యొకటి మిగులలేదనెడి శబ్దముచేత, ఏచైతన్యము చెప్పబడుచున్నదో, ఆచైతన్యమే ఆత్మస్వరూపమగు బ్రహ్మమగును. ప్ర. అయితే, అభావమును దెలిపెడి, కొంచమై నను మరియొకటి మిగులలేదనెడి శబ్దముచేత చైతన్యము చెప్పబడదని యెట్లు చెప్పవ చ్చును?. ఉ. స్థూలసూక్ష్మాది సర్వప్రపంచబాధకు సాక్షిత్వముగా వర్తించెడి జ్ఞాన మును అవశ్యమంగీకరించవలెను. మరియు, వస్తువును దెలిపెడిశబ్దములయందే భేదము గలదుగాని, ఆవస్తువునందు భేదముండదు. అందుచేత, సర్వజగద్బాధకు సాక్షియగు ప్రత్యగాత్మయందు, కొంచెమైనను మరియొకటి మిగులలేదనెడి ఇత్యాదిశబ్దములే భేదిం పబడుచున్నవిగాని, బాధలేని సాక్షిచైతన్యము (సర్వదా) ఉన్నదేయగును.

అవ. ఈయర్థమును, శ్రుతిచేత సిద్ధాంతమును జేయుచున్నాడు.

శ్లో॥ అతఏవంశ్రుతిర్బాధ్యంబాధిత్వా శేషయత్యదః।
సఏష నేతి నేత్యాత్మేత్యతద్వ్యావృత్తిరూపతః॥ 3 ౨.

టీ. అతఏవ - అకారణమువల్లనే, సఏషః - అతఁ, ఆత్మా - పరమాత్మ, నేతి నేతి - ఇదిగాదిదిగాదు. ఇతి - ఇట్లుచెప్పెడి శ్రుతియు, అతద్వ్యావృత్తిరూపతః= అతత్ - అనాత్మపదార్థములయొక్క, వ్యావృత్తిరూపతః - నిరాకరణద్వారా, బాధ్యం - నిరాకరించుటకుయోగ్యమైన సర్వప్రంచవస్తుసమూహమును. బాధిత్వా - అత్మగా దని నిరాకరించి, అదః - నిరాకరించుటకు శక్యముగాని ప్రత్యక్స్వరూపమును, శేష యతి - మిగిలింపజేయుచున్నది.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఏకారణముచేత సాక్షిచైతన్యము బాధింపబడదో, ఆకారణమువల్లనే, శ్రు॥ సఏషనేతినేత్యాత్మా॥ అనెడిశ్రుతియు, అనాత్మపదార్థనిరాకరణద్వారా, నిరాకరించుటకు శక్యమైన అనాత్మ వస్తుసమూహమునంతయు ఆత్మ గాదని నిరాకరించి, అటుపిమ్మట నిరాకరించుటకు శక్యగాని ప్రత్యగాత్మస్వరూపమును శేషింపజేయుచున్నది.

శ్లో॥ ఇదంరూపంతుయద్యావత్తత్త్యక్తుంశక్యతేఽఖిలం।
అశక్యోహ్యనిదంరూపస్సఆత్మాబాధవర్జితః॥ ౩౩.

టీ. ఇదం - ఇదియనిదృశ్యత్వముచే ననుభవింపబడుచుండెడి, రూపం-స్వరూపముగల, యద్యావత్ - ఏదేహేంద్రియాది దృశ్యవస్తు సమూహముగలదో, తదఖిలం-ఆదృశ్యమంతయు, త్యక్తుం - నిరాకరించుటకు, శక్యతేతు - శక్యమేయగుచున్నది. అనిదంరూపః - ఇదియనెడి భావముచేత పొందుటకు యోగ్యుడుగాని సాక్షి, అశక్యః-నిరాకరించుటకు అశక్యుడగును, బాధవర్జితః - బాధలేని, సః - ఆసాక్షి, ఆత్మ - ప్రత్యగాత్మయగును.

తా. ప్ర. అయితే, శ్రు॥ సఏషనేతినేత్యాత్మా॥ అనెడిశ్రుతి, నిరాకరించుటకు యోగ్యమైనదానిని ఆత్మగాదనినిరాకరించి, పిమ్మట నిరాకరించుటకు శక్యముగాని దానిని శేషింపజేయుచున్నదని చెప్పితిరి. అక్కడనిరాకరించుటకు శక్యమైనదేదియో, నిరాకరించుటకు శక్యగానిదెద్దియో జెప్పుము?. ఉ. ఇదియని దృశ్యభావముచేత అనుభవింపబడెడి స్వరూపముగల దేహేంద్రియాది అనాత్మవస్తు సమూహమంతయు, ఆత్మగాదని బుద్ధిచేత విడుచుటకు శక్యమగును. మరియు, ఇదియని దృశ్యత్వముచేత ఎరుగబడుటకు యోగ్యుడుగానిసాక్షిని, విడుచుటకు శక్యముగాదు. మరియు, సర్వదృశ్యమును ఆత్మగాదని బుద్ధిచేతవిడిపించెడి తనయొక్క స్వరూపమే సాక్షియగుటల్ల, ఆసాక్షినివిడుచుటకు శక్యముగాదనియుం దెలియవలెను. ప్ర. అయితే, ఇట్లు చెప్పుట చేత ఫలమేమి?. ఉ. ఎప్పటికిబాధలేని, యేసాక్షిరూపమగు బోధగలదో, ఆబోధయే ఆత్మయగుగాని, అహంకారాది దృశ్యపదార్థసమూహము ఆత్మగాదని తెలియవలెను.

శ్లో॥ సిద్ధంబ్రహ్మణిసత్యత్వంజ్ఞానత్వంతుపురేరితం।
స్వయమేవానుభూతిత్వాదిత్యాదివచనైఃస్ఫుటం॥ ౩౪.

టీ. బ్రహ్మణి- బ్రహ్మస్వరూపలక్షణమందుగల, సత్యత్వం- సత్యలక్షణము, సిద్ధం - ఆత్మయందు సిద్ధముగానున్నదేయగును, స్వయమేవ - తానే, అనుభూతి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్వాదిత్యాదివచనైః- అనుభవరూపుడగుటవల్లలని చెప్పబడిన ఇత్యాదివాక్యములచేత, జ్ఞానత్వం-జ్ఞానలక్షణము, స్ఫుటం-లెస్సగా, పురా పూర్వము, ఈరితం- చెప్పబడినది.

తా. ప్ర. సరి. ఆత్మనుబాధలేకపోవుగాక. ఇట్లు చెప్పుటచేత ప్రస్తుతమందు లాభమేమి ?. ఉ. బ్రహ్మస్వరూపలక్షణమందు, ఏసత్యలక్షణము చెప్పబడెనో, ఆస త్యలక్షణము, పూర్వోక్తప్రకారము ఆత్మయందు సిద్ధముగానున్నదే యగును. ప్ర. సరి. ఆత్మయందు సత్యత్వముండుగాక. ఆత్మయందు జ్ఞానలక్షణమెట్లుండెనో జెప్పుము?. ఉ. ౧౩ పదుమూడవశ్లోకము మొదలగు శ్లోకములచేత, ఆత్మయందు జ్ఞానలక్షణము గలదని పూర్వమే చక్కగా జెప్పబడెను. గనుక, బ్రహ్మస్వరూపమందుగల సత్యజ్ఞా నలక్షణములు రెండును, ఆత్మయందున్నవని తెలియవలెను,

శ్లో॥ నవ్యాపిత్వాద్దేశతోంతోనిత్యత్వాన్నాపికాలతః।
నవస్తుతోపిసార్వాత్మ్యాదానంత్యంబ్రహ్మణిత్రిధా॥ 3౫.

టీ. వ్యాపిత్వాత్ - వ్యాపిత్వమువల్ల, దేశతః - దేశమువల్లకలిగెడి, అంతః- నాశము, న. బ్రహ్మమునకులేదు. నిత్యత్వాత్ - బ్రహ్మమునిత్యమగుటవల్ల, కాల తోపి - కాలమువల్లకలిగెడి నాశంబును, న-లేదు. సార్వాత్మ్యాత్ - బ్రహ్మము సర్వవస్తుస్వరూపమగుటవల్ల, వస్తుతోపి - వస్తువువల్లకలిగెడినాశంబును, న- లేదు. బ్రహ్మణి -బ్రహ్మమందు, ఆనంత్యం-అనంతస్వభావము, త్రిధా-ఇట్లు త్రివిధమగును.

తా. ప్ర. సరి. సత్యత్వజ్ఞానత్వములురెండును ఆత్మయందుసిద్ధించినను, బ్రహ్మ మందు అనంతస్వభావములేమిచేత, ఆఅనంతస్వభావము ఆత్మయందుసిద్ధింపదుగదా.? ఉ. బ్రహ్మమందు అనంతస్వభావముగలదు. ఆఅనంతస్వభావము, మూడువిధములు గానున్నది ప్ర. అదియెట్లు ?. బ్రహ్మము, వ్యాపకరూపకమగుటవల్ల, ౧. దేశము చేతకలగెడి పరిచ్ఛేదము బ్రహ్మమునకులేదని, శ్రు॥ నిత్యంవిభుంసర్వగతంసు సూక్ష్మం ఆకాశవత్సర్వగతశ్చనిత్యః॥ అనెడిఇత్యాదిశ్రుతి, జెప్పుచున్నది. మరియు, బ్రహ్మయు, బ్రహ్మము, నిత్యమగుటవల్ల, ౨. కాలముచేత గలిగెడి పరిచ్ఛేదము బ్రహ్మమునకులే దని, శ్రు॥ నిత్యోనిత్యానాంచేతనశ్చేతనానాం॥ అనెడి ఇత్యాదిశ్రుతి, జెప్పుచున్నది. మరియు, బ్రహ్మము సర్వవస్తుస్వరూపమగుటవల్ల, 3. వస్తువుచేత కలిగెడి పరిచ్ఛేద ము బ్రహ్మమునకులేదని. శ్రు॥ ఇదంసర్వంయదయమాత్మా సర్వంహ్యేతద్బ్రహ్మబ్రహ్మై వేదంసర్వం॥ అనెడి ఇత్యాదిశ్రుతి, జెప్పుచున్నది. గనుక, ఈచెప్పబడిన శ్రుతులయం దు బ్రహ్మమునకు, వ్యాపిత్వనిత్యత్వ సర్వాత్మత్వములు ప్రతిపాదించుటవల్ల, దేశకాల వస్తువులచేత బ్రహ్మమునకు పరిచ్ఛేదములేదని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. కేవలశ్రుతివల్లనేగాక, యుక్తిచేతయు బ్రహ్మమందు అనంతస్వభావము తోచుచున్నదని, ఇప్పుడు దెలుపుచున్నాడు.

శ్లో॥ దేశకాలాన్యవస్తూనాంకల్పితత్వాచ్చమాయయా।
నదేశాదికృతోంతోస్తిబ్రహ్మణ్యానంత్యంస్ఫుటంతతః॥ ౩౬.

టీ. దేశకాలాన్యవస్తూనాం - దేశకాలాన్యవస్తువులు, మాయయా - మాయచేత, కల్పితత్వాచ్చ - కల్పించబడుటవల్ల, దేశాదికృతః=దేశాది.దేశకాలాదులవల్ల, కృతః-చేయబడెడి, అనగా కలిగెడియనుట. అంతః - నాశము, నాస్తి - వాస్తవముచేతలేదు. తతః - అందువల్ల, బ్రహ్మ - బ్రహ్మము, ఆనంత్యం - అనంతస్వభావముగలదగును. స్ఫుటం - ఆఅనంతస్వభావమాత్మయందును సిద్ధమేయగును.

తా. బ్రహ్మమునకు పరిచ్ఛేదమునుకలిగించుటకు కారణములైన, ౧ దేశము, ౨. కాలము, ౩. అన్యవస్తువు, ఈమూడును, మాయచేతకల్పించబడినవగుటచే. కనుక, ఇంద్రజాలాదిమాయచేత కల్పించబడిన గంధర్వపట్టణాదులవల్ల ఆకాశమునకు వాస్తవమైన పరిచ్ఛేదములేనట్లు, మాయాకల్పితములైన దేశకాలాన్యవస్తువులచేత వాస్తవమైన పరిచ్ఛేదము బ్రహ్మమందుసంభవింపదు. ఈయుక్తిప్రకారము, బ్రహ్మమందు అనంతస్వభావముగలదని స్పష్టముగాదోచుచున్నది. మరియు, బ్రహ్మమందు సత్యత్వముండుటచేత, అనంతత్వము సిద్ధముగానుండునని తెలియవలెను.(మరియు, బ్రహ్మమందు సత్యత్వముండుటచేత, అనంతత్వము సిద్ధముగానుండునని తెలియవలెను) మరియు, బ్రహ్మమే ఆత్మయని, శ్రు॥ తదేతత్సత్యమాత్మాబ్రహ్మైవబ్రహ్మాత్మైవాత్రహ్యేవం. నవిచికిత్స్యమిత్యోంసత్యమాత్మైవనృసింహోదేవోబ్రహ్మభవతి. అయమాత్మాబ్రహ్మ॥ ఇత్యాది శ్రుతిసహస్రంబులు ఆత్మబ్రహ్మములకు అభేదమును జెప్పుచున్నవి. గనుక బ్రహ్మమందుగల అనంతస్వభావము, ఈప్రత్యగాత్మయందు సిద్ధముగానున్నదే యగునని యభిప్రాయము.

శ్లో॥ సత్యంజ్ఞానమనంతంయద్బ్రహ్మతద్వస్తుతస్యతత్।
ఈశ్వరత్వంచజీవత్వముపాధిద్వయకల్పితం॥ ౩౭.

టీ. సత్యం - సత్యస్వభావము, జ్ఞానం - జ్ఞానస్వభావము, అనంతం - అనంతస్వభావముగల, యత్ - ఏ, బ్రహ్మ - బ్రహ్మముగలదో, తత్ -ఆపరబ్రహ్మము, వస్తు-పారమార్థికమగును. తస్య- ఆబ్రహ్మమునకు, ఈశ్వరత్వం- ఈశ్వరభావంబును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జీవత్వంచ - జీవభావంబును. తత్ - ఆయీశ్వరజీవత్వము, ఉపాధిద్వయకల్పితం= ఉపాధిద్వయ - రెండుఉపాధులచేత, కల్పితం - కల్పించబడెను.

తా. ప్ర. అయితే, జడరూపమగు జగత్తు, మాయచేతబ్రహ్మమందు కల్పించబడుటవల్ల, ఆజగత్తు బ్రహ్మమునకు వాస్తవమైన పరిచ్ఛేదమును కలిగించలేకపోయినను, చేతనులైన జీవేశ్వరులకు జడస్వభావములేని కారణముచేత, ఆజీవేశ్వరులు బ్రహ్మమందు వాస్తవమైన పరిచ్ఛేదమునుకలిగింపగలరు. అందుచేత, బ్రహ్మమునకు అనంతస్వభావము లభింపదనిచెప్పరాదాయేమి?? ఉ. ఈయీశ్వరజీవులును, క్రిందచెప్పబోవుడి రెండు ఉపాధులవల్ల గల్పించబడిరి. కనుక, వారును పారమార్థికస్వరూపులుగారు. ఆకారణముచేత, ఆయీశ్వరజీవులును బ్రహ్మమునందు వాస్తవమైన పరిచ్ఛేదమును గలిగింపజాలరు అనియుట్లనగా జెప్పెదవినుము. సత్యజ్ఞానానంత స్వరూపలక్షణముగల, ఏపరబ్రహ్మముగలదో, ఆబ్రహ్మమే పారమార్థికమగును. లోకప్రసిద్ధములగు, ఈశ్వరత్వజీవత్వములురెండును రెండుఉపాధులచేత ఆపరబ్రహ్మమునకే కల్పించబడినవి. అట్లు ఈశ్వరజీవులిద్దరును బ్రహ్మమందుగల్పించబడుటచేత, జడరూపమగుజగత్తువలెనే, ఆయీశ్వరజీవులును బ్రహ్మమునకు వాస్తవమైన పరిచ్ఛేదమును కలిగింపజాలరని యభిప్రాయము.

అవ. ఆఉపాధులురెండు నిర్ణయనగా, ఆరెండు ఉపాధులను క్రమముగా జూపదలచి, మొదట, ఈశ్వరోపాధిభూతమైన శక్తిని దెలుపుచున్నాడు.

శ్లో॥ శక్తిరస్త్యైశ్వరీకాచిత్సర్వవస్తునియామికా।
ఆనందమయమారభ్యగూఢాసర్వేషువస్తుషు॥ ౩౭.

టీ. సర్వవస్తునియామికా = సర్వవస్తు - పృథివ్యాది సర్వవస్తువులయొక్క, నియామికా - నియమనముజేయునదియు, కాచిత్ - ఒకానొకటియగు, అనగా అనిర్వచనీయమనుట. ఐశ్వరీ - ఈశ్వరోపాధిభూతమైనట్టి, అనగా ఈశ్వరసంబద్ధమైనదనుట. శక్తిః-శక్తి, అస్తి-కలదు. ఆనందమయం-ఆనందమయకోశమును, ఆరభ్య-ప్రారంభించి, అనగా ఆనందమయకోశము మొదలుకొనియనుట- సర్వేషు- బ్రహ్మాండము మొదలగు సకలములైన, వస్తుషు-వస్తువులయందు, గూఢా-ఆశక్తిఅణగియున్నది.

తా. సత్యాసత్యరూపములచేత జెప్పుటకు శక్యముగానట్టిదియు, ఈశ్వరోపాధిత్వముచేత ఈశ్వరసంబంధినియైనట్టిదియు, అంతర్యామి బ్రాహ్మణమందు జెప్పబడిన నియమింపదగినవస్తువులను నియమించునదియగు, ఒకశక్తికలదు. ఆశక్తి, ఈశ్వరునకు ఉపాధిభూతముగా వర్తించుటచేత, ఈశ్వరసంబంధినియని చెప్పబడును. ప్ర. అయి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే, ఆశక్తి, ఎచ్చటనున్నదియో, ఎందువల్ల పొందబడలేదో చెప్పుము ?. ఉ. ఆనందమయకోశము మొదలుకొని, బ్రహ్మాండాంతపర్యంతముగల పృథివ్యాదిసర్వవస్తువులయందును, అణగియున్నది. అందువల్ల మనయింద్రియములచేత గ్రహింపబడలేదని యభిప్రాయము.

శ్లో॥ వస్తుధర్మానియమ్యేరన్ శక్త్యానైవయదాతదా।
అన్యోన్యధర్మసాంకర్యాద్విప్లవేవజగద్భవేత్॥ ౩౯.

టీ. యదా - ఎప్పుడు, శక్త్యా-శక్తిచేత, వస్తుధర్మాః=వస్తు-భూమి మొదలగు వస్తువులయొక్క, ధర్మాః-కాఠిన్యాదిధర్మములు, నైవనియమ్యేరన్ - నియమింపబడవో, అనగా స్థాపింపబడవోయనుట. తదా-అప్పుడు, అన్యోన్యధర్మసాంకర్యాత్ = అన్యోన్యధర్మ - ఒకవస్తుధర్మము మరియొకవస్తుధర్మముతోటి, సాంకర్యాత్ - చేరియుండుటవల్ల, అనగా అనేకవస్తుధర్మములు ఒకవస్తువునందే చేరియుండుటచేననుట. జగత్ - ప్రపంచము, విప్లవేదభవు - అనియతవ్యవహారవిభ్రమత్యమును పొందునుగదాయనుట.

తా. ప్ర. అయితే, నియమముచేత లభింపబడని శక్తిని, లేనిదానినిగానే చెప్పరాదాయేమి ?. ఉ. పృథివ్యాదివస్తువులయొక్క కాఠిన్యాదిధర్మములు, శక్తిచేత స్థాపింపబడనియెడల, ఆయావస్తుధర్మములన్నియు, కలసి ఒకవస్తువునందే వర్తించుచుండును. అట్లువర్తించుచుండుటచేత, జగత్తు, నియమముగల వ్యవహారమునుపొందియుండదు. అనగా, ఆయావస్తుధర్మములను ఆయావస్తువునందుండునట్లుగా, నియమించుటకు శక్తికే సాధ్యమగుగాని, మరియొకదానికి సాధ్యముగాదని యభిప్రాయము, ఈకారణముచేత శక్తిలేదనిచెప్పరాదని తెలియవలెను.

శ్లో॥ చిచ్ఛాయావేశతశ్శక్తిశ్చేతనేవవిభాతిసా।
తచ్ఛక్త్యుపాధిసంయోగాద్బ్రహ్మైవేశ్వరతాంవ్రజేత్॥ ౪౦.

టీ. సాశక్తిః - ఆమాయాశక్తి, చిచ్ఛాయావేశతః=చిచ్ఛాయా - చిదాభాసునియొక్క, ఆవేశతః - ప్రవేశమువల్ల, చేతనేవ - చేతనత్వమును పొందినదానివలె, విభాతి - తోచుచున్నది. తచ్ఛక్త్యుపాధిసంయోగాత్=తచ్ఛక్తి-ఆశక్తియే, అనగా ఆశక్తియనెడియనుట. ఉపాధి - ఉపాధితోటి, సంయోగాత్ - సంబంధమువల్ల, బ్రహ్మైవ - సత్యజ్ఞానానంతస్వరూప పరబ్రహ్మమే, ఈశ్వరతాం - సర్వజ్ఞత్వాదిధర్మములుగల ఈశ్వరభావమును, వ్రజేత్ - పొందును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే, జడరూపమైన ఈమాయాశక్తి, జగత్తును నియమించునది యగునని చెప్పుట, యుక్తమెట్లగును?. ఉ. ఆమాయాశక్తియందు, పరబ్రహ్మముయొక్క ప్రతిబింబము ప్రవేశించియున్నది. ఆప్రతిబింబము చిదాభాసుడని చెప్పబడును. అట్టి చిదాభాసునితోటి, ఆమాయాశక్తి కూడియుండుటవల్ల, ఆమాయాశక్తి, చేతన భావమును పొందినదానివలె తోచుచున్నది. అట్టిమాయాశక్తియే, బ్రహ్మమునకు ఉపాధియగును. ఆమాయాశక్త్యుపాధితోటి సంబంధమువల్ల, సత్యజ్ఞానానంతస్వరూప పరబ్రహ్మమే, సర్వజ్ఞత్వాదిధర్మములుగల ఈశ్వరభావమును పొందుచున్నది.

అవ. జీవత్వమునకు ఉపాధిభూతములైన పంచకోశములను పూర్వమే చెప్పుటచేత, ఆపంచకోశనిమిత్తకమైన జీవత్వము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ కోశోపాధివివక్షాయాం యాతిబ్రహ్మైవజీవతాం।
పితాపితామహశ్చైకః పుత్రపౌత్రౌ యథాప్రతి॥ ౪౧.

టీ. ఏకః - ఒకదేవదత్తుడు, పుత్రపౌత్రౌప్రతి=పుత్రపౌత్రులనుగురించి, పితా- తండ్రియు, పితామహశ్చ - తాతయు. యథా - ఏప్రకారమగుచున్నాడో, (తథా) ఆప్రకారము, కోశోపాధివివక్షాయాం=కోశోపాధి - పంచకోశోపాధియొక్క, వివక్షాయాం - పర్యాలోచన, (క్రియమాణాయాంసత్యాం) చేయబడుచుండగా, బ్రహ్మైవ - సత్యజ్ఞానానంతలక్షణ పరబ్రహ్మమే, జీవతాం-జీవవ్యవహారవిషయత్వమును, యాతి - పొందుచున్నది.

తా. పంచకోశోపాధిని ఆలోచించునప్పుడు, సత్యజ్ఞానానంతస్వరూప లక్షణ పరబ్రహ్మమే, జీవవ్యవహారవిషయత్వమును పొందుచున్నది. ప్ర. అయితే, ఒకబ్రహ్మమే, పరస్పరవిరుద్ధధర్మములుగల జీవేశ్వరరూపద్వయమును ఏకకాలమందెట్లుపొందెనో జెప్పుము?. ఉ. లోకమందు ఒకదేవదత్తుడనెడి మనుష్యుడు, పుత్రునిగురించి తండ్రియగును. మనుమనిగురించి తాతయగును. ఆటువలెనే బ్రహ్మంబును, పంచకోశోపాధిని విచారించునప్పుడు. ఆబ్రహ్మమే ~~ఈశ్వరుడగుచున్నాడని~~ జీవుడగుచున్నాడని తెలియవలెను.

అవ. వాస్తవమందు, జీవత్వమైనను ఈశ్వరత్వమైనను బ్రహ్మమునకులేదని, యిప్పుడు దృష్టాంతపూర్వకముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ పుత్రాదేరవివక్షాయాం నపితా నపితామహః।
తద్వన్నేశో నాపిజీవశ్శక్తికోశావివక్షణే॥ ౪౨.

టీ. పుత్రాదేః - పుత్రాదికముయొక్క, అవివక్షాయాంసత్యాం - విచారణలేక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోవుచుండగా, నపితా- దేవదత్తుని తండ్రి గాడు. పితామహ- తాతయు, న- కాడు. తద్వత్ - ఆప్రకారము, శక్తికోశావివక్షణే సతి = శక్తి-మాయయొక్కయు, కోశ - పంచకోశములయొక్కయు, అవివక్షణే సతి - విచారణలేకపోవుచుండగా, నేశః - బ్రహ్మము ఈశ్వరుడు గాదు. జీవోపి - జీవుడును, న- కాదు.

తా. పుత్రపౌత్రాదివిషయమైన సంకల్పములేనప్పుడు, దేవదత్తుడనెడి మనుష్యుడు తండ్రియుందాతయుంగానట్లు, మాయాశక్తి పంచకోశవిషయక విచారణము లేనప్పుడు, ఆబ్రహ్మమునకు ఈశ్వరత్వజీవత్వములు రెండును లేవు. అనగా మాయాశక్తియు పంచకోశములును లేనప్పుడు బ్రహ్మమునకు ఈశత్వజీవత్వములు రెండును లేవని యభిప్రాయము.

అవ. ఈచెప్పబడిన జ్ఞానమునకు ఇప్పుడు ఫలమును జెప్పుచున్నాడు.

శ్లో॥ యఏవంబ్రహ్మవేదైషబ్రహ్మైవభవతిస్వయం।

బ్రహ్మణో నాస్తిజన్మాతఃపునరేషనజాయతే॥ ౪౩.

టీ. ఏవం - ఈప్రకారము పంచకోశవివేకపూర్వకముగా, బ్రహ్మ - ప్రత్యగభిన్న పరబ్రహ్మమును, యః - ఏపురుషుడు, వేద-ఎరుగుచున్నాడో, అనగా సాక్షాత్కరించుకొనుచున్నాడో యనుట. ఏషః- ఈపురుషుడు, స్వయం- తాను, బ్రహ్మైవ- బ్రహ్మమే, భవతి - అగుచున్నాడు. బ్రహ్మణః - బ్రహ్మమునకు, జన్మ- జననము, నాస్తి - లేదు. అతః - ఆకారణమువలన, ఏషః - ఈవిద్వాంసుడు, పున - మరల, నజాయతే - పుట్టడు.

తా. ఈపూర్వోక్తప్రకారము, పంచకోశవిభజనలక్షణమైన వివేకపూర్వకముగా ప్రత్యగాత్మకంటె అభిన్నమైన పరబ్రహ్మమును, సాధనచతుష్టయసంపత్తిగల ఏపురుషుడు సాక్షాత్కరించుకొనుచున్నాడో, ఆపురుషుడు తానే, సత్యజ్ఞానానంతస్వరూపపరబ్రహ్మమగుచున్నాడు. ఇట్లు॥ శ్రు॥ సయోహవైతత్పరమం బ్రహ్మవేదబ్రహ్మైవ భవతిబ్రహ్మవిదాప్నోతిపరం॥ అని యిత్యాదిశ్రుతులు, బ్రహ్మము నెఱిగినవాడు, తానే, బ్రహ్మమగుచున్నాడనియు, మోక్షమును పొందుచున్నాడనియుం జెప్పుచున్నవి.

ప్ర. అయితే, అట్లు బ్రహ్మమగుటవలన ఫలమేమి?. ఉ. బ్రహ్మమునకు జన్మములేదు. అందువలన, ఈవిద్వాంసుడును, తనస్వరూపమునకు ఆబ్రహ్మత్వము లభించుటచేత, మరలజన్మమును పొందడు. ఇట్లు శ్రు॥ నజాయతేమ్రియతే వావిపశ్చిత్, నచపునరావర్తతే॥ అని ఇత్యాదిశ్రుతులు జెప్పుచున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

* ఇతి శ్రీపంచదశ్యాం తృతీయప్రకరణం. *

గద్య* ఇది, శ్రీపరమేశ్వరగురుచరణ వరప్రసాదలబ్ధబ్రహ్మవిద్యావిరాజిత కాశ్య పసగోత్రపవిత్ర మంత్రివంశపయః పారావారపరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్యపుత్ర లక్ష్మీనారాయణామాత్య ప్రణీతంబైన ఆంధ్రటీకాతాత్పర్యసహిత శ్రీవేదాంతపంచ దశియందు పంచకోశవివేకమనెడి తృతీయప్రకరణము సంపూర్ణమాయెను.

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

---

శ్రీకృష్ణదేవాయనమః.

## ద్వైతవివేక ప్రారంభము.

---

అవ. ఇప్పుడు, శ్రీవిద్యారణ్యగురుండు, ద్వైతవివేకమనెడి గ్రంథమును చేయుటకు ఇచ్ఛయించినవాడగుచు, తాను చేయబూనిన గ్రంథము నిర్విఘ్నముగా పరిపూర్తిపొందుటకొఱకు, ఇష్టదేవతాస్వరూప స్మరణలక్షణమైన మంగళము నాచరించుచు, ఇది వేదాంతప్రకరణమగుటవల, శాస్త్రసంబంధమైన, ౧. అధికారి, ౨. విషయము, ౩. సంబంధము, ౪. ప్రయోజనము, అనెడి అనుబంధచతుష్టమునే సిద్ధమగు నట్లుచేసి, ప్రతిజ్ఞాపూర్వకముగా గ్రంథారంభము జేయుచున్నాడు.

ఓం॥ శ్లో॥ ఈశ్వరేణాపిజీవేనసృష్టంద్వైతంవివిచ్యతే।
వివేకేసతిజీవేనహేయోబంధఃస్ఫుటీభవేత్॥ ౧.

టీ. ఈశ్వరేణ - అంతర్యామిచేతయు, జీవేనాపి - జీవునిచేతయు, సృష్టం - పుట్టింపబడిన, ద్వైతం- జగము, వివిచ్యతే- విభజించి చూపబడుచున్నది. వివేకేసతి- జీవేశ్వరులచేత పుట్టింపబడిన జగత్తులను విభజింపుచుండగా, జీవేన - జీవునిచేత, హేయః - విడువదగిన, బంధః - బంధహేతువగు ద్వైతము, స్ఫుటీభవేత్ - స్పష్టమగును. అనగా స్పష్టత్వమును పొందుననుట.

తా. కారణమగుమాయను ఉపాధిగాగల అంతర్యామి, ఈశ్వరుడగును. కార్యములైన పంచకోశములను ఉపాధిగాగలిగి, నేననియభిమానించెడివాడు జీవుడగును. ఆజీవేశ్వరులచేత సృష్టింపపడిన జగత్తు, ఈ ప్రకరణమందు విభజించి చూపబడును. ప్ర. అయితే, కాకిపంటిని పరీక్షించినట్లు, ఈ ద్వైతవివేకమువల్ల నిష్ప్రయోజనమేగ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దా?. ఉ. జీవేశ్వరులచేత సృష్టింపబడిన రెండువిధములైన ద్వైతములను విభజించి యెఱుగుచుండగా, ఆరెంటిలో జీవునిచేత విడువదగిన బంధహేతువగు ద్వైతము స్పష్టమగును. అనగా, ఇంతపర్యంతముగల ద్వైతము జీవునిచేత విడువదగినదగునని నిశ్చయింపబడునని యభిప్రాయము. గనుక, ఈద్వైతవివేకమువలన ప్రయోజనము లేదని చెప్పరాదు.

అవ. ఇప్పుడు శ్వేతాశ్వతరవాక్యార్థమును పఠించుచున్నాడు.

శ్లో॥ మాయాంతుప్రకృతింవిద్యాన్మాయినంతుమహేశ్వరం।
సమాయీసృజతీత్యాహుః శ్వేతాశ్వతరశాఖినః॥ ౨.

టీ. మాయాంతు - మాయాశక్తిని, ప్రకృతిం- ప్రకృతినిగా, విద్యాత్ - ఎరుగవలెను. మాయినంతు - మాయోపాధికుని, మహేశ్వరం- మహేశ్వరునిగా తెలియవలెను. సః - ఆ, మాయీ - మహేశ్వరుడు, సృజతీతి - సర్వజగత్తును సృష్టించుచున్నాడని, శ్వేతాశ్వతరశాఖినః - శ్వేతాశ్వతరశాఖులు, ఆహుః-చెప్పుదురు.

తా. ప్ర. అయితే, జీవులయొక్క అదృష్టద్వారా జగత్తు పుట్టుచున్నదనియు, అందుచేత జగత్కారణత్వము జీవులకేగలదని, వాదులు వర్ణించుచుండగా ఈశ్వరునిచేత జగంబు సృష్టింపబడెనని యెట్లు చెప్పవచ్చును ? ఉ. ఇట్లు చెప్పుట, బహుశ్రుతులకు విరోధమగును. గనుక, ఈచోద్యము చేయుదగదు. అదియెట్లనగా జెప్పెదవినుము. మాయాశక్తిని ప్రకృతిగా నెరుగవలెననియు, మాయోపాధికుని మహేశ్వరునిగా నెరుగవలెననియు, ఆమాయోపాధికుడైన మహేశ్వరుడు సర్వజగత్తును సృష్టించుచున్నాడనియు, గనుక, సర్వజగత్తును సృష్టించెడువాడు ఈశ్వరుడేనని, శ్వేతాశ్వతరశాఖులు శ్రు॥ మాయాంతుప్రకృతింవిద్యాన్మాయినంతుమహేశ్వరం । అస్యావయవభూతైస్తువ్యాప్తం సర్వమిదంజగత్॥ అని యిట్లు ఈశ్వరునిస్తుతించి, శ్రు॥ అస్మాన్మాయీసృజతేవిశ్వమేతత్॥ ఇత్యాదివాక్యములచేత వర్ణించిరి.

అవ. ఇప్పుడు, ఐతరేయోపనిషద్వాక్యార్థమును పఠించుచున్నాడు.

శ్లో॥ ఆత్మావాఇదమగ్రేభూత్సఈక్షతసృజాఇతి।
సంకల్పేనాసృజల్లోకాన్సఏతానితిబహ్వృచాః॥ ౩.

టీ. ఇదం - ఈజగంబంతయు, అగ్రే- సృష్టికి పూర్వమందు, ఆత్మావా - పరమాత్మమాత్రమే, అభూత్ - ఆయెను. అనగా పరమాత్మమాత్రముగానే యుండెననుట. సః - ఆపరమాత్మ, సృజేతి - సృష్టించుచున్నానని, ఈక్షత - చూచెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనగా సంకల్పించెనట. సః-ఆపరమాత్మ, సంకల్పేన - సంకల్పముచేత, ఏతాన్ - ఈ, లోకాన్ - లోకములను, అసృజదితి - సృష్టించెనని, బహ్వృచాః - ఋక్శాఖాధ్యాయినులు చెప్పుదురు.

తా. సృష్టికిపూర్వమందు ఈజగంబంతయు, పరమాత్మమాత్రముగానే యుండెననియు, ఆపరమాత్మ, సృష్టించెదనని సంకల్పించెననియు, మరియు, ఆపరమాత్మ, సంకల్పముచేత ఈసర్వలోకములను సృష్టించెననియు, ఇట్లు, శ్రు॥ ఆత్మావా ఇదమేక ఏవాగ్రఆసీన్నాన్యత్కించనమిషత్స ఈక్షతలోకాన్నుసృజా ఇతి. సఇమాన్ లోకానసృజత్॥ ఇత్యాదవాక్యములచేత అద్వితీయపరమాత్మవల్లనే, సర్వజగంబుపుట్టెనని ఋక్శాఖులు జెప్పుదురు.

అవ ఈశ్వరుడే జగత్కారణుడనుటయందు తైత్తిరీయశ్రుతియుం బ్రమాణమని, రెండుశ్లోకములచేత, ఆ తైత్తిరీయోపనిషద్వాక్యార్థమును పఠించుచున్నాడు.

శ్లో॥ ఖంవాయ్వగ్నిజలోర్వ్యోషధ్యన్నదేహాఃక్రమాదమీ।
సంభూతాబ్రహ్మణస్తస్మాదేతస్మాదాత్మనోఽఖిలాః॥ ౪.

టీ. తస్మాదేతస్మాదాత్మనః - ఆయీప్రత్యగభిన్నపరమాత్మయగు, బ్రహ్మణః - పరబ్రహ్మమువల్ల, ఖంవాయ్వగ్నిజలోర్వ్యోషధ్యన్నదేహాః = ఖం - ఆకాశంబును, వాయు - వాయువును, అగ్ని - అగ్నియు, జల - జలములును, ఉర్వీ-భూమియు, ఓషధి - ఓషధులును, అన్న - అన్నంబును, దేహాః - శరీరములును, అమీ-ఈ అఖిలాః - అన్నియు, క్రమాత్ - క్రమముగా, సంభూతాః - పుట్టినవి.

తా. ఆయీప్రత్యగభిన్న పరమాత్మయగు బ్రహ్మమువల్ల, ఆకాశవాయువగ్ని జలభూమిఓషధి అన్నదేహాదులన్నియు క్రమముగాబుట్టెనని, తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది.

శ్లో॥ బహుస్యామహమేవాతఃప్రజాయేయేతికామతః।
తపస్తప్త్వాసృజత్సర్వంజగదిత్యాహతిత్తిరిః॥ ౫.

టీ. అహమేవ - నేనే, బహు - బహురూపములుగా, స్యాం - అయ్యెదను. ప్రజాయేయ - కార్యవర్గమయ్యెదను. ఇతి - ఈవిధముగల, కామతః - ఇచ్ఛవలన, తపస్తప్త్వా-తపస్సుచేసి, అనగా ఆలోచించుట. సర్వం-సకలమైన, జగత్ - ప్రపంచమును, అసృజదితి - ఆబ్రహ్మముసృష్టించెనని. తిత్తిరిః-తిత్తిరిముని, ఆహ-చెప్పెను,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మరియు, ఆప్రత్యగభిన్నపరబ్రహ్మమే, నేను బహురూపములుగా నయ్యెదననియు, కార్యవర్గమయ్యెదననియు, ఈవిధమయిన యిచ్ఛచేత ఆలోచించి, ఈసర్వజగత్తును సృష్టించెనని, తిత్తిరిముని చెప్పెను. అనగా, ఆతైత్తిరీయోపనిషత్తునందు, శ్రు॥ సత్యజ్ఞానమనంతంబ్రహ్మ॥ అనెడి వాక్యము మొదలుకొని, శ్రు॥ తస్మాద్వాఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః॥ ఇత్యాదివాక్యముచేతయు, శ్రు॥ అన్నాత్పురుషః॥ అనెడి వాక్యాంతమువరకుగల వాక్యములచేతయు, పంచకోశరూపగుహయందు బ్రహ్మమున్నదని జెప్పి, ప్రత్యగాత్మకంటె అభిన్నమగు ఆబ్రహ్మమువలన ఆకాశాదిదేహాంతమువరకుగల జగంబులుబుట్టెనని దెలుపబడెను. అట్లుతెలిపి, పైభాగమందును, శ్రు॥ సోకామయత బహుస్యాంప్రజాయేయేతి సతపోతప్యత। సతపస్తప్త్వాఇదం సర్వమసృజతయదిదంకించ॥ అనెడివాక్యములచేత, ఆప్రత్యగభిన్నపరబ్రహ్మమే జగదుత్పత్తీచ్ఛాపూర్వకపర్యాలోచనచేత సర్వజగత్తును సృష్టించెనని తెలుపబడెను.

అవ. ఛాందోగ్యశ్రుతియందును బ్రహ్మమువల్లనే జగత్తు సృష్టింపబడినట్లు, వినబడుచున్నదని, యిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ ఇదమగ్రేసదేవాసీద్బహుత్వాయతదైక్షత।
తేజోబన్నాండజాదీనిససర్జేతిచసామగాః॥ ౬.

టీ. ఇదం - ఈజగంబంతయు, అగ్రే - సృష్టికిపూర్వమందు, సదేవాసీత్ - బ్రహ్మమాత్రముగానేయుండెను. తత్ - ఆబ్రహ్మము, బహుత్వాయ - బహురూపముగానుండుటకొరకు, ఐక్షత - వీక్షించెను. అనగా సంకల్పించెననుట. తేజోబన్నాండజాదీని=తేజః-అగ్నిని. అప్ - జలంబును, అన్న - అన్నములను, అండజాదీని-అండజాదిభూతములను, ససర్జ - సృష్టించెను. ఇతిచ - ఇట్లని, సామగాః - సామవేదాధ్యాయినులు వర్ణించుచున్నారు.

తా. ఈప్రపంచమంతయు సృష్టికిబూర్వమందు బ్రహ్మమయముగానుండెననియు, ఆబ్రహ్మము బహురూపములుగా నుండుటకొరకు సంకల్పించెననియు, అట్లు బ్రహ్మము సంకల్పించి, ఆకాశవాయువులను సృష్టించి, పిమ్మట, తేజోజలాద్యన్న అండజాదిభూతములను సృష్టించెనని, సామవేదాధ్యాయినులు చెప్పుదురు. అదియెట్లనగా, శ్రు॥ సదేవసోమ్యేదమగ్రఆసీ దేకమేవాద్వితీయం॥ అనియిట్లు సద్రూపమగు అద్వితీయబ్రహ్మమును జెప్పుటకు ప్రారంభించి, శ్రు॥ తదైక్షతబహుస్యాం ప్రజాయేయేతితత్తేజోసృజత॥ ఇత్యాదివాక్యముచేత ఆబ్రహ్మమునకే, ఈక్షణపూర్వకమయిన తేజోజలాన్నస్రష్టృత్వము చెప్పబడెను, అనగా ఆబ్రహ్మమే సంకల్పించి, సర్వజగత్తు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుసృష్టించెనని యభిప్రాయము. మరియు, ఆభూతములకు, ౧. అండజము=గ్రుడ్డువల్లబుట్టినది, ౨. జరాయుజము=మావివల్లబుట్టిన మనుష్యదేహము, ౩. ఉద్భిజ్జము=భూమిని భేదించుకొని పైకి అంకురించుకొనిన వృక్షాదికము. అనెడి, ఈమూడుశరీరములను, ఆబ్రహ్మము సృష్టించెనని, శ్రు॥ తేషాంఖల్వేషాం భూతానాం త్రీణ్యేవబీజాని భవంత్యండజం జరాయుజముద్భిజ్జం॥ ఇత్యాదివాక్యముచేత సామవేదాధ్యాయినులు జెప్పుదురురని తాత్పర్యము.

అవ. ఇప్పుడు, ముండకోపనిషద్వాక్యార్థమును పఠించుచున్నాడు.

శ్లో॥ విస్ఫులింగాయథావహ్నేర్జాయంతేఽక్షరతస్తథా:
వివిధాశ్చిజ్జడాభావాఇత్యాథర్వణికశ్రుతిః॥ ౭.

టీ. వహ్నేః - ప్రదీప్తమగు అగ్నివలన, విస్ఫులింగాః - విస్ఫులింగములు, యథా - ఏప్రకారముగా, జాయంతే - పుట్టుచున్నవో, తథా - ఆప్రకారము, అక్షరతః - బ్రహ్మమువల్ల, వివిధాః - నానావిధములైన, చిజ్జడాః - చేతనజడరూపములగు, భావాః - పదార్థములు బుట్టుచున్నవి. ఇతి - ఇట్లని, ఆథర్వణికశ్రుతిః - ముండకోపనిషద్వాక్యము జెప్పుచున్నది.

తా. దేదీప్యమానముగా బ్రజ్వలించెడి అగ్నిహోత్రమువలన నిప్పులరవలు బుట్టినట్లు, అక్షరశబ్దముచేత జెప్పదగిన బ్రహ్మమువల్ల చేతనజడరూపములగు నానావిధపదార్థములు బుట్టుచున్నని. ఇట్లు, శ్రు॥ తదేతత్సత్యంయథాసుదీప్తాత్పావకాద్విస్ఫులింగాస్సహస్రశః ప్రభవంతేసరూపాః। తథాక్షరాద్వివిధాస్సోమ్యభావాః ప్రజాయంతేతత్రచైవాపియంతి॥ ఇత్యాది వాక్యముచేత ముండకోపనిషత్తునందు జెప్పబడియున్నది.

అవ. ఇట్లు, బృహదారణ్యకశ్రుతియందును అవ్యాకృతశబ్దముచేజెప్పదగినబ్రహ్మమువల్ల నామరూపవంతమైన జగత్తుబుట్టినట్లు వినపడుచున్నదని చెప్పుచున్నాడు.

శ్లో॥ జగదవ్యాకృతంపూర్వమాసీద్వ్యాక్రియతాధునా।
దృశ్యాభ్యాంనామరూపాభ్యాంవిరాడాదిషుతేస్ఫుటే॥ ౮.

టీ. పూర్వం - సృష్టికిపూర్వము, జగత్ - ప్రపంచము, అవ్యాకృతం- అవ్యాకృతశబ్దముచే జెప్పదగిన బ్రహ్మమాత్రముగా, ఆసీత్ -ఉండెను. అధునా - ఇప్పుడు, అనగా సృష్టికాలమందనుట. దృశ్యాభ్యాం - దృశ్యములగు, నామరూపాభ్యాం - నామరూపములచేత, వ్యాక్రియత - వికారముగాజేయబడెను. తే-ఆనామరూపములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రెండును, విరాడాదిషు - విరాట్టుమొదలగు స్థూలకార్యములయందు, స్ఫుటే - స్పష్ట ముగాదోచుచున్నవి.

తా. శ్రు॥ తద్ధేదంతర్హ్యవ్యాకృతమాసీత్తన్నామరూపాభ్యామేవ వ్యాక్రియ తాసౌనామాయమిదంరూపం॥ అనెడి వాక్యముచేత, సృష్టికిపూర్వమందు, ఈజగంబం తయు మాయోపాధికమగు అవ్యాకృతశబ్దముచే జెప్పదగినబ్రహ్మమయముగా నుండె నని, బృహదారణ్యకశ్రుతియందు జెప్పబడెను. అవ్యాకృతశబ్దవాచ్యమగు బ్రహ్మము ను చెప్పుటచేత, నామరూపాత్మకప్రపంచము సృష్టికిపూర్వమందు స్పష్టముగాలేనట్లు ను, నామరూపములను, స్పష్టీకరించెడి శక్తియొకటియున్నట్లు అర్థమాయెను. పిమ్మట సృష్టికాలమందు ఆశక్తివల్లకలిగింపబడిన నామరూపములు రెండును. విరాట్టుమొద లగు స్థూలకార్యములయందు స్పష్టత్వమును పొందుచున్నవని యభిప్రాయము.

శ్లో॥ విరాణ్మనుర్నరోగావఃఖరాశ్వాజాదయస్తథా।
పిపీలికావధిద్వంద్వమితివాజసనేయినః॥ ౯.

టీ. విరాణ్మనుర్నరోగావః=విరాట్ - విరాట్టును, మను - మనువులును, నరః - మనుష్యులును, గావః - గోవులును, ఖరశ్వాజాదయః=ఖర - గాడిదలును, అశ్వ - గుఱ్ఱములును, అజాదయః - మేకలుమొదలగునవియు, తథా - ఆప్రకారము, పిపీలి కావధిద్వంద్వం=పిపీలికా - చీమయే, అవధి - అవధిగాగల, ద్వంద్వం - జంతుమిథు నరాశియంతయు బ్రహ్మమువల్లబుట్టెను. ఇతి - ఇట్లని. వాజసనేయినః - వాజసనే యినులు జెప్పుదురు.

తా. బ్రహ్మాదిదేవతులును, మనువులును, మనుష్యులును, గోవులును, గుఱ్ఱము లును, గాడిదెలు మేకలు మొదలగుజంతువులును, మరియు, చీమపర్యంతముగల స్త్రీ పురుషరూపజంతుమిథునరాశియంతయు, పరబ్రహ్మమువల్లబుట్టెనని, శ్రు॥ తదిదమప్యే తర్హినామరూపాభ్యామేవవ్యాక్రియతేఽసౌనామాయమిదంరూపం॥ ఆత్మైవేదమగ్రఆసీ త్పురుషవిధః॥ ఇత్యాదివాక్యముమొదలుకొని, శ్రు॥ ఏవమేవయదిదంకించ మిథునమా పిపీలికాభ్యస్తత్సర్వమసృజత॥ అనెడివాక్యాంతమువరకుగల గ్రంథముచేత బృహదార ణ్యకోపనిషత్తునందు, ఈపైనచెప్పబడిన అర్థమేచెప్పబడెను. గనుక, ఈశ్వరునివల్లనే జగత్తుపుట్టెనుగాని, జీవులవల్ల జగత్తుపుట్టలేదని తెలియవలెను.

శ్లో॥ కృత్వారూపాంతరంజైవందేహేప్రావిశదీశ్వరః।
ఇతితాఃశ్రుతయఃప్రాహుర్జీవత్వంప్రాణధారణాత్॥ ౧౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఈశ్వరః - బ్రహ్మము, జీవం - జీవసంబంధియగు, రూపాంతరం - మరియొకవికారిరూపమును, కృత్వా - చేసికొని, దేహే - దేహసమూహమందు, ప్రావిశదితి - ప్రవేశించెనని, తాః - ఆ, శ్రుదయః - ఉపనిషత్తులు, ప్రాహుః - చెప్పుచున్నవి. ప్రాణధారణాత్=ప్రాణ - ప్రాణాదులను, ధారణాత్ - ధరించుటవల్ల అనగా ప్రాణాదులయొక్క స్వామిత్వముచేత ప్రేరకత్వమువల్లననుట జీవత్వం - జీవభావమగును.

తా. మరియు ఆబ్రహ్మమే, జీవస్యంబంధియగు మరియొక వికారరూపమును చేసికొని దేహసమూహమందు ప్రవేశించెనని, పైనచెప్పబడిన ఉపనిషత్తులన్నియుం జెప్పుచున్నవి. ప్ర అయితే, ఆబ్రహ్మమునకు జీవభావమెందువల్లనో జెప్పుము. ? ఉ. ప్రాణాదులకు ప్రభుభావముచేత వర్తించుచు, ఆప్రాణాదులను ప్రేరేపించుటయే, జీవభావమగును. అట్టిజీవరూపమును బ్రహ్మముచేసికొని, దేహసమూహమందు ప్రవేశించియున్నదని తెలియవలెను.

శ్లో॥ చైతన్యంయదధిష్ఠానంలింగదేహశ్చయఃపునః।
చిచ్ఛాయాలింగదేహస్థాతత్సంఘోజీవఉచ్యతే॥ ౧౧.

టీ. అధిష్ఠానం - లింగదేహకల్పనకు ఆధారమగు, యత్ - ఏ, చైతన్యం - కూటస్థచైతన్యముగలదో, యఃపునః - ఏ, లింగదేహశ్చ- కూటస్థచైతన్యమందు కల్పింపబడిన లింగదేహముగలదో, లింగదేహస్థా=లింగదేహ - సూక్ష్మశరీరమందు, స్థా - ఉండెడి, చిచ్ఛాయా=చిత్ - కూటస్థునియొక్క ఛాయా - ప్రతిబింబముగలదో, అనగా చిదాభాసుడనుట. తత్సంఘః=తత్ - ఆమూటియొక్క, సంఘః - సమూహము, జీవః - జీవుడని, ఉచ్యతే - చెప్పబడును.

తా. ప్ర. అయితే, ఆజీవస్వరూపమెట్టిది ?. ఉ. ౧. లింగదేహకల్పనకుఆధారమైన ప్రత్యగాత్మయనెడి చైతన్యంబును, ౨. ఆచైతన్యమందు కల్పించబడిన లింగదేహంబును, ౩. ఆలింగదేహమందు ప్రతిబింబరూపముగానుండెడి చిదాభాసుడును, ఈమూటినిజేర్చి జీవశబ్దముచేత చెప్పబడును. బింబరూపుడగు ప్రత్యగాత్మయొక్క ప్రతిబింబమును. చిదాభాసునిగా దెలియవలెను.

శ్లో॥ మాహేశ్వరీతుమాయాయాతస్యానిర్మాణశక్తివత్।
విద్యతేమోహశక్తిశ్చతంజీవంమోహయత్యసౌ॥ ౧౨.

టీ. మాహేశ్వరీతు - ఈశ్వరసంబంధినియగు, యా - ఏ, మాయా - మాయా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శక్తిగలదో, తస్యాః- ఆమాయకు, నిర్మాణశక్తివత్ - జగన్నిర్మాణశక్తియున్నట్లు, మోహశ్చ శక్తిశ్చ-మోహనసామర్థ్యతయు, విద్యతే- గలిగియున్నది. అసౌ - ఈమోహనశక్తి, తం - ముందుజెప్పబడిన, జీవం - జీవుని, మోహయతి - మోహింపజేయుచున్నది.

తా. ప్ర. అయితే, ఈశ్వరుడే జీవరూపముచేత దేహమందు ప్రవేశించియున్నయెడల, ఆజీవునకు అజ్ఞత్వదుఃఖిత్వాది విరుద్ధధర్మములెట్లుగలుగును ?. ఉ. శ్రు॥ మాయాంతుప్రకృతింవిద్యాన్మాయినంతుమహేశ్వరం॥ అనెడి శ్రుతిప్రకారము, ఈశ్వరసంబంధినియగుమాయకు, సర్వజగత్తును సృష్టించెడి సామర్థ్యమున్నట్లు, ఆమాయకే, మోహింపజేసెడి సామర్థ్యతయుంగలిగియున్నది ఇట్లు, శ్రు॥ తదేతజ్జడంమోహాత్మకం॥ అనెడిశ్రుతి, మాయ, జడరూపమనియు, మోహరూపమనియుం జెప్పుచున్నది. ప్ర. సరి. అందువల్లఏమి ?. ఉ. ఆమోహనశక్తి, ఆజీవునిమోహింపజేసి, చిదానందాదిస్వరూపజ్ఞానములేనివానిని గాజేయుచున్నది.

శ్లో॥ మోహాదనీశతాంప్రాప్యమగ్నోవపుషిశోచతి।
ఈశసృష్టమిదంద్వైతంసర్వముక్తంసమాసతః॥ ౧౩.

టీ. మోహాత్ - పూర్వోక్తమోహనశక్తివల్ల, అనీశతాం - అసామర్థ్యత్వమును, ప్రాప్య - పొంది, వపుషి - దేహమందు, నిమగ్నస్సన్ - తాదాత్మ్యాభిమానమునుపొందినవాడగుచు, శోచతి - దుఃఖించుచున్నాడు. అనగా దుఃఖిత్వాద్యభిమానమును చేయుచున్నాడనుట. ఈశసృష్టం = ఈశ - ఈశ్వరునిచేత, సృష్టం-సృష్టింపబడిన, ఇదం - ఈ, ద్వైతం - జగత్తు, సర్వం - అంతయు, సమాసతః - సంక్షేపముగా, ఉక్తం - చెప్పబడెను.

తా. ప్ర. అయితే, అట్లు మోహింపజేయుటవల్ల నష్టమేమి ?. ఉ. ఆజీవుడు, ఆమోహనశక్తివల్ల, ఇష్టమునుపొందుటయందును, అనిష్టమునువిడుచుటయందును సామర్థ్యతలేనివాడగుచు, శరీరమే తాననితలచుచు దుఃఖిత్వాద్యభిమానమును జేయుచున్నాడు. ఇట్లు, శ్రు॥ సమానేవృక్షేపురుషోనిమగ్నో౽నీశయాశోచతిముహ్యమానః॥ అనెడి శ్రుతిజెప్పుచున్నది. ఈచెప్పబడినదంతయు, ఈశ్వరునిచేత సృష్టింపబడిన ద్వైతమగును. ఈశ్వరసృష్టినంతయు సంక్షేపముగాజెప్పితిమి. అనగా, ఇకముందు జెప్పబోయెడి జీవసృష్టి, ఈయీశ్వరసృష్టితోటి చేరకుండుటకొరకు, ఇక్కడ ఈశ్వరసృష్టి, ముగింపబడెనని తెలియవలెను.

అవ. ఇకనుజీవునిచేత సృష్టింపబడిన ద్వైతమును దెలుపుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ సప్తాన్నబ్రాహ్మణేద్వైతంజీవసృష్టంప్రపంచితం।
అన్నానిసప్తజ్ఞానేనకర్మణాఽజనయత్పితా॥ ౧౪.

టీ. సప్తాన్నబ్రాహ్మణే - సప్తాన్నబ్రాహ్మణమందు, జీవసృష్టం=జీవ - జీవునిచేత, సృష్టం - సృష్టింపబడిన, ద్వైతం - జగము, ప్రపంచితం - చెప్పబడెను. పితా - జీవుడు, జ్ఞానేన- తెలివిచేతయు, కర్మణా - కర్మముచేతయు, సప్త-ఏడైన, అన్నాని - అన్నములను, అజనయత్ - పుట్టించెను, అనగా సృష్టించెననుట.

తా. ప్ర. అయితే, ఆజీవుడు, ద్వైతమును సృష్టించెననుటయందు ప్రమాణ మేమి?. ఉ. ఛాందోగ్యోపనిషత్తుయందుగల సప్తాన్నమనెడి బ్రాహ్మణమందు జీవ సృష్టి, చెప్పబడియున్నది. గనుక, సప్తాన్నబ్రాహ్మణము ప్రమాణమగును. ప్ర. అయితే, ఆసప్తాన్నబ్రాహ్మణమందు, జీవసృష్టి, యెట్లుచెప్పబడెనో చెప్పుము?. ఉ. జీవుడు, జ్ఞానకర్మములచేత సప్తాన్నములను సృష్టించెనని, శ్రు॥ యత్సప్తాన్నాని మేధయాతపసాఽజనయత్పితా॥ ఇట్లు, సప్తాన్నబ్రాహ్మణమందుచెప్పబడియున్నది. ఇటుజీవుడు, తనఅదృష్టద్వారా, జగత్తును సృష్టించుటవల్ల, పైనచెప్పబడిన శ్రుతియం దుగల, పితృశబ్దముచేత ఆజీవుడు సర్వలోకపాలకుడని తెలియవలెను.

శ్లో॥ మర్త్యాన్నమేకం దేవాన్నే ద్వేపశ్వన్నంచతుర్థకం।
అన్యత్త్రితయమాత్మార్థమన్నానాంవినియోజనం॥ ౧౫.

టీ. ఏకం - ఆసప్తాన్నములలోనొకటి, మర్త్యాన్నం=మర్త్య - మనుష్యుల యొక్క, అన్నం - అన్నమగును. ద్వే- రెండు, దేవాన్నే=దేవ- దేవతలయొక్క, అన్నే - అన్నములగును. చతుర్థకం - నాలగవదగుమరియొకటి, పశ్వన్నం=పశు - పశువులయొక్క, అన్నం - అన్నమగును. అన్యత్ - మిగిలిన, త్రితయం - అన్నత్రయము, అనగా మూడన్నములనుట. ఆత్మార్థం - ఆత్మకొరకగును. అన్నానాం - సప్తాన్నములయొక్క, వినియోజనం - ఉపయోగము, (ఉక్తం) ఇట్లుచెప్పబడెను.

తా. ప్ర. అయితే, జీవుడు, ఎందునిమిత్తమై, ఆసప్తాన్నములను సృష్టించెనో జెప్పుము?. ఉ. ఆసప్తాన్నములలో, ఒకటి మనుష్యాన్నమగును. మరిరెండు, దేవాన్నములగును. నాలగవదగు మరియొకటి పశ్వన్నమగును. మిగిలిన మూడన్నములును ఆత్మాన్నములగును. ఈప్రకారముగా ఆసప్తాన్నములయొక్క ఉపయోగము, ఆస ప్తాన్నబ్రాహ్మణమందు, శ్రు॥ ఏకమస్యసాధారణంద్వేదే వానభాజయత్ త్రీణ్యాత్మ నేఽకురుతపశుభ్యఏకంప్రాయచ్ఛత్॥ అనిచెప్పబడియున్నది.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ వ్రీహ్యాదికం దర్శపూర్ణమాసౌ క్షీరం తథా మనః।
వాక్ప్రాణాశ్చేతి సప్తత్వమన్నానామవగమ్యతాం॥ ౧౬.

టీ. వ్రీహ్యాదికం - వడ్లు మొదలగుధాన్యంబును, దర్శపూర్ణమాసౌ - అమావాస్యాపూర్ణిమలును, క్షీరం - పాలును, తథా - అప్రకారము, మనః - మనంబును, వాక్ప్రాణాశ్చ=వాక్ - ఇంద్రియములును, ప్రాణాశ్చ - ప్రాణములును, అన్నానాం - అన్నములయొక్క, సప్తత్వమితి - సప్తసంఖ్యాస్వరూపమని, అవగమ్యతాం - ఎరుగబడుగాక. అనగా నెరుగవలెననుట.

తా. ప్ర. అయితే, ఆసప్తాన్నములెవ్వి?. ఉ. ధాన్యాదికమనుష్యాన్నమగును. అమవాస్యా పూర్ణిమలురెండును దేవాన్నములగును. క్షీరములుపశ్వన్నమగును, ౧. మనంబును, ౨. ఇంద్రియవర్గంబును, ౩. ప్రాణవర్గంబును, ౪ ఈమూడును ఆత్మాన్నములగును. ఈచెప్పబడినయేడును, సప్తాన్నములని తెలియవలెను. ఈచెప్పబడిన ప్రకారమే సప్తాన్నబ్రాహ్మణమందు, శ్రు॥ ఏకమస్య సాధారణ మితీదమేవాస్య తత్సాధారణమన్నం యదిదమద్యతే। అనెడివాక్యము మొదలుకొని, శ్రు॥ అయమాత్మావాఙ్మయో మనోమయః ప్రాణమయః॥ అనెడి వాక్యాంతపర్యంతముగల వాక్యసందర్భముచేత జెప్పబడియున్నది.

శ్లో॥ ఈశేనయద్యప్యేతాని నిర్మితాని స్వరూపతః।
తథాపి జ్ఞానకర్మాభ్యాం జీవోఽకార్షీత్తదన్నతాం॥ ౧౭.

టీ. యద్యపి - విచారించగా, ఏతాని - ఈసప్తాన్నములును, స్వరూపతః - స్వరూపమువల్ల, ఈశేన - ఈశ్వరునిచేత, నిర్మితాని - నిర్మించబడినవగును. తథాపి - అట్లైనను, జీవః - జీవుడు, జ్ఞానకర్మభ్యాం - జ్ఞానకర్మములచేత, తదన్నతాం=తత్ - ఆయేడింటికిని, అన్నతాం - అన్నత్వమును, అనగా తనకుభోగసాధనత్వమునమనుట. అకార్షీత్ - కలుగజేసెను. అనగా కలుగజేసికొనుననుట.

తా. ప్ర. అయితే, ఈసప్తాన్నములును జగత్తులో అంతర్భూతములగుటచేత, ఈసప్తాన్నములను ఈశ్వరనిర్మితములనియే జెప్పుట యుక్తమగుగాని, యీశ్వరనిర్మితములుగావని చెప్పుటయుక్తమెట్లగును?. ఉ. ఆసప్తాన్నములయొక్క స్వరూపము ఈశ్వరనిర్మితమైనను ఆసప్తాన్నములయొక్క భోగ్యత్వాకారము, జీవునిచేతనిర్మింపబడినదగును. ఎట్లనగా జెప్పెదవినుము. ఈసప్తాన్నములయొక్క స్వరూపము ఈశ్వరునిచేత నిర్మింపబడినను, జీవుడు జ్ఞానకర్మములచేత ఆసప్తాన్నములను, తనకు భోగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సాధనముగా జేసికొనెను. జ్ఞానము, విహితమనియు, ప్రతిషిద్ధమనియు, ఇట్లు రెండు విధములగును. దేవతాదిధ్యానము, విహితజ్ఞానమనబడును. పరస్త్రీపరధనాపహరణాది రూపమగు ధ్యానము, ప్రతిషిద్ధజ్ఞానమనబడును. మరియు, కర్మంబును, విహితమనియు, ప్రతిషిద్ధమనియు, ఇట్లు రెండువిధములగును. యజ్ఞాదిరూపమగు కర్మము, విహితకర్మమనబడును. హింసాదిరూపమగుకర్మము, ప్రతిషిద్ధకర్మమనబడును. ఇట్టి జ్ఞానకర్మములచేత జీవుడు, ఆసప్తాన్నములను తనకు భోగసాధనములగునట్లుగా, ఆ సప్తాన్నములకు భోగ్యాకారత్వమును నిర్మించెనని తెలియవలెను.

శ్లో॥ ఈశకార్యంజీవభోగ్యంజగద్ద్వాభ్యాంసమన్వితం।
పితృజన్యాభర్తృభోగ్యాయథాయోషిత్తథేష్యతాం॥ ౧౭.

టీ. జగత్ - సప్తాన్నరూపముగా జెప్పబడిన ధాన్యాదికము, ఈశకార్యం- ఈశ్వరకార్యముగాను, అనగా ఈశ్వరునిచే గలిగినదనుట. జీవభోగ్యం=జీవ- జీవునకు, అనగా జీవునిచేననుట. భోగ్యం - భోగింపదగినవస్తువుగాను, ద్వాభ్యాం - ఇద్దరితోటి, సమన్వితం- సంబంధముగలదియగును. యోషిత్ -ఒకస్త్రీ, పితృజన్యాసతీ= పితృ - తండ్రివల్ల, జన్యాసతీ - పుట్టినదగుచు, భర్తృభోగ్యా=భర్తృ - భర్తకు, భోగ్య - భోగింపదగినవస్తువు, యథా - ఏప్రకారమాయెనో, తథా- ఆప్రకారము, ఇష్యతాం - జగత్తు ఇచ్ఛయింపబడుగాక.

తా. ప్ర. అయితే, ఇట్లుచెప్పుటచేత ఏమిచెప్పబడినట్లాయెను? ఉ. సప్తాన్నరూపముచేత జెప్పబడిన ధాన్యాదిజగత్తు, ఈశ్వరునివల్ల బుట్టినదిగాను, జీవునిచేత భోగింపదగినదిగాను, ఇట్లు రెండువిధములచేత జీవేశ్వరులిద్దరితోటి సంబంధమును గలిగియున్నది. ప్ర. అయితే, ఒకవస్తువు, ఇట్లిద్దరితోటి సంబంధమును గలిగియుండుటయందు దృష్టాంతమేమి?. ఉ. ఒకస్త్రీ, తండ్రివల్ల బుట్టినదగుచు, భర్తకు భోగ్యవస్తువాయెను. అటువలెనే, సప్తాన్నరూపజగంబును, ఈశ్వరునివల్ల బుట్టినదగుచు, జీవునకు భోగింపదగినవస్తువాయెనని తెలియవలెను.

శ్లో॥ మాయావృత్త్యాత్మకోహీశసంకల్పస్సాధనంజనౌ।
మనోవృత్త్యాత్మకోజీవసంకల్పోభోగసాధనం॥ ౧౮.

టీ. మాయావృత్త్యాత్మకః=మాయా- మాయయొక్క, వృత్తి - వ్యాపారమే, ఆత్మకః - స్వరూపముగాగల, ఈశసంకల్పః=ఈశ - ఈశ్వరునియొక్క, సంకల్పః- సంకల్పము, జనౌహి - సృష్టించుటయందే, సాధనం - సాధనముగును. మనోవృత్త్యా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్మకః=మనః - మనస్సుయొక్క, వృత్తి - వ్యాపారమే, ఆత్మకః - స్వరూపముగా గల, జీవసంకల్పః=జీవ - జీవునియొక్క - సంకల్పః - సంకల్పము, భోగసాధనం= భోగ - భోగమందు, సాధనం - సాధనమగును.

తా. ప్ర. అయితే, జగత్తు సృష్టించుటయందు జీవేశ్వరులకు సాధనమేమి?. ఉ. మాయావ్యాపారమే స్వరూపముగాగల ఈశ్వరసంకల్పము. సృష్టించుటయందే సాధనమగును. మనోవ్యాపారమే స్వరూపముగాగల జీవునియొక్క సంకల్పము, భోగమందు సాధనమగునని తెలియవలెను.

శ్లో॥ ఈశనిర్మితమణ్యాదౌ వస్తున్యేకవిధే స్థితే।
భోక్తృధీవృత్తినానాత్వాత్తద్భోగో బహుధేష్యతే॥ ౨౦.

టీ. ఈశనిర్మితమణ్యాదౌ=ఈశ - ఈశ్వరునిచేత, నిర్మిత - నిర్మింపబడిన, మణ్యాదౌ - మణిమొదలగు, వస్తుని - వస్తువునందు, ఏకవిధే - ఒకటేవిధము, అనగానేకస్వరూపమనుట. స్థితేసతి - ఉంచుండగా, భోక్తృధీవృత్తి నానాత్వాత్ = భోక్తృ - అనుభవించెడి జనులయొక్క, ధీవృత్తి-బుద్ధివృత్తులయొక్క, నానాత్వాత్ - నానావిధత్వమువల్ల, తద్భోగః=తత్ - అమణ్యాదివస్తువుయొక్క, భోగః - భోగము, బహుధా - అనేకవిధముగా, ఇష్యతే - ఇచ్ఛయింపబడుచున్నది. అనగా అనుభవింపబడుచున్నదనుట.

తా. ప్ర. అయితే, ఈశ్వరునిచేత సృష్టింపబడినవస్తుస్వరూపముకంటే, అన్యమైన భోగ్యత్వాకారమే లేనప్పుడు, జీవునిచేత సృష్టింపబడినదెద్ది?. ఉ. ఈశ్వరునిచేత నిర్మింపబడిన మణిమొదలగు వస్తువునందు ఏకస్వరూపము గలిగియున్నను, అమణ్యాదివస్తువును అనుభవింపదలచిన పురుషులయొక్క చిత్తవృత్తులు, 'నానావిధముగానుండుటవల్ల, ఆపురుషులచేత అమణ్యాదివస్తువిషయభోగంబును, బహువిధములుగా అనుభవింపబడుచున్నది. కనుక, అట్టిబహువిధభోగమునకు ప్రయోజకమైన ఆకారభేదము, అమణ్యాదిభోగ్యవస్తువునందు గలదని ఊహించవలెను. అమణ్యాదిభోగ్యవస్తువునందుగల ఆకారభేదమే, జీవునిచేత సృష్టింపబడెనని తెలియవలెను. భోగ్యమనగా భోగింపదగిన వస్తువనియర్థము.

శ్లో॥ హృష్యత్యేకో మణింలబ్ధ్వా క్రుధ్యత్యన్యో హ్యలాభతః।
పశ్యత్యేవవిరక్తోఽత్ర నహృష్యతి నకుప్యతి॥ ౨౧.

టీ. ఏకః - మణినికోరెడువారిలోనొకడు, మణిం- ఆమణిని, లబ్ధ్వా- పొంది,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హృష్యతి - సంతోషమునుపొందుచున్నాడు. అన్యః - ఆమణిని కోరెడువారిలో మరియొకడు: అలాభతః-ఆమణిలభింపమివల్ల, క్రుధ్యతి-క్రోధమునుపొందుచున్నాడు. అత్ర- ఈమణివిషయమై, విరక్తః-అపేక్షలేనివాడు, అనగా మణినికోరనివాడనుట. పశ్యత్యేవ - చూచుచుండునేగాని, నహృష్యతి - లాభనిమిత్తక సంతోషమునుపొందడు. నకుప్యతి అలాభనిమిత్తక క్రోధంబునుపొందడు.

తా. ప్ర. అయితే, భోగభేదమున్నయెడల, భోగ్యవస్తువగు ఆమణ్యాదికమందు ఆకారభేదమును కల్పించవలయును. ఆభోగభేదమేలేనప్పుడు అమణ్యాదిభోగ్యవస్తువునందు ఆకారభేదమెట్లుగలుగును?. ఉ. ప్రత్యక్షముగా భోగభేదము కనబడుచుండగా, లేదనిచెప్పరాదు. అదియెట్లనగా జెప్పెదవినుము. మణిలాభమును కోరెడివారిలోనొకడు, ఆమణినిపొందుటచేత సంతోషమును బొందుచున్నాడు. మరియు, ఆమణికోరెడివారిలో మరియొకడు, ఆమణి, తనకు లభింపమిచేత క్రోధమును బొందుచున్నాడు. మరియు, ఈమణివిషయమై విరక్తుడైనవాడు, ఆమణినిచూచుచుండునేగాని, మణిలాభాలాభనిమిత్తములైన సంతోషక్రోధములను పొందుచున్నవాడుగాడు. ఈచెప్పబడిన మణివిషయములగు సంతోషక్రోధఉపేక్షలు మూడును భోగములగును. ఈమూడువిధములైన భోగములకును సమానములైన ఆకారభేదములు మూడును ఆభోగ్యవస్తువగు మణియందున్నవని తెలియవలెను. ఈభోగ్యాకారభేదములు మూడును, జీవునిచేత సృష్టింపబడినవని యభిప్రాయము.

శ్లో॥ ప్రియోఽప్రియఉపేక్ష్యశ్చేత్యాకారామణిగాస్త్రయః।
సృష్టాజీవైరీశసృష్టంరూపంసాధారణంత్రిషు॥ ౨౨.

టీ. ప్రియః - ప్రీతివిషయత్వంబును, అనగా ప్రేమయనుట, అప్రియః- అప్రియవిషయత్వంబును, అనగా ద్వేషమనుట. ఉపేక్ష్యశ్చ - ఉపేక్షావిషయత్వంబును, అనగా ఉపేక్షించుటయనుట. ఇతి - ఇట్లనెడి, మణిగాః=మణి - మణిని, గాః - పొందియుండెడి, ఆకారాః - ఆకారభేదములు, త్రయశ్చ - మూడును, జీవైః-జీవులచేత, సృష్టాః - సృష్టింపబడినవి. ఈశసృష్టం=ఈశ - ఈశ్వరునిచేత, సృష్టం - సృష్టింపబడిన, రూపం - మణిస్వరూపము, త్రిషు - ఆయాకారవిశేషములగు మూటియందును, సాధారణం - సమానముగానున్నది.

తా. ప్ర. అయితే, భోగభేదమువల్లగలిగెడి, ఆభోగ్యవస్త్వాకారభేదములెవ్వి? ఉ. ఆమణియందు పురుషులకుగల, ౧. ప్రియభావంబును, ౨. అప్రియభావంబును, ౩. ఉపేక్ష్యభావమనెడి లక్షణములుగల ఆకారభేదములు మూడును జీవులచేతసృ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ష్టింపబడినవగును. ఆయాకారవిశేషములగు మూటియందును, సమానముగా గూడి యుండెడి, ఏమణిస్వరూపముగలదో, అది, ఈశ్వరనిర్మితమని తెలియవలెను.

అవ. ఈచెప్పబడిన జీవసృష్టియగు భోగ్యవస్త్వాకారభేదమును మరియొక యుదాహరణముచే నిప్పుడు స్పష్టీకరించుచున్నాడు.

శ్లో॥ భార్యాస్నుషాననాందాచయాతామాతేత్యనేకధా।
ప్రతియోగిధియాయోషిద్భిద్యతేనస్వరూపతః॥ ౨౩.

టీ. యోషిత్ - స్త్రీ, ప్రతియోగిధియా - భేదబుద్ధిచేత, భార్యా - భార్యయనియు. స్నుషా- కోడలనియు, ననాందాచ - ఆడుబిడ్డయనియు, యాతా-తోడికోడలనియు, మాతేతి - తల్లియనియు, అనేకధా - అనేకవిధములుగా, భిద్యతే - భేదింపబడుచున్నది. స్వరూపతః - స్వరూపమువల్ల, న - భేదింపబడదు.

తా. లోకమందు, ఒకస్త్రీ, మగడుమామ మొదలగు ఆయాయపేక్షారూపమైన భేదబుద్ధిచేత భార్యయనియు. కోడలనియు, ఆడుబిడ్డయనియు, తోడికోడలనియు, తల్లియనియు, ఇట్లు అనేకవిధములుగా భేదింపబడుచున్నదేగాని, స్వరూపమువల్ల భేదింపబడలేదు.

అవ. ఇప్పుడు, పూర్వవాది, ఆక్షేపించుచున్నాడు.

శ్లో॥ నను జ్ఞానాని భిద్యంతామాకారస్తునభిద్యతే।
యోషిద్వపుష్యతిశయోనదృష్టోజీవనిర్మితః॥ ౨౪.

టీ. నను - ఓయీ, జ్ఞానాని - స్త్రీవిషయములైన జ్ఞానములు, భిద్యతాం - భేదింపబడుగాక. ఆకారస్తు- స్త్రీయొక్కయాకారమో, నభిద్యతే- భేదింపబడలేదు యోషిద్వపుషి = యోషిత్ - ఆస్త్రీయొక్క, వపుషి - దేహమందు, జీవనిర్మితః= జీవ - జీవునిచేత, నిర్మితః - నిర్మింపబడిన, అతిశయః - రూపాతిశయము, నదృష్టః- కనబడలేదు.

తా. ఓఅద్వైతసిద్ధాంతీ, స్త్రీవిషయములైన ఆలు, కోడలు, మొదలగు జ్ఞానములే భిన్నముగాకనబడుచున్నవిగాని, ఆట్టిజ్ఞానములకు విషయభూతమైన స్త్రీయొక్క స్వరూపమందు జీవునిచే నిర్మింపబడిన స్వరూపభేదము కనబడలేదు. అట్లుకనబడనప్పుడు, ఆయాయపేక్షా రూపమగు భేదబుద్ధిచేత, ఆస్త్రీ, భేదింపబడుచున్నదని చెప్పుటయుక్తమెట్లగునని పూర్వవాది ఆక్షేపించెను.

అవ. ఇందుకు సిద్ధాంతి పరిహారమును జెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ మైవంమాంసమయీయోషిత్కాచిదన్యామనోమయీ।
మాంసమయ్యాఅభేదేపిభిద్యతేహిమనోమయీ॥ ౨౫.

టీ. మైవం - ఇట్లు ఆక్షేపింపరాదు. మాంసమయీ - మాంసమయరూపము గల, యోషిత్ - స్త్రీ, అన్యా - ఇతరమగు, కాచిత్ - ఒకానొక, మనోమయీ - మనోమయరూపముగలదియునగును. మాంసమయ్యా - మాంసమయరూపముచేత, అభేదేపి - భేదములేకపోయినను, మనోమయీ - మనోమయరూపము, భిద్యతేహి - భేదింపబడుచున్న దేయగును.

తా. ఓపూర్వవాదీ, నీయాక్షేపము సరియైనదిగాదు. ఆ స్త్రీయొక్క స్వరూపము, ఒకటి మాంసమయదేహమనియు, మరియొకటి మనోమయదేహమనియు, ఇట్లు రెండువిధములుగానున్నది. గనుక, ముందుజెప్పబడిన జ్ఞానభేదముచేత మాంసమయదేహమందు ఆకారభేదముగలుగకున్నను, మనోమయదేహరూపమందు ఆకారభేదము గలుగుచున్నది. మరియు, వస్తువునందు రూపభేదములేకనే, ఆవస్తువిషయమైన జ్ఞానభేదముగలుగదు. అందుచేత, ఆలు, కోడలు మొదలగు స్త్రీవిషయములైన జ్ఞానభేదములచేత ఆస్త్రీయొక్కరూపమందు ఆకారభేదముగలదని యవశ్యమంగీకరింపవలెను.

అవ. ఇప్పుడు, మరల పూర్వవాది, ఆక్షేంచుచున్నాడు.

శ్లో॥ భ్రాంతిస్వప్నమనోరాజ్యస్మృతిష్వస్తుమనోమయం।
జాగ్రన్మానేనమేయస్యనమనోమయతేతిచేత్॥ ౨౬.

టీ. భ్రాంతిస్వప్నమనోరాజ్యస్మృతిషు=భ్రాంతి-భ్రాంతిదశయందు, స్వప్న-స్వప్నావస్థయందును, మనోరాజ్య - సర్వదావిషయధ్యానకాలమందును, స్మృతిషు-స్మరించుటయందును, మనోమయం - మనోమయరూపము, అస్తు - అగుగాక. జాగ్రన్మానేన - ప్రత్యక్షప్రమాణముచేత, మేయస్య - ప్రమేయమునకు, అనగా వస్తువునకనుట, మనోమయతా - మనోమయభావము, న-లేదు. ఇతిచేత్ - ఇట్లంటివేని చెప్పెదవినుము.

తా. ఓసిద్ధాంతీ, ౧. భ్రాంతి, ౨. స్వప్నము, ౩. మనోరాజ్యము, ౪. స్మృతి, ఈనాలుగుసమయములయందును తోచెడివస్తువు, మనోమయమగునేగాని, జాగ్రదవస్థయందు ప్రత్యక్షాదిప్రమాణముచే నెరుగబడెడి, స్త్రీమొదలగు వస్తువునకు మనోమయత్వమును నెట్లుచెప్పవచ్చును. అనగా చెప్పరాదనుట.

అవ. ఇప్పుడు, సిద్ధాంతి, సమాధానము జెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ బాధకమానే నేతు మేయేనయోగాత్స్యాద్విషయాకృతిః।
భాష్యవార్తికకారాభ్యామయమర్థఉదీరితః॥ ౨౮.

టీ. బాధం - ప్రత్యక్షాదిప్రమాణమందు బాహ్యవస్తువుండుట నిశ్చయమేయగును. మానే - ప్రమాణమందు, విషయాకృతిస్తు - వస్త్వాకారమో, మేయేన - ప్రమేయముతోటి, యోగాత్ - సంబంధమువల్ల, స్యాత్ - అగును. అయం - ఈ, అర్థః - అర్థము, భాష్యవార్తికకారాభ్యాం=భాష్యకార - శంకరాచార్యుని చేతయుం, వార్తికకారాభ్యాం - వార్తికకారుని చేతయు, ఉదీరితః - చెప్పబడను.

తా. ఓయిపూర్వవాదీ, ప్రత్యక్షాదిప్రమాణస్థలమందు, బాహ్యవస్తువుండుట నిశ్చయమేయగును. ప్ర. అయితే, ఆదినిశ్చయమైనయెడల, బాహ్యవస్తువైన స్త్రీకి, మనోమయత్వము నెట్లుచెప్పితిరి?. ఉ. చిదాభాసునితోఁగూడిన మనోవృత్తిరూపము ప్రమాణమని చెప్పబడును. ఘటాదివిషయము ప్రమేయమని చెప్పబడును. అట్టిప్రమాణమైన చిదాభాససహితమనోవృత్తిరూపము, ప్రమేయమైన ఘటాదివిషయముతోటి కలియుటవల్ల, ఆప్రమాణమందు విషయాకారము గలుగుచున్నది. గనుక, స్త్రీ మొదలగు బాహ్యవస్తువులకును మనోమయభావమును చెప్పవచ్చును. ప్ర. అయితే, ఈయర్థమును మీరేకల్పించినారాయేమి?. ఉ. ఈయర్థము శ్రీభాష్యవార్తికకారులచేత జెప్పబడియున్నది.

అవ. ఇప్పుడు, ఆభాష్యకారునివాక్యము నుదహరించుచున్నాడు.

శ్లో॥ మూషాసిక్తంయథాతామ్రంతన్నిభంజాయతేతథా।
రూపాదీన్వ్యాప్నువచ్చిత్తంతన్నిభందృశ్యతేధ్రువం॥ ౨౯.

టీ. తామ్రం- కరుగబడినరాగి, మూషాసిక్తంసత్=మూషా - మూసయందు, సిక్తంసత్ - తడుపబడినదగుచు, తన్నిభం=తత్ - ఆమూసయొక్క, నిభం - ఆకారమువంటి ఆకారముగలది, యథా - ఏప్రకారము, జాయతే- అగుచున్నదో, తథా- ఆప్రకారము, రూపాదీన్ - విషయములను, వ్యాప్నువత్ - విషయీకరించెడి, అనగా నెరిగెడియనుట. చిత్తం - చిత్తము, ధ్రువం - అవశ్యముగా, తన్నిభం=తత్ - ఆయాఘటాదివిషయముయొక్క, నిభం - ఆకారమువంటి ఆకారముగలదిగా, దృశ్యతే- కనబడుచున్నది. అనగా పొందబడుచున్నదనుట.

తా. విగ్రహాదులను పోతపోయుటకు అగ్నిచేత కరుగబడినరాగి, మూసయందు తడుపబడినదగుచు, ఆమూసయొక్క ఆకారమువంటి ఆకారముగలది యెట్లగుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్నదో, అటువలెనే ఘటాదివిషయములను ఎరిగెడి చిత్తంబును, ఆయాఘటాది విషయముయొక్క ఆకారమువంటి ఆకారముగలదిగా అవశ్యమగుచున్నదని శ్రీభాష్యకారులు జెప్పిరి.

అవ. ఇప్పుడు, ఈయర్థమందు మరియొకదృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ వ్యంజకో వా యథాలోకో వ్యంగ్యస్యాకారతామియాత్ ।
సర్వార్థవ్యంజకత్వాద్ధీరర్థాకారా ప్రదృశ్యతే॥ ౨౯.

టీ. వ్యంజకః - ప్రకాశకమగు, అనగా ప్రకాశింపజేసెడియనుట. ఆలోకః - ఎండ మొదలగునది, వ్యంగ్యస్య - ప్రకాశింపబడెడి ఘటాదిరూపముయొక్క, ఆకారతాం - ఆకారమువంటి ఆకారత్వమును, ఇయాత్ - పొందును. ధీః - బుద్ధి, సర్వార్థవ్యంజకత్వాత్=సర్వార్థ - సకలపదార్థములయొక్క, వ్యంజకత్వాత్ - ప్రకాశకమగుటవల్ల, అనగా సర్వపదార్థములను ప్రకాశింపజేయునదియగుటవల్లననుట. అర్థాకారాసతీ=అర్థ - విషయములయొక్క, ఆకారాసతీ - ఆకారమువంటి ఆకారముగలదగుచు. ప్రదృశ్యతే - కనబడుచున్నది.

తా. ప్ర. అయితే, రాగిమొదలగులోహము, అగ్నిసంబంధమువల్ల కరుగబడి మూసయందు తడుపబడుచుండగా, కఠినమైనమూసయొక్క తాకిడిచేత చల్లదనముగలుగుటవల్ల, ఆరాగిమొదలగులోహము, ఆమూసయొక్క ఆకారమువంటి ఆకారమును పొందుచున్నను, తామ్రాదికమువంటి ఆకారవస్తువుగానిబుద్ధి, ఘటాదివిషయములయందు వ్యాపించినను, అట్టిబుద్ధికి ఘటాద్యాకారమువంటి యాకారమెట్లుగలుగును? ఉ. అయితే, ఈదృష్టాంతము నీబుద్ధికి సరిపడనియెడల మరియొకదృష్టాంతమును జెప్పెదవినుము. ప్రకాశరూపముగలిగి, ఇతరవస్తువులను ప్రకాశింపజేసెడి ఎండమొదలగునది, ఘటాదివస్తువులను ప్రకాశింపజేయుచు, ఆఘటాదివస్తువుయొక్క ఆకారమువంటి ఆకారముగలదగుచున్నది. ఈప్రకారమే బుద్ధియు, సకలపదార్థములయందు వ్యాపించి ప్రకాశింపజేయుటవల్ల, ఆఘటాదివస్తువుయొక్క ఆకారమువంటి ఆకారముగలదగుచున్నదని తెలియవలెను.

అవ. ఇప్పుడు, వార్తికకారవాక్యమును పఠించుచున్నాడు.

శ్లో॥ మాతుర్మానాభినిష్పత్తిర్నిష్పన్నం మేయమేతితత్ ।
మేయాభిసంగతంతచ్చ మేయాభత్వంప్రపద్యతే॥ ౩౦.

టీ. మాతుః - ప్రమాతవల్ల, మానాభినిష్పత్తిః=మాన - ప్రమాణముయొక్క,


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అభినిష్పత్తిః - ఉత్పత్తి, (భవతి) అగుచున్నది. నిష్పన్నం - అట్లుపుట్టినప్రమాణము, మేయం - ప్రమేయమును, అనగా ఘటాదివిషయరూపమునను. ఏతి - పొందుచున్నది. తచ్చ - ఆప్రమాణము, మేయాభిసంగతంసత్ = మేయ - ప్రమేయముతోటి. అభిసంగతంసత్ - సంబద్ధమగుచు, మేయాభత్వం = మేయ - ఘటాదిరూపముయొక్క, ఆభత్వం - ఆకారమువంటి ఆకారభావమును, ప్రపద్యతే - పొందుచున్నది.

తా. కూటస్థునితోగూడిన బుద్ధియందుగల చిదాభాసరూపము, ప్రమాతయని చెప్పబడును. అట్టిప్రమాతవల్ల ప్రమాణముబుట్టుచున్నది. చిదాభాసునితోగూడిన మనస్సుయొక్క వృత్తిరూపము, ప్రమాణమని చెప్పబడును. అట్లు పుట్టినప్రమాణము, ప్రమేయమైన ఘటాదిరూపమును పొందుచున్నది. మరియు, అట్లుఘటాదిరూపమును పొందినప్రమాణము, ఆఘటాదిరూపముతోటి చేరినదగుచు, ఘటాదిరూపముయొక్క సమానాకారత్వమును పొందుచున్నదని వార్తికకారులు జెప్పిరి.

శ్లో॥ సత్యేవంవిషయౌ ద్వౌస్తోఘటౌ మృణ్మయధీమయౌ।
మృణ్మయోమానమేయఃస్యాత్సాక్షిభాస్యస్తుధీమయః॥ ౩౧.

టీ. ఏవంసతి - ఇట్లగుచుండగా, మృణ్మయధీమయౌ = మృణ్మయ - మృత్తికామయంబును, ధీమయౌ - మనోమయమనెడి, ద్వౌ - రెండైన, విషయౌ - విషయములు, స్తః - వున్నవి. మృణ్మయః - మత్తికామయఘటము, మానమేయః = మాన - ప్రమాణముచేత, మేయః - ప్రకాశింపబడునది, స్యాత్ - అగును. ధీమయః - మనోమయఘటము, సాక్షిభాస్యః = సాక్షి - ప్రత్యగాత్మచేత, భాస్యః - ప్రకాశింపబడునదియగును.

తా. ప్ర. సరి. ఇట్లు చెప్పుటచేత ప్రస్తుతమందు లాభమేమి?. ఉ. ఈపైన చెప్పబడినప్రకారము, ఒకఘటమే, మృత్తికామయమనియు, మనోమయమనియు, ఇట్లు రెండువిధములుగానున్నదియగును. ప్ర. అయితే, మృత్తికామయఘటము మనస్సుచేత గ్రహింపబడినట్లు, మనోమయఘటము, ఆమనస్సుచేత గ్రహింపబడుటకుశక్యముగామివల్ల, ఆమనోమయఘటమును గ్రహించుటకు మరియొకటి లేకపోవుచుండగా, ఆమనోమయఘటమెట్లు సిద్ధించును?. ఉ. మృత్తికామయఘటము మనస్సుచేత ప్రకాశింపబడినట్లు, మనోమయఘటంబును సాక్షిచేత ప్రకాశింపబడుచున్నది. గనుక, మనోమయఘటమును గ్రహించునదిలేదని చెప్పరాదు.

శ్లో॥ అన్వయవ్యతిరేకాభ్యాంధీమయోజీవబంధకృత్।
సత్యస్మిన్సుఖదుఃఖేస్తస్తస్మిన్నసతినద్వయం॥ ౩౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అన్వయవ్యతిరేకాభ్యాం - అన్వయవ్యతిరేకములవల్ల, ధీమయః - మానసప్రపంచము, జీవబంధకృత్ = జీవ - జీవునకు, బంధకృత్ - బంధమునుకలించునది యగును. అస్మిన్ సతి - ఈమానసప్రపంచము తోచుచుండగా, సుఖదుఃఖే - సుఖదుఃఖములురెండును, స్తః - ఉన్నవి. తస్మిన్ - ఆమానసప్రపంచము, అసతి - లేకపోవుచుండగా, ద్వయం - సుఖదుఃములురెండును, న - లేవు.

తా. ప్ర. సరి. ఈపైనచెప్పబడిన ప్రకారము ద్వైతము ద్వివిధమగుగాక. ఆద్వివిధద్వైతమందు దేనినివిడువవలెనో, దేనినివిడువనక్కరలేదో జెప్పుము ?. ఉ. అన్వయవ్యతిరేకములచేత, జీవసృష్టియైన మానసప్రపంచమే, జీవునకుబంధకారియగును. గనుక జీవసృష్టియగు మానసప్రపంచము విడువదగినదగునని తెలియవలెను. ప్ర. అన్వయవ్యతిరేకములనగానేమి ?. ఉ. మానసప్రపంచముండుటయే, (అన్వయము) అగును. ఆమానసప్రపంచములేకపోవుటయే, (వ్యతిరేకము) అగును. జీవునిచేత సృష్టింపబడిన మానసప్రపంచమున్నయెడల, జీవునకుసుఖదుఃఖములుగలుగుచున్నవి. ఆ మానసప్రపంచములేని సుషుప్తిమూర్ఛాద్యవస్థలయందు జీవునకు సుఖదుఃఖములుగలుగలేదు. కనుక, జీవసృష్టియగుమానసప్రపంచమేజీవునకుబంధకారియని తెలియవలెను.

శ్లో॥ అసత్యపిచబాహ్యార్థేస్వప్నాదౌబధ్యతేనరః।
సమాధిసుప్తిమూర్ఛాసుసత్యప్యస్మిన్నబధ్యతే॥ 33.

టీ. నరః - మనుష్యుడు, స్వప్నాదౌ - స్వప్నస్మృత్యాదికాలమందు, బాహ్యార్థే - స్త్రీవ్యాఘ్రాదివస్తువు, అసత్యపి - నిశ్చయముగాలేకపోయినను, బధ్యతే - బంధింపబడుచున్నాడు. అనగా సుఖదుఃఖయుక్తుడగుచున్నాడనుట. సమాధిసుప్తిమూర్ఛాసు = సమాధి - సమాధ్యవస్థయందును, సుప్తి - సుషుప్త్యవస్థయందును, మూర్ఛాసు - మూర్ఛావస్థయందును, అస్మిన్ - ఈబాహ్యవస్తువైన స్త్రీవ్యాఘ్రాదికము, సత్యపి - నిశ్చయముగా సమీపమందున్నను, నబధ్యతే - బంధింపబడడు. అనగా సుఖదుఃఖయుక్తుడుగాడనుట.

తా. ప్ర. అయితే, ఈచెప్పబడిన అన్వయవ్యతిరేకములు, బాహ్యవస్తువిషయముగాగలవికావాయేమి ?. ఉ. లోకమందు మనుష్యుడు స్వప్నస్మృత్యాదికాలమందు, తనకు అనుకూలములైన స్త్రీలుమొదలగు బాహ్యవస్తువులును, ప్రతికూలములైన వ్యాఘ్రాదిబాహ్యవస్తువులును నిశ్చయముగా సమీపమందులేకపోయినను, ఆ స్త్రీవ్యాఘ్రాదులు మనస్సునకు దోచుటవల్ల, సుఖదుఃఖములను పొందుచున్నాడు. మరియు, సమాధిసుషుప్తిమూర్ఛావస్థలయందు అనుకూలప్రతికూలములగు స్త్రీవ్యా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఘ్రాది బాహ్యవస్తువులు నిశ్చయముగా సమీపమందు వర్తించుచున్నను, ఆ స్త్రీవ్యాఘ్రాదులు మనస్సునకు దోపమిచేత, ఆవిషయసంబంధసుఖదుఃఖములను మనుష్యుడు పొందుటలేదు. అందువల్ల, మనస్సంబంధములేని కేవలబాహ్యవిషయకములగు అన్వయ వ్యతిరేకములులేవని యభిప్రాయము.

అవ. మనోమయప్రపంచమే, జీవునకు బంధకారియగుటవల్ల, ఆఅన్వయవ్యతిరేకముల నిప్పుడు, ఉదాహరణముచేత స్పష్టీకరించుచున్నాడు.

శ్లో॥ దూరదేశంగతేపుత్రేజీవత్యేవాత్రతత్పితా।
విప్రలంభకవాక్యేనమృతంమత్వాప్రరోదితి॥ ౩౪.

టీ. దూరదేశం - దూరదేశమును, గతే - పొందియున్న, పుత్రే - పుత్రుడు, జీవత్యేవసతి - జీవించియుంచుండగానే, అత్ర - ఇక్కడ, అనగా గృహమందనుట. తత్పితా=తత్ -వానియొక్క, పితా - తండ్రి, విప్రలంభకవాక్యేన = విప్రలింభక - పరులను వంచించెడివానియొక్క, వాక్యేన - మిధ్యావచనముచేత, మృతంమత్వా - తనపుత్రుని చచ్చినవానిగాదలచి, ప్రరోదితి - రోదనమునుజేయుచున్నాడు. అనగా పెద్దగా నేడ్చుచున్నాడనుట.

తా. మరియు, దూరదేశమునకు వెళ్లినపుత్రుడు, అక్కడజీవించి సుఖముగా నుండగానే, స్వగృహమందుండెడుతండ్రి, నీపుత్రుడుచచ్చెననెడి మిధ్యావాక్యమును పరవంచకునివల్లవిని, తనపుత్రుని చచ్చినవానినిగా భావించి విశేషముగా నేడ్చుచున్నాడు.

శ్లో॥ మృతేపితస్మిన్వార్తాయామశ్రుతాయాంనరోదితి।
అతస్సర్వస్యజీవస్యబంధకృన్మానసంజగత్॥ ౩౫.

టీ. తస్మిన్ - ఆపుత్రుడు, మృతేపి - చచ్చినను, వార్తాయాం- మృతవాక్యము, అశ్రుతాయాంసత్యాం - వినబడకుంచుండగా, నరోదితి - రోదనముచేయడు. అనగా దుఃఖించడనుట. అతః - అందువల్ల, సర్వస్య - సకలమైన, జీవస్య - జీవరాశికి, మానసం - మనస్సంబంధమగు, జగత్ - ప్రపంచము, బంధకృత్ - బంధకారియగును. అనగా బంధమును గలిగించునదియగుననుట.

తా. మరియు, దూరదేశమందుండెడి ఆపుత్రుడు, నిశ్చయముగా చచ్చినను, ఆ మృతవాక్యమునుగృహమందుండెడితండ్రి, విననియెడల, దుఃఖింపడు. కనుక, సర్వజీవులకునుజీవసృష్టియైన మానసప్రపంచరూపద్వైతమే, బంధకారియగునని తెలియుపలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ విజ్ఞానవాదో బాహ్యార్థవైయర్థ్యాత్స్యాదిహేతి చేత్।
నహృద్యాకారమాధాతుం బాహ్యస్యాపేక్షితత్వతః॥ ౩౮.

టీ. బాహ్యార్థే - బాహ్యవస్తువు, వైయర్థ్యాత్ - వ్యర్థమగుటవల్ల, ఇహ - ఇక్కడ, విజ్ఞానవాదః - విజ్ఞానవాదము, స్యాదితిచేత్ - అగుననియంటివేని, హృది - బుద్ధియందుగల, ఆకారం - విషయాకారమును, ఆధాతుం - ఆబుద్ధికి సమర్పించుటకొరకు, బాహ్యస్య - బాహ్యవస్తువు, అపేక్షితత్వతః - అపేక్షింపబడుటవల్ల, న - విజ్ఞానవాదము గాదు.

తా. ప్ర. అయితే, మానసప్రపంచమైన జీవసృష్టియే, జీవునకుబంధహేతువని యంగీకరించినయెడల, బాహ్యప్రపంచము వ్యర్థమగుటచేత, ఇది విజ్ఞానవాదము కాదా యేమి?. ఉ. మానసప్రపంచమే బంధకారణమైనను, ఆమానసప్రపంచమునకు హేతుభూతముగా బాహ్యపదార్థము గ్రహింపబడుటచేత ఇది విజ్ఞానవాదము కానేరదు. అనగా మనస్సునందుగల విషయాకారమును ఆమనస్సునకు సమర్పించుటకొరకు బాహ్యవస్తువు అపేక్షింపబడుటచేత, మామతము విజ్ఞానవాదము కాదనియభిప్రాయము.

శ్లో॥ వైయర్థ్యమస్తు వా బాహ్యం న వారయితుమీశ్మహే।
ప్రయోజనమపేక్షంతే న మానానీతిహిస్థితిః॥ ౩౯.

టీ. వైయర్థ్యం - వ్యర్థత్వము, అస్తు - అగుగాక, బాహ్యం - బాహ్యపదార్థమును, వారయితుం - నివారించుటకు, నేశత్మహే - సమర్థులము గాము. మానాని - ప్రత్యక్షాదిప్రమాణములు, ప్రయోజనం - ప్రయోజనమును, నాపేక్షంతే - అపేక్షింపవు. ఇతి - ఇట్లు, స్థితిర్హి - శాస్త్రనిర్ణయమగును.

తా. ప్ర. ఓ అద్వైతసిద్ధాంతీ, ఉత్తరోత్తరమానస ప్రపంచసమర్పణముకొరకు పూర్వపూర్వమానస ప్రపంచసంస్కారమే హేతువగును. గనుక, మనస్సునందుగల విషయాకారమును ఆమనస్సునకు సమర్పించుటకొరకు హేతుభూతముగా బాహ్యపదార్థమును అపేక్షింపవలసిన పనియేమి? ఉ. ఓపూర్వవాదీ, నీయిష్టప్రకారము బాహ్యపదార్థము వ్యర్థమేయగుగాక. అనగా, సిద్ధాంతి, ప్రౌఢవాదముచేత, పూర్వవాది, వాదించెడి బాహ్యపదార్థవ్యర్థత్వము నంగీకరించెనని తెలియవలెను. ప్ర. అయితే, ఓ అద్వైతసిద్ధాంతీ, బాహ్యపదార్థము వ్యర్థమైనయెడల, మీకును, విజ్ఞానవాదులకును భేదమేమి?. ఉ. విజ్ఞానవాదులు బాహ్యపదార్థమే లేదని చెప్పుదురు. మేము, వ్యవహారకాలమందు బాహ్యపదార్థముకలదని యంగీకరించెదమే గాని, లేదని చెప్పము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇదియే విజ్ఞానవాదమునకును మాకును భేదమగును ప్ర. అయితే, మీరుబాహ్యవస్తువు గలదని యంగీకరించినను, ఆబాహ్యవస్తువువల్ల మీకుప్రయోజనములేమిచేత, ఆయంగీకారము యుక్తమెట్లగును ?. ఉ. ప్రత్యక్షాది ప్రమాణములు వస్తుసిద్ధిని అపేక్షించుచున్న వేగాని ప్రయోజనము నపేక్షింపవు. కనుక, వస్తుసిద్ధి, ప్రమాణములకు అధీనమై యున్నదేగాని, ప్రయోజనములకు అధీనముగా నుండలేదు. మరియు, ప్రయోజనము లేకపోయినను వస్తువునవశ్యమంగీకరించుట, శాస్త్రమర్యాదయగును. మరియు, ప్రమాణసిద్ధమైన ప్రపంచవస్తువును ప్రయోజనములేనిమాత్రము చేతనే, లౌకికులును ఇతరవాదులును అంగీకరించక అన్యాయముగావిడిపించిరనియు, మేమట్లువిడిపించమనియుం దాత్పర్యము.

అవ. ఇప్పుడు పూర్వవాది, ఒకయాక్షేపమును జేయుచున్నాడు.

శ్లో॥ బంధశ్చేన్మానసంద్వైతంతన్నిరోధేనశామ్యతి।
అభ్యసేద్యోగమేవాతోబ్రహ్మజ్ఞానేనకింవద॥ ౩౮.

టీ. మానసం - మనస్సంబంధమైన. ద్వైతం - ప్రపంచము, బంధశ్చేత్ - బంధకారియైనయెడల, తత్ - ఆమానసప్రపంచము, నిరోధేన - మనోనిగ్రహరూపయోగముచేత, శామ్యతి - ఉపశమించుచున్నది. అనగా నశించుననుట. అతః - అందువల్ల, యోగమేవ - మనోనిగ్రహరూపయోగమునే, అభ్యసేత్ - అభ్యసింపవలెను. బ్రహ్మజ్ఞానేన - బ్రహ్మజ్ఞానముచేత, కింవద-ప్రయోజనమేమో చెప్పుము అనగా ప్రయోజనములేదనుట.

తా. ప్ర. ఓఅద్వైతసిద్ధాంతీ, జీవసృష్టియైన మానసప్రపంచరూపమగు, ద్వైతమే జీవునకు బంధహేతువైనయెడల మనోనిగ్రహరూపయోగముచేత ఆ మానసప్రపంచము నశించును. కనుక, మనోనిగ్రహరూపయోగమునే అభ్యసింపవలయునుగాని బ్రహ్మజ్ఞానముచేత ప్రయోజనములేదు. మరియు, బ్రహ్మజ్ఞానముచేత బంధము నివర్తించునని చెప్పుట, విరోధముకాదాయేమి ?.

అవ. ఇట్లు పూర్వవాది, అడుగగా, ఇందుకు సిద్ధాంతి పరిహారమును జెప్పుచున్నాడు.

శ్లో॥ తాత్కాలికద్వైతశాంతావప్యాగామిజనీక్షయః।
బ్రహ్మజ్ఞానంవినానస్యాదతి వేదాంతడిండిమః॥ ౩౯.

టీ. తాత్కాలికద్వైతశాంతావపి=తాత్కాలిక - ప్రస్తుతమందు, ద్వైత -

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మానసప్రపంచమునకు, శాంతావపి - శాంతిగలిగినను, ఆగామిజనిక్షయః=ఆగామి - భవిష్యత్కాలమందు, జని - కలిగెడు మానసప్రపంచముయొక్క, క్షయః- నాశము, బ్రహ్మజ్ఞానంవినా - బ్రహ్మజ్ఞానములేక, నస్యాదితి-కాదని, వేదాంతడిండిమః = వేదాంత - ఉపనిషత్తులయొక్క, డిండిమః - భేరీవాద్యమగును. అనగా వేదాంతసిద్ధాంతమగుననుట.

తా. ఉ. ఓపూర్వవాదీ, యోగముచేత మానసద్వైతశాంతి, ౧. ప్రస్తుతమందుగలుగునో, లేక, ౨. ఇకమీదటసర్వదాగలుగునో, జెప్పుము. ప్రస్తుతమందని చెప్పుట, మాకుసమ్మతమేయగును. ఇకమీద సర్వదా, యోగమువల్ల మానసద్వైతశాంతి కలుగునని చెప్పరాదు. ప్ర. అదియేమి?. ఉ. యోగమునుధరించి మనస్సునునిగ్రహించినప్పుడే, మానసద్వైతము ఉపశాంతినిపొందియుండి, పిమ్మట, యోగమునుమానినప్పుడు, మరల మానసప్రపంచరూపద్వైతము అంకురించుచు వృద్ధియగును. మరియు, బ్రహ్మజ్ఞానముచేతనే సర్వబంధములచేత నిశ్శేషముగా జీవుడు విడువబడుచున్నాడనియు, మోక్షమును పొందుచున్నాడనియు, మరియు, జనులు, ఏకాలమందు అభ్యాసముచేత ఆకాశమును దేహముగాధరించినట్లుండెదరో, ఆకాలమందు సంసారమును ఎరుగక సకలదుఃఖమును విడిపించెదరని, శ్రు॥ జ్ఞాత్వాదేవంముచ్యతేసర్వపాశైః జ్ఞాత్వాశివంశాంతిమత్యంతమేతి। యదాచర్మవదాకాశంవేష్టయిష్యంతిమానవాః। తదాదేవమవిజ్ఞాత్వా దుఃఖస్యాంతోభవిష్యతి॥ ఇట్లు, శ్రుతులు భేరీవాద్యముమ్రోగినట్లు మ్రోగుచున్నవి. కనుక, బ్రహ్మజ్ఞానమువల్లనే బంధనివృత్తియగుగాని, మనోనిగ్రహరూపయోగమువల్ల బంధము నివర్తింపదని యభిప్రాయము.

శ్లో॥ అనివృత్తేపీశసృష్టేద్వైతేతస్యమృషాత్మతాం।
బుద్ధ్వాబ్రహ్మాద్వయంబోద్ధుంశక్యంవస్త్వైక్యవాదనః॥ ౪౦.

టీ. ఈశసృష్టే=ఈశ - ఈశ్వరునియొక్క, సృష్టే-సృష్టియగు, ద్వైతే - ద్వైతము, అనివృత్తేపి - నశింపకున్నను, తస్య - ఆయీశ్వరద్వైతమునకు, మృషాత్మతాం - మిథ్యాభావమును, బుధ్వా - తెలిసికొని, అద్వయం - అద్వితీయమగు, బ్రహ్మ - బ్రహ్మవస్తువును, బోద్ధుం - బోధించుటకొరకు, వస్త్వైక్యవాదినః - అద్వైతవాదికి, శక్యం - సాధ్యమగును.

తా. ప్ర. అయితే, ఈశ్వరసృష్టియైన బాహ్యప్రపంచము నశింపబడకనే, అద్వితీయబ్రహ్మజ్ఞానము ఉదయించదుగదా?. ఉ. ఆఈశ్వరసృష్టియైన బాహ్యప్రపం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చరూపమగు ద్వైతము, నివారింపబడకున్నను, ఆయీశ్వరద్వైతమునకు మిథ్యాభావమును నిశ్చయించి, అద్వితీయబ్రహ్మవస్తువును బోధించుటకు, అద్వైతవాదికి శక్యమగును. కనుక, ఈశ్వరద్వైతమైన బాహ్యప్రపంచము నివారింపబడకున్నను బ్రహ్మజ్ఞానోదయము కాగలదు.

శ్లో॥ ప్రళయేతన్నివృత్తౌతుగురుశాస్త్రాద్యభావతః।
విరోధిద్వైతాభావేపినశక్యంబోద్ధుమద్వయం॥ ౪౧.

టీ. ప్రళయే - ప్రళయావస్థయందు, తన్నివృత్తౌసత్యాంతు=తత్ - ఆఈశ్వరద్వైతముయొక్క, నివృత్తౌసత్యాంతు - నివారణమగుచుండగానో, గురుశాస్త్రాద్యభావతః=గురుశాస్త్రాది-గురుశాస్త్రాదికముయొక్క, అభావతః - లేమివల్ల, విరోధిద్వైతాభావేపి=విరోధి - నీకువిరోధియగు, ద్వైత - ఈశ్వరద్వైతముయొక్క, అభావేపి - అభావమైనను, అద్వయం - అద్వితీయబ్రహ్మవస్తువును, బోద్ధుం- బోధించుటకు, నశక్యం - సాధ్యముగాదు.

తా. ప్ర. అయితే, ఆయీశ్వరద్వైతము నివారింపబడుటయే, అద్వైతబ్రహ్మవిజ్ఞానమునకు ప్రయోజనమగుగాని, ఆయీశ్వరద్వైతమిథ్యాత్వజ్ఞానము అద్వైతబ్రహ్మవిజ్ఞానమునకు ప్రయోజనమెట్లగును?. ఉ. ప్రళయావస్థయందు నీకువిరోధియగు ఈశ్వరద్వైతమైన బాహ్యప్రపంచము నీయిష్టప్రకారము లేకపోయినను, గురుశాస్త్రాదిరూపమగు జ్ఞానసాధనము అప్పుడు లేమిచేత అద్వితీయబ్రహ్మవస్తువును బోధించుటకు అప్పుడు శక్యముగాదు. గనుక, ఆయీశ్వరద్వైతము నివారింపబడుటవల్ల ప్రయోజనములేదని తెలియవలెను.

శ్లో॥ అబాధకంసాధకంచద్వైతమీశ్వరనిర్మితం।
అపనేతుమశక్యంచేత్యాస్తాంతద్ద్విష్యతేకుతః॥ ౪౨.

టీ. ఈశ్వరనిర్మితం = ఈశ్వర - ఈశ్వరునిచే, నిర్మితం - సృష్టింపబడిన, ద్వైతం - ఆకాశాదిప్రపంచము, అబాధకం - జ్ఞానబాధకముగాదు. సాధకంచ - జ్ఞానసాధకంబగును. అపనేతుం - ఆకాశాదిద్వైతమును నివారింపజేయుటకు, అశక్యంచ - మాచేతశక్యగాదు. ఇతి - ఈకారణమువల్ల, తత్ - ఆఈశ్వరద్వైతము, ఆస్తాం - ఉండుగాక. కుతః- ఏకారణమువల్ల, ద్విష్యతే- ద్వేషింపబడును. అనగా ఈశ్వరద్వైతమందు ద్వేషముగూడదనుట.

తా. ప్ర. అయితే, అట్లైనయెడల, ద్వైతముండగా, అద్వితీయబ్రహ్మవిజ్ఞాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మెట్లుగలుగును?. ఉ. ఈశ్వరసృష్టియైన బాహ్యప్రపంచము మిథ్యయనెడి జ్ఞానము చేతనే అద్వైతజ్ఞానముకలుగునని చెప్పబడుటచేత, ఆఈశ్వరసృష్టియైన ఆకాశాది ప్రపంచము అద్వైతబ్రహ్మవిజ్ఞానమునకు బాధకముగాదు. మరియు, ఆయీశ్వరద్వైతము గురుశాస్త్రాదిరూపముగా అద్వైతబ్రహ్మవిజ్ఞానమునకు సాధకముగానున్నది. అదియునుంగాక, ఆయాకాశాదిద్వైతమును, మేమునివారింపజేయజాలము. ఈహేతువువల్ల, ఆయాకాశాదిద్వైతమందు గాక. ఏకారణమువల్ల, ఆయీశ్వరద్వైతమందు నీకుద్వేషముగలిగెనో తెలియలేదు. అనగా, ఆయీశ్వరద్వైతమందు ద్వేషముగలుగుటకు కారణములేదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, జీవసృష్టియైన మానసద్వైతమునువిభజించిచెప్పుచున్నాడు.

శ్లో॥ జీవద్వైతంతుశాస్త్రీయమశాస్త్రీయమితిద్విధా।
ఉపాదదీతశాస్త్రీయమాతత్త్వస్యావభోదనాత్॥ ౪౩.

టీ. జీవద్వైతం - జీవసృష్టియైన మానసప్రపంచము, శాస్త్రీయం - శాస్త్రీయమనియు, అశాస్త్రీయంతు - నిషిద్ధమనియు, ఇతి-ఇట్లు, ద్విధా - ద్వివిధమగును. ఆతత్త్వస్యావబోధనాత్ - బ్రహ్మస్వరూపము నెరిగెడి పర్యంతము, అనగా బ్రహ్మస్వరూపమును తెలియజేసెడి పర్యంతమనుట. శాస్త్రీయం - శాస్త్రసమ్మతద్వైతమును, ఉపాదదీత - గ్రహించవలయును.

తా. జీవసృష్టియైన మానసద్వైతము, ౧. శాస్త్రీయమనియు, ౨. అశాస్త్రీయమనియు, ఇట్లు రెండువిధములుగానున్నది. ప్ర. అయితే, ఆరెండువిధములుగానున్న మానసప్రపంచమును (సర్వదా) విడువవలయునాయేమి? ఉ. బ్రహ్మస్వరూపమును తెలిసికొనెడి పర్యంతము, శాస్త్రీయమానసద్వైతమును గ్రహించవలయును.

శ్లో॥ ఆత్మబ్రహ్మవిచారాఖ్యంశాస్త్రీయంమానసంజగత్।
బుద్ధేతత్త్వేతచ్చహేయమితిశ్రుత్యనుశాసనం॥ ౪౪.

టీ. ఆత్మబ్రహ్మవిచారాఖ్యం=ఆత్మబ్రహ్మ - ప్రత్యగాత్మరూపపరబ్రహ్మముయొక్క, విచారాఖ్యం-విచారమనునది, అనగా శ్రవణాదికమనుట. శాస్త్రీయం-శాస్త్రసమ్మతమైన, మానసంజగత్ - మానసప్రపంచమగును. తత్త్వే - పరతత్త్వము, అనగా జీవబ్రహ్మైక్యలక్షణమనుట. బుద్ధేసతి- సాక్షాత్కరింపబడుచుండగా, తచ్చ- ఆశాస్త్రీయద్వైతంబును, హేయమితి - విడువదగినదగునని, శ్రుత్యనుశాసనం = శ్రుతి - శ్రుతియొక్క, అనుశాసనం - ఆజ్ఞయగును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే, ఆశాస్త్రీయమానసద్వైతమెద్ది?. ఉ. ప్రత్యగాత్మరూప పరబ్రహ్మముయొక్క, విచారణయనెడి. వేదాంతశ్రవణమననదిధ్యాసనమెద్దిగలదో, అదియే శాస్త్రీయమానసప్రపంచమగును. ప్ర. అయితే, శ్లో॥ ఆసుప్తేరామృతేః కాలం నయేద్వేదాంతచింతయా॥ అనెడి వాక్యమందు నిద్రామరణములుగలిగెడి పర్యంతము గల కాలమును వేదాంతచింతనముచేత గడుపవలెనని చెప్పబడియుండగా, బ్రహ్మజ్ఞానముగలిగెడి పర్యంతమే, శాస్త్రీయమానస ప్రపంచమును గ్రహింపవలెనని చెప్పుట యుక్తమెట్లగును?. ఉ. జీవబ్రహ్మైక్యలక్షణపరతత్వము సాక్షాత్కరింపబడుచుండగా, శాస్త్రీయమానసప్రపంచమును విడువవలెనని, శ్రుతి, ఆజ్ఞాపించుచున్నది. కనుక బ్రహ్మజ్ఞానోదయమయిన పిమ్మట, వేదాంతశ్రవణాదిరూపమగు మానసప్రపంచమును విడువవలెను. ప్ర. అయితే, శ్లో॥ ఆసుప్తేరామృతేః కాలంనయేద్వేదాంతచింతయా॥ అనెడి వాక్యమునకు గతియేమి?. ఉ. ఆవాక్యముయొక్క పూర్వార్థమందు, కామక్రోధాదులు బుట్టుటకు కొంచెమైనను అవసరమునివ్వరాదని, శ్లో॥ దద్యాన్నావసరంకించిత్కామాదీనాం మనాగిలి॥ అనిచెప్పబడియున్నది. గనుక, కామాదులను నిషేధించుటయందు ఈవాక్యము వర్తించుచున్నదని చెప్పెదము. అందుచేత, బ్రహ్మవిజ్ఞానోదయము పర్యంతము శాస్త్రీయమానస ప్రపంచమునుగ్రహించి, పిమ్మట విడుచుటవల్ల, విరోధమేమియులేదని తెలియవలెను.

అవ. బ్రహ్మజ్ఞానోదయమైనపిమ్మట, శాస్త్రీయమానసప్రపంచమును విడువవలెననిజెప్పెడి కొన్నిశ్రుతులను పఠించుచున్నాడు.

శ్లో॥ శాస్త్రాణ్యధీత్య మేధావీ అభ్యస్యచపునఃపునః।
పరమంబ్రహ్మవిజ్ఞాయ ఉల్కావత్తాన్యథోత్సృజేత్॥ ౪౫.

టీ. మేధావీ - బుద్ధిమంతుడు, శాస్త్రాణి - వేదాంతశాస్త్రములను, అధీత్య- చదివి, పునఃపునః - మరలమరల, అభ్యస్యచ - అభ్యసించి, పరమంబ్రహ్మ - పరబ్రహ్మమును, విజ్ఞాయ - తెలిసికొని, అనగా సాక్షాత్కరించుకొనియనుట. అథ - అటుపిమ్మట, తాని - ఆశాస్త్రములను, ఉల్కావత్ - కొఱవికట్టెనువలె, ఉత్సృజేత్ - విడువవలెను.

తా. పండితుడగువాడు, వేదాంతశాస్త్రములను చక్కగాజదివి, ఆశాస్త్రార్థమును మాటిమాటికి నభ్యసించి- ప్రత్యగాత్మరూపపరబ్రహ్మమును సాక్షాత్కరించుకొని, అన్నము ఉడికినపిమ్మట, కొఱవికట్టెలను విడిపించినట్లు, పిమ్మట, ఆశాస్త్రములన్నిటిని విడువవలెనని, ఈశ్రుతి, జెప్పుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ గ్రంథమభ్యస్య మేధావీజ్ఞానవిజ్ఞానతత్పరః।
పలాలమివధాన్యార్థీత్యజేద్గ్రంథమశేషతః॥ ౪౬.

టీ. ధాన్యార్థీ - ధాన్యమునుగోరెడివాడు, పలాలమివ - గడ్డినివిడిపించినట్లు, జ్ఞానవిజ్ఞానతత్పరః=జ్ఞాన - శాస్త్రీజ్ఞానమందును, విజ్ఞాన - అనుభవజ్ఞానమందును, తత్పరః - ఆసక్తిగల, మేధావీ - పండితుడు, గ్రంథం - వేదాంతగ్రంథమును. అభ్యస్య - అభ్యసించి (అథ) బ్రహ్మసాక్షాత్కారానంతరమందు, గ్రంథం - వేదాంతగ్రంథమును, అశేషతః - నిశ్శేషముగా, త్యజేత్ - విడువవలెను.

తా. మరియు, ధాన్యమునుగోరెడివాడు, ధాన్యములేనిపరిగడ్డిని నిశ్శేషముగా విడిపించినట్లు, బుద్ధిమంతుడగువాడు, పరోక్షఅపరోక్షబ్రహ్మవిజ్ఞానమందు ఆసక్తిగలవాడై, వేదాంతగ్రంథమునుజదివి, బ్రహ్మసాక్షాత్కారానంతరమందు, ఆవేదాంతగ్రంథమును నిశ్శేషముగా విడువవలెనని, ఈశ్రుతి, చెప్పుచున్నది.

శ్లో॥ తమేవధీరోవిజ్ఞాయప్రజ్ఞాంకుర్వీతబ్రాహ్మణః।
నానుధ్యాయేద్బహూఞ్ఛబ్దాన్ వాచోవిగ్లాపనంహితత్॥ ౪౭.

టీ. ధీరః - బ్రహ్మచర్యాదిసాధనసంపన్నుడగు, బ్రాహ్మణః - బ్రహ్మమగుటకిచ్ఛయించెడి ముముక్షువు, తమేవ - ఆప్రత్యగాత్మరూప పరమాత్మనే, విజ్ఞాయ - నిస్సంశయముగానెరిగి, ప్రజ్ఞాం - బ్రహ్మాత్మైకత్వజ్ఞానసంతతిరూపచిత్తైకాగ్ర్యతను, కుర్వీత - సంపాదింపవలెను. బహూన్ - అనాత్మగోచరములగు, శబ్దాన్ - బహుశబ్దములను, నానుధ్యాయేత్ - స్మరింపరాదు. తత్ - ఆస్మరణము, వాచః - వాగింద్రియమునకును మనస్సునకును, విగ్లాపనంహి - శ్రమహేతువేయగును.

తా. మరియు, బ్రహ్మచర్యాదిసాధనసంపత్తిగలిగి, బ్రహ్మమగుటకు ఇచ్ఛయించెడి ముముక్షువు, ప్రత్యగాత్మరూపపరబ్రహ్మమునే, సంశయవిపర్యయరహితముగానెరిగి, బ్రహ్మాత్మైకత్వజ్ఞానసంతానరూపచిత్తైకాగ్ర్యత్వమును, సంపాదించవలెను. అనాత్మవిషయములైన బహుశబ్దములను స్మరించినను ఉచ్చరించినను, మనోవాగింద్రియములకు శ్రమహేతువగును. అనగా బ్రహ్మము సాక్షాత్కరించినపిమ్మట, సర్వవ్యవహారములను విడిపింపవలెనని, ఈశ్రుతిచెప్పుచున్నదని యభిప్రాయము.

శ్లో॥ తమేవైకంవిజానీథహ్యన్యావాచోవిముంచథ।
యచ్ఛేద్వాఙ్మనసీప్రాజ్ఞఇత్యాద్యాశ్శ్రుతయఃస్ఫుటాః॥ ౪౮

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఏకం- అద్వితీయుడైన, తమేవ - ఆ ప్రత్యగభిన్న పరమాత్మనే, విజానీథ- ఎరుగుడు. అన్యాః - అనాత్మగోచరములగు, వాచః - వాక్యములను, విముంచథ - విడువుడు. ప్రాజ్ఞః- పండితుడు, వాక్ - ఇంద్రియములను, మనసీ - మనస్సునందు, యచ్ఛేత్ - నియమించవలెను, అనగా నుంచవలెననుట. ఇత్యాద్యాః - ఇవి మొదలగు, శ్రుతయః - శ్రుతులు, స్ఫుటాః - శాస్త్రీయమానస ప్రపంచమును విడువవలెనని స్ఫుటముగా జెప్పుచున్నవి.

తా. మరియు, ఆయద్వితీయమగు ప్రత్యగభిన్న పరబ్రహ్మమునే, ఎరుగుడు. అనాత్మవిషయములైన ఇతరవాక్యములను విడువుడు. సర్వేంద్రియములను విషయగ్రహణమునకుబోనివ్వక, మనస్సునందునిలుపవలెననియు, ఆయింద్రియ సహితమనస్సును బుద్ధియందు నిలుపవలెననియు, ఆయింద్రియ మనోసహితబుద్ధిని, మహత్తత్వమందు నిలుపవలెననియు, ఆయింద్రియమనోబుద్ధిసహిత మహత్తత్వమును, ప్రత్యగాత్మయందు నిలుపవలెననియు. శ్రు॥ యచ్ఛేద్వాఙ్మనసీప్రాజ్ఞస్త ద్యచ్ఛేత్ జ్ఞానమాత్మని । జ్ఞానమాత్మనిమహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాంతఆత్మని॥ ఇత్యాదిశ్రుతులన్నియు, అపరోక్షబ్రహ్మవిజ్ఞానానంతరమందు, శాస్త్రీయమానసప్రపంచమును విడువవలెనని, స్ఫుటముగాజెప్పుచున్నవని యభిప్రాయము. మహత్తత్వమనగా అహంకారమగును.

అవ. అశాస్త్రీయద్వైతముయొక్క అవాంతర భేదమునిప్పుడుజెప్పుచున్నాడు.

శ్లో॥ అశాస్త్రీయమపిద్వైతంతీవ్రంమందమితిద్విధా।
కామక్రోధాదికంతీవ్రంమనోరాజ్యంతథేతరత్॥ ౪౯.

టీ. అశాస్త్రీయం - శాస్త్రనిషిద్ధమైన, ద్వైతమపి - మానసప్రపంచంబును, తీవ్రం - వేగమనియు, మందం- మందమనియు, ఇతి- ఇట్లు, ద్విధా - ద్వివిధమగును. కామక్రోధాదికం - కామక్రోధాదిరూపమానస ప్రపంచము, తీవ్రం - వేగమగును. తథా-ఆప్రకారము, మనోరాజ్యం-సర్వదావిషయధ్యానము, ఇతరత్ -మందమగును.

తా. అశాస్త్రీయమగు మానసద్వైతంబును, ౧. తీవ్రమనియు, ౨. మందమనియు, ఇట్లు ద్వివిధముగానున్నది. కామక్రోధలోభమోహమదమాత్సర్య ఈర్ష్యాదంభదర్ప అసూయాది దుర్గుణములన్నియు, తీవ్రమనిచెప్పబడును. మరియు, సర్వదా, స్త్రీ మొదలగు విషయములను ధ్యానించుట, మందమనిచెప్పబడును.

శ్లో॥ ఉభయంతత్వబోధాత్ప్రాఙ్నివార్యంబోధసిద్ధయే।
శమస్సమాహితత్వంచసాధనేషుశ్రుతంతతః॥ ౫౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. తత్త్వబోధాత్ - బ్రహ్మజ్ఞానాభ్యాసము చేయుటను బ్రారంభించుటకంటె, ప్రాక్ - పూర్వము, బోధసిద్ధయె - జ్ఞానసిద్ధికొరకు, ఉభయం - ద్వివిధమానసప్రపంచము, నివార్యం - నివారింపజేయదగినదగును. తతః - అందువల్ల, సాధనేషు - సాధనములయందు, అనగా సాధనచతుష్టయమందనుట. శమః - మనోనిగ్రహరూప శాంతియు, సమాహితత్వంచ - సమాధిభావంబును, శ్రుతం - వినబడుచున్నది.

తా. ప్ర. అయితే, ఈరెంటినియు, శాస్త్రీయద్వైతమునువలెనే, తత్త్వజ్ఞానముగలిగినపిమ్మట, విడువవలెనేమో చెప్పుము?. ఉ. బ్రహ్మజ్ఞానముకొరకు వేదాంత శ్రవణాదులను జేయుటను బ్రారంభించుటకంటె బూర్వమందే, అతీవ్రమందములనెడి, అశాస్త్రీయమానసద్వైతమును నివారింపజేయవలెను. అందుచేతనే, బ్రహ్మజ్ఞానసాధన చతుష్టయసంపత్తిని విధించెడి శ్రుతులయందు, శ్రు॥ శాంతోదాంతఉపరతస్తితిక్షుస్సమాహిత శ్శ్రద్ధావిత్తోభూత్వాఽత్మన్యేవాత్మానంపశ్యేత్ ॥ అనెడివాక్యముచేత, శమాదిషట్కము వినబడుచున్నది. ఈశ్రుతియందుగల శాంతపదముచేత, కామక్రోధాదిరూపమగు తీవ్రమానసద్వైతము నివారింపదగినదని తెలుపబడెను. మరియు, ఈ శ్రుతియందుగల సమాహితపదముచేత, సమాధి, విధింపబడెను. ఇట్లు సమాధిని విధించుటచేత, మందమనెడి మనోరాజ్యరూపమగు మానసద్వైతము, నివారింపదగినదని తెలుపబడెనని తెలియవలెను. ప్ర. అయితే, సాధనచతుష్టయసంపత్తియనగానేమి?. ఉ. ౧. నిత్యానిత్యవస్తువివేకము, ౨. ఇహాముత్రార్థఫలభోగవిరాగము. ౩. శమాదిషట్కసంపత్తి, ౪. ముముక్షుత్వము. ఈనాలుగును సాధనచతుష్టయసంపత్తి, యనెడిపేరుచేత జెప్పబడును. మరియు, కర్మమువల్ల సంపాదింపబడిన ఈలోకము కర్మఫలము క్షయించినవెంటనే, ఏప్రకారముగా క్షయించుచున్నదో, ఈప్రకారమే పుణ్యమువల్ల సంపాదింపబడిన స్వర్గాదిపరలోకంబును, పుణ్యకర్మము క్షయించినవెంటనే క్షయించుచున్నదనియు, బ్రహ్మవేత్తయగువాడు, బ్రహ్మమేయగుటవల్ల జననమరణలక్షణసంసారమును పొందడనియు, భూమశబ్దముచే జెప్పదగిన పరమాత్మయే, అమృతమనియు, ఆపరమాత్మకంటె అన్యముగాదోచునది యంతయుం దుఃఖమనియుంజెప్పెడి, శ్రు॥ తద్యథేహకర్మచితోలోకః క్షీయత ఏవమేవాముత్రపుణ్యచితోలోకః క్షీయతే, నజాయతేమ్రియతేవావిపశ్చిత్, యోవైభూమాతదమృతమన్యదార్తం॥ ఇత్యాది శ్రుతులు, నిత్యానిత్యవస్తువివేకత్వమును బోధించుచున్నవి. మరియు, ముముక్షువగువాడు కర్మముచే సంపాదింపబడెడి లోకములనిత్యములని పరీక్షించి, వైరాగ్యమును పొందుననియు, కర్మముచేత ముక్తిలేదనియు, భోక్తయగు తనయొక్కభోగముకొరకే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భార్యాపుత్రధనాధి సర్వప్రపంచంబును ప్రీతివిషయత్వమును బొందుచున్నదనియుం జెప్పెడి, శ్రు॥ పరీక్ష్యలోకాన్కర్మచితాన్ బ్రాహ్మణోనిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన, ఆత్మనస్తుకామాయసర్వంప్రియంభవతి॥ ఇత్యాదిశ్రుతులు, ఇహాముత్రార్థఫల భోగ విరాగత్వమును బోధింపుచున్నవి. మరియు, ౧. శమము, ౨. దమము, ౩. ఉపరతి=అనగా కర్మసన్న్యాసము, ౪. తితిక్ష, ౫ సమాధానము=అనగా సమాధి, ౬. శ్రద్ధ, ఈయారింటినిగలవాడగుచు, తనయందే, స్వరూపభూతుడగు పరమాత్మ నుజూచునని చెప్పెడి, శ్రు॥ శాంతోదాంత ఉపరతస్తితిక్షుస్సమాహితశ్శ్రద్ధావిత్తో భూత్వాత్మన్యేవాత్మానంపశ్యేత్॥ ఇత్యాదిశ్రుతులు, శమాదిషట్కసంపత్తినిబోధింపు చున్నవి. మరియు, విద్వాంసుడగువాడు, తానేబ్రహ్మమగుటచేతయు, బ్రహ్మమునకు జన్మములేమిచేతయు, అట్టివిద్వాంసుడు పునర్జన్మమును పొందడనిచెప్పెడి, శ్రు॥ నచ పునరావర్తతే॥ ఇత్యాదిశ్రుతులు, ముముక్షుత్వమును దెలుపుచున్నవని తెలియవలెను. గనుక, సత్యవస్తువుబ్రహ్మమనియు, జగంబంతయు అసత్యమనియెరుగుటయే, ౧. నిత్యానిత్యవస్తువివేకమని చెప్పబడును. మరియు, ఇహలోకపరలోకవస్తు భోగములయందు ఇచ్ఛలేకపోవుటయే, ౨. ఇహాముత్రార్థఫలభోగవిరాగమని చెప్పబడును. మరియు, ౧. శమము, ౨. దమము, ౩. ఉపరతి, ౪. తితిక్ష. ౫. సమాధానము = అనగా సమాధి, ౬. శ్రద్ధ, ఈయారును, ౩. శమాదిషట్కమని చెప్పబడును. మనస్సును, శ్రవణాదులకంటె వ్యతిరిక్తములైన శబ్దస్పర్శాది ఇంద్రియవిషయములవల్ల మగిలించి, శ్రవణాదులయందేనిలుపుట, శమమని చెప్పబడును. అనగా మనోనిగ్రహముజేయుట యే, శమమనితెలియవలెను. మరియు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను శ్రవణాది వ్యతిరిక్తములైన ఇంద్రియవిషయములవల్ల మరలించి, స్వస్థానములయందే నిలుపుట, దమమని చెప్పబడును. అనగాబాహ్యేంద్రియనిగ్రహము దమమని తెలియవలెను. మరియు, విహితములైన నిత్యకర్మాదులను శాస్త్రోక్తప్రకారము విడుచుటయే, ఉపరతి యని చెప్పబడును. ఇదియే సన్న్యాసమని చెప్పబడును. ఇట్లు కర్మసన్న్యాసము జేయని పక్షమందు, వేదవిహితములైన నిత్యకర్మాదులనుజేయుచు, కర్తృత్వాద్యభిమానము లేనివాడై, కర్మఫలము నపేక్షింపక, ఈశ్వరార్పణబుద్ధిచేత కర్మములనుజేయుచుం డుటయే, ఉపరతియనిచెప్పబడును. మరియు, ప్రారబ్ధకర్మవశముచేత, ఏయేకాల మందు ఏయేసుఖదుఃఖములు సంభవించునో, ఆయాసుఖదుఃఖములను అనుభవింపక తప్పదనెడి బుద్ధియందుగల దృఢనిశ్చయముచేత, ఓర్పుగలిగియుండుటయే తితిక్ష, యనిచెప్పబడును. మరియు, బూర్వోక్తప్రకారము విషయములనుంచి త్రిప్పబడిన,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇంద్రియమనస్సులు వాసనావశమువల్ల, మరల విషయములయందే పోవుచుండును. గనుక, అట్టి ఇంద్రియమనస్సులను శ్రవణాదులకంటె వ్యతిరిక్తములైన విషయముల వల్ల మరలించి, స్వస్థానములయందేనిలిపి, సమాధిరూపముగానుండుటయే, సమాధాన మని చెప్పబడును. మరియు, ఆచార్యునియందును, వేదాంతశాస్త్రమందును, ఈశ్వ రునియందుగల భక్తి పూర్వకమైన విశ్వాసము శ్రద్ధయని చెప్పబడును. శమాదిషట్క సంపత్తియొక్క స్వరూపమిట్టిదని తెలియవలెను. మరియు, మోక్షమును పొందవలె నని బుద్ధియందు దృఢనిశ్చయము గలిగియుండుటయే, ౪. ముముక్షుత్వమని చెప్పబ డును. ఈచెప్పబడిన నాలుగుసాధనములును, సాధనచతుష్టయ సంపత్తియనెడి పేరుచేత వ్యవహరింపబడుచున్నవి. ఈనాలుగు సాధనములును, ఒకటికంటె మరి యొకటి ఉత్తరోత్తరక్రమముగా, బలవంతములని, సూ॥ అథాతో బ్రహ్మజిజ్ఞాసా॥ అనెడి సూత్రముయొక్క, శ్రీభాష్యమందు శ్రీశంకరాచార్యులచే జెప్పబడెను. గనుక, మొదటిదానికంటె రెండవదియు, రెండవదానికంటె మూడవదియు, మూడవదానికం టె నాలగవదియు, బలముగలవియగుచున్నవని తెలియవలెను. ఈనాలుగు సాధనము లను మొదట సంపాదించుకొని, పిమ్మట, వేదాంతశ్రవణాదులను జేయవలెను. అట్లుగానియెడల, ఆచార్యునిదగ్గిర వేదాంతశ్రవణాదులను జేసెడికాలమందైనను, ఈ సాధనచతుష్టయమును సంపాదించవలెనని దెలియవలెను. ఈసాధనచతుష్టయసంప త్తిని, బ్రహ్మతత్త్వవిచారణము జేయుటకంటె బూర్వమందే సంపాదించవలెనని, శ్రుతి, జెప్పుటచేత, ఈసాధనచతుష్టయసంపత్తివల్ల, తీవ్రమందరూపమగు మానసద్వైతము నివారింపబడునని, పూర్వశ్లోకమందు, శ్రీవిద్యారణ్యమునిచేత, జెప్పబడెను.

శ్లో॥ బోధాదూర్ధ్వంచతద్ధేయంజీవన్ముక్తిప్రసిద్ధయే।
కామాదిక్లేశబంధేనయుక్తస్యనహిముక్తతా॥ ౫౧.

టీ. జీవన్ముక్తిప్రసిద్ధయే=జీవన్ముక్తి - జీవన్ముక్తియొక్క, ప్రసిద్ధయే - సిద్ధి కొరకు, బోధాత్ - జ్ఞానోదయముకంటె, ఊర్ధ్వంచ - పిమ్మటయు, తత్ - ఆఅ శాస్త్రీయద్వివిధమానసద్వైతము, హేయం-విడువదగినదగును. కామాదిక్లేశబంధేన= కామాది - కామక్రోధాదిరూపమగు, క్లేశ - వ్యసనమనెడి, బంధేన-బంధముతోటి, యుక్తస్య - కూడియున్నవానికి, అనగా సంసారబద్ధునకనుట. ముక్తతా - జీవన్ము క్తిభావము, నహి - లేనేలేదు.

తా. ప్ర. అయితే, ఆఅశాస్త్రీయమగు ద్వివిధమానసప్రపంచమును, తత్వజ్ఞా నోత్పత్తికంటె బూర్వమందే నివారింపజేయవలెనని చెప్పుటచేత, జ్ఞానోత్పత్తియైన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పిమ్మట, ఆశాస్త్రీయద్వివిధమానసద్వైతమును మరల గ్రహింపవచ్చునుగదా ?. ఉ. బ్రహ్మజ్ఞానోదయమైన పిమ్మటగూడ, జీవన్ముక్తిసిద్ధించుటకొరకు, ఆశాస్త్రీయ ద్వివిధమానసద్వైతమును, (సర్వదా) విడువవలెను. ఈయర్థమును వ్యతిరేకముఖముగా జెప్పెదవినుము. కామక్రోధాదిరూపమగు వ్యసనమే సంసారబంధమగును. అట్టిబంధముతోగూడినవాడు బద్ధుడగును. అట్టిసంసారబద్ధునకు జీవన్ముక్తత్వములేనేలేదని తెలిసికొనుము.

అవ. ఇప్పుడు, పూర్వవాదిజేసెడి చోద్యమును, ప్రతిబంధిచేత బరిహరించుచున్నాడు.

శ్లో॥ జీవన్ముక్తిరియంమాభూజ్జన్మాభావేత్వహంకృతీ।
తర్హిజన్మాపి తేస్త్యేవస్వర్గమాత్రాత్కృతీభవాన్॥ ౫౨.

టీ. ఇయం - ఈ, జీవన్ముక్తిః - జీవన్ముక్తి, మాభూత్ - లేకపోవుగాక. అనగా నాకుజీవన్ముక్తి అక్కరలేదనుట. జన్మాభావేసతితు = జన్మ - జన్మముయొక్క, అభావేసతితు - అభావమగుచుండగానో, అనగా విదేహముక్తిగలుగుచుండగానో యనుట. అహం- నేను, కృతీ - కృతకృత్యుడనయ్యెదను. (ఇతిచేత్) ఇట్లంటివేని, తర్హి-అట్లైనయెడల, తే-నీకు. జన్మాపి - జన్మంబును, అస్త్యేవ-కలదేను. భవాన్ - నీవు, స్వర్గమాత్రాత్ - స్వర్గమాత్రమువల్లనే, కృతీ - కృతకృత్యుడవగుదువు.

తా. ప్ర. అయితే. జన్మము మొదలుకొని, సంసారమువల్ల, పరితపించుచుండెడివానికి, పరమపురుషార్థరూపమగు విదేహముక్తిచేతనే ప్రయోజనముగలదుగాని, జీవన్ముక్తివల్ల బ్రయోజనములేమిచేత, ఈజీవన్ముక్తినాకు అక్కరలేదు. నేను, జన్మాభావరూపమగు విదేహముక్తిచేతనే కృతార్థుడనుగానాయేమి ?. ఉ. అట్లైనయెడల, నీకు జన్మముగలుగకమానదు, నీవు స్వర్గలోకమాత్రముచేతనే కృతార్థుడవయ్యెదవే గాని, నీకువిదేహముక్తిగలుగదు. అనగా, నీవు, ఈమనుష్యలోకభోగము నివర్తించునసెడి భయమువల్ల, జీవన్ముక్తిని విడిపించినయెడల పరలోకభోగము నివర్తించునసెడి భయమువల్ల నీచేతవిదేహముక్తియు విడువబడినదేయగుననియు జీవన్ముక్తివల్లనే విదేహముక్తిలభింపబడుగాని, జీవన్ముక్తినివిడిచినయెడల నీకువిదేహముక్తిగలుగదని యభిప్రాయము. ఈవిధముగా జెప్పబడెడి సమాధానము, ప్రతిబంధియని చెప్పబడును.

అవ. ఇప్పుడు, ప్రతిబంధీవిమోచనమును శంకించుకొనుచు, ప్రత్యుత్తరము జెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ క్షయాతిశయదోషేణస్వర్గో హేయోయదా తదా।
స్వయందోషతమాత్మాయం కామాదిః కింనహీయతే॥ ౫౩.

టీ. క్షయాతిశయదోషేణ=క్షయ - నశించుటయు, అతిశయ - అధికమగు, దోషేణ - దోషముచేత, అనిత్యదోషముచేననుట. యదా - ఎప్పుడు, స్వర్గః - స్వర్గలోకము, హేయః - విడువదగినదగునో, తదా - అప్పుడు, దోషతమాత్మా= దోషతమ - అధికదోషమే, ఆత్మా - స్వరూపముగాగల, స్వయం - తానైన, కామాదిః - కామక్రోధాదికము, కింనహీయతే విడువబడదాయేమి. అనగా విడువ బడదగినదే యగును.

తా. ప్ర. అయితే, స్వర్గాదిలోకము, క్షయాతిశయదోషమును గలిగియుండు టచేత, ఆస్వర్గాదిలోకము విడువదగినది గాదాయేమి?. ఉ. సరి. అట్లైనయెడల్ల, సకలపురుషార్థములకు విఘాతమును గలగించెడి, ఈకామక్రోధాదికము మిక్కిలి దోషరూపమగును. అట్టి కామక్రోధాదికమును, నిశ్శేషము గావిడువవలెనని తెలిసికొనుము.

శ్లో॥ తత్త్వంబుద్ధ్వాపి కామాదీన్ నిశ్శేషంజహాసిచేత్।
యథేష్టాచరణం తేస్యాత్కర్మశాస్త్రాతిలంఘినః॥ ౫౪.

టీ. తత్త్వం - పరతత్త్వమును, బుద్ధ్వాపి - ఎరిగియు, కామాదీన్ - కామాదులను, నిశ్శేషం - శేషములేనట్లుగా, నజహాసిచేత్ - విడువకుంటివేని, కర్మశాస్త్రాతి లంఘినః=కర్మశాస్త్ర - కర్మశాస్త్ర - కర్మశాస్త్రమును, అతిలంఘినః - అతిక్రమిం చిన, తే - నీకు, యథేష్టాచరణం- స్వేచ్ఛాచరణము, అనగాతనయిష్టప్రకారము ప్రవర్తించుటయనుట. స్యాత్ - కలుగును. అనగానగుననుట.

తా. ప్ర. అయితే, వైరాగ్యాదిసంపాదనముచేత మిక్కిలి అనర్థహేతువగు కామక్రోధాదికము, విడువదగినదైనను, దేహసంబంధభోగమాత్రమునకు ఉపయోగిక మగు కామాదికమును గ్రహించుటవల్ల దోషమేమి?. ఉ. నీవుపరతత్త్వము నెరిగియు, కామక్రోధాదులను నిశ్శేషముగా విడువకుంటివేని, కర్మశాస్త్రమునతిక్రమించి నీకు, స్వేచ్ఛాప్రవర్తనముగలుగును. అనగా, నీవు, బ్రహ్మవేత్తననెడి అభిమానముచేత విధి నిషేధరూపమగు కర్మశాస్త్రమతిక్రమించి, కామక్రోధాదులయొక్క వశమందు వర్తించుచున్నయెడల, నీయిష్టప్రకారము ప్రవర్తించినవాడవగుదువని యభిప్రాయము.

అవ. స్వేచ్ఛాచరణదోషమును ప్రతిపాదించెడి సురేశ్వరాచార్యవాక్యము లిప్పుడు పఠించుచున్నాడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ బుద్ధాద్వైతసతత్త్వస్యయథేష్టాచరణంయది।
శునాంతత్త్వదృశాంచైవకోభేదోఽశుచిభక్షణే॥ ౫౫.

టీ. బుద్ధాద్వైతసతత్త్వస్య = బుద్ధ - తెలిసికొనబడిన, అద్వైతసతత్త్వస్య - అద్వైతస్వరూపబ్రహ్మముగలవానికి, యథేష్టాచరణంయది - స్వేచ్ఛాప్రవర్తనము గలిగినయెడల, తత్త్వదృశాం - తత్త్వవేత్తలకును, శునాంచైవ - కుక్కలకును, అశుచిభక్షణే=అశుచి - అమేధ్యపదార్థములను, భక్షణే - తినుటయందు, భేదః - భేదము, కః - ఏమి - అనగా విశేషములేదనుట.

తా. ప్ర. సరి. నాకు, స్వేచ్ఛాచరణముగలిగినను గలుగనిమ్ము. అందుచేత దోషమేమి?. ఉ. అద్వైతబ్రహ్మస్వరూపవేదికి, స్వేచ్ఛాచరణముగలిగినయెడల, అమేధ్యపదార్థ భక్షణాదికముంగలుగును. అట్లుగలుగుచుండగా, కుక్కలకును, తత్త్వవేత్తలకును విశేషమేమియులేదని, శ్రీసురేశ్వరాచార్యులు జెప్పిరి.

అవ. ఇప్పుడు, సిద్ధాంతి, ఆపూర్వము, ప్రత్యుత్తరమును జెప్పుచున్నాడు.

శ్లో॥ బోధాత్పురామనోమాత్రదోషాత్క్లిశ్నాస్యథాధునా।
అశేషలోకనిందాచేత్యహోతేబోధవైభవః॥ ౫౬.

టీ. బోదాత్ - జ్ఞానోత్పత్తికంటె, పురా-పూర్వము, మనోమాత్రదోషాత్ - కామాదిదోషమాత్రమువల్లనే, క్లిశ్నాసి - వ్యసనమునుబొందితివి. అథ - జ్ఞానోదయమైనపిమ్మట, అధునా - ఇప్పుడు, అశేషలోకనిందాచ=అశేషలోక - సర్వజనులచేత, నిందాచ - నిందయుంగలిగెను. ఇతి - ఇట్లుగలిగిన, తే- నీయొక్క, బోధవైభవః - జ్ఞానవైభవము, అహో - ఏమిగాస్తుతింపబడెను. అనగా నీజ్ఞానవైభవంబెందుకు, కాల్చనాయనుట.

తా. ప్ర. అయితే, ఇంతమాత్రముచేత, ఏమిఅనిష్టము జెప్పబడినట్లాయెనో జెప్పుము?. ఉ. నీకుబ్రహ్మజ్ఞానోదయము గలుగకమునుపు, కామక్రోధాదిచిత్తదోషములచేత, నీకువ్యసనముగలిగెను. ఆవ్యసనము, బ్రహ్మజ్ఞానముగలిగిన పిమ్మట, ఇప్పుడునీకు, సర్వలోకనిందచేత, ఇబ్బడించెను. (అహో) నీజ్ఞానవిభవమును, నేనేమనిస్తుతింపగలను. అనగా నీజ్ఞానవిభవంబెందుకు, కాల్చనాయని యభిప్రాయము.

శ్లో॥ విడ్వరాహాదితుల్యత్వంమాకాంక్షీస్తత్త్వవిద్భవాన్।
సర్వధీదోషసంత్యాగాల్లోకైఃపూజ్యశ్చదేవవత్॥ ౫౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. తత్త్వవిత్ - బ్రహ్మవేత్తవగు, భవాన్ - నీవు, విడ్వరాహాదితుల్యత్వం=విట్ - కుక్కతోటియు, వరాహాది - పందిమొదలగు హీనజంతువులతోటియు, తుల్యత్వం- సామ్యమును, మాకాంక్షీః - కోరకుము. సర్వధీదోషసంత్యాగాత్ =సర్వ-సకలములైన, ధీదోష - చిత్తదోషములయొక్క, సంత్యాగాత్ - పరిత్యాగమువల్ల, లోకైః - జనులచేత, దేవవత్ - దేవునివలె, పూజ్యశ్చ - పూజింపదగినవాడవు. (భవ) అగుము.

తా. ప్ర. అయితే, ఏమిచేయవలెనో చెప్పుము?. ఉ. సర్వాధిక్యతనుగలిగించుటకు కారణమైన పరతత్త్వజ్ఞానము నీకు గలిగియుండియు, కామక్రోధాదులను విడుచుటకు శక్తిలేనివాడవై, సర్వజంతువులకంటె హీనజంతువులగు, కుక్క, పంది, మొదలగు జంతువులతోటి సమానముగానుండవలెనని కోరకుము. మరియేమనగా, కామక్రోధాదిలక్షణసకలమనోదోషములను విడిపించుటచేత, దేవునివలె, సర్వజనులచేత, బూజింపదగినవాడవుగముత.

అవ. కామాదులనువిడుచుటకు ఉపాయము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ కామ్యాదిదోషదృష్ట్యాద్యాః కామాదిత్యాగహేతవః।
ప్రసిద్ధా మోక్షశాస్త్రేషు తానన్విష్య సుఖీభవ॥ ౨౮.

టీ. కామ్యాదిదోషదృష్ట్యాద్యాః=కామ్య-కామనావిషయములయొక్కయు, ఆది - ద్వేషవిషయములయొక్కయు, దోష - దోషములయొక్క, దృష్టి - దృష్టియు, ఆద్యాః - కోపస్వరూపవిచారాదులును, కామాదిత్యాగహేతవః=కామాది- కామక్రోధాదులయొక్క, త్యాగ - పరిత్యాగమునకు, హేతవః - కారణములుగా, మోక్షశాస్త్రేషు - వేదాంతశాస్త్రములయందు, ప్రసిద్ధాః - ప్రసిద్ధములైయున్నవి. అనగాజెప్పబడినవగుట. తాన్ - అదోషదృష్టి కోపస్వరూపవిచారాదులను, అన్విష్య-వెదకి, అనగా తెలిసికొనియనుట. సుఖీ - సౌఖ్యవంతుడవు, భవ - అగుము.

తా. ప్ర. అయితే - ఆకామక్రోధాదులను విడిపించుటకు ఉపాయమేమి?. ఉ. కామింపదగిన స్త్రీపుష్పాదివస్తువులయందుగల అనిత్యత్వాదిదోషదృష్టియు, ద్వేష్యాదివస్తువులయందు గలిగెడి కోపాదులయొక్క స్వరూపవిచారాదులును, కామక్రోధాదులను విడిపించుటకు కారణములగును. ప్ర. అయితే, ఆదోషదృష్ట్యాదులు, కామాదులను విడిపించుటకు కారణములగుననెడి విషయమై ప్రమాణమేమి?. ఉ. వేదాంతశాస్త్రములయందు, బ్రసిద్ధముగా జెప్పబడియున్నవి. ప్ర. సరి. చెప్పబడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాక. అందువల్లలాభమేమి ?. ఉ. ఆవిషయదోషదృష్ట్యాదులను దెలిసికొని విచారించి కామక్రోధాదులను విడిపించి, సుఖవిగను.

శ్లో॥ త్యజ్యతామేష కామాదిర్మనోరాజ్యేతు కాక్షితిః।
అశేషదోషబీజత్వాత్ క్షతిర్భగవ తేరితా॥ ౫౯.

టీ. ఏషః - ఈ, కామాదిః - కామక్రోధాదికము, త్యజ్యతాం - విడువబడు గాక. మనోరాజ్యేతు - సర్వదావిషయములను ధ్యానించుటయందు. క్షతిః - కీడు, కా - ఏమి ?. అనగా మనోరాజ్యము గ్రహింపదగుననుట. (ఇతిచేత్) ఇట్లంటివేని, అశేషదోషబీజత్వాత్ = అశేషదోష - సర్వదోషములకు, బీజత్వాత్ - ఆమనోరాజ్యము కారణమగుటవల్ల, క్షతిః - అనర్థహేతుత్వము, భగవతా - శ్రీకృష్ణదేవుని చేత, ఈరిత - చెప్పబడెను.

తా. ప్ర. అయితే, ఈకామక్రోధాదిరూపమగు తీవ్రమానసద్వైతము, అనర్థహేతువగుటచేత, ఇది విడువదగినదే యగును. మనోరాజ్యము, అనర్థమునకు హేతువుగామిచేత, ఆమనోరాజ్యమును విడువనక్కరలేదుగదా ?. ఉ. ఆమనోరాజ్యము సర్వదోషములకు కారణమగును. మరియు, ఈమనోరాజ్యము పురుషునకు సాక్షాత్తుగా గీడును గలిగింపకున్నను, పరంపరగా గీడును గలిగించుటచేత, ఇదియు దుఃఖహేతువేయగునని, శ్రీభగవంతునిచే జెప్పబడెను.

అవ. ఆభగవద్వాక్యము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంసస్సంగస్తేషూపజాయతే।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోభిజాయతే॥ ౬౦.

టీ. విషయాన్ - విషయములను, ధ్యాయతః - ధ్యానముచేసెడి, పుంసః - పురుషునకు, తేషు - ఆవిషయములయందు, సంగః - ఆసక్తి, ఉపజాయతే - కలుగుచున్నది. సంగాత్ - విషయాసక్తివల్ల, కామః - కోరికపుట్టుచున్నది. కామాత్ - కోరికవల్ల, క్రోధః - కోపము, అభిజాయతే - పుట్టుచున్నది.

తా. స్త్రీపుష్పాదివిషయములను సర్వదా స్మరించెడి పురుషునకు, ఆవిషయములయందు ఆసక్తిగలుగుచున్నది. ఆవిషయాసక్తివల్ల కామముపుట్టుచున్నది. ఆస్త్రీపుష్పాదివిషయము లభించకపోవుచుండగా, ఆకామమువల్ల క్రోధముబుట్టుచున్నదని, ఇట్లు శ్రీపరమేశ్వరుడు, గీతాశాస్త్రమందు చెప్పెను. కనుక, సర్వదా విషయధ్యాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రూపమగు మనోరాజ్యము, ఇట్లు పరంపరగా దుఃఖహేతువగుటచేత, ఈమనోరాజ్యం బును విడువదగినదే యగునని యభిప్రాయము.

శ్లో॥ శక్యంజేతుంమనోరాజ్యంనిర్వికల్పసమాధితః।
సుసంపాద్యఃక్రమాత్సోఽపిసవికల్పసమాధినా॥ ౬౧.

టీ. నిర్వికల్పసమాధితః - నిర్వికల్పసమాధివల్ల, మనోరాజ్యం - మనోరాజ్యమును, జేతుం - జయించుటకు, శక్యం - సాధ్యమగును. సోఽపి - ఆనిర్వికల్పసమాధియు, క్రమాద్-క్రమముగా, సవికల్పసమాధినా - సవికల్పసమాధిచేత, సుసంపాద్యః - అనాయాసముగా, సంపాదింపదగినదగును.

తా. ప్ర. అయితే, ఈమందమానసద్వైతరూపమగు మనోరాజ్యమును విడుచుటకు ఉపాయమేమి?. ఉ. నిర్వికల్పకసమాధిచేత ఈమనోరాజ్యమును జయించుటకు సాధ్యమగును. ప్ర. ఆనిర్వికల్పకసమాధి, దేనివల్లసిద్ధింపబడును?. ఉ. సవికల్పకసమాధిచేత, ఆనిర్వికల్పకసమాధి, క్రమముగాలభింపబడగలదు.

శ్లో॥ బుద్ధతత్త్వేనధీదోషశూన్యేనైకాంతవాసినా।
దీర్ఘంప్రణవముచ్చార్యమనోరాజ్యంవిజీయతే॥ ౬౨.

టి. బుద్ధతత్త్వేన=బుద్ధ - తెలియబడిన, తత్త్వేన - బ్రహ్మాత్మైక్యలక్షణముగలిగినట్టియు, ధీదోషశూన్యేన=ధీదోష - కామక్రోధాదులయొక్క, శూన్యేన - అభావముగలిగినట్టియు, అనగా చిత్తదోషములేనివాడగుట. ఏకాంతవాసినా=ఏకాంత - నిర్జనప్రదేశమందు, వాసినా - నివసించెడిపురుషునిచేత, దీర్ఘం - షడ్ద్వాదశమాత్రయుక్తమైన, ప్రణవం - ఓంకారము, ఉచ్చార్య - ఉచ్చరింపబడి, మనోరాజ్యం - మందరూపమానసద్వైతము, విజీయతే - జయింపబడుచున్నది.

తా. ప్ర. అయితే, ౧. యమము, ౨. నియమము, ౩. ఆసనము, ౪. ప్రాణాయామము, ౫. ప్రత్యాహారము, ౬. ధ్యానము, ౭. ధారణము, ౮. సమాధి, అనెడి అష్టాంగయోగములుగలవాడు, నిర్వికల్పకసమాధిచేత మనోరాజ్యమును నివారింపజేయగలడు. ఆఅష్టాంగములులేనివానికి గతియేమి?. ఉ. జీవబ్రహ్మైక్యరూపమగు పరతత్త్వమునెరిగి, కామక్రోధాదిమనోదోషములులేక, విజనప్రదేశమందు నివసింపవలెననెడి స్వభావముగలపురుషుడు, ఆరు, పదిరెండు, మొదలగు మాత్రలతోగూడియున్నట్లుగా, ప్రణవమునుచ్చరించి, మనోరాజ్యమును జయింపగలడు. ఒక హ్రస్వాక్షరమును ఉచ్చ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రించుటకుదగిన కాలము, మాత్రయని చెప్పబడును. (అ) అనెడి అక్షరము హ్రస్వాక్షరమగును.

శ్లో॥ జితేతస్మిన్ వృత్తిశూన్యంమనస్తిష్ఠతిమూకవత్।
ఏతత్పదంవసిష్ఠేనరామాయబహుధేరితం॥ ౬౩.

టీ. తస్మిన్ - అమనోరాజ్యము, జితేసతి - జయింపబడుచుండగా, మనః - మనస్సు, మూకవత్ - మూగవానివలె, తిష్ఠతి, స్థితినిపొందుచున్నది. ఏతత్పదం - ఈ దశ, వసిష్ఠేన - వసిష్ఠమునిచేత, రామాయ - దశరథరామునికొరకు, బహుధా - అనేకవిధములుగా, ఈరితం - చెప్పబడెను.

తా. ప్ర. అయితే, మనోరాజ్యమునుజయించుటచేత బ్రయోజనమేమి ?. ఉ. అమనోరాజ్యము నివారింపబడుచుండగా, మూగవాడు, సకలవాగ్వ్యవహారములను విడిపించియున్నట్లు, మనంబును, సకలవ్యాపారములను విడిపించియుండును. ఇట్లు, వృత్తిశూన్యముగానుండెడి మనస్సునకే, బరమపురుషార్థత్వముగలిగియున్నదని తెలిసికొనునది. ప్ర. ఈవిషయమై ప్రమాణమేమి ?. ఉ. ఇట్లు, వృత్తిశూన్యముగానుండెడి మనస్సునకే, పరమపురుషార్థత్వముగలిగియున్నదని, శ్రీజ్ఞానవాసిష్ఠమందు జెప్పబడెను.

అవ. ఆవసిష్ఠశ్లోకములురెంటి నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ దృశ్యంనాస్తీతిబోధేనమనసోదృశ్యమార్జనం।
సంపన్నంచేత్తదుత్పన్నాపరానిర్వాణనిర్వృతిః॥ ౬౪.

టీ. దృశ్యం- జగత్తు, నాస్తీతి - లేదనెడి, బోధేన- అద్వితీయబ్రహ్మత్వజ్ఞానము చేత, మనసః - మనస్సునకు, దృశ్యమార్జనం - దృశ్యనివారణము, సంపన్నంచేత్ - కలిగినయెడల, తత్ - అప్పుడు, పరా - అధికమైన, నిర్వాణనిర్వృతిః - మోక్షసుఖము, ఉత్పన్నా - కలిగెననితెలియవలెను.

తా. శ్రు॥ నేహనానాస్తికించన॥ ఇత్యాదిశ్రుతిప్రకారము, అద్వితీయబ్రహ్మత్మకంబె అన్యమగుజగంబులేదనెడి జ్ఞానముచేత మనస్సునకు దృశ్యముదోచనియెడల, అప్పుడు, నిరతిశయమోక్షసుఖము లభించెనని తెలియవలెను.

శ్లో॥ విచారితమలంశాస్త్రం చిరముద్గ్రాహితంమిథః।
సంత్యక్తవాసనాన్మౌనాదృతేనాస్త్యుత్తమంపదం॥ ౬౫.

టీ. శాస్త్రం - అద్వైతశాస్త్రము, అలం - అధికముగా, విచారితం - విచా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రింపబడెను. (తథా) ఆప్రకారము, మిథః - గురుశిష్యాదిసంవాదద్వారా, చిరం - బహుకాలము, ఉద్గ్రాహితం-ఉపన్యాసము జేయబడెను. సంత్యక్తవాసనాత్ = సంత్యక్త- లెస్సగావిడువబడిన, వాసనాత్ - కామక్రోధాదివాసనలుగల, అనగా కామక్రోధాదివాసనలు లేనియచుట. మౌనాత్ - మనస్సుయొక్క తూష్ణీంభావముకంటె, ఋతే - అధికమైన, ఉత్తమం - శ్రేష్ఠమగు, పదం - స్థానము, అనగా పురుషార్థమనుట. నాస్తి - లేదు.

తా. మరియు, అద్వైతశాస్త్రము సమగ్రముగా మాచేతవిచారింపబడెను. మరియు, ఆఅద్వైతశాస్త్రము, గురుశిష్యాదిసంవాదద్వారా, బహుకాలము సమగ్రముగామాచేత ఉపన్యాసము జేయబడెను. ప్ర. ఇట్లుచేసి, యేమినిశ్చయింపబడెను?. ఉ. కామక్రోధాదివాసనలులేని మనస్సుయొక్క, తూష్ణీంభావముకంటె, అధికమైన పరమపదముమరియొకటిలేదని మాచేతనిశ్చయింపబడెను. ఇట్లు శ్రీవసిష్ఠునిచేత జ్ఞానవాసిష్ఠమందు జెప్పబడెనని యభిప్రాయము.

శ్లో॥ విక్షిప్యతేకదాచిద్ధీఃకర్మణాభోగదాయినా।
పునస్సమాహితాసాస్యాత్తదైవాభ్యాసపాటవాత్॥ ౭౭.

టీ. భోగదాయినా = భోగ - భోగమును, దాయినా - ఇచ్చెడి, కర్మణా - ప్రారబ్ధకర్మముచేత, కదాచిత్ - ఒకానొకప్పుడు, ధీః - బుద్ధి, విక్షిప్యతేచేత్ -విక్షేపమును బొందినయెడల, తదైవ - అప్పుడే, సా - ఆబుద్ధి, అభ్యాసపాటవాత్ = అభ్యాస - సమాధ్యభ్యాసముయొక్క, పాటవాత్ - దృఢత్వమువల్ల, పునః - మరల, సమాహితా - సమాధియందుంచబడినది, స్యాత్ - అగును.

తా. ప్ర. అయితే, ఇట్లువృత్తిశూన్యముగా జేయబడినమనస్సునకు, ప్రారబ్ధకర్మవశమువల్ల దేహమునేననెడి యభిమానరూపమగు విక్షేపముగలిగినయెడల, అందుకు బరిహారోపాయమేమి?. ఉ. భోగమునిచ్చెడి ప్రారబ్ధకర్మముచేత ఒకానొకప్పుడు బుద్ధికివిక్షేపముగలిగినయెడల, అప్పుడే, ఆబుద్ధి, మరలసమాధ్యభ్యాసదృఢత్వమువల్ల, సమాధియందుంచబడునని తెలియవలెను.

అవ. సర్వదాచిత్తవిక్షేపములేనివానికి, బ్రహ్మవేత్త, యనెడిపేరును జౌపచారికమని, ఇప్పుడుచెప్పుచున్నాడు.

శ్లో॥ విక్షేపోయస్యనాస్త్యస్యబ్రహ్మవిత్త్వంనమన్యతే।
బ్రహ్మైవాయమితిప్రాహుర్మునయఃపారదర్శినః॥ ౭౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. యస్య - ఏపురుషునకు, విక్షేపః - దేహాద్యభిమానము, నాస్తి - లేదో, అస్య - ఈజ్ఞానికి - బ్రహ్మవిత్త్వం-బ్రహ్మవిత్త్వభావము, నమన్యతే-తలచబడదు. అయం - ఈజ్ఞాని, బ్రహ్మైవేతి - పరబ్రహ్మమేనని, పారదర్శినః- వేదాంతశాస్త్రపార గులగు, మునయః - మహామునులు, ప్రాహుః - చెప్పుదురు.

తా. మరియు, దేహాద్యభిమానరూపమగు విక్షేపములేనిజ్ఞానిని, బ్రహ్మవేత్తను గాజెప్పరాదు. మరియేమనగా, ఈజ్ఞాని, సాక్షాత్తుగాపరబ్రహ్మమేనని, వేదాంత శాస్త్రపారగులగు దివ్యజ్ఞానులైన మహామునులుజెప్పుదురు.

అవ. ఈవిషయమందును వసిష్ఠవాక్యమునిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ దర్శనాదర్శనేహిత్వాస్వయంకేవలరూపతః।
యస్తిష్ఠతిసతుబ్రహ్మన్బ్రహ్మనబ్రహ్మవిత్స్వయం॥ ౬౮.

టీ. హేబ్రహ్మన్-ఓబ్రాహ్మణా, యః-ఏపురుషుడు, దర్శనాదర్శనే=దర్శన-జ్ఞానమును, అదర్శనే-అజ్ఞానమును, అనగా నేనుబ్రహ్మమునెరుగుదు నెరుగననెడివ్యవహారద్వయమునసుట. హిత్వా-విడచి, స్వయం-తాను, కేవలరూపతః-అద్వితీయచైతన్యమాత్రరూపముగా, తిష్ఠతి-స్థితినిబొందుచున్నాడో, సతు-ఆపురుషుడే, బ్రహ్మ-పరబ్రహ్మమగును. స్వయం-తాను, బహ్మవిత్-బ్రహ్మవేత్త, న-కాడు.

తా. ఓబ్రాహ్మణా, ఏపురుషుడు, నేనుబ్రహ్మమునెరుగుదు నెరుగననెడి, వ్యవహారద్వయమును విడిపించి, తాను, అద్వితీయచైతన్యమాత్రరూపముగా నుండునో, ఆట్టిపురుషుడు, తానుపరబ్రహ్మమేయగుగాని, బ్రహ్మవేత్తగాడని, శ్రీవసిష్ఠమహామునిచే జెప్పబడెను.

అవ. ఇప్పుడు, సఫలముగా ద్వైతవివేచనము ముగింపుచున్నాడు.

శ్లో॥ జీవన్ముక్తేఃపరాకాష్ఠాజీవద్వైతవివర్జనాత్
లభ్యతేసావతోత్రేదమీశద్వైతాద్వివేచితం॥ ౬౯.

టీ. అసౌ - ఈచెప్పబడిన ప్రకారముగల, జీవన్ముక్తేః - జీవన్ముక్తియొక్క - పరా - నిరతిశయమైన, కష్ఠా - పర్యవసానస్థానము, జీవద్వైతవివర్జనాత్ = జీవద్వైత - మనోమయప్రపంచముయొక్క, వివర్జనాత్ - పరిత్యాగమువల్ల, లభ్యతే - పొందబడుచున్నది. అతః - ఆకారణమువల్ల, అత్ర - ఇక్కడ, ఇదం - ఈజీవద్వైతము, ఈశద్వైతాత్=ఈశ - ఈశ్వరునిచేసృష్టింపబడిన, ద్వైతాత్ - ప్రపంచముకంటె, వివేచితం - విభజింపబడెను. అనగా విభజించిచూపబడెననుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. జీవసృష్టియైన మానసప్రపంచమును, నిశ్శేషముగా విడుచుటచేత, జీవన్ముక్తిరూపమగు పరమపదము పొందబడుచున్నది. ఆకారణమువల్ల, ఈద్వైతవివేకప్రకరణమందు, జీవద్వైతమును, ఈశ్వరద్వైతమగు ఆకాశాదిప్రపంచముకంటె, భిన్నముగా విభజించిచూపితిమి.

* ఇతి. శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థ
విద్యారణ్యముని వర్యకృత ద్వైతవివేక స్సమాప్తః

గద్య. ఇది * శ్రీపరమేశ్వర గురుచరణ వరప్రసాదలబ్ధబ్రహ్మ విద్యావిరాజిత కాశ్యపసగోత్ర పవిత్ర మంత్రివంశపయః పారావార పరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్యపుత్ర బుధజనవిధేయ లక్ష్మీనారాయణామాత్య ప్రణీతంబైన టీకా తాత్పర్య సహిత శ్రీవేదాంత పంచదశియందు ద్వైతవివేకమనెడి చతుర్థప్రకరణము సంపూర్ణమాయెను.

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

---

శుభమస్తు.

శ్రీకృష్ణసద్గురుపరబ్రహ్మణేనమః.

## మహావాక్యవివేకప్రారంభము.

---

అవ. పరమకృపామూర్తియగు శ్రీవిద్యారణ్యగురుండు, ముముక్షువునకు మోక్షసాధనమైన బ్రహ్మాత్మైకత్వజ్ఞానసిద్ధికొరకు, ప్రసిద్ధములైన నాలుగుమహావాక్యములయొక్క అర్థమును క్రమముగా నిరూపింపదలచి, ఈమహావాక్యవివేకమనెడి ప్రకరణమును, ప్రారంభించుచు, అందు మొదట, ఋగ్వేదమందు ఐతరేయారణ్యక శ్రుతియందుగల, శ్రు॥ ప్రజ్ఞానంబ్రహ్మ॥ అనెడి మహావాక్యమందుండెడి, ప్రజ్ఞానశబ్దమునకు అర్థమును జెప్పుచున్నాడు.

ఓం. శ్లో॥ యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతిచ।
స్వాద్వస్వాదూవిజానాతి తత్ప్రజ్ఞానముదీరితం॥ ౧.

టీ. యేన - చక్షుర్ద్వారా వ్యాపించిన అంతఃకరణవృత్తితోగూడినట్టి ఏచైతన్యముచేత, ఇదం - చూచుటయోగ్యమైన ఈరూపాదికమును, ఈక్షతే - పురుషుడు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జూచుచున్నాడో, శృణోతి - శబ్దములను వినుచున్నాడో, జిఘ్రతి - గంధములను ఆఘ్రాణించుచున్నాడో, వ్యాకరోతి - శబ్దసమూహమును వ్యవహరించుచున్నాడో, స్వాద్వస్వాదూ = స్వాదు - తీపిని, అస్వాదూ - చేదును, అనగా రసములననుట. విజానాతి - ఎరుగుచున్నాడో, తత్ - ఆచైతన్యము, ప్రజ్ఞానం - ప్రజ్ఞానమని, ఉదీరితం - చెప్పబడుచున్నది. అనగా ప్రజ్ఞానశబ్దముచేత జెప్పబడుచున్నదనుట.

తా. నేత్రేంద్రియద్వారా బాహ్యమునకు వ్యాపించిన అంతఃకరణవృత్తితోగూడినట్టి, ఏచైతన్యముచేత బురుషుడు జూచుటకు యోగ్యమైనరూపాదికమును జూచుచున్నాడో, మరియు, శ్రోత్రేంద్రియద్వారా, బాహ్యప్రదేశమునకు వ్యాపించినట్టి అంతఃకరణవృత్తితోగూడిన ఏచైతన్యముచేత బురుషుడు శబ్దసమూహమును వినుచున్నాడో, మరియు, ఘ్రాణేంద్రియద్వారా, బాహ్యప్రదేశమునకు వ్యాపించినట్టి అంతఃకరణవృత్త్యుపాధితోగూడిన ఏచైతన్యముచేత గంధసమూహమును బురుషుడు ఆఘ్రాణించుచున్నాడో, మరియు, వాగింద్రియద్వారా బాహ్యమునకు వ్యాపించినట్టి అంతఃకరణవృత్త్యుపాధితోగూడిన ఏచైతన్యముచేత బురుషుడు సకలశబ్దములను ఉచ్చరించుచు వ్యవహరించుచున్నాడో, మరియు, జిహ్వేంద్రియద్వారా, బాహ్యప్రదేశమునకు వ్యాపించిన అంతఃకరణవృత్తితోగూడినట్టి ఏచైతన్యముచేత పురుషుడు, తీపి, చేదు, మొదలగురసములనెరుగుచున్నాడో, ఈప్రకారమే, సకలేంద్రియములతోటియు అంతఃకరణవృత్తి చేరుచుండగా, అట్టివృత్తిభేదములతోగూడిన ఏచైతన్యముచేత బురుషుడు సకలేంద్రియవిషయముల నెరుగుచున్నాడో, అట్టిచైతన్యమే, శ్రు॥ ప్రజ్ఞానంబ్రహ్మ, అనెడి మహావాక్యమందుగల ప్రజ్ఞానశబ్దముచేత జెప్పబడుచున్నది. ఇట్లు చెప్పుటచేత ఏచైతన్యముచేత జూచుచున్నాడో, అనిచెప్పెడి, శ్రు॥ యేనవాపశ్యతి॥ ఈవాక్యము మొదలుకొని, ఇవియన్నియు ప్రజ్ఞానముయొక్క నామధేయములేనని జెప్పెడి, శ్రు॥ సర్వాణ్యేవైతాని ప్రజ్ఞానస్య నామధేయాని॥ ఈవాక్యాంతమువరకుగల వాక్యసందర్భములయొక్క అర్థము సంక్షేపముగా జూపబడినట్లాయెను.

అవ. ఇట్లు ప్రజ్ఞానశబ్దార్థమును దెలిపి, ఇప్పుడు బ్రహ్మశబ్దార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ చతుర్ముఖేంద్రదేవేషు మనుష్యాశ్వగవాదిషు।
చైతన్యమేకంబ్రహ్మాతః ప్రజ్ఞానంబ్రహ్మమయ్యపి॥ ౨.

టీ. చతుర్ముఖేంద్రదేవేషు = చతుర్ముఖ - బ్రహ్మదేవునియందును, ఇంద్రదేవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

షు - దేవేంద్రాదిదేవతలయందును, మనుష్యాశ్వగవాదిషు = మనుష్య - మనుష్యుల యందును, అశ్వ - గుఱ్ఱములయందును, గవాదిషు - గోవుమొదలగు వానియందుగల, ఏకం - ఒక్కటియగు, చైతన్యం - చైతన్యము, బ్రహ్మ - బ్రహ్మమగును. అతః - ఆకారణమువల్ల, మయ్యపి - నాదేహమందునుగల, ప్రజ్ఞానం - ప్రజ్ఞానము, బ్రహ్మ- బ్రహ్మమగును.

తా. ఉత్తములగు దేవాదిశరీరములను ధరించినవారియందును, మధ్యములు లగు మనుష్యదేహములను ధరించినవారియందును, అధములగు, గోవు, గుఱ్ఱము మొదలగు ప్రాణులయందును, ఆకాశాదిభూతములయందును, జగజ్జన్మాది హేతుభూత మగు ఏఅద్వితీయ చైతన్యముగలదో, ఆచైతన్యము బ్రహ్మమగును. ఇట్లుచెప్పుటచేత ఈచైతన్యరూప పరమాత్మయే, బ్రహ్మదేవుడనియు, ఇంద్రుడనియుం జెప్పెడి, శ్రు॥ ఏషబ్రహ్మైషఇంద్రః॥ ఈవాక్యము మొదలుకొని, సర్వదేహములయందును, ఈచైతన్య రూపపరమాత్మ, ప్రజ్ఞానరూపముగా స్థితినిబొందియున్నాడని చెప్పెడి, శ్రు॥ ప్రజ్ఞా ప్రతిష్ఠా॥ ఈవాక్యాంతము వరకుగల వాక్యసందర్భముయొక్క, అర్థమును సంక్షేపిం చెప్పబడినట్లాయెను. ఇది బ్రహ్మశబ్దార్థమని తెలియవలెను. ప్ర అయితే, శ్రు॥ ప్ర జ్ఞానంబ్రహ్మ॥ అనెడి మహావాక్యమందుగల రెండుపదములకును అర్థమును దెలిపితిరి. ఈవాక్యార్థమేమి ?. ఉ. ఏకారణమువల్ల అంతటనుండెడి ప్రజ్ఞానము బ్రహ్మమగునో, ఆకారణమువల్ల, నాదేహమందుండెడి ప్రజ్ఞానంబును బ్రహ్మమేయగుననినిశ్చయించుట, వాక్యార్థమగును. అనగా, అంతటనుండెడి ప్రజ్ఞానమునకు ఏలక్షణముగలదో, అట్టి లక్షణము, నాదేహమందుండెడి ప్రజ్ఞానమునకును గలిగియుండుటచేత, ఈప్రజ్ఞానమే బ్రహ్మమగునని యభిప్రాయము.

అవ. ఇట్లు ఋగ్వేదమందుగల మహావాక్యార్థమును నిరూపించి, యజుర్వేదము లోని బృహదారణ్యకోపనిషత్తునందుగల, శ్రు॥ అహంబ్రహ్మాస్మి, అనెడి మహావాక్యా ర్థమును చెప్పదలచి ఆమహావాక్యమందుగల అహంశబ్దార్థమునిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ పరిపూర్ణఃపరాత్మాస్మిన్ దేహేవిద్యాధికారిణి।
బుద్ధేస్సాక్షితయాస్థిత్వాస్ఫురన్నహమితీర్యతే॥ 3.

టీ. పరిపూర్ణః - పరిచ్ఛిన్నత్వములేని పరమాత్మ, అస్మిన్ - ఈమాయాకల్పి తజగత్తునందు, విద్యాధికారిణి = విద్యా - జ్ఞానసంపాదనమునకు, అధికారిణి - యోగ్య మగు, దేహే - మనుష్యాదిశరీరమందు, బుద్ధేః - సూక్ష్మశరీరమునకు, సాక్షితయా-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సాక్షిభావముచేత, అనగా నిర్వికారముగాననుట స్థిత్వా - ఉండి, స్ఫురన్ - ప్రకాశించుచున్నవాడగుచు, అహమితి - నేనని, ఈర్యతే - చెప్పబడుచున్నాడు. అనగా, లక్షణావృత్తివల్ల, అహమనెడి పదముచే జెప్పబడుచున్నాడనుట.

తా. స్వాభావికముగా దేశకాలవస్తువులచేత పరిచ్ఛిన్నత్వములేని పరమాత్మ, మాయాకల్పితమగు ఈజగంబునందు, శమాదిసాధన సంపన్నత్వముచేత, జ్ఞానసంపాదనమునకు యోగ్యమైనట్టియు, వేదాంతశ్రవణాద్యనుష్ఠానవంతమగు, ఈమనుష్యాది శరీరమందు బుద్ధికి సాక్షిత్వముచేత నిర్వికారముగా ప్రకాశించుచుండి, లక్షణావృత్తివల్ల, అహమనెడి పదముచేత జెప్పబడుచున్నాడు. ఈలక్షణావృత్తిస్వరూపమును తృప్తిదీపమందుగల, డెబ్బదినాలుగవ శ్లోకతాత్పర్యమునుజూచి తెలిసికొనవలయును.

అవ. ఇప్పుడు, బ్రహ్మశబ్దార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ స్వతఃపూర్ణఃపరాత్మాత్రబ్రహ్మశబ్దేనవర్ణితః।
అస్మీత్యైక్యపరామర్శస్తేనబ్రహ్మభవామ్యహం॥ ౪.

టీ. స్వతః - స్వాభావికముగా, పూర్ణః - అపరిచ్ఛిన్నుడగు, పరాత్మ - పూర్వోక్తపరమాత్మ, అత్ర - ఈమహావాక్యమందు, బ్రహ్మశబ్దేన=బ్రహ్మ - బ్రహ్మమనెడి, శబ్దేన - పదముచేత, వర్ణితః - లక్షణావృత్తిచేత జెప్పబడుచున్నాడు. అస్మీతి - అస్మి యనెడిపదము, ఐక్యపరామర్శః=ఐక్య - ఏకత్వమును, పరామర్శః - తెలుపుచున్నదగును. తేన - అందుచేత, అహం - నేను, బ్రహ్మ - బ్రహ్మము, భవామి - అగుచున్నాను.

తా. స్వాభావికముగా దేశకాలవస్తువులచేత పరిచ్ఛిన్నత్వములేని పూర్వోక్త పరమాత్మ, శ్రు॥ అహంబ్రహ్మాస్మి, అనెడి, ఈమహావాక్యమందు బ్రహ్మమనెడిపదముచేత, లక్షణావృత్తివల్ల జెప్పబడుచున్నాడు. మరియు, ఈమహావాక్యమందుగల, (అస్మి) యనెడి, అనెడిపదముచేత, (అహం, బ్రహ్మ,) అనెడిరెండుపదములకును సామానాధికరణ్యముచేత లభింపదగిన, జీవబ్రహ్మైక్యమును బోధించుచున్నది. అందుచేత బ్రహ్మమగుచున్నానని తాత్పర్యము.

అవ ఇప్పుడు, సామవేదమందుగల ఛాందోగ్యశ్రుతియందు జెప్పెడి, శ్రు॥ తత్త్వమసి అనెడి మహావాక్యార్థమును ప్రకాశింపజేయుటకొరకు, అందు, (తత్) అనెడి పదముయొక్క లక్ష్యార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఏకమేవాద్వితీయంసన్నామరూపవివర్జితం।
సృష్టేఃపురాధునాప్యస్యతాదృక్త్వంతదితీర్యతే॥ ౫

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. సృష్టేః - సృష్టికి, పురా- పూర్వము, నామరూపవివర్జితం- నామరూప- నామరూపములచేత, వివర్జితం-విడువబడినట్టియు, అనగా నామరూపములు లేనిదనుట. అద్వితీయం - రెండవదిలేనట్టియు, ఏక మేవ - ఒక్కటేయగు, సత్ - సద్వస్తువు ప్రతిపాదింపబడియుండెనో. అస్య - ఈసద్వస్తువునకు, అధునాపి- ఇప్పుడును, అనగా సృష్ట్యుత్తరకాలమందనుట. తాదృక్త్వం - విచారదృష్టిచే నట్టిస్వభావము, తదితి - అదియనెడిపదముచేత, ఈర్యతే - లక్షణావృత్తివల్ల జెప్పబడుచున్నది.

తా. శ్రు॥ సదేవసోమ్యేదమగ్రఆసీత్, ఏకమేవాద్వితీయం॥ అనెడి శ్రుతిచేత సృష్టికిబూర్వమందు సజాతీయ విజాతీయ స్వగతభేదములులేని, నామరూపరహితమగు ఏసద్వస్తువు ప్రతిపాదింపబడియుండెనో, ఈసద్వస్తువునకు, ఇప్పుడనగా సృష్ట్యుత్తరకాలమందును విచారదృష్టిచేనట్టి స్వభావము, (తత్) అనెడి పదముచేత లక్షణావృత్తివల్ల బోధింపబడుచున్నది.

అవ. ఇప్పుడు, (త్వం) అనెడిపదమునకు లక్ష్యార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ శ్రోతుర్దేహేంద్రియాతీతంవస్త్వత్రత్వంపదేరితం।
ఏకతాగ్రాహ్యతేఽసీతితదైక్యమనుభూయతాం॥     ౬.

టీ. శ్రోతుః - ముముక్షువుయొక్క. దేహేంద్రియాతీతం - దేహేంద్రియ - స్థూలాదిశరీరత్రయముకంటె, అతీతం - విలక్షణమగు, వస్తు - సద్వస్తువు, అత్ర- ఈ మహావాక్యమందు, త్వంపదేరితం=త్వం - నీవనెడి, పద - శబ్దముచేత, ఈరితం - చెప్పబడుచున్నది. అసీతి - అసియనెడిపదముచేత, ఏకతా - ఐక్యము, గ్రాహ్యతే - గ్రహింపబడుచున్నది. తదైక్యం=తత్ - అతత్త్వం పదార్థములయొక్క, ఐక్యం - ఏకత్వము, అనుభూయతాం - ముముక్షువులచే ననుభవింపబడుగాక.

తా. వేదాంతశ్రవణ మననాద్యనుష్ఠానముచేత మహావాక్యార్థజ్ఞానవంతుడగు ముముక్షువుయొక్క, స్థూలసూక్ష్మకారణశరీరములకు సాక్షిత్వముచేత విలక్షణముగా వర్తించుచుండెడి సద్వస్తువే, ఈమహావాక్యమందుగల, (త్వం) అనెడి పదముచేత లక్షణావృత్తివల్ల జెప్పబడుచున్నది. మరియు, ఈమహావాక్యమందుగల, (అసి) అనెడిపదముచేత, (తత్త్వం) అనెడి రెండుపదములకుగల సామానాధికరణ్యమువల్ల పొందబడెడి, పదార్థద్వయైక్యము, శిష్యునిగురించి బోధింపబడుచున్నది. గనుక, అతత్త్వంపదార్థములగు జీవబ్రహ్మములయొక్క ఐక్యమును, ముముక్షువులు అనుభవింపవలయునని తాత్పర్యము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. అట్లు, శ్రు॥ తత్త్వమసి॥ అనెడి మహావాక్యార్థమును దెలిపి, ఇప్పుడు అథర్వణవేదమందుగల, శ్రు॥ అయమాత్మాబ్రహ్మ॥ అనెడి మహావాక్యార్థమును వ్యాఖ్యానింపదలచి, (అయమాత్మా) అనెడి రెండుపదములకును నిర్ణయింపబడిన అర్థమును క్రమముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ స్వప్రకాశాపరోక్షత్వమయమిత్యుక్తితో మతం।
అహంకారాదిదేహాంతాత్ప్రత్యగాత్మేతిగీయతే॥ ౬.

టీ. అయమితి - ఈయని, ఉక్తితః - చెప్పుటవల్ల, స్వప్రకాశాపరోక్షత్వం= స్వప్రకాశ - స్వయముగా ప్రకాశించుటచేత, అపరోక్షత్వం - ప్రత్యక్షత్వము, మతం- సమ్మతమగును. అహంకారాదిదేహాంతాత్ = అహంకార - అహంకారమే, ఆది- ఆదిగాగలిగినట్టియు, దేహ - స్థూలదేహమే, అంతాత్ - అంతముగాగల ప్రపంచము కంటె, ప్రత్యగాత్మేతి = ప్రత్యక్ - అధిష్ఠానత్వసాక్షిత్వముల చేతలోగానుండెడి, ఆత్మేతి - ఆత్మయని, గీయతే - చెప్పబడుచున్నది.

తా. (అయం = ఈ,) అనెడిపదముచేత, ఆత్మకు, స్వప్రకాశత్వముచేత అపరోక్షత్వము గలిగియున్నదనెడియర్థము సమ్మతమగును. అదృష్టములగు పుణ్యాదులకువలె, ఆత్మకునిత్యపరోక్షత్వములేదని దెలుపుటకును, ఘటాదిజడపదార్థములకువలె, ఆత్మకుదృశ్యత్వములేదని దెలుపుటకును, ఈశ్లోకమందు, స్వప్రకాశాపరోక్షత్వమనెడి విశేషణద్వయము, శ్రీవిద్యారణ్యగురునిచే జెప్పబడెనని తెలియవలెను. ప్ర. అయితే, ఆత్మశబ్దము దేహాదులయందును ప్రయోగింపబడుచున్నది. ఈమహావాక్యమందుగల ఆత్మశబ్దమునకు అర్థమేమి?. ఉ. ఇక్కడ ఆత్మయనగా ప్రత్యగాత్మయగును. అహంకార ప్రాణమనోఇంద్రియ దేహసంఘాత రూపప్రపంచములకంటెలోపట, ఆధారత్వసాక్షిత్వములచేత వర్తించుటవల్ల, ప్రత్యగాత్మయని చెప్పబడుచున్నాడు.

అవ. బ్రాహ్మణాదులయందును బ్రహ్మశబ్దమునకు బ్రయోగముగనబడుచుండుటవల్ల, ఆయర్థమును నివర్తింపజేయుటకొరకు, ఈమహావాక్యమందుగల బ్రహ్మశబ్దార్థము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ దృశ్యమానస్యసర్వస్యజగతస్తత్త్వమీర్యతే।
బ్రహ్మశబ్దేనతద్బ్రహ్మస్వప్రకాశాత్మరూపకం॥ ౭

టీ. దృశ్యమానస్య - కనబడుచుండెడి, సర్వస్య - సకలమగు, జగతః - జగంబునకు, తత్త్వం - అధిష్ఠానరూపము, బ్రహ్మశబ్దేన - బ్రహ్మశబ్దముచేత, ఈర్యతే -

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెప్పబడుచున్నది. తద్బ్రహ్మ - ఆబ్రహ్మము, స్వప్రకాశాత్మరూపకం=స్వప్రకాశ-స్వయంప్రకాశమానుడగు, ఆత్మ - ప్రత్యగాత్మయే, రూపకం - స్వరూపము గాగలది యగును. అనగా, ఆప్రత్యగాత్మయే బ్రహ్మమనుట.

తా. దృశ్యత్వముచేత మిథ్యారూపమగు ఆకాశాదిసర్వజగత్తునకు, ఆధారము గాను, ఆజగద్బాధకు అవధిత్వముగాను, పారమార్థికమగు సచ్చిదానందలక్షణముగల ఏరూపముగలదో, ఆరూపము, శు॥ అయమాత్మాబ్రహ్మ॥ అనెడి, ఈమహావాక్యమందుగల బ్రహ్మశబ్దముచేత జెప్పబడుచున్నది. ప్ర. అయితే, దీనికి వాక్యార్థమేమి?. ఉ. పైనచెప్పబడిన లక్షణముగల బ్రహ్మము స్వప్రకాశమానుడగు ప్రత్యగాత్మను, స్వరూపముగాగలదియగును. అనగా, ఈప్రత్యగాత్మయేబ్రహ్మమని యభిప్రాయము.

* ఇతి, శ్రీపంచదశ్యాంమహావాక్యార్థవివేకః. *

గద్య * ఇది, శ్రీపరమేశ్వరగురుచరణ వరప్రసాదలబ్ధ బ్రహ్మవిద్యా విరాజత కాశ్యపసగోత్ర పవిత్ర మంత్రివంశపయః పారావార పరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్యపుత్ర లక్ష్మీనారాయణామాత్యప్రణీతంబైన ఆంధ్రటీకాతాత్పర్యసహిత శ్రీవేదాంతపంచదశియందు మహావాక్యార్థ వివేకమనెడి పంచమప్రకరణము సంపూర్ణమాయెను.

వివేకపంచకము సంపూర్ణమాయెను.

సర్వంశ్రీకృష్ణార్పణమస్తు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీరస్తు.

## దీపికాపంచక విషయసూచిక.



### చిత్రదీపమందుగల విషయసూచిక.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లోక సంఖ్య.

౭౭ ప్రాభాకర తార్కికులమతము ను దెలుపుట.
౯౫ భాట్టులమతమును దెలుపుట.
౯౭ సాంఖ్యమతమును దెలుపుట.
౧౦౨ ఈశ్వరరూపస్థాపనము.
౧౦౫ ఆయీశ్వరవిషయమై భ్రాంతులైనవాదిమతములం దెలుపదలచి, పతంజలిమతమును దెలుపుట
౧౦౯ తార్కికులమతమును దెలుపుట.
౧౧౧ హైరణ్యగర్భమతమును దెలుపుట.
౧౧౩ విశ్వరూపచింతకుల మతమును దెలుపుట.
౧౧౫ ప్రాజాపత్యులమతమును దెలుపుట.
౧౧౬ భాగవతమతమును దెలుపుట.
౧౧౭ శైవులమతమును దెలుపుట.
౧౧౯ గాణపత్యమతమును దెలుపుట.
౧౨౩ సర్వమతములకు సమ్మతముగా నీశ్వరస్వరూపమును నిర్ణయించుట.
౧౨౫ మాయాస్వరూప తత్కార్యాదినిరూపణము జేయుట.
౧౫౩ ఆనందమయకోశ రూప ఈశ్వరస్వరూప నిర్ణయము జేయుట.
౧౫౭ ఆనందమయకోశమునకు ఈశ్వరత్వసర్వజ్ఞత్వాదిధర్మనిరూపణము జేయుట.
౧౬౪ ఆనందమయకోశరూపఈశ్వరునకుఅంతర్యామిత్వమందుఅంతర్యామి బ్రాహ్మణమును, గీతావాక్యమును బ్రమాణముగా నిరూపించుట.
౧౭౧ ఆనందమయకోశ రూప ఈశ్వరునకు జగదాద్యనిత్వ నిరూపణము.
౧౯౧ ఈశ్వర బ్రహ్మములకు అన్యోన్యాధ్యాసనిరూపణము.
౧౯౫ షడ్విధలింగనిరూపణము జేయుట.
౧౯౭ ఆనందమయకోశరూప ఈశ్వరునివలనజగదుత్పత్తి ప్రకారమును దెలుపుట.
౨౦౦ హిరణ్యగర్భస్వరూప నిరూపణ (ము
౨౦౪ విరాడ్స్వరూపనిరూపణము.
౨౦౯ పూజకులకు ఫలభేదము గలుగుటకుగారణమును దెలుపుట.
౨౧౦ జ్ఞానముచేత మోక్షప్రాప్తినిరూపణము.
౨౧౨ జీవేశ్వరాదిభేదము, మాయాకల్పితమనినిరూపించుట.
౨౧౬ భేదవాదిదూషణము.
౨౨౭ సాంఖ్యయోగ మతములకు వేదాంతవిరోధాంశ నిరూపణము జేయుచు సాంఖ్యయోగమతనిరాకరణము జేయుట.
౨౩౪ ఆత్మకు బంధమోక్షములు పరమార్థమందులేవనినిరూపించుట
౨౩౬ కూటస్థబ్రహ్మములకు ఏకత్వనిరూపణము.
౨౪౨ అద్వైతద్వైతములకు అనుభవముచేతసత్యాసత్యత్వ నిరూపణము జేయుట.
౨౫౪ అనుభవముచేత చిత్తునకునిత్యత్వనిరూపణము జేయుచు, ద్వైతమునకు మిథ్యాత్వనిరూపణము జేయుట.
౨౫౯ తత్త్వజ్ఞానఫలనిరూపణము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

---

## తృప్తిదీపనుండు గల విషయ సూచిక.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



కూటస్థదీపమందు గల విషయసూచిక.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

—*—

## ధ్యానదీపమందు గల విషయ సూచిక.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## నాటకదీపమందుగల విషయ సూచిక.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుభమస్తు.

శ్రీకృష్ణసద్గురుపరబ్రహ్మణేనమః.

ఆంధ్రటీకాతాత్పర్యసహిత

# శ్రీ వేదాంతపంచదశి.

## చిత్రదీపప్రారంభము.

అవతారిక. ఇప్పుడు, శ్రీవిద్యారణ్యమునీంద్రుడు తాను జేయుటకిచ్ఛయించిన గ్రంథమునకు నిర్విఘ్నముగా బరిసమాప్తిగలిగెడికొరకు (పరమాత్మని) అనెడిపదము చేత ఇష్టదేవతాస్వరూపానుసంధానలక్షణ మంగళము నాచరించుచు ఈగ్రంథము వేదాంతప్రకరణమగుటవల్ల ఆవేదాంతవిషయాదులచేతనే అనుబంధ చతుష్టయసిద్ధిని మనస్సునందుంచుకొని జగత్తుయొక్క అధ్యారోపాపవాదములచేత నిష్ప్రపంచరూపుడగుపరమాత్మ బోధింపబడుచున్నాడనిచెప్పెడి॥ శ్లో॥ అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచంప్రపంచ్యతే॥ అనెడి న్యాయమునను సరించి పరమాత్మయందు ఆరోపింపబడినజగత్తుయొక్క స్థితిప్రకారమును దృష్టాంతసహితముగా దెలుపుచున్నాడు.

ఓం. శ్లో॥ యథాచిత్రపటేదృష్టమవస్థానాంచతుష్టయం।
పరమాత్మనివిజ్ఞేయంతథావస్థాచతుష్టయం॥ ౧.

టీ. చిత్రపటే - చిత్రపస్త్రమందు, అవస్థానాం - అవస్థలయొక్క, చతుష్టయం - చతుస్సంఖ్య, యథా - ఏప్రకారము, దృష్టం - కనబడుచున్నదో, తథా - ఆప్రకారము, పరమాత్మని - పరమాత్మయందు, అవస్థాచతుష్టయం = అవస్థా - అవస్థలయొక్క, చతుష్టయం - చతుస్సంఖ్య, విజ్ఞేయం - తెలియదగినదగును.

తా. చిత్రపస్త్రమందు ఏప్రకారముగా నాలుగవస్థలు కనబడుచున్నవో ఆప్రకారమే పరమాత్మయందును నాలుగవస్థలుగలవని తెలియవలెను.

అవ. ఇప్పుడు ఆయవస్థాచతుష్టయమును దృష్టాంత దార్ష్టాంతికములను రెంటియందును గ్రమముగాజూపుచున్నాడు.

శ్లో॥ యథాధౌతోఘట్టితశ్చలాంఛితోరంజితఃపటః।
చిదంతర్యామిసూత్రాత్మావిరాడాత్మాతథేర్యతే॥ ౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. పటః - వస్త్రము, ధౌతః-ధౌతమనియు, ఘట్టితః-ఘట్టితమనియు, లాంఛితః - లాంఛితమనియు, రంజితశ్చ-రంజితమనియు, యథా- ఏప్రకారము జెప్పబడుచున్నదో, తథా-ఆప్రకారము, ఆత్మా-పరమాత్మ, చిత్-చిత్తుఅనియు, అంతర్యామి-అంతర్యామియనియు, సూత్రాత్మా-సూత్రాత్ముడనియు, విరాడ్ చ-విరాట్టుఅనియు, ఈర్యతే- చెప్పబడుచున్నాడు.

తా. ౧. ధౌతము, ౨. ఘట్టితము, ౩. లాంఛితము, ౪. రంజితము, అనెడిపేర్లుగల ఈనాలుగవస్థలును చిత్రవస్త్రమందెట్లు లభింపబడుచున్నవో ఆ ప్రకారమే పరమాత్మయందును, ౧. చిత్తు, ౨. అంతర్యామి, ౩, సూత్రాత్మ, ౪. విరాట్టు, అనెడి యీనాలుగవస్థలును తెలియదగినవగును.

అవ. ఇప్పుడు దృష్టాంతమందుగల అవస్థాస్వరూపములను క్రమముగా తెలుపుచున్నాడు.

శ్లో॥ స్వతశ్శుభ్రోఽత్ర ధౌతస్స్యాత్ ఘట్టితోన్యవిలేపనాత్ ।
మష్యాకారైర్లాంఛితస్స్యాద్రంజితోవర్ణపూరణాత్ ॥ ౩.

టీ. అత్ర-ఈదృష్టాంతమందు, స్వతః-స్వయముగా, అనగా, మరియొకపదార్థసంబంధములేకననుట, శుభ్రః - తెల్లనివస్త్రము, ధౌతః-ధౌతవస్త్రము, స్యాత్-అగును. అన్యవిలేపనాత్=అన్య - అన్యవస్తువును, విలేపనాత్-పూయుటవలన, ఘట్టితః-ఘట్టితవస్త్రమగును. మష్యాకారైః=మషీ - మషీమయములైన, ఆకారైః-ఆకారములచేత, లాంఛితః-లాంఛితవస్త్రము, స్యాత్-అగును. వర్ణపూరణాత్ = వర్ణ-యోగ్యవర్ణములను, పూరణాత్-నిండించుటవలన, రంజితః-రంజితవస్త్రమగును.

తా. ఈదృష్టాంతమందుగల నాలుగవస్థలలో మరియొకపదార్థసంబంధములేకనే (స్వతః) పరిశుభ్రమైనవస్త్రము, ౧. ధౌతమనిచెప్పబడును. గంజిమొదలగు మరియొకపదార్థముచేత బూయబడినవస్త్రము, ౨. ఘట్టితమనిచెప్పబడును. మషిమొదలగు ఆకారములతో గూడుకొనినవస్త్రము, ౩. లాంఛితమనిచెప్పబడును. మరియు యోగ్యతనతిక్రమించనట్లుగా వర్ణములచేతనిండింపబడిన వస్త్రము, ౪. రంజితమనిచెప్పబడును.

అవ. ఆనాలుగవస్థలను దార్ష్టాంతికమందిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ స్వతశ్చిదంతర్యామీతుమాయావీసూక్ష్మసృష్టితః।
సూత్రాత్మాస్థూలసృష్ట్యైవవిరాడిత్యుచ్యతేపరః॥ ౪.

టీ. పరః-పరమాత్మ, స్వతః-స్వయముగా, అనగా, మాయాతత్కార్యసం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బంధములేకయనుట. చిత్-చిత్తని చెప్పబడును. మాయావీ-మాయతోగూడిన పరమాత్మ, అంతర్యామీ-అంతర్యామియని చెప్పబడును. సూక్ష్మసృష్టితః-సూక్ష్మసృష్టివలన అనగా అపంచీకృత పంచభూతకార్య సమష్టి సూక్ష్మశరీరసంబంధము వల్లననుట. సూత్రాత్మ-హిరణ్యగర్భుడని చెప్పబడును. స్థూలసృష్ట్యైవ-స్థూలసృష్టిచేతనే, అనగా పంచీకృతపంచభూతకార్యసమష్టి స్థూలశరీరోపాధి సంబంధమువలననుట. విరాడితి-విరాట్టని, ఉచ్యతే-చెప్పబడుచున్నాడు.

తా. మాయా తత్కార్యసంబంధములేని పరమాత్మ, ౧. చిత్తు అనిచెప్పబడును. మరియు మాయతోగూడిన పరమాత్మ, ౨ అంతర్యామి అనిచెప్పబడును. మరియు, అపంచీకృత పంచభూతకార్యసమష్టి సూక్ష్మశరీరోపాధిగలపరమాత్మ, 3. సూత్రాత్మ అనిచెప్పబడును. మరియు, పంచీకృతపంచభూతకార్యసమష్టిస్థూలశరీరోపాధిసంబంధముగలపరమాత్మ, ౪. విరాట్టు అనిచెప్పబడును.

శ్లో॥ బ్రహ్మాద్యాస్స్తంబపర్యంతాః ప్రాణినోత్రజడాఅపి।
ఉత్తమాధమభావేనవర్తంతేపటచిత్రవత్॥ ౫.

టీ. అత్ర - ఈపరమాత్మయందు, బ్రహ్మాద్యాః=బ్రహ్మ - బ్రహ్మదేవుడే, ఆద్యాః - ఆదిగాగలిగినట్టియు, స్తంబపర్యంతాః= స్తంబ. గడ్డిపోచయే, పర్యంతాః - అంతముగాగల, ప్రాణినః - ప్రాణులును, జడాఅపి-పర్వతాదిజడవస్తువులును, ఉత్తమాధమభావేన- ఉత్తమాధమభావముచేత, పటచిత్రవత్=పట-వస్త్రముయొక్క, చిత్రవత్ - చిత్తరువువలె, వర్తంతే-వర్తించుచున్నవి.

తా. ప్ర. అయితే పరమాత్మను చిత్రవస్త్రమునుగాబోల్చినయెడల ఆపరమాత్మనాశ్రయించిన చిత్తరువెద్ది?. ఉ. ఈపరమాత్మయందు ఉత్తమాధమభావముచేతవర్తించుచుండెడి బ్రహ్మాది స్తంబపర్యంతముగల చేతనాచేతనజీవరాశియు, పర్వతనద్యాది జడపదార్థసమూహంబును, చిత్రవస్త్రమందుగల చిత్తరువువలె వర్తించుచున్నది.

అవ. ఇప్పుడు బ్రహ్మదేవాదిజగంబునకు చేతనభావముగలుగుటకు కారణమును జెప్పుటకొరకు దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ చిత్రార్పితమనుష్యాణాంవస్త్రాభాసాః పృథక్పృథక్।
చిత్రాధారేణవస్త్రేణసదృశాఇవకల్పితాః॥ ౬.

టీ. చిత్రాధారేణ=చిత్ర-చిత్తరువునకు, ఆధారేణ-ఆధారమగు, వస్త్రేణ - వస్త్రముతోటి, సదృశాఇవ-సమానములవంటి, వస్త్రాభాసాః - ఆభాసవస్త్రములు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిత్రార్పితమనుష్యాణాం=చిత్రే-చిత్రవస్త్రమందు, అర్పిత-సమర్పింపబడిన, అనగా లిఖింపబడినట్టియనుట. మనుష్యాణాం - మనుష్యులకు, పృథక్పృథక్ - వేరువేరుగా, కల్పితాః-కల్పింపబడుచున్నవి.

తా. మరియు చిత్తరువునకు ఆధారమగువస్త్రములో సమానములైనటువంటి నానావిధవర్ణములతో గూడినవస్త్రములు, చిత్రవస్త్రమందు లిఖింపబడిన మనుష్యాదిశరీరములకే కల్పించబడుచున్నవి. అట్లుకల్పింపబడిన వస్త్రములు శీతాదికమును నివారింపజేయమిచేత ఆభాసవస్త్రములని చెప్పబడును.

అవ. ఈదృష్టాంతస్థితార్థము నిప్పుడుదార్ష్టాంతికమందుజెప్పుచున్నాడు.

శ్లో॥ పృథక్పృథక్ చిదాభాసాశ్చైతన్యాధ్యస్తదేహినాం।
కల్ప్యంతేజీవనామానోబహుధాసంసరంత్యమీ॥ ౭.

టీ. చైతన్యాధ్యస్తదేహినాం=చైతన్య - పరమాత్మయందు, అధ్యస్త-ఆరోపింపబడిన, దేహినాం - దేవాదిప్రాణులకు, జీవనామానః = జీవ - జీవులనెడి, నామానః - పేర్లుగల, చిదాభాసాః - చిదాభాసులు, పృథక్పృథక్ - ప్రత్యేకప్రత్యేకముగా, కల్ప్యంతే - కల్పించబడుచున్నారు. అమీ - ఈజీవులు, బహుధా-అనేకవిధములుగా, సంసరంతి - సంసారమును బొందుచున్నారు.

తా. ఆప్రకారమే పరమాత్మయందు ఆరోపింపబడిన దేవమనుష్య పశుపక్ష్యాదిశరీరములకే జీవులనెడిపేర్లుగల చిదాభాసులు ప్రత్యేకముగా గల్పించబడుచున్నారుగాని పర్వతనద్యాదులకు కల్పించబడుటలేదు. ప్ర. అయితే ఆదేవమనుష్యాదిశరీరములకు ఆచిదాభాసులు కల్పించబడుటకు గారణమేమి?. ఉ. ఈజీవులు దేవమనుష్య పశ్వాదిశరీరప్రాప్తిచేత బహువిధములుగా సంసారమును పొందుచున్నారు. ఆకారణముచేత దేవమనుష్యాదిశరీరములకే జీవులనెడిపేర్లుగల చిదాభాసులు కల్పించబడిరని తెలియవలెను. కనుక ఈజీవులే సంసారమునుపొందుచున్నారనియు పరమాత్మ నిర్వికారుడగుటచేత ఆపరమాత్మ సంసారమునుపొందలేదనియు నభిప్రాయము. చిదాభాసుడనగా పరమాత్మయొక్క ప్రతిబింబమగును.

శ్లో॥ వస్త్రాభాసస్థితాన్వర్ణాన్యద్వదాధారవస్త్రగాన్।
వదంత్యజ్ఞాస్తథా జీవసంసారంచిద్గతంవిదుః॥ ౮.

టీ. అజ్ఞాః - మూఢజనులు, వస్త్రాభాసస్థితాన్=వస్త్రాభాస-ఆభాసవస్త్రమందు, స్థితాన్-ఉండెడి, వర్ణాన్, వర్ణములను, ఆధారవస్త్రగాన్=ఆధార-చిత్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రుపునకాధారమగు, వస్త్రి-వస్త్రిమును, గాక్-పొందినవానినిగా, యద్వత్-ఏప్రకారము, వదంతి-చెప్పుచున్నారో, తథా-ఆప్రకారము, జీవసంసారం=జీవ-జీవునియొక్క, సంసారం-సంసారమును, చిద్గతం=చిత్-పరమాత్మను, గతం-పొందినదానినిగా, విదుః-తెలియుచున్నారు.

తా. ప్ర అయితే సకలవాదులును, లౌకికులును, ఆత్మకే సంసారముగలిగియున్నదని చెప్పుటకు గారణమేమి?. ఉ. చిత్రవస్త్రమందు గల్పింపబడిన దేవమనుష్యాది శరీరములయందు లిఖింపబడినట్టి ఆభాసవస్త్రిమందుగల వర్ణములను చిత్తరువునకు ఆధారమగు వస్త్రిమును పొందినవానినిగా మూఢులు జెప్పుదురు. అటువలెనే సకలవాదులును లౌకికులును జీవునకుగల సంసారమును ఆత్మను పొందియున్నట్లు అజ్ఞానముచే జెప్పుదురు. కనుక అజ్ఞానమే కారణమగును.

అవ. పర్వతనద్యాదులకు చిదాభాసకల్పనా అభావమును దృష్టాంతపూర్వకముగా నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ చిత్రస్థపర్వతాదీనాంవస్త్రాభాసోనలిఖ్యతే,
సృష్టిస్థమృత్తికాదీనాంచిదాభాసస్తథానహి॥ ౯.

టీ. చిత్రస్థపర్వతాదీనాం=చిత్రస్థ-చిత్రమందుండెడి, పర్వతాదీనాం-పర్వతాదులకు, వస్త్రాభాసః-ఆభాసవస్త్రిము, నలిఖ్యతే-లిఖింపబడదు. తథా-ఆప్రకారము, సృష్టిస్థమృత్తికాదీనాం=సృష్టిస్థ-సృష్టియందుండెడి, మృత్తికాదీనాం-మన్ను మొదలగువానికి, చిదాభాసః-చిదాభాసుడు, నహి-కల్పింపబడదు.

తా. మరియు చిత్తరువునందు లిఖింపబడియుండెడి పర్వతనద్యాదులకు ప్రయోజనములేమిచేత ఆభాసవస్త్రిము లిఖింపబడదు. అటువలెనే సృష్టియందుగల పర్వతనదీశిలాదులకును ప్రయోజనములేమిచేత చిదాభాసుడుగల్పింపబడలేదని తెలియవలెను.

అవ. ఇట్లు ఆత్మయందారోపింపబడిన సంసారము జ్ఞానముచేనివర్తింపబడునని యెడియర్థము సిద్ధించెడికొరకు ఆసంసారమూలభూతమగు అవిద్యనిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ సంసారఃపరమార్థోయంసంలగ్నస్స్వాత్మవస్తుని।
ఇతిభ్రాంతిరవిద్యాస్యాద్విద్యయైషానివర్తతే॥ ౧౦.

టీ. అయం-ఈ, సంసారః-సంసారము, పరమార్థః వాస్తవమగుననియు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వాత్మవస్తుని=స్వాత్మ-స్వస్వరూపభూతమగు, వస్తుని-పరమాత్మవస్తువునందు, సంలగ్న ఇతి-చేరియున్నదనెడి, భ్రాంతిః-భ్రమ, అవిద్యా-అజ్ఞానము, స్యాత్ - అగును. ఏషా-ఈ అవిద్య,విద్యయా-జ్ఞానముచేత, నివర్తతే-నివృత్తిని బొందుచున్నది.

తా. ఈసంసారము వాస్తవమనియు తనస్వరూపభూతమగు ఆత్మవస్తువునందున్నదని చెప్పుటకుగారణమైనభ్రాంతియే అవిద్యయగును. ఈయవిద్య జ్ఞానముచేత నివర్తింపబడును.

శ్లో॥ ఆత్మాభాసస్యజీవస్యసంసారోనాత్మవస్తునః।
ఇతిబోధోభవేద్విద్యాలభ్యతేసౌవిచారణాత్॥ ౧౧.

టీ. ఆత్మాభాసస్య=ఆత్మ-ప్రత్యగాత్మయొక్క, ఆభాసస్య-ప్రతిబింబరూపుడగు, అనగాచిదాభాసుడనుట. జీవస్య-జీవునకు, సంసారః - సంసారసంబంధము గలదు. ఆత్మవస్తునః=ఆత్మ-ప్రత్యగాత్మయనెడి, వస్తునః-బ్రహ్మవస్తువునకు, న-సంసారసంబంధములేదు. ఇతి-ఈరూపమగు, బోధః-జ్ఞానము, విద్యా-విద్య, భవేత్ - అగును. అసౌ-ఈవిద్య, విచారణాత్ -విచారణవలన, లభ్యతే-పొందబడుచున్నది.

తా. ప్ర. అయితే ఈవిద్యయెద్ది. ఆవిద్య లభించుటకు ఉపాయమేమి ?. ఉ. ఆత్మయొక్క ప్రతిబింబరూపుడగు చిదాభాసుడనెడి జీవునకేసంసారముగలిగియున్నదనియు, ఆత్మవస్తువునకు సంసారములేదనెడి యీరూపమగుబోధయే విద్యయగును. ఈవిద్య విచారణయనెడి ఉపాయముచేత లభింపబడుచున్నది.

శ్లో॥ సదావిచారయేత్తస్మాజ్జగజ్జీవపరాత్మనః।
జీవభావజగద్భావబాధేస్వాత్మైవశిష్యతే॥ ౧౨.

టీ. తస్మాత్ -అందువలన, జగజ్జీవపరాత్మనః=జగత్ -ప్రపంచమును, జీవ-జీవునిని, పరాత్మనః-ప్రత్యగాత్మను, సదా-ఎల్లప్పుడును, విచారయేత్ -విచారించవలెను. జీవభావజగద్భావబాధే=జీవభావ-జీవరూపమునకును, జగద్భావ-ప్రపంచరూపమునకును, బాధేసతి-బాధగలుగుచుండగా, స్వాత్మైవ=స్వ-తనయొక్క, ఆత్మైవ-స్వరూపభూతపరమాత్మడే, శిష్యతే-శేషింపబడుచున్నాడు. అనగా శేషించుచున్నాడనుట.

తా. ప్ర. అయితే దేనివిచారణచేత విద్యలభింపబడును?. ఉ. సర్వదా జగజ్జీవపరమాత్మస్వరూపములను మూటిని విచారించుటవల్ల విద్య లభింపబడును. ప్ర. అయితే మోక్షావస్థయందు ఫలరూపముగా పరమాత్మ ఉండుటవలన, ఆపరమాత్మస్వరూపవిచారణ ఉపయోగించును. జీవజగంబులయొక్క విచారణయెచ్చట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుపయోగింపబడునో చెప్పుము ?. ఉ. విచారణవలనగలిగిన జ్ఞానముచేత ఆజీవజగద్రూపములు రెండును బాధింపబడుచుండగా తనస్వరూపమగు పరమాత్మయే మిగులుచున్నాడు. అనగా అజీవజగద్రూపములు రెండును వాస్తవముగాలేవనెడి జ్ఞానముద్వారా వానివిచారణ పరమాత్మను శేషింపజేయుటయందు నుపయోగింపబడుననియభిప్రాయము. అవ. ఇప్పుడు బాధశబ్దార్థమును జెప్పుచు పరపక్షమందు శిక్షను విధించుచున్నాడు.

శ్లో॥ నాప్రతీతిస్తయోర్బాధః కింతుమిథ్యాత్వనిశ్చయః।
నోచేత్సుషుప్తిమూర్ఛాదౌ ముచ్యేతాయత్నతోజనః॥ ౧౩.

టీ. తయోః-ఆజీవజగత్తులయొక్క, బాధః-బాధ, అప్రతీతిః-లోపమి, న-కాదు. కింతు-మరియేమనగా, మిథ్యాత్వనిశ్చయః-మిథ్యాభావనిశ్చయమగును. నోచేత్-అట్లుగానియెడల, జనః-జనము, అయత్నతః-ప్రయత్నములేకనే, అనగా జ్ఞానములేకనేయనుట. సుషుప్తిమూర్ఛాదౌ=సుషుప్తి-సుషుప్త్యవస్థయందును, మూర్ఛాదౌ-మూర్ఛాద్యవస్థయందును, ముచ్యేత-సంసారసంబంధమువల్ల విడువబడవలయును.

తా. ప్ర. అయితే విచారణచేత జీవజగద్భావబాధ గలుగుచుండగా స్వస్వరూపభూతపరమాత్మయే శేషింపబడుచున్నాడని చెప్పితిరి. విచారణచేత జీవజగంబులకు బాధగలుగుచుండగా ఆరెండును లోపమిచేత జ్ఞానికి లోకవ్యవహారలోపముగలుగదా యేమి ?. ఉ. ఆజీవజగద్రూపములయొక్క బాధయనగా ఆరెండును స్ఫురింపకపోవుటగాదు. మరియేమనగా ఆజీవజగద్రూపములు రెండును మిథ్యయనెడినిశ్చయమే బాధశబ్దార్థమగును. మరియు ఇక్కడ బాధశబ్దమునకు స్ఫురింపమియని అర్థముజేసినయెడల సుషుప్తిమూర్ఛాద్యవస్థలయందు జీవరూపజగద్రూపమగు ద్వైతము స్ఫురింపమిచేత తత్వజ్ఞానములేకనే జనులుముక్తిబొందవలయును. అట్లుజనులు సుషుప్తిమూర్ఛాద్యవస్థలయందు ముక్తినిపొందుటలేదు. కనుక జీవజగద్రూపబాధయనగా ద్వైతముమిథ్యయనెడి దృఢనిశ్చయమేయగుగాని స్ఫురింపకపోవుటగాదు. అందుచేత జ్ఞానికి వ్యవహారలోపములేదని తెలియవలెను.

శ్లో॥ పరమాత్మావశేషోపి తత్సత్యత్వవినిశ్చయః।
నజగద్విస్మృతిర్నోచేజ్జీవన్ముక్తిర్నసంభవేత్॥ ౧౪.

టీ. పరమాత్మావశేషోపి=పరమాత్మ-ప్రత్యగాత్మయొక్క, అవశేషోపి-మిగులుటయు, తత్సత్యత్వవినిశ్చయః=తత్-ఆపరమాత్మయొక్క, సత్యత్వవినిశ్చయః-సత్యత్వజ్ఞానమగును. జగద్విస్మృతిః=జగత్-ప్రపంచముయొక్క, విస్మృతిః-మరపు, న-కాదు. నోచేత్-అట్లుగానియెడల, జీవన్ముక్తిః-జీవన్ముక్తి, నసంభవేత్-సంభవింపదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మఱియు పరమాత్మ శేషించుచున్నాడని చెప్పుటచేత ఆపరమాత్మ సత్యమనెడిజ్ఞానమేయగుగాని జగత్తునుమరచియుండుటగాదు. ఇట్లు గానియెడల జీవన్ముక్తిసంభవింపదు జీవించియుండియే సంసారబంధమువలనవిడువబడుట జీవన్ముక్తియని చెప్పబడును.

అవ. ఇప్పుడువిచారణకు అవధిని జెప్పుచున్నాడు.

శ్లో॥ పరోక్షా చాపరోక్షేతి విద్యా ద్వేధా విచారజా।
తత్రాపరోక్షవిద్యాప్తౌ విచారోఽయం సమాప్యతే॥ ౧౫.

టీ. విచారజా=విచార-విచారణవలన, జా-పుట్టిన, విద్యా-జ్ఞానము, పరోక్షా-పరోక్షమనియు, అపరోక్షాచ-అపరోక్షమనియు, ఇతి-ఇట్లు, ద్వేధా-ద్వివిధమగును. తత్ర-ఆద్వివిధమందు, అపరోక్షవిద్యాప్తౌ=అపరోక్షవిద్యా-అపరోక్షజ్ఞానముయొక్క, ఆప్తౌ-పొందుటయందు, అనగా నపరోక్షజ్ఞానములభించుచుండగాననుట అయం-ఈ, విచారః- విచారణ, సమాప్యతే-సమాప్తిని బొందుచున్నది.

తా. ప్ర. అయితే, జగజ్జీవపరమాత్మలను సర్వదావిచారించవలెనని చెప్పుటచేత దేహముపడెడిపర్యంతము విచారించుచుండవలెనేమో చెప్పుము?. ఉ. విచారణవలనగలిగెడివిద్య, ౧. పరోక్షమనియు, ౨. అపరోక్షమనియు, ఇట్లుద్వివిధముగానున్నది. ఆరెంటిలో అపరోక్షవిద్య లభించుచుండగా ఈవిచారణ సమాప్తినిబొందుచున్నది. కనుక అపరోక్షజ్ఞానము గలిగెడిపర్యంతము జగజ్జీవపరమాత్మస్వరూపములను సర్వదావిచారించుచుండవలెనని యభిప్రాయము.

అవ. ఆద్వివిధవిద్యాస్వరూపములనిప్పుడు క్రమముగాజూపుచున్నాడు.

శ్లో॥ అస్తి బ్రహ్మేతి చేద్వేద పరోక్షజ్ఞానమేవ తత్।
అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారః స ఉచ్యతే॥ ౧౬.

టీ. బ్రహ్మ - బ్రహ్మము, అస్తీతి-కలదని, వేదచేత్ - సామాన్యాకారముగా నెరిగినయెడల, తత్-అది, పరోక్షజ్ఞానమేవ-పరోక్షజ్ఞానమేయగును. అహం-నేను, బ్రహ్మేతి - బ్రహ్మయని, వేదచేత్ - ఎరిగినయెడల, సః - అది, సాక్షాత్కారః - అపరోక్షజ్ఞానమని, ఉచ్యతే - చెప్పబడుచున్నది.

తా పరబ్రహ్మమొకటియున్నదని ఆచార్యద్వారా మహావాక్యార్థవిచారణవలన సామాన్యాకారముగా నెరిగినయెడల అదిపరోక్షజ్ఞానమని చెప్పబడును. పిమ్మట లెస్సగావిచారించి ఆబ్రహ్మమే నేనని ఇట్లు ప్రత్యక్షముగా నెరిగినయెడల అది యపరోక్షజ్ఞానమని చెప్పబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఆత్మసాక్షాత్కారమునకిట్టి అసాధారణకారణమగు ఆత్మస్వరూపవివేచనము నిప్పుడు ప్రతిజ్ఞాపూర్వకముగా దెలుపుచున్నాడు.

శ్లో॥ తత్సాక్షాత్కారసిద్ధ్యర్థమాత్మతత్త్వం వివిచ్యతే।
యేనాయం సర్వసంసారాత్సద్య ఏవ విముచ్యతే॥ ౧౭.

టీ. యేన-ఏబ్రహ్మసాక్షాత్కారముచేత, అయం-ఈపురుషుడు, సర్వసంసారాత్-సర్వసంసారమువలన, సద్యఏవ-అప్పుడే, విముచ్యతే-విడువబడుచున్నాడో. తత్సాక్షాత్కారసిద్ధ్యర్థం=తత్-ఆబ్రహ్మముయొక్క, సాక్షాత్కారసిద్ధ్యర్థం-సాక్షాత్కారసిద్ధికొరకు, ఆత్మతత్త్వం-ఆత్మస్వరూపము, వివిచ్యతే-విభజించిచూపబడుచున్నది.

తా. ఏబ్రహ్మసాక్షాత్కారముచేత ఈజీవుడు అప్పుడే సర్వసంసారబంధమువల్ల విముక్తుడగునో ఆబ్రహ్మసాక్షాత్కారసిద్ధికొరకు ఆత్మస్వరూపము ఈగ్రంథమందు విభజించి చూపబడుచున్నది.

అవ. చిదాత్మకు పారమార్థికమగు ఏకత్వమును నిశ్చయించుటకొరకువ్యవహారదశయందు తోచుచుండెడి చైతన్యభేదమునిప్పుడు దృష్టాంతసహితముగా దెలుపుచున్నాడు.

శ్లో॥ కూటస్థో బ్రహ్మజీవేశావిత్యేవం చిచ్చతుర్విధా।
ఘటాకాశమహాకాశౌ జలాకాశాభ్రఖే యథా॥ ౧౮.

టీ. ఘటాకాశమహాకాశౌ=ఘటాకాశ-ఘటాకాశంబును, మహాకాశౌ-మహాకాశంబును, జలాకాశాభ్రఖేయథా=జలాకాశ-జలాకాశంబును, అభ్రఖేయథా-మేఘాకాశమువలె, అనగా, ఘటాకాశమహాకాశ జలాకాశ మేఘాకాశములవలెననుట. చిత్-పరమాత్మచైతన్యము, కూటస్థః-కూటస్థుడనియు, బ్రహ్మ-బ్రహ్మమనియు, జీవేశావితి-జీవ, ఈశ్వరులనియు, ఏవం-ఈప్రకారము, చతుర్విధా-చతుర్విధములుగాదోచుచున్నది.

తా. ఒక్కటియగు ఆకాశము, ౧. ఘటాకాశమనియు, ౨. మహాకాశమనియు, ౩. జలాకాశమనియు, ౪. మేఘాకాశమనియు ఇట్లు, నాలుగువిధములుగా దోచినట్లు ఒక్కటియగు పరమాత్మచైతన్యంబును, ౧. కూటస్థుడనియు, ౨. బ్రహ్మమనియు, ౩. జీవుడనియు, ౪. ఈశ్వరుడనియు, ఇట్లునాలుగువిధములుగా వ్యవహారదశయందుదోచుచున్నది.

అవ. ఘటముచే నవచ్ఛిన్నమైన ఘటాకాశంబును, అట్లు అవచ్ఛిన్నముగాని మహాకాశంబును, ఈరెండును బ్రసిద్ధముగాదోచుటవలన, ఆరెంటినివిడిపించి అప్రసిద్ధమగుజలాకాశము నిప్పుడు దెలుపుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ ఘటావచ్ఛిన్నఖేనీరంయత్తత్రప్రతిబింబితః।
సాభ్రనక్షత్రఆకాశో జలాకాశఉదీర్యతే॥ ౧౯.

టీ. ఘటావచ్ఛిన్నఖే=ఘట-ఘటముతోటి, అవచ్ఛిన్న-కూడిన, ఖే-ఆకాశమందు, యత్-ఏ, నీరం-జలముగలదో, తత్ర-ఆజలమందు, ప్రతిబింబితః- ప్రతిబింబమునుబొందిన, అనగా ప్రతిబింబించినయనుట. సాభ్రనక్షత్రఆకాశః=సాభ్రనక్షత్ర-మేఘనక్షత్రసహితమగు, ఆకాశః-ఆకాశము, జలాకాశః జలాకాశమని, ఉదీర్యతే-చెప్పబడుచున్నది.

తా. ఘటముతోగూడియుండెడి ఆకాశమందు ఏజలముగలదో ఆజలమందు ప్రతిబింబించిన మేఘనక్షత్రసహితమగు ఆకాశము జలాకాశమని చెప్పబడును.

అవ. ఇప్పుడు మేఘాకాశమును దెలియజేయుచున్నాడు.

శ్లో॥ మహాకాశస్యమధ్యేయన్మేఘమండలమీక్ష్యతే।
ప్రతిబింబతయాతత్రమేఘాకాశో జలేస్థితః॥ ౨౦.

టీ. మహాకాశస్య-మహాకాశముయొక్క, మధ్యే-మధ్యమందు, యత్-ఏ, మేఘమండలం=మేఘ-మేఘములయొక్క, మండలం-గుంపు, ఈక్ష్యతే-కనబడుచున్నదో, తత్ర-ఆమేఘమండలమందుగల, జలే-జలమందు, ప్రతిబింబతయా-ప్రతిబింబరూపముగా, స్థితః-స్థితినిబొందినయాకాశము, మేఘాకాశః-మేఘాకాశమని చెప్పబడుచున్నది.

తా. మహాకాశముయొక్క మధ్యమందు ఏమేఘమండలము గనబడుచున్నదో ఆమేఘమండలమందుగల జలమందు ప్రతిబింబరూపముగానుండెడి యాకాశము మేఘాకాశమని చెప్పబడుచున్నది.

శ్లో॥ మేఘాంశరూపముదకంతుషారాకారసంస్థితం।
తత్రస్వప్రతిబింబోయంనీరత్వాదనుమీయతే॥ ౨౧.

టీ. మేఘాంశరూపం=మేఘ-మేఘమందు, అంశరూపం-సూక్ష్మావయవరూపముగల, ఉదకం-జలము, తుషారాకారసంస్థితం=తుషార-మంచునీటియొక్క, ఆకార-ఆకారమువంటి యాకారముచేత, సంస్థితం-స్థితినిబొందియున్నది. తత్ర-ఆమేఘమందుగల, నీరత్వాత్-నీటితనమువలన, అయం-ఈ, స్వప్రతిబింబః-ఆకాశప్రతిబింబము, అనుమీయతే-అనుమానింపబడుచున్నది. అనగానను మానప్రమాణముచే నెరుగబడుచున్నదనుట.

తా. ప్ర. అయితే మేఘమందుగల జలముకనబడకుండగా ఆజలమందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆకాశము ప్రతిబింబించెననెడి జ్ఞానమెట్లుకలుగును ?. ఉ. మేఘమందుండెడి జలము ప్రత్యక్షముగా గనబడకున్నను వర్షలక్షణకార్యముచేత ఆవర్షమునకు ఉపాదాన కారణమగు జలము ఆమేఘమందు మంచునీటివలె సూక్ష్మావయవరూపముగానున్న దని అనుమానప్రమాణముచేత నూహించియెరుగవలెను. మరియు అట్టిసూక్ష్మావయవరూపమగు మేఘజలమందు ఆకాశప్రతిబింబమునుండునని యూహింపబడును. కను క ఘటమునుబొందియుండెడిజలము ఆకాశప్రతిబింబమును గలిగియున్నట్లు జలస్వభావమువలన సకలజలంబును ఆకాశప్రతిబింబమును గలిగియుండుటపదగుచున్నదని యి ట్లుఅనుమానప్రమాణముచేతనూహించి మేఘమందుగలసూక్ష్మాకారజలమందును ఆ కాశ ప్రతిబింబముగలదని యూహించి తెలియవలెను.

అవ. ఇట్లు, దృష్టాంతమందుగల ఆకాశచతుష్టయమును దెలిపి దార్ష్టాంతికమందు మొదటజెప్పిన కూటస్థు నిప్పుడుతెలుపుచున్నాడు.

శ్లో॥ అధిష్ఠానతయా దేహద్వయావచ్ఛిన్నచేతనః।
కూటవన్నిర్వికారేణస్థితఃకూటస్థఉచ్యతే॥ ౨౨.

టీ. దేహద్వయావచ్ఛిన్నచేతనః=దేహద్వయ-స్థూలసూక్ష్మదేహములతోటి, అవచ్ఛిన్న-కూడియుండెడి, చేతనః-ఆత్మ, అధిష్ఠానతయా-ఆధారత్వముచేత, కూటవత్-డాగలివలె, నిర్వికారేణ-నిర్వికారముగా, స్థితిః-స్థితినిపొందియున్నాడు (అతః) అందువలన, కూటస్థః-కూటస్థుడని, ఉచ్యతే-చెప్పబడుచున్నాడు.

తా. అవిద్యచే గల్పించబడినట్టియు పంచీకృతఅపంచీకృతపంచభూతకార్యములైన స్థూలసూక్ష్మములనెడి రెండుదేహములతో గూడిన ఆత్మచైతన్యము ఆదేహద్వయమున కాధారత్వముచేతవర్తించుచు డాగలివలె నిర్వికారముగా నుండుటచేత కూటస్థుడనిచెప్పబడును. కూటమనగా డాగలియగును. బంగారు సొమ్ములుజేయుటకు ఆధారమగు ఇనుపముద్ద డాగలియనిచెప్పబడును. మరియుకూటమనగా ఓడకువేసెడిలంగరనియుందెలియవలెను. అట్టికూటమువలె నిర్వికారముగానుండెడిఆత్మచైతన్యము కూటస్థశబ్దముచేత చెప్పబడుననియభిప్రాయము.

అవ. ఇట్లు కూటస్థునిదెలిపి యాకూటస్థునియందు గల్పించబడినబుద్ధియందు ప్రతిబింబరూపముగా నాకూటస్థపక్షపాతిత్వముచే వర్తింపుచుండెడి జీవునినిప్పుడు దెలుపుచున్నాడు.

శ్లో॥ కూటస్థేకల్పితాబుద్ధిస్తత్రచిత్ప్రతిబింబకః।
ప్రాణానాంధారణాజ్జీవస్సంసారేణసయుజ్యతే॥ ౨౩.

టీ. కూటస్థే-కూటస్థాత్మయందు, బుద్ధిః-బుద్ధి, కల్పితా-కల్పించబడెను. తత్ర-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆబుద్ధియందుగల, చిత్ప్రతిబింబకః=చిత్-కూటస్థునియొక్క, ప్రతిబింబకః-ప్రతిబింబరూపముగలవాడు, అనగాచిదాభాసుడనుట. ప్రాణానాం-ప్రాణములను, ధారణాత్-ధరించుటవలన, జీవః-జీవుడగును. సః-ఆజీవుడు, సంసారేణ-సంసారముతోటి, యుజ్యతే-కూడికనుపొందుచున్నాడు.

తా. కూటస్థాత్మయందు బుద్ధికల్పించబడెను. ఆబుద్ధియందు కల్పించబడిన కూటస్థునియొక్క ప్రతిబింబరూపుడగు చిదాభాసుడే జీవుడగును. ప్ర. అయితేఆచిదాభాసునకు జీవుడనెడి పేరుగలుగుటకు నిమిత్తమేమి?. ఉ. ఆచిదాభాసుడు ప్రాణములనుధరించి యుంకుటవల్ల జీవుడనిచెప్పబడును. ప్ర. అయితే కూటస్థునికంటె అన్యుడగుజీవునికల్పించుట అప్రయోజకము కాదాయేమి?. ఉ. నిర్వికారుడగుకూటస్థునకు సంసారముసంభవింపమిచేత ఆసంసారమును నిర్వహించుటకొరకు అవశ్యముగా ఆజీవునంగీకరింపవలెను. కనుక, ఆజీవుడే సంసారముతోటి కూడియున్నాడని తెలియవలెను.

శ్లో॥ జలవ్యోమ్నాఘటాకాశో యథాసర్వస్తిరోహితః।
తథాజీవేనకూటస్థస్సోన్యోన్యాధ్యాసఉచ్యతే॥ ౨౮.

టీ. జలవ్యోమ్నా-జలాకాశముచేత, ఘటాకాశః-ఘటాకాశము, సర్వః-అంతయు, యథా-ఏప్రకారము, తిరోహితః-అంతర్ధానముజేయబడెనో, తథా-అప్రకారము, జీవేన-జీవునిచేత, కూటస్థః-ప్రత్యగాత్మ, (తిరోహితః) మరుగుపడియున్నాడు. సః-ఆతిరోధానము, అన్యోన్యాధ్యాసః-అన్యోన్యాధ్యాసమని, ఉచ్యతే-భాష్యాదులయందు జెప్పబడెను.

తా. ప్ర. అయితే జీవునికంటెఅన్యుడగు కూటస్థుడున్నయెడల తోచబడలేదేమి ?. ఉ. జలాకాశముచేత, ఘటాకాశమంతయు తిరోధానమునుబొందినట్లు జీవునిచేతకూటస్థుడు తిరోధానమునుబొందియుండుటచేత దోచలేదు. ప్ర, అయితే ఈతిరోధానము శాస్త్రమందెక్కడైనం జెప్పబడలేదాఏమి?. ఉ. ఈతిరోధానమే అన్యోన్యాధ్యాసశబ్దముచేత బ్రహ్మసూత్రభాష్యాదులయందు జెప్పబడియున్నది.

శ్లో॥ అయంజీవోనకూటస్థంవివినక్తికదాచన।
అనాదిరవివేకోయంమూలావిద్యేతిగమ్యతాం॥ ౨౯.

టీ. అయం-ఈ, జీవః చిదాభాసుడు, కదాచన-ఎప్పుడును, కూటస్థం-కూటస్థాత్మను, నవివినక్తి-భిన్నముగాఎరుగడు. అనాదిః-అనాదిగానుండెడి, అయం-ఈ, అవివేకః-అవివేకము, మూలావిద్యేతి-మూలాజ్ఞానమని, గమ్యతాం-పొందబడుగాక. అనగాఎరుగవలెననుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే ఇదియే అధ్యాసమైనయెడల దీనికి కారణరూపమగు అవిద్య ఎద్ది?. ఉ. ఈజీవుడు ఇదివరకెప్పుడైనను తనకంటెభిన్నముగా కూటస్థాత్మను యెరుగడు. ఈయెరుగమిరే అనాదిగానుండెడి అవివేకమగును. ఈయవివేకమునే సంసారకారణమగు అవిద్యనుగా నెరుగవలెను. అనగా జీవకూటస్థులకు సంసారదశయందు భేదప్రతీతిలేమిరే అవిద్య యనియభిప్రాయము.

అవ. పూర్వోక్తజీవుడు అవిద్యాకల్పితుడ నెడివిషయమును స్పష్టముజేయుటకొరకు అవిద్యనువిభజించుచు విక్షేపహేతువుగానుండెడి ఆవృతినియిప్పుడుజూపుచున్నాడు.

శ్లో॥ విక్షేపావృతిరూపాభ్యాంద్విధాఽవిద్యావ్యవస్థితా।
నభాతినాస్తికూటస్థఇత్యాపాదనమావృతిః॥ ౨౬.

టీ. అవిద్యా-అజ్ఞానము, విక్షేపావృతిరూపాభ్యాం=విక్షేప-విక్షేపరూపము చేతను, ఆవృతిరూపాభ్యాం-ఆవరణరూపము చేతను, ద్విధా-ద్వివిధముగా, వ్యవస్థితా-స్థితినిబొందెను. అనగావర్తించుచున్నదనుట.కూటస్థః కూటస్థుడు, నాస్తి-లేడు, నభాతీతి-ప్రకాశింపలేదనెడి, ఆపాదనం-వ్యవహారహేతువు, ఆవృతిః ఆవరణమగును.

తా. ౧. విక్షేపము, ౨. ఆవరణము అనెడి యీరెండురూపములుగాఅవిద్య ప్రవర్తించుచున్నది. ప్ర అయితే, అందు ఆవరణమెద్ది?. ఉ. కూటస్థుడులేడనియు బ్రకాశింపలేదనియు ఇట్లువ్యవహరించుటకు హేతువెద్దియో అదియేఆవరణమగును.

శ్లో॥ అజ్ఞానీవిదుషాపృష్టఃకూటస్థంనప్రబుధ్యతే।
నభాతినాస్తికూటస్థఇతిబుధ్వావదత్యపి॥ ౨౭.

టీ. అజ్ఞానీ-మూఢుడు, విదుషా-జ్ఞానిచేత, కూటస్థం-కూటస్థాత్మనుగురించి, పృష్టస్సన్-అడుగబడినవాడగచు, కూటస్థః-కూటస్థుడు, నప్రబుధ్యతే-నాచే నెరుగబడలేదు. నాస్తి-లేడు. నభాతి-ప్రకాశింపలేదు. ఇతి-ఈప్రకారము, బుధ్వాపి-తెలిసియు, అనగానజ్ఞానము ననుభవించియనుట, వదతి-చెప్పుచున్నాడు.

తా. ప్ర. అయితే అవిద్యయు ఆయవిద్యాకార్యమగు ఆవరణంబును ఈరెండు నుండుటయందు బ్రమాణమేమి?. ఉ. లోకానుభవమే ప్రమాణమగును. ప్ర. ఆలోకానుభవమేమి?. ఉ. నీవుకూటస్థు నెరుగుదువాఏమి. అనియిట్లు విద్వాంసుడు అజ్ఞానినడుగగా నేనుఆకూటస్థు నెరుగనని అజ్ఞానముననుభవించి ఆయజ్ఞానిచెప్పుచున్నాడు ఇదియే అవిద్యానుభవమగును. మరియు కూటస్థుడులేడనియు బ్రకాశింపలేదనియు ఇట్లుఅజ్ఞాని జెప్పుచున్నాడు. ఇదియే ఆవరణానుభవమగును, కనుక అవిద్యావరణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు లేందు నుండుటయందు ఈచెప్పబడిన అనుభవమే ప్రమాణమగునని తెలియవలెను.

శ్లో॥ స్వప్రకాశేకుతోఽవిద్యాతాంవినాకథమావృతిః।
ఇత్యాదితర్కజాలానిస్వానుభూతిర్గ్రసత్యసౌ॥ ౭౮.

టీ. స్వప్రకాశే-స్వయంప్రకాశరూపుడగు కూటస్థునియందు, అవిద్యా-అజ్ఞానము, కుతః-ఎక్కడిది. అనగానుండరాదనుట. తాంవినా-ఆయవిద్యనువిడచి, ఆవృతిః-ఆవరణము, కథం-ఎట్లుండును. అనగానుండదనుట. ఇత్యాదితర్కజాలాని=ఇత్యాది-ఇవిమొదలగు, తర్కజాలాని-తర్కసమూహములను, అసౌ-ఈ, స్వానుభూతిః=స్వ-తనయొక్క, అనుభూతిః-అవిద్యానుభవము, గ్రసతి-మ్రింగుచున్నది.

తా. ప్ర. అయితే అంధకారతేజస్సులకు రెంటికిని విరుద్ధస్వభావత్వముచేత ఆరెంటికిని సంబంధముగలుగనట్లు మీఅద్వైతమతమందు ఆత్మ స్వప్రకాశరూపుడగుటవలన అట్టిస్వప్రకాశవస్తువునందు అంధకారమువంటి అవిద్యయెట్లుండును?. అవిద్య లేనప్పుడు ఆయవిద్యాకార్యమగు ఆవరణమును నిరూపించుటకుశక్యమెట్లగును?. మరియు ఆవరణములేనప్పుడు దానికార్యమగువిక్షేపమెట్లుసంభవించును? అవిక్షేపము లేనప్పుడు జ్ఞానముచేనివర్తింపబడగిన సంసారదుఃఖములేమిచేత జ్ఞానమువ్యర్థమగుచుండగా అట్టిజ్ఞానమునుప్రతిపాదించెడి శాస్త్రము అప్రమాణముగాదాయేమి?. ఉ. ఇత్యాదితర్కములన్నియు ముందుజెప్పబడిన అవిద్యానుభవముచేతబాధింపబడుచున్నవి. వా॥ నహీదృష్టేఽనుపపన్నంనామ॥ అనెడి న్యాయప్రకారము అవిద్య అనుభవింపబడుచుండగా లేదనితర్కింపరాదు.

శ్లో॥ స్వానుభూతావవిశ్వాసేతర్కస్యాప్యనవస్థితేః।
కథంవాతార్కికస్తస్యతత్వనిశ్చయమాప్నుయాత్॥ ౭౯.

టీ. స్వానుభూతౌ=స్వ-తనయొక్క, అనుభూతౌ-అనుభవమందు, అవిశ్వాసేసతి-నమ్మికములేకపోవుచుండగా, తర్కస్యాపి-తర్కమునకును, అనవస్థితేః-అనవస్థాభావముగలుగుటవలన, తస్య-ఆవస్తువుయొక్క, తత్వనిశ్చయం-స్వరూపనిశ్చయమును, తార్కికః-తార్కికుడు, కథంవా-ఎట్లు, ఆప్నుయాత్-పొందును. అనగా బొందజాలడనుట.

తా. ప్ర. అయితే ఈచెప్పబడిన తర్కమునకు బూర్వోక్తఅవిద్యానుభవము విరోధమగుచు ఆభాసత్వమును బొందుటవలన అట్టిఅనుభవముచేతనైనను వస్తుస్వరూపనిశ్చయమెట్లుగలుగును?. ఉ. తనయనుభవమును దాను ప్రమాణముగా నమ్మనియెడల వస్తుస్వరూపనిశ్చయమునుగలిగించెడి తర్కమునకు మరియొకతర్కముచేతభా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధగలుగుచుండగా కేవలతార్కికునకు వస్తుస్వరూపనిశ్చయ మెప్పటికినిగలుగదు. అనగా సరియైన తర్కముచేతపొందబడిన వస్తుస్వరూపవిషయమై సంశయపూర్వకముగా దర్కింపరాదని యభిప్రాయము.

శ్లో॥ బుద్ధ్యారోహాయతర్క శ్చేదపేక్ష్యేతతథాసతి।
స్వానుభూత్యనుసారేణతర్క్యతాంమాకుతర్క్యతాం॥ ౩౦.

టీ. బుద్ధ్యారోహాయ=బుద్ధి - బుద్ధియందు, ఆరోహాయ - ఎక్కుటకొరకు, తర్కః-తర్కము, అపేక్ష్యేతచేత్ -అపేక్షింపబడెడియెడల, తథాసతి-అట్లుఅపేక్షింపబడుచు, స్వానుభూత్యనుసారేణ=స్వ - తనయొక్క, అనుభూతి - అనుభవమునకు, అనుసారేణ-అనుసరణముగా, అనగా ననుభవము ననుసరించియనుట. తర్క్యతాం-తర్కింపబడుగాక. అనగా తర్కింపవలెననుట. మాకుతర్క్యతాం-కుతర్కములు తర్కింపబడకుండుగాక. అనగా కుతర్కములను చేయరాదనుట.

తా. ప్ర. సరి. అనుభవము వస్తుస్వరూపనిశ్చయముగలదేయగును. అయినను అనుభవింపబడుచుండెడి పదార్థము చక్కగా బుద్ధిచేతసంభావింపబడెడిజ్ఞానము కొరకు తర్కమునపేక్షింపరాదాయేమి?. ఉ. అట్లైనయెడల అనుభవముననుసరించి ఆయనుభవమునకు అనుకూలముగా దర్కింపవలెనేగాని అనుభవమునకు విరోధముగా కుతర్కములను తర్కింపరాదు.

శ్లో॥ స్వానుభూతిరవిద్యాయామావృతౌచప్రదర్శితా।
అతఃకూటస్థచైతన్యమవిరోధీతితర్క్యతాం॥ ౩౧.

టీ. అవిద్యాయాం-అజ్ఞానమందును, ఆవృతౌచ-ఆవరణమందును, స్వానుభూతిః - స్వానుభవము, ప్రదర్శితా - చూపబడెను. అతః-ఆకారణమువలన, కూటస్థచైతన్యం - కూటస్థచైతన్యము, అవిరోధీతి - అవిద్యకువిరోధిగాదని, తర్క్యతాం - తర్కింపబడుగాక. అనగా దర్కింపవలెననుట.

తా. ప్ర. అయితే యీయనుభవ మెద్ది?. ఏయనుభవముననుసరించి తర్కింపవలెనో చెప్పుము?. ఉ. పూర్వము జ్ఞానిఅజ్ఞానులయొక్క ప్రశ్నోత్తరములయందు అవిద్యాఆవరణములయొక్క అనుభవముజూపబడెను. కనుక అవిద్యకు కూటస్థచైతన్యమువిరోధిగాదని తర్కింపవలెను.

శ్లో॥ తచ్చేద్విరోధికేనేయమావృతిర్హ్యనుభూయతాం।
వివేకస్తువిరోధిస్యాత్తత్త్వజ్ఞానినిదృశ్యతాం॥ ౩౨.

టీ. తత్ -ఆకూటస్థచైతన్యము, విరోధిచేత్ -అవిద్యకువిరోధియైనయెడల, కేన-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏ హేతువుచేత, ఇయం - ఈ, ఆవృతిః - ఆవరణము, అనుభూయతాంహి - అనుభవింప బడును. అనగా ననుభవింపబడదనుట. వివేకస్తు - వివేకమో, విరోధీః - అవిద్యకుశత్రువు, స్యాత్ - అగును. తత్వజ్ఞానిని - తత్వజ్ఞానియందు, దృశ్యతాం - చూడబడుగాక.

తా. ప్ర. అయితే ఆతర్క మెద్దియో చెప్పుము?. ఉ. ఆకూటస్థచైతన్యము అవిద్యకువిరోధియైనయెడల ఆకూటస్థునిఆశ్రయించుకొని అవిద్య ఉండమిచేత ఈయావరణము అనుభవింపబడుటకు హేతువులేదు. కనుక ఈయావరణము అజ్ఞానిచేనను భవింపబడుచుండుటవలన కూటస్థచైతన్యము అవిద్యకువిరోధి గాదని తర్కింపవలెను. ప్ర. అయితే అవిద్యకు విరోధియెద్ది?. ఉ. వేదాంతవాక్యార్థవిచారణవలనగలిగినజ్ఞానము అవిద్యకువిరోధియగును. ప్ర. అయితే అవిద్యకుజ్ఞానమువిరోధిగా నెచ్చటజూడబడెను?. ఉ. తత్వజ్ఞానియందు అవిద్యలేమిచేత ఆయవిద్యకు జ్ఞానమువిరోధియని తెలియబడుచున్నది.

అవ. ఇట్లు అవిద్యాఆవరణములనుజూపి యిప్పుడు విక్షేపాధ్యాసము జెప్పుచున్నారు.

శ్లో॥ అవిద్యావృతకూటస్థే దేహద్వయయుతా చితిః।
శుక్తౌరూప్యవదధ్యస్తా విక్షేపాధ్యాసఏవహి॥ ౩౩.

టీ. శుక్తౌ - ముత్త్యపుచిప్పయందు, రూప్యవత్ - ఆరోపింపబడిన వెండివలె, అవిద్యావృతకూటస్థే = అవిద్యావృత - అవిద్యావరణముగల, కూటస్థే - ప్రత్యగాత్మయందు, అధ్యస్తా - ఆరోపింపబడిన, దేహద్వయయుతా = దేహద్వయ - స్థూలసూక్ష్మదేహములతోటి, యుతా - సహితమైన, చితిరేవహి - చిదాభాసరూపమే, విక్షేపాధ్యాసః = విక్షేప - విక్షేపమనెడి, అధ్యాసః - అధ్యాసమగును.

తా. ముత్త్యపుచిప్పయందు భ్రాంతిచేతగల్పించబడిన వెండివలె పూర్వోక్తఅవిద్యావరణవంతుండగు కూటస్థునియందు స్థూలసూక్ష్మశరీరసహితుడగు చిదాభాసుడు గల్పించబడెను. ఈచిదాభాసుడే విక్షేపమనెడిపేరుగల అధ్యాసమగునని తెలియవలెను.

అవ. ఈవిక్షేపమునకు అధ్యాసభావము సిద్ధించెడికొరకు, శుక్తిరజతాధ్యాససామ్యము నిప్పుడుజెప్పుచున్నాడు.

శ్లో॥ ఇదమంశస్యసత్యత్వంశుక్తిగంరూప్యఇష్యతే।
స్వయంత్వంవస్తుతాచైవంవిక్షేపేవీక్ష్యతేన్యగం॥ ౩౪.

టీ. శుక్తిగం - ముత్యపుచిప్పనుబొందియుండెడి, అంశస్య - అంశముయొక్క, ఇదం - ఇదియనెడిశబ్దభావంబును, సత్యత్వం - సత్యత్వంబును, రూప్యే - వెండియందు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇష్యతే-ఇచ్ఛయింపబడుచున్నది. అనగాపొందబడుచున్నదనుట. ఏవం-ఈప్రకారము కూటస్థునియందుండెడి, స్వయంత్వం-తాననెడిశబ్దభావంబును, వస్తుతాచ-వస్తుస్వభావంబును, విక్షేపే-విక్షేపమందు, అన్యగం-చిదాభాసునిపొందియున్నట్లుగా, వీక్ష్యతే-కనబడుచున్నది.

తా. శుక్తికయందుండెడి ఇదియనెడిశబ్దభావంబును (అనగానెదుటిప్రదేశాదికములోటిసంబంధించియుండుట.) సత్యత్వంబును (అనగాబాధింపబడమి) ఈరెండును ఆరోపించబడినరజతమందు (ఇదిరజతమని) తోచుచున్నవి. ఈప్రకారమే కూటస్థునియందుగల స్వయంశబ్దభావంబును వస్తుభావంబును ఈరెండును ఆరోపించబడిన చిదాభాసునియందుదోచుచున్నవి.

అవ. ఇట్లు దృష్టాంతదార్ష్టాంతికములగు రెంటియందును సామాన్యాంశప్రతీతినిజూపి, యిప్పుడువిశేషాంశప్రతీతి సామ్యమునుజూపుచున్నాడు.

శ్లో॥ నీలపృష్ఠత్రికోణత్వంయథాశుక్తౌతిరోహితం।
అసంగానందతాద్యేవంకూటస్థేపితిరోహితం॥ ౩౫.

టీ. శుక్తౌ-శుక్తికయందుగల, నీలపృష్ఠత్రికోణత్వం=నీల-నలుపుతనంబును, పృష్ఠ-వెనుకప్రక్కయు, త్రికోణత్వం-త్రికోణరూపంబును, యథా-ఏప్రకారము, తిరోహితం-మరుగుపడెనో, ఏవం-ఈప్రకారము, కూటస్థేపి-కూటస్థునియందునుగల, అసంగానందతాది=అసంగ-నిస్సంగత్వంబును, ఆనందతా-ఆనందస్వభావంబును, ఆది-పరిపూర్ణత్వాదికంబును, తిరోహితం-మరుగుబడెను.

తా. మరియు శుక్తికయందుగల, ౧. నలుపుగుణంబును, ౨. వెనుకప్రక్కయు, ౩. త్రికోణాకారతయు ఈమూడును మరుగుబడినట్లు కూటస్థునియందుగల, ౧. అసంగత్వంబును, ౨. ఆనందస్వభావంబును, ౩. పరిపూర్ణత్వాదికంబును మరుగుబడియున్నవని తాత్పర్యము.

అవ. ఇప్పుడు దృష్టాంతదార్ష్టాంతికములయందు మరియొకసామ్యమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఆరోపితస్యదృష్టాంతేరూప్యంనామయథాతథా।
కూటస్థాధ్యస్తవిక్షేపనామాహమితినిశ్చయః॥ ౩౬.

టీ. దృష్టాంతే-దృష్టాంతమగుశుక్తికాస్థలయందు, ఆరోపితస్య-కల్పించబడినపదార్థమునకు, రూప్యం-వెండియనెడి, నామ-పేరు, యథా-ఏప్రకారముగలిగెనో, తథా-ఆప్రకారము దార్ష్టాంతికమందును, కూటస్థాధ్యస్తవిక్షేపనామ=కూటస్థ-


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రత్యగాత్మయందు, అధ్యస్త-కల్పించబడిన, విక్షేప-చిదాభాసరూపముయొక్క, నామ-పేరు-అహమితి-నేననెడి, నిశ్చయః-నిశ్చయముగలదాయెను.

తా. దృష్టాంతమగుశుక్తిస్థలమందు ఆరోపించబడిన పదార్థమునకు వెండియనెడిపేరుగలిగినట్లు కూటస్థాత్మయందు గల్పించబడిన చిదాభాసరూపవిక్షేపమునకు (అహం) నేననెడిపేరుగలిగెనని తెలియవలెను.

శ్లో॥ ఇదమంశం స్వతఃపశ్యన్ రూప్యమిత్యభిమన్యతే।
తథాస్వంచ స్వతఃపశ్యన్నహమిత్యభిమన్యతే॥ ౩౭.

టీ. ఇదం-శుక్తికయందుగల ఇదియనెడి, అంశం-అంశమును, స్వతఃపశ్యన్-(స్వతః) చూచుచు, రూప్యమితి-వెండియని, అభిమన్యతే-అభిమానమునుజేయుచున్నాడు. తథా-అప్రకారము, స్వంచ-తనను, స్వతఃపశ్యన్-(స్వతః) చూచుకొనుచు, అహమితి-నేనని, అభిమన్యతే-అభిమానమునుజేయుచున్నాడు.

తా. ప్ర. అయితే దృష్టాంతమందు ఎదుటవర్తింపుచుండెడి శుక్తికాఖండమందు ఇంద్రియసన్నికర్షణముగలుగుచుండగా ఆశుక్తికకంటె అన్యమగు ఇదివెండి యనెడియభిమానముగలుగుచున్నది. ఇట్లుదార్ష్టాంతికమందు ఆత్మకంటె అన్యమగువస్త్వభిమానము లేదేమి?. ఉ. దృష్టాంతమగుశుక్తిస్థలమందుగల ఇదియనెడి అంశమును (స్వతః) చూచుచు భ్రాంతిచేత ఇదివెండి యనియభిమానింపుచున్నాడు. ఈప్రకారమే దార్ష్టాంతికమందు తనను (స్వతః) చూచుకొనుచు నేననియభిమానింపుచున్నాడు. కనుక స్వప్రకాశత్వముచేత ప్రకాశింపుచుండెడి కూటస్థాత్మయందు ఆకూటస్థునికంటెఅన్యమగు (అహం) నేననెడియభిమానము గలిగియుండుటచేత దృష్టాంతదార్ష్టాంతికములకు విరోధములేదని యభిప్రాయము.

శ్లో॥ ఇదంత్వరూప్యతే భిన్నే స్వత్వాహంతే తథేష్యతాం।
సామాన్యంచ విశేషశ్చ హ్యుభయత్రాపిగమ్యతే॥ ౩౮.

టీ. ఇదంత్వరూప్యతే=ఇదంత్వ-ఇదియనెడి శబ్దార్థంబును, రూప్యతే-వెండియనెడిశబ్దార్థంబును, భిన్నే-భిన్నములగును. స్వత్వాహంతే=స్వత్వ-తానెనెడిశబ్దార్థంబును, అహంతే-నేననెడిశబ్దార్థంబును, తథా-అప్రకారము, అనగా భిన్నముగానను టు. ఇష్యతాం-ఇచ్ఛయింపబడుగాక. అనగా భిన్నములగుచున్నవనుట. ఉభయత్రాపి-రెంటియందును, సామాన్యంచ-సామాన్యరూపంబును, విశేషశ్చ-విశేషరూపంబును, గమ్యతే-పొందబడుచున్నది.

తా. ప్ర. అయితే (స్వయం, అహం) తాను నేను అనెడి రెండుశబ్దములకును ఏకార్థత్వముగలిగి యుండుటవలన-దృష్టాంతదార్ష్టాంతికములకు సామ్యమెట్లుగలుగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

షః?. ఉ. ౧. ఇది, ౨. వెండి అనెడిరెండుశబ్దార్థములును, ౧. (స్వయం=తాను) ౨. (అహం=నేను) అనెడిరెండుశబ్దార్థములును భిన్నములగును. మరియు, ఆరెంటియందును క్రమముగా, ౧. సామాన్యరూపము, ౨. విశేషరూపము సమానముగానుండుటవలన (స్వయమహం) అనెడిశబ్దములు రెండును ఏకార్థత్వమునుగలిగియున్నవని చెప్పరాదు. అందుచేతదృష్టాంత దార్ష్టాంతికములకువిరోధము లేదనియభిప్రాయము.

అవ. ఇప్పుడు స్వయంశబ్దార్థమునకు సామాన్యరూపత్వమును స్పష్టీకరించుటకొరకు లౌకికప్రయోగమును జూపుచున్నాడు.

శ్లో॥ దేవదత్తస్స్వయంగచ్ఛేత్త్వంవీక్షస్వస్వయంతథా।
అహంస్వయంనశక్నోమీత్యేవంలోకేప్రయుజ్యతే॥ ౩౯.

టీ. దేవదత్తః-దేవదత్తుడు, స్వయం-స్వయముగా, గచ్ఛేత్-వెళ్లును. త్వం-నీవు, స్వయం-స్వయముగా, వీక్షస్వ-చూచుకొనుము. అహం-నేను, స్వయం-స్వయముగా, నశక్నోమి-సమర్థుడనుగాను ఇత్యేవం-అనియీప్రకారము, లోకే-లోకమందు, ప్రయుజ్యతే-స్వయంశబ్దము ప్రయోగింపబడుచున్నది.

తా. దేవదత్తుడు స్వయముగావెళ్లుననియు నీవుస్వయముగాజూచుకొనుమనియు, నేనుస్వయముగా సమర్థుడనుగాననియు ఇట్లు స్వయంశబ్దము నీవు నేను వాడు వీడు మొదలగుశబ్దములయందంతటను సమానముగా లోకమందుబ్రయోగింపబడుటచేత ఆస్వయంశబ్దార్థమునకు సామాన్యరూపత్వముగలిగియున్నది.

శ్లో॥ ఇదంరూప్యమిదంవస్త్రమితియద్వదిదంతథా।
అసౌత్వమహమిత్యేషుస్వయమిత్యభిమన్యతే॥ ౪౦.

టీ. ఇదం-ఇది, రూప్యం-వెండియనియు, ఇదం-ఇది, వస్త్రమితి-వస్త్రమనియు, యద్వత్-ఏప్రకారముగా, ఇదం-ఇదియనెడిశబ్దము ప్రయోగింపబడుచున్నదో, తథా-ఆప్రకారము, అసౌ-వీడు, త్వం-నీవు, అహమితి-నేననెడి, ఏతేషు-ఈశబ్దములయందు, స్వయమితి-తాననెడిశబ్దము, అభిమన్యతే-అభిమానింపబడుచున్నది. అనగా బ్రయోగింపబడుచున్నదనుట.

తా. ప్ర. అయితే ఇట్లులోకమందుస్వయంశబ్దము బ్రయోగింపబడుగాక. ఇంతమాత్రముచేతస్వయంశబ్దార్థమునకు సామాన్యరూపత్వమెట్లుసిద్ధించును?. ఉ. వెండి, వస్త్రము మొదలగుపదార్థములయందు ఇదివెండియనియు ఇదివస్త్రమనియు ఇట్లు అంతటను ఇదంశబ్దముబ్రయోగింపబడుటవలన ఆఇదంశబ్దార్థమునకు సామాన్యరూపత్వమెట్లుగలిగెనో ఆప్రకారమే వీడు-నీవు-నేను-అనెడి యీశబ్దములయందు అంతటను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వయంశబ్దము ప్రయోగింపబడుటవల్ల ఆస్వయంశబ్దార్థమునకును సామాన్యరూపత్వము పొందబడుచున్నది.

శ్లో॥ అహంత్వాద్భిద్యతాంస్వత్వంకూటస్థే తేనకింతవ।
స్వయంశబ్దార్థఏవైషకూటస్థఇతి మేభవేత్॥ ౪౧.

టీ. అహంత్వాత్-నేననెడిశబ్దభావమువలన, స్వత్వం-తాననెడిశబ్దభావము, భిద్యతాం-భేదింపబడుగాక, తేన-ఆభేదముచేత, కూటస్థే-కూటస్థునియందు, తవ-నీకు, కిం-ప్రయోజనమేమి. (ఇతిచేత్) ఇట్లంటివేని, ఏషః-ఈ, స్వయంశబ్దార్థఏవ-స్వయంశబ్దార్థమే, కూటస్థఇతి-కూటస్థుడనెడిలాభము, మే-నాకు, భవేత్-కలుగును.

తా. ప్ర. సరి. (స్వయంఅహం) అనెడిరెండుశబ్దములకును లోకమందుభేదముండుగాక. ఈభేదముచేత కూటస్థునియందు నీకు లాభమేమి?. ఉ. ఈసామాన్యరూపమగు స్వయంశబ్దార్థమే. కూటస్థుడనెడి లాభమునాకు గలిగెను.

శ్లో॥ అన్యత్వవారకంస్వత్వమితిచేదన్యవారణం।
కూటస్థస్యాత్మతాంవక్తురిష్టమేవహితద్భవేత్॥ ౪౨.

టీ. స్వత్వం-స్వయంశబ్దభావరూపమగు ధర్మము, అన్యత్వవారకమితిచేత్=అన్యత్వ-అన్యత్వమును, వారకమితిచేత్-నివారింపజేయునదియగుననియంటివేని, కూటస్థస్య-కూటస్థునకు, ఆత్మతాం-ఆత్మత్వమును, వక్తుః-చెప్పెడినాకు, తత్-ఆ, అన్యవారణం=అన్య-అన్యత్వముయొక్క, వారణం-నివారణము, ఇష్టమేవ-సమ్మతమే, భవేత్-అగును.

తా. ప్ర. అయితే స్వయంశబ్దార్థరూపమగుధర్మము, అన్యశబ్దార్థమును నివారింపజేయునది యగునేగాని, కూటస్థభావమును బోధింపదుగదా?. ఉ. స్వయంశబ్దార్థమగు కూటస్థుడే ఆత్మయగుటవలన, ఆకూటస్థునకు ఆత్మత్వమును జెప్పెడినాకు స్వయంశబ్దభావరూపమగు ధర్మము, అన్యశబ్దార్థమును నివారింపజేయునదియగుట సమ్మతమేయగును.

శ్లో॥ స్వయమాత్మేతిపర్యాయౌ తేనలోకేతయోస్సహ।
ప్రయోగోనాస్త్యతస్స్వత్వమాత్మత్వంచాన్యవారకం॥ ౪౩.

టీ. స్వయం - తాననెడిశబ్దంబును, ఆత్మేతి - ఆత్మయనెడిశబ్దంబును, పర్యాయౌ - సమానార్థముగలవియగును. తేన - ఆకారణముచేత, లోకే - లోకమందు, తయోః - ఆరెండుశబ్దములకును, సహప్రయోగః - ఏకవాక్యమందు ప్రయోగము, నాస్తి - లేదు. అతః-అందువలన, స్వత్వం - స్వయంశబ్దభావంబును, ఆత్మత్వంచ-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆత్మశబ్దభావంబును, అన్యవారకం=అన్య - అన్యశబ్దార్థమును, వారకం - నివారింప జేయునది యగును.

తా. ప్ర. అయితే భిన్నముగాబ్రవర్తించుటకు నిమిత్తముగల గోవు, గుఱ్ఱము మొదలగుశబ్దములకు ఏకార్థత్వములేనట్లు స్వయం-ఆత్మ అనెడి రెండుశబ్దములకును ఏకార్థత్వము లేకపోవుచుండగా స్వయంశబ్దార్థమైన కూటస్థునకు ఆత్మత్వమెట్లు చెప్పవచ్చును?. ఉ. ౧ హస్తము, ౨. కరము, ౩. పాణి, అనెడి యీమూడు శబ్దములును ఒకచేతికే పేర్లైనట్లు ౧. స్వయం, ౨. ఆత్మ, అనెడిరెండుశబ్దములును ఒకసద్వస్తువుయొక్క పేర్లగును. కనుక (స్వయం-ఆత్మ) అనెడిరెండుశబ్దములును ఏకార్థముగలవగునని తెలియవలెను. ఈహేతువువలననే (స్వయం-ఆత్మ) అనెడి యీ రెండుశబ్దములును లోకమందు ఏకవాక్యమందెక్కడైనను బ్రయోగింపబడలేదు. ప్ర. సరి. ఇట్లుచెప్పుటచేత ఫలమేమి?. ఉ. స్వయంశబ్దార్థమే ఆత్మయగుటవలన స్వయంశబ్దార్థంబును ఆత్మశబ్దార్థంబును అన్యశబ్దార్థమును నివారింపజేయునదియగు నని తెలియవలెను.

శ్లో॥ ఘటస్స్వయంనజానాతీత్యేవంస్వత్వంఘటాదిషు।
అచేతనేషుదృష్టంచేద్దృశ్యతామాత్మసత్వతః॥ ౭౭.

టీ. ఘటః - కుండ, స్వయం - స్వయముగా, నజానాతి - ఎరుగదని, ఏవం- ఈప్రకారము, అచేతనేషు - చేతనములుగాని, ఘటాదిషు - ఘటాదులయందు, స్వత్వం-స్వయంశబ్దప్రయోగము, దృష్టంచేత్ - కనబడుచున్నదంటివేని, ఆత్మసత్వతః = ఆత్మ-ఆత్మచైతన్యముయొక్క, సత్వతః-ఉనికివల్ల, దృశ్యతాం-స్వయంశబ్ద ప్రయోగము కనబడుగాక.

తా. ప్ర. అయితే ఘటముస్వయముగా నెరుగదనెడి ఈలాటివ్యవహారమందు అచేతనములైన ఘటాదులయందును స్వయంశబ్దప్రయోగము కనబడుచుండగా, (స్వయం-ఆత్మ) అనెడి రెండుశబ్దములకును ఏకార్థత్వమెట్లు ఘటించును?. ఉ. ఆయచేతనములైన ఘటాదులయందును స్ఫురణరూపముగా ఆత్మచైతన్యముండుట వలన ఆఘటాదులయందు స్వయంశబ్దము బ్రయోగింపబడుటచేత విరోధములేదు.

శ్లో॥ చేతనాచేతనభిదాకూటస్థాత్మకృతానహి।
కింతుబుద్ధికృతాభాసకృతైవేత్యవగమ్యతాం॥ ౭౫.

టీ. చేతనాచేతనభిదా=చేతన - చేతనరూపమైనట్టియు, అచేతన - అచేతన రూపమైనట్టియు, భిదా - భేదము, కూటస్థాత్మకృతా=కూటస్థాత్మ - ప్రత్యగాత్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేత, కృతా - చేయబడినది, నహి - కానేకాదు. కింతు - మరియేమనగా, బుద్ధికృతాభాసకృతైవేతి=బుద్ధి - మనస్సుయందు, కృత - కల్పించబడిన, ఆభాస - చిదాభాసుని చేత, కృతైవేతి - చేయబడినదేనని, అవగమ్యతాం - పొందబడుగాక. అనగా గ్రహింపవలెననుట.

తా. ప్ర. అయితే ఘటాదులయందును ఆత్మచైతన్యమున్న యెడల మనుష్యాది జంతువులకు చేతనసంజ్ఞగలుగుట నిర్నిమిత్తకమేయగుగదా ?. ఉ. చిదాభాసుని గలిగియుండెడి భూతములు చేతనములనియు చిదాభాసునిగలిగియుండని పదార్థములు అచేతనములనియుం జెప్పబడును. కనుక బుద్ధియందుగల్పించబడిన చిదాభాసుని యొక్క ఉనికిలేములవలననే చేతనఅచేతనరూపమగు విభాగముగలిగెనేగాని కూటస్థాత్మ యొక్క ఉనికిలేములవలన చేతనఅచేతనరూపమగు విభాగముకలుగలేదని తెలియవలెను.

శ్లో॥ యథాచేతనఆభాసఃకూటస్థేభ్రాంతికల్పితః।
అచేతనోఘటాదిశ్చతథాతత్రైవకల్పితః॥ ౪౬.

టీ. చేతనః - చేతనుడైన, ఆభాసః - చిదాభాసుడు, కూటస్థే - ప్రత్యగాత్మయందు, యథా - ఏప్రకారము, భ్రాంతికల్పితః=భ్రాంతి - అవిద్యాభ్రాంతిచేత, కల్పితః - కల్పించబడెనో, తథా - ఆప్రకారము, అచేతనః - అచేతనరాశియగు, ఘటాదిశ్చ - ఘటాదికంబును, తత్రైవ - ఆకూటస్థునియందే, కల్పితః-కల్పించబడెను.

తా. ప్ర. అయితే చిదాభాసునియొక్క ఉనికిలేములవలన చేతనఅచేతనరూపవిభాగముగలిగెనని నిశ్చయించినయెడల అచేతనములగు ఘటాదులయందు ఆత్మయుండెనని చెప్పుట నిష్ప్రయోజనమేగదా ?. ఉ. చేతనుడైన చిదాభాసుడు అవిద్యచేత గూటస్థునియందు గల్పించబడినట్లు ఆయవిద్యచేత ఆకూటస్థునియందే అచేతనరాశియగు ఘటాదికంబును కల్పించబడెను. కనుక చేతనఅచేతనరూప విభాగహేతువుచేత కూటస్థుడు పొందబడకున్నను అచేతనరాశియగు ఘటాదికముయొక్క కల్పనకు ఆధారవస్తువుగా కూటస్థుడుగలడని పొందదగినవాడగును.

అవ. ౧. స్వయం, ౨. ఆత్మా, అనెడి యీరెండు శబ్దార్థములకును ఏకత్వమును జెప్పెడి విషయమై ఇప్పుడు పూర్వవాది అధికప్రసంగముగా నాక్షేపించుచున్నాడు.

శ్లో॥ తత్తేదంతేఅపిస్వత్వమివత్వమహమాదిషు।
సర్వత్రానుగతేతేనతయోరస్త్వాత్మతేతిచేత్॥ ౪౭.

టీ. త్వమహమాదిషు=త్వం - నీవు, అహం - నేను, ఆదిషు - ఇవిమొదలగు శబ్దములయందు, సర్వత్ర - అంతటను సామాన్యరూపముగా బ్రయోగింపబడెడి, స్వత్వమివ - స్వయంశబ్దభావమువలె, తత్తేదంతేఅపి=తత్తా - అదియనెడి శబ్దార్థం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బును, ఇదంతేఅపి - ఇదియ నెడిశబ్దార్థంబును, సర్వత్ర - నీవునేను మొదలగు శబ్దముల యందంతట బ్రయోగింపబడుటచేత, అనుగతే - సామాన్యరూపముగా ననువర్తించు చున్నవి. తేన - ఆ కారణముచేత, తయోరపి - ఆరెండుశబ్దార్థములకును, ఆత్మతేతిచేత్ - ఆత్మస్వరూపత్వముగలుగునని యంటివేని.

తా. ప్ర. ఓయద్వైతసిద్ధాంతీ నీవు నేను మొదలగుశబ్దముల యందంతటను (స్వయం) = తానను నెడిశబ్దము బ్రయోగింపబడుచుండుటచేత ఆస్వయంశబ్దార్థము నకు సామాన్యరూపత్వము గలిగియున్నదనియు అందుచేత ఆస్వయంశబ్దార్థమే ఆత్మ యగునని యుంజెప్పితిరి. అట్లైనయెడల (తత్) అది, (ఇదం) ఇది, అనెడియారెండు శబ్దములును ఆస్వయంశబ్దమువలెనే నీవు నేను మొదలగుశబ్దములయందంతటను అనీవ నియు ఈనేననియు ఇట్లుప్రయోగింపబడుచు స్వయంశబ్దార్థమువలెనే సామాన్యరూప త్వమును గలిగియున్నవి. ఆకారణముచేత స్వయంశబ్దార్థమునకువలెనే ౧. (తత్) అది, ౨. (ఇదం) ఇది, అనెడి యీరెండుశబ్దార్థములకును ఆత్మస్వరూపత్వము గలుగదాయేమి ?.

అవ. ౧. (తత్) అది, ౨. (ఇదం) ఇది, అనెడియారెండు శబ్దార్థములకును, ఆత్మత్వాధికవృత్తి గలిగియుండుటవలన ఆరెంటికిని ఆత్మత్వము సంభవింపదని యిప్పుడు సిద్ధాంతి చెప్పుచున్నాడు.

శ్లో॥ తేఆత్మత్వేప్యనుగతే తత్తేదంతేతతస్తయోః।
ఆత్మత్వంనైవసంభావ్యంసమ్యక్త్వాదేర్యథాతథా॥ ౪౫.

టీ. తే - ఆరెండైన, తత్తేదంతే=తత్తా - అదియ నెడిశబ్దార్థంబును, ఇదంతే- ఇదియనెడి శబ్దార్థంబును, ఆత్మత్వేపి - ఆత్మత్వమందును, అనగా ఆత్మజాతియం దనుట. అనుగతే - అనువర్తించుచున్నవి. తతః - ఆకారణమువలన, సమ్యక్త్వా దేః = సమ్యక్త్వ - (మంచిది) అనెడి శబ్దార్థమునకును, ఆదేః - (చెడ్డది) అనెడి శబ్దార్థమునకును, యథా - ఏ ప్రకారము, ఆత్మత్వం - ఆత్మస్వరూపము, నసంభావ్యం- భావింపదగినదికాదో, అనగా సంభవింపదోయనుట. తథా - ఆప్రకారము, తయోః- ఆ-అది ఇదియనెడి రెండుశబ్దార్థములకును, ఆత్మత్వం - ఆత్మస్వరూపము, నసంభావ్యం- భావింపదగినదిగాదు. అనగా సంభవింపదనుట.

తా. (౧. తత్, ౨. ఇదం) అది ఇదియనెడిశబ్దములురెండును (స్వయం) తానను నెడిశబ్దమువలె నీవు నేను మొదలగుశబ్దములయందు అనువర్తించుటయేగాక నీవు నేను మొదలగుశబ్దములయందు అనువర్తించెడి (ఆత్మత్వమందును) = ఆత్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాలియందును అనువర్తించుటచేత ఆయాతత్త్వమనియు ఈయాతత్త్వమనియు ఇత్యాదివ్యవహారములు సంభవించుటవలన ఆ (అది ఇది) యనెడి రెండుశబ్దార్థములకును అతత్త్వాధికవృత్తిగలిగియుండుటచేత ఆరెంటికిని అతత్స్వరూపత్వము భావింపబడదు. కనుక అతత్త్వము సమ్యగాతత్త్వమనియు అసమ్యగాతత్త్వమనెడి వ్యవహారవశమువలన (అతత్త్వమందును) = అతత్జాతియందు ననువర్తించెడి (సమ్యక్త్వ అసమ్యక్త్వశబ్దార్థములకు) = మంచిది చెడ్డది యనెడి రెండుశబ్దార్థములకు అతత్స్వరూపత్వము సంభవింపనట్లు (తత్ ఇదం) అది ఇదియనెడి రెండుశబ్దార్థములకును అతత్స్వరూపత్వము సంభవింపదని తెలియవలెను.

అవ. ఇట్లు ప్రాసంగికమునుముగించి, ఫలితమునుజూపుటకొరకు, లోకవ్యవహారముచే సిద్ధించెడియర్థము నిప్పుడుచెప్పుచున్నాడు.

శ్లో॥ తత్తేదం తేస్వతాన్యత్వే త్వంతాహం తేపరస్పరం।
ప్రతిద్వంద్వితయాలోకేప్రసిద్ధేనాస్తిసంశయః॥ ౪౯.

టీ. తత్తేదం తే-అది ఇదియ నెడి శబ్దభావములు రెండును, స్వతాన్యత్వే-తానన్యమనెడి శబ్దభావములు రెండును, త్వంతాహంతే - నీవు నేనను నెడి శబ్దభావములు రెండును, పరస్పరం - ఒకటికొకటి, ప్రతిద్వంద్వితయా - విరోధిత్వము చేత, లోకే - లోకమందు, ప్రసిద్ధే - ప్రసిద్ధము గానున్నవి. సంశయః - సందేహము, నాస్తి - లేదు.

తా. (తదిదం) అది ఇదియనిలోకమందు బ్రయోగింపబడుటవలన అదియనెడిశబ్దార్థము ఇదియనెడిశబ్దార్థమునకు విరోధియగును. మరియు (స్వయమన్యః) తానన్యుడనిలోకమందు బ్రయోగింపబడుటవలన (స్వయం) తాననెడిశబ్దార్థము అన్యశబ్దార్థమునకు విరోధియగును. మరియు (త్వమహం) నీవునేననిలోకమందు బ్రయోగింపబడుటవలన నీవనెడిశబ్దార్థము నేననెడిశబ్దార్థమునకు విరోధియగును. ఈప్రకారములోకమందు పైనచెప్పబడినశబ్దార్థములకు పరస్పరవిరోధస్వభావములుగా బ్రయోగములు కనబడుచుండుటవలన పూర్వోక్తశబ్దార్థములకువిరోధము ప్రసిద్ధముగాగలిగియున్నదని తెలియవలెను.

శ్లో॥ అన్యతాయాఃప్రతిద్వంద్వీస్వయంకూటస్థఇష్యతాం।
త్వంతాయాఃప్రతియోగ్యేషోహమిత్యాత్మనికల్పితః॥ ౫౦.

టీ. స్వయం-తాననెడిశబ్దార్థమగు, కూటస్థః-ప్రత్యగాత్మ, అన్యతాయాః-అన్యశబ్దభావమునకు, ప్రతిద్వంద్వీ-విరోధియని-ఇష్యతాం-ఇచ్ఛయింపబడుగాక. అనగా-నెరుగవలెననుట. త్వంతాయాః-నీవనెడిశబ్దభావమునకు, ప్రతియోగీ-విరోధియగు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏషః-ఈ, అహమితి-నేననెడిచిదాభాసుడు, అత్రని-కూటస్థునియందు, కల్పితః-కల్పించబడెను.

తా. ప్ర సరి. ఈచెప్పబడినశబ్దార్థములకు లోకమందువిరోధిత్వముగలిగియుండుగాక. అందుచేత ప్రకృతమందులాభమేమి?. ఉ. అన్యశబ్దార్థమునకు స్వయంశబ్దార్థమగుకూటస్థుడు విరోధియగును. మరియు నీవనెడిశబ్దార్థమునకు విరోధియగు (అహం) నేననెడి యాచిదాభాసుడు కూటస్థునియందు గల్పించబడెనని తెలియవలెను.

శ్లో॥ అహంతాస్వత్వయోర్భేదేరూప్యతేదంతయోరివ।
స్పష్టేపిమోహమాపన్నాఏకత్వంప్రతిపేదిరే॥ ౫౧.

టీ. రూప్యతేదంతయోరివ=రూప్యతా-వెండియనెడి శబ్దభావమునకు, ఇదంతయోరివ-ఇదియనెడిశబ్దభావమునకువలె, అహంతాస్వత్వయోః=అహంతా-నేననెడిశబ్దభావమునకును, స్వత్వయోః-తాననెడిశబ్దభావమునకును, భేదే-భేదము, స్పష్టేసత్యపి-స్పష్టముగానున్నను, మోహం-భ్రాంతిని, ఆపన్నాస్సంతః-పొందినవారగుచు, ఏకత్వం-జీవకూటస్థులకభేదమును, ప్రతిపేదిరే-పొందిరి.

తా. ప్ర. అయితే ఈపూర్వోక్తప్రకారము జీవకూటస్థులకు భేదముగలిగియుండగా ఇట్లందరునెరుగలేదేమి?. ఉ. పూర్వోక్తశుక్తిరజత దృష్టాంతమందు, ౧. ఇది, ౨. వెండి, అనెడి రెండుశబ్దార్థములకును భేదముగలిగియున్నట్లు కూటస్థజీవులకును భేదముగలిగియున్నది. అట్టిభేదము ఈపూర్వోక్తప్రకారము స్పష్టముగాదోచుచున్నను అందరును భ్రాంతిగలవారై ఆజీవకూటస్థులకు ఏకత్వమునుబొందిరి. అనగా బుద్ధికిసాక్షియగుకూటస్థుని బుద్ధిచేత ప్రత్యక్షముజేసికొనుట అశక్యమగుటవలన (అహం) నేననిప్రకాశించుచుండెడి జీవకూటస్థులకుభ్రాంతిచే నందరునేకత్వమును బొందిరని యభిప్రాయము.

శ్లో॥ తాదాత్మ్యాధ్యాసఏవాత్రపూర్వోక్తావిద్యయాకృతః।
అవిద్యాయాంనివృత్తాయాంతత్కార్యంవినివర్తతే॥ ౫౨.

టీ. అత్ర-ఈచిత్రదీపమందు, పూర్వోక్తావిద్యయా=పూర్వోక్త-ముందుజెప్పబడిన, అవిద్యయా-అజ్ఞానముచేత, కృతః-చేయబడిన, అనగాగల్పించబడినట్టియనుట. తాదాత్మ్యాధ్యాసఏవ-అన్యోన్యాధ్యాసమేభ్రాంతికి కారణమగును. అవిద్యాయాం-అజ్ఞానము, నివృత్తాయాంసత్యాం-నివర్తింపబడుచుండగా, తత్కార్యం=తత్-ఆయవిద్యయొక్క, కార్యం-అన్యోన్యాధ్యాసము, వినివర్తతే-నివృత్తినిబొందుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే జీవకూటస్థులయొక్క ఈయేకత్వభ్రాంతికి గారణ మేమి?. ఉ. ఈచిత్రదీపమందు ఇరువదిరెండవశ్లోకమందు జెప్పబడిన అవిద్యచేతకల్పించబడి నట్టి అన్యోన్యాధ్యాసమే ఈభ్రాంతికి గారణమగును. మరియు ఏహేతువుచేత అన్యోన్యాధ్యాసము అవిద్యయొక్క కార్యమగునో ఆహేతువుచేత అవిద్యనివర్తింపజేసెడి జ్ఞానమువలననే అన్యోన్యాధ్యాసము నివర్తించునని తెలియవలెను.

శ్లో॥ అవిద్యావృతితాదాత్మ్యే విద్యయైవవినశ్యతః।
విక్షేపస్యస్వరూపంతుప్రారబ్ధక్షయమీక్షతే॥ ౨౩.

టీ. అవిద్యావృతితాదాత్మ్యే=అవిద్యా-అవిద్యయొక్క కార్యములగు, ఆవృతి-ఆవరణంబును, తాదాత్మ్య-అధ్యాసంబును, విద్యయైవ-జ్ఞానముచేతనే, వినశ్యతః-నాశమునుపొందుచున్నవి. విక్షేపస్య-ప్రారబ్ధకర్మసహితవిక్షేపముయొక్క, స్వరూపంతు-స్వరూపమో, ప్రారబ్ధక్షయం=ప్రారబ్ధ-ప్రారబ్ధకర్మముయొక్క, క్షయం-నాశమును, ఈక్షతే-చూచుచున్నది. అనగా ప్రారబ్ధకర్మముక్షయించెడి పర్యంతముం డుననుట.

తా. ప్ర. అయితే బ్రహ్మాత్మైకత్వజ్ఞానోదయమైనను అవిద్యాకార్యమగు దేహాదికముండుటచేత అవిద్యనివర్తించుచుండగా దానికార్యమగు అన్యోన్యాధ్యాసము నివర్తించునని యెట్లుచెప్పవచ్చును?. ఉ. అవిద్యయే ముఖ్యకారణముగాగల, ౧. ఆవృతియు, ౨. అన్యోన్యాధ్యాసంబును, ఈరెండును జ్ఞానముచేతనశించుచున్నవి. ప్రారబ్ధకర్మముతోగూడి అవిద్యవలనబుట్టినవిక్షేపస్వరూపము ప్రారబ్ధకర్మముక్షయించెడి పర్యంతముండును. కనుక ఇట్లుచెప్పుటచేత విరోధమేమియులేదు. స్థూలసూక్ష్మశరీరములతోగూడిన చిదాభాసుడువిక్షేపమనియు స్థూలసూక్ష్మదేహములు రెండును విక్షేపస్వరూపమనియుం దెలియవలెను.

అవ. ఇప్పుడు ఇతరశాస్త్రసిద్ధదృష్టాంతముచేత, గార్యానువృత్తినిజెప్పుచున్నాడు.

శ్లో॥ ఉపాదానేవినష్టేపిక్షణంకార్యంప్రతీక్ష్యతే।
ఇత్యాహుస్తార్కికాస్తద్వదస్మాకంకింనసంభవేత్॥ ౨౪.

టీ. తార్కికాః-తార్కికులు, ఉపాదానే-ఉపాదానకారణము, వినష్టేపి-నాశమునుబొందినను, కార్యం-కార్యము, క్షణం-క్షణకాలము, ప్రతీక్ష్యతేఇతి-కనబడుచున్నదని, ఆహుః-చెప్పుదురు. తద్వత్-అప్రకారము, అస్మాకం-మాకు, నసంభవేత్కిం-సంభవింపదాయేమి. అనగానాప్రకారమేమాకునగుననుట.

తా. ప్ర. అయితే ప్రారబ్ధకర్మము నిమిత్తమాత్రమైయుండగా అట్టిప్రారబ్ధ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కర్తృస్థితి మాత్రముచేతనే ఉపాదానకారణము నశించినపిమ్మట దానికార్యమెట్లుండునని? ఉ. ఉపాదానకారణము నశించినను దానికార్యముక్షణకాలపర్యంతముండునని తర్కశాస్త్రజ్ఞులుజెప్పుదురు. ఆప్రకారమే మావేదాంతసిద్ధాంతమందును కారణమగుఅవిద్య నశించినపిమ్మట దానికార్యమగు విక్షేపస్వరూపమగుదేహాదికము కొంతకాలమువరకునుండుట విరుద్ధముగాదని యభిప్రాయము.

శ్లో॥ తంతూనాందినసంఖ్యానాంతైస్తాదృక్క్షణఈరితః।
భ్రమస్యాసంఖ్యకల్పస్య యోగ్యఃక్షణఇహేష్యతాం॥ ౫౫.

టీ. దినసంఖ్యానాం-దినములచేలెక్కింపదగిన, తంతూనాం-తంతువులకు, తైః-ఆతార్కికులచేత, తాదృక్-అటువంటి, క్షణః-క్షణకాలము, ఈరితః-చెప్పబడెను. ఇహ-ఈసంసారమందు, అసంఖ్యకల్పస్య-అనాదికాలముగానుండెడి, భ్రమస్య-భ్రాంతికి, యోగ్యః-తగినట్టి, క్షణః-క్షణకాలము, ఇష్యతాం-ఇచ్ఛయింపబడు గాక.

తా. ప్ర. అయితే తార్కికులచేతకార్యము క్షణమాత్రముండునని యంగీకరింపబడెనేగాని, చిరకాలమువరకునుండునని యంగీకరింపబడలేదుగదా? ఉ. ఆతార్కికులు కొన్నిదినములనుంచియుండెడి తంతువులునశించినపిమ్మట వానికార్యమగు వస్త్రము క్షణమాత్రముండునని జెప్పిరి. అనగాముందుతంతువులు నశించినపిమ్మట వెనుకవస్త్రమునశించును. ఈమధ్యకాలము క్షణమని తెలియవలెను. ఈసంసారసంబంధభ్రాంతి అనాదికాలమునుంచిప్రవర్తించుచుండుటచేత దానిసంస్కారవశమువలన కార్యమగువిక్షేపస్వరూపము కుమ్మరవానిచక్రముతెరిగినట్లు బహుకాలపర్యంతముండుటవిరోధములేదని తెలియవలెను. అనగా గొన్నిదినములనుంచి యుండెడి తంతువులు నశించినపిమ్మట వానికార్యమగు వస్త్రముక్షణమాత్రముండుననియంగీకరించినప్పుడు ఈలెక్కప్రకారము అనాదికాలముగానుండెడి అవిద్యకును అట్టిక్షణపరిమితికాలములనుజేర్చి లెక్కించినయెడల ఆయవిద్యాకార్యమగు విక్షేపస్వరూపదేహాదికము బహుకాలమువరకుండవచ్చునని దెలియబడగలదని యభిప్రాయము.

శ్లో॥ వినాక్షోదక్షమంమానంతైర్వృథాపరికల్ప్యతే।
శ్రుతియుక్త్యనుభూతిభ్యోవదతాంకిన్నుదుశ్శకం॥ ౫౬.

టీ. తైః-ఆతార్కికులచేత, క్షోదక్షమం-విచారసామర్థ్యతగల, మానంవినా-ప్రమాణమువిడువబడియే, వృథా-వ్యర్థముగా, పరికల్ప్యతే-కల్పించబడెను. శ్రుతియుక్త్యనుభూతిభ్యః=శ్రుతి-శ్రుతివలనను, యుక్తి-యుక్తివలనను, అనుభూతిభ్యః-అనుభవమువలనను, వదతాం-చెప్పుచుండెడిమాకు, కిన్నుదుశ్శకం-శక్యముగానిదేది. అనగాసర్వముశక్యమేయగుననుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే తార్కికులచేత అయుక్తము జెప్పబడినట్లు మీచేతను అయుక్తమే చెప్పబడెనుగదా?. ఉ. ఆతార్కికులు విచారసామర్థ్యతగల ప్రమాణమును విడిపించి, తమయిష్టప్రకారము వ్యర్థముగా కల్పించిరి. మేము, ౧. శ్రుతి, ౨. యుక్తి, 3. అనుభవము, అనెడియీమూడు ప్రమాణములవలన జెప్పుచున్నాము. కనుక మాకుఅసాధ్యమెద్దియు లేదు. అనగా మేముప్రమాణపూర్వకముగా జెప్పెదమేగాని తార్కికులవలె అన్యాయకల్పనలంజేయమని యభిప్రాయము. ఇక్కడశ్రుతియనగా జ్ఞానముచేత అవిద్యా ఆవరణ అధ్యాసములు నశించినను ఆయవిద్యాకార్యమగు ప్రారబ్ధకర్మసహిత విక్షేపస్వరూపదేహాదికము ప్రారబ్ధకర్మము నశించెడిపర్యంతముండుననిచెప్పెడి-శ్రు॥ తస్యతావదేవచిరంయావన్నవిమోక్ష్యేఽథసంపత్స్యే॥ ఇత్యాదిశ్రుతియని తెలియవలెను. మరియు కుమ్మరవాడు చక్రమునుత్రిప్పుటమానినను ఆచక్రము కొంతసేపటివరకు దిరిగినిల్చునేగాని అప్పుడేనిలువదు. అటువలెనే సంసారభ్రమకుగారణమగు అవిద్యనశించినను దానికార్యమగుప్రారబ్ధకర్మసహితవిక్షేపస్వరూపదేహాదికము ప్రారబ్ధకర్మక్షయపర్యంతముండును. కనుక ఇక్కడయుక్తియనగా కుమ్మరవానిచక్రము దిరుగుటమొదలగు దృష్టాంతములని తెలియవలెను. అనుభవమనగా విద్వాంసులకుగల అనుభవమని గ్రహించవలెను.

అవ. ఇప్పుడు, ప్రకృతము ననుసరించి చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆస్తాందుస్తార్కికైస్సాకంవివాదఃప్రకృతంబ్రువే,
స్వాహమోస్సిద్ధమేకత్వంకూటస్థపరిణామినోః॥ ౫౭.

టీ. దుస్తార్కికైస్సాకం. దుస్తార్కికులతోటి, వివాదః-కలహము, ఆస్తాం-అట్లుండుగాక. ప్రకృతం-ప్రకృతమును, బ్రువే-చెప్పెదను. స్వాహమోః=స్వ-స్వయంశబ్దార్థమైనట్టియు, అహమోః-అహంశబ్దార్థమైనట్టియు, కూటస్థపరిణామినోః=కూటస్థ-కూటస్థునకును, పరిణామినోః-చిదాభాసునకును, ఏకత్వం-ఏకత్వము, సిద్ధం-భ్రాంతిచేసిద్ధమగును.

తా. దురాత్ములగు తార్కికులతోటి కలహమునట్లుండనిమ్ము. ఇకనుప్రకృతార్థమునుజెప్పెదవినుము. (స్వయం) తానసెడిశబ్దార్థమగుకూటస్థునకును. (అహం) నేననెడిశబ్దార్థమగుచిదాభాసునకును భ్రాంతిచేతఏకత్వము సిద్ధమైయున్నది.

శ్లో॥ భ్రామ్యంతేపండితంమన్యాస్సర్వేలౌకికతార్కికాః,
అనాదృత్యశ్రుతింమౌర్ఖ్యాత్కేవలాంయుక్తిమాశ్రితాః॥ ౫౮.

టీ. లౌకికతార్కికాః-లౌకికతార్కికులగు, సర్వే-అందరును, పండితంమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్యాః-తామపండితులమనితలచుచు, కేవలాం-ఒక్కటియగు, యుక్తిః-యుక్తినిమాత్రము, ఆశ్రితాస్సంతః-ఆశ్రయించినవారగుచు, మౌర్ఖ్యాత్-మూర్ఖత్వమువలన, శ్రుతిం-శ్రుతిని, అనాదృత్య-నిగ్రహించి, అనగా నాదరింపకయనుట. భ్రామ్యంతే-భ్రాంతిని బొందుచున్నారు. అనగా భ్రమించిరనుట.

తా. ప్ర. అయితే కూటస్థజీవులయొక్క యేకత్వము అవిద్యాభ్రాంతిసిద్ధమైనయెడల ఇదిభ్రాంతియని యెవ్వరును ఎరుగలేదేమి?. ఉ. లౌకికతార్కికులందరును తామపండితులమని తలచుచు కేవలయుక్తినిమాత్రమాశ్రయించినవారై మూర్ఖత్వముచేత శ్రుతిని ఆదరింపక భ్రమించిరి కనుక వారికందరికిని శ్రుతితాత్పర్య విచారణములేమిచేత దెలిసికొనలేదని తెలియవలెను.

శ్లో॥ పూర్వాపరపరామర్శవికలాస్తత్ర కేచన।
వాక్యాభాసాన్ స్వస్వపక్షే యోజయంత్యప్యలజ్జయా॥ ౫౯.

టీ. తత్ర-అలౌకికతార్కికులలో, కేచన-కొందరు, పూర్వాపరపరామర్శవికలాస్సంతః=పూర్వ-పూర్వవాక్యముల యొక్కయు, అపర-వెనుకటివాక్యములయొక్కయు, పరామర్శ-అర్థమునువిమర్శించుటయందు, వికలాస్సంతః-సామర్థ్యతలేనివారగుచు, స్వస్వపక్షే=స్వస్వ-తమతమయొక్క, పక్షే-మతములందు, వాక్యాభాసానపి=వాక్య-వాక్యములయొక్క, ఆభాసానపి-ఆభాసములను, అనగా బరవాక్యములచే బాధింపబడెడి పూర్వపక్షవాక్యములననుట. అలజ్జయా-సిగ్గులేమిచేత-యోజయంతి-చేర్చుచున్నారు.

తా. ప్ర. అయితే శ్రుత్యర్థమునుజెప్పెడి వారైనను కొందరు ఇదిభ్రాంతియని యెరుగలేదేమి?. ఉ. అలౌకికతార్కికులలో గొందరు శ్రుత్యర్థమును జెప్పెడివారైనను, ముందు వెనుకటివాక్యార్థమునువిమర్శించుటయందు ప్రజ్ఞలేనివారై పరవాక్యములచే బాధింపబడెడి పూర్వపక్షవాక్యాభాసములనుసిగ్గులేమిచేత తమతమమతములందు నియమించుకొనుచు, తమతమసిద్ధాంతములను ప్రకటించుచున్నారు. అనగా శ్రుతితాత్పర్యమును జెప్పెడివారికిని సాకల్యముగాశ్రుత్యర్థము దెలియలేదని యభిప్రాయము.

అవ. అట్టివాదులమతములను క్రమముగాదెలుపదలచి, అందుప్రత్యక్షమునే ముఖ్యప్రమాణముగా బొందుటచేత, అతిస్థూలభావమగుటవలన, లోకాయతిచార్వాకాదిమతములను మొట్టమొదట జెప్పుచున్నాడు.

శ్లో॥ కూటస్థాదిశరీరాంతసంఘాతస్యాత్మతాంజగుః।
లోకాయతాః పామరాశ్చ ప్రత్యక్షాభాసమాశ్రితాః॥ ౬౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. లోకాయతాః - లోకాయతులున్ను, పామరాశ్చ - పామరులున్ను, ప్రత్యక్షాభాసం=ప్రత్యక్ష - ప్రత్యక్షముగా, ఆభాసం - బాధింపబడెడిస్థూలదేహమును, ఆశ్రితాస్సంతః - ఆశ్రయించినవారగుచు, కూటస్థాదిశరీరాంతసంఘాతస్య=కూటస్థ-ప్రత్యగాత్మయే, ఆది - మొదలుగాగలిగినట్టి, శరీర - స్థూలదేహమే, అంత-అంత్యముగాగల, సంఘాతస్య - సంఘాతమునకు, ఆత్మతాం - ఆత్మభావమును, జగుః - చెప్పుదురు.

తా. ఆవాదులలో ప్రత్యక్షమునొక్కటినే ముఖ్యప్రమాణముగా బొందియుండెడి లోకాయతులును పామరులును ప్రత్యక్షముగా బాధింపబడుచుండెడి స్థూలదేహమును ఆత్మగాదలచిన వారగుచు కూటస్థాత్మ మొదలుకొని స్థూలదేహాంత్యమువరకుగల సంఘాతమునకు ఆత్మత్వమును జెప్పుదురు. అనగా స్థూలదేహమునే ఆత్మనుగా జెప్పుదురని యభిప్రాయము. ప్ర. అయితే ప్రత్యక్షసిద్ధత్వముచేత లోకాయతాదులు దేహాదికమునకు జెప్పెడి ఆత్మభావము పారమార్థికముగాదాయేమి?. ఉ. ఈస్థూలదేహాదికము ప్రత్యక్షముగా బాధింపబడుచుండుటచేత దీనికి ఆత్మభావమును జెప్పరాదు. కనుకనే శ్రీవిద్యారణ్యగురుండు ప్రత్యక్షాభాసమనెడి పదమును ప్రయోగించేనని తెలియవలెను.

అవ. ఆలోకాయతాదులు ప్రత్యక్షమునే ముఖ్యప్రమాణముగా వాదించెడివారైనను పరులను మోసముజేయుటకొరకు తమమతము శ్రుతిసిద్ధమని జూపెడినిమిత్తమై వాక్యమునుగూడ ఉదహరింపుచున్నారని యిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ శ్రౌతీకర్తుంస్వపక్షం తేకోశమన్నమయంతథా।
విరోచనస్యసిద్ధాంతంప్రమాణంప్రతిజజ్ఞిరే॥ ౬౧.

టీ. తే - ఆలోకాయతాదులు, స్వపక్షం=స్వ - తమయొక్క, పక్షం - మతమును, శ్రౌతీకర్తుం - శ్రుతిసమ్మతముజేయుటకు, అన్నమయం=అన్న - అన్నముచేత, మయం - వికారరూపమునుపొందిన, కోశం - కోశంబును, అనగా అన్నమయకోశమునసుట. తథా - ఆప్రకారము, విరోచనస్య - విరోచనునియొక్క, సిద్ధాంతం-సిద్ధాంతమును, ప్రమాణం - ప్రమాణమునుగా, ప్రతిజజ్ఞిరే - తెలిసికొనిరి. అనగానుదహరింతురనుట.

తా. మరియు ఆలోకాయతాదులు తమమతమును శ్రుతిసమ్మతముగా జేయుటకు ఆయీపరమాత్మ అన్నరసమయుడని అన్నమయకోశమును ప్రతిపాదించెడి-శ్రు॥ సవాఏషపురుషోన్నరసమయః॥ అనెడివాక్యంబును మరియు ఆత్మయే దేహ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మయుడని విరోచనుని సిద్ధాంతమును ప్రతిపాదించెడి-వా॥ ఆత్మైవ దేహమయః॥ అనెడి యిత్యాదివాక్యంబును ప్రమాణముగా జెప్పుదురు. అలోకాయతాచుటు ఈ రెండువాక్యములను ప్రమాణముగా గ్రహించిరని చెప్పితిమే గాని ఆ రెండు వాక్యములును ఇక్కడ ప్రకరణవిరోధమగుటవలన శ్రీవిద్యారణ్యగురునిచేత ప్రతిపాదింపబడలేదని తెలియవలెను.

అవ. ఈమతమందు దోషదర్శనపూర్వకముగా మరియొక మతము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ జీవాత్మనిర్గమే దేహమరణస్యాత్రదర్శనాత్।
దేహాతిరిక్తఏవాత్మేత్యాహుర్లోకాయతాఃపరే॥ ౬౨.

టీ. పరే-మరికొందరగు, లోకాయతాః-లోకాయతులు, జీవాత్మనిర్గమేసతి= జీవాత్మ-జీవాత్మకు, నిర్గమేసతి-గమనముగలుగుచుండగా, అత్ర-ఇక్కడ, దేహమరణస్య=దేహ-స్థూలశరీరముయొక్క, మరణస్య-మరణము, దర్శనాత్-ప్రత్యక్షమగుటవలన, అనగాగనబడుటవలననుట. దేహాతిరిక్తఏవ=దేహ-స్థూలదేహముకంటె, అతిరిక్తఏవ-అన్యుడే, ఆత్మేతి-ఆత్మయని, ఆహుః-చెప్పుదురు.

తా. మరియు మరికొందరు లోకాయతమతస్థులు జీవాత్మ దేహమునువిడిచి వెడలుచుండగా దేహమువృతమై యిక్కడనే కనబడుచున్నదనియు కనుక ఈ స్థూలదేహము ఆత్మ గాదనియు ఈదేహముకంటె అన్యుడే ఆత్మయగుననియుం చెప్పుదురు.

శ్లో॥ ప్రత్యక్షత్వేనాభిమతాహంధీర్దేహాతిరేకిణం।
గమయేదింద్రియాత్మానంవచ్మీత్యాదిప్రయోగతః॥ ౬౩.

టీ. వచ్మి-నేనుచెప్పుచున్నాను. ఇత్యాదిప్రయోగతః-ఇత్యాదిప్రయోగములవలన, ప్రత్యక్షత్వేన-ప్రత్యక్షభావముచేత, అభిమతా-సమ్మతమైన, అహంధీః-నేననెడిబుద్ధి, దేహాతిరేకిణం=దేహ-స్థూలదేహముకంటె, అతిరేకిణం-అన్యుడగు, ఇంద్రియాత్మానం=ఇంద్రియ-ఇంద్రియరూపుడగు, ఆత్మానం-ఆత్మను, గమయేత్-పొందింపజేయుచున్నది.

తా. ప్ర. అయితే దేహముకంటె అన్యుడగుఆత్మ ఎటువంటివాడో ఏప్రమాణముచే నెరుగబడునో జెప్పుము?. ఉ. నేనుచెప్పుచున్నాను. నేనుజూచుచున్నాను. ఇత్యాదిప్రయోగములులోకమందుప్రత్యక్షముగాగనబడుచుండుటవలనప్రత్యక్షత్వముచేత సమ్మతమైన నేననెడిబుద్ధి దేహముకంటె అన్యుడగు ఇంద్రియరూపుడైన ఆత్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ను దెలుపుచున్నది. అనగా బుద్ధిచేత పొందదగిన వాగాదీంద్రియములే ఆత్మయని, లోకాయతులు చెప్పుదురని యభిప్రాయము.

శ్లో॥ వాగాదీనామింద్రియాణాంకలహశ్శ్రుతిషుశ్రుతః।
తేనచైతన్యమేతేషామాత్మత్వంతతఏవహి॥ ౬౪.

టీ. శ్రుతిషు-వేదవాక్యములయందు, వాగాదీనాం-వాక్కు మొదలగు, ఇంద్రియాణాం-ఇంద్రియములకు, కలహః-వివాదము, శ్రుతః-వినబడుచున్నది. తేన-ఆకారణముచేత, ఏతేషాం-ఈఇంద్రియములకు, చైతన్యం-చేతనభావముగలను, తతఏవహి-ఆ చేతనత్వకారణమువలననే, ఆత్మత్వం-ఆత్మభావమగును.

తా. ప్ర. అయితే అచేతనములగు ఇంద్రియములకు ఆత్మత్వమెట్లుసిద్ధించును?. ఉ. వాక్కు మొదలగు ఇంద్రియములు అన్యోన్యముగా గలహించుకొనుచున్నట్లు శ్రుతులయందువినబడుచున్నదనియు చేతనత్వములేకనే కలహింపజాలవనియు చేతనత్వమే ఆత్మలక్షణమగుట నేత వాగాదీంద్రియములకు ఆత్మత్వముజెప్పవచ్చునని ఆలోకాయతులుజెప్పుదురు.

అవ. ఇప్పుడు, మరియొకమతమును దెలుపుచున్నాడు.

శ్లో॥ హైరణ్యగర్భాఃప్రాణాత్మవాదినస్త్వేవమూచిరే।
చక్షురాద్యక్షలోపేపిప్రాణసత్త్వేతుజీవతి॥ ౬౫.

టీ. ప్రాణాత్మవాదినః=ప్రాణ-ప్రాణవాయువే, ఆత్మ-ఆత్మయని, వాదినః-వాదించెడి, హైరణ్యగర్భాస్తు-హైరణ్యగర్భులనెడిమతస్థులో, చక్షురాద్యక్షలోపేపి=చక్షురాది - నేత్రము మొదలగు, అక్ష-ఇంద్రియములకు, లోపేపి-లోపము గలిగినను, ప్రాణసత్త్వేతు=ప్రాణ-ప్రాణము, సత్త్వేతు - స్థితినిబొందుచుండగా, జీవతీతి-పురుషుడుజీవించియున్నాడని, ఏవం-ఈప్రకారము, ఊచిరే-చెప్పిరి.

తా. మరియు ప్రాణవాయువే ఆత్మయనివాదించెడి హైరణ్యగర్భులనెడిమతస్థులు సుషుప్త్యాద్యవస్థలయందు చక్షురాదీంద్రియములు లేకున్నను ప్రాణవాయువుండుటచేత బురుషుడు జీవించియున్నాడు కనుక ప్రాణవాయువేఆత్మయగుగాని ఇంద్రియవర్గమాత్మకాదనియుం జెప్పుదురు.

అవ. ప్రాణమునకు ఆత్మత్వమందు శ్రౌతలింగములనిప్పుడు జూపుచున్నారు.

శ్లో॥ ప్రాణోజాగర్తిసుప్తేపిప్రాణశ్రైష్ఠ్యాదికంశ్రుతం।
కోశఃప్రాణమయస్సమ్యగ్విస్తరేణప్రపంచితః॥ ౬౬.

టీ. ప్రాణః-ప్రాణము, సుప్తేపి-సుషుప్తియందును, జాగర్తి-లయింపకున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాణశ్రైష్ఠ్యాదికం=ప్రాణ-ప్రాణముయొక్క, శ్రైష్ఠ్యాదికం-శ్రేష్ఠత్వసంవాదప్రవేశాదికము, శ్రుతం-వినబడుచున్నది. ప్రాణమయః-ప్రాణమయమనెడి, కోశః-కోశము, సమ్యక్-లెస్సగా, విస్తరేణ-విస్తారముగా, ప్రపంచితః-శ్రుతులయందు ప్రసిద్ధముగా జెప్పబడెను.

తా. మరియు ఈదేహమనెడిపట్టణమందు సుషుప్త్యాదిసర్వావస్థలయందును ప్రాణాదివాయువులు లయింపకున్నవని-శ్రు॥ ప్రాణాదయఏవైతస్మిన్ పురేజాగ్రతి॥ ఇత్యాదివాక్యములచేత ప్రాణజాగరణము వినబడుచున్నది. మరియు ప్రాణముప్రసన్నమగుచుండగా ఊర్ధ్వగతిగలుగుచున్నదని-శ్రు॥ తత్ప్రాణేప్రసన్న ఉదతిష్ఠత్ తదుక్థమభవత్తదేతదుక్థం॥ ఇత్యాదివాక్యములచేత ప్రాణమునకు శ్రేష్ఠత్వసంవాదప్రవేశాదికము వినబడుచున్నది. మరియు ఆత్మ ప్రాణమయ రూపుడుగానున్నాడని-శ్రు॥ అన్యోంతరఆత్మాప్రాణమయః॥ ఇత్యాదివాక్యములచేత ప్రాణమయకోశము చెప్పబడెను. గనుక ప్రాణమేఆత్మయని ఆహైరణ్యగర్భులు చెప్పుదురని యభిప్రాయము.

అవ. ప్రాణముకంటె లోపలనుండునట్టి మనస్సునకు ఆత్మత్వముంజెప్పెడివారిమతమునిప్పుడు, జూపుచున్నాడు.

శ్లో॥ మనఆత్మేతిమన్యంతఉపాసనపరాజనాః।
ప్రాణస్యాభోక్తృతాస్పష్టాభోక్తృత్వంమనసస్తతః॥ ౬౭.

టీ. ఉపాసనపరాః-ఉపాసనపరులగు, జనాః-జనులు, మనః-మనస్సు, ఆత్మేతి-ఆత్మయని, మన్యంతే-తలచుచున్నారు. ప్రాణస్య-ప్రాణమునకు, అభోక్తృతా-భోక్తృత్వములేమి, స్పష్టా-స్పష్టమగును. మనసః-మనస్సునకు, భోక్తృత్వం-భోక్తృత్వముగలిగియున్నది. తతః-అందువల్ల.

తా. మరియు ఉపాసనపరులగుజనులు ప్రాణమునకు భోక్తృత్వములేమిచేతను మనస్సునకు భోక్తృత్వముగలిగియుండుటచేతను మనంబేఆత్మయగునని యిట్లు యుక్తిపూర్వకముగా చెప్పుదురు. భోక్తృత్వమనగా అనుభవించెడి స్వభావమని యర్థము.

అవ. మనస్సునకు ఆత్మత్వమునుజెప్పెడివిషయమై, యుక్తిని ప్రతిపాదించెడి శ్రుతిని జెప్పుచున్నారు.

శ్లో॥ మనఏవమనుష్యాణాంకారణంబంధమోక్షయోః।
శ్రుతోమనోమయఃకోశస్తేనాత్మేతీరితంమనః॥ ౬౮.

టీ. మనుష్యాణాం-మనుష్యులకు, మనఏవ-మనంబే, బంధమోక్షయోః-బంధ

5 CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మోక్షములకు, కారణం-హేతునగును. మనోమయః-మనోమయమనెడి, కోశః-కోశము, శ్రుతః-శ్రుతులయందు వినబడుచున్నది. తేన-ఆకారణముచేత, మనః-మనస్సు, ఆత్మేతి-ఆత్మయని, ఈరితం-చెప్పబడెను.

తా. మరియు మనుష్యులయొక్క బంధమోక్షములకు మనంబే కారణమగునని ఈశ్రుతిజెప్పుచున్నది. మరియు-శ్రు॥ తస్మాద్వాఏతస్మాత్ప్రాణమయాదన్యోంతర ఆత్మామనోమయః॥ ఇత్యాదివాక్యములందు మనోమయకోశము వినబడుచున్నది. కనుక మనంబేఆత్మయని ఆఉపాసనపరులగుజనులు జెప్పుదురని తాత్పర్యము.

అవ. ఇప్పుడు మనస్సునకంటె లోపలనుండునట్టి, విజ్ఞానమునకు ఆత్మత్వమును జెప్పెడి, బౌద్ధునిమతమును జూపుచున్నాడు.

శ్లో॥ విజ్ఞానమాత్మేతిపరఆహుఃక్షణికవాదినః।
యతోవిజ్ఞానమూలత్వంమనసోగమ్యతేస్ఫుటం॥ ౬౯.

టీ. పరే-మరికొందరగు, క్షణికవాదినః-క్షణికవాదులు, యతః-ఏకారణమువలన, మనసః-మనస్సునకు, విజ్ఞానమూలత్వం-విజ్ఞానహేతుత్వము, స్ఫుటం-స్ఫుటముగా, గమ్యతే-పొందబడుచున్నదో, (అతః) ఆకారణమువలన, విజ్ఞానం-బుద్ధి, ఆత్మేతి-ఆత్మయని, ఆహుః-చెప్పుదురు.

తా. మరియు, మనస్సునకులోపల విజ్ఞానముండుటచేత ఆవిజ్ఞానముమనస్సునకుహేతువుగానున్నది. ఆకారణముచేత విజ్ఞానమే ఆత్మయని క్షణికవాదులనెడి బౌద్ధులుజెప్పుదురు.

అవ. ఆమనోవిజ్ఞానములకు కార్యకారణభావమును దెలుపుటకు, ఆరెంటియొక్కభేదము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ అహంవృత్తిరిదంవృత్తిరిత్యంతఃకరణంద్విధా।
విజ్ఞానంస్యాదహంవృత్తిరిదంవృత్తిర్మనోభవేత్॥ ౭౦.

టీ. అహంవృత్తిః-నేననెడివృత్తిరూపముగాను, ఇదంవృత్తిః-ఇదియనెడివృత్తిరూపముగాను, ఇతి-ఈప్రకారము, అంతఃకరణం-అంతరింద్రియము, ద్విధా-ద్వివిధముగానున్నది. అహంవృత్తిః-నేననెడివృత్తిరూపము, విజ్ఞానం-బుద్ధి, స్యాత్-అగును. ఇదంవృత్తిః-ఇదియనెడివృత్తిరూపము, మనః-మనస్సు, భవేత్-అగును.

తా. ప్ర. అయితే విజ్ఞానమనశ్శబ్దములచే జెప్పదగిన అంతఃకరణమునకు ఏకత్వముగలిగియుండగామనోవిజ్ఞానములకు కార్యకారణభావమెట్లుగలిగెను?. ఉ. ౧. నేననెడివృత్తిరూపముగాను, ౨. ఇదియనెడివృత్తిరూపముగాను ఇట్లుఅంతకరణము ద్వి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విధము గానున్నది. ఆరెంటిలో నేననెడిఆంతరవృత్తిరూపము విజ్ఞానమగును. ఇదియ నెడిబాహ్యవృత్తిరూపము మనంబగును.

అవ. ఆమనోవిజ్ఞానములకు కార్యకారణభావముంజెప్పుచున్నాడు.

శ్లో॥ అహంప్రత్యయబీజత్వమిదంవృత్తేరతిస్ఫుటం।
అవిదిత్వాస్వమాత్మానంబాహ్యం వేత్తినతుక్వచిత్ ॥ ౭౧.

టీ. ఇదంవృత్తేః-ఇదియనెడి బాహ్యవృత్తికి, అహంప్రత్యయబీజత్వం=అహం-నేననెడి, ప్రత్యయ-వృత్తియే, బీజత్వం-కారణభావము, అతిస్ఫుటం-మిక్కిలిస్ఫుటముగానున్నది. స్వం-తానైన, ఆత్మానం-స్వరూపమును, అవిదిత్వా-ఎరుగక, బాహ్యం-బాహ్యవిషయమును, క్వచిత్తు-ఎప్పటికిని, నవేత్తి-ఎరుగడు.

తా. ఇదియనిబాహ్యవస్తువును విషయీకరించెడివృత్తికి, నేననెడిఆంతరవృత్తి కారణమగుచున్నది. ప్ర. అదియెట్లు?. ఉ. పురుషుడు తన్నునెరుగక బాహ్యవిషయము నెప్పటికి నెరుగడు. అనగా నేననెడివృత్తియొక్క యుదయములేకపోవుచుండగా ఇదియనెడిబాహ్యవృత్తి కలుగదనియభిప్రాయము. కనుక ఇదియనెడివృత్తిరూపముగల మనస్సునకు నేననెడివృత్తిరూపముగల విజ్ఞానముకారణమగును. ఈచెప్పిన ప్రకారము మనోవృత్తి కార్యమగుననియు బుద్ధివృత్తియగువిజ్ఞానము కారణమగునని యుం దెలియవలెను.

అవ. ఆవిజ్ఞానమునకు క్షణికత్వమందు, అనుభవమును ప్రమాణముగాజెప్పుచున్నారు.

శ్లో॥ క్షణేక్షణేజన్మనాశావహంవృత్తేర్మితౌయతః।
విజ్ఞానంక్షణికంతేనస్వప్రకాశంస్వతోమితేః॥ ౭౨.

టీ. అహంవృత్తేః-నేననెడివృత్తికి, యతః-ఏకారణమువలన, క్షణేక్షణే-ప్రతిక్షణమందును, జనన్నాశౌ-ఉత్పత్తివినాశములు, మితౌ-తెలియబడుచున్నవో, తేన-ఆకారణముచేత, విజ్ఞానం-విజ్ఞానము, క్షణికం-క్షణికమగును. స్వతః-తనచేత, మితేః-తెలియబడుటవలన, స్వప్రకాశం-విజ్ఞానముస్వప్రకాశరూపమగును.

తా. మరియు (అహం) నేననెడి వృత్తిరూపవిజ్ఞానమునకు ప్రతిక్షణమందును ఉత్పత్తివినాశములు కలిగియుండుటచేత విజ్ఞానముక్షణికమగును. మరియు తనచేతనే యెరుగబడుటవలన ఆవిజ్ఞానముస్వప్రకాశరూపమగునని ఆవిజ్ఞానవాదులనెడి బౌద్ధులుజెప్పుదురు.

అవ. ఇప్పుడు, విజ్ఞానమేఆత్మయనెడివిషయమైశ్రుతిప్రమాణమునుజెప్పుచున్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ విజ్ఞానమయకోశోఽయం జీవ ఇత్యాగమా జగుః।
సర్వసంసారవత స్యజన్మనాశసుఖాదికః॥ ౭౩.

టీ. అయం-ఈ, విజ్ఞానమయకోశః=విజ్ఞానమయ-విజ్ఞానమయమనెడి, కోశః-కోశము, జీవఇతి-జీవుడని, ఆగమాః-వేదములు, జగుః-చెప్పుచున్నవి. జన్మనాశ సుఖాదికః=జన్మ-జననంబును, నాశ-మరణంబును, సుఖాదికః-సుఖదుఃఖాదులంగల, సర్వసంసారః-సంసారమంతయు, ఏతస్య-ఈజీవునకగును.

తా. మరియు మనోమయకోశముకంటె అంతరముగా విజ్ఞానమయకోశముగలదనియు ఆవిజ్ఞానమయమే జీవుడనియు-శ్రుః తస్మాద్వా ఏతస్మాన్మనోమయాదన్యోంతర ఆత్మావిజ్ఞానమయః విజ్ఞానం యజ్ఞం తనుతే॥ ఇత్యాదివాక్యములు విజ్ఞానమునకు ఆత్మభావమును ప్రతిపాదించుచున్నది. మరియు జననమరణసుఖదుఃఖాదిరూపమగు సంసారమంతయు ఈవిజ్ఞానమయరూపుడగు జీవునకే గలిగియున్నదనియు ఆవిజ్ఞానవాదులనెడి బౌద్ధులు చెప్పుదురు.

అవ. బౌద్ధులలో అవాంతరభేదముగల శూన్యవాదిమతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ విజ్ఞానం క్షణికం నాత్మా విద్యుదభ్రనిమేషవత్।
అన్యస్యానుపలబ్ధత్వాచ్ఛూన్యం మాధ్యమికా జగుః॥ ౭౪.

టీ. విద్యుదభ్రనిమేషవత్-మేఘమందు బ్రలినిమిషమందు బుట్టెడి మెరుపువలె, క్షణికం-క్షణికమగు, విజ్ఞానం-విజ్ఞానము, నాత్మా-ఆత్మగాదు. అన్యస్య-అన్యవస్తువు, అనుపలబ్ధత్వాత్-పొందబడమివలన, శూన్యం-శూన్యమని, మాధ్యమికాః-బౌద్ధులలో శూన్యవాదులు, జగుః-చెప్పుదురు.

తా. మరియు మేఘమందు బ్రతినిమిషమందుబుట్టి నశించుచుండెడి మెరుపువలె క్షణికమగు విజ్ఞానము ఆత్మ గాదనియు ఆవిజ్ఞానముకంటె అన్యవస్తువెద్దియు పొందబడమిచేత శూన్యమేయని శూన్యవాదులు చెప్పుదురు.

అవ. శూన్యవిషయమై, శ్రుతిని జెప్పెదరని, యిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ అసదేవేదమిత్యాదావిదమేవ శ్రుతం తతః।
జ్ఞానజ్ఞేయాత్మకం సర్వం జగద్భ్రాంతిపరికల్పితం॥ ౭౫.

టీ. ఇదం-ఈజగంబంతయు, అసదేవ-సృష్టికిబూర్వమందు లేనిదేయగుననిచెప్పెడి, ఇత్యాదౌ-ఇత్యాదిశ్రుతియందు, ఇదమేవ-ఈశూన్యత్వమే, శ్రుతం-వినబడుచున్నది, తతః-ఆకారణమువల్ల, సర్వం-సకలమైన, జ్ఞానజ్ఞేయాత్మకం=

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్ఞాన - జ్ఞానరూపముగలిగినట్టియు, జ్ఞేయాత్మకం - జ్ఞానముచే నెఱుగబడెడి రూపము గలిగినట్టి, సర్వం - సకలమైన, జగత్ - ప్రపంచము, భ్రాంతిప్రకల్పితం=భ్రాంతి-భ్రమచేత, ప్రకల్పితం - కల్పించబడినదగును.

తా. మరియు శూన్యవిషయమై సృష్టికిబూర్వమందు ఈజగంబంతయు శూన్యముగానే యుండెనని చెప్పెడి శ్రు॥ అసదేవసోమ్యేదమగ్రఆసీత్॥ ఇత్యాదిశ్రుతియందును శూన్యమేవినబడుచున్నదని శూన్యవాదులుచెప్పుదురు. శ్రు॥ సదేవసోమ్యేదమగ్రఆసీత్॥ అనెడిశ్రుతిని శూన్యవాదులు (అసదేవసోమ్యేదమగ్రఆసీత్) అని యిట్లు పఠించిరని తెలియవలెను. ఈశ్రుత్యర్థవిషయమునుగురించి పంచభూతవివేకమందు జక్కగాజెప్పబడెను. ప్ర. అయితే శూన్యమైనయెడల తోచుచుండెడిజగత్తునకు గతియేమి?. ఉ. జ్ఞానరూపముగలజగంబును జ్ఞానముచే నెరుగబడెడిరూపముగల జగంబంతయు భ్రాంతిచేతగల్పించబడెనని శూన్యవాదులు జెప్పుదురు.

అవ. ఇప్పుడు అద్వైతసిద్ధాంతి ఈశూన్యమతమును దూషించుచున్నాడు.

శ్లో॥ నిరధిష్ఠానవిభ్రాంతేరభావాదాత్మనోఽస్తితా।
శూన్యస్యాపిససాక్షిత్వాదన్యథానోక్తిరస్యతే॥ ౭౬.

టీ. నిరధిష్ఠానవిభ్రాంతేః = నిరధిష్ఠాన-ఆధారములేని, విభ్రాంతేః-భ్రమము, అభావాత్-లేమివలన, ఆత్మనః-జగత్కల్పనకాధారుడగుఆత్మయొక్క, అస్తితా-స్థితి బొందదగినదగును. శూన్యస్యాపి - శూన్యంబును, ససాక్షిత్వాత్ - సాక్షిసహితమగుటవలన, ఆత్మనః - శూన్యసాక్షియైనఆత్మయొక్క, అస్తితా - స్థితిబొందదగినదగును. అన్యథా-అట్లుఆత్మస్థితి నంగీకరించనియెడల, అస్య-ఈశూన్యముయొక్క, ఉక్తిః - మాట, అనగాశూన్యమని చెప్పుటయనుట. తే - నీకు, న - సిద్ధింపదు.

తా. స్వరూపములేనిశూన్యము భ్రాంతికిఆధారముగా నుండరామిచేతయు ఆధారవస్తువునాశ్రయింపనిభ్రాంతి సంభవింపమిచేతయు జగత్కల్పనకు ఆధారుడగు ఆత్మగలడని యంగీకరింపవలెను. ఇదియునుంగాక శూన్యవాదిచేతయు శూన్యమునకు సాక్షిభావముగా వర్తింపుచుండెడి తననాత్మనుగా నవశ్యమంగీకరింపవలెను. అట్లు శూన్యమునకు సాక్షిభావముగావర్తింపుచుండెడి తానైనఆత్మ ఉన్నట్లుఅంగీకరింపబడనియెడల శూన్యమనిచెప్పుటయు బౌద్ధుడవగునీమతమందుసిద్ధింపదు. అనగా శూన్యమునకు సాక్షిత్వముగా దానుండియే శూన్యమని చెప్పుచున్నాడుగాని తాను లేనియెడల శూన్యమనిచెప్పుటకు సాధ్యముముగాదనియభిప్రాయము. ఈచెప్పబడిన మతములన్నియు వేదబాహ్యములని చెప్పబడును. ఇకను చెప్పబడెడి మతములన్నియు వైదికమతములగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ అన్యోవిజ్ఞానమయతఆనందమయఆంతరః।
అస్తీత్యేవోపలబ్ధవ్యఇతివైదికదర్శనం॥ ౭౭.

టీ. విజ్ఞానమయతః - విజ్ఞానమయకోశముకంటె, అన్యః - అన్యమైనట్టియు, ఆంతరః - లోపటనుండునట్టి, ఆనందమయః - ఆనందమయకోశము, అస్తీతి - కలదని, ఉపలబ్ధవ్యఏవేతి - శ్రుతివలనబొందదగినదేయగునని, వైదికదర్శనం - వైదికసిద్ధాంతమగును.

తా. ప్ర. అయితే ఆత్మ ఎద్ది?. ఉ. విజ్ఞానమయకోశముకంటె అన్యమైనట్టియు ఆవిజ్ఞానమయమునకు లోపలనుండునట్టి ఆనందమయకోశముగలదని చెప్పెడి శ్రు॥ తస్మాద్వాఏతస్మాద్విజ్ఞానమయాదన్యోంతరఆత్మానందమయః॥ అనెడిశ్రుతిఉండుటవలన ఆనందమయకోశము ఆత్మగాపొందదగినదగునని వైదికసిద్ధాంతమగును. అనగా ఈఆనందమయకోశము ఈక్రిందచెప్పఁబోయెడి వాదులకు ఆత్మయగునని యభిప్రాయము.

అవ. ఇట్లు ఆత్మస్వరూపవిషయమై వాదులకుగల వివాదమునుజూపి ఆఆత్మయొక్క పరిమాణవిశేషమందును వాదులకుగలకలహము నికజూపుచున్నాడు.

శ్లో॥ అణుర్మహాన్మధ్యమోవేత్యేవంతత్రాపివాదినః।
బహుధావివదంతేహిశ్రుతియుక్తిసమాశ్రయాత్॥ ౭౮.

టీ. అణుః-ఆత్మఅణుపరిమాణుడో, మహాన్-పరిపూర్ణుడో, మధ్యమోవేతి-మధ్యమపరిమాణుడోయని, ఏవం-ఈప్రకారము, తత్రాపి-ఆపరిమాణవిశేషమందును, వాదినః-వాదులు, శ్రుతియుక్తిసమాశ్రయాత్ = శ్రుతియుక్తి-శ్రుతియుక్తులయొక్క, సమాశ్రయాత్ - ప్రాపకమువల్ల, బహుధా - అనేకవిధములుగా, వివదంతేహి-కలహమునుబొందుచున్నారు.

తా. మరియు ఆఆత్మయొక్క పరిమాణవిశేషమందును ఆత్మ అణుపరిమాణుడో లేక పరిపూర్ణుడో లేక మధ్యమపరిమాణుడోయని ఈప్రకారముగా వాదులు శ్రుతియుక్తులవాశ్రయించినవారగుచు అనేకవిధములుగా కలహించుచున్నారు.

అవ. అందు అణుత్వవాదుల నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ అణుంవదంత్యాంతరాళాస్సూక్ష్మనాడీప్రచారతః
రోమ్ణస్సహస్రభాగేనతుల్యాసుప్రచరత్యయం॥ ౭౯.

టీ. ఆంతరాళాః - ఆంతరాళులు, సూక్ష్మనాడీప్రచారతః = సూక్ష్మనాడీ-సూక్ష్మనాడులయందు, ప్రచారతః - ఆత్మసంచారముజేయుటవల్ల, అణుం - అణు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరిమాణునిగా, వదంతి - చెప్పుచుడు. అయం - ఈఆత్మ, రోమ్ణః - వెండ్రుకయొక్క, సహస్రభాగేన - సహస్రభాగముతోటి, తుల్యాసు - సమానములైన, (నాడీషు) సూక్ష్మనాడులయందు, ప్రచరతి - సంచారమును జేయుచున్నాడు.

తా. అందు ఆంతరాళికులనెడి మతస్థులు ఆత్మను అణుపరిమాణునిగా జెప్పుదురు. ప్ర. అట్లుచెప్పుటకు కారణమేమి?. ఉ. వెండ్రుకయొక్క సహస్రభాగముతోటి సమానములైన సూక్ష్మనాడులయందు ఈయాత్మ సంచరించుటచేత అణుపరిమాణునిగా జెప్పుదురు. అనగా ఆత్మ అణుపరిమాణుడు గానియెడల సూక్ష్మనాడులయందు సంచారము ఘటింపదని యభిప్రాయము.

శ్లో॥ అణోరణీయానేషోణుసూక్ష్మాత్సూక్ష్మతరంత్వితి।
అణుత్వమాహుశ్శ్రుతయశ్శతశోథసహస్రశః॥ ౭౦.

టీ. ఏషః - ఈఆత్మ, అణుః - అణుపరిమాణుడగుననియు, అణోః - అణువుకంటె, అణీయాన్ - పరమాణు పరిమాణుడగుననియు, సూక్ష్మాత్ - సూక్ష్మముకంటె, సూక్ష్మతరంత్వితి - అతిసూక్ష్మవస్తువగుననియు, శతశః - శతసంఖ్యలుగలిగినట్టియు, అథసహస్రశః - సహస్రసంఖ్యలుగలిగినట్టి, శ్రుతయః - శ్రుతులు, అణుత్వం - అణుపరిమాణభావమును, ఆహుః - చెప్పుచున్నవి.

తా. ప్ర. అయితే ఆత్మ అణుపరిమాణుడనుటయందు బ్రమాణమేమి?. ఉ. ఈఆత్మ అణువుకంటె పరమాణుప్రమాణుడగుననియు గొప్పవస్తువుకంటె మిక్కిలి గొప్పవాడనియు సూక్ష్మముకంటె అతిసూక్ష్మవస్తువగుననియు ఈఅణుపరిమాణుడగు ఆత్మ చిత్తముచే నెరుగదగినవాడగుననియు శ్రు॥ అణోరణీయాన్మహతోమహీయాన్ నేషాణురాత్మా చేతసావేదితవ్యః సూక్ష్మాత్సూక్ష్మతరంనిత్యం॥ ఇత్యాదిశ్రుతిసహస్రంబులు ఆత్మనణుపరిమాణునిగా జెప్పుచున్నవని ఆయాంతరాళికులు చెప్పుదురు.

అవ. ఈవిషయమై మరియొకశ్రుతిని ఉదహరించుచున్నారు.

శ్లో॥ వాలాగ్రశతభాగస్యశతధాకల్పితస్యచ।
భాగోజీవస్సవిజ్ఞేయఇతిచాహాపరాశ్రుతిః॥ ౭౧.

టీ. శతధాకల్పితస్య=శతధా - అనేకవిధములుగా, కల్పితస్య - భాగింపబడిన, వాలాగ్రశతభాగస్య=వాలాగ్ర - వెండ్రుకకొనయొక్క, శతభాగస్య - ఖండశతకముయొక్క, భాగః - అంశపరిమాణముగల, సః - ఆ, జీవః - జీవుడు, విజ్ఞేయ ఇతి - తెలియదగినవాడగునని, అపరా - మరియొక, శ్రుతిశ్చ - శ్రుతియు, ఆహ - చెప్పెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మరియు అనేకఖండములుగా భాగింపబడిన వెండ్రుకకొనను అనేకఖండములుగా భాగించినయెడల ఎంతపరిమాణముగలిగియుండునో అంతసూక్ష్మపరిమాణముగల వానినిగా ఆజీవు నెరుగవలెనని ఈశ్రుతి చెప్పుచున్నది. ఇట్లు అంతరాళులు ఆత్మకు అణుత్వమును జెప్పుదురని యభిప్రాయము.

అవ. ఇప్పుడు మధ్యమపరిమాణవాదిమతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ దిగంబరామధ్యమత్వమాహురాపాదమస్తకం।
చైతన్యవ్యాప్తిసంద్రృష్టేరానఖాగ్రశ్రుతేరపి॥ ౮-౨.

టీ. దిగంబరాః - దిగంబరులు, ఆపాదమస్తకం - పాదము మొదలుకొని శిరస్సు పర్యంతము, చైతన్యవ్యాప్తిసంద్రృష్టేః=చైతన్య - చైతన్యముయొక్క, వ్యాప్తిసంద్రృష్టేః - వ్యాప్తికనబడుచుండుటవల్లను, ఆనఖాగ్రశ్రుతేరపి=ఆనఖాగ్ర - ఆయాత్మ ఈదేహమందు ప్రవేశించి గోటికొనపర్యంతము వ్యాపించియున్నాడని చెప్పెడి, శ్రుతేరపి - శ్రుతివలనను, మధ్యమత్వం - మధ్యమపరిమాణత్వమును, ఆహుః-చెప్పుదురు.

తా. మరియు పాదము మొదలుకొని శిరస్సుపర్యంతము చైతన్యవ్యాప్తిగలిగియుండుటచేతను ఆయాత్మ ఈదేహమందు బ్రవేశించినవాడై గోటికొనపర్యంతము వ్యాపించియున్నాడని చెప్పెడి శ్రు॥ సఏవఇహప్రవిష్టఆనఖాగ్రేభ్యః॥ అనెడిశ్రుతిచేతను ఆత్మనుమధ్యమపరిమాణునిగా దిగంబరులనెడిమతస్థులు చెప్పుదురు.

శ్లో॥ సూక్ష్మనాడీప్రచారస్తుసూక్ష్మైరవయవైర్భవేత్।
స్థూలదేహస్యహస్తాభ్యాంకంచుకప్రతిమోకవత్॥ ౮-౩.

టీ. హస్తాభ్యాం - చేతులచేత, స్థూలదేహస్య - స్థూలదేహమునకు, కంచుకప్రతిమోకవత్=కంచుక - చొక్కాయియొక్క, ప్రతిమోకవత్ - ప్రవేశమువలె, సూక్ష్మనాడీప్రచారస్తు=సూక్ష్మనాడీ-సూక్ష్మనాడులయందు, ప్రచారస్తు-సంచారంబును, సూక్ష్మైః-సూక్ష్మములైన, అవయవైః-అవయవములచేత, భవేత్-అగును.

తా. ప్ర. అయితే ఆత్మకు మధ్యమపరిమాణమును నిశ్చయించినయెడల శ్రుతిసిద్ధమైన నాడీసంచారమెట్లుఘటించును?. ఉ. దేహముయొక్క అవయవములైన చేతులకు చొక్కాయిబ్రవేశించుటచేత దేహమునకు చొక్కాయియొక్కప్రవేశమెట్లగునో అటువలెనే ఆత్మయొక్క సూక్ష్మావయవములకు నాడులయందు సంచారముగలుగుటచేత ఆత్మకును సూక్ష్మనాడులయందు సంచారముగలిగిన ట్లేయగునని దిగంబరులు చెప్పుదురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ న్యూనాధికశరీరేషు ప్రవేశోపిగమాగమైః।
ఆత్మాంశానాంభవేత్తేనమధ్యమత్వంవినిశ్చితం॥ ౭౪.

టీ. న్యూనాధికశరీరేషు = న్యూన-నీచములైనట్టియు, అధిక-శ్రేష్ఠములైనట్టి, శరీరేషు-శరీరములయందు, ప్రవేశోపి-ప్రవేశంబును, ఆత్మాంశానాం=ఆత్మ-ఆత్మనుగల, అంశానాం - అవయవములయొక్క, గమాగమైః - నాశోత్పత్తులచేత, భవేత్ - అగును. తేన - ఆకారణముచేత, మధ్యమత్వం - మధ్యమపరిమాణత్వము, వినిశ్చితం - నిశ్చయింపబడెను.

తా. ప్ర. అయితే ఆత్మ సర్వదా నియతమధ్యమపరిమాణుడని నిశ్చయించినయెడల అట్టిఆత్మకుకర్మవశమువల్ల నీచశ్రేష్ఠశరీరములయందు ప్రవేశమెట్లుగలుగును?. ఉ. ఆత్మకుగల అవయవములయొక్క ఉత్పత్తివినాశములచేత కర్మవశమువల్ల గలిగెడి సర్వదేహములయందును ఆత్మకుప్రవేశముగలుగుచున్నది. ఆకారణముచేత, ఆత్మ మధ్యమపరిమాణుడని నిశ్చయింపబడెనని దిగంబరులుచెప్పుదురు. అనగా ఆత్మకుకర్మవశమువల్ల ఆయాశరీరములు ప్రాప్తించునట్లు కర్మవశమువల్లనే ఆయాశరీరములయందు ప్రవేశించుటకుదగినట్లు ఆత్మకుఅవయవములుఃబుట్టుచు నశించుచుండునని యభిప్రాయము.

అవ. ఆత్మ అవయవసహితుడైనయెడల ఘటాదికమువలె ఆత్మకుఅనిత్యత్వప్రసంగముగలుగునని యీమతమునద్వైతసిద్ధాంతి ఇప్పుడుదూషించుచున్నాడు.

శ్లో॥ సాంశస్యఘటవన్నాశో భవత్యేవతథాసతి।
కృతనాశాకృతాభ్యాగమయోఃకోవారకోభవేత్ ॥ ౭౫.

టీ. సాంశస్య - అవయవసహితుడగుఆత్మునకు, ఘటవత్ - ఘటమునకువలె, నాశః - నాశనము, భవత్యేవ - కలుగుచున్నదేను, తథాసతి - అట్లునాశముగలుగుచుండగా, కృతనాశాకృతాభ్యాగమయోః = కృతనాశ - కృతనాశదోషముయొక్కయు, అకృతాభ్యాగమయోః - అకృతాభ్యాగమదోషముయొక్కయు, అనగా కృతనాశ అకృతాభ్యాగమములనెడి రెండుదోషములనుట. వారకః - నివారకుడు, అనగానివారింపజేయువాడు, కః ఎవడు, భవేత్ -అగును. అనగా నెవ్వడును లేడనుట.

తా. ఆత్మ అవయవసహితుడైనయెడల అవయవవంతమగు ఘటాదికమువలె ఆత్మయు నాశమునుబొందును. ప్ర. ఆత్మకు నాశముగలిగినఁగలుగనిమాత్ర. అందువల్లదోషమేమి?. ఉ. ఆత్మకునాశమును అంగీకరించినయెడల ఈదేహమునశించినప్పుడే ఆత్మయునశించుటచేత ఈజన్మమందుజేయబడిన పుణ్యాపాపకర్మములు భోగము


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్వ్యాకనేనశించును. ఇట్లునశించుట ౧. కృతవిప్రణాశదోషమని చెప్పబడును. మరియు ఈ ఆత్మ పూర్వజన్మమందు లేమిచేత పూర్వజన్మసంబంధకర్మము లేకనే యిప్పుడు నిర్నిమిత్తముగా బురుషునకు సుఖదుఃఖరూపభోగము గలుగుచున్నదని చెప్పవలసివచ్చును. ఇట్లు చెప్పుట, ౨. అకృతాభ్యాగమదోషమని చెప్పబడును. ఈ రెండుదోషములను నివారింపజేయుటకు ఎవ్వడును సమర్థుడుగాడు. అనగా ఆత్మకు అనిత్యత్వమునంగీకరించినయెడల ఈ రెండుదోషములుగలుగుచున్నవనియభిప్రాయము.

అవ. ఈపైన చెప్పబడినప్రకారము అణుత్వమధ్యమపరిమాణత్వములు సంభవింపమిచేత ఆత్మకువిభుత్వముసిద్ధమని యిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ తస్మాదాత్మామహానేవ నైవాణుర్నాపిమధ్యమః।
ఆకాశవత్సర్వగతో నిరంశశ్శ్రుతిసమ్మతః॥ ౮౮.

టీ. తస్మాత్ - అందువల్ల, ఆత్మా-ప్రత్యగాత్ముడు, మహానేవ - పరిపూర్ణుడే యగును. అణుః-అణుపరిమాణుడు, నైవ-కానేకాడు. మధ్యమోపి-మధ్యమపరిమాణుడును, న-కాడు. ఆకాశవత్-ఆకాశమువలె, సర్వగతః = సర్వ-సర్వమును, గతః-పొందినవాడును, అనగా సర్వవ్యాపియనుట. నిరంశః-అవయవరహితుడును, శ్రుతిసమ్మతం=శ్రుతి-వేదమునకు, సమ్మతం-సమ్మతమగును.

తా. ఈపైన చెప్పబడినప్రకారము ఆత్మ పరిపూర్ణుడేయగుగాని అణుపరిమాణుడును మధ్యమప్రమాణుడుగాడు. ప్ర. ఇందుకుప్రమాణమేమి? ఉ. ఆత్మ ఆకాశమువలె సర్వగతుడనియు, నిత్యుడనియు, నిష్కలుడనియు, నిష్క్రియుడనియు శ్రు॥ ఆకాశవత్సర్వగతశ్చనిత్యః నిష్కలంనిష్క్రియం॥ ఇత్యాదిశ్రుతి జెప్పుచున్నది.

అవ. ఇట్లు ఆత్మకువిభుత్వమును సాధించి ఆయాత్మకు చిద్రూపత్వమును నిశ్చయించుటకొరకు ఆవిషయమైవాదులకుగల వివాదము నిక జెప్పుచున్నాడు.

శ్లో॥ ఇత్యుక్త్వాతద్విశేషేతుబహుధాకలహంయయుః।
అచిద్రూపోథచిద్రూపశ్చిదచిద్రూపఇత్యపి॥ ౮౯.

టీ. ఇతి-ఈప్రకారము, ఉక్త్వా-ఆవాదులుచెప్పి, అథ-అపిమ్మట, తద్విశేషేతు=తత్-ఆయాత్మయొక్క, విశేషేతు-స్వరూపవిశేషమందో, అచిద్రూపః - జడస్వరూపుడనియు, చిద్రూపః-జ్ఞానస్వరూపుడనియు, చిదచిద్రూపః=చిత్-జ్ఞానస్వరూపుడును, అచిద్రూపః-జడస్వరూపుడునునియు, అనగా జ్ఞానాజ్ఞానస్వరూపుడనుట. ఇత్యపి - ఇట్లని, బహుధా - అనేకవిధములుగా,- కలహం - వివాదమును, యయుః-ఆవాదులుపొందిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్లు ఆ వాదులు జెప్పి ఆపిమ్మట ఆయాత్మస్వరూపవిశేషవిషయమై ఆత్మ జడస్వరూపుడనియు జ్ఞానస్వరూపుడనియు జ్ఞానాజ్ఞానస్వరూపుడనియు ఈప్రకారము ఆవాదులు అనేకవిధములుగా కలహించుచున్నారు.

అవ. ఆత్మ జడరూపుడని జెప్పెడి వాదిమతము నిప్పుడుజూపుచున్నాడు.

శ్లో॥ ప్రాభాకరాస్తార్కికాశ్చప్రాహురస్యాదిబాత్మతాం।
ఆకాశవద్ద్రివ్యమాత్మాశబ్దవత్తద్గుణశ్చితిః॥ ౮౮.

టీ. ప్రాభాకరాః-ప్రాభాకరులును, తార్కికాశ్చ-తార్కికులును, అస్య-ఈఆత్మనకు, అదిదాత్మతాం-జడస్వరూపత్వమును, ప్రాహుః-చెప్పుదురు. ఆత్మా-ఆత్మ, ఆకాశవత్-ఆకాశమువంటి, ద్రవ్యం-ద్రవ్యమనియు, శబ్దవత్-ఆకాశము యొక్క గుణమగుశబ్దమువలె, చితిః-జ్ఞానము, తద్గుణః=తత్-ఆయాత్మకు, గుణః-గుణమనియు, (ప్రాహుః) చెప్పుదురు.

తా. ఆవాదులలో ప్రాభాకరమతస్థులును తార్కికులును ఆత్మ జడస్వరూపుడని చెప్పుదురు. ప్ర. వారుజెప్పెడిప్రక్రియ ఎట్లు? ఉ ఆకాశమువంటిద్రవ్యము ఆత్మయగుననియు ఆకాశముయొక్క గుణమగుశబ్దమువలె ఆత్మకు జ్ఞానముగుణమనియు ఇట్లు అనుమానప్రమాణముచే జెప్పుదురు. ప్ర. అయితే ఇక్కడ ఆయనుమాన ప్రమాణమెట్లు? ఉ, ఆకాశము శబ్దగుణమునుగలిగియున్నట్లు ఆత్మ జ్ఞానగుణమును గలిగియుండుటవల్ల ఆత్మ ఆకాశమువంటి ద్రవ్యమగుటకు దగుచున్నదనియు ఆత్మ జ్ఞానగుణమునుగలిగియుండుటవల్ల పృథివ్యాదులవల్ల భేదింపబడుచున్నదనియు మరియు ఎద్ది, పృథివ్యాదికమువలె పృథివ్యాదులవల్ల భేదింపబడదో అద్ది, జ్ఞానగుణము గలదిగాదని యూహించుటయే ఇక్కడ అనుమానప్రమాణమని తెలియవలెను. ఇట్లు ప్రాభాకరాదులు జెప్పుదురని యభిప్రాయము.

అవ. ఆయాత్మకే మరికొన్ని విశేషగుణముల నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ ఇచ్ఛాద్వేషప్రయత్నాశ్చధర్మాధర్మౌసుఖాసుఖే।
తత్సంస్కారాశ్చతస్యైతేగుణాశ్చితివదీరితాః॥ ౮౯.

టీ. ఇచ్ఛాద్వేషప్రయత్నాశ్చ = ఇచ్ఛా - కోరికయు, ద్వేష - ద్వేషంబును, ప్రయత్నాశ్చ-ప్రయత్నములును, ధర్మాధర్మౌ = ధర్మ-ధర్మంబును, అధర్మౌ-అధర్మంబును, సుఖాసుఖే = సుఖ - సౌఖ్యతయు, అసుఖే - దుఃఖంబును, తత్సంస్కారాశ్చ = తత్-వానియొక్క, సంస్కారాశ్చ-భావనలును, ఏతే-ఇవియన్నియు, చితివత్-జ్ఞానమువలె, గుణాః-ఆత్మయొక్కగుణములని, ఈరితాః-చెప్పబడినవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మరియు, ౧. ఇచ్ఛయు, ౨. ద్వేషంబును, 3. ప్రయత్నములును, ౪. ధర్మంబును, ౫. అధర్మంబును, ౬. సుఖము, ౭. దుఃఖము, ౮. వానియొక్క భావనలు, ఇవియన్నియు జ్ఞానమువలెనే ఆత్మయొక్కగుణములని ఆప్రాభాకరాదులు జెప్పుదురు. ధర్మమనగా జేయదగినకార్యమనియు, అధర్మమనగా జేయదగని కార్యమనియుం దెలియవలెను.

అవ. ఈగుణములకు ఉత్పత్తివినాశకారణమును జెప్పుచున్నారు.

శ్లో॥ ఆత్మనోమనసాయోగే స్వాదృష్టవశతోగుణాః।
జాయంతేఽథప్రలీయంతేసుషుప్తేఽదృష్టసంక్షయాత్॥ ౯౦.

టీ. స్వాదృష్టవశతః = స్వ-తనయొక్క, అదృష్టవశతః-అదృష్టవశమువల్ల, ఆత్మనః-ఆత్మకు, మనసా-మనస్సుతోటి, యోగేసతి - సంబంధముగలుగుచుండగా, గుణాః-గుణములు, జాయంతే-పుట్టుచున్నవి. సుషుప్తే-సుషుప్తియందు, అదృష్టసంక్షయాత్ = అదృష్ట-అదృష్టముయొక్క, సంక్షయాత్-క్షయమువల్ల, అనగా అదృష్టము క్షయించుటవల్లననుట. అథ-పిమ్మట, ప్రలీయంతే-లయించుచున్నవి.

తా. మరియు తనఅదృష్టవశమువల్ల ఆత్మకుమనస్సుతోటి సంబంధముగలుగుచుండగా గుణములుబుట్టుచున్నవి. మరియు సుషుప్తియందు అదృష్టముక్షయించుటవల్ల ఆపుట్టినగుణములు లీనమగుచున్నవని ఆప్రాభాకరాదులుజెప్పుదురు.

శ్లో॥ చితిమత్త్వాచ్చేతనోయమిచ్ఛాద్వేషప్రయత్నవాన్।
స్యాద్ధర్మాధర్మయోఃకర్తాభోక్తాదుఃఖాదిమత్త్వతః॥ ౯౧.

టీ. ఇచ్ఛాద్వేషప్రయత్నవాన్ = ఇచ్ఛా - కోరికయు, ద్వేష-ద్వేషంబును, ప్రయత్నవాన్ - ప్రయత్నములంగల, అయం - ఈఆత్మ, చితిమత్త్వాత్ - జ్ఞానగుణవంతుడగుటవల్ల, చేతనః - చేతనుడగును. ధర్మాధర్మయోః - ధర్మాధర్మములను, కర్తా - చేయువాడగును. దుఃఖాదిమత్త్వతః = దుఃఖాది - దుఃఖములను, మత్త్వతః- గలిగియుండుటవల్ల, భోక్తా - కర్మఫలమననుభవించెడివాడును, స్యాత్ - అగును.

తా. ప్ర. అయితే ఆత్మ జడరూపుడైనయెడల చేతనుడెట్లాయెను? ఉ. జ్ఞానగుణమును గలిగియుండుటచేతయు ఇచ్ఛాద్వేషప్రయత్నములం గలిగియుండుటచేతయు ఆయాత్మ చేతనుడాయెను. ప్ర. అయితే ఈశ్వరునికంటె ఆత్మకుభేదమేమి? ఉ. పుణ్యపాపములను గలిగించెడి ధర్మాధర్మకార్యములను ఆత్మ (కర్త) చేయువాడగును. మరియు ఆకర్మఫలమగు దుఃఖాదికమును ఆత్మ (భోక్త) అనుభవించెడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పొడగును. ఈకర్తృత్వభోక్తృత్వములు రెండును ఆత్మకుగలిగియుండుటచేత ఆయా
త్మ ఈశ్వరునికంటె అన్యుడని తెలియవలెను.

శ్లో॥ యథాత్రకర్మవశతః కాదాచిత్కం సుఖాదికం।
తథాలోకాంతరే దేహే కర్మణేచ్ఛాదిజన్యతే॥ ౯౨.

టీ. అత్ర-ఈదేహమందు, కర్మవశతః-కర్మవశమువల్ల, యథా-ఏప్రకారము, సుఖాదికం.సుఖదుఃఖాదికము-కాదాచిత్కం-ఒకానొకప్పుడుగలుగుచున్నదో, తథా-ఆప్రకారము, లోకాంతరే-మరియొకలోకమందు, దేహేసతి-దేహముగలుగుచుండగా, కర్మణా-కర్మముచేత, ఇచ్ఛాది-ఇచ్ఛాదికము, జన్యతే-పుట్టుచున్నది.

తా. ప్ర. అయితే ఆత్మ సర్వగతుడైనయెడల అట్టిఆత్మకులోకాంతిరగమనాదికమెట్లు ఘటించును? ఉ. ఈదేహమందుకర్మవశమువల్ల ఏప్రకారముగా సుఖదుఃఖాదికము అప్పుడప్పుడు గలుగుచున్నదో అటువలెనే పరలోకమందును దేహముగలుగుచుండగా కర్మమువల్ల ఇచ్ఛాదికముగలుగుచున్నది. అనగా ఈదేహమందు కర్మవశమువల్ల ఇచ్ఛాదికముగలుగుచుండగా ఆత్మకు అవస్థానాదివ్యవహారముగలిగినట్లు కర్మవశమువల్ల లోకాంతరమందు మరియొకదేహముగలుగుచుండగా ఆదేహముతోగూడిన ఆత్మప్రదేశమందు సుఖాద్యుత్పత్తివశమువల్ల అక్కడఆత్మకుగమనాది వ్యవహారము గలుగుచుండును. గనుక ఇట్లుఆత్మకుగమనాదికము ఔపచారికమే యగునని ఆప్రాభాకరాదులయొక్క యభిప్రాయమగును.

శ్లో॥ ఏవంచసర్వగస్యాపిసంభవేతాంగమాగమౌ।
కర్మకాండస్సమగ్రోత్రప్రమాణమితితేఽవదన్॥ ౯౩.

టీ. ఏవంచ - ఈప్రకారముగా, సర్వగస్యాపి - సర్వగతుడైన ఆత్మకును, గమాగమౌ=గమ-గమనంబును, ఆగమ-ఆగమనంబును, సంభవేతాం-సంభవించును. అత్ర-ఈవిషయమై, సమగ్రః-ఫలసహితమగు, కర్మకాండః-కర్మకాండము, ప్రమాణమితి-ప్రమాణమని, తే-ఆప్రాభాకరాదులు, అవదన్-చెప్పిరి.

తా. ఈపైచెప్పబడిన ప్రకారము ఆత్మ సర్వగతుడైనను అట్టిఆత్మకు లోకాంతరగమనాగమనములుగలవని తెలియవలెను. ప్ర. అయితే ఆత్మకు, కర్తృత్వాదిధర్మముగల దనుటయందు ప్రమాణమేమి?. ఉ. సమగ్రమగు కర్మకాండమంతయు ప్రమాణమగునని ఆప్రాభారతార్కికులు చెప్పుదురని యభిప్రాయము.

శ్లో॥ ఆనందమయకోశోయస్సుషుప్తౌపరిశిష్యతే।
అస్పష్టచిత్సఆత్మైషాంపూర్వకోశోస్యతేగుణాః॥ ౯౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. సుషుప్తౌ-సుషుప్తియందు, అస్పష్టచిత్=అస్పష్ట-స్పష్టముకాని, చిత్-జ్ఞానరూపమగు, యః-ఏ, ఆనందమయకోశః-ఆనందమయకోశము, పరిశిష్యతే-శేషింపబడుచున్నదో, సః-ఆ, పూర్వకోశః-మొదటికోశము, ఏషాం-ఈప్రాభాకరాదులకు, ఆత్మా-ఆత్మయగును. అస్య-ఈఆత్మకు, తే-ముందుజెప్పబడిన జ్ఞానాదులు, గుణాః-గుణములగును.

తా. ప్ర. ఓఅద్వైతసిద్ధాంతీ పూర్వము అనగా ౨౭. డెబ్బదిఏడవశ్లోకమందు విజ్ఞానమయకోశముకంటె ఆనందమయకోశము అంతరమని చెప్పి ఆయానందమయకోశమే ఆత్మయని చెప్పబడెను. ఇప్పుడు ఇచ్ఛాదిగుణములంగలవాడు ఆత్మయని చెప్పబడుటచేత పూర్వోత్తరవిరోధములేదాయేమి?. ఉ. సుషుప్తియందు అస్పష్టజ్ఞానరూపమగు ఏఆనందమయకోశము శేషింపబడుచున్నదో ఆయానందమయకోశము శ్రుతిచేజెప్పబడిన పంచకోశములలో మొదటికోశమగును. ఆయానందకోశమే ఈప్రాభాకరాదులకు ఆత్మయగును. ఈఆత్మకు ముందుజెప్పబడిన జ్ఞానాదులన్నియు గుణములగునని ఆప్రాభాకరాదులు జెప్పుదురు. గనుక పూర్వోత్తరవిరోధము లేదని తెలియవలెను.

అవ. ఈయానందమయ కోశరూపుడగు ఆత్మకే, జ్ఞానజ్ఞానస్వరూపమును భాట్టులువర్ణించెదరని యిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ గూఢంచైతన్యముత్ప్రేక్ష్యజడబోధస్వరూపతాం।
ఆత్మనోబ్రువతేభాట్టాశ్చిదుత్ప్రేక్షోత్థితస్మృతేః॥ ౯౫.

టీ. భాట్టాః-భాట్టమతస్థులు, ఆత్మనః ఆత్మయొక్క, గూఢం-స్పష్టముగాని, చైతన్యం-జ్ఞానరూపమును, ఉత్ప్రేక్ష్య-ఊహించి, జడబోధస్వరూపతాం=జడ-అజ్ఞానస్వరూపత్వమును, బోధస్వరూపతాం-జ్ఞానస్వరూపత్వమును, బ్రువతే-చెప్పుచున్నారు. ఉత్థితస్మృతేః=ఉత్థిత-సుషుప్తినుంచిలేచినవానియొక్క, స్మృతేః-స్మృతివలన, చిదుత్ప్రేక్షా = చిత్ - చైతన్యముయొక్క, ఉత్ప్రేక్షా - ఊహ, (భవతి) కలుగుచున్నది.

తా. మరియు భాట్టులనెడి మతస్థులు ఆత్మయొక్క అస్పష్టజ్ఞానస్వరూపమునుఊహించి ఆత్మ జ్ఞానాజ్ఞానస్వరూపుడని జెప్పుదురు. ప్ర. అయితే వారు ఆత్మకు చైతన్యస్వరూపము నూహించుటకు గారణమేమి?. ఉ. సుషుప్తినుంచిలేచినపురుషునకు కలిగెడిస్మృతివలన ఆత్మకు చైతన్యరూపముగలదని ఊహించుచున్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. వారుచిద్రూపము నూహించెడి ప్రకారమునే, యిప్పుడు స్పష్టము జేయుచున్నాడు.

శ్లో॥ జడోభూత్వాతదాస్వాప్సమితిజాడ్యస్మృతిస్తదా।
వినాజాడ్యానుభూతింనకథంచిదుపపద్యతే॥ ౯౬.

టీ. తదా-ఆసుషుప్తికాలమందు, జడః-జడుడను, భూత్వా-ఐ, అస్వాప్సమితి-నిద్రించితినని యెడి, జాడ్యస్మృతిః=జాడ్య-జడస్వభావముయొక్క, స్మృతిః-స్మరణముగలుగుచున్నది. తదా-ఆసుషుప్తికాలమందు, జాడ్యానుభూతింవినా=జాడ్య-జడస్వభావముయొక్క, అనుభూతింవినా-అనుభవమునువిడచి, అనగా జాడ్యానుభవము లేకనేయనుట. కథంచిత్-ఎట్లును, నోపపద్యతే-ఈస్మృతి పొందబడదు.

తా. సుషుప్తినుండిలేచినవానికి ఆసుషుప్తికాలమందు జడుడనై అనగానేమియుందెలియనివాడనై నిద్రించితినని యెడి ఈరూపముగలస్మృతి గలుగుచున్నది. గనుక ఆసుషుప్తియందు జడస్వభావము అనుభవింపబడకనే ఈస్మృతిగలుగనేరదు. అనగా ఈస్మృతి సుషుప్తియందుగల జడస్వభావముయొక్క అనుభవమును కల్పించుచున్నదని ఆభాట్టులు చెప్పుదురని యభిప్రాయము.

అవ. సుషుప్తియందు చైతన్యములోపింపదనెడి విషయమై ప్రమాణమును జెప్పుచున్నారు.

శ్లో॥ ద్రష్టుర్దృష్టేరలోపశ్చశ్రుతస్సుప్తౌతతస్స్వయం।
అప్రకాశప్రకాశాభ్యామాత్మాఖద్యోతవద్యుతః॥ ౯౭.

టీ. సుప్తౌ-సుషుప్తికాలమందు, ద్రష్టుః-ఆత్మయొక్క, దృష్టేః-స్వరూపభూతచైతన్యముయొక్క, అలోపశ్చ-లోపములేదనియు, శ్రుతః శ్రుతివల్లవినబడుచున్నది. తతః-ఆకారణమువల్లను, స్వయం-తానైన, ఆత్మ-ఆత్మ, ఖద్యోతవత్-మిణుగురుపురుగువలె, అప్రకాశప్రకాశాభ్యాం=అప్రకాశ-అప్రకాశముతోటియు, ప్రకాశాభ్యాం-ప్రకాశముతోటియు, యుతః-కూడినవాడగును.

తా. మరియు-శ్రు॥ నహిద్రష్టుర్దృష్టేర్విపరిలోపోవిద్యతేఽవినాశిత్వాత్॥ అనెడిశ్రుతియందు ఆత్మయొక్క స్వరూపభూతమగు చైతన్యమునకు వినాశస్వభావము లేమిచేత సుషుప్తియందు ఆచైతన్యలోపములేదని వినబడుచున్నది. మరియు ఇట్లుగాక సుషుప్తియందు చైతన్యలోపముగలదని వాదించెడివానికిని సాక్షికములేని ఆత్మచైతన్యలోపమును చెప్పుటకు శక్యముగాదు. అనగాసుషుప్తియందు చైతన్యములేద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ని చెప్పినయెడల తానేలేకపోవుటచేత ఆత్మచైతన్యలోపమునకు సాక్షిలేడనియు సాక్షిలేని చైతన్యలోపము నంగీకరింపరాదనియుం దెలియవలెను. ఈకారణమువలన సూర్యునివలె ఆత్మ అప్రకాశ ప్రకాశములతోఁగూడియున్నాడని భాట్టులు చెప్పుదురు.

అవ. ఈభాట్టమతమందు దూషణమును దెలిపెడి, సాంఖ్యమతము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ నిరంశస్యోభయాత్మత్వంనకథంచిద్ఘటిష్యతే।
తేనచిద్రూపఏవాత్మేత్యాహుస్సాంఖ్యావివేకినః॥ ౯౭.

టీ. వివేకినః వివేకవంతులగు, సాంఖ్యాః-సాంఖ్యమతస్థులు, నిరంశస్య-నిరవయవునకు, ఉభయాత్మత్వం-జ్ఞానాజ్ఞానరూపత్వము, కథంచిత్-ఎట్లును, నఘటిష్యతే-ఘటింపబడదు. తేన-ఆకారణముచేత, ఆత్మా ఆత్మ, చిద్రూపఏవేతి-జ్ఞానస్వరూపుడేనని, ఆహుః-చెప్పుదురు.

తా. మరియు వివేకవంతులగు సాంఖ్యులు అవయవములులేని ఆత్మకుజ్ఞానాజ్ఞానస్వరూపత్వము ఎట్లును సంభవింపదు గనుక ఆత్మ (చిద్రూపుడు)=జ్ఞానస్వరూపుడేయగునని చెప్పుదురు.

శ్లో॥ జాడ్యాంశఃప్రకృతేరూపంవికారిత్రిగుణంచతత్।
చితోభోగాపవర్గార్థంప్రకృతిస్సాప్రవర్తతే॥ ౯౮.

టీ. జాడ్యాంశః-అజ్ఞానభాగము, ప్రకృతేః-ప్రకృతియొక్క, రూపం-రూపమగును. తత్-ఆప్రకృతిరూపము, త్రిగుణం-త్రిగుణస్వరూపముగలదియు, వికారిచ-వికారముగలదియునగును. చితః-ఆత్మకు, భోగాపవర్గార్థం=భోగ-భోగముకొరకును, అపవర్గార్థం-మోక్షముకొరకును, అనగా పురుషునకు భోగమోక్షములను గలిగించెడికొరకనుట. సా-ఆ, ప్రకృతిః-ప్రకృతి, ప్రవర్తతే-ప్రవర్తించుచున్నది.

తా. ప్ర. అయితే ఆత్మ చిద్రూపుడైనయెడల సుషుప్తినుంచిలేచిన పురుషునకు గలిగెడి జాడ్యస్మృతికి గతియేమి?. ఉ. సుషుప్తియందు అనుభవింపబడెడిజడాంశము ప్రకృతియొక్క రూపమగును. ఆప్రకృతిరూపము సత్వరజస్తమోగుణములంగలదియగును. వికారము కలదియునగును. ప్ర. అయితే ప్రకృతినిగల్పించుటచేత ప్రయోజనమేమి?. ఉ. ఆప్రకృతి (ఆత్మకు)=పురుషునకు భోగమోక్షములకొరకు ప్రవర్తించుచున్నది. గనుక ప్రయోజనముగలదని ఆసాంఖ్యులు చెప్పుదురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ అసంగాయాశ్చితేర్బంధమోక్షౌ భేదాగ్రహాన్మతౌ।
బంధముక్తివ్యవస్థార్థం పూర్వేషామివచిద్భిదా॥ ౧౦౦.

టీ. భేదాగ్రహాత్ = భేద-ప్రకృతిపురుషులయొక్క స్వరూపభేదమును, అగ్రహాత్-గ్రహింపమివల్ల, అసంగాయాః-సంగములేని, చితేః-చిత్తునకు, అనగాబురుషునకనుట. బంధమోక్షౌ-బంధమోక్షావస్థలు, మతౌ-సమ్మతములగును.

తా. ప్ర. అయితే (చిత్తు)=ఆత్మ, అసంగుడగుటచేత అట్టిఆత్మయనెడి పురుషునకును ప్రకృతికిని అత్యంతభేదము గలిగియుండగా ప్రకృతివర్తించుటచేత బురుషునకు భోగమోక్షములెట్లు గలుగును?: ఉ. ప్రకృతిపురుషులయొక్క స్వరూపములను విభజించిభిన్నముగా నెరుగమిచేత పురుషునియందు భోగమోక్షములు వ్యవహరింపబడుచున్నవని ఆసాంఖ్యులు జెప్పుదురు. మరియు బంధమోక్షావస్థలను స్థాపించుటకొరకు తార్కికాదులచేత ఆత్మభేదమంగీకరింపబడినట్లు ఈసాంఖ్యులచేతయు ఆత్మభేదమంగీకరింపబడెనని తెలియవలెను.

అవ. ప్రకృతిగలదనుటయందును, పురుషుడసంగుడనుటయందును, ఆసాంఖ్యులు జెప్పెడిశ్రుతిని యిప్పుడు ఉదహరించుచున్నాడు.

శ్లో॥ మహతః పరమవ్యక్తమితిప్రకృతిరుచ్యతే।
శ్రుతావసంగతాతద్వదసంగోహీత్యతిస్ఫుటా॥ ౧౦౧.

టీ. ప్రకృతిః-ప్రకృతి, మహతః-మహత్తత్త్వముకంటె, పరం-పరమనియు, అవ్యక్తం-వ్యక్తరూపముగానిదియని, అనగా నేత్రాదీంద్రియములచే విషయీకరింపబడనిదనుట. శ్రుతౌ-శ్రుతియందు, ఉచ్యతే-చెప్పబడుచున్నది. తద్వత్-ఆప్రకారము, అసంగతా-పురుషునకసంగత్వము, అసంగోహీతి-ఈపురుషుడు అసంగుడనిజెప్పెడిశ్రుతిచేత, అతిస్ఫుటా-మిగులస్పష్టత్వమును బొందుచున్నది.

తా. మరియు ప్రకృతి మహత్తత్త్వముకంటె పరమైనదనియు అవ్యక్తమనియు ఇట్లుశ్రుతియందు వినబడుచున్నది. మరియు పురుషుడుఅసంగుడని-శ్రు॥ అసంగోహ్యయంపురుషః॥ అనెడిశ్రుతిచేత స్పష్టముగా దెలియబడుచున్నదని ఆసాంఖ్యులు జెప్పుదురు.

అవ. ఇట్లు, జీవవిషయమైనవాదులయొక్క కలహమునుజూపి, యికనీశ్వరుని విషయమైన వాదులయొక్కకలహములంజూపుటకు, యోగులుజెప్పెడి, ఈశ్వరరూపము నిప్పుడు స్థాపించుచున్నాడు.

శ్లో॥ చిత్సన్నిధౌప్రవృత్తాయాః ప్రకృతేర్హినియామకం।
ఈశ్వరం బ్రువతే యోగాః స జీవేభ్యః పరశ్శ్రుతః॥ ౧౦౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. యోగాః-యోగశాస్త్రిములు, అనగా యోగులనుట. చిత్సన్నిధౌ=చిత్-ఆత్మయొక్క, సన్నిధౌ-సమీపమందు, ప్రవృత్తాయాః-ప్రవర్తించుచుండెడి, ప్రకృతేః-ప్రకృతియొక్క, నియామకం-నియామకుని, అనగా ప్రకృతిని నియమంచెడివానినుట. ఈశ్వరం-ఈశ్వరునిగా, బ్రువతే-చెప్పుదురు. సః-ఆఈశ్వరుడు, జీవేభ్యః-జీవులకంటె, పరః-శ్రేష్ఠుడని, శ్రుతః-శ్రుతులయందు వినబడుచున్నాడు.

తా. మరియు (చిత్తుయొక్క)=ఆత్మయొక్కసన్నిధియందు ప్రవర్తించుచుండెడి ప్రకృతిని నియమించెడివాడు ఈశ్వరుడని యోగులుచెప్పుదురు. ప్ర. అయితే ప్రకృతిపురుషులకంటె అన్యుడైనఈశ్వరునికల్పించుట అప్రమాణముగాదాయేమి?. ఉ. ఆయీశ్వరుడు జీవులకంటెశ్రేష్ఠుడని శ్రుతులయందు వినబడుచున్నాడు. కనుక అప్రమాణముగాదని ఆయోగులుజెప్పుదురు.

అవ. ఈశ్వరస్థితిని ప్రతిపాదించెడి, ఆశ్రుతినిప్పుడుపఠించుచున్నారు.

శ్లో॥ ప్రధానక్షేత్రజ్ఞపతిర్గుణేశ ఇతిహిశ్రుతిః।
అరణ్యకేసంభ్రమేణహ్యంతర్యామ్యుపపాదితః॥ ౧౦౩.

టీ. ప్రధానక్షేత్రజ్ఞపతిః=ప్రధాన-ప్రకృతికిని, క్షేత్రజ్ఞ-జీవులకును, పతిః-అధిపతియనియు, గుణేశః=గుణ-సత్వరజస్తమోగుణములకు, ఈశః-ప్రభువనియు, అనగాగుణములను నియమించెడివాడనుట. ఇతి-ఈప్రకారము, శ్రుతిర్హి-శ్రుతిజెప్పుచున్నది. ఆరణ్యకే-అంతర్యామిబ్రాహ్మణమందు, అంతర్యామీ-ఈశ్వరుడు, సంభ్రమేణ - భయముచేత, ప్రతిపాదితః - ప్రతిపాదించబడెను. అనగా జెప్పబడెననుట.

తా. సత్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థారూపమగు ప్రకృతికిని జీవులకును అధిపతియనియు. సత్వరజస్తమోగుణములను నియమించెడివాడనియు ఇట్లు ఈశ్వరుడుగలడని శ్రుతిజెప్పుచున్నది. మరియు ఇత్యాదిశ్రుతియేగాక అంతర్యామి బ్రాహ్మణమందును భయముచేత ఈశ్వరుడు చెప్పబడెనని యోగులు జెప్పుదురని యభిప్రాయము.

అవ. ఆయీశ్వరవిషయమైన వాదులకలహము నికదెలుపుచున్నాడు.

శ్లో॥ అత్రాపికలహాయంతే వాదినస్స్వస్వయుక్తిభిః।
వాక్యాన్యపియథాప్రజ్ఞం దార్ఢ్యాయోదాహరంతిహి॥ ౧౦౪.

టీ. అత్రాపి - ఈయీశ్వరవిషయమందును, వాదినః - వాదులు, స్వస్వయుక్తిభిః=స్వస్వ-తమతమయొక్క, యుక్తిభిః-యుక్తులచేత, కలహాయంతే-కలహమును జేయుచున్నారు, దార్ఢ్యాయ-తమమతము దృఢమగుటకొరకు, యథాప్రజ్ఞం-తమప్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్ఞనతిక్రమించినట్లుగా, వాక్యాన్యపి-వాక్యంబులనుకూడ, ఉదాహరింతిహి-ఉదహరించుచున్నారు.

తా. ఈయీశ్వరవిషయమందును వాదులుఁతమతమనుదోచెడి యుక్తులచేతకలహములంజేయుచు ఆవాదులు తమతమమతము దృఢమగుటకొరకు తమబుద్ధికొలది వాక్యములంగూడ ఉదహరించుచున్నారు.

అవ. ఇప్పుడు, పతంజలిచేజెప్పబడిన, ఈశ్వరునిప్రతిపాదించెడి॥ సూత్రం॥ క్లేశకర్మవిపాకైస్తదాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః॥ అనెడిసూత్రార్థము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ క్లేశకర్మవిపాకైస్తదాశయైరప్యసంయుతః।
పుంవిశేషోభవేదీశో జీవవత్సోప్యసంగచిత్॥ ౧౦౫.

టీ. క్లేశకర్మవిపాకైః=క్లేశ-అవిద్యాదిపంచక్లేశములతోటియు, కర్మ-కర్మములతోటియు, విపాకైః-జాత్యాయుర్భోగములనెడి ఫలవిశేషములతోటియు, తదాశయైః=తత్-వానియొక్క, ఆశయైః-సంస్కారములతోటియు, అసంయుతః-కూడుకొనని, అనగానంటబడనియనుట. పుంవిశేషః-పురుషశ్రేష్ఠుడు, ఈశః-ఈశ్వరుడు, భవేత్-అగును. సోపి-ఆఈశ్వరుడును, జీవవత్-జీవునివలె, అసంగచిత్=అసంగ-అసంగుడును, చిత్-చిద్రూపుడునగును.

తా. అవిద్యాదిపంచక్లేశములచేతయు కర్మములచేతయు ఆకర్మఫలవిశేషములను జాత్యాయుర్భోగములచేతయు (వానిసంస్కారములు) అనగాభావనలచేతయు అంటబడనిపురుషశ్రేష్ఠుడు ఈశ్వరుడగుననియును ఆయీశ్వరుడుజీవునివలెనే అసంగుండును చిద్రూపుండునగునని పతంజలిచేజెప్పబడెను. కర్మములనగా అశుక్లకృష్ణమనెడిపేరుగల కర్మము (అదృష్టము) యోగికిగలదనియు ఇతరులకు త్రివిధకర్మముండుననియుం బతంజలిచేత సూత్రం॥ కర్మాశుక్లకృష్ణం యోగినస్త్రివిధమితరేషాం॥ అనెడి సూత్రమందు జెప్పబడెనని తెలియవలెను.

శ్లో॥ తథాపిపుంవిశేషత్వాద్ఘటతేస్యనియంతృతా।
అవ్యవస్థౌబంధమోక్షావాపతేతామిహాన్యథా॥ ౧౦౬.

టీ. తథాపి-అట్లుఅసంగచిద్రూపుడైనను, పుంవిశేషత్వాత్-పురుషశ్రేష్ఠుడగుటవల్ల, అస్య-ఈయీశ్వరునకు, నియంతృతా-నియామకత్వము, ఘటతే-ఘటించుచున్నది. అన్యథా-అట్లుగానియెడల, అనగానీశ్వరునకు నియామకత్వము లేనియెడలననుట. ఇహ-ఇక్కడ, బంధమోక్షౌ-బంధమోక్షములు, అవ్యవస్థౌ-సంతౌ-నియమములేనివై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గా స్థాపింపబడనివగుచు, అపతేతాం-పడిపోవును. అనగా బంధమోక్షములు నియమ మునుతప్పి, వ్యత్యస్తమును బొందుననుట.

తా. ప్ర. అయితే ఈశ్వరుడు అసంగచిద్రూపుడైనయెడల అతడు నియమిం చెడివాడెట్లగును?. ఉ. ఆయాశ్వరుడు అసంగచిద్రూపుడైనను పురుషశ్రేష్ఠుడగుట వల్ల అతడుసర్వమును నియమించుటకు సమర్థుడగును. ప్ర. అయితే ఈశ్వరునకు ని యామకత్వము నంగీకరించనియెడల దోషమేమి? ఉ. ఆయాశ్వరునకు నియామకత్వ ముగలదని చెప్పనియెడల ఇక్కడ బంధమోక్షములురెండును నియమమునుతప్పి వ్య త్యస్తమును బొందునని పతంజలిమతమగును.

శ్లో॥ భీషాస్మాదిత్యేవమాదావసంగస్యపరాత్మనః।
శ్రుతంతద్యుక్తమప్యస్యక్లేశకర్మాద్యసంగమాత్॥ ౧౦౭.

టీ. అస్మాత్-ఈయాశ్వరునివల్ల, భీషా-భయహేతుత్వము గలుగుచున్నదని, ఇత్యేవమాదౌ-ఈప్రకార మిత్యాదిశ్రుతియందు, అసంగస్య- నిస్సంగుడైన, పరాత్మ నః-పరమాత్మునకు, తత్-అనియామకత్వము, శ్రుతం-వినబడుచున్నది. అస్య-ఈ యాశ్వరునకు, క్లేశకర్మాద్యసంగమాత్=క్లేశ-అవిద్యాదిపంచక్లేశములతోటియు, క ర్మాది-కర్మాదులతోటియు, అసంగమాత్-సంబంధములేమివల్ల, యుక్తమపి-నియా మకత్వము యుక్తమేయగును.

తా. ప్ర. అయితే అసంగుడైనఈశ్వరునకు నియామకత్వముండెడి విషయమై ప్రమాణములేదుగదా?. ఉ. శ్రు॥ భీషాస్మాత్॥ అనెడి యిత్యాదిశ్రుతియందు ఈశ్వ రుడు నియామకుడని వినబడుచున్నాడు. ప్ర. అయితేఅసంగుడైన ఈశ్వరునకునియా మకత్వము వినబడినను యుక్తముగాని దెట్లంగీకరింపబడును?. ఉ. జీవధర్మరాశియ గు క్లేశకర్మాదికముతోటి ఈశ్వరునకు సంబంధములేమివల్ల ఈశ్వరునకు నియామక త్వముగలదని చెప్పుటయుక్తమే యగునని పతంజలిమతమగును.

శ్లో॥ జీవానామప్యసంగత్వాత్ క్లేశాదిర్నహ్యథాపిచ।
వివేకాగ్రహతః క్లేశకర్మాదిప్రాగుదీరితం॥ ౧౦౮.

టీ. జీవానామపి, జీవులకును, అసంగత్వాత్-అసంగస్వభావమువల్ల, క్లేశాదిః- క్లేశకర్మాదికము, నహి - వాస్తవమందులేనేలేదు. అథాపిచ - అయినను, వివేకాగ్ర హతః=వివేక - అసంగత్వవివేకముయొక్క, అగ్రహతః-గ్రహణములేమివల్ల, అనగా అసంగత్వజ్ఞానము లేమిచేననుట. ప్రాక్-పూర్వము, ఉదీరితం-చెప్పబడిన, క్లేశకర్మా ది=క్లేశ-అవిద్యాదిక్లేశ పంచకంబును, కర్మాది-కర్మాదికంబునుగలదు.

తా. ప్ర. అయితే జీవులకును అసంగచిద్రూపత్వము గలిగియుండుటచేత ఆ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జీవులును క్లేశకర్మాదిరహితులగుచుండగా ఈశ్వరునియందు ఆధిక్యమేమి? ఉ. ఆ జీవులకు అసంగచిద్రూప స్వభావముచేత వాస్తవమందు క్లేశకర్మాదికములేకపోయి నను నేనసంగచిద్రూపుడనని బుద్ధితోటివిభజించి యెరిగెడిలక్షణముగల జ్ఞానములేమి చేత పూర్వము (౧౦౫) వ శ్లోకమందు చెప్పబడిన క్లేశాదిధర్మరాశితోటి జీవులకు సంబంధముగలిగియున్నదని తెలియవలెను. ఇట్లు పతంజలిమతమనియభిప్రాయము.

అవ. తార్కికులు అసంగుడైన ఈశ్వరునకు నియామకత్వమును సహింపని వారగుచు ఈశ్వరునకు జీవులకంటె భేదముసిద్ధించుటకొరకు జ్ఞానాదిగుణత్రయమును నిత్యముగా నంగీకరించుచున్నారని యిప్పుడుజెప్పుచున్నాడు.

శ్లో॥ నిత్యజ్ఞానప్రయత్నేచ్ఛాగుణానీశస్యమన్వతే।
అసంగస్యనియంతృత్వమయుక్తమితితార్కికాః॥ ౧౦౯.

టీ. తార్కికాః - తార్కికులు, అసంగస్య - అసంగుడైన, ఈశస్య - ఈశ్వరునకు, నియంతృత్వం - నియామకత్వము, అయుక్తమితి - కూడదని, నిత్యజ్ఞానప్రయత్నేచ్ఛాగుణాన్ = నిత్య - నిత్యములైన, జ్ఞాన - జ్ఞానంబును, ప్రయత్న - ప్రయత్నంబును, ఇచ్ఛా - ఇచ్ఛలనెడి, గుణాన్ - మూడుగుణములను, మన్వతే - తలచుచున్నారు. అనగా నంగీకరింపుచున్నారనుట.

తా. తార్కికులు అసంగుడైన ఈశ్వరునకు నియామకత్వముగూడదని ౧. జ్ఞానము, ౨. ప్రయత్నము, ౩. ఇచ్ఛ, ఈమూడుగుణములును ఈశ్వరునకు నిత్యములైయున్నవని అంగీకరించిరి.

శ్లో॥ పుంవిశేషత్వమప్యస్యగుణైరేవనచాన్యథా।
సత్యకామస్సత్యసంకల్పఇత్యాదిశ్రుతిర్జగౌ॥ ౧౧౦.

టీ. అస్య - ఈయీశ్వరునకు, గుణైరేవ - గుణములచేతనే, పుంవిశేషత్వం = పురుషశ్రేష్ఠత్వముగలిగియున్నది. అన్యథా - మరియొకవిధముచేత, నచ - కాదు. సత్యకామః = సత్య - నిజమైన, కామః - ఇచ్ఛగలవాడనియు, సత్యసంకల్పః = సత్య - నిజమైన, సంకల్పః - సంకల్పముగలవాడనియు, ఇత్యాదిశ్రుతిః - ఇత్యాదివేదవాక్యము, జగౌ - చెప్పుచున్నది.

తా. ప్ర. అయితే ఇచ్ఛాదిగుణములంగల ఈశ్వరునకు జీవునికంటె విలక్షణత్వ మెట్లుగలుగును?. ఉ. జ్ఞానప్రయత్నేచ్ఛలనెడి మూడుగుణములును నిత్యములగుటచేతనే ఆఈశ్వరుడు జీవునికంటెవిలక్షణుడై పురుషశ్రేష్ఠుడని చెప్పబడుచున్నాడు. అయితే ఈశ్వరునకుజ్ఞానాదిగుణములు నిత్యముగానున్నవనుటయందు ప్రమాణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మేమి?. ఉ. ఆయీశ్వరుడు సత్యకాముడనియు సత్యసంకల్పుడనియు శ్రు॥ సత్యకామస్సత్యసంకల్పః॥ అనెడి యిత్యాదిశ్రుతి జెప్పుచున్నదని ఆతార్కికులు చెప్పుదురు.

అవ. ఆతార్కికమతమందును దోషమున్నని చెప్పెడి మరియొకమతమునిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ నిత్యజ్ఞానాదిమత్త్వేఽస్య సృష్టిరేవ సదా భవేత్।
హిరణ్యగర్భ ఈశోఽతో లింగదేహేన సంయుతః॥ ౧౧౧.

టీ. అస్య - ఈయీశ్వరునకు, నిత్యజ్ఞానాదిమత్త్వేసతి=నిత్య - నిత్యముగా, జ్ఞానాదిమత్త్వేసతి - జ్ఞానాదిగుణములుగలిగియుంచుండగా, సదా - ఎల్లప్పుడు, సృష్టిరేవ - సృష్టించుటయే, భవేత్ - అగును. అతః - ఆకారణమువల్ల, లింగదేహేన - సమష్టిసూక్ష్మశరీరముతోటి, సంయుతః - కూడుకొనియుండెడి, హిరణ్యగర్భః - సూత్రాత్ముడు, ఈశః - ఈశ్వరుడగును.

తా. మరియు అంతర్యామియగు ఈశ్వరునకు తార్కికులు చెప్పిన ప్రకారము జ్ఞానప్రయత్నేచ్ఛలనెడి మూడుగుణములును నిత్యముగానున్నయెడల అట్టియీశ్వరుని వల్ల సర్వదా సృష్టియేయగుచుండవలయుననియు అట్లుసర్వదా సృష్టియగుచుండమి చేత ఆయంతర్యామి యీశ్వరుడుగాడనియు హిరణ్యగర్భుడు ఈశ్వరుడగునని హైరణ్యగర్భులు చెప్పుదురు. ప్ర. అయితే ఆహిరణ్యగర్భునకు స్వరూపమేమి?. ఉ. మాయోపాధిగల పరమాత్మ సమష్టిలింగశరీరముతోగూడి యభిమానించుటచేత హిరణ్యగర్భుడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ ఉద్గీథబ్రాహ్మణే తస్య మాహాత్మ్యమతివిస్తృతం।
లింగసత్త్వేఽపి జీవత్వం నాస్య కర్మాద్యభావతః॥ ౧౧౨.

టీ. తస్య - ఆహిరణ్యగర్భునియొక్క, మాహాత్మ్యం - ప్రభావము, ఉద్గీథబ్రాహ్మణే=ఉద్గీథ - ఉద్గీథమనెడి, బ్రాహ్మణే - బ్రాహ్మణమందు, విస్తృతమితి-విస్తారముగాజెప్పబడెనని చెప్పుదురు. అస్య - ఈహిరణ్యగర్భునకు, లింగసత్త్వేఽపి=లింగ- సూక్ష్మశరీరముతోటి, సత్త్వేఽపి - స్థితిగలిగినను, కర్మాద్యభావతః = కర్మాది - కర్మకామాదికముయొక్క, అభావతః - లేమివల్ల, జీవత్వం - జీవభావము, న - లేదు.

తా. ప్ర. అయితే హిరణ్యగర్భుడు ఈశ్వరుడగుననుటయందు ప్రమాణమేమి?. ఉ. ఆహిరణ్యగర్భునియొక్క మహాత్మ్యము ఉద్గీథమనెడి బ్రాహ్మణమందు విస్తారముగా జెప్పబడియున్నది. గనుక ఉద్గీథబ్రాహ్మణము ప్రమాణమగును. ప్ర. అయితే ఆహిరణ్యగర్భుడు లింగశరీరసంబంధాభిమానముచేత జీవుడుగాడాయేమి?.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ఆహిరణ్యగర్భునకు సమష్టిసూక్ష్మశరీర సంబంధాభిమానము గలిగియున్నను అవిద్యాకామకర్మములులేమిచేత అతనికి జీవత్వముసంభవింపదని అహైరణ్యగర్భులు జెప్పుదురు.

అవ. ఇప్పుడు మరియొకమతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ స్థూలదేహంవినాలింగదేహోనక్వాపిదృశ్యతే।
వైరాజోదేహఈశోఽతస్సర్వతోమస్తకాదిమాన్॥ ౧౧౩.

టీ. లింగదేహః - సూక్ష్మశరీరము, స్థూలదేహంవినా - స్థూలశరీరమునువిడిచి, క్వాపి - ఎచ్చటనైనను, నదృశ్యతే - కనబడలేదు. అతః - అందువల్ల, సర్వతః - అంతటను, మస్తకాదిమాన్ - శిరశ్చక్షుః పాదాద్యవయవములుంగల, వైరాజః - విరాడ్సంబంధమైన, అనగా విరాట్పురుషునియొక్క యనుట. దేహః - శరీరము, అనగా విశ్వరూపమనుట. ఈశః - ఈశ్వరుడగును.

తా. మరియు విరాడుపాసకులు స్థూలదేహములేని లింగశరీరమెచ్చటంగనబడదనియు కనుక అంతటను శిరఃపాదాద్యవయవములంగల విరాట్పురుషునియొక్క విశ్వరూపమే ఈశ్వరుడగునని చెప్పుదురు. అనగా సమష్టిస్థూలశరీరసంబంధాభిమాని యగు విరాట్పురుషుడే ఈశ్వరుడగునని యభిప్రాయము.

అవ. ఆవిరాట్పురుషుడుండుటయందు ప్రమాణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ సహస్రశీర్షేత్యేవంచవిశ్వతశ్చక్షురిత్యపి।
శ్రుతమిత్యాహురనిశంవిశ్వరూపస్యచింతకాః॥ ౧౧౪.

టీ. విశ్వరూపస్య - విరాట్పురుషునియొక్క, చింతకాః - ఉపాసకులు, అనిశం - సర్వదా, సహస్రశీర్షేతి - విరాట్పురుషుడనేక శిరస్సులుగలవాడనియు, విశ్వతః - అంతటను, చక్షురిత్యపిచ - నేత్రములుంగలవాడనియు, ఏవం - ఈప్రకారము, శ్రుతమితి - పురుషసూక్తమందు వినబడుచున్నదని, ఆహుః - చెప్పుదురు.

తా. ప్ర. అయితే ఆవిరాట్పురుషుడుండుటయందు ప్రమాణమేమి?. ఉ. పురుషసూక్తము ప్రమాణమగును. ఆపురుషసూక్తమందు విరాట్పురుషుడు అనేక శిరస్సులంగలవాడనియు అంతటను నేత్రములంగలిగియున్నాడనియు ఈప్రకారము చెప్పబడియున్నదనియు గనుక ఆవిరాట్పురుషుడే ఈశ్వరుడగునని ఆవిరాడుపాసకులు జెప్పుదురు.

అవ. ఈవిరాట్టుయందును దోషదృష్టిచేత దేవతాంతరము నాశ్రయింపబడుచున్నదని యిప్పుడు జెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ సర్వతఃపాణిపాదత్వేక్రిమ్యాదేరపిచేశతా।
తతశ్చతుర్ముఖోదేవఏవేశోనేతరఃపుమాన్॥ ౧౧౫.

టీ. సర్వతః - అంతటను, పాణిపాదత్వేసతి= పాణి - చేతులును, పాదత్వే సతి - పాదములుంగల స్వభావముగలుగుచుండగా, క్రిమ్యాదేరపిచ - పురుగు మొదలగు జంతువునకును, ఈశతా - ఈశ్వరత్వముగలుగును. తతః - ఆకారణమువల్ల, చతుర్ముఖః - నాలుగునాలుగుముఖములంగల, దేవఏవ - బ్రహ్మదేవుడే, ఈశః - ఈశ్వరుడగును. ఇతరః - ఇతరుడగు, పుమాన్ - పురుషుడు, న - ఈశ్వరుడు గాడు.

తా. అట్టి విరాట్పురుషునకు అంతటను కాలు చేయి మొదలగు అవయవములు గలిగియుండుటచేత అవిరాట్పురుషుడు ఈశ్వరుడని చెప్పినయెడల పురుగు మొదలగు జంతువునుగూడ ఈశ్వరుడని చెప్పవలసివచ్చును. గనుక నాలుగుముఖములంగల బ్రహ్మదేవుదే ఈశ్వరుడగుననియు ఇతరపురుషుడు ఈశ్వరుడు గాడనియు మరికొందరుజనులు చెప్పుదురు.

శ్లో॥ పుత్రార్థంతముపాసీనాఏవమాహుఃప్రజాపతిః।
ప్రజాఅసృజతేత్యాదిశ్రుతించోదాహరంత్యమీ॥ ౧౧౬.

టీ. పుత్రార్థం - పుత్రసంతానముకొరకు, తం - ఆబ్రహ్మదేవుని, ఉపాసీనాః - ఉపాసించెడిజనులు, ఏవం - ఈప్రకారము, ఆహుః - చెప్పుదురు. అమీ - ఈజనులు, ప్రజాపతిః - ప్రజాపతి, ప్రజాః - ప్రజలను, అసృజత - సృష్టించెనని చెప్పెడి, ఇత్యాదిశ్రుతించ - ఇత్యాదిశ్రుతినియు, ఉదాహరంతి - ప్రమాణముగా, నుదహరించుచున్నారు.

తా. ప్ర. ఇట్లు చెప్పెడివారెవ్వరో జెప్పుము ? ఉ. పుత్రసంతానముకొరకు ఆబ్రహ్మదేవుని ఉపాసించెడిజనులు ఈప్రకారము చెప్పుదురు. మరియు ఈజనులు బ్రహ్మదేవుడు ప్రజలను సృష్టించెనని శ్రు॥ ప్రజాపతిఃప్రజాఅసృజత॥ అనెడి శ్రుతి చెప్పుచుండుటచేత బ్రహ్మదేవుడే ఈశ్వరుడగునని చెప్పుదురు.

అవ. ఇప్పుడు భాగవతమతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ విష్ణోర్నాభేస్సముద్భూతోవేధాఃకమలజస్తతః।
విష్ణురేవేశఇత్యాహుర్లోకేభాగవతాజనాః॥ ౧౧౭.

టీ. వేధాః - సృష్టికర్తయగు, కమలజః - బ్రహ్మదేవుడు, విష్ణోః - విష్ణుదేవుని యొక్క, నాభేః - నాభివల్ల, సముద్భూతః - పుట్టెను. తతః - ఆకారణమువల్ల, విష్ణురేవ - విష్ణుదేవుడే, ఈశఇతి - ఈశ్వరుడని, లోకే - లోకమందు, భాగవతాః - భాగవతమతస్థులైనటువంటి, జనాః - జనులు, ఆహుః - చెప్పుదురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మరియు లోకమందు భాగవతమతస్థులు సృష్టికర్తయగుబ్రహ్మదేవుడు విష్ణుదేవునియొక్క నాభిపద్మమువలన బుట్టెననియు అందుచేత విష్ణుదేవుడే ఈశ్వరుడగుగాని బ్రహ్మదేవుడు ఈశ్వరుడుగాడనియుం జెప్పుదురు.

అవ. ఇప్పుడు శైవులయొక్క మతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ శివస్యపాదావన్వేష్టుం శార్ఙ్గ్యశక్తస్తతశ్శివః।
ఈశోనవిష్ణురిత్యాహుశ్శైవాఆగమమానినః॥ ౧౧౮.

టీ. శార్ఙ్గీ-విష్ణుదేవుడు, శివస్య-శివునియొక్క, పాదౌ-పాదములను, అన్వేష్టుం-వెదకుటకు, అశక్తః-అసమర్థుడాయెను. తతః-ఆకారణమువల్ల, శివః-శివుడు, ఈశః-ఈశ్వరుడగుననియు, విష్ణు-విష్ణుదేవుడు. నేతి-ఈశ్వరుడుగాడని, ఆగమమానినః=ఆగమ-ఆగమములయందు, మానినః-అభిమానవంతులగు, శైవాః-శివమతస్థులు, ఆహుః-చెప్పుదురు.

తా. మరియు ఆగమములయందు అభిమానవంతులగు శివమతస్థులు విష్ణుదేవుడు శివునిపాదములను వెదకుటకు అసమర్థుడాయెననియు ఆకారణమువల్ల శివుడే ఈశ్వరుడగుగాని విష్ణుదేవుడు ఈశ్వరుడుగాడని చెప్పుదురు.

అవ. ఇప్పుడు గాణపత్యమతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ పురత్రయంసాధయితుంవిఘ్నేశంసోప్యపూజయత్।
వినాయకంప్రాహురీశంగాణపత్యమతేరతాః॥ ౧౧౯.

టీ. సోపి-ఆశివుడును, పురత్రయం-పురత్రయమును, అనగాత్రిపురాసురులనునట. సాధయితుం-సాధించుటకు, విఘ్నేశం-గణపతిని, అపూజయదితి-పూజించెనని, గాణపత్యమతే-గణపతిమతమందు, రతాః-ఆసక్తులగుజనులు, వినాయకం-గణపతిని, ఈశం-ఈశ్వరునిగా, ప్రాహుః-చెప్పుదురు.

తా. మరియు ఆశివుడును త్రిపురములను సాధించుటకు విఘ్నేశ్వరునిబూజించుటచేత వినాయకుడే ఈశ్వరుడగుగాని శివుడు ఈశ్వరుడుగాడని గాణపత్యమతస్థులు జెప్పుదురు.

అవ. ఈచెప్పబడినన్యాయమును ఇతరమతములయందును జూపుచున్నాడు.

శ్లో॥ ఏవమన్యేస్వస్వపక్షాభిమానేనాన్యథాన్యథా।
మంత్రార్థవాదకల్పాదీనాశ్రిత్యప్రతిపేదిరే॥ ౧౨౦.

టీ. ఏవం-ఈప్రకారము, అన్యే-భైరవమైలారాద్యుపాసకులు; స్వస్వపక్షాభిమానేన=స్వస్వ-తమతమయొక్క, పక్ష-మతమందుగల, అభిమానేన-అభిమానము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేత, అన్యథాన్యథా-వెవ్వేరువిధముగా, అనగాదమచే నుపాసింపబడెడి దేవతాదిక మునసుట. మంత్రార్థవాదకల్పాదీన్ =మంత్ర-మంత్రములయొక్క, అర్థవాద-అర్థవాదములను, కల్పాదీన్-కల్పాదులను, అనగా స్థలపురాణాదులననుట. ఆశ్రిత్య-ఆశ్రయించి, ప్రతిపేదిరే-ఈశ్వరునిగాబొందిరి.

తా. ఈపైచెప్పబడిన ప్రకారమే భైరవమైలారాద్యుపాసకులును వేరువేరువిధముగానీశ్వరుని వర్ణించుచున్నారు. ప్ర. అయితే వారట్లువర్ణించుటకు గారణమేమి?. ఉ. తమతమమతాభిమానమే గారణమగును. మరియు ఆయాదేవతాదికము ఈశ్వరుడని చెప్పుటయందు మంత్రములయొక్క అర్థవాదములును స్థలమాహాత్మ్యదులంజెప్పెడి పురాణకల్పాదులను ప్రమాణములగునని ఆజనులుచెప్పుదురు.

శ్లో॥ అంతర్యామిణమారభ్యస్థావరాంతేశవాదినః।
సంత్యశ్వత్థార్కవంశాదేఃకులదైవత్వదర్శనాత్॥ ౧౨౧.

టీ. అశ్వత్థార్కవంశాదేః = అశ్వత్థ-రావిచెట్టునకును, అర్క-జిల్లేడుచెట్టునకును, వంశాదేః-ఎదురుమొదలగుచెట్టునకు, కులదైవత్వదర్శనాత్ =కులదైవత్వ-కులదేవతాభావముయొక్క, దర్శనాత్-దర్శనమువల్ల, అనగావృక్షాదికమును కులదేవతనుగా జనులుపూజించుటవల్లననుట. అంతర్యామిణం-అంతర్యామిని, ఆరభ్య-మొదలుకొని, స్థావరాంతేశవాదినః=స్థావర-వృక్షాదికమే, అంత-అంతముగాగలభూతములను, ఈశ-ఈశ్వరుడని, వాదినః-వాదించెడిజనులు, సంతి-కలరు.

తా. ప్ర. అయితే ఇట్లు ఎన్నిమతములున్నవో జెప్పుము?. ఉ. అంతర్యామినిమొదలుకొని వృక్షాదికపర్యంతముగల భూతములను ఈశ్వరునిగాజెప్పెడిజనులు గలరు, గనుక లోకమందు లెక్కలేనిమతములున్నవని తెలియవలెను. ప్ర. అయితే వృక్షాదికము నీశ్వరునిగావాదించెడి మతమెచ్చటగలదు?. ఉ. లోకమందు రావి జిల్లేడువెదురుమొదలగు వృక్షాదికమును కులదేవతనుగా లోకమందుజనులు బూజించుటను జూచుచున్నాము. గనుక స్థావరేశవాదములేదని చెప్పరాదు.

శ్లో॥ తత్వనిశ్చయకామేనన్యాయాగమవిచారిణాం।
ఏకైవప్రతిపత్తిస్స్యాత్సాప్యత్రస్ఫుటముచ్యతే॥ ౧౨౨.

టీ. తత్వనిశ్చయకామేన-పరతత్వనిశ్చయేచ్ఛచేత, న్యాయాగమవిచారిణాం=న్యాయ-న్యాయముయొక్కయు, ఆగమ-వేదాంతశాస్త్రముయొక్కయు, విచారిణాం-విచారణస్వభావముగలపురుషులకు, ప్రతిపత్తిః-ఈశ్వరవిషయమైనబుద్ధి, ఏకైవ-ఒక్కటియేయగును. సాపి-ఆప్రతిపత్తియు, అత్ర-ఈగ్రంథమందు, స్ఫుటం-స్ఫుటముగా, ఉచ్యతే-చెప్పబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే ఇట్లుమతభేదముగలిగియుండగా ఏమతముగ్రహింపదగిన దో మరియేమతము విడువదగినదో చెప్పుము?. ఉ. పరతత్త్వమును నిశ్చయింపవలెన నెడియిచ్ఛచేత న్యాయవిచారణయు వేదాంతశాస్త్రవిచారణయుంగల పురుషులకు ఈశ్వరవిషయమైనప్రతిపత్తి ఒక్కటియేయగును. ఆప్రతిపత్తి ఈచిత్రదీపమందు స్ఫుటముగా చెప్పబడుచున్నది.

అవ. ఆప్రతిపత్తినే చూపుటకు, అందుకనుకూలశ్రుతినిప్పుడుపరించుచున్నాడు.

శ్లో॥ మాయాంతుప్రకృతింవిద్యాన్మాయినంతుమహేశ్వరం।
అస్యావయవభూతైస్తువ్యాప్తంసర్వమిదంజగత్॥ ౧౨౩.

టీ. మాయాంతు-మాయనే, ప్రకృతిం.జగదుపాదానకారణభూతమగు ప్రకృతినగా, విద్యాత్-తెలియవలెను. మాయినంతు-మాయోపాధికుడగు అంతర్యామినే, మహేశ్వరం-మాయాధిష్ఠాతనుగా, అనగానిమిత్తకారణునిగానునుబ. (విద్యాత్) తెలియవలెను. అస్య-ఈయంతర్యామియొక్క, అవయవభూతైస్తు-అంశరూపులగు చరాచరాత్మకజీవులచేత, ఇదం - ఈ, సర్వం - సకలమగు, జగత్ - ప్రపంచము, వ్యాప్తం-వ్యాపించబడెను.

తా. మాయనే జగత్తునకు ఉపాదానకాలణమగు ప్రకృతినిగానెరుగవలెనని యు మాయోపాధికుడగు అంతర్యామినే మాయకుఆధారుడగు నిమిత్తకారణునిగా నె రుగవలెననియు ఈమహేశ్వరునియొక్క అంశరూపులగు చరాచరాత్మకజీవులచేత ఈజగంబంతయు వ్యాపింపబడెనని ఈశ్రుతి చెప్పుచున్నది.

అవ. ఈశ్రుతిప్రకారము ఈశ్వరవిషయ నిర్ణయముచేయుట, యుక్తమని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఇతిశ్రుత్యనుసారేణన్యాయ్యోనిర్ణయఈశ్వరే।
తథాసత్యవిరోధస్స్యాత్ స్థావరాంతేశవాదినాం॥ ౧౨౪.

టీ. ఇతి-ఈప్రకారముజెప్పెడి, శ్రుత్యనుసారేణ.శ్రుతిప్రకారము, ఈశ్వరే-ఈశ్వరవిషయమై, నిర్ణయః-నిర్ణయము, న్యాయ్యః-తగినదగును. తథాసతి-అట్లగుచుండగా, స్థావరాంతేశవాదినాం=స్థావర-వృక్షాదికమే, అంత-అంత్యముగాగలభూతములను, ఈశ - ఈశ్వరుడని, వాదినాం - వాదించెడివారికి, అవిరోధః - సమ్మతము, స్యాత్ -అగును.

తా. ఈచెప్పబడిన శ్రుతిప్రకారముగా ఈశ్వరవిషయమైన నిర్ణయము యుక్తమగును. ప్ర. ఎందుచేతనీనిర్ణయము యుక్తమగునో చెప్పుముని. ఉ. అట్లు ఈశ్వర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్ణయముంజేసినయెడల, వృక్షాంత్యపర్యంతముగల భూతములను ఈశ్వరుడనిపాదించెడి జనులకందరికిని సమ్మతమగును. అనగా ఈశ్రుతిప్రకారము సర్వము ఈశ్వరభావమేయగుటచేత లోకమందుగల ఏమతస్థునకును విరోధములేదని యభిప్రాయము.

అవ. ఇకను మాయారూపమును జెప్పుచున్నాడు.

శ్లో॥ మాయాచేయంతమోరూపా తాపనీయేతదీరణాత్।
అనుభూతింతత్రమానం ప్రతిజజ్ఞే శ్రుతిస్స్వయం॥ ౧౨౫.

టీ. తాపనీయే - తాపనీయోపనిషత్తునందు, తదీరణాత్ = తత్ - ఆతమోరూపియగుమాయయొక్క, ఈరణాత్ - అభిధానమువల్ల, అనగా తమోరూపత్వము జెప్పబడుటచేననుట. ఇయంచ-ఈమాయ, తమోరూపా-తమోరూపియగును. తత్ర-ఆతమోరూపత్వమందు, అనుభూతిం-లోకానుభవమును, మానం-ప్రమాణమునుగా, శ్రుతిః-శ్రుతి, స్వయం-తాను, ప్రతిజజ్ఞే-తెలిపెను.

తా. ప్ర. అయితే జగత్తునుకలిగించినమాయకు రూపమేమి?. ఉ. జగత్తును కలిగించిన ఈమాయ తమోరూపియగును. ప్ర. ఇదితమోరూపియని చెప్పుటకుగారణమేమి?. ఉ. మాయ తమోరూపియని శ్రు॥ మాయాచతమోరూపా॥ ఇట్లుతాపనీయోపనిషత్తునందు ఆతమోరూపత్వము చెప్పబడియున్నది. ప్ర. అయితే మాయ తమోరూపియనుటయందు ప్రమాణమేమి?. ఉ. ఆతమోరూపత్వమందు లోకానుభవమును ప్రమాణముగా శ్రుతి దెలిపినది.

శ్లో॥ జడంమోహాత్మకంతచ్చేత్యనుభావయతిశ్రుతిః।
ఆబాలగోపంస్పష్టత్వాదానంత్యంతస్యసాబ్రవీత్॥ ౧౨౬.

టీ. తత్-ఆతమోరూపియగుమాయ, జడం-జడరూపియనియు, మోహాత్మకం-మోహనరూపియనియు, ఇతి-ఈప్రకారము, శ్రుతిః-వేదవాక్యము, అనుభావయతి-అనుభవమును స్పష్టీకరించుచున్నది. ఆబాలగోపం-పిల్లవాడు మొదలుకొని గొల్లవానిపర్యంతము స్పష్టత్వాత్-స్పష్టమగుటవల్ల, అనగా సర్వానుభవ సిద్ధమగుటవల్లననుట. తస్య-ఆతమోరూపియగుమాయకు, ఆనంత్యం - అనంతస్వభావమును, సా-ఆశ్రుతి, అబ్రవీత్ -చెప్పెను.

తా. ప్ర. అయితే మాయయొక్కతమోరూపత్వమందు ఈలోకానుభవమెద్ది?. ఉ. ఆతమోరూపియగు ఈమాయ జడరూపియనియు మోహనరూపియనియు శ్రు॥ తదేతజ్జడంమోహాత్మకం॥ అనెడిశ్రుతియే లోకానుభవమును స్పష్టీకరించుచున్నది. మరియు జడభావమోహనభావములు రెండును ప్రకృతియొక్కకార్యములైన విష

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యము పిల్లవాడు గొల్లవాడు మొదలగు సర్వజనులకును అనుభవసిద్ధముగుటవల్ల శ్రు॥ అనంతం॥ అనెడిశ్రుతి ఆతమోరూపియగుమాయకు అనంతస్వభావమును జెప్పెను. అనగా సర్వానుభవసిద్ధత్వమే అనంతస్వభావమని తెలియవలెను.

అవ. ఇప్పుడు జడమోహశబ్దార్థములంజెప్పుచున్నాడు.

శ్లో॥ అచిదాత్మఘటాదీనాంయత్స్వరూపంజడంహితత్।
యత్రకుంఠీభవేద్బుద్ధిస్సమోహ ఇతిలౌకికాః॥ ౧౨౭.

టీ. అచిదాత్మఘటాదీనాం=అచిదాత్మ - అచేతనవస్తువులగు, ఘటాదీనాం - ఘటాదులకు, యత్ - ఏ, స్వరూపం - స్వరూపముగలదో, తద్ధి - అదియే, జడం - జడశబ్దార్థమగును. యత్ర - ఎచ్చట, అనగా నేవిషయమందనుట. బుద్ధిః - బుద్ధి, కుంఠీ - పొరబాటునుబొందినది, భవేత్ - అగునో, సః-అది, మోహఇతి - మోహమని, లౌకికాః - లౌకికులు జెప్పుదురు.

తా. అచేతనములగు ఘటాదులకు ఏస్వరూపముగలదో అదియే జడశబ్దార్థమగును. మరియు ఏవిషయమందు బుద్ధి పొరబాటునుబొందినదగునో అదిమోహశబ్దార్థమగును.

శ్లో॥ ఇత్థంలౌకికదృష్ట్యైతత్సర్వైరప్యనుభూయతే।
యుక్తిదృష్ట్యాత్వనిర్వాచ్యంనాసదాసీదితిశ్రుతేః॥ ౧౨౮.

టీ. ఇత్థం - ఈప్రకారము, లౌకికదృష్ట్యా - లోకదృష్టిచేత, ఏతత్ - ఈజాడ్యమోహలక్షణతమోరూపత్వము, సర్వైరపి - సర్వజనులచేతయు, అనుభూయతే - అనుభవింపబడుచున్నది. యుక్తిదృష్ట్యాతు - యుక్తిదృష్టిచేతనో, నాసదాసీదితి - సత్యాసత్యరూపికాదనిచెప్పెడి, శ్రుతేః - శ్రుతివల్ల, అనిర్వాచ్యం - వాక్కుచేజెప్పుటకు శక్యముగానిదగును.

తా. ఈపైనచెప్పబడిన జాడ్యమోహలక్షణతమోరూపత్వము లోకదృష్టిచేత సర్వజనులచేననుభవింపబడుచుండుటవల్ల సర్వానుభవసిద్ధత్వలక్షణముగల అనంతస్వభావము మాయకుసిద్ధించెనని తెలియవలెను. ప్ర. అయితే ఈప్రకారము మాయకు సర్వానుభవసిద్ధత్వముగలుగుచుండగా ఆమాయ ఘటాదికమువలె జ్ఞానముచేతనివర్తింపబడదుగదా?. ఉ. యుక్తిదృష్టిచేత ఆమాయ సత్యమనియైనను అసత్యమనియైనం జెప్పుటకు శక్యముగానిదగును. గనుక ఆమాయ జ్ఞానముచేతనివర్తింపబడునని తెలియవలెను. ప్ర. అయితే ఆమాయ (అనిర్వాచ్యం) వాక్కుచేజెప్పుటకుశక్యముగానిదనుటయందు ప్రమాణమేమి?. ఉ. మాయ సత్యముగాదనియు అసత్యముగాదనియుం జెప్పెడి శ్రు॥ నాసదాసీన్నోసదాసీత్॥ ఇత్యాదిశ్రుతియే ప్రమాణమగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఈశ్రుతియొక్క యభిప్రాయము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ నాసదాసీద్విభాతత్వాన్నోసదాసీచ్చ బాధనాత్।
విద్యాదృష్ట్యాశ్రుతంతుచ్ఛంతస్యనిత్యనివృత్తితః॥ ౧౨౯.

టీ. విభాతత్వాత్-ఆమాయప్రకాశించుచుండుటవల్ల, అసత్-లేనిది, నాసీత్-కాదు. బాధనాత్-శ్రుతినిషేధించుటవల్ల, అనగా శ్రుతి చేనిషేధింపబడుటవల్లననుట. సచ్చ - ఉండునదియు, అనగా సత్యమనుట. నోఆసీత్ - కాదు. తస్య - అతమో రూపియగుమాయ, నిత్యనివృత్తితః=నిత్య - సర్వదా, నివృత్తితః - నివృత్తినిబొందుటవల్ల, విద్యాదృష్ట్యా - జ్ఞానదృష్టిచేత, తుచ్ఛం - తుచ్ఛరూపియగును.

తా. ఆతమోరూపియగుమాయ ప్రత్యక్షముగా దోచుచుండుటవల్ల (అసత్యం)=లేనిదిగాదని శ్రు॥ నాసదాసీత్। అనెడి శ్రుతిజెప్పుచున్నది. మరియు ఈమాయా రూపములేనిదేయగునని చెప్పెడి శ్రు॥ నేహనానాస్తికించన॥ అనెడి శ్రుతిచేతనిషేధింపబడుటవల్ల సత్యముగాదు. మరియు సత్యాసత్యరూపమువిరుద్ధమగుటవల్ల శ్రు॥ అయుక్తం॥ అనెడిశ్రుతిచేత ఆమాయ ఉపేక్షింపబడెను. ఈప్రకారముగా శ్రుతియుక్తిదృష్టిచేత ఆమాయ అనిర్వచనీయమనిదెలిపెనని తెలియవలెను. మరియు విద్వాంసులయొక్కఅనుభవముచేత శ్రు॥ తుచ్ఛమిదంరూపస్య॥ అనెడిశ్రుతి ఆమాయకు తుచ్ఛత్వమును దెలుపుచున్నది. అనగా జ్ఞానదృష్టిచేత ఆమాయ సర్వదాలేనిదేనని యభిప్రాయము. ప్ర. ఆమాయ తుచ్ఛరూపియగుటకు గారణమేమి?. ఉ. జ్ఞానముచేత సర్వదానివర్తింపబడుటవల్ల తుచ్ఛమగునని తెలియవలెను. తుచ్ఛమనగా కాలత్రయమందును లేనిదనియర్థము.

అవ. ఈయుపపాదింపబడిన అర్థము నుపసంహరించుచున్నాడు.

శ్లో॥ తుచ్ఛాఽనిర్వచనీయాచవాస్తవీచేత్యసౌత్రిధా।
జ్ఞేయామాయాత్రిభిర్బోధైశ్శ్రౌతయౌక్తికలౌకికైః॥ ౧౩౦.

టీ. అసౌ - ఈ, మాయా - మాయ, శ్రౌతయౌక్తికలౌకికైః=శ్రౌత - శ్రుతిసంభధమైనట్టియు, యౌక్తిక - యుక్తిసంభధమైనట్టియు, లౌకికైః - లోకసంబంధమైనట్టియు, త్రిభిః - మూడైన, బోధైః - జ్ఞానములచేత, అనగా దృష్టులచేననుట. తుచ్ఛా - సర్వదాలేనిదనియు, అనిర్వచనీయాచ - నోటిచేజెప్పుటకు శక్యముగానిదనియు, వాస్తవీచ - సత్యమనియు, ఇతి - ఈప్రకారము, త్రిధా - మూడువిధములు గలదిగా, జ్ఞేయా - తెలియదగినదగును.

తా. ఈమాయ శ్రౌతబోధచేత మూడుకాలములయందును లేనిదనియు యు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్తిసంబంధబోధచేత అనిర్వచనీయమనియు లౌకికబోధచేత వాస్తవమనియు ఈప్రకారము త్రివిధముగా దెలియదగినదగును.

అవ. ఈజగత్తుయొక్క ఉనికిలేములను జూపుచున్నదని చెప్పెడి శ్రు॥ అస్య సత్త్వమసత్త్వంచదర్శయతి॥ అనెడిశ్రుతియొక్క అర్థమగు ఈమాయయొక్కకృత్యము నిప్పుడు జెప్పుచున్నాడు

శ్లో॥ అస్యసత్త్వమసత్త్వంచజగతోదర్శయత్యసౌ।
ప్రసారణాచ్చసంకోచాద్యథాచిత్రపటస్తథా॥ ౧౩౧.

టీ. ప్రసారణాత్ - తెరచుటనుచేయుటవల్లను, సంకోచాత్ - మడపును బొందుటవల్లను, చిత్రపటః - చిత్రవస్త్రము, యథా - ఏప్రకారముగా దనయందు గల చిత్తరుపుయొక్క ఉనికిలేములందెలుపుచున్నదో, తథా - ఆప్రకారము, అసౌ - ఈమాయ, అస్య - ఈ, జగతః - జగంబుయొక్క, సత్త్వం - ఉనికినియు, అసత్త్వంచ - లేమినియు, దర్శయతి - చూపుచున్నది.

తా. చిత్రవస్త్రము తెరవబడుచు తనయందుగల చిత్రవర్ణస్థితిని జూపినట్లును ఆచిత్రవస్త్రము మడవబడుచు తనయందుగల చిత్రవర్ణములను జూపనట్లును ఈమాయ ఈజగంబుయొక్క ఉనికిలేములంజూపుచున్నది. ఇదియేమాయయొక్కకృత్యమగును.

అవ. శ్రు॥ స్వతంత్రాస్వతంత్రత్వేన॥ అనెడి శ్రుతిచేత, మాయకు, ౧. స్వాతంత్ర్యము, ౨. అస్వాతంత్ర్యము, ఈరెండును జూపబడుటచేత, ఆరెంటియందుని ప్పుడు సబబును జెప్పుచున్నాడు.

శ్లో॥ అస్వతంత్రాహిమాయాస్యాదప్రతీతేర్వినాచితం।
స్వతంత్రాపితథైవస్యాదసంగస్యాన్యథాకృతేః॥ ౧౩౨.

టీ. మాయా-మాయ, చితంవినా-చిత్తునువిడచి, అనగానాత్మనువిడచియనుట. అప్రతీతేః-తోపమివల్ల, అస్వతంత్రాహి-స్వాతంత్ర్యములేనిదే, స్యాత్-అగును అసంగస్య-కూటస్థాత్మను, అన్యథా-మరియొకవిధముగా, అనగాసంగముగలవానిని గాననుట. కృతేః-చేయుటవల్ల, స్వతంత్రాపి-స్వాతంత్ర్యముగలదియు, తథైవ-ఆప్రకారమే, స్యాత్-అగును.

తా. మరియు ఆమాయ తనన్నుప్రకాశింపజేసెడి ఆత్మచైతన్యమును విడచి ప్రత్యేకముగాదోపమిచేత అస్వతంత్రయనిచెప్పబడును. మరియు అసంగుడైనకూటస్థాత్మను అన్యవిధముగాజేయుటవల్ల ఆమాయ స్వతంత్రయనియుం జెప్పబడును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. కూటస్థాత్మనుజేసిన అన్యవిధమునే, యిప్పుడుస్పష్టీకరించుచున్నాడు.

శ్లో॥ కూటస్థాసంగమాత్మానంజగత్త్వేనకరోతిసా।
చిదాభాసస్వరూపేణజీవేశావపినిర్మమే॥ ౧౩౩.

టీ. సా-ఆమాయ, కూటస్థాసంగం=కూటస్థ-కూటస్థభావముచేత, అసంగం-నిస్సంగుడైన, ఆత్మానం-ప్రత్యగాత్మను, జగత్త్వేన-జగద్భావముగా, అనగాజగద్రూపునిగాననుట. కరోతి-చేయుచున్నది. చిదాభాసస్వరూపేణ-చిదాభాసరూపముచేత, జీవేశావపి-జీవేశ్వరులనిద్దరినిగూడ, నిర్మమే-నిర్మించినది.

తా. ఆమాయ కూటస్థస్వభావముచేత నిస్సంగుడైన ప్రత్యగాత్మను జగద్రూపముగల వానినిగాజేయుచున్నది. అనగా ఆప్రత్యగాత్మనందు సర్వజగత్తునుకల్పించినదని యభిప్రాయము. మరియు శ్రు॥ జీవేశావాభాసేనకరోతి॥ అనెడి శ్రుతిప్రకారము ఆమాయ చిదాభాసస్వరూపముజేత జీవేశ్వరులనిద్దరిని సృష్టించెను. అనగా జీవేశ్వరవిభాగంబును జేసెనని యభిప్రాయము.

శ్లో॥ కూటస్థమనుపద్రుత్యకరోతిజగదాదికం।
దుర్ఘటైకవిధాయిన్యాంమాయాయాంకాచమత్కృతిః॥ ౧౩౪.

టీ. కూటస్థం-కూటస్థాత్మను, అనుపద్రుత్య-ఉపద్రవింపక, అనగా కూటస్థునకు ఉపద్రవముగలిగింపకనుట. జగదాదికం - జగముమొదలగుదానిని, కరోతి - చేయుచున్నది. దుర్ఘటైకవిధాయిన్యాం = దుర్ఘటైక - కేవలదుర్ఘటత్వమును, అనగా నసాధ్యముననుట. విధాయిన్యాం - ఘటింపజేసెడి, మాయాయాం - మాయయందు, చమత్కృతిః - ఆశ్చర్యకారణము, కా - ఏమి ?. అనగాలేదనుట.

తా. ప్ర. అయితే ఆమాయ ప్రత్యగాత్మనందు జగదాదికమునుకల్పించుటచేత ఆప్రత్యగాత్మను అన్యవిధముగలవానినిగాజేసినయెడల అతనికిగలకూటస్థస్వభావమునకు హానిగలుగలేదాయేమి ?. ఉ. ఆకూటస్థస్వభావమునకు ఉపద్రవము గలిగింపకనే ఆకూటస్థునియందు జగదాదిస్వరూపమునుకల్పించెను. ప్ర. అయితే కూటస్థభావమునకు విఘాతములేనట్లుగా ఆకూటస్థునియందు జగదాదిస్వరూపమును గల్పించుట దుర్ఘటముగాదాయేమి ?. ఉ. కేవలదుర్ఘటత్వమును ఘటింపజేసెడె స్వభావముగల మాయయందు ఆశ్చర్యకారణములేదు. అనగా కేవలదుర్ఘటత్వమును ఘటింపజేసెడి స్వభావము మాయయందుండుటచేత ఇదియొకయాశ్చర్యకారణముగాదనియు అట్లు దుర్ఘటత్వమును ఘటింపజేసెడి స్వభావము మాయయందులేనియెడల మాయాశబ్దార్థమే చెడిపోవునని యభిప్రాయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. మాయకు దుర్ఘటకారిత్వ స్వభావముగలిగియుండుటయందు దృష్టాంత మునిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ ద్రవత్వముదకేవహ్నావౌష్ణ్యంకాఠిన్యమశ్మని।

మాయాయాందుర్ఘటత్వంచస్వతస్సిధ్యతినాన్యతః॥ ౧౩౫.

టీ. ఉదకే-జలమందు, ద్రవత్వం-తడియు, వహ్నౌ-అగ్నియందు, ఔష్ణ్యం-ఉష్ణస్వభావంబును, అశ్మని-రాతియందు, కాఠిన్యం-కఠినత్వంబును, మాయాయాం-మాయయందు, దుర్ఘటత్వంచ-దుర్ఘటకారిత్వంబును, స్వతః-స్వాభావికముగా, సిధ్యతి-సిద్ధించుచున్నది. అన్యతః-అన్యపదార్థమువల్ల, న-సిద్ధించుటలేదు.

తా. మరియు జలమందు ద్రవత్వంబును అగ్నియందు ఉష్ణత్వంబును రాతియందు కఠినత్వంబును స్వాభావికముగానున్న వేయగుగాని అన్యపదార్థమువల్ల గలుగునట్లు మాయయందు దుర్ఘటమును ఘటింపజేసెడి శక్తియు స్వాభావికముగా నున్నదేయగుగాని అన్యపాదార్థమువల్ల గలిగినదిగాదని తెలియవలెను.

శ్లో॥ నవేత్తిలోకోయావత్తంసాక్షాత్తావచ్చమత్కృతిం।

ధత్తేమనసిపశ్చాత్తుమాయైషేత్యుపశామ్యతి॥ ౧౩౬.

టీ. లోకః-జనము, యావత్-ఎంతపర్యంతము, తం-ఆమాయాప్రయోగకర్తను, సాక్షాత్-ప్రత్యక్షముగా, నవేత్తి-ఎరుగదో, తావత్-అంతపర్యంతము, మనసి-మనస్సునందు, చమత్కృతిం-చమత్కారహేతుత్వమును, ధత్తే-ధరించుచున్నది. పశ్చాత్తు-ఆమాయాప్రయోగకర్తనెరిగినపిమ్మటనో, ఏషా-ఇది, మాయేతి-మాయయని, ఉపశామ్యతి-ఉపశమమును బొందుచున్నది.

తా. ప్ర. అయితే లోకమందు మాయకు చమత్కారహేతుత్వము గనబడుచుండగా మాయయొక్క దుర్ఘటకారిత్వము ఆశ్చర్యకారణముగాదని యెట్లుచెప్పితిరి?. ఉ. లోకమందును ఇంద్రజాలాది మాయాప్రయోగకర్తను జను లెంతపర్యంతము ప్రత్యక్షముగా జూడరో అంతపర్యంతము ఇది బహుచమత్కారహేతువుగానున్నదని మనస్సునందు ధరించుచున్నారు. ఆమాయాప్రయోగకర్తను ప్రత్యక్షముగాజూచిన పిమ్మట ఇదిమాయయని జనులు ఉపేక్షించుచున్నారు. కనుక మాయాప్రయోగకర్తను ప్రత్యక్షముగా జూచెడిపర్యంతమే ఆమాయ ఆశ్చర్యకారణమగుగాని మాయాప్రయోగకర్తను జూచినపిమ్మట ఆశ్చర్యకారణముగాదని తెలియవలెను.

 CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. మరియు, జగంబు సత్యమని చెప్పెడి, తార్కికాదివాదులనుగురించి, యిట్టిచోద్యములు జేయదగినవేయగుగాని, జగంబు మాయామయమని జెప్పెడి, మాయావాదినిగురించి, యిట్టిచోద్యములంజేయరాదని యిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రసరంతిహిచోద్యానిజగద్వస్తుత్వవాదిషు।
నచోదనీయంమాయాయాంతస్యాశ్చోద్యైకరూపతః॥ ౧౩౬

టీ. జగద్వస్తుత్వవాదిషు=జగత్-ప్రపంచమునకు, వస్తుత్వ-సత్యత్వమును,వాదిషు-వాదించెడి తార్కికాదులయందు, చోద్యాని-చోద్యములు, ప్రసరంతిహి-వ్యాపించుచున్నవి. తస్యాః-ఆమాయకు, చోద్యైకరూపతః=చోద్య-ఆశ్చర్యమే, ఏక-ముఖ్యమైన, రూపతః-స్వరూపమగుటవల్ల, మాయాయాం-మాయయందు, చోదనీయం-చేయదగిన చోద్యము, న-లేదు.

తా. మరియు జగంబు సత్యమని చెప్పెడి తార్కికాది వాదులయందు చోద్యములు వ్యాపించుచున్నవేగాని ఆమాయకుచోద్యమొక్కటియే ముఖ్యస్వరూపమగుటవల్ల ఆమాయయందు చేయదగిన చోద్యములేదని తెలియవలెను.

అవ. మాయావాదినిగురించి చోద్యముచేయుటయందు, అతిప్రసంగమునిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ చోద్యేపియదిచోద్యంస్యాత్తచ్చోద్యేచోద్యతేమయా।
పరిహార్యంతతశ్చోద్యంనపునఃప్రతిచోద్యతాం॥ ౧౩౭.

టీ. చోద్యేపి-చోద్యవిషయమందును, చోద్యం-చోద్యము, స్యాద్యది-కలిగినయెడల, అనగా జోద్యమునుచేసినయెడలననుట. తచ్చోద్యే-ఆచోద్యమందు, మయా-నాచేత, చోద్యతే-మరియొక చోద్యముజేయబడును. తతః-అందువల్ల, చోద్యం-చోద్యవిషయము, పరిహార్యం - పరిహరింపదగినదగును. పునః - మరల, నప్రతిచోద్యతాం-ప్రతిచోద్యమును జేయకుందువుగాక. అనగా ప్రతిచోద్యమును చేయరాదనుట.

తా. మరియు జగంబు మాయామయమని వాదించెడివానినిగురించి నీవుచోద్యమును జేసితివేని నీచోద్యమందు నాచేతమరియొక చోద్యము జేయబడును. ప్ర. అయితే యేమిచేయదగినదో చెప్పుము?. ఉ. చోద్యవిషయము పరిహరింపదగినదేయగుగాని ప్రతిచోద్యమును చేయరాదు.

అవ. ఈయర్థమునే మరల యిప్పుడు విశదముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ విస్మయైకశరీరాయామాయాయాశ్చోద్యరూపతః।
అన్వేష్యఃపరిహారోస్యాబుద్ధిమద్భిఃప్రయత్నతః॥ ౧౩౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. విస్మయైకశరీరాయాః=విస్మయ-ఆశ్చర్యము, ఏక-ఒక్కటియే, శరీరాయాః-శరీరము గాగల, మాయాయాః-మాయకు, చోద్యరూపతః-చోద్యస్వరూపపు గుటవల్ల, బుద్ధిమద్భిః-బుద్ధిమంతులచేత, ప్రయత్నతః-ప్రయత్నమువల్ల, అస్యాః-ఈ మాయకు, పరిహారః-పరిహారము, అన్వేష్యః వెదుకదగినదగుగుసు.

తా. ఆశ్చర్యమొక్కటియే శరీరము గాగలమాయ చోద్యస్వరూపియగుటవల్ల బుద్ధిమంతులగు జనులు ప్రయత్నముచేత ఈ మాయకు బరిహారమును వెదుకవలెనని యభిప్రాయము.

శ్లో॥ మాయాత్వమేవ నిశ్చేయమితి చే త్తర్హి నిశ్చిను।
లోకప్రసిద్ధమాయాయా లక్షణం య త్తదీక్ష్యతాం॥ ౧౪౦.

టీ. మాయాత్వమేవ - మాయాస్వభావమే, అనగా మాయాలక్షణమనుట. నిశ్చేయమితిచేత్-నిశ్చయింపదగినదనియంటివేని. తర్హి-అట్లైనయెడల, నిశ్చిను-నిశ్చయింపుము. లోకప్రసిద్ధమాయాయాః=లోకప్రసిద్ధ-లోకప్రసిద్ధమగు, మాయాయాః-మాయకు, యత్-ఏ, లక్షణం-లక్షణముగలదో, తత్-ఆలక్షణము, ఈక్ష్యతాం-చూడబడుగాక.

తా. ప్ర. అయితే జగంబునకు మాయాస్వభావనిశ్చయముగలుగుచుండగా దాని పరిహారమును వెతకుట ఉచితమగునేగాని ఆమాయాస్వభావ నిశ్చయమేసిద్ధించనప్పుడు పరిహారముతోటి బనియేమి?. ఉ. జగంబునకు మాయాలక్షణము నిశ్చయింపదగినదని యంటివేని, సరి. నిశ్చయింపుము. ప్ర. అయితే ఆమాయాలక్షణమేమి?. ఉ. లోకప్రసిద్ధమగు మాయకు ఏ లక్షణమాగలదో ఆలక్షణమును దెలిసికొనుము.

శ్లో॥ ననిరూపయితుంశక్యావిస్పష్టంభాసతేచయా।
సామాయేతీంద్రజాలాదౌ లోకాస్సంప్రతిపేదిరే॥ ౧౪౧.

టీ. యా-ఎద్ది, ఇంద్రజాలాదౌ-ఇంద్రజాలాదికమందు, నిరూపయితుం-నిర్ణయించుటకు, నశక్యాసతి-శక్యముకానిదగుచు, విస్పష్టం-మిక్కిలిస్పష్టముగా, భాసతేచ-ప్రకాశించుచున్నదో, సా-అద్ది, మాయేతి-మాయయని, లోకాః-జనులు, సంప్రతిపేదిరే-పొందిరి. అనగా గ్రహించిరనుట.

తా. ప్ర. అయితే ఆలోకప్రసిద్ధమాయకైనను లక్షణమేమి?. ఉ. ఇంద్రజాలాదికమందు ఎద్ది నిర్ణయించుటకు శక్యముగాక మిక్కిలి స్పష్టముగా బ్రకాశించుచున్నదో అద్ది మాయయని లోకులు గ్రహించిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఈదృష్టాంతసిద్ధలక్షణము నిప్పుడు దార్ష్టాంతికమందు నిర్ణయించు చున్నాడు.

శ్లో॥ స్పష్టంభాతిజగచ్చేదమశక్యంతన్నిరూపణం।
మాయామయంజగత్తస్మాదీక్షస్వాపక్షపాతతః॥ ౧౪౨.

టీ. ఇదం-ఈ, జగచ్చ-జగంబును. స్పష్టం-స్పష్టముగా, భాతి-తోచుచున్న ది. తన్నిరూపణం=తత్-ఆజగంబుయొక్క, నిరూపణం-నిరూపణము, అశక్యం-శక్యము గాదు. తస్మాత్-అందువల్ల, అపక్షపాతతః-నిష్పక్షపాతముచేత, జగత్-ప్రపంచమును, మాయామయం-మయామయమునుగా, ఈక్షస్వ-చూడుము.

తా. ఆప్రకారమే యీజగంబును స్పష్టముగా దోచుచున్నది. ఆజగంబుబుట్టినవిధమును నిర్ణయించుటకు శక్యముగాదు. కనుక నిష్పక్షపాతబుద్ధిచేతజగత్తును మాయామయమునుగా జూడుము.

శ్లో॥ నిరూపయితుమారబ్ధేనిఖిలైరపిపండితైః।
అజ్ఞానంపురతస్తేషాంభాతికక్ష్యాసుకాసుచిత్॥ ౧౪౩.

టీ. నిఖిలైరపిపండితైః-సకల పండితులచేతను, నిరూపయితుం-జగన్నిరూపణముజేయుటకు, ప్రారబ్ధేసతి-ప్రారంభించుచుండగా, తేషాం-ఆపండితులయొక్క, పురతః-ఎదుట, కాసుచిత్-కొన్నియగు, కక్ష్యాసు-కక్ష్యలయందు, అజ్ఞానం-అజ్ఞానము, భాతి-తోచుచున్నది. అనగాదోచుచుండెననుట.

తా. ప్ర. అయితే జగత్తును నిరూపించుటకు ఎందుకుశక్యముగాదు?. ఉ. సకలపండితులును జగన్నిరూపణము జేయుటకు బ్రారంభించుచుండగా వారియెదుటకొన్నికక్ష్యలయందు అజ్ఞానము దోచుచుండెను. అనగా బండితులుకొన్ని కోటీలుగాజేరి జగత్తుబుట్టినవిధమును నిర్ణయింపవలెనని ప్రశ్నోత్తరములను జరుపుచుండగా తుదకుకొన్ని కోటీలయందుండెడి పండితులు సమాధానమును జెప్పజాలక మాకేమియుం దెలియదనిరి. ఇదియే అజ్ఞానమగును, కనుక జగత్తు పుట్టినవిధమును నిర్ణయించుటకు శక్యముగాదు.

అవ, ఆ శక్యముగాని విధమునే, ఇప్పుడు ఉదాహరణముచేత స్పష్టీకరించు చున్నాడు.

శ్లో॥ దేహేంద్రియాదయోభావావీర్యేణోత్పాదితాఃకథం।
కథంవాతత్రచైతన్యమిత్యుక్తేతేకిముత్తరం॥ ౧౪౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. దేహేంద్రియాదయః - దేహేంద్రియాదులగు, భావాః - పదార్థములు, వీర్యేణ - వీర్యముచేత, కథం - ఎట్లు, ఉత్పాదితాః - పుట్టెను. తత్ర - ఆదేహేంద్రియాదులయందు, చైతన్యం - చైతన్యము, కథంవా - ఎట్లుగలిగెను. ఇతి - ఈ ప్రకారము, ఉక్తే సతి - అడుగబడుచుండగా, తే - నీయొక్క, ఉత్తరం - ప్రత్యుత్తరము, అనగా సమాధానమనుట. కిం - ఏమి.

తా. దేహేంద్రియాది పదార్థములు వీర్యముచే నెట్లుగలిగెను. మరియు ఆ దేహేంద్రియాదులయందు చైతన్య మెట్లుకలిగెను. ఇట్లు నిన్నుఅడిగినయెడల ఇందుకు నీయొక్కప్రత్యుత్తర మేమో దెలియజేయుము.

అవ. ఇప్పుడు స్వభావవాదిచేసెడి శంకను బూర్వపక్షము జేయుచున్నాడు.

శ్లో॥ వీర్యస్యైష స్స్వభావశ్చేత్కథంతద్విదితంత్వయా।
అన్వయవ్యతిరేకౌయౌభగ్నౌతౌవంధ్యవీర్యతః॥ ౧౪౫.

టీ. వీర్యస్య - వీర్యమునకు, ఏషః - ఇది, స్వభావశ్చేత్ - స్వభావమని యంటివేని, తత్ - అది, త్వయా - నీచేత, కథం - ఎట్లు, విదితం - తెలియబడెను. యౌ - ఏ, అన్వయవ్యతిరేకౌ - అన్వయవ్యతిరేకములుగలవో, తౌ - ఆ అన్వయ వ్యతిరేకములు రెండును, వంధ్యవీర్యతః=వంధ్య - వంధ్యా స్త్రీయందుగల, వీర్యతః- వీర్యమువల్ల, భగ్నౌ - చెడిపోయెను.

తా. ప్ర. అయితే దేహేంద్రియాదులను గలిగించుట వీర్యమునకు స్వభావ మని చెప్పరాదాయేమి?. ఉ. ఓస్వభావవాదీ అదియంతయు వీర్యమునకు స్వభావ మని నీకెట్లుదెలిసెను. ప్ర. ఎక్కడెక్కడ వీర్యముగలదో అక్కడక్కడ దేహేంద్రియాదులు బుట్టుచున్నవని యెరుగుట అన్వయమగును. మరియు ఎక్కడెక్కడ వీర్యములేవో అక్కడక్కడ దేహేంద్రియాదులు బుట్టలేదనియెరుగుట వ్యతిరేకమగును. ఈ అన్వయవ్యతిరేకమువల్ల వీర్యమునకు ఇది స్వభావమని యెరుగబడుచుండ లేదాయేమి ?. ఉ. వంధ్యాస్త్రీయందుగలవీర్యము వ్యర్థమగుచుండుటవల్ల నీవుచెప్పిన అన్వయవ్యతిరేకములకు వ్యాప్తిలేదు. కనుక అట్లుచెప్పరాదు.

శ్లో॥ నజానామికిమప్యేతదత్యంతేశరణంతవ।
అతఏవమహాంతోస్యప్రవదంతీంద్రజాలతాం॥ ౧౪౬.

టీ. అంత్యే - అంత్యమందు, ఏతత్ - ఇది, కిమపి - కొంచమైనను, నజానామి - ఎరుగను. తవ - నీకు, శరణమితి - నమస్కారమని చెప్పగలవు. అతఏవ- అందువల్లనే, మహాంతః - పెద్దలగుమునులు, అస్య - ఈజగంబునకు, ఇంద్రజాలతాం- ఇంద్రజాలస్వభావమును, ప్రవదంతి - చెప్పుచురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఇట్లు మాటిమాటికిని ప్రశ్న జేయగా తుదకు ఈవిషయమును గూర్చి నేను నేనెరుగననియు నీకు శరణమనియుం బ్రత్యుత్తరమునివ్వగలవు. కనుక నే మహాత్ములగు మునులు ఈజగంబునకు ఇంద్రజాలస్వభావమును జెప్పిరి. అనగా ఈజంగం బంతయు ఇంద్రజాలమువలె మాయామయమని యభిప్రాయము.

అవ. ఈ చెప్పబడిన ప్రకారము జగంబు అనిర్వచనీయమనెడి విషయమై వృద్ధసమ్మతిని నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ ఏతస్మాత్కిమి వేంద్రజాలమపరంయద్గర్భ వాసేస్థితం।
రేత శ్చేతతిహ స్తమ స్తకపదప్రోద్భూతనానాంకురం।
పర్యాయేణశిశుత్వయౌవనజరా వేషైర నేకైర్వృతం।
పశ్యత్య త్తిశృణోతిజిఘ్రతితథాగచ్ఛత్యథాగచ్ఛతి ॥౧౪౭.

టీ. గర్భవాసే - గర్భస్థలమందు, స్థితం - స్థితినిబొందినట్టి, యత్ - ఏ, రేతః - ఇంద్రియముగలదో, (తత్) ఆ యింద్రియము, హస్తమస్తపదప్రోద్భూతనానాంకురం సత్ = హస్త - చేతులుగాను, మస్తక - శిరస్సుగాను, పద - పాదములుగాను, ప్రోద్భూత - పుట్టిన, నానాంకురంసత్ - నానావిధపరిణామముగలదగుచు, అనగా నానావిధ అంకురములంగలదనుట. పర్యాయేణ - పిమ్మట, అనేకైః - అనేకములగు, శిశుత్వయౌవనజరావేషైః=శిశుత్వ - బాల్యలక్షణమనునట్టియు, యౌవన - యౌవన లక్షణమనునట్టియు, జరా - జరాలక్షణమనునట్టి, వేషైః - వేషములతోటి, వృతం సత్ - కూడినదగుచు, చేతతి - ఎరుగుచున్నది. పశ్యతి - చూచుచున్నది. అత్తి - తినుచున్నది. శృణోతి - వినుచున్నది. జిఘ్రతి - అఘ్రాణించుచున్నది. అథ - పిమ్మట. ఆగచ్ఛతి - వచ్చుచున్నది. తథా - ఆప్రకారము, గచ్ఛతి - పోవుచున్నది. ఏతస్మాత్ - ఇంతకంటె, అపరం - మరియొకటియైన, ఇంద్రజాలం - ఇంద్రజాలము, కిమివ - ఎటువంటిది. అనగా నింతకంటెమరియొక ఇంద్రజాలములేదనుట.

తా. గర్భస్థలమందు ఏయింద్రియముగలదో అది కాళ్లు చేతులు శిరస్సు మొదలగు అవయవరూపముగా నంకురించినదగుచు పిమ్మట కాలక్రమముచేత బాల్యయౌవనజరాలక్షణములనెడి వేషములతో గూడినదగుచు ఎరుగుచు చూచుచు తినుచు వినుచు మూర్కొనుచు వచ్చుచు పోవుచున్నది. ఇంతకంటె మరియొక ఇంద్రజాల మెటువంటిదని పెద్దలగుమునులు జెప్పుదురు.

అవ. దేహమునకుమాత్రమేగాక అచేతనమగు మట్టిచెట్లు మొదలగుదానికి దుర్నిరూపత్వము గలిగియున్నదని యిప్పుడు జెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ దేహవద్వటధానాద్యౌసువిచార్యవిలోక్యతాం।
క్వధానాకుత్రవావృక్షస్తస్మాన్మాయేతినిశ్చిను॥ ౧౪౮.

టీ. దేహవత్ - దేహమువలె, వటధానాద్యౌ - మఱ్ఱివిత్తనము, మొదలగు ధాన్యమందును, సువిచార్య - చక్కగావిచారించి, విలోక్యతాం - చూడబడుగాక. ధానా - మఱ్ఱివిత్తనము, క్వ - ఎక్కడ, అనగా మిక్కిలి చిన్నదనుట. వృక్షోవా - మఱ్ఱిచెట్టో, కుత్ర - ఎక్కడను, అనగా మిక్కిలి గొప్పదనుట. తస్మాత్ - అందువల్ల, మాయేతి - మాయయని, నిశ్చిను - నిశ్చయింపుము.

తా. దేహమువలెనే మఱ్ఱివిత్తనము మొదలగుబీజమునందును చక్కవిచారించి చూడుము. మఱ్ఱివిత్తనమెంతచిన్నదియో మఱ్ఱిచెట్టు ఎంతపెద్దదియో యోచింపుము. కనుక ప్రపంచమంతయు మాయామయమని నిశ్చయించి దేహేంద్రియములు బుట్టిన విధమును నిశ్చయించుటకు సాధ్యముగానియట్లు మఱ్ఱిచెట్టు మొదలగు అచేతనరాశియు గలిగినవిధమును నిశ్చయించుటకుశక్యముగాదని తెలిసికొనుము. అనగా జగంబంతయు మాయమని యభిప్రాయము.

శ్లో॥ నిరుక్తావభిమానం తేదధతేతార్కికాదయః।
హర్షమిశ్రాదిభిస్తేతుఖండనాదౌసుశిక్షితాః॥ ౧౪౯.

టీ. తే - ఆ, తార్కికాదయః - తార్కికాదులు, నిరుక్తౌ - తర్కశాస్త్రమందు, అభిమానం - అభిమానమును, దధతే - ధరించుచున్నారు. తేతు - ఆతార్కికాదులో, హర్షమిశ్రాదిభిః - హర్షమిశ్రులు మొదలగు ఆచార్యులచేత, ఖండనాదౌ - ఖండనాదిగ్రంథమందు, సుశిక్షితాః - చక్కగా శిక్షింపబడిరి.

తా. ప్ర. అయితే మేము మీకుదగినట్లు సమాధానమును జెప్పుటకు అశక్తులమైనను పూర్వపు ఉదయనుడు మొదలగు తార్కికాచార్యులు మీకుదగిన సమాధానమును చెప్పియుండలేదా యేమి?. ఉ. ఆఉదయనాది తార్కికులు తర్కమందు అభిమానవంతులైయుండిరి. వారును ఆకాలమందుగల మాఅద్వైతఆచార్యులగు హర్షమిశ్రాదులచేత ఖండనాది గ్రంథములయందు జక్కగా శిక్షింపబడిరి.

అవ. ఈయర్థమందు సాంప్రదాయికుల వాక్యము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ అచింత్యాఃఖలుయేభావానతాంస్తర్కేషుయోజయేత్।
అచింత్యరచనారూపంమనసాపిజగత్ఖలు॥ ౧౫౦.

టీ. యేభావాః - ఏపదార్థములు, అచింత్యాః - చింతించుటకు శక్యములు గావో, అనగా జింతింపదగినవికావోయనుట. తాన్ - ఆపదార్థములను, తర్కేషు - తర్కములయందు, నయోజయేత్ ఖలు - నియమింపగాదు. అనగా జేర్చరాదనుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనసాపి - మనంబుచేనైనను, జగత్ - ప్రపంచము, అచింత్యరచనారూపంఖలు = అచింత్య - చింతించుటకు శక్యముగాని, అనగా జింతింపదగనియనుట. రచనారూపం ఖలు - కల్పనాస్వరూపముగలదేయగును.

తా. ఏపదార్థములు మనస్సుచే జింతించుటకు శక్యములుగావో అట్టి పదార్థములను తర్కములయందుగూర్చరాదు. మరియు జగంబు మనస్సుచేనైనను చింతింపదగని కల్పనాస్వరూపముగలదగునని వృద్ధులుజెప్పిరి.

శ్లో॥ అచింత్యరచనాశక్తిబీజంమాయేతినిశ్చను।
మాయాబీజంతదేవైకంసుషుప్తావనుభూయతే॥ ౧౫౧.

టీ. అచింత్యరచనాశక్తిబీజం = అచింత్య - చింతింపదగని, రచనాశక్తి - కల్పనాశక్తివంతమగు, బీజం - కారణము, మాయేతి - మాయయని, నిశ్చను - నిశ్చయింపుము. ఏకం - ఒకటియైన, తత్ - ఆ, మాయాబీజమేవ = మాయా - మాయయనెడి, బీజమేవ - కారణమే, సుషుప్తౌ - సుషుప్తియందు, అనుభూయతే - అనుభవింపబడుచున్నది.

తా. ప్ర. సరి జగంబు చింతింపనశ్యకమైన కల్పనారూపమేయగుగాక. అందుచేత మాయయందుగల విశేషమేమి?. ఉ. ఈపూర్వోక్తప్రకారము జగంబు అచింత్య కల్పనారూపమగుటచేత ఆఅచింత్య కల్పనాశక్తివంతమగు కారణమెద్దియో అదియే మాయయని నిశ్చయింపుము. ప్ర. అయితే ఈవిధమైనకారణ మెచ్చటజూడబడెనో చెప్పుము?. ఉ. ఆ ఒక్కటియైన మాయయనెడి కారణమే సుషుప్తియందు సర్వజనులచే ననుభవింపబడుచున్నది.

శ్లో॥ జాగ్రత్స్వప్నజగత్తత్రలీనంబీజఇవద్రుమః।
తస్మాదశేషజగతో వాసనాస్తత్రసంస్థితాః॥ ౧౫౨.

టీ. బీజే - విత్తనమందు, ద్రుమఇవ - వృక్షము లయించియున్నట్లు, తత్ర - ఆసుషుప్తిసంబంధమాయయందు, జాగ్రత్స్వప్నజగత్ = జాగ్రత్స్వప్న - జాగ్రత్స్వప్న రూపమగు, జగత్ - ప్రపంచము, లీనం - అణగియున్నది. తస్మాత్ - అందువల్ల, అశేషజగతః - సర్వజగంబుయొక్క, వాసనాః - వాసనలు, తత్ర - ఆమాయయందు, సంస్థితాః - స్థితినిబొందియున్నవి.

తా. ప్ర. అయితే ఆసుషుప్తి జగత్కారణమెట్లాయెను?. ఉ. విత్తనమందు వృక్షము లయించియున్నట్లు ఆసుషుప్తియందు జాగ్రత్స్వప్నరూపజగంబంతయు లయించియున్నది. ప్ర. అయితే అందువల్ల ఏమి?. ఉ. ఏకారణమువల్ల సర్వజగంబునకు కారణము మాయయగునో ఆకారణమువల్ల సర్వజగంబుయొక్క వాసనలును ఆమాయయందున్నవని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ యాబుద్ధివాసనాస్తాసుచైతన్యంప్రతిబింబతి।
మేఘాకాశవదస్పష్టచిదాభాసోనుమీయతాం॥ ౧౫౩.

టీ. యాః-ఏ, బుద్ధివాసనాః- బుద్ధివాసనలుగలవో, తాసు - ఆబుద్ధివాసనల యందు, చైతన్యం - కూటస్థచైతన్యము, ప్రతిబింబతి - ప్రతిబింబమును బొందుచున్నది. అనగా బ్రతిబింబించుచున్నదనుట. మేఘాకాశవత్ = మేఘ - మేఘమందు ప్రతిబింబించిన, ఆకాశవత్ -ఆకాశమువలె, అస్పష్టచిదాభాసః=అస్పష్ట - స్పష్టత్వమునుబొందని, చిదాభాసః-చిదాభాసుడు, అనుమీయతాం - అనుమానింపబడుగాక. అనగా ననుమానప్రమాణముచే నెరుగబడుననుట.

తా. ప్ర. అయితే సర్వజగద్వాసనలును మాయయందుండుటచేత ఆమాయ యందేమిగలిగెను?. ఉ. ఆసుషుప్తిరూపమాయయందు ఏబుద్ధివాసనలుగలవో ఆబుద్ధివాసనలయందు చైతన్యము బ్రతిబింబించుచున్నది. ప్ర. అయితే: ఆసుషుప్తిరూపమాయయందుగల బుద్ధివాసనలయందు ప్రతిబింబమున్నయెడల అనుభవింపబడలేదేమి?. ఉ. మేఘమందు బ్రతిబింబరూపముగానుండెడి ఆకాశమువలె అస్పష్టరూపముగానుండుటచేత ఆచిదాభాసుడు అనుభవింపబడలేదు. ప్ర. అయితే ఆప్రతిబింబరూప చిదాభాససిద్ధి మనకెట్లు గలుగును?. ఉ. అనుమాన ప్రమాణముచేత ఆబుద్ధివాసనల యందు ప్రతిబింబరూప చిదాభాసుడున్నట్లు మనము నిశ్చయింపవలెను.

శ్లో॥ సాభాసమేవతద్బీజంధీరూపేణప్రరోహతి।
అతోబుద్ధౌచిదాభాసోవిస్పష్టంప్రతిభాసతే॥ ౧౫౪.

టీ. సాభాసం-అస్పష్టచిదాభాసునితోగూడిన, తద్బీజమేవ=తత్ -ఆమాయ యనెడి, బీజమేవ-కారణమే, అనగా నజ్ఞానమేననుట. ధీరూపేణ-బుద్ధిరూపముగా, ప్రరోహతి - అంకురించుచున్నది. అతః-అందువల్ల, బుద్ధౌ-బుద్ధియందు, చిదాభాసః-చిదాభాసుడు, విస్పష్టం-మిక్కిలిస్పష్టముగా, ప్రతిభాసతే-ప్రకాశించుచున్నాడు.

తా. ప్ర. అయితే మేఘాంశమగు జలమందు ఆకాశప్రతిబింబము స్పష్టముగా దోచకున్నను దానిజాతీయమగు ఘటోదకమందు ఆకాశ ప్రతిబింబము స్పష్టముగా దోచుచుండుటచేత మేఘజలమందు ఆకాశ ప్రతిబింబము గలదని అనుమానప్రమాణముచేత నిశ్చయింపవచ్చును. ఇక్కడ అట్టిదృష్టాంతము లేమిచేత సౌషుప్తమాయానిష్ఠబుద్ధి వాసనలయందు చిదాభాసుడున్నట్లు అనుమాన ప్రమాణముచే నెట్లు ఘటించును?. ఉ. ఇచ్చటయు అటువంటి దృష్టాంతమును సంపాదించుటకొరకు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జెప్పెద వినుము. చిదాభాసునితోఁగూడిన ఆమాయారూపమగు అజ్ఞానమే బుద్ధిరూపముగా బరిణమించుచు మిక్కిలి స్పష్టముగాతోఁచెడి చిదాభాసునిగలదగుచున్నది. ప్ర. అయితే ఇట్లు చెప్పుటచే నిక్కడ అనుష్ఠాన ప్రమాణ మెట్లు సూచింపబడెను?. ఉ. సుషుప్తిసంబంధ మాయయందుగల బుద్ధివాసనలు బుద్ధియొక్క అవస్థావిశేషములగుటవల్ల బుద్ధివృత్తియందుగల వలెనే చిత్తుయొక్క ప్రతిబింబవంతములగుటకు దగినవని ఇట్లు అనుమానప్రమాణముచేత సౌషుప్తమాయానిష్ఠబుద్ధి వాసనలయందు చిదాభాసుడున్నట్లు నిశ్చయింపవలెను.

అవ. ఇట్లు శ్రుతిచే జెప్పబడిన జీవేశ్వరులకుగల మాయికత్వమును దెలిపి, ఈ ప్రతిపాదింపబడిన యర్థము నిప్పుడు పసంహరించుచున్నాడు.

శ్లో॥ మాయాభాసేనజీవేశౌకరోతీతిశ్రుతౌశ్రుతం।
మేఘాకాశజలాకాశావివతౌసువ్యవస్థితౌ॥ ౧౫౫.

టీ. మాయా-మాయాశక్తి, ఆభాసేన-చిదాభాసరూపముచేత, జీవేశౌ-జీవేశ్వరులను, కరోతీతి-చేయుచున్నదని, అనగా గలిగించుచున్నదని యనుట. శ్రుతౌ-వేదవాక్యమందు, శ్రుతం-వినబడుచున్నది. తౌ-ఆయీశ్వరజీవులిద్దరును, మేఘాకాశజలాకాశావివ=మేఘాకాశ-మేఘాకాశమువలెను, జలాకాశవివ-జలాకాశమువలెను, సువ్యవస్థితౌ-స్థితినిబొందియున్నారు.

తా. ఈ చెప్పబడినప్రకారము ఆమాయ చిదాభాసరూపముచేత జీవేశ్వరులనిద్దరిని కలిగించుచున్నదని శ్రుతియందు వినబడుచున్నది. ప్ర. అయితే జీవేశ్వరులకు మాయాకల్పితత్వము సమానమైయుండగా ఆజీవేశ్వరులకు మధ్యమందు భేదమెట్లు సిద్ధించెను?. ఉ. ఆయీశ్వరజీవు లిద్దరును అస్పష్ట స్పష్టోపాధులం గలిగియుండుటచేత మేఘాకాశ జలాకాశములవలె స్థితిని బొందియున్నారు. అనగా అస్పష్ట స్పష్టోపాధులం గలిగియుండుటచేత ఆ యీశ్వర జీవులకు భేదము సిద్ధించెనని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, ఈశ్వరునకు మేఘాకాశ సామ్యమును స్ఫుటీకరించుచున్నాడు.

శ్లో॥ మేఘవద్వర్తతేమాయామేఘస్థితతుషారవత్।
ధీవాసనాశ్చిదాభాసస్తుషారస్థఖవత్స్మృతః॥ ౧౫౬.

టీ. మాయా - మాయ, మేఘవత్ - మేఘమువలె, వర్తతే - వర్తించు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నది. మేఘస్థితతుషారవత్ = మేఘస్థిత - మేఘమందుండెడి, తుషారవత్ - సూక్ష్మావయవవంతమగు జలమువలె, ధీవాసనాః - బుద్ధివాసనలు వర్తించుచున్నవి. చిదాభాసః - చిదాభాసుడు, తుషారస్థఖవత్ = తుషారస్థ - మేఘ నిష్టసూక్ష్మ జలమందుగల, ఖవత్ - ఆకాశమువలె, అనగా మేఘాకాశమువలెననుట, స్థితః - స్థితినిబొందియున్నాడు.

తా. మాయ మేఘమువంటిదగును. ఆ మాయయందుగల బుద్ధివాసనలు మేఘమందుగల సూక్ష్మావయవరూప జలమువంటిదగును. ఆ మాయానిష్ఠ బుద్ధివాసనల యందుగల చిదాభాసుడు, మేఘనిష్ఠ సూక్ష్మావయవరూప జలమందు ప్రతిఫలించిన ఆకాశ ప్రతిబింబమువంటి వాడగును.

శ్లో॥ మాయాధీనశ్చిదాభాసశ్శ్రుతోమాయీమహేశ్వరః।
అంతర్యామీచసర్వజ్ఞోజగద్యోనిస్సఏవహి॥ ౧౫౭.

టీ. మాయాధీనః = మాయా - మాయకు, అధీనః - అధీనుడగు, అనగా మాయయందు ప్రతిబింబించిన యనుట. చిదాభాసః - చిదాభాసుడు, మాయీ - మాయాధిష్ఠాత యనియు, మహేశ్వరః - ఈశ్వరుడనియు, అనగా నియామకు డనుట. శ్రుతః - శ్రుతియందు వినబడుచున్నాడు. సఏవ - ఆచిదాభాసుడే, అంతర్యామీచ - అంతర్యామి యనియు, సర్వజ్ఞః - సర్వమును దెలిసిన వాడనియు, జగద్యోనిః = జగత్ - ప్రపంచమునకు, యోనిః - కారణుడనియు, (శ్రుతః) శ్రుతి యందు వినబడుచున్నాడు.

తా. ప్ర. మాయాప్రతిబింబరూపుడగు చిదాభాసుడే ఈశ్వరుడనుటయందు ప్రమాణమేమి?. ఉ. మాయాధీనుడైన చిదాభాసుడే మాయకు ఆధారుడగు ఈశ్వరుడని శ్రుతియందు వినబడుచున్నాడు. గనుక శ్రుతియే ప్రమాణమగును. మరియు ఆచిదాభాసుడే అంతర్యామియనియు సర్వజ్ఞుడనియు జగద్యోనియనియు ఇట్టినరత్నములన్నియు ఆచిదాభాసునకే శ్రుతియందు వినబడుచున్నవి.

శ్లో॥ సౌషుప్తమానందమయంప్రక్రమ్యైవంశ్రుతిర్జగా।
ఏషసర్వేశ్వరఇతిసోఽయంవేదోక్తఈశ్వరః। ౧౫౮.

టీ. సౌషుప్తం - సుషుప్తి సంబంధమైన, ఆనందమయం - ఆనందమయకోశమును, ప్రక్రమ్య - ఉపక్రమించి, ఏషః - ఈ యానందమయకోశము, సర్వేశ్వర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇతి - సర్వేశ్వరుడని, ఏవం - ఈప్రకారముగా, శ్రుతిః - వేదవాక్యము, జగౌ - చెప్పుచున్నది. సోయం - ఆ యీ యానందమయకోశము, వేదోక్తఈశ్వరః = వేద - వేదముచేత, ఉక్త - చెప్పబడిన, ఈశ్వరః - ఈశ్వరుడగును.

తా. ప్ర. అయితే బుద్ధివాసనలయందుగల ప్రతిబింబమును ఈశ్వరత్వాది ధర్మములు శ్రుతిసిద్ధము లెట్లాయెను?. ఉ. శ్రు॥ సుషుప్తస్థానఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవ॥ అనెడి యిత్యాదిశ్రుతి సుషుప్తిసంబంధ మాయానిష్ఠబుద్ధి వాసనలయందుగల ప్రతిబింబరూప ఆనందమయకోశమునకు ఈశ్వరత్వాది ధర్మములను జెప్పుచున్నది. కనుక ఈ యానందమయకోశమే వేదోక్త ఈశ్వరుడగునని తెలియవలెను.

శ్లో॥ సర్వజ్ఞత్వాదికేతస్యనైవవిప్రతిపద్యతాం।
శ్రౌతార్థస్యావితర్క్యత్వాన్మాయాయాంసర్వసంభవాత్॥౧౨౯.

టీ. శ్రౌతార్థస్య - శ్రుత్యర్థమును, అవితర్క్యత్వాత్ - వితర్కింప రామి వల్లయు, మాయాయాం - మాయయందు, సర్వసంభవాత్ - సర్వముసంభవించుట వల్లయు, తస్య - ఆ యానందమయకోశమునకు, సర్వజ్ఞత్వాదికే - సర్వజ్ఞత్వాది ధర్మరాశిగలిగియుండెడి విషయమై, నైవవిప్రతిపద్యతాం - విరోధింపకుందువుగాక. అనగా విరోధములేదనుట.

తా. ఆ ఆనందమయకోశమునకు సర్వజ్ఞత్వాది ధర్మరాశి గలిగియున్నదని చెప్పినయెడల అనుభవవిరోధముగాదాయేమి?. ఉ. ఆయానందమయమునకు సర్వజ్ఞత్వాది ధర్మములు గలవనెడి విషయమై అనుభవ విరోధమని తర్కింపరాదు. ప్ర. ఎందువల్లనోచెప్పుము?. ఉ. శ్రుతిచేచెప్పబడినయర్థము, సత్యమో అసత్యమో యనెడి సంశయముచేత తర్కింపరాదు. మరియు మాయయందు సర్వము సంభవించుటవల్ల సర్వజ్ఞత్వాది ధర్మరాశి విషయమై విపరీతముగా దర్కింపరాదని తెలిసికొనుము.

అవ. శ్రుతిప్రామాణ్యసిద్ధికొరకు సర్వేశ్వరత్వాది ధర్మరాశిని క్రమముగా నిప్పుడు ప్రతిపాదించుచున్నాడు.

శ్లో॥ అయంయత్సృజతేవిశ్వంతదన్యథయితుంపుమాన్।
నకోపిశక్తస్తేనాయంసర్వేశ్వరఇతీరితః॥ ౧౨౦.

టీ. అయం - ఈ యానందమయకోశము, యత్ - ఏ, విశ్వం - జాగ్రత్స్వప్న రూప ప్రపంచమును, సృజతే - సృష్టించుచున్నదో, తత్ - ఆ ప్రపంచమును, అన్యథయితుం - మరియొకవిధముగాజేయుటకు, కః - ఏ, పుమానపి - పురుషుడును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నశక్త - సమర్థుడుగాడు. తేన - ఆకారణముచేత, అయం - ఈ యానందమయ కోశము, సర్వేశ్వరఇతి - సర్వేశ్వరుడని, ఈరితః - శ్రుతిచేజెప్పబడెను.

తా. ప్ర. అయితే అనుకూలమైనయుక్తిలేనప్పుడు రాతితెప్పయనెడి వాక్యమువలెనే శ్రుతియు అర్థవాదముగాదాయేమి?. ఉ. ఈ యానందమయకోశము ఏజాగ్రత్స్వప్నాది రూపజగంబును సృష్టించుచున్నదో ఆజగంబును మరియొకవిధముగా మార్పుజేయుటకు ఏపురుషుడును సమర్థుడుగాడు. ఆకారణముచేత ఈ ఆనందమయకోశము సర్వేశ్వరుడని చెప్పబడెను.

అవ. ఇప్పుడు సర్వజ్ఞత్వమును దెలుపుచున్నాడు.

శ్లో॥ అశేషప్రాణిబుద్ధీనాంవాసనాస్తత్రసంస్థితాః।
తాభిఃక్రోడీకృతంసర్వం తేనసర్వజ్ఞఈరితః॥ ౧౬౧.

టీ. అశేషప్రాణిబుద్ధీనాం = అశేషప్రాణి - సర్వజీవులయొక్క, బుద్ధీనాం- బుద్ధులయొక్క, వాసనాం - వాసనలు, తత్ర - ఆయానందమయకోశమందు, సంస్థితాః - సంస్థితినిబొందుచున్నవి. తాభిః - ఆసర్వజీవబుద్ధివాసనలచేత, సర్వం - సర్వజగంబును, క్రోడీకృతం - ఎరుగబడుచున్నది. తేన - ఆకారణముచేత, సర్వజ్ఞః - సర్వజ్ఞుడని, ఈరితః - చెప్పబడెను.

తా. మరియు ఆనుషుప్తిసంబంధమగు అజ్ఞానమనెడి కారణమందు కార్యములైన సర్వజీవరాశి బుద్ధులయొక్క వాసనలు నివసించియున్నవి. ఆసర్వబుద్ధివాసనలచేత సర్వజగంబును నిశ్శేషముగా నెరగబడుచున్నది. కనుక సర్వబుద్ధివాసనావంతమగు అజ్ఞానోపాధికత్వముచేత ఈ యానందమయకోశము సర్వజ్ఞుడని చెప్పబడును.

శ్లో॥ వాసనానాంపరోక్షత్వాత్సర్వజ్ఞత్వంనహీక్ష్యతే।
సర్వబుద్ధిషుతద్దృష్ట్వా వాసనాస్వనుమీయతాం॥ ౧౬౨.

టీ. వాసనానాం- బుద్ధివాసనలయొక్క, పరోక్షత్వాత్ - పరోక్షత్వమువల్ల, అనగా బుద్ధివాసనలు ప్రత్యక్షము గామివల్లననుట. సర్వజ్ఞత్వం - సర్వజ్ఞత్వము, నహీక్ష్యతే - కనబడలేదు. అనగా ననుభవింపబడలేదనుట. తత్ - ఆ సర్వజ్ఞత్వమును, సర్వబుద్ధిషు - సర్వబుద్ధులయందును, దృష్ట్వా - చూచి, వాసనాసు, బుద్ధివాసనలయందు, అనుమీయతాం - అనుమానింపబడుగాక. అనగా ననుమాన ప్రమాణముచే నెరుగవలెననుట.

తా. ప్ర. అయితే ఆ యానందమయ కోశమునకు సర్వజ్ఞత్వ మున్నయెడల అనుభవింపబడలేదేమి?. ఉ. సర్వజ్ఞత్వమునకు కారణములగు బుద్ధివాసనలు పరో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

షముగానుండుటవల్ల అనుభవింపబడలేదు. ప్ర. అయితే సర్వజ్ఞత్వమున్నదని మన మెట్లు నిశ్చయింపవచ్చును?. ఉ. సర్వజీవరాశి బుద్ధులయందుగల సర్వజ్ఞత్వము తనకు కారణములైన సర్వబుద్ధివాసనలం బొందియుండెడి సర్వజ్ఞత్వ పూర్వకముగా నగుటకు దగినదగునని అనుమానప్రమాణముచేత నెరుగవలెను. అనగా కార్యమైన వస్త్రమందు గనబడెడి రూపాది ధర్మవిశేషము ఆవస్త్రమునకు కారణమగు తంతునిష్ఠ పూర్వకముగా గనబడుచున్నదని తెలిసికొనినట్లు తెలిసికొనవలెనని యభిప్రాయము.

అవ. ఇట్లు సర్వజ్ఞత్వమును దెలిపి శ్రు॥ ఏషాంతర్యామి॥ అనెడి శ్రుతిచే జెప్పబడిన అంతర్యామిత్వమును ఉపపాదించుచున్నాడు.

శ్లో॥ విజ్ఞానమయముఖ్యేషుకోశేష్వన్యత్ర చైవహి।
అంత స్తిష్ఠన్ యమయతి తేనాంతర్యామితాంవ్రజేత్ ॥౧౬౩.

టీ. (యతః) ఏకారణమువల్ల, విజ్ఞానమయముఖ్యేషు - విజ్ఞానమయాదికోశములయందును, అన్యత్ర చైవహి - పృథివ్యాదులయందును, అంతః - లోపట, తిష్ఠన్ - స్థితినిబొందినవాడగుచు, యమయతి - ప్రేరేపించుచున్నాడో, తేన - ఆ కారణముచేత, అంతర్యామితాం - అంతర్యామిభావమును, వ్రజేత్ - పొందెను.

తా. మరియు ఏకారణముచేత ఈ యానందమయకోశరూప ఈశ్వరుడు విజ్ఞానమయము మొదలగు కోశములయందును పృథివ్యాది సర్వభూతములయందును లోపటనున్నవాడగుచు ప్రేరేపణము జేయుచున్నాడో ఆకారణముచేత అంతర్యామి యని శ్రుతిచే జెప్పబడుచున్నాడు.

అవ. ఈయర్థమందు అంతర్యామి బ్రాహ్మణమంతయు బ్రమాణమని జూపుట కొరకు ఆ యంతర్యామి బ్రాహ్మణమందు ఏకదేశభూతమగు శ్రు॥ యోవిజ్ఞానేతిష్ఠన్॥ అనెడి యిత్యాది వాక్యార్థము నిప్పుడుజెప్పుచున్నాడు.

శ్లో॥ బుద్ధౌతిష్ఠన్నాంతరోస్యాధియానేక్ష్యశ్చధీవపుః।
ధియమంతర్యమయతీత్యేవం వేదేనఘోషితం॥ ౧౬౪.

టీ. బుద్ధౌ - బుద్ధియందు, తిష్ఠన్ - స్థితినిబొందినవాడగుచు, అస్యాః - ఈ బుద్ధివల్ల, నాంతరః - కప్పబడనివాడై, ధీవపుస్సన్ = ధీ - బుద్ధినే, వపుస్సన్ - దేహముగాగలవాడగుచు, ధియా - బుద్ధిచేత, నేక్ష్యశ్చ - చూడబడనివాడై, అనగా నెరుగబడకనుట. అంతః - లోపట, ధియం - బుద్ధిని, యమయతీతి - ప్రేరేపించుచున్నాడని, ఏవం - ఈప్రకారముగా, వేదేన - అంతర్యామి బ్రాహ్మణముచేత, ఘోషితం - ఘోషింపబడెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మరియు ఆయంతర్యామియగు ఈశ్వరుడు ప్రాణులబుద్ధియందున్న వాడై యును ఆబుద్ధిచేత కప్పబడలేదనియు బుద్ధిని శరీరముగా గలిగియుండియు ఆబుద్ధిచే జూపబడలేదనియు లోపటబుద్ధిని నియమించుచు ప్రేరేపణరూపముగా నభిమానింపు చున్నాడనియు ఈప్రకారముగా నంతర్యామి బ్రాహ్మణము ఘోషించుచున్నది.

అవ. అంతర్యామి బ్రాహ్మణముయొక్క ప్రతిపర్యాయమును వ్యాఖ్యానము చేసినయెడల గ్రంథబాహుళ్యమగుననెడి భయముచేత తానుజేసెడి వ్యాఖ్యానమునకు సర్వపర్యాయ సంచారిత్వ సిద్ధికొరకు శ్రు॥ యస్సర్వేషుభూతేషు॥ అనెడి పర్యాయమును వ్యాఖ్యానింపదలచినవాడై శ్రు॥ యస్సర్వేషుభూతేషుతిష్ఠన్॥, అనెడి వాక్యార్థమును దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ తంతుఃపటేస్థితోయద్వదుపాదానతయాతథా।
సర్వోపాదానరూపత్వాత్సర్వత్రాయమవస్థితః॥ ౧౬౫.

టీ. పటే - వస్త్రమందు, తంతుః - దారపుప్రోగు, అనగా నూలనుట. యద్వత్ - ఏప్రకారముగా, ఉపాదానతయా - ఉపాదానకారణభావముచేత, స్థితః - స్థితినిబొందుచున్నదో, తథా - ఆప్రకారము, అయం - ఈ అంతర్యామి, సర్వోపాదానరూపత్వాత్ = సర్వ - సర్వప్రపంచమునకు, ఉపాదానరూపత్వాత్ - ఉపాదాన కారణరూపమగుటవల్ల, సర్వత్ర-అంతటను, ఆవస్థితిః-స్థితినిబొందియున్నాడు.

తా. మరియు వస్త్రమందు నూలు ఏప్రకారముగా ఆవస్త్రమునకు ఉపాదాన కారణత్వముచేత వర్తించుచున్నదో ఆప్రకారమే ఈయంతర్యామియు సర్వజగంబునకు ఉపాదాన కారణరూపముగా వర్తించుచుండుటవల్ల అంతటను స్థితినిబొందియున్నాడని తెలియవలెను.

శ్లో॥ పటాదప్యాంతరస్తంతుస్తంతోరప్యంశురాంతరః।
అంతరత్వస్యవిశ్రాంతిర్యత్రాసావనుమీయతాం॥ ౧౬౬.

టీ. పటాదపి - వస్త్రముకంటెను, తంతుః - నూలు, ఆంతరః - ఆంతరమగును. అనగా మరుగుగలదగుననుట. తంతోరపి - నూలుకంటెను, అంశుః - దారపు చీలిక, ఆంతరః - మరుగుగలదగును. యత్ర - ఏస్థలమందు, అంతరత్వస్య - అంతరత్వముయొక్క, విశ్రాంతిః - విశ్రమగునో అనగా అభావమనుట. (తత్ర) ఆస్థలమందు, అసౌ - ఈ యంతర్యామి, అనుమీయతాం - అనుమాన ప్రమాణముచే నెరుగబడుగాక.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే ఈ యంతర్యామి ఉపాదాన కారణత్వముచేత అంతట నున్నయెడల అంతట పొందబడలేదేమి?. ఉ. వస్త్రముకంటె నూలు అంతరమగును. ఆనూలుప్రోగుకంటె ఒకదారపుచీలిక అంతరమగును. ఈప్రకారము అణుత్వతారతమ్యమువలె అంతరత్వ తారతమ్యము ఏస్థలమందులేకపోవునో ఆస్థలమందు ఈ యంతర్యామి ఉన్నాడని యిట్లు అనుమానప్రమాణముచేత నెరుగవలెను. అనగా అంతర్యామి సర్వాంతరుడగుటవల్ల కనబడలేదని యభిప్రాయము.

శ్లో॥ ద్విత్ర్యాంతరత్వకక్ష్యాణాం దర్శనేప్యయమాంతరః।
నవీక్ష్యతే తతోయుక్తిశ్రుతిభ్యామేవనిర్ణయః॥ ౧౬౭.

టీ: ద్విత్ర్యాంతరత్వకక్ష్యాణాం = ద్విత్ర్యాంతరత్వ - రెండు మూడు అంతరత్వములయొక్క, దర్శనేపి - దర్శనమందును, అయం - ఈ యంతర్యామి, ఆంతరస్సన్ - అంతరుడగుచు, నవీక్ష్యతే - కనబడడు. తతః - అందువల్ల, యుక్తిశ్రుతిభ్యామేవ - యుక్తిశ్రుతులచేతనే, నిర్ణయః - నిర్ణయమగును. అనగా నీశ్వర నిర్ణయమును జేయవలెననుట.

తా. ప్ర. అయితే అంతర్యామి సర్వాంతరుడైనను దారపు చీలిక మొదలగునవి గనబడినట్లు అంతర్యామియొక్క దర్శనము గాదాయేమి?. ఉ. దారపు చీలిక మొదలగు సూక్ష్మవస్తువులు గనబడినను వానియన్నిటికంటె ఈ యంతర్యామి లోగానుండుటచేత కనబడడు. అనగా ఆదారపుప్రోగు మొదలగు బాహ్యవస్తువుల వలె ఈయంతర్యామి బాహ్యవస్తువుగామిచేత కనబడదని తెలియవలెను. ప్ర. అయితే అయంతర్యామి కలడని యెట్లు నిర్ణయింపవలెనో చెప్పుము?. ఉ. ౧. శ్రుతిచేతను, ౨. యుక్తిచేతను, అంతర్యామిని నిర్ణయింపవలెను. ప్ర. ఆ యుక్తి శ్రుతులెవ్వి. ఉ. అచేతనమగు జగంబునకు చేతనాధారత్వములేకనే ప్రవర్తనము గూడదనునది యుక్తి యగును. శ్రు॥ యస్సర్వేషుభూతేషుతిష్ఠన్॥. అనెడివాక్యము శ్రుతియగును. ఈ యుక్తి శ్రుతులచేతనే అంతర్యామికలడని నిర్ణయింపవలెను.

అవ. ఎవనికి సర్వభూతములును శరీరమగునో యని చెప్పెడి శ్రు॥ యస్య సర్వాణిభూతానిశరీరం॥. అనెడి శ్రుత్యర్థము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ పటరూపేణసంస్థానాత్పటస్తంతోర్వపుర్యథా।
సర్వరూపేణసంస్థానాత్సర్వమస్యవపుస్తథా॥ ౧౬౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. పటరూపేణ - వస్త్రరూపము చేత, అవస్థానాత్ - స్థితిని బొందియుండుటవల్ల, తంతోః - నూలునకు, పటః - వస్త్రము, యథా - ఏప్రకారముగా, వపుః - శరీరమగునో, తథా - ఆప్రకారము, సర్వరూపేణ - సర్వరూపముచేత, సంస్థానాత్ - స్థితినిబొంది యుండుటవల్ల, అస్య - ఈ యంతర్యామికి, సర్వం - సర్వజగంబును, వపుః - శరీరమగును.

తా. మరియు నూలు వస్త్రరూపముగా నుండుటచేత ఆ వస్త్రము నూలునకు శరీరమెట్లగునో ఆటువలెనే ఈ యంతర్యామియు సర్వజగద్రూపముగా నుండుటచేత, సర్వజగంబును ఈ యంతర్యామికి శరీరమగునని తెలియవలెను.

అవ. మరియు, ఎవడు, సర్వాంతరుడగుచు, సర్వభూతములను ప్రేరేపించుచున్నాడో, అని చెప్పెడి, శ్రు॥ యస్సర్వాణి భూతాన్యంతరోయమయతి॥ అనెడి వాక్య తాత్పర్యమును దృష్టాంతసహితముగా నిప్పుడు రెండు శ్లోకములచేజెప్పుచున్నాడు.

శ్లో॥ తంతోస్సంకోచవిస్తారచలనాదౌపటోయథా।
అవశ్యమేవభవతినస్వాంతత్ర్యంపటేమనాత్॥ ౧౬౯.

టీ. తంతోః - నూలును, సంకోచవిస్తారచలనాదౌ = సంకోచ - సంకోచమందును, అనగా ముడుచుటయందనుట. విస్తార - తెరచుటయందును, చలనాదౌ - చలించుట మొదలగుదానియందును, పటః - వస్త్రము, యథా - ఏప్రకారము అవశ్యమేవ - అవశ్యముగానే, అనగానూలువలె చలనాదికముంగలదనుట. భవతి - అగుచున్నదో, పటే - వస్త్రమందు, మనాక్ - కొంచెమైనను, స్వాతంత్ర్యం - స్వాతంత్ర్యము, న - లేదో.

తా. మరియు నూలుయొక్క సంకోచ విస్తార చలనాదికముచేత వస్త్రమునకు సంకోచ విస్తార చలనాదిక మవశ్యముగా నెట్లు గలుగునో మరియు వస్త్రమందు కొంచెమైనను స్వాతంత్ర్య మెట్లు లేదో.

శ్లో॥ తథాంతర్యామ్యయంయత్రయయావాసనయాయథా.
విక్రియేతతథావశ్యంభవత్యేవనసంశయః॥ ౧౭౦.

టీ. తథా - ఆప్రకారము, అయం - ఈ, అంతర్యామీ - ఈశ్వరుడు, యత్ర - ఎచ్చట, యయా - ఏ, వాసనయా - వాసనచేత, యథా - ఏఘటాదిరూపముగా, విక్రియేత - వికారమునుబొందునో, తథా - ఆప్రకారము, అవశ్యం -

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవశ్యముగా, భవత్యేవ - ఆయా ఘటాదికార్య మగుచున్నదేను, సంశయః - సంశయము, న - లేదు.

తా. ఆప్రకారమే పృథివ్యాదులయందు ఉపాదాన కారణరూపముగా నుండెడి ఈ యంతర్యామియు ఎచ్చటెచ్చట ఏఏవాసనచేత ఏప్రకారము ఘటాదికార్యరూపముగా వికారమును బొందుచున్నాడో ఆయాప్రకారము ఆయా ఘటాది కార్యవర్గ మవశ్యమగుచున్నది. ఇందుకు సంశయములేదు.

అవ. ఇట్లు అంతర్యామిని బ్రతిపాదించెడి శ్రుతిని ఉపన్యసించి, యిప్పుడు స్మృతినిగూడ, ఉపన్యసించుచున్నాడు.

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాంహృద్దేశేర్జునతిష్ఠతి।
భ్రామయన్సర్వభూతానియంత్రారూఢానిమాయయా॥ ౧౭౧.

టీ. హే అర్జున - ఓఅర్జునుడా, ఈశ్వరః-ఈశ్వరుడు, యంత్రారూఢాని = యంత్ర - యంత్రములను, ఆరూఢాని - ఎక్కిన, సర్వభూతాని - సర్వభూతములను, మాయ - మాయచేత, భ్రామయన్ - భ్రమింపజేయుచున్నవాడై, సర్వభూతానాం - సర్వజీవులయొక్క, హృద్దేశే - హృదయప్రదేశమందు, తిష్ఠతి - స్థితిని బొందుచున్నాడు.

తా. ఓ అర్జునా ఈశ్వరుడు సర్వభూతములయొక్క హృదయప్రదేశమందున్నాడు. మరియు ఆఈశ్వరుడు యంత్రముల నాశ్రయించినట్టి సర్వభూతములను మాయచేత భ్రమింప జేయుచున్నాడని శ్రీభగవంతుడు గీతాశాస్త్రమందు అర్జునునకు జెప్పెను.

అవ. ఈభగవద్వాక్యమందుగల, (సర్వభూతానాం) అనెడిపదమునకుఅర్థమునిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ సర్వభూతానివిజ్ఞానమయాస్తేహృదయేస్థితాః।
తదుపాదానభూతేశస్తత్రవిక్రియతేఖలు॥ ౧౭౨.

టీ. సర్వభూతాని - సర్వభూతములనగా, విజ్ఞానమయాః - విజ్ఞానమయులగుదురు. తే - ఆ విజ్ఞానమయులు, హృదయే - హృదయమందు, స్థితాః - స్థితిని బొందుచున్నారు. తదుపాదానభూతేశః=తత్ - ఆవిజ్ఞానమయములకు, ఉపాదాన భూత - కారణభూతుడైన, ఈశః - ఈశ్వరుడు, తత్ర - ఆహృదయమందు, విక్రియతేఖలు - వికారమును బొందుచున్నాడుగదా.

తా. పూర్వోక్త భగవద్వాక్యమందుగల సర్వభూతపదమునకు విజ్ఞానమయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లని యర్థమగును. అవిజ్ఞానమయులు హృదయకమలమందుండిరి. ప్ర. అయితే ఆవి జ్ఞానమయులు హృదయకమలమందుండుటకు గారణమేమి?. ఉ. ఆవిజ్ఞానమయకోశరూపులగుజీవులకు ఉపాదానకారణభూతుడైన ఈశ్వరుడు హృదయమందు విజ్ఞానమయాకారముగా పరిణమించుచున్నాడు. గనుక సర్వవిజ్ఞామయులును ఆహృదయకమలమందుండిరని తెలియవలెను.

అవ. పూర్వోక్త భగవద్వాక్యమందు, (యంత్రారూఢాని) అనెడి పదమందుగల, యంత్రారోహ శబ్దములకు, అర్థము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ దేహాదిపంజరంయంత్రంతదారోహోభిమానితా।
విహితప్రతిషిద్ధేషుప్రవృత్తిర్భ్రమణంభవేత్॥ ౧౭౩.

టీ. దేహాదిపంజరం - పంజరరూపముగా నుండెడి దేహేంద్రియాదికము, యంత్రం-యంత్రమగును. అభిమానితా - ఆదేహాభిమానిత్వము, తదారోహః=తత్ - ఆయంత్రముయొక్క, ఆరోహః - ఎక్కుటయగును. విహితప్రతిషిద్ధేషు = విహిత-ధర్మమందును, ప్రతిషిద్ధేషు - అధర్మమందును, ప్రవృత్తిః - ప్రవర్తనము, అవగా బ్రవర్తించుట యనుట. భ్రమణం - భ్రమణము, అనగా దిరుగుట యనుట. భవేత్ - అగును.

తా. ప్ర. అయితే పూర్వోక్తభగవద్వాక్యమందు (యంత్రారూఢాని) అనెడి పదమందుగల యంత్రారోహశబ్దములకు అర్థమేమి?. ఉ. పంజరమువంటి దేహేంద్రియాదికము యంత్రమగును. ఆయంత్రము నెక్కుటయనగా అదేహేంద్రియాదికమందుగల అభిమానిత్వమగును. ప్ర. అయితే పూర్వోక్తభగవద్వాక్యమందుగల (భ్రామయన్) అనెడి పదముయొక్క ప్రకృత్యర్థమేమి?. ఉ. ధర్మాధర్మములయందు బ్రవర్తించుటమే (భ్రమణం=తిరుగుట) యగును. ఇదియే భ్రామయన్ అనెడి పదమందుగల భ్రమణమనెడి ప్రకృతి శబ్దమునకు అర్థమని తెలియవలెను.

అవ. పూర్వోక్త భగవద్వాక్యమందు, (భ్రామయన్) అనెడి పదమందుగల, ణిచ్, అనెడి ప్రత్యయమునకును, మాయాపదమునకును అర్థము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ విజ్ఞానమయరూపేణతత్ప్రవృత్తిస్వరూపతః।
స్వశక్త్యేశోవిక్రియతేమాయయాభ్రామణంహితత్॥౧౭౪.

టీ ఈశః - ఈశ్వరుడు, స్వశక్త్యా = స్వ - తనయొక్క, శక్త్యా - శక్తిచేత, విజ్ఞానమయరూపేణ - విజ్ఞానమయాకారముగా, తత్ప్రవృత్తిస్వరూపతః =

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తత్ప్రవృత్తి - ఆ విజ్ఞానమయుల ప్రవర్తనముయొక్క, స్వరూపతః - స్వరూపమువల్ల, వికి్రియతే - వికారమును బొందుచున్నాడు. తద్ధి - అదియే, మాయయా-మాయచేత, భ్రామణం - భ్రమింపజేయుటయగును.

తా. ఈశ్వరుడు తనశక్తిచేత విజ్ఞానమయాకారముగా ఆవిజ్ఞానమయుల ప్రవర్తన స్వరూపమువల్ల పరిణమించుచున్నాడు ఇదియే మాయచేత భ్రమింపజేయుటయగును.

అవ. శ్రుతియందుగల, (యమయతి) అనెడి పదమునకును, ఇదియే యర్థమని, యిప్పుడు చెప్పుచు, ఈ చెప్పబడిన వ్యాఖ్యానము నితర పర్యాయములయందును కూర్చుచున్నాడు.

శ్లో॥ అంతర్యమయతీత్యుక్త్యాఽయమేవార్థశ్శ్రుతౌశ్రుతః।
పృథివ్యాదిషుసర్వత్రన్యాయోఽయంయోజ్యతాంధియా॥౧౭౫.

టీ. అంతః - లోపట, యమయతీతి - ఈశ్వరుడు ప్రేరేపించుచున్నాడని, ఉక్త్యా - చెప్పుటచేతను, అయం - ఈ, అర్థఏవ - అర్థమే, శ్రుతౌ - శ్రుతియందు, శ్రుతః - వినబడుచున్నది. అయం - ఈ, న్యాయః - న్యాయము, పృథివ్యాదిషు - పృథివ్యాది భూతములయందు, సర్వత్ర - అంతటను, ధియా - బుద్ధిచేత, యోజ్యతాం - కూర్చబడుగాక.

తా. మరియు (అంతర్యమయతి) ఈశ్వరుడు సర్వాంతరుడై ప్రేరేపించుచున్నాడని చెప్పెడి పదముచేతనుకూడ ఈ పైనచెప్పబడిన యర్థమే వినబడుచున్నది. కనుక ఈ పైనచెప్పబడిన న్యాయమును పృథివ్యాదులయందు అంతటను బుద్ధిచేత ఆలోచించవలెను.

అవ. ప్రవృత్తిజాతమంతయు ఈశ్వరాధీనమనుటయందు, మరియొకవాక్యము నిప్పుడు, ఉదహరించుచున్నాడు,

శ్లో॥ జానామిధర్మంనచమేప్రవృత్తిర్జానామ్యధర్మంనచమేనివృత్తిః।
కేనాపిదేవేనహృదిస్థితేనయథానియుక్తోస్మితథాకరోమి॥ ౧౭౬.

టీ. ధర్మం - చేయదగినకార్యమును, జానామి - ఎరుగుచున్నాను. మే-నాకు, ప్రవృత్తిశ్చ - ధర్మమందు ప్రవర్తనంబును, న - లేదు. అధర్మంచ - చేయరాని కార్యమును, జానామి - ఎరుగుచున్నాను. మే - నాకు, నివృత్తిశ్చ - అధర్మమందు ప్రవర్తింపమి, న - లేదు. హృది - హృదయమందు, స్థితేన - స్థితిని బొందియుండెడి, కేనాపి - ఒక[illegible] గా, నియుక్తః-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నియమింపబడెడివాడను, అస్మి - అగుచున్నానో, తథా - ఆప్రకారముగా, కరోమి- చేయుచున్నాను.

తా. మరియు నేను ధర్మము నెరిగినను ధర్మమందునాకు ప్రవర్తనములేదని యు నేను అధర్మము నెరిగినను నాకు అధర్మమందు నివృత్తిలేదనియు మరియేమనగా బుద్ధియందుండెడి ఒకానొకదేవునిచేత ఏప్రకారముగా నియమింపబడుదునో ఆప్రకారము ధర్మాధర్మములం జేయుచుందునని మరియొకవాక్యము సర్వము ఈశ్వరాధీనమని చెప్పుచున్నది.

శ్లో॥ నార్థఃపురుషకారేణేత్యేవంమాశంక్యతాంయతః।
ఈశఃపురుషకారస్వరూపేణాపివివర్తతే॥ ౧౭౭.

టీ. యతః - ఏకారణమువల్ల, ఈశః - ఈశ్వరుడు, పురుషకారస్వరూపేణాపి = పురుషకార - పురుషప్రయత్నముయొక్క, స్వరూపేణాపి - స్వరూపముచేతను, వివర్తతే - పరిణమించుచున్నాడో, (అతః) ఆకారణమువల్ల, పురుషకారేణ- పురుషప్రయత్నముచేత, అర్థః - ప్రయోజనము నేతి - లేదని, ఏవం - ఈప్రకారము, మాశంక్యతాం - శంకింపబడకుండు గాక.

తా. ప్ర. అయితే ప్రవృత్తియంతయు ఈశ్వరాధీనమైనయెడల పురుషప్రయత్నము వ్యర్థముగాదాయేమి ? ఉ. ఏకారణముచేత ఆయీశ్వరుడు పురుషప్రయత్న స్వరూపముగా వర్తించుచున్నాడో ఆకారణముచేత పురుషప్రయత్నమువల్ల ప్రయోజనములేదని శంకింపరాదు.

శ్లో॥ ఈదృగ్బోధేనేశ్వరస్యప్రవృత్తిర్మైవవార్యతాం।
తథాపీశస్యబోధేనస్వాత్మాసంగత్వధీజనిః॥ ౧౭౮.

టీ. ఈదృగ్బోధేన - ఇటువంటిబోధచేత, అనగా నీశ్వరుడు పురుషప్రయత్నాది స్వరూపముగాగూడ వర్తించుచున్నాడనెడి జ్ఞానముచేననుట. ఈశస్య- ఈశ్వరునియొక్క, ప్రవృత్తిః - అంతర్యామిరూపముచేత ప్రేరకత్వము, మైవవార్యతాం - నివారింపబడకుండుగాక. తథాపి - ఆట్లైనను, ఈశస్య - ఈశ్వరునియొక్క, బోధేన - జ్ఞానముచేత, స్వాత్మాసంగత్వధీజనిః = స్వాత్మ - స్వస్వరూపముయొక్క, అసంగత్వధీ - అసంగత్వ - జ్ఞానముయొక్క, జనిః - ఉత్పత్తియగుచున్నది.

తా. ప్ర. అయితే పురుషప్రయత్నంబును ఈశ్వర స్వరూపమేయైనయెడల (యమయంతి [illegible]) అనెడి [illegible] ప్రతిపాదింపబడిన అంతర్యామి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక్క ప్రేరకత్వము వ్యర్థముగాదాయేమి?. ఉ. ఈశ్వరుడు బురుమప్రయత్నాది స్వరూపముగాగూడ వర్తించుచున్నాడనెడి జ్ఞానముచేత అంతర్యామియొక్క ప్రేరేపణము నివారింపబడదు. మరియు అట్టి యీశ్వరజ్ఞానముచేత స్వస్వరూపభూతుడగు ప్రత్యగాత్మ అసంగుడనెడి జ్ఞానముగలుగుచున్నది. కనుక అంతర్యామియొక్క ప్రేరేపణము వ్యర్థముకానేరదు.

శ్లో॥ తావతాముక్తిరిత్యాహుశ్శ్రుతయస్స్మృతయస్తథా।
శ్రుతిస్మృతీమమైవాజ్ఞేఇత్యపీశ్వరభాషితం॥ ౧౭౯.

టీ. శ్రుతయః - శ్రుతులును, తథా - అప్రకారము, స్మృతయః - స్మృతులును, తావతా - అట్టి ఆత్మాసంగత్వజ్ఞానముచేత, ముక్తిరితి - మోక్షముగలుగుచున్నదని, అహుః - చెప్పుచున్నవి. శ్రుతిస్మృతీ - శ్రుతిస్మృతులు రెండును, మమ- నాయొక్క, అజ్ఞేఏవ - ఆజ్ఞలేను, ఇత్యపి - ఇట్లని, ఈశ్వరభాషితం = ఈశ్వర- భగవంతునిచేత, భాషితం - చెప్పబడెను.

తా. ప్ర. అయితే ఆత్మ అసంగుడనెడి జ్ఞానముచేసైనను బ్రయోజనమేమి?. ఉ. ఆత్మ అసంగుడనెడి జ్ఞానముచేతనే ముక్తి గలుగుచున్నదని శ్రుతిస్మృతులు జెప్పుచున్నవి. ప్ర. అయితే శ్రుతిస్మృతులు జెప్పినమాత్రముచేతనే ముక్తిగలుగునా యేమి?. ఉ. శ్రుతిస్మృతులురెండును నాయొక్క ఆజ్ఞలగునని ఈశ్వరుడే శ్రీగీతాశాస్త్రమందు జెప్పెను. గనుక శ్రుతిస్మృతులచే జెప్పబడిన యర్థమును అతిక్రమింపరాదు.

శ్లో॥ ఆజ్ఞయాభీతిహేతుత్వంభీషాస్మాదితిహిశ్రుతం।
సర్వేశ్వరత్వమేతత్స్యాదంతర్యామిత్వతఃపృథక్॥ ౧౮౦.

టీ. అస్మాత్ - ఈయీశ్వరునివల్ల, భీషేతి - భయముగలుగుచున్నదనెడి శ్రుతివల్ల, ఆజ్ఞయా - ఆజ్ఞచేత, భీతిహేతుత్వం - భయహేతుత్వము, శ్రుతంహి- వినబడెనుగదా. ఏతత్ - ఈభీతిహేతుత్వము, అంతర్యామిత్వతః - అంతర్యామి స్వభావముకంటె, పృథక్ - భిన్నమైన, సర్వేశ్వరత్వం - సర్వేశ్వరభావమగును.

తా. మరియు శ్రు॥ భీషాస్మాత్॥ అనెడి శ్రుతివల్ల ఈశ్వరాజ్ఞచేత భీతిహేతుత్వము వినబడుచున్నది. ప్ర. అయితే ఆజ్ఞచేత ఈశ్వరునకు భీతిహేతుత్వము ఎందుకొరకు వినబడుచున్నదో జెప్పుము?. ఉ. ఈభీతిహేతుత్వము అంతర్యామి స్వభావముకంటె భిన్నమైన సర్వేశ్వరభావమగును. అనగా అంతర్యామిభావముకంటె సర్వేశ్వరభావమునకు భేదముసిద్ధించెడికొరకు వినబడుచున్నదని యభిప్రాయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. బాహ్యాభ్యంతరములగు రెంటియందును ఈశ్వరుడే నియామకుడనెడి విషయమై ఇప్పుడు రెండుశ్రుతులను పఠించుచున్నాడు.

శ్లో॥ ఏతస్యవాఅక్షరస్యప్రశాసనఇతిశ్రుతిః।
అంతఃప్రవిష్టశ్శాస్తాయంజనానామితిచశ్రుతిః॥ ౧౮౧.

టీ. ఏతస్యవా - ఈ, అక్షరస్య - అక్షరుడైన ఈశ్వరునియొక్క, ప్రశాసన ఇతి - ఆజ్ఞయందు సూర్యచంద్రాది ప్రపంచమంతయు ప్రవర్తించుచున్నదని, శ్రుతిః- శ్రుతిజెప్పుచున్నది. అయం - ఈయీశ్వరుడు, జనానాం - ప్రాణులయొక్క, అంతః- దేహములోపట, ప్రవిష్టస్సన్ -ప్రవేశించినవాడగుచు, శాస్తేతిచ-శిక్షకుడగుచున్నాడని, శ్రుతిః - మరియొకశ్రుతి చెప్పుచున్నది.

తా. మరియు సూర్యచంద్రాది బాహ్యజగంబంతయు అక్షరుడైన ఈయీశ్వరునియొక్క ఆజ్ఞయందు బ్రవర్తించుచున్నదని శ్రుతి జెప్పుచున్నది. మరియు ఈ యీశ్వరుడు సర్వప్రాణులయొక్క శరీరములలోపట బ్రవేశించినవాడగుచు శిక్షించుచున్నాడని మరియొకశ్రుతి జెప్పుచున్నది.

అవ. శ్రు॥ క్రమప్రాప్తమైన ఏష్యయోనిః॥ అనెడి వాక్యార్థమును జెప్పుచు శ్రు॥ ప్రభవాప్యయాహిభూతానాం॥ అనెడివాక్యమును హేతువుగా నిప్పుడు చేర్చుచున్నాడు.

శ్లో॥ జగద్యోనిర్భవేదేషప్రభవాప్యయకృత్త్వతః।
ఆవిర్భావతిరోభావావుత్పత్తిప్రలయౌమతౌ॥ ౧౮౨.

టీ. ప్రభవాప్యయకృత్త్వతః = ప్రభవ - సృష్టియు, అప్యయ - ప్రళయంబును యీరెంటియొక్క, కృత్త్వతం - చేయుటవల్ల, ఏషః - ఈయీశ్వరుడు, జగద్యోనిః = జగత్ - ప్రంచమునకు, యోనిః - కారణుడు, భవేత్ - అగును. ఉత్పత్తిప్రళయౌ - సృష్టిప్రళయములురెండును, ఆవిర్భావతిరోభావా - ఆవిర్భావతిరోభావములుగా, మతౌ - సమ్మతములగును.

తా. మరియు ఈయీశ్వరుడు సర్వజగత్సృష్టిప్రళయములను జేయుటవల్ల జగద్యోనియని శ్రుతిచేజెప్పబడెను. సృష్టిప్రళయములనగా ఆవిర్భావతిరోభావములగును.

అవ. ఈశ్వరుడు జగంబును ఆవిర్భవింపజేసెడి విషయమును దృష్టాంతసహితముగా నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆవిర్భావయతిస్వస్మిన్విలీనంసకలంజగత్।
ప్రాణికర్మవశాదేషపటోయద్వత్ప్రసారితః॥ ౧౮౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. పటః - చిత్రవస్త్రము, ప్రాసారితః - విస్తరింపబడినదగుచు, యద్వత్ - ఏప్రకారముగాదనయందుగల చిత్రవర్ణములను తోపింపజేయుచున్నదో, (తద్వత్) ఆప్రకారముగ, ఏషః - ఈశ్వరుడు, స్వస్మిన్ - తనయందు, విలీనం - లయమును బొందిన, సకలం - సకలమగు, జగత్ - ప్రపంచమును, ప్రాణికర్తృవశాత్ = ప్రాణి జీవులయొక్క, కర్తృవశాత్ - కర్తృవశమువల్ల, ఆవిర్భావయతి - ఆవిర్భవింపజేయుచున్నాడు. అనగా తోపింతజేయుచున్నాడనుట.

తా. చిత్రవస్త్రము విస్తరింపబడినదగుచు ఏప్రకారముగా దనయందు అణగియుండెడి చిత్రవర్ణములను తోపింపజేయుచున్నదో అటువలెనే ఈశ్వరుడును దనయందు లయించిన సకలజగంబును జీవులయొక్క కర్తృవశమువల్ల, తోపింపజేయుచున్నాడు. ఇదియే ఆవిర్భావశబ్దార్థమగును.

అవ. ఆ యీశ్వరునకే ప్రళయకారణత్వము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ పునస్తిరోభావయతి స్వాత్మన్యేవాఖిలంజగత్ ।
ప్రాణికర్మక్షయవశాత్సంకోచితపటో యథా॥ ౧౨౪.

టీ. సంకోచితపటః = సంకోచిత - ముడువబడిన, పటః - చిత్రవస్త్రము, యథా - ఏప్రకారముగా జిత్రవర్ణములను తనయందే అణచుకొనుచున్నదో, (తథా) ఆప్రకార మీశ్వరుడును, ప్రాణికర్తృక్షయవశాత్ = ప్రాణి - జీవరాశియొక్క, కర్తృ - కర్తృములయొక్క, క్షయవశాత్ - నాశవశమువల్ల, అఖిలం - సకలమైన, జగత్ - ప్రపంచమును, స్వాత్మన్యేవ - తనయందే, పునః - మరల, తిరోభావయతి - అణగింపజేయుచున్నాడు.

తా. మరియు ఆచిత్రవస్త్రము ముడువబడినదగుచు చిత్రవర్ణములను ఏప్రకారము తనయందే అణచుకొనుచున్నదో ఆప్రకార మీశ్వరుడును జీవరాశియొక్క కర్తృక్షయవశమువల్ల మరల సకలజగంబును తనయందే అణగింప జేయుచున్నాడు.

అవ. ఆవిర్భావ తిరోభావముల విషయమై, మరికొన్ని దృష్టాంతముల నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ రాత్రిఘస్రౌసుప్తిబోధావున్మీలననిమీలనే।
తూష్ణీంభావమనోరాజ్యేఇవ సృష్టిలయావిమౌ॥ ౧౨౫.

టీ. రాత్రిఘస్రౌఇవ - రాత్రింబగలులవలెను, సుప్తిబోధావివ - సుషుప్తి జాగ్రదవస్థలవలెను, ఉన్మీలననిమీలనేఇవ - కంటిని దెరచుట మూయుటవలెను. తూష్ణీంభావ మనోరాజ్యేఇవ - తూష్ణీంభావమనోరాజ్యములవలెనే, ఇమౌ - ఈ సృష్టిలయౌ - సృష్టిప్రళయములు సమ్మతములగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఈ జగంబుయొక్క సృష్టిప్రళయములు పగలు రాత్రికాలములవలెను జాగ్రత్సుషుప్తులవలెను కంటికి తెరచుట మూయుటవలెను తూష్ణీంభావమనోరాజ్యములవలెను గలిగియున్నవని తెలియవలెను.

శ్లో॥ ఆవిర్భావతిరోభావశక్తిమత్త్వేనహేతునా।
ఆరంభపరిణామాదిచోద్యానాంనాత్రసంభవః॥ ౧౫౬.

టీ. ఆవిర్భావతిరోభావశక్తిమత్త్వేన=ఆవిర్భావ-ఆవిర్భావముయొక్కయు, తిరోభావ-తిరోభావముయొక్కయు, శక్తిమత్త్వేన-శక్తినిగలుగుటయనెడి, హేతునా-హేతువుచేత, అనగా నీశ్వరుడు ఆవిర్భావతిరోభావ శక్తివంతుడగుటచేననుట. ఆరంభపరిణామాదిచోద్యానాం=ఆరంభ-ఆరంభవాదముయొక్కయు, పరిణామాది-పరిణామాది వాదములయొక్కయు, చోద్యానాం-ఆక్షేపములకు, అత్ర-ఇక్కడ, నసంభవః-ఉత్పత్తిగలుగదు.

తా. ప్ర. అయితే ఈశ్వరునకు జగద్యోనిత్వము ఆరంభకత్వముచేతనోలేక జగదాకారముగా పరిణమించుటచేతనో చెప్పుము. అద్వితీయునకు ఆరంభకత్వము గూడదు. మరియు నిరవయవునకు పరిణామము యుక్తముగాదుగదా?. ఉ. ఈశ్వరుడు జగంబును ఆవిర్భావ తిరోభావములను జేసెడి శక్తిమంతుడగును. కనుక ఆరంభపరిణామాది చోద్యములు ఇక్కడ సంభవింపనేరవు. అనగా నీశ్వరునియందు జగత్సృష్టివిషయమై మేము వివర్తవాదము నాశ్రయించుటచేత ఆరంభపరిణామాదివాదములవల్ల గలిగెడు దోషములేదని యభిప్రాయము. ఈ యారంభపరిణామ వివర్తవాదస్వరూపములను ఈపంచదశియందుగల అద్వైతానందమనెడి పదుమూడవ ప్రకరణములోని ౭-౮-౯ శ్లోకతాత్పర్యములను జూచి తెలిసికొనవలెను.

శ్లో॥ అచేతనానాంహేతుస్స్యాజ్జాడ్యాంశోనేశ్వరస్తథా।
చిదాభాసాంశతస్త్వేషజీవానాంకారణంభవేత్॥ ౧౫౭.

టీ. జాడ్యాంశః-ప్రకృతిరూపము, అచేతనానాం-దేహేంద్రియాది జడపదార్థములకు, హేతుః-కారణము, స్యాత్-అగును. ఈశ్వరః-ఈశ్వరుడు, అనగా నీశ్వరచైతన్యమనుట. న-కాదు, ఏషతు-ఈ యీశ్వరుడో, చిదాభాసాంశతః-చిదాభాసరూపమువల్ల, జీవానాం-జీవులకు, తదా-అప్రకారము, కారణం-హేతువు, భవేత్-అగును.

తా. ప్ర. అయితే ఒక్కడైన ఈశ్వరుడు చేతన అచేతనరూప జగంబునకు ఉపాదానకారణ మెట్లగును?. ఉ. ఈశ్వరుడు మాయోపాధికుడగుటవలన ఆమా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యమే దేహేంద్రియాది అచేతన పదార్థములకు గారణమగుగాని ఈశ్వర చైతన్యము దేహేంద్రియాది అచేతనములకు గారణముగాదు. మరియు ఈశ్వరుడు చిదాభాస రూపముచేత జీవులకుగారణుడగును. అనగా ఈశ్వరుడొక్కడే ప్రకృతి ప్రాధాన్యత చేత అచేతనములకు ఉపాదాన కారణమాయెననియు చిదాభాసరూపముచేత జీవుల కు గారణమాయెననియుం దెలియవలెను.

అవ. ఇప్పుడు రెండు శ్లోకములచే బూర్వవాది, ఆక్షేపించుచున్నాడు.

శ్లో॥ తమఃప్రధానః క్షేత్రాణాం చిత్ప్రధానశ్చిదాత్మనాం।
పరః కారణతామేతి భావనాజ్ఞానకర్మభిః॥ ౧౮౮.

టీ. తమఃప్రధానః-తమోగుణప్రధానుడగు అనగా మాయోపాధికుడనుట. పరః-పరమాత్మ, క్షేత్రాణాం-శరీరములకును, అనగా జడపదార్థములకనుట. చిత్ప్రధానః-చైతన్యప్రధానుడగు పరమాత్మ, చిదాత్మనాం-జీవులకును, భావనాజ్ఞానకర్మభిః=భావనా-సంస్కారముచేతను, జ్ఞాన-దేవతాధ్యానాదికముచేతను, కర్మభిః-పుణ్యాపాపలక్షణ కర్మములచేతను, కారణతాం - జగత్కారణత్వమును, ఏతి - పొందుచున్నాడు.

తా. ప్ర. అయితే తమోగుణప్రధాన మాయోపాధికుడగు పరమాత్మ అచేతనములు శరీరాది జగంబునకును చేతనప్రధానుడగు పరమాత్మ జీవులకును సంస్కార దేవతాధ్యానకర్మములనెడి మూడునిమిత్తములచేత కారణత్వమును బొందుచున్నాడని సురేశ్వరాచార్యులు జెప్పిరి.

శ్లో॥ ఇతి వార్తికకారేణ జడచేతనహేతుతా।
పరమాత్మన ఏవోక్తా నేశ్వరస్యేతి చేన్న తత్॥ ౧౮౯.

టీ. ఇతి-ఈప్రకారము, వార్తికగారేణ-సురేశ్వరాచార్యునిచేత, పరమాత్మన ఏవ-పరమాత్మకే, జడచేతనహేతుతా=జడ-జడరూపజగంబునకును, చేతన-చేతనరూపజగంబునకును, హేతుతా-కారణత్వము, ఉక్తా-చెప్పబడెను. ఈశ్వరస్య-ఈశ్వరునకు, నేతిచేత్-జగత్కారణత్వము జెప్పబడలేదని యంటివేని, తత్-అది, అనగా అట్లనుట, న-కాదు.

తా. ఇట్లు వార్తికకారుడైన సురేశ్వరాచార్యులచేత పరమాత్మయే చేతన అచేతనరూప జగంబునకు కారణమని చెప్పబడెనేగాని ఈశ్వరుడు జగత్కారణమని చెప్పబడలేదు. కనుక మాయకుడగు ఈశ్వరుడు జగత్కారణుడని యెట్లు చెప్పవచ్చును?. ఉ. అట్లుకాదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. త్వంపదార్థమందువలె తత్పదార్థమందును ఆదిష్ఠాన ఆరోప్యములకు అన్యోన్యాధ్యాసము చెప్పబడుటచే, నీదోషము లేదని సిద్ధాంతి, పరిహరించుచున్నాడు.

శ్లో॥ అన్యోన్యాధ్యాసమత్రాపిజీవకూటస్థయోరివ।
ఈశ్వరబ్రహ్మణోస్సిద్ధంకృత్వాబ్రూతేసురేశ్వరః॥ ౧౯౦.

టీ. సురేశ్వరః-సురేశ్వరాచార్యుడు, అత్రాపి-ఇచ్చటను, జీవకూటస్థయోరివ-జీవకూటస్థులకువలె, ఈశ్వరబ్రహ్మణోః-ఈశ్వరబ్రహ్మములకును, అన్యోన్యాధ్యాసం-తాదాత్మ్యాధ్యాసమును, సిద్ధంకృత్వా-సిద్ధముగాచేసి, బ్రూతే-చెప్పెను.

తా. ఓ పూర్వవాదీ ఆ సురేశ్వరాచార్యులు జీవకూటస్థులకు అన్యోన్యాధ్యాసము గలిగియున్నట్లు ఈశ్వర బ్రహ్మములకును అన్యోన్యాధ్యాసము సిద్ధించినట్లు నిశ్చయించి పరమాత్మకు జగత్కారణత్వమును జెప్పెనుగాని కేవలపరమాత్మకు జగత్కారణత్వమును జెప్పలేదని యభిప్రాయము.

శ్లో॥ సత్యంజ్ఞానమనంతంయద్బ్రహ్మతస్మాత్సముత్థితాః।
ఖవాయ్వగ్నిజలోర్వ్యోషధ్యన్నదేహాఇతిశ్రుతిః॥ ౧౯౧.

టీ. సత్యం-సద్రూపలక్షణము గలిగినట్టియు, జ్ఞానం-చిద్రూపలక్షము గలిగినట్టియు, అనంతం-అనంతరూపలక్షణము గలిగినట్టి, యత్-ఏ, బ్రహ్మ-బ్రహ్మముగలదో, తస్మాత్-ఆపరబ్రహ్మమువల్ల, ఖవాయ్వగ్నిజలోర్వ్యోషధ్యన్నదేహాః=ఖ-ఆకాశంబును, వాయు-వాయువును, అగ్ని-అగ్నియు, జల-జలంబును, ఉర్వీ-భూమియు, ఓషధి-ఓషధులును, అన్న-అన్నంబును, దేహాః-దేహములును, సముత్థితాఃఅతి-పుట్టినవని, శ్రుతిః-శ్రుతిజెప్పుచున్నది.

తా. ప్ర. అయితే సురేశ్వరాచార్యులచేత ఈశ్వరబ్రహ్మములకు అన్యోన్యాధ్యాసము సిద్ధముగానున్నట్లు నిశ్చయించి వ్యవహరింపబడెనని మీకెట్లు తెలిసెను ?. ఉ. శ్రుత్యర్థపర్యాలోచనముచేత దెలియబడుచున్నది. ప్ర. అయితే ఆస్థలమెద్ది?. ఉ. సత్యజ్ఞానానంత స్వరూపలక్షణముగల పరబ్రహ్మమువల్ల, ౧. ఆకాశము, ౨. వాయువు, ౩. అగ్ని, ౪. జలము, ౫. భూమి, ౬. ఓషధులు, ౭. అన్నములు, ౮. దేహములు, అనగా చతుర్విధభూతసముదాయము ఇత్యాది ప్రపంచమంతయుం బుట్టినట్లు శ్రు॥ సత్యంజ్ఞానమనంత॥ అనెడి ఇత్యాదిశ్రుతి జెప్పుచున్నది.

శ్లో॥ ఆపాతదృష్టితస్తత్రబ్రహ్మణోభాతిహేతుతా।
హేతోశ్చసత్యతాతస్మాదన్యోన్యాధ్యాసఇష్యతే॥ ౧౯౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. తత్ర-ఆశ్రుతియందు, ఆపాతదృష్టితః-సామాన్యముగాచూచుటవల్ల, బ్రహ్మణః-నిర్గుణబ్రహ్మమునకు, హేతుతా-జగత్కారణత్వము, భాతి-తోచుచున్నది. హేతోశ్చ-జగత్కారణుడైన ఈశ్వరునకును, సత్యతా-సత్యత్వము, భాతి-తోచుచున్నది. తస్మాత్-అందువల్ల, అన్యోన్యాధ్యాసః-అన్యోన్యాధ్యాసము, ఇష్యతే-ఇచ్ఛయింపబడుచున్నది.

తా. ప్ర. సరి. ఈశ్రుతి ఉండుగాక. ఈశ్రుతిచే ఈశ్వర బ్రహ్మములకు అన్యోన్యాధ్యాసమెట్లు సిద్ధించెను?. ఉ. సాధారణ దృష్టిచేత ఆశ్రుతియందు సత్యజ్ఞానానంత స్వరూపలక్షణ నిర్గుణ బ్రహ్మమునకు జగత్కారణత్వము దోచుచున్నది. మరియు సాధారణ దృష్టిచేతనే జగత్కారణుడగు మాయా ప్రతిబింబరూపుడైనట్టి ఈశ్వరునకు ఆ శ్రుతియందు సత్యత్వము దోచుచున్నది. ఈ సత్యత్వము ఈశ్వర బ్రహ్మములకు అన్యోన్యాధ్యాసము లేనియెడల తోచనేరదు. కనుక జీవకూటస్థులకువలెనే ఈశ్వర బ్రహ్మములకును సామాన్యదృష్టిచేత అన్యోన్యాధ్యాసముగలిగియున్నది. అందుచే నీశ్వరబ్రహ్మములకు భ్రాంతిచే నేకత్వముగలదని నిశ్చయించి పరమాత్మయగు నిర్గుణ బ్రహ్మమునకు జగత్కార ణత్వమును సురేశ్వరాచార్యులు జెప్పిరని యభిప్రాయము.

అవ. ఇట్లు, అన్యోన్యాధ్యాసముచే సిద్ధమైన ఈశ్వర బ్రహ్మములయొక్క ఏకత్వమును, పూర్వోక్తఘట్టితవస్త్ర దృష్టాంతముచే నిప్పుడు దృఢీకరించుచున్నాడు.

శ్లో॥ అన్యోన్యాధ్యాసరూపోఽసావన్నలిప్తపటోయథా।
ఘట్టితేనైకతామేతితద్వద్భ్రాంత్యైకతాంగతః॥ ౧౯౩.

టీ. అన్నలిప్తపటః = అన్న - అన్యపదార్థముచేత, లిప్త - పూయబడిన, పటః - శుభ్రవస్త్రము, ఘట్టితేన - ఘట్టితరూపముచేత, ఏకతాం - ఏకత్వమును, యథా - ఏప్రకారము, ఏతి - పొందుచున్నదో, తద్వత్ - ఆప్రకారము, అసౌ-ఈపరమాత్మ, అన్యోన్యాధ్యాసరూపః - తాదాత్మ్యాధ్యాసరూపుడగుచు, భ్రాంత్యా-మాయాభ్రాంతిచేత, ఏకతాం - ఈశ్వరునితోనభేదమును, గతః - పొందినవాడాయెను.

తా. కనుక అన్యపదార్థములగు అన్నము గంజి మొదలగువానిచే బూయబడిన శుభ్రవస్త్రము ఘట్టితరూపముతోటి ఏకత్వమునుబొందినట్లు ఈశ్వరునితోటి అన్యోన్యాధ్యాసరూపుడగు ఈపరమాత్మ మాయాభ్రాంతిచేత ఈశ్వరునితో అభేదముగా నున్నట్లు తోచుచున్నాడు.

అవ. ఇట్లు భ్రాంతిచే నేకత్వముగలిగెనని దృష్టాంతమును దెలిపి ఈశ్వరబ్రహ్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వరూపభేదము పామరులకు స్ఫురించలేదనెడి విషయమై పూర్వోక్తమగు మరియొక దృష్టాంతము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ మేఘాకాశమహాకాశౌ వివిచ్యేతే న పామరైః।
తద్వద్బ్రహ్మేశయోరైక్యం పశ్యంత్యాపాతదర్శినః॥ ౧౯౪.

టీ. పామరైః - మూఢులచేత, మేఘాకాశమహాకాశౌ = మేఘాకాశ - మేఘాకాశంబులు, మహాకాశౌ - మహాకాశంబును, నవివిచ్యేతే - విభజించియెరుగబడవు. తద్వత్ - ఆప్రకారము, ఆపాతదర్శినః సామాన్యజ్ఞానులు, బ్రహ్మేశయోః = బ్రహ్మ - నిర్గుణపరబ్రహ్మమునకును, ఈశయోః - ఈశ్వరునకును, ఐక్యం - భ్రాంతిచే నేకత్వమును, పశ్యంతి - చూచుచున్నారు.

తా. మరియు పామరులు మేఘాకాశమహాకాశ స్వరూపములను రెంటిని బుద్ధిచేత విభజించి ఎరుగజాలక ఆమేఘాకాశ మహాకాశములను రెంటిని అవివేకముచేత అభేదముగా జూచుచున్నారు. అటువలెనే అజ్ఞానులు ఈశ్వరబ్రహ్మ స్వరూపములను బుద్ధిచేత విభజించి ఎరుగజాలక భ్రాంతిచేత ఆయీశ్వరబ్రహ్మముల నైక్యముగా జూచుచున్నారు.

శ్లో॥ ఉపక్రమాదిభిర్లింగైస్తాత్పర్యస్య విచారణాత్।
అసంగం బ్రహ్మ మాయావీ సృజత్యేష మహేశ్వరః॥ ౧౯౫.

టీ. ఉపక్రమాదిభిః - ఉపక్రమము మొదలగు, లింగైః - చిహ్నములచేత, తాత్పర్యస్య - శ్రుతితాత్పర్యముయొక్క, విచారణాత్ - విచారమువల్ల, బ్రహ్మ - బ్రహ్మము, అసంగం - నిస్సంగస్వరూపముగలదగును. మాయావీ - మాయికుడగు, ఏషః - ఈ, మహేశ్వరః - ఈశ్వరుడు, సృజతీతి - సృష్టించుచున్నాడని, (అవగమ్యతే) తెలియబడుచున్నది.

తా. ప్ర. అయితే ఈశ్వరబ్రహ్మములకు గల భేదము దేనిచే దెలియబడునో జెప్పుము?. ఉ. శ్లో॥ ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతాఫలం। అర్థవాదోపపత్తిశ్చ లింగం తాత్పర్యనిర్ణయః॥ అని చెప్పబడినప్రకారము ౧. ఉపక్రమము, ౨. ఉపసంహారము, ౩. అభ్యాసము, ౪. అపూర్వకయు, ౫. ఫలము, ౬. అర్థవాదము, ౭. ఉపపత్తి, అనెడి షడ్విధలింగములచేత ఉపనిషత్తులకు దాత్పర్యనిర్ణయము జేయుచుండగా బ్రహ్మము అసంగమనియు మాయికుడైన ఈశ్వరుడు జగత్తును సృష్టించుచున్నాడనుయుం దెలియబడును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్ర. అయితే ఉపక్రమ లింగములో జేరిన శ్రుతులెట్టివి?. ఉ. సృష్టికిబూర్వమందు ఈజగంబాతయు నామరూపరహితమగు సద్రూపబ్రహ్మమాత్రముగా నుండెనని ప్రతిపాదించెడి శ్రు॥ సదేవసోమ్యేదమగ్రఆసీత్ ఏకమేవాద్వితీయం॥ ఇత్యాది శ్రుతులు ఉపక్రమ లింగములో జేరినవగును. ప్ర. సరి. ఉపసంహార లింగములో జేరిన శ్రుతులెట్టివి?. ఉ. ఈ తోచుచుండెడి జగత్సమూహంతయు ఆసద్రూపబ్రహ్మమయమేయగుననియు, ఆబ్రహ్మమే సత్యమనియు ఆబ్రహ్మమే ఆత్మయగుననియుం బ్రతిపాదించెడి శ్రు॥ ఐతదాత్మ్యమిదం సర్వం॥తత్సత్యంసఆత్మా॥ అనెడి యిత్యాది శ్రుతులు ఉపసంహార లింగములో జేరినవగును. ఈయుపక్రమోపసంహారములు రెండును అద్వితీయాత్మస్వరూపమును ప్రతిపాదించుటచేత ఈరెంటినిజేర్చి ఒక లింగముగా జెప్పబడును. ప్ర. సరి. అభ్యాసలింగములో జేరిన శ్రుతులెట్టివి?. ఉ. నీవు బ్రహ్మమని యనేకప్రకారములచే నుపదేశించెడి శ్రు॥ తత్త్వమసి॥ అని ఏకత్వమును ప్రతిపాదించెడి ఇత్యాదివాక్యములు అభ్యాసలింగములో జేరినవగును. ఆ యుపదేశముచేతను నీయొక్క స్వరూపమునకే అద్వితీయాత్మత్వమును బోధించుచున్నది. కనుక ఈ యభ్యాసము రెండవలింగమగును. ప్ర. అయితే అపూర్వత లింగములో జేరిన శ్రుతులెవ్వి?. ఉ. సంఘాతమందుండెడి ప్రత్యగభిన్న పరమాత్మను ఎరుగవారేమి. అని యిట్లు చెప్పెడి శ్రు॥ అత్రతావకిల సత్సోమ్యననిభాసల॥ ఇత్యాది శ్రుతులు అపూర్వతలింగములో జేరినవగును. ఈ యపూర్వలింగములో జేరిన శ్రుతులుజెప్పెడి ప్రకారము అష్టవిధ ప్రమాణములలో ఉపనిషత్ప్రమాణము చేత ఆత్మ లక్షణమును బురుషుడెరుగుచున్నాడు గాని ఇతరప్రమాణములచేత నెరుగబడలేదని ప్రతిపాదించుటయే అపూర్వతా లింగమని తెలియవలెను. ఈ అపూర్వతా లింగము మూడవలింగమగును. ప్ర. సరి. ఫల లింగములో జేరిన శ్రుతులెట్టివి?. ఉ. ప్రారబ్ధ మెంతపర్యంతము నశింపదో అంతపర్యంతము దేహేంద్రియాది ప్రపంచము మిథ్యారూపముగా దోచుచు ఆ ప్రారబ్ధమునకు నిశ్శేషనాశనమెప్పుడుగలుగునో అప్పుడు జగంబు బొత్తుగా దోచక అద్వితీయాత్మస్వరూపముగా నుండునని అద్వితీయాత్మజ్ఞానమునకు ఫలమును ప్రతిపాదించెడి శ్రు॥ తస్యతావదేవ యావన్నవిమోక్ష్యేధసంపత్స్యే॥ ఇత్యాదిశ్రుతులు ఫల లింగములో జేరినవగును. ఇది నాలుగవ లింగమగును. ప్ర. సరి. అర్థవాద లింగములో జేరిన శ్రుతులెట్టివి?. ఉ. ఏవస్తువును వినుటచేత వినబడని వస్తువు వినబడుచున్నదో ఏవస్తువును మననము జేయుటచేత మననము జేయబడని వస్తువు మననము చేయబడుచున్నదో ఏవస్తువు నెరుగుటచేత నెరుగబడని వస్తువు ఎరుగబడుచున్నదో అని యిట్లు అద్వితీయాత్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్ఞానము సిద్ధించెడికొరకు అర్థవాదమును బ్రతిపాదించెడి శ్రు॥ అనేనజీవేనాత్మనాను ప్రవిశ్య యేనాశ్రుతం శ్రుతంభవత్యమతంమతమవిజ్ఞాతంవిజ్ఞాతం॥ ఇత్యాదిశ్రుతులు అర్థవాదలింగములో జేనరివగును. ఇది అయిదవలింగమగును. ప్ర. సరి. ఉపపత్తి లింగములోజేరిన శ్రుతులెట్టివి?. ఉ. మృత్తికవలన కలిగిన ఘటాదులును బంగారు వలన గలిగిన కటక మకుటాదులును ఇనుమువలన బుట్టిన ఖడ్గాదులును కారణము కంటె భిన్నముగాదోచినను ఈ కార్యములకు ఉచ్చారణముదప్ప మరియొక అర్థను లేమిచేత కారణవ్యతిరిక్తముగా కార్యము లేదనెడి యుక్తిని బ్రతిపాదించెడి శ్రు॥ వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవసత్యం॥ ఇత్యాదిశ్రుతులు ఉపపత్తిలింగములో జేరినవగును. ఈ యుపపత్తిలింగము ప్రసిద్ధముగా దోచునట్టిజగంబును ప్రత్యగాత్మ స్వరూపమగు బ్రహ్మమేయగుగాన దృష్టాంతస్వరూపమైన ఈ జగంబును ప్రత్యగాత్మకంటె అభిన్నత్వమును ప్రతిపాదింపుచు ప్రత్యగాత్మను అద్వితీయత్వమును సూచించుచున్నది. కనుక ఇది యారవ లింగమగును. ఈప్రకారము షడ్విధలింగములచేత శ్రుతులకు దాత్పర్యమును నిర్ణయించినవానికి శ్రవణ మాత్రముచేత అద్వితీయాత్మ జ్ఞానోదయమగును. ఇందుకు సంశయములేదు.

అవ. శ్రుతియందు ఉపక్రమోపసంహారములను ఏకరూప ప్రదర్శనముచే జెప్పబడిన బ్రహ్మముయొక్క అసంగత్వము నిప్పుడు స్పష్టముజేయుచున్నాడు

శ్లో॥ సత్యంజ్ఞానమనంతంచేత్యుపక్రమ్యోపసంహృతం।
యతోవాచోనివర్తంతఇత్యసంగత్వనిర్ణయః॥ ౧౯౬.

టీ. సత్యం - బ్రహ్మము సద్రూపమనియు, జ్ఞానం - చిద్రూపమనియు, అనంతంచేతి - అనంతరూపమనియు, ఉపక్రమ్య - చెప్పుటకు బ్రారంభించి, యతః- ఏనిర్గుణబ్రహ్మస్వరూపమునుంచి, వాచః - సకలవాక్యములును, నివర్తంతఇతి - నివర్తించుచున్నదని, ఉపసంహృతం - ఉపసంహరింపబడెను. అనగా బ్రహ్మస్వరూపమును జెప్పుట ముగింపబడెననుట. (అతః) ఆకారణమువలన, అసంగత్వనిర్ణయః— అసంగత్వ - నిస్సంగత్వముయొక్క, నిర్ణయః - నిర్ణయము, (భవతి - అగుచున్నది.

తా. బ్రహ్మము సత్యజ్ఞానానంద స్వరూపముగలదని బ్రహ్మస్వరూపమును జెప్పుటకు శ్రుతియందు బ్రారంభింపబడి ఏ నిర్గుణబ్రహ్మస్వరూపమునుంచి సకలేంద్రియ వ్యాపారములును నివర్తించుచున్నవో యని యిట్లు ముగింపబడెను. ఇట్లు జెప్పుటచేత బ్రహ్మము అసంగమనెడి నిర్ణయము స్పష్టమాయెనని తెలియవలెను.

అవ. మాయికుడగు ఈశ్వరుడు జగత్తును సృష్టించుచున్నాడని ప్రతిపాదించెడి శ్రుతి నిప్పుడు అర్థమువలన జూపుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ మాయీసృజతివిశ్వంసనిరుద్ధస్తత్రమాయయా।
అన్యఇత్యపరాబ్రూతే శ్రుతిస్తేనేశ్వరస్సృజేత్॥ ౧౯౭.

టీ. సః - ఆ, మాయీ - మాయిపుడగు ఈశ్వరుడు, విశ్వం - జగంబును, సృజతి - సృష్టించుచున్నాడు. అన్య - మరియొకడు, అనగా జీవుడనుట. మాయయా - మాయచేత, తత్ర - ఆ జగంబునందు, నిరుద్ధఇతి - బంధింపబడెనని, అపరా- మరియొకటియగు, శ్రుతిః - శ్రుతి, బ్రూతే - చెప్పుచున్నది. తేన-ఆకారణముచేత, ఈశ్వరః - ఈశ్వరుడు, సృజేత్ - సర్వజగంబును సృష్టించెను.

తా. మరియు మాయిపుడైన ఈశ్వరుడు జగత్తును సృష్టించెననియు జీవుడు మాయచేత ఆ జగంబునందు బంధింపబడెనని శ్రుతి॥ అస్మాన్మాయీసృజతే విశ్వమేతత్తస్మింశ్చాన్యోమాయయాసన్నిరుద్ధః॥ అనెడి శ్రుతి జెప్పుచున్నది. కనుక ఈశ్వరుడే జగత్తును సృష్టించెనని తెలియవలెను.

అవ. ఇట్లు ఆనందమయకోశరూపుడగు ఈశ్వరునకు జగత్కారణత్వమును బ్రతిపాదించి ఆ యీశ్వరునివలన జగంబుబుట్టిన క్రమము నిక జెప్పుచున్నాడు.

శ్లో॥ ఆనందమయఈశోఽయంబహుస్యామిత్యవైక్షత।
హిరణ్యగర్భరూపోఽభూత్సుప్తిస్స్వప్నోయథాభవేత్॥ ౧౯౮.

టీ. అయం-ఈ, ఆనందమయః-ఆనందమయకోశోపాధికుడగు, ఈశః-ఈశ్వరుడు, బహుస్యామితి-బహుప్రపంచరూపముగానయ్యెదనని, అవైక్షత-చూచెను. అనగా సంకల్పించెననుట. సుప్తిః-సుషుప్తి, స్వప్నః-స్వప్నము. యథా-ఏప్రకారము, భవేత్-అగునో, (తథా) ఆప్రకార మీశ్వరుడును, హిరణ్యగర్భరూపః-హిరణ్యగర్భరూపుడు, అభూత్-ఆయెను.

తా. ఈయానందమయకోశరూపుడగు ఈశ్వరుడు బహుప్రపంచరూపముగా నయ్యెదనని సంకల్పించి సుషుప్తి స్వప్నమైనవిధముగా ఆయీశ్వరుడు హిరణ్యగర్భరూపుడాయెను. అనగా ఆయీయీశ్వరునివలన ఆకాశముబుట్టెననియు ఆయాకాశవిశిష్టచైతన్యమువలన వాయువుబుట్టెననియు ఆవాయువిశిష్టచైతన్యమువలన అగ్నిబుట్టెననియు ఆయగ్నివిశిష్టచైతన్యమువలన జలముబుట్టెననియు అజలవిశిష్టచైతన్యమువలన పృథ్వీబుట్టెననిచెప్పెడి శ్రుతి॥ తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః అద్భ్యఃపృథివీ॥ అనెడి ఇత్యాదివాక్యములప్రకారము అపంచీకృత పంచసూక్ష్మభూతములుబుట్టెననియు అసూక్ష్మభూతములయొక్క సత్వరజోగుణభాగములవలన సమష్టి వ్యష్టిరూప సూక్ష్మశరీరములుబుట్టె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననియు ఆసూక్ష్మశరీరమందు ఈశ్వరుడు నేనని యభిమానించుటచేత హిరణ్యగర్భుడాయెననియు ఈలింగశరీరాది సృష్టిక్రమము పంచతత్త్వవివేకమందు జెప్పబడెననియుం దెలియవలెను.

శ్లో॥ క్రమేణయుగపద్వైషాసృష్టిర్జ్ఞేయాయథాశ్రుతి।
ద్వివిధశ్రుతిసద్భావాద్ద్వివిధస్వప్నదర్శనాత్॥ ౧౯౯.

టీ. ద్వివిధశ్రుతిసద్భావాత్ = ద్వివిధ-ద్వివిధమగు, శ్రుతిసద్భావాత్-శ్రుతియుండుటవల్లను, ద్వివిధస్వప్నదర్శనాత్ = ద్వివిధ-ద్వివిధమగు, స్వప్నదర్శనాత్-స్వప్నముగనబడుటవల్లను, ఏషా ఈ, సృష్టిః-సృష్టి, క్రమేణవా-క్రమముగాబుట్టినదియైనను, యుగపత్ - ఒక్కటేసారిబుట్టినదియైనను, యథాశ్రుతి-శ్రుతినతిక్రమించక, జ్ఞేయా- తెలియదగినదగును.

తా. ప్ర. అయితే శ్రు॥ తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః॥ ఇత్యాదిశ్రుతియందు ఆకాశాదిభూత క్రమముగా జగత్తు సృష్టింపబడినట్లు వినబడుచున్నది. మరియు శ్రు॥ ఇదగ్ంసర్వమసృజత॥ ఇత్యాది శ్రుతియందు ఆకాశాది జగంబంతియు ఒక్కటేసారి బుట్టినట్లు వినబడుచున్నది. ఈ రెండువిధములలో ఏవిధమును గ్రహింపవలెనో ఏవిధమును విడువవలెనో చెప్వుము?. ఉ. ఈరెండు విధములైన సృష్టుల విషయమై శ్రుతియుక్తులుండుటచేత పూర్వోక్తద్వివిధసృష్టిని గ్రహింపవలెను. అనగా ఈ ద్వివిధసృష్టియు శ్రుతిసమ్మతముగా నుండుటచేత ఆకాశాది భూతక్రమముగానైనను ఒక్కటేసారిగానైనను జగంబుబుట్టెనని తెలియవలెనే గాని శ్రుతినతిక్రమించరాదు. ప్ర. అయితే ఈ ద్వివిధసృష్టిని గ్రహించెడి విషయమై యుక్తి ఏది?. ఉ. లోకమందు క్రమముతోగూడియు అక్రమముతోగూడియు స్వప్నపదార్థవర్గము కనబడుచున్నది. ఆటువలెనే జగత్సృష్టి పూర్వోక్తద్వివిధములో ఏవిధముగానైన నుండవచ్చునని రెండు విధములను గ్రహింపవలెనని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, హిరణ్యగర్భుని స్వరూపమును నిరూపించుచున్నాడు.

శ్లో॥ సూత్రాత్మాసూక్ష్మదేహాఖ్యస్సర్వజీవఘనాత్మకః।
సర్వాహంమానధారిత్వాత్క్రియాజ్ఞానాదిశక్తిమాన్॥ ౨౦౦.

టీ. సూత్రాత్మ=సూత్ర - వస్త్రమందు నూలువలె, ఆత్మ - జగంబునందు గూడియుండెడి స్వరూపముగలవాడును, సూక్ష్మదేహాఖ్యః= సూక్ష్మదేహ-సూక్ష్మశరీరమనెడి, ఆఖ్యః- పేరుగలవాడును, క్రియాజ్ఞానాదిశక్తిమాన్=క్రియా - క్రియా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్త

శక్తిగలవాడును, జ్ఞానాదిశక్తిమాన్-జ్ఞానేచ్ఛాశక్తిమంతుడును, అనగా, ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తిమంతుడనుట. సర్వాహంమానధారిత్వాత్=సర్వ-సకలవ్యష్టి లింగశరీరములయందు, అహంమాన-నేననెడియభిమానమును, ధారిత్వాత్-ధరించినవాడగుట వల్ల, సర్వజీవఘనాత్మకః=సర్వజీవ - సర్వలింగశరీరోపాధికులగు జీవులయొక్క, ఘనాత్మకః-సమష్టిస్వరూపుడునగును.

తా. ఆ హిరణ్యగర్భుడు వస్త్రమందు నూలువలె జగత్తునందు గూడి యుండెడి స్వరూపము గలవాడగుటచేత సూత్రాత్ముడనియు సూక్ష్మదేహుడనెడి పేరుగలవాడును ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తి మంతుడును సర్వవ్యష్టి లింగశరీరముల యందు నేననియభిమానించుటచేత సర్వలింగ శరీరోపాధికులగు జీవులయొక్క సమష్టి స్వరూపుడు నగును.

అవ. ఆ హిరణ్యగర్భావస్థయందు జగంబుదోచెడి విషయమై దృష్టాంతము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రత్యూషే వా ప్రదోషే వా మగ్నో మందే తమస్యయం।
లోకో భాతి యథా తద్వదస్పష్టం జగదీక్ష్యతే॥ ౨౧౧.

టీ. ప్రత్యూషేవా-ప్రాతఃకాలమందైనను, ప్రదోషేవా-సాయంకాలమందైనను, మందే-అల్పమగు, తమసి-చీకటియందు, అయం-ఈ, లోకః-లోకము, మగ్నస్సన్-మునిగినదగుచు, యథా-ఏప్రకారముగా, భాతి-తోచుచుండునో, తద్వత్-ఆప్రకారముగా హిరణ్యగర్భావస్థయందు, జగత్-ప్రపంచము, అస్పష్టం-స్పష్టత్వము నుబొందనట్లు, ఈక్ష్యతే-కనబడుచున్నది.

తా. ప్రాతఃకాల మందైనను సాయంకాల మందైనను కొంచెముగా నుండెడి చీకటియందు ఈ లోకము మునిగినదగుచు ఏప్రకారము స్పష్టత్వమును బొందక తోచుచుండునో అటువలెనే హిరణ్యగర్భావస్థయందు ప్రపంచము స్పష్టత్వమును బొందక కనబడుచుండును.

అవ. ఇట్లు లోకప్రసిద్ధ దృష్టాంతమును దెలిపి, ఈ చిత్రదీపమందు రెండవ శ్లోకమందు దెలుపబడిన, లాంఛితవస్త్రము నిప్పుడు, దృష్టాంతీకరించుచున్నాడు.

శ్లో॥ సర్వతో లాంఛితో మష్యా యథా స్యాద్ఘట్టితః పటః।
సూక్ష్మాకారైస్తథేశస్య వపుస్సర్వత్ర లాంఛితం॥ ౨౧౨.

టీ. ఘట్టితః-ఘట్టితత్వమును బొందిన, పటః-వస్త్రము, మష్యా-మసిచేత, అనగా మషీమయములగు ఆకారములచేననుట. సర్వతః-అంతటను, లాంఛితః-లాం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఘితత్వమును బొందినది, యథా-ఏప్రకారము, స్యాత్-అగునో, తథా-ఆప్రకారము, ఈశస్య-మాయికుడైన ఈశ్వరునియొక్క, వపుః-ఆకారము, సూక్ష్మాకారైః-సూక్ష్మ రూపములచేత, సర్వత్ర-అంతటను, లాంఛితం-లాంఛితరూపమును బొందినదగు చు న్నది. అనగా గురుతుతాజేయబడినదగు చున్నదనుట.

తా. మరియు ఘట్టితత్వమును బొందిన ధౌతవస్త్రము మషీమయములైనఆకా రవిశేషములతో జేరుటవలన లాంఛితవస్త్రమెట్లగుచున్నదో అటువలెనే మాయికు డైన ఈశ్వరునియొక్క ఆకారము హిరణ్యగర్భావస్థయందు అపంచీకృత పంచభూత కార్యములచేత సమష్టిలింగశరీరమగుచు లాంఛితమనెడిపేరుచేజెప్పబడుచున్నది.

అవ. బుద్ధికెక్కుటకొరకు ఈవిషయమై మరియొకదృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ సస్యం వా శాకజాతం వా సర్వతోంకురితం యథా।
కోమలం తద్వదేవైష పేలవో జగదంకురః॥ ౨౦౩.

టీ. సస్యంవా-పైరైనను, శాకజాతంవా-కూరలైనను, సర్వతః-అంతటను, అం కురితంసత్-అంకురింపబడినదగుచు, యథా-ఏప్రకారము, కోమలం-మృదువుగానుండు నో, తద్వత్-ఆప్రకారమే హిరణ్యగర్భావస్థ యందును, ఏషః-ఈ, జగదంకురః= జగత్-ప్రపంచముయొక్క, అంకురః-అంకురము, పేలవః-మృదువుగా నుండును. అనగా సూక్ష్మరూపముగా నుండుననుట.

తా. మరియు పైరైనను బచ్చలిమొదలగు కూరలైనను అంతట నంకురించిన దగుచు సూక్ష్మరూపముగా నున్నట్లు ఈ హిరణ్యగర్భావస్థయందును సూక్ష్మాకార ముగా జగంబంకురించి యుండును.

అవ. ఇట్లు, హిరణ్యగర్భ స్వరూపమును విశదీకరించి, ఆ హిరణ్యగర్భుని యొక్క అవస్థాభేదరూపుడైనట్టియు, పంచీకృత కార్యోపాధికుడైనట్టి విరాట్టును, దృష్టాంతత్రయముచే నిప్పుడు విశదీకరించుచున్నాడు.

శ్లో॥ ఆతపాభాతలోకో వా పటో వా వర్ణపూరితః।
సస్యం వా ఫలితం యద్వత్తథా స్పష్టవపుర్విరాట్॥ ౨౦౪.

టీ. ఆతపాభాతలోకో వా=ఆతప-ఎండచేత, ఆభాత-ప్రకాశింపబడిన, లో కోవా-లోకమైనను, వర్ణపూరితః=వర్ణ-యోగ్యములైన వర్ణములచేత, పూరితః-నిండిం పబడిన, పటోవా-చిత్రవస్త్రమైనను, ఫలితం-ఫలింపబడిన, సస్యంవా-పైరైనను, య ద్వత్-ఏప్రకారము స్పష్టముగాదోచునో, తథా-ఆప్రకారము, విరాట్-విరాట్పురు షుడు, స్పష్టవపుః=స్పష్ట-స్పష్టముగాదోచెడి, వపుః-శరీరముగలవాడగును. అనగా విశ్వరూపుడనుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మరియు సూర్యోదయమైన పిమ్మట ఎండచే బ్రకాశింపబడెడి కాంక
మైనను యోగ్యములగు చిత్ర వర్ణములచే నిండింపబడిన చిత్రవస్త్రమైనను ఫలిం
చిన పైరైనను ఏప్రకారము స్పష్టముగా దోచు చుండునో అటు వలెనే
పంచీకృత కార్యోపాధికుడగు విరాట్పురుషుడును విశ్వరూపముచేత స్పష్టముగా
దోచుచున్నాడు.

శ్లో॥ విశ్వరూపాధ్యాయఏషఉక్తస్సూక్తేపిపౌరుషే।
ధాత్రాదిస్తంబపర్యంతా నేతస్యావయవాన్విదుః॥ ౨౦౫.

టీ. ఏషః-ఈ విరాట్పురుషుడు, విశ్వరూపాధ్యాయే- విశ్వరూపాధ్యాయ
మందును, పౌరుషేసూక్తే-పురుషసూక్తమందును, ఉక్తః-చెప్పబడెను. ధాత్రాదిస్తం
బపర్యంతాన్=ధాత్రాది-బ్రహ్మదేవుడే ఆదిగా గలిగినట్టియు, స్తంబ-స్తంబమే,
పర్యంతాన్-పర్యంతముగాగల భూతములను ఏతస్య-ఈ విరాట్టుయొక్క, అవయ
వాన్-అవయవములనుగా, విదుః-ఎఱుగుచున్నారు.

తా. ప్ర. అయితే ఆవిరాట్టు ఉండుటయందు బ్రమాణమేమి?. ఉ. శ్రీభగ
వద్గీతా శాస్త్రమందుగల విశ్వరూపాధ్యాయమందును పురుషసూక్తమనెడి వేదభాగ
మందును ఈ విరాట్పురుషుడు చెప్పబడెను. గనుక ఆ రెండును బ్రమాణములగును.
ప్ర. అయితే ఆవిశ్వ రూపాధ్యాయాదికమందు విరాట్టుయొక్క రూపము ఎటువంటి
దిగా జెప్పబడెనో జెప్పుము?. ఉ. బ్రహ్మదేవుడు మొదలుకొని స్తంబపర్యంతము
గల జగంబంతయు ఆవిరాట్టుయొక్క స్వరూపముగా జెప్పబడెను.

అవ. అంతర్యామి మొదలుకొని, కుద్దాలకాది పర్యంతముగల వస్తుసమా
హమునంతయు, ప్రత్యేకముగా ఈశ్వరభావముచే బూజింపవచ్చునని యిప్పుడు,
మూడుశ్లోకములచే జెప్పుచున్నాడు.

శ్లో॥ ఈశసూత్రవిరాడ్వేధోవిష్ణురుద్రేంద్రవహ్నయః।
విఘ్నభైరవమైరాళమారికాయక్షరాక్షసాః॥ ౨౦౬.

టీ. ఈశసూత్రవిరాడ్వేధో విష్ణురుద్రేంద్రవహ్నయః=ఈశ-అంతర్యామియు,
సూత్ర-హిరణ్యగర్భుడును, విరాట్-విరాట్పురుషుడును, వేధః-బ్రహ్మదేవుడును,
విష్ణు-విష్ణుదేవుడును, రుద్ర-శివుడును, ఇంద్ర-దేవేంద్రుడును, వహ్నయః-అగ్నిదేవుడు
ను, విఘ్నభైరవమైరాళమారికాయక్ష రాక్షసాః=విఘ్న-వినాయకుడును, భైరవ-
భైరవుడును, మైరాళ-మైరాళుడును, మారికా-మారికయు, యక్ష-యక్షులును, రాక్ష
సాః-రాక్షసులును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే ఇట్లు చెప్పుట చేతబ్రకృతిమందులాభ మేమి? ఉ. అంతర్యామియును హిరణ్యగర్భుడును విరాట్పురుషుడును బ్రహ్మవిష్ణురుద్రదేవేంద్రాగ్ని దేవాదిదేవగణంబులును వినాయకభైరవమైరాళమారికా యక్షరాక్షసాది భూతగణములును.

శ్లో॥ విప్రక్షత్రియవిట్ఛూద్రాగవాశ్వమృగపక్షిణః।
అశ్వత్థవటచూతాద్యాయవవ్రీహితృణాదయః॥ ౨౦౭.

టీ. విప్రక్షత్రియవిట్ఛూద్రాః=విప్ర-బ్రాహ్మణులును, క్షత్రియ-రాజులును, విట్-వైశ్యులును, శూద్రాః-శూద్రులును, గవాశ్వమృగపక్షిణః=గో-గోవులును, అశ్వ-గుఱ్ఱములును, మృగ-మృగములును, పక్షిణః-పక్షులును, అశ్వత్థవటచూతాద్యాః=అశ్వత్థ-రావిచెట్లును, వట-మఱ్ఱిచెట్లును, చూతాద్యాః-మామిడి మొదలగు చెట్లును, యవవ్రీహితృణాదయః=యవ-గోధుమలును, వ్రీహి-వడ్లును, తృణాదయః-గడ్డి మొదలగునవియు.

తా. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులును గోవులును గుఱ్ఱములును మృగపక్ష్యాదులును అశ్వత్థవటచూతాది వృక్షములును గోధుమలును వడ్లును తృణాదులును.

శ్లో॥ జలపాషాణమృత్కాష్ఠవాస్యాకుద్దాలకాదయః।
ఈశ్వరాస్సర్వఏవైతే పూజితాఃఫలదాయినః॥ ౨౦౮.

టీ. జలపాషాణమృత్కాష్ఠవాస్యాకుద్దాలకాదయః=జల-జలంబును, పాషాణ-రాళ్లును, మృత్-మట్టియు, కాష్ఠ-కొయ్యలును, వాస్యా-ఉలి మొదలగు పనిముట్లును, కుద్దాలకాదయః-గుద్దలి మొదలగు ఆయుధములును, ఏతే-ఇవి, సర్వే-అన్నియు, ఈశ్వరాఏవ-ఈశ్వరులేయగుచున్నవి. పూజితాస్సంతః-పూజింపబడినవగుచు, ఫలదాయినః=ఫల-ఫలమును, దాయినః-ఇచ్చునవగును.

తా. మరియు జలపాషాణమృత్తికా కాష్ఠవాస్యాకుద్దాలకాదివస్తుసమూహమంతయు ఈశ్వరరూపమేననియు ఆయావస్తువును ప్రత్యేకముగా బూజించువారలకు ఆయావస్తువు ఫలమునిచ్చెడిదగుచున్నవనియుం దెలియవలెను.

శ్లో॥ యథాయథోపాసతేతంఫలమీయుస్తథాతథా।
ఫలోత్కర్షాపకర్షౌతుపూజ్యపూజానుసారతః॥ ౨౦౯.

టీ. తం=ఆపరమేశ్వరుని, యథాయథా-ఏయేప్రకారము, ఉపాసతే-జనులు ఉపాసనముజేయుచున్నారో, తథాతథా-ఆయాప్రకారము, ఫలం-ఫలమును, ఈయుః-పొందుదురు. ఫలోత్కర్షాపకర్షౌతు=ఫల-ఫలముయొక్క, ఉత్కర్ష-ఆధిక్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
Jangamwadi Math, VARANASI.
Acc. No. 4222

తెయు, అపకర్తౌతు - అల్పత్వంబో, అనగా ఫలభేదమనుట. పూజ్యపూజానుసారతః=పూజ్య-పూజింపదగిన దేవతలయొక్క, పూజా-అర్చనయొక్క, అనుసారతః-అనుసరణమువలన, (భవతి) కలుగుచున్నది.

తా. ప్ర. అయితే ఆయాజగంబును ఈశ్వరత్వబుద్ధిచేత బూజించుటవలనే ఫలముగలిగెడి విషయమై ప్రమాణమేమి?. ఉ ఆయాజగత్తును ఈశ్వరత్వబుద్ధిచేత బూజించుటవలన ఫలముగలదనెడి విషయమై శ్రు॥ తంయథాయథోపాసతేతదైవ భవతి॥ అనెడిశ్రుతి ఆపరమేశ్వరుని ఏయేప్రకారముగా జనులు ఉపాసనమును జేయుచున్నారో ఆయాప్రకారము ఫలమునుబొందుచున్నారని జెప్పుచున్నది. గనుక ఈశ్రుతి ప్రమాణమగును. ప్ర. అయితే సర్వవస్తురాశికంతయు ఈశ్వరత్వము గలుగుచుండగా పూజకులకు ఫలభేదమగలుగుటకు గారణమేమి?. ఉ. పూజింపబడెడి దేవతాదిరూపముయొక్కయు పూజయొక్కయు పూజకునియొక్కయు సాత్త్వికాదిగుణభేదముచేత ఫలభేదముగలగుచున్నది.

శ్లో॥ ముక్తిస్తుబ్రహ్మతత్వజ్ఞానాదేవాస్యనచాన్యథా।
స్వప్రబోధంవినానైవస్వస్వప్నోహీయతేయథా॥ ౨౧౦.

టీ. స్వప్రబోధంవినా=స్వ-తనయొక్క, ప్రబోధంవినా-జాగరణమును విడిచి, స్వస్వప్నః=స్వ-తనయొక్క, స్వప్నః-స్వప్నము, యథా-ఏప్రకారము, నైవహీయతే-నివృత్తినిబొందదో, (తథా) ఆప్రకారము, అస్య-ఈపురుషునకు, ముక్తిస్తు-మోక్షమో, బ్రహ్మతత్వజ్ఞానాదేవ = బ్రహ్మతత్వ-ప్రత్యగభిన్నపరమాత్మయొక్క, జ్ఞానాదేవ-జ్ఞానమువల్లనే, (భవతి) కలుగుచున్నది. అన్యథా-మరియొకవిధముచేత, నచ-కలుగదు.

తా. ప్ర. అయితే ఈప్రకారముగా ఈశ్వరోపాసనముచేత సాంసారికఫలసిద్ధి గలుగుగాక. మరి దేనినుపాసించుటచేత ముక్తిగలుగునోజెప్పుము?. ఉ. తననిద్రచేత గల్పించుబడిన తనస్వప్నము తనజాగరణమువలన నివర్తించునేగాని మరిదేనిచేతను ఎట్లునివర్తింపబడదో అటువలెనే బ్రహ్మమునాశ్రయించియుండెడి అజ్ఞానముచేగల్పింపబడిన తనసంసారంబును బ్రహ్మస్వరూపజ్ఞానముచేతనే నివర్తించును గాని మరిదేనిచేతను నివర్తింపబడదు అనగాజ్ఞానము చేదప్ప మరిదేనిచేతను ముక్తిగలుగదని యభిప్రాయము.

శ్లో॥ అద్వితీయబ్రహ్మతత్వేస్వప్నోయమఖిలంజగత్।
ఈశజీవాదిరూపేణచేతనాచేతనాత్మకం॥ ౨౧౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఈశజీవాదిరూపేణ = ఈశ - ఈశ్వరరూపముచేతను, జీవాదిరూపేణ- జీవాదిరూపముచేతను వర్తింపుచుండెడి, చేతనాచేతనాత్మకం=చేతన- చేతనరూపమైనట్టియు, అచేతనాత్మకం-అచేతనరూపమైనట్టి, అఖిలం-సకలమగు, జగత్ -ప్రపంచము, అయం-ఇది, అద్వితీయబ్రహ్మతత్త్వే=అద్వితీయ-ద్వైతశూన్యమగు, బ్రహ్మతత్త్వే-పరబ్రహ్మస్వరూపమందు, స్వప్నః-స్వప్నమగును.

తా. ప్ర. అయితే నివర్తింపదగిన ద్వైతము స్వప్నతుల్యముగాని హేతువుచేత స్వప్నదృష్టాంతముచేత బ్రహ్మజ్ఞానమువలన ద్వైతనివృత్తిలక్షణముగలముక్తి సాధ్యమగునని యెట్లుచెప్పవచ్చును?. ఉ. భ్రాంతిచేత మరియొకవిధముగా తెలియుగుటవలన ఈద్వైతమునకు స్వప్నతుల్యత్వము గలిగియున్నందున జెప్పవచ్చును. ప్ర. అదియెట్లు?. ఉ. ఈశ్వరజీవాదిరూపముచేత ప్రవర్తించుచుండెడి చేతనాచేతనరూపమగు ఈజగంబంతయు అద్వితీయబ్రహ్మస్వరూపమందు స్వప్నతుల్యముగానున్నదని. శ్రు॥ త్రయమేతత్సుషుప్తంస్వప్నమాయామాత్రం॥ అనెడి శ్రుతిజెప్పుచున్నది.

శ్లో॥ ఆనందమయవిజ్ఞానమయావీశ్వరజీవకౌ।
మాయయాకల్పితావేతౌ తాభ్యాంసర్వంప్రకల్పితం॥ ౨౧౨.

టీ. ఆనందమయవిజ్ఞానమయౌ = ఆనందమయ-ఆనందమయకోశంబును, విజ్ఞానమయౌ-విజ్ఞానమయకోశంబును, ఈశ్వరజీవకౌ=ఈశ్వర-ఈశ్వరుడును, జీవకౌ- జీవుడునగుచు ఏతౌ-ఈ యీశ్వరజీవులిద్దరును, మాయయా-మాయచేత, కల్పితౌ- కల్పించబడిరి. తాభ్యాం-ఆయీశ్వరజీవులచేత, సర్వం-సర్వంబును, ప్రకల్పితం-విశేషముగాగల్పించబడెను.

తా. ప్ర. అయితే బ్రహ్మముకంటె అభిన్నులగు ఈశ్వరజీవులిద్దరును జగత్సంబంధులెట్లగుదురు?. ఉ. ఆనందమయకోశము ఈశ్వరుడగును. విజ్ఞానమయకోశము జీవుడగును. ఈ యీశ్వరజీవులిద్దరును మాయచేగల్పించబడిరి. పిమ్మట ఆ యీశ్వరజీవులవలన సర్వముకల్పించబడెను. కనుక ఈశ్వరజీవులిద్దరును మాయాకల్పితులగుటచేత ఆ యీశ్వరజీవులిద్దరును జగంబులోనుండెడివారగుటవలన జగత్సంబంధులగుదురని తెలియవలెను.

శ్లో॥ ఈక్షణాదిప్రవేశాంతాసృష్టిరీశేనకల్పితా।
జాగ్రదాదివిమోక్షాంతస్సంసారోజీవకల్పితః॥ ౨౧౩.

టీ. ఈక్షణాదిప్రవేశాంతా=ఈక్షణ-సంకల్పమే, ఆది-ఆదిగా గలిగినట్టియు, ప్రవేశ-ప్రవేశమే, అంతా-అంతముగల, సృష్టిః-సృష్టి, ఈశేన-మాయోపాధికునిచేత,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కల్పితా-కల్పించబడెను. జాగ్రదాదివిమోక్షాంతః=జాగ్రత్-జాగ్రదవస్థయే, ఆది-అదిగాగలిగినట్టియు, విమోక్ష-విదేహముక్తియే, అంతః-అంతముగాగల, సంసారః-సంసారము, జీవకల్పితః=జీవ-జీవునిచేత, కల్పితః కల్పించబడినదగును.

తా. ప్ర. అయితే ఆజీవేశ్వరులచే సర్వముకల్పించబడెనని చెప్పితిరి. ఎవనిచే నెద్దికల్పించబడెనో చెప్పుము?. ఉ. ఆ ఈశ్వరుడు తనసంకల్పముచేత నాకాశాదిజగంబులుబుట్టించి పంచీకరించి ఆజగంబులలోదాను ప్రవేశించెననెడి పర్యంతముగలసృష్టి ఈశ్వరునిచే గల్పించబడినదగును. ఇట్లు శ్రు॥ సఐక్షతలోకాన్నుసృజా॥ ఆనెడి వాక్యము మొదలుకొని శ్రు॥ ఏతయాద్వారాప్రాపద్యతే॥ అనెడి వాక్యాంతము వరకుగల గ్రంథము చెప్పుచున్నది. మరియు జాగ్రదవస్థమొదలుకొని విదేహముక్తి పర్యంతముగల సంసారమంతయును జీవునిచే గల్పించబడినదగును. ట్లు శ్రు॥ తస్యత్రయ ఆవసథాః ఇత్యాదివాక్యము మొదలుకొని శ్రు॥ సఏతమేవపురుషంబ్రహ్మతతమపశ్యత్॥ అనెడి వాక్యాంతమువరకుగల గ్రంథము చెప్పుచున్నది.

శ్లో॥ అద్వితీయంబ్రహ్మతత్త్వమసంగంతన్నజానతే।
జీవేశయోర్మాయికయోర్వృథైవకలహంయయుః ౨౧౪.

టీ. అద్వితీయం ద్వైతశూన్యమైనట్టియు, అసంగం-నిస్సంగమైనట్టి, తత్-ఆ, బ్రహ్మతత్త్వం-నిర్గుణబ్రహ్మస్వరూపమును, నజానతే-వాదులెరుగరు. మాయికయోః-మాయాకల్పితులగు, జీవేశయోః-జీవేశ్వరులవిషయమై, వృథైవ-వ్యర్థముగానే, కలహం-వివాదమును, యయుః-పొందిరి.

తా. ప్ర. అయితే నిర్గుణబ్రహ్మమే పారమార్థికమైనదయినను వాదులుజీవేశ్వర స్వరూపవిషయమై కలహించుటకు గారణమేమి?. ఉ. వాదులందరును అద్వితీయ అసంగనిర్గుణ బ్రహ్మస్వరూపమునెరుగరు. అందుచేత ఆవాదులందరును మాయికులగు జీవేశ్వరులయొక్క స్వరూపవిషయమై వ్యర్థముగా గలహించుచున్నారు. అనగావాదులకు శ్రుతిసిద్ధతత్త్వజ్ఞానములేమిచేత వ్యర్థముగాగలహించుచున్నారని యభిప్రాయము.

శ్లో॥ జ్ఞాత్వాసదాతత్త్వనిష్ఠానతుమోదామహేవయం।
అనుశోచామఏవాన్యాన్నభ్రాంతైర్వివదామహే॥ ౨౧౫.

టీ. తత్త్వనిష్ఠాః-తత్త్వనిష్ఠులమగు, వయం-మేము, సదా-ఎల్లప్పుడు, జ్ఞాత్వాతు-వాదులుభ్రాంతులని ఎరిగియు, నమోదామహే-సంతోషమును బొందము. అన్యాన్-అజ్ఞానులనుగురించి, అనుశోచామఏవ-చింతించుచున్నవారమేను. భ్రాంతైః-భ్రమను బొందినవాదులతోటి, నవివదామహే-కలహింపము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే జీవేశ్వరులవిషయమైన వాదకలహము అజ్ఞానమునుమూలముగాగలదైనయెడల అటువంటితత్వముచేత మీరుబోధింపరాదాయేమి?. ఉ. అట్లు బోధించుటచేత వృథాశ్రమయేగాని ప్రయోజనములేమిచేత బోధింపము. మరియు అద్వైతబ్రహ్మనిష్ఠులమగుమేము సర్వవాదులు భ్రాంతులని ఏరియు అజ్ఞానులగు ఇతరవాదులంజూచి చింతించెదమేగాని సంతోషింపము. భ్రాంతులైనవాదులతోటి వివాదమునుబొందము.

అవ. ఈశ్వరునియందును, జీవునియందును, భ్రాంతిచేతకలహించెడి వాదుల నిప్పుడు విభజించిచూపుచున్నాడు.

శ్లో॥ తృణార్చకాదియోగాంతా ఈశ్వరే భ్రాంతిమాశ్రితాః।
లోకాయతాదసాంఖ్యాంతా జీవేపిభ్రాంతిమాశ్రితాః॥ ౨౧౬

టీ. తృణార్చకాదయోగాంతాః=తృణ-తృణమును, అర్చక-పూజించెడివారే, ఆది-ఆదిగాగలిగినట్టియు, యోగ-యోగమతస్థులే, అంతాః-అంత్యముగాగలవాదులు, ఈశ్వరే-ఈశ్వరునివిషయమై, భ్రాంతిం-భ్రమను, ఆశ్రితాః-ఆశ్రయించిరి. అనగా బొందిరనుట. లోకాయతాదిసాంఖ్యాంతాః=లోకాయత-లోకాయతులే, ఆది-ఆదిగాగలిగినట్టియు, సాంఖ్య-సాంఖ్యులే, అంతాః-అంత్యముగాగలవాదులు, జీవే-జీవునివిషయమై, విభ్రాంతిం-విభ్రమమును, ఆశ్రితాః-ఆశ్రయించిరి. అనగా బొందిరనుట.

తా. తృణమును దైవమునుగాభావించి పూజించెడివారు తృణార్చకులనబడుదురు. అట్టి తృణార్చకులు మొదలుకొని యోగమతస్థులే అంత్యముగాగల వాదులందరును ఈశ్వరునివిషయమై భ్రమించిరి. మరియు లోకాయతమతస్థులుమొదలుకొని సాంఖ్యమతస్థులే అంత్యముగాగల వాదులందరును జీవునివిషయమై విభ్రమమునుబొందిరి.

శ్లో॥ అద్వితీయబ్రహ్మతత్వం నజానంతియదాతదా।
భ్రాంతాఏవాఖిలాస్తేషాంక్వముక్తిఃక్వేహవాసుఖం॥ ౨౧౭

టీ. యదా-ఎప్పుడు, అద్వితీయబ్రహ్మతత్వం=అద్వితీయ-ద్వైతశూన్యమగు, బ్రహ్మతత్వం - నిర్గుణబ్రహ్మస్వరూపమును, నజానంతి - ఎరుగరో, తదా - అప్పుడు, అఖిలాః-అందరును, భ్రాంతాఏవ - భ్రమనుబొందినవారే యగుదురు. తేషాం-అట్టి భ్రాంతులకు, ముక్తిః-మోక్షము, క్వ-ఎక్కడిది. అనగాలేదనుట. ఇహ-ఈలోకమందు, సుఖంవా-సుఖమైనను, క్వ-ఎక్కడిది. అనగా లేదనుట.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే ఆవాదులు భ్రమించిరని చెప్పవలసిన పనియేమి?. ఉ. అద్వితీయనిర్గుణ పరబ్రహ్మస్వరూపము నెరుగనివారందరును భ్రాంతులేయగుదురు. అట్టివారికి ముక్తిలేమియేగాక తమమతము నుద్ధరించవలెననెడి తలంపు మెండుగా గలిగియుండుటవల్ల చిత్తవిశ్రాంతిలేని హేతువుచేత ఈలోకమందు సుఖమైనను లేద నియభిప్రాయము.

శ్లో॥ ఉత్తమాధమభావశ్చేత్తేషాంస్యాదస్తు తేనకిం।
స్వప్నస్థరాజ్యభిక్షాభ్యాంనబుద్ధస్స్పృశ్యతేఖలు॥ ౨౧౮.

టీ. తేషాం - ఆవాదులకు, ఉత్తమాధమభావః = ఉత్తమ-ఉత్తమలక్షణము యొక్కయు, అధమ-అధమలక్షణముయొక్కయు, భావః-భావము, స్యాచ్చేత్-కల దనియంటివేని, అస్తు-కలుగుగాక. తేన-అట్టియుత్తమాధమ భావముచేత, కిం-ప్రయో జనమేమి. అనగా బ్రయోజనములేదనుట. బుద్ధః-జాగ్రదవస్థను బొందినవాడు, స్వ ప్నస్థరాజ్యభిక్షాభ్యాం = స్వప్నస్థ-స్వప్నావస్థ యందుగల, రాజ్య-రాజ్యపరిపాల నముచేతను, భిక్షాభ్యాం-భిక్షాటనము చేతను, నస్పృశ్య తేఖలు-స్పృశింపబడడు గదా.

తా. ప్ర. అయితే ఆవాదులకు బ్రహ్మవిద్య లేకపోయినను ఇతరవిద్యా ప్రావీణ్యతచేత గలిగెడు ఉత్తమాధమ భావమువల్ల కొంతమందికి సుఖములేదాయే మి?. ఉ. స్వప్నావస్థయందుగల రాజ్యపరిపాలన భిక్షాటనాదులచేత జాగ్రద వస్థను బొందినవాడు స్పృశింపబడనట్లు అట్టిసుఖముచే బ్రయోజనము లేమిచేత అట్టి సుఖమును ముముక్షువులు ఆదరింపరు.

అవ. జీవేశ్వరవాదములయందు ముక్తిహేతుత్వము లేమిచేత, ఆజీవేశ్వరవా దములయందు ముముక్షువులు బుద్ధినుంచరాదని, ఉపసంహరింపుచున్నాడు.

శ్లో॥ తస్మాన్ముముక్షుభిర్నైవమతిర్జీవేశవాదయోః।
కార్యాకింతుబ్రహ్మతత్వంవిచార్యంబుధ్యతాంచతత్॥ ౨౧౯.

టీ. తస్మాత్-అందువల్ల, ముముక్షుభిః - ముముక్షువులచేత, జీవేశవాదయోః- జీవేశ్వరవాదముల యందు, మతిః-బుద్ధి, కార్యా-చేయదగినది, నైవ-కానేకాదు. అనగా నుండరాదనుట. కింతు-మరియేమనగా, బ్రహ్మతత్వం-నిర్గుణబ్రహ్మ స్వరూప ము, విచార్యం-విచారింపదగిన దగును. తత్-ఆ బ్రహ్మస్వరూపము, బుధ్యతాంచ- ఎరుగబడుగాక. అనగా నెరుగవలెననుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. అందుచేత ముముక్షువులగు వారు జీవేశ్వర వాదములయందు బుద్ధినుంచరాదు. ప్ర. అయితే ఏమిచేయ దగినదో జెప్పుము? 'ఉ. శ్రుత్యర్థమును విచారించుటచేత బ్రహ్మబోధయందే బుద్ధినుంచి ఆ నిర్గుణ పరబ్రహ్మ స్వరూపము నెఱుగవలెను.

శ్లో॥ పూర్వపక్షతయాతౌచే త్తత్త్వనిశ్చయహేతుతాం।
ప్రాప్నుతోస్తునిమజ్జస్వతయోరైనతావతావశః॥ ౨౨౦.

టీ. తౌ-ఆ జీవేశ్వరవాదములు రెండును, పూర్వపక్షతయా-పూర్వపక్షభావముచేత, తత్త్వనిశ్చయ హేతుతాం = తత్త్వనిశ్చయ-బ్రహ్మస్వరూప నిశ్చయముయొక్క, హేతుతాం-హేతుత్వమును, ప్రాప్నుతశ్చేత్ - పొందుచున్నవంటివేని, అస్తు - అగుగాక. ఏతావతా - పూర్వపక్షభావముగా జీవేశ్వర స్వరూపము లను విచారించుటచేత, అనగా బ్రహ్మతత్త్వ నిర్ణయ హేతుత్వ సంభవముచే ననుట. తయోః-ఆజీవేశ్వరవాదములయందు, అవశస్సన్ - వశుడవగుచు, ననిమజ్జస్వ-మునుగకుము.

తా. ప్ర. అయితే బ్రహ్మస్వరూప నిశ్చయము గలిగెడికొరకు ఆజీవేశ్వరులయొక్క వాదములను పూర్వపక్ష భావముగానైనను విచారింపరాదాయేమి?. ఉ. సరి. అట్లైనయెడల, బ్రహ్మస్వరూపనిర్ణయ హేతుత్వము గలిగియుండుటచేత విచారించినను ఆజీవేశ్వర వాదములయందే వివేకజ్ఞాన శూన్యుడవై మునుగకుము. అనగా జీవేశ్వర వాదములయందే బుద్ధిని సర్వదా ఉంచి మునింపరాదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, పూర్వవాది, ఆక్షేపించుచున్నాడు.

శ్లో॥ అసంగచిద్విభుర్జీవస్సాంఖ్యోక్తస్తాదృగీశ్వరః।
యోగోక్తస్తత్త్వయోరర్థౌశుద్ధౌతావితిచేచ్ఛృణు॥ ౨౨౧.

టీ. జీవః - జీవుడు, అసంగచిత్ - అసంగ చిద్రూపుడనియు, విభుః - పరిపూర్ణుడని, సాంఖ్యోక్తః = సాంఖ్య - సాంఖ్యశాస్త్రమందు, ఉక్తః - చెప్పబడెను. ఈశ్వరః - ఈశ్వరుడు, తాదృక్ - అట్టివాడేనని, (యోగోక్తః) యోగశాస్త్రముచే జెప్పబడెను. తత్త్వయోః=తత్ -తత్పదముయొక్కయు, త్వమోః-త్వంపదముయొక్కయు, అర్థౌ - పదార్థములగు, తౌ - ఆ యీశ్వరజీవు లిద్దరును, పరిశుద్ధులని, యంటివేని, శృణు-వినుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. ఓ అద్వైతసిద్ధాంతీ సాంఖ్యయోగ శాస్త్రములయందు జీవేశ్వరులిద్దరును పరిశుద్ధచిద్రూపులనియు పరిపూర్ణులనియుం జెప్పబడెను. అందుకు మీరును సమ్మతించితిరి. అట్లగుచుండగా, ఆసాంఖ్యయోగ మతములను రెంటిని మీరు పూర్వపక్షము జేయరుగదా?. ఉ. చెప్పెదవినుము.

శ్లో॥ నతత్త్వమోరుభావర్థావస్మత్సిద్ధాంతతాంగతౌ।
అద్వైతబోధనాయైవసాకక్షాకాచిదిష్యతే॥ ౨౨౨.

టీ. తత్త్వమోః = తత్-తత్పదము యొక్కయు, త్వమోః - త్వంపదము యొక్కయు, ఉభౌ - రెండైన, అర్థౌ - పదార్థములు, అస్మత్సిద్ధాంతతాం = అస్మత్ - మాయొక్క, సిద్ధాంతతాం - సిద్ధాంత భావమును, నగతౌ - పొందినవి గావు. సా-ఆ, కక్షా-తత్త్వంపదార్థభేదము, కాచత్-కొంచెము, అద్వైతబోధనాయైవ=అద్వైత-తత్త్వంపదార్థైక్యముయొక్క, బోధనాయైవ-బోధించుటకొరకే, ఇష్యతే-ఇచ్ఛయింపబడుచున్నది.

తా. ఓపూర్వవాదీ ఆ సాంఖ్యయోగ శాస్త్రములయందు జీవేశ్వరులు పరిశుద్ధచిద్రూపులనియు, పరిపూర్ణులనియుం జెప్పబడినను ఆ జీవేశ్వరులగు తత్త్వంపదార్థములకు వాస్తవభేదముగలదని ఆ సాంఖ్యయోగమతస్థు లంగీకరించిరి. మా అద్వైతసిద్ధాంతమందు తత్త్వం, అనెడి రెండు పదార్థములు వాస్తవమందు లేవు. ప్ర. అయితే మీయద్వైతమతమందును కూటస్థ బ్రహ్మశబ్దములచేత తత్త్వంపదార్థములు రెండును పరిశుద్ధములని భిన్నముగా జెప్పబడలేదాయేమి?. ఉ. లోక ప్రసిద్ధభేదనిరాసద్వారా ఆతత్త్వంపదార్థములకు రెంటికి నైక్యమును బోధించుటకొరకే కూటస్థ బ్రహ్మశబ్దములచే జెప్పితిమేగాని వాస్తవముచేత ఆతత్త్వంపదార్థములకు మా అద్వైతసిద్ధాంతమందు కొంచెమైనను భేదములేదు.

శ్లో॥ అనాదిమాయయాభ్రాంతాజీవేశౌసువిలక్షణౌ।
మన్యంతేతద్వ్యుదాసాయకేవలంశోధనంతయోః॥ ౨౨౩.

టీ. అనాదిమాయయా=అనాది-అనాదిగాదమనాశ్రయించియుండెడి, మాయయా-అవిద్యచేత, భ్రాంతాస్సంతః-జనులు భ్రాంతిని బొందినవారగుచు, జీవేశ్వరౌ-జీవేశ్వరులిద్దరును, సువిలక్షణౌ-పారమార్థిక భేదవంతులని, మన్యంతే-తలంచుచున్నారు. తద్వ్యుదాసాయ = తత్-ఆ భేదముయొక్క, వ్యుదాసాయ-నివృత్తికొరకు, తయోః-ఆ తత్త్వంపదార్థములయొక్క, శోధనం-శోధనము, కేవలం-ముఖ్యమైనదగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే మీఅద్వైతసిద్ధాంతమందు తత్త్వంపదార్థములకు భేదము లేనియెడల ఆతత్త్వంపదార్థశోధనము నెందుకజెప్పితిరి?. ఉ. తనకు ఆశ్రయమైన వస్తువును మోహింపజేయునది అవిద్యయగును. అట్టి అవిద్యచేత జనులు విపరీత జ్ఞానవంతులగుచు జీవునకు కర్తృత్వాది ధర్మంబును ఈశ్వరునకు సర్వజ్ఞత్వాది గుణ యోగిత్వంబును పారమార్థికమని తలచుచున్నారు. ఆకారణమువల్ల అట్టిజనులకుగల విపరీతజ్ఞానము నివర్తించుటకొరకే ఆతత్త్వంపదార్థములయొక్క శోధనమును మేము ముఖ్యముగా జెప్పితిమి.

అవ. పదార్థశోధనప్రకారము నే జూపుట కిచ్ఛయించినవాడగుచు అందుకు ఉపాయముగా పూర్వోక్త దృష్టాంతము నిప్పుడు స్మరించుచున్నాడు.

శ్లో॥ అతఏవాత్రదృష్టాంతో యోగ్యః ప్రాక్సమ్యగీరితః।
ఘటాకాశమహాకాశజలాకాశాభ్రఖాత్మకః॥ ౨౨౪.

టీ. అతఏవ-అందువల్లనే, అత్ర-ఈపదార్థశోధనవిషయమై, యోగ్యః-తగిన, ఘటాకాశమహాకాశజలాకాశాభ్రఖాత్మకః=ఘటాకాశ-ఘటాకాశముయొక్కయు-మహాకాశ-మహాకాశముయొక్కయు, జలాకాశ-జలాకాశముయొక్కయు, అభ్రఖ, మేఘాకాశముయొక్కయు, ఆత్మకః-స్వరూపముగల, దృష్టాంతము, ప్రాక్-పూర్వము, సమ్యక్-లెస్సగా, ఈరితః-చెప్పబడెను.

తా. ఏకారణమువల్ల పదార్థశోధనము ముఖ్యముగా జేయదగినదో ఆకారణముచేత ఈపదార్థశోధనవిషయమై ఘటాకాశ మహాకాశ జలాకాశ మేఘాకాశ రూపముగల మంచిదృష్టాంతమును పూర్వమే జెప్పితిమి.

అవ. పదార్థశోధనప్రకారము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ జలాభ్రోపాధ్యధీనే తేజలాకాశాభ్రఖేతయోః।
ఆధారౌతుఘటాకాశమహాకాశౌసునిర్మలౌ॥ ౨౨౫.

టీ. తే-ఆరెండైన, జలాకాశాభ్రఖే=జలాకాశ-జలాకాశంబును, అభ్రఖే-మేఘాకాశంబును, జలాభ్రోపాధ్యధీనే=జల-జలమనునట్టి, అభ్ర-మేఘమనునట్టి, ఉపాధి-ఉపాధిద్వయమునకు, అధీనే-అధీనములగును. తయోః- అలాకాశ మేఘాకాశములకు రెంటికి, ఆధారౌ-ఆధారములగు, ఘటాకాశమహాకాశౌతు-ఘటాకాశ మహాకాశములో, సునిర్మలౌ-మిక్కిలి పరిశుద్ధములగును.

తా. ఆ దృష్టాంతమందుగల జలాకాశ మేఘాకాశములు రెండును జలమేఘ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములనెడి ఉపాధులకు అధీనములగును, ఆ జలాకాశ మేఘాకాశములకు ఆధారము లగు ఘటాకాశ మహాకాశములు రెండును మిక్కిలి పరిశుద్ధములైయున్నవి.

అవ. ఇప్పుడు దార్ష్టాంతికమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఏవమానందవిజ్ఞానమయౌ మాయాధియోర్వశౌ।
తదధిష్ఠానకూటస్థబ్రహ్మణీతు సునిర్మలే॥ ౨౨౬.

టీ. ఏవం-ఈదృష్టాంతప్రకారము, ఆనందవిజ్ఞానమయౌ=ఆనంద-ఈశ్వరరూపమగు ఆనందమయకోశంబును, విజ్ఞానమయౌ-జీవరూపమగు విజ్ఞానమయకోశంబును, మాయాధియోః=మాయా-మాయకును, ధియోః-బుద్ధికిని, వశౌ-అధీనములగును. తదధిష్ఠానకూటస్థబ్రహ్మణీతు=తత్-ఆ యీశ్వరజీవులగు ఆనందమయ విజ్ఞానమయ కోశములకు, అధిష్ఠాన-ఆధారములైన, కూటస్థబ్రహ్మణీతు-కూటస్థబ్రహ్మచైతన్యములో, సునిర్మలే-మిక్కిలి పరిశుద్ధములైయున్నవి.

తా. పూర్వోక్త దృష్టాంతప్రకారము ఆనందమయ విజ్ఞానమయకోశరూపులగు ఈశ్వరజీవులు మాయాబుద్ధులకు అధీనులైయున్నారు. అనగా నీశ్వరరూపమగు ఆనందమయకోశము మాయోపాధిని గలిగియున్నదనియు జీవరూపమగు విజ్ఞాన మయకోశము బుద్ధ్యుపాధిని గలిగియున్నదనియుం దెలియవలెను. మరియు ఆ యానందమయ విజ్ఞానమయకోశములకు ఆధారములగు బ్రహ్మకూటస్థ చైతన్యములు మిక్కిలి పరిశుద్ధములైయున్నవి. అనగా గూటస్థ బ్రహ్మశబ్దములచే జెప్పబడెడి చైతన్యమొక్కటియేనని తెలియవలెను.

శ్లో॥ ఏతత్కక్షోపయోగేన సాంఖ్యయోగౌ మతౌ యది।
దేహోఽన్నమయకక్షత్వాదాత్మత్వేనాభ్యుపేయతాం॥ ౨౨౭.

టీ. ఏతత్కక్షోపయోగేన=ఏతత్కక్షా-ఈపదార్థద్వయశోధనకక్షకు, ఉపయోగేన-ఉపయోగించుటచేత, సాంఖ్యయోగౌ-సాంఖ్యయోగమతములు రెండును, మతౌయది-వేదాంతసమ్మతములగునని యంటివేని, అన్నమయకక్షత్వాత్-అన్నమయ కోశప్రతిపాదనోపయోగిత్వమువల్ల, దేహః-స్థూలదేహము, ఆత్మత్వేన-ఆత్మభావముగా, అభ్యుపేయతాం-అంగీకరింపబడుగాక.

తా. ప్ర. అయితే మీరుజెప్పెడి ఈపదార్థద్వయశోధనకక్షకు ఉపయోగించుటచేత ఆసాంఖ్యయోగమతములను రెంటిని వేదాంతసమ్మతములైన వానినిగా నంగీకరింపరాదాయేమి?. ఉ. ఇట్లుచెప్పుట మిక్కిలి అల్పమగును. ప్ర. అదియేమి?.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. అన్నమయాదికోశమును ఆత్మనుగా బ్రతిపాదించెడి ఇతరశాస్త్రములనుగూడ ఆయాస్థలములయందు ఉపయోగముగా మేము జెప్పుటచేత ఆయామతముల ప్రకారము స్థూలదేహాదికమును వేదాంతసమ్మతి ఆత్మనుగా గ్రహింపవలసివచ్చును. గనుక ఇతరమతములవలెనే సాంఖ్యయోగమతములురెండును వేదాంత సమ్మతిములుగా నంగీకరింపబడవని యభిప్రాయము.

శ్లో॥ ఆత్మభేదోజగత్సత్యమీశోన్యఇతిచేత్త్రయం।

త్యజ్యతేతైస్తదాసాంఖ్యయోగవేదాంతసమ్మతిః॥ ౨౨౮.

టీ. ఆత్మభేదః-ఆత్మభేదంబును, జగత్-జగత్తు, సత్యం-సత్యము, ఈశః-ఈశ్వరుడు, అన్యఇతి-అన్యుడనెడి, త్రయం-ఈ అంశత్రయము, తైః-ఆసాంఖ్యయోగులచేత, త్యజ్యతేచేత్-విడువబడినయెడల, తదా-అప్పుడు, సాంఖ్యయోగవేదాంత సమ్మతిః = సాంఖ్యయోగ-సాంఖ్యయోగమతములకు, వేదాంతసమ్మతిః-అద్వైతశాస్త్రిసమ్మతము గలుగును.

తా. ప్ర. అయితే సాంఖ్యయోగశాస్త్రములకు వేదాంతవిరోధిత్వమెందువల్ల గలిగెనో జెప్పుము ?. ఉ. ౧. ఆత్మభేదంబును, ౨. జగత్సత్యత్వంబును, ౩. ఈశ్వరుడు తటస్థుడుగానన్యుడగుననెడి ఈ మూడంశములను ఆసాంఖ్యయోగులు విడిచిన యెడల ఆసాంఖ్యయోగమతములకు రెంటికిని వేదాంతసమ్మతము గలుగును.

అవ. ఆసాంఖ్యయోగమతములను పూర్వపక్షము చేయుదలచి పూర్వవాది చేసెడి ప్రశ్నమునకు అభిసంధిని హృదయమందుంచుకొని ప్రత్యుత్తరము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ జీవోఽసంగత్వమాత్రేణకృతార్థఇతిచేత్తదా।

స్రక్చందనాదినిత్యత్వమాత్రేణాపికృతార్థతా॥ ౨౨౯.

టీ. జీవః-జీవుడు, అసంగత్వమాత్రేణ-అసంగస్వరూపుడగుటచేతనే, కృతార్థ ఇతిచేత్-కృతార్థుడగుననియంటివేని, తదా-అప్పుడు, స్రక్చందనాది నిత్యత్వమాత్రేణాపి = స్రక్-పుష్పమాలయొక్కయు, చందనాది-చందనాదిపదార్థములయొక్కయు, నిత్యత్వమాత్రేణాపి-సత్యత్వజ్ఞానమాత్రముచేతయు, కృతార్థతా-కృతార్థత్వము గలుగవలెను.

తా. ప్ర. అయితే ఆ సాంఖ్యయోగులు మీవలెనే ఆత్మ అసంగుడనిచెప్పిరి. వారుచెప్పినప్రకారము ఆత్మ అసంగుడనెడి జ్ఞానముచేతనే ముక్తి సిద్ధించుచుండగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అద్వైతజ్ఞానముచేత ప్రయోజనమేమి?. ఉ అంతమాత్రేముచేతనే ముక్తిగలిగెడి పక్షమందు పుష్పచందనాదులయొక్క నిత్యత్వజ్ఞానముచేగూడ ముక్తి గలుగవలసి వచ్చును. అనగా అద్వైతజ్ఞానముచేత దప్ప మరియొకదానిచేత ఆత్మకు అసంగత్వాదికము సంభవింపబడదనెడి అభిసంధి సిద్ధాంతి హృదయమందుగలదని తెలియవలెను.

అవ. ఇప్పుడు సిద్ధాంతి అభిసంధిని ప్రకటీకరించుచున్నాడు.

శ్లో॥ యథాస్రగాదనిత్యత్వందుస్సంపాదంతథాత్మనః।
అసంగత్వంనసంభావ్యంజీవతోర్జగదీశయోః॥ ౨౩౦.

టీ. స్రగాదినిత్యత్వం=స్రగాది-పుష్పచందనాదులయొక్క, నిత్యత్వం-సత్యత్వము, యథా-ఏప్రకారము, దుస్సంపాదం-సంపాదింపదగినదిగాదో, తథా-ఆప్రకారము, జగధీశయోః-జగదీశ్వరులు, జీవతోస్సతోః-ప్రకాశించిదోచుచుండగా, ఆత్మనః-ఆత్మకు, అసంగత్వం-అసంగభావము, నసంభావ్యం-సంభావింపదగినదిగాదు.

తా. ఆసాంఖ్యయోగులు ఈశ్వర జగంబులను నిత్యవస్తువులనుగా నిర్ణయించిరి. కనుక పుష్పచందనాదులకు నిత్యత్వమును సంపాదించుటకు సాధ్యముగానట్లు విశేష్యవిశేషణాకారముచేత ప్రకాశించుచుండెడి జగదీశ్వరులు స్ఫురించుచుండగా ఆత్మకు అసంగత్వము సంభవింపదు.

అవ. అసంగత్వాసంభవమునే యిప్పుడు స్పష్టముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ అవశ్యంప్రకృతిస్సంగంపురేవాపాదయేత్తథా।
నియచ్ఛత్వేతమీశోపికోస్యమోక్షస్తథాసతి॥ ౨౩౧.

టీ. ప్రకృతిః-ప్రకృతి, పురేవ-పూర్వమువలె, అనగా నవివేకదశయందువలెనేయనుట. అవశ్యం-ముఖ్యముగా, సంగం-పురుషునకు, దేహేంద్రియాదులతోటి అభిమానరూపసంబంధమును, అపాదయేత్-సంపాదించును. తథా-ఆప్రకారము, ఈశోపి-ఈశ్వరుడును, ఏతం-ఈపురుషుని, నియచ్ఛతు-నియమించుగాక. అనగా నియమించుచుండుననుట. తథాసతి-అట్లగుచుండగా, అస్య-ఈ పురుషునకు, మోక్షః-మోక్షము, కః-ఎద్ది. అనగా నెప్పటికిని మోక్షములేదనుట.

తా. ఆ సాంఖ్యమతమందు ప్రకృతికి నాశములేమిచేత ఆ ప్రకృతి పూర్వమవివేకదశయందు బురుషునకు దేహేంద్రియాదులతోటి అభిమానరూపసంగమును కలిగించినట్లు ఇప్పుడు వివేకదశయందును ఆప్రకారమే ప్రకృతి పురుషునకు సంగమమును సంపాదింపగలదు. మరియు ఈశ్వరుడును పూర్వమవివేకదశయందువలెనే ఈ పురు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

షుని నియమించుచుండగలడు. ఇట్లు ఈశ్వరప్రకృతులు రెండును తమకార్యముల యందు బురుషుని బ్రవర్తింపజేయుచుండగా ఈ పురుషునకెప్పటికిని మోక్షముగలుగ దని యభిప్రాయము.

శ్లో॥ అవివేకకృతస్సంగోనియమశ్చేతిచేత్తథా।
బలాదాపతితోమాయావాదస్సాంఖ్యస్యదుర్మతేః॥ ౨౩౨.

టీ. సంగః-దేహేంద్రియాదులతోఁటి అభిమానరూప సంబంధంబును, నియమశ్చ-నియమించుటయు, అవివేకకృతఇతిచేత్=అవివేక-అవివేకముచేత, కృతఇతిచేత్-చేయబడెననియంటివేని, బలాత్-బలాత్కారముచేత అనగా ఇచ్ఛలేకయేయనుట, దుర్మతేః-దుర్మతియగు, సాంఖ్యస్య-సాంఖ్యునకు, మాయావాదః-మాయావాదప్రసంగము, ఆపతితః-కలిగెను.

తా. ప్ర. అయితే సంగనియమములు రెండును అవివేక కార్యములగుట చేత వివేకముచే నవివేకము నివర్తించుచుండగా మరల సంగాద్యుత్పత్తి లేదని ఆ సాంఖ్యుడు జెప్పినయెడల దోషమేమి?. ఉ. ఇట్లు సాంఖ్యుడు జెప్పిన యెడల వానికిచ్ఛలేకనే బలాత్కారముచేత దుర్మతియగు సాంఖ్యునియొక్కమతము, మాయావాద ప్రసంగమగుచు అపసిద్ధాంతమగును. అదియెట్లనగా జెప్పెదవినుము. అవివేకమనగా, ౧. వివేకాభావమో, ౨. లేక వివేకముకంటె నన్యమో లేక, ౩. వివేకవిరోధియో జెప్పుము. అవివేకమనునది అభావమాత్రమైన యెడల భావకార్యములగు సంగాదులను గలిగించెనని చెప్పరాదు. గనుక అవివేకమనునది వివేకాభావముగానేరదు. మరియు వివేకరూపముకంటె నన్యమగు ఘటాదికమునకు సంగాది హేతుత్వము కనబడుటలేదు. అందుచేత అవివేకమనునది వివేకముకంటె నన్యమైనదని చెప్పరాదు. మరియు అవివేకమనునది వివేకవిరోధియని చెప్పెడివిషయమై ఆ యవివేకము భావరూపియనియు అజ్ఞానస్వరూపమనియు జ్ఞానముచే నివర్తింపబడు ననియుం జెప్పవలెను. ఇట్లు చెప్పుటయే మా అద్వైతసిద్ధాంతమగును. కనుక అవివేకమువల్ల సంగాదులు గలిగినవని సాంఖ్యుడు జెప్పినయెడల ఆసాంఖ్యునిమత మపసిద్ధాంతమగుచు వానిప్రసంగము మాయావాదమగును. ఆకారణముచేత సాంఖ్యయోగశాస్త్రములు రెండును వేదాంతసమ్మతములు గావని దెలియవలెను.

శ్లో॥ బంధమోక్షవ్యవస్థార్థమాత్మనానాత్వమిష్యతాం।
ఇతిచేన్నయతోమాయావ్యవస్థాపయితుంక్షమా॥ ౨౩౩.

టీ. బంధమోక్షవ్యవస్థార్థం=బంధ - బంధముయొక్కయు, మోక్ష-మోక్షము


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక్కయు, వ్యవస్థాం-స్థాపనము కొరకు, ఆత్మనానాత్వం=ఆత్మ-ఆత్మయొక్క, నానాత్వం - అనేకత్వము, ఇష్యతామితి చేత్ - ఇచ్ఛయింపబడు గాకయని యంటివేని, న అట్లు గాదు. యతః-ఏ కారణము వల్ల, మాయా-మాయ, వ్యవస్థాపయితుం-బంధమో క్షావస్థలను స్థాపన జేయుటకొరకు, క్షమా-సమర్థమైనదో.

తా. ప్ర. అయితే అద్వైతమే శ్రుతి సమ్మతముగా నున్నదని చెప్పినయెడల బంధమోక్షస్థాపనము వ్యర్థమగునని ఆత్మభేదము నంగీకరింపరాదాయేమి ?. ఉ. ఆ త్మ అద్వితీయుడైనను అట్టి ఆత్మయందు బంధమోక్షావస్థలను కల్పించుటకొరకు మాయకు సామర్థ్యతగలదు. కనుక బంధమోక్షస్థాపనము కొరకు ఆత్మభేదము నంగీ కరింపవలసిన పనిలేదని యభిప్రాయము.

శ్లో॥ దుర్ఘటంఘటయామీతివిరుద్ధంకింనపశ్యసి।
వాస్తవౌబంధమోక్షౌతుశ్రుతిర్నసహతేతరాం॥ ౨౩౪,

టీ. దుర్ఘటం-అసాధ్యమును, ఘటయామీతి-సాధ్యము చేయుచున్నానసెడి, విరుద్ధం-విరోధవాక్యమును, నపశ్యసికిం-చూడవాయేమి. అనగా లోకమందు వింటి విగదా యనుట. బంధమోక్షౌ-బంధమోక్షావస్థలు రెండును, వాస్తవౌతు-వాస్తవము లనెడిపక్షమును, శ్రుతిః-శ్రుతి, నసహతేతరాం-బొత్తుగా సహింపదు.

తా. ప్ర. అయితే మాయయైనను బంధమోక్షములనెట్లు స్థాపించును ?. ఉ. దుర్ఘటమును ఘటింపజేసెదననెడి వాక్యమును నీవు లోకమందు వినలేదా యేమి. అనగా మాయకు దుర్ఘటకారిత్వము స్వాభావికముగా నున్నదని యభి ప్రాయము. ప్ర. అయితే బంధము అవిద్యాకల్పితమైనను మోక్షమును వాస్త వమైన దానినిగా నంగీకరింపరాదాయేమి ?. ఉ. బంధ మోక్షావస్థలు రెండు ను వాస్తవము లనెడి విషయమై శ్రుతికి బొత్తుగా సమ్మతముగాదు. అనగా బంధమోక్షములనెడి రెండవస్థలలో దేనిని వాస్తవముగా జెప్పినను శ్రుతికి విరో ధమగునని యభిప్రాయము ప్ర. అయితే ఆత్మకు బంధమోక్షావస్థలు రెండును వాస్తవమందు లేనట్లు మనకెట్లు తెలియబడునో జెప్పుము ?. ఉ. యోచించిన యెడల ఆత్మకు బంధమోక్షావస్థలు రెండును వాస్తవమందు లేవనియు అవిద్య చే కల్పించబడినవనియు మనకు స్పష్టముగా దెలియబడును. ప్ర. అయితే ఆ యోచనంబెద్ది ?. ఉ. ఆత్మకు అవస్థాపత్త్వము నిర్నిమిత్తముచేత ప్రాప్తిం చెనో లేక సనిమిత్తంబుచే బ్రాప్తించెనోయని యోచించవలెను. ప్ర. అయితే నిర్నిమిత్తముచే బ్రాప్తించెనని చెప్పరాదా యేమి ?. ఉ. అట్లు చెప్పందగదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్ర. అది యేమి?. ఉ. ఇప్పుడు నీవు వేదాంతార్థ శ్రవణమననాదులచేత జ్ఞానమును సంపాదించుకొని మోక్షప్రాప్తుండ వైనను పూర్వము నిర్నిమిత్తము చేత నీకెట్లు బంధము సంప్రాప్త మాయెనో. ఆటువలెనే ఇంకను మరలనీకు నిర్నిమిత్తముచేతనే బంధము సంప్రాప్తమగును. కనుక ఈ యర్థము మోక్షవినాశప్రసంగ మగుటచేత అట్లు చెప్పందగదు. ప్ర. అయితే ఆత్మకు సనిమిత్తము చేతనే బంధము ప్రాప్తించెనని యైనం జెప్పందగదాయేమి?. ఉ. అట్లును చెప్పందగదు. ప్ర. అది యేమి?. ఉ. ఆత్మను అవస్థావంతునిగాజేసిన ఆనిమిత్తంబు కలుపకు నీలత్వాది స్వరూపము వలె ఆత్మకు స్వరూపముగా నుండవలెను. అట్లున్నయెడల ఆట్టి బంధనిమిత్తము నశించునట్లు ప్రయత్నంబుజేయగా ఆత్మయగు తానే అభావమగుచున్నాడు. కనుక అట్లు జెప్పందగదు. ప్ర. అయితే ఆత్మకు బంధమును కలిగించెడి నిమిత్తము ఆత్మ స్వరూపముకంటె అన్యంబుగ నుండునదియై బ్రహ్మజ్ఞానముచేత నివర్తింపరాదాయేమి?. ఉ. సరి. అసంగుడైన ఆత్మను అవస్థావంతునిగా భ్రమింపజేసి జ్ఞానముచేత నివర్తింపబడునదియే (అవిద్య) అనంబడును. కనుక మిథ్యారూపమగు అట్టి అవిద్య యొక్క కార్యములగు ఏ యవస్థల తోటియు ఆత్మకు లేశమైనను సంబంధము లేదు. ఇదియే మా విద్యారణ్య గురునియొక్క అభిప్రాయ మగును. మరియు ఈ యర్థంబంతయు ఉత్తర మీమాంసా శాస్త్రగ్రంథ మందు శ్రీవ్యాసమహాముని చేత సూ॥ అథాతో బ్రహ్మజిజ్ఞాసా॥ అనెడి సూత్రమందు దెలుపబడియున్నది. మరియు నిత్యముక్త స్వరూపుడైన ఆత్మకు బంధాద్యవస్థ లున్నట్లు గల్పించి వేదమును సార్థకము జేసెదమని తలచి బ్రహ్మాత్మైకత్వ జ్ఞానమునకు విఘ్నమును గలిగించెడివారలు ఆత్మహత్యా దోషమును బొందుదురనియు అట్టివారలు సర్వశాస్త్రజ్ఞులైనను మూర్ఖులవలె విడువదగిన వారలగుదురనియు ఇట్లు శ్రీశంకరభగవత్పాదాచార్యులవారిచేత శ్రీభగవద్గీతా శాస్త్రముయొక్క (౧౩) అధ్యాయములో శ్లో॥ క్షేత్రజ్ఞంచాపి మాంవిద్ధి సర్వక్షేత్రేషు భారత॥ అనెడి శ్లోక భాష్యమందు సంభాషింపబడెను. మరియు ఆత్మకు బంధ మోక్షావస్థలు రెండును ఏకాలమందు ప్రాప్తించెనో లేక భిన్న కాలముల యందు ప్రాప్తించెనో అనియు యోచించవలెను. ప్ర. అయితే యేకకాలమందు ప్రాప్తించెనని చెప్పరాదాయేమి?. ఉ. స్థితి గతివలె విరుద్ధంబులగు బంధమోక్షావస్థలు రెండును ఏకకాలమందు ప్రాప్తించెనని చెప్పందగదు. ప్ర.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అయితే భిన్నకాలములయందు వచ్చెననిసైనం జెప్పందగదా యేమి ?. ఉ. ఇట్లు చెప్పునప్పుడు బంధావస్థను పూర్వము కల్పించవలెను. మరియు ఆ బంధావస్థ అనాదిగా నున్నదనియు అంత్యము గలదనియుం జెప్పవలెను. ఇట్లు చెప్పుట సర్వప్రమాణ న్యాయవిరోధ మగుచున్నది. మరియు మోక్షావస్థ రెండవదిగా వేనుక కల్పింపబడిన దగుచు ఆదియు ఆదిగలదనియు అంత్యము లేదనియుం జెప్పబడవలెను. ఇట్లు చెప్పుటయు సర్వప్రమాణ న్యాయవిరోధమగు చున్నది. ప్ర. అయితే ఈపద్ధతి సర్వప్రమాణ న్యాయవిరోధ మగుటకు గారణమేమి ?. ఉ. ఆద్యంతములలో నొకటిగలిగియుండి మరియొకటి లేకపోవుట సర్వ ప్రమాణన్యాయవిరోధ మగును. కనుక ఆత్మ అవస్థావంతుడనెడి విషయమును ఎవ్విదన్యాయముచేతను నిరూపించుటకు శక్యముగాదు. మరియు ఆత్మ ఒక అవస్థనుంచి మరియొక అవస్థను బొందెడి పక్షమందు అట్టి ఆత్మకు నిత్యత్వమును సంపాదించుటకు శ్రుతిశతంబులచే నైనను శక్యముగాదు. మరియు ఆత్మ ఆకాశమువలె నిరవయవుడై యున్నాడు. అట్టి ఆత్మకు ఏయవస్థనుం జెప్పుట ఉచితంబుగాదు. కనుక ఈపైన చెప్పబడిన ప్రకారము మూఢులైన ద్వైతవాదులకు బహువిధదోషంబులు సంప్రాప్తములగు చున్నవి. మా అద్వైతవాదమందు బరిహరింపదగిన అట్టి దోషంబొకటియు లేదు. కనుకనే నిత్యముక్తుడైన ఆత్మకు బంధమోక్షావస్థలు రెండును మాయాకల్పితములే గాని వాస్తవములుగావని శ్రీవిద్యారణ్యగురునిచే పై శ్లోకమందు జెప్పబడెను. ఈపూర్వోక్త ప్రకారము అద్వైతము శ్రుతిప్రమాణన్యాయ సిద్ధాంతమై విద్వదనుభవసిద్ధమై వసిష్ఠాది మహాముని గణమతమై ప్రకాశించు చున్నది. ఇట్లుండగా అద్వైతవాదమందు బంధమోక్షంబు లెవరికనియు సుఖదుఃఖాది ధర్మవంతుడగు ఆత్మకు బ్రహ్మాత్మత్వమెట్లు గలుగుననియుం గుయుక్తులంజెప్పుచు తాము పండితులనిదలిచి తమతమ మతాభిమానముచేత ముముక్షువులను మోసముజేయుచు శ్రేయోమార్గ విఘ్నకర్తలగుచు అద్వైతమును నిందించువారలకు స్వయం కృతాపరాధ మహాదోషముచేత రౌరవాది మహానరకంబులును పశ్వాదిహీన జన్మప్రాప్తియుం గలుగునని శాస్త్రము జెప్పుచున్నది.

అవ. బంధమోక్షాదికమునకు వాస్తవత్వమును నిషేధించెడి శ్రుతినిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ ననిరోధోనచోత్పత్తిర్నబద్ధోనచసాధకః।
నముముక్షుర్నవైముక్తఇత్యేషాపరమార్థతా॥ ౨౩౫.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. నిరోధః-వినాశనము, న-లేదు. ఉత్పత్తిశ్చ-దేహసంబంధంబును, న-లేదు. బద్ధః-సుఖదుఃఖాదిధర్మవంతుడు, న-కాడు, సాధకశ్చ-శ్రవణాద్యనుష్ఠాతయు, న-కాడు. ముముక్షుః-సాధనచతుష్టయసంపన్నుడును, న-కాడు. ముక్తః-నివర్తింపబడిన అవిద్యగలవాడును, నవై-కాడు. ఏషా-ఇది, పరమార్థతేతి-పరమార్థమని శ్రుతిజెప్పుచున్నది. అనగా నిదియంతయు వాస్తవముచేతలేదని యభిప్రాయము.

తా. ౧. జననము, ౨. మరణము, ౩. సుఖదుఃఖాది ధర్మవంతుడు, ౪. శ్రవణమననాద్యనుష్ఠాత, ౫. సాధనచతుష్టయసంపన్నుడు, ౬. అవిద్యావిముక్తుడు, ఇత్యాది సకలవ్యవహారంబును పరమార్థమందులేదని శ్రుతిజెప్పుచున్నది. అనగా వస్తుతత్త్వమందు ఈవ్యవహారమంతయులేదని యభిప్రాయము.

అవ. ఇట్లు జీవేశ్వరాదిభేదమునకు బ్రతిపాదింపబడిన మాయామయత్వము నిప్పుడు ఉపసంహరించుచున్నాడు.

శ్లో॥ మాయాఖ్యాయాః కామధేనోర్వత్సౌజీవేశ్వరావుభౌ।
యథేచ్ఛంపిబతాంద్వైతంతత్త్వంత్వద్వైతమేవహి॥ ౨౩౬.

టీ. మాయాఖ్యాయాః = మాయా-మాయయనెడి, ఆఖ్యాయాః-పేరుగల, కామధేనోః-కామధేనువునకు, ఉభౌ-యిద్దరగు, జీవేశ్వరౌ-జీవేశ్వరులు, వత్సౌ-బిడ్డలగుదురు. యథేచ్ఛం-తనయిష్టప్రకారము, ద్వైతం-ద్వైతమనెడి క్షీరములను, పిబతాం - పానముచేయుదురుగాక. తత్త్వంతు - పరతత్త్వమో, అద్వైతమేవహి-అద్వైతమేయగును.

తా. మాయయనునది ఒక కామధేనువువంటిదగును. ఆ కామధేనువునకు జీవేశ్వరులిద్దరును దూడవంటివారగుదురు. ఆ మాయా కామధేనువుయొక్క జీవేశ్వరులనెడి దూడలు తమయిష్టప్రకారము ద్వైతమనెడిపాలను పానముచేయుదురుగాక. పరతత్త్వము అద్వైతమేయగుగాని ద్వైతముకానేరదు.

శ్లో॥ కూటస్థబ్రహ్మణోర్భేదో నామమాత్రాదృతేనహి।
ఘటాకాశమహాకాశౌ వియుజ్యేతేనహిక్వచిత్॥ ౨౩౭.

టీ. కూటస్థబ్రహ్మణోః=కూటస్థ-ప్రత్యగాత్మకును, బ్రహ్మణోః-బ్రహ్మమునకును, భేదః-భేదము, నామమాత్రాదృతే-నామమాత్రమునుతప్ప, నహి-వాస్తవమందు లేనేలేదు. ఘటాకాశమహాకాశౌ-ఘటాకాశమహాకాశములు రెండును, క్వచిత్-ఎప్పుడైనను, నవియుజ్యేతేహి-వేరుచేయబడవుగదా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే జీవేశ్వరులిద్దరును మాయికులగుటచేత వారికిగల భేదము మిథ్యయైనను కూటస్థ బ్రహ్మచైతన్యములు రెండును సత్యములగుటచేత ఆ రెంటికి గల భేదము పారమార్థికముగాదా యేమి?. ఉ. ఘటాకాశమహాకాశములకు రెంటికిని భేదములేనట్లు కూటస్థబ్రహ్మములకు రెంటికిని నామమాత్ర భేదమే గాని వాస్తవమందు భేదములేదు. అనగా భేదమునుకల్పించుటకు ప్రయోజకమగు స్వరూపభేదము ఆ కూటస్థబ్రహ్మములకు లేమిచేత ఆరెండుచైతన్యములకు కొంచమైనను భేదములేదని యభిప్రాయము.

శ్లో॥ యదద్వైతంశ్రుతంసృష్టేఃప్రాక్తదేవాద్యచోపరి।
ముక్తావపివృథామాయాభ్రామయత్యఖిలాన్జనాన్॥ ౨౩౭.

టీ. సృష్టేః-సృష్టికంటె, ప్రాక్ పూర్వము, యత్-ఏ, అద్వైతం-అద్వితీయ బ్రహ్మతత్త్వము, శ్రుతం-శ్రుతియందు వినబడుచున్నదో, తదేవ ఆ అద్వితీయ బ్రహ్మతత్త్వమే, అద్య-ఇప్పుడును అనగా సృష్టికాలమందనుట. ఉపరిచ-ఇక రాబోయెడి కాలమందును, ముక్తావపి-మోక్షదశయందును ఏకరూపముగా ప్రకాశించుచున్నది. మాయా-అవిద్య, అఖిలాన్ సమస్తమైన, జనాన్-జనులను, వృథా-వ్యర్థముగా, భ్రామయతి-భ్రమింపజేయుచున్నది.

తా. ప్ర. అయితే యిట్లు చైతన్యభేదమునకు మిథ్యాభావమును సమర్థించుట చేత ఫలమేమి?. ఉ. శ్రు॥ సదేవసోమ్యేదమగ్రఆసీత్ ఏకమేవాద్వితీయం॥ అనెడి శ్రుతిప్రకారము సృష్టికి పూర్వమందు సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యమగు ఏ అద్వితీయ బ్రహ్మతత్త్వము వినబడుచున్నదో అదియే యిప్పుడును ఇకముత్తర కాలమందును మోక్షదశయందును బాధింపబడక ఏకరూపముగా ప్రకాశించుచున్నది. ప్ర. అయితే సర్వజనులును భేదమందు నమ్మికము గలిగియుండుటకు గారణమేమి?. ఉ. ఆమాయ సర్వజనులను మోహింపజేయుటచేత జనులందరును తత్త్వజ్ఞానశూన్యులై భేదమందునమ్మికమును బొందియున్నారు- గనుక అజ్ఞానమే కారణమగునని తెలియవలెను.

శ్లో॥ యేవదంతీత్థమేతేపిభ్రామ్యంతేఽవిద్యయాత్రకిం।
నయథాపూర్వమేతేషామత్రభ్రాంతేరదర్శనాత్॥ ౨౩౮.

టీ. యే-ఏజనులు, ఇత్థం-ఈప్రకారముగా, వదంతి-చెప్పుచున్నారో, ఏతేపి-వీరును, అవిద్యయా-మాయచేత, భ్రామ్యంతే-భ్రమనుబొందుచున్నారు. అత్ర-ఈ తత్త్వజ్ఞానమందు, అనగా తత్త్వజ్ఞానముచేననుట. (కిమితిచేత్) ప్రయోజనమేమని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యంటివేని, ఏతేషాం-ఈతత్వజ్ఞానులకు, యథాపూర్వం-పూర్వమందువలె, అనగా నవివేకదశయందువలెననుట. అత్ర-ఈతత్వజ్ఞానదశయందు, భ్రాంతేః-భ్రాంతియొక్క, అదర్శనాత్-లేమివల్ల, న-ప్రయోజనమిలేదని చెప్పరాదు.

తా. ప్ర. అయితే ప్రపంచము మాయామయమనియు పరతత్వము అద్వైతమనియు ఈప్రకారముగా నేజనులు వర్ణించుచున్నారో అట్టివీరును సంసారవంతులై కనబడుచుండగా తత్వజ్ఞానముచేత ప్రయోజనమేమి?. ఉ. ఈతత్వజ్ఞానులలో గొందరికి వ్యవహారముగలిగియున్నను పూర్వమవివేకదశయందువలె ఈజ్ఞానదశయందు భ్రాంతిగలిగియుండదు. కనుక మహాత్ప్రయోజనముగలదని యభిప్రాయము.

అవ. జ్ఞానులకు భ్రాంతియొక్క అభావమునుజూపుటకు ఇప్పుడు అజ్ఞానులయొక్క నిశ్చయమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఐహికాముష్మికస్సర్వస్సంసారోవా స్తవస్తతః।
నభాతినాస్తిచాద్వైతమిత్యజ్ఞానివినిశ్చయః॥ ౨౮౦.

టీ. ఐహికాముష్మికః = ఐహిక-ఈలోకసంబంధమైనట్టియు, ఆముష్మికః-పరలోకసంబంధమైనట్టియు, సర్వసంసారః=సర్వ-సకలమగు, సంసారః-సంసారము వాస్తవఇతి-వాస్తవమగుననియు, తతః-ఆకారణమువల్ల, అద్వైతం-అద్వితీయబ్రహ్మతత్వము, నాస్తీతి-లేదనియు, నభాతీతిచ-తోచుచుండలేదనియు, అజ్ఞానివినిశ్చయః= అజ్ఞాని-అజ్ఞానులయొక్క, వినిశ్చయః-నిశ్చయమగును.

తా. ఈ లోకమందుగల పుత్రభార్యాది పోషణరూపసంసారంబును పరలోకమందుగల స్వర్గసుఖాద్యనుభవరూప సంసారంబును వాస్తవమనియు అందుచేత పరతత్వమగు అద్వైతము లేదనియు తోచుచుండలేదనియు ఇట్లు అజ్ఞానులయొక్క నిశ్చయమగును.

అవ. తత్వనిశ్చయముగలవానికి అజ్ఞానియొక్కనిశ్చయముకంటె విలక్షణత్వము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ జ్ఞానినోవిపరీతోస్మాన్నిశ్చయస్సమ్యగీక్ష్యతే।
స్వస్వనిశ్చయతోబద్ధోముక్తోహంచేతిమన్యతే॥ ౨౮౧.

టీ. అస్మాత్-ఈయజ్ఞానివినిశ్చయముకంటె, విపరీతః-విరుద్ధమైన, నిశ్చయః-నిశ్చయము, జ్ఞానినః-తత్వజ్ఞానికి, సమ్యక్-లెస్సగా, ఈక్ష్యతే-కనబడుచున్నది. స్వస్వనిశ్చయతః = స్వస్వ-తనతనయొక్క, నిశ్చయతః-నిశ్చయమువల్ల, అహం-నేను, బద్ధఇతి-బద్ధుడనియు, అహం-నేను, ముక్తశ్చేతి-ముక్తుడననియు, మన్యతే-తలచుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మఱియు అద్వైతము పారమార్థికమనియు స్ఫురించుచున్నదనియు సంసారమంతయు పారమార్థికము గాదనియు ఇట్లు తత్వజ్ఞానియొక్క నిశ్చయమగును. ప్ర. అయితే అట్టినిశ్చయమువల్ల బ్రయోజనమేమి?. ఉ. తనతననిశ్చయమునను సరించి ఫలముగలుగుచున్నది. కనుక అజ్ఞానియగువాడు నేను సంసారబద్ధుడననియు జ్ఞానియగువాడు నేను సర్వసంసారవిముక్తుడననియుం దలచుచు సంసార బంధ మోక్షములను బొందుచున్నారని యభిప్రాయము.

శ్లో॥ నాద్వైతమపరోక్షంచేన్న చిద్రూపేణభాసనాత్।
అశేషేణనభాతంచేద్ద్వైతంకింభాసతేఖిలం॥ ౨౮౨.

టీ: అద్వైతం-అద్వైతబ్రహ్మస్వరూపము, అపరోక్షం-ప్రత్యక్షముగా, నచేత్-స్ఫురింపుచుండలేదని యంటివేని, చిద్రూపేణ-జ్ఞానస్వరూపముచేత, భాసనాత్-ప్రకాశించుచుండుటవల్ల, న-ప్రత్యక్షముగా బ్రకాశింపుచుండలేదని చెప్పరాదు. అశేషేణ-సాకల్యముగా, నభాతంచేత్-ప్రకాశమునుబొందలేదనియంటివేని, ద్వైతం-ద్వైతము, అఖిలం-సాకల్యముగా, భాసతేకిం-ప్రకాశించుచున్నదాయేమి?. అనగా స్ఫురించలేదనుట.

తా. ప్ర. అయితే అద్వైతము ప్రకాశించుచున్నదని శాస్త్రమువల్ల జెప్పితిరే గాని అనుభవమువల్ల జెప్పలేదు. అందుచేత అద్వైతనిశ్చయమెట్లుకలుగును?. ఉ. ఘటముస్ఫురించుచున్నదనియు వస్త్రముస్ఫురించుచున్నదని ఇట్లు ఘటాదులయందంతటను స్ఫురణరూపముగా అద్వితీయ బ్రహ్మముయొక్క చిద్రూపము ప్రకాశించుచుండుటవల్ల అద్వైతము అనుభవగోచరముగాలేదని చెప్పరాదు. ప్ర. అయితే చిద్రూపముస్ఫురణరూపముగా ప్రకాశించుచున్నను ఆ చిద్రూపమంతటను సాకల్యముగా స్ఫురించుచుండలేదుగదా?. ఉ. అంతటను సాకల్యముగా నీద్వైతము ప్రకాశించుచున్నదాయేమి. అనగా సాకల్యముగా బ్రకాశింపమి ద్వైతపక్షమందును సమానముగానున్నదని యభిప్రాయము.

అవ. ఇట్లు అద్వైతద్వైతములయందు దోషసామాన్యముం దెలిపి యిప్పుడు పరిహారసామ్యమును జెప్పుచున్నాడు.

శ్లో॥ దిఙ్మాత్రేణవిభానంతుద్వయోరపిసమంఖలు।
ద్వైతసిద్ధివదద్వైతసిద్ధిస్తేతావతానకిం॥ ౨౮౩.

టీ. దిఙ్మాత్రేణ-ఏకదేశముచేత, విభానంతు-స్ఫురణమో, ద్వయోరపి-ద్వైతాద్వైతములనెడి రెండుపక్షములయందును, సమంఖలు-సమానమేయగుగదా. తే-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీయొక్క, అనగానీద్వైతపక్షమందనుట. తానతా- అంతమాత్రముచేత, అన గానేకదేశస్ఫురణముండుటచేననుట. ద్వైతసిద్ధివత్ = ద్వైత-ద్వైతముయొ క్క, సిద్ధివత్ . నిశ్చయమువలె అద్వైతసిద్ధిః = అద్వైత - అద్వైతముయొ క్క, సిద్ధిః- నిశ్చయము, నకిం-కాదాయేమి. అనగానగుచున్నదేననుట.

తా. మరియు చిద్రూపము, స్ఫురణరూపముగా, ఏకదేశముచే ప్రకా శించుటయో, ద్వైతాద్వైతపక్షములనెడి రెంటియందును సమానముగాను న్నది. కనుక, ద్వైతాద్వైతపక్షములనెడి రెంటియందును పరిహారము సమా నముగా నేయున్నదనియభిప్రాయము. ప్ర. అయితే,ఇంతమాత్రముచేత, పరిహా రసామ్యమెట్లు సిద్ధించెను? ఉ. నీద్వైతపక్షమందు చిద్రూపమునకు ఏకదేశ స్ఫురణముగలిగియుండుటచేత, నీకుద్వైతనిశ్చయమెట్లుగలిగెనో, అటువలెనే, మాఅద్వైతపక్షమందును చిద్రూపమునకు ఏకదేశస్ఫురణము గలిగియుండుట చేత, మాకును అద్వైతనిశ్చయముగలుగునని తెలిసికొనుము.

అవ. ఇప్పుడు, పూర్వవాది, మరియొకవిధముచేత, అద్వైతసిద్ధిలేదని, యాక్షేపించుచున్నాడు.

శ్లో॥ ద్వైతేనహీనమద్వైతం ద్వైతజ్ఞానేకథంత్విదం।
చిద్భానంత్వవిరోధ్యస్య ద్వైతస్యాతోఽసమేఉభే॥ ౨౪౪.

టీ. ద్వైతేన-ద్వైతముచేత, అద్వైతం-అద్వైతము, హీనం-విఘాత త్వమునుబొందును. ద్వైతజ్ఞానేసతి - ద్వైతస్ఫురణముగలుగుచుండగా,ఇదం తు-ఈయద్వైతనిశ్చయము, కథం- ఎట్లుసిద్ధించును. అనగా సిద్ధించదనుట. చిద్భానంతు=చిత్-చిద్రూపముయొక్క, భానంతు-స్ఫురణమో, అస్య-ఈ,ద్వై తస్య- ద్వైతమునకు, అవిరోధి-విరోధిగాదు. అతః = ఆకారణమువల్ల, ఉభే- ద్వైతాద్వైతములురెండును, అసమే-సమానత్వమునుబొందవు.

తా. ప్ర. ఓ అద్వైతసిద్ధాంతీ, అద్వైతమనగా ద్వైతములేనిదగును. కనుక, ద్వైతాద్వైతములు రెండును పరస్పరవిరోధమునుగలిగియుండుటవ ల్ల, ద్వైతస్ఫురణముగలుగుచుండగా, అద్వైతనిశ్చయమెట్లును గలుగ నేరదు. ఆకారణమువల్ల, ద్వైతముచేత అద్వైతము విఘాతత్వమునుబొందును. ఉ. అయితే, ఓపూర్వవాదీ,ద్వైతమునకును అద్వైతమువిరోధియగుటవల్ల,అద్వై తస్ఫురణముగలుగుచుండగా, ద్వైతసిద్ధిగామిచేత నీవుచేసెడిచోద్యము, నీద్వై తమందును సమానముగావ్యాపించదాయేమి? ప్ర. ఓ అద్వైతసిద్ధాంతీ, మీఅ ద్వైతవాదమందు, చిద్రూపస్ఫురణమే, అద్వైతస్ఫురణ మగుటచేతయు, ఆచి ద్రూపస్ఫురణము ద్వైతమునకువిరోధిగామిచేతయు, అద్వైతస్ఫురణము గలు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుచుండగా, ద్వైతనిశ్చయమునకు భంగములేదు. ఆకారణమువల్ల, ద్వైతాద్వైతపక్షములు రెండును సామ్యములు గాసేరవు.

అవ. అనియిట్లు పూర్వవాది ఆక్షేపించగా, అందుకుఅద్వైతసిద్ధాంతి, తగిన ప్రత్యుత్తరము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏవంతర్హి శృణుద్వైత మసన్మాయామయత్వతః।
తేనవాస్తవమద్వైతం పరిశేషాద్విభాసతే॥ ౨౮౫.

టీ. ఏవంతర్హి - ఇట్లైనగో డల, ద్వైతం-ద్వైతము, మాయామయత్వతః-మాయామయమగుటవల్ల, అసత్-సత్యముగాదు. తేన-ఆకారణముచేత, వాస్తవం-సత్యరూపమగు, అద్వైతం- అద్వైతము, పరిశేషాత్ - అంతటను సత్ప్రత్యయముచేత మిగులుటవల్ల, విభాసతే - ప్రకాశించుచున్నది.

తా. ఓ పూర్వవాదీ, ద్వైతమంతయు మాయామయమగుటవల్ల, సత్యముగాదు. కనుక, తోచుచుండెడి నామరూపాది సకలద్వైతమును మిథ్యయని నిరాకరించుచుండగా, వాస్తవమగు అద్వైతమంతటను, (సత్ = ఉండునది) అనెడి ప్రత్యయరూపముగా శేషించుచు, ప్రకాశించుచున్నది. అనగా, తోచుచుండెడి ద్వైతమంతయుమిథ్యయగుటచేత, వాస్తవమైన అద్వైతమునకు విఘాతమును గలిగింపబాలదని యభిప్రాయము.

అవ. ఆ అద్వైతపరిశేషప్రకారమునే, యిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ అచింత్యరచనారూపం మాయైవ సకలంజగత్।
ఇతినిశ్చిత్యవస్తుత్వ మద్వైతేపరిశేష్యతాం॥ ౨౮౬.

టీ. అచింత్యరచనారూపం=అచింత్య-చింతించుటకు యోగ్యముగాని, రచనారూపం-కల్పనారూపమువంటి స్వరూపముగల, సకలం-సకలమగు, జగత్-ప్రపంచము, మాయైవ-మిథ్యయేయగును. ఇతి - ఈప్రకారము, నిశ్చిత్య- నిశ్చయించి, అద్వైతే-అద్వైతమందు, వస్తుత్వం - వాస్తవత్వము, పరిశేష్యతాం-శేషింపబడుగాక, అనగా శేషింపజేయుమనుట.

తా. చింతించుటకు శక్యముగాని కల్పనారూపమువంటి స్వరూపము గలసకలజగంబును మిథ్యయేయగునని, ఈప్రకారముగా అనిర్వచనీయత్వముచేత ద్వైతమునకు మిథ్యాభావమునునిశ్చయించి, అద్వైతమును వాస్తవమునుగా శేషింపజేయవచ్చును.

శ్లో॥ పునర్ద్వైతస్యవస్తుత్వం భాతిచేత్త్వంతథాపునః।
పరిశీలయకోవాత్ర ప్రయాసస్తేనతేవద॥ ౨౮౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ద్వైతస్య- ద్వైతమునకు, వస్తుత్వం - సత్యత్వము, పునః-మరల, ఛాళిచేత్-తోచుచుండునంటివేని, త్వం-నీవు, పునః-మరల, తథా - ఆప్రకారము, అనగా పూర్వోక్తప్రకారముగాననుట. పరిశీలయ-పరిశీలింపుము. అనగా ద్వైతముమిథ్యయని విచారింపుమనుట. అత్ర-ఈద్వైతమిథ్యాభావనివిషయమై, తేన-అట్లు పరిశీలించుటచేత, తే-నీకు,ప్రయాసః- కష్టము, కోవా- ఏమియో, వద - చెప్పుము.

తా. ప్ర. అయితే, ఈపూర్వోక్త ప్రకారము, అద్వైతనిశ్చయముచే యబడినను, పూర్వవాసనచేత మరలమరలద్వైతమునకుసత్యత్వముదోచినయెడల, చేయవలసినపనియేమి?. ఉ. అట్లుద్వైతముసత్యమనితోచినయెడల, అది నివర్తించుటకొరకు, మరలమరలద్వైతము మిథ్యయని, పూర్వోక్తప్రకారము విచారణచేత పరిశీలింపుచుండుము. ఈద్వైతనివృత్తికొరకు, జగంబు మిథ్యయనివిచారించుటచేత నీకు ప్రయాసమేమియులేదు. మరియు, ఈప్రకారము అద్వైతనిశ్చయజ్ఞానముగలిగెడికొరకు, వేదాంతార్థ శ్రవణమననాదులను మాటిమాటికి జేయుచుండవలెనని, బ్రహ్మసూత్రములయందు, సూ॥ ఆవృత్తిరసకృదుపదేశాత్॥ అనియిట్లుచతుర్థాధ్యాయములో, వ్యాసునిచేజెప్పబడెనని తెలియవలెను.

శ్లో॥ కియంతంకాలమితిచేత్ ఖేదోయంద్వైతఇష్యతాం।
అద్వైతేతునయుక్తోయం సర్వానర్థనివారణాత్॥ ౭౮౮.

టీ. కియంతంకాలమితిచేత్ - ఈవిచారణ యెంతకాలపర్యంతమనియంటివేని, అయం-ఈ, ఖేదః-వ్యసనము, ద్వైతే-ద్వైతమందు, ఇష్యతాం- ఇచ్ఛయింపబడుగాక. సర్వానర్థనివారణాత్ = సర్వానర్థ-సర్వదుఃఖములయొక్క, నివారణాత్ - నివారణమువల్ల, అనగా సర్వదుఃఖములను నివారింపజేయుటచేననుట. అద్వైతేతు- అద్వైతమందో, అయం-ఈవ్యసనము, నయుక్తః-కూడియుండునదిగాదు.

తా. ప్ర. అయితే, ఎంతపర్యంతమిట్లు, విచారింపదగినదో చెప్పుము? ఉ. ఈవ్యసనముద్వైతమందేయుండునుగాని, అద్వైతనుచేత సర్వదుఃఖములునివారింపబడుటవల్ల, ఆఅద్వైతమందు ఈవ్యసనముగలిగియుండదు.

శ్లో॥ క్షుత్పిపాసాదయోదృష్టా యథాపూర్వం మయితిచేత్।
మచ్ఛబ్దవాచ్యేహంకారే దృశ్యంతాం నేతికోవదేత్॥ ౭౮౯.

టీ. మయి-నాయందు, యథాపూర్వం- పూర్వమందువలె, క్షుత్పిపాసాదయః-క్షుత్ - ఆకలియు, పిపాసాదయః - దప్పిమొదలగునవియు, దృష్టాఃఇతి

చేత్ - కనబడుచున్నవనియంటివేని, మచ్ఛబ్దవాచ్యే=మచ్ఛబ్ద- నేననెడిశబ్దముచే త, వాచ్యే-చెప్పదగిన, అహంకారే-అహంకారమందు, దృశ్యంతాం- కనబడు గాక. నేతి-కనబడలేదని, కః-ఎవడు, వదేత్ - చెప్పును.

తా. ప్ర. అయితే. నేనిప్పుడు, అద్వైతాత్మస్వరూపవేదినై, అపరో క్షజ్ఞానినైనను, నాయందు, ఆకలిదప్పి మొదలగునవి కనబడుచున్నవి. గనుక, అద్వైతాత్మజ్ఞానము, సర్వదుఃఖములను నివారింపజేయుననియెట్లుచెప్పవచ్చు ను?. ఉ. ఆకలిదప్పి మొదలగునవి, నేననెడిశబ్దముచే జెప్పదగిన అహంకార మందు గనబడుచున్నవో, లేక, నేననెడి శబ్దార్థమునకు ఆధారమగు చిదాత్మ యందు గనబడుచున్నవో జెప్పుము. చిదాత్మ డగు కూటస్థుడు, అసంగుడగుట చేతను, అవిషయుడగుటచేతను, ఆకూటస్థునియందుండునని చెప్పరాదు. గను క, ఆకలిదప్పి మొదలగునవియన్నియు, అహంకారమందే కనబడుచుండును. ఆయహంకారమందు కనబడలేదని యెవ్వడును జెప్పడు,

శ్లో॥ చిద్రూపేపిప్రసజ్యేరం స్తాదాత్మ్యాధ్యాసతోయది।
మాధ్యాసంకురుకింతుత్వం వివేకంకురుసర్వదా॥ ౨౫౦.

టీ. తాదాత్మ్యాధ్యాసతః - అన్యోన్యాధ్యాసమువల్ల, చిద్రూపేపి- కూటస్థాత్మయందును, ప్రసజ్యేరన్ యది - వ్యాపించుచున్నవని యంటివేని, త్వం-నీవు, అధ్యాసం-అధ్యాసమును, మాకురు-చేయకుము. కింతు-మరియేమన గా, సర్వదా-ఎల్లప్పుడును, వివేకం-వివేకమును, అనగా నహంకారాదులకం టె కూటస్థుడన్యుడనెడి జ్ఞానాభ్యాసముననుట. కురు-చేయుము.

తా. ప్ర. అయితే, వాస్తవస్థితిచేత ఆకలిదప్పి మొదలగు దుఃఖములు కూటస్థాత్మయందు లేకపోయినను, అన్యోన్యాధ్యాసరూపభ్రాంతిచేత,ఆకూట స్థునియందును దోచుచుండవాయేమి?. ఉ. అట్లైనయెడల, దేహేంద్రియా దులే నేననెడి అన్యోన్యాధ్యాసమును నీవు చేయవద్దు. మరియేమనగా,అధ్యా సనివృత్తికొరకు, సర్వదా, కూటస్థాత్మ, చిదాభాస దేహేంద్రియాదులకం టె నన్యుడనెడి వివేకరూపజ్ఞానాభ్యాసమును నీవు జేయుచుండుము.

శ్లో॥ ఝుడిత్యధ్యాసఆయాతి దృఢవాసనయేతిచేత్।
ఆవర్తయేద్వివేకంచ దృఢంవాసయితుంసదా॥ ౨౫౧.

టీ. దృఢవాసనయా - దృఢవాసనచేత, ఝుడితి- శీఘ్రముగా, అధ్యా సః-అన్యోన్యాధ్యాసము, ఆయాతిచేత్ - వచ్చుచున్నదంటివేని, దృఢం-దృఢ ముగా, వాసయితుం-నిల్పుటకొరకు, వివేకంచ-వివేకంబును, అనగా గూటస్థు డు చిదాభాసాదికముకంటె నన్యుడనెడి జ్ఞానమనుట. ఆవర్తయేత్- వర్తిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పశేయవలెను.

తా. ప్ర. అయితే, అనాదివాసనావశముచేత మరలమరల అన్యోన్యాధ్యాసము శీఘ్రముగావచ్చుచుండదాయేమి?. ఉ. దృఢవాసనచేత శీఘ్రముగా నధ్యాసము గలిగెడి పక్షమందు, దృఢముగానివసించెడి నిమిత్తమై, సర్వదా వివేకజ్ఞానమును, అభ్యసింపవలెను. అనగా నధ్యాసమును నివర్తింపజేయుటకు, వివేకజ్ఞానముదప్ప, మరియొక ఉపాయము లేదని యభిప్రాయము.

శ్లో॥ వివేకద్వైతమిథ్యాత్వం యుక్త్యైవేతినభణ్యతాం।
అచింత్యరచనాత్వస్యానుభూతిర్హిస్వసాక్షికీ। ౨౩౨.

టీ. వివేకేసతి-వివేకజ్ఞానముగలుగుచుండగా, యుక్త్యైవ- యుక్తిచేతనే, ద్వైతమిథ్యాత్వమితి=ద్వైత-ద్వైతముయొక్క, మిథ్యాత్వమితి- మిథ్యాభావముదోచుచున్నదని, అనగా మిథ్యాలక్షణముదోచుచున్నదనియనుట. నభణ్యతాం-భాషింపకుండువుగాక. అచింత్యరచనాత్వస్య=అచింత్య- చింతింపదగని, రచనాత్వస్య-కల్పనాభావమునకు, అనుభూతిః- అనుభవము, స్వసాక్షికీ=స్వ-తానే, సాక్షికీ- సాక్షిగాగలదగును.

తా. ప్ర. అయితే, విచారణచేత ద్వైతమునకు మాయామయత్వము, యుక్తిచేతనే సిద్ధించుచున్నదిగాని, అనుభవమువల్ల సిద్ధింపలేదు గదా?. ఉ. అచింత్యరచనాస్వభావలక్షణముగల ద్వైతమిథ్యాభావమునకు, అనుభవమే, సాక్షిగా గలిగియున్నది. కనుక, అనుభవముచేత ద్వైతమునకుమాయామయత్వము సిద్ధించలేదని చెప్పరాదు.

శ్లో॥ చిదప్యచింత్యరచనా యదితర్హ్యస్తునోవయం।
చితంసుచింత్యరచనాం బ్రూమోనిత్యత్వకారణాత్॥ ౨౩౩.

టీ. చిదపి-చిత్తును, అనగాకూటస్థాత్మయనుట. అచింత్య రచనాయది- అచింత్య-చింతింపదగని, రచనాయది- కల్పనాస్వరూపముగలదని యంటివేని, తర్హ్యస్తు-సరి, యగుగాక. వయం-మేము, చితం-చిత్తును, నిత్యత్వకారణాత్=నిత్యత్వ-సత్యత్వముయొక్క, కారణాత్-కారణమువల్ల, అనగా సత్యలక్షణము గలిగియుండుటచేతననుట. సుచింత్యరచనాం-సుచింత్య - చింతింపదగిన, రచనాం-కల్పనాస్వరూపమునుగా, బ్రూమః - చెప్పుము.

తా. ప్ర. అయితే, అచింత్య రచనాస్వభావము, మిథ్యాపదార్థలక్షణమనిచెప్పితిరి. ఆ అచింత్యరచనాస్వభావము చిదాత్మయందు వ్యాపింపదాయేమి?. ఉ. సరి, చిత్తు, అచింత్యరచనాస్వరూపముగలదేయగుగాక. అనగా శ్రీ విద్యారణ్యగురుండు అచింత్యరచనాస్వభావము, ప్రాగ్రసథ్యానముతో గూడినద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుచుండగా మిథ్యాభావ లక్షణమగునని చెప్పుట కిచ్ఛయించినవాడై, అచింత్య రచనాస్వభావము నాత్మకు అంగీకరించెనని తెలియవలెను. ప్ర. అయితే, చిత్తు, అచింత్యరచనాస్వరూపము గలదని చెప్పినయెడల, అద్వైతము అపసిద్ధాంతముగాదాయేమి?. ఉ, మేము, చిత్తు, నిత్యమనెడి కారణమువల్ల, చిత్తును అచింత్యరచనా స్వరూపముగలదానినిగా జెప్పము. అనగా, చిత్తునకు నిత్యత్వలక్షణము గలిగియుండెడి కారణమువల్ల, అట్టిచిత్తునకు, అచింత్యరచనాస్వభావము నంగీకరించుటచేత, అపసిద్ధాంతము గానేరదని యభిప్రాయము.

శ్లో॥ ప్రాగభావో నానుభూతశ్చితేర్నిత్యాతతశ్చితిః।
ద్వైతస్య ప్రాగభావస్తు చైతన్యేనానుభూయతే॥ ౧.౮.

టీ. చితేః-ఆత్మకు, ప్రాగభావః-ప్రాగభావము, నానుభూతః- అనుభవింపబడలేదు. తతః-ఆకారణమువల్ల, చితిః- చిత్తు, నిత్యా - సత్యమగును. ద్వైతస్య-ద్వైతమునకు, ప్రాగభావస్తు - ప్రాగభావమో, చైతన్యేన-ఆత్మచేత, అనుభూయతే - అనుభవింపబడుచున్నది.

తా. ప్ర. అయితే, ఏకారణమువల్ల, చిత్తునకునిత్యత్వముగలదో జెప్పుము?. ఉ. ఏకారణముచేత, చిత్తునకు ప్రాగభావము అనుభవింపబడలేదో, ఆకారణముచేత, చిత్తు, నిత్యమని తెలియవలెను. ప్ర. అయితే, చిత్తునకుప్రాగభావమును జెప్పినయెడల, దోషమేమి?. ఉ. చిత్తునకు ప్రాగభావముగలదని చెప్పినయెడల, ఆప్రాగభావము, చిత్తుచేత ననుభవింపబడెనో. లేక, అన్యముచేతననుభవింపబడెనో చెప్పుము. అన్యముచే ననుభవింపబడెనని చెప్పినయెడల, ఆ అన్యమనునది, జడరూపమగుటవల్ల, అనుభవించునది కానేరదు. కనుక, చిత్తు యొక్క ప్రాగభావము అన్యముచే ననుభవింపబడెనని చెప్పరాదు. మరియు, చిత్తుయొక్క ప్రాగభావము, చిత్తుచేతనే అనుభవింపబడెననెడి పక్షమందు, మరియొకచిత్తుచే ననుభవింపబడెనో, లేక తనచేతనే అనుభవింపబడెనో చెప్పుము. మరియొక చిత్తుచే ననుభవింపబడెనని చెప్పెడి పక్షమందు, అద్వైతవాదమందు చిత్తు ఒక్కటియేయగుగాని, మరియొకచిత్తులేదు. కనుక, మరియొకచిత్తుచేత ననుభవింపబడెనని చెప్పరాదు. మరియు, మరియొక చిత్తుగలదని యంగీకరించినయెడల, అది, సిద్ధాంతీకరించబడిన చిత్తును గ్రహించకనే. ఆచిత్తునకు విరోధియగు అభావమును గ్రహింపనేరదు. అనగా, మరియొక చిత్తు అనునది, సిద్ధాంతీకరించబడిన చిత్తునెరిగి, పిమ్మట దానియొక్క అభావము తెలిసెనని చెప్పవలసివచ్చునని యభిప్రాయము. ప్ర. సరి. అట్లు చెప్పుటచేత, దోషమేమి?. ఉ. సిద్ధాంతీకరించబడిన చిత్తు, మరియొక చిత్తు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేత గ్రహించబడెనని చెప్పినయెడల, అసిద్ధాంతీకరింపబడిన చిత్తునకు, ఘటా దికమునకువలె, జడస్వభావము సిద్ధించునేగాని, చిత్స్వభావము సిద్ధింపనేరదు. ప్ర. అది యేమి?. ఉ. చిత్తు, అనుభవరూపముగా నుండునేగాని, అనుభవించబడెడిరూపముగానుండదు. మరియు, ఘటాదిపదార్థములును, అన్నమయాదిపంచకోశములును, చిత్రగు ఆత్మచేత ననుభవింప బడుచుండుటవల్ల, అవియన్నియు జడపదార్థములాయెను. ఆచిత్రగు ఆత్మయు, మరియొక చిత్తుచేత ననుభవింపబడెడిపక్షమందు, ఆ చిత్రగు ఆత్మను జడపదార్థమునుగా చెప్పవలసివచ్చును. కనుక, చిత్తు, మరియొక చిత్తుచేత గ్రహించబడెనని చెప్పరాదు. ప్ర. అయితే, చిత్తుయొక్క అభావము, తనచేతనే గ్రహించబడెననిమైనను జెప్పరాదాయేమి?. ఉ. తనయొక్క అభావము, తనచేతనేగ్రహించబడుటకు శక్యముగాదు. కనుక, చిత్తునకు ప్రాగభావము గలదనెడి విషయమైన అనుభవములేమిచేత, చిత్తునకు ప్రాగభావము లేదనియు, ఆకారణముచేత చిత్తు నిత్యమనియుం దెలియవలెను. ప్ర. అయితే,ద్వైతంబును, ప్రమాతృప్రమాణాది రూపభేదమును గలిగియుండుటచేత, అద్వైతముయొక్క ప్రాగభావము, ద్వైతముచేతనే అనుభవింపబడుటకు శక్యము గామిచేతయు, అద్వైతముయొక్క ప్రాగభావముననుభవింపదగినది మరియొకటి లేమిచేతయు, చైతన్యమువలెనే ద్వైతంబును నిత్యముగాదాయేమి?. ఉ. జాగ్రదాది ద్వైతము, సుషుప్తియందులేనట్లు, సాక్షియగు చిత్తుచేత ననుభవింప బడుచున్నది. ఇట్లు, శ్రు॥ తపసస్సాక్షీ సర్వస్యసాక్షీ॥ అనెడి శ్రుతి జెప్పుచున్నది. కనుక, ద్వైతముయొక్క ప్రాగభావమును అనుభవించునదిలేదని చెప్పరాదు, పూర్వమందులేమి, ప్రాగభావమని చెప్పబడును.

శ్లో॥ ప్రాగభావయుతంద్వైతం రచ్యతేహి ఘటాదివత్।
తథాపిరచనాఽచింత్యా మిథ్యాతేనేంద్రజాలవత్॥ ౨౫.

టీ. ప్రాగభావయుతం= ప్రాగభావ - ప్రాగభావముతోటి, యుతం- కూడిన, ద్వైతం - ద్వైతము, ఘటాదివత్-ఘటాదికమువలె, రచ్యతే-కల్పించబడుచున్నదేను. తథాపి - అట్లు కల్పించబడుచున్నను, రచనా- అద్వైతకల్పనము, అచింత్యా-చింతింపదగనిదగును. అనగా జింతించుటకు శక్యముగానిదనుట, తేన-అట్లు కల్పించబడుచు చింతింపదగని కల్పనాస్వరూపము గలదగుటచేత, ఇంద్రజాలవత్ - ఇంద్రజాలమువలె, అనగా నింద్రజాలాది మాయచే నిర్మింపబడిన మేడమొదలగుదానివలెననుట. మిథ్యా-అసత్యముగును.

తా. ఈ చెప్పినప్రకారముగా, ద్వైతము ప్రాగభావముతో గూడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుండుటవల్ల, ఘటాదికమువలె కల్పించబడుచున్నదేయగును. అట్లు కల్పించబడుచున్నను, అద్వైతముయొక్క కల్పనము, చింతించుటకు శక్యముగానిదగును. మరియు, అట్లు కల్పించబడుచు, చింతించుటకు శక్యముగాని కల్పనాస్వరూపముగలదగుటచేత, ఇంద్రజాలాదిమాయచే నిర్మింపబడిన మేడవలె, మిథ్యయగును అనగా, అచింత్యరచనాస్వభావముగలది, ప్రాగభావముతో గూడుచుండగా, మిథ్యాభావలక్షణవంతమగుటచేత, ద్వైతమునకు మిథ్యాభావము నిస్సంశయముగా సిద్ధించెనని యభిప్రాయము.

శ్లో. చిత్ప్రత్యక్షాతతోఽన్యస్య మిథ్యాత్వంచానుభూయతే।
నాఽద్వైతమపరోక్షం చే త్యేతన్నవ్యాహతంకథం॥ ౨౫౮.

టీ. చిత్-కూటస్థచైతన్యము, ప్రత్యక్షా - ప్రత్యక్షమగును, తతః - ఆకూటస్థచైతన్యముకంటె, అన్యస్య-అన్యమగుద్వైతమునకు, మిథ్యాత్వంచ-మిథ్యాభావము, అనుభూయతే - అనుభవించబడుచున్నది. అద్వైతం- అద్వైతము, అపరోక్షం-ప్రత్యక్షత్వముగలది, నేతి - కాదనెడి, ఏతత్-ఈవాక్యము, కథం-ఎట్లు, నవ్యాహతం-విరోధత్వమునుబొందదు. అనగావిరోధమగుననుట.

తా. ఈపూర్వము, చిద్రూపముచే ప్రకాశించుచుండుటవల్ల, అట్టిస్వప్రకాశత్వముచేత, చిత్తు, నిత్యమనియు, అపరోక్షముగా ప్రకాశించుచున్నదనియు, మరియు, చిత్తుకంటె అన్యమగు ద్వైతముయొక్క మిథ్యాభావము ఆచిత్తుచేతనే అనుభవింపబడుచున్నదనియుం జూపబడెను. ఇట్లు, అద్వైతము ప్రత్యక్షత్వముచేత ప్రకాశించుచుండగా, అద్వైతము ప్రత్యక్షముగా దోచలేదనెడివాక్యము, విరోధమేయగునని యభిప్రాయము.

అవ. ఇప్పుడు పూర్వవాది జేసెడి ప్రశ్నమునకు ప్రతిబందీ పూర్వకముగా ప్రత్యుత్తరమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఇత్థంజ్ఞాత్వాప్యసంతుష్టాః కేచిత్కుత ఇతీర్యతాం।
చార్వాకాదేఃప్రబుద్ధస్యా ప్యాత్మాదేహఃకుతోవద॥ ౨౫౯.

టీ. ఇత్థం-ఈప్రకారముగా, కేచిత్-కొందరు, జ్ఞాత్వాపి - వేదాంతార్థము నెరిగియు, కుతః-ఎందువల్ల, అసంతుష్టాః- సంతోషమునుబొందరో, ఈర్యతామితి- చెప్పబడుగాకయనియంటివేని, ప్రబుద్ధస్య - ఊహాపోహకుశలుడగు, చార్వాకాదేరపి-చార్వాక-చార్వాకునకును, ఆదేరపి- పామరునకును, దేహః-స్థూలశరీరము, ఆత్మా-ఆత్మయగుట, కుతః-ఎందువల్లనో,వద-చెప్పుము.

తా. ప్ర. అయితే, కొందరుపురుషులు, ఈప్రకారము వేదాంతార్థము నెరిగినను, అట్టిపురుషులకు ఈవేదాంతసిద్ధాంతమందు విశ్వాసము కలుగని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కికారణమేమి?. ఊహాపోహకుశలుడగు చార్వాక పామరాదిజనమునకు, దేహమే, ఆత్మగాదోచుటకు కారణమేమో జెప్పుము. ఇట్లు ప్రత్యుత్తరమును జెప్పుటయే, ప్రతిబంది, యని చెప్పబడును. అనగా, సమగ్రమైన వేదాంతార్థ విచారణములేమిచేనని దెలుపదలచి, ఇట్లు ప్రతిబందీ పూర్వకముగా సిద్ధాంతి ప్రత్యుత్తరమును జెప్పెనని దెలియవలెను.

అవ. ఇప్పుడు. పూర్వవాది, ప్రతిబందీమోచనమును శంకించగా, అందుకుదగిన సమాధానమును సిద్ధాంతి జెప్పుచున్నాడు.

శ్లో॥ సమ్యగ్విచారోనాస్త్యస్య ధీదోషాదితిచేత్తథా।
అసంతుష్టాస్తుశాస్త్రార్థం నత్వైక్షంతవిశేషతః॥ ౨౪౭.

టీ. అస్య-ఈచార్వాకాది జనమునకు, ధీదోషాత్- చిత్తదోషమువల్ల, సమ్యక్-లెస్సగా, విచారః-వేదాంతార్థవిచారము, నా స్తీతిచేత్- లేదంటివేని, అసంతుష్టాస్తు-వేదాంతార్థము నెరిగి సంతోషింపనివారో, విశేషతః - విశేషముగా, శాస్త్రార్థం-వేదాంతార్థమును, నత్వైక్షంత - చూచినవారుగారు. అనగా వేదాంతార్థవిచారమును సమగ్రముగా జేసినవారు కారనుట.

తా. ప్ర, అయితే, ఆచార్వాకాదిజనునకు, చిత్తదోషమువల్ల, వేదాంతార్థవిచారణము లేమిచేత, దేహమే, ఆత్మగా దోచెనని చెప్పరాదాయేమి?. ఉ. సరి. ఆప్రకారమే, వేదాంతార్థము నెరిగి విశ్వసింపని జనులును, వేదాంతశాస్త్రార్థమును సమగ్రముగా నెరుగరని తెలిసికొనుము.

అవ. ఇట్లు పరతత్వమును విచారించి, ఆవిచారజన్య తత్వజ్ఞానఫలమును విచారించుటకు, ఆ తత్వజ్ఞానఫలమును ప్రతిపాదించెడి, శ్రుతి నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ యదాసర్వే ప్రముచ్యంతే కామాయేఽస్యహృదిశ్రితాః।
ఇతిశ్రౌతంఫలందృష్టం నేతిచేద్దృష్టమేవతత్॥ ౨౪౮.

టీ. అస్య-ఈమనుష్యునియొక్క, హృది- హృదయమందు, శ్రితాః-ఆశ్రయించిన, యే-ఏ, కామాః-ఇచ్ఛాదులుగలవో, (తే) ఆ, సర్వే- ఇచ్ఛాదులన్నియు, యదా-ఏకాలమందు, ప్రముచ్యంతే-విడువబడుచున్నవో అప్పుడుమరణశీలపురుషు డమృతమును బొందుచున్నాడని శ్రుతి జెప్పుచున్నది. ఇతి- ఈచెప్పబడిన, శ్రౌతం-శ్రుతిప్రోక్తమగు, ఫలం-తత్వజ్ఞానఫలము, దృష్టం-ప్రత్యక్షత్వమును బొందినది, నేతిచేత్-కాదనియంటివేని, తత్-ఆతత్వజ్ఞానఫలము, దృష్టమేవ-ప్రత్యక్షత్వమును బొందినదే యగును. అనగా ననుభవ సిద్ధత్వమును బొందినదే యగుననుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఈముముక్షువుయొక్క హృదయమందు, తాదాత్మ్యాధ్యాసమే, మూలముగాఁగల, ఏ ఇచ్ఛాదులుగలవో, ఆయిచ్ఛాదులన్నియు, ఏకాలమందు తత్వజ్ఞానముచేత అధ్యాసము నివృత్తినిబొందుచుండఁగా, నివృత్తిని బొందుచున్నవో, అప్పుడే, పూర్వము దేహతాదాత్మ్యాధ్యాసముచేత మరణశీలుఁడగు పురుషుఁడు, అధ్యాసము లేమిచేత అమృతవంతుఁడగుచు, ఈదేహమందే, సత్యజ్ఞానానందస్వరూపబ్రహ్మమును బొందుచున్నాఁడని, శ్రు॥ యదాసర్వేప్రముచ్యంతేకామాయేఽస్యహృదిశ్రితాః । అథమర్త్యోఽమృతోభవత్యత్ర బ్రహ్మసమశ్నుతే॥ ఈశ్రుతిచెప్పుచున్నది. ప్ర. అయితే, ఈశ్రుతిచేత ప్రతిపాదింపబడిన కామనివృత్త్యాదిలక్షణముగల ఫలము, శాస్త్రప్రసిద్ధమేగాని, అనుభవసిద్ధముకాదుగదా? ఉ. ఆతత్వజ్ఞానఫలము, అనుభవసిద్ధముగా నున్నట్లు, సమనంతరశ్రుతివాక్యతాత్పర్య పర్యాలోచనముచేత తెలియబడుచున్నది. కనుక, అనుభవసిద్ధముగా లేదని చెప్పరాదు.

అవ. ఆ తత్వజ్ఞానఫలముయొక్క అనుభవసిద్ధత్వమును స్పష్టీకరించుటకొరకు, ఆశ్రుతివాక్యము నుదాహరించి, ఆవాక్యార్థమును జెప్పుచున్నాఁడు.

శ్లో॥ యదాసర్వేప్రభిద్యంతే హృదయగ్రంథయస్త్వితి।
కామాగ్రంథిస్వరూపేణ వ్యాఖ్యాతావాక్యశేషతః॥ ౨౬౦.

టీ. యదా-ఏకాలమందు, సర్వే-సకలములైన, హృదయగ్రంథయస్తు-హృదయగ్రంథులు, ప్రభిద్యంతేతి- భేదింపబడుచున్నవోయని చెప్పెడి, వాక్యశేషతః-వాక్యశేషమువల్ల, కామాః-కామములు, గ్రంథిస్వరూపేణ- గ్రంథిస్వరూపముగా, వ్యాఖ్యాతాః - వ్యాఖ్యానము జేయబడెను.

తా. ఏజ్ఞాననిష్ఠాకాలమందు సకల హృదయ గ్రంథులును, భేదింపబడుచున్నవోయని, శ్రు॥ యదాసర్వేప్రభిద్యంతే హృదయగ్రంథయస్త్వితి॥ అనెడి వాక్యశేషమువల్ల, కామములన్నియు గ్రంథిభేదముగా వ్యాఖ్యానము జేయబడెను. మరియు, అహంకారప్రత్యగాత్మలకుగల అన్యోన్యాధ్యాసము నివర్తించుటయే, గ్రంథినాశమనెడి యర్థము, అనుభవసిద్ధమైయున్నది. కనుక, తత్వజ్ఞానముచేత కామనివృత్త్యాదిలక్షణముగల ఫలము గలుగుచున్నదనెడి విషయము, ప్రత్యక్షమేయగును.

శ్లో॥ అహంకారచిదాత్మానా వేకీకృత్యావివేకతః।
ఇదంమేస్యాదిదంమేస్యా దితీచ్ఛాః కామశబ్దితాః॥ ౧౬౧.

టీ. అవివేకతః - అవివేకమువల్ల, అహంకారచిదాత్మనౌ - అహంకారకూటస్థాత్మలనురెంటిని, ఏకీకృత్య-ఐక్యముజేసి, ఇదం-ఇది, మే-నాకు, స్యాత్-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అగును. అనగా కావలెననుట, ఇదం-ఇది, మే-నాకు, స్యాదితి - అగుననెడి. ఇచ్ఛాః-ఇచ్ఛలు, కామశబ్దితాః-కామశబ్దముచేత జెప్పదగినవగును.

తా. ప్ర. అయితే, లోకమందు కామశబ్దముచేత ఇచ్ఛాభేదమే జెప్పబడుచుండగా, పూర్వోక్తవాక్యశేషమందు గ్రంధిస్వరూపముగా వ్యాఖ్యానమెట్లు జేయబడెను?. ఉ. అహంకార ప్రత్యగాత్మలను రెంటిని, అవివేకతవల్ల నైక్యముచేసి, యిదినాది, యిదినాది, యనెడి యిచ్ఛావిశేషములు, కామశబ్దముచే జెప్పఁబడుచున్నవి. అనగానధ్యాసమూలముగల, యిచ్ఛావిశేషమే కామశబ్దముచే జెప్పబడునుగాని, కేవలమగు యిచ్ఛామాత్రము, కామశబ్దముచే జెప్పబడదని యభిప్రాయము.

శ్లో॥ అప్రవేశ్యచిదాత్మానం పృథక్పశ్యన్నహంకృతిం।
ఇచ్ఛంస్తుకోటివస్తూనినబాధోగ్రంధిభేదతః॥ ౨౬౬.

టీ. చిదాత్మానం - ప్రత్యగాత్మను, అప్రవేశ్య - అహంకారమందు ప్రవేశింపజేయక, అహంకృతిం - అహంకారమును, పృథక్ - భిన్నముగా, పశ్యన్-చూచుచు, కోటివస్తూని- కోటివస్తువులను, అనగామితిలేని విషయములననుట. ఇచ్ఛన్ - ఇచ్ఛయించినవాడైనను, గ్రంధిభేదతః = గ్రంధి- హృదయగ్రంధియొక్క, భేదతః-లేమివల్ల, అనగా హృదయగ్రంధి నశించుటచేననుట. నబాధః-బాధలేదు.

తా. ప్ర. అయితే, అధ్యాసమూలముగల కామమే విడువదగినదైనయెడల, అధ్యాసములేనికామము గ్రహింపదగినదికాదాయేమి?. ఉ. ప్రత్యగాత్మనహంకారమందు తాదాత్మ్యాధ్యాసముచే బ్రవేశింపజేసి మరుగుపరచక, అహంకారమును బుద్ధిచేత భిన్నముగా జూచుచు, కోటివస్తువులను కోరినవాడైనను, అట్టివానికి గ్రంధిలేమిచేత, బాధలేదు గనుక, అధ్యాసము లేనికామమును గ్రహించుటచేత బాధలేమివల్ల, అట్టి యిచ్ఛను గ్రహింపవచ్చునని యభిప్రాయము.

శ్లో॥ గ్రంధిభేదేపిసంభావ్యా ఇచ్ఛాఃప్రారబ్ధదోషతః।
బుధ్వాపిపాపబాహుళ్యాదసంతోషోయథాతవ॥ ౨౬౩.

టీ. బుధ్వాపి-వేదాంతార్థమునెరిగినను, పాపబాహుళ్యాత్=పాప-పాపకర్మనుయొక్క, బాహుళ్యాత్-ఆధిక్యతవల్ల, తవ-నీకు, యథా. ఏప్రకారము, అసంతోషః-సంతోషములేదో, అనగావిశ్వాసములేదోయనుట. (తథా) ఆప్రకారము, గ్రంధిభేదేపి=గ్రంధి- హృదయగ్రంధికి, భేదేపి-నాశముగలిగినను, ప్రారబ్ధదోషతః= ప్రారబ్ధ- ప్రారబ్ధకర్మముయొక్క, దోషతః- దోషము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వల్ల, ఇచ్ఛాః-ఇచ్ఛలు, సంభావ్యాః - సంభవింపదగినవగును.

తా. ప్ర. ఆయితే, అధ్యాసము లేకపోవుచుండగా, ఇచ్ఛలు గలుగవుగ దా?. ఉ. నీవు వేదాంతార్థము నెరిగినను, పాపాధిక్యతచేత నీకు సిద్ధాంతమం దు విశ్వాసముగలుగనట్లు, హృదయగ్రంథిభేధింపబడినను, ప్రారబ్ధదోషము చేత జ్ఞానికి, ఇచ్ఛలు బుట్టుచున్నవి.

అవ. అధ్యాసము లేకపోవుచుండగా, అహంకారమందుగల ఇచ్ఛాదిక ముచేత, బాధలేదని, యిప్పుడు రెండు దృష్టాంతములచేత విశదీకరించుచు న్నాడు.

శ్లో॥ అహంకారగతేచ్ఛాద్యైర్దేహవ్యాధ్యాదిభిస్తథా।
వృక్షాదిజన్మనాశైర్వా చిద్రూపాత్మనికింభవేత్॥ ౨౬౪.

టీ. అహంకారగతేచ్ఛాద్యైః= అహంకార-అహంకారమును, గత-పొందిన, ఇచ్ఛాద్యైః-ఇచ్ఛాదులచేతను, దేహవ్యాధ్యాదిభిః = దేహ-దేహము నుపొందియుండెడి, వ్యాధ్యాదిభిః-రోగాదులచేతను, తథా - అప్రకారము, వృక్షాదిజన్మనాశైర్వా = వృక్షాది - వృక్షాదులయొక్క, జన్మ-జననముచేతను, నాశైర్వా-నాశనములచేనైనను, చిద్రూపాత్మని=చిత్-జ్ఞానమే, రూప- స్వరూ పముగాగల, ఆత్మని- కూటస్థునియందు, కింభవేత్ - లాభనష్టమేమి. అనగా హానివృద్ధులులేవనుట.

తా. అహంకారసాక్షియగు కూటస్థునకు దేహసంబంధము లేమివల్ల, దే హమునుబొందియుండెడి రోగాదులచేత, ఆకూటస్థునకు బాధలేనట్లును, వృ క్షాదులయొక్క ఉత్పత్తి వినాశములచేత కూటస్థునకు వృద్ధిహానులు లేనట్లును, అధ్యాసమునివర్తించుచుండగా, అహంకారమును బొందియుండెడి యిచ్ఛాదు లచేతయు, చిద్రూపుడగు కూటస్థునకు బాధలేదని యభిప్రాయము.

శ్లో॥ గ్రంథిభేదాత్పురాప్యేవ మితిచేత్తన్నవిస్మర।
అయమేవగ్రంథిభేద స్తవతేనకృతీభవాన్॥ ౨౬౫.

టీ. పురాపి-పూర్వమందును, అనగా నాయనివేకదశయందనుట. గ్రం థిభేదాత్= గ్రంథి- హృదయగ్రంథికంటె, భేదాత్-కూటస్థునూపము భిన్నము గానుండుటవల్ల, ఏవమితిచేత్-. ఈప్రకారమేననియంటివేని, అనగా నిప్పుడు వివేకదశయందువలెనే, అవివేక దశయందును కూటస్థుడసంగుడని యంటివేని యనుట. తత్-దానిని, అనగా బూర్వస్థితినను. నవిస్మర - స్మరింపకుము. అయమేవ-సర్వదా కూటస్థుడసంగుడనెడి యివ్విధబోధయే, తవ- నీయొక్క, గ్రంథిభేదః= గ్రంథి-హృదయగ్రంథిని, భేదః - భేదించునదియగును. తేన-అట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బోధచేత, భవాన్-నీవు, కృతీ-కృతార్థుడవైతివి.

తా. ప్ర. అయితే, అసంగుడైన చిదాత్మునకు ఏకరూపత్వము గలిగియుండుటచేత, పూర్వమందును కామాదులవల్ల బాధలేదుగదా?. ఉ. ఇట్టిబోధయే, హృదయగ్రంథిని నశింపజేయునదియగునని మేము జెప్పుటవల్ల, ఈచోద్యము మాకుఅనుకూలమేయగును. మరియు. ఆబోధచేత నీవు కృతార్థుడవైతివి. కనుక, పూర్వస్థితినికను స్మరింపకుము.

శ్లో॥ నైవంజానంతిమూఢాశ్చే త్సోయంగ్రంథిర్నచాపరః।
గ్రంథితచ్ఛేదమాత్రేణ వైషమ్యంమూఢబుద్ధయోః॥ ౨౬౬.

టీ. ఏవం - ఈప్రకారము, మూఢాః-మూఢులు; నజానంతిచేత్-ఎరుగరనియంటివేని, సః-ఆ, గ్రంథిః-హృదయగ్రంథి, అయం - ఇదియేయగును. అపరః-మరియొకటి, నచ- గ్రంథికాదు. మూఢబుద్ధయోః = మూఢ-మూఢునకును, బుద్ధయోః-జ్ఞానికిని, గ్రంథితచ్ఛేదమాత్రేణ=గ్రంథి - గ్రంథిస్థితిమాత్రముచేతను, తత్-ఆగ్రంథియొక్క, ఛేదమాత్రేణ - అభావమాత్రముచేతను, వైషమ్యం - భేదమగును.

తా. ప్ర. అయితే, యిట్లు, మూఢులెరుగరేమి?. ఉ. ఈవిధమైనజ్ఞానములేమియే, హృదయగ్రంథియగుగాని, మరియొకటి హృదయగ్రంథికాదు. ప్ర. అయితే; జ్ఞానికిని, ఇచ్ఛనంగీకరించినయెడల, జ్ఞానికిని, అజ్ఞానికిని భేదమేమి?. ఉ. గ్రంథిస్థితిమాత్రముచేతను, గ్రంథిశూన్య మాత్రముచేతను, అజ్ఞానిజ్ఞానులకు భేదముగలిగియున్నదేగాని, మరియొకభేదములేదు.

అవ. అజ్ఞానిజ్ఞానులకు మరియొకభేదకారణములేదని, యిప్పుడు విశదీకరించుచున్నాడు.

శ్లో॥ ప్రవృత్తౌవానివృత్తౌవా దేహేంద్రియమనోధియాం।
నకించిదపివైషమ్యమ స్త్యజ్ఞానివిబుద్ధయోః॥ ౨౬౭.

టీ. ప్రవృత్తౌవా - కర్మములనుజేయుటయందుగాని, నివృత్తౌవా- కర్మములను జేయకుండుటయందుగాని, అజ్ఞానివిబుద్ధయోః - అజ్ఞాని-అజ్ఞానియొక్కయు, విబుద్ధయోః-జ్ఞానియొక్కయు, దేహేంద్రియమనోధియాం- దేహేంద్రియమనోబుద్ధులలో, కించిదపి- కొంచెమైనను, వైషమ్యం-భేదము, నాస్తి-లేదు.

తా. కర్మములనుజేయుటయందుగాని, కర్మములను జేయకుండుటయందుగాని, అజ్ఞానిజ్ఞానులయొక్క దేహేంద్రియమనోబుద్ధులలో భేదముకొంచెమైననులేదు.

అవ. ఈచెప్పబడినయర్థమును దృష్టాంతమును జెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ వ్రాత్యశ్రోత్రియయోర్వేద పాఠాపాఠకృతాభిదా।
నాహారాదావస్తిభేద స్సోఽయంన్యాయోఽత్రయోజ్యతాం॥ ౧౬౮.

టీ. వ్రాత్యశ్రోత్రియయోః=వ్రాత్య-ఉపనయనాది సంస్కారములేని బ్రాహ్మణునకును, శ్రోత్రియయోః - వేదమునుజదివిన బ్రాహ్మణునకును, వేద పాఠాపాఠకృతా=వేదపాఠ-వేదపాఠమును జేయుటచేతను, అపాఠకృతా-వేద పాఠమును జేయమిచేతను, భిదా-భేదమగును. ఆహారాదౌ- ఆహారభక్షణాదికా ర్యమందు, భేదః-భేదము; నాస్తి-లేదు. సోఽయం-ఆయీ, న్యాయః - న్యాయ ము, అత్ర-ఇక్కడ, అనగానజ్ఞానిజ్ఞానులయందు యోజ్యతాం- యుక్తమగుగా క. అనగా గూర్చవలెననుట.

తా. వ్రాత్యశ్రోత్రియులకు వేదమునుజదువమియందును వేదమునుజ దువుటయందును భేదముగలిగియున్నదేగాని, ఆహారభక్షణాది కార్యమును జే యుటయందు భేదములేదు. ఆప్రకారమే, అజ్ఞానిజ్ఞానులకును, హృదయగ్రం థిభావాభావములచేత భేదముగలిగియున్నదేగాని, మరియొక విధమైన భేదము లేదని యభిప్రాయము.

అవ. జ్ఞానికి గ్రంథిశూన్యత్వవిషయమై, గీతావాక్యమును ప్రమాణ ముగా నిప్పడు పఠించుచున్నాడు.

శ్లో॥ నద్వేష్టిసంప్రవృత్తాని ననివృత్తానికాంక్షతి॥
ఉదాసీనవదాసీన ఇతి గ్రంథిభిదోచ్యతే॥ ౧౬౯.

టీ. సంప్రవృత్తానిసంతి - దుఃఖములు ప్రాప్తించుచుండగా, నద్వేష్టి- జ్ఞానవంతుడు ద్వేషమునుబొందడు. నివృత్తానిసంతి-సుఖములు నివర్తించుచుం డగా, నకాంక్షతి-అపేక్షనుబొందడు. ఉదాసీనవత్- ఏమియునక్కరలేనివానివ లె, ఆసీనః-ప్రవర్తించుచుండును. ఇతి-ఈప్రకారము, గ్రంథిభిదా = గ్రంథి- జ్ఞానికిహృదయగ్రంథియొక్క, భిదా-శూన్యత్వము, ఉచ్యతే- చెప్పబడెను.

తా. మరియు, దుఃఖములు ప్రాప్తించుచుండగా, జ్ఞానవంతుడు ద్వేష మునుబొందడనియు, సుఖములునివర్తించుచుండగా, అపేక్షింపడనియు, మరి యేమనగా, జ్ఞానియగువాడు, ఏమియు నక్కరలేనివానివలె ప్రవర్తించుచున్నా డని, యిట్లు, శ్రీభగవద్గీతయందు, జ్ఞానికిహృదయగ్రంథి శూన్యత్వము చెప్ప బడెను.

శ్లో॥ ఔదాసీన్యంవిధేయం చేద్వచ్ఛబ్దైర్వ్యర్థతామియాత్।
నశక్తాఅస్యదేహాద్యా ఇతిచేద్రోగఏవసః॥ ౧౭౦.

టీ. ఔదాసీన్యం - ఉదాసీనసంబంధముయిన; విధేయంచేత్ - విధిపర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంటివేని, వచ్చుఃఽ-వలెనసెడిపదము, వ్యర్థతాం-నిరర్థకత్వమును, ఇయాత్-పొందును. అస్య-ఈజ్ఞానియొక్క, దేహాద్యాః-దేహేంద్రియాదులు, శక్తాః-శక్తివంతములు, నేతిచేత్-కావనియంటివేని, సః-అది, రోగఏవ - వ్యాధియే యగును.

తా. ప్ర. అయితే, ఈభగవద్వాక్యము, ఔదాసీన్యవిధి పరమేయగు ననియు, గ్రంథిశూన్యత్వమందు ప్రమాణము గాదనియుం జెప్పరాదాయేమి?. ఉ. ఈవాక్యము ఔదాసీన్యవిధిపరమేనని జెప్పినయెడల, ఉదాసీనునివలెననిచెప్పబడుటచేత, వలెనసెడిపదము వ్యర్థమగును. కనుక, ఔదాసీన్యవిధి పరము గాదనియు, జ్ఞానికి గ్రంథిశూన్యత్వమందు ప్రమాణపనియుం దెలియవలెను. ప్ర. అయితే, జ్ఞానియొక్క దేహేంద్రియాదులు బలహీనములగుటచేత, కార్యములను జేయుటకు శక్తివంతములుగావనియు, గ్రంథిశూన్యత్వముచేతగాదనియుంజెప్పరాదాయేమి?. ఉ. జ్ఞానియొక్క దేహేంద్రియాదులు అశక్తములగుటచేత కార్యములనుజేయజాలనియెడల, అది క్షయవ్యాధియేయగును. అట్లుచెప్పరామిచేత జ్ఞానికి గ్రంథిలేమివల్లనే, అతని దేహేంద్రియాదులు కార్యములయందు విక్షేపముగా బ్రవర్తించలేదని తెలియవలెను.

అవ. ఇప్పుడు. సిద్ధాంతి, పూర్వవాదిని పరిహాసము జేయుచున్నాడు.

శ్లో॥ తత్త్వబోధంక్షయవ్యాధిం మన్యంతేయేమహాధియః।
తేషాంప్రజ్ఞాతివిశదా కింతేషాందుశ్శకంవద॥ ౨౭౧.

టీ. మహాధియః - మహాబుద్ధిమంతులగు, యే - ఏజనులు, తత్త్వబోధం=తత్త్వ-జీవబ్రహ్మైక్యలక్షణముయొక్క, బోధం-జ్ఞానమును, క్షయవ్యాధిం-క్షయవ్యాధినిగా, మన్యంతే-తలచుచున్నారో. తేషాం - అట్టిజనులయొక్క, ప్రజ్ఞా-బుద్ధి, అతివిశదా-మిగులనిర్మలమైనదగును. తేషాం - అట్టిజనులకు, దుశ్శకం-అసాధ్యము, కిం-ఏదియో, వద-చెప్పుము.

తా. ప్ర. అయితే, జ్ఞానియొక్క దేహేంద్రియాదులు, క్షయవ్యాధిచేత, అశక్తములాయెనని చెప్పిన యెడల దోషమేమి?. ఉ. తత్త్వజ్ఞానమును క్షయవ్యాధినిగా, ఏమహాబుద్ధిమంతులు తలచెదరో, అట్టిజనులయొక్క ప్రజ్ఞ మిక్కిలినిర్మలమైనదగును. అట్టిజనులకు అసాధ్యమేద్దియులేదు. అనగా బ్రహ్మజ్ఞానమును క్షయరోగమునుగాదలచెడి, నీవంటివారినిజూచి, అందరును, ఎగతాళిచేసి, నవ్వుదురని యభిప్రాయము.

శ్లో॥ భరతాదేరప్రవృత్తిఃపురాణోక్తేతిచేత్తదా।
జక్షన్క్రీడన్రతంవిందన్నిత్యశ్రూయతేకింనుతత్॥ ౨౭౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. భరతాదేః-జడభరతుడు మొదలగు జ్ఞానిజనమునకు, అప్రవృత్తిః- కార్యములయందునివ గనము, పురాణోక్తేరితిచేత్- పురాణములయందు జెప్పబ డెననియంటివేని, తదా-అప్పుడు, జక్షన్-జ్ఞానియగువాడు భక్షించుచు, క్రీడన్- స్వేచ్ఛచేతనిహరించుచు, రతిం-స్త్రీబాలాదులతోటిరతిని, విందన్నితి-పొందుచు ఈశరీరమును తలచడని చెప్పెడి, శ్రుతిం-శ్రుతిని, నాశ్రౌషీఃకిం- వినవాయేమి.

తా. ప్ర. అయితే, జడభరతాదిజ్ఞానులకు కార్యములయందు ప్రవర్త నములేదని, పురాణములయందు జెప్పబడియుండగా, నన్నుమీరిట్లు పరిహాస ము జేయుట, యుక్తమెట్లగును?. ఉ. జ్ఞాని, భక్షించుచున్నను, స్వేచ్ఛచేతనిహ రించుచున్నను, స్త్రీబాలాదులతోటి, శ్రీకృష్ణజనకప్రహ్లాదాదులవలె రమించు చున్నను, జనులసమీపమందు వర్తించుచున్నను, ఈశరీరమును స్మరింపడని, శ్రు॥ జక్షన్ క్రీడన్ రమమాణస్త్రీభిర్వాయానైర్వాజ్ఞానిభిర్వావయస్యైర్వా నోపజనంస్మరన్నిదంశరీరం॥ ఇట్లుచెప్పెడి, శ్రుతినినీవువినక, ఈ చోద్యమును చేసితివి. అనగా, ఈశ్రుతిని నీవు వినినయెడల, ఇట్టిచోద్యములను జేయవనియ భిప్రాయము.

శ్లో॥ నహ్యాహారాదిసంత్యజ్య భరతాద్యాస్థితాఃక్వచిత్।
కాష్ఠపాషాణవత్కింతు సంగభీతాఉదాసతే॥ ౨౭౩.

టీ. భరతాద్యాః-జడభరతుడు మొదలగువారు, క్వచిత్ - ఎప్పుడును, ఆహారాది-ఆహారనిద్రాదికమును, సంత్యజ్య-విడిపించి, కాష్ఠపాషాణవత్=కా ష్ఠ-కొయ్యలవలెను, పాషాణవత్-శిలలవలెను, నహిస్థితాః- స్థితినిబొందినవారు గారు. కింతు-మరియేమనగా, సంగభీతాస్సంతః=సంగ - సంసారసంగమున కు, భీతాస్సంతః- భయమును బొందినవారగుచు, ఉదాసతే-ఉదాసీనత్వమును బొందిరి. అనగానేమియు నక్కరలేనివానివలె ప్రవర్తించిరనుట.

తా. ప్ర. అయితే, పురాణమునకుగతియేమి?. ఉ. జడభరతాదిజ్ఞాను లెప్పుడైనను, ఆహారనిద్రాదికమును విడిపించి, కొయ్యలవలెను, బండలవలెను స్థితినిబొందియుండలేదు. మరియేమనగా, సంసారసంగమునకు భయపడినవా రగుచు, ఉదాసీనత్వమునుబొందిరి. అనగా బురాణంబును, జ్ఞానికి ఉదాసీనత్వ ముగలదని బోధించుచున్నదేగాని, కార్యములయందు ప్రవర్తనములేదని, బో ధించలేదని తెలియవలెను.

శ్లో॥ సంగీహిబాధ్యతేలోకైర్నిస్సంగస్సుఖమశ్నుతే।
తేనసంగఃపరిత్యాజ్య స్సర్వదాసుఖమిచ్ఛతా॥ ౨౭౪.

టీ. సంగీ-విషయాసక్తిగలవాడు, లోకైః- జనులచేత, బాధ్యతే- బా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధింపబడుచున్నాడు. నిస్సంగః-విషయాసక్తిలేనివాడు, సుఖం-సౌఖ్యమును, అశ్నుతే-పొందుచున్నాడు. తేన - ఆకారణముచేత, సర్వదా-ఎల్లప్పుడును, సుఖం-సౌఖ్యమును, ఇచ్ఛతా-కోరెడివానిచేత, సంగః-విషయాసక్తి, పరిత్యాజ్యః - విడువదగినదగును.

తా. ప్ర. అయితే, సంగమునెందుకు విడువవలెనో జెప్పుము? ఉ. సంగముగలవాడు, జనులచేతబాధింపబడును. సంగములేనివాడు, సుఖమునుబొందును. గనుక, సర్వదాసుఖమునుగోరెడివాడు, సంగమునువిడువవలెను. విషయాసక్తియే సంగమగునని తెలియవలెను.

శ్లో॥ అజ్ఞాత్వాశాస్త్రహృదయం మూఢోవక్త్యన్యథాన్యథా।
మూర్ఖాణాంనిర్ణయస్త్వాస్తా మస్మత్సిద్ధాంతఉచ్యతే॥ ౨౭౫.

టీ. మూఢః-మూఢుడు శాస్త్రహృదయం = శాస్త్ర - శాస్త్రముయొక్క, హృదయం-అభిప్రాయమును, అజ్ఞాత్వా-ఎరుగక, అన్యథాన్యథా-నానావిధముగా, వక్తి-చెప్పుచున్నాడు. అనగా జెప్పుననుట. మూర్ఖాణాం- మూఢులయొక్క, నిర్ణయః-నిశ్చయము, ఆస్తాం- అట్లుండుగాక. అస్మత్సిద్ధాంతః = అస్మత్-మాయొక్క, సిద్ధాంతః - సిద్ధాంతము, అనగా శాస్త్రహృదయమనుట. ఉచ్యతే - చెప్పబడుచున్నది.

తా. ప్ర. అయితే, మానససంగమునే విడువవలసినయెడల, మానససంగత్వములేక, బాహ్యమందు వ్యవహరించెడివారికి అజ్ఞత్వాదులు గలవని, జనులచేనిందింపబడుటకు గారణమేమి?. ఉ. మూఢజనులు శాస్త్రహృదయమునెరుగక, వెవ్వేరువిధముగాజెప్పుదురు. కనుక, మూఢులయొక్క నిశ్చయమునట్లుండనిమ్ము. అనగా మూఢులయొక్క నిర్ణయ మిక్కడ విచారింప దగినది గాదని యభిప్రాయము. ప్ర. అయితే, ఎద్ది, అను సంధానము జేయదగినదో జెప్పుము?. ఉ. శాస్త్రహృదయమైన మాయద్వైత సిద్ధాంతము చెప్పబడును. కనుక, మాసిద్ధాంతమును తెలిసికొని, అనుష్ఠింపవలెను.

శ్లో॥ వైరాగ్యబోధోపరమా స్సహాయాస్తేపరస్పరం।
ప్రాయేణసహావర్తంతేవియుజ్యంతే క్వచిత్క్వచిత్॥ ౨౭౬.

టీ. వైరాగ్యబోధోపరమాః=వైరాగ్య-విరక్తియు, బోధ - జ్ఞానంబును, ఉపరమాః- ఉపరతియు, తే-అవిమూడును, పరస్పరం- అన్యోన్యముగా, సహాయాః-సహాయములగును. ప్రాయేణ - సాధారణముగా, సహావర్తంతే - అవిమూడును కూడి వర్తించుచుండును. క్వచిత్క్వచిత్ - ఒకానొకపురుషునియందొకానొకటి, వియుజ్యంతే-వియోగమును బొందుచున్నవి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే, మీసిద్ధాంతమేమి? ఉ. ౧. వైరాగ్యము. ౨. బోధ, ౩. ఉపరతి, ఈమూడును అన్యోన్యసహాయముగానుండును. ఈమూడును, సాధారణముగా; ఒకపురుషునియందుగూడి వర్తించుచుండును. మరియు, ఈమూటిలో నొకటియైనను రెండైనను, ఒకానొకపురుషునియందు లేకపోవుటయుం గలదు.

శ్లో॥ హేతుస్స్వరూపకార్యాణి భిన్నాన్యేషామసంకరః।
యథావదవగంతవ్యశ్శాస్త్రార్థం ప్రవివిచ్యతా॥ ౨౭౭.

టీ. ఏషాం-ఈమూటియొక్క, హేతుస్స్వరూపకార్యాణి = హేతుః-హేతువును, స్వరూప-స్వరూపంబును, కార్యాణి-కార్యంబును, భిన్నాని-భిన్నముగానున్నవి. శాస్త్రార్థం-శాస్త్రార్థమును, ప్రవివిచ్యతా- విభజించి యెరిగెడివానిచేత, యథావత్- వాస్తవముగా, అనగా నున్నదున్నట్లుగాననుట. అసంకరః- వీనిభేదము, అవగంతవ్యః - తెలియదగినదగును.

తా. ప్ర. అయితే, వైరాగ్యాదులు మూడును, అన్యోన్యసహాయములుగానుండునని, అపరిహారగస్థితిని జూపుటవల్ల, ఆమూటికిని భేదము లేదా యేమి? ఉ. ఆమూటియొక్క, హేతుస్స్వరూపకార్యములకు భేదముండుటవల్ల, ఆమూటికిని భేదముగలదు. కనుక, శాస్త్రార్థమును విమర్శించి, యెరుగదలచినవాడు, ఆమూటియొక్క భేదమును, వాస్తవముగా నెరుగవలెను.

అవ. ఆమూటిలో, వైరాగ్యముయొక్క హేతుస్స్వరూప కార్యములను మూటినిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ దోషదృష్టిర్జిహాసాచ పునర్భోగేష్వదీనతా।
అసాధారణహేత్వాద్యా వైరాగ్యస్యత్రయోఽప్యమీ॥ ౨౭౮.

టీ. దోషదృష్టిః- విషయములయందు దోషదృష్టియు, జిహాసాచ- భోగములనువిడచుటయు. పునః-మరల, భోగేషు-భోగములయందు, అదీనతా-దైన్యాభావంబును, అనగానిచ్ఛ ఉదయింపమియనుట. అమీ- ఈ, త్రయోఽపి-మూడును, వైరాగ్యస్య - వైరాగ్యముయొక్క, అసాధారణ హేత్వాద్యాః-అసాధారణహేతుస్స్వరూపకార్యములగును.

తా. విషయములయందుగల, అనిత్యత్వసాతిశయత్వాది దోషదర్శనమే, వైరాగ్యమునకు హేతువగును. విషయభోగములను విడుచుటయే, వైరాగ్యస్స్వరూపమగును. మరల భోగేచ్ఛ, కలుగమియే, వైరాగ్యముయొక్క కార్యమగును. ఈచెప్పబడిన హేతుస్స్వరూపకార్యములుమూడును, మరియొకదానికి లేమిచేత, అసాధారణములని చెప్పబడును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇప్పుడు, బోధయొక్క హేతుస్వరూప కార్యములను జూపుచున్నాడు.

శ్లో॥ శ్రవణాదిత్రయంతద్వ త్తత్వమిథ్యావివేచనం।
పునర్గ్రంథేరనుదయో బోధస్యైతేత్రయోమతాః॥ ౨౯.

టీ. శ్రవణాదిత్రయం= శ్రవణ- వేదాంతశ్రవణమే, ఆది- ఆదిగాగల, త్రయం-మూడును, అనగా శ్రవణమనన నిదిధ్యాసములనుట. తద్వత్- ఆప్రకారము, తత్వమిథ్యావివేచనం = తత్వ - కూటస్థాత్మయొక్కయు, మిథ్యా- అహంకారాదులయొక్కయు, వివేచనం-భేదజ్ఞానంబును,పునః-మరల,గ్రంథేః- హృదయగ్రంథియొక్క, అనుదయః-ఉదయింపమియు, ఏతే-ఈ, త్రయః-మూడును, బోధస్య-తత్వజ్ఞానముయొక్క, మతాః- హేతుస్వరూప కార్యములనుట సమ్మతములగును.

తా. మరియు, ఓశిష్యుడా, ఆత్మయే, చూడదగినదనియు, వినదగినదనియు, ఎరుగదగినదనియు, ధ్యానింపదగినదనియుం జెప్పెడి, శ్రు। ఆత్మావారే ద్రష్టవ్యశ్శ్రోతవ్యోమంతవ్యో నిదిధ్యాసితవ్యః ॥ అనెడి శ్రుతి ప్రకారము, వేదాంతార్థశ్రవణమనన నిదిధ్యాసములుమూడును, జ్ఞానమునకు హేతువులగును. అనగా నాత్మదర్శనమునకు సాధనముగా శ్రవణాదులను జేయవలెనని చెప్పబడుటచేత, శ్రవణమనననిది ధ్యాసములుమూడును, జ్ఞానహేతువు లాగునని తెలియవలెను. మరియు అహంకారాదులకంటె కూటస్థాత్మను భిన్నముగాజూచెడిజ్ఞానమే, బోధస్వరూపమగును. మరియు, అన్యోన్యా ధ్యాసరూపమగు హృదయగ్రంథి, మరల నుదయింపమియే, బోధయొక్క కార్యమగునని తెలియవలెను.

అవ. ఇప్పుడు,ఉపరతియొక్క హేతుస్వరూపకార్యములనుజూపుచున్నాడు.

శ్లో॥ యమాదిర్ధీనిరోధశ్చ వ్యవహారస్యసంక్షయః।
స్యుర్హేత్వాద్యాఉపరతే రిత్యసంకర ఈరితః॥ ౩౦.

టీ. యమాది-యమనియమాదికంబును, ధీనిరోధశ్చ = ధీ-బుద్ధియొక్క, నిరోధశ్చ-నిరోధలక్షణయోగంబును, వ్యవహారస్య-వ్యవహారముయొక్క,సంక్షయః-నాశంబును, ఉపరతేః-ఉపరతియొక్క, హేత్వాద్యాః - హేతుస్వరూపకార్యములు, స్యుః-అగుచున్నవి. ఇతి-ఈప్రకారము, అసంకరః - వైరాగ్యాదులయొక్కభేదము, ఈరితః- చెప్పబడెను.

తా. ౧. యమము, ౨. నియమము, 3. ఆసనము, ౪. ప్రాణాయామము, ౫. ప్రత్యాహారము, ౬. ధ్యానము: ౭. ధారణము, ౮. సమాధి, ఈమోని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మినియు, అష్టాంగములని చెప్పబడును. ఈయష్టాంగములు ఉపరతికి హేతువులగును మరియు, చిత్తనిరోధలక్షణముగలయోగము, ఉపరతియొక్క స్వరూపమగును. మరియు, సర్వవ్యవహారసంక్షయము, ఉపరతియొక్క కార్యమగును.

ప్ర. సరి. యమమనగానేమి?. ఉ. ౧. హింసజేయమియు, ౨. యథార్థమును జెప్పుటయు, ౩. దొంగతనము జేయమియు, ౪. బ్రహ్మచర్యవ్రతమును ధరించియుండుటయు, ౫. దానములను గ్రహించకుండుటయు, ఈయైదును, యమలక్షణములగును. ప్ర. సరి. నియమమనగానేమి?. ఉ. ౧. ఆంతరబాహ్యపరిశుద్ధియు, ౨. కాయికవాచిక మానసికమనెడి త్రివిధతపంబును, ౩. సంతోషంబును, ౪. వేదాధ్యయనంబును, ౫. ఈశ్వరప్రణిధానంబును, ఈయైదును నియమలక్షణములగును. ప్ర. సరి. ఆసనమనగానేమి?. ఉ. పద్మాసనము మొదలగు ఆసనముల నభ్యసించుటయే, ఆసనమని చెప్పబడును. ప్ర. సరి. ప్రాణాయామమనగానేమి?. ఉ. ఈ పూర్వోక్తయమనియమాసనముల నభ్యసించినపిమ్మట, ప్రాణాయామమును జేయవలెను. ఈప్రాణాయామము, ౧. రేచకమనియు, ౨. పూరకమనియు, ౩. కుంభకమనియుం జెప్పబడును. ప్ర. అందు రేచకమనగానేమి?. ఉ. ప్రాణవాయువును మూలాధార చక్రమునుంచి, బ్రహ్మరంధ్రపర్యంతము, సుషుమ్నానాళద్వారముగ, ఉత్థాపనను జేయుటయే, రేచకమని చెప్పబడును. ప్ర. సరి. పూరకమనగానేమి?. ఉ. అట్లు బ్రహ్మరంధ్రపర్యంతము రేచించిన వాయువును, మరల సుషుమ్నానాళ ద్వారముగ, మూలాధారచక్రమందు జేర్చుటయే, పూరకమని చెప్పబడును. ప్ర. సరి. కుంభకమనగానేమి?. ఉ. ఈకుంభకము ద్వివిధమగును. ప్ర. అది యెట్లు?. ఉ. రేచించినవాయువును బ్రహ్మరంధ్రమందు మాత్రాసంఖ్యగ నిలుపుటయే, ఊర్ధ్వకుంభకమని చెప్పబడును. మరియు, పూరించినవాయువును మాత్రాసంఖ్యగ, మూలాధారచక్రమందు నిలుపుటయే, అధఃకుంభకమని చెప్పబడును. ఈరేచకపూరక కుంభక ప్రాణాయామ భేదములను, యోగశాస్త్రమువల్ల దెలిసికొనవలెను. ప్ర. సరి. ప్రత్యాహారమనగానేమి?. ఉ. శబ్దస్పర్శాదివిషయములనుంచి, శ్రోత్రాదీంద్రియములను మరలించి, తమతమ స్వస్థానములయందు నిలుపుటయే, ప్రత్యాహారమని చెప్పబడును. ప్ర. సరి. ధ్యానమనగానేమి?. ఉ. సగుణబ్రహ్మమునైనను, నిర్గుణ బ్రహ్మము నైనను నిరంతరము చింతించుటయే, ధ్యానమని చెప్పబడును. ప్ర. సరి. ధారణమనగానేమి?. ఉ. మూలాధారచక్రము మొదలగు ప్రదేశములయందు మనస్సును నిలుపుటయే, ధారణమని చెప్పబడును. ప్ర. సరి. సమాధియనగానేమి?. ఉ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిర్గుణబ్రహ్మతత్వమందుగల, నిశ్చలచిత్తవృత్తియే, సమాధియని చెప్పబడును. ఈ ప్రకారముగా, అష్టాంగయోగస్వరూపముల నెరుగవలెను.

శ్లో॥ తత్వబోధః ప్రధానంస్యా త్సాక్షాన్మోక్షప్రదత్వతః।
బోధోపకారిణావేతౌ వైరాగ్యోపరమావుభౌ॥ ౨౮౧.

టీ. తత్వబోధః - తత్వజ్ఞానము, సాక్షాత్-ప్రత్యక్షముగా, మోక్షప్రదత్వతః=మోక్ష-ముక్తిని, ప్రదత్వతః - ఇచ్చుటవల్ల, ప్రధానం - ముఖ్యమైనది, స్యాత్-అగును. ఏతౌ-ఈ, ఉభౌ-రెండైన, వైరాగ్యోపరమౌ=వైరాగ్య - విరక్తియు, ఉపరమౌ- ఉపరతియు, బోధోపకారిణౌ=బోధ-తత్వజ్ఞానమునకు, ఉపకారిణౌ- సహాయముజేయునవియగును.

తా. ప్ర. అయితే, వైరాగ్యబోధోపరతులనెడి ఈమూటికిని, మోక్షమును కలిగించెడివిషయమై సమప్రాధాన్యత, గలదేమోచెప్పుము?. ఉ. పురుషుడు,ఆపరమాత్మనెరిగి, మోక్షమునుబొందుచున్నాడనియు, మోక్షమునుబొందుటకు, జ్ఞానముతప్ప,మరియొకమార్గములేదనియుంజెప్పెడి, శ్రు॥ తమేవంవిదిత్వాతి మృత్యుమేతినాన్యఃపంథావిద్యతేయనాయ ॥ అనెడి శ్రుతి ప్రకారము, తత్వజ్ఞానమొక్కటియే, ప్రత్యక్షముగామోక్షమునిచ్చుటవల్ల, అది ముఖ్యమైనదగును. మరియు, ముముక్షువగువాడు, వైరాగ్యమును బొందుననియు, కర్మముచేతముక్తిగలుగదనియు, ఆపరమాత్మనెరిగెడికొరకు గురువునే ఆశ్రయించుననియు, శమదమోపరతితితిక్షా సమాధులంగలవాడై, తనయందే పరమాత్మనుజూచుననియుంజెప్పెడి, శ్రు ॥ బ్రాహ్మణోనిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేనతద్విజ్ఞానార్థంసగురుమేవాభిగచ్ఛేత్, శాంతోదాంత ఉపరతస్తితిక్షుస్సమాహితో భూత్వాత్మన్యేవాత్మానం పశ్యేత్॥ అనెడి శ్రుతుల ప్రకారము, వైరాగ్యోపరతులురెండును, జ్ఞానమునకు సహాయకారులగును. కనుక, మోక్షమునుగలిగించెడివిషయమై. జ్ఞానమునకే ప్రాధాన్యత్వము గలిగియున్నదని తెలియవలెను,

అవ. వైరాగ్యబోధోపరతులు మూడును, సాధారణముగాకూడి వర్తించుచుండుననియు, ఆమూటిలో నొకటి రెండు, ఒకానొకపురుషునియందు లేకపోవుచున్నవనియు, (౨౮౬) శ్లోకమందు జెప్పబడెను. అందుకు కారణము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ త్రయోప్యత్యంతపక్వాశ్చే న్మహతస్తపసఃఫలం।
దురితేనక్వచిత్కించి త్కదాచిత్ప్రతిబధ్యతే॥ ౨౮౨.

టీ. త్రయోపి - వైరాగ్యబోధోపరతులు మూడును, అత్యంతపక్వాశ్చేత్=అత్యంత-మిక్కలి, పక్వాశ్చేత్-పరిపక్వములైనయెడల, మహతః- అధిక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మైన, అనగా ననేక జన్మములయందు సంపాదింపబడిన పుణ్యరాశి రూపమ గుననుట. తపసః-తపస్సుయొక్క, ఫలం-ఫలమగును. దురితేన-పాపముచేత; క్వచిత్-ఒకానొక పురుషునియందు, కదాచిత్- ఒకానొకప్పుడు, కించిత్-ఒకానొకటి; ప్రతిబధ్యతే - ప్రతిబంధనును బొందుచున్నది.

తా. ఆవైరాగ్యబోధోపరతులు మూడును, ఒకపురుషునియందు మిక్కిలిపరిపక్వములైయున్నయెడల, అనేకజన్మములయందు సంపాదింపబడిన మహత్పుణ్యరాశిఫలమని తెలియవలెను. మరియు, ప్రతిబంధకపాపమునను సరించి, ఆమూటిలోనొకటియైనను, రెండైనను, ఒకానొకపురుషునియం దొకానొకకాలమందు లేకపోవుచున్నవి.

అవ. ఆమూటిలో, తత్వజ్ఞానములేనియెడల, మోక్షముకలుగదని; ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ వైరాగ్యోపరతీపూర్ణే బోధస్తుప్రతిబధ్యతే।
యస్యతస్యనమోక్షోస్తి పుణ్యలోకస్తపోబలాత్॥ ౨౮౩.

టీ. యస్య-ఏపురుషునకు, వైరాగ్యోపరతీ= వైరాగ్య-విరక్తియు, ఉపరతీ-ఉపరతియు, పూర్ణేసత్యౌ-పూర్ణత్వమును బొందియుండగా,బోధస్తు-తత్వజ్ఞానము, ప్రతిబధ్యతే-ప్రతిబంధమునుబొందునో, తస్య-అట్టిపురుషునకు, మోక్షః-మోక్షము, నాస్తి-లేదు. తపోబలాత్-వైరాగ్యోపరతిరూపతపోబలమువల్ల, పుణ్యలోకః - పరలోకముగలుగును.

తా. మరియు, ఏపురుషునకు వైరాగ్యోపరతులురెండును, సంపూర్ణముగానుండి, తత్వజ్ఞానముమాత్రము లేకపోవునో, అట్టి పురుషునకు మోక్షముగలుగదు. ప్ర. అయితే; వైరాగ్యాదికమును సంపాదించుటచేత, ఫలము లేదుగదా?. ఉ. వైరాగ్యోపరతులు రెండును, తపంబగుటచేత, అట్టిపుణ్యబలమువల్ల, పుణ్యలోకప్రాప్తిగలుగునని, శ్రీభగవద్గీతయందు। శ్లో ॥ ప్రాప్యపుణ్యకృతాంలోకానుషిత్వాశాశ్వతీస్సమాః । శుచీనాంశ్రీమతాం గేహేయోగభ్రష్టోభిజాయతే॥ అని చెప్పబడియున్నది.

శ్లో॥ పూర్ణేబోధేతదన్యౌద్వౌ ప్రతిబద్ధౌయదాతదా।
మోక్షోవినిశ్చితఃకింతు దృష్టదుఃఖంనవశ్యతి॥ ౨౮౪.

టీ. బోధే-జ్ఞానము,పూర్ణేసతి-పూర్ణత్వమును బొందియుంచుండగా,తదన్యౌ-తత్-అజ్ఞానముకంటె, అన్యౌ-అన్యములైన, ద్వౌ - వైరాగ్యోపరతులు రెండును, యదా-ఎప్పుడు, ప్రతిబద్ధౌ-ప్రతిబంధమునుబొందినవగునో, తదా-అప్పుడు, మోక్షః-మోక్షము, వినిశ్చితః-నిశ్చయింపబడును. కింతు- మరియేమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నగా, దృష్టదుఃఖం=దృష్ట-ప్రారబ్ధకర్మముచే ననుభవింపబడెడి, దుఃఖం-దుఃఖము, ననశ్యతి- నాశమునుబొందదు.

తా. మరియు, తత్వజ్ఞానము పూర్ణముగా నున్నదగుచు, వైరాగ్యోపరతులు రెండును లేనియెడల, అట్టిపురుషునకు మోక్షముగలుగునని నిశ్చయింపవలెను. ఆ పురుషునకు వైరాగ్యోపరతులు రెండును లేమిచేత, ప్రారబ్ధకర్మవశమువల్ల గలిగెడి దుఃఖమునశింపదు. అనగా జ్ఞానముచేత మోక్షము గలిగినను, వైరాగ్యోపరతులు రెండును లేమివల్ల జీవించియుండగా ముక్తిసుఖము లభింపదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు వైరాగ్యాదులకు అవధిని జూపుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మలోకతృణీకారో వైరాగ్యస్యావధిర్మతః।
దేహాత్మవత్పరాత్మత్వదార్ఢ్యేబోధస్సమాప్యతే॥ ౨౮౫.

టీ. బ్రహ్మలోకతృణీకారః= బ్రహ్మలోక - సత్యలోకమును, తృణీకారః-తృణీకరించుట. అనగా బ్రహ్మలోకమును తృణముగా భావించుటయనుట. వైరాగ్యస్య- వైరాగ్యముయొక్క అవధిః-అంత్యముగా, మతః-సమ్మతమగును. దేహాత్మవత్పరాత్మత్వదార్ఢ్యేసతి = దేహాత్మవత్- దేహము నేననెడిజ్ఞానమువలె, పరాత్మత్వ - పరమాత్మస్వరూపముయొక్క, దార్ఢ్యేసతి-దృఢముగలుగుచుండగా, అనగా నేనుపరమాత్మననెడి దృఢజ్ఞానము గలుగుచుండగాననుట. బోధః-జ్ఞానము, సమాప్యతే- సమాప్తిని బొందుచున్నది.

తా. మరియు, బ్రహ్మలోకమును, గడ్డిపరకనువలె నిష్ప్రయోజనము గాదలచుటయే, వైరాగ్యమునకు అవధియగును. అనగా నంతకుమించిన వైరాగ్యము లేదనుట. మరియు, దేహమే, నేననెడిజ్ఞానమువలె, నేను పరమాత్మననెడి దృఢజ్ఞానము గలుగుచుండగా, బోధ, పరిపూర్ణత్వమును బొందును. అనగా నదియేబోధ కవధియని యభిప్రాయము.

శ్లో॥ సుప్తివద్విస్మృతిస్సీమాభవేదుపరమస్యహి।
ధియాస్వయావినిశ్చేయం తారతమ్యమవాంతరం॥ ౨౮౬.

టీ. సుప్తివత్-సుషుప్తియందువలె, విస్మృతిః - వ్యవహారసంక్షయము, అనగా సర్వవ్యవహారమును పరచియుండుటయనుట. ఉపరమస్య- ఉపరతికి, సీమా-అవధి, భవేద్ధి-అగును. అవాంతరం-మధ్యమందుగల, తారతమ్యం- భేదము, స్వయా-స్వకీయమైన, ధియా-బుద్ధిచేత, వినిశ్చేయం - నిశ్చయింపదగినదగును.

తా. మరియు సుషుప్తియందువలె, సర్వవ్యవహారసంక్షయమునుబొంది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుండుటయే, ఉపరతికి అవధియగును. అనగా నంతకుమించిన యుపరతిలేదని యభిప్రాయము, మరియు, తనకువైరాగ్యబోధోపరతులుండెడి పరిమాణమునుబట్టి, ఇంతమాత్రపు వైరాగ్యబోధోపరతులు తనకుగలవని, తనతనబుద్ధిచేత నిశ్చయించుకొనవలెను.

శ్లో॥ ఆరబ్ధకర్మనానాత్వాద్బుద్ధానామన్యథాన్యథా।
వర్తనం తేనశాస్త్రార్థే భ్రమితవ్యంనపండితైః॥ ౨౮౭.

టీ. ఆరబ్ధకర్మనానాత్వాత్=ఆరబ్ధకర్మ - ప్రారబ్ధకర్మముయొక్క, నానాత్వాత్- నానావిధత్వమువల్ల, అనగా ప్రారబ్ధకర్మము నానావిధముగానుండుటచే ననుట. బుద్ధానాం-జ్ఞానులకు, అన్యథాన్యథా- నానావిధముగా, వర్తనం-ప్రవర్తనము గలిగియుండును. తేన- అందుచేత, శాస్త్రార్థే - శాస్త్రార్థమందు, పండితైః-పండితులచేత, నభ్రమితవ్యం - భ్రమింపదగినదికాదు.

తా. ప్ర. అయితే, తత్వజ్ఞానవంతులకును కామక్రోధాదులుగలిగియుండుటచేత భేదము కనబడుచుండుటవల్ల జ్ఞానముచేత ముక్తిగలుగునని నిశ్చయించుటకుశక్యమెట్లగును? ఉ. ప్రారబ్ధకర్మము, నానావిధముగా నుండుటవల్ల, జ్ఞానులకును నానావిధముగా ప్రవర్తనము గలిగియుండును. గనుక, పండితులగువారు, శాస్త్రార్థమునందుభ్రమించి జ్ఞానులు వ్యవహారశూన్యులైయుండవలెనని తలచరాదు. అనగా, కామక్రోధాదులు, రోగాదులవలె, ప్రారబ్ధకర్మఫలరూపమగుటచేత, ఆ కామక్రోధాదులు ముక్తికి ప్రతిబంధకములు గాజాలవని యభిప్రాయము. ఈచెప్పబడిన, ప్రారబ్ధకర్మ నానావిధత్వమును, తృప్తిదీపమందు, ౧౫౨, శ్లోకార్థమునుజూచి తెలిసికొనవలెను.

శ్లో॥ స్వస్వకర్మానుసారేణ వర్తంతాం తేయథాయథా।
అవిశిష్టస్సర్వబోధ స్సమాముక్తిరితిస్థితిః॥ ౨౮౮.

టీ. తే- ఆ జ్ఞానులు, స్వస్వకర్మానుసారేణ=స్వస్వ- తమతమయొక్క, కర్మానుసారేణ-ప్రారబ్ధకర్మానుసరణముగా, యథాయథా- తమయిష్టప్రకారము, వర్తంతాం-ప్రవర్తింతురుగాక.సర్వబోధః=సర్వ- సర్వజ్ఞానులయొక్క, బోధః-నేనుబ్రహ్మమైతినని యాకారముగలజ్ఞానము, అవిశిష్టఇతి- భేదములేనిదనియు, ముక్తిః-జ్ఞానఫలమగుముక్తి, సమేతి-సమానమనియు, స్థితిః-వేదాంతనిర్ణయమగును.

తా. ప్ర. అయితే, యెరుగదగినదేమి?. ఉ. జ్ఞానులు, తమతమప్రారబ్ధకర్మముననుసరించి వ్యవహారవంతులైయున్నను, అందరికిని, బ్రహ్మహమనెడియాకారకజ్ఞానము, ఏకాకారముగానున్నది. మరియు, బ్రహ్మస్వరూపము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గానుండెడిముక్తియు, అందరికిని సమానముగా నున్నది. ఇదియే శాస్త్రహృదయమగు, మాఅద్వైత సిద్ధాంతమగును. కనుక, ఈ పూర్వోక్తప్రకారము, మాసిద్ధాంతము ననుష్ఠించి, ప్రవర్తింపుమని యభిప్రాయము.

అవ. ఈప్రకరణముయొక్క తాత్పర్యము నిప్పుడు, సంక్షేపించి, జూపుచున్నాడు.

శ్లో॥ జగచ్చిత్రంస్వచైతన్యే పటేచిత్రమివార్పితం।
మాయయాతదుపేక్ష్యైవ చైతన్యేపరిశేష్యతాం॥ ౨౮౯

టీ. పటే-వస్త్రమందు, చిత్రం-చిత్రవర్ణము, అర్పితమివ-కల్పించబడినట్లు, స్వచైతన్యే-స్వ-తానైన, చైతన్యే- పరమాత్మయందు, చిత్రం - చిత్రరూపమగు, జగత్-ప్రపంచము, మాయయా-మాయచేత, అర్పితం-కల్పించబడెను. తత్- ఆజగంబును, ఉపేక్ష్య-ఉపేక్షించి, అనగామిథ్యయనినిరాకరించి యనుట. చైతన్యఏవ- పరమాత్మయే, పరిశేష్యతాం- శేషింపబడుగాక.

తా. వస్త్రమందు చిత్రరూపము గల్పించబడినట్లు, తానైనపరమాత్మయందు, చిత్రరూపమువంటిజగంబు, మాయచే గల్పించబడెను. కనుక,ఆమాయామయమైన జగంబును మిథ్యయని యుపేక్షజేసినయెడల, అద్వితీయమగు తానైన, పరమాత్మచైతన్యమే సత్యమై శేషించుచున్నది. అనగా, మిథ్యయని నిరాకరించుటకు యోగ్యమైన ద్వైతమునంతయు నిరాకరించగా, తుదకునిరాకరించుటకు యోగ్యముగాని, తానైన పరమాత్మచైతన్యమే,ద్వైతనిషేధమునకవధిగా సత్యమై శేషించుచున్నదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, గ్రంథాభ్యాసఫలమును జెప్పుచున్నాడు.

శ్లో॥ చిత్రదీపమిమంనిత్యం యేనుసందధతేబుధాః।
పశ్యంతోపిజగచ్చిత్రం తేముహ్యంతినపూర్వవత్॥ ౨౯౦.

టీ. యేబుధాః- ఏపండితులు, ఇమం-ఈ చిత్రదీపం-చిత్రదీపమనెడి గ్రంథమును, అనుసందధతే-అనుసంధానముజేయుచున్నారో, తే- అట్టిపండితులు, చిత్రం-విచిత్రరూపమగు, జగత్-ప్రపంచమును, పశ్యంతోపి- చూచుచున్నవారైనను, పూర్వవత్-పూర్వమువలె, అనగా నవివేకదశయందువలెననుట. నముహ్యంతి- మోహమునుబొందరు.

తా. మఱియు, ఏపండితులు, ఈచిత్రదీపమనెడిగ్రంథము ననుసంధానముజేసెదరో, అట్టిపండితులు, విచిత్రరూపముగల జగంబును జూచుచున్నవారైనను, పూర్వమవివేకదశయందువలె మోహమునుబొందరు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇతి * శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థ విద్యారణ్యమునివర్యకృత శ్రీవేదాంతపంచదశ్యాం చిత్రదీపస్సమాప్తః.

గద్య * ఇది, శ్రీపరమేశ్వర గురుచరణ వరప్రసాదలబ్ధ బ్రహ్మవిద్యా విరాజిత కాశ్యపసగోత్ర పవిత్ర మంత్రి వంశపయః పారావార పరిపూర్ణ సుధాకర బుధవినుతచరిత్ర లక్ష్మణామాత్యపుత్ర పిచ్చమాంబాగర్భ శుక్తిజనిత ముక్తాఫలబుధజనవిధేయ లక్ష్మీనారాయణామాత్య ప్రణీతంబైన ఆంధ్రటీకా తాత్పర్యసహిత శ్రీవేదాంతపంచదశియందు చిత్రదీపమనైడి షష్ఠమప్రకరణము సంపూర్ణమాయెను.

శ్లో॥ చిత్రదీపస్యటీకేయం పదతాత్పర్యబోధినీ।
నారాయణాఖ్యవిదుషా కృష్ణపాదసమర్పితా॥

శ్రీకృష్ణః ప్రీయతాం.

ఓంతత్సత్ సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హరిః ఓం.

శ్రీకృష్ణసద్గురు పరబ్రహ్మణేనమః.

# తృప్తిదీపప్రారంభము.



అవ. ఇప్పుడు, శ్రీవిద్యారణ్య గురుండు, తృప్తిదీపమనెడి ప్రకరణము నారంభించుచున్నవాడగుచు, ఆతృప్తిదీపము, శ్రుతివ్యాఖ్యాన రూపమగుట వల్ల, ఆతృప్తిదీపమునకు వ్యాఖ్యానింపదగిన శ్రుతిని, మొట్టమొదటనే పఠించుచున్నాఁడు.

ఓం. శ్లో॥ ఆత్మానంచేద్విజానీయా దయమస్మీతిపూరుషః।
కిమిచ్ఛన్ కస్యకామాయ శరీరమనుసంజ్వరేత్॥ ౧.

టీ. పూరుషః-పురుషుఁడు,అయం - ఈస్వయంప్రభానందరూపపరమాత్మ,అస్మీతి-నేనైతినని,ఆత్మానం-తనను,విజానీయాచ్చేత్-ఎరిగినయెడల, కిమిచ్ఛన్-ఏఫలమునిచ్ఛయించినవాఁడగుచు, కస్య - ఏభోక్తయొక్క, కామాయ-ప్రీతికొరకు, శరీరం-దేహము, (తప్యమానంసత్) తపించుచుండగా, అనుసంజ్వరేత్- తపించునోయని యాక్షేపార్థకము. అనగా బరమార్థమందు భోక్తృభోగ్యరూపమగు మాయాకల్పితమైన ద్వైతము దోషమిచేత తపించడనుట.

తా. పురుషుడు, స్వయంప్రభానందరూపుఁడగు, ఈకూటస్థుఁడనైతినని తానైనపరమాత్మ నెరిగినయెడల, అప్పుడేమిఫలము నిచ్ఛయించుచున్నవాఁడగుచు, ఏభోక్తయొక్క ప్రీతికొరకు దేహముతపించుచుండగా, తపించునోయని యాక్షేపార్థకము. అనగా, ఆపరమార్థదశయందు భోక్తృభోగ్య రూపమగు మాయాకల్పితమైన ద్వైతముదోషమిచేత తపించడని, ఈశ్రుతియొక్క యభిప్రాయమగును.

అవ. ఇప్పుడు, తాను జేయుటకిచ్ఛయించిన గ్రంథవిచార తత్ఫలమును జూపుచున్నాఁడు.

శ్లో॥ అస్యాః శ్రుతేరభిప్రాయ స్సమ్యగత్రవిచార్యతే।
జీవన్ముక్తస్యయాతృప్తి స్సాతేనవిశదాయతే॥ ౨.

టీ. అస్యాః-ఈ, శ్రుతేః-శ్రుతియొక్క, అభిప్రాయః-అభిప్రాయము, అత్ర-ఈప్రకరణమందు, సమ్యక్-లెస్సగా, విచార్యతే- విచారింపబడుచున్న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ది. అనగావిచారణజేయబడుచున్నదనుట. తేన- ఆయభిప్రాయవిచారముచేత, జీవన్ముక్తస్య-జీవన్ముక్తునకు, యా-ఏ, తృప్తిః-తృప్తిగలదో, సా-ఆతృప్తి, విశదాయతే - స్పష్టత్వమును బొందుచున్నది.

తా. ఈశ్రుతియొక్క యభిప్రాయము, ఈ ప్రకరణమందు చక్కగా విచారింపబడును. ఆయభిప్రాయవిచారముచేత, జీవన్ముక్తునకు శ్రుతిప్రసిద్ధమైన, ఏతృప్తిగలదో, అట్టితృప్తి, స్పష్టీకరించబడినదగును.

అవ. ౧. పదచ్ఛేదము. ౨. పదార్థోక్తి, ౩. సమాసము, ౪. వాక్యయోజనము, ౫. ఆక్షేపమునకు సమాధానము, ఈయైదును, వ్యాఖ్యానలక్షణములని, శ్లో॥ పదచ్ఛేదంపదార్థోక్తిర్విగ్రహోవాక్యయోజనా । ఆక్షేపస్యసమాధానం వ్యాఖ్యానంపంచలక్షణం॥ ఇట్లుచెప్పబడుటచేత, పూర్వోక్తశ్రుతియందు గల, పురుషపదముయొక్క, అర్థమును దెలుపుటకొరకు, అందుకు ఉపోద్ఘాతముగా నిప్పుడు సృష్టినిసంక్షేపించి, చూపుచున్నాడు.

శ్లో॥ మాయాభాసేనజీవేశౌ కరోతీతి శ్రుతత్వతః।
కల్పితావేవజీవేశౌ తాభ్యాంసర్వంప్రకల్పితం॥ ౩.

టీ. మాయా- ప్రకృతి, ఆభాసేన-చిదాభాసునిచేత, జీవేశౌ-జీవేశ్వరులను, కరోతీతి-కలిగించుచున్నదని శ్రుతత్వతః - శ్రుతియందు వినబడుటవల్ల, జీవేశౌ-జీవేశ్వరులు, కల్పితావేవ-కల్పితులేయగుదురు. తాభ్యాం- ఆజీవేశ్వరులచేత, సర్వం-సర్వజగంబు, ప్రకల్పితం- కల్పించబడెను.

తా. సత్యజ్ఞానానంతస్వరూపమగు పరబ్రహ్మముయొక్క ప్రతిబింబముతోగూడిన ప్రకృతియే, ఇక్కడమాయాశబ్దముచేత జెప్పబడుచున్నది. ఆప్రకృతి, సత్వరజస్తమోగుణరూపియు, జగదుపాదానకారణంబునగును. ఆప్రకృతి, సత్వగుణముయొక్క, శుద్ధిఅవిశుద్ధులచేత ద్వివిధభేదముగలదగుచు, మాయయనియు, అవిద్యయనియుం జెప్పబడును. ఆమాయయందును, అవిద్యయందును ప్రతిబింబించినబ్రహ్మచైతన్యమే, ఈశ్వరుడనియు; జీవుడనియుం జెప్పబడును. ఈవిషయము, ప్రత్యక్తత్వవివేకమనెడి ప్రకరణములోని, ౧౫, ౧౬, ౧౭, శ్లోకములయందు శ్రీవిద్యారణ్యగురువులచే నిరూపింపబడెను. ఈయర్థమునే మనస్సునందుంచుకొని, మాయ, చిదాభాసునిచేతజీవేశ్వరులను కల్పించినదనియు; మాయా అవిద్యలురెండును, బ్రహ్మమేయగుచున్నదనియుం జెప్పెడి, శ్రు॥ జీవేశావాభాసేనకరోతి. మాయాచావిద్యాచస్వయమేవభవతి ॥ అనెడి శ్రుతియుం బ్రవర్తించుచున్నది. కనుక, జీవేశ్వరులిద్దరును మాయచే గల్పించబడిన వారగుదురు. తక్కినజగంబంతయు, ఆజీవేశ్వరులచేత గల్పించబడెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ ఈక్షణాదిప్రవేశాంతా సృష్టిరీశేనకల్పితా।
జాగ్రదాదివిమోక్షాంత స్సంసారో జీవకల్పితః॥ ౪.

టీ. ఈక్షణాదిప్రవేశాంతా=ఈక్షణ-చూచుటయే, అనగా సంకల్పమే యనుట. ఆది-మొదలుగాగలిగినట్టియు, ప్రవేశ-ప్రవేశమే, అంతా - అంత్యముగాగలిగినట్టి, సృష్టిః-జగత్సృష్టి, ఈశ్వరేణ - మాయోపాధికునిచేత, కల్పితా-కల్పించబడెను. జాగ్రదాదివిమోక్షాంతః = జాగ్రత్-జాగరితావస్థయే, ఆది-మొదలుగాగలిగినట్టియు, విమోక్ష-విదేహముక్తియే, అంతః-అంత్యముగా గలిగినట్టి, సంసారః-సంసారము, జీవకల్పితః = జీవ- అవిద్యోపాధికునిచేత, కల్పితః-కల్పించబడెను. అనగా నాసంసారమందు జీవున కభిమానము గలిగి యుండుటచేత, జీవకల్పితంబనుట.

తా. ప్ర. అయితే,ఆజీవేశ్వరులలో, నెవనిచేనదికల్పించబడెనోచెప్పుము?. ఉ. శ్రు॥ తదైక్షతబహుస్యాంప్రజాయేయేతి॥ అనెడి శ్రుతిప్రకారము, ఆయీశ్వరుడు బహుప్రపంచరూపముగా నయ్యెదననెడి సంకల్పమే, ఆదిగా గలిగినట్టియు, శ్రు॥ అనేనజీవేనాత్మనానుప్రవిశ్య ॥ అనెడి శ్రుతిప్రకారము, ఆయీశ్వరునకు జగంబునందుప్రవేశమే అంత్యముగా గల జగత్సృష్టియంతయు, ఈశ్వరునిచే గల్పించబడెనని తెలియవలెను. మరియు, జాగరితావస్థమొదలుకొని, విదేహముక్తియే, అంత్యముగాగల సంసారమందు, జీవునకభిమానము గలిగియుండుటచేత, ఆసంసారమంతయు జీవునిచేగల్పించబడెనని తెలియవలెను. మరియు, ఆపరమాత్మయే, శరీరమందుండి, మాయచేత మోహింపబడినవాడై, జీవరూపమునుధరించి, సర్వమును జేయుచున్నాడనియు,ఆజీవుడే, స్త్రీఅన్నపానాది విచిత్రభోగములచేత జాగ్రదవస్థయందు తృప్తిబొందుచున్నాడనియు, మరియు, ఆజీవుడు స్వప్నావస్థయందు, తనమాయచేత గల్పించబడిన ప్రపంచసంబంధ సుఖదుఃఖముల ననుభవించుచున్నాడనియు, మరియు, ఆజీవుడు, సుషుప్త్యవస్థయందు సకలేంద్రియములు లయించుచుండగా, అజ్ఞానముచేత తిరస్కరింపబడి, సుఖరూపమును బొందుచున్నాడనియు, మరల నాజీవుడే, పూర్వజన్మకర్మసంబంధవశమువల్ల, స్వప్నజాగ్రదవస్థలం బొందుచున్నాడనియు, ఇట్లు మూడవస్థలనెడి మూడుపట్టణములయందు, ఏజీవుడుక్రీడించుచున్నాడో, ఆజీవునివల్ల విచిత్రమంతయుబుట్టుచున్నదనియు, మరియు, జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచమును, ఏ బ్రహ్మము ప్రకాశింపజేయుచున్నదో, ఆబ్రహ్మము, నేనేననియెరిగినజీవుడు, సర్వబంధములచే విముక్తుడగుచున్నాడనియు, ఇట్లు, శ్రు। సఏవమాయాపరిమోహితాత్మాశరీరమాస్థాయక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నోతిసర్వం । శ్రీ అన్నపానాదివిచిత్రభోగైస్సఏవజాగ్రత్పరితృప్తిమేతి । స్వప్నేపిజీవస్సుఖదుఃఖభోక్తాస్వమాయయాకల్పితవిశ్వలోకే । సుషుప్తికాలేసకలేవిలీనేతమోభిభూతస్సుఖరూపమేతి ॥ పునశ్చజన్మాంతరకర్మయోగాత్సఏవజీవస్స్వపితిప్రబుద్ధః । పురత్రయేక్రీడతియశ్చ జీవస్తతస్తుజాతం సకలంవిచిత్రం॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే । తద్బ్రహ్మాహమితిజ్ఞాత్వాసర్వబంధైః ప్రముచ్యతే॥ అనియిట్లు, ఆజాగ్రదాదులువినబడుచున్నవి.

అవ. ఇట్లు, పురుషశబ్దార్థమును దెలుపుటకు ఉపయోగమైన సృష్టినిదెలిపి, యిప్పుడు,పూర్వోక్తశ్రుతియందుగల పురుషశబ్దార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ భ్రమాధిష్ఠానభూతాత్మా కూటస్థాసంగచిద్వపుః।
అన్యోన్యాధ్యాసతోసంగ ధీస్థజీవోత్రపూరుషః॥ ౫.

టీ. కూటస్థాసంగచిద్వపుః=కూటస్థ-నిర్వికారిత్వముచేత, అసంగచిద్వపుః-అసంగజ్ఞానరూపుడైనట్టియు, భ్రమాధిష్ఠానభూతాత్మా=భ్రమ - దేహేంద్రియాది అధ్యాసమునకు, అధిష్ఠానభూత- ఆధారత్వముచే వర్తించుచుండెడి, ఆత్మా-పరమాత్మ, అన్యోన్యాధ్యాసతః-తాదాత్మ్యాధ్యాసమువల్ల, అసంగధీస్థజీవస్సః=అసంగ-తనతోటిపారమార్థికసంబంధములేని, ధీ- బుద్ధియందు,స్థ-వర్తించుచుండుటచేత, జీవస్సః-జీవుడగుచు, అత్ర- ఈశ్రుతియందు- పూరుషః- పురుషుడనిచెప్పబడుచున్నాడు.

తా. నిర్వికారత్వముచేత అసంగచిద్రూపుడైనట్టియు, దేహేంద్రియాది అధ్యాసమునకు, ఆధారత్వముచేతవర్తించుచుండెడి పరమాత్మ, అసంగుడే యగును. ఆపరమాత్మ, భాష్యం॥ అన్యోన్యస్మిన్నన్యోన్యాత్మకతా మన్యోన్యధర్మాంశ్చాధ్యస్యసర్వవ్యవహారభాగ్భవతి। అనియిట్లు,శ్రీశంకరాచార్యులచే నిరూపింపబడిన తాదాత్మ్యాధ్యాసముచే, తనతోటి పారమార్థిక సంబంధశూన్యమగుబుద్ధియందు వర్తించుటవల్ల జీవభావమునుబొందినవాడగుచు,ఈశ్రుతియందు పురుషశబ్దముచేత జెప్పబడుచున్నాడు. అనగా, బుద్ధ్యాదులన్నియుం గల్పించబడుటకు, ఆధారమైనకూటస్థచైతన్యమే, బుద్ధియందుప్రతిబింబించుటచేత జీవభావమునుబొందినదగుచు, ఈశ్రుతియందు పురుషశబ్దముచేత జెప్పబడుచున్నదనియభిప్రాయము. ఆయీపరమాత్మయనెడిపురుషుడు సర్వపురములనెడి దేహములయందు శయనించుటచేతనైనను,ఒకదేహమందు శయనించుటచేతనైనను పురుషుడనిచెప్పబడుచున్నాడని, శ్రు। సవాఅయంపురుషస్సర్వాసుపూర్షుపురిశయః। అనెడి శ్రుతిచేతపురుషశబ్దము, వ్యుత్పాదింపబడుటవల్ల, పురుషశబ్దమే,పూరుషుడని, ఈశ్రుతియందు ప్రయోగింపబడెనని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ సాధిష్ఠానోపి మోక్షాదౌ జీవోధిక్రియతేనతు।
కేవలోనిరధిష్ఠాన విభ్రాంతేః క్వాప్యసిద్ధితః॥ ౬.

టీ. సాధిష్ఠానః-కూటస్థునితోగూడిన, జీవః - చిదాభాసుడు, మోక్షాదౌ-మోక్షస్వర్గాదికమందు, అనగా మోక్షస్వర్గాది సాధనానుష్ఠానమందనుట. అధిక్రియతే- అధికారియగుచున్నాడు. నిరధిష్ఠానవిభ్రాంతేః- నిరధిష్ఠాన-ఆధారవస్తువులేని, విభ్రాంతేః-విభ్రాంతికి, అనగా నారోపమనుట. అసిద్ధితః-సిద్ధింపమివల్ల, కేవలస్తు-చిదాభాసుడుమాత్రమూ, న-అధికారిగాజాలడు.

తా. ప్ర. అయితే, ఇక్కడ పురుషశబ్దముచేత, కేవలచిదాభాసరూపుడగు జీవునిమాత్రమే చెప్పవలయును. అధిష్ఠానభూతమగు ఈకూటస్థచైతన్యమును జేర్చి చెప్పుటచేత ప్రయోజనమేమి?. ఉ. అధిష్ఠానరూపుడగు కూటస్థునితోగూడిన చిదాభాసుడే, మోక్షస్వర్గాది సాధనానుష్ఠానమందు అధికారియగుచున్నాడుగాని, కేవల చిదాభాసుడుమాత్ర మధికారియగుటలేదు. ప్ర. అందుకుగారణమేమి?. ఉ. ఆధారవస్తువులేనిభ్రాంతి, లోకమందెచ్చటయుంగనబడలేదు. కనుక,అధిష్ఠానభూతుడైన కూటస్థునివిడచి, కేవలచిదాభాసుడుండడు. అనగా, ప్రతిబింబరూపుడగు చిదాభాసుడు, కల్పితుడగుటవల్ల, ఆ చిదాభాసునకు సంసారమోక్షాదిసిద్ధిగలిగెడికొరకు. ఆకూటస్థచైతన్యముగూడ, గ్రహింపదగినదగునని యభిప్రాయము.

అవః ఇప్పుడు, కూటస్థునితోగూడిన చిదాభాసుడే, సంసారాదికముతోగూడినవాడగుచున్నాడని; రెండుశ్లోకములచే విభజించి చూపుచున్నాడు.

శ్లో॥ అధిష్ఠానాంశసంయుక్తం భ్రమాంశమవలంబతే।
యదాతదాహంసంసారీత్యేవంజీవోభిమన్యతే॥ ౭.

టీ. జీవః-జీవుడు, యదా-ఏకాలమందు, అధిష్ఠానాంశసంయుక్తం=అధిష్ఠానాంశ-కూటస్థరూపముతోటి, సంయుక్తం-సహితమగు, భ్రమాంశం-చిదాభాసునితోగూడిన శరీరద్వయమును, అవలంబతే - తనస్వరూపముగాగ్రహించుచున్నాడో, తదా-ఆకాలమందు, అహం- నేను, సంసారీతి - సంసారిననని, ఏవం-ఈప్రకారము, అభిమన్యతే- అభిమానమును జేయుచున్నాడు.

తా. కనుక, పురుషుడు, ఏకాలమందు కూటస్థరూపముతోటిసంయుక్తమగు, చిదాభాసునితోగూడిన దేహద్వయమును, తనస్వరూపముగాగ్రహించుచున్నాడో, ఆకాలమందు నేను సంసారినని, ఈప్రకారముగా నభిమానించుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ భ్రిమాంశస్యతిరస్కారా దధిష్ఠానప్రధానతా।
యదాతదాచిదాత్మాహ మసంగోఽస్మీతిబుధ్యతే॥ ౮.

టీ. యదా-ఏకాలమందు, భ్రిమాంశస్య- దేహద్వయసహితచిదాభాసు యొక్క తిరస్కారాత్- అనాదరణమువల్ల, అధిష్ఠానప్రధానతా = అధిష్ఠాన-కూటస్థునియొక్క, ప్రధానతా-స్వరూపత్వముజీవునిచేగ్రహింపబడునో,తదా-ఆకాలమందు, అహం-నేను, చిదాత్మా- చిద్రూపుడను, అస్మీతి - ఇతినని యు, అసంగః-అసంగుడను, అస్మీతి- ఇతినని యు, బుధ్యతే-ఎరుగుచున్నాడు.

తా. మరియు, ఏకాలమందు, దేహద్వయసహిత చిదాభాసరూపమును మిథ్యాత్వజ్ఞానముచే ననాదరించుటవల్ల, అధిష్ఠానభూతుడైన కూటస్థునియొక్క స్వరూపత్వమే, పురుషునిచేత గ్రహింపబడునో, అప్పుడు; నేను అసంగచిద్రూపుడనైతినని జీవుడు తన నెరుగుచున్నాడు.

శ్లో॥ నాసంగేఽహంకృతిర్యుక్తా కథమస్మీతిచేచ్ఛృణు।
ఏకోముఖ్యోద్వావముఖ్యావిత్యర్థస్త్రివిధోఽహమః॥ ౯.

టీ. అసంగే-నిస్సంగుడైనకూటస్థునియందు,అహంకృతిః-అహంకారము, నయుక్తా సతీ-యుక్తముగాకపోవుచుండగా. కథం-ఎట్లు, అస్మీతిచేత్- నేనసంగచిద్రూపుడనైతినని యెరుగునంటివేని శృణు-చెప్పెదవినుము.అహమః-అహం-శబ్దముయొక్క, అనగా నేననెడిశబ్దముయొక్కయనుట. అర్థః-అర్థము, ఏకః-ఒకటి, ముఖ్యః-ముఖ్యార్థమగును. ద్వౌ-మరిరెండు, అముఖ్యౌ - అముఖ్యార్థములగును.ఇతి-ఈప్రకారము, త్రివిధః - అహంశబ్దార్థము త్రివిధమగును.

తా. ప్ర. అయితే,అధిష్ఠానమగు కూటస్థచైతన్యమునకు జీవస్వరూపత్వమును గ్రహించినయెడల, ఆకూటస్థుడసంగ చిద్రూపుడగుటచేత, అతనికి అహమనెడి జ్ఞానవిషయత్వము లేమివల్ల, నేనసంగచిద్రూపుడనైతిననెడి జ్ఞానమెట్లు సంభవించును?. ఉ. జ్ఞానవిషయుడుగాని చిద్రూపకూటస్థునియందు అహమనెడిజ్ఞానవిషయత్వము, ముఖ్యవృత్తిచేత లేకపోయినను,లక్షణావృత్తిచేత. ఆకూటస్థునియందు అహమనెడి జ్ఞానవిషయత్వము గలదు. ప్ర. అదియెట్లు?. ఉ. అహంశబ్దార్థము, మూడువిధములుగా నున్నది. ఆ త్రివిధములలో, నొకటి ముఖ్యార్థమనియు, మరిరెండు అముఖ్యార్థములనియుం జెప్పబడును.

శ్లో॥ అన్యోన్యాధ్యాస్తరూపేణ కూటస్థాభాసయోర్వపుః।
ఏకీభూయభవేన్ముఖ్య స్తత్రమూఢైః ప్రయుజ్యతే॥ ౧౦.

టీ. కూటస్థాభాసయోః = కూటస్థ - కూటస్థునియొక్కయు, ఆభాస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యోః-చిదాభాసునియొక్కయు, వపుః-స్వరూపము, అన్యోన్యాధ్యస్తరూపేణ-తాదాత్మ్యాధ్యాసరూపముచేత, ఏకీభూయ- ఏకీభవించి,అనగానవిద్యాధ్యారోపిచే నేకత్వమును బొందియనుట. ముఖ్యః - ముఖ్యార్థము, భవేత్ - అగును. (యతః) ఏకారణమువల్ల, తత్ర-ఆ యేకీభవించినరూపమందు, మూఢైః- మూఢులచేత. ప్రయుజ్యతే - అహంశబ్దము ప్రయోగించబడుచున్నదో, (అతః) ఆకారణమువల్ల నహంశబ్దార్థము ముఖ్యార్థమగును.

తా. ప్ర. అయితే, అందు ముఖ్యార్థమెట్టిది?. ఉ. కూటస్థచిదాభాసుల యొక్క స్వరూపము, అన్యోన్యాధ్యాసముచే నైక్యమునుపొంది,అహంశబ్దముచేజెప్పబడుచుండుటవల్ల, ముఖ్యార్థమగును. ప్ర. అయితే, ఇదిముఖ్యార్థమగుటకుగారణమేమి?. ఉ. వివేకముచేత విభజించి యెరుగబడని కూటస్థచిదాభాసులయొక్క అన్యోన్యాధ్యాసరూపమందు వివేకజ్ఞానశూన్యులగు సర్వమూఢులచేతను, ఏకారణమువల్ల అహంశబ్దము ప్రయోగించబడుచున్నదో, ఆకారణమువల్ల, ఇదిముఖ్యార్థమగునని తెలియవలెను.

అవ. ఇప్పుడు, అముఖ్యార్థములను రెంటిని జూపుచున్నాడు.

శ్లో॥ పృథగాభాసకూటస్థా వముఖ్యౌతత్రతత్వవిత్।
పర్యాయేణప్రయుఙ్క్తే౽హం శబ్దంలోకేచవైదికే॥ ౧౧.

టీ. ఆభాసకూటస్థౌ= ఆభాస - చిదాభాసుడును, కూటస్థౌ-కూటస్థుడును, పృథక్-ప్రత్యేకముగా నహంశబ్దార్థత్వముచే విభజింపబడిన వారగుచు, అముఖ్యౌ-అముఖ్యార్థవంతులగుదురు. (యతః) - ఏకారణమువల్ల, తత్ర- ఆకూటస్థచిదాభాసులయందు, తత్వవిత్-తత్వజ్ఞాని, అహంశబ్దం- నేననెడిశబ్దమును, లోకే-లోకవ్యవహారమందును, వైదికేచ- వైదికవ్యవహారమందును, పర్యాయేణ-వరుసగా, ప్రయుఙ్క్తే-ప్రయోగమునుజేయుచున్నాడో, (అతః)- ఆకారణమువల్ల నముఖ్యార్థములగును.

తా. చిదాభాసకూటస్థులిద్దరును, ప్రత్యేకముగా నహంశబ్దార్థత్వముచే నెప్పుడు విమర్శింపబడుదురో, అప్పుడు, అముఖ్యార్థములగును. ప్ర. అయితే, ఈరెంటికి నముఖ్యార్థత్వము గలుగుటకు గారణమేమి?. ఉ. ఏకారణమువల్ల, తత్వజ్ఞానియగువాడు, కూటస్థచిదాభాసులవిషయమై, అహంశబ్దమును, లౌకికవ్యవహారమందును, వైదికవ్యవహారమందును, పర్యాయముగా ప్రయోగించుచున్నాడో, ఆకారణమువల్ల,ఈరెండును అముఖ్యార్థములగును. అనగా,అన్యోన్యాధ్యాసముచే నేకీభూతమగుటవల్ల విభజించియెరుగబడని కూటస్థ చిదాభాసులయొక్క స్వరూపమందు అహంశబ్దమును సర్వజనులునువ్యవహరించుటచే


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నదిముఖ్యార్థమాయెననియు, కూటస్థచిదాభాసులయొక్క స్వరూపమునుబుద్ధిచే, విభజించి, ఆ కూటస్థ చిదాభాసులయందు ప్రత్యేకముగా నహంశబ్దమును వ్యవహరించెడిజనులు కొందరేయగుటచేత; ఈయహంశబ్దార్థములు రెండును,అముఖ్యార్థములాయెననియుం దెలియవలెను.

అవ. పర్యాయముగా నహంశబ్దమును ప్రయోగించుచున్నాడని చెప్పబడిన యర్థమునే. సులభముగా బోధించెడికొరకు, ఇప్పుడు రెండుశ్లోకములచే స్పష్టముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ లౌకికవ్యవహారేఽహం గచ్ఛామీత్యాదికేబుధః।
వివిచ్యైవచిదాభాసం కూటస్థాత్తంవివక్షతి॥ ౧౨.

టీ. బుధః-పండితుడు, అహం-నేను, గచ్ఛామి-వెళ్లుచున్నాను. ఇత్యాదికే-ఇదిమొదలగు, లౌకికవ్యవహారే-లోకవ్యవహారమందు, కూటస్థాత్-కూటస్థునివల్ల, చిదాభాసం-చిదాభాసుని, వివిచ్య-బుద్ధిచేతవిభజించి, తమేవ - ఆచిదాభాసునే, వివక్షతి- అహంశబ్దముచేజెప్పుట కిచ్ఛయించు చున్నాడు.

తా. విద్వాంసుడగువాడు, నేనువెళ్లుచున్నాననెడి, యిత్యాదిలౌకికవ్యవహారమందుబుద్ధిచేత కూటస్థునికంటె చిదాభాసుని భిన్నముగావిభజించి, ఆచిదాభాసునిమాత్రమే, నేననెడి శబ్దముచే జెప్పుటకు ఇచ్ఛయించు చున్నాడు.

శ్లో॥ అసంగోహంచిదాత్మాహ మితిశాస్త్రీయదృష్టితః।
అహంశబ్దంప్రయుఙ్క్తేఽయం కూటస్థేకేవలేబుధః॥ ౧౩.

టీ. అయం-ఈ, బుధః-విద్వాంసుడు, శాస్త్రీయదృష్టితః = శాస్త్రీయ-శాస్త్రసంబంధమైన, అనగా వేదాంతశ్రవణముచే గలిగినయనుట. దృష్టితః-జ్ఞానమువల్ల, అహం-నేను, అసంగః - నిస్సంగుడననునట్టియు, అహం-నేను, చిదాత్మా-చిద్రూపుడననునట్టి, ఇతి-ఈవిధముగలవైదికవ్యవహారమందు,కేవలే, బుద్ధిచే చిదాభాసునికంటె విభజింపబడిన, కూటస్థే-కూటస్థునియందు, అహంశబ్దం-నేననెడిశబ్దమును, ప్రయుఙ్క్తే-లక్షణావృత్తిచేత ప్రయోగించుచున్నాడు.

తా. ఈ విద్వాంసుడే, వేదాంత శ్రవణజ్ఞానముచేత, నేను నిస్సంగుడనునట్టియు, నేను చిదాత్ముడననునట్టి వైదికవ్యవహారమందు, బుద్ధిచేత చిదాభాసునికంటె విభజింపబడిన కూటస్థునియందే, లక్షణావృత్తిచే నహంశబ్దమును ప్రయోగించుచున్నాడు. కనుక, లక్షణావృత్తివల్ల నహంశబ్దార్థత్వముచేత కూటస్థునకు అహమనెడి జ్ఞానవిషయత్వము సంభవించుటవల్ల, నేనసంగ చిద్రూపుడనైతినని నెడి జ్ఞానము లభింపగలదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, పూర్వవాది, ఆక్షేపించుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ జ్ఞానితాజ్ఞానితేత్వాత్మా భాసస్యైవనచాత్మనః।
తథాచకథమాభాసః కూటస్థోస్మీతిబుధ్యతాం॥ ౧౪.

టీ. జ్ఞానితాజ్ఞానితేతు = జ్ఞానితా - జ్ఞానముగలిగియుండుటయు, అజ్ఞానితేతు-అజ్ఞానముగలిగియుండుటయు, అనగా జ్ఞానిత్వాజ్ఞానిత్వములో యనుట. ఆత్మాభాసస్యైవ=ఆత్మ-కూటస్థునియొక్క, ఆభాసస్యైవ - ప్రతిబింబమునకే గలవుగాని, అనగా చిదాభాసునకు గలవనుట, ఆత్మనః- కూటస్థునకు, నచ-లేవు. తథాచ-అట్లగుచుండగా, ఆభాసః-కూటస్థునికంటె నన్యుడగు చిదాభాసుడు, కూటస్థః-కూటస్థుడను, అస్మీతి-ఇతినని, కథం-ఎట్లు, బుధ్యతాం-బోధింపబడును. అనగా బోధింపబడుట కర్హుడుగాడనుట.

తా. ప్ర. అయితే, కూటస్థచిదాభాసులిద్దరును;అహంశబ్దమునకు అముఖ్యార్థవంతులని, ప్రత్యేకముగా జెప్పబడెను. వారిద్దరిలో, కూటస్థుడు, తనయజ్ఞాననివృత్తికొరకు నేనసంగచిద్రూపుడనైతిననియెరుగునో, లేక, అట్లుచిదాభాసుడెరుగునో చెప్పుము. మరియు, కూటస్థుడసంగుడగుటచేత, ఆకూటస్థునకు జ్ఞానిత్వాజ్ఞానిత్వములుగలదని చెప్పరాదు. కనుక, నేనసంగ చిద్రూపుడనైతినని కూటస్థుడెరుగరాదు. ఆకారణమువల్ల, చిదాభాసునకు జ్ఞానిత్వాజ్ఞానిత్వములంజెప్పవలయును. అట్లుచిదాభాసునకు జ్ఞానిత్వాజ్ఞానిత్వములు, జెప్పబడుచుండగా, కూటస్థునికంటె నన్యుడగు చిదాభాసుడు. నేను కూటస్థుడనైతినని యెరుగుటకు సమర్థుడెట్లగును?. అనగా నెరుగజాలడనుట.

అవ. ఇందుకు, సిద్ధాంతి, ప్రత్యుత్తరమును జెప్పుచున్నాడు.

శ్లో॥ నాయందోషశ్చిదాభాసః కూటస్థైకశరీరవాన్।
ఆభాసత్వస్యమిధ్యాత్వా త్కూటస్థత్వావశేషణాత్॥ ౧౫.

టీ. అయం-ఈ, దోషః-దోషము, న-లేదు. ఆభాసత్వస్య- చిదాభాసరూపమునకు, మిధ్యాత్వాత్ - మిధ్యాభావమగుటవల్లను, కూటస్థత్వావశేషణాత్=కూటస్థత్వ-కూటస్థరూపమే, అవశేషణాత్ - వాస్తవముగా శేషించుటవల్లను, చిదాభాసః- చిదాభాసుడు, కూటస్థైక శరీరవాన్=కూటస్థ-కూటస్థుడే, ఏక - ముఖ్యమైన, శరీరవాన్ - స్వరూపముగాగలవాడగును.

తా. ఓపూర్వవాదీ, ఆ చిదాభాసునకు కూటస్థుడే ముఖ్యస్వరూపమగుటవల్ల, ఈచిదాభాసుడుకూటస్థునికంటె నన్యుడుకానేకాడు. కనుక.ఈదోషములేదు. మరియు, ఈ చిదాభాసునకు నిజస్వరూపము కూటస్థుడేయగుటవల్ల, అద్దమందు ప్రతిబింబరూపముగా దోచెడిముఖము వాస్తవముగానట్లు, కూటస్థు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నియొక్క ప్రతిబింబగూప్పుడైన, ఈ చిదాభాసుడు, మిథ్యారూపుడగును. మరియు, అద్దమందుదోచెడి ముఖప్రతిబింబమునకు, ఆధారమైనముఖము వాస్తవమైనట్లు, అంతఃకరణమందు ప్రతిబింబ రూపముగాదోచెడి, ఈ చిదాభాసునకు ఆధారమగు కూటస్థచైతన్యబింబము, సత్యస్వరూపమై శేషించుచున్నదని తెలియవలెను.

శ్లో॥ కూటస్థోఽస్మీతిబోధోఽపి మిథ్యాచేన్నేతికోవదేత్।
నహిసత్యతయాఽభీష్టం రజ్జుసర్పవిసర్పణం॥ ౧౬.

టీ. కూటస్థ-కూటస్థుడను, అస్మీతి-ఐతిననెడి, బోధోఽపి- జ్ఞానంబును, మిథ్యాచేత్-మిథ్యయగుననియంటివేని, నేతి-మిథ్యకాదని,కః-ఎవడు, వదేత్-చెప్పును. అనగా మిథ్యయగుట మాకుసమ్మతమేననుట. రజ్జుసర్పవిసర్పణం= రజ్జు-త్రాటియందు గల్పించబడిన, సర్ప-సర్పముయొక్క, విసర్పణం-గమనాదికము, సత్యతయా-వాస్తవముగా, నహ్యభీష్టం- అంగీకరింపబడదుగదా.

తా. ప్ర. అయితే, చిదాభాసుడు మిథ్యయైనయెడల, ఆచిదాభాసునాశ్రయించినట్టి, కూటస్థుడనైతిననెడి జ్ఞానంబును, మిథ్యకాదా యేమి?. ఉ. కూటస్థస్వరూపముకంటె నన్యముగాదోచునదియంతయు, మిథ్యయగుట, మాకిష్టమేయగుటచేత, జ్ఞానము మిథ్యకాదని యెవ్వడును జెప్పజాలడు. మరియు, రజ్జువునందు భ్రాంతిచే గల్పించబడిన సర్పముయొక్క గమనాదికమున్నట్లు దోచినను, ఆగమనాదికార్యము వాస్తవమెట్లుగాదో, అటువలెనే, మిథ్యారూపుడైన చిదాభాసుడు సంపాదించినట్టి,కూటస్థుడనైతిననెడి జ్ఞానంబును,మిథ్యయేయగును.

శ్లో॥ తాదృశేనాపిబోధేన సంసారోహినివర్తతే।
యక్షానురూపోహిబలిరిత్యాహుర్లౌకికాజనాః॥ ౧౭.

టీ. తాదృశేన-అటువంటి, బోధేనాపి-జ్ఞానముచేతనే, సంసారః-సంసారము, నివర్తతేహి-నివృత్తినిబొందుచున్నదేను. యక్షానురూపః = యక్ష-యక్షునకు, అనురూపః-తగినట్టి, బలిరితి-ఆహారమని, లౌకికాః-లౌకికులగు,జనాః-జనులు, ఆహుః-చెప్పుదురు.

తా. ప్ర. అయితే, జ్ఞానముమిథ్యయైనయెడల,అట్టిజ్ఞానముచేత సంసారము నివర్తింపబడదుగదా?. ఉ. భూతమునకుతగినబలియని లౌకికజనులుచెప్పకొనినట్లు; చిదాభాసుడు మిథ్యయగుటచేత, అతనిచే సంపాదింపబడిన జ్ఞానముమిథ్యయగుచుండగా, ఆచిదాభాసునకుగల సంసారంబును మిథ్యయేయగుగాని, సత్యముగానేరదు. అనగా నసత్యమైన స్వప్నవ్యాఘ్రి దర్శనముచేత సత్యముగాదోచెడి నిద్ర, నివర్తింపబడినట్లు, అట్టిజ్ఞానముచేతనే, నివర్తింపద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గినసంసారంబును నివర్తించుచున్నదని యభిప్రాయము.

అవ. ఈ యుపపాదింపబడినయర్థము నిప్పుడుపసంహరించుచున్నాడు.

శ్లో॥ తస్మాదాభాసపురుష స్సకూటస్థో వివిచ్యతం।
కూటస్థోఽస్మీతివిజ్ఞాతు మర్హతీత్యభ్యధాచ్ఛ్రుతిః॥ ౧౭.

టీ. తస్మాత్- ఆకారణమువల్ల, పురుషః-పురుషశబ్దముచే జెప్పదగినట్టి యు, సకూటస్థః-కూటస్థసహితుడైనట్టి, ఆభాసః-చిదాభాసుడు, తం- ఆకూట స్థుని, వివిచ్య-మిథ్యాభూతుడైన తనకంటెభిన్నముగావిభజించి, కూటస్థః- కూ టస్థుడను, అస్మీతి-ఐతినని, విజ్ఞాతుం - ఎరుగుటకు, అర్హతీతి - తగుచున్నాడని, శ్రుతిః-శ్రుతి, అభ్యధాత్ - చెప్పెను.

తా. ఏకారణముచేత కూటస్థుడే చిదాభాసునకునిజస్వరూపమో,ఆకా రణముచేత, పురుషశబ్దముచేజెప్పదగినట్టి, కూటస్థసహితుడైన, చిదాభాసుడు, మిథ్యారూపుడైన తనకంటెకూటస్థునివిభజించి, లక్షణావృత్తిచేత నేను కూటస్థు డనైతినని యెరుగుటకు సమర్థుడగునని, యభిప్రాయముచేత, పూర్వోక్త శ్రుతి, చెప్పుచున్నదని తెలియవలెను.

అవ. ఇట్లు, పూర్వోక్తశ్రుతియందుగల, ౧. పురుషః,౨. అస్మి,అనెడి రెండుపదములయొక్క ప్రయోగాభిప్రాయమునుదెలిపి, యిప్పుడు, (అయం) అనెడి పదప్రయోగాభిప్రాయమును చెప్పుచున్నాడు.

శ్లో॥ అసందిగ్ధావిపర్యస్త బోధో దేహాత్మనీక్ష్యతే।
తద్వదత్రేతినిర్ణేతు మయమిత్యభిధీయతే॥ ౧౮.

టీ. దేహాత్మని=దేహ-దేహరూపమగు, ఆత్మని- ఆత్మయందు, అసంది గ్ధావిపర్యస్తబోధః=అసందిగ్ధ- సంశయరహితమైనట్టియు, అవిపర్యస్త విపర్య య రహితమైనట్టి, బోధః-ఈదేహమైతినని నెడిజ్ఞానము, ఈక్ష్యతే- కనబడుచు న్నది. అనగాలౌకికులకుగలిగియున్నదనుట. అత్ర- ఈప్రత్యగాత్మవిషయమై, తద్వదితి-అటువంటిజ్ఞానమును ముక్తిసిద్ధికొరకు సంపాదింపవలెనని, నిర్ణేతుం- నిర్ణయించుటకు, అయమితి- ఈస్వప్రకాశానందరూపపరమాత్మయని, అభిధీయ తే- శ్రుతిచే జెప్పబడుచున్నది.

తా. మరియు, లౌకికులకు ప్రసిద్ధమైన దేహమందు, ఈదేహమునేనై తినని నెడి జ్ఞానము, సంశయవిపర్యయరహితముగా గలిగియున్నట్లు, సంశయవి పర్యయరహితముగా, ఈప్రత్యగాత్మ, నేనైతిననెడిజ్ఞానమును ముక్తిసిద్ధించె డికొరకు సంపాదింపవలెనని నిర్ణయించుటకు, (అయం) ఈస్వప్రకాశానందరూ ప పరమాత్మయనెడి యర్థముగలపదము, శ్రుతియందు ప్రయోగింపబడెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇటువంటిజ్ఞానమే, మోక్షసాధనమనుటయందు, ఇప్పుడు, ఆచార్యవాక్యమును పఠించుచున్నాడు.

శ్లో॥ దేహాత్మజ్ఞానవజ్జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకం।
ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపిముచ్యతే॥ ౨౦.

టీ. దేహాత్మజ్ఞానబాధకం=దేహ - శరీరమే, ఆత్మ - నేననెడి, జ్ఞాన-జ్ఞానమును, బాధకం-బాధించునట్టిదియు, దేహాత్మజ్ఞానవత్ - దేహ- శరీరమే, ఆత్మ-నేననెడి, జ్ఞానవత్-దృఢజ్ఞానమువంటి, జ్ఞానం - దృఢమగుబ్రహ్మజ్ఞానము, ఆత్మన్యేవ- ప్రత్యగాత్మయందే, యస్య- ఏపురుషునకు, భవేత్-కలుగునో, సః-ఆపురుషుడు, నేచ్ఛన్నపి- మోక్షము నిచ్ఛయింపకపోయినను, ముచ్యతే- సంసారబంధమునుంచి విడువబడుచున్నాడు.

తా. దేహమేనేననెడి మనుష్యజ్ఞానమును బాధించునట్టిదియు, దేహమేనేననెడి మనుష్యజ్ఞానమువంటి, దృఢమైన బ్రహ్మజ్ఞానము, ప్రత్యగాత్మయందే, యేపురుషునకుగలుగునో, ఆపురుషుడు, మోక్షేచ్ఛలేనివాడైనను, సంసారహేతువగు అజ్ఞానము జ్ఞానముచే బాధింపబడుటచేత, సంసార బంధమునుంచి విడువబడుచున్నాడని శ్రీమదాచార్యులు చెప్పిరని యభిప్రాయము.

శ్లో॥ అయమిత్యపరోక్షత్వ ముచ్యతేచేత్తదుచ్యతాం।
స్వయంప్రకాశంచైతన్య మపరోక్షంసదాయతః॥ ౨౧.

టీ. అయమితి- ఈస్వప్రకాశానందరూప పరమాత్మయనెడి యర్థముగల పదము, అపరోక్షత్వం - ఆత్మకుప్రత్యక్షత్వమును, ఉచ్యతేచేత్ - చెప్పుచున్నదనియలటివేని, యతః-ఏకారణమువల్ల, చైతన్యం- కూటస్థ చైతన్యము, స్వయంప్రకాశంసత్ - స్వప్రకాశస్వరూపమగుచు, సదా- ఎల్లప్పుడును, అపరోక్షం-ప్రత్యక్షముగానున్నదో, (అతః) ఆకారణమువల్ల, తత్ - ఆప్రత్యక్షత్వము, ఉచ్యతాం-చెప్పబడుగాక.

తా. ప్ర. అయితే, ఈఘటమనెడి, యిత్యాదిప్రయోగములయందు, ఇదియనినిర్దేశింపబడినవస్తువునకు ప్రత్యక్షత్వము కనబడినట్లు, ఈపరమాత్మనైతినెడియర్థముగల, (అయం) అనెడిశబ్దప్రయోగమందును, ఆత్మకు ప్రత్యక్షత్వము వినబడుచున్నదనిచెప్పరాదాయేమి?. ఉ. అట్లు చెప్పుటయు, మాకుసమ్మతమేయగును. ప్ర. అదిమీకుసమ్మతమగుటెట్లు?. ఉ. అద్వితీయమైనకూటస్థచైతన్యము, సర్వదా, ఇతరసాధనమునపేక్షింపకనే, చిద్రూపముచేత స్వయముగా ప్రకాశించుచు నిత్యాపరోక్షరూపముగానుండుటచేత, అట్లు చెప్పుట మాకిష్టమేయగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ పరోక్షమపరోక్షంచ జ్ఞానమజ్ఞానమిత్యదః।
నిత్యాపరోక్షరూపేపి ద్వయంస్యాద్దశమేయథా॥ ౨౨.

టీ. పరోక్షం- ప్రత్యక్షత్వములేమియు, అపరోక్షంచ-ప్రత్యక్షత్వంబును, జ్ఞానం - ఎరుకయు, అజ్ఞానమితి- మరుపనెడి, అదః-ఈ, ద్వయం- రెంటను, దశమేయథా-పదియవవానియందువలె, నిత్యాపరోక్షరూపేపి= నిత్య- సర్వదా, అపరోక్షరూపేపి - అపరోక్షరూపుడగు ప్రత్యగాత్మునందును, స్యాత్- అగును. అనగా నుండుననుట.

తా. ప్ర. అయితే, ఆత్మస్వప్రకాశచిద్రూపుడగుటచేత, నిత్యాపరోక్షరూపుడనిచెప్పినయెడల, (అయం) అనెడిపదమునకు మరియొక యభిప్రాయవర్ణనాంగీకారబలమువల్లగలిగెడి, ౧. పరోక్షవిషయత్వంబును, ౨. అపరోక్షవిషయత్వంబును, ౩. పూర్వోక్తజ్ఞానాశ్రయ విషయత్వంబును, ౪. అజ్ఞానాశ్రయవిషయత్వంబును, ఆత్మకెట్లుసంభవించునోచెప్పుము?. ఉ. ఆత్మ, నిత్యాపరోక్షరూపుడైనను, ౧. పరోక్షాపరోక్షవిషయత్వంబును, ౨. పూర్వోక్తజ్ఞానాజ్ఞానవిషయత్వంబును, ఈరెండును పదియవవానియందున్నట్లు, ఈ సర్వమాత్మయందు సంభవింపగలదని తెలియవలెను.

అవ. ఇప్పుడు, ఆదృష్టాంతమును తెలుపుచున్నాడు.

శ్లో॥ నవసంఖ్యాహృతజ్ఞానో దశమోవిభ్రమాత్తదా।
నవేత్తిదశమోస్మీతి వీక్షమాణోపితాన్నవ॥ ౨౩.

టీ. నవసంఖ్యాహృతజ్ఞానః= నవసంఖ్యా-తొమ్మిదిమందిగల సంఖ్యచేత, హృత-అపహరించబడిన, జ్ఞానః - జ్ఞానముగల, దశమః - పదియవవాడు, తాన్-ఆ, నవ-తొమ్మిదిమంది పురుషులను. వీక్షమాణోపి-చక్కగాజూచుచుండియు, విభ్రమాత్-భ్రాంతివల్ల, తదా-అప్పుడు, దశమః - పదియవవాడను, అస్మీతి-ఐతినని, నవేత్తి - ఎరుగడు.

తా. పదిమందిపురుషులు, పరదేశమునకువెళ్లుచు, మార్గమందొకనదీప్రవాహమునుదాటి, ఆవలగట్టునకు సుఖముగాజేరిరి. అందుముఖ్యుడగు పదియవవాడు, తాను పదిమందియు సుఖముగాజేరిరో, లేదో, యని సంశయించి, తొమ్మిదిమందిని లెక్కపెట్టి, ఆ తొమ్మిదిమందిని జక్కగాజూచుచు, గణనకర్తయగు తాను, సర్వదా ప్రత్యక్షముగా నుండియు, ఆ తొమ్మిదిమందిని లెక్కించెడిలెక్కచేత తననుమరచి, నేను పదియవవాడనైతినని యెరుగకుండెను. ఆపదియవవాడు, నేను పదియవవాడనని యెరుగమియే, అజ్ఞానమని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection: Digitized by eGangotri

అవ. ఇట్లు దశమునియందు అజ్ఞానమునుజూపి, ఆయజ్ఞాన కార్యమగు ఆవరణము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ నభాతినాస్తిదశమ ఇతిస్వందశమంతదా।
మత్వావక్తితదజ్ఞాన కృతమావరణంవిదుః॥ ౨౪.

టీ. తదా-అప్పుడు, దశమః-పదియవవాడు, స్వం - తాను, దశమం సంతం-పదియవవాడుగానుండియు, దశమః-పదియవవాడు, నాస్తీతి - లేడనియు, నభాతీతి తోచలేదనియు, మత్వా-తెలిసి, వక్తి - చెప్పుచున్నాడు. తత్-అట్లుచెప్పుటకుగారణమును, అజ్ఞానకృతం = అజ్ఞాన - అజ్ఞానముచేత, కృతం-చేయబడిన,ఆవరణం-ఆవరణమునుగా,(బుధాః)పండితులు,విదుః-తెలియుదురు.

తా. మరియు, అప్పుడు, పదియవవాడు, తానుపదియవవాడుగానుండియు, పదియవవాడులేడనియు, తోచలేదనియుందెలిసిచెప్పుచున్నాడు. ఇట్లు చెప్పుటకు గారణమెద్దియో;అదియే,అజ్ఞానకార్యమగు ఆవరణమునుగావిద్వాంసులుతెలిసికొనిరి. దశముడులేడనుట, ఆవరణముయొక్క అసత్వాంశ మగుననియు, దశముడుదోచలేదనుట, ఆవరణముయొక్క అభానాంశమనియుం దెలియవలెను.

అవ. ఆయజ్ఞానకార్యమేయగు,విశేషవిక్షేపమునిప్పుడుజూపుచున్నాడు.

శ్లో॥ నద్యాంమమారదశమ ఇతిశోచన్ప్రరోదితి।
అజ్ఞానకృతవిక్షేపం రోదనాదింవిదుర్బుధాః॥ ౨౫.

టీ. దశమః-పదియవవాడు, నద్యాం-నదియందు, మమారఇతి- పదియవవాడు చచ్చెనని, శోచన్-దుఃఖించుచు, ప్రరోదితి - పెద్దగా నేడ్చుచున్నాడు. బుధాః-పండితులు, రోదనాదిం - ఏడ్పు మొదలగువానిని, అజ్ఞాన కృతవిక్షేపం=అజ్ఞాన-అజ్ఞానముచేత, కృత-చేయబడిన, విక్షేపం- విశేషవిక్షేపమునుగా, విదుః - తెలిసికొనిరి.

తా. మరియు, పదియవవాడు, ఆపదియవవాడు నదీప్రవాహమందు జచ్చెనని దుఃఖించుచు పెద్దధ్వని గలుగునట్లు ఏడ్చుచు, శిరస్సు గొట్టుకొనుచున్నాడు. ఈయేడ్పు మొదలగుదానిని, అజ్ఞానకార్యమేయగు విశేషవిక్షేపమునుగా పెద్దలుతెలిసికొనిరి.

అవ. ఇప్పుడు, దశమునియొక్క అసత్వమునెడి, ఆవరణాంశమును నివర్తింపజేసెడి పరోక్షజ్ఞానమును జెప్పుచున్నాడు.

శ్లో॥ నమృతోదశమోస్తీతి శ్రుత్వాప్తవచనంతదా।
పరోక్షత్వేనదశమం వేత్తిస్వర్గాదిలోకవత్॥ ౨౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. తదా-అప్పుడు, దశమః- పదియవవాడు, నమృతఇతి - మృతినిబొం దినవాడుగాడనియు, అస్తీతి- కలడనెడి, ఆప్తవచనం = ఆప్త-విహితునియొక్క, వచనం-వాక్యమును, శ్రుత్వా-విని, పరోక్షత్వేన-పరోక్షభావముచేత, స్వర్గాదిలోకవత్-స్వర్గాదిలోకమునువలె, అనగా స్వర్గాదిలోకము నెరిగినట్లనుట. దశమం - పదియవవానిని, వేత్తి- పదియవవాడెరుగుచున్నాడు.

తా. మరియు, అప్పుడు, ఒకానొకవిహితునివల్ల, పదియవవాడుచావలే దనియు, సుఖముగానున్నాడనియుం బదియవవాడు వినినవాడై, పరోక్షత్వము చేత స్వర్గాదిలోకము నెరిగినట్లు, పదియవవానినెరుగుచున్నాడు. ఇట్లెరుగుట, పరోక్షజ్ఞానమగును. ఈపరోక్షజ్ఞానముచేత దశముడులేడనుటకు కారణమైన ఆవరణాంశము నివర్తించుచున్నదని తెలియవలెను.

అవ. ఇప్పుడు, ఆ దశమునియొక్క అభానమనెడి, ఆవరణాంశమును నివర్తింపజేసెడి, అపరోక్షజ్ఞానమును జూపుచున్నాడు.

శ్లో॥ త్వమేవదశమోసీతి గణయిత్వాప్రదర్శితః।
అపరోక్షతయాజ్ఞాత్వా హృష్యత్యేవనరోదితి॥ ౨౭.

టీ. త్వమేవ-నీవే, దశమః - పదియవవాడవు, అసీతి-ఇతివని, గణయిత్వా-లెక్కపెట్టి, ప్రదర్శితః-విహితునిచేజూపబడెను. అపరోక్షతయా- ప్రత్యక్షభావముచేత, జ్ఞాత్వా-నేనేపదియవవాడనైతినినియెరిగి, హృష్యత్యేవ- సంతోషమునే బొందుచున్నాడు. నరోదితి - దుఃఖమునువిడచుచున్నాడు.

తా. మరియు, అదివరకు తనచేత లెక్కపెట్టబడిన తొమ్మిదిమందిలో టికూడ, అప్పుడు తనను లెక్కబెట్టి నీవేపదియవవాడవైతివని విహితుడుజూపగా, అప్పుడు, నేనే పదియవవాడనైతినని అపరోక్షత్వముచేత, పదియవవాడై నతననుతానెరిగి, సంతోషమునుబొంది, దుఃఖమును విడిపించెను. దుఃఖమును విడుచుట, దుఃఖనివృత్తియనెడి యవస్థయగును. సంతోషించుట, తృప్తియనెడి యవస్థయగును. ఇట్లు దృష్టాంతభూతుడైన దశమునియందు, ౧. అజ్ఞానము, ౨. ఆవరణము, ౩. విక్షేపము,౪. పరోక్షజ్ఞానము,౫.అపరోక్షజ్ఞానము,౬. దుఃఖనివృత్తి,౭.తృప్తి:అనగా నానందప్రాప్తియనెడి సప్తావస్థలున్నవని తెలియవలెను.

అవ. ఇట్లు, దృష్టాంత భూతుడైన దశమునియందు జూపబడిన అవస్థాసప్తకప్రకారము, ఆయవస్థాసప్తకమును దార్ష్టాంతికమగు ఆత్మయందును, ఆలోచింపదగినదని చెప్పుచున్నాడు.

శ్లో॥ అజ్ఞానావృతివిక్షేప ద్వివిధజ్ఞానతృప్తయః।
శోకాపగమఇత్యేతే యోజనీయాశ్చిదాత్మని॥ ౨౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అజ్ఞానావృతివిక్షేపద్వివిధజ్ఞానతృప్తయః = అజ్ఞాన - అజ్ఞానంబును, ఆవృతి-ఆవరణంబును, విక్షేప - విక్షేపంబును, ద్వివిధజ్ఞాన- జ్ఞానద్వయంబును, తృప్తయః-తృప్తియు, శోకాపగమః - దుఃఖనివృత్తియు, ఇతి - ఇట్లనెడి, ఏతే- ఈసప్తావస్థలును, చిదాత్మని-ఆత్మయందు, యోజనీయాః-కూర్చదగినవగును. అనగా నాలోచింపదగినవగుననుట.

తా. ౧. అజ్ఞానము, ౨. ఆవరణము, ౩. విక్షేపము, ౪. పరోక్షజ్ఞానము, ౫. అపరోక్షజ్ఞానము, ౬. దుఃఖనివృత్తి, ౭. తృప్తి. అనెడి ఈసప్తావస్థలును, ఆత్మయందుగలవని తెలియవలెను.

అవ. అక్కడాత్మయందు, అజ్ఞానాద్యవస్థాసప్తకమును, నాలుగుశ్లోకములచే నిప్పుడు క్రమముగా జూపుచున్నాడు,

శ్లో॥ సంసారాసక్తచిత్తస్సం శ్చిదాభాసఃకదాచన।
స్వయంప్రకాశకూటస్థం స్వతత్వంనైవవేత్త్యయం॥ ౨౯.

టీ. అయం-ఈ, చిదాభాసః-చిదాభాసుడు, సంసారాసక్తచిత్తస్సన్= సంసార-సంసారమందు, ఆసక్త- ఆసక్తిగల, చిత్తస్సన్ - చిత్తముగలవాడగుచు, కదాచన-ఎప్పుడును, అనగా శ్రుత్యర్థవిచారము జేయుటకంటెబూర్వమందనుట. స్వతత్వం = స్వ-తనయొక్క, తత్వం-నిజరూపమగు, స్వయంప్రకాశకూటస్థం=స్వయంప్రకాశ - స్వప్రకాశమానుడగు, కూటస్థం-ప్రత్యగాత్మను, నైవవేత్తి - ఎరుగనేయెరుగడు.

తా. ఈ చిదాభాసుడగు జీవుడు, విషయభోగసంపాదనాదులయందు ఆసక్తచిత్తముగలవాడగుచు, శ్రుత్యర్థవిచారము జేయనిపూర్వమందెప్పుడైనను, తననిజరూపమగు స్వప్రకాశ చిద్రూపకూటస్థాత్మనెరుగమియెద్దిగలదో, అదియే, అజ్ఞానమనెడి ప్రథమావస్థయగును.

శ్లో॥ నభాతినాస్తికూటస్థ ఇతివక్తిప్రసంగతః।
కర్తాభోక్తాహమస్మీతి విక్షేపంప్రతిపద్యతే॥ ౩౦.

టీ. ప్రసంగతః-కూటస్థవిషయకప్రసంగవశమువల్ల, కూటస్థః- కూటస్థుడు, నాస్తీతి-లేడనియు, నభాతీతి-తోచలేదనియు, అనగా ప్రకాశింపలేదనుట. వక్తి-చిదాభాసుడు జెప్పుచున్నాడు. అహం-నేను, కర్తా- కర్మములంజేయువాడను, అస్మీతి-ఐతినని యు, భోక్తా - కర్మఫలమననుభవించెడివాడను, అస్మీతి-ఐతినని, విక్షేపం - విక్షేపరూపమును, ప్రతిపద్యతే-పొందుచున్నాడు.

తా. మరియు, కూటస్థవిషయమైన ప్రసంగము గలుగుచుండగా, కూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టస్థుడు లేడనియు, తోచలేదనియు, ఇట్లు చిదాభాసుడు తెలిసి చెప్పుచున్నాడు. ఇదియే, అజ్ఞానకార్యమగు ఆవరణద్వయమనెడి ద్వితీయావస్థ యగును. మరియు, కూటస్థుడు లేడనియు, తోచలేదనియుం జెప్పినప్రకారమే, నేను కర్తననియు, భోక్తననియుండలచుచు, విక్షేపరూపమునుపొంది, తన కర్తృత్వ భోక్తృత్వాదులను కూటస్థాత్మయం దారోపించుచున్నాడు. ఇది విక్షేపమనెడి తృతీయావస్థయగును. ప్ర. అయితే, ఈ యారోపమునకు హేతువెద్ది?. ఉ. స్థూలసూక్ష్మదేహములతోగూడిన చిదాభాసుడు, విక్షేపమని చెప్పబడును. ఆ విక్షేపమే హేతువగును.

శ్లో॥ అస్తికూటస్థఇత్యాదౌ పరోక్షంవేత్తివార్తయా।
పశ్చాత్కూటస్థఏవాస్మీత్యేవంవేత్తివిచారతః॥    ౩౧.

టీ. వార్తయా- గురువాక్యముచేత, కూటస్థః- కూటస్థుడు, అస్తి-కలడని, ఆదౌ.ఆదియందు, అనగామొదటనుట. పరోక్షం-పరోక్షముగా, వేత్తి-ఎరుగుచున్నాడు. పశ్చాత్ - అట్లెరిగినపిమ్మట, విచారతః-విచారణవల్ల, కూటస్థఏవ- కూటస్థుడే, అస్మీతి- ఐతినని, ఏవం - ఈప్రకారము ప్రత్యక్షముగా, వేత్తి- కూటస్థునెరుగుచున్నాడు.

తా. మరియు, గురునిచే బోధింపబడినవాడగుచు కూటస్థుడొకడుగలడనియెరుగుచున్నాడు. ఇది పరోక్షజ్ఞానమనెడి చతుర్థావస్థయగును. పిమ్మట, వేదాంతవాక్యార్థవిచారణమువల్ల, ఆకూటస్థుడే, నేనైతినని ప్రత్యక్షముగానెరుగుచున్నాడు. ఇది యపరోక్షజ్ఞానమనెడి పంచమావస్థయగును.

శ్లో॥ కర్తాభోక్తేత్యేవమాది శోకజాతంప్రముంచతి।
కృతంకృత్యంప్రాపణీయంప్రాప్తమిత్యేవతుష్యతి।    ౩౨.

టీ. కర్తేతి- కర్మములంజేయువాడననునట్టియు, భోక్తేతి - కర్మఫలమననుభవించెడివాడననెడి, ఏవమాది- ఇత్యాదిరూపముగల, శోకజాతం- శోకదుఃఖములయొక్క, జాతం-రాశిని, ప్రముంచతి - విడుచుచున్నాడు. కృత్యం-చేయదగినదంతయు, కృతమితి - చేయిబడెననియు, ప్రాపణీయం-పొందదగినఫలమంతయు, ప్రాప్తమిత్యేవ- పొందబడెననియు, తుష్యతి - సంతోషమును బొందుచున్నాడు.

తా. మరియు, అసంగుడైన కూటస్థాత్మ, నేనైతిననెడి, అపరోక్షజ్ఞానము గలిగినపిమ్మట, నభిమానముచేగలిగిన కర్తృత్వ భోక్తృత్వరూప దుఃఖరాశినంతయు, విడుచుచున్నాడు. ఇది దుఃఖనివృత్తియనెడి, షష్ఠమావస్థయగును. మరియు, నేను జేయదగినదంతయు. నాచేత జేయబడెననియు: నేను పొంద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దగినఫలమంతయు నాచేతపొందబడెనని, సంతోషించుచున్నాడు. ఇది, తృప్తి యనెడి సప్తమావస్థ యగును.

అవ. ఇట్లు దార్ష్టాంతికమందును జెప్పబడిన అవస్థాసప్తకము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ అజ్ఞానమావృతి స్తద్వ ద్విక్షేపశ్చ పరోక్షధీః।
అపరోక్షమతిశ్శోక మోక్ష స్తృప్తిర్నిరంకుశా॥ 33.

టీ. అజ్ఞానంచ-అజ్ఞానంబును, ఆవృతిశ్చ-ఆవరణద్వయంబును,తద్వత్-ఆప్రకారము, విక్షేపశ్చ-విక్షేపంబును, పరోక్షధీశ్చ-పరోక్షజ్ఞానంబును; అపరోక్షమతిశ్చ - అపరోక్షజ్ఞానంబును, శోకమోక్షః = శోక-దుఃఖముయొక్క, మోక్షః-నివృత్తియు, నిరంకుశా - నిరాటంకమగు, తృప్తిశ్చ- తృప్తియు.

తా. ౧. అజ్ఞానము, ౨. ఆవరణద్వయము, 3. విక్షేపము, ౪. పరోక్షజ్ఞానము, ౫. అపరోక్షజ్ఞానము, ౬. దుఃఖనివృత్తి, ౭. తృప్తియనగా నానందప్రాప్తియనెడి ఈసప్తావస్థలును ఆత్మయందుఁగలవని తెలియవలెను.

శ్లో॥ సప్తావస్థాఇమాస్సంతి చిదాభాసస్యతాస్విమౌ।
బంధమోక్షౌ స్థితౌతత్ర తిస్రోబంధకృతస్స్మృతాః॥ 3౪.

టీ. ఇమాః-ఈ, సప్తావస్థాః-సప్త-ఏడైన, అవస్థాః- అవస్థలు, చిదాభాసస్య- చిదాభాసునకు, సంతి - గలిగియున్నవి. తాసు - ఆసప్తావస్థలయందు, ఇమౌ-ఈ, బంధమోక్షౌ-బంధమోక్షములు రెండును, స్థితౌ- స్థితినిబొందియున్నవి. తత్ర-ఆసప్తావస్థలయందు, తిస్రః - మూడవస్థలు; అనగా నజ్ఞానావరణవిక్షేపములనుట. బంధకృతః=బంధ-సంసారబంధమును, కృతః- కలిగించుచున్నవని, స్మృతాః - చెప్పబడినవి.

తా. ప్ర. అయితే, ఈసప్తావస్థలును, ఆత్మధర్మములని యంగీకరించినయెడల, ఆయాత్మకు నిర్వికారిత్వమును దెలిపెడి కూటస్థశబ్దార్థమునకు భంగము గలుగదాయేమి?. ఉ. వా. సర్వంవాక్యంసావధారణం॥ అనెడి న్యాయప్రకారము, ఈసప్తావస్థలును చిదాభాసునకే గలిగియున్నవిగాని, కూటస్థునకొక్కటినైనను లేదు. ప్ర. అయితే, ఈసప్తావస్థల నిక్కడ జెప్పుట, నిష్ప్రయోజనమేగదా?. ఉ. ఈసప్తావస్థలును, జీవునకు బంధమోక్షరూపఫలమును గలిగించుచుండుటచేత, వ్యర్థముగాదు. ప్ర. అయితే, ఈసప్తావస్థలకును,అవిశేషముగా బంధమోక్షకారిత్వము గలిగియున్నదేమో జెప్పుము?. ఉ. ఆ సప్తావస్థలలో, అజ్ఞానావరణవిక్షేపములనెడి మూడవస్థలును, జీవునకు బంధమును గలిగించునని యగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఆమూఢవస్థలకు బంధకారిత్వమును జూపుటకొరకు, అనూటికి యొక్క స్వరూపమును ప్రత్యేకముగా కార్యప్రదర్శనముచేత, స్పష్టీకరించుటకిచ్ఛయించినవారై యిప్పుడజ్ఞాన స్వరూపమును జూపుచున్నాడు.

శ్లో॥ నజానామీత్యుదాసీన వ్యవహారస్యకారణం।
విచారప్రాగభావేనయుక్తమజ్ఞానమీరితం॥ ౩౫.

టీ. విచారప్రాగభావేన=విచార- ఆత్మస్వరూపవిచారము జేయుటకంటె, ప్రాక్ - పూర్వమందు, అభావేన-అభావముతోటి, యుక్తం - కూడినదియు, ఉదాసీనవ్యవహారస్య - ఉదాసీనవ్యవహారమునకు, కారణం-హేతువగునదియు, నజానామీతి- ఎరుగననియనుభవింపబడునది, అజ్ఞానం-అజ్ఞానమని, ఈరితం - చెప్పబడును.

తా. ఆత్మతత్వవిచారము జేయుటకంటె బూర్వకాలమందు అభావసహితమైనదియు, మరియు, బురుషు డేమియుంజేయక తోచకుండుటకు గారణమైనదియు, నేనెరుగననియనుభవింపబడుచున్నదియగు ఇదియేఅజ్ఞానమగును.

అవ. ఇప్పుడు,ఆవరణస్వరూపమును, తత్కార్యంబుంజూపుచున్నాడు.

శ్లో॥ అమార్గేణవిచార్యాథ నాస్తినోభాతిచేత్యసౌ।
విపరీతవ్యవహృతి రావృతేఃకార్యమిష్యతే॥ ౩౬.

టీ. అమార్గేణ-అశాస్త్రీయమార్గముచేత,అనగా కేవలతర్కముచేననుట. విచార్య విచారించి, అథ-పిమ్మట, అసౌ-ఈకూటస్థుడు, నాస్తీతి - లేడనియు, నోభాతీతిచ- తోచలేదనెడి, అనగా, ప్రకాశింపలేదనెడియనుట. విపరీతవ్యవహృతిః=విపరీత-విరుద్ధమగు, వ్యవహృతిః-వ్యవహారము, ఆవృతేః - ఆవరణముయొక్క, కార్యం-కార్యమని, ఇష్యతే - ఇచ్ఛయింపబడుచున్నది.

తా. మరియు, శాస్త్రోక్తపద్ధతినతిక్రమించి, కేవలతర్కముచేత విచారముచేసి, పిమ్మట కూటస్థుడులేడనియు, తోచలేదనియు, ఇట్టి విపరీతవ్యవహారమెద్దిగలదో, అద్ది, ఆవరణముయొక్క కార్యమని చెప్పబడును.

అవ. ఇప్పుడు, విక్షేపస్వరూప తత్కార్యంబుం జూపుచున్నాడు.

శ్లో॥ దేహద్వయచిదాభాస రూపోవిక్షేపఈరితః।
కర్తృత్వాద్యఖిలశ్శోక స్సంసారాఖ్యోస్యబంధకః॥ ౩౭.

టీ. దేహద్వయచిదాభాసరూపః = దేహద్వయ- స్థూలసూక్ష్మశరీరద్వయముతోగూడిన, చిదాభాస- చిదాభాసునియొక్క, రూపః - రూపము, విక్షేపః-విక్షేపమని, ఈరితః-చెప్పబడెను. బంధకః - బంధహేతువైన, సంసారాఖ్యః=సంసార - సంసారమనెడి, ఆఖ్యః-పేరుగల,కర్తృత్వాద్యఖిలః=కర్తృ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్వ- కర్తృత్వమే, ఆది-ఆదిగాగల, అఖిలః- సకలమగు, శోకః - దుఃఖము, అస్య-ఈచిదాభాసునియొక్క కార్యమగును.

తా. మరియు, స్థూలసూక్ష్మములనెడి రెండుదేహములతోగూడినచిదాభాసుడే విక్షేపమగును. మరియు, బంధహేతువగునట్టియు, సంసారమనెడి పేరుగలిగినట్టి, కర్తృత్వభోక్తృత్వ ప్రమాతృత్వాది రూపమగు సకలదుఃఖంబును, ఈవిక్షేపరూపుడగు చిదాభాసునియొక్క కార్యమగును.

శ్లో॥ అజ్ఞానమావృతిశ్చైతే విక్షేపాత్ప్రాక్ప్రసిధ్యతః।
యద్యప్యథాప్యవస్థేతే విక్షేపస్యైవ నాత్మనః॥ ౩౮.

టీ. యద్యపి-విచారించగా, అజ్ఞానం-అజ్ఞానంబును, ఆవృతిశ్చ- ఆవరణంబును, ఏతే-ఈరెండవస్థలును, విక్షేపాత్-విక్షేపముకంటె, ప్రాక్-పూర్వమందు, ప్రసిధ్యతః - ప్రసిద్ధినిపొందియున్నవి. అనగా సిద్ధించుచున్నవనుట. అథాపి- ఐనను, తే-ఆరెండైన, అవస్థే-అవస్థలు, విక్షేపస్యైవ-చిదాభాసునకే యగును. ఆత్మనః - కూటస్థునకు, న-లేవు.

తా. ప్ర. అయితే, విక్షేపోత్పత్తికంటె బూర్వమందజ్ఞానావరణములుండుటచేతయు, చిదాభాసుడు విక్షేపము లోగానుండుటచేతయు, ఆరెండవస్థలును చిదాభాసునకులేకపోవుచుండగా, సప్తావస్థలును చిదాభాసునకే గలవని, చెప్పుటయుక్తమెట్లగును?. ఉ. ఈయజ్ఞానావరణములు రెండును విక్షేపముకంటె బూర్వమందున్నను, కూటస్థాత్మ, అసంగుడగుటచేత, ఆకూటస్థునకు ఏయవస్థయుంజెప్పరాదు. ఆకారణముచేత, ఆరెండవస్థలను విక్షేపరూప చిదాభాసునకే గలవని చెప్పవలయును.

శ్లో॥ విక్షేపోత్పత్తితఃపూర్వ మపివిక్షేపసంస్కృతిః।
అస్త్యేవతదవస్థాత్వ మవిరుద్ధంతత స్తయోః॥ ౩౯.

టీ. విక్షేపోత్పత్తితః= విక్షేప-విక్షేపముయొక్క, ఉత్పత్తితః - ఉత్పత్తికంటె, పూర్వమపి-పూర్వమందును, విక్షేపసంస్కృతిః= విక్షేప - విక్షేపముయొక్క, సంస్కృతిః- సంస్కారము, అస్త్యేవ-ఉన్నదేయగును. తతః-ఆకారణమువల్ల, తయోః-ఆయజ్ఞానావరణములకు రెంటికిని, తదవస్థాత్వం = తత్-ఆచిదాభాసునియొక్క, అవస్థాత్వం-అవస్థాభావము, అవిరుద్ధం- విరోధముగాదు. అనగానజ్ఞానావరణములనెడి రెండవస్థలనుచిదాభాసునకుజెప్పవచ్చుననుట.

తా. ప్ర. అయితే, అజ్ఞానావరణావస్థాకాలమందు, అవస్థావంతుడైన విక్షేపరూప చిదాభాసుడు లేకపోవుచుండగా, ఆరెండవస్థల నాచిదాభాసునకెట్లుచెప్పవచ్చును?. ఉ. విక్షేపరూపచిదాభాసోత్పత్తికంటె బూర్వమందును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవిక్షేప సంస్కారముండుటచేత, ఆ యజ్ఞానావరణములనెడి రెండవస్థలను చిదాభాసునకుజెప్పుటవల్ల, విరోధములేదు. అనగా నాయజ్ఞానావరణావస్థాకాలమందు విక్షేపరూపచిదాభాసుడు లేకపోయినను, అవిక్షేపసంస్కార మప్పుడుండుటచేత, ఆరెండవస్థలను విక్షేపరూప చిదాభాసునకు జెప్పుటవల్ల విరోధములేదని యభిప్రాయము.

శ్లో॥ బ్రహ్మణ్యారోపితత్వేన బ్రహ్మావస్థేఇమేఇతి।
నశంకనీయంసర్వాసాం బ్రహ్మణ్యేవాధిరోపణాత్॥ ౪౦.

టీ. ఇమే-ఈరెండవస్థలును, బ్రహ్మణి-కూటస్థునియందు, ఆరోపితత్వేన-కల్పింపబడుటచేత, బ్రహ్మావస్థేఇతి = బ్రహ్మ - కూటస్థునియొక్క, అవస్థేఇతి- అవస్థలని, నశంకనీయం - శంకింపదగదు. బ్రహ్మణ్యేవ- కూటస్థునియందే, సర్వాసాం-సర్వావస్థలయొక్క, అధిరోపణాత్ - కల్పనమగుటవల్ల.

తా. ప్ర. అయితే, అప్రసిద్ధమగు విక్షేపసంస్కారద్వారా, ఆరెండవస్థలను విక్షేపరూపచిదాభాసునకు జెప్పుటకంటె, కూటస్థుడు అధిష్ఠానముగానుండుటచేత, నాయజ్ఞానావరణములనెడి రెండవస్థలను కూటస్థునకుజెప్పుట, శ్రేష్ఠముగాదాయేమి?. ఉ. సర్వావస్థలును, కూటస్థునియందే కల్పించబడినవి. కనుక, అజ్ఞానావరణములనెడి రెండవస్థలను కూటస్థునియొక్క అవస్థలనిచెప్పుట, అధికప్రసంగమగును.

అవ. ఇప్పుడు, పూర్వవాది, ఆక్షేపించుచున్నాడు.

శ్లో॥ సంసార్యహంవిబుద్ధోహం నిశ్శోకస్తుష్టఇత్యపి।
జీవగాఉత్తరావస్థా భాంతినబ్రహ్మగాఇతి॥ ౪౧.

టీ. అహం-నేను, సంసారీతి - సంసారముగలవాడననియు. విబుద్ధఇతి-జ్ఞానవంతుడననియు, నిశ్శోకఇతి- దుఃఖములేనివాడననియు, తుష్టఇత్యపి-సంతోషముగలవాడనని, ఉత్తరావస్థాః=ఉత్తర- విక్షేపోత్పత్తియొక్క పరమందుగల, అవస్థాః-అవస్థలు, అనగా విక్షేపజ్ఞానదుఃఖనివృత్తితృప్తులనెడి నాలుగవస్థలనుట. జీవగాస్సత్యః-జీవునిపొందినవగుచు, భాంతి-తోచుచున్నది. అనగా జీవునాశ్రయించితోచుచున్నవనుట. బ్రహ్మగాః - కూటస్థునిబొందినవి, అనగా కూటస్థునాశ్రయించినవనుట. నేతి - కావు.

తా. ప్ర. ఓ అద్వైతసిద్ధాంతీ, సర్వావస్థలును కూటస్థునియందారోపితములైనను, జీవుడు విక్షేపావస్థను గలిగియుండుటచేత, నేను సంసారినైతిననియు, తత్వజ్ఞానావస్థను గలిగియుండుటచేత, నేను జ్ఞానినైతిననియు, సం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సారదుఃఖ నివృత్త్యవస్థనుబొందుటచేత, నేను నిశ్శోకుడనైతిననియు, తృప్త్యవస్థనుబొందుటచేత, నేను సంతోషముగలవాడనైతినని, అభిమానించుచున్నాడు. కనుక, విక్షేపోత్పత్తియొక్క పరమంమగల అవస్థలన్నియు, జీవు నాశ్రయించి తోచుచున్నవేగాని కూటస్థునాశ్రయించియున్నట్లు తోచలేదు. అనగా, విక్షేపజ్ఞానదుఃఖనివృత్తితృప్తులనెడి నాలుగవస్థలను జీవునకు జెప్పవలెనని యు, అజ్ఞానావరణములనెడి రెండవస్థలను కూటస్థునకుం జెప్పవలెనని పూర్వవాదియొక్క ఆక్షేపాభిప్రాయమగును.

అవ. ఇప్పుడు, సిద్ధాంతి, ప్రత్యుత్తరమును జెప్పుచున్నాడు.

శ్లో॥ తర్హ్యజ్ఞోహంబ్రహ్మసత్వే భానేమద్దృష్టితోనహి।
ఇతిపూర్వేఅవస్థేచ భాసేతేజీవగేఖలు॥ ౪౨.

టీ. తర్హి - అట్లైనయెడల, అహం-నేను, అజ్ఞఇతి-మూఢుడననియు,మద్దృష్టితః=మత్-నాయొక్క, దృష్టితః - అనుభవమువల్ల; బ్రహ్మసత్వభానే= బ్రహ్మ-కూటస్థునియొక్క,సత్వే-స్థితియు, భానే-స్ఫురణంబును, నహీతి-లేవని, పూర్వే-విక్షేపావస్థకంటె బూర్వమందుగల, అవస్థేచ - అజ్ఞానావరణావస్థలు రెండును, జీవగేసత్యౌ - జీవునిపొందియున్నవగుచు, భాసేతేఖలు - తోచుచున్నవిగదా.

తా. ఓపూర్వవాదీ, అట్లైనయెడల, నేనుమూఢుడననియు, కూటస్థబ్రహ్మము లేదనియు, నాయనుభవముచేతతోచలేదని, ఈప్రకారముగా, అజ్ఞానావరణావస్థలురెండును జీవుడైన చిదాభాసునిచేతనే, యనుభవింప బడుచున్నవి. గనుక, ఆయజ్ఞానావరణావస్థలురెండును చిదాభాసునకే గలవనియు, కూటస్థునకులేవనియుం దెలిసికొనుము.

శ్లో॥ అజ్ఞానస్యాశ్రయోబ్రహ్మేత్యధిష్ఠానతయాజగుః।
జీవావస్థాత్వమజ్ఞానాభిమానిత్వాదవాదిషం॥ ౪౩.

టీ. అజ్ఞానస్య-అజ్ఞానమునకు, అధిష్ఠానతయా- ఆధారత్వముచేత, ఆశ్రయః-ఆశ్రయము, బ్రహ్మేతి-బ్రహ్మమని, జగుః-పూర్వాచార్యులుచెప్పిరి. అజ్ఞానాభిమానిత్వాత్=అజ్ఞాన-అజ్ఞానమందు, అభిమానిత్వాత్ - జీవునకభిమానముగలిగియుండుటవల్ల, జీవావస్థాత్వం = జీవ-జీవునియొక్క, అవస్థాత్వం-అవస్థాభావమును, అనగా జీవావస్థనుగాననుట. అవాదిషం- చెప్పితిని.

తా. ప్ర. అయితే, అజ్ఞానమునకు బ్రహ్మమాశ్రయమని, పూర్వాచార్యులు జెప్పుటకుగారణమేమి?. ఉ. అజ్ఞానమునకాధారవస్తువుగా బ్రహ్మము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్నదనెడివివక్షచేత, బ్రహ్మమజ్ఞానమున కాశ్రయమని, పూర్వాచార్యులుజె ప్పిరి. ప్ర. అయితే, మీరు, ఏవివక్షచేత, అజ్ఞానమును జీవునియొక్క యవస్థ నుగాజెప్పితిరో జెప్పుడు?. ఉ. అజ్ఞానమందు జీవున కభిమానముగలిగి, అతని చేత ననుభవింపబడుటచేత, ఆ యజ్ఞానమును జీవునియొక్క! యవస్థనుగా జెప్పితిమి.

అవ. ఇట్లు, బంధహేతువులగు, అజ్ఞానావరణ విక్షేపములనెడి మూడ వస్థలనుజూపి, తక్కిన నాలుగవస్థలయందు, పూర్వోక్త అజ్ఞానావరణ నివృత్తి ద్వారా, ముక్తిహేతువులగు పరోక్షజ్ఞానాపరోక్షజ్ఞానములనెడి రెండవస్థల నికజూపుచున్నాడు.

శ్లో॥ జ్ఞానద్వయేనన ష్టేస్మి న్నజ్ఞానేతత్కృతావృతిః।
సభాతినాస్తిచేత్యేషా ద్వివిధాపివినశ్యతి॥ ౪౪.

టీ. జ్ఞానద్వయేన - పరోక్షాపరోక్షరూపజ్ఞానద్వయముచేత, అస్మిన్- ఈ,అజ్ఞానే-అజ్ఞానము, నష్టేసతి-నశింపబడుచుండగా, నాస్తీతిచ - కూటస్థుడు లేడనునట్టియు, నభాతీతిచ-కూటస్థుడు తోచలేదనునట్టి, ద్వివిధా- ద్వివిధరూప ముగల, ఏసా-ఈ, తత్కృతావృతిః-తత్- ఆ యజ్ఞానముచేత, కృత - చేయబ డిన, ఆవృతిరపి - ఆవరణంబును, వినశ్యతి - నాశమునుబొందుచున్నది.

తా. మరియు, పరోక్షాపరోక్షలక్షణముగల జ్ఞానద్వయముచేత, ఈయ జ్ఞానము నశింపబడుచుండగా, ఆయజ్ఞానకార్యమే, కూటస్థుడులేడనియు, ప్ర కాశింపుచుండలేదనియుం జెప్పెడివ్యవహారమునకు కారణమగు, ఈ యావర ణద్వయంబును నశించుచున్నది. అనగా కారణమగు అజ్ఞానము లేమిచేత,దాని కార్యమగు అవరణంబును నశించుసని యభిప్రాయము.

శ్లో॥ పరోక్షజ్ఞానతోనశ్యే దసత్త్వావృతిహేతుతా।
అపరోక్షజ్ఞాననాశ్యా హ్యభానావృతిహేతుతా॥ ౪౫.

టీ. పరోక్షజ్ఞానతః- పరోక్షజ్ఞానమువల్ల, అసత్త్వావృతిహేతుతా=అస త్వ-కూటస్థుడులేడనెడి, అవృతి-ఆవరణముయొక్క, హేతుతా - హేతుత్వము, నశ్యేత్-నశించును. అభానావృతిహేతుతా=అభాన-కూటస్థుడు తోచలేదనెడి, ఆవృతి- ఆవరణముయొక్క, హేతుతా - హేతుత్వము, అపరోక్షజ్ఞాననాశ్యా హి=అపరోక్షజ్ఞాన-అపరోక్షజ్ఞానముచేత, నాశ్యాహి- నశింపదగినదేయగును.

తా. ప్ర. అయితే,ఏయంశముచేత,నేయంశమునివర్తించునోచెప్పుము?. ఉ. కూటస్థుడుగలడనెడి, ఇవ్విధరూపసంతమగు పరోక్షజ్ఞానమువల్ల, కూట స్థుడులేడనెడి వ్యవహారమునకు కారణమగు ఆవరణాంశము నివర్తించును. మరి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యు, నేను కూటస్థుడనైతినని, ఈరూపవంతమగు అపరోక్షజ్ఞానముచేత, కూటస్థుడు దోచలేదనెడి వ్యవహారమునకు గారణమగు ఆవరణాంశము నివర్తించును.

అవ. ఇప్పుడు, జ్ఞానముయొక్క ఫలరూపమగు అవస్థాద్వయమందు, ప్రథమావస్థను జెప్పుచున్నాడు.

శ్లో॥ అథానావరణేనష్టే జీవత్వారోపసంక్షయాత్।
కర్తృత్వాద్యఖిలశ్శోక స్సంసారాఖ్యోనివర్తతే॥ ౪౮.

టీ. అథానావరణే= అథాన- కూటస్థుడు దోచలేదనెడి వ్యవహారమునకుగారణమగు, ఆవరణే - ఆవరణాంశము, నష్టేసతి- నాశమునుబొందుచుండగా, జీవత్వారోపసంక్షయాత్=జీవత్వ- జీవభావమగు, ఆరోప - ఆరోపముయొక్క, సంక్షయాత్ - క్షయమువల్ల, సంసారాఖ్యః= సంసార-సంసారమనెడి, ఆఖ్యః-పేరుగలిగినట్టియు, కర్తృత్వాద్యఖిలః=కర్తృత్వాది- కర్తృత్వభోక్తృత్వ ప్రమాతృత్వాది రూపముయొక్క, అఖిలః - సకలమగు, శోకః-దుఃఖము, నివర్తతే - నివృత్తిని బొందుచున్నది.

తా. ఇట్లు అపరోక్షజ్ఞానముచేత, కూటస్థుడు దోచలేదనెడి వ్యవహారమునకు కారణమైన ఆవరణము నివర్తింపబడుచుండగా,అవిద్యాభ్రాంతిచే దోచుచుండెడి, జీవత్వారోపంబును నివర్తింపబడును. ఆ జీవత్వము నివర్తించినవెంటనే, ఆ జీవుని నిమిత్తముగా జేసికొని తోచుచుండెడి, సంసారమనెడిపేరుగల, కర్తృత్వభోక్తృత్వప్రమాతృత్వాదిరూప సకలదుఃఖంబును నివర్తింపబడగలదు.

అవ. ఇట్లు, దుఃఖనివృత్తియనెడి యవస్థనుజూపి, నిరంకుశ తృప్తిలక్షణమగు ద్వితీయావస్థ నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ నివృత్తేసర్వసంసారే నిత్యముక్తత్వభాసనాత్।
నిరంకుశాభవేత్తృప్తిః పునశ్శోకాసముద్భవాత్॥ ౪౯.

టీ. సర్వసంసారే = సర్వ-సకలమైన, సంసారే- సంసారము, నివృత్తేసతి - నివృత్తినిబొందుచుండగా, నిత్యముక్తత్వభాసనాత్ = నిత్య-సర్వదా, ముక్తత్వ-జీవన్ముక్తత్వముయొక్క, భాసనాత్-స్ఫురణమువల్లను, పునః-మరల, శోకాసముద్భవాత్= శోక - సంసారరూపదుఃఖముయొక్క, అసముద్భవాత్-ఉత్పత్తిలేనివల్లను, నిరంకుశా - నిరాటంకమగు, అనగా నిరుపాధికమైనట్టియనుట. తృప్తిః - ఆనందము, భవేత్ - కలుగును.

తా. పూర్వోక్తప్రకారము, సర్వ సంసారము నివర్తింప బడుచుండ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గా, సర్వదా, జీవన్ముక్తస్వభావము స్ఫురించుచుండుటచేతయు, మరల సంసారరూపదుఃఖము కలుగమిచేతయు, ఈ జ్ఞానికి నిరుపాధికమగు తృప్తిగలుగుచున్నది.

శ్లో॥ అపరోక్షజ్ఞానశోక నివృత్త్యాఖ్యేఉభేఇమే।
అవస్థేజీవగేబ్రూతె ఆత్మానంచేదితిశ్రుతిః॥ ౪౮.

టీ. జీవగే- జీవునిబొందియుండెడి, అపరోక్షజ్ఞానశోక నివృత్త్యాఖ్యే= అపరోక్షజ్ఞాన - బ్రహ్మసాక్షాత్కారమనునట్టియు, శోకనివృత్తి- దుఃఖనివృత్తియనునట్టి, ఆఖ్యే-పేర్లుగల, ఇమే-ఈ, ఉభే-రెండైన, అవస్థే-అవస్థలను,ఆత్మానంచేదితి-ఆత్మానంచేద్విజానీయాదనెడి, శ్రుతిః-శ్రుతి, అబ్రూత- చెప్పెను.

తా. ప్ర. అయితే, శ్రు॥ ఆత్మానంచేద్విజానీయాత్॥ అనెడి మంత్రమునువ్యాఖ్యానముజేయుచు, ఆమంత్రవ్యాఖ్యానమును విడిపించి మధ్యమందు అజ్ఞానాది సప్తావస్థలంజెప్పుటచేత, ప్రస్తుతవిరోధముగాదాయేమి?. ఉ. శ్రు॥ ఆత్మానంచేద్విజానీయా దయమస్మీతిపూరుషః । కిమిచ్ఛన్కస్యకామాయశరీరమనుసంజ్వరేత్॥ అనెడి మంత్రము, చిదాభాసునియందుగల సప్తావస్థలయందు, అపరోక్షజ్ఞానదుఃఖనివృత్తులనెడి రెండవస్థలం దెలుపుచున్నది. ఆరెండవస్థలంజెప్పుటచేత, అజ్ఞానాదిసప్తావస్థలంజెప్పదగియుండెను. కనుక, ఈసప్తావస్థానిరూపణమంతయు, ఆమంత్రతాత్పర్య నిరూపణశేషత్వమగుటచేత ప్రకరణవిరోధములేదని తెలియవలెను.

శ్లో॥ అయమిత్యపరోక్షత్వ ముక్తంతద్ద్వివిధంభవేత్।
విషయస్వప్రకాశత్వా ద్ధియాప్యేవంతదీక్షణాత్॥ ౪౯.

టీ. అయమితి-ఈ స్వప్రభానందపరమాత్మడనైతిననెడి యర్థముగలపదముచేత, అపరోక్షత్వం- ఆత్మకపరోక్షజ్ఞాన విషయత్వము, ఉక్తం-చెప్పబడెను. విషయస్వప్రకాశత్వాత్=విషయ-ఆత్మయొక్క, స్వప్రకాశత్వాత్- స్వప్రకాశస్వభావమువల్లను, అనగాతనవ్యవహారమునకు మరియొకసాధనాపేక్షలేమిచేననుట. ధియా-బుద్ధిచేత, ఏవం-ఈప్రకారము, అనగా స్వప్రకాశరూపముగాననుట. తదీక్షణాదపి=తత్ - ఆయాత్మను, ఈక్షణాదపి - చూచుటవల్లను, తత్ - ఆయపరోక్షత్వము, ద్వివిధం - రెండువిధములుగలది, భవేత్-అగును.

తా. ప్ర. అయితే, ౪౧,శ్లోకమందు,(అయం) అనెడిపదముచేత ఆత్మకపరోక్షత్వము జెప్పబడెననెడి విషయను నంగీకరించితిరి. అట్లైనయెడల, ఆత్మ అపరోక్షజ్ఞానవిషయుఁడేయగుగాని, పరోక్షజ్ఞానవిషయుఁడుగాఁడుగదా?.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. పూర్వోక్తశ్రుతియందుగల, (అయం) అనెడి పదముచేత, ఆత్మకు అపరోక్షత్వముచెప్పబడును. ఆయపరోక్షత్వము ద్వివిధమగును. ప్ర. అందుకుగారణమేమి?. ఉ. చిద్రూపుడగు ఆత్మ, స్వప్రకాశత్వమువల్ల, (అహం) నేనని ప్రత్యక్షముగా స్ఫురించుచుండుటచేత, అపరోక్షజ్ఞానవిషయుడగును. మరియు, బుద్ధిచేత, ఆయాత్మను స్వప్రకాశునిగా జూచుటవల్ల, ఆయాత్మ,పరోక్షజ్ఞానవిషయుడగును. తాను, ఇతరసాధనము నపేక్షింపకనే, సర్వదా ప్రకాశించుచుండుటయే, స్వప్రకాశత్వమగునని తెలియవలెను.

శ్లో॥ పరోక్షజ్ఞానకాలేపి విషయస్స్వప్రకాశతా।
సమా బ్రహ్మస్వప్రకాశ మస్తీత్యేవం విబోధనాత్॥ ౫౦.

టీ. స్వప్రకాశం- స్వయంప్రకాశమానమగు, బ్రహ్మ - బ్రహ్మము, అస్తీతి-కలదని, ఏవం-ఈప్రకారము, అనగా స్వప్రకాశరూపముగా ననుట. విబోధనాత్-బుద్ధిచేదెలియుటవల్ల, పరోక్షజ్ఞానకాలేపి - పరోక్షజ్ఞానకాలమందును, విషయస్స్వప్రకాశతా=విషయ-ఆత్మయొక్క, స్వప్రకాశతా - స్వప్రకాశత్వము, సమా-సమానముగానున్నది.

తా. ప్ర. సరి. ఈ చెప్పినచొప్పున, అపరోక్షజ్ఞానము ద్వివిధమగుగాక. ఇట్లుచెప్పుటచేత పరోక్షజ్ఞానవిషయత్వమందులాభమేమి?. ఉ. పరోక్షజ్ఞానియగువాడు, స్వప్రకాశరూపమగు బ్రహ్మముగలదని, ఈప్రకారముగా బుద్ధిచేనెరుగుచున్నాడు. అందుచేత, అపరోక్షజ్ఞానకాలమందువలెనే, పరోక్షజ్ఞానకాలమందును బ్రహ్మముయొక్క స్వప్రకాశత్వము సమానముగా నున్నది. అనగా జ్ఞానవిషయమగు బ్రహ్మముయొక్క స్వప్రకాశత్వము, పరోక్షజ్ఞానవిషయత్వమునకు విరోధిగాదని యభిప్రాయము.

శ్లో॥ అహంబ్రహ్మేత్యనుల్లిఖ్య బ్రహ్మాస్తీత్యేవముల్లిఖేత్।
పరోక్షజ్ఞానమేతన్నభ్రాంతంబాధానిరూపణాత్॥ ౫౧.

టీ. అహం-నేను, బ్రహ్మేతి-బ్రహ్మమునని, అనుల్లిఖ్య-సాక్షాత్కరించుకొనక, బ్రహ్మ-బ్రహ్మము, అస్తీతి-కలదని,ఏవం-ఈప్రకారము, ఉల్లిఖేత్-ఎరుగును. ఏతత్-ఈ, పరోక్షజ్ఞానం - పరోక్షజ్ఞానము, బాధానిరూపణాత్=బాధ-బాధయొక్క, అనిరూపణాత్-నిరూపణములేమివల్ల, భ్రాంతం- భ్రాంతిని బొందినది. అనగా మిథ్యాజ్ఞానమనుట. న-కాదు.

తా. ప్ర. అయితే, ప్రత్యగభిన్న పరబ్రహ్మమును గోచరింపజేసెడి, ఈజ్ఞానమునకు పరోక్షభావమెట్లుగలిగెను? ఉ. నేను బ్రహ్మమునైతినని, బ్రహ్మము సాక్షాత్కరించుకొనక, బ్రహ్మముగలదని సామాన్యాకారముగా దెలి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సికొనుటయే, పరోక్షజ్ఞానమగును. అనగా ఆబ్రహ్మము, ప్రత్యగాత్మయగు నేనేనని ప్రత్యక్షముగా నెరుగమిచేత, ఇది పరోక్షజ్ఞానమేయగునని యభిప్రాయము. ప్ర. అయితే, ప్రత్యగాత్మయగు నేనే, ఆపరబ్రహ్మమునైతినని ప్రత్యక్షముగా నెరుగమిచేత, ఇది భ్రాంతిజ్ఞానముగాదాయేమి? ఉ. ఈ పరోక్షజ్ఞానమునకు మిథ్యాత్వము, ౧. బాధింపబడుటచేతనో, లేక, ౨. ఇది బ్రహ్మమని బ్రహ్మస్వరూపమును ప్రత్యక్షముగా గ్రహింపమిచేతనో, ౩. లేక అపరోక్షత్వముచేత గ్రహించుటకు యోగ్యమైన బ్రహ్మమును పరోక్షత్వముచేత గ్రహించుటచేతనో, లేక, ౪. ప్రత్యగంశమును గ్రహింపమిచేతనో చెప్పుము. బ్రహ్మముకలదని సామాన్యాకారముగా నెరిగిన ఈపరోక్షజ్ఞానము, బాధింపబడమిచేత, ఇది మిథ్యాజ్ఞానము కానేరదు.

అవ. ఇది మిథ్యాజ్ఞానము గామికి, హేతువు నిప్పుడు వివరించుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మనాస్తీతిమానంచేత్స్యాద్బాధ్యేతతదాధ్రువం।
నచైవంప్రబలంమానం పశ్యామోఽతోనబాధ్యతే॥ ౫౨.

టీ. బ్రహ్మ-బ్రహ్మము; నాస్తీతి-లేదని, మానం - ప్రమాణము, స్యాచ్చేత్-ఉన్నయెడల, తదా- అప్పుడు; ధ్రువం-నిశ్చయముగా, బాధ్యేత - ఈపరోక్షజ్ఞానము బాధింపబడును. ఏవం-ఈప్రకారముగా, ప్రబలం - బలవంతమగు, మానం-ప్రమాణమును, నపశ్యామః - చూచుచున్నవారముగాము. అనగా చూడమనుట. అతః-ఆకారణమువల్ల, నబాధ్యతే- బాధింపబడదు.

తా. బ్రహ్మములేదనెడి ప్రమాణమున్నయెడల, అప్పుడు, తప్పక ఈపరోక్షజ్ఞానము బాధింపబడి, మిథ్యాజ్ఞానమగును. ఇట్టి ప్రబల ప్రమాణమును మేముజూడలేము. ఆకారణమువల్ల, ఈపరోక్షజ్ఞానము బాధింపబడదు. అందుచేత ఈ పరోక్షజ్ఞానము మిథ్యాజ్ఞానము కానేరదు. కనుక, ప్రథమపక్షము గూడదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు. రెండవపక్షమునధికప్రసంగమని దూషించుచున్నాడు.

శ్లో॥ వ్యక్త్యనుల్లేఖమాత్రేణ భ్రమత్వేస్వర్గధీరపి।
భ్రాంతిస్స్యాద్వ్యక్త్యనుల్లేఖాత్సామాన్యోల్లేఖదర్శనాత్॥ ౫౩.

టీ. వ్యక్త్యనుల్లేఖమాత్రేణ-వ్యక్తి- ఇదిబ్రహ్మమని, అనుల్లేఖమాత్రేణ-ప్రత్యక్షముగానెరుగనిమాత్రముచేత, భ్రమత్వేసతి - మిథ్యాభావమగుచుండగా, వ్యక్త్యనుల్లేఖాత్-వ్యక్తి - స్వర్గరూపమును, అనుల్లేఖాత్-ప్రత్యక్షముగా గ్రహింపమివల్లను, సామాన్యోల్లేఖదర్శనాత్-సామాన్యోల్లేఖ - స్వర్గముగలదని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సామాన్యాకారముగా, దర్శనాత్-స్ఫురించుటవల్లను, స్వర్గధీరపి - స్వర్గజ్ఞానంబును, భ్రాంతిః-మిథ్యాభావముగలది, స్యాత్ అగును.

తా. మరియు, ఇదిబ్రహ్మమని బ్రహ్మస్వరూపమును బ్రత్యక్షముగా నెరుగనిమాత్రముచేతనే, ఈపరోక్షజ్ఞానము మిథ్యయయ్యెడి పక్షమందు, ఇది స్వర్గమనెడి యాకారముచేత స్వర్గస్వరూపమును బ్రత్యక్షముగా గ్రహింపమిచేతయు, స్వర్గముగలదని, ఇట్లు సామాన్యాకారముగా స్ఫురించుటచేతయు, స్వర్గజ్ఞానంబును మిథ్యాజ్ఞానమగునని చెప్పవలసివచ్చును. ఇట్లు చెప్పుట, అధికప్రసంగమగును. కనుక, ఇది బ్రహ్మమని బ్రహ్మ స్వరూపమును బ్రత్యక్షముగా నెరుగనిమాత్రముచేత, ఈ పరోక్షజ్ఞానము మిథ్యకాజాలదు. అందుచేత రెండవపక్షంబును గూడదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు మూడవపక్షమును నిరాకరించుచున్నాడు.

శ్లో॥ అపరోక్షత్వయోగ్యస్య నపరోక్షమతిర్భ్రమః।
పరోక్షమిత్యనుల్లేఖాదర్థాత్పారోక్ష్యసంభవాత్॥ ౫౪.

టీ. పరోక్షమితి-బ్రహ్మము పరోక్షమనెడియాకారముచేత, అనుల్లేఖాత్-బ్రహ్మమును గ్రహింపమివల్ల, అపరోక్షత్వయోగ్యస్య= అపరోక్షత్వ= ప్రత్యక్షత్వముచేత, యోగ్యస్య-గ్రహించుటకు యోగ్యమైన ప్రత్యగభిన్న బ్రహ్మముయొక్క, పరోక్షమతిః - పరోక్షజ్ఞానము, నభ్రమః - భ్రాంతిజ్ఞానముకానేరదు. అర్థాత్-అర్థమువల్ల, అనగానిదిబ్రహ్మమని, ఈప్రకారము బ్రత్యక్షముగా బ్రహ్మస్వరూపమును గ్రహింపని సామర్థ్యముచేతనుట. పారోక్ష్యసంభవాత్ - పరోక్షభావము సంభవించుటవల్ల, (పరోక్షత్వం) పరోక్షత్వసిద్ధిగలిగెను.

తా. మరియు, అపరోక్షత్వముచేత గ్రహించుటకు యోగ్యమైన ప్రత్యగభిన్నబ్రహ్మమును విషయముగాగల పరోక్షజ్ఞానమునకు మిథ్యాభావము సంభవింపనేరదు. ప్ర. ఎందువల్లనో జెప్పుము?. ఉ. బ్రహ్మము పరోక్షమనెడి, ఈయాకారముచేత బ్రహ్మమును గ్రహింపమివల్ల, ఇది మిథ్యాజ్ఞానము కానేరదు. అనగా నపరోక్షత్వముచేత గ్రహించుటకు యోగ్యమగు ప్రత్యగభిన్నబ్రహ్మము, పరోక్షమనెడి, ఈవిధమైన ఆకారముచేత ఆబ్రహ్మమును గ్రహించినయెడల, ఈపరోక్షజ్ఞానము, మిథ్యాజ్ఞానమగుననియు, అట్లు గ్రహింపమిచేత ఈపరోక్షజ్ఞానమిథ్యకాదనియుం దెలియవలెను. ప్ర. అయితే,ఏకారణముచే నట్టిజ్ఞానమునకు బరోక్షత్వముగలిగెనో జెప్పుము?. ఉ. ఇది బ్రహ్మమని, ఈప్రకారముగా, బ్రహ్మస్వరూపము నెరుగనిసామర్థ్యతచేత, ఈజ్ఞా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నమునకు బరోక్షత్వసిద్ధిగలిగెనని తెలియవలెను. కనుక, ఈజ్ఞానము మిథ్య, కానేరదు. అందుచేత మూడవపక్షంబును గూడదు.

అవ. ఇప్పుడు, నాలగవపక్షంబునుంగూడదని చెప్పుచున్నాడు.

శ్లో॥ అంశాగృహీతిర్భ్రాంతిశ్చేద్ఘటజ్ఞానంభ్రమోభవేత్।
నిరంశస్యాపిసాంశత్వంవ్యావర్త్యాంశవిభేదతః॥ ౫౫.

టీ. అంశాగృహీతిః=అంశ- ప్రత్యగంశమును, అగృహీతిః- గ్రహింపమి, భ్రాంతిశ్చేత్ - భ్రాంతియగుననియంటివేని, ఘటజ్ఞానం - ఘటజ్ఞానము, భ్రమః-భ్రాంతి, భవేత్-అగును. అనగా నంతరావయవములను గ్రహింపమిచేత ఘటాదిజ్ఞానంబును భ్రమయగుననుట. నిరంశస్యాపి- నిరవయవబ్రహ్మమునకును, వ్యావర్త్యాంశవిభేదతః=వ్యావర్త్య-నివర్తింపదగిన, అంశ- అంశద్వయముయొక్క, విభేదతః-భేదమువల్ల, సాంశత్వం- అవయవసహితత్వముగలిగియున్నది.

తా. ప్ర. అయితే, బ్రహ్మాంశమునుగ్రహించినను, ప్రత్యగాత్మాంశమును గ్రహింపమిచేత, ఈపరోక్షజ్ఞానము, మిథ్య,కారాదాయేమి?. ఉ.అట్లైనయెడల, ఇది ఘటమని ఘటము నెరిగినను, ఆఘటములోపలనుండెడి అవయవములను గ్రహింపమిచేత ఘటాదిజ్ఞానమునకును, మిథ్యాత్వము సంభవించును. అట్లుగూడదు. కనుక, ఈపరోక్షజ్ఞానము, బ్రహ్మాంశమునుగ్రహించినను,ప్రత్యగాత్మాంశమును గ్రహింపమిచేత భ్రాంతిజ్ఞానమని చెప్పరాదు. అందుచేత నాలగవపక్షంబునుంగూడదని తెలియవలెను. ప్ర. అయితే,ఘటము, అవయవవంతమగుటవల్ల ఇదిఘటమని ఘటాంశమును గ్రహించినను ఆఘటముయొక్క లోపలనుండెడి అవయవములనుగ్రహింపమిగలదు. బ్రహ్మమో, నిరంశమగుచుండగా, ఆబ్రహ్మాంశమును గ్రహింపమెట్లుగలుగును?. ఉ. బ్రహ్మమందును నివర్తింపదగిన అంశములు రెండుగలవు. ఆరెండంశములవల్ల గలిగిన ఉపాధినిమిత్తకమైన, అవయవసహితత్వము, ఆబ్రహ్మంబునకుం గలదు.

శ్లో॥ అసత్త్వాంశోనివర్తేత పరోక్షజ్ఞానతస్తథా।
అభానాంశనివృత్తిస్స్యా దపరోక్షధియాకృతా॥ ౫౬.

టీ. పరోక్షజ్ఞానతః-పరోక్షజ్ఞానమువల్ల, అసత్త్వాంశః- బ్రహ్మములేదనెడియంశము, నివర్తేత-నివర్తించును. తథా-ఆప్రకారము, అపరోక్షధియా- అపరోక్షజ్ఞానముచేత, అభానాంశనివృత్తిః= అభాన- బ్రహ్మముతోచలేదనెడి, అంశ-అంశముయొక్క, నివృత్తిః-నివృత్తి, కృతా - చేయబడును.

తా. ప్ర. అయితే,బ్రహ్మమందునివర్తింపదగినఅంశద్వయమెద్ది?. ఉ.౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మములేపనియు, ౨. తోచలేదనియుం జెప్పుటకు కారణమెద్దిగలదో, అది యే, బ్రహ్మమందునివర్తింపదగిన అంశద్వయమగును. ప్ర. అయితే, ఆయంశ ద్వయమెట్లునివర్తించును?. ఉ. కూటస్థబ్రహ్మముకలదనెడిపరోక్షజ్ఞానముచేత కూటస్థబ్రహ్మములేదనెడి (అసత్త్వాంశము) నివర్తించును. మరియు, ఆకూట స్థబ్రహ్మము, నేనేననెడి, ఈయాకారముగల, అపరోక్ష జ్ఞానముచేత కూట స్థబ్రహ్మము తోచలేదనెడి, (అభానాంశము) నివర్తించునని తెలియవలెను.

అవ. అపరోక్షత్వముచేత గ్రహించుటకు యోగ్యమైన విషయముయొ క్క పరోక్షజ్ఞానము భ్రాంతిగాదనెడి ఈవిషయమును, దృష్టాంతముచేతగూడ, మరల నిప్పుడు దృఢము జేయుచున్నాడు.

శ్లో॥ దశమో౽స్తీత్యవిభ్రాంతం పరోక్షజ్ఞానమీక్ష్యతే।
బ్రహ్మాస్తీత్యపితద్వత్స్యా దజ్ఞానావరణంసమం॥ ౫౭.

టీ. దశమః-పదియవవాడు, అస్తీతి-కలడనెడి, పరోక్షజ్ఞానం - పరోక్ష జ్ఞానము, అనగానాప్తునివాక్యమువల్ల గలిగినజ్ఞానమనుట. యథా - ఏప్రకార ము, అవిభ్రాంతంసత్-భ్రాంతిజ్ఞానముకానిదగుచు, ఈక్ష్యతే - కనబడుచున్న దో, తద్వత్- ఆప్రకారము, బ్రహ్మ-బ్రహ్మము, అస్తీతి - కలదనెడిరూపము గల పరోక్షజ్ఞానంబును. స్యాత్-అగును. అనగా వాస్తవమగుననుట. అజ్ఞా నావరణం-అజ్ఞాన-అజ్ఞానముయొక్క, ఆవరణం - లేదనిచెప్పుటకుగారణమగు ఆవరణాంశము, సమం - రెంటియందును సమానమగును.

తా. దశముడుచానలేదనియు, కలడనియు, విహితుడుజెప్పగా, ఆవిహి తునివాక్యమువల్ల గలిగినపరోక్షజ్ఞానము భ్రాంతిజ్ఞానముగానిదగుచు, ఏప్రకా రము వాస్తవమగునో, అటువలెనే, కూటస్థబ్రహ్మము గలదనెడి వాక్యమువల్ల గలిగినపరోక్షజ్ఞానంబును భ్రాంతిజ్ఞానముగాక, వాస్తవమేయగును. మరియు, దృష్టాంతభూతుడైన దశమునియందును, దార్ష్టాంతికమగు కూటస్థబ్రహ్మమం దును, అజ్ఞానకార్యమగు, లేడు, లేదనెడి, (అసత్త్వావరణాంశము) సమానము గానుండుటచేత, కలడు, కలదనెడిరూపముగల పరోక్షజ్ఞానంబునకును వాస్త వత్వము సమానముగానున్నదని తెలయవలెను.

శ్లో॥ ఆత్మాబ్రహ్మేతివాక్యార్థే నిశ్శేషేణవిచారితే।
వ్యక్తిరుల్లిఖ్యతే యద్వద్దశమస్త్వమసీత్యతః॥ ౫౮.

టీ. ఆత్మా-ప్రత్యగాత్మ, బ్రహ్మేతి-బ్రహ్మమనెడి, వాక్యార్థే-మహా వాక్యార్థము,నిశ్శేషేణ- నిశ్శేషముగా, విచారితేసతి-విచారించబడుచుండగా, దశమః పదియవవాడు, త్వం-నీవు, అసీతి-ఇతివనెడి, అతః - వాక్యమువల్ల, య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వత్ - ఏప్రకారము పదియవవాడు తనయందు సాక్షాత్కరించుచున్నాడో, (తద్వత్) అటువలెనే, వ్యక్తిః - తనయందు బ్రహ్మస్వరూపము, ఉల్లిఖ్యతే-సాక్షాత్కారమును బొందుచున్నది.

తా. ప్ర. సరి. అయితే, వాక్యమువల్ల పరోక్షజ్ఞానము గలిగెడి పక్షమందు, మరి దేనిచే నపరోక్షజ్ఞానము గలుగునో చెప్పుము?. ఉ. విచారణలో గూడిన ఆవాక్యమువల్లనే,అపరోక్షజ్ఞానముగలుగుచున్నది. ప్ర. అదియెట్లు?. ఉ. శ్రు॥ అయమాత్మాబ్రహ్మ॥ ఈప్రత్యగాత్మయే బ్రహ్మమగుననెడి మహావాక్యార్థమును విచారించినయెడల, పూర్వము పరోక్షముగా గలదని యెరుగబడినబ్రహ్మము, తనయందు సాక్షాత్కరించుటచేత, నేనే బ్రహ్మమునైతినని పురుషు డపరోక్షముగా నెరుగుచున్నాడు. ఇట్లెరుగుటయే, అపరోక్షజ్ఞానమగును. ప్ర. అయితే, ఇట్లెరుగుటకు దృష్టాంతమేమి?. ఉ. నీవు పదియవవాడవైతివనెడి విహితునివాక్యమువల్ల, పూర్వముగలడని పరోక్షముగా నెరుగబడిన దశముడు, తనయందు సాక్షాత్కరించుచున్నాడు. అటువలెనే బ్రహ్మంబును, పురుషునకు సాక్షాత్కరించుటచేత, ఆ పురుషుడు, నేనేబ్రహ్మమునైతినని యెరుగుచున్నాడని తెలియవలెను.

అవ. విచారణతోగూడిన వాక్యముచేత అపరోక్షజ్ఞానము గలిగెడిప్రకారము నిప్పుడు దృష్టాంతసహితముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ దశమః కఇతిప్రశ్నే త్వమేవేతినిరూపితే।

గణయిత్వా స్వేనసహా స్వమేవదశమంస్మరేత్॥ ౫౯.

టీ. దశమః-పదియవవాడు, కఇతి-ఎవడని, ప్రశ్నేకృతేసతి - ప్రశ్న జేయబడుచుండగా, త్వమేవేతి-నీవేపదియవవాడవని, నిరూపితేసతి- తెలుపబడుచు, స్వేనసహ-తనతోగూడ, గణయిత్వా- తక్కినతొమ్మిదిమందినిలెక్కించి, స్వమేవ-తననే, దశమం-పదియవవానినిగా, స్మరేత్-స్మరించును.

తా. నీచేతగలడని చెప్పబడిన, ఆదశము డెచ్చటనున్నాడని యడుగగా, నీవేదశముడవని, ఆ విహితుడు, ఆ దశమునితోజెప్పి తెలిపెను. అప్పుడు, ఆదశముడు, తనతోగూడ, ఇతరులను తొమ్మిదిమందిని లెక్కపెట్టి, నేనే దశముడనైతినని, తననే దశమునిగా స్మరించుచున్నాడు.

అవ. నేను దశముడనైతిననెడి ఈజ్ఞానము, విచారసహితవాక్యమువల్ల బుట్టుటచేత, సంశయ విపర్యయాది రూపమును బొందదని, ఇప్పుడు జెప్పుచున్నాడు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ దశమోఽస్మీతివాక్యోత్థానధీరస్యవిహన్యతే।
ఆదిమధ్యావసానేషుననవత్వస్యసంశయః॥ ౬౦.

టీ. దశమః-పదియవవాడను, అస్మీతి-ఐతినని, అస్య - ఈ దశముని యొక్క, ధీః-బుద్ధి, నవిహన్యతే-బాధింపబడదు. ఆదిమధ్యావసానేషు = ఆది-ఆదియందును, మధ్య=మధ్యమందును, అవసానేషు- అంత్యమందును, అనగా లెక్కించునప్పుడు తొమ్మిదిమందియొక్క ఆదిమధ్యాంత్యములయందు ప్రారంభించి గణించిననుట. నవత్వస్య-నవసంఖ్యయొక్క, సంశయః-సంశయము, న-లేదు. అనగా నేను దశముడనో, గానోయనెడి సంశయము లేదనుట.

తా. మరియు, ఈ దశమునకు, నీవే దశముడవైతివని, విహితుడుచెప్పి, లెక్కించిచూపగా, అప్పుడాదశముడు, ఆ విహితునియొక్కవాక్యార్థమునాలోచించి, నేనే దశముడనైతినని యెరిగినబుద్ధి,మరియే జ్ఞానముచేతనైనను బాధింపబడదు. మరియు, లెక్కించునప్పుడు, తొమ్మిదిమందియొక్క ఆదిమధ్యాంత్యములయందు ప్రారంభించి బుద్ధికి భ్రిమగలుగునట్లుగా గణించినను, నేను దశముడనో, కానో, యనెడిసంశయముగలుగదు. అందువల్ల, అట్టిజ్ఞానము, దృఢమగు అపరోక్షరూపియని తెలియవలెను. అనగా ఈదశమునకు, నేనే దశముడనైతినని జ్ఞానము, విచారసహితమగు వాక్యమువల్ల బుట్టుటచేత, ఎప్పటికిని నశింపదని యభిప్రాయము.

అవ. ఈదృష్టాంతస్థితార్థమునంతయు, దార్ష్టాంతికమందిప్పుడు, కూర్చుచున్నాడు.

శ్లో॥ సదేవేత్యాదివాక్యేన బ్రహ్మసత్వంపరోక్షతః।
గృహీత్వాతత్త్వమస్యాదివాక్యాద్వ్యక్తింసముల్లిఖేత్॥ ౬౧.

టీ. సదేవ-సృష్టికిబూర్వమందు సద్వస్తువొక్కటియే యున్నదని చెప్పెడి, ఇత్యాదివాక్యేన - ఇత్యాదివాక్యముచేత, పరోక్షతః- పరోక్షత్వమువల్ల, బ్రహ్మసత్వం=బ్రహ్మ-పరబ్రహ్మముయొక్క, సత్వం- స్థితిని, గృహీత్వా-గ్రహించి, తత్త్వమసి=తత్-ఆబ్రహ్మము, త్వం-నీవు, అసి - ఐతివి, ఇత్యాదివాక్యాత్-ఇత్యాదివాక్యమువల్ల, వ్యక్తిం-అద్వితీయబ్రహ్మరూపుడగుతనను, సముల్లిఖేత్ - నేనుబ్రహ్మమునైతినని ప్రత్యక్షముగా నెరుగును.

తా. ఈదృష్టాంతప్రకారము, సృష్టికిబూర్వమందు సద్వస్తువగుబ్రహ్మమొక్కటియేయున్నదనిచెప్పెడి, శ్రు॥ సదేవసోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం॥ ఇత్యాదివాక్యముచేత బ్రహ్మముకలదని మొదటపరోక్షత్వముగానిశ్చయించి, ఆబ్రహ్మము జీవరూపముగా దేహమందుప్రవేశించెననెడి మొదలగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుక్తిపర్యాలోచనచేత, ఆబ్రహ్మమునకు ప్రత్యగాత్మ రూపత్వమునుభావించి, ఆ పరబ్రహ్మము నీవైతివనిచెప్పెడి, శ్రు॥ తత్త్వమస్యాది వాక్యముచేత, అద్వితీయబ్రహ్మరూపుడగు తనను, నేను బ్రహ్మమునైతినని సాక్షాత్కరించుకొనుచున్నాడు.

శ్లో॥ ఆదిమధ్యావసానేషు స్వస్య బ్రహ్మత్వధీరియం।
నైవవ్యభిచరేత్తస్మా దాపరోక్ష్యం ప్రతిష్ఠితం॥ ౬౨.

టీ. ఇయం-ఈ, బ్రహ్మత్వధీః- బ్రహ్మత్వబుద్ధి, ఆదిమధ్యావసానేషు-పంచకోశములయొక్క ఆదిమధ్యాంత్యములయందు, స్వస్య-తనకు, (వ్యవహారేపి) వ్యవహారము గలిగినను, నైవవ్యభిచరేత్-అన్యవిధముగలదికానేకాదు. తస్మాత్-అందువల్ల, ఆపరోక్ష్యం - ఈబుద్ధికపరోక్షజ్ఞానత్వము, ప్రతిష్ఠితం-స్థాపించబడెను.

తా. అట్లు బ్రహ్మమును తనయందు సాక్షాత్కరించుకొనుటవల్ల, ఈపురుషునకు పంచకోశములయొక్క ఆదిమధ్యాంత్యములయందు వ్యవహారముగలిగినను, తనయొక్క బ్రహ్మత్వబుద్ధి, అన్యవిధముగానేరదు. అనగా నేను బ్రహ్మమునగుదునో కానోయనెడి సంశయము గలుగదని తెలియవలెను. అందుచేత, ఈ బుద్ధికి అపరోక్షజ్ఞానత్వము దృఢముగా స్థాపించబడెనని తాత్పర్యము.

శ్లో॥ జన్మాదికారణత్వాఖ్యలక్షణేనభృగుఃపురా।
పారోక్ష్యేణగృహీత్వాథవిచారాద్వ్యక్తిమైక్షత॥ ౬౩.

టీ. పురా-పూర్వము, భృగుః-భృగువనెడి ఋషీశ్వరుడు, జన్మాదికారణత్వాఖ్యలక్షణేన-జన్మాది-జగజ్జన్మస్థితిలయములకు, కారణత్వాఖ్య - కారణభావమనెడి, లక్షణేన - లక్షణముగలవాక్యముచేత, పారోక్ష్యేణ - పరోక్షత్వముగా, గృహీత్వా-బ్రహ్మము నెరిగి, అథ-పిమ్మట, విచారాత్-పంచకోశవిచారమువల్ల, వ్యక్తిం-ప్రత్యగాత్మరూపబ్రహ్మమును, ఐక్షత-చూచినవాడాయెను.

తా. ప్ర. అయితే, ఇట్లు మొట్టమొదట కేవలవాక్యమువల్ల, పరోక్షజ్ఞానము గలుగుననియు, పిమ్మట, విచారసహితవాక్యమువల్లనే అపరోక్షజ్ఞానముగలుగుననియు, ఇట్లు దేనిచేదెలియబడునో జెప్పుము?. ఉ. తైత్తిరీయకాదిశ్రుత్యర్థమునాలోచించుటచేత దెలియబడుచున్నది. ప్ర. అదియెట్లు?. ఉ. పూర్వము భృగువనెడిపేరుగల ఋషీశ్వరుడు, దేనివల్ల, ఈభూతములన్నియుంబుట్టుచున్నవో, అట్టు పుట్టినభూతములు దేనిచేత జీవించుచున్నవో, దేనియందు లయించుచున్నవో, దానినివిచారించి తెలిసికొనుమనియు, అదియే బ్రహ్మమనియుందెలిపెడి, శ్రు॥ యతోవా ఇమానిభూతాని జాయంతే, యేనజాతానిజ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ॥ అనెడి జగజ్జన్మస్థితిలయములకు కారణలక్షణరూపమగు వాక్యమును, తనతండ్రియగు వరుణునివల్ల వినినవాడగుచు, ఆవాక్యముచేత జగత్తునకుకారణంబగు బ్రహ్మముగలదని, మొదట పరోక్షముగానెరిగి, పిమ్మట, ఆభృగుఋషి, అన్నమయాది పంచకోశస్వరూపమును విచారించి. ఆ కోశములకు అనాత్మత్వమును నిశ్చయించి, పంచకోశవ్యతిరిక్తుడగు ప్రత్యగాత్మయనెడి బ్రహ్మము నపరోక్షముగా నెరిగినవాడాయెను.

శ్లో॥ యద్యపిత్వమసీత్యత్రవాక్యంనోక్తవాన్ భృగోఃపితా।
తథాప్యన్నంప్రాణమితివిచార్యస్థలముక్తవాన్॥ ౬౪.

టీ. యద్యపి-విచారించగా, అత్ర-ఈతైత్తిరీయక శ్రుతిప్రకరణమందు, భృగోః-భృగువుయొక్క, పితా-తండ్రియగువరుణుడు, త్వమసీతి-నీవుబ్రహ్మమైతివనెడి, వాక్యం-వాక్యమును, నోచేత్ - చెప్పలేదనియంటివేని, తథాపి-అట్లైనను, అన్నమితి-అన్నమయమనునట్టియు, ప్రాణమితి - ప్రాణమయమనునట్టి, విచార్యస్థలం = విచార్య-బ్రహ్మమునువిచారింపదగిన, స్థలం-ప్రదేశమును, ఉక్తవాన్ - చెప్పినవాడాయెను,

తా. ప్ర. అయితే, ఈతైత్తిరీయకప్రకరణమందు భృగువుయొక్కతండ్రియగు వరుణుడు, నీవు బ్రహ్మమైతివని భృగువున కుపదేశించినట్లు కనబడలేదు. అట్లుకనబడనప్పుడు, భృగువున కాత్మసాక్షాత్కారమెట్లాయెను?. ఉ. నీవుబ్రహ్మమైతివని వరుణుడుపదేశింపకున్నను. అన్నమయ ప్రాణమయమనోమయవిజ్ఞానమయానందమయ కోశములనెడి యర్థమును దెలిపెడివాక్యముచేత, ఆత్మను విచారించదగినస్థలమునుజెప్పెను. అనగా ఆత్మ సాక్షాత్కారమునకు హేతువగువిచారణకు యోగ్యస్థలమును జెప్పెనని యభిప్రాయము.

శ్లో॥ అన్నప్రాణాదికోశేషు సువిచార్యపునఃపునః।
ఆనందవ్యక్తిమీక్షిత్వాబ్రహ్మలక్ష్మాప్యయూయుజత్॥ ౬౫.

టీ. పునఃపునః-మాటిమాటికిని, అన్నప్రాణాదికోశేషు=అన్నప్రాణాది-అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయానందమయములనెడి, కోశేషు-పంచకోశములయందు, సువిచార్య - ఆత్మనుచక్కగా విచారించి, ఆనందవ్యక్తిం-ఆత్మయొక్క యానందస్వరూపమును, ఈక్షిత్వా - చూచి, అనగా సాక్షాత్కరించుకొనియనుట. బ్రహ్మలక్ష్మాపి = బ్రహ్మ - బ్రహ్మముయొక్క, లక్ష్మాపి-లక్షణంబును, అయూయుజత్ - ఆత్మయందేకూర్చెను. అనగా నాత్మలక్షణమునే బ్రహ్మలక్షణముగా నెరిగెననుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే, అన్నమయాది పంచకోశములను విచారించుచుండగా ప్రత్యగాత్మ, సాక్షాత్కరించునేగాని, బ్రహ్మమెట్లు సాక్షాత్కరించును?. ఉ. ప్రత్యగాత్మయే బ్రహ్మమగుటవల్ల, ఆభృగుమహర్షి, పంచకోశములను మాటిమాటికిని చక్కగావిచారించి, ఆపంచకోశములయందుండెడి ఆనందస్వరూప ప్రత్యగాత్మను సాక్షాత్కరించుకొని, గ్రామ్యధర్మనిమిత్తకమగు ఈ ఆనందమువల్లనే, ఈ భూతములన్నియుం బుట్టుచున్నవనియు అట్లు పుట్టిన భూతములు విషయభోగాదినిమిత్తకమగు, ఈయానందముచేతనే జీవించుచున్నవనియు, సుషుప్త్యాదికాలమందు స్వస్వరూపభూతానందమందే సకల భూతములును లయించుచున్నవనెడి యర్థముగల, శ్రు ॥ ఆనందాద్ధ్యేవఖల్విమాని భూతానిజాయంతే, ఆనందేన జాతానిజీవంతి, ఆనందం ప్రయంత్యభిసంవిశంతి॥ అనెడి వాక్యములచేత బ్రహ్మలక్షణంబును, ఆయానందరూప ప్రత్యగాత్మయందు గలదని తెలిసికొనెను.

శ్లో॥ సత్యంజ్ఞానమనంతంచే త్యేవంబ్రహ్మస్వలక్షణం।
ఉక్త్వాగుహాహితత్వేన కోశేష్వేతత్ప్రదర్శితం॥ ౬౬.

టీ. సత్యం-సత్యత్వంబును, జ్ఞానం - చిద్రూపత్వంబును. అనంతంచ-అనంతస్వభావంబును, బ్రహ్మస్వలక్షణమితి=బ్రహ్మ- బ్రహ్మముయొక్క, స్వలక్షణమితి-స్వరూపలక్షణమని, ఏవం-ఈప్రకారము, ఉక్త్వా-శ్రుతిజెప్పి, గుహాహితత్వేన- ఆబ్రహ్మము పంచకోశరూపగుహ లోపలనుండుటచేత, కోశేషు-పంచకోశములయందు ఏతత్-ఈ ప్రత్యగాత్మరూపత్వము, ప్రదర్శితం-శ్రుతిచేజూపబడెను. అనగానాబ్రహ్మమునకే ప్రత్యగ్రూపత్వము చెప్పబడెననుట.

తా. ప్ర. అయితే, బ్రహ్మము తటస్థలక్షణత్వముచేత ప్రత్యగాత్మకంటె భిన్నమగుచుండగా, ఆనందరూపత్వముచేనా ప్రత్యగాత్మయందు బ్రహ్మలక్షణముగలదని తెలిసికొనుటెట్లు ఘటించును?. ఉ. శ్రు ॥ సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ॥ అనెడిశ్రుతి; సత్యజ్ఞానానంతత్వము, బ్రహ్మస్వరూపలక్షణమని తెలిపి, శ్రు। యోవేదనిహితంగుహాయాంపరమేవ్యోమన్। అనెడివాక్యముచేత పంచకోశరూపగుహాయందు, ఆ బ్రహ్మముండుటవల్ల, ఆ బ్రహ్మమునకే, ప్రత్యగాత్మరూపత్వము దెలుపబడెను. కనుక, ఆ బ్రహ్మమే, ప్రత్యగాత్మయనెడిపేరుచేత పంచకోశరూపగుహయందున్నదని శ్రుతిజెప్పుటవల్ల, ఆబ్రహ్మమునకును, ప్రత్యగాత్మకును, ఎంతమాత్రమైనను స్వరూపభేదములేదని తెలియవలెను.

అవ. ఇట్లు, తైత్తిరీయకశ్రుత్యర్థపర్యాలోచనచేత భృగువునకు పరోక్షజ్ఞానపూర్వకవిచారజన్య బ్రహ్మసాక్షాత్కారమును దెలిపి, ఇప్పుడు ఛాం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హోగ్య శ్రుతిపర్యాలోచనచేత, ఆ యర్థమునే జూపుచున్నాడు.

శ్లో॥ పారోక్ష్యేణవిబుద్ధ్యేంద్రోయ ఆత్మేత్యాదిలక్షణాత్।
అపరోక్షీకర్తుమిచ్ఛంశ్చతుర్వారంగురుంయయౌ॥ ౬౭.

టీ. ఇంద్రః-దేవేంద్రుడు, యః-ఎవడు, ఆత్మేతి - ఆత్మయనెడి, లక్ష ణాత్-లక్షణవంతమగువాక్యమువల్ల, పారోక్ష్యేణ-పరోక్షత్వముచేత, విబుధ్య-బ్రహ్మమునెరిగి, అపరోక్షీకర్తుం - అపరోక్షము చేసికొనుటకు, ఇచ్ఛన్ సన్-ఇచ్ఛగలవాడగుచు, చతుర్వారం - నాలుగుమారు, గురుం - బ్రహ్మదేవుని: యయౌ - పొందెను.

తా. మరియు, ఏయాత్మ, పాపములేనివాడో, మలినములేనివాడో, మృత్యువులేనివాడో, దుఃఖములేనివాడో, నిస్సంశయుడో, అనగా నపరోక్షరూపుడనిచెప్పెడి, శ్రు॥ యఆత్మాపహతపాప్మా విరజో విమృత్యుర్విశోకోవిజిఘత్సః॥ ఇత్యాదివాక్యముచేత బ్రతిపాదింపబడిన లక్షణమువల్ల, దేవేంద్రుడు పరోక్షముగా నాత్మనెరిగి, పిమ్మట, విచారమువల్ల దేహత్రయమును నిరాకరించుటచేత, నాయాత్మ సాక్షాత్కార సిద్ధికొరకు, నాలుగుమార్లు తనగురువైన బ్రహ్మదేవునిదగ్గరకు బోయినట్లు ఛాందోగ్యోపనిషత్తునందు అష్టమాధ్యాయములో వినబడుచున్నది.

అవ. ఇప్పుడాయర్థమునే, ఐతరేయోపనిషత్తునందును వినబడుచున్నదని జూపుచున్నాడు.

శ్లో॥ ఆత్మావాఇదమిత్యాదౌ పరోక్షంబ్రహ్మలక్షితం।
అధ్యారోపాపవాదాభ్యాం ప్రజ్ఞానంబ్రహ్మదర్శితం॥ ౬౮.

టీ. ఇదం-ఈజగంబంతయు, ఆత్మావా- సృష్టికిబూర్వమందు బ్రహ్మమయముగానేయుండెననిచెప్పెడి, ఇత్యాదౌ - ఇత్యాది వాక్యమందు, బ్రహ్మ-బ్రహ్మము, పరోక్షం-పరోక్షత్వముగా, లక్షితం- తెలుపబడెను. అధ్యారోపాపవాదాభ్యాం=అధ్యారోప - అధ్యారోపముచేతను, అపవాదాభ్యాం- అపవాదముచేతను, ప్రజ్ఞానం-ఆత్మస్వరూపమగు ప్రజ్ఞానము, బ్రహ్మేతి-బ్రహ్మమని, దర్శితం-చూపబడెను. అనగా జెప్పబడెననుట.

తా. మరియు, సృష్టికిబూర్వమందు, ఈజగంబంతయు ఆత్మమయముగానుండెననియు, అన్యమెద్దియులేదనియుం జెప్పెడి, శ్రు। ఆత్మావాఇదమేకఏవాగ్రఆసీన్నాన్యత్కించనమిషత్ ॥ అనెడి వాక్యముచేత బ్రహ్మలక్షణమును దెలిపి, ఆయాత్మ, లోకములను సృష్టించుచున్నానని సంకల్పించెనని చెప్పెడి, శ్రు। సఈక్షతలోకాన్నుసృజే। అనెడి వాక్యము మొదలుకొని, శ్రు। తస్యత్రే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

య ఆవసథాస్త్రయస్స్వప్నాఅయమావసథో౽యమావసథ॥ అనెడి వాక్యపర్యంతముగల గ్రంథముచేత బరమాత్మయందు జగంబుకల్పింపబడినప్రకారమునుదెలిపి, శ్రు॥ సజాతోభూతాన్యభివ్యైఖ్యత్కిమిహాన్యంవావదిషత్ ॥ అనెడి వాక్యముచేత, ఆకల్పింపబడినజగంబునకు అపవాదమునుజెప్పి, శ్రు॥ స్వయమేవపురుషంబ్రహ్మతతమపశ్యదితీదమదర్శమితి॥ అనెడి వాక్యముచేత ప్రత్యగాత్మకు, బ్రహ్మస్వరూపత్వము జెప్పబడెను. మరియు, మరల, శ్రు॥ పురుషోహమేవ॥ అనెడి ఇత్యాదివాక్యముచేత జ్ఞానసాధనమగు వైరాగ్యముగలుగుటకొరకు గర్భవాసాదిదుఃఖమునుదెలిపి, ఈయాత్మ, ఎవ్వడో మేముపాసించెదమనిచెప్పెడి, శ్రు॥ కోయమాత్మేతి, వయముపాస్మహే॥ ఇత్యాది వాక్యముచేత విచారమువల్ల తత్త్వంపదార్థపరిశోధనపూర్వకముగా, శ్రు॥ ప్రజ్ఞానంబ్రహ్మ॥ అనెడివాక్యముచేత ప్రజ్ఞానస్వరూపుడగు ప్రత్యగాత్మకు బ్రహ్మత్వము జూపబడెను.

అవ. ఈచెప్పిన న్యాయమును,ఇతరశ్రుతులయందును జూపుచున్నాడు.

శ్లో॥ అవాంతరేణవాక్యేన పరోక్షా బ్రహ్మధీర్భవేత్।
సర్వత్రైవమహావాక్య విచారాదపరోక్షధీః॥ ౬౯.

టీ. అవాంతరేణ-ఒకానొకటియగు, వాక్యేన-వాక్యముచేత, పరోక్షా-పరోక్షమనెడి, బ్రహ్మధీః-బ్రహ్మజ్ఞానము, భవేత్-కలుగును. సర్వత్ర-సర్వశ్రుతులయందును, మహావాక్యవిచారాత్=మహావాక్య - మహావాక్యార్థముయొక్క, విచారాత్ - విచారణమువల్ల, అపరోక్షధీః - అపరోక్షజ్ఞానము కలుగుచున్నది.

తా. ఒకానొకవాక్యముచేత బ్రహ్మముగలదనెడి పరోక్షజ్ఞానము గలుగును. సర్వశ్రుతులయందును, మహావాక్యార్థ విచారణమువల్లనే, అపరోక్షబ్రహ్మజ్ఞానము గలుగునట్లు చెప్పబడెనని తెలియవలెను.

శ్లో॥ బ్రహ్మాపరోక్షసిద్ధ్యర్థం మహావాక్యమితీరితం।
వాక్యవృత్తావతోబ్రహ్మ పరోక్ష్యేవిమతిర్నహి॥ ౭౦.

టీ. బ్రహ్మాపరోక్షసిద్ధ్యర్థం=బ్రహ్మ - బ్రహ్మముయొక్క, అపరోక్షసిద్ధ్యర్థం-సాక్షాత్కారసిద్ధికొరకు, మహావాక్యమితి - మహావాక్యము ప్రవర్తించుచున్నదని, వాక్యవృత్తౌ-వాక్యవృత్తియందు, ఈరితం-చెప్పబడెను. అతః-మహావాక్యమువల్ల, బ్రహ్మాపరోక్ష్యే=బ్రహ్మ-బ్రహ్మముయొక్క, అపరోక్ష్యే-అపరోక్షజ్ఞానవిషయమై, విమతిః-వివాదము, నహి - లేనేలేదు.

తా. ప్ర. అయితే, మహావాక్యవిచారము, అపరోక్షజ్ఞానమును గలి౦

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున నెడివిషయమును, మీ రేకల్పించిచెప్పితి రేమోచెప్పుడు?. ఉ. బ్రహ్మము యొక్క అపరోక్షజ్ఞానమును సిద్ధింపజేయుటకొరకు మహావాక్యము ప్రవర్తించుచున్నదని వాక్యవృత్తియనెడి గ్రంథమందు, శ్రీశంకరాచార్యులు జెప్పిరి. కనుక, మహావాక్యార్థవిచారమువల్ల, బ్రహ్మసాక్షాత్కారరూపముగల అపరోక్షజ్ఞానముగలుగున నెడివిషయమై, వివాదమేమియు లేనేలేదని యభిప్రాయము.

అవ. వాక్యవృత్తియందు, శ్రీమదాచార్యులు చెప్పినప్రకారము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ ఆలంబనతయాభాతియోఽస్మత్ప్రత్యయశబ్దయోః।
అంతఃకరణసంభిన్నబోధస్సత్వంపదాభిధః॥ ౭౧.

టీ. యః-ఏ, అంతఃకరణసంభిన్నబోధః = అంతఃకరణసంభిన్న-అంతఃకరణోపాధికమగు, బోధః-బోధరూపముగలదో, సః- ఆబోధరూపము; అస్మత్ప్రత్యయశబ్దయోః-అస్మత్ప్రత్యయ-నేన నెడిజ్ఞానమునకును, శబ్దయోః- నేన నెడిశబ్దమునకును, ఆలంబనతయా-విషయత్వముచేత, భాతి-స్ఫురించుచున్నది. సః-అట్టివిధముగలబోధ, త్వంపదాభిధః= త్వం-నీవనెడి, పద - పదమే, అభిధః-పేరుగలదగును. అనగా, తత్త్వమసి, అనెడి మహావాక్యమందుగల, త్వం పదవాచ్యార్థమగుననుట.

తా. నేననెడిజ్ఞానమునకును, నేననెడిశబ్దమునకును, ఆధారముగా,అంతఃకరణోపాధికమగు, ఏబోధగలదో, ఆబోధ, తత్త్వమసి, అనెడిమహావాక్యమందుగల, త్వం, అనెడి పదముచే జెప్పదగినదగును.

అవ. ఇట్లు, త్వంపదవాచ్యార్థమునుదెలిపి, ఇప్పుడు, తత్పద వాచ్యార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ మాయోపాధిర్జగద్యోని స్సర్వజ్ఞత్వాదిలక్షణః।
పారోక్ష్యశబలస్సత్యా ద్యాత్మక స్తత్పదాభిధః॥ ౭౨.

టీ. మాయోపాధిః=మాయ-మాయయే, ఉపాధిః - ఉపాధిగాగలిగినట్టియు, జగద్యోనిః=జగత్-ప్రపంచమునకు, యోనిః- కారణమైనట్టియు, సర్వజ్ఞత్వాదిలక్షణః= సర్వజ్ఞత్వాది - సర్వజ్ఞత్వాది ధర్మరాశియే, లక్షణః-లక్షణముగాగలిగినట్టియు, పారోక్ష్యశబలః-పరోక్షత్వధర్మవిశిష్టమైనట్టియు, సత్యాద్యాత్మకః=సత్యాది-సత్యజ్ఞానాదికమే,ఆత్మకః-స్వరూపముగాగల పరమాత్మ, తత్పదాభిధః=తత్పద-తత్పదమే, అభిధః- పేరుగలవాడగును. అనగాతత్త్వమసి, అనెడి మహావాక్యమందుగల, తత్పదవాచ్యార్థమగుననుట.

తా. మరియు, ఆపరమాత్మ,మాయోపాధికుడును,జగత్కారణుడును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరోక్షత్వధర్మవిశిష్టుడునగును. ఇదియే పరమాత్మకు,తటస్థలక్షణమగును. మరియు, ఆపరమాత్మ, సత్యజ్ఞానానందస్వరూపుడగును.అట్టిపరమాత్మయే,తత్త్వమసి,అనేడి మహావాక్యమందుగల, తత్పదముచే జెప్పదగినవాడగునని తెలియవలెను.

అవ. ఇట్లు, తత్త్వంపదార్థములను దెలిపి, వాక్యార్థమునుబోధించుటకొరకు లక్షణావృత్తి, ఆశ్రయింపదగినదగునని ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రత్యక్పరోక్షతైకస్య సద్వితీయత్వపూర్ణతా।
విరుధ్యేతేయతస్తస్మా ల్లక్షణాసంప్రవర్తతే॥ ౭౩.

టీ. ఏకస్య-ఒకవస్తువునకు, ప్రత్యక్పరోక్షతా=ప్రత్యక్- ప్రత్యగ్భావంబును, అనగాబుద్ధింద్రియాదిసర్వప్రపంచమునకు నాంతరముగా వర్తించుచు సాక్షిత్వముచే ప్రకాశించుచుండుటనుట.పరోక్షతా-పరోక్షత్వంబును, సద్వితీయత్వపూర్ణతా=సద్వితీయత్వ-సద్వితీయత్వముతోగూడిన, పూర్ణతా- పరిపూర్ణత్వంబును, యతః-ఏకారణమువలన, విరుధ్యేతే - విరోధమునుబొందుచున్నవో, తస్మాత్-ఆకారణమువలన, లక్షణా - లక్షణావృత్తి, సంప్రవర్తతే - ప్రవర్తించుచున్నది.

తా. మరియు, ఒక్కటియగు బ్రహ్మవస్తువు, ప్రత్యగాత్మయనేడినామముచేత దేహమందు సర్వాంతరముగానుండి,బుద్ధీంద్రియాది సర్వప్రపంచమునకును సాక్షిత్వముగా స్ఫురించుచుండుటచేత స్వప్రకాశత్వమును బొందియున్నది. మరియు, ఆబ్రహ్మవస్తువే, ఆకాశాది సర్వజగదాధారముగానుండి ప్రత్యగాత్మవలె ప్రత్యక్షత్వముగాస్ఫురించక, పరోక్షత్వమునుబొందియున్నది. మరియు, ప్రత్యగాత్మ, దేహేంద్రియాది ద్వైతముతోగూడి, పరిచ్ఛిన్నత్వమును బొందియున్నాడు. సర్వజగదాధారమగు బ్రహ్మమే, పరిపూర్ణత్వమునుబొందియున్నది. ఈప్రత్యగాత్మయు, ఆబ్రహ్మంబును, సత్యజ్ఞానానందస్వరూపలక్షణముచేత ఏకత్వమును బొందియుండుటవల్ల, అట్టి అద్వితీయవస్తువునకు, ఈపూర్వోక్తప్రకారము, ౧. ప్రత్యక్త్వపరోక్షత్వంబును, ౨. సద్వితీయత్వముతోగూడిన పూర్ణత్వంబును గలిగియుండుట, విరోధమగును. కనుక, లక్షణావృత్తి, ఆశ్రయింపదగినదగునని యభిప్రాయము.

శ్లో॥ తత్త్వమస్యాదివాక్యేషు లక్షణాభాగలక్షణా।
సోయమిత్యాదివాక్యస్థ పదయోరివనాపరా॥ ౭౪.

టీ. సోఽయమితి-ఆదేవదత్తుడేవీడనేడి, ఇత్యాది వాక్యస్థపదయోరివ=ఇత్యాదివాక్యస్థ-ఇత్యాదివాక్యగతములగు, పదయోరివ- పదములయందువలె,


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తత్త్వమస్యాదివాక్యేషు-తత్-ఆబ్రహ్మము, త్వం-నీవు, అసి-ఐతివనెడి, ఆది-ఇత్యాది వాక్యేషు-వేదాంతవాక్యములయందు, భాగలక్షణా- విరుద్ధాంశమును పరిత్యజింపజేసెడి రూపముగల, లక్షణా - జహదజహల్లక్షణము, అనగా విడచి విడువని లక్షణమనుట. (ఆశ్రయణీయా) - ఆశ్రయింపదగినదగును. అపరా-ఇతరలక్షణము, అనగాజహల్లక్షణ అజహల్లక్షణములు రెండుననుట. న-ఆశ్రయింపదగినవికావు.

తా. ప్ర. అయితే, ఆలక్షణమెట్టిది?- ఉ. వాక్యం ॥ సోఽయందేవదత్తః=ఆగాలమందక్కడ జూడబడినదేవదత్తుడే నీడనెడి యర్థముగల, ఇత్యాది వాక్యములయందు విరుద్ధభాగములను పరిత్యజింపజేసెడి రూపముగల, జహదజహల్లక్షణమెట్లాశ్రయింపబడునో, అటువలెనే, తత్త్వమస్యాది మహావాక్యములయందును, జహదజహల్లక్షణ మాశ్రయింపబడునేగాని, ౧. జహల్లక్షణంబును, ౨. అజహల్లక్షణంబును, ఈరెండును ఆశ్రయింపబడవు.

ప్ర. అయితే, లక్షణమెన్నివిధంబులో జెప్పుము?. ఉ. ౧. (జహల్లక్షణము=విడచినలక్షణము) అనియు, ౨. (అజహల్లక్షణము = విడువనిలక్షణము, అనియు, ౩. (జహదజహల్లక్షణము= విడచినిడువనిలక్షణము) అనియు, ఇట్లు లక్షణావృత్తి, త్రివిధముగానున్నది. ప్ర. అయితే, అందు, ౧. (జహల్లక్షణము=విడచినలక్షణము) అనునదియెద్ది?. ఉ. వాక్యం (గంగాయాం ఘోషః=గంగయందు గొల్లపల్లెయున్నది.) అనెడి వాక్యమందుండెడి గంగయనెడి పదమునకు ప్రవాహమనియర్థమగును. కనుక, ఈయర్థము విరుద్ధమగుటచేత, ఈయర్థమునుబొత్తిగావిడచి, ఆగంగయొడ్డునందు గొల్లపల్లెయున్నదనెడి యర్థమును గ్రహించుటయే, జహల్లక్షణమనబడును. ఇట్లు, (తత్త్వమసి) అనెడిమహావాక్యమందుగల, త్వం=నీవు) అనెడిపదార్థమైన కూటస్థస్వరూపమును బొత్తుగావిడచినయెడల, మముక్షువులయొక్క స్వరూపమే లేకపోవును. కనుక, జహల్లక్షణము మహావాక్యార్థమందు గ్రహింపందగదు. ప్ర. సరి. ౨. (అజహల్లక్షణము=విడువనిలక్షణము) అనునదియెద్ది?. ఉ. (మంచాః క్రోశంతి= మంచములుకూయుచున్నవి.) అనెడివాక్యార్థము ప్రత్యక్షవిరోధమగుటచేత, (మంచాః= మంచములు) అనెడి పదమును విడువకనే, మంచములమీదనుండెడి పురుషులు కూయుచున్నారనెడి యర్థమును గ్రహించుటయే, అజహల్లక్షణ మనబడును. ఇది విడిపింపజేయని రూపముగలదగుటచేత, ఇది మహావాక్యార్థమందు, యుక్తముగానేకాదు. ప్ర. సరి. ౩. (జహదజహల్లక్షణము= విడచివిడువనిలక్షణము) అనునదియెద్ది? ఉ. వాక్యం॥ (సోఽయందేవదత్తః) అనెడి వాక్యమునకు, ఆకాల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మందు గంగాతీరమందు జూడబడిన దేవదత్తుడే వీడని, యర్థమగును. కనుక, ఈయర్థమందు విరుద్ధములగు, ఆదేశమీదేశములును, ఆకాలమీకాలములును, ఆవయస్సు ఈవయస్సు మొదలగు విరుద్ధాంశములనన్నిటినివిడచి, కేవల లక్ష్యార్థభూతుడైన దేవదత్తుడే వాక్యార్థమని గ్రహించినట్లు, (తత్త్వమసి) అనెడిమహావాక్యమందును, తత్త్వంపదార్థములైన బ్రహ్మకూటస్థులకు ఉపాధులగు, మాయా అవిద్యలను, వానికార్యములగు సర్వజ్ఞత్వకించిజ్జత్వాది సకలధర్మములనువిడిచి, కేవలచైతన్యమాత్రమునకు నైక్యమును గ్రహించుటయే, (జహదజహల్లక్షణము) అని చెప్పబడును. ఇదియే లక్ష్యార్థమగును. కనుక, ఈ చెప్పబడినప్రకారమే, (ప్రజ్ఞానం బ్రహ్మ, అహంబ్రహ్మాస్మి, అయమాత్మాబ్రహ్మ,) అనెడిమహావాక్యములకును లక్షణావృత్తిచేత లక్ష్యార్థమును గ్రహించవలెను.

శ్లో॥ సంసర్గోవావిశిష్టోవా వాక్యార్థో నాత్రసమ్మతః।
అఖండైకరసత్వేన వాక్యార్థో విదుషాంమతః॥ ౭౫.

టీ. అత్ర-ఇక్కడ, అనగా మహావాక్యములయందనుట. వాక్యార్థః-వాక్యార్థము, సంసర్గోవా-సంసర్గాన్వయరూపముగానైనను, విశిష్టోవా-విశిష్టాన్వయరూపముగానైనను, నసమ్మతః-అంగీకరింపబడదు. వాక్యార్థః-మహావాక్యార్థము, అఖండైకరసత్వేన-అఖండైకరసత్వముచేత, అనగా స్వగతాదిభేద శూన్యవస్తుమాత్రరూపముగాననుట. విదుషాం-పండితులకు, మతః-సమ్మతమగును.

తా. ప్ర. అయితే, వా॥ గామానయ=గోవునుదెమ్ము. అనెడి యిత్యాదివాక్యములయందు లక్షణావృత్తిలేకనే వాక్యార్థముబోధింపబడుచున్నది. అటువలెనే, ఈ మహావాక్యములయందును లక్షణావృత్తినాశ్రయించకనే వాక్యార్థమును బోధింపరాదాయేమి?. ఉ. లోకమందు, గోవునుదెమ్ము, అనెడియిత్యాదివాక్యములయందుగల, పదములచేత స్మరింపబడెడి ఆకాంక్షాదివంతములగు గవాదిపదార్థములయొక్క అన్వయము వాక్యార్థత్వముచే సంగ్రహింపబడును. ఇది సంసర్గాన్వయమునకు దృష్టాంతమగును. మరియు, వా॥ నీలంమహత్సుగంధ్యుత్పలం=మంచిపరిమళముగల నల్లగలువ. అనెడి యిత్యాది వాక్యములయందు, నలుపుమొదలగు ధర్మములతోఁగూడియుండెడి కలువ, వాక్యార్థత్వముగా గ్రహింపబడును. ఇది విశిష్టాన్వయమునకు దృష్టాంతమగును. ఈప్రకారముగా మహావాక్యములయందు సంసర్గరూపముగానైనను, విశిష్టరూపముగానైనను, వాక్యార్థత్వ మంగీకరింపబడదు. మరియేమనగా, అఖండాన్వయరూపముగా, మహావాక్యార్థము పండితులకు సమ్మతమగును. అనగా సజాతీయవిజాతీయస్వగతభేద శూన్యమగు కేవలవస్తుమాత్రరూపమైన వాక్యార్థము పండితు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లకు సమ్మతమగుననుట. కనుక, సంసర్గ విశిష్టరూపాన్వయములు రెండును, మహావాక్యములయందు పండితులకు సమ్మతములుగావు. అందుచేత లక్షణా వృత్తి, ఆశ్రయింపదగినదగునని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, అఖండైకరసరూపమగు వాక్యార్థమునుజూపుచున్నాడు.

శ్లో॥ ప్రత్యగ్బోధో యఆభాతి సోఽద్వయానందలక్షణః।
అద్వయానందరూపశ్చ ప్రత్యగ్బోధైకలక్షణః॥ ౭౬.

టీ. యః-ఏ, ప్రత్యగ్బోధః-సర్వాంతరుడగు చిద్రూపుడు, అనగా ప్రత్యగాత్మయనుట. ఆభాతి-బుద్ధ్యాదిసాక్షిత్వముచేత స్ఫురించుచున్నాడో, సః-ఆప్రత్యగాత్మ, అద్వయానందలక్షణః - అద్వితీయానంద లక్షణముగల పరమాత్మయగును. అద్వయానందరూపశ్చ - అద్వితీయానందరూప పరమాత్మయు, ప్రత్యగ్బోధైకలక్షణః=ప్రత్యక్- సర్వాంతరమగు, బోధ-బోధయే. ఏక-ముఖ్యమైన, లక్షణః-స్వరూపముగలవాడగును. అనగా ప్రత్యగాత్మయేయగుననుట.

తా. ఇట్లు లక్షణావృత్తినాశ్రయించి, తత్త్వమస్యాది మహావాక్యములకు అఖండాన్వయముచేత వాక్యార్థము జేయగా,దేహేంద్రియాది సర్వప్రపంచమునకులోగా బుద్ధ్యాది సాక్షిత్వముచేత, ఏబోధస్వరూపుడగు ( ప్రత్యగాత్మ) స్ఫురించుచున్నాడో, ఆప్రత్యగాత్మ, అద్వితీయానందరూప పరమాత్మయగును. ఆ అద్వితీయానందరూప పరమాత్మయు ఈబోధస్వరూపుడగు ప్రత్యగాత్మయేయగునని, ఇట్లువాక్యవృత్తియనెడి గ్రంథమందు, శ్రీశంకరాచార్యులు మహావాక్యార్థవిచారణవల్ల అపరోక్షజ్ఞానము గలుగునని చెప్పిరి.

శ్లో॥ ఇత్థమన్యోన్యతాదాత్మ్యప్రతిపత్తిర్యదాభవేత్।
అబ్రహ్మత్వంత్వమర్థస్యవ్యావర్తేతతదైవహి॥ ౭౭.

టీ. ఇత్థం-ఈపూర్వోక్తప్రకారము ప్రత్యగాత్మపరమాత్మలకు, అన్యోన్యతాదాత్మ్యప్రతిపత్తిః=అన్యోన్యతాదాత్మ్య-పరస్పర స్వరూపైక్యముయొక్క, ప్రతిపత్తిః-జ్ఞానము, యదా-ఎప్పుడు, భవేత్-కలుగునో, తదైవ-అప్పుడే, త్వమర్థస్య=త్వం-త్వమనెడి పదముయొక్క, అర్థస్య-అర్థమగు ప్రత్యగాత్మకు, అబ్రహ్మత్వం - భ్రాంతిసిద్ధజీవభావము, వ్యావర్తేత-నివర్తించును. హి-ఇది ప్రసిద్ధమనుట.

తా. ప్ర. అయితే, ఇట్లు అఖండార్థజ్ఞానముచేత ప్రయోజనమేమి? ఉ. ఈపూర్వోక్తప్రకారముప్రత్యగాత్మ పరమాత్మలయొక్క అన్యోన్యస్వరూపైక్యజ్ఞానము గలుగుచుండగా, అప్పుడే, (తత్త్వమసి) అనెడి వాక్యమందు గల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్వంపదార్థమగు ప్రత్యగాత్మకు భ్రాంతిచేత సిద్ధించియుండెడి జీవభావము నివర్తించును.

శ్లో॥ తదర్థస్యచపారోక్ష్యంయద్యేవంకింతతశ్శృణు।
పూర్ణానందైకరూపేణప్రత్యగ్బోధోవతిష్ఠతే॥ ౭౪.

టీ. తదర్థస్యచ=తత్-తత్పదముయొక్క, అర్థస్య-అర్థమగు బ్రహ్మమునకు, పారోక్ష్యంచ-పరోక్షత్వంబును నివర్తించును. అనగా పరోక్షజ్ఞానైకవిషయత్వంబును నివర్తించుననుట. యద్యేవః-ఈప్రకారము నివర్తించినయెడల, తతః-అందువల్ల, కిం-లాభమేమని యంటివేని, శృణు-చెప్పెదవినుము. ప్రత్యగ్బోధః=ప్రత్యక్-సర్వాంతరుడగు, బోధః - బోధస్వరూపప్రత్యగాత్మ, పూర్ణానందైకరూపేణ=పూర్ణ-పరిపూర్ణత్వంబును, ఆనంద- ఆనందత్వంబును, ఏక-ముఖ్యమగు, రూపేణ-స్వరూపముచేత, అవతిష్ఠతే- స్థితినిబొందుచున్నాడు.

తా. మరియు, పూర్వోక్త అఖండార్థజ్ఞానముచేత (తత్త్వమసి) అనెడి వాక్యమందుగల త్వంపదార్థమగు ప్రత్యగాత్మకు భ్రాంతిసిద్ధజీవత్వము నివర్తించుటయేగాక, తత్త్వమసి) అనెడి వాక్యమందుగల తత్పదార్థమగు బ్రహ్మమునకుగల పరోక్షజ్ఞానైక విషయత్వంబును నివర్తించుచున్నది. ప్ర. సరి. ఇటుని వర్తించుటచేత లాభమేమి?. ఉ. బుద్ధ్యాదులకు సాక్షిభావముగాస్ఫురించుచుండెడి, ఈబోధస్వరూప ప్రత్యగాత్మయే, పరిపూర్ణానందైక స్వరూపమగుచున్నది.

శ్లో॥ ఏవంసతిమహావాక్యాత్పరోక్షజ్ఞానమీర్యతే।
యైస్తేషాంశాస్త్రసిద్ధాంతవిజ్ఞానంశోభతేతరాం॥ ౭౫.

టీ. ఏవంసతి-ఇటుఖండైకరసజ్ఞానముగలుగుచుండగా, యైః - ఏజనులచేత, మహావాక్యాత్ మహావాక్యాగమువల్ల, పరోక్షజ్ఞానం - పరోక్షజ్ఞానము, ఈర్యతే-చెప్పబడునో, తేషాం-అట్టిజనులకు, శాస్త్రసిద్ధాంతవిజ్ఞానం=శాస్త్రసిద్ధాంత-వేదాంతశాస్త్రసిద్ధాంతముయొక్క, విజ్ఞానం - విజ్ఞానము, శోభతేతరాం- మిక్కిలియధికముగా ప్రకాశించును. అనగా నట్టిజనులు మూర్ఖులనియభిప్రాయము.

తా. ప్ర. అయితే,వా॥ సమయబలేన సమ్యక్పరోక్షానుభవసాధనమాగమః-వేదము సమయబలముచేత లెస్సగా పరోక్షానుభవసాధనమని వేదలక్షణము చెప్పబడియుండగా, మహావాక్యము, అపరోక్షజ్ఞానమును గలిగించునని యెట్లుచెప్పవచ్చును?. ఉ. పూర్వోక్తప్రకారము, మహావాక్యార్థ విచారమువల్ల, అఖండైకరసరూపమగు (అనగా సజాతీయవిజాతీయ స్వగతభేదశూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్యమైన) అపరోక్షజ్ఞానము గలుగుచుండగా, ఏజనులచేత మహావాక్యమువల్ల పరోక్షజ్ఞానము చెప్పబడునో, అట్టిజనులయొక్క వేదాంతశాస్త్రసిద్ధాంతవిజ్ఞానము మిక్కిలి ప్రకాశించుననిశ్రీవిద్యారణ్యగురుండు పరిహాసముచేసెను అనగా నట్టిజనులు వేదాంతసిద్ధాంత రహస్యము నెరుగరని, యభిప్రాయము.

శ్లో॥ ఆస్తాంశాస్త్రస్యసిద్ధాంతో యుక్త్యావాక్యాత్పరోక్షధీః।
స్వర్గాదివాక్యవన్నైవందశమేవ్యభిచారతః॥ ౮౦.

టీ. శాస్త్రస్య-వేదాంతశాస్త్రముయొక్క, సిద్ధాంతః - సిద్ధాంతము, ఆస్తాం-ఉండుగాక. యుక్త్యా-అనుమానప్రమాణముచేత, స్వర్గాదివాక్యవత్= స్వర్గాది-స్వర్గాదికమును ప్రతిపాదించెడి, వాక్యవత్-వాక్యమువలె,వాక్యాత్- మహావాక్యమువల్ల, పరోక్షధీశ్చేత్-పరోక్షజ్ఞానముగలుగునని యంటివేని, దశమే-పదియవవానియందు, వ్యభిచారతః-వ్యాప్తిలేమివల, నైవం- ఇట్లుగాదు.

తా. ప్ర. వేదాంతశాస్త్రసిద్ధాంతము నట్లుండనిమ్ము. అనుమానప్రమాణముచేత, వివాదాస్పదమగు మహావాక్యముస్వర్గాదికమును ప్రతిపాదించెడివాక్యమువలె, వాక్యసామాన్యమగుటవలన పరోక్షజ్ఞానమును కలిగించునదియేయగువాని, అపరోక్షజ్ఞానమును గలిగింపజాలదు గదా?. ఉ. ఈహేతువు నియమముగా నంతటనువ్యాపించునదిగాదు. ప్ర. అదియెట్లు?. ఉ. వా॥ దశమస్త్వమసి= నీవు పదియవవాడ వైతివనెడి వాక్యత్వము గలుగుచుండగా, అచ్చట అపరోక్షజ్ఞానముగలుగుచున్నది. కనుక, మహావాక్యముచేత అపరోక్షజ్ఞానము గలుగుచుండగా, గలుగదని చెప్పరాదు.

శ్లో॥ స్వతోఽపరోక్షజీవస్యబ్రహ్మత్వమభివాంఛతః।
నశ్యేత్సిద్ధాపరోక్షత్వమితియుక్తిర్మహత్యహో॥ ౮౧.

టీ. బ్రహ్మత్వం-పరోక్షబ్రహ్మస్వరూపమును, వాంఛతః- ఇచ్ఛయించుటవల్ల, స్వతః-స్వభావముగా, అపరోక్షజీవస్యాపి-అపరోక్షత్వముగలజీవునకును, సిద్ధాపరోక్షత్వం=సిద్ధ-స్వతస్సిద్ధమగు, అపరోక్షత్వం - అపరోక్షస్వభావము, నశ్యేదితి-నాశమును బొందుననెడి, యుక్తిః-యుక్తి, అహో-ఆహా, మహతీ - గొప్పదగును.

తా. ఇదియునుంగాక, (స్వతః) అపరోక్షత్వముగలజీవుడు, పరోక్షబ్రహ్మత్వమును గోరుటచేత, అట్టిజీవునకు, స్వతస్సిద్ధముగానుండెడి అపరోక్షత్వము నశించుననిచెప్పెడి యుక్తి, ఆహా మిక్కిలి గొప్పదియగును. అనగా, త్వంపదార్థమగు జీవునకు పరోక్షత్వములేమిచేతను, మహావాక్యముపరోక్షబ్రహ్మమును దెలుపుటచేతను, అట్టి జీవునకు మహావాక్యము పరోక్షజ్ఞాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునుగూడ, గలిగింపజాలదని, అంగీకరింతువేమో చెప్పుమని యభిప్రాయము. ఇక్కడ, జీవుడనగా ప్రత్యగాత్మయగును.

శ్లో॥ వృద్ధిమిష్టవతో మూల మపినష్టమితీదృశం।
లౌకికంవచనంసార్థం సంపన్నంత్వత్ప్రసాదతః॥ ౮౨.

టీ. వృద్ధిం-వడ్డిని, ఇష్టవతః - కోరెడివానియొక్క, మూలమపి-మూలధనంబును, నష్టమితి-నాశమునుబొందెననెడి, ఈదృశం-ఈలాటి, లౌకికం-లోకసంబంధమగు, వచనం-వాక్యము; త్వత్ప్రసాదతః = త్వత్-నీయొక్క, ప్రసాదతః-అనుగ్రహమువల్ల, సార్థం-సార్థకత్వమును, సంపన్నం-పొందినదాయెను.

తా. ప్ర. స్వతః, అపరోక్షత్వముగలజీవుడు, పరోక్ష బ్రహ్మత్వమునుగోరుచు, తన అపరోక్షత్వమును పోగొట్టుకొనుననెడి విషయము, నాకు ఇష్టమేయగును?. ఉ. ఇందుకు నీవు సమ్మతించినయెడల, వడ్డిని కోరెడివానియొక్కయాశ, మూలధనంబును జెరుచుననెడి, లోకవాక్యము, ఇప్పుడు నీయనుగ్రహమువల్ల, సార్థకమాయెను.

అవ. ఇప్పుడు, పూర్వవాది, ఒకవిధమైన ఆక్షేపము జేయుచున్నాడు.

శ్లో॥ అంతఃకరణసంభిన్నబోధో జీవో౽పరోక్షతాం।
అర్హత్యుపాధిసద్భావాన్నతు బ్రహ్మానుపాధితః॥ ౮౩.

టీ. ఉపాధిసద్భావాత్ = ఉపాధి-ఉపాధియొక్క, సద్భావాత్-స్థితివల్ల, అంతఃకరణసంభిన్నబోధః = అంతఃకరణ-అంతఃకరణముచేత, సంభిన్న-పరిచ్ఛిన్నత్వమునుబొందిన, బోధః-చిద్రూపుడగు, జీవః-జీవుడు,అపరోక్షతాం-అపరోక్షత్వమునుగూర్చి, అర్హతి-తగుచున్నాడు. బ్రహ్మతు-బ్రహ్మమో, అనుపాధితః-ఉపాధిలేనిదగుటవలన (అపరోక్షతాం) అపరోక్షత్వమును గురించి, నార్హతి - తగదు.

తా. ప్ర. అయితే, అంతఃకరణోపాధిగలజీవునకు, ఉపాధిగలిగియుండుటవలన, ఆ జీవునకు అపరోక్షత్వము గలిగియుండును. బ్రహ్మమునకు ఉపాధిలేమిచేత, ఆబ్రహ్మమునకు అపరోక్షత్వముతగదని చెప్పరాదాయేమి?.

అవ. ఇప్పుడు, సిద్ధాంతి, బ్రహ్మమునకు నిరుపాధికత్వము సిద్ధింపదని పరిహారమును జెప్పుచున్నాడు.

శ్లో॥ నైవంబ్రహ్మత్వబోధస్యసోపాధివిషయత్వతః।
యావద్విదేహకైవల్యముపాధేరనివారణాత్॥ ౮౪.

టీ. బ్రహ్మత్వబోధస్య- బ్రహ్మత్వజ్ఞానమునకు, సోపాధివిషయత్వతః= సోపాధి-ఉపాధితోగూడిన, విషయత్వతః- విషయముగలిగియుండుటవలన, అన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గా బ్రహ్మముగలిగియుండుటవల్లననుట. నైవం - ఇట్లు చెప్పరాదు. అనగా బ్రహ్మమునకు ఉపాధిలేదని చెప్పరాదనుట. విదేహకైవల్యం- విదేహముక్తి, యావత్-కలిగెడిపర్యంతము, ఉపాధేః- జీవునియొక్క ఉపాధి, అనివారణాత్- నివారింపమినలన, (జ్ఞానస్యసోపాధివిషయత్వం) జ్ఞానమునకు సోపాధికవిష యత్వము గలిగియున్నది.

తా. ఉ. బ్రహ్మమునకు ఉపాధిలేదని చెప్పరాదు. ప్ర. అదియేమి?. ఉ. జీవునకు (అహంబ్రహ్మాస్మి) అనెడి ఆకారముగల, ఏబ్రహ్మరూపత్వజ్ఞాన ముగలదో, అట్టిజ్ఞానము అంతఃకరణోపాధి సహితముగానున్నది. కనుక,అట్టి జ్ఞానమునకు విషయమగు బ్రహ్మంబును, ఉపాధిసహితముగానుండవలయును. మరియు, జ్ఞేయమగు బ్రహ్మమునకు ఉపాధిసహితత్వములేకనే, జ్ఞానమునకు సోపాధికవిషయత్వము సంభవింపదు. ప్ర. అయితే, జ్ఞానమునకు సోపాధిక విషయత్వ మెందువల్లగలుగునో జెప్పుము?. ఉ. జీవునకు విదేహముక్తి గలిగెడి పర్యంతము, అంతఃకరణోపాధి, నివర్తింపదు. అందువేత జ్ఞానమునకు విషయ మగు బ్రహ్మంబును, ఉపాధిసహితముగానున్నదని యంగీకరించవలెనని యభి ప్రాయము.

శ్లో॥ అంతఃకరణసాహిత్య రాహిత్యాభ్యాంవిశిష్యతే।
ఉపాధిర్జీవభావస్యబ్రహ్మతాయాశ్చనాన్యథా॥ ౮౫.

టీ. జీవభావస్య-జీవభావమునకును, బ్రహ్మతాయాశ్చ-బ్రహ్మభావ మునకును, ఉపాధిః - ఉపాధితత్వము, అంతఃకరణసాహిత్య రాహిత్యాభ్యాం- అంతఃకరణ - మనస్సుయొక్క, సాహిత్య - సంబంధముచేతను, రాహిత్యా భ్యాం-లేమిచేతను, విశిష్యతే-భేదత్వమునుబొందుచున్నది. అన్యథా- మరియొ కవిధముచేత, న-కాదు.

తా. ప్ర. అయితే, ఆ జీవబ్రహ్మములకుగల, ఉపాధిద్వయభేదమును జెప్పుము?. ఉ. జీవునకు, అంతఃకరణసంబంధమే, ఉపాధియగును. ఆయంతః కరణసంబంధము లేమియే, బ్రహ్మమునకు ఉపాధియగుగాని, మరియొక ఉపా ధిలేదు.

శ్లో॥ యథావిధిరుపాధిస్స్యాత్ప్రతిషేధస్తథానకిం।
సువర్ణలోహభేదేనశృంఖలాత్వంనభిద్యతే॥ ౮౬.

టీ. విధిః-భావరూపమగు అంతఃకరణసంబంధము, యథా- ఏప్రకార ము, ఉపాధిః-ఉపాధి,స్యాత్-అగునో, తథా- ఆప్రకారము, ప్రతిషేధః-అభా వరూపమగు అంతఃకరణవియోగము, నకిం- ఉపాధికాదాయేమి. అనగా నగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననుట. సువర్ణలోహభేదేన = సువర్ణ-బంగారముయొక్కయు, లోహ- ఇనుము యొక్కయు, భేదేన-భేదముచేత, శృంఖలాత్వం - బంధకత్వము, నభిద్యతే- భేదింపబడదు.

తా. ప్ర. అయితే, అంతఃకరణ సంబంధము, భావరూపమగుటచేత, అది యుపాధియనుగాని, అభావరూపమగు అంతఃకరణవియోగమును, ఉపాధినిగాజెప్పుట, ఉచితమెట్లగును?. ఉ. భావరూపమగు అంతఃకరణసంబంధము ఉపాధి, ఎట్లగునో, ఆప్రకారమే, అభావరూపమగు అంతఃకరణ వియోగంబును, ఉపాధియేయగును. ప్ర. అయినను, భావాభావరూపత్వ లక్షణము గల అవాంతరభేదముకనబడుచుండునుగదా?. ఉ. ఈభేదముచేత కొంచెమైనను ప్రయోజనములేదని, ఆభేదమును అనాదరించవలెను. ఇందుకు దృష్టాంతమును జెప్పెదవినుము. బంగారముచేతనైనను ఇనుముచేతనైనను సంకెళ్ళను చేసి, ఆ సంకెళ్ళచేత పురుషుని బంధింపజేయవచ్చును. అట్లు పురుషునియొక్క సంచారమును అడ్డగింపజేసెడి విషయమందు, ఉపయోగించని బంగారు ఇనుము మొదలగువానిభేదము, ఏప్రకారముగా అనాదరింపదగినదగునో,ఆప్రకారమే, భావాభావరూపభేదంబును, ఆదరింపదగినదికాదు. అనగా, భేదహేతువగు కార్యమెంతపర్యంతముండునో, అంతపర్యంతము ఉపాధిత్వమని,వా॥ యావత్కార్యమవస్థాయిభేదహేతోః॥ ఇట్లు ఉపాధిలక్షణము చెప్పబడుట చేత, అట్టిలక్షణము అంతఃకరణసంబంధ తద్వియోగములనెడి రెంటియందు నుండుటనల్ల, అభావరూపమగు అంతఃకరణవియోగంబును ఉపాధియేయగునని యు, మరియు, వ్యవహారముండెడి పర్యంతము బ్రహ్మము ఉపాధిగలదేయగునని యుం దెలియవలెను.

అవ. విధివలె, నిషేధంబును, బ్రహ్మబోధోపాయత్వముచేత బ్రహ్మోపాధియగునని ధృఢీకరించుటకొరకు, విధినిషేధములురెండును, బ్రహ్మబోధోపాయములుగా, శ్రీమదాచార్యులచేత నిరూపింపబడినవని, ఇప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ అతద్వ్యావృత్తిరూపేణ సాక్షాద్విధిముఖేనచ।
వేదాంతానాంప్రవృత్తిస్స్యాద్ద్విధేత్యాచార్యభాషితః॥౨౭.

టీ. అతద్వ్యావృత్తిరూపేణ=అతత్ - ప్రపంచముయొక్క, వ్యావృత్తిరూపేణ-నిషేధోపాయముచేతను, సాక్షాత్-సాక్షాత్తుగా, విధిముఖేనచ-వాచకశబ్దప్రయోగముచేతను, ద్విధా-ద్వివిధముగా, వేదాంతానాం-ఉపనిషత్తులకు, (బ్రహ్మణి) బ్రహ్మమందు, ప్రవృత్తిరితి - ప్రవర్తనముగలిగియున్నదని, ఆచా


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్యభాషితం-ఆచార్య-ఆచార్యులచేత, భాషితం- సంభాషింపబడెను. అనగా ప్రతిపాదింపబడెననుట.

తా. శ్రు॥ నేతినేతి॥ అనెడి శ్రుతిప్రకారము, ఇదియాత్మగాదిది యాత్మగాదని, దేహేంద్రియాది సర్వప్రపంచమును నిషేధించుటయే, వ్యావృత్తియని చెప్పబడును. అట్టివ్యావృత్తియనెడి ఉపాయముచేతను, మరియు, బ్రహ్మము, సద్రూపమనియు, చిద్రూపమనియు, అనంతరూపమనియుం జెప్పెడి, శ్రు॥ సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ॥ ఇత్యాదిశ్రుతిప్రకారము, వాచకశబ్దప్రయోగవిధానపూర్వకముచేతను, ఈ రెండువిధములుగా, ఉపనిషత్తులకుబ్రహ్మమందు ప్రవర్తనము గలిగియున్నదని, శ్రీమదాచార్యులచేత ప్రతిపాదింపబడెను.

శ్లో॥ అహమర్థపరిత్యాగా దహంబ్రహ్మేతిధీఃకుతః।
నైవమంశస్యహిత్యాగో భాగలక్షణయోదితః॥ ౮౮.

టీ. అహమర్థపరిత్యాగాత్=అహమర్థ - అహంశబ్దార్థమగు కూటస్థాత్మను, పరిత్యాగాత్ - విడుచుటవలన, అహం-నేను, బ్రహ్మేతి-బ్రహ్మమునైతి ననెడి, ధీః-జ్ఞానము, కుతః - ఎక్కడనుంచిగలుగును. అనగా గలుగదనుట. (ఇతిచేత్) ఇట్లంటివేని, నైవం-ఇట్లు ఆక్షేపింపరాదు. భాగలక్షణయా- జహదజహల్లక్షణముచేత, అంశస్యహి - అహంశబ్దార్థమందు గల జడాంశమునకే, త్యాగః-పరిత్యాగము, ఉదితః - చెప్పబడెను.

తా. ప్ర. అయితే, ఉపనిషత్తులు, ఇదియాత్మగాదిది యాత్మగాదని దేహేంద్రియాదిప్రపంచమును నిషేధించుటచేత, బ్రహ్మమును బోధించుచున్నవనియంగీకరించినయెడల, అహంశబ్దార్థమగు కూటస్థునిగూడ, విడువవలసివచ్చును. అట్లు కూటస్థాత్మను విడచినయెడల, (అహంబ్రహ్మాస్మి) అనెడియాకారకజ్ఞానము సామానాధికరణ్యముచే నెట్లు ఉదయించును?. ఉ. ఇట్లు ఆక్షేపింపరాదు. ప్ర. అదియేమి?. ఉ. జహదజహల్లక్షణముచేత అహంశబ్దార్థమందుగల జడాంశమమాత్రమే, విడువబడెనుగాని, కూటస్థాత్మ విడువబడలేదు. కనుక, (అహంబ్రహ్మాస్మి) అనెడి ఆకారకజ్ఞానము, లభింపబడునని తెలియవలెను.

అవ. జడాంశత్యాగముచేత బ్రహ్మమును బోధించెడిప్రకారము నిప్పుడు స్పష్టముగా జూపుచున్నాడు.

శ్లో॥ అంతఃకరణసంత్యాగా దవశిష్టేచిదాత్మని।
అహంబ్రహ్మేతివాక్యేన బ్రహ్మత్వంసాక్షిణీక్ష్యతే॥ ౪౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అంతఃకరణసంత్యాగాత్=అంతఃకరణ- మనస్సుయొక్క, సంత్యాగాత్-పరిత్యాగముకంటె, అవశిష్టే-మిగిలిన, చిదాత్మని- చిద్రూపుడగు, సాక్షిణి-కూటస్థునియందు, అహం-నేను, బ్రహ్మేతి-బ్రహ్మము నైతినని, వాక్యేన-వాక్యముచేత, బ్రహ్మత్వం-బ్రహ్మభావము, ఈక్ష్యతే- చూడబడుచున్నది. అనగా ననుభవింపబడుచున్నదనుట.

తా. అహంశబ్దార్థమందుగల జడాంశమగు అంతఃకరణమునువిడువగా శేషించినట్టి చిద్రూపకూటస్థునియందు, (అహంబ్రహ్మాస్మి) అనెడిమహావాక్యముచేత బ్రహ్మత్వము జూడబడుచున్నదని తెలియవలెను.

శ్లో॥ స్వప్రకాశోఽపిసాక్ష్యేషధీవృత్త్యావ్యాప్యతేఽన్యవత్।
ఫలవ్యాప్యత్వమేవాస్య శాస్త్రకృద్భిర్నివారితం॥ ౯౦.

టీ. ఏషః-ఈ, సాక్షీ-కూటస్థాత్మ, స్వప్రకాశోఽపి-స్వయంప్రకాశరూపుడైనను, అన్యవత్-ఘటాదివస్తువువలె, ధీవృత్త్యా-బుద్ధివృత్తిచేత, వ్యాప్యతే-వ్యాప్తినిబొందుచున్నాడు. అనగా వ్యాపింపబడుచున్నాడనుట. అస్య-ఈకూటస్థునకు, ఫలవ్యాప్యత్వమేవ= ఫల-వృత్తిప్రతిబింబిత చిదాభాసరూపముచేత, వ్యాప్యత్వమేవ - వ్యాప్తినిబొందుటయే, అనగావ్యాపింపబడుటయే యనుట. శాస్త్రకృద్భిః-శాస్త్రకర్తలచేత, నివారితం-నివారింపబడెను. అనగా వృత్తివ్యాప్యత్వము నివారింపబడలేదనుట.

తా. ప్ర. అయితే, అద్వితీయుడైన ప్రత్యగాత్మ, స్వప్రకాశుడైయుండగా, (అహంబ్రహ్మాస్మి) అనెడి యాకారముగల బుద్ధివృత్తిచేత నెరుగబడుటెట్లుగలుగును?. ఉ. నేనుస్వప్రకాశుడననెడి బుద్ధివృత్తి గలుగుచుండుటవలన, బుద్ధివృత్తిచేత ఘటాదికము వ్యాపింపబడినట్లు, ఈప్రత్యగాత్మయు, బుద్ధివృత్తిచేత, నేను బ్రహ్మమునని యెరుగబడుచున్నాడు. ప్ర. సరి. అట్లైనయెడల, మీమతము అపసిద్ధాంతముగాదాయేమి?. ఉ. ఫలముచేత, ఈప్రత్యగాత్మ, వ్యాపింపబడడనియేపూర్వాచార్యులు చెప్పిరిగాని, బుద్ధివృత్తిచేత ప్రత్యగాత్మకు వ్యాప్యత్వములేదనిచెప్పలేదు. గనుక, సిద్ధాంత విరోధములేదు. అనగా, ఈప్రత్యగాత్మ, స్వయంప్రకాశత్వముచేత ప్రకాశించుచుండుటవలన, ఫలముయొక్కవ్యాప్యత్వము, ఈప్రత్యగాత్మకు నిరాకరింపబడెనని యభిప్రాయము. బుద్ధివృత్తియందుప్రతిబింబింపబడినచిదాభాసుడు,ఫలమనిచెప్పబడును.

అవ. ఆత్మయందు ఫలవ్యాప్తిలేదని జూపుటకొరకు, ఇప్పుడుఅనాత్మకు, వృత్తిచేతను ఫలముచేతను వ్యాప్తిగలదని చూపుచున్నాడు.

శ్లో॥ బుద్ధితత్స్థచిదాభాసౌ ద్వావపివ్యాప్నుతోఘటం।

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తత్రాజ్ఞాన-ధియానశ్యేదాభాసేనఘటస్స్ఫురేత్॥ ౯౧.

టీ. బుద్ధితత్స్థచిదాభాసౌ=బుద్ధి-బుద్ధివృత్తియు, తత్స్థ- ఆ బుద్ధివృత్తియందుగల, చిదాభాసౌ-ఫలంబును, ద్వావపి - ఈరెండును, ఘటం- ఘటమును, వ్యాప్నుతః-వ్యాపించుచున్నవి. తత్ర-ఆ రెంటిలో, ధియా- ప్రమాణరూపబుద్ధివృత్తిచేత, అజ్ఞానం-అజ్ఞానము, నశ్యేత్ - నాశమునుబొందును. ఆభాసేన-చిదాభాసునిచేత, ఘటః-ఘటము, స్ఫురేత్-స్ఫురించును.

తా. బుద్ధివృత్తియు, చిదాభాసుడును, ఈరెండును ఘటమునువ్యాపించియుండును. ప్ర. అయితే, ఆరెండును వ్యాపించుటచేత ప్రయోజనమేమి?. ఉ. ఆ రెంటిలో ప్రమాణభూతమైన బుద్ధివృత్తిచేత అజ్ఞానము నశించును. అనగా జ్ఞానాజ్ఞానములకు విరోధమగుటవలన, ప్రమాణభూతమగు బుద్ధివృత్తిచేత అజ్ఞానము నశించునని యభిప్రాయము. మరియు, ఘటము, జడత్వముచేత, (స్వతః) స్ఫురింపజాలమివల్ల, చిదాభాసునిచేత స్ఫురించునని తెలియవలెను.

అవ. ఇప్పుడు, అనాత్మకంటె ఆత్మయందు విలక్షణత్వమును జూపుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మణ్యజ్ఞాననాశాయవృత్తివ్యాప్తిరపేక్ష్యతే।
స్వయంస్ఫురణరూపత్వాన్నాభాసఉపయుజ్యతే॥ ౯౨.

టీ. బ్రహ్మణి-ప్రత్యగాత్మయందు, అజ్ఞాననాశాయ=అజ్ఞాన-అజ్ఞానముయొక్క, నాశాయ-నాశముకొరకు, వృత్తివ్యాప్తిః = వృత్తి- బుద్ధివృత్తియొక్క, వ్యాప్తిః-వ్యాప్యత్వము, అనగా బుద్ధివృత్తి వ్యాపించుటనుట. అపేక్ష్యతే-అపేక్షింపబడుచున్నది. స్వయం-తాను, అనగా ప్రత్యగాత్మయనుట. స్ఫురణరూపత్వాత్-స్ఫురణరూపముగలిగియుండుటవలన, ఆభాసః-చిదాభాసుడు,నోపయుజ్యతే - ఉపయోగింపబడడు.

తా. ప్రత్యగాత్మ పరబ్రహ్మములయొక్క ఏకత్వము, అజ్ఞానముచేతనావరించబడియుండుటవలన, ఆ యజ్ఞానము నివర్తించుటకొరకు (తత్త్వమస్యాది) మహావాక్యమువలన బుట్టినట్టి, (అహంబ్రహ్మాస్మి) అనెడి యాకారముగలబుద్ధివృత్తిచేత, ప్రత్యగ్రూప బ్రహ్మమందు వ్యాప్తి అపేక్షింపబడును. మరియు, ఆ బుద్ధివృత్తియందు చిదాభాసుడున్నను, ఆ ప్రత్యగ్బ్రహ్మమునకు (స్వతః) స్ఫురణరూపము గలిగియుండుటచేత, ఆప్రత్యగ్బ్రహ్మమును స్ఫురింపజేయుటకొరకు, ఆచిదాభాసుడు ఉపయోగింపబడడని యభిప్రాయము.

అవ. ఈ చెప్పబడిన యర్థమును దృష్టాంతప్రదర్శనముచే విశదీకరించుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ చక్షుర్దీపావపేక్ష్యేతే ఘటాదేర్దర్శనే యథా।
నదీపదర్శనేకింతుచక్షు రేకమపేక్ష్యతే॥ గ-౩.

టీ. ఘటాదేః-ఘటాదివస్తురాశియొక్క, దర్శనే - దర్శనమందు, చక్షుర్దీపౌ-నేత్రదీపములు రెండును, అపేక్ష్యేతే- అపేక్షింపబడుచున్నవి. దీపదర్శనే=దీప-దీపమును, దర్శనే-చూచుటయందు, న - ఆ రెండునపేక్షింపబడవు. కింతు-మరియేమనగా, ఏకం-ఒక్కటియగు, చక్షుః-నేత్రము, యథా-ఏప్రకారముగా, అపేక్ష్యతే-అపేక్షింపబడుచున్నదో.

తా. అంధకారముచేత కప్పబడిన ఘటాది పదార్థరాశినిజూచుటయందు, నేత్రదీపములు రెండునపేక్షింపబడుచున్నవి. దీపమును జూచుటయందు నేత్రమొక్కటియే అపేక్షింపబడునుగాని, నేత్రదీపములు రెండు నపేక్షింపబడవు. అటువలెనే, ప్రత్యగ్బ్రహ్మమందును, అజ్ఞానము నశించుటకొరకు, బుద్ధివృత్తి ఒక్కటియే ఉపయోగింపబడునుగాని, చిదాభాసు డుపయోగింపబడడని తెలియవలెను.

శ్లో॥ స్థితోఽప్యసౌచిదాభాసో బ్రహ్మణ్యేకీభవేత్పరం।
నతుబ్రహ్మణ్యతిశయం ఫలంకుర్యాద్ఘటాదివత్॥ గ-౪.

టీ. అసౌ-ఈ, చిదాభాసః- చిదాభాసుడు, స్థితోఽపి - బుద్ధివృత్తియందు స్థితినిబొందియున్నను, బ్రహ్మణి-ప్రత్యగ్బ్రహ్మమందు, ఏకీభవేత్ - ఏకీభూతుడైయుండును. ఘటాదివత్-ఘటాదికమందువలె, బ్రహ్మణి= ప్రత్యగాత్మయందు, పరం-అన్యమగు, అతిశయం-అధికమైన, ఫలంతు-ప్రయోజనమునో, అనగాస్ఫురణలక్షణాతిశయమననుట. నకుర్యాత్-కలిగింపజాలడు.

తా. ప్ర. అయితే, బుద్ధియందును, దానివృత్తులయందును చిదాభాసుడు స్వాభావికముగా నుండుటచేత, ఘటాదులయందువలె బ్రహ్మమందును బుద్ధివృత్తివ్యాపించుచుండగా, ఆవృత్తివ్యాప్తిబలమువల్ల, చిదాభాసుడువ్యాపించియుండడాయేమి?. ఉ. ఘటాద్యాకారవృత్తియందువలె, (అహంబ్రహ్మాస్మి) అనెడియాకారము గల బుద్ధివృత్తియందు చిదాభాసుడున్నను, ఈప్రత్యగాత్మయగు బ్రహ్మముకంటె భిన్నముగాప్రకాశింపడు. మరియేమనగా మధ్యాహ్నకాలమందు గల ప్రచండసూర్యునియొక్క ఎండనడుమ వర్తించెడి దీపప్రభ, ఆయెండతోటి దేకీభూతమైనట్లు, ఈచిదాభాసుడును. ప్రత్యగాత్మయందు ఏకీభూతుడైయుండును. కనుక, ఘటమును స్ఫురింపజేసినట్లు,ఈచిదాభాసుడు బ్రహ్మమందు స్ఫురణలక్షణాతిశయమును గలిగింప జేయజాలడని యభిప్రాయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ అప్రమేయమనాదించే త్యత్రశ్రుత్యేదమీరితం।
మనసైవేదమాప్తవ్యమితి ధీవ్యాప్యతా శ్రుతా॥ ౯౫.

టీ. అత్ర-ఈవిషయమై, అప్రమేయం బ్రహ్మమప్రమేయమనియు,అనాదించేతి-అనాదియనియుంజెప్పెడి, శ్రుత్యా-శ్రుతిచేత, ఇదం- ఈఫలవ్యాప్తిరాహిత్యము, ఈరితం-చెప్పబడెను. ఇదం-ఈబ్రహ్మము, మనసైవ - మనంబుచేతనే, ఆప్తవ్యమితి - పొందదగినదనిచెప్పెడి శ్రుతిచేత, ధీవ్యాప్యతా= ధీ-బుద్ధివృత్తియొక్క, వ్యాప్యతా-వ్యాప్తి, శ్రుతా - వినబడుచున్నది.

తా. ప్ర. అయితే, ప్రత్యగ్బ్రహ్మమందు ఫలవ్యాప్తిలేదనియు, వృత్తివ్యాప్యత్వము ఉన్నదనియుం జెప్పితిరి. ఈవిషయమై ప్రమాణమేమి?. ఉ. బ్రహ్మము నిర్వికల్పకమనియు, అంత్యములేనిదనియు, హేతుదృష్టాంతము లేనిదనియు, అప్రమేయమనియు, అదిలేని, ఏబ్రహ్మమును పండితుడెరిగి సర్వసంసారబంధవిముక్తుడగునో, అనిచెప్పెడి, శ్రు॥ నిర్వికల్పమనంతంచ హేతుదృష్టాంతవర్జితం। అప్రమేయమనాదించ యద్జ్ఞాత్వాముచ్యతేబుధః॥ అనెడి అమృతబిందూపనిషత్తునందుగల అప్రమేయశబ్దముచేత, బ్రహ్మమందు ఫలవ్యాప్తిలేదనిచెప్పబడెను. మరియు, మనస్సుచేతనే బ్రహ్మముపొందదగినదగునని చెప్పెడి, శ్రు॥ మనసైవేదమాప్తవ్యం నేహనానాస్తికించన॥ అనెడి కఠశ్రుతిచేత,బ్రహ్మమందు వృత్తివ్యాప్తిగలదని వినబడుచున్నది. కనుక,ఈరెండుశ్రుతులును ప్రమాణములగునని యభిప్రాయము.

శ్లో॥ ఆత్మానంచేద్విజానీయా దయమస్మీతివాక్యతః।
బ్రహ్మాత్మవ్యక్తిముల్లిఖ్య యోబోధస్సోఽభిధీయతే॥ ౯౬.

టీ. అయం-ఈస్వప్రకాశానందరూప పరమాత్మ, అస్మీతి - నేనైతినని, ఆత్మానం-తనను,విజానీయాచ్చేత్-పురుషుడెరిగినయెడల ననిచెప్పెడి, వాక్యతః-వాక్యమువల్ల, బ్రహ్మాత్మవ్యక్తిం- బ్రహ్మ-సత్యాదిలక్షణ బ్రహ్మాభిన్నమగు, ఆత్మవ్యక్తిం-ప్రత్యగాత్మస్వరూపమును, ఉల్లిఖ్య-విషయీకరించి, యః-ఏ, బోధః-జ్ఞానముపుట్టుచున్నదో, సః-ఆజ్ఞానము, అభిధీయతే - ఈవాక్యముచేత జెప్పబడుచున్నది.

తా. ప్ర. అయితే, జీవునియందుగల అపరోక్షజ్ఞానదుఃఖనివృత్తులనెడి రెండవస్థలను, శ్రు॥ ఆత్మానంచేద్విజానీయా దయమస్మీతిపూరుషః। కిమిచ్ఛన్కస్యకామాయ శరీరమనుసంజ్వరేత్॥ అనెడిమంత్రముచే జెప్పబడెనని, ఈతృప్తిదీపమందుగల (౪౮) నలుబదియెనిమిదవశ్లోకముచేత మీరు జెప్పితిరి. ఆమంత్రమందు ఏవాక్యముచేత అపరోక్షజ్ఞానము చెప్పబడెనోచెప్పుము?. ఉ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సత్యజ్ఞానానందలక్షణముగల పరబ్రహ్మముకంటె అభిన్నమగు ప్రత్యగాత్మ స్వరూపమును సాక్షాత్కరించుకొని, ఏయపరోక్షజ్ఞానముబుట్టుచున్నదో,అయ పరోక్షజ్ఞానావస్థ, శ్రు ॥ ఆత్మానంచే ద్విజానీయా దయమస్మీతి పూరుషః॥ అనెడి ఈవాక్యముచే జెప్పబడెనని తెలియవలెను.

శ్లో॥ అస్తుబోధో౽పరోక్షో౽త్రమహావాక్యాత్తథాప్యసౌ।
నదృఢశ్శ్రవణాదీనామాచార్యైఃపునరీరణాత్॥ ౯౭.

టీ. అత్ర-ఈబ్రహ్మాత్మవిషయమందు, మహావాక్యాత్ - విచారసహిత మహావాక్యార్థమువల్ల, అపరోక్షః-సాక్షాత్కారభూతమగు, బోధః- జ్ఞానము, అస్తు-కలుగుగాక. తథాపి-అట్లుకలిగినను, ఆచార్యైః - శ్రీశంకరాచార్యుల చేత, పునః-మరల, అనగావాక్యార్థజ్ఞానోత్పత్త్యనంతరమందనుట. శ్రవణా దీనాం-వేదాంతశ్రవణమనన నిదిధ్యాసానుష్ఠానము, ఈరణాత్- చెప్పబడుట వల్ల, నదృఢః - దృఢముగాదు.

తా. ప్ర. అయితే, పూర్వోక్తప్రకారము, విచారసహిత వేదాంతవా క్యార్థమువల్లనే, అపరోక్షజ్ఞానము సిద్ధించెడిపక్షమందు, సూ ॥ ఆవృత్తిరసకృ దుపదేశాత్॥ ఇత్యాదివాక్యముచేత మాటిమాటికి ననుష్ఠింపవలెనని జెప్పబడి నవేదాంతశ్రవణాదికము ననుష్ఠింపవలసిన పనిలేదుగదా?. ఉ. ఈ బ్రహ్మాత్మ విషయమందు ఒకానొకప్పుడు విచారసహిత మహావాక్యార్థముచేత అపరోక్ష జ్ఞానముగలిగినను, అట్టిజ్ఞానము దృఢముగానిలువజాలదు. కనుక, మహావాక్యా ర్థవిచారమువల్ల జ్ఞానముగలిగినపిమ్మటయు, మాటిమాటికిని వేదాంతశ్రవణాది కము ననుష్ఠింపవలెనని, శ్రీశంకరాచార్యులచేత జెప్పబడెను. ఇట్లు శంకరా చార్యులచేత చెప్పబడుటవల్ల, అట్లుగలిగిన అపరోక్షజ్ఞానము దృఢముగాని ల్చుటకొరకు, వేదాంతశ్రవణాదికమును మాటిమాటికి జేయవలెననెడియర్థము లభింపబడుచున్నది. అనగా, జ్ఞానోత్పత్తియైన పిమ్మటగూడ, ఆచార్యులచేత జ్ఞానదార్ఢ్యతకొరకు జెప్పబడిన వేదాంతశ్రవణాద్యనుష్ఠానమును జేయవలెనని యభిప్రాయము.

అవ. శ్రీశంకరాచార్యులచేత, ఏవాక్యముచే నిట్లు చెప్పబడెననెడిశం కరాగా, ఆశంకరాచార్యవాక్యము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ అహంబ్రహ్మేతివాక్యార్థ బోధోయావద్దృఢీభవేత్।
శమాదిసహితస్తావ దభ్యసేచ్ఛ్రవణాదికం॥ ౯౮.

టీ. అహం-నేను, బ్రహ్మేతి-బ్రహ్మమైతినని యనెడి యాకారముగల, వా క్యార్థబోధః=వాక్యార్థ-మహావాక్యార్థవిచారజనితమగు, బోధః-అపరోక్షజ్ఞాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము, యావత్-ఎంతకాలమునకు, దృఢీభవేత్ - దృఢముగలదగునో, తావత్-అంతపర్యంతము, శమాదిసహితస్సన్=శమాది - శమదమాదులతోటి, సహితస్సన్- కూడినవాడగుచు, శ్రవణాదికం - వేదాంత శ్రవణ మననాదికమును, అభ్యసేత్ - అభ్యసింపవలెను.

తా. మహావాక్యార్థ విచారజనితమగు, (అహంబ్రహ్మాస్మి) అనెడియాకారముగల అపరోక్షజ్ఞానము ఎప్పటికి దృఢముగలదగునో, అంతపర్యంతము పురుషుడు శమదమాదులతో గూడినవాడగుచు వేదాంతార్థ శ్రవణ మననని దిధ్యాసముల నభ్యసింపవలెనని, శ్రీశంకరాచార్యులు జెప్పిరి.

శ్లో॥ బాఢంసంతిహ్యాదార్ఢ్యస్య హేతవశ్శ్రుత్యనేకతా।
అసంభావ్యత్వమర్థస్య విపరీతాచభావనా॥ ౯౯.

టీ. హి-ఏకారణమువల్ల, శ్రుత్యనేకతా= శ్రుతి-శ్రుతులయొక్క, అనేకతా-నానాత్వంబును, అర్థస్య-అద్వితీయబ్రహ్మరూపముయొక్క, అసంభావ్యత్వం-అసంభావితత్వంబును, విపరీతా-విపరీతమనెడి, భావనాచ- భావనయు, అదార్ఢ్యస్య-అదార్ఢ్యతకు, హేతవః-హేతువులు, బాఢం - సర్వవిధములచేత, సంతి-కలవో.

తా. ప్ర. అయితే, వేదాంతవాక్యప్రమాణమువల్ల బుట్టినజ్ఞానము,దృఢముగానిలువమికి గారణమేమి?. ఉ. శ్రుతులయొక్క నానావిధత్వమువల్ల గలిగెడిసంశయము, ప్రథమహేతువగును. మరియు, అఖండైకరసమగుఅద్వితీయబ్రహ్మరూపము లౌకికముగాదనిభావింపమి, అసంభావ్యమని చెప్పబడును. ఈ అసంభావ్యత్వము రెండవహేతువగును. మరియు, మరల కర్తృత్వాద్యభిమానముగలుగుట, విపరీతభావనయనిచెప్పబడును. ఈవిపరీతభావనము మూడవహేతువగును. ఇట్లు, అపరోక్షజ్ఞానము దృఢముగానిలువమికి, సర్వవిధములచేతను, ఈచెప్పబడిన మూడుహేతువులును గలిగియున్నవని తాత్పర్యము. పూర్వోక్తములగు, ౧. సంశయము, ౨. అసంభావన, ౩. విపరీతభావన,అనెడి ఈమూడును ఒక్కొకటి రెండేసివిధములుగానున్నవి. ఎట్లనగా,౧. ప్రమాణగతసంశయమనియు, ౨. ప్రమేయగత సంశయమనియు, ౧. ప్రమాణగత అసంభావనయనియు, ౨. ప్రమేయగత అసంభావనయనియు, ౧. ప్రమాణగతవిపరీతభావమనియు, ౨. ప్రమేయగతవిపరీతభావమనియు, ఇట్లు రెండేసివిధములుగానున్నవి. ప్ర. సరి. అందు ప్రమాణగతసంశయం బెయ్యది?. ఉ. శ్రుతి, కర్మమును ప్రతిపాదింపుచున్నదో, లేక, శిష్టంబగు ప్రత్యగ్బ్రహ్మమును ప్రతిపాదింపుచున్నదో, యనిగలిగెడి శ్రుతివిషయమైన సంశయము, ప్రమాణగతసంశయమని చెప్పబడును. ప్ర.సరి. ప్రమేయగతసంశయంబెద్ది?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. జగత్కారణవస్తువు బ్రహ్మమో, లేక, ప్రధానాదులో, యనిగలిగెడిసంశయము, ప్రమేయగతసంశయమనిచెప్పబడును. ప్ర. సరి. ప్రమాణగత అసంభావనయెద్ది?. ఉ. బ్రహ్మము శుద్ధవస్తువగుటవల్ల, అన్యప్రమాణముచేత పృథివ్యాదులవలె నెరుగబడుచున్నందున, ఆశుద్ధబ్రహ్మము జగత్కారణమగునని, శ్రుతులుప్రతిపాదింపనేరవనెడి నిశ్చయము, ప్రమాణగతాసంభావమని చెప్పబడును. ప్ర. సరి. ప్రమేయగత అసంభావమెద్ది?. ఉ. జగత్తుకంటె బ్రహ్మము విలక్షణమైయుండుటచేత, ఆబ్రహ్మముజగత్కారణమని చెప్పరాదనియు, ప్రధానాదులే జగత్కారణమనెడి నిశ్చయము, ప్రమేయగతా సంభావమని చెప్పబడును. ప్ర. సరి. ప్రమాణగత విపరీతభావంబెద్ది?. ఉ. బ్రహ్మముశుద్ధవస్తువగుటచేత, శ్రుతులకు శుద్ధబ్రహ్మమును బ్రతిపాదించుటయందు తాత్పర్యములేదనియు, మరియు శ్రుతులు శుద్ధబ్రహ్మమును బ్రతిపాదించిన యెడల పురుషునకు బ్రవృత్తి నివృత్తులుగూడవనియు, అందుచే బ్రయోజనములేకపోవుననియు, లోకమందు బ్రవృత్తిపూర్వకముగానే పురుషార్థముకనబడుచున్నదనియు, ఇట్లుదోచుటయే, ప్రమాణగత విపరీతభావంబని చెప్పబడును. ప్ర. సరి. ప్రమేయగత విపరీతభావంబెద్ది?. ఉ. అశుద్ధ్యాదివికారములతోగూడుకొనియుండెడి జగంబునకు కారణమగు బ్రహ్మంబును అశుద్ధ్యాదులతో గూడుకొనియుండవలెననియు, అట్లుండమిచేత ప్రధానాదులే జగంబునకు గారణమని బుద్ధియందుదోచుటయే, ప్రమేయగత విపరీతభావంబని చెప్పబడును. మరియు, ఈచెప్పబడిన సంశయా సంభావ్య విపరీతభావములుమూడును ప్రత్యగాత్మయందును గలుగుచున్నవని తెలియవలెను. ప్ర. అదియెట్లు?. ఉ. అంతర్యమందు జీవుడుగాను, జగంబులోనొకడుగాను, దోచుచుండెడితాను, జగద్విలక్షణమైన బ్రహ్మంబగునో, కాదో, యనితలంచుటయే ప్రత్యగాత్మవిషయక సంశయమగును. మరియు, కర్తృత్వాద్యనేక ధర్మయుక్తుడై, పరిచ్ఛిన్నుడై, జననమరణంబులతో గూడియుండెడి తనకు, విపరీతలక్షణములంగల బ్రహ్మస్వరూపత్వంబుగూడదని నిశ్చయించుటయే, ప్రత్యగాత్మవిషయమైన అసంభావనయనంబడును. మరియు, తానకర్తమైనయెడల, తనను దేశించి, ఈకర్మమునుచేయుమనియు, ఈకర్మమునుజేయకుమనియు, దీనిని మానుమనియు, దీనినిమానకుమనియు, దీనిని గ్రహింపుమనియు, దీనిని గ్రహింపకుమనియు, దీనినిభక్షింపుమనియు, దీనినిభక్షింపకుమనియు, ఈలాటిధర్మములు శ్రుతులయందు ప్రతిపాదింపనేరవనియు, అందుచేత నేనుకర్తనగుటకు సంశయములేదని నిశ్చయించుటయే, సర్వధర్మ ప్రతీతిలక్షణముగల విపరీతభావము,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రత్యగాత్మవిషయమైనదిగా జెప్పబడును. ఈప్రకారము సంశయాసంభావ్యవిపరీతభావనా స్వరూపముల నెరుంగవలెను.

అవ. ఇట్లు, జ్ఞానము దృఢముగానిలువమికి మూడు హేతువులనుచెప్పి, శ్రుతినానాత్వ ప్రయుక్తావార్థ్యహేతువు నివర్తించుటకొరకు, వేదాంతార్థశ్రవణము జేయదగినదని, ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ శాఖాభేదాత్కామభేదాచ్ఛ్రుతంకర్మాన్యథాన్యథా।
ఏవమత్రాపిమాశంకీత్యతశ్శ్రవణమాచరేత్॥ ౧౦౦.

టీ. శాఖాభేదాత్- ఋగ్వేదాదిశాఖాభేదమువలనను, కామభేదాత్-కామభేదమువలనను, అన్యథాన్యథా- అనేకవిధముగా, కర్మ-కర్మము, అనగా కర్మభేదమనుట. శ్రుతం-వినబడుచున్నది. ఏవం - ఈప్రకారము, అత్రాపి-ఉపనిషత్తులయందు ప్రతిపాదింపబడెడి బ్రహ్మస్వరూపమందును, మాశంకి-భేదమునుశంకింపకుము. ఇత్యతః-ఈహేతువువలన, శ్రవణం- వేదాంతార్థశ్రవణమును, ఆచరేత్ - ఆచరించవలెను.

తా. సాధనభూతమగు ఋక్కుచేత హౌత్రము చేయబడుచున్నదనియు, సాధనభూతమగు యజుస్సుచేత ఆధ్వర్యవము జేయబడుచున్నదనియు, సాధనభూతమగు సామముచేత ఉద్గీథము జేయబడునని, శ్రు॥ యదృచైవహౌత్రం క్రియతేయజుషాధ్వర్యవం సామ్నోద్గీథం॥ అనియిట్లు, ఋగ్వేదాదిశాఖాభేదమువలన కర్మభేదము వినబడుచున్నది. హోతచేత జేయబడెడికర్మము (హౌత్రమని) జెప్పబడును. ఆధ్వర్యునిచే జేయబడెడికర్మము, (ఆధ్వర్యవం) అని చెప్పబడును. ఉద్గాతచేజేయబడెడి సప్తవిధకర్మములలోనొకటి, (ఉద్గీథం)అని చెప్పబడును. మరియు, వర్షమునుగోరెడివాడు (కారీరి) అనెడిపేరుగలయజ్ఞమును చేయవలెననియు, ఆయువునుగోరెడివాడు (శతకృష్ణలం) అనెడి పేరుగల యజ్ఞమును జేయవలెనని, శ్రు ॥ కారీర్యావృష్టికామోయజేత, శతకృష్ణలమాయుష్కామః॥ ఇత్యాది వాక్యప్రకారము, కామభేదముచేత కర్మభేదము వినబడుచున్నది. ఈప్రకారమే ఉపనిషత్తులయందు ప్రతిపాదింపబడినబ్రహ్మతత్వవిషయమై సంశయింపరాదు. అట్టిసంశయనివృత్తికొరకు వేదాంతార్థశ్రవణము జేయవలయును. అనగా, ఉపనిషత్తులయందు ప్రతిపాదింపబడెడి బ్రహ్మతత్వమునకును భేదముగలదనెడి సంశయముగలుగుచుండగా, అట్టి సంశయమునివర్తించుటకొరకు, మాటిమాటికిని వేదాంతార్థ శ్రవణమును జేయవలెనని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, శ్రవణలక్షణమును జెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ వేదాంతానామశేషాణామాదిమధ్యావసానతః।
బ్రహ్మాత్మన్యేవ తాత్పర్యమితిధీశ్శ్రవణం భవేత్॥ ౧౦౧.

టీ. అశేషాణాం-సకలములైన, వేదాంతానాం - ఉపనిషత్తులయొక్క, ఆదిమధ్యావసానతః-ఆదిమధ్యాంతమువలన, బ్రహ్మాత్మన్యేవ=బ్రహ్మ-పరబ్రహ్మమగు, ఆత్మన్యేవ-ప్రత్యగాత్మయందే, తాత్పర్యమితి - తాత్పర్యమనెడి, ధీః-నిశ్చయబుద్ధి, శ్రవణం-వేదాంతార్థశ్రవణము, భవేత్- అగును.

తా. ప్ర. అయితే, ఆశ్రవణమెద్ది?. ఉ. సకలోపనిషత్తులకును,ఉపక్రమోపసంహారాది షడ్విధలింగములచేత తాత్పర్యము నిరూపింపబడుచుండగా, బ్రహ్మరూపమగు ప్రత్యగాత్మయే, పరతత్వమనెడి పర్యవసాననిశ్చయము, శ్రవణమని చెప్పబడును.

శ్లో॥ సమన్వయాధ్యాయఏతత్సూక్తంధీస్వాస్థ్యకారిభిః।
తర్కైస్సంభావనార్థస్య ద్వితీయాధ్యాయఈరితా॥ ౧౦౨.

టీ. ఏతత్-ఈశ్రవణము, సమన్వయాధ్యాయే-సమన్వయాధ్యాయమందు, అనగా బ్రహ్మసూత్రశాస్త్రముయొక్క ప్రథమాధ్యాయమందనుట. సూక్తం-వ్యాసాదులచే లెస్సగాజెప్పబడెను. అర్థస్య-వేదాంతార్థముయొక్క, సంభావనా-సంభావితత్వాను సంధానము, అనగా నసంభావనా నివృత్తిహేతువగుమననమనుట. ధీస్వాస్థ్యకారిభిః=ధీ-బుద్ధికి, స్వాస్థ్య- స్వస్థత్వమును, కారిభిః-కలిగించెడి, తర్కైః-యుక్తియుక్తశబ్దములచేత, ద్వితీయాధ్యాయే - ద్వితీయాధ్యాయమందు, ఈరితా - చెప్పబడెను.

తా. ప్ర. అయితే, ఇవ్విధమగుశ్రవణమెచ్చట నిరూపింపబడెనో చెప్పుము?. ఉ. ఈశ్రవణము, బ్రహ్మసూత్రశాస్త్రముయొక్క ప్రథమాధ్యాయమందు, వ్యాసాదులచే జక్కగాజెప్పబడెను. మరియు, అసంభావనానివృత్తి హేతువగు మననమో, ప్రమేయగతానుపపత్తి పరిహారద్వారా బుద్ధికిస్వాస్థ్యతనుగలిగించెడితర్కసులచేత, బ్రహ్మసూత్రశాస్త్రముయొక్క ద్వితీయాధ్యాయమందు నిరూపింపబడెను. కనుక, వేదాంతార్థశ్రవణముచేత శ్రుతి నానావిధత్వమువల్ల గలిగెడి జ్ఞానాదార్ఢ్యహేతువగు సంశయము నివర్తించుననియు, వేదాంతార్థమననముచేత అసంభావనయనెడి అదార్ఢ్యహేతువు నివర్తించుననియుం దెలియవలెను.

అవ. ఇప్పుడు, విపరీతభావనాత న్నివృత్త్యుపాయమును జెప్పుచున్నాడు.

శ్లో॥ బహుజన్మదృఢాభ్యాసా ద్దేహాదిష్వాత్మధీఃక్షణాత్।
పునఃపునరుదేత్యేవం జగత్సత్యత్వధీరపి॥ ౧౦౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. బహుజన్మదృఢాభ్యాసాత్=బహుజన్మ-అనేకజన్మములయందుగల, దృఢ-దృఢమగు, అభ్యాసాత్-అభ్యాసమువల్ల, దేహాదిషు - దేహాదులయందు, ఆత్మధీః-ఆత్మబుద్ధి, క్షణాత్-క్షణమాత్రమువల్ల, పునఃపునః-మాటిమాటికి, ఉదేతి-ఉదయించుచున్నది. ఏవం-ఈప్రకారము, జగత్సత్యత్వధీరపి - దేహేంద్రియాది జగత్సత్యత్వబుద్ధియు, (ఉదేతి) క్షణమాత్రమున గలుగుచున్నది.

తా. ఇదివరకుబహుజన్మములయందుగల దృఢాభ్యాసమువల్లనిమేషమాత్రములో దేహాదులయందు, మాటిమాటికి ఆత్మబుద్ధియు, దేహేంద్రియాది జగంబునందు సత్యత్వబుద్ధియు, గలుగుచున్నది. ఇదియే విపరీత భావనయని చెప్పబడును.

శ్లో॥ విపరీతాభావనేయమైకాగ్ర్యాత్సానివర్తతే।
తత్త్వోపదేశాత్ప్రాగేవ భవత్యేతదుపాసనాత్॥ ౧౦౪.

టీ. ఇయం-ఇది, విపరీతా-విపరీతమైన, భావనా-భావమగును. సా-ఆవిపరీతభావన, ఐకాగ్ర్యాత్-చిత్తైకాగ్ర్యమువల్ల, నివర్తతే - నివృత్తినిబొందుచున్నది. ఏతత్-ఈచిత్తైకాగ్ర్యము, తత్త్వోపదేశాత్-బ్రహ్మోపదేశముకంటె, అనగా బ్రహ్మోపదేశమును బొందుటకంటె ననుట. ప్రాగేవ - పూర్వమే, ఉపాసనాత్-సగుణబ్రహ్మోపాస్తివల్ల, భవతి-కలుగుచున్నది.

తా. ఈచెప్పబడిన దేహాత్మత్వజగత్సత్యత్వబుద్ధియే, విపరీతభావనయగును. ఈ విపరీత భావన, చిత్తైకాగ్ర్యమువల్ల, నివర్తించుచున్నది. ప్ర. అయితే, ఆచిత్తైకాగ్ర్యము, దేనివల్లగలుగునోజెప్పుము?. ఉ. నిర్గుణబ్రహ్మోపదేశమును బొందుటకంటె పూర్వమే, సగుణబ్రహ్మోపాసనవల్ల, ఈచిత్తైకాగ్ర్యము గలుగుచున్నది.

శ్లో॥ ఉపాస్తయోఽతఏవాత్రబ్రహ్మశాస్త్రేఽపిచింతితాః।
ప్రాగనభ్యాసినఃపశ్చాద్బ్రహ్మాభ్యాసేనతద్భవేత్॥ ౧౦౫.

టీ. అత్ర-ఈచిత్తైకాగ్ర్యవిషయమై, తే-అ, ఉపాస్తయఏవ-ఉపాసనలే, బ్రహ్మశాస్త్రేఽపి - వేదాంతశాస్త్రమందును, చింతితాః - చింతింపబడినవి. ప్రాక్-నిర్గుణబ్రహ్మోపదేశమును బొందుటకంటె పూర్వము,అనభ్యాసినః-అభ్యాసములేనివానికి, అనగా సగుణ బ్రహ్మోపాసనచేత చిత్తైకాగ్ర్యమును సంపాదించనివానికనుట. పశ్చాత్-పిమ్మట, అనగా నిర్గుణబ్రహ్మోపదేశమును బొందినపిమ్మటననుట. బ్రహ్మాభ్యాసేన-బ్రహ్మాభ్యాసముచేత, తత్-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆచిత్తైకాగ్ర్యము, భవేత్-కలుగును.

తా. ప్ర. అయితే, సగుణబ్రహ్మోపాసనవల్ల, చిత్తైకాగ్ర్యముగలుగుననెడివిషయము, దేనివల్లమీకుదెలిసెనో చెప్పుము?. ఉ. చిత్తైకాగ్ర్యమునుగలిగించెడి యాయుపాసనలే, వేదాంతశాస్త్రమందును చెప్పబడెను. అనగానుపాసనావిచారము వేదాంతశాస్త్రమందును జేయబడుటవల్ల, మాకు దెలిసెనని యభిప్రాయము. ప్ర. అయితే, సగుణబ్రహ్మోపాస్తిని జేయనివానికి, ఆచిత్తైకాగ్ర్యమెట్లుగలుగును?. ఉ. నిర్గుణబ్రహ్మోపదేశమునుబొందుటకంటె పూర్వమందు సగుణబ్రహ్మోపాస్తివల్ల చిత్తైకాగ్ర్యమును సంపాదించనివానికి, నిర్గుణబ్రహ్మోపదేశమును బొందినపిమ్మట, బ్రహ్మాభ్యాసమువల్ల, ఆచిత్తైకాగ్ర్యముగలుగుచున్నదని తెలియవలెను.

శ్లో॥ తచ్చింతనంతత్కథనమన్యోన్యంతత్ప్రబోధనం।
ఏతదేకపరత్వంచబ్రహ్మాభ్యాసంవిదుర్బుధాః॥ ౧౦౬.

టీ. తచ్చింతనం=తత్-ఆప్రత్యగ్బ్రహ్మస్వరూపముయొక్క, చింతనం-చింతనంబును, తత్కథనం-ఆబ్రహ్మస్వరూపవిషయ సంభాషణంబును, అన్యోన్యం-గురుశిష్యాదిసంవాదద్వారా, తత్ప్రబోధనం-ఆబ్రహ్మస్వరూపబోధనంబును, ఏతదేకపరత్వంచ=ఏతత్-ఈప్రత్యగాత్మయందు, ఏక-ముఖ్యమైన, పరత్వంచ-పరత్వబుద్ధియు, అనగా చిత్తైకాగ్ర్యరూపనిదిధ్యాసమనుట. బ్రహ్మాభ్యాసం - బ్రహ్మాభ్యాసమునుగా, బుధాః-పండితులు, విదుః- తెలిసికొనిరి.

తా. ప్ర. అయితే, బ్రహ్మాభ్యాసమెట్టిదో చెప్పుము?. ఉ. ఆప్రత్యగ్బ్రహ్మస్వరూపమును చింతించుటయు, ఆబ్రహ్మస్వరూపమునుగురించి సంభాషించుటయు, గురుశిష్యాదిసంవాదద్వారా, ఆబ్రహ్మస్వరూపమును తెలిసికొనుటయు, (ఏతదేకపరత్వంబును)= ఈప్రత్యగాత్మయందు చిత్తైకాగ్ర్యరూపనిదిధ్యాసంబును, ఈ చెప్పబడినవిషయములను బ్రహ్మాభ్యాసమునుగా విద్వాంసులు తెలిసికొనిరి. కనుక, ఇదియే బ్రహ్మాభ్యాసమగును.

అవ. ఏతదేకపరత్వమును విశదీకరించుట కొరకు, ఇప్పుడు శ్రుతిని పఠించుచున్నాడు.

శ్లో॥ తమేవధీరోవిజ్ఞాయప్రజ్ఞాంకుర్వీతబ్రాహ్మణః।
నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్వాచోవిగ్లాపనంహితత్॥

టీ. ధీరః-బ్రహ్మచర్యాదిసాధన సంపన్నుడగు, బ్రాహ్మణః - ముముక్షువు, తమేవ-ఆ ప్రత్యగ్రూపపరమాత్మనే, విజ్ఞాయ-ఎరిగి, ప్రజ్ఞాం-బ్రహ్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తైలైకత్వజ్ఞానసంతానరూప చిత్తైకాగ్ర్యమును, కుర్వీత-సంపాదించవలెను. బహూన్-అనాత్మగోచరములగు, శబ్దాన్-శబ్దములను, నానుధ్యాయాత్-స్మరింపరాదు. ఇట్లు చెప్పుటచేత వచించరాదనుటయుం గ్రహింపబడుచున్నది. తత్-ఆశబ్దస్మరణోచ్చారణము, వాచః-వాక్కునకు విగ్లాపనంహి - శ్రమహేతువేయగును.

తా. బ్రహ్మచర్యాదిసాధన సంపన్నుడగు ముముక్షువు, ఆప్రత్యగ్రూపపరమాత్మనే, నిస్సంశయముగానెరిగి, బ్రహ్మైకత్వ జ్ఞానసంతతిరూప చిత్తైకాగ్ర్యమును సంపాదించవలెను. అనాత్మవిషయములగు బహుశబ్దములను స్మరణోచ్చారణము జేయరాదు. అనాత్మగోచరములగు శబ్దములను ధ్యానించుటచేత మనస్సునకు శ్రమగలుగుననియు, అట్టి శబ్దోచ్చారణముచేత వాక్కునకు శ్రమగలుగుననియుం దెలియవలెను.

అవ. ఇట్లు చిత్తైకాగ్ర్యమును ప్రతిపాదించెడి శ్రుతినిదెలిపి, ఆవిషయమై ఇప్పుడు స్మృతినిగూడ, పఠించుచున్నాడు.

శ్లో॥ అనన్యాశ్చింతయంతోమాంయేజనాఃపర్యుపాసతే।
తేషాంనిత్యాభియుక్తానాంయోగక్షేమంవహామ్యహం॥౧౦౮.

టీ. ఏజనాః-ఏజనులు, అనన్యాస్సంతః- (అహంబ్రహ్మాస్మి) అనెడిజ్ఞానముచే నాకంటె నభిన్నులగుచు, (తద్భవ) ఆప్రకారమే, మాం - పరమేశ్వరుడగునన్ను, చింతయంతః-చింతించుచు, పర్యుపాసతే-సర్వకాలములయందును నారూపవంతులై వర్తించుచున్నారో, నిత్యాభియుక్తానాం=నిత్య-సర్వదా,అభియుక్తానాం- నాయందు చిత్తముగల, తేషాం-అట్టిజనులకు, అహం - వారిస్వరూపముగా ధ్యానింపబడెడినేను, యోగక్షేమం=యోగ-లభింపబడనిశుభమును లభింపజేయుటయు, క్షేమం-లభింపబడినశుభమును రక్షించుటయు, వహామి- సంపాదించుచున్నాను.

తా. ఏజనులు, (అహంబ్రహ్మాస్మి) అనెడి యాకారము గల జ్ఞానముచేత నాకంటె నభిన్నులగుచు, ఆప్రకారమే నన్నుచింతించుచు, సర్వకాలములయందును నన్నుపాసించుచు నారూపవంతులయ్యెవర్తించెదరో, అట్టి (సర్వదా) నాయందు చిత్తముగల జనులకు, వారిస్వరూపముగా ధ్యానింపబడుచుండెడి నేను, వారికి యోగక్షేమములను సంపాదించుచున్నాను. పొందబడని శుభమును పొందింపజేయుట, యోగమని చెప్పబడును. లభింపబడిన యోగమును రక్షించుట, క్షేమమనబడును.

అవ. ఈ యుదాహరింపబడిన శ్రుతిస్మృతులయొక్క తాత్పర్యము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఇతిశ్రుతిస్మృతీనిత్యమాత్మన్యేకాగ్రతాంధియః।
విధత్తోవిపరీతాయాభావనాయాఃక్షయాయహి॥ ౧౦౯.

టీ. ఇతి-ఈప్రకారము, శ్రుతిస్మృతీ-శ్రుతిస్మృతులు రెండును, విపరీతాయాః-విపరీతమగు, భావనాయాః-భావనయొక్క, క్షయాయహి-నాశము కొరకే, ఆత్మని-ప్రత్యగాత్మయందు, నిత్యం-సర్వదా, ధియః - చిత్తమునకు, ఏకాగ్రతాం-ఏకాగ్ర్యమును, విధత్తః-ప్రతిపాదించుచున్నవి.

తా. ఈ యుదాహరింపబడిన శ్రుతిస్మృతులు రెండును, విపరీతభావనను నశింపజేయుటకొరకే, సర్వదా, ఆత్మయందు చిత్తైకాగ్ర్యమును ప్రతిపాదించుచున్నవని తెలియవలెను.

శ్లో॥ యద్యథావర్తతేతస్యతత్త్వంహిత్వాన్యథాత్వధీః।
విపరీతాభావనాస్యాత్పిత్రాదావరిధీర్యథా॥ ౧౧౦.

టీ. యత్-ఏశుక్త్యాదివస్తువు, యథా-ఏశుక్త్యాదిరూపముచేత, వర్తతే-వర్తించుచున్నదో, తస్య-ఆశుక్త్యాదివస్తువుయొక్క, తత్త్వం - శుక్త్యాదిరూపత్వమును, హిత్వా-విడచి, అన్యథాత్వధీః-అన్యథాత్వ-రజతాదిరూపత్వముయొక్క, ధీః-జ్ఞానము,పిత్రాదౌ-తండ్రిమొదలగుజనమునందు. అరిధీర్యథా - శత్రుత్వజ్ఞానమువలె, విపరీతా-విపరీతమైన, భావనా- భావన, స్యాత్-అగును.

తా. ప్ర. అయితే, దేహాదులయందు ఆత్మత్వబుద్ధికిని, దేహేంద్రియాదిజగత్సత్యత్వబుద్ధికిని, విపరీతభావనాస్వభావ మెట్లుగలిగెను?. ఉ. ఆరెంటియందును విపరీతభావనాలక్షణముండుటచేత, ఆ రెంటికిని విపరీతభావనాస్వభావముగలిగియున్నది. ప్ర. అయితే, ఆవిపరీతభావనాలక్షణమెద్ది?. ఉ. ఏశుక్త్యాదివస్తువు ఏశుక్త్యాదిరూపముచేత వర్తించుచున్నదో ఆశుక్త్యాదివస్తువుయొక్కరూపత్వమునువిడచి, రజతాదిరూపత్వముయొక్క జ్ఞానము, విపరీతభావనయగును. అనగానదిగాని వస్తువునందు దానిబుద్ధి, విపరీత భావనయగునని తెలియవలెను. ప్ర. ఇందుకు ఉదాహరణమును జెప్పుము?. ఉ. తండ్రిమొదలగుబంధుజనమందు శత్రుత్వబుద్ధి, విపరీతభావనయైనట్లు, దేహేంద్రియాదికమందుగల ఆత్మత్వబుద్ధియు, దేహేంద్రియాది జగత్సత్యత్వబుద్ధియు, విపరీతభావనేయగునని యభిప్రాయము.

అవ. ఈ పూర్వోక్తలక్షణమును ప్రకృతమందు గూర్చుచున్నాడు.

శ్లో॥ ఆత్మాదేహాదిభిన్నోయంమిథ్యాచేదంజగత్తయోః।
దేహాద్యాత్మత్వసత్యత్వధీర్విపర్యయభావనా॥ ౧౧౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అయం-ఈ, ఆత్మా-ప్రత్యగాత్మ, దేహాదిభిన్నః= దేహాది-దేహేంద్రియాదులకంటె, భిన్నః-భిన్నుడగును. ఇదం-ఈ, జగచ్చ-దేహేంద్రియాదిప్రపంచంబును, మిథ్యా-మిథ్యయగును. తయోః- ఆ యాత్మజగంబులవిషయమై, దేహాద్యాత్మత్వసత్యత్వధీః=దేహాది-దేహాదులయందు, ఆత్మత్వ - ఆత్మత్వబుద్ధియు, సత్యత్వధీః-దేహేంద్రియాదిజగత్సత్యత్వబుద్ధియు, విపర్యయభావనా - విపరీతభావనయగును.

తా. ఈ ప్రత్యగాత్మ, వాస్తవముచేత దేహేంద్రియాది జగంబుకంటె భిన్నుడగును. ఈ దేహేంద్రియాదిజగంబును మిథ్యయగును. ఇట్లగుచుండగా, ఆయాత్మజగంబులవిషయమై, దేహాదులయందు, ఏ యాత్మత్వబుద్ధిగలదో యదియు, దేహేంద్రియాదిజగంబుయొక్క, ఏ సత్యత్వబుద్ధిగలదో యదియు, విపరీతభావనయగునని యభిప్రాయము.

అవ. పూర్వము, (౧౦౪) శ్లోకమందు చిత్తైకాగ్ర్యమువల్ల విపరీతభావన నివర్తింపబడునని సామాన్యముగాజెప్పబడిన యర్థమునే, ఇప్పుడు విశేషాకారముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ తత్వభావనయానశ్యేత్సాతో దేహాతిరిక్తతాం।
ఆత్మనోభావయేత్తద్వన్మిథ్యాత్వంజగతోనిశం॥ ౧౧౨.

టీ. సా-ఆవిపరీతభావన, తత్వభావనయా = తత్వ-ప్రత్యగ్బ్రహ్మముయొక్క, భావనయా-ధ్యానముచేత, నశ్యేత్ - నాశమును బొందును. అతః-ఆకారణమువల్ల, అనిశం-సర్వదా, ఆత్మనః-ప్రత్యగాత్మకు, దేహాతిరిక్తతాం= దేహ-శరీరత్రయముకంటె, అతిరిక్తతాం-భిన్నత్వమును, భావయేత్- ధ్యానింపవలెను. తద్వత్-ఆప్రకారము, అనిశం-సర్వదా, జగతః- దేహేంద్రియాది జగంబునకు, మిథ్యాత్వం-మిథ్యాత్వమును, భావయేత్ - చింతించవలెను.

తా. దేహాద్యాత్మత్వ జగత్సత్యత్వబుద్ధిరూపమగువిపరీతభావన, ప్రత్యగ్బ్రహ్మ స్వరూపమును నిరంతరము ధ్యానించుటచేత నశించును. కనుక, ప్రత్యగాత్మ, దేహేంద్రియాది సర్వజగంబునకంటె నన్యుడనియు, దేహేంద్రియాది జగంబంతయు మిథ్యయనియు, ఇట్లు సర్వదా భావించుచుండవలెనని చెప్పబడెను.

అవ. ఇప్పుడు పూర్వవాది, ఒకప్రశ్న జేయుచున్నాడు.

శ్లో॥ కింమంత్రజపవన్మూర్తిధ్యానవచ్చాత్మభేదధీః।
జగన్మిథ్యాత్వధీశ్చాత్రభావ్యావర్త్యాస్యాదుతాన్యథా॥ ౧౧౩.

టీ. ఆత్మభేదధీః=ఆత్మ-ప్రత్యగాత్మయొక్క, భేదధీః - భేదజ్ఞానంబును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనగా దేహాదులకంటె, ప్రత్యగాత్మ భిన్నమనెడి జ్ఞానంబుననుట. జగన్మిథ్యాత్వధీశ్చ=జగత్-దేహేంద్రియాదిజగంబుయొక్క, మిథ్యాత్వధీశ్చ- మిథ్యాత్వభావనయు, మంత్రజపవత్=మంత్ర-మంత్రముయొక్క, జపవత్- జపమువలెను, మూర్తిధ్యానవచ్చ=మూర్తి-దేవతాదిరూపముయొక్క, ధ్యానవచ్చ - ధ్యానమువలెను, అత్ర-ఇక్కడ, అనగా బ్రహ్మాభ్యాసమందనుట. ఆవర్త్యా-నియమముచేననుష్ఠింపదగినది. కింస్యాత్-అగునాయేమి? ఉత-అట్లుగాక, అన్యథా-మరియొకవిధముగలది, (కింస్యాత్) అగునాయేమి?. అనగా లౌకిక వ్యవహారమువలె నియమములేకనే జేయుటకు శక్యమగునేమో చెప్పుమనుట.

తా. ప్ర. అయితే, ఓ అద్వైతసిద్ధాంతి, దేహాదులకంటె ప్రత్యగాత్మ భిన్నమనెడి రూపముగల భేదజ్ఞానంబును, దేహేంద్రియాది జగంబుయొక్క మిథ్యాత్వభావనయు, మంత్రజపమును జేసినట్లును, దేవతాదిరూపమును ధ్యానించినట్లును, నియమముచే ననుష్ఠింపవలెనో, లేక, లౌకిక వ్యవహారమువలె నియమములేకనే అనుష్ఠింపదగునేమో జెప్పుము.

అవ. అనియిట్లు పూర్వవాది యడుగగా, ప్రత్యక్షఫలము గలదగుట చేత, ఇక్కడనియమమెద్దియులేదని, ఇప్పుడు సిద్ధాంతి చెప్పుచున్నాడు.

శ్లో॥ అన్యథేతివిజానీహిదృష్టార్థత్వేనభుక్తివత్।
బుభుక్షుర్జపవద్భుఙ్క్తేనకశ్చిన్నియతఃక్వచిత్॥ ౧౧౪.

టీ. దృష్టార్థత్వేన-ప్రత్యక్షఫలముగలిగియుండుటచేత, భుక్తివత్-భోజనమువలె, అనగా భోజనముజేసినట్లనుట. అన్యథేతి- నియమములేకనే యనుష్ఠింపవచ్చునని, విజానీహి-తెలిసికొనుము. బుభుక్షుః - భోజనము జేయుట కిచ్ఛయించెడిపురుషుడు, కశ్చిత్-ఎవడును, నియతస్సన్- నియమముగలవాడగుచు, క్వచిత్-ఎప్పుడును, జపవత్-జపముచేసెడిపురుషునివలె, నభుఙ్క్తే- భోజనము జేయడు.

తా. ప్రత్యగభిన్నబ్రహ్మాభ్యాసము, ప్రత్యక్షఫలము గలదగుటవల్ల, భోజనము జేసినట్లు, నియమములేకనే, బ్రహ్మాభ్యాసమును జేయవచ్చును. ప్ర. అయితే, భోజనము ప్రత్యక్షఫలముగలదైనను, శ్రుతిస్మృతులచేత భోజనము జేయుటయందు నియమము జెప్పబడలేదాయేమి?. ఉ. ఆకలిని పోగొట్టుకొనుటకు భోజనము జేయుటకిచ్ఛయించెడి పురుషుడు, జపము జేయువానివలె, నియమముగలిగి, భోజనము జేయడు. అనగా, తనకు ఆకలిచేతగలిగినబాధ, ఏప్రకారముగా నివర్తించునో, ఆప్రకారముగా భోజనము జేయుచున్నాడని యభిప్రాయము.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఈవిషయమునే, ఇప్పుడు, స్పష్టముగా చెప్పుచున్నాడు.

శ్లో॥ అశ్నాతివాననవాశ్నాతిభుఙ్క్తేవా స్వేచ్ఛయాన్యథా।
యేన కేన ప్రకారేణ క్షుధామపనినీషతి॥ ౧౧౫.

టీ. (అన్నేసతి) ఆకలిగలవాడు అన్నము గలిగియుండగా, అశ్నాతివా-ఒకానొకప్పుడు భక్షించుచున్నాడు. (తస్మిన్నసతి) ఆయన్నము లేకపోవుచుండగా, నవాశ్నాతి-భక్షింపనివాడగుచు కాలమును గడుపుచున్నాడు. అనగా నాకలిబాధను మఱపించెడి జూదము మొదలగు కార్యములను జేయుటచే కాలమునుగడుపుచున్నాడనుట. అన్యథావా- మరియొకవిధముగానైనను, అనగా నాహారమున్నప్పుడు నిల్చియుండినైనను నడుచుచునైనను పండుకొనినైననను నుట. స్వేచ్ఛయా-తనయిష్టప్రకారము, భుఙ్క్తే-భక్షించుచున్నాడు. యేన కేనప్రకారేణ- ఏప్రకారముచేనైనను, క్షుధాం-ఆకలిని, అనగా తాత్కాలిక క్షుద్బాధననుట. అపనినీషతి- పోగొట్టుకొనుట కిచ్ఛయించుచున్నాడు.

తా. ఆకలిగలవాడు అన్నమున్నప్పుడు భక్షించుచున్నాడు. ఆయన్నము లేనప్పుడు క్షుద్బాధనుమఱపించెడి జూదము మొదలగు చేష్టలచేత కాలమునుగడుపుచున్నాడు. మరియు, ఆహారమున్నప్పుడు, నిల్చియుండినైనను, నడుచుచునైనను, పండుకొనినైనను, సమయభేదముచేత తనయిష్టప్రకారముగాభక్షించుచున్నాడు. ఏప్రకారముచేనైనను, తాత్కాలికక్షుద్బాధను పోగొట్టుకొనుటకు ఇచ్ఛయించుచున్నాడు. ఇచ్చటొకయభిసంధిగలదు. అది యేమనగా, క్షుద్బాధానివృత్తిలక్షణ ప్రత్యక్షఫలముకొరకు, తనయిష్టప్రకారముగా నియమములేకనే భోజనము జేయదగినదనియు, నియమములు పరలోక హేతువులగుననియుం దెలియవలెను.

అవ. జపాదులయందు భోజనముకంటెభేదము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ నియమేనజపంకుర్యాదకృతౌప్రత్యవాయతః।
అన్యథాకరణేనర్థస్స్వరవర్ణవిపర్యయాత్॥ ౧౧౬.

టీ. అకృతౌసత్యాం-గాయత్ర్యాదిమహామంత్రజపము జేయకపోవుచుండగా, ప్రత్యవాయతః-ప్రత్యవాయమనెడి దోషముగలుగుచుండుటవల్ల,నియమేన-నియమముచేత, జపం-మంత్రజపమును, కుర్యాత్ - చేయవలెను. అన్యథా-మరియొకవిధముగా, స్వరవర్ణవిపర్యయాత్= స్వర-స్వరముయొక్కయు, వర్ణ-వర్ణముయొక్కయు, విపర్యయాత్-విపర్యయమువల్ల, కరణేసతి-జపము జేయుచుండగా, అనర్థః - కీడుగలుగును.

తా. చేయవలసినగాయత్ర్యాది మహామంత్రజపమును, నియమముచేత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జేయవలెను. ప్ర. అందుకుహేతువేమి?. ఉ. చేయవలసిన గాయత్ర్యాదివ హోమంత్రజపమును చేయనియెడల, ప్రత్యవాయమనెడిదోషముగలుగును. ప్ర. అయితే, చేయవలసినగాయత్ర్యాది మంత్రజపమునుజేయనియెడల, ప్రత్యవాయదోషము గలుగుగాక. ఆజపమును నియమముదప్పి మరియొకవిధముగా జేయుటచేత ఆప్రత్యవాయదోషము గలుగదుగదా?. ఉ. స్వరవర్ణవిపర్యయముగా మంత్రమును జపించినయెడల, దేవేంద్రునియొక్క శత్రువగు వృత్రాసురునకు స్వరాపరాధముచేత గీడుగలిగినట్లు, స్వరవర్ణ విపర్యయముగా నుచ్చరింపబడినవాక్యము, వజ్రాయుధతుల్యమగుచు, యజమానునిచంపునని, శ్లో ॥ సవాగ్వజ్రోయజమానంహినస్తి యథేంద్రశత్రుస్స్వరతోపరాధాత్ ॥ ఇట్లుచెప్పబడియున్నది. కనుక, స్వరవర్ణవిపర్యయముగా మంత్రమును జపించినయెడల కీడుగలుగునని తెలియవలెను.

శ్లో॥ క్షుధేవదృష్టబాధాకృద్విపరీతాచభావనా।
జేయాకేనాప్యుపాయేననాస్త్యత్రానుష్ఠితేఃక్రమః॥ ౧౧౭.

టీ. విపరీతా-విపరీతమగు, భావనాచ-భావనయు, క్షుధేవ - ఆకలివలెనే, దృష్టబాధాకృత్=దృష్ట- ప్రత్యక్షమగు, బాధా-బాధను, కృత్ - కలుగజేయునదియగును. కేనాప్యుపాయేన-ఏయుపాయముచేనైనను, జేయా - జయింపదగినదగును. అత్ర-ఈవిపరీతభావనను జయించెడి విషయమై, అనుష్ఠితేః-ధ్యానానుష్ఠానముయొక్క, క్రమః-నియమము, నాస్తి-లేదు.

తా. ప్ర. అయితే, ఆకలి,ప్రత్యక్షముగా బాధహేతువగుటచేత,ఆక్షుద్బాధానివృత్తికొరకు నియమములేకనే భుజింపదగును. విపరీతభావన,ప్రత్యక్షబాధను కలిగింపమిచేత దానినివర్తింపజేసెడికొరకు, అదృష్టఫలకారియగు బ్రహ్మధ్యానరూపధ్యానము, నియమముచే ననుష్ఠింపదగినది కాదాయేమి?. ఉ. విపరీతభావనయు, ఆకలివలెనే పురుషునకు ప్రత్యక్షముగా దుఃఖహేతువగుననెడి విషయము, అనుభవసిద్ధమైయున్నది. కనుక, నియమములేకనే ఏప్రకారముగానైన నాహారమును భక్షించి క్షుద్బాధను పోగొట్టుకొనినట్లు, ఏయుపాయముచేనైన నావిపరీత భావనను జయింపవలయును. ఈబ్రహ్మధ్యానవిషయమై నియమములేదు.

శ్లో॥ ఉపాయఃపూర్వమేవోక్తస్తచ్చింతాకథనాదికః।
ఏతదేకపరత్వేపినిర్బంధోధ్యానవన్నహి॥ ౧౧౮.

టీ. తచ్చింతాకథనాదికః=తత్-ఆప్రత్యగ్బ్రహ్మముయొక్క, చింతా-చింతనయు, కథనాదికః- సంభాషణాదికంబును రూపముగాగల, ఉపాయః-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉపాయము, అనగా బ్రహ్మాభ్యాసమనుట. పూర్వమేవ - పూర్వమే, ఉక్తః- చెప్పబడెను. ఏతదేకపరత్వేపి=ఏతత్- ఈప్రత్యగ్బ్రహ్మముయొక్క, ఏకపర త్వేపి- ముఖ్యపరత్వమందును, అనగా చిత్తైకాగ్ర్యరూపనిదిధ్యాసనమంద నుట. ధ్యానవత్-ధ్యానకాలమందువలె, నిర్బంధః-నిర్బంధము,నహి-లేనేలేదు.

తా. ప్ర. అయితే, ఆయుపాయమెద్దియోచెప్పుము?. ఉ. ఆప్రత్యగ్బ్ర హ్మస్వరూపమును చింతించుటయు, తత్స్వరూపసంభాషణము మొదలగు బ్ర హ్మాభ్యాసరూపమైన ఉపాయము, పూర్వము, (౧౦౬) శ్లోకమందు జెప్పబడె ను. కనుక, ఈయుపాయమగు బ్రహ్మాభ్యాసముచేత, సర్వదా ప్రత్యగాత్మ స్వరూపము చింతించుచు, తత్పరుడై: అదియేనేనని భావించుచున్నయెడల,విప రీతభావన జయింపబడునని యభిప్రాయము. ప్ర. అయితే, బ్రహ్మాభ్యాసము నకు, జపమందువలె, ప్రాఙ్ముఖత్వాది నియమములేకపోయినను, ధ్యానకాల మందువలె, తదేకపరత్వలక్షణముగల చిత్తైకాగ్ర్యరూప నిర్బంధము గలదు గదా?. ఉ. ఈప్రత్యగాత్మ, దేహముకంటె పరుడనైడి బ్రహ్మాభ్యాసమందు, ధ్యానమందుగల చిత్తైకాగ్ర్యరూప నిర్బంధమువంటి నిర్బంధములేదు.

అవ. ధ్యానమందు నిర్బంధమునుజూపుటకొరకు, ఇప్పుడు ధ్యానస్వరూ పమును జెప్పుచున్నాడు.

శ్లో॥ మూర్తిప్రత్యయసాంతత్యమన్యానంతరితంధియః।
ధ్యానంతత్రాతినిర్బంధో మనసశ్చంచలాత్మనః॥ ౧౧౯.

టీ. ధియః-బుద్ధియొక్క, అనగా బుద్ధిసంబంధములగుననుట. మూర్తిప్ర త్యయసాంతత్యం=మూర్తిప్రత్యయ- దేవతాదిమూర్తి గోచరవృత్తులయొక్క, సాంతత్యం-అవిచ్ఛిన్నవర్తమానత్వంబును, అన్యానంతరితం=అన్య- ఇతరవృత్తి చేత, అనంతరితం-విడువబడుటయు, ధ్యానం-ధ్యానమగును. తత్ర - ఆధ్యాన మందు, చంచలాత్మనః=చంచల-అత్యంతచలనమే, ఆత్మనః - స్వరూపముగా గల, మనసః-మనస్సునకు, అతినిర్బంధః - మిక్కిలి నిర్బంధముగలదు.

తా. ప్ర. అయితే, ధ్యానమనగా ధ్యేయచింతామాత్ర స్వరూపముగ లదగును. అట్టిధ్యానమందు నిర్బంధమేమి?. ఉ. ధ్యానస్వరూపమును జెప్పెద వినుము. బుద్ధియొక్క సంబంధములగు దేవతాదిమూర్తి గోచరవృత్తులు, నిరం తరము తైలధారవలె వర్తించుచుండుటయు, ఇతరవిషయకవృత్తి, వర్తింపమి యు, ఈరెంటినిగలది ధ్యానమని చెప్పబడును. ప్ర. సరి. ఇదిధ్యానస్వరూప మగును. అందునిర్బంధమేమి?.ఉ. సర్వదాసంచారస్వభావముగల ఏనుగుగుఱ్ఱ ము మొదలగు జంతువు నొకచోట స్తంభాదికమందు బంధించుటచేత, ఆజంతు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వున కెంతనిర్బంధముగలిగియుండునో, అటువలెనే ధ్యానమందును చంచలస్వభావముగలమనస్సునకు, మిక్కిలి నిర్బంధము గలిగియుండునని తెలియవలెను.

అవ. మనస్సుయొక్క చాంచల్యాదికమందు, గీతావాక్యము నిప్పుడు ప్రమాణముగా బఠించుచున్నాడు.

శ్లో॥ చంచలంహిమనఃకృష్ణప్రమాథిబలవద్దృఢం।
తస్యాహంనిగ్రహంమన్యేవాయోరివసుదుష్కరం॥ ౧౨౦.

టీ. హేకృష్ణ-ఓకృష్ణదేవా, మనః-మనస్సు, చంచలం-మిక్కిలిచలనస్వభావముగలదియు, ప్రమాథి-పురుషునకువ్యాకులమును గలిగించునదియు, బలవత్-సామర్థ్యముగలదియు, దృఢం-దృఢమైనదగును. అనగా సద్విషయమందైన నసద్విషయమందైనను గూడియుండెడిమనస్సును, ఆయావిషయమునుంచి యెత్తుటకు శక్యముగానిదగుననుట. వాయోరివ- వాయువుయొక్కనిగ్రహము వలె, తస్య-ఆమనస్సుయొక్క, నిగ్రహం-నిగ్రహము, సుదుష్కరం- మిక్కిలి దుష్కరమని, అహం-నేను, మన్యే-తలచుచున్నాను.

తా. ఓకృష్ణదేవా, మనస్సు మిక్కిలి చలనస్వభావముగలదగును. పురుషునకు వ్యాకులమును గలిగించునదగును. సమర్థవంతమగుటచేత నిగ్రహించుటకు శక్యముగానిదగును. మరియు, సద్విషయమందైనను అసద్విషయమందైనను తగిలినమనస్సును, ఆయావిషయమునుంచి యెత్తుటకు శక్యముగాదు. కనుక, వాయువును నిగ్రహించుటకు శక్యముగానట్లు, మనస్సును నిగ్రహించుటయు శక్యముగాదని నేను తలచుచున్నానని, అర్జునుడు శ్రీభగవంతుడైన కృష్ణదేవునితో జెప్పుకొనెను.

అవ. మనోనిగ్రహము దుష్కరమనుటయందు, యోగవాసిష్ఠవాక్యంబునుగూడ, ఇప్పుడు ప్రమాణముగా బఠించుచున్నాడు.

శ్లో॥ అప్యబ్ధిపానాన్మహతస్సుమేరూన్మూలనాదపి।
అపివహ్న్యశనాత్సాధోవిషమశ్చిత్తనిగ్రహః॥ ౧౨౧.

టీ. హేసాధో-ఓవసిష్ఠమునీంద్రా, అబ్ధిపానాదపి= అబ్ధిసముద్రమును, అనగా సముద్రోదకమునంతయుననుట. పానాదపి-త్రాగుటకంటెను, మహతః-గొప్పదియగు, సుమేరూన్మూలనాదపి=సు-అతిశయమైన, మేరు-మేరుపర్వతమును, ఉన్మూలనాదపి-పెల్లగించుటకంటెను, వహ్న్యశనాదపి=వహ్ని - అగ్నిహోత్రమును, అశనాదపి-భక్షించుటకంటెను, చిత్తనిగ్రహః- మనోనిగ్రహము, విషమః- అసాధ్యమగును. అనగా దుష్కరమగుననుట.

తా. ఓమహాత్ముడవగు వసిష్ఠమునీంద్రా, మహాసముద్రోదకమునంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యు త్రాగుటకంటెను, మిక్కిలి గొప్పదియగు మేరుపర్వతమును పెల్లగించు టకంటెను, జాజ్వల్యమానముగా మండుచుండెడి అగ్నిహోత్రమును భక్షించుటకంటెను, మనోనిగ్రహము మిక్కిలి కష్టమగుననని, శ్రీదశరథరామమూర్తి, తనగురుడైన వసిష్ఠమహామునీంద్రునితో జెప్పుకొనినట్లు, శ్రీయోగవాసిష్ఠమందు వినఁబడుచున్నది.

అవ. ధ్యానమందుకంటె బ్రహ్మాభ్యాసమందుభేదమునిప్పుడుజూపుచున్నాడు.

శ్లో॥ కథనాదౌననిర్బంధశ్శృంఖలాబద్ధదేహవత్।
కింత్వనంతేతిహాసాద్యైర్వినోదో నాట్యవద్ధియః॥ ౧౨౨.

టీ. శృంఖలాబద్ధదేహవత్=శృంఖలా-సంకెళ్ళచేత, బద్ధ-బంధింపబడిన, దేహవత్-దేహమునకువలె, కథనాదౌ-బ్రహ్మస్వరూప సంభాషణ చింతనాదికమందు, నిర్బంధః-నిర్బంధము, న-లేదు. కింతు-మరియేమనగా, అనంతేతిహాసాద్యైః=అనంత-అసంఖ్యములగు, ఇతిహాసాద్యైః-ఇతిహాసాదులచేత, ధియః-బుద్ధికి, నాట్యవత్-నాట్యక్రియనుజూచినట్లు, వినోదః- క్రీడావిషయమగును.

తా. సంకెళ్ళచేత బంధింపబడిన దేహమునకు గల నిర్బంధమువంటినిర్బంధము, బ్రహ్మస్వరూపవిషయక సంభాషణ చింతనాదిరూపమగు బ్రహ్మాభ్యాసమందు లేకపోవుటయేగాక, ఇతిహాసముచేతను, అపరిమితలౌకికకథానుకూల యుక్తిదృష్టాంతములను జూపుటచేతను, నాట్యక్రియను జూచునప్పుడు బుద్ధికి వినోదముగానున్నట్లు, ఈబ్రహ్మాభ్యాసమందును బుద్ధికి వినోదముగానుండును. పూర్వికులయొక్క చరిత్రము, ఇతిహాసమని చెప్పబడును.

శ్లో॥ చిదేవాత్మాజగన్మిథ్యేత్యత్రపర్యవసానతః।
నిదిధ్యాసనవిక్షేపో నేతిహాసాదిభిర్భవేత్॥ ౧౨౩.

టీ. ఆత్మా-ప్రత్యగాత్మ, చిదేవ- చిన్మాత్రరూపుడేయగును. జగత్-దేహేంద్రియాదికము, మిథ్యేతి-మిథ్యయగుననెడి, అత్ర - ఈయర్థమందు, పర్యవసానతః-బ్రహ్మాభ్యాసముముగింపబడుటవల్ల, ఇతిహాసాదిభిః-ఇతిహాసకథాదులచేత, నిదిధ్యాసనవిక్షేపః=నిదిధ్యాసన- (అహంబ్రహ్మాస్మి) అనెడి భావనకు, విక్షేపః-మఱపు, నభవేత్-కలుగదు.

తా. ప్ర. అయితే, కథాదులను వినుటచేనైనను, తదేక పరత్వరూప నిదిధ్యాసమునకు విఘాతముగలుగదాయేమి?. ఉ. ప్రత్యగాత్మ, చిన్మాత్రరూపుడనియు, ఈ దేహాదిరూపజగంబును మిథ్యయగుననెడి, ఈ యర్థమందు, తత్పరత్వశబ్దముచే జెప్పబడెడి (అహంబ్రహ్మాస్మి) అనెడి నిదిధ్యాసమునకు ముగింపుగలుగుటచేత, కథాదులవల్ల, (అహంబ్రహ్మాస్మి) అనెడి నిదిధ్యాసరూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పభావనకు మఱపుగలుగదని తెలియపలెను.

శ్లో॥ కృషివాణిజ్యసేవాదౌ కావ్యతర్కాదికేషుచ।
విక్షిప్యతే ప్రవృత్త్యాధీస్తైస్తత్రస్మృత్యసంభవాత్॥ ౧౨౪.

టీ. ధీః-బుద్ధి, కృషివాణిజ్యసేవాదౌ- కృషి-పైరుబెట్టుటయందును, వాణిజ్య-వర్తకమందును, సేవాదౌ- సేవాదికమందును, కావ్యతర్కాదికేషుచ- కావ్యతర్కాదిశాస్త్రాభ్యాసములయందును, ప్రవృత్త్యా - ప్రవర్తించుటచేత, విక్షిప్యతే-విక్షేపమునుబొందుచున్నది. (కుతః) ఎందువల్లననగా, తైః-ఆకృష్యాదులచేత, తత్ర-ఆయభ్యాసకాలమందు, స్మృత్యసంభవాత్-స్మృతి- నేను బ్రహ్మమనెడి తలంపుయొక్క, అసంభవాత్-అసంభవమువల్ల, అనగా నేను బ్రహ్మమనెడి తలంపు గలుగమిచేత విక్షేపమును బొందుచున్నదనుట.

తా. ప్ర. అయితే, ఇతిహాసాదులు జ్ఞానవిఘ్నకారులు గావని యంగీకరించినయెడల. బ్రహ్మాభ్యాసమును జేసెడివాడు కృష్యాదులనుగూడ, చేయవచ్చునుగదా?. ఉ. పైరుబెట్టుటయు, వ్యాపారము జేయుటయు, పరులవద్ద నవుకరిజేయుచు పరులను సర్వదా సేవించుచుండుటయు, కావ్యతర్కాది ఇతరశాస్త్రాభ్యాసము జేయుటయు, ఈమొదలగు వ్యవహారములయందుబుద్ధి, ప్రవర్తించుటచేత, అప్పుడు నేను బ్రహ్మమననెడి జ్ఞప్తిగలుగమివల్ల, నేను మనుష్యుడనని, ఇట్లు విక్షేపమును బొందుచున్నది. కనుక విపరీతభావనను గలిగించెడి, ఇత్యాదివ్యవహారములు జ్ఞానమునకు విరోధములేయగును.

శ్లో॥ అనుసందధతైవాత్రభోజనాదౌ ప్రవర్తితుం।
శక్యతేత్యంతవిక్షేపాభావాదాశుపునస్స్మృతేః॥ ౧౨౫.

టీ. అనుసందధతా-బ్రహ్మాభ్యాసము జేయువాడు, అత్ర-ఈ, భోజనాదౌ-భోజనాదివ్యవహారమందు, అత్యంతవిక్షేపాభావాత్=అత్యంతవిక్షేప- అధికవిక్షేపముయొక్క, అభావాత్-లేమివలనను, ఆశు-శీఘ్రముగా, పునః-మరల, స్మృతేః- నేను బ్రహ్మమననెడి జ్ఞప్తిగలుగుచుండుట వలనను, ప్రవర్తితుం- భోజనాదివ్యవహారమందు బ్రవర్తించుటకు, శక్యతే ఏవ- సమర్థుడేయగును.

తా. ప్ర. అయితే,కృషివాణిజ్యకావ్యతర్కాదులన్నియు బ్రహ్మానుసంధానమునకు విఘ్నకారులగుటవలన, వానినన్నిటినివిడచినయెడల, భోజనాదికార్యములును అటువంటివేయగుటచేత, ఆ భోజనాదికార్యములనుగూడ విడువవలదాఏమి?. ఉ. బ్రహ్మానుసంధానము జేయువాడు, భోజనాదికార్యములయందు బ్రవర్తించుటకు సమర్థుడేయగును. ప్ర. ఏకారణముచేతనో జెప్పుము?. ఉ. ఆభోజనాదికార్యములను జేయునప్పుడు, బుద్ధికి విశేషవిక్షేపముగలుగదు. ప్ర.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అయితే, అప్పుడు నిశేష విక్షేపములేదని చెప్పుటకుగారణమేమి?. ఉ. స్నాన భోజనాదికార్యములను జేయునప్పుడు, నేను బ్రహ్మమననెడిజ్ఞప్తి, శీఘ్రము గా మరల గలుగుచున్నది. ఇట్లు గలుగుటయే, కారణమగును.

శ్లో॥ తత్త్వవిస్మృతిమాత్రాన్నానర్థఃకింతువిపర్యయాత్।
విపర్యేతుంనకాలోస్తిఝుడితిస్మరతఃక్వచిత్॥ ౧౨౮.

టీ. తత్త్వవిస్మృతిమాత్రాత్=తత్త్వ- బ్రహ్మస్వరూపమును, విస్మృతి మాత్రాత్-మరచుటమాత్రమువలన, అనర్థః-పురుషార్థహాని, న-లేదు. కింతు- మరియేమనగా, విపర్యయాత్-విపరీతభావమువలన, (అనర్థః) పురుషార్థహాని గలుగును. ఝుడితి-శీఘ్రముగా, స్మరతః- నేనుబ్రహ్మమననెడి జ్ఞప్తిగలుగుట వలన, క్వచిత్-కొంచెమైనను, విపర్యేతుం-విపరీతభావనను బొందుటకు,కాలః- అవకాశము, నాస్తి-లేదు.

తా. ప్ర. అయితే ఆస్నానభోజనాదికాలమందు, విక్షేపము లేకపోయి నను, నేను బ్రహ్మమననెడి జ్ఞప్తి లేమిచేత పురుషార్థహాని, యగుగదా?. ఉ. బ్రహ్మస్వరూపమును మరచినమాత్రముచేతనే, పురుషార్థహానిగలుగదు. ప్ర. అయితే, దేనివలన బురుషార్థహానియగునో చెప్పుము?. ఉ. నేనుమనుష్యుడనెడి విపరీతభావముచేత, బురుషార్థహానియగును. ప్ర. అయితే, భోజనాదికాలమం దు నేను బ్రహ్మమననెడిజ్ఞప్తి, లేకపోవుచుండగా విపరీతభావముగూడ గలు గునుగదా?. ఉ. ఆ భోజనాదికాలమందు కొంచెమైనను విపరీతభావమును బొందుటకు తగిన అవకాశములేదు. కనుక, అప్పుడు విపరీతభావము గలుగ దని తెలియవలెను.

శ్లో॥ తత్త్వస్మృతేరవసరోనాస్త్యన్యాభ్యాసశాలినః।
ప్రత్యుతాభ్యాసఘాతిత్వాద్బలాత్తత్త్వముపేక్ష్యతే॥ ౧౨౯.

టీ. అన్యాభ్యాసశాలినః=అన్య-ఇతరశాస్త్రములను అభ్యాస - అభ్య సించుటయే, శాలినః-స్వభావముగాగలపురుషునకు, తత్త్వస్మృతేః = తత్త్వ- బ్రహ్మస్వరూపముయొక్క, స్మృతేః-స్మరణమునకు, అనగా నేను బ్రహ్మ మనని స్మరించుటకనుట. అవసరః-అవకాశము, నాస్తి-లేదు. ప్రత్యుత-ఇంత మాత్రమేగాక, అభ్యాసఘాతిత్వాత్ = అభ్యాస - బ్రహ్మాభ్యాసమును, ఘాతి త్వాత్-చెరుచునదియగుటవల్ల, అనగా బ్రహ్మాభ్యాసమునకు విరోధియగుటచే ననుట. బలాత్-అన్యశాస్త్రాభ్యాసబలమువలన, తత్త్వం- బ్రహ్మస్వరూపము, అనగా బ్రహ్మానుసంధానమనుట. ఉపేక్ష్యతే-ఉపేక్ష జేయబడుచున్నది.

తా. ప్ర. అయితే,భోజనాదికార్యములయందుబ్రవర్తించెడివానివలెనే,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తర్కాద్యభ్యాసమందు ప్రవర్తించెడివానికిని, బ్రహ్మస్మృతిగలుగదాయేమి?.
ఉ. కావ్యతర్కాద్యభ్యాసమందు ప్రవర్తించెడివానికి, బ్రహ్మస్వరూపమును స్మరించుటకు అవకాశములేదు. అదియునుంగాక, కావ్యతర్కాద్యభ్యాసము, బ్రహ్మాభ్యాసమునకు విరోధియగుటచేత, ఆకావ్యతర్కాద్యభ్యాస బలమువలన బ్రహ్మతత్త్వము స్మరింపబడక ఉపేక్షింపబడును.

అవ. బ్రహ్మానుసంధానమునకు విరోధకార్యములను విడుచుటయందు, శ్రుతిద్వయము నిప్పుడు ప్రమాణీకరించుచున్నాడు.

శ్లో॥ తమేవైకంవిజానీథహ్యాన్యావాచోవిముంచథ।
ఇతిశ్రుతంతథాన్యత్రవాచోవిగ్లాపనంత్వితి॥ ౧౭౮.

టీ. ఏకం-అద్వితీయుడగు, తమేవ-ఆపరమాత్మనే,విజానీథ-ఎరుగుడు. అన్యాః-అనాత్మగోచరములగు, వాచః-శబ్దములను, విముంచథేతి- విడువుడని, శ్రుతం-ముండకోపనిషత్తునందు వినబడుచున్నది. తథా- ఆప్రకారము, అన్యత్ర-మరియొకశ్రుతియందు, వాచః - వాక్కునకు, విగ్లాపనంత్వితి- శ్రమహేతువని, (శ్రుతం) వినబడుచున్నది.

తా. అద్వితీయుడగు ఆపరమాత్మనే ఎరుగుడనియు, అనాత్మగోచరములగు ఇతరవాక్యములను విడువుడనియు, ఈచెప్పబడిన వాగ్విమోకపూర్వకబ్రహ్మసాక్షాత్కారము, మోక్షమునకు అపారసంసారసముద్రముయొక్క సేతువు వంటిదగుననియు, ఇట్లు, శ్రు॥ తమేవైకంవిజానథాత్మా నమన్యావాచోవిముంచథ అమృతస్యైష సేతుః॥ అని శ్రుతిజెప్పుచున్నది. మరియు, అనాత్మగోచరములగు బహుశబ్దములను ధ్యానించుటవలన మనంబునకు శ్రమహేతువగుననియు, బహుశబ్దములనుచ్చరించుటవలన వాక్కునకు శ్రమహేతువగుననియు, ఇట్లు, శ్రు॥ నానుధ్యాయాద్బహూంచ్ఛబ్దా న్వాచోవిగ్లాపనంహితత్ ॥ అని, మరియొకశ్రుతి జెప్పుచున్నది. కనుక,బ్రహ్మానుసంధానమునకు విరోధములగు కావ్యతర్కాద్యభ్యాసములను విడువవలెనని యభిప్రాయము.

శ్లో॥ ఆహారాదిత్యజన్నైవజీవేచ్ఛాస్త్రాంతరంత్యజన్।
కింనజీవసియేనైవంకరోష్య తదురాగ్రహం॥ ౧౭౯.

టీ. ఆహారాది-అన్నపానాదికమును, త్యజన్ - విడుచుచు, నైవజీవేత్-జీవింపరాదు. శాస్త్రాంతరం-ఇతరశాస్త్రమును,అనగా కావ్యతర్కాద్యభ్యాసముననుట. త్యజన్-విడుచుచు, నజీవసిః-జీవింపలేవాఏమి?. అనగా జీవింపవచ్చుననుట. అత్ర-ఈవిషయమందు, యేన-ఏకారణముచేత,దురాగ్రహం-దురాగ్రహమును, ఏవం-ఈప్రకారము, కరోషి-చేసెదవు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే, బ్రహ్మానుసంధానముకంటె అన్యమగు ఆహారాది కమువిడువజాలనట్లు, కావ్యతర్కాద్యభ్యాసంబునుగూడ, విడువకచేయరాదా యేమి?. ఉ. ఆహారాదికమును విడచినయెడలజీవింపజాలవు. కావ్యతర్కాది శాస్త్రాభ్యాసమును విడుచుటచేత చచ్చిపోవు. కనుక, తర్కాద్యభ్యాసమును విడిపించెడివిషయమై, ఏహేతువుచేత ఇట్లు దురాగ్రహమును పొందెదవో తెలియలేదు.

శ్లో॥ జనకాదేఃకథంరాజ్యమితిచేద్దృఢబోధతః।
తథాతవాపిచేత్తర్కం పఠయద్వాకృషింకురు॥ ౧౩౦.

టీ. జనకాదేః-జనకాదిజ్ఞానివర్గమునకు, రాజ్యం - రాజ్యపరిపాలనాది లౌకికవ్యవహారప్రవర్తనము: కథమితిచేత్-ఎట్లుగలిగెననియంటివేని, దృఢబోధతః=దృఢ-నిశ్చలమగు, బోధతః - అపరోక్షజ్ఞానము గలిగియుండుటవల్లనని తెలిసికొనుము. తవాపి-నీకును, తథాచేత్ - ఆప్రకారము నిశ్చలాపరోక్షజ్ఞానము గలిగియున్నయెడల, తర్కం-తర్కమును, పఠ-చదువుము. యద్వా-లేక, కృషిం-కృషిని, కురు-చేయుము. అనగా పైరుబెట్టుకొనుమనుట.

తా. ప్ర, అయితే,తత్వవేత్తలగుజనకాదులకు రాజ్యపరిపాలనాదివ్యవహారమందు ప్రవర్తనమెట్లుగలిగెనోచెప్పుము?. ఉ.ఆజనకాదులకు నిశ్చలాపరోక్షజ్ఞానము గలిగియుండుటచేత, రాజ్యపరిపాలనాది వ్యవహారమును జేయుటకు, వారికిశక్యమాయెను. కనుక, ఆరాజ్యపరిపాలనాదివ్యవహారము, వారికి బాధకరముగాదు. మరియు, ఆజనకాదిజ్ఞానులకువలె, నాకును, దృఢాపరోక్షజ్ఞానము గలదనియంటివేని, అట్లైనయెడల నీవును నీయిష్టప్రకారము తర్కమును పఠింపుము. లేకపైరుబెట్టుటమొదలగు పనులను జేయుము. అనగా దృఢాపరోక్షజ్ఞానముగలిగినపిమ్మట, ఎట్లుప్రవర్తించినను బాధలేదని యభిప్రాయము.

శ్లో॥ మిథ్యాత్వవాసనాదార్ఢ్యేప్రారబ్ధక్షయకాంక్షయా।
అక్లిశ్యంతఃప్రవర్తంతేస్వస్వకర్మానుసారతః॥ ౧౩౧.

టీ. మిథ్యాత్వవాసనాదార్ఢ్యేసతి=మిథ్యాత్వవాసనా- జగన్మిథ్యాత్వజ్ఞానమునకు, దార్ఢ్యేసతి-దృఢత్వముగలుగుచుండగా, ప్రారబ్ధక్షయకాంక్షయా=ప్రారబ్ధక్షయ-ప్రారబ్ధకర్మక్షయముయొక్క, కాంక్షయా-అపేక్షచేత,అక్లిశ్యంతః-దుఃఖమునుబొందనివారగుచు, స్వస్వకర్మానుసారతః = స్వస్వ- తమతమయొక్క, కర్మ-ప్రారబ్ధకర్మముయొక్క, అనుసారతః-అనుసరణమువలన అనగా తమతమప్రారబ్ధకర్మముననుసరించియనుట. ప్రవర్తంతే-జ్ఞానులుప్రవర్తిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుచున్నారు.

తా. ప్ర.అయితే, జ్ఞానులుసంసారమునకు నిస్సారత్వము నెరిగియు, ఆ సంసారమందు ఎందుకుప్రవర్తించెదరోచెప్పుము?. ఉ. జగన్మిథ్యాత్వజ్ఞానమునకు దృఢత్వముగలుగుచుండగా, జ్ఞానులు, ప్రారబ్ధ కర్మక్షయమును గోరుచు దుఃఖమునుబొందక తమతమప్రారబ్ధకర్మము ననుసరించి, సంసారమందు ప్రవర్తించుచున్నారు. అనగా ప్రారబ్ధకర్మ మవశ్యముగా ఫలమిచ్చునదగుటవలన, భోగముచేత ఆప్రారబ్ధకర్మక్షయముకొరకు, జ్ఞానులకు సంసారమందు ప్రవర్తనము గలుగుచున్నదని యభిప్రాయము.

శ్లో॥ అతిప్రసంగోమాశంక్యస్స్వకర్మవశవర్తినాం।
అస్తువాకేనశక్యేతకర్మవారయితుంవద॥ ౧౩౨.

టీ. స్వకర్మవశవర్తినాం=స్వ-తమయొక్క, కర్మవశ-ప్రారబ్ధకర్మవశముచేత, వర్తినాం-వర్తించెడిజ్ఞానులకు, అతిప్రసంగః - అతిప్రసంగము, మాశంక్యః-శంకింపదగినదిగాదు. అస్తువా-అతిప్రసంగముగలుగుగాక. కేన-ఎవనిచేత, కర్మ-ప్రారబ్ధకర్మమును, వారయితుం - నివారింపజేయుటకు, శక్యేత-శక్యమగునో, వద - చెప్పుము.

తా. ప్ర. అయితే, జ్ఞానులకు అనాచారమందును ప్రవర్తనము గలుగదాయేమి?. ఉ. తమతమప్రారబ్ధకర్మవశమందు ప్రవర్తించెడి జ్ఞానులకు, అతిప్రసంగముగలుగునని శంకింపరాదు. ప్ర. అయితే, ప్రారబ్ధకర్మవశమువల్లనే, అతిప్రసంగముగూడ, గలుగదాయేమి?. ఉ. సరి. కలుగుగాక. ప్రారబ్ధకర్మమును నివారింపజేయుటకు, ఎవనిచేత శక్యమగునోచెప్పుము. అనగాప్రారబ్ధకర్మమును, నివారింపజేయుటకు, ఎవ్వడునుసమర్థుడుగాడని యభిప్రాయము. ప్రసంగమనగా విధినిషేధరూపశాస్త్రమగును. అట్టివిధి నిషేధరూపశాస్త్రము నతిక్రమించి ప్రవర్తించుటయే, అతిప్రసంగ శబ్దార్థమగునని తెలియవలెను.

శ్లో॥ జ్ఞానినోఽజ్ఞానినశ్చాత్రసమేప్రారబ్ధకర్మణి।
నక్లేశోజ్ఞానినోధైర్యాన్మూఢఃక్లిశ్యత్యధైర్యతః॥ ౧౩౩.

టీ. అత్ర-ఇక్కడ, అనగానవశ్యభోక్తవ్యత్వమందనుట. జ్ఞానినః-జ్ఞానికిని, అజ్ఞానినశ్చ-అజ్ఞానికిని, ప్రారబ్ధకర్మణి-ప్రారబ్ధకర్మము, సమేసతి- సమానత్వమునుబొందుచుండగా, ధైర్యాత్-ధైర్యమువలన, జ్ఞానినః-జ్ఞానికి, క్లేశః-దుఃఖము, న-లేదు.మూఢః-అజ్ఞాని, అధైర్యతః-అధైర్యమువలన, క్లిశ్యతి-దుఃఖమును బొందుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే,జ్ఞానికిని, అజ్ఞానికిని,అవశ్యభోక్తవ్యత్వముచేత ప్రారబ్ధకర్మము సమానత్వమునుబొందుచుండగా, ఈజ్ఞాన్యజ్ఞానులకు భేదమేమి?. ఉ. భోగప్రదత్వముచేత, ప్రారబ్ధకర్మము జ్ఞాన్యజ్ఞానులకు సమానముగానున్నను, జ్ఞానియగువాడు ధైర్యముచేత దుఃఖమునుబొందడు. అజ్ఞానియగువాడు అధైర్యముచేత దుఃఖమునుబొందుచున్నాడు. కనుక, జ్ఞాన్యజ్ఞానులకు ఇదియే భేదమగును.

అవ. ఈవిషయమై, ఇప్పుడు దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ మార్గేగంత్రోర్ద్వయోశ్శ్రాంతౌసమాయామప్యదూరతాం।
జానన్ధైర్యాద్ద్రుతంగచ్ఛత్యన్యస్తిష్ఠతిదీనధీః॥ ౧౩౪.

టీ. మార్గే-మార్గమందు, గంత్రోః-నడిచెడి, ద్వయోః-ఇద్దరుపురుషులకు, శ్రాంతౌ-బడలిక,సమాయామపి-సమానముగానున్నను, (ఏకః) ఒకడు, ధైర్యాత్-ధైర్యమువలన, అదూరతాం-సమీపత్వమును, జానన్ - తలచుచు, గచ్ఛతి-వెళ్లుచున్నాడు. అనగా నడచుచున్నాడనుట. దీనధీః - దైన్యబుద్ధిగల, అన్యః-రెండవవాడు, తిష్ఠతి - నిల్చుచున్నాడు.

తా. ఇద్దరుపురుషులు ఒకస్థలమునకు వెళ్ళదలచి,మార్గమందునడచివెళ్ళుచుండగా, వారిద్దరికిని మార్గాయాసము సమానముగానున్నను,వారిలోధైర్యవంతుడు, తాముచేరవలసినస్థలము, సమీపమందున్నదని తలచుచు, ధైర్యముచేత నడుచును. రెండవవాడు దీనచిత్తుడగుటవలన, తాముచేరవలసినస్థలము దూరమందున్నదనితలచుచు నడువజాలక, అక్కడనే నిల్చియుండును. అటువలెనే జ్ఞాన్యజ్ఞానులకును భేదముగలిగియున్నదని, పూర్వశ్లోకమందు చెప్పబడిన ప్రకారము తెలిసికొనవలెను.

అవ. ఇట్లుప్రతిపాదింపబడిన, శ్రు॥ ఆత్మానంచేద్విజానీయాత్॥అనెడి మంత్రముయొక్క పూర్వార్థమందుగల యభిప్రాయము నిప్పు డనుసరించి చెప్పుచు, జ్ఞానఫలమునుజూపెడి, ఆమంత్రముయొక్క ఉత్తరార్థమును పఠించుచున్నాడు.

శ్లో॥ సాక్షాత్కృతాత్మధీస్సమ్యగవిపర్యయబాధితః।
కిమిచ్ఛన్కస్యకామాయశరీరమనుసంజ్వరేత్॥ ౧౩౫.

టీ. సాక్షాత్కృతాత్మధీః = సాక్షాత్కృత - సాక్షాత్కారము చేసికొనబడిన, ఆత్మ-ప్రత్యగభిన్న పరబ్రహ్మముయొక్క, ధీః-బుద్ధిగలవాడు, అనగా నపరోక్షజ్ఞానవంతుడనుట. సమ్యక్-లెస్సగా, అవిపర్యయబాధితస్సన్- దేహాద్యాత్మత్వబుద్ధిచేత బాధింపబడనివాడగుచు, కిమిచ్ఛన్- ఏమిఫలమిచ్ఛయించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చు, కస్య-ఏభోక్తయొక్క, కామాయ-ప్రీతికొఱకు, శరీరం- దేహము, (తప్య మానంసత్) తపించుచుండగా, అనుసంజ్వరేత్-శరీరమునను సరించి తపించు నోయని యాక్షేపార్థకము. అనగా పరమార్థమందు భోక్తృభోగ్యరూపద్వై తములేమిచేత తపించడనుట.

తా. ఆత్మ సాక్షాత్కారరూపముగల అపరోక్షజ్ఞానవంతుడు, దేహమే నేననెడి విపరీతభావముచేత కొంచెముగానైనను బాధింపబడని వాడగుచు, ఏమిఫలమిచ్ఛయించుచు, ఏభోక్తయొక్క ప్రీతికొఱకు దేహము తపించుచుండ గా, నాదేహము ననుసరించితపించునో, యనియిట్లు పూర్వోక్తశ్రుతి, ఆక్షేపిం చుచున్నది. అనగా నపరోక్షజ్ఞానదశయందు మాయాకల్పితమగు భోక్తృ భోగ్యరూపద్వైతములోపమిచేత తపించడని యభిప్రాయము.

అవ. ఈమంత్రముయొక్క ఉత్తరార్థమునకు తాత్పర్యము నిప్పుడుజెప్పు చున్నాడు.

శ్లో॥ జగన్మిథ్యాత్వధీభావాదాక్షిప్తౌకామ్యకాముకౌ।
తయోరభావేసంతాపశ్శామ్యేన్నిస్నేహదీపవత్॥ ౧౩౬.

టీ. జగన్మిథ్యాత్వధీభావాత్ - దేహేంద్రియాది సర్వజగన్మిథ్యాత్వ జ్ఞానమువలన, కామ్యకాముకౌ=కామ్య-కోరదగినదియు, కాముకౌ-కోరెడివా డును, ఆక్షిప్తౌ-నిరాకరించబడుచున్నవి. తయోః-ఆకామ్యకాములకు, అభావే సతి-అభావముగలుగుచుండగా, నిస్నేహదీపవత్=నిస్నేహ- చమురులేని, దీప వత్-దీపమువలె, సంతాపః-కామనానిమిత్తకదుఃఖము, శామ్యేత్- నశించును.

తా. దేహేంద్రియాది సర్వజగన్మిథ్యాత్వజ్ఞానముచేత, కామ్యకాము కులురెండును, నిరాకరించబడుచున్నవి. ఈకామ్యకాముకులురెండును నిరా కరించబడుటకు సర్వజగన్మిథ్యాత్వజ్ఞానమేకారణమగును. ప్ర. అట్లు నిరాక రించుటవలన ఫలమేమి?. ఉ. ఆకామ్యకాముకులు రెండును లేకపోవుచుండ గా, కామనానిమిత్తకదుఃఖము చమురులేనిదీపము, నశించినట్లు నశించుచున్న ది. అనగా కారణమగు కామ్యములేకపోవుచుండగా, గామమే నిమిత్తముగా గలదుఃఖము, నశించునని యభిప్రాయము.

శ్లో॥ గంధర్వపత్తనేకించిన్నైంద్రజాలికనిర్మితే।
జానన్కామయతేకింతుజిహాసతిహసన్నిదం॥ ౧౩౭.

టీ. ఐంద్రజాలికనిర్మితే - ఇంద్రజాల సంబంధమాయావినిర్మితమైన, గంధర్వపత్తనే-గంధర్వనగరమందు, (స్థితం) ఉండెడివస్తువును, కించిదపి- కొంచెమైనను, జానన్ - ఇదియింద్రజాలసంబంధమాయావినిర్మితమని యెరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుచు, నకామయతే-కామమును చేయడు. అనగా నపేక్షింపడనుట. కింతు-మరి యేమనగా, ఇదం-ఇది సత్యముగాదని, హసన్-నవ్వుచు, జహాసతి- విడుచుట కిచ్ఛయించుచున్నాడు.

తా. ప్ర. అయితే, కామ్యములేకపోవుచుండగా కామనయొక్క అభావమెచ్చటజూడబడెనో చెప్పను?. ఉ. ఇంద్రజాలసంబంధమాయచేత నిర్మింపబడిన గంధర్వనగరమంనుగలవస్తువును, ఇది యింద్రజాల సంబంధమాయా కల్పితవస్తువని యెరిగినవాడు, ఆవస్తువును కొంచెమైన నపేక్షింపకుండుటయే గాక, ఇది యసత్యమనినవ్వుచు విడుచుట కిచ్ఛయించుచున్నాడు.

అవ. ఈయర్థము నిప్పుడు దార్ష్టాంతికమందు జేర్చుచున్నాడు.

శ్లో॥ ఆపాతరమణీయేషుభోగేష్వేవంవిచారవాన్।
నానురజ్యతికింత్వేతాన్ దోషదృష్ట్యాజిహాసతి॥ ౧౩౮.

టీ. ఆపాతరమణీయేషు-ఆపాత-అవిచారముచేత, రమణీయేషు-రమింపదగిన, అనగా ప్రతీతిమాత్రరమ్యములైనట్టియనుట. భోగేషు- స్త్రీపుష్పచందనాదివిషయములయందు, ఏవం-ఈప్రకారము, విచారవాన్ - ప్రతీతిమాత్ర రమ్యత్వానుసంధానముజేయువాడు; నానురజ్యతి - ఆసక్తిని జేయడు. కింతు-మరియేమనగా, దోషదృష్ట్యా - ఆయావిషయదోష దర్శనముచేత, ఏతాన్-ఈభోగములను, జిహాసతి-విడుచుటకిచ్ఛయించుచున్నాడు.

తా. ఈప్రకారమే, ప్రతీతిమాత్రముచేత మనోహరములగు స్త్రీపుష్పచందనాది విషయభోగములయందు, ప్రతీతిమాత్రరమ్యత్వానుసంధానముగలవాడు, ఆభోగముల నపేక్షింపడు. మరియేమనగా, ఆయావిషయములయందుగల దోషదృష్టిచేత, ఆభోగములనువిడుచుట కిచ్ఛయించుచుండును.

అవ. విషయదోషములను దెలిపెడి మూడువాక్యముల నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ అర్థానామార్జనేక్లేశస్తథైవపరిపాలనే।
నాశేదుఃఖంవ్యయేదుఃఖంధిగర్థాన్ క్లేశకారిణః॥ ౧౩౯.

టీ. అర్థానాం- ధనాదివిషయములయొక్క, అర్జనే - సంపాదనమందు, క్లేశః-దుఃఖముగలుగుచున్నది. పరిపాలనే-అట్లుసంపాదింపబడిన విషయములను రక్షించుటయందు, తథైవ-ఆప్రకారమేయగును. అనగా దుఃఖముగలుగుచున్నదనుట. నాశే-ధనాదివిషయనాశనమందు, దుఃఖం-దుఃఖముగలుగుచున్నది. వ్యయే-ధనాదిపదార్థవ్యయమందు, దుఃఖం- దుఃఖముగలుగుచున్నది. క్లేశకారిణః-క్లేశ-సర్వవిధములచేదుఃఖమును, కారిణః - కలుగజేసెడి, అర్థాన్-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధనాదివిషయములను, ధిక్-కాల్చనాయని నిందార్థకము.

తా. ప్ర. అయితే, ఆవిషయదోషములెవ్వియోచెప్పుము?. ఉ. ధనాది విషయములనుసంపాదించుటయందు దుఃఖము గలుగుచున్నది. అట్లుసంపాదింపబడిన ధనాదివిషయములను రక్షించుటయందు దుఃఖముగలుగుచున్నది. మరియు ధనాదివిషయము నశించుచుండగా దుఃఖముగలుగుచున్నది. మరియు,ఆధనాదిపదార్థము వ్యయమగుచుండగా దుఃఖముగలుగుచున్నది. ఇట్లు సర్వదా దుఃఖమును గలిగించెడి ధనాదివిషయములు కాల్చనాయెందుకని, ఈవాక్యము చెప్పుచున్నది.

అవ. ఇట్లు విషయములకు దుఃఖహేతుత్వమునుజూపి, ఇప్పుడు అశోభనత్వమును రెండుశ్లోకములచే జూపుచున్నాడు.

శ్లో॥ మాంసపాంచాలికాయాస్తుయంత్రలోలేంగపంజరే।
స్నాయ్వస్థిగ్రంధిశాలిన్యాఃస్త్రియాఃకిమివశోభనం॥ ౧౪౦.

టీ. స్నాయ్వస్థిగ్రంధిశాలిన్యాః=స్నాయు - నరములతోటియు, అస్థి-ఎముకలతోటియు, గ్రంథి- స్తనాదులతోటియు, శాలిన్యాః-ఒప్పుచున్నట్టియు, అనగా స్తనాదిసహితముగా వర్తించుచున్నట్టియనుట. మాంసపాంచాలికాయాః-మాంస - మాంసమయమగు, పాంచాలికాయాః - బొమ్మవంటి, స్త్రియాః-స్త్రీయొక్క, యంత్రలోలేంగపంజరే= యంత్ర- యంత్రమువంటి, లోల-చంచలస్వభావముగల, అంగ అవయములే, పంజరే-గూడుగాగలశరీరమందు, కింశోభనమివ - శుభమేమియులేదు.

తా. స్త్రీయొక్కదేహము, నరములతోటియు, ఎముకలతోటియు, పిరుదులుచన్నులు మొదలగువానితోటియు గూడినదగును. గనుక, మాంసముచేతజేయబడిన బొమ్మవంటిదగును. మరియు, ఆస్త్రీయొక్కశరీరము. యంత్రమువంటి చంచలస్వభావముగల అవయవములనుగలిగి, పంజరమువలె నుండును. అటువంటి స్త్రీయొక్క శరీరమందు కొంచెమైనను శుభములేదని, శాస్త్రము జెప్పుచున్నది.

శ్లో॥ ఏవమాదిషుశాస్త్రేషుదోషాస్సమ్యక్ప్రపంచితాః।
విమృశన్ననిశంతానికథందుఃఖేషుమజ్జతి॥ ౧౪౧.

టీ. ఏవమాదిషు-ఇత్యాది, శాస్త్రేషు-శాస్త్రములయందు,దోషాః-విషయదోషములు, సమ్యక్-లెస్సగా, ప్రపంచితాః- తెలుపబడినవి. తాని-ఆవిషయదోషములను; అనిశం-సర్వదా,విమృశన్-విమర్శించినవాడగుచు,దుఃఖేషు-దుఃఖములయందు, కథం-ఎట్లు, మజ్జతి-మునుగును. అనగా మునుగడనుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఈపూర్వోక్తప్రకారము జెప్పెడి శాస్త్రములయందు విషయదోషములుచక్కగాజెప్పబడినవి. ఆవిషయదోషములను చక్కగా విచారించువాడు దుఃఖములయందుమునుగడు. మరియు, మూలమందుగల ఆదిశబ్దముచేత, ఆస్త్రీయందుగల చర్మమాంసరక్తజలములను బుద్ధిచేత భిన్నముచేసి చూచుచుండగా, ఆస్త్రీరూపము రమ్యముగా దోచినయెడల జాడుమనియు, వ్యర్థముగా మోహమందు మునుగకుమనియుంజెప్పెడి, శ్లో॥ త్వఙ్మాంసరక్తబాష్పాంబుపృథక్కృత్వావిలోచనే। సమాలోకయరమ్యంచేత్కింముధాపరిముహ్యసి॥ఇత్యాదివాక్యము గ్రహింపబడుచున్నదని తెలియవలెను.

అవ. విషయదోషదర్శనము గలుగుచుండగా భోగేచ్ఛగలుగదనెడివిషయమై, ఇప్పుడు యుక్తిసహిత దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ క్షుధయాపీడ్యమానోపినవిషంహ్యత్తుమిచ్ఛతి।

మృష్టాన్నధ్వస్తతృడ్జానన్నామూఢస్సజ్జిఘత్సతి॥ ౧౪౨.

టీ. క్షుధయా - ఆకటిచేత, పీడ్యమానోపి - పీడింపబడెడి వాడైనను, విషం-విషమును, అత్తుం-భక్షించుటకు, నేచ్ఛతిహి-ఇచ్ఛయింపడుగదా.అమూఢః-వివేకముగలవాడు, మృష్టాన్నధ్వస్తతృట్=మృష్టాన్న- పరిశుద్ధాన్నభోజనముచేత,ధ్వస్త-నశింపబడిన, తృట్-దప్పియనెడియిచ్ఛగలవాడు,తత్-ఆవిషమును, జానన్-ఇది విషమనియెరుగుచు, నజిఘత్సతి - భక్షించుట కిచ్ఛయింపడు.

తా. మరియు, ఆకటిచేతపీడింపబడెడివాడైనను, విషమునుభక్షించుట కిచ్ఛయింపనే యిచ్ఛయింపడు. మరియు, స్వయముగా వివేకము గలవాడు, పరిశుద్ధమగు పాయసాన్నాది భోజనముచేత ఆకలిని పోగొట్టుకొనిన వాడగుచు, ఇది విషమనియెరుగుచు, ఆ విషమును భక్షించుటకు అపేక్షింపడు.

శ్లో॥ ప్రారబ్ధకర్మప్రాబల్యాద్భోగేష్విచ్ఛాభవేద్యది।

క్లిశ్యన్నేవతదాప్యేషభుఙ్క్తేవిష్టిగృహీతవత్॥ ౧౪౩.

టీ. ప్రారబ్ధకర్మప్రాబల్యాత్=ప్రారబ్ధకర్మ- ప్రారబ్ధకర్మముయొక్క, ప్రాబల్యాత్-ప్రబలత్వమువలన, భోగేషు-భోగములయందు, ఇచ్ఛా- కోరిక, భవేద్యది-జ్ఞానికిగలిగినయెడల, తదాపి-అప్పుడును, ఏషః-ఈజ్ఞాని, విష్టిగృహీతవత్=విష్టి-నరకబాధను, గృహీతవత్ - పొందినవానివలె, క్లిశ్యన్నేవ- దుఃఖించుచునే, భుఙ్క్తే-అనుభవించుచున్నాడు.

తా. ప్ర. అయితే, ప్రారబ్ధకర్మముయొక్క ప్రబలత్వమువలన, జ్ఞానికిని విషయభోగేచ్ఛ, గలుగదాయేమి?. ఉ. ప్రారబ్ధకర్మముయొక్క ప్రబలత్వముచేత జ్ఞానికి విషయభోగేచ్ఛగలిగినను, ఈజ్ఞాని,అప్పుడును నరకబాధను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పొందినవానివలె దుఃఖించుచు, విషయసుఖాదుల ననుభవించుచున్నాడు. అన గా, జ్ఞానికి విషయభోగేచ్ఛగలిగినను, ప్రీతిపూర్వకముగా భోగముల ననుభ వింపడని యభిప్రాయము.

శ్లో॥ భుంజానానాఅపిబుధాశ్శ్రద్ధావంతఃకుటుంబినః।
నాద్యాపికర్మనచ్ఛిన్నమితిక్లిశ్యంతిసంతతం॥ ౧౪౪.

టీ. శ్రద్ధావంతః-శ్రద్ధగలిగినట్టియు, కుటుంబినః - కుటుంబవంతులగు, బుధాః-పండితులు, అనగాజ్ఞానులనుట. భుంజానానాఅపి-ప్రారబ్ధకర్మఫలము లననుభవింపుచుండియు, అద్యాపి-ఇప్పుడును, నః-మాకు, కర్మ-ప్రారబ్ధకర్మ ము, నచ్ఛిన్నమితి-నాశమునుబొందలేదని, సంతతం-సర్వదా, క్లిశ్యంతి-దుఃఖిం చుచున్నారు.

తా. ప్ర. అయితే, జ్ఞాని, ప్రీతిపూర్వకముగా భోగముల ననుభవింప డని, మీకెట్లు తెలిసెనో జెప్పుడు?. ఉ. లోకమందు శ్రద్ధావంతులై, భార్యాపు త్రాది కుటుంబసమేతులై యుండెడిజ్ఞానులు, ప్రారబ్ధకర్మఫలముల ననుభవిం చుచుండియు, ఇప్పటికిని మాకు కర్మక్షయముగాలేదని, ఇట్లుసర్వదా దుఃఖిం చుచున్నారు. అనగా, లోకముచేత మాకు దెలిసెనని యభిప్రాయము.

శ్లో॥ నాయంక్లేశోత్రసంసారతాపఃకింతువిరక్తతా।
భ్రాంతిజ్ఞాననిదానోహితాపస్సాంసారికస్స్మృతః॥ ౧౪౫.

టీ. అయం-ఈ, క్లేశః-దుఃఖము, సంసారతాపః- సాంసారికపరితాప ము, న-కాదు. కింతు-మరియేమనగా, అత్ర - ఈ సంసారమందు, విరక్తతా- ఆసక్తిలేమి, (స్యాత్) అగును. భ్రాంతిజ్ఞాననిదానః=భ్రాంతిజ్ఞాన- భ్రాంతిజ్ఞా నమే, నిదానః-నిమిత్తముగాగల, తాపః-దుఃఖము, సాంసారికః- సంసారసం బంధదుఃఖమని, స్మృతః-పూర్వాచార్యులచే జెప్పబడెను.

తా. ప్ర. అయితే, జ్ఞానులకును సాంసారిక దుఃఖమున్నయెడల, జ్ఞాన మునకు వ్యర్థత్వము సంభవించదాయేమి?. ఉ. ఇప్పటికి మాకు ప్రారబ్ధకర్మ ముక్షయింపలేదనెడి ఈదుఃఖము, ఈ సంసారమందు ఆసక్తిలేమియగుగాని, సంసారసంబంధదుఃఖముగాదు. మరియు, భ్రాంతిజ్ఞానమును నిమిత్తముగాగల పరితాపము, సాంసారిక దుఃఖమని పూర్వాచార్యులచేత జెప్పబడెను. ఈదుః ఖము వివేకజ్ఞానమును నిమిత్తముగాగలదగుటచేత, సాంసారిక దుఃఖమువంటి దిగాదని తెలియవలెను.

శ్లో॥ వివేకేనపరిక్లిశ్యన్నల్పభోగేనతృప్యతి।
అన్యథానంతభోగేపినైవతృప్యతికర్హిచిత్॥ ౧౪౬.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. వివేకేన-వివేకముచేత, పరిక్లిశ్యన్-దుఃఖించుచు, అల్పభోగేన-స్వల్పభోగముచేత, తృప్యతి-తృప్తినిబొందుచున్నాడు. అన్యథా-అట్లుగానియెడల, అనగా వివేకములేనియెడల ననుట. అనంతభోగేపి-అపరిమితభోగము గలిగినను, కస్మైచిత్-ఒకానొకప్పుడును, నైవతృప్యతి - తృప్తినిబొందనేపొందడు.

తా. ప్ర. అయితే, జ్ఞానికిగల ఈదుఃఖము, వివేకమును మూలముగాగలదనిగాని, యవివేకమును మూలముగాగలదనిగాని, యెట్లు తెలియబడునో చెప్పుము?. ఉ. ఈజ్ఞాని, ఆత్మానాత్మవివేకముచేత, ప్రారబ్ధకర్మము క్షయించలేదని దుఃఖించుచు, కామములేమిచేత స్వల్పభోగముచేతనే తృప్తిని బొందుచున్నాడు. మరియు, ఆత్మానాత్మ వివేకములేనివాడు, అపరిమిత విషయభోగముగలిగియున్నను, కామమునశింపమిచేత ఎప్పటికినీ తృప్తినిబొందడు. కనుక, జ్ఞానికిగల ఈదుఃఖము వివేకమును మూలముగాగలదగునని తెలియవలెను.

అవ. విషయభోగము తృప్తిహేతువుగాదనుటయందు, ఇప్పుడు శ్రుతిని పఠించుచున్నాడు.

శ్లో॥ నజాతుకామఃకామానాముపభోగేనశామ్యతి।
హవిషాకృష్ణవర్త్మేవభూయఏవాభివర్ధతే॥ ౧౪౭.

టీ. కామానాం-అధికాశగలవస్తువులయొక్క, ఉపభోగేన- భోగానుభవముచేత, అనగా కామ్యవస్తువులను భోగించుటచేననుట. కామః - ఇచ్ఛ, జాతు-ఒకానొకప్పుడును, నశామ్యతి-శాంతినిబొందదు. అనగా నశింపదనుట. హవిషా- నేతిచేత, కృష్ణవర్త్మేవ - అగ్నిహోత్రమువలె, భూయః-మరల అధికముగా, అభివర్ధతఏవ - వృద్ధినిబొందుచున్నదేను.

తా. ప్ర. అయితే, వివేకికివలె అవివేకికిని భోగముచేతనే తృప్తిగలుగుచుండగా, అప్పుడు వివేకము అప్రయోజకముగాదాయేమి?. ఉ. అధికకామముగల వస్తువులను భోగించుటచేత ఎప్పటికినికామము నశింపదనియు, మరియు, హవిస్సుచేత అగ్నిహోత్రము వృద్ధిబొందినట్లు, విషయభోగానుభవముచేత కామము మిక్కిలి అధికముగా వృద్ధిబొందుననియు, ఇట్లు ఈశ్రుతి చెప్పుచున్నది. కనుక, విషయభోగము, తృప్తిహేతువుగాదని తెలియవలెను.

శ్లో॥ పరిజ్ఞాయోపభుక్తోహిభోగోభవతితుష్టయే।
విజ్ఞాయసేవితశ్చోరోమైత్రీమేతనచోరతాం॥ ౧౪౮.

టీ. పరిజ్ఞాయ-తెలిసి, ఉపభుక్తః-అనుభవింపబడెడి, భోగోహి - భోగమే, తుష్టయే-తృప్తికొరకు, భవతి- అగుచున్నది. అనగా తృప్తిహేతువగుచున్నదనుట. విజ్ఞాయ-వీడుచోరుడనియెరిగి, సేవితః-సేవింపబడెడి, చోరః-దొం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గవాడు, మైత్రీం-మిత్రత్వమును, ఏతి-పొందుచున్నాడు. చోరతాం - చోర స్వభావమును, నేతి-పొందడు.

తా. ప్ర. అయితే, వివేకమను మూలముగాగలభోగము, తృప్తినిగలి గించుచున్నదనుటయందు ప్రమాణమేమి?. ఉ. అనుభవసిద్ధమై యున్నందున అనుభవమే ప్రమాణమగును. ప్ర. ఆయనుభవమెద్ది?. ఉ. ఈభోగమింతమా త్రముగలదేననియు, ఈ ప్రకారముగా ప్రయాసముచేత సాధింపదగినదని యు, ఇట్లు అనుభవపూర్వకముగా పొందబడినయెడల, ఆభోగము తృప్తిహే తువుగా గనబడుచున్నది. ప్ర. అయితే, పేరాసకు కారణమగుభోగము వివే కముతోగూడి వర్తించినమాత్రముచేతనే, తృప్తినెట్లు గలిగించును?. ఉ. వీడు చోరుడనియెరిగి, ఆ చోరునితోగూడ, వర్తించెడిపురుషునకు, ఆచోరుడు తన చోరస్వభావమునువదలి, ఆ పురుషునితోటి మైత్రిని పొందుచున్నాడు. ఇట్లు లోకమందు గనబడుచున్నది. అటువలెనే, ఆశకు గారణమగు భోగంబును వివేకములోగూడి వర్తించినమాత్రముచేత,ఆశనుగలిగించెడి తనస్వభావమును వదలి, అందుకు విపరీత కార్యమగు తృప్తిని గలిగించుచున్నదని తెలియవలెను.

శ్లో॥ మనసోనిగృహీతస్యలీలాభోగోల్పకోపియః।
తమేవాలబ్ధవిస్తారంక్లిష్టత్వాద్బహుమన్యతే॥ ౧౪౯.

టీ. నిగృహీతస్య-నిగ్రహింపబడిన, మనసః - మనస్సునకు, అల్పకోపి- స్వల్పమైనను, లీలాభోగః-లీలానుభవము, యః-ఎద్దిగలదో, అలబ్ధవిస్తారం= అలబ్ధ-పొందబడని, విస్తారం-బాహుళ్యమగు, అనగా విస్తారముగానియనుట. తమేవ-ఆభోగమునే, క్లిష్టత్వాత్ - దోషయుక్తమగుటవలన, బహుమన్యతే- అధికత్వముగా దలచుచున్నాడు.

తా. ప్ర. అయితే, కామనాస్వభావముగల మనస్సునకు స్వల్పభోగ ముచే నెట్లుతృప్తిగలుగును?. ఉ. యోగాభ్యాసముచేత వశీకరింపబడిన మన స్సునకు స్వల్పమైనను లీలాభోగమెద్దిగలదో, విస్తారముగాని ఆభోగమునే, మిక్కిలిగొప్పదానినిగా దలచుచున్నాడు. అనగా నిదిధ్యాసనముచేత గ్రహిం పబడిన మనస్సునకు, కామనాస్వభావము లేమిచేత స్వల్పభోగమువల్లనే, తృ ప్తిని బొందునని తెలియవలెను.

అవి. నిగ్రహింపబడిన మనస్సునకు స్వల్పభోగముచేతనే తృప్తిగలుగు చున్నదనెడి విషయమై, ఇప్పుడు దృష్టాంతము జెప్పుచున్నాడు.

శ్లో॥ బద్ధముక్తోమహీపాలోగ్రామమాత్రేణతుష్యతి।
పరైరబద్ధోనాక్రాంతోనరాష్ట్రంబహుమన్యతే॥ ౧౫౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. బద్ధముక్తః=బద్ధ-పరులచేతబంధింపబడుచు, ముక్తః - విడువబడిన, మహీపాలః-రాజు, గ్రామమాత్రేణ- ఒకగ్రామమాత్రముచేత, తుష్యతి - సంతోషమును బొందుచున్నాడు. పరైః-శత్రువులచేత, అబద్ధః- బంధింపబడనట్టియు, అనాక్రాంతః-ఆక్రమింపబడనిరాజు, రాష్ట్రం-ఒకదేశమును, నబహుమన్యతే - అధికత్వముగా దలచడు.

తా. శత్రువులచేత బంధింపబడుచు విడువబడిన రాజునకు, ఒకగ్రామము నిచ్చినయెడల, అంతమాత్రముచేతనే అతడు సంతోషమును బొందుచున్నాడు. మరియు, శత్రువులచేత బంధింపబడనట్టియు, ఆక్రమింపబడనట్టి రాజునకు ఇరువది ముప్పదిగ్రామములుగల ఒకదేశము లభించినను ఆదేశమనధికముగా దలచడు.

అవ. ఇప్పుడు పూర్వవాది, ఒక ఆక్షేపమును జేయుచున్నాడు.

శ్లో॥ వివేకేజాగ్రతిసతిదోషదర్శనలక్షణే।
కథమారబ్ధకర్మాపిభోగేచ్ఛాంజనయిష్యతి॥ ౧౫౧.

టీ. జాగ్రతి-జాగ్రదవస్థయందు, దోషదర్శనలక్షణే - దోషదృష్టిలక్షణముగల, వివేకేసతి- వివేకజ్ఞానస్థితిగలిగియుండగా, ఆరబ్ధకర్మాపి - ప్రారబ్ధకర్మంబును, కథం-ఎట్లు, భోగేషు-భోగములయందు, ఇచ్ఛాం-ఇచ్ఛను,జనయిష్యతి- పుట్టింపగలదు. అనగా నిచ్ఛను గలిగింపజాలదనుట.

తా. ప్ర. ఓ అద్వైతసిద్ధాంతీ, (౧౪౩) శ్లోకముచేత,ప్రారబ్ధకర్మవశమువలన, జ్ఞానికిని విషయభోగేచ్ఛ గలుగునని చెప్పితిరి. అట్లు చెప్పుటయుక్తముగాదు. ఎందుచేననగా, జ్ఞానికిజాగ్రదవస్థయందు, ఇచ్ఛావిఘాతినియగువిషయదోషదృష్టి లక్షణముగల వివేకజ్ఞానముగలిగియుండగా, ప్రారబ్ధకర్మమైనను విషయభోగేచ్ఛను గలిగింపజాలదు. అనియిట్లు పూర్వవాది, ఆక్షేపించెనని తెలియవలెను.

అవ. ఇందుకు, సిద్ధాంతి, ప్రత్యుత్తరము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ నైషదోషోయతోఽనేకవిధంప్రారబ్ధమిష్యతే।
ఇచ్ఛానిచ్ఛాపరేచ్ఛాచప్రారబ్ధంత్రివిధంస్మృతం॥ ౧౫౨.

టీ. యతః-ఏకారణమువలన, ప్రారబ్ధం-ప్రారబ్ధకర్మము, అనేకవిధం-బహువిధములంగలదిగా, ఇష్యతే-ఇచ్ఛయింపబడుచున్నదో, అనగా నంగీకరించబడుచున్నదో ననుట. (అతః) ఆకారణమువలన, ఏషః-ఈ, దోషః-దోషము, న-లేదు. ప్రారబ్ధం-ప్రారబ్ధకర్మము, ఇచ్ఛా - ఇచ్ఛాప్రారబ్ధమనియు, అనగా నిచ్ఛను గలిగించునదియనుట. అనిచ్ఛా- అనిచ్ఛాప్రారబ్ధమనియు, అన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గా ననిచ్ఛచేత భోగమునిచ్చునదియనుట. పరేచ్ఛాచ - పరేచ్ఛాప్రారబ్ధమని యు, అనగా పరేచ్ఛచేత భోగమునిచ్చునదియనుట. త్రివిధం - ఇట్లు త్రివిధ ముగా, స్మృతం-చెప్పబడును.

తా. ఉ. ఓపూర్వవాదీ, జ్ఞానికి విషయదోషదృష్టిలక్షణముగల వివేకజ్ఞా నముగలిగియున్నను, ప్రారబ్ధకర్మము నానాప్రకారముగా నుండుటచేత, ఆప్రారబ్ధకర్మము, జ్ఞానికి ఇచ్ఛను బుట్టింపగలదు. కనుక, నీవు చెప్పినదోష ముగలుగదు. ప్ర. అయితే, ఆప్రారబ్ధకర్మముయొక్క నానా ప్రకారత్వము నుజెప్పుము?. ఉ. ఇచ్ఛనుగలిగించుటచేత,౧. ఇచ్ఛాప్రారబ్ధమనియు మరియు, పురుషుడిచ్ఛయింపకున్నను భోగమునిచ్చుటచేత, ౨. అనిచ్ఛా ప్రారబ్ధమని యు, మరియు, పరులయొక్కయిచ్ఛచేత భోగమునిచ్చుటవలన, ౩. పరేచ్ఛా ప్రారబ్ధమనియు, ఇట్లు,ప్రారబ్ధకర్మము త్రివిధముగానున్నదని తెలియవలెను.

అవ. ఇప్పుడు, ఇచ్ఛాప్రారబ్ధమును జూపుచున్నాడు.

శ్లో॥ అపథ్యసేవినశ్చోరారాజదారరతాఅపి।
జానంతఏవస్వానర్థమిచ్ఛంత్యారబ్ధకర్మతః॥ ౧౫౩.

టీ. అపథ్యసేవినః=అపథ్య-మేలుకలిగింపని కార్యమును, అనగా భవి ష్యత్కాలమందు ననుభవింపదగిన దుఃఖమును గలిగించెడికార్యములననుట. సేవినః-సేవించెడివారును, అనగా నపథ్యమును సేవించెడిరోగులు మొదలగు వారనుట. చోరాః-దొంగలును, రాజదారరతాఅపి= రాజదార - రాజస్త్రీల యందు, రతాఅపి - ఆసక్తిగలవారును, జానంతస్సంతఏవ - ఎరిగినవారేయగు చు, ఆరబ్ధకర్మతః-ప్రారబ్ధకర్మమువలన,స్వానర్థం=స్వ-తమయొక్క, అనర్థం- కీడును, ఇచ్ఛంతి-కోరుచున్నారు.

తా. రాబోయెడికాలమందు కీడునుగలిగించెడి కార్యములను చేసెడివా రిలో, అపథ్యమును సేవించెడి రోగులును, చోరులును, రాజస్త్రీలయందాస క్తిగల పురుషులును, తమకు గీడుగలుగునని తెలిసియు, ప్రారబ్ధకర్మమువలన, అపథ్యసేవాచోరత్వాదికార్యములను జేయుటకు ఇచ్ఛయించుచున్నారు. కను క, ఇట్టి ఇచ్ఛనుగలిగించుటకు గారణము ప్రారబ్ధకర్మమగునని తెలియవలెను.

శ్లో॥ నచాత్రైతద్వారయితుమీశ్వరేణాపిశక్యతే।
యతఈశ్వరఏవాహగీతాయామర్జునంప్రతి॥ ౧౫౪.

టీ. అత్ర-ఈలోకమందు, ఏతత్- ఈప్రారబ్ధకర్మమును, వారయితుం- నివారింపజేయుటకు, ఈశ్వరేణాపిచ-ఈశ్వరునిచేనైనను, నశక్యతే- శక్యము గాదు. యతః-ఏకారణమువలన, ఈశ్వరఏవ-ఈశ్వరుడే, గీతాయాం-శ్రీగీతా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాస్త్రమందు, అర్జునంప్రతి - అర్జునునిగురించి, ఆహ-చెప్పెనో.

తా. ప్ర. అయితే,అపథ్యసేవాదిరూపముగల యిచ్ఛ, ప్రారబ్ధకర్మఫలంబగునని, దేనిచే దెలియబడెనో చెప్పుము?. ఉ. ఈలోకమందు ఈ ప్రారబ్ధకర్మఫలమును నివారింపజేయుటకు, ఈశ్వరునకైననుశక్యముగాదు. కనుక, ఈ ప్రారబ్ధకర్మమునకు పరిహారములేమిచేత, ఇట్టి యిచ్ఛలన్నియు ప్రారబ్ధకర్మఫలములగునని తెలియవలెను. ప్ర. అయితే, ఇకమీదటగలుగదగిన కీడుకొరకు, ఇట్లు ఇచ్ఛయించుచున్నారనెడి విషయము, దేనిచే దెలియబడుచున్నదో చెప్పుము?. ఉ. శ్రీగీతాశాస్త్రమందు ఈశ్వరుడైన శ్రీకృష్ణదేవుడే, ఈవిషయమునుగురించి, అర్జునునకు జెప్పెను.

అవ. ఇప్పుడు, ఆగీతావాక్యమును పఠించుచున్నాడు.

శ్లో॥ సదృశంచేష్టతేస్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి।
ప్రకృతింయాంతిభూతానినిగ్రహఃకింకరిష్యతి॥ ౧౫౫.

టీ. జ్ఞానవానపి-జ్ఞానవంతుడును, స్వస్యాః - తనయొక్క, ప్రకృతేః-ప్రకృతికి, అనగా వర్తమానజన్మాదికమందు తెలియబడుచుండెడి పూర్వజన్మకృతధర్మాధర్మాది సంస్కారమునకనుట. సదృశం- సమానముగా, చేష్టతే-ప్రవర్తించుచున్నాడు.భూతాని-ప్రాణులు,ప్రకృతిం-అట్టిప్రకృతిని, యాంతి-పొందుచున్నవి. నిగ్రహః-ప్రవృత్తినివృత్తులయొక్క నిరోధను, కింకరిష్యతి-ఏమిచేయగలదు. అనగా నేమియుం జేయజాలదనుట.

తా. ఓఅర్జునా! జ్ఞానవంతుడును,తనపూర్వజన్మసంస్కారప్రకారము, ప్రవృత్తి నివృత్తిమార్గములయందు బ్రవర్తించుచున్నాడు. కనుక, మూర్ఖుడు, తనపూర్వజన్మ సంస్కారప్రకారము ప్రవర్తించునని చెప్పవలసిన పనిలేదు. ఆకారణముచేత, ప్రాణివర్గమంతయు, తమపూర్వజన్మ సంస్కారమునుపొంది ప్రవర్తించుచున్నది. కనుక, నాచేనైనను, అన్యునిచేతనైనను జేయబడినప్రవృత్తినివృత్తులయొక్కనిగ్రహము, ఏమియుం జేయజాలదని, శ్రీభగవంతుడగు కృష్ణదేవుడు, అర్జునునకుజెప్పెను. ఈవాక్యమునుచేత, ముందరరాబోయెడి కీడులనుగలిగించెడియిచ్ఛలు, ప్రారబ్ధకర్మమువల్ల గలుగుచున్నవని తెలియవలెను.

అవ. తీవ్రప్రారబ్ధమునకు పరిహారములేదనెడివిషయమై, మరియొకవాక్యసమ్మతము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ అవశ్యంభావిభావానాంప్రతీకారోభవేద్యది।
తదాదుఃఖైర్నలిప్యేరన్నలరామయుధిష్ఠిరాః॥ ౧౫౬.

టీ. అవశ్యం-ముఖ్యముగా, అనగాతప్పకనుట. భావిభావానాం-భావి-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంభవింపదగిన, భావానాం-దుఃఖాదులకు, ప్రతీకారః-పరిహారము, భవేద్యది- ఉన్నయెడల, తదా-అప్పుడు, నళరామయుధిష్ఠిరాః=నళ-నలుడును,రామ-దశరథరాముడును, యుధిష్ఠిరాః-ధర్మరాజును, దుఃఖైః- దుఃఖములచేత, నలిప్యేరన్ - స్పృశింపబడరు.

తా. మరియు, అవశ్యముగాదప్పక కలిగెడి దుఃఖాదులకు పరిహారమున్నయెడల, అప్పుడు, నళుడును, దశరథరాముడును, ధర్మరాజును, దుఃఖములచేత పీడింపబడరాదు. అనగా నళరామ ధర్మరాజాదులు దుఃఖములచేత పీడింపబడుటవల్ల, తీవ్రప్రారబ్ధమునకు పరిహారములేదని, ఈవాక్యము జెప్పుచున్నదని యభిప్రాయము.

శ్లో॥ నచేశ్వరత్వమీశస్యహీయతేతావతాయతః।
అవశ్యంభావితాస్యేషామీశ్వరేణైవనిర్మితా॥ ౧౫౭.

టీ. తావతా- ప్రారబ్ధమును పరిహరింపజాలమిచేత, ఈశస్య-ఈశ్వరునియొక్క, ఈశ్వరత్వం - ఈశ్వరభావము, నచహీయతే-చెడదు. యతః-ఏకారణమువల్ల, అవశ్యం-అవశ్యముగా, ఏషాం - ఈదుఃఖాదులయొక్క, అనగా దుఃఖాదులననుట. భావితాపి-భావిత్వంబును, అనగా ననుభవించుట ననుట. ఈశ్వరేణైవ - ఈశ్వరునిచేతనే, నిర్మితా-నిర్మించబడెనో.

తా. ప్ర. అయితే, ప్రారబ్ధమునకు బరిహారములేనియెడల, ఆప్రారబ్ధమును పరిహరించుటకు సమర్థుడుగాని ఈశ్వరునకు, అనీశ్వరత్వప్రసంగము కలుగదాయేమి?. ఉ. ఆప్రారబ్ధమును పరిహరింపజాలమిచేత, ఈశ్వరునియొక్క ఈశ్వరభావముచెడదు. ప్ర. ఎందువల్లజెడదోచెప్పుము?. ఉ. ఏకారణముచేత, ఈదుఃఖాదుల నవశ్యమనుభవించవలెనని, ఈశ్వరుడే నిర్మించెనో, ఆకారణముచే నీశ్వరత్వము జెడదని తెలియవలెను.

అవ. ఇట్లు ప్రపంచసహితమగు ఇచ్ఛాప్రారబ్ధమునుదెలిపి, ఇక ననిచ్ఛాప్రారబ్ధమును జెప్పుటకు ప్రారంభించుచున్నాడు.

శ్లో॥ ప్రశ్నోత్తరాభ్యామేవైతద్గమ్యతేఽర్జునకృష్ణయోః।
అనిచ్ఛాపూర్వకంచాస్తి ప్రారబ్ధమితితచ్ఛృణు॥ ౧౫౮.

టీ. అనిచ్ఛాపూర్వకం- అనిచ్ఛాపూర్వకమగు, ప్రారబ్ధంచ-ప్రారబ్ధంబును, అస్తీతి-కలదని తెలియవలెను. ఏతత్ - ఈయనిచ్ఛాప్రారబ్ధము, అర్జునకృష్ణయోః-అర్జునకృష్ణులయొక్క, ప్రశ్నోత్తరాభ్యామేవ- ప్రశ్నోత్తరములచేతనే, గమ్యతే - పొందబడుచున్నది.

తా. మరియు, అనిచ్ఛాపూర్వకమగు ప్రారబ్ధంబునుగలదని తెలియవలె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ను. ఈయనిచ్ఛాప్రారబ్ధము, అర్జున కృష్ణులయొక్క ప్రశ్నోత్తరములచేతనే, తెలియబడుచున్నది. కనుక, ఆయనిచ్ఛాప్రారబ్ధమును జెప్పెదవినుము.

అవ. ఆయనిచ్ఛాప్రారబ్ధవిషయమై, అర్జునునియొక్క ప్రశ్నము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయంపాపంచరతిపూరుషః।
అనిచ్ఛన్నపివార్ష్ణేయబలాదివనియోజితః॥ ౧౫౯.

టీ. హేవార్ష్ణేయ- ఓకృష్ణా, అథ-సరి. అయం-ఈ, పూరుషః - పురుషుడు, కేన-ఏహేతుభూతముచేత, ప్రయుక్తస్సన్-ప్రేరేపింపబడినవాడగుచు, అనిచ్ఛన్నపి - ఇచ్ఛను జేయనివాడైనను, (రాజ్ఞః) రాజుయొక్క, బలాత్- బలమువల్ల, నియోజితఇవ - నియమింపబడినవానివలె, పాపం- పాపమును, చరతి-ఆచరించుచున్నాడో.

తా. ఓకృష్ణా, ఈపురుషుడు, ఏహేతుభూతముచేత ప్రేరేపింపబడినవాడై, ఇచ్ఛయించకుండియు, రాజుచేత బలమువల్లనియమింపబడిన వానివలె, పాపమునాచరించుచున్నాడో చెప్పుమని. అర్జును డడిగెను.

అవ. ఇందుకు, శ్రీకృష్ణునియొక్క ప్రత్యుత్తరవాక్యము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ కామఏషక్రోధఏషరజోగుణసముద్భవః।
మహాశనోమహాపాప్మావిద్ధ్యేనమిహవైరిణం॥ ౧౬౦.

టీ. ఏషః-ఈపురుషుని ప్రవర్తింపజేయునది, రజోగుణసముద్భవః=రజోగుణ-రజోగుణమువల్ల, సముద్భవః-ఉత్పత్తిగలిగినట్టి, ఏషః - ఈ ప్రసిద్ధమగు, కామః-కామము, (కదాచిత్) ఒకానొకప్పుడు, క్రోధః - క్రోధరూపమగుచున్నది. అనగా క్రోధరూపముగాబరిణమించుచున్నదనుట. (సః) ఆక్రోధము, మహాశనః=మహత్-అధికమగు, అశనః- విషయసమూహము నాహారముగాగలదియు, మహాపాప్మా=మహత్-అధికమైన, పాప్మా-పాపస్వరూపియు నగును. ఇహ-ఈసంసారమందు, ఏనం-ఈకామక్రోధరూపిని, వైరిణం-వైరినిగా, విద్ధి-తెలిసికొనుము.

తా. ఓ అర్జునా, ఈ పురుషుని ప్రవర్తింపజేయునదెద్దియనగా, రజోగుణమువల్ల ఉత్పత్తిగల, ఈ ప్రసిద్ధమైన కామమగును. ఈకామము, ఒకానొకప్పుడు, క్రోధరూపముగా పరిణమించుచున్నది. మరియు,నాక్రోధము అధికవిషయసమూహము నాహారముగాగలదగుచు, మహాపాపమునుగలిగించుటవల్ల, మహాపాపస్వరూపియగును. ఆ కారణమువల్ల, ఈ సంసారమందు, ఈకామ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్రోధరూపిని, నీకు శత్రువునుగా దెలిసికొనుము. అనగా, ప్రారబ్ధవశమువల్ల ఉద్రేకించిన రజోగుణముయొక్క కార్యములగు కామక్రోధములలో నొకటి, పురుషుని బ్రేరేపించి విషయములయందు బ్రవర్తింపజేయుచున్నదేగాని, ఇచ్ఛచేత బురుషుడు బ్రవర్తించలేదని యభిప్రాయము.

అవ. ఈ శ్లోకమందు కామక్రోధములే బురుషుని బ్రవర్తింపజేయుచున్నట్లు కనబడుచున్నదేగాని, అనిచ్ఛాప్రారబ్ధము పురుషుని బ్రవర్తింపజేసినట్లు కనబడలేదనెడి యాక్షేపముచేసికొని, ఆ యనిచ్ఛాప్రారబ్ధము పురుషుని బ్రవర్తింపజేయుచున్నదని ప్రతిపాదించెడి, యాభగవద్వాక్యము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ స్వభావజేనకౌంతేయనిబద్ధస్స్వేనకర్మణా।
కర్తుంనేచ్ఛసియన్మోహాత్కరిష్యస్యవశోపితత్॥ ౧౬౧.

టీ. హేకౌంతేయ- ఓ అర్జునా, స్వేన-తనచే ననుష్ఠింపబడినదిగనుకనే, స్వభావజేన-స్వకీయప్రారబ్ధమనెడి, కర్మణా-కర్మముచేత, నిబద్ధస్సన్-బంధింపబడినవాడవగుచు. యత్-ఏయుద్ధమును, కర్తుం-చేయుటకు, నేచ్ఛసి - ఇచ్ఛయింపవో, తదపి-ఆయుద్ధంబును, మోహాత్-అవివేకమువల్ల, అవశస్సన్ - పరవశుడవగుచు, కరిష్యసి - చేయగలవు.

తా. ఓ అర్జునా, తనచేత ననుష్ఠించబడినదగుటవల్ల స్వకీయమగు ప్రారబ్ధకర్మముచేత నిశ్చయముగా బంధింపబడినవాడవగుచు, ఏ కర్మమును జేయుట కిచ్ఛయింపవో, ఆకర్మము నే, అవివేకమువల్ల బరవశుడవై, చేయగలవని, శ్రీభగవంతుడు జెప్పెను. ఇట్లు జెప్పుటచేత, అనిచ్ఛా ప్రారబ్ధముగలదని తెలియపలెను.

అవ. ఇప్పుడు, పరేచ్ఛాప్రారబ్ధముగలదని చెప్పుచున్నాడు.

శ్లో॥ నానిచ్ఛంతోనచేచ్ఛంతఃపరదాక్షిణ్యసంయుతాః।
సుఖదుఃఖేభజంత్యేతత్పరేచ్ఛాపూర్వకర్మహి॥ ౧౬౨.

టీ. అనిచ్ఛంతః-ఇచ్ఛయించనివారును, సుఖదుఃఖే - సుఖదుఃఖములను, నభజంతి-అనుభవింపరు. ఇచ్ఛంతశ్చ-ఇచ్ఛయించెడివారును, ననభజంతి-అనుభవింపకమానరు. (కింతు) మరియేమనగా, పరదాక్షిణ్యసంయుతాస్సంతః= పర-ఇతరులయొక్క, దాక్షిణ్య-దాక్షిణ్యముతోటి, సంయుతాస్సంతః-కూడినవారగుచు, సుఖదుఃఖే-సుఖదుఃఖములను, భజంతి-అనుభవించుచున్నారు. ఏతత్-ఇది, పరేచ్ఛాపూర్వకర్మహి= పరేచ్ఛా-పరేచ్ఛయనెడి, పూర్వకర్మ- ప్రారబ్ధము, హి - ప్రసిద్ధమగును.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మరియు, ఇచ్ఛయించనివారు సుఖదుఃఖముల ననుభవింపరు. ఇచ్ఛయించెడివారును సుఖదుఃఖముల ననుభవింపకమానరు. మరియేమనగా, పరుల యొక్క దాక్షిణ్యముతోఁగూడినవారగుచు, ఆపరులయొక్క ప్రీతికొరకే, సుఖదుఃఖముల ననుభవించుచున్నారు. ఆ కారణమువల్ల, ఈ సుఖాది భోగహేతుభూతమగు, పరేచ్ఛాప్రారబ్ధము ప్రసిద్ధముగానున్నదని తెలియవలెను. గనుకనే జ్ఞానికివిషయదోషదర్శనము గలిగియున్నను, ప్రారబ్ధకర్మమునకు బరిహారము లేమివల్ల, ఆప్రారబ్ధకర్మము నిచ్ఛను గలిగింపనిదానినిగా జేయుటకు ఎవ్వరికిని శక్యముగాదని యభిప్రాయము.

శ్లో॥ కథంతర్హి కిమిచ్ఛన్నిత్యేవమిచ్ఛానిషిధ్యతే।
నేచ్ఛానిషేధఃకింత్విచ్ఛాబాధోభర్జితబీజవత్॥ ౧౬౩.

టీ. తర్హి-అట్లైనయెడల; కిమిచ్ఛన్నితి - ఏమిఫలము నిచ్ఛయించుచున నెడియర్థముగల శ్రుతివాక్యముచేత, ఏవం-ఈప్రకారము, కథం=ఎట్లు, ఇచ్ఛా-కోరిక, నిషిధ్యతే-నిషేధింపబడెను. అనగా జ్ఞానికి ఇచ్ఛలేదని యెట్లు నిషేధింపబడెననుట. ఇచ్ఛానిషేధః=ఇచ్ఛా-ఇచ్ఛయొక్క, నిషేధః - అభావము న-కాదు. కింతు-మరియేమనగా, భర్జితబీజవత్=భర్జిత-తపింపబడిన, అనగా కార్యక్షమముగానియనుట. బీజవత్ - విత్తనమువలె, ఇచ్ఛాబాధః= ఇచ్ఛా- ఇచ్ఛయొక్క, బాధః-బాధ, (వర్ణితః) వర్ణింపబడెను.

తా. ప్ర. అయితే, తత్వజ్ఞానికి నిచ్ఛనంగీకరించినయెడల, ఏమిఫలమిచ్ఛయించుచు పరితపించునోయనెడి యర్థముచేత జ్ఞానికిచ్ఛలేదని దెలిపెడి, శ్రు॥ కిమిచ్ఛన్॥ అనెడి శ్రుతివాక్యమునకు విరోధముగాదాయేమి?. ఉ. శ్రు ॥ కిమిచ్ఛన్॥ అనెడి ఈ శ్రుతివాక్యముచే జ్ఞానికిచ్ఛలేదని చెప్పబడలేదు. మరియేమనగా, ప్రారబ్ధకర్మవశమువల్ల జ్ఞానికిచ్ఛగలిగియున్నను, ఆయిచ్ఛ, అగ్నిచేతదపింపబడిన విత్తనమువలె తనకార్యము జేయుటకు సామర్థ్యము గలదిగాదని, ఇచ్ఛయొక్క బాధయే చెప్పబడెను. అనగా స్వరూపముచేత ఇచ్ఛయున్నను, ఆయిచ్ఛకు, వ్యసనాది కార్యమును జేయుటకు సామర్థ్యములేదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు సంక్షేపముగా జెప్పబడినయర్థమును స్పష్టముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ భర్జితానితుబీజానిసంత్యకార్యకరాణిచ।
విద్వదిచ్ఛాతథేష్టవ్యాఽసత్త్వబోధాన్నకార్యకృత్॥ ౧౬౪.

టీ. భర్జితాని-అగ్నిచేత తపింపబడినట్టి, బీజాని-విత్తనములు, సంతితుచ-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వరూపముచేనున్నను, అకార్యకరాణి - అంకురాది కార్యములను జేయజాలవు. తథా-ఆప్రకారము, విద్వదిచ్ఛా= విద్వత్-జ్ఞానియొక్క, ఇచ్ఛా - కోరిక, ఇష్టవ్యా- అంగీకరింపదగినదగును. అసత్వబోధాత్-అసత్వ- ఇచ్ఛయింపబడెడి పదార్థము మిథ్యయనెడి, బోధాత్-జ్ఞానమువల్ల, కార్యకృత్-కార్య-వ్యసనాదికార్యమును, కృత్-చేయునది, న-కాదు.

తా. అగ్నిచేత కాల్చబడిన విత్తనములు, తాము స్వరూపముచేత స్థితిని బొందియున్నను, అంకురించుట మొదలుగా గల కార్యమును జేయజాలవు. ఆప్రకారమే, జ్ఞానియొక్కయిచ్ఛ, తానుస్వరూపముచేత స్థితినిబొందియున్నను, ఇచ్ఛయింపబడెడి పదార్థముయొక్క మిథ్యాత్వజ్ఞానముచేత, ఆ యిచ్ఛ, బాధింపబడుటవల్ల, వ్యసనాదికమును గలిగించుటకు శక్తివంతము గాదని తెలియవలెను.

శ్లో॥ దగ్ధబీజమరోహేపిభక్షణాయోపయుజ్యతే।
విద్వదిచ్ఛాప్యల్పభోగంకుర్యాన్నవ్యసనంబహు॥ ౧౬౫.

టీ. దగ్ధం-అగ్నిచేగాల్చబడిన, బీజం-విత్తనము, అరోహేపి-అంకురింపకపోయినను, భక్షణాయ-భక్షించుటకొరకు, ఉపయుజ్యతే - ఉపయోగించబడుచున్నది. (తథా) ఆప్రకారము,విద్వదిచ్ఛాపి=విద్వత్-జ్ఞానియొక్క,ఇచ్ఛాపి-ఇచ్ఛయు, అల్పభోగం-స్వల్పభోగమును, కుర్యాత్- కలిగించును. బహు-బహువిధమగు, వ్యసనం-విపత్తును, న-కలిగింపదు.

తా. ప్ర. అయితే, ఫలములేమిచేత జ్ఞానికి, ఇచ్ఛగలదని, యెట్లంగీకరింపబడును?. ఉ. అగ్నిచేత కాల్చబడిన విత్తనము, అంకురింపక పోయినను, భక్షించుటకు ఉపయోగించబడుచున్నది. అటువలెనే, జ్ఞానియొక్క యిచ్ఛయు, స్వల్పభోగమును కలుగజేయునేగాని, బహువిధమగు విపదాది రూప వ్యసనమును కలిగించదు.

శ్లో॥ భోగేపచరితార్థత్వాత్ప్రారబ్ధంకర్మహీయతే।
భోక్తవ్యసత్యతాభ్రాంత్యావ్యసనంతత్రజాయతే॥ ౧౬౬.

టీ. ప్రారబ్ధం-ప్రారబ్ధమనెడి, కర్మ-కర్మము, చరితార్థత్వాత్=చరిత-ఆచరించబడిన, అర్థత్వాత్-ప్రయోజనత్వముగలదగుటవల్ల, అనగా భోగమాత్రమునకు హేతువగుటవల్లననుట. భోగేన-భోగముచేత, హీయతే- క్షయించుచున్నది. భ్రాంత్యా-భ్రాంతిచేత, భోక్తవ్యసత్యతా-భోక్తవ్య-అనుభవింపదగినపదార్థముయొక్క, సత్యతా-సత్యత్వము దోచుచుండగా, తత్ర-ఆవిషయమందు, వ్యసనం-విపదాదిరూపము, జాయతే-కలుగుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే, కర్మమే, భోగద్వారా, వ్యసనమునుగూడ, కలిగించదాయేమి?. ఉ. ప్రారబ్ధకర్మము, భోగమును కలిగించుటయే ప్రయోజనముగా గలదగుటవల్ల, భోగముచేత క్షయించును. అనగా, ప్రారబ్ధకర్మము భోగమాత్ర హేతువగుటవల్ల, వ్యసనమును గలిగింపజాలదని తెలియవలెను. ప్ర. అయితే, దేనిచే వ్యసనముగలుగునో చెప్పుము?. ఉ. అనుభవింపబడెడి పదార్థము, సత్యమని దోచుచుండగా, ఆ విషయమందు వ్యసనముగలుగును.

అవ. వ్యసనహేతువగు భ్రమ నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ మావినశ్యత్వయంభోగోవర్ధతాముత్తరోత్తరం।
మావిఘ్నాఃప్రతిబధ్నంతుధన్యోస్మ్యస్మాదితిభ్రమః॥ ౧౬౭.

టీ. అయం-ఈ, భోగః-భోగము, మావినశ్యతు - నశింపకుండుగాక. (ఏషః) ఈభోగము, ఉత్తరోత్తరం-ఉత్తరోత్తరముగా, వర్ధతాం-వృద్ధిబొందుగాక. విఘ్నాః-విఘ్నములు, మాప్రతిబధ్నంతు - ప్రతిబంధమునుచేయకుండుగాక. అస్మాత్-ఈభోగమువల్ల, ధన్యః-కృతార్థుడను, అస్మీతి - ఇతిననునది, భ్రమః-భ్రాంతియగును.

తా. ఈ భోగము, నశింపకుండుగాకయనియు, ఈభోగము ఉత్తరోత్తరముగా వృద్ధిబొందుగాకయనియు, విఘ్నములీభోగమునకు ప్రతిబంధమును చేయకపోగాకయనియు, ఈ భోగమువల్ల నేను కృతార్థుడ నయ్యెద ననెడి, ఈరూపముగల సంకల్పమే భ్రమయగునని తెలియవలెను.

అవ. ప్రసంగవశమువల్ల, ఈభ్రమమునకు బరిహారోపాయమును జెప్పుచున్నాడు.

శ్లో॥ యదభావినతద్భావిభావిచేన్నతదన్యథా।
ఇతిచింతావిషఘ్నోయంబోధోభ్రమనివర్తకః॥ ౧౬౮.

టీ. యత్-ఏభోగము, అభావి-సంభవించుటకయోగ్యమో, తత్-ఆభోగము, నభావి-సంభవింపదు. భావిచేత్-సంభవించుటకు యోగ్యమైనయెడల, తత్-ఆభోగము, అన్యథా-మరియొకవిధమైనది, అనగాననుభవించుట కయోగ్యమైనదనుట. నేతి-కాదనెడి రూపముగల, చింతావిషఘ్నః = చింతా-చింతయనెడి, విష-విషమును, ఘ్నః-నశింపజేయునట్టి, అయం-ఈ, బోధః-జ్ఞానము, భ్రమనివర్తకః=భ్రమ-భ్రాంతిని, నివర్తకః - నివర్తింపజేయునదగును.

తా. మరియు, ఏభోగము, సంభవించుటకయోగ్యమో, ఆభోగము, సంభవింపనేసంభవింపదనియు, మరియు, ఏభోగము సంభవించుటకు యోగ్యమో, ఆభోగము సంభవింపకమానదనెడి, ఈ రూపముగల, ఈబోధమే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భ్రాంతిని నివర్తింపజేయునదియగును. మరియు, ఈమేలు నాకెప్పుడు గలుగునోయనియు, ఈదుఃఖము నాకెప్పుడు నివర్తింపగలదోయనెడి, ఇత్యాది రూపముగల సంకల్పను, చింతయని చెప్పబడును. విషమునంటిన పురుషునకు ఆవిషము నాశహేతువైనట్లు, ఇట్టిచింతగలపురుషునకు, ఆ చింతయే నాశహేతువగును. ఆచింతను, పూర్వోక్తజ్ఞానము, నశింపజేయునని యభిప్రాయము.

శ్లో॥ సమేపిభోగేవ్యసనంభ్రాంతోగచ్ఛేన్నబుద్ధవాన్।
అశక్యార్థస్యసంకల్పాద్భ్రాంతస్యవ్యసనంబహు॥ ౧౬౯.

టీ. భోగే-ప్రారబ్ధకర్మఫలభోగము, సమేపి - అజ్ఞానిజ్ఞానులకు సమానమైనను, భ్రాంతః-భ్రాంతినిబొందినవాడు, వ్యసనం-దుఃఖమును, గచ్ఛేత్-పొందును. బుద్ధవాన్-జ్ఞానవంతుడు, నగచ్ఛేత్-పొందడు. భ్రాంతస్య-భ్రాంతినిబొందినవానికి, అశక్యార్థస్య=అశక్య-సాధ్యముగాని, అర్థస్య - విషయరాశియొక్క, సంకల్పాత్-సంకల్పముగలిగియుండుటవల్ల, అనగా చింతగలిగియుండుటచేననుట. బహు-అధికమైన, వ్యసనం-దుఃఖముగలుగును.

తా. ప్ర. అయితే, అజ్ఞానిజ్ఞానులకిద్దరికిని ప్రారబ్ధకర్మఫల భోగమందు భేదములేనియెడల, ఒకనికి వ్యసనంబును, మరియొకనికి వ్యసనము లేమియునెట్లు సంభవించును?. ఉ. అజ్ఞానిజ్ఞానులకు ప్రారబ్ధకర్మఫలభోగము సమానముగానున్నను, ఆ యిద్దరిలో నజ్ఞాని, వ్యసనమును బొందుచున్నాడుగాని, జ్ఞానవంతుడు వ్యసనమును బొందడు. ప్ర. అయితే, అజ్ఞానికి వ్యసనము గలుగుటకు కారణమేమి?. ఉ. అజ్ఞానికి సాధ్యముగాని విషయసమూహముయొక్క చింతగలిగియుండుటవలన, అధికవ్యసనము గలుగును. అనగా నజ్ఞానిజ్ఞానులకు బ్రారబ్ధకర్మఫలము సమానముగానున్నను, విపరీతజ్ఞానముయొక్క ఉనికిలేములవల్ల, ఆయిద్దరికిని వ్యసనతదభావసిద్ధి గలుగుచున్నదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, వివేకికి వ్యసనాభావమును జూపుచున్నాడు.

శ్లో॥ మాయామయత్వంభోగస్యబుధ్వాస్థాముపసంహరన్।
భుంజానోపినసంకల్పంకురుతేవ్యసనంకుతః॥ ౧౭౦.

టీ. (వివేకీ) వివేకవంతుడు, భోగస్య - భోగమునకు, మాయామయత్వం-మాయామయభావమును, బుధ్వా-తెలిసి, ఆస్థాం-భోగాసక్తిని, ఉపసంహరన్-ఉపసంహారము జేయుచున్నవాడగుచు, భుంజానోపి - ప్రారబ్ధకర్మఫలమునను భవించుచున్నవాడైనను, సంకల్పం-చింతను, నకురుతే-చేయడు. వ్యసనం-దుఃఖము, కుతః-ఎక్కడిది. అనగా నెట్లు గలుగుననుట.

తా. మరియు, వివేకియగువాడు, ప్రారబ్ధ కర్మభోగమునకు మాయా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మయత్వమును నిశ్చయించుకొని, భోగాసక్తినిమాన్పి, కర్మఫలమగు భోగము ననుభవించుచున్నవాడైనను, చింతింపడు. అట్టివానికి వ్యసనము లేనేలేదని తెలియవలెను.

శ్లో॥ స్వప్నేంద్రజాలసదృశమచింత్యరచనాత్మకం।
దృష్టంనష్టంజగత్పశ్యన్ కథంతత్రానురజ్యతి॥ ౧౭౧.

టీ. స్వప్నేంద్రజాలసదృశం=స్వప్న-స్వప్నములోటియు, ఇంద్రజాల-ఇంద్రజాలములోటియు, సదృశం-సమానమైనట్టియు,అచింత్యరచనాత్మకం=అచింత్య-చింతించుటకు శక్యముగాని, రచనా-కల్పనయే, ఆత్మకం- స్వరూపముగా గలిగినట్టియు, దృష్టంసత్-కనబడుచున్నదగుచు, నష్టం-నాశమునుబొందెడి, జగత్-ప్రపంచమును,పశ్యన్-చూచుచు, తత్ర-ఆజగంబునందు, కథం-ఎట్లు, అనురజ్యతి-ఆసక్తిని జేయును. అనగా నాసక్తినుంచడనుట.

తా. ప్ర. అయితే, జ్ఞానికి, జగంబు మాయామయమనెడి బోధగలిగి యున్నను, భోగమప్పుడు సుఖహేతువగుటచేత, దేనివల్ల నాసక్తిలేకపోవునో చెప్పుము?. ఉ. స్వప్నములోటియు, ఇంద్రజాలములోటియు, సమానమైనట్టియు, అచింత్యకల్పనారూపమైనట్టియు, కనబడుచు నాశమును బొందుచుండెడి జగంబునుజూచుచు, ఆజగంబునందు నాసక్తినుంచడు. అనగా, జ్ఞానికి విషయములయందు బహువిధదోష దర్శనముండుటచేత,ఆసక్తిగలుగదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, జగంబునకు స్వప్నేంద్రజాలసాదృశ్యము గలుగుట కుపాయమును రెండుశ్లోకములచే జెప్పుచున్నాడు.

శ్లో॥ స్వస్వప్నమాపరోక్ష్యేణదృష్ట్వాపశ్యన్ స్వజాగరం।
చింతయేదప్రమత్తస్సన్నుభావనుదినంముహుః॥ ౧౭౨.

టీ. స్వస్వప్నం=స్వ-తనయొక్క,స్వప్నం-స్వప్నమును, ఆపరోక్ష్యేణ-అపరోక్షముగా, దృష్ట్వా- చూచి, స్వజాగరం=స్వ - తనయొక్క, జాగరం-జాగరణమును, పశ్యన్-చూచుచు, ఉభౌ-రెంటిని, అప్రమత్తస్సన్- పొరపాటులేనివాడగుచు, అనుదినం- ప్రతిదినమందును, ముహుః - మాటిమాటికిని, చింతయేత్-చింతించును. అనగా నీజాగరము స్వప్నతుల్యమని దలచుననుట.

తా. ప్ర. అయితే, జగంబునకు స్వప్నేంద్రజాలసాదృశ్యాది జ్ఞానము గలిగియుండగా, ఆసక్తియొక్క ఉనికి సంభవింపదు. ఆ స్వప్నేంద్రజాలాది సాదృశ్యము, దేనివల్ల గలుగునోజెప్పుము?. ఉ. వివేకియగువాడు, తనస్వప్నమును ప్రత్యక్షముగాజూచి, తనయొక్క జాగరణము ననుభవించుచు పొర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భాటును బొందనివాడై, ఆ రెంటినిగురించి ప్రతిదినమందును, ఈజాగరణము స్వప్నమువంటిదని, మాటిమాటికిని చింతించుచుండును.

శ్లో॥ చిరంతయోస్సర్వసామ్యమనుసంధాయజాగరే।
సత్యత్వబుద్ధింసంత్యజ్యనానురజ్యతిపూర్వవత్॥ ౧౭౩.

టీ. తయోః-ఆస్వప్నజాగరణములకు, సర్వసామ్యం = సర్వ-సర్వవిధములచేత, అనగా తాత్కాలికభోగ హేతుత్వపరిపక్వవిరసత్వ వినాశిత్వాది లక్షణముచేననుట. సామ్యం-సమత్వమును, చిరం-బహుకాలము, అనుసంధాయ-అనుసంధించి, జాగరే-జాగరితావస్థయందు, సత్యత్వబుద్ధిం-సత్యత్వబుద్ధిని, సంత్యజ్య-విడిపించి, పూర్వవత్- పూర్వమువలె, అనగా జగత్సత్యత్వజ్ఞానదశయందువలెననుట. నానురజ్యతి- అనురక్తినిజేయడు. అనగా ననురక్తుడుగాడనుట.

తా. ఈప్రకారముగా, ఆస్వప్నజాగరణములకు తాత్కాలిక భోగ హేతుత్వ పరిపక్వవిరసత్వ వినాశిత్వాది లక్షణముచేత సర్వవిధసామ్యమును, చిరకాలమనుసంధించి, జాగరణమందు సత్యత్వబుద్ధిని విడిపించి, జాగ్రద్వస్తువులయందు పూర్వము జగత్సత్యత్వజ్ఞానదశయందువలె, అనురక్తుడుగాడని తెలియవలెను.

శ్లో॥ ఇంద్రజాలమిదంద్వైతమచింత్యరచనాత్వతః।
ఇత్యవిస్మరతోహానిఃకావాప్రారబ్ధభోగతః॥ ౧౭౪.

టీ. ఇదం-ఈ, ద్వైతం - భోగ్యపదార్థరాశి, అచింత్యరచనాత్వతః= అచింత్య-చింతించుటకుశక్యముగాని, రచనాత్వతః- కల్పనారూపమగుటవల్ల, ఇంద్రజాలమితి-ఇంద్రజాలమువలె మిథ్యయగుననెడి యుక్తిచేత, (అనుసంధాయ) అనుసంధించి, అవిస్మరతః-మరువని, (విదుషః) జ్ఞానికి, ప్రారబ్ధభోగతః=ప్రారబ్ధ-ప్రారబ్ధకర్మముయొక్క, భోగతః-అనుభవమువల్ల, హానిః- ఉపద్రవము, కావా-ఏమి. అనగా ప్రారబ్ధకర్మఫల జగన్మిథ్యాత్వజ్ఞానములు రెండును విభిన్నవిషయములగుటవల్ల, ప్రారబ్ధకర్మఫలములగు సుఖదుఃఖములయొక్క అనుభవముచేత జగన్మిథ్యాత్వాను సంధానమునకైనను, జగన్మిథ్యాత్వానుసంధానముచేత ప్రారబ్ధకర్మఫలమునకైనను హానిలేదనుట.

తా. ప్ర. అయితే, ప్రపంచగోచరమగు మిథ్యాత్వజ్ఞానమునకును, విషయసత్యత్వము నాశ్రయించియుండెడి భోగమునకును, పరస్పర విరోధమగుటవల్ల, జగన్మిథ్యాత్వజ్ఞానము గలిగియుండగా, జ్ఞానికి ప్రారబ్ధకర్మఫలభోగమెట్లుసిద్ధించును?. ఉ. ఈ భోగ్యవస్తురాశియంతయు, అచింత్య రచనారూప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మగుటవల్ల, ఇంద్రజాలమువలె మిథ్యయగుననెడి యుక్తిచేత ననుసంధించి, మరువనిజ్ఞానికి, ప్రారబ్ధకర్మఫలములగు సుఖదుఃఖములయొక్క అనుభవముచేత జగన్మిథ్యాత్వానుసంధానమునకైనను, జగన్మిథ్యాత్వానుసంధానముచేత ప్రారబ్ధభోగమునకైనను హానిలేదు. ప్ర. అట్లుహానిలేమికి గారణమేమి?. ఉ. ప్రారబ్ధకర్మభోగ జగన్మిథ్యాత్వజ్ఞానములకు రెంటికిని విభిన్నవిషయత్వముగ లిగియుండుటయే కారణమగును. మరియు, భోగమునకు విషయసత్యత్వాపేక్షలేమివల్ల, నిరోధములేదనియుం దెలియవలెను.

అవ. ఆ విభిన్నవిషయత్వమునే, ఇప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ నిర్బంధ స్తత్త్వవిద్యాయా ఇంద్రజాలత్వసంస్మృతౌ।
ప్రారబ్ధస్యాగ్రహోభోగేజీవస్యసుఖదుఃఖయోః॥ ౧౭౫.

టీ. తత్త్వవిద్యాయాః = తత్త్వ- జగత్స్వరూపమును గోచరింపజేసెడి, విద్యాయాః-జ్ఞానమునకు, ఇంద్రజాలత్వసంస్మృతౌ=ఇంద్రజాలత్వ - ఇంద్రజాలలక్షణమువంటి లక్షణముగల జగంబుయొక్క, సంస్మృతౌ-మిథ్యాత్వానుసంధానమందు, నిర్బంధః-నిర్బంధముగలదు. అనగా తత్త్వజ్ఞానమునకు జగన్మిథ్యాత్వానుసంధానమును జేయుటయే స్వభావముగా గలిగియున్నదేగాని, ప్రారబ్ధకర్మభోగమును నశింపజేసెడి స్వభావములేదనుట. ప్రారబ్ధస్యచ-ప్రారబ్ధకర్మమునకును, జీవస్య-జీవునియొక్క, సుఖదుఃఖయోః- సుఖదుఃఖములయందు, ఆగ్రహః- పూనికగలిగియున్నది. అనగా ప్రారబ్ధ కర్మమునకును, జీవునకు సుఖదుఃఖములనిచ్చుటయే స్వభావముగా గలిగియున్నదేగాని, భోగింపబడెడి ప్రపంచవస్తువునకు సత్యత్వమును సంపాదించెడి స్వభావములేదనుట.

తా. జగత్స్వరూపమును గోచరింపజేసెడి జ్ఞానమునకు, ఇంద్రజాలలక్షణమువంటి లక్షణముగల జగంబుయొక్క మిథ్యాత్వానుసంధానమును జేయుటయే స్వభావముగాగలిగియున్నదేగాని, ప్రారబ్ధకర్మభోగమును నశింపజేసెడి స్వభావము గలిగియుండలేదు. మరియు, ప్రారబ్ధకర్మమునకును జీవునకు సుఖదుఃఖములనిచ్చుటయే స్వభావముగాగలిగియున్నదేగాని, భోగ్యమగు ప్రపంచవస్తువునకు సత్యత్వమును సంపాదించెడి స్వభావము లేదని తాత్పర్యము.

అవ. ఇట్లు విభిన్నవిషయత్వమునుజూపి, యిప్పుడు ప్రయోగమును జెప్పుచున్నాడు.

శ్లో॥ విద్యారబ్ధేవిరుధ్యేతేనభిన్నవిషయత్వతః।
జానద్భిరప్యైంద్రజాలంవినోదోదృశ్యతేఖలు॥ ౧౭౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. విద్యారబ్ధే=విద్యా-జ్ఞానంబును, అరబ్ధే- ప్రారబ్ధకర్మంబును, భిన్న విషయత్వతః- విభిన్నవిషయత్వమువలన, నవిరుధ్యేతే - విరోధమునుబొందవు. ఇంద్రజాలం-ఇంద్రజాలసంబంధమగు, వినోదః- చమత్కారవిశేషము, జానద్భిరపి-ఇంద్రజాలత్వము నెరిగినవారిచేతను, దృశ్యతేఖలు- చూడబడుచున్నది గదా.

తా. కనుక, తత్వవిద్యాప్రారబ్ధకర్మములు రెండును, విభిన్నవిషయములంగలవగుటవల్ల, పరస్పరము విరోధమును బొందవనియు, సంప్రతిపన్నరూపరసజ్ఞానములవంటివగునని, ఇట్లు అనుమాన ప్రమాణముచే నెరుగవలెను. ప్ర. అయితే, భోగ్యపదార్థ మిథ్యాత్వజ్ఞానము, భోగమునకు బాధకముగాదనెడి విషయమెచ్చట జూడబడెనోచెప్పుము?. ఉ. ఇంద్రజాలస్వభావము నెరిగినవారును, ఆ యింద్రజాలసంబంధచమత్కారవిశేషమును జూచుచున్నారు. కనుక, భోగ్యపదార్థముయొక్క మిథ్యాత్వజ్ఞానము, భోగబాధకమగునని చెప్పరాదు.

శ్లో॥ జగత్సత్యత్వమాపాద్యప్రారబ్ధంభోజయేద్యది।
తదావిరోధివిద్యాయాఃభోగమాత్రాన్నసత్యతా॥ ౧౭౭.

టీ. ప్రారబ్ధ-ప్రారబ్ధకర్మము, జగత్సత్యత్వం = జగత్- భోగ్యపదార్థరాశికి, సత్యత్వం అబాధ్యత్వమును, ఆపాద్య- సంపాదించి, భోజయేద్యది- భోగింపజేసినయెడల, అనగా జీవునకు సుఖదుఃఖముల నిచ్చినయెడల ననుట. తదా-అప్పుడు, విద్యాయాః-జ్ఞానమునకు, విరోధి-విరోధియగును. భోగమాత్రాత్-భోగమాత్రమువల్ల, సత్యతా- భోగ్యపదార్థమునకు సత్యత్వము, నసిద్ధింపదు.

తా. ఇదియునుంగాక, తత్వవిద్యాప్రారబ్ధకర్మములకు రెంటికిని విరోధముగలదని చెప్పెడిపక్షమందు, ౧. ప్రారబ్ధకర్మము విద్యకు విరోధియో, ౨. లేక, విద్య, ప్రారబ్ధకర్మమునకు విరోధియోజెప్పుము. ప్రారబ్ధకర్మము,భోగ్యపదార్థరాశికి సత్యత్వమును సంపాదించి జీవునకు సుఖదుఃఖముల నిచ్చినయెడల, అప్పుడు విద్యావిషయమగు మిథ్యాత్వమునపహరించినదగుటచేత, ఆప్రారబ్ధకర్మము, విద్యకు విరోధియగును. అట్లు ప్రారబ్ధకర్మముచేయక, భోగమునుమాత్రమే యిచ్చుచున్నది. అందుచేత, ప్రారబ్ధకర్మము విద్యకు విరోధిగాదు. ప్ర. అయితే భోగబలమువల్లనే, భోగ్యపదార్థరాశికి సత్యత్వంబును గలుగదాయేమి?. ఉ. భోగమాత్రమువల్ల, భోగ్యపదార్థమునకు సత్యత్వము గలుగదు. అనగా భోగమాత్రముచేత భోగ్యవస్తువునకు సత్యత్వము గలద


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేది విషయమై దృష్టాంతము లేదని యభిప్రాయము.

శ్లో॥ అనూనోజాయతేభోగఃకల్పితైస్స్వప్నవస్తుభిః।
జాగ్రద్వస్తుభిరప్యేవమసత్యైర్భోగఇష్యతాం॥ ౧౭౮.

టీ. కల్పితైః-కల్పించబడిన, స్వప్నవస్తుభిః-స్వప్నవస్తువులచేత, అనూనః-కొంచెముగాని, భోగః-భోగము, జాయతే-కలుగుచున్నది. ఏవం-ఈప్రకారము, అసత్యైః అసత్యములగు, జాగ్రద్వస్తుభిరపి=జాగ్రత్- జాగరణావస్థయందుగల, వస్తుభిరపి-వస్తువులచేతను, భోగః-భోగము, ఇష్యతాం-అంగీకరింపబడుగాక. అనగా భోగము నంగీకరింపవలెననుట.

తా. ప్ర- అయితే, మిథ్యాపదార్థములచేత భోగముగలుగుచున్నదనెడి విషయమందును, దృష్టాంతము లేదుగదా?. ఉ. స్వప్నావస్థయందు కల్పించబడినవస్తువులచేత భోగనుగలుగుచున్నది. కనుక, దృష్టాంతములేదని చెప్పరాదు. ఈప్రకారమే, అసత్యమలైన జాగ్రదవస్థయందుగల వస్తువులచేత భోగముగలుగుచున్నదని, అంగీకరింపవలెను.

అవ. పూర్వోక్త ద్వితీయపక్షంబును యుక్తముగాదని ఇప్పుడుచెప్పుచున్నాడు.

శ్లో॥ యదివిద్యాపహ్నువీతజగత్ప్రారబ్ధఘాతినీ।
తదాస్యాన్నతుమాయాత్వబోధేనతదపహ్నవః॥ ౧౭౯.

టీ. విద్యా-తత్వజ్ఞానము, జగత్ - ప్రపంచమును, అపహ్నువీతయది-స్వరూపనాశము చేసినయెడల, తదా-అప్పుడు, ప్రారబ్ధఘాతినీ=ప్రాగబ్ధ-ప్రారబ్ధకర్మమునకు, ఘాతినీ-విఘాతము జేయునది, స్యాత్ - అగును. మాయాత్వబోధేన=మాయాత్వ-ప్రపంచము మాయామయమనెడి, బోధేన-జ్ఞానముచేత, తదపహ్నవస్తు=తత్-ఆ ప్రపంచస్వరూపముయొక్క, అపహ్నవస్తు- నాశమో, నస్యాత్ - అగుటలేదు.

తా. మరియు, తత్వవిద్య, భోగ్యపదార్థరాశిని, ఇదివెండిగాదనెడినిషేధకజ్ఞానమువలె తోచుచుండెడి భోగ్యవస్తువునకు స్వరూపనాశనము గలిగించినయెడల, అప్పుడు ప్రారబ్ధకర్మభోగమగు సుఖదుఃఖానుభవముయొక్క సాధనము నపహరించుటచేత, ప్రారబ్ధకర్మమునకు విరోధియగును. ఆతత్వవిద్య, అట్లుచేయక భోగ్యరూపమగు జగంబునకు మిథ్యాత్వమునే బోధించుచున్నది. అందువల్ల, తత్వవిద్య, ప్రారబ్ధకర్మమునకు విరోధిగాదని తెలియవలెను. ప్ర. అయితే, జగంబు మిథ్యయనెడి బోధవల్లనే, ఆజగంబుయొక్కస్వరూపంబును నశింపదాయేమి?. ఉ. ఇంద్రజాలాదికమందు స్వరూప నాశనముం జేయకనే, మిథ్యాత్వజ్ఞానము కనబడుచుండుటవల్ల, జగంబు మిథ్యయనెడి బోధచేత,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆభోగ్యరూపజగంబుయొక్క స్వరూపవినాశనము గలుగదని తెలియవలెను

అవ. ఈ విషయమునే యిప్పుడు, స్పష్టముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ అనపహ్నుత్యలోకా స్తదింద్రజాలమిదంత్వితి।
జానంత్యేవానపహ్నుత్యభోగ్యమాయాత్వధీ స్తథా॥ ౧౮౦.

టీ. లోకాః-జనులు, తత్- ఆయింద్రజాలస్వరూపమును, అనపహ్నుత్య-నిరసింపక, అనగానశింపజేయకనుట. ఇదం- ఇది, ఇంద్రజాలంత్వితి-ఇంద్రజాలమని, జానంత్యేవ-ఎరుగుచున్నవారేను. తథా - ఆప్రకారము, అనపహ్నుత్య-భోగభోగ్యమును నశింపజేయక, భోగ్యమాయాత్వధీః= భోగ్య-జగంబుయొక్క, మాయాత్వధీః-మిథ్యాత్వజ్ఞానము గలుగుచున్నది.

తా. జనులు, ఆయింద్రజాలస్వరూపమును నశింపజేయక, ఇది యింద్రజాలమని, యేప్రకారముగా నెరుగుచున్నారో, ఆప్రకారము, భోగభోగ్యస్వరూపమును నశింపజేయకనే, జగన్మిథ్యాత్వజ్ఞానము గలుగవచ్చునని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, పూర్వవాది, రెండుశ్లోకములచే నాక్షేపించుచున్నాడు.

శ్లో॥ యత్రత్వస్యజగత్స్వాత్మాపశ్యేత్క స్తత్రకేనకిం।
కింజిఘ్రేత్కింవదేద్వేతిశ్రుతౌతుబహుఘోషితం॥ ౧౮౧.

టీ. యత్ర- ఏవిద్యావస్థయందు, జగత్-జగంబంతయు, అస్య-ఈజ్ఞానికి, స్వాత్మా-స్వస్వరూపమగునో, తత్ర-ఆవిద్యాదశయందు,కః-ఏద్రష్ట, కేన-ఏసాధనముచేత,అనగాచక్షురింద్రియముచేననుట. కిం-ఏదృశ్యమును,పశ్యేత్-చూచునో, అనగా జూడనేరడనుట. కేన-ఏఘ్రాణేంద్రియముచేత, కిం - ఏపుష్పాదికమును, జిఘ్రేత్ - ఆఘ్రాణించునో, అనగా నాఘ్రాణింపనేరడనుట. కేన-ఏవాగింద్రియముచేత, కిం-ఏవాక్యమును, వదేత్-చెప్పునో, అనగా జెప్పజాలడనుట. ఏవంవేతి- ఈప్రకారమాయాయింద్రియముచేత నాయావ్యాపారమును జేయనేరడని, శ్రుతౌ-శ్రుతియందు, బహు- అనేకవిధముగా, ఘోషితం-ఘోషింపబడెను. అనగా ననేకపర్యాయములు జెప్పబడెననుట.

తా. ఓ అద్వైతసిద్ధాంతీ, ఏవిద్యాదశయందు, ఈజగంబంతయు,శ్రు॥ ఇదంసర్వంయదయమాత్మా॥ అనెడి శ్రుతిప్రోక్తజ్ఞానముచేత, ఈజ్ఞానికి స్వరూపమేయగుచున్నదో, ఆవిద్యాదశయందు, ఏద్రష్ట, ఏసాధనభూత చక్షురింద్రియముచేత, ఏదృశ్యజాతమునుజూచునో, ఏఘ్రాణేంద్రియముచేత,ఏపుష్పాదికము నాఘ్రాణించునో, ఏవాగింద్రియముచేత నేవాక్యమును చెప్పునో, అనగా నాయాయింద్రియముచేత నాయావ్యాపారమును గ్రహింపనేరడని,శ్రు॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యత్రత్వస్యసర్వమాత్మైవాభూత్తత్కేనకంపశ్యేత్॥ అనెడి ఇత్యాదిశ్రుతి, జ్ఞానదశయందుద్రష్టృదర్శన దృశ్యములులేవని బోధించుచున్నది. అందుచేత, విద్య ఉదయించుచుండగా, జగత్స్వరూపము నశించును.

శ్లో॥ తేనద్వైతమపహ్నుత్యవిద్యోదేతినచాన్యథా।
తథాచవిదుషోభోగఃకథంస్యాదితిచేచ్ఛృణు॥ ౧౮౨.

టీ. తేన-ఆకారణముచేత, విద్యా-జ్ఞానము, ద్వైతం - జగంబును, అపహ్నుత్య-నశింపజేసి, ఉదేతి-ఉదయించుచున్నది. అన్యథా - మరియొకవిధముగా, అనగా జగత్స్వరూపమును నశింపజేయకనుట. నచ-ఉదయింపదు. తథాచ-అట్లగుచుండగా, విదుషః-జ్ఞానికి, భోగః-భోగము, కథం-ఎట్లు, స్యాదితిచేత్-కలుగునయంటివేని, శ్రుణు-చెప్పెదవినుము.

తా. అందుచే నేమనగా, భోగ్యరూపజగంబును నశింపజేసి, జ్ఞానము ఉదయించునేగాని, జగంబును నశింపజేయక జ్ఞానోదయము కానేరదు. అట్లగుచుండగా, జ్ఞానికి భోగమెట్లు సిద్ధించునని పూర్వవాది, ఆక్షేపించెను.

అవ. ఇందుకు, సిద్ధాంతి, యిప్పుడు సమాధానమును జెప్పుచున్నాడు.

శ్లో॥ సుషుప్తివిషయాముక్తివిషయావాశ్రుతిస్త్వితి।
ఉక్తంస్వాప్యయసంపత్త్యోరితిసూత్రేహ్యతిస్ఫుటం॥ ౧౮౩.

టీ. శ్రుతిస్తు-ఈశ్రుతియో, సుషుప్తివిషయావా - సుషుప్తివిషయముగలదిగానైనను, ముక్తివిషయావేతి-ముక్తివిషయముగలదిగానైన నన్వయించబడునని, స్వాప్యయసంపత్త్యోః=స్వాప్యయ- సుషుప్తియందుగాని, సంపత్త్యోః-ముక్తియందుగాని, ఇతి-ఇట్లనిచెప్పెడి, సూత్రే-సూత్రమందు, అతిస్ఫుటం-మిక్కిలి స్ఫుటముగా, ఉక్తంహి - చెప్పబడెను.

తా. ఓపూర్వవాదీ, పూర్వోక్తశ్రుతిని, సుషుప్తివిషయముగానైనను, ముక్తివిషయముగానైనను, అన్వయించవలెనని, సూత్రం॥ స్వాప్యయసంపత్త్యోరన్యతరాపేక్షమావిష్కృతంహి॥ అనెడి బ్రహ్మసూత్రమందు అతిస్ఫుటముగా జెప్పబడెను. గనుక, ఈశ్రుతిని, ఇచ్చట నుదహరించి, ఆక్షేపించపరాదు.

అవ. ఈశ్రుతిని, సుషుప్త్యాదివిషయముగలదానినిగా నంగీకరించనియెడల, బాధకము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ అన్యథాయాజ్ఞవల్క్యాదేరాచార్యత్వంనసంభవేత్।
ద్వైతదృష్టావవిద్వత్తాద్వైతాదృష్టౌనవాగ్వదేత్॥ ౧౮౪.

టీ. అన్యథా- అన్యవిధమైనయెడల, అనగా పూర్వోక్తశ్రుతిని సుషుప్తిమోక్షవిషయముగా నంగీకరించనియెడల్లననుట. యాజ్ఞవల్క్యాదేః- యాజ్ఞవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ల్క్యాదిమునివర్గమునకు, ఆచార్యత్వం-ఆచార్యత్వము, నసంభవేత్ - సంభవింపదు. ద్వైతదృష్టౌసత్యాం - ద్వైతజ్ఞానము గలుగుచుండగా, అవిద్వత్తా- అద్వైతజ్ఞానముసిద్ధింపదు. ద్వైతాదృష్టౌసత్యాం=ద్వైత - ద్వైతముయొక్క, అదృష్టౌసత్యాం-జ్ఞానములేకపోవుచుండగా, వాక్-వాక్యమును,నవదేత్-చెప్పరాదు. అనగా బోధింపదగిన శిష్యాదికము లేమిచేత నాచార్య వాక్యము శిష్యునిబోధించుటకొరకు ప్రవర్తించదనుట.

తా. మరియు, బూర్వోక్తశ్రుతిని, సుషుప్తిమోక్షవిషయముగా నంగీకరించనియెడల, యాజ్ఞవల్క్యాదిమునివర్గమునకు, ఆచార్యత్వము సంభవింపదు. ప్ర. అయితే, అట్లు సంభవింపమికి గారణమేమి?. ఉ. యాజ్ఞవల్క్యాదిమునివర్గము, ద్వైతమును జూచినయెడల. అప్పుడు వారికి అద్వైతజ్ఞానము లేమిచేత, ఆచార్యత్వము సంభవింపదు. మరియు, ఆ యాజ్ఞవల్క్యాదులుద్వైతమునుజూడనియెడల, బోధింపదగిన శిష్యాదికము లభింపమిచేత,ఆచార్యవాక్యము, శిష్యునిగురించి బోధించుటకొరకు ప్రవర్తింపదు. కనుక, ఈప్రసంగము విద్యాసంప్రదాయమును నశింపజేయునదియగునని తెలియవలెను.

శ్లో॥ నిర్వికల్పసమాధౌతుద్వైతాదర్శనహేతుతః।
సైవాపరోక్షవిద్యేతిచేత్సుషుప్తిస్తథానకిం॥ ౧౮౫.

టీ. నిర్వికల్పసమాధౌతు- నిర్వికల్పసమాధియందో, ద్వైతాదర్శనహేతుతః=ద్వైత-జగంబుయొక్క, అదర్శనహేతుతః-కనబడనిహేతువవల్ల, సైవ- అద్వైతవిస్మృతియే, అపరోక్షవిద్యేతిచేత్ - అపరోక్షజ్ఞానమని యంటివేని, సుషుప్తిః-సుషుప్తి, తథా-ఆప్రకారము, అనగాద్వైతప్రతీతిలేనిదనుట. నకిం- కాదాయేమి. అనగా నగుననుట.

తా. ప్ర. అయితే, యాజ్ఞవల్క్యాదులకు ఆచార్యత్వదశయందుండెడి జ్ఞానమునకు విద్యాస్వభావముండినను, అప్పుడు ద్వైతను స్ఫురించుచుండుట వల్ల, ఆజ్ఞానమునకు అపరోక్షవిద్యాస్వభావములేదనియు, నిర్వికల్పక సమాధియందు ద్వైతము లోపమిచేత నదియే అపరోక్ష విద్యయనియుం జెప్పరాదాయేమి?. ఉ. ఇట్లుచెప్పుట,అధికప్రసంగమగును. ప్ర. అదియేమి?. ఉ. ద్వైతస్ఫురణములేని అవస్థకు విద్యాభావము నంగీకరించినయెడల, సుషుప్తియందును ద్వైతస్ఫురణములేమిచేత, ఆసుషుప్తికిని విద్యాభావముగలదని చెప్పవలసివచ్చును. గనుక, అట్లు చెప్పుట అధికప్రసంగమగునని తెలియవలెను.

శ్లో॥ ఆత్మతత్వంనజానాతిసుప్తౌయదితదాత్వయా।
ఆత్మధీరేవవిద్యేతివాచ్యంనద్వైతవిస్మృతిః॥ ౧౮౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. సుప్తౌ-సుషుప్తియందు, ఆత్మతత్వం-ఆత్మస్వరూపమును,నజానాతి యది-పురుషుఁడెరుఁగడనియంటివేని, తదా-అప్పుడు, త్వయా - నీచేత, ఆత్మధీ రేవ-ఆత్మబుద్ధియే, విద్యేతి-విద్యయని, వాచ్యం - చెప్పదగినదగును. ద్వైతవి స్మృతిః=ద్వైత-జగంబుయొక్క, విస్మృతిః-స్ఫురింపమి, న-విద్యకాదు.

తా. ప్ర. అయితే, సుషుప్తియందు ద్వైతస్ఫురణము లేకపోయినను, ఆత్మగోచరజ్ఞానములేమిచేత, ఆసుషుప్తికి విద్యాస్వభావ మెట్లు సిద్ధించును?. ఉ. సరి. అట్లైనయెడల, వివేకజ్ఞానమునకే విద్యాస్వభావమును చెప్పవలయు గాని, ద్వైతములోపమికి విద్యాభావమును జెప్పరాదని నిశ్చయించుకొనుము.

శ్లో॥ ఉభయంమిళితంవిద్యాయదితర్హిఘటాదయః।
అర్ధవిద్యాభాజినస్స్యుస్సకలద్వైతవిస్మృతేః॥ ౧౭౭.

టీ. మిళితం-కలసిన, ఉభయం-ఆత్మజ్ఞానద్వైతవిస్మృతులు రెండును, విద్యాయది - విద్యయగుననియంటివేని, తర్హి - అట్లైనయెడల, ఘటాదయః- ఘటాదిజడపదార్థములును, సకలద్వైతవిస్మృతేః=సకల- సకలమగు, ద్వైత- జగంబుయొక్క, విస్మృతేః=విస్మృతిని గలిగియుండుటవల్ల, అర్ధవిద్యాభాజి నః=అర్ధవిద్యా-అర్ధవిద్యను, భాజినః-పొందినవి, స్యుః-అగుచున్నవి.

తా. ప్ర. అయితే, కలసివర్తించెడి ఆత్మజ్ఞానద్వైతవిస్మృతులకు రెం టికిని విద్యాభావమును జెప్పవలయుగాని, ఆరెంటిలో నొక్కొకదానికి ప్రత్యే కముగా విద్యాభావమును జెప్పరాదుగదా?. ఉ. ద్వైతవిస్మృతికిని విద్యాభా వము నంగీకరించినయెడల, జడపదార్థములైన ఘటాదులకు, సంపూర్ణముగా ద్వైతవిస్మృతి గలిగియుండుటవల్ల, ఆఘటాదులును అర్ధవిద్యావంతములగు నని చెప్పవలసివచ్చును. కనుక, అట్లు చెప్పరాదని యభిప్రాయము.

అవ. ఈపక్షమందే, సమాధిమంతులగు పురుషులకు అర్ధభాగవిద్యయుం గలిగియుండదని, పరిహాససహితముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ మశకధ్వనిముఖ్యానాంవిక్షేపాణాంబహుత్వతః।
తవవిద్యాతథానస్యాద్ఘటాదీనాంయథాదృఢా॥ ౧౭౮.

టీ. విక్షేపాణాం- విక్షేపమునుగలిగించెడి, మశకధ్వనిముఖ్యానాం= మ శక-దోమలయొక్క, ధ్వనిముఖ్యానాం-ధ్వనిమొదలగువానియొక్క, బహుత్వ తః-బహుత్వమువల్ల, తవ-నీయొక్క, విద్యా-జ్ఞానము, ఘటాదీనాం - ఘటాది జడపదార్థములకు, యథా-ఏప్రకారము, దృఢా- ద్వైతవిస్మృతివల్ల దృఢజ్ఞాన ముగలదో, తథా-ఆప్రకారము, నస్యాత్-దృఢముగాదు.

తా. మరియు, ఈ పక్షమందు ఘటాదిజడపదార్థములకు, ఏప్రకారము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాన్వైతవిస్మరణము దృఢముగా గలిగియుండునో, ఆప్రకారము, నీయొక్క సమాధియందు విక్షేపమునుగలిగించెడి దోమలు మొదలగు జంతువులయొక్క ధ్వని, వినబడుటవల్ల, అట్టి దృఢమైన ద్వైతవిస్మరణము నీకు గలిగియుండదు. అందుచేత, నీకుగలవిద్యకంటె ఘటాదులకు గలవిద్య, ఆధిక్యతగలదని చెప్పవలసివచ్చును.

శ్లో॥ ఆత్మధీరేవవిద్యేతియదితర్హిసుఖీభవ।
దుష్టచిత్తంనిరుంధ్యాశ్చేన్నిరుంధిత్వంయథాసుఖం॥ ౧౮౯.

టీ. ఆత్మధీరేవ-ఆత్మబుద్ధియే, అనగా నాత్మజ్ఞానమేననుట. విద్యేతియది-విద్యయనియంటివేని, తర్హి-అట్లైనయెడల, సుఖీ-సుఖవంతుడవు, భవ-అగుము. దుష్టచిత్తం-దుష్టచిత్తమును, నిరుంధ్యాశ్చేత్ - నిరోధము జేసెది వాడవైతివేని, యథాసుఖం-సుఖముగలుగునట్లుగా, త్వం- నీవు, నిరుంధి - నిరోధముచేయుము.

తా. ప్ర. అయితే,ఆత్మజ్ఞానమునకే విద్యాస్వభావముగలదనియు,ద్వైతవిస్మృతికి విద్యాస్వభావము లేదనియుంజెప్పుదమాయేమి?. ఉ. సరి. అట్లైనయెడల సుఖివిగమ్ము. అనగా, అట్లుచెప్పుట మాకిష్టమనెడి యభిప్రాయముతోటి, సిద్ధాంతి,పూర్వవాదికిఆశీర్వాదముజేసెనని తెలియవలెను.ప్ర. అయితే, ఆత్మజ్ఞానమే విద్యయైనను, అవిద్య,దుష్టచిత్తమందు సంభవింపమిచేత, చిత్తదోషము నశించెడికొరకు,చిత్తవృత్తినిరోధమును చేయవలెనుగదా?. ఉ. నీయిష్టప్రకారము చిత్తనిగ్రహము జేసికొనుము. అనగా చిత్తనిగ్రహము జేయుటను మేమంగీకరించితిమని యభిప్రాయము.

అవ. చిత్తనిరోధంబిష్టమగుటకు గారణమును జెప్పుచు, ఈప్రతిపాదింపబడిన, శ్రు॥ కిమిచ్ఛ౯॥ అనెడి మంత్రాంశవ్యాఖ్యానము నిప్పుడుపసంహరింపుచున్నాడు.

శ్లో॥ తదిష్టమేష్టవ్యమాయామయత్వస్యసమీక్షణాత్।
ఇచ్ఛన్నప్యజ్ఞవన్నేచ్ఛేత్కిమిచ్ఛన్నపిహిశ్రుతం॥ ౧౯౦.

టీ. ఏష్టవ్యమాయామయత్వస్య=ఏష్టవ్య - అద్వితీయాత్మజ్ఞానముకొరకు ఇచ్ఛయింపబడుచుండెడి, మాయామయత్వస్య - జగన్మాయామయత్వమును, సమీక్షణాత్-లెస్సగాజూచుటవల్ల, అనగా జగన్మాయామయత్వము జూడబడుటచేననుట. తత్-ఆచిత్తనిరోధము,(అస్మాకం) మాకు,ఇష్టం-సమ్మతమగును. ఇచ్ఛన్నపి-జ్ఞానియిచ్ఛయించుచున్నవాడైనను, అజ్ఞవత్- అజ్ఞానివలె, నేచ్ఛేత్-ఇచ్ఛయింపడు. (అతః) ఆకారణమువల్ల, కిమిచ్ఛన్నపి- ఏమిఫలంబిచ్ఛయించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నవాడనియు, శ్రుతంశ్రీ-శ్రుతియందు వినబడుచున్న దేను.

తా. అట్లు చిత్తనిరోధము జేయుట, మాకు ఇష్టమేయగును. ప్ర. అది మీకిష్టమగుటకు గారణమేమి?. ఉ. ఏకారణముచేత చిత్తదోషము లేనివాడు, అద్వితీయాత్మజ్ఞానముకొరకు అవశ్యముగా నిశ్చయింపబడుచుండెడి జగన్మాయామయత్వమును జూచునో, ఆకారణముచేత, చిత్తమును నిగ్రహించుట, మాకుసమ్మతమేయగును. ఈ చెప్పబడినప్రకారము, ఈజ్ఞాని, ప్రారబ్ధకర్మబలమువల్ల భోగమునిశ్చయించినను, అజ్ఞానివలె నిశ్చయింపడు. ఆకారణముచేత- ఏమిఫలమునిశ్చయించుచున్నవాడనెడి యర్థముగల, శ్రు॥ కిమిచ్ఛన్॥ అనెడి మంత్రాంశముచేత, శ్రుతియందు ఈయర్థమే వినబడుచున్నదని తెలియవలెను.

అవ. ఈ పూర్వోక్తప్రకారను, శ్రు॥ కిమిచ్ఛన్। అనెడి మంత్రాంశమునకు అభిప్రాయమును వర్ణించుటకు, కారణము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ రాగోలింగమబోధస్యసంతురాగాదయోబుధే।
ఇతిశాస్త్రద్వయంసార్థమేవంసత్యవిరోధతః॥ ౧౪౧.

టీ. ఏవంసతి- ఈచెప్పబడినప్రకారము జ్ఞానికి దృఢరాగము లేకపోవుచుండగా, అబోధస్య-మూఢునకు, రాగః-విషయాసక్తి, లింగమితి -దృఢమగునని చెప్పునట్టియు, బుధే-జ్ఞానియందు, రాగాదయః- రాగాదులు, సంత్వితి-ఉండుగాకయని చెప్పునట్టి, శాస్త్రద్వయం-శాస్త్రద్వయము, అవిరోధతః-అవిరోధముగా, సార్థం-అర్థవంతమగును.

తా. ఈ పూర్వోక్తప్రకారము జ్ఞానికిదృఢరాగము లేకపోవుచుండగా, వృక్షమువంటిదేహముంమగల, తొఱ్ఱవంటి చిత్తసంచారభూములయందు,అగ్నివంటి దృఢరాగమున్నయెడల,పచ్చికవంటి తత్వజ్ఞానముగలుగదని,శ్లో॥ రాగోలింగమబోధస్యచిత్తవ్యాయామభూమిషు। కుతశ్శాద్వలతాతస్య యస్యాగ్నిః కోటరేతరోః॥ అనెడి శాస్త్రము, జ్ఞానికి రాగముండరాదని, రాగమునునిషేధించెడి, ఈశాస్త్రంబును, మరియు, తత్వజ్ఞానము గలుగుటచేత శాస్త్రార్థమంతయు సమాప్తమగుటవల్ల, రాగాదులు విశేషముగానున్నను, నీకు ముక్తి గలుగుననియు, ఆరాగాదులచేత మోక్షముబాధింపబడదని ఆ తత్వజ్ఞానికిరాగము నంగీకరించెడి, శ్లో॥ శాస్త్రార్థస్యసమాప్తత్వాన్ముక్తిస్స్యాత్తావతాపితే। రాగాదయస్సంతుకామం నతద్భావోపరాధ్యతే॥ అనెడి శాస్త్రంబును, అవిరోధముగా అర్థవంతములాయెను. అనగా, జ్ఞానికి రాగము గూడదని చెప్పెడి రాగనిషేధపరశాస్త్రము, దృఢరాగత్వమును జెప్పుటచేతను, అజ్ఞానికే, రాగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము నంగీకరించెడిశాస్త్రము, రాగాభాసత్వమును చెప్పుటచేతను, ఈ రెండు శాస్త్రములును అర్థవంతములాయెనని యభిప్రాయము. రాగలక్షణములేకనే, రాగమువలె తోచబడుచుండెడి విషయాసక్తి, రాగాభాసమని చెప్పబడును.

అవ. ఇట్లు, శ్రు॥ కిమిచ్ఛన్॥ అనెడి మంత్రాంశాభిప్రాయమునువర్ణించి, శ్రు॥ కస్యకామాయ॥ అనెడిమంత్రాంశాభిప్రాయము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ జగన్మిథ్యాత్వవత్స్వాత్మాసంగత్వస్యసమీక్షణాత్।
కస్యకామాయేతివచోభోక్త్రభావవివక్షయా॥ ౯౨.

టీ. జగన్మిథ్యాత్వవత్=జగత్ - ప్రపంచముయొక్క, మిథ్యాత్వవత్-మిథ్యాత్వమువలె, స్వాత్మాసంగత్వస్య = స్వాత్మ- తనస్వరూపముయొక్క, అసంగత్వస్య-అసంగత్వమును, సమీక్షణాత్-చూచుటవల్ల, భోక్త్రభావవివక్షయా=భోక్తృ-భోక్తయొక్క, అభావవివక్షయా- అభావవివక్షచేత, కస్యకామాయేతి - ఏభోక్తయొక్క ప్రీతికొరకనెడి, వచః - వాక్యము ప్రవర్తించుచున్నది.

తా. మరియు, జగన్మిథ్యాత్వబోధచేత వాస్తవకామ్యము లేదనెడి వివక్షవలన, శ్రుతిచేత,ఏమిఫలమిచ్ఛయించుచుననెడి యర్థముగల, శ్రు॥ కిమిచ్ఛన్॥ అనెడి వాక్యముచెప్పబడినట్లు, ఆత్మయొక్క అసంగత్వబోధచేత వాస్తవమగు భోక్తృత్వము ఆత్మకులేదనెడి వివక్షవల్ల, ఏభోక్తయొక్క ప్రీతికొరకనెడి యర్థముగల, శ్రు॥ కస్యకామాయ। అనెడివాక్యముశ్రుతిచేత జెప్పబడెననితెలియవలెను. కామింపదగిన స్త్రీపుష్పాది విషయము, కామ్యమనిచెప్పబడును.

అవ. ఆత్మకు భోక్తృత్వమున్నయెడల, ఆభోక్తృత్వముకూడదనిచెప్పవలయునేగాని, ఆత్మ, అసంగుడగుటవల్ల, అతనికి భోక్తృత్వమే లేనప్పుడు, ఆయాత్మకు భోక్తృత్వమును నిషేధించుటచేత ప్రయోజనములేదని శంకించుకొని, ఆభోక్తృత్వము, స్వానుభవసిద్ధమగుటవల్ల,ఇట్లు శంకింపరాదనిదలచి, ఆ భోక్తృత్వమును ప్రతిపాదించెడి శ్రుత్యర్థము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ పతిజాయాదికంసర్వంతత్తద్భోగాయనేచ్ఛతి।
కింత్వాత్మభోగార్థమితిశ్రుతావుద్ఘోషితంబహు॥ ౯౩.

టీ. పతిజాయాదికం= పతి-భర్తయు, జాయా - భార్యయు, ఆదికం-మొదలుగాగల, సర్వం-సకలజగంబును, తత్తద్భోగాయ=తత్తత్ - ఆయాపతిభార్యాదిభోగ్యప్రపంచముయొక్క, భోగాయ- భోగముకొరకు, నేచ్ఛతి-ఇచ్ఛయించుచుండలేదు. కింతు-మరియేమనగా, ఆత్మభోగార్థమితి=ఆత్మ-ఆత్మ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక్క, భోగార్థమితి- భోగముకొరకిచ్ఛయింపబడుచున్నదని, శ్రుతౌ-శ్రుతి యందు, బహు-బహువిధముగా, ఉద్ఘోషితం- ఘోషింపబడెను.

తా. ఓమైత్రేయా, భర్తచేతకామింపబడెడిభార్య, ఆభర్తయొక్క ప్రయోజనముకొరకే కామింపబడుచున్నదిగాని భార్యయొక్క ప్రయోజనముకొరకు భర్తచేత కామింపబడుచుండలేదని చెప్పెడి, శ్రు॥ నవా అరేపత్యుఃకామాయపతిః ప్రియోభవతి॥ అనెడివాక్యము మొదలుకొని, ఆత్మయొక్క భోగముకొరకు సర్వజగంబును, ప్రీతివిషయత్వమును బొందుచున్నదనిచెప్పెడి శ్రు॥ ఆత్మనస్తుకామాయసర్వంప్రియంభవతి॥ అనెడి వాక్యమంత్యముగాగల గ్రంథసందర్భముచేత భర్తృభార్యాది ప్రపంచమంతయు, ఆత్మకు భోగసాధనమని ప్రతిపాదింపబడెను. కనుక, ఆత్మకు భోక్తృత్వప్రసక్తి గలిగెనని తెలియవలెను.

అవ. ఇట్లు ఆత్మకు భోక్తృత్వమునుజూపి, ఆభోక్తృత్వము వాస్తవమందులేదని దెలుపుటకొరకు, భోక్తనుగురించి వికల్పించుచున్నాడు.

శ్లో॥ కింకూటస్థశ్చిదాభాసోయథాకించోభయాత్మకః।
భోక్తాతత్రనకూటస్థోఽసంగత్వాద్భోక్తృతాంవ్రజేత్॥౧౯౪.

టీ. భోక్తా-కర్మఫలమననుభవించెడివాడు, కూటస్థః-కేవలప్రత్యగాత్మయగునో, కిం-లేక, చిదాభాసః-కేవలచిదాభాసుడగునో, యథాకించ-లేక, ఉభయాత్మకః-కూటస్థసహిత చిదాభాసుడగునోయని వికల్పార్థకము. తత్ర-ఆమూడుపక్షములయందు, కూటస్థః-కేవలప్రత్యగాత్మ, అసంగత్వాత్-అసంగత్వమువల్ల, అనగా నసంగుడగుటచేననుట. భోక్తృతాం - భోక్తృత్వమును, నవ్రజేత్-పొందడు.

తా. ప్ర. అయితే, ౧. కేవలకూటస్థుడు భోక్తయగునో, లేక, ౨. కేవలచిదాభాసుడు భోక్తయగునో, లేక, ౩. కూటస్థసహితచిదాభాసుడు భోక్తయగునోచెప్పుము?. ఉ. ఆ మూడుపక్షములయందు, కేవలకూటస్థుడు, అసంగత్వముచేత నిర్వికారుడగుటవలన, భోక్తృత్వమును బొందడు. గనుక, కేవలకూటస్థుడు భోక్తయగుననెడి ప్రథమపక్షముగూడదు.

శ్లో॥ సుఖదుఃఖాభిమానాఖ్యో వికారోభోగఉచ్యతే।
కూటస్థశ్చవికారీచేత్యేతన్నవ్యాహతంకథం॥ ౧౯౫.

టీ. సుఖదుఃఖాభిమానాఖ్యః=సుఖ - సుఖమందును, దుఃఖ- దుఃఖమందును, అభిమానాఖ్యః-అభిమానలక్షణముగల, వికారః-వికారము, భోగః-భోగమని, ఉచ్యతే-చెప్పబడుచున్నది. కూటస్థశ్చ-నిర్వికారియు, వికారీచ- వికారి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యనగుననెడి, ఏతత్-ఈవాక్యము, కథం-ఎట్లు, నవ్యాహతం-విరోధత్వమును బొందదు. అనగా విరోధమగుననుట.

తా. ప్ర. అయితే,కూటస్థునకు, అసంగత్వభోక్తృత్వములు రెండును గలుగుగాక. అందుచే దోషమేమి?. ఉ. సుఖిత్వ దుఃఖిత్వాభిమాన లక్షణము గల వికారము భోగమగును. అట్టిభోగము, అసంగుడగు కూటస్థునకుగలదని చెప్పరాదు. కూటస్థుడనగా, నిర్వికారుడగును. అట్టినిర్వికారుడు, వికారియగు ననెడి, ఈ వాక్యము విరోధమగును. అనగా, ఒకవస్తువునందు, నిర్వికారిత్వ వికారిత్వములకు రెంటికిని, స్థితిగలుగదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, రెండవపక్షంబునుగూడదని చెప్పుచున్నాడు.

శ్లో॥ వికారిబుద్ధ్యధీనత్వాదాభాసో౽వికృతావపి।
నిరధిష్ఠానవిభ్రాంతిః కేవలానహితిష్ఠతి॥ ౧౯౬.

టీ. ఆభాసః-చిదాభాసుడు, వికారిబుద్ధ్యధీనత్వాత్=వికారి-వికారరూపముగల, బుద్ధి-బుద్ధియనెడియుపాధికి, అధీనత్వాత్-అధీనత్వమువలన, అనగా నధీనుడగుటచేననుట. (స్వస్మిన్) తనయందు, వికృతావపి - వికారముగలిగనను, కేవలా-కేవలమగు, నిరధిష్ఠానవిభ్రాంతిః = నిరధిష్ఠాన - ఆధారత్వములేని, విభ్రాంతిః-ఆరోపము, అనగావిభ్రమమనుట, నహితిష్ఠతి- స్థితినిబొందదుగదా.

తా. ప్ర. అయితే, వికారియగు చిదాభాసునకు భోక్తృత్వమునుచెప్పరాదాయేమి?. ఉ. ఆచిదాభాసుడు, వికారియగుబుద్ధిని ఉపాధిగాగలిగియుండుటచేత, తనయందు వికారము సంభవించినను, ఆచిదాభాసుడు కల్పితుడగుటచేత, తనకు ఆధారభూతుడగు కూటస్థునివిడచి, స్వాతంత్ర్యస్థితిసంభవింపమివలన, కేవలచిదాభాసునకును భోక్తృత్వము సంభవింపదని యభిప్రాయము. కనుక, కేవలచిదాభాసుడు భోక్తయగునెడి రెండవపక్షంబునుగూడదని తెలియవలెను.

అవ. అందువలన, మూడవపక్షము యుక్తమగునని, ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఉభయాత్మకఏవాతో లోకేభోక్తానిగద్యతే
తాదృగాత్మానమారభ్యకూటస్థశ్శేషితశ్శ్రుతౌ॥ ౧౯౭.

టీ. అతః-ఆకారణమువలన, లోకే-లోకమందు, అనగా వ్యవహారదశయందనుట. ఉభయాత్మకఏవ-కూటస్థసహితచిదాభాసుడే, భోక్తా- కర్మఫలమనుభవించెడివాడగునని, నిగద్యతే-చెప్పబడుచున్నాడు. శ్రుతౌ- బృహదారణ్యకాదిశ్రుతియందు. తాదృక్-అటువంటి, ఆత్మానం - భోక్తను, ఆరభ్య- చెప్పుటకుప్రారంభించి, కూటస్థః-ప్రత్యగాత్మ, శేషితః-శేషింపబడెను. అన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గా బుద్ధ్యాద్యనాత్మ నిరసనముచేత శేషింపబడెననుట.

తా. ఏకారణముచేత కూటస్థచిదాభాసులలో నొక్కొకనికి బ్రహ్మైకము గా, భోక్తృత్వముసంభవింపదో, ఆకారణముచేత, కూటస్థసహిత చిదాభాసుడే, వ్యవహారదశయందు భోక్తయని చెప్పబడుచున్నాడు. అనగా పరమార్థ దశయందు కూటస్థసహిత చిదాభాసత్వమే ఘటింపదని యభిప్రాయము. ప్ర. అయితే, ఈపురుషుడసంగుడేననెడి యర్థముగల, శ్రు। అసంగోహ్యాయంపురుషః॥ అనెడి ఇత్యాదివాక్యమందు, అసంగుడైన కూటస్థునకే, ఆయీయాత్మ, విజ్ఞానమయముగానున్నాడనెడి యర్థముగల, శ్రు ॥ యోయంవిజ్ఞానమయఃప్రాణేషు॥ అనెడి యిత్యాదివాక్యమందు బుద్ధిసాక్షిత్వంబును వినబడుటవలన,కూటస్థసహిత చిదాభాసత్వమనెడి భోక్తృస్వరూపంబును పారమార్థికమేయగునని చెప్పవలయుగాని, లోకవ్యవహారమాత్రముచే సిద్ధించుచున్నదని యెట్లు చెప్పవచ్చును?. భోక్తృస్వరూపము పారమార్థికమగుననెడి విషయమై, శ్రుతి యొక్క అభిప్రాయములేమిచేత,ఇట్లుచెప్పరాదు. ప్ర. అయితే,శ్రుతియొక్క తాత్పర్యమేమి?. ఉ. బృహదారణ్యకాది శ్రుతియందు బుద్ధ్యుపాధికుడగు భోక్తనుచెప్పుటకు ప్రారంభించి, బుద్ధ్యాదులకు అనాత్మత్వమును నిశ్చయించుటచేత, బుద్ధ్యాదికల్పనకు ఆధారభూతుడగు చిద్రూపకూటస్థుడు,శేషింపబడెను.

అవ. ఆవిషయమందు, బృహదారణ్యక వాక్యార్థమును, సంక్షేపించి యిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ ఆత్మాకతమఇత్యుక్తేయాజ్ఞవల్క్యోవిబోధయన్।
విజ్ఞానమయమారభ్యాసంగతంపర్యశేషయత్॥ ౧౯౮.

టీ. ఆత్మా-కూటస్థుడు, కతమఇతి-ఎవ్వడని, ఉక్తేసతి-జనకునిచేనడుగబడుచుండగా, యాజ్ఞవల్క్యః - యాజ్ఞవల్క్యుడు, విబోధయన్ - ఆజనకుని బోధించుచు, విజ్ఞానమయం-విజ్ఞానమయమును, ఆరభ్య - చెప్పుటకు ప్రారంభించి, అసంగం-అసంగుడగు, తం-ఆకూటస్థుని, పర్యశేషయత్-శేషింపజేసినవాడాయెను.

తా. శిష్యుడైన జనకునిచేత, ఆత్మయనగానెవ్వడని, శ్రు॥ కతమఆత్మ॥ అనెడి వాక్యముచే నిట్లు ఆత్మ, అడుగబడుచుండగా, గురుడైన యాజ్ఞవల్క్యుడు, ఆ యాత్మను బోధించుచు,శ్రు॥ యోయంవిజ్ఞానమయఃప్రాణేషు॥ అనెడి యిత్యాదివాక్యముచేత విజ్ఞానమయుని జెప్పుటకు ప్రారంభించి ఈపురుషు డసంగుడనెడి యర్థముగల, శ్రు॥ అసంగోహ్యాయంపురుషః॥ అనెడివాక్యముచేత అసంగుడైన కూటస్థాత్మను శేషింపజేసినవాడాయెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఈప్రకారము బృహదారణ్యకశ్రుతియందు అసంగాత్మ పరిశేష ప్రకారమునుజూపి, ఐతరేయాదిశ్రుతులయందును, ఆయసంగాత్మ పరిశేష ప్రకారము నిప్పుడు చూపుచున్నాడు.

శ్లో॥ కోయమాత్మేత్యేవమాదౌసర్వత్రాత్మావిచారతః।
ఉభయాత్మకమారభ్యకూటస్థశ్శేష్యతేశ్రుతౌ॥ ౧౯౯.

టీ. అయం-ఈ, ఆత్మా-ఆత్మ, కః-ఎవడనెడి, ఇత్యాదౌ-ఇత్యాదివాక్యమందు, సర్వత్ర-అంతటను, ఏవం-ఈప్రకారము, విచారతః- విచారణవలన, శ్రుతౌ-శ్రుతియందు, ఉభయాత్మకం- కూటస్థసహితచిదాభాసుని, అనగా భోక్తననుట. ఆరభ్య-తెలుపుటకుప్రారంభించి, ఆత్మా-ప్రత్యగాత్మయగు, కూటస్థః-నిర్వికారుడు, శేష్యతే - శేషింపబడుచున్నాడు.

తా. ఈ యాత్మ, ఎవడనియు, మేము ఉపాసించెదమనియు, ఆయాత్మ, ఎటువంటివాడనెడి యర్థముగల, శ్రు॥ కోయమాత్మేతి, వయముపాస్మహే, కతరస్సఆత్మేతి। అనెడియిత్యాది ఐతరేయశ్రుతివాక్యమందు, ఆత్మవిచారముచేత, అంతఃకరణోపాధికుడగు భోక్తను చెప్పుటకుప్రారంభించి, ప్రజ్ఞానమాత్రస్వరూపుడగు కూటస్థుడు శేషింపబడెను. ఈప్రకారమే, ఇతరశ్రుతులయందును చెప్పబడెనని తెలిసికొనవలెను. ఇట్లు యుక్తిశ్రుతులచేత ఆలోచించగా కూటస్థసహితచిదాభాసరూపుడగు భోక్త, మిథ్యారూపుడనియు పారమార్థికుడగు అసంగకూటస్థునకు భోక్తృత్వములేదనియు, స్పష్టముగాదెలియబడుచున్నది. కనుక, పరమార్థమందు భోక్తగలడనెడి విషయమై శ్రుతియొక్క అభిప్రాయముగాదని తెలియవలెను.

శ్లో॥ కూటస్థసత్యతాంస్వస్మిన్నధ్యస్యాత్మావివేకతః।
తాత్వికీంభోక్తృతాంమత్వానకదాచిజ్జిహాసతి॥ ౨౦౦.

టీ. ఆత్మా-లోకప్రసిద్ధుడగుభోక్త, అవివేకతః-విభజనలక్షణజ్ఞానశూన్యత్వమువలన, కూటస్థసత్యతాం = కూటస్థ - కూటస్థనిష్ఠమగు, సత్యతాం-సత్యత్వమును, స్వస్మిన్-తనయందు,అధ్యస్య-ఆరోపించుకొని, భోక్తృతాం-తనయందుగల భోక్తృత్వమును, తాత్వికీం-సత్యమైనదానినిగా, మత్వా-తలచి, కదాచిత్- ఎప్పటికిని, నజిహాసతి - విడుచుటకు సమ్మతింపడు.

తా. ప్ర. అయితే, ఈ చెప్పబడినప్రకారము,భోక్త, మిథ్యయగుచుండగా, ప్రాణులకు, ఆభోక్తయందు సత్యత్వబుద్ధి, గలుగుటకు కారణమేమి?. ఉ. లోకప్రసిద్ధుడగుభోక్త, తాను కూటస్థునికంటె నన్యుడనెడి విభజనలక్షణజ్ఞానము తనకులేమిచేత, కూటస్థునియందుగల సత్యత్వమును తనయందారోపిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుకొని, తద్ద్వారా, తనయందుగల భోక్తృత్వమును సత్యముగాదలచి, భోగము నెప్పటికిని విడుచుటకు సమ్మతింపదు. గనుక, భోక్తయందు సత్యత్వబుద్ధి గలుగుటకు అజ్ఞానమే కారణమగును.

శ్లో॥ భోక్తాస్వస్యైవభోగాయపతిజాయాదిమిచ్ఛతి।
ఏషలౌకకవృత్తాంతశ్శ్రుత్యాసమ్యగనూదితః॥ ౨౦౧.

టీ. భోక్తా- లోకప్రసిద్ధుడగుభోక్త, స్వస్యైవ - తనయొక్కయే, భోగాయ-భోగముకొరకు, పతిజాయాదిం=పతి-భర్తయు, జాయాదిం - భార్య మొదలుగాగలప్రపంచమును, ఇచ్ఛతి-కోరుచున్నాడు. లౌకికవృత్తాంతః-లౌకికవృత్తాంతమగు, ఏషః--ఈవ్యవహారము, శ్రుత్యా-శ్రుతిచేత, సమ్యక్ - లెస్సగా, అనూదితః - చెప్పబడెను.

తా. ప్ర. అయితే, ఆత్మయొక్కభోగముకొరకు భర్తృభార్యాదిప్రపంచమంతయు ప్రీతివిషయత్వమును బొందుచున్నదని, శ్రు॥ ఆత్మనస్తుకామాయసర్వంప్రియంభవతి॥ అనెడి శ్రుతిచేత, భోగ్యపదార్థమునకు,ఆత్మశేషత్వమెట్లుచెప్పబడెను?. ఉ. లోకమందు,ఏభోక్తగలడో,ఆభోక్త,తనయొక్క భోగముకొరకే, భర్తృభార్యాది భోగసాధనప్రపంచమును కోరుచున్నాడనేడి, ఈ లౌకికవృత్తాంతము శ్రుతిచేత లెస్సగా చెప్పబడెనుగాని, మరియొక యర్థము శ్రుతిచేత ప్రతిపాదింపబడలేదు. అనగా భోగ్యప్రపంచమంతయు కూటస్థసహిత చిదాభాసరూపభోక్తకు శేషమని చెప్పబడెనేగాని, కూటస్థాత్మకు శేషముగా ప్రతిపాదింపబడలేదని యభిప్రాయము.

శ్లో॥ భోగ్యానాంభోక్తృశేషత్వాన్మాభోగ్యేష్వనురజ్యతాం।
భోక్తర్యేవప్రధానేఽతోఽనురాగంతంవిధిత్సతి॥ ౨౦౨.

టీ. భోగ్యానాం- భర్తృభార్యాది భోగ్యపదార్థములు, భోక్తృశేషత్వాత్=భోక్తృ-భోక్తకు, అనగాతనకనుట. శేషత్వాత్- భోగసాధములగుటవలన, భోగ్యేషు-భర్తృభార్యాదులయందు, మానురజ్యతాం- అనురాగము జేయబడకుండుగాక. అనగా ననురాగము జేయదగదనుట. అతః - ఆకారణమువల్ల ప్రధానే- ప్రధానభూతుడగు, భోక్తర్యేవ - భోక్తయగు తనయందే, తం-ఆ, అనురాగం-అనురాగమును, విధిత్సతి-విధించుట కిచ్ఛయించుచున్నది.

తా. ప్ర. అయితే, లౌకికవృత్తాంతము, శ్రుతిచేజెప్పబడుటకు గారణమేమి?. ఉ. భర్తృభార్యాది భోగ్యప్రపంచమంతయు, భోక్తయగు తనకు భోగసాధనమగుటవలన, భోగ్యములయందు అనురాగము జేయదగదు. మరియేమనగా, ప్రధానభూతుడగు భోక్తయగు తనయందే, ప్రేమను విధించుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొరకు, ఈలౌకికవృత్తాంతము శ్రుతిచే జెప్పబడెనని తెలియవలెను.

అవ. భోగ్యములయందు ప్రేమనువిడుచుటయందును, ఆత్మయందుప్రేమ జేయదగినదగుననుటయందును, దృష్టాంతభావముగా, ఈశ్వరునియందు ప్రేమప్రార్థనాపూర్వకమగు పురాణవచనము నిప్పడుదాహరించుచున్నాడు.

శ్లో॥ యాంప్రీతిరవివేకానాంవిషయేష్వనపాయినీ।

త్వామనుస్మరతస్సామేహృదయాన్మాపసర్పతు॥ ౨౦౩.

టీ. హేమాప- ఓవిష్ణుదేవా, అవివేకానాం-ఆత్మజ్ఞానశూన్యులకు, విషయేషు-స్త్రీపుష్పాదివిషయములయందు, అనపాయినీ-దృఢమగు, యా- ఏ, ప్రీతిః-ప్రీతిగలదో, సా-ఆప్రీతి, త్వాం-నిన్ను, అనుస్మరతః- సర్వదా చింతించెడి, మే-నాయొక్క, హృదయాత్-మనస్సునుంచి, సర్పతు - తొలగిపోవుగాక. అనగా నామనంబు, విషయములయందాసక్తిని విడిపించి, నీయందే సర్వదాస్థితినిపొందవలెననుట. ఈశ్లోకమునకు మరియొక యర్థంబునుంగలదు. అదియెట్లనగా, అవివేకానాం-ఆత్మజ్ఞానశూన్యులకు, విషయేషు-విషయములయందు,అనపాయినీ- దృఢమైన, యా-ఎటువంటి, ప్రీతిః-ప్రీతిగలదో, సా - అటువంటి ప్రీతి, అనగా నీవిషయమందు నాకుగలప్రీతియనుట. త్వాం - నిన్ను, అనుస్మరతః-సర్వదాచింతించుచుండెడి, మే-నాయొక్క, హృదయాత్-మనంబునుంచి, మాపసర్పతు-తొలగిపోకుండుగాక. అనగా సర్వదా ఉండవలెననుట.

తా. ఓవిష్ణుదేవా, ఆత్మజ్ఞానశూన్యులకు స్త్రీపుష్పాది విషయములయందు, దృఢమైన, యేప్రీతిగలదో, ఆప్రీతి, నిన్నుసర్వదాచింతించెడి నాయొక్క మనంబునుంచి, తొలగిపోవలయును. అనగా నామనంబు విషయాసక్తిని విడిపించి, నీయందే సర్వదా స్థితినిబొందియుండవలెనని తాత్పర్యము.

ఈ శ్లోకమునకు మరియొక తాత్పర్యమేమనగా, ఆత్మజ్ఞానశూన్యులకు విషయములయందు దృఢమైన యెటువంటిప్రీతిగలదో, నీయందునాకుగల అటువంటిప్రీతి, నిన్ను సర్వదాచింతించెడి, నామనస్సునందు సర్వదా, ఉండవలెనని యభిప్రాయము. ఈపురాణవాక్యము, భోగ్యప్రపంచమందు ప్రీతినివిడిపించి, ఈశ్వరునియందు ప్రీతినుంచవలెనని విధించుచున్నది.

శ్లో॥ ఇతిన్యాయేనసర్వస్మాద్భోగ్యజాతాద్విరక్తధీః।

ఉపసంహృత్యతాంప్రీతింభోక్తర్యేవబుభుత్సతే॥ ౨౦౪.

టీ. ఇతి - ఈ చెప్పబడిన, న్యాయేన - పురాణన్యాయముచేత, సర్వస్మాత్- సకలమగు, భోగ్యజాతాత్-భర్తృభార్యాదిలక్షణమువలన,విరక్తధీః-వైరాగ్యబుద్ధిగలవాడు, తాం- ఆ భోగ్యగోచరమగు, ప్రీతిం-అనురాగమును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భోక్తరి- భోక్తయగు, తనయందు, ఉపసంహృత్యైవ - ఉపసంహరించియే, (ఆత్మానం) కూటస్థాత్మను, బుభుత్సతే-తెలియుటకిచ్ఛయించుచున్నాడు.

తా. ప్ర. సరి. ఇట్లు పురాణమునందు చెప్పబడుటచేత ప్రకృతమందు లాభమేమి?. ఉ. ఈ చెప్పబడిన పురాణన్యాయముచేత, భర్తృభార్యాదిలక్షణముగల భోగ్యప్రపంచమందు విరక్తబుద్ధిగలవాడు, భర్తృభార్యాది లక్షణముగల భోగ్యపదార్థరాశినుంచి, భోగ్యగోచరప్రీతిని మరలించి, ఆప్రీతినంతయు, భోక్తయగు తనయందుంచుకొని, కూటస్థాత్మనెరుగుట కిచ్ఛయించుచున్నాడు.

అవ. ఇట్లు ఆత్మయందు ప్రేమోపసంహారము జేయుటచేత గలిగెడిఫలితమును దృష్టాంతసహితముగా నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ స్రక్చందనవధూవస్త్రసువర్ణాదిషు పామరః।
అప్రమత్తోయథాతద్వన్నప్రమాద్యేద్భోక్తరి॥ ౨౦౫.

టీ. పామరః-తత్వజ్ఞానరహితుడు, స్రక్చందనవధూవస్త్రసువర్ణాదిషు= స్రక్-పుష్పములయందును, చందన - శ్రీచందనమందును, వధూ - స్త్రీలయందును, వస్త్ర-వస్త్రములయందును, సువర్ణాదిషు - సువర్ణాదులయందు, యథా- ఏప్రకారము, అప్రమత్తః-సావధానుడగునో,తద్వత్- ఆప్రకారము, భోక్తరి- భోక్తయగు ఆత్మయందు నప్రమాద్యతి - ప్రమాదమునుజేయడు. అనగా నాయాత్మ చింతచేతనే యుండుననుట.

తా. మరియు, పామరుడు పుష్పచందన స్త్రీ వస్త్రసువర్ణాదివిషయసుఖములను బొందుటకు, ఆవిషయములను సర్వదాచింతించుచున్నట్లు, ముముక్షువు, భోక్తయగు ఆత్మవిషయమందు పొరబాటునుబొందక, సర్వదా, ఆయాత్మను చింతించుచుండును.

అవ. ప్రమాదమును జేయకపోవుటనే, బహుదృష్టాంతములచేత స్పష్టీకరించుచున్నాడు.

శ్లో॥ కావ్యనాటకతర్కాదిమభ్యస్యతెనిరంతరం।
విజిగీషుర్యథాతద్వన్ముముక్షుస్స్వంవిచారయేత్॥ ౨౦౬.

టీ. విజిగీషుః-ప్రతివాదులను జయించుట కిచ్ఛయించినవాడు, నిరంతరం-సర్వదా-కావ్యనాటకతర్కాదిం=కావ్య-కావ్యములను, నాటక - నాటకములను, తర్కాదిం-తర్కవ్యాకరణాదికమును, యథా - ఏప్రకారము, అభ్యస్యతి-అభ్యాసము జేయుచున్నాడో, తద్వత్-ఆప్రకారము, ముముక్షుః-ముముక్షువు, స్వం-తనను, అనగానాత్మననుట. విచారయేత్-విచారించును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. మరియు, ప్రతివాదులను జయించుటకు ఇచ్ఛయించినవాడు, కావ్యనాటక తర్క వ్యాకరణాదులను, సర్వదా, అభ్యసించినట్లు, ముముక్షువును, తానైన ఆత్మను, సర్వదా విచారించుచున్నాడు.

శ్లో॥ జపయాగోపాసనాదికురుతేశ్రద్ధయాయథా।

స్వర్గాదివాంఛయాతద్వచ్ఛ్రద్ధధ్యాత్స్వేమముముక్షయా॥ ౨౦౭.

టీ. (వైదికః) వైదికుడు, స్వర్గాదివాంఛయా=స్వర్గాది-స్వర్గాదిలోకవిషయమగు, వాంఛయా-కోరికచేత, శ్రద్ధయా-శ్రద్ధతోటి యథా- ఏప్రకారము, జపయాగోపాసనాది=జప-మంత్రజపంబును, యాగ - యజ్ఞంబులను, ఉపాసనాది-ఉపాసనాదికమును, కురుతే-చేయుచున్నాడో; తద్వత్-ఆప్రకారము, (ముముక్షురపి) ముముక్షువును, ముముక్షయా - మోక్షేచ్ఛచేత, స్వే-శ్రుతిప్రోక్తఆత్మయగు తనవిషయమై, శ్రద్ధధ్యాత్- శ్రద్ధను జేయును. అనగా నమ్మికగలవాడగుననుట.

తా. మరియు, స్వర్గలోకబ్రహ్మలోకాదులను గోరెడివైదికుడు,ఆయాలోకవిషయకవాంఛచేత, శ్రద్ధాపూర్వకముగా జపయజ్ఞోపాసనాదికమును చేసినట్లు, ముముక్షువును, మోక్షేచ్ఛచేత, శ్రుతిప్రోక్తమగు ఆత్మయైన తనయందు విశ్వాసముగలవాడగును.

శ్లో॥ చిత్తైకాగ్ర్యంయథాయోగీమహాయాసేనసాధయేత్।

అణిమాదిప్రేప్సయైవం వివిచ్యాత్స్వంముముక్షయా॥ ౨౦౮.

టీ. యోగీ- యోగాభ్యాసము జేయువాడు, అణిమాదిప్రేప్సయా= అణిమాది-అణిమాద్యష్టైశ్వర్యములయొక్క, ప్రేప్సయా - లాభేచ్ఛచేత, మహాయాసేన - అధికాయాసముతోటి. చిత్తైకాగ్ర్యం - చిత్తైకాగ్ర్యమును, యథా-ఏప్రకారము, సాధయేత్ - సంపాదించునో, ఏవం - ఈప్రకారము, (ముముక్షురపి) ముముక్షువును, ముముక్షయా-మోక్షేచ్ఛతోటి, స్వం-తానైన ఆత్మను, వివిచ్యాత్-దేహాదులవల్ల విభజించి యెరుగవలెను.

తా. మరియు, యోగాభ్యాసము జేయువాడు, అణిమాద్యష్టైశ్వర్యలాభేచ్ఛచేత, మహాయాసముతోటి, ఏప్రకారముగా చిత్తైకాగ్ర్యమును సంపాదించునో, ఆప్రకారము, ఈ ముముక్షువును, ఆత్మయగుతనను, సర్వదా, దేహాదులవల్ల విభజించి యెరుగును.

శ్లో॥ కౌశలానివివర్ధంతేతేషామభ్యాసపాటవాత్।

యథాతద్వద్వివేకోస్యాప్యభ్యాసాద్విశదాయతే॥ ౨౦౯.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. తేషాం- ఆకావ్యాద్యభ్యాసముగలవారలకు, అభ్యాసపాటవాత్= అభ్యాస-అభ్యాసముయొక్క, పాటవాత్-సామర్థ్యతవల్ల, కౌశలాని - కౌశలములు, యథా-ఏప్రకారము; వివర్ధంతే-వృద్ధిబొందుచున్నవో, తద్వత్-ఆప్రకారము, అస్య-ఈముముక్షువునకు, వివేకోపి-వివేకంబును, అభ్యాసాత్- అభ్యాసమువల్ల, విశదాయతే - స్పష్టమగుచున్నది.

తా. ప్ర. అయితే, సర్వదా, కావ్యాదులనభ్యసించుటచేత, నీరికిఫలమేమి?. ఉ. ఆకావ్యాదులనభ్యసించెడివారికి, అభ్యాససామర్థ్యతవల్లఆయా విషయమందు బుద్ధికౌశలత్వము వృద్ధిబొందుచున్నది. ఈప్రకారమే, ఈ ముముక్షువునకును అభ్యాసమువల్ల, దేహాదులకంటె, ఆత్మభిన్నుడనెడి జ్ఞానము, స్పష్టత్వమును బొందుచున్నది.

అవ. ఈ యభ్యాసమువల్ల గలిగెడి వివేకఫలము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ వివిచ్యతాభోక్తృతత్వంజాగ్రదాదిష్వసంగతా।
అన్వయవ్యతిరేకాభ్యాంసాక్షిణ్యధ్యవసీయతే॥ ౨౧౦.

టీ. అన్వయవ్యతిరేకాభ్యాం - అన్వయవ్యతిరేకములచేత, భోక్తృతత్వం=భోక్తృ-భోక్తయొక్క, తత్వం-పారమార్థికస్వరూపమును, వివిచ్యతా-దేహేంద్రియాదిజడరాశివల్ల విభజించిభేదముగా నెరిగెడి పురుషునిచేత, జాగ్రదాదిషు-జాగ్రదాద్యవస్థలయందు, సాక్షిణి-సాక్షియందు, అసంగతా-అసంగత్వము, అధ్యవసీయతే - నిశ్చయింపబడుచున్నది.

తా. అన్వయవ్యతిరేకములచేత, భోక్తయొక్క పారమార్థికస్వరూపమును, దేహాదిజడపదార్థములవల్ల భిన్నముగా విభజించియెరిగెడి పురుషునిచేత, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలయందు సాక్షికి అసంగత్వము, నిశ్చయింపబడుచున్నది.

అవ. ఆయన్వయవ్యతిరేకముల నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ యత్రయద్దృశ్యతేద్రష్ట్రాజాగ్రత్స్వప్నసుషుప్తిషు।
తత్రైవతన్నేతరత్రేత్యనుభూతిర్హిసమ్మతా॥ ౨౧౧.

టీ. జాగ్రత్స్వప్నసుషుప్తిషు - జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలయందు, యత్ర-ఏస్థానమందు, యత్-ఏభోగ్యపదార్థము, ద్రష్ట్రా-సాక్షిచేత, దృశ్యతే- అనుభవింపబడుచున్నదో, (తత్) ఆ భోగ్యపదార్థము, తత్రైవ - ఆయవస్థయందే, (తిష్ఠతి) స్థితినిబొందుచున్నది. ఇతరత్ర - ఇతరావస్థయందు, నేతి-స్థితినిబొందలేదనెడి, అనుభూతిః - అనుభవము, సమ్మతా-సమ్మతమగును. హి- ఇది లోకప్రసిద్ధమగుననుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. జాగ్రదాద్యవస్థలయొక్క మధ్యమందు, ఏస్థానమందు స్థూలరహస్యానందరూపముగాగల, ఏదేభోగ్యము సాక్షిచేత ననుభవించబడుచున్నదో, ఆయాభోగ్యము, ఆయాయవస్థయందే యున్నదనియు, ఇతరావస్థయందు లేదనియెరుగుటయే, వ్యతిరేకమగును. ఆమూడవస్థలయందుగల, ఆయాభోగ్యమును అనుభవించెడి ద్రష్టయనెడి ఆత్మయో, సర్వావస్థలయందును స్వాభావికముగా వర్తించుచున్నాడని యెరుగుట, అన్వయమగును. ఈ చెప్పబడిన అనుభవము, సర్వసమ్మతమై ప్రసిద్ధముగానున్నది.

అవ. కేవలమనుభవమేగాక, ఈవిషయమై ఆగమంబును ప్రమాణముగానున్నదనెడి యభిప్రాయముతోటి, శ్రు॥ సయత్తత్రకించిత్పశ్యత్యనన్వాగతస్తేనభవత్యసంగోహ్యయంపురుషః, సవాఏషఏతస్మిన్ సంప్రసాదేరన్త్వాచరిత్వాదృష్ట్వైవపుణ్యంచాపుణ్యంచపునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి॥ అనెడి ఇత్యాదివాక్యద్వయార్థము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ సయత్తత్రేక్షతేకించిత్తేనానన్వాగతోభవేత్।
దృష్ట్వైవపుణ్యంపాపంచేత్యేవంశ్రుతిషుడిండిమః॥ ౨౧.

టీ. సః-ఆయాత్మ. తత్ర-ఆయవస్థయందు, యత్కించిత్-ఏ, కొంచెము భోగ్యపదార్థమును, ఈక్షతే-చూచుచున్నాడో, తేన- ఆదృశ్యములోటి, అనన్వాగతః - అనుసరించిపొందనివాడు, భవేత్-అగును. అనగా నాదృశ్యమును గ్రహించకనే అవస్థాంతరమును బొందుచున్నాడనుట. సః - ఆయాత్మ, పుణ్యం-పుణ్యఫలమగు సుఖంబును, పాపంచ-పాపఫలమగు దుఃఖంబును, దృష్ట్వైవేతి-చూచియే అవస్థాంతరమును బొందుచున్నాడని, అనగా నాయాయవస్థయందుగల సుఖదుఃఖములను గ్రహించకనే మరియొక యవస్థనుబొందుచున్నాడనుట. ఏవంచ-ఈప్రకారము, శ్రుతిషు-ఉపనిషత్తులయందు, డిండిమః-భేరీవాద్యమగును. అనగా వేదాంతసిద్ధాంతమనుట.

తా. ఆయాత్మ, ఏయవస్థయందు, ఏకొంచెముభోగ్యపదార్థమును చూచునో, ఆయాభోగ్యపదార్థమును స్వీకరించకనే, తానే మరియొక యవస్థను బొందుచున్నాడనియు, మఱియు, పుణ్యఫలమగు సుఖంబును, పాపఫలమగు దుఃఖంబును, స్వీకరించకనే మరియొక యవస్థనుబొందుచున్నాడని, పూర్వోక్త శ్రుతులు రెండును జెప్పుచున్నవని యభిప్రాయము.

అవ. భోక్తయొక్క పారమార్థికస్వరూపమును విభజించి దెలిపెడి శ్రుతుల నిప్పుడు పఠించుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యాదిప్రపంచంయత్ప్రకాశతే।
తద్బ్రహ్మాహమితిజ్ఞాత్వాసర్వబంధైఃప్రముచ్యతే॥ ౧౧౩.

టీ. యత్-ఏసత్యజ్ఞానానందలక్షణపరబ్రహ్మము, జాగ్రత్స్వప్నసుషుప్త్యాదిప్రపంచం=జాగ్రత్స్వప్నసుషుప్త్యాది - జాగ్రత్స్వప్నసుషుప్త్యాది లక్షణముగల, ప్రపంచం-జగంబును, ప్రకాశతే-ప్రకాశింపజేయుచున్నదో, తద్బ్రహ్మ-ఆబ్రహ్మము, అహమితి-నేనైతినని, జ్ఞాత్వా-ఎరిగి, అనగా శ్రుత్యనుభవములచే నిశ్చయించియనుట. సర్వబంధైః- సర్వప్రతిబంధములచేత, అనగా ప్రమాతృత్వ కర్తృత్వ భోక్తృత్వాదులచేననుట. ప్రముచ్యతే- నిశ్శేషముగా విడువబడుచున్నాడు.

తా. ఏసత్యజ్ఞానానందలక్షణపరబ్రహ్మము, సాక్షిరూపముగా నున్నదగుచు జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచమును ప్రకాశింపజేయుచున్నదో, ఆ బ్రహ్మమునేనైతిననియు, బుద్ధిచిదాభాసాదికము నేనుగానని, శ్రుత్యనుభవములచే నిశ్చయించి, ప్రమాతృత్వ కర్తృత్వభోక్తృత్వాది సర్వబంధములచేత, నిశ్శేషముగా విడువబడుచున్నాడని, ఈశ్రుతి జెప్పుచున్నది.

శ్లో॥ ఏకఏవాత్మామంతవ్యోజాగ్రత్స్వప్నసుషుప్తిషు।
స్థానత్రయవ్యతీతస్యపునర్జన్మనవిద్యతే॥ ౧౧౪.

టీ. జాగ్రత్స్వప్నసుషుప్తిషు = జాగ్రత్ - జాగరితావస్థయందును, స్వప్న-స్వప్నావస్థయందును, సుషుప్తిషు- సుషుప్త్యవస్థయందును, ఏకః-ఒక్కడగు, ఆత్మైవ-ఆత్మయే, మంతవ్యః-తెలియదగినవాడగును. స్థానత్రయవ్యతీతస్య=స్థానత్రయ - జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలకంటె, వ్యతీతస్య-అన్యత్వమునుబొందినయాత్మకు, పునః-మరల, జన్మ-జననము, నవిద్యతే-లేదు.

తా. మరియు, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందు, ఆత్మ, ఒక్కటియే దెలియదగినదగును. ఈప్రకారము వివేకజ్ఞానముచేత, అవస్థాత్రయమువల్లవిభజించి యెరిగిన ఆత్మకు పునర్జన్మములేదు. అనగా నీశరీరము పడిపోయినపిమ్మట, మరియొక శరీరప్రాప్తిలేదని, ఈశ్రుతి జెప్పుచున్నది.

శ్లో॥ త్రిషుధామసుయద్భోగ్యంభోక్తాభోగశ్చయద్భవేత్।
తేభ్యోవిలక్షణస్సాక్షీచిన్మాత్రోహంసదాశివః॥ ౧౧౫.

టీ. త్రిషు-మూడైన, ధామసు - అవస్థానములయందు, యత్- ఏ, భోగ్యం-భోగింపదగినపదార్థరాశియు, (యశ్చ)- ఏ, భోక్తా-భోక్తయు, యః-ఏ, భోగశ్చ-భోగంబును, అనగా నాయాయనుభవరూపమనుట. భవేత్ - కలదో, తేభ్యః-ఆస్థానాదులకంటె, విలక్షణః-అన్యుడైనట్టియు, చిన్మాత్రః-చిన్మా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుడైనట్టియు, సాక్షీ-సాక్షియైనట్టియు, సదాశివః=సదా-సర్వదా, అనగా నిర తిశయానందరూపత్వముచేత సర్వకాలములయందుననుట. శివః- శోభమాను డగు పరమాత్మ, అహం- నేను, (అస్మి) ఐతిని.

తా. మరియు,జాగ్రత్స్వప్నసుషుప్తులనెడి మూడవస్థలయందును క్రమ ముగా స్థూలరహస్యానందరూపమగు, ఏభోగ్యముగలదో, మరియు, విశ్వతైజ సప్రాజ్ఞరూపుడగు, ఏభోక్తగలడో, మరియు, ఆయాయనుభవ రూపమగు, ఏభోగముగలదో, వానియన్నిటికంటె, విలక్షణుడైనట్టి, ఏచిద్రూపుడగు సాక్షి గలడో, ఆసాక్షియగుపరమాత్మ, నిరతిశయానంద రూపత్వముచేత సర్వదా శోభాయమానుడగుననియు, ఆపరమాత్మయే, నేనైతినని, ముముక్షువగువాడు నిశ్చయించుకొనవలెనని, ఈశ్రుతిచెప్పుచున్నది.

శ్లో॥ ఏవంవివేచితేతత్త్వేవిజ్ఞానమయశబ్దితః।
చిదాభాసోవికారీయోభోక్తృత్వంతస్యశిష్యతే॥ ౨౧౯.

టీ. ఏవం-ఈప్రకారము, తత్త్వే-పరతత్త్వము, అనగా బరమాత్మస్వ రూపమనుట. వివేచితేసతి - విభజించియెరుగబడుచుండగా, విజ్ఞానమయశబ్ది తః=విజ్ఞానమయ-విజ్ఞానమయమనెడి, శబ్దితః-శబ్దమును బొందినట్టియు, అనగా విజ్ఞానమయకోశమనెడి పేరుగలవాడనుట. వికారీ- వికారియైనట్టి, యః - ఏ, చిదాభాసః-చిదాభాసుడుగలడో, తస్య-ఆచిదాభాసునకు, భోక్తృత్వం-భో క్తృభావము, శిష్యతే-శేషింపబడుచున్నది.

తా. ప్ర. అయితే, యిట్లు వివేకముచేత ఆత్మస్వరూప మసంగమని నిశ్చయింపబడుచుండగా, భోక్తృత్వమెవనికో చెప్పుడు?. ఉ. ఇట్లు పరమా త్మస్వరూపము బుద్ధిచేత విభజింపబడి,అసంగమని నిశ్చయింపబడుచుండగా, విజ్ఞానమయశబ్దముచేత జెప్పబడెడి, ఏచిదాభాసుడుగలడో, ఆ చిదాభాసుడు వికారియగుటచేత, అతనికేభోక్తృత్వము గలిగియున్నదని నిశ్చయింపవలెను.

అవ. అయితే, చిదాభాసునకు భోక్తృత్వముగలదని యంగీకరించినయె డల, భోక్తలేడనెడి వివక్షచేత, శ్రు॥ కస్యకామాయ ॥ అనెడి శ్రుతివాక్యము చెప్పుచున్నదని, పూర్వము, ౧౯-౨, శ్లోకమందు చెప్పబడిన యర్థమునకు విరో ధమగుననెడి యాక్షేపము వచ్చుచుండగా, శ్రు॥ కస్యకామాయ॥అనెడిశ్రుతి వాక్యమును పారమార్థికమందు భోక్తలేడని చెప్పుచున్నదానినిగా దలచి, భో క్తయగు చిదాభాసునకు మిథ్యాభావము నిప్పుడు సాధించుచున్నాడు.

శ్లో॥ మాయికోయంచిదాభాసశ్శ్రుతేరనుభవాదపి।
ఇంద్రజాలంజగత్ప్రోక్తంతదంతఃపాత్యయంయతః॥ ౨౨౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. జగత్-ప్రపంచము, ఇంద్రజాలం- ఇంద్రజాలముగా, అనగా ఇంద్రజాలమువంటిదిగానసుట. ప్రోక్తం-చెప్పబడును. యతః- ఏకారణమువల్ల, అయం-ఈచిదాభాసుడు, తదంతఃపాతీ=తత్-ఆమిథ్యాభూతమగు జగంబుయొక్క, అంతః-లోపటు, పాతి-పడియుండునో, అనగా జగంబునం దిమిడియుండునోయనుట. (అతః) ఆకారణమువల్ల, అయం-ఈ, చిదాభాసః- చిదాభాసుడు, శ్రుతేః-శ్రుతివల్లను, అనుభవాదపి-అనుభవమువల్లను, మాయికః-మిథ్యాస్వరూపుడగును.

తా. ఆమాయ, చిదాభాసరూపముచేత,జీవేశ్వరులనిద్దరిని సృష్టించుచున్నదని చెప్పెడి, శ్రు। జీవేశావాభాసేనకరోతి॥ అనెడి శ్రుతిచేతను,అనుభవముచేతను, ఈ రెంటిచేతను, ఈ చిదాభాసుడు, మిథ్యారూపుడగును. ప్ర. అయితే, ఆయనుభవమెద్ది?. ఉ. ద్రష్టృదర్శన దృశ్యములనెడి మాటియొక్క మధ్యమందు వర్తించుచున్నాడని యెరుగుటయే, అనుభవమగును. మరియు, ఈచిదాభాసుడు ఇంద్రజాలమువంటి మిథ్యాభూతమగు జగంబునందు, లోపటుబడియుండుటచేత, ఈ చిదాభాసునియొక్క మిథ్యాత్వము, ఆప్రకారమే విద్వాంసులచే ననుభవించబడుచున్నది. కనుక, ఏకారణముచేత, ఈచిదాభాసుడు జగంబులో నిమిడిపడియుండునో, ఆకారణముచేత, మిథ్యారూపుడగునని తెలియవలెను.

అవ. ఈ చిదాభాసునకు జగంబునకువలెనే, వినాశిత్వానుభవము గలిగియుండుటచేతను, మిథ్యాత్వమగునని యిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ విలయోప్యస్యసుప్త్యాదౌసాక్షిణావ్యానుభూయతే।
ఏతాదృశంస్వస్వభావంవివినక్తిపునఃపునః॥ ౨౧౮.

టీ. అస్య-ఈచిదాభాసునియొక్క, విలయోపి - విలయంబును, సుప్త్యాదౌ-సుషుప్తిమూర్ఛాద్యవస్థయందు, సాక్షిణా - సాక్షిచేత, అనుభూయతేపి-అనుభవించబడుచున్నదేను. ఏతాదృశం-ఇటువంటి, స్వస్వభావం = స్వ-తనయొక్క, స్వభావం-స్వరూపమును, పునఃపునః-మాటిమాటికి, వివినక్తి- కూటస్థునికంటె భిన్నముగావిభజించి యెరుగుచున్నాడు.

తా. మరియు, సుషుప్తిమూర్ఛాద్యవస్థయందు, ఈచిదాభాసునియొక్క విలయంబును సాక్షిచేత ననుభవింపబడుచున్నది. ప్ర. సరి. చిదాభాసునకు మిథ్యాత్వమగుగాక. అందుచే నేమి?. ఉ. కూటస్థునికంటె విభజించిభిన్నముగా నెరుగబడిన చిదాభాసుడు మాయికుడెప్పుడగునో, అప్పుడు తనరూపము మిథ్యయని మాటిమాటికిని కూటస్థునికంటె విభజించి యెరుగుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ వివిచ్యనాశంనిశ్చిత్యపునర్భోగంనవాంఛతి।
ముమూర్షుశ్శాయితోభూమౌవివాహంకోభివాంఛతి॥ ౨౧౯.

టీ. వివిచ్య-కూటస్థునికంటె తననువిభజించి, నాశం-నాశమును, నిశ్చిత్య-నిశ్చయించి, పునః-మరల, భోగం-భోగమును, నవాంఛతి- ఇచ్ఛయింపడు. ముమూర్షుః-మరణమునిచ్ఛయించువాడు, భూమౌ- భూమియందు, శాయితస్సన్-శయనింపబడినవాడగుచు, కః - ఎవడు, వివాహం-పెండ్లిని, అభివాంఛతి-ఇచ్ఛయించును. అనగా నెవ్వడు నిచ్ఛయింపడనుట.

తా. ప్ర. అట్లుచిదాభాసుడు, తనను కూటస్థునికంటె విభజించియెరిగిన నెరుగనిమ్ము. అందుచేనేమి?. ఉ. అట్లు చిదాభాసుడు, తననుకూటస్థునికంటె భిన్నముగానెరిగి, తాను మిథ్యారూపుడగుటచేత తనకునాశమునునిశ్చయించి, మరల భోగము నిచ్ఛయించడు. ప్ర. అయినే,తనకు వినాశముగలుగుననెడి నిశ్చయము జేయబడుచుండగా, భోగేచ్ఛ గలుగదనుటయందు దృష్టాంతమేమి?. ఉ. చచ్చుటకు సిద్ధమైనవాడు, భూశయనము జేయబడినవాడై, ఎవ్వడును వివాహము జేసికొనుట కిచ్ఛయించడు. అటువలెనే ఈ చిదాభాసుడును, మిథ్యారూపుడగుటచేత, తనకు నాశమునునిశ్చయించి భోగమునుకోరడని యభిప్రాయము.

శ్లో॥ జిహ్రేతివ్యవహర్తుంచభోక్తాహమితిపూర్వవత్।
ఛిన్ననాసఇవహ్రీతఃక్లిశ్యన్నారబ్ధమశ్నుతే॥ ౨౨౦.

టీ. పూర్వవత్-పూర్వమువలె, అహం-నేను, భోక్తేతి-భోక్తనని, వ్యవహర్తుంచ-వ్యవహారముజేయుటకును, జిహ్రేతి-సిగ్గునుబొందుచున్నాడు. ఛిన్ననాసఇవ-ఛిన్న-నరుకబడిన, నాసఇవ-ముక్కుగలవానివలె, హ్రీతస్సన్- సిగ్గునుబొందినవాడగుచు క్లిశ్యన్-దుఃఖముననుభవించుచు, ఆరబ్ధం- ప్రారబ్ధకర్మఫలమును, అశ్నుతే - పొందుచున్నాడు.

తా. మరియు, ఆచిదాభాసుడు, పూర్వమవివేక దశయందువలె, నేను భోక్తనని వ్యవహరించుటకు సిగ్గునుపొందుచున్నాడు. ప్ర. అయితే, ఆచిదాభాసుడు, జ్ఞానోత్పత్త్యనంతరమందు, ప్రారబ్ధకర్మక్షయపర్యంతము, ఏప్రకారముగా వ్యవహరించునో చెప్పుము?. ఉ. నరుకబడిన ముక్కుగలవానివలె, ఆచిదాభాసుడు సిగ్గుగలవాడై, ఇప్పటికిని ప్రారబ్ధకర్మము క్షయించలేదని, ఈప్రకారముగా దుఃఖము ననుభవించుచు, ప్రారబ్ధకర్మము క్షయించెడిపర్యంతము, ఆప్రారబ్ధకర్మఫలము ననుభవించుచున్నాడని తెలియవలెను.

అవ. జ్ఞానానంతరమందు, సాక్షికి భోక్తృత్వము లేదనెడి విషయము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కైముతికన్యాయముచే సిద్ధమని యిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ యథాస్వస్యాపిభోక్తృత్వంమంతుంజిహ్రేత్యయంతథా।
సాక్షిణ్యారోపయేదేతదితికైవకథావృథా॥ ౨౨౮.

టీ. అయం-ఈచిదాభాసుడు, యథా - ఏప్రకారము, స్వస్యాపి - తన కును, భోక్తృత్వం-భోక్తృత్వమును, మంతుం-ఎరుగుటకు, అనగా నేనుభోక్తనని తలచుటకనుట. జిహ్రేతి-సిగ్గునుబొందుచున్నాడో, తథా- ఆప్రకారము, ఏతత్-ఈభోక్తృత్వమును, సాక్షిణి - కూటస్థునియందు, ఆరోపయేదితి-ఆరోపముజేయుననెడివాక్యము, కైవ-ఏది. అనగాలేదనుట. కథా-ఇట్లుకల్పించినవాక్యము, వృథా - అర్థశూన్యము గలదగును.

తా. ఈ పూర్వోక్తప్రకారము, ఈ చిదాభాసుడు, తాను భోక్తనని యెరుగుటకే సిగ్గును బొందుచున్నప్పుడు, ఈ తనభోక్తృత్వమును అసంగుడైన కూటస్థాత్మయందు ఆరోపింపజాలడని చెప్పవలసినపనిలేదు. మరియు, జ్ఞానానంతరమందు, ఈచిదాభాసుడు, మిథ్యయగుటచేత, తాను భోక్తనని యెరుగుటకే సిగ్గును బొందియు, తన భోక్తృత్వమును కూటస్థాత్మయందు, ఆరోపించునని చెప్పినయెడల, ఆవాక్యము అర్థశూన్యమేయగుగాని, సార్థకము గాదని యభిప్రాయము.

అవ. ఈ చెప్పబడిన యర్థమును శ్రుతిచేత సిద్ధాంతము జేయుచున్నాడు.

శ్లో॥ ఇత్యభిప్రేత్యభోక్తారమాక్షిపత్యవిశంకయా।
కస్యకామాయేతితతశ్శారీరానుజ్వరోనహి॥ ౨౨౯.

టీ. కస్యకామాయేతి - ఏభోక్తయొక్క ప్రీతికొరకనెడి యర్థముగల ఈ శ్రుతి, ఇతి-ఈ పూర్వోక్తప్రకారము, అభిప్రేత్య-నిశ్చయించి,అవిశంకయా-నిస్సంశయముగా, భోక్తారం-భోక్తను, ఆక్షిపతి - నిరాకరించుచున్నది,తతః-ఆకారణమువల్ల, అనగా వాస్తవమందు భోక్తలేని కారణముచేననుట. శారీరానుజ్వరః=శారీర- దేహసంబంధమగు, అనుజ్వరః-సంతాపము, అనగా దుఃఖమనుట. నహి-లేనేలేదు.

తా. ఏభోక్తయొక్క ప్రీతికొరకనెడి యర్థముగల, శ్రు॥ కస్యకామాయ॥ అనెడి ఈశ్రుతివాక్యము, వాస్తవమగు భోక్తృత్వము, కూటస్థునకు గలిగియున్నదో, లేక చిదాభాసునకు గలిగియున్నదో, అనియిట్లు పూర్వోక్త ప్రకారము విచారించి, పరమార్థమందు భోక్తలేడని నిశ్చయించి, నిస్సంశయముగా భోక్తలేడని, భోక్తను నిరాకరించుచున్నదని తెలియవలెను. ప్ర. సరి. ఈచెప్పబడిన ప్రకారముభోక్త,లేకపోవుగాక. అందుచే నేమి?. ఉ. వాస్తవమందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భోక్తలేమిచేత, నిశ్చలాపరోక్షజ్ఞానికి, దేహసంబంధ దుఃఖములేనేలేదు.

అవ. జ్ఞానికి శరీరసంబంధ దుఃఖములేదని జూపుటకొరకు, శరీరభేదంబును, ఆయాశరీరమందుగల దుఃఖస్థితిని, ఇప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ స్థూలంసూక్ష్మం కారణంచశరీరంత్రివిధంస్మృతం।
అవశ్యంత్రివిధోస్త్యేవతత్రతత్రోదితోజ్వరః॥ ౨౨౩.

టీ. శరీరం-దేహము, స్థూలం-స్థూలమనియు, సూక్ష్మం - సూక్ష్మమనియు, కారణంచ-కారణమనియు, త్రివిధం-త్రివిధముగా, స్మృతం-చెప్పబడెను. తత్రతత్ర-ఆయాదేహమందు, అవశ్యం-అవశ్యముగా, ఉదితః- పుట్టిన, జ్వరః-దుఃఖము, త్రివిధః-త్రివిధముగా, అస్త్యేవ-కలదేను.

తా. శరీరము, ౧. స్థూలమనియు, ౨. సూక్ష్మమనియు, ౩. కారణమనియు, ఇట్లు త్రివిధముగా జెప్పబడెను. ఆయాశరీరమందు అవశ్యముగా గలిగినజ్వరము త్రివిధముగానున్నది. అనగా నొక్కొక్కశరీరమందు ఒక్కొకవిధమైనజ్వరము గలిగియున్నదని యభిప్రాయము.

అవ. స్థూలశరీరమందుగల జ్వరముల నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ వాతపిత్తశ్లేష్మజన్యవ్యాధయఃకోటిశస్తనౌ।
దుర్గంధిత్వకురూపత్వదాహభంగాదయస్తథా॥ ౨౨౪.

టీ. తనౌ-స్థూలశరీరమందు, వాతపైత్యశ్లేష్మజన్యవ్యాధయః=వాత- వాయువువలనను, పిత్త-పైత్యమువలనను, శ్లేష్మ - శ్లేష్మమువల్లను, జన్య-పుట్టిన, వ్యాధయః-వ్యాధులు. కోటిశః-కోట్లపరిమితిగా (సంతి) కలవు. తథా- అప్రకారముగా, దుర్గంధిత్వకురూపత్వ దాహభంగాదయః=దుర్గంధిత్వ-చెడుగవులును, కురూపత్వ-కురూపత్వంబును, దాహ-డప్పియు, భంగాదయః - అపజయాదులును, (సంతి) కలవు.

తా. స్థూలదేహమందు, వాతపైత్యశ్లేష్మములచేత గలిగినవ్యాధులు కోటులపరిమితిగాగలవు. మరియు, ఆస్థూలదేహమందు, చెడుకంపును, సౌందర్యహీనత్వంబును, డప్పియు, అపజయము మొదలగునవియుంగలవు. ఇవియన్నియు జ్వరములని చెప్పబడును. జ్వరమనగా దుఃఖహేతువనియర్థము.

అవ. సూక్ష్మదేహమందుగల జ్వరముల నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ కామక్రోధాదయశ్శాంతిదాంత్యాద్యాలింగదేహగాః।
జ్వరాద్వయేపిబాధంతేప్రాప్త్యాఽప్రాప్త్యానరంక్రమాత్॥ ౨౨౫.

టీ. కామక్రోధాదయః=కామ-కామంబును, క్రోధాదయః - క్రోధములును, దాంత్యాద్యాః=దాంతి - ఇంద్రియనిగ్రహంబును, ఆద్యాః-శాంత్యా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దులును, అనగా మనోనిగ్రహాదులనుట. లింగదేహగాః=లింగదేహ-సూక్ష్మశరీరమును, గాః-పొందిన, జ్వరాః-సంతాపములగును. ద్వయేపి-ఈజ్వర ద్వివిధంబును, ప్రాప్త్యా-లభించుటచేతను, అప్రాప్త్యా-లభింపమిచేతను, క్రమాత్-క్రమముగా, నరం-మనుష్యుని, బాధంతే-బాధించుచున్నవి.

తా. మరియు, లింగశరీరమందు. ౧. కామము, ౨. క్రోధము, ౩. లోభము, ౪. మోహము, ౫. మదము, ౬. మాత్సర్యము, ౭. ఈర్ష్యయు, ౮. దంభము, ౯. దర్పము, ౧౦. అసూయాది దుర్గుణములును, శమదమాదిసుగుణములును గలిగియున్నవి. ఈచెప్పబడిన దుర్గుణసుగుణములన్నియు, లింగదేహమందుగల జ్వరములని చెప్పబడును. కామక్రోధాదిదుర్గుణములు పురుషునిపొందుటచేత బాధించుచున్నవి. శమదమాదిసుగుణములు పురుషునిపొందమిచేత బాధించుచున్నవి. గనుక: శమదమాదీ సుగుణములును జ్వరసామ్యములే యగుటచేత, జ్వరములేయగునని తెలియవలెను.

అవ. కారణశరీరమందుగల జ్వరము, ఛాందోగ్యశ్రుతియందు జెప్పబడినదని యిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ స్వంపరంచనవేత్త్యాత్మావినష్టఇవకారణే।
ఆగామిదుఃఖబీజంచేత్యేతదింద్రేణదర్శితం॥ ౨౨౬.

టీ. కారణే - కారణశరీరమందు, అనగా సుషుప్త్యవస్థయందనుట. ఆత్మా-పురుషుడు, స్వం-తనను, పరంచ-పరునియు, నవేత్తిచ-ఎరుగడనియు, వినష్టఇవేతిచ - నాశమునుబొందినవానివలె నున్నాడనియు, ఏతత్-ఈకారణశరీరము, ఆగామిదుఃఖబీజంచేతి=ఆగామి- భవిష్యత్కాలమందనుభవింపదగిన, దుఃఖ-దుఃఖములకు, బీజంచేతి - హేతువుగానున్నదనియు, అనగా దుఃఖబీజవాసనలంగలిగియున్నదనుట. ఇంద్రేణ-దేవేంద్రునిచేత, దర్శితం- చూపబడెను. అనగా గురుడైన బ్రహ్మదేవునియెదుట నివేదింపబడెననుట.

తా. శ్రు॥ నాహంఖల్వయమేవం సంప్రత్యాత్మానంజానాత్యయమహమస్మీతి. నోఏవేమానిభూతాని వినాశమేవాపీతోభవతి. నాహమత్రభోగ్యంపశ్యామి॥ అనెడి ఛాందోగ్య శ్రుతివాక్యమందు, పురుషుడు సుషుప్త్యవస్థను బొందుచుండగా, కారణశరీరమందు ఆ పురుషునకు ఇది నేననునట్టియు, వీడు పరుడనునట్టిజ్ఞానము లేదనియు, అజ్ఞానముచేత నశించినవానివలె నున్నాడనియు, ఈకారణశరీరము రేపుగలుగదగిన దుఃఖములకు బీజభూతములైన వాసనలంగలిగియున్నదనియు, శిష్యుడైన దేవేంద్రునిచేత, గురువైన బ్రహ్మదేవునియెదుట, నివేదింపబడినట్లు, వినబడుచున్నది. కనుక, ౧. స్వపరజ్ఞానశూన్యత్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము, ౨. అజ్ఞానముచే నష్టప్రాయత్వము, ౩. ఆగామిసుఃఖబీజవాసనాస్థితియు, ఈమూడును కారణశరీరమందుగల జ్వరములని తెలియవలెను.

అవ. ఇట్లు మూడు శరీరములయందుగల జ్వరములందెలిపి, ఆజ్వరములకు అపరిహార్యత్వము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏతేజ్వరాశ్శరీరేషుత్రిషుస్వాభావికామతాః।
వియోగేతుజ్వరైస్తానిశరీరాణ్యేవనాసతే॥ ౨౨౭.

టీ. త్రిషు-మూడైన, శరీరేషు-శరీరములయందు, ఏతే - ఈచెప్పబడిన, జ్వరాః-జ్వరములు, స్వాభావికాః-స్వాభావికములని, అనగా శరీరములతోగూడబుట్టినవనుట. మతాః-సమ్మతములగును. జ్వరైః- జ్వరములతోటి, వియోగే సతితు- వియోగమునుబొందుచుండగా, అనగా నెడబాయుచుండగాననుట. తాని - ఆ, శరీరాణి - శరీరములు, నాసతఏవ - స్థితినిబొందనేపొందవు. అనగా నుండవనుట.

తా. స్థూలసూక్ష్మకారణములనెడి మూడు శరీరములయందును దోచుచుండెడి ఈజ్వరములు, శరీరముతో గూడబుట్టినవగుటచేత, స్వాభావికములని చెప్పబడుచున్నవి. ఈ స్వాభావికత్వమును వ్యతిరేకముఖముగా చెప్పెద వినుము. ఏకారణమువలన, ఈజ్వరములతోటి, ఆశరీరములకు వియోగముగలుగుచుండగా, ఆశరీరములేయుండవో, ఆకారణమువలన ఈజ్వరములు స్వాభావికములని తెలియవలెను.

అవ. ఇప్పుడావిషయమై దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ తంతోర్వియుజ్యేతపటోవాలేభ్యఃకంబళోయథా।
మృదోఘటస్తథాదేహోజ్వరేభ్యోపీతిదృశ్యతాం॥ ౨౨౮.

టీ. తంతోః-నూలువలన, పటః-వస్త్రము, యథా-ఏప్రకారము, వియుజ్యేత-వియోగమునుబొందునో, అనగా నూలువలన వస్త్రము వియోగమును బొందినయెడల వస్త్రమేయుండదనుట. వాలేభ్యః-వెంట్రుకలవలన, కంబళః-గొంగళి, యథా-ఏప్రకారము, వియుజ్యేత- వియోగమునుబొందునో, అనగా వెంట్రుకలవలన గొంగళివియోగమును బొందినయెడల గొంగళేయుండదనుట. మృదః-మృత్తికవలన, ఘటః-ఘటము, యథా-ఏప్రకారము, వియుజ్యేత-వియోగమునుబొందునో, అనగా మృత్తికవలన ఘటము వియోగమునుబొందినయెడల ఘటరూపమేలేదనుట. జ్వరేభ్యః-జ్వరములవలన. దేహోపి- దేహంబును, తథేతి-ఆప్రకారమేనని, దృశ్యతాం - చూడబడుగాక.

తా. నూలువలన వస్త్రము వియోగమునుబొందినయెడల, ఆ వస్త్రరూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పమే లేనట్లును, వెంట్రుకలవలన కంబళివియోగమును బొందినయెడల, ఆ కంబళియొక్కరూపమే లేనట్లును, మృత్తికవలన ఘటము వియోగమును బొందినయెడల, ఆఘటరూపమే లేనట్లు, జ్వరములవలన దేహము వియోగమును బొందినయెడల, ఆదేహమేయుండదని యభిప్రాయము.

అవ. కూటస్థునియందు జ్వరాభావమును, కైముతికన్యాయముచే జూపదలచుట కిచ్ఛయించిన వాడగుచు, ఇప్పుడు చిదాభాసునియందు జ్వరాభావమును జూపుచున్నాడు.

శ్లో॥ చిదాభాసేస్వతఃకోపిజ్వరోనాస్తియతశ్చితః।
ప్రకాశైకస్వభావత్వమేవదృష్టంనచేతరత్॥ ౧౨౯.

టీ. చిదాభాసే-చిదాభాసునియందు, అనగాచిత్తుయొక్క ప్రతిబింబమందనుట. స్వతః-స్వంతముగా, అనగా శరీరత్రయగత జ్వరసంబంధమొకటి తప్పయనుట. జ్వరః-జ్వరము, కోపి-ఏద్దియు, నాస్తి-లేదు. యతః- ఏకారణమువలన, చితః-చిత్తునకు, అనగా కూటస్థునకనుట. ప్రకాశైకస్వభావత్వమేవ-ప్రకాశైకస్వభావత్వమే, అనగా స్వప్రకాశత్వమే ముఖ్యస్వరూపముగాననుట. దృష్టం-చూడబడుచున్నదో, అనగా ననుభవింపబడుచున్నదో యనుట. ఇతరత్-అన్యరూపము, నచ- అనుభవింపబడలేదో.

తా. కూటస్థునియొక్క ప్రతిబింబరూప చిదాభాసునియందు, (స్వతః) శరీరత్రయమందుగల జ్వరములతోటి సంబంధమొకటితప్ప, మరియొక జ్వరమెద్దియులేదు. ప్ర. ఆచిదాభాసునియందు జ్వరములేకపోవుటకు గారణమేమి?. ఉ. చిద్రూపుడగు కూటస్థాత్మకు, స్వప్రకాశత్వమే ముఖ్యస్వభావముగా, విద్వాంసులకు అనుభవసిద్ధముగా నున్నదేగాని, ఇతరస్వభావమున్నట్లు అనుభవములేదు. కనుక, ఆకూటస్థాత్మయొక్క ప్రతిబింబరూపుడగు చిదాభాసునకును అటువంటిస్వభావమేగలిగియున్నదని యంగీకరింపదగుగాని, మరియొకస్వభావము గలిగియుండునని యంగీకరింపదగదు. ఆకారణముచేత చిదాభాసునకు, శరీరత్రయమందుగల జ్వరములతోటి సంబంధముతప్ప, మరియొకజ్వరములేదని తెలియవలెను.

అవ. ఎందుకొరకు చిదాభాసునియందు జ్వరాభావము సాధింపబడెనో, దాని నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ చిదాభాసేప్యసంభావ్యాజ్వరాస్సాక్షిణికాకథా।
ఏవమప్యేకతాంమేనేచిదాభాసోహ్యవిద్యయా॥ ౧౩౦.

టీ. జ్వరాః-జ్వరములు, చిదాభాసేపి-చిదాభాసునియందును, అసంభా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యాః-సంభావ్యములుగావు. అనగా లేవనుట. సాక్షిణి - కూటస్థాత్మయందు, కథా-కలవనెడికల్పనాకథ, కా-ఎద్ది. అనగా కూటస్థాత్మయందు జ్వరములులేవని చెప్పవలసినపనిలేదనుట. ఏవమపి-ఈప్రకారము తనయందు జ్వరములేకపోయినను, చిదాభాసః-చిదాభాసుడు, అవిద్యయా-అజ్ఞానముచేత,ఏకతాం-ఏకత్వమును, మేనే-తలచుచున్నాడు. హి-ఇది ప్రసిద్ధమనుట.

తా. చిదాభాసునియందు నెప్పుడు జ్వరములులేవో, అప్పుడు సాక్షియగు కూటస్థాత్మయందు జ్వరములులేవని చెప్పవలసిన పనిలేదు. ప్ర. అయితే, నేను తపించుచున్నాననెడి జ్వరానుభవమునకు గతియేమి?. ఉ. ఇట్లు చిదాభాసుడు, తనయందు జ్వరములేనివాడైనను, అవిద్యచేత ఏకత్వమునుబొంది, నేను తపించుచున్నానని యభిమానించుచున్నాడు.

అవ. పూర్వశ్లోకమందు, (ఏకతాంమేనే) అని సంక్షేపముగా జెప్పబడినయర్థమునే, యిప్పుడు స్పష్టముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ సాక్షీసత్యత్వమధ్యస్య స్వేనోపేతేవపుస్త్రయే।
తత్సర్వంవాస్తవంస్వస్యస్వరూపమితిమన్యతే॥ ౨౩౧.

టీ. (చిదాభాసః) చిదాభాసుడు, స్వేన-తనతోటి, ఉపేతే - సహితమగు, వపుస్త్రయే-శరీరత్రయమందు, సాక్షీసత్యత్వం=సాక్షీ- కూటస్థునియొక్క, అనగా కూటస్థునియందుండెడియనుట. సత్యత్వం-సత్యభావమును, అధ్యస్య-అధ్యాసముచేసి, అనగా కల్పించుకొనియనుట. తత్సర్వం-అదియంతయు, అనగా జ్వరవంతమగు శరీరత్రయమునను‌ట. స్వస్య-తనయొక్క, వాస్తవం- వాస్తవమగు, స్వరూపమితి- స్వరూపమని, మన్యతే-తలచుచున్నాడు.

తా. ఈ చిదాభాసుడు, తనతోటిగూడియుండెడి, స్థూలసూక్ష్మకారణములనెడి శరీరత్రయమందు,కూటస్థునియందుగల సత్యత్వమునారోపించుకొని, జ్వరములంగల శరీరత్రయమును, తనయొక్క వాస్తవ స్వరూపమని, తలచుచున్నాడు.

శ్లో॥ ఏతస్మిన్భ్రాంతికాలేయంశరీరేషుజ్వరస్త్వథ।
స్వయమేవజ్వరామీతిమన్యతేహికుటుంబివత్॥ ౨౩౨.

టీ. అయం ఈచిదాభాసుడు, తస్మిన్-ఈ, భ్రాంతికాలే- భ్రాంతివేళయందు, శరీరేషు-శరీరములయందుగల, జ్వరః-జ్వరము, అనగా జ్వరమననుట. (స్వాత్మన్యారోపయతి) తనస్వరూపమందారోపించుచున్నాడు. అథతు-అటుపిమ్మటనో, స్వయమేవ-తానే, జ్వరామీతి - నేను తపించుచున్నానని, కుటుంబివత్-కుటుంబివలె, మన్యతేహి - తలచుచున్నాడు. అనగా నభిమానించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నాడనుట.

తా. ప్ర. అయితే, ఇట్లు చిదాభాసునకు భ్రాంతిజ్ఞానము గలుగుచుండగా, ఏమియగునో చెప్పుము?. ఉ. ఈ చిదాభాసుడు, ఈభ్రాంతికాలమందు, శరీరత్రయమందుగల జ్వరమును, తనస్వరూపమందు ఆరోపించుచున్నాడు. అట్లు ఆరోపించిన పిమ్మటనో, తానే, నేను తపించుచున్నానని, కుటుంబివలె అభిమానించుచున్నాడు.

అవ. ఆ దృష్టాంతము నిప్పుడు, విశదీకరించుచున్నాడు.

శ్లో॥ పుత్రదారేషుతప్యత్సుతపామీతివృథాయథా।
మన్యతేపురుష స్తద్వదాభాసోప్యభిమన్యతే॥ ౨౩౩.

టీ. పుత్రదారేషు=పుత్ర-పుత్రులును, దారేషు-భార్యలును, తప్యత్సు సత్సు-తాపమునుబొందుచుండగా, పురుషః-పురుషుడు, యథా- ఏప్రకారము, వృథా-వ్యర్థముగా, తపామీతి-తపించుచున్నానని, మన్యతే - తలచుచున్నాడో, తద్వత్-ఆప్రకారము, చిదాభాసోపి - జీవుడును, అభిమన్యతే - అభిమానమును బొందుచున్నాడు.

తా. పుత్రభార్యాదులు తపించుచుండగా, పురుషుడువ్యర్థముగా, నేను తపించుచున్నానని యేప్రకారము తలచుచున్నాడో, ఆప్రకారము ఈ చిదాభాసుడును అభిమానించుచున్నాడని, పూర్వశ్లోకార్థముతోటి సంబంధముచేసి కొనవలెను.

అవ. ఇట్లు అవివేకదశయందు చిదాభాసునకు భ్రాంతిచేత జ్వరమును జూపి, వివేకదశయందు ఆచిదాభాసునకు జ్వరాభావము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ వివిచ్యభ్రాంతిముజ్ఝిత్వాస్వమప్యగణయన్ సదా।
చింతయన్ సాక్షిణంకస్మాచ్ఛరీరమనుసంజ్వరేత్॥ ౨౩౪.

టీ. (చిదాభాసః) జీవుడు, వివిచ్య - భేదముగానెరిగి, అనగా తనను, కూటస్థుని, శరీరములను భిన్నముగానెరిగి యనుట. భ్రాంతిం-భ్రమను, ఉజ్ఝిత్వా-విడిపించి, స్వమపి-తననును, అగణయన్ సన్- గణించుకొననివాడగుచు, అనగా తనయందు నాదరమును జేయనివాడగుచుననుట. సదా - ఎల్లప్పుడును, సాక్షిణం-తననిజరూపమగు కూటస్థాత్మను,చింతయన్-చింతించుచు,కస్మాత్-ఏహేతువువలన, శరీరమను - జ్వరవంతమగు శరీరము ననుసరించి, సంజ్వరేత్-తపించునోయని యాక్షేపార్థకము. అనగా తపించనే తపించడనుట.

తా. మరియు, ఈ చిదాభాసుడు, కూటస్థుని, తనను, శరీరములను,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భిన్నముగానెరిగి, (ఇదియంతయు నాయొక్క వాస్తవరూపమని తలచుననిచెప్ప బడిన) భ్రాంతినివిడిపించి, తాను ఆభాసుడననెడి జ్ఞానముచేత తనయందుప్రతి నుంచనివాడగుచు,తనయొక్కనిజరూపమగు జ్వరాదిరహితుడైన సాక్షిని(కూట స్థుని) సర్వదా చింతించుచు, జ్వరముగలశరీరముననుసరించి, తానే హేతువు చేతనైనను తపించడని తెలియవలెను.

అవ. భ్రాంతిజ్ఞాన తత్వజ్ఞానములకు, జ్వరతదభావకారణత్వముగలదనె డివిషయమును దృష్టాంతప్రదర్శనముచే నిప్పుడు స్పష్టీకరించుచున్నాడు.

శ్లో॥ అయథావస్తుసర్పాదిజ్ఞానం హేతుః పలాయనే।
రజ్జుజ్ఞానేఽహిధీధ్వస్తౌ కృత్యమప్యనుశోచతి॥ ౨౩౫.

టీ. అయథావస్తుసర్పాదిజ్ఞానం=అయథావస్తు-రజ్జ్వాదికమందు కల్పించ బడిన, సర్పాది-సర్పాదికముయొక్క, జ్ఞానం-జ్ఞానము, పలాయనే-పారిపోవు టయందు, హేతుః-కారణమగుచున్నది. రజ్జుజ్ఞానే-రజ్జ్వాదిజ్ఞానమందు, అహిధీ ధ్వస్తౌసత్యాం=అహిధీ-సర్పాదిబుద్ధియొక్క, ధ్వస్తౌసత్యాం-నాశనమగుచుం డగా, కృత్యమపి-పనినిగురించియు, అనగా పలాయనమునుగురించి యనుట. అనుశోచతి- తపించుచున్నాడు. అనగా నేను వ్యర్థముగా భ్రమించితినని చిం తించుచున్నాడనుట.

తా. మరియు, రజ్జ్వాదికమందు గల్పించబడిన సర్పాదికముయొక్క జ్ఞానము, భయపడి పారిపోవుటకుగారణమగుచున్నది. ఆదిశబ్దముచేత స్థాణు వునందు కల్పించబడెడిచోరుని దృష్టాంతముగా గ్రహించవలెను. మరియు, రజ్జ్వాదిజ్ఞానముచేత సర్పాదిబుద్ధి, నశించుచుండగా, నేనుభ్రమించి వ్యర్థము గా పారిపోతినని, చింతించుచున్నాడు. కనుక, భ్రాంతిజ్ఞానము జ్వరమునకు గారణమగుననియు, వాస్తవజ్ఞానము, జ్వరాభావమునకు గారణమగుననియుం దెలియవలెను.

అవ. సాక్షిని సర్వదా చింతించుచున్నాడని, (౨౩౪) శ్లోకమందుజెప్ప బడిన యర్థము నిప్పుడు, దృష్టాంతముచేత స్పష్టీకరించుచున్నాడు.

శ్లో॥ మిథ్యాభియోగదోషస్య ప్రాయశ్చిత్తత్వసిద్ధయే।
క్షమాపయన్నివాత్మానం సాక్షిణం శరణం గతః॥ ౨౩౬.

టీ. మిథ్యాభియోగదోషస్య=మిథ్యాభియోగ - వ్యర్థముగాపరునిళిట్టిన వానియొక్క, దోషస్య-దోషమునకు, ప్రాయశ్చిత్తత్వసిద్ధయే = ప్రాయశ్చిత్త త్వ-ప్రాయశ్చిత్తత్వముయొక్క, సిద్ధయే-సిద్ధికొరకు, క్షమాపయన్నివ- క్షమాప ణముగోరెడివానివలె, అనగా ప్రార్థనజేసినట్లనుట. (అయమపి) ఈచిదాభాస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

షును, సాక్షిణం-సాక్షియగు, ఆత్మానం-కూటస్థాత్మను, శరణం-శరణమును, గతః-పొందుచున్నాడు.

తా. మరియు. లోకమందు, వ్యర్థముగా పరునిదూషించి తిట్టినవాడు, ఆదోషమునకు ప్రాయశ్చిత్తత్వము సిద్ధించెడికొరకు, తనచేతదూషింపబడినవానిని, మాటిమాటికిని క్షమాపణముగోరుచు ప్రార్థించినట్లు, ఈచిదాభాసుడును, అసంగరూపుడగు కూటస్థునియందు, పరదూషణమువంటి లక్షణము గల భోక్తృత్వము నారోపించుటనుగురించి, తద్దోష ప్రాయశ్చిత్తము కొరకు, సాక్షియగు కూటస్థుని క్షమాపణము గోరెడివానివలె, శరణమును బొందుచున్నాడు. అనగా కూటస్థునకు శరణాగతుడగుచున్నాడనుట.

అవ. ఆవిషయమందే, మరియొకదృష్టాంతము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ ఆవృత్తపాపనుత్త్యర్థంస్నానాద్యావర్తతేయథా।
ఆవర్తయన్నివధ్యానం సదాసాక్షిపరాయణః॥ ౨౩౭.

టీ. ఆవృత్తపాపనుత్త్యర్థం=ఆవృత్త-మాటిమాటికిజేయబడిన, పాప-పాపకర్మముయొక్క, నుత్త్యర్థం-నాశనముకొరకు, స్నానాది- స్నానజపాదివిహితకర్మమును, అనగా ప్రాయశ్చిత్తముననుట. యథా-ఏప్రకారము, ఆవర్తతే-మాటిమాటికి ననుష్ఠించుచున్నాడో, (తథాయమపి) ఆప్రకార మీచిదాభాసుడును, ధ్యానం-ధ్యానమును, ఆవర్తయన్నివ - మాటిమాటికి జేయుచున్నవానివలె, సదా-సర్వదా, సాక్షిపరాయణః=సాక్షి-కూటస్థుడే, పర - శ్రేష్ఠమైన, అయనః-పదముగాగలవాడు, (భవతి) అగుచున్నాడు.

తా. మరియు. లోకమందు పాపకారియగుపురుషునిచేత సంపాదింపబడిన పాపమునశించెడికొరకు, విహితమగు స్నానజపాది ప్రాయశ్చిత్త కర్మము, మాటిమాటికి నేప్రకారముగా ననుష్ఠింపబడుచున్నదో, ఆప్రకారమీచిదాభాసుడును, తానుబహుకాలమునుంచి సాక్షియగు కూటస్థునియందు ఆరోపించిన సంసారిత్వాది దోషపరిహారముకొరకు, మాటిమాటికిని ధ్యానము జేయువానివలె, సర్వదా సాక్షిపరాయణుడగుచున్నాడు.

అవ. ఇట్లు దృష్టాంతములచేత సాక్షిపరత్వమును వర్ణించి, తనగుణములనుపొగడుకొనుటయందు, లజ్జాశీలత్వమును, దృష్టాంతసహితముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ ఉపస్థకుష్ఠినీవేశ్యావిలాసేషువిలజ్జతే।
జానతోఽగ్రేతథాభాసఃస్వప్రఖ్యాతౌవిలజ్జతే॥ ౨౩౮.

టీ. ఉపస్థకుష్ఠినీ=ఉపస్థ-ఉపస్థయందు, కుష్ఠినీ-కుష్ఠురోగముగల,వేశ్యా-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేశ్యాస్త్రీ, జానతః-ఎరిగినవానియొక్క, అగ్రే-ఎదుట, విలాసేషు- విలాసములయందు, అనగా విలాసములను జేయుటయందనుట. (యథా) ఏప్రకారముగా, విలజ్జతే-సిగ్గునుపొందుచున్నదో, తథా-ఆప్రకారము, ఆభాసః-చిదాభాసుడు, స్వప్రఖ్యాతౌ=స్వ-తనను, ప్రఖ్యాతౌ-పొగడుకొనుటయందు, అనగా నేనుకర్తననియు భోక్తననియుం జెప్పుకొనుటయందనుట. విలజ్జతే - సిగ్గును బొందుచున్నాడు.

తా. మరియు, ఉపస్థయందు కుష్ఠురోగముగల వేశ్యావనిత, తనరోగస్థితి నెరిగినవానియెడుట, ఏప్రకారముగా విలాసములను జేయుటయందుసిగ్గుపడునో, ఆప్రకారమే, ఈ చిదాభాసుడును, తననిజరూపము కూటస్థుడనియెరిగినపిమ్మట, తనకర్తృత్వభోక్తృత్వాది గుణములను చెప్పుకొనెడి విషయమై సిగ్గునుబొందుచున్నాడు. ౧. వృషభగమనమువంటి గంభీరగమనంబును, ౨. ధైర్యదృష్టియు, ౩. చిఱునవ్వుతోగూడినవాక్యంబును,ఈమూటినిగలది విలాసమని, శ్లో॥ వృషభస్యేవగంభీరాగతిర్ధీరంచదర్శనం । సాస్మితంచవచోయత్రసవిలాసఇతీరితః॥ అనెడి వాక్యప్రకారము దెలియవలెను.

అవ. శరీరత్రయమునుంచి భిన్నముగా నెఱుగబడిన చిదాభాసునకు, మరల నాశరీరములతోటి తాదాత్మ్యభ్రాంతియంబులేదనుటయందు, దృష్టాంతము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ గృహీతోబ్రాహ్మణోమ్లేచ్ఛైః ప్రాయశ్చిత్తంచరన్పునః।
మ్లేచ్ఛైస్సంకీర్యతేనైవతథాభాసశ్శరీరకైః॥ ౨౩౯.

టీ. మ్లేచ్ఛైః-నీచజాతిజనులచేత, గృహీతః- గ్రహింపబడిన, బ్రాహ్మణః-బ్రాహ్మణుడు, ప్రాయశ్చిత్తం - స్నాన జపాది ప్రాయశ్చిత్త కర్మమును, చరన్-ఆచరించుచున్నవాడగుచు, పునః-మరల, మ్లేచ్ఛైః-మ్లేచ్ఛులతోటి,నైవ సంకీర్యతే-కలియ నేకలియడు. తథా-ఆప్రకారము, ఆభాసః- చిదాభాసుడు, శరీరకైః-శరీరములతో, నైవ-తాదాత్మ్యాధ్యాసమును జేయనే జేయడు.

తా. మ్లేచ్ఛులచేత గ్రహింపబడిన బ్రాహ్మణుడు, తద్దోషపరిహారముకొరకు స్నానజపాది ప్రాయశ్చిత్తకర్మమును, జేసికొనుచు, మరల నామ్లేచ్ఛజనులతోటిగూడనట్లు, ఈ చిదాభాసుడును, శరీరత్రయమునుంచి భిన్నముగా నెరుగబడినవాడగుచు, మరలనాశరీరములేనేననెడిరూపముగల, తాదాత్మ్యాధ్యాసమును జేయనే జేయడని తెలియవలెను.

అవ. ఈ చిదాభాసుడు, కేవలము తనయపరాధనివృత్తిమాత్రముకొరకేగాక, మహత్ప్రయోజనసిద్ధికొరకును, సాక్షిననుసరించుచున్నాడని, సింహా


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలోకనన్యాయముచేత దృష్టాంతసహితముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ యావరాజ్యేస్థితో రాజపుత్రస్సామ్రాజ్యవాంఛయా।
రాజానుకారీభవతితథాసాక్ష్యనుకార్యయం॥ ౨౮౦.

టీ. యావరాజ్యే-యావరాజ్యమందు, స్థితః - స్థితినిబొందియుండెడి, రాజపుత్రః-రాజపుత్రుడు, సామ్రాజ్యవాంఛయా - రాజ్యసామ్రాజ్యవాంఛచేత, రాజానుకారిసన్ = రాజ-రాజును, అనుకారిసన్ - అనుసరించినవాడగుచు, భవతి-ప్రజారంజనాదిగుణవంతుడగు రాజేయగుచున్నాడు. తథా-ఆప్రకారము, అయం-ఈ చిదాభాసుడు, సాక్ష్యనుకారీసన్ = సాక్షీ-కూటస్థుని, అనుకారీసన్- అనుసరించినవాడగుచు, (భవతి) తానే పూర్ణానందైకస్వరూప కూటస్థాత్మయగుచున్నాడు.

తా. యావరాజ్యమందుండెడి రాజపుత్రుడు, రాజ్యసామ్రాజ్యవాంఛచేత రాజననుసరించినవాడగుచు, ప్రజారంజనాది గుణవంతుడగురాజేయైనట్లు, ఈచిదాభాసుడును, కూటస్థాత్మ ననుసరించినవాడగుచు, తాను, పూర్ణానందైకస్వరూప కూటస్థాత్మయగుచున్నాడు. సింహము గుహలోనుంచి వెలుపటికి కొంతదూరమునడిచివచ్చి నిల్చియుండి, తాను నడిచివచ్చినమార్గమును కలియజూచినట్లు, శ్రీవిద్యారణ్యగురుడును, పూర్వోక్తగ్రంథమునంతయు పారజూచి, ఈచిదాభాసుడు కూటస్థునాశ్రయించి, తానే పూర్ణానందైకస్వరూప కూటస్థుడగునని చెప్పుటచేత, ఇది సింహావలోకనన్యాయమగునని తెలియవలెను.

శ్లో॥ యోబ్రహ్మవేదబ్రహ్మైవ భవత్యేషఇతిశ్రుతిం।
శ్రుత్వాతదేకచిత్తస్సన్ బ్రహ్మవేత్తినచేతరత్॥ ౨౮౧.

టీ. యః-ఏపురుషుడు, బ్రహ్మ-బ్రహ్మమును, వేద- ఎరుగుచున్నాడో, ఏషః-ఈపురుషుడు, బ్రహ్మైవ-బ్రహ్మమే, భవతీతి - అగుచున్నాడనిచెప్పెడి, శ్రుతిం-శ్రుతిని, శ్రుత్వా-విని, తదేకచిత్తస్సన్ = తత్ - ఆబ్రహ్మమందు, ఏక-ముఖ్యమైన, చిత్తస్సన్-చిత్తముగలవాడగుచు, అనగా తదేకనిష్ఠుడగుచుననుట. బ్రహ్మ-బ్రహ్మమును, వేత్తి-ఎరుగుచున్నాడు. ఇతరత్ - అన్యమును, నచవేత్తి- ఎరుగడు. అనగా దేహేంద్రియాదులయందు తాదాత్మ్యాధ్యాసము జేయడనుట.

తా. ప్ర. అయితే, యువరాజునకు రాజానుసరణముచేత సామ్రాజ్యఫలము గనబడినట్లు, ఈ చిదాభాసునకు సాక్షిననుసరించుటయందు ఫలముగనబడలేదు. అందుచే నీచిదాభాసుడు సాక్షిననుసరించుటయం దెట్లుప్రవర్తిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చును?. ఉ. ఆపరబ్రహ్మము నెవడెరుగునో, వాడేపరబ్రహ్మమగుచున్నాడని యు, ఈబ్రహ్మవేదికి జన్మము గలుగదనియు, దుఃఖమును దాటుచున్నాడని యు, పాపమును తరించుచున్నాడనియు, పంచకోశరూపగుహావలనను, కామ ప్రమోకరూప హృదయగ్రంథులవలనను, ముక్తుడగుచు అమృతరూపుడగుచు న్నాడనియు, శ్రు॥ సయోహవైతత్పరమంబ్రహ్మవేదబ్రహ్మైవభవతి. నాస్యా బ్రహ్మవిత్కులేభవతి. తరతిశోకంతరతిపాప్మానంగుహాగ్రంధిభ్యోవిముక్తోఽ మృతోభవతి। ఇట్లుచెప్పెడి శ్రుతియందు బ్రహ్మభావాదిరూపఫలము వినఁబడు చుండుటచేత, ఈ చిదాభాసుడు ఆ శ్రుత్యర్థమునువిని,ఆఫలవాంఛచేత ఆకూ టస్థరూప పరబ్రహ్మమందే ముఖ్యచిత్తముగలవాడగుచు, సాక్షియగు బ్రహ్మ మునెరిగి, ఆపరబ్రహ్మమేయగుచున్నాడు. అనగా బ్రహ్మభావాది ఫలవాంఛ చేత సాక్షిననుసరించుటయందు ప్రవర్తించుట, యుక్తమగునని తెలియవలెను.

శ్లో॥ దేవత్వకామాహ్యగ్న్యాదౌ ప్రవిశంతియథాతథా।
సాక్షిత్వేనావశేషాయస్వవినాశంసవాంఛతి॥ ౨౭౨.

టీ. దేవత్వకామాః = దేవత్వ- దేవత్వమందు, కామాః - అపేక్షగలజ నులు, అగ్న్యాదౌ-భృగ్వగ్నిప్రయాగగంగాదికమందు, యథా - ఏప్రకార ను, ప్రవిశంతి-ప్రవేశించుచున్నారో, తథా-ఆప్రకారము, సః-ఆచిదాభాసు డు, సాక్షిత్వేన - సాక్షిరూపముగా, అవశేషాయ-శేషించుటకొరకు, అనగా నుండుటకొరకనుట. స్వవినాశం=స్వ- తనయొక్క, వినాశం - వినాశమును, వాంఛతి-కోరుచున్నాడు.

తా. ప్ర. అయితే,బ్రహ్మజ్ఞానముచేత బ్రహ్మభావప్రాప్తిగలుగుచుం డగా, చిదాభాసరూపమేనశించును. అందుచేత తనవినాశముకొరకు చిదాభా సుడెట్లుప్రవర్తించును?. ఉ. లోకమందు, దేవత్వప్రాప్తిని గోరెడి మనుష్యు లు, భృగ్వగ్నిప్రయాగ గంగాప్రవేశాదికమందు ఏప్రకారముగా ప్రవర్తిం చుచున్నారో, ఆప్రకారము సాక్షిరూపముగానుండెడి లక్షణముగల అధికఫ లముండుటచేత, చిదాభాసరూపమునకు నాశహేతువైన బ్రహ్మజ్ఞానమందును, ప్రవర్తనము ఘటించునని తెలియవలెను.

శ్లో॥ యావత్స్వదేహదాహంసనరత్వంనైవముంచతి।
తావదారబ్ధదేహంస్యాన్నాభాసత్వేపిమోచనం॥ ౨౭౩.

టీ. సః-ఆభృగ్వగ్న్యాదికమందు ప్రవేశించినపురుషుడు, స్వదేహదా హం-స్వ-తనయొక్క, దేహ-శరీరముయొక్క, దాహం-దహనము, యావత్- కాబోయెడిపర్యంతము, నరత్వం-నరస్వభావమును, అనగా మనుష్యవ్యవహా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రయోగ్యత్వమనునట. (యథా) ఏప్రకారము, నైవముంచతి-విడువనేవిడువ డో, (ఏవం) ఈప్రకారము, ఆరబ్ధదాహం = ఆరబ్ధ-ప్రారబ్ధకర్మముయొక్క, దాహం-నాశనము, తావత్-అయ్యేడిపర్యంతము, ఆభాసత్వవిమోచనం=ఆభాసత్వ- చిదాభాసస్వభావముయొక్క, విమోచనం - విమోచనము, నస్యాత్-కాదు.

తా. ప్ర. అయితే, తత్వజ్ఞానముచేత చిదాభాసత్వమునశించినయెడల, జ్ఞానులకు జీవత్వవ్యవహారమెట్లుగలుగును?. ఉ. భృగ్వగ్న్యాదికమందుప్రవేశించిన పురుషుడు, దహనాదికముచేత, తనదేహమునకు నాశము గలిగేడిపర్యంతము నరవ్యవహారయోగ్యత్వమును విడువనట్లు, బ్రహ్మజ్ఞానోదయమైనను ప్రారబ్ధకర్మక్షయపర్యంతము, చిదాభాసుడు నశింపమిచేత జ్ఞానులకు జీవత్వవ్యవహారము నివర్తింపదని తెలియవలెను.

శ్లో॥ రజ్జుజ్ఞానేపికంపాదిశ్శనైరేవోపశామ్యతి।
పునర్మందాంధకారేసారజ్జుఃక్షిప్తోరగీభవేత్॥ ౨౭౭.

టీ. రజ్జుజ్ఞానేసత్యపి=రజ్జు-త్రాటియొక్క, జ్ఞానేసత్యపి- జ్ఞానముగలిగినను, కంపాదిః-దేహమువణుకుటమొదలగునది, శనైరేవ-మెల్లగానే, ఉపశామ్యతి - ఉపశమమును బొందుచున్నది. అనగా నశించుచున్నదనుట. పునః-మరల, మందాంధకారే=మంద-దట్టముగాని, అనగాకొంచెమగుననుట. అంధకారే-చీకటియందు, సా-ఆ, రజ్జుః-త్రాడు, క్షిప్తోరగీ=క్షిప్త-కల్పించబడిన, ఉరగీ-సర్పముగలది, భవేత్-అగును.

తా. ప్ర. అయితే, కర్తృత్వభోక్తృత్వాదిభ్రాంతికి ఉపాదానకారణమగు అజ్ఞానము, వివేకజ్ఞానముచేత నివర్తించుచుండగా, జ్ఞానికివిషయభోగానువృత్తియైనను, నేను మర్త్యుడననెడి విపరీతప్రతీతియైన నెట్లుగలుగును?. ఉ. సర్పభ్రాంతివదలి రజ్జుజ్ఞానము గలిగినను, సర్పభ్రాంతివలన గలిగినదేహకంపాదికార్యము, మెల్లగా నశించును. మరల మందాంధకారము గలిగినప్పుడు, ఆరజ్జువు సర్పమువలె దోచుచుండును.

అవ. ఈదృష్టాంతసిద్ధార్థమును, దార్ష్టాంతికమం దిప్పుడుగూర్చుచున్నాడు.

శ్లో॥ ఏవమారబ్ధభోగోపిశనైశ్శామ్యతినోహఠాత్।
భోగకాలేకదాచిత్తుమర్త్యోహమితిభాసతే॥ ౨౭౮.

టీ. ఏవం-ఈదృష్టాంతప్రకారము, ఆరబ్ధభోగోపి= ఆరబ్ధ-ప్రారబ్ధకర్మముయొక్క, భోగోపి-భోగంబును,శనైః-మెల్లగా, శామ్యతి- నశించుచున్నది. హఠాత్-బలాత్కారమువలన, అనగా మనము కోరినప్పుడనుట. నో - నశిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పడు. భోగకాలేతు- ప్రారబ్ధకర్మభోగకాలమందో, కదాచిత్ - ఒకానొక ప్పుడు, అహం-నేను, మర్త్యఇతి- మనుష్యుడనని, భాసతే - విపరీతజ్ఞానము దోచుచుండును.

తా. ఈపూర్వోక్త దృష్టాంతప్రకారము, ప్రారబ్ధకర్మ భోగమైనను, మెల్లగా నశించునేగాని, బలాత్కారముచేత నశించదు. మరియు, ప్రారబ్ధకర్మ భోగమునను భవించుచుండగా, ఒకానొకప్పుడు, నేను మనుష్యుడననెడి విప రీతజ్ఞానంబును, జ్ఞానికిగలుగుచుండును.

శ్లో॥ నైతావతాపరాధేనతత్వజ్ఞానంవినశ్యతి।
జీవన్ముక్తివ్రతంనేదంకింతువస్తుస్థితిఃఖలు॥ ౨౪౬.

టీ. ఏతావతా-ఇంతమాత్రమగు, అపరాధేన- తప్పితముచేత, తత్వజ్ఞా నం-బ్రహ్మజ్ఞానము, నవినశ్యతి-నాశమునుబొందదు. ఇదం- ఈమర్త్యత్వబుద్ధ్య నుకరణలక్షణముగలజ్ఞానము, జీవన్ముక్తివ్రతం=జీవన్ముక్తి-జీవన్ముక్తియొక్క, వ్రతం-నియమము, న-కాదు. అనగానియమముగానను ష్ఠించదగినదిగాదనుట. కింతు-మరియేమనగా, వస్తుస్థితిఃఖలు - వస్తుస్థితి నెరుగుటయగును.

తా. ప్ర. అయితే, తత్వజ్ఞానముగలిగినపిమ్మట, మరల నేనుమనుష్యు డననెడి బుద్ధిగలుగుచుండగా, అట్టివిపరీతజ్ఞానముచేత, తత్వజ్ఞానము బాధింప పడదాయేమి?. ఉ. ఒకానొకప్పుడు నేనుమనుష్యుడననెడి, ఇవ్విధజ్ఞానముగలి గినంతమాత్రపు తప్పితముచేత వేదాంతప్రమాణజనిత తత్వజ్ఞానము బాధింప బడదు. ప్ర. ఎందువలన బాధింపబడదో చెప్పుము?. ఉ. ఈమనుష్యత్వబుద్ధ్య నుకరణలక్షణముగలజ్ఞానము, నియమముగా ననుష్ఠింపదగిన జీవన్ముక్తి వ్రతము గాదు. మరియేమనగా, యథార్థజ్ఞానముచేత భ్రాంతిజ్ఞానము నివర్తించును. కనుక, ఇది వస్తుస్వభావమగును. ఆకారణమువలన, ఒకానొకప్పుడు, నేనుమ నుష్యుడననెడి బుద్ధిగలిగినను, మరల తత్వజ్ఞానాంతరముచేత, ఆబుద్ధియే, బా ధింపబడునని తెలియవలెను.

శ్లో॥ దశమోపిశిరస్తాడంరుదన్బుధ్వానరోదితి।
శిరోవ్రణస్తుమాసేనశనైశ్శామ్యతినోతదా॥ ౨౪౭.

టీ. దశమోపి-దృష్టాంతమందుపదియవవాడును, శిరస్తాడం - శిరస్తాడన పూర్వకముగా, అనగా నెత్తికాయగొట్టుకొనుచుననుట. రుదన్-ఏడ్చుచు, బు ధ్వా-నేనుదశముడనైతినని యెరిగి, నరోదితి-ఏడ్వడు. శిరోవ్రణస్తు=శిరః - శిర స్సుయొక్క, వ్రణస్తు-గాయమో, మాసేన-ఒకమాసకాలముచేత, శనైః- మెల్ల గా, శామ్యతి-నశించుచున్నది. తదా-అప్పుడు, అనగా నేను దశముడననియె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రినప్పుడనుట. నో-నశింపదు.

తా. ప్ర. సరి. అగుగాక. రజ్జుసర్పాదిస్థలమందు విపరీతజ్ఞాననివృత్తి యగుచుండగా, దానికార్యమగు దేహకంపాదికమప్పుడేనశింపక, కొంతకాలమువరకుండును. ప్రకృతదృష్టాంతమందు (నీవు దశముడవైతివనెడి) వాక్యవిచారజన్యజ్ఞానముచేత దశమునియందు భ్రాంతి, నివర్తించుచుండగా, దానికార్యము కొంతకాలపర్యంతమున్నట్లు పొందబడలేదేమి?. ఉ. ఆదశమునకు, నేనుదశముడనైతినని నెడి జ్ఞానోదయమగుచుండగా, శిరస్తాడన పూర్వకముగాగల ఏడ్పుమాత్రము నివర్తించుచున్నది. అదివరకు నెత్తిని కొట్టుకొనుటచేత గలిగినవ్రణము, కొంతకాలమునకు నశించునేగాని, అప్పుడేనశింపదు. కనుక, ఈదృష్టాంతమందును కార్యానువృత్తి కొంతకాలపర్యంతముండునని తెలియవలెను.

శ్లో॥ దశమామృతిలాభేనజాతోహర్షోవ్రణవ్యథాం।
తిరోధత్తేముక్తిలాభస్తథాప్రారబ్ధదుఃఖితాం॥ ౨౬౮.

టీ. దశమామృతిలాభేన=దశమ-దశమునియొక్క, అమృతిలాభేన-మృత్యభావలాభముచేత, జాతః-కలిగిన, హర్షః-సంతోషము, వ్రణవ్యథాం-నెత్తిగాయపుదుఃఖమును, తిరోధత్తే-తిరోధానము జేయుచున్నది. తథా-ఆప్రకారము, ముక్తిలాభః-జీవన్ముక్తిలాభము, ప్రారబ్ధదుఃఖితాం=ప్రారబ్ధ - ప్రారబ్ధకర్మముచేగలిగిన, దుఃఖితాం - దుఃఖిత్వమును, (తిరోధత్తే) తిరోధానము జేయుచున్నది.

తా. ప్ర. అయితే, జ్ఞానముకలిగినపిమ్మటగూడ,సంసారమున్నయెడల, జీవన్ముక్తికి పురుషార్థత్వమెట్లుగలుగును?. ఉ. దశమునియొక్క అమృతిలాభముచేత గలిగినసంతోషము, శిరోవ్రణదుఃఖమును మరగుపరచినట్లు, ముక్తిలాభంబును, ప్రారబ్ధకర్మముచేత గలిగెడి దుఃఖమును మరగు పరచుచున్నది. కనుక, జీవన్ముక్తికి పురుషార్థత్వముగలదని తెలియవలెను.

శ్లో॥ వ్రతాభావాద్యదాధ్యాసస్తదాభూయోవివిచ్యతాం।
రససేవీదినేఘస్త్రేభూయోభూయోయథాతథా॥ ౨౬౯.

టీ. వ్రతాభావాత్=వ్రత-జీవన్ముక్తివ్రతముయొక్క, అభావాత్- లేమివలన, యదా-ఎప్పుడు, అధ్యాసః-దేహేంద్రియాదికముతోటి తాదాత్మ్యాధ్యాసముగలుగునో, తదా-అప్పుడు, భూయః-మరల, వివిచ్యతాం - వివేచనముచేయబడుగాక. అనగా నాత్మ, దేహాదికముకంటె భిన్నముగా నున్నాడని యెరుగవలెననుట. రససేవీ-రసమునుసేవించెడిపురుషుడు, దినే - ఒకదినమం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డు, భూయోభూయః-మరలమరల, అనగా ననేకమార్లనుట. యథా-ఏప్రకారముగా, భుఙ్క్తే-భోజనము జేయుచున్నాడో, తథా-ఆప్రకారముగాతత్వమును విభజించి యెరుగవలెననుట.

తా. ప్ర. అయితే, ఈమర్త్యత్వబుద్ధ్యను కరణలక్షణముగల జ్ఞానము, నియమముగాననుష్ఠింపదగిన జీవన్ముక్తివ్రతముగాదని, (౨౮౬) శ్లోకమందు జెప్పబడెను. నేనుమనుష్యుడననెడి విపరీతజ్ఞానమందు తత్వములేకపోవుచుండగాలాభమేమి?. ఉ. ఈమర్త్యత్వబుద్ధ్యనుకరణలక్షణముగల జ్ఞానమునకు,నియమముగాననుష్ఠింపదగిన జీవన్ముక్తివ్రతములేమిచేత, దేహమునేననెడి రూపముగల అధ్యాసమెప్పుడుగలుగునో, అప్పుడుమరల, దేహాదికముకంటెఆత్మ,భిన్నుడనెడి వివేకజ్ఞానమునభ్యసింపుచుండవలెను. ఇందుకు దృష్టాంతమును జెప్పెద వినుము. రసమును సేవించెడిమనుష్యుడు, ఆకటిబాధ, నివర్తించెడి కొరకు ఒకదినమందే మరలమరల ననేకపర్యాయములాహారమును భక్షించినట్లు, వివేకియు, తనకుగలిగెడి అధ్యాసము నివర్తించెడికొరకు, మాటిమాటికిని, దేహాదికముకంటె, ఆత్మ, భిన్నుడనెడి వివేకమును జేయవలయునని యభిప్రాయము.

శ్లో॥ శమయత్యౌషధేనాయందశమస్స్వంవ్రణంయథా।
భోగేనశమయిత్వైవతత్ప్రారబ్ధంముచ్యతేతథా॥ ౨౫౦.

టీ. అయం-ఈ, దశమః-దశముడు, ఔషధేన- ఔషధముచేత, స్వం-స్వకీయమైన, వ్రణం-వ్రణమును, యథా-ఏప్రకారము, శమయతి-నశింపజేసికొనుచున్నాడో, తథా-ఆప్రకారము, ఏతత్-ఈ, ప్రారబ్ధం - ప్రారబ్ధకర్మము, భోగేన-భోగముచేత, శమయిత్వా - నాశమునుబొంది, ముచ్యతే-విడువబడుచున్నది.

తా. ప్ర. అయితే, జ్ఞానముచేత నివర్తింపదగని ప్రారబ్ధకర్మఫలమునకు, మఱిదేనిచేత నివృత్తిగలుగునో చెప్పుము?. ఉ. ఆదశముడు, భ్రాంతివశయందు నెత్తినికొట్టుకొనుటచేత గలిగినవ్రణము, పిమ్మట, ఔషధముచేత నివర్తించినట్లు, ఈ ప్రారబ్ధకర్మను, భోగముచేత నశించి, విడువబడునని తెలియవలెను.

అవ. శ్లో॥ అపరోక్షజ్ఞానశోకనివృత్త్యాఖ్యేఉభేఇమే। అవస్థేజీవగేబ్రూత ఆత్మానంచేదితిశ్రుతిః॥ అనెడి, (౪౮) నలుబదియేనిమిదవశ్లోకముచేత, శ్రు॥ ఆత్మానంచేద్విజానీయాదయమస్మీతిపూరుషః ॥ కిమిచ్ఛన్కస్యకామాయ శరీరమనుసంజ్వరేత్॥ అనెడి ఈమంత్రమందు, జీవునియొక్క అవస్థలగు అపరోక్షజ్ఞానదుఃఖనివృత్తులనెడి రెండును చెప్పబడినవని తెలుపబడెను. అట్లుచెప్ప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టచేత సూచింపబడెడి, తృప్తిలక్షణముగల సప్తమ్యవస్థనిప్పుడు వృత్తానుకీర్తన పూర్వకముగాజెప్పుటకు ప్రారంభించుచున్నాడు.

శ్లో॥ కిమిచ్ఛన్నితివాక్యోక్తశ్శోకమోక్ష ఉదీరితః।
ఆభాసస్యహ్యవస్థేషాషష్ఠీతృప్తిస్తుసప్తమీ॥ ౨౫౧.

టీ. కిమిచ్ఛన్నితి-ఏమిఫలమిచ్ఛయించుననెడి యర్థముగల, వాక్యోక్తః= వాక్య-వాక్యముచేత, ఉక్తః-చెప్పబడిన, శోకమోక్షః-దుఃఖనివృత్తి, ఉదీరితః- చెప్పబడెను. అనగా దెలిపితిమనుట. ఆభాసస్య- చిదాభాసునియొక్క, ఏషా- ఈ, అవస్థా-దుఃఖనివృత్తిలక్షణావస్థ, షష్ఠీహి-ఆరవదియగుగదా. సప్తమీ-ఏడవ దియగు, తృప్తిస్తు- తృప్తిలక్షణావస్థయో, (వ్యాఖ్యాయతే) ఇక జెప్పబడును.

తా. ఏమిఫలము నిచ్ఛయించుచుననెడి యర్థముగల, శ్రు॥ కిమిచ్ఛన్॥ అనెడి ఉత్తరార్థవాక్యముచేత జెప్పబడిన, దుఃఖనివృత్తిలక్షణముగల, అవస్థను, ఈపూర్వోక్తగ్రంథసందర్భముచేత దెలిపితిమి. ఈదుఃఖనివృత్త్యవస్థ, శ్లో॥ అజ్ఞానమావృతిస్తద్వద్విక్షేపశ్చపరోక్షధీః । అపరోక్షమతిశ్శోకమోక్షస్తృప్తిర్నిరంకుశా॥ అనెడి, (౩౩) ముప్పదిమూడవ శ్లోకముచే దెలుపబడిన, జీవావస్థలగు ఏడింటిలో నారవదియగును. ఇకను తృప్తిలక్షణముగల జీవునియొక్క సప్తమ్యవస్థను వ్యాఖ్యానించెదమని యభిప్రాయము.

అవ. అపరోక్షజ్ఞానజన్యమగు తృప్తికి నిరంకుశత్వమును, ప్రతియోగి ప్రదర్శనపూర్వకముగా, నిప్పుడు దెలుపుచున్నాడు.

శ్లో॥ సాంకుశావిషయైస్తృప్తిరియంతృప్తిర్నిరంకుశా।
కృతంకృత్యంప్రాపణీయంప్రాప్తమిత్యేవతృప్యతి॥ ౨౫౨.

టీ. విషయైః-విషయములచేగలిగెడి, తృప్తిః-తృప్తి, సాంకుశా-సాంకుశమగును. ఇయం-ఈ, తృప్తిః-తృప్తి, అనగా నపరోక్షజ్ఞానజన్యతృప్తియనుట. నిరంకుశా-నిరంకుశమగును. కృత్యం-కార్యరాశి, కృతమిత్యేవ - చేయబడినట్లే యాయెననియు, ప్రాపణీయం- పొందదగినఫలవర్గము, ప్రాప్తమిత్యేవ- పొందబడినట్లేయాయెనని, తృప్యతి-తృప్తినిబొందుచున్నాడు.

తా. విషయలాభజన్యమగు తృప్తికి, మరియొకవిషయ కామత్వముచేత చెరుపుగలుగుటవలన, ఆతృప్తి, సాంకుశమని చెప్పబడును. మరియు, అపరోక్షబ్రహ్మజ్ఞానమువలన తృప్తిగలుగుచుండగా, మరియొకసుఖేచ్ఛగలుగమిచేత, ఈతృప్తి, నిరంకుశమని చెప్పబడును. ఆనిరంకుశత్వ మెట్లనగా జెప్పెదవినుము. చేయవలసిన కార్యరాశియంతయు జేయబడినట్లేయాయెనని (తనకృతకృత్యతచేతను) పొందదగినఫలవర్గమంతయు పొందబడినట్లే యాయెనని, (తన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(ప్రాప్తప్రాప్యత్వముచేతను) తృప్తినిబొందుచున్నాడు. గనుక, ఇది నిరంకుశ తృప్తియని చెప్పబడును.

అవ. ఆకృతకృత్యత్వమునే, ఇప్పుడు స్పష్టముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ ఐహికాముష్మికవ్రాతసిద్ధ్యై ముక్తేశ్చసిద్ధయే।
బహుకృత్యంపురాస్యాభూత్తత్సర్వమధునాకృతం॥ ౨౫౩.

టీ. అస్య-ఈవిద్వాంసునకు, పురా- జ్ఞానోత్పత్తికంటె బూర్వము, ఐహికాముష్మికవ్రాతసిద్ధ్యై = ఐహిక-ఇహలోకసంబంధమైనట్టియు, ఆముష్మిక-పరలోకసంబంధమైనట్టి వ్రాత-ఇష్టవస్తురాశియొక్క, సిద్ధ్యై-సిద్ధికొరకును, ముక్తేశ్చ-మోక్షముయొక్క, సిద్ధయే-సిద్ధికొరకును, బహు - బహువిధముగా, కృత్యం - చేయదగినది, అభూత్-ఉండెను. అధునా - ఇప్పుడు, అనగా తత్వజ్ఞానోదయమైనపిమ్మటననుట. తత్సర్వం - అదియంతయు, కృతం- చేయబడినట్లాయెను.

తా. ఈవిద్వాంసునకు తత్వజ్ఞానోదయముకంటె బూర్వము ఈలోకమందు ఇష్టప్రాప్తికొరకును, అనిష్టనివృత్తికొరకును, కృషివాణిజ్యాది కర్మను చేయదగినదైయుండెను. మరియు, స్వర్గాదిపుణ్యలోకసిద్ధికొరకు, యాగోపాసనాదికము చేయదగినదైయుండెను. మరియు, మోక్షసాధనమగు తత్వజ్ఞానసిద్ధికొరకు. వేదాంతశ్రవణాదికము చేయదగినదై యుండెను. ఇప్పుడనగా తత్వజ్ఞానోదయమైన పిమ్మటనో, సాంసారికఫలేచ్ఛలేమిచేతను, మరియు, బ్రహ్మానందము సాక్షాత్కరించుటచేతను, ఆకృషియాగవేదాంత శ్రవణాదికమంతయు జేయబడినట్లాయెను. అనగా నికమీదననుష్ఠింపదగినదిలేనందున, చేయదగినదంతయుఁ జేయబడినట్లాయెనని యభిప్రాయము. ఇదియే కృతకృత్యత్వమగును.

అవ. ఇట్లు కృతకృత్యత్వమునుదెలిపి, తత్ఫలభూతమగు తృప్తినిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ తదేతత్కృతకృత్యత్వంప్రతియోగిపురస్సరం।
అనుసందధదేవాయమేవంతృప్యతినిత్యశః॥ ౨౫౪.

టీ. అయం- ఈవిద్వాంసుడు, తదేతత్-ఆఈ, కృతకృత్యత్వం-కృతకృత్యత్వమును, ప్రతియోగిపురస్సరం - ప్రతియోగ్యనుసంధానపూర్వకముగా, అనుసందధత్- అనుసంధానముజేయుచు, ఏవం- ఈచెప్పబోయెడిప్రకారము, నిత్యశః-సర్వదా, తృప్యత్యేవ-తృప్తినిబొందుచున్నవాడేయగును.

తా. ఈవిద్వాంసుడు, ఆయీకృతకృత్యత్వమును ప్రతియోగ్యనుసం


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధానపూర్వకముగా ననుసంధానము జేయుచున్నవాడగుచు, ఇక జెప్పబోయెడి ప్రకారము, సర్వదా తృప్తినిబొందుచున్నాడు.

అవ. ఆయనుసంధానమునే, ముప్పదియేడుశ్లోకములుగల గ్రంథముచే దెలుపుచు, అందు ఐహికసుఖార్థులకంటె, విలక్షణత్వము నిప్పుడు తనకు జూపుచున్నాడు.

శ్లో॥ దుఃఖినోఽజ్ఞాస్సంసరంతుకామంపుత్రాద్యపేక్షయా।
పరమానందపూర్ణోఽహంసంసరామికిమిచ్ఛయా॥ ౨౫౫.

టీ. దుఃఖినః-దుఃఖవంతులగు, అజ్ఞాః-మూఢులు,పుత్రాద్యపేక్షయా-పుత్రాది-పుత్రభార్యాదికమందుగల, అపేక్షయా-అపేక్షచేత, కామం-మిక్కిలిగా, సంసరంతు - సంసారమును బొందుదురుగాక. పరమానందపూర్ణః-పరమానందపూర్ణుడనగు, అహం-నేను, కిమిచ్ఛయా- ఏయిచ్ఛచేత, అనగాదేనినిచ్ఛయించుటచేననుట. సంసరామి- సంసారమునుబొందెదనని యాక్షేపార్థకము. అనగా నేకోరికయు నాకులేమిచేత నేనుసంసారమును బొందననుట.

తా. దుఃఖవంతులగుమూఢులు, పుత్రభార్యాదులయందు గల అపేక్షచేత అధికసంసారమునుపొందుదురు. పరమానందపూర్ణుడనగునాకు, ఏయిచ్ఛయులేనందున, నేను సంసారమునుబొందను.

అవ. స్వర్గాదికముకొరకు కర్మాద్యనుష్ఠానమును జేసెడివారికంటె,విలక్షణత్వము నిప్పుడు తనకు జూపుచున్నాడు.

శ్లో॥ అనుతిష్ఠంతుకర్మాణిపరలోకయియాసవః।
సర్వలోకాత్మకఃకస్మాదనుతిష్ఠామికింకథం॥ ౨౫౬.

టీ. పరలోకయియాసవః = పరలోక-పరలోకమును, యియాసవః-పొందుటకిచ్ఛయించెడిజనులు, కర్మాణి-కర్మములను, అనుతిష్ఠంతి - చేయుచున్నారు. సర్వలోకాత్మకః=సర్వలోక - సర్వలోకములకు, ఆత్మకః-స్వరూపముగాగలనేను, కస్మాత్-ఎందువలన, కథం-ఎట్లు, కిం-దేనిని, అనుతిష్ఠామి-అనుష్ఠానము జేసెదనని ఆక్షేపార్థకము. అనగా నేను దేనినిజేయననుట.

తా. మరియు, పరలోకములను పొందుటకిచ్ఛయించెడిజనులు, కర్మోపాసనానుష్ఠానమును జేయుచున్నారు. నేను సర్వలోకస్వరూపుడనగుటచేత, ఏమియుం జేయనక్కరలేదు.

శ్లో॥ వ్యాచక్షతాంతేశాస్త్రాణివేదానధ్యాపయంతువా।
యేఽత్రాధికారిణోమేతునాధికారోఽక్రియత్వతః॥ ౨౫౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అత్ర-ఈలోకమందు, యే-ఏజనులు, అధికారిణః - అధికారవంతు లో, తే-ఆజనులు, శాస్త్రాణి-శాస్త్రములను, వ్యాచక్షతాం- చెప్పుదురుగాక. వేదాన్-వేదములను, అధ్యాపయంతువా-అధ్యయనము జేయింతురుగాక. మేతు-నాకో, అక్రియత్వతః-నిష్క్రియత్వమువలన, అధికారః-అధికారము, న-లేదు.

తా. ప్ర. అయితే, నియొక్కప్రయోజనముకొరకు నీకు ప్రవర్తనము లేకపోయినను, పరులయొక్క ప్రయోజనముకొరకైనను, నీకు ప్రవర్తనముగలుగదాయేమి?. ఉ. ఈలోకమందు అధికారులగు జనులు, తమ శిష్యులచేత శాస్త్రాధ్యయనమునైనను, వేదాధ్యయనమునైనను చేయించుచుందురు. నేను నిష్క్రియాస్వరూపుడనగుటవలన, పరులచేత వేదశాస్త్రాధ్యయనము జేయించెడి యధికారమునాకులేదు. అనగా నాకధికారములేమిచేత పరప్రయోజనముకొరకైనను నాకు ప్రవర్తనములేదని యభిప్రాయము.

శ్లో॥ నిద్రాభిక్షేస్నానశౌచేనేచ్ఛామినకరోమిచ।
ద్రష్టారశ్చేత్కల్పయంతికింమేస్యాదన్యకల్పనాత్॥ ౭౬౮.

టీ. (అహం) నేను, నిద్రాభిక్షే=నిద్రా-నిద్రను,భిక్షే-భిక్షను, నేచ్ఛామి-ఇచ్ఛయించుచుండెడి వాడనుగాను. స్నానశౌచే = స్నాన - స్నానమును, శౌచే-పారిశుద్ధ్యమును, నకరోమిచ-చేయుచుండెడివాడనుంగాను. ద్రష్టారః-చూచెడివారు, కల్పయంతిచేత్-కల్పించుచున్నారనియంటివేని,అన్యకల్పనాత్=అన్య-ఇతరులయొక్క, కల్పనాత్-కల్పనమువలన, మే-నాకు, కింస్యాత్ - ఏమి బాధయగును. అనగా నాకు ఎవ్విధబాధయులేదనుట.

తా. ప్ర. అయితే, నీదేహసంరక్షణకొరకు భిక్షాహరణాదికంబును, పరలోకసిద్ధికొరకు స్నానజపాదికంబును, నీచేత జేయబడుచుండగా, నీకు నిష్క్రియత్వమెట్లు సిద్ధించెను?. ఉ. నేను వాస్తవముచేత, నిద్రాభిక్షములనిచ్ఛయించెడివాడనుగాను. స్నానశౌచములను జేసెడివాడనుంగాను. మరియు, నిద్రాభిక్షామలను నేనిచ్ఛయించినట్లును, స్నానశౌచాదికమును నేను జేసినట్లు ను, చూచెడిజనులు కల్పించెదరని యంటివేని, అన్యులచేత జేయబడిన కల్పన వలన, నాకేమియుబాధలేదు. అనగా పూర్వోక్తనిద్రాభిక్షాద్యపేక్షయు.స్నానజపాదికర్మానుస్ఠానంబును, నాదృష్టిచేత నాకులేనేలేదనియు, అవి నాకుగలిగి యున్నట్లు అన్యులచేతనే కల్పించబడెననియు, ఆయన్యకల్పనచేత నాకు బాధ లేదనియు నభిప్రాయము.

అవ. అన్యకల్పనచేత బాధలేదనుటయందు దృష్టాంతమును జెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ గుంజాపుంజాదిదహ్యేతనాన్యారోపితవహ్నినా।
నాన్యారోపితసంసారధర్మానేవమహంభజే॥ ౫౫.

టీ. అన్యారోపితవహ్నినా=అన్య - అన్యులచేత, ఆరోపిత- కల్పించబడిన, వహ్నినా-అగ్నిచేత, గుంజాపుంజాది=గుంజా - పూసగురివిందపొదయు, పుంజాది-ధాన్యపురాశిమొదలగునదియు, నదహ్యేత - దహింపబడదు. ఏవం- ఈప్రకారము, అహం-నేను, అన్యారోపితసంసారధర్మాన్ = అన్య-ఇతరులచేత, ఆరోపిత-కల్పించబడిన, సంసారధర్మాన్ - సాంసారికధర్మములను, నభజే-పొందను.

తా. ప్ర. అయితే, అన్యకల్పనచేతగూడ,బాధగలదుగదా?. ఉ. అన్యులచే నారోపింపబడిన అగ్నిచేత, పూసగురివింద మొదలగు పొదలును, ధాన్యపురాశిమొదలగునదియు దహింపబడనట్లు, అన్యులచే నాయందుకల్పించబడెడి సాంసారికధర్మములను నేను పొందను.

శ్లో॥ శృణ్వంత్వజ్ఞాతతత్వాస్తేజానన్కస్మాచ్ఛృణోమ్యహం।
మన్యంతాంసంశయాపన్నానమన్యేహమసంశయః॥ ౫౬.

టీ. అజ్ఞాతతత్వాః=అజ్ఞాత-ఎరుగబడని, తత్వాః - జీవబ్రహ్మైక్యలక్షణముగల, అనగా బ్రహ్మసాక్షాత్కారములేనియనుట. తే - ఆముముక్షువులు, శృణ్వంతు-వేదాంతార్థమును వింటురుగాక. అనగా వేదాంత శ్రవణమునుజేయవలెననుట. అహం-నేను, జానన్-పరతత్వము నెరిగినవాడనగుచు,కస్మాత్-ఎందువలన, శృణోమి-వినెదను. అనగా వేదాంత శ్రవణమును జేయననుట. సంశయాపన్నాః=సంశయ-సందేహమును, ఆపన్నాః-పొందినవారు, మన్యంతాం-మననముజేయుదురుగాక. అసంశయః-సంశయములేని, అహం - నేను, నమన్యే- మననము జేయను.

తా. ప్ర. అయితే, నీకు, ఇతరఫలేచ్ఛలేకపోవుచుండగా, నీవు కర్మానుష్ఠానమును జేయకున్నను, తత్వసాక్షాత్కారముకొరకు వేదాంత శ్రవణాదికము జేయదగినదేయగుగదా?. ఉ. జీవబ్రహ్మైక్యలక్షణముగల పరతత్వము నెరుగని ముముక్షువులు, వేదాంతార్థశ్రవణమును జేయుదురు. నేను బ్రహ్మసాక్షాత్కారము గలవాడనగుటచేత,వేదాంతార్థశ్రవణమును జేయను. మరియు, జీవబ్రహ్మైక్యలక్షణ పరతత్వవిషయమై, తత్వమీప్రకారమో, లేక మరియొకవిధమోయనెడి రూపముగల సంశయవంతులు, వేదాంతార్థమును మననముజేయుదురు. నేను నిస్సంశయుడనగుటచేత, మననమును జేయను.

శ్లో॥ విపర్యస్తోనిదిధ్యాసేత్కింధ్యానమవిపర్యయాత్।

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేహాత్మత్వవిపర్యాసంనకదాచిద్భజామ్యహం॥ ౨౬౧.

టీ. విపర్యస్తః-విపరీతభావనను జేయువాడు, నిదిధ్యాసేత్- నిదిధ్యాసమును జేయవలెను. అవిపర్యయాత్- విపరీతభావములేమివలన, ధ్యానం-నిదిధ్యాసము, కిం-చేయవలసినపనియేమి. అనగా జేయననుట. దేహాత్మత్వవిపర్యాసం=దేహ- దేహమందు, ఆత్మత్వ - ఆత్మత్వబుద్ధిలక్షణము గల, విపర్యాసం = విపరీతభావనను, అహం - నేను, కదాచిత్ - ఎప్పటికిని, నభజామి- పొందను.

తా. ప్ర. అయితే, వేదాంతశ్రవణ మననములలోఁటి నీకావశ్యకము లేకపోయినను, విపరీతభావమును పోగొట్టుకొనుటకొరకు, నిదిధ్యాసమైనను నీచేత జేయదగినదికాదాయేమి?. ఉ. దేహాదికమందు ఆత్మత్వబుద్ధి లక్షణము గల విపరీతభావమును జేయువాడు,ఆవిపరీతభావము నశించెడికొరకు, (అహం బ్రహ్మాస్మి) అనెడి చింతనారూపము గల నిదిధ్యాసమును జేయవలెను. అట్టి విపరీతభావము లేకపోవుచుండగా, నిదిధ్యాసరూపధ్యానమును జేయవలసినపనిలేదు. దేహాదికమందు ఆత్మత్వబుద్ధిలక్షణముగల విపరీతభావమును నేనెప్పటికిని బొందను. అనగా దేహాదికమందు ఆత్మత్వబుద్ధిలక్షణము గల విపరీతభావము నాకులేమిచేత, ఆనిదిధ్యాసముగూడ, నాచే ననుష్ఠింపదగినదిగాదని యభిప్రాయము.

శ్లో॥ అహంమనుష్యఇత్యాదివ్యవహారోవినాప్యముం।
విపర్యాసంచిరాభ్యస్తవాసనాతోఽవకల్పతే॥ ౨౬౨.

టీ. అముం-ఈ, విపర్యాసం- విపరీతభావమును, వినాపి - విడచినను, చిరాభ్యస్తవాసనాతః= చిర-బహుకాలమునుంచి, అభ్యస్త-అభ్యసింపబడిన, వాసనాతః - వాసనావశమువలన, అహం-నేను, మనుష్యః-మనుష్యుడనెడి, ఇత్యాదివ్యవహారః - ఇత్యాదిరూపకవ్యవహారము, అవకల్పతే- కల్పించబడుచున్నది.

తా. ప్ర. అయితే, మీకు విపర్యయము లేనియెడల, నేను మనుష్యుడననెడి వ్యవహారము మీకెట్లుఘటించును?. ఉ. ఈ విపరీతభావమున్ను విడచినను, బహుకాలమునుంచి యభ్యసింపబడిన వాసనావశముచేత, నేను మనుష్యుడననెడి ఇత్యాది వ్యవహారము కల్పించబడుచున్నదని తెలిసికొనుము.

శ్లో॥ ప్రారబ్ధకర్మణిక్షీణేవ్యవహారోనివర్తతే।
కర్మాక్షయేత్వసౌనైవశామ్యేద్ధ్యానసహస్రతః॥ ౨౬౩.

టీ. ప్రారబ్ధకర్మణి-ప్రారబ్ధకర్మము, క్షీణేసతి- క్షయమునుబొందుచుం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డగా, వ్యవహారః-నేనుమనుష్యుడననెడి వ్యవహారము, నివర్తతే - నివృత్తిని బొందుచున్నది. కర్మాక్షయేపి = కర్మ- ప్రారబ్ధకర్మముయొక్క, అక్షయేపి- క్షయాభావమందో, అసౌ-ఈవ్యవహారము, ధ్యానసహస్రతః - ధ్యానసహస్రమువలన, నైవనాశమ్యేత్-నాశమునుపొంద నేపొందదు.

తా. ప్ర. అయితే, ఈవ్యవహారముయొక్క నివృత్తిసిద్ధికొరకు, మీచేతధ్యానము సంపాదింపదగినదేయగుగదా?. ఉ. ప్రారబ్ధకర్మము క్షయించుచుండగా, ఈ మనుష్యత్వాది వ్యవహారము నివర్తించుచున్నది. ప్రారబ్ధకర్మము క్షయించని యెడల, ధ్యానసహస్రముచే నైనను, ఈ వ్యవహారము నివర్తింపదు.

శ్లో॥ విరళత్వంవ్యవహృతేరిష్టంచేద్ధ్యానమస్తుతే।
అబాధికాంవ్యవహృతింపశ్యన్ధ్యాయామ్యహంకుతః॥ ౧౬౪.

టీ. వ్యవహృతేః - మనుష్యత్వాది వ్యవహారముయొక్క, విరళత్వం- వెలితి, అనగా నబాహుళ్యత్వమనుట. ఇష్టంచేత్- ఇష్టమైనయెడల, తే-నీకు, ధ్యానం- ధ్యానము, అస్తు-అగుగాక. అహం-నేను, వ్యవహృతిం - వ్యవహారమును, అబాధికాం-బాధకముగానిదానినిగా, పశ్యన్-చూచుచు, కుతః-ఎందువలన, ధ్యాయామి- ధ్యానముజేసెదను. అనగా ధ్యానము జేయననుట.

తా. ప్ర. అయితే, ప్రారబ్ధకర్మ నిమిత్తకమగు వ్యవహారముయొక్క అబాహుళ్యతకొరకైనను, మీచేధ్యానము జేయదగినదికాదా యేమి?. ఉ. నీవు వ్యవహారముయొక్క అబాహుళ్యత్వమును గోరితివేని, ధ్యానమును జేయుము. నేను వ్యవహారమును బాధకముగానిదానినిగా జూచుచు, ఎందువలన ధ్యానించెదను. అనగా వ్యవహారము నాకబాధకముగా గనబడుచుండుటచేత, దాని నివృత్తికొరకు నాచేత ధ్యానమనుష్ఠింపదగినదిగాదని యభిప్రాయము.

శ్లో॥ విక్షేపోనాస్తియస్మాన్మేనసమాధిస్తతోమమ।
విక్షేపోవాసమాధిర్వామనసస్స్యాద్వికారిణః॥ ౧౬౫.

టీ. యస్మాత్-ఏకారణమువలన, మే-నాకు, విక్షేపః-విక్షేపము, నాస్తి- లేదో, తతః- ఆకారణమువలన, మమ-నాకు, సమాధిః - సమాధి, న - లేదు. విక్షేపోవా-విక్షేపమైనను, సమాధిర్వా - సమాధియైనను, వికారిణః- వికారియగు, మనసః-మనస్సునకు, స్యాత్-అగును.

తా. ప్ర. అయితే, మీచేతధ్యానము జేయదగినదిగాకపోయినను, విక్షేపము నశించెడికొరకు, మీచేతసమాధి, జేయదగినదికాదాయేమి?. ఉ. ఏకారణముచేత నాకువిక్షేపములేదో, ఆకారణముచేత, నాకు సమాధిలేదు. మరియు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విక్షేపమైనను సమాధియైనను వికారియగుమనస్సునకగును. అనగా, విక్షేపసమాధులు రెండును మనోధర్మములగుటవలన, విక్షేపమును నివారింపజేసెడి సమాధియందును నిర్వికారుడనగు నాకథికారము లేదని యభిప్రాయము.

అవ. ఈచెప్పఁబడిన కృతకృత్యత్వము నిప్పుడు ముగించుచున్నాడు.

శ్లో॥ నిత్యానుభవరూపస్య కోవా మేఽనుభవః పృథక్।
కృతంకృత్యంప్రాపణీయంప్రాప్తమిత్యేవనిశ్చయః॥ ౨౮౮.

టీ. నిత్యానుభవరూపస్య=నిత్య-సర్వదా, అనుభవరూపస్య- అనుభవరూపుడనగు, మే-నాకు, పృథక్-అన్యమైన, అనుభవః=అనుభవము, కోవా-ఎక్కడిదో జెప్పుము. కృత్యం-చేయదగినది, కృతమితి-చేయఁబడెననియు, ప్రాపణీయం-పొందదగినది, ప్రాప్తమిత్యేవ-పొందబడెననియే, నిశ్చయః-నానిశ్చయమగును.

తా. ప్ర. అయితే, సమాధిఫలమగు అనుభవము, మీచేతసంపాదింపదగినదియగుఁగదా?. ఉ. సర్వదా అనుభవరూపుడనగు నాకు, అన్యమైన అనుభవము లేదు. అనగా నాయనుభవము నాస్వరూపమగుటచేత, అది సంపాదింపదగినదికాదని యభిప్రాయము. నాచేత జేయదగిన కార్యవర్గమంతయు జేయబడినట్లాయెననియు, పొందదగినఫలవర్గమంతయు పొందఁబడెననియే, నానిశ్చయమగును. ఇదియే కృతకృత్యత్వమని తెలియవలెను.

శ్లో॥ వ్యవహారో లౌకికోవా శాస్త్రీయోవాన్యథాపివా।
మమాకర్తురలేపస్యయథారబ్ధంప్రవర్తతాం॥ ౨౮౯.

టీ. లౌకికోవా- భిక్షాహారాదిరూపమైనను, శాస్త్రీయోవా - జపసమాధ్యాదిరూపమైనను, అన్యథాపివా-హింసాదిరూపమైన, వ్యవహారః-వ్యవహారము, అకర్తుః-అకర్తయైనట్టియు, అలేపస్య-భోక్తృత్వములేనట్టి, మమ- నాకు, ఆరబ్ధంయథా-ప్రారబ్ధకర్మమునతిక్రమించక, ప్రవర్తతాం- ప్రవర్తించుఁగాక.

తా. ప్ర. అయితే, ఈప్రకారము మీకంతటను కర్తృత్వములేకపోవుచుండగా, మీకనియతవృత్తిత్వము ప్రాప్తించదా యేమి?. ఉ. కర్తృత్వభోక్తృత్వరహితుడనగునాకు, ప్రారబ్ధకర్మమునతిక్రమించక, భిక్షాహారాది లౌకిక వ్యవహారమైనను జపసమాధ్యాది శాస్త్రీయ వ్యవహారమైనను, ప్రతిషిద్ధహింసాది వ్యవహారమైనను గలుగుట, మాకిష్టమేయగును. అనగా ప్రారబ్ధవశముచేత ప్రాప్తించెడి అనియతవృత్తిత్వముగలిగినను గలుగనిమ్మని యభిప్రాయము.

అవ. ఇట్లు వస్తుతత్వమును దెలిపి, ప్రౌఢవాదముచే నిప్పుడు చెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ అథవాకృతకృత్యోపిలోకానుగ్రహకామ్యయా।
శాస్త్రీయేణైవమార్గేణవర్తేహంకామమత్షతిః॥ ౨౬౮.

టీ. అథవా-మరియొకపక్షమందు, అహం-నేను, కృతకృత్యోపి - కృతార్థుడనైనను, లోకానుగ్రహవాంఛయా = లోక-ప్రాణులయందు, అనుగ్రహవాంఛయా-అనుగ్రహేచ్ఛచేత, శాస్త్రీయేణ-శాస్త్రసమ్మతమగు, మార్గేణైవ-మార్గముచేతనే, కామం-మిక్కిలిగా, వర్తే-ప్రవర్తించెదను. అక్షతిః-బాధలేదు.

తా. మరియు, నేనుకృతకృత్యుడనైనను మరియొకపక్షమందు ప్రాణులయందు అనుగ్రహేచ్ఛచేత శాస్త్రసమ్మతమార్గముచేతనే మిక్కిలిగా ప్రవర్తించెదను. అందుచే బాధలేదు.

శ్లో॥ దేవార్చనస్నానశౌచభిక్షాదౌవర్తతాంవపుః।
తారంజపతువాక్తద్వత్పఠత్వామ్నాయమస్తకం॥ ౨౬౯.

టీ. వపుః-శరీరము, దేవార్చనస్నానశౌచభిక్షాదౌ=దేవార్చన-దేవతార్చనము జేయుటయందును, స్నాన-స్నానము జేయుటయందును, శౌచ-శుచిత్వమందును, భిక్షాదౌ-భిక్షాహరణాదికమందును, వర్తతాం - ప్రవర్తించుగాక. వాక్-నోరు, తారం - ప్రణవమును, పఠతు-పఠించుగాక. తద్వత్-ఆప్రకారముగా, ఆమ్నాయమస్తకం - వేదాంతశాస్త్రమును, పఠతు-పఠించుగాక. అనగా పఠించుననుట.

తా. ప్ర. అయితే, శాస్త్రీయ మార్గమందే మీరు ప్రవర్తనము నంగీకరించినయెడల, ఆ యభిమాన ప్రయుక్తవికారము, మీకుకలుగదాయేమి? దేవతార్చనమును జేయుటయందును, స్నానమునుచేయుటయందును, శుచిత్వమందును, భిక్షాహరణాదికమందును, దేహము ప్రవర్తించును. మరియు, నోరు, ప్రణవమునైనను, వేదాంతశాస్త్రమునైనను పఠించుచుండును.

శ్లో॥ విష్ణుం ధ్యాయతుధీర్యద్వాబ్రహ్మానందేవిలీయతాం।
సాక్ష్యహంకించిదప్యత్రనకుర్వేనాపికారయే॥ ౨౭౦.

టీ. ధీః-బుద్ధి, విష్ణుం - విష్ణుదేవుని, ధ్యాయతు - ధ్యానించుగాక. యద్వా-లేక, బ్రహ్మానందే=బ్రహ్మ-బ్రహ్మస్వరూపమగు, ఆనందే- ఆనందమందు, విలీయతాం-లీనమునుపొందుగాక. అత్ర-ఈబుద్ధ్యాది వ్యవహారవిషయమై, సాక్షీ-సాక్షినగు, అహం-నేను, కించిదపి-కొంచెమైనను, నకుర్వే-చేయుచుండెడి వాడనుంగాను. నాపికారయే - చేయించుచుండెడి వాడనుంగాను.

తా. మరియు, నాబుద్ధి,విష్ణువునుధ్యానముజేయుచుండును. లేక,బ్రహ్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నందమందులయించును. ఈబుద్ధికి సాక్షినగు నేను, కొంచెమైనను చేసినవాడ నుంగాను. చేయించినవాడనుంగాను.

అవ. ఇప్పుడు ఫలితమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఏవంచ కలహః కుత్రసంభవేత్కర్మిణో మమ।
విభిన్నవిషయత్వేన పూర్వాపరసముద్రవత్॥ ౧౭౧.

టీ. ఏవంచ-ఈప్రకారము, కర్మిణః-కర్మికిని, మమ- నాకును, పూర్వాపరసముద్రవత్=పూర్వ - తూర్పుదిక్కునందుండునట్టియు, అపర - పశ్చిమదిక్కునందుండునట్టి, సముద్రవత్-సముద్రములకువలె, విభిన్నవిషయత్వేన-విభిన్నవిషయత్వముచేత, కలహః-కలహము, కుత్ర- ఎచ్చట, సంభవేత్ - సంభవించును. అనగా సంభవింపదనుట.

తా. ఈప్రకారము, కర్మికినినాకును, ప్రాక్పశ్చిమసముద్రములకువలె, విభిన్నవిషయముగలిగియుండుటచేత, కలహమెచ్చటయు సంభవింపదు.

అవ. విభిన్నవిషయత్వమునే, ఇప్పుడు స్పష్టముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ వపుర్వాగ్ధీషు నిర్బంధః కర్మిణో నతు సాక్షిణి।
జ్ఞానినస్సాక్ష్యలేపత్వే నిర్బంధో నేతరత్రహి॥ ౧౭౨.

టీ. కర్మిణః-కర్మికి, వపుర్వాగ్ధీషు= వపుః దేహమందును, వాక్-వాక్కునందును, ధీషు-బుద్ధియందును, నిర్బంధః-నిర్బంధముగలదు. సాక్షిణితు- ప్రత్యగాత్మయందో, న-నిర్బంధములేదు. జ్ఞానినః-జ్ఞానికి, సాక్ష్యలేపత్వే = సాక్షీ-ప్రత్యగాత్మయొక్క, అలేపత్వే-అభోక్తృత్వమందు, నిర్బంధః - నిర్బంధము గలదు. ఇతరత్రహి-ఇతరమందు, అనగా మనోవాగ్దేహములయందనుట. న-నిర్బంధములేదు.

తా. కర్మియగువాడు, మనోవాగ్దేహములచేత కర్మములను జేయుచుండుటవలన, ఆమనోవాగ్దేహములను పుణ్యకర్మములయందు ప్రవర్తింపజేయవలెననెడి నిర్బంధము కర్మికిగలదుగాని, ప్రత్యగాత్మవిషయమైన నిర్బంధము లేదు. మరియు, జ్ఞానికి, ప్రత్యగాత్మయొక్క అభోక్తృత్వానుసంధానమును జేయుటయందే నిర్బంధముగలదుగాని, మనోవాగ్దేహములను సత్కర్మములయందు ప్రవర్తింపజేయవలెననెడి నిర్బంధములేదు. కనుక,కర్మిజ్ఞానులిద్దరును విభిన్నవిషయులగుదురు.

అవ. అట్లు విభిన్నవిషయులగుచులడియు, ఏకర్మిజ్ఞానులు కలహించెదరో, వారు విద్వాంసులచేత పరిహసింపదగినవారగుదురని యిప్పుడు చెప్పుచున్నాడు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ ఏవంచాన్యోన్యవృత్తాంతానభిజ్ఞౌబధిరావివ।
వివదేతాంబుద్ధిమంతోహసంత్యేవవిలోక్యతౌ॥ ౧౭౩.

టీ. ఏవంచ-ఈప్రకారము, అన్యోన్యవృత్తాంతానభిజ్ఞౌ=అన్యోన్య-పరస్పరముయొక్క, వృత్తాంత-వృత్తాంతమును, అనభిజ్ఞౌ-ఎరుగనివారగుచు, బధిరావివ-చెవిటివాండ్రవలె, వివదేతాం - కలహముజేసెదరో, తౌ-ఆకర్మిజ్ఞానులనిద్దరిని, బుద్ధిమంతః-పండితులు, విలోక్య-చూచి, హసంత్యేవ - నవ్వుదురు.

తా. ఈ ప్రకారము అన్యోన్యవృత్తాంతము నెరుగని; యేకర్మిజ్ఞానులిద్దరును చెవిటివాండ్రవలె కలహించుకొనెదరో, అట్టి కర్మిజ్ఞానులనిద్దరిని పండితులుజూచి, పరిహాసమును జేయుదురు.

శ్లో॥ యంకర్మీనవిజానాతిసాక్షిణంతస్యతత్త్వవిత్।
బ్రహ్మత్వంబుధ్యతాంతత్రకర్మిణఃకింవిహీయతే॥ ౧౭౪.

టీ. కర్మీ-కర్మములనుజేయువాడు, యం-ఏ,సాక్షిణం-ప్రత్యగాత్మను, నవిజానాతి-ఎరుగడో, తస్య-ఆప్రత్యగాత్మకు, బ్రహ్మత్వం- బ్రహ్మభావమును, అనగా బ్రహ్మస్వరూపలక్షణమనుట. తత్త్వవిత్-జ్ఞాని,బుధ్యతాం-ఎరుగుగాక. తత్ర-ఆవిషయమందు, కర్మిణః-కర్మికి, కింవిహీయతే - లోపమేమి. అనగా కర్మానుష్ఠానమందు లోపములేదనుట.

తా. ప్ర. అయితే, అట్లుకలహించెడి కర్మిజ్ఞానులనుజూచి, విద్వాంసులు పరిహాసమజేయుటకు కారణమేమి?. ఉ. ఆకర్మిజ్ఞానులిద్దరును, నిర్విషయకలహకారులగుటవలన, విద్వాంసులచేత పరిహసింపబడుదురు. ప్ర. ఆనిర్విషయకలహకారిత్వమెట్లు?. ఉ. కర్మియగువాడు, కర్మానుష్ఠానమునకు ఉపయోగించెడి దేహవాగ్బుద్ధులకంటె అన్యుడగు ప్రత్యగాత్మనెరుగడు. జ్ఞానియగువాడు, ఆప్రత్యగాత్మను పరబ్రహ్మమునుగా నెరుగుటచేత, కర్మికి, తనకర్మానుష్ఠానమందు లోపమేమియులేదు.

శ్లో॥ దేహవాగ్బుద్ధయస్త్యక్తాజ్ఞానినానృతబుద్ధితః।
కర్మీప్రవర్తయత్వాభిర్జ్ఞానినోహీయతేఽత్రకిం॥ ౧౭౫.

టీ. జ్ఞానినా-జ్ఞానిచేత, దేహవాగ్బుద్ధయః = దేహ-శరీరంబును, వాక్-నోరును, బుద్ధయః-బుద్ధియు, అనృతబుద్ధితః- మిథ్యాత్వజ్ఞానమువలన, త్యక్తాః-విడువబడినవి. ఆభిః-ఈదేహవాగ్బుద్ధులచేత, కర్మీ-కర్మములను చేసెడివాడు, ప్రవర్తయతు-కర్మానుష్ఠానమందు ప్రవర్తించుగాక. అత్ర-ఈవిషయమందు,జ్ఞానినః-జ్ఞానికి, కింవిహీయతే- లోపమేమి. అనగా లోపములేదనుట.

తా. మరియు, జ్ఞానిచేత దేహవాగ్బుద్ధులు మూడును, మిథ్యాత్వజ్ఞానము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలన విడువబడినవగును. అట్టిదేహవాగ్బుద్ధులచేత, కర్మియగువాడు కర్మానుస్థానమందు బ్రవర్తించుచున్నాడు. అట్లు ప్రవర్తించుటచేత జ్ఞానికైనను లోపములేదు. కనుక, వ్యర్థముగా కలహించెడి కర్మిజ్ఞానులు, విద్వాంసులచేత బరిహాసము జేయదగినవారగుదురని యభిప్రాయము.

శ్లో॥ ప్రవృత్తిర్నోపయుక్తాచేన్నివృత్తిఃక్వోపయుజ్యతే।
బోధహేతుర్నివృత్తిశ్చేద్బుభుత్సాయాంతథేతరా॥ ౨౭౮.

టీ. (జ్ఞానినః) జ్ఞానికి, ప్రవృత్తిః- ప్రవర్తనము. అనగా కర్మానుస్థానమనుట. ఉపయుక్తా-ఉపయోగమునుబొందునది, నచేత్ - కాదనియంటివేని, నివృత్తిః-నివృత్తి, అనగా కర్మములను జేయమియనుట. క్వ-ఎచ్చట, ఉపయుజ్యతే-ఉపయోగించబడుచున్నది. అనగా నివృత్తిచేత నుపయోగము లేదనుట. నివృత్తిః-కర్మములను జేయమి, బోధహేతుః=బోధ-జ్ఞానమునకు, హేతుః- కారణము, స్యాచ్చేత్ - అగుననియంటివేని, ఇతరా - ప్రవృత్తి, బుభుత్సాయాంస త్యాం-పరతత్వమునెరుగుట కిచ్ఛగలుగుచుండగా, తథా- ఆప్రకారమగును. అనగా జ్ఞానహేతువగుననుట.

తా. ప్ర. జ్ఞానికి కర్మానుస్థానముచేత బ్రయోజనములేమివలన, అజ్ఞాని కర్మములం జేయకుండవలయుగదా?. ఉ. సరి. జ్ఞానికి నివృత్తిచేత నుపయోగములేదు. అనగా నుపయోగములేమి, నివృత్తియందును సమానమే యగునని యభిప్రాయము, ప్ర. అయితే, నివృత్తి,బోధహేతువగుటవలన, ఆనివృత్తిచేత నుపయోగములేదని యెట్లుచెప్పవచ్చును?. ఉ. సరి. అట్లైనయెడల, పరతత్వము నెరుగుట కిచ్ఛగలుగుచుండగా, ప్రవృత్తియు బోధహేతునే యగును. అనగా జ్ఞానికి బ్రవృత్తియు, బోధహేతువగుటచేత, ఆప్రవృత్తియు నుపయోగము గలదేయగునని యభిప్రాయము.

శ్లో॥ బుద్ధశ్చేన్నబుభుత్సేతనాప్యసౌబుధ్యతేపునః।
అబాధాదనువర్తేతబోధోనత్వన్యసాధనాత్॥ ౨౭౭.

టీ. బుద్ధః-తత్వమునెరిగినవాడు, నబుభుత్సేతచేత్ - మరలనెరుగుటకిచ్ఛను జేయడనియంటివేని, అసౌ-ఈతత్వవేత్త, పునరపి-మరల, నబుధ్యతే - ఎరుగడు, బోధః-తత్వజ్ఞానము, అబాధాత్- బాధనుబొందమివలన , అనువర్తేత- అనువర్తించును. అనగా స్థిరముగానుండుననుట. అన్యసాధనాత్- ఇతరసాధనమువలన, అనగా నితరసాధనానుస్థానముచేననుట. నతు - స్థిరత్వమునుబొందదు.

తా. ప్ర. అయితే, తత్వము నెరిగినవానికి, మరల తత్వము నెరుగుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కిచ్ఛలేమిచేత, ప్రవృత్తి, ఎట్లుపయోగించును?. ఉ. సరి. అట్లైనయెడల,తత్వ్వముసెరిగినవానికి, మరల బోధతోపనిలేమిచేత, ఆబోధహేతువగు నివృత్తియు, జ్ఞానినిగురించి, ఉపయోగముగలదిగాదని తెలిసికొనుము. ప్ర. అయితే, ఒకానొకప్పుడు బుట్టినజ్ఞానముయొక్క స్థిరత్వముకొరకు, జ్ఞానిచేతనివృత్తి, అపేక్షింపబడదాయేమి?. ఉ. స్థిరత్వము, బాధకాభావము నపేక్షించునేగాని, మరియొకసాధనము నపేక్షించదు. కనుక, వేదాంతవాక్యప్రమాణమువలన గలిగినజ్ఞానమునకు మరియొక బలవత్ప్రమాణముచేత బాధలేమివలన, అట్టియపరోక్షజ్ఞానము స్థిరముగానిల్చియేయుండును. అందువలన, అట్టి స్థిరత్వముకొరకు, మరియొకసాధన మనుష్ఠింపదగినదికాదు. అనగా జ్ఞానవంతుడు జ్ఞానస్థైర్యతకొరకు నివృత్తి ననుష్ఠించడని యభిప్రాయము.

శ్లో॥ నావిద్యానాపితత్కార్యంబోధంబాధితుమర్హతి।
పురైవతత్వబోధేనబాధితేతేఉభేయతః॥ ౨౭౮.

టీ. అవిద్యా-అజ్ఞానము, బోధం-జ్ఞానమును, బాధితుం-బాధించుటకు, నార్హతి-తగినదికాదు. తత్కార్యమపి-ఆయవిద్యాకార్యమగుదేహాదిద్వైతంబును, బోధం-తత్వజ్ఞానమును, బాధితుం-బాధించుటకు, నార్హతి - తగినదికాదు, తత్వబోధేన-తత్వజ్ఞానముచేత, పురైవ - పూర్వమే, తే-ఆ, ఉభే - రెండును, అనగా నవిద్యాతత్కార్యములనుట. యతః-ఏకారణమువలన, బాధితే-బాధింపబడినవో.

తా. ప్ర. అయితే, మరియొకప్రమాణముచేత, బోధ, బాధింపబడకున్నను, అవిద్యచేనైనను, ఆయవిద్యాకార్యమగు దేహాదిద్వైతముచే నైనను కర్తృత్వాదిరూపమగు అధ్యాసముచేనైనను, బాధింపబడదా యేమి?. ఉ. అవిద్యయైనను, ఆయవిద్యాకార్యమగు దేహాదిద్వైతమైనను, తత్వబోధనుబాధించుటకుతగినదికాదు. ప్ర. అందుకుహేతువేమియో చెప్పుము?. ఉ. ఏకారణమువలన తత్వబోధచేత, ఆయవిద్యాతత్కార్యములు రెండును పూర్వమే బాధింపబడినవో, ఆకారణమువలన, ఆరెండును బోధను బాధింపజాలవని తెలియవలెను.

శ్లో॥ బాధితందృశ్యతామక్షైస్తేనబాధోనదృశ్యతే।
జీవన్నాఖుర్నమార్జారంహంతిహన్యాత్కథంమృతః॥ ౨౭౯.

టీ. బాధితం-బాధింపబడిన దేహాదిద్వైతము, అక్షైః- ఇంద్రియములచేత, దృశ్యతాం-చూడబడుగాక. తేన-ఆదేహాదిద్వైతముచేత, బాధః- బోధకుబాధ, నదృశ్యతే-కనబడుచున్నదిగాదు. అనగా లేదనుట. ఆఖుః - ఎలుక,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జీవన్-జీవించుచు, మార్జారం-పిల్లిని, నహంతి-చంపలేదు. మృతః- చచ్చినయెలుక, కథం-ఎట్లు, హన్యాత్-పిల్లిని, చంపును. అనగా జంపజాలదనుట.

తా. ప్ర. అయితే, బోధచేత అవిద్యబాధింపబడినను, ఆయవిద్యాకార్యమగు దేహేంద్రియాదిద్వైతము ప్రత్యక్షముగా దోచుచుండుటచేత బాధింపబడనందున, అట్టి దేహాదిద్వైతముచేత బోధకు, బాధ, గలుగునుగదా?.
ఉ. ఉపాదానకారణమగు అవిద్య, నివర్తించుచుండగా దానికార్యమగు దేహాదిద్వైతము ఇంద్రియములకు దోచుచున్నను బాధింపబడినదే యగును. అట్లు బాధింపబడిన దేహాదిద్వైతముచేత, బోధకుబాధలేదు. ఇందుకుదృష్టాంతమును జెప్పెదవినుము. జీవించియుండెడి యెలుక, పిల్లినిచంపజాలదు. అట్టియెలుకమృతినిబొందిన, పిల్లినిచంపజాలనట్లు, బోధచేత బాధింపబడిన దేహాదిద్వైతము, బోధను బాధింపజాలదని తెలియవలెను.

అవ. ద్వైతదర్శనముచేత తత్త్వబోధకు బాధలేదనెడివిషయమును కైముతికన్యాయప్రదర్శనముచేత దృఢీకరించుటకు,అందుకనుకూలదృష్టాంతము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ అపిపాశుపతాస్త్రేణవిద్ధశ్చేన్నమమారయః।
నిష్ఫలేషువినున్నాంగోనంక్ష్యతీత్యత్రకాప్రమా॥ ౨౮౦.

టీ. యః-ఏసమర్థుడగుపురుషుడు, పాశుపతాస్త్రేణ - పాశుపతాస్త్రముచేత, విద్ధోపి-కొట్టబడియు, నమమారచేత్-చావనియెడల (సః) ఆపురుషుడు, నిష్ఫలేషువినున్నాంగస్సన్=నిష్ఫల-శల్యరహితమగు, ఇషు- బాణముచేత, వినున్న-ప్రేర్యబడిన, అనగా చీల్చబడిననుట. అంగస్సన్-దేహముగలవాడగుచు, నంక్ష్యతీతి-నాశమును బొందుచున్నాడనెడి, అత్ర - ఈయర్థమందు, ప్రమా-ప్రమాణము, కా-ఏమి. అనగా నిశ్చయములేదనుట.

తా. మరియు, సమర్థుడగు పురుషుడు పాశుపతాస్త్రముచేత కొట్టబడి దేహమందు రంధ్రము జేయబడినవాడై చావనియెడల, అట్టి పురుషుడు శల్యరహితమైనబాణముచేత చీల్చబడిన దేహముగలవాడై, నాశమును బొందెననెడి వాక్యమెప్పటికిని నిశ్చయజ్ఞానమును గలిగింపజాలదు.

అవ. ఈదృష్టాంత సిద్ధార్థము నిప్పుడు దార్ష్టాంతికమందు గూర్చుచున్నాడు.

శ్లో॥ ఆదావవిద్యయాచిత్రైస్స్వకార్యైఃజృంభమాణయా।
యుద్ధ్వాబోధోఽజయత్సోద్యసుదృఢోబాధ్యతాంకథం॥ ౨౮౧.

టీ. ఆదౌ-జ్ఞానాభ్యాససమయమందు, చిత్రైః- బహువిధములైన, స్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కార్యైః=స్వ-తనయొక్క, అనగా నవిద్యయొక్కయనుట. కార్యైః- ప్రమాతృత్వభోక్తృత్వ కర్తృత్వాదులచేత, జృంభమాణయా - విశేషముగావర్ధిల్లుచుండెడి, అవిద్యయా-అజ్ఞానములోటి, బోధః-తత్వజ్ఞానము, యుద్ధ్వా-యుద్ధమును జేసి, (తాం) ఆయవిద్యను, అజయత్-జయించెను. సుదృఢః - అభ్యాసపాటవముచేత మిక్కిలిదృఢత్వమునుబొందిన, సః - అబోధ, అద్య-ఇప్పుడు, అనగా నవిద్యనివర్తిలచుచుండగాననుట. కథం-ఎట్లు, బాధ్యతాం-బాధింపబడును. అనగా నిర్మూలమగు నవిద్యాకార్యముచేత బాధింపబడదనుట.

తా. విద్యాభ్యాససమయమందు, బహువిధములైన, తనయొక్క కార్యములగు ప్రమాతృత్వభోక్తృత్వకర్తృత్వాదులలోటి విశేషముగా వర్ధిల్లుచుండెడి అవిద్యలోటి, బోధ, యుద్ధముచేసి, ఆయవిద్యనుజయించెను. ఆబోధయే అభ్యాసపాటవముచేత మిక్కిలిదృఢత్వమునుబొందెను. ఇప్పుడు అవిద్యానివృత్తినిబొందుచుండగా నిర్మూలమైనదానికార్యమగు అధ్యాసముచేత, నెట్లును బాధింపబడదు.

అవ. ఈయుపపాదింపబడిన యర్థము, శిష్యులయొక్క బుద్ధికెక్కుటకొరకు, రూపకముచే నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ తిష్ఠంత్వజ్ఞానతత్కార్యశవాబోధేనమారితాః।
నభీతిర్బోధసమ్రాజఃకీర్తిఃప్రత్యుతతస్యతైః॥ ౭౮౨.

టీ. బోధేన-బోధచేత, మారితాః - చంపబడిన, అజ్ఞానతత్కార్యశవాః=అజ్ఞాన-అవిద్యయనునట్టియు, తత్-ఆయవిద్యయొక్క, కార్య- కార్యములనెడి, శవాః-పీనుగులు. తిష్ఠంతు-ఉండుగాక. బోధసమ్రాజః=బోధ-తత్వబోధయనెడి, సమ్రాజః-సమ్రాట్టునకు, భీతిః-భయము, న-లేదు. తస్య-ఆబోధసమ్రాట్టునకు, తైః-ఆపీనుగులచేత, కీర్తిః-కీర్తిగలదని, ప్రత్యుత-చెప్పవలసినపనియేమి. అనగా జెప్పవలసిన నక్కరలేదనుట.

తా. మరియు, తత్వబోధయనెడి సమ్రాట్టుచేతజంపబడిన,ఆయవిద్యాతత్కార్యములనెడి పీనుగులుండుగాక. అవియుండుటచేత బోధయనెడి సమ్రాట్టునకు భయములేదు. మరియు, ఆయవిద్యాదిశవములచేత, నాబోధయనెడి సమ్రాట్టునకు, కీర్తిగలుగునని యికచెప్పవలసినపనిలేదు.

శ్లో॥ యఏవమతిశూరేణబోధేననవియుజ్యతే।
ప్రవృత్త్యావానివృత్త్యావా దేహాదిగతయాఽస్యకిం॥ ౭౮౩.

టీ. యః-ఏపురుషుడు, ఏవం- ఈపూర్వోక్తప్రకారము, అతిశూరేణ-అధికశూరుడగు, అనగా నవిద్యాతత్కార్యఘాతకమైనట్టి యనుట. బోధేన-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మాత్మైకత్వజ్ఞానములోఁటి, నవియుజ్యతే-వియోగమును బొందఁడో, అస్య-ఈపురుషునకు, దేహాదిగతయా=దేహాది-దేహాదికమును, గతయా-పొందియుండెడి, ప్రవృత్త్యావా-ప్రవృత్తిచేతనైనను, నివృత్త్యావా-నివృత్తిచేతనైనను, కిం-ఏమి. అనగా నిష్టమనిష్టంబు గొంచెమైనను లేదనుట.

తా. ప్ర. సరి. అట్లగుగాక. ఇట్లు చెప్పుటచేత ప్రకృతమందు లాభమేమి?. ఉ. ఏపురుషుడు, ఈ చెప్పబడిన ప్రకార మవిద్యాతత్కార్యఘాతకమగు బ్రహ్మాత్మైకత్వలక్షణ బోధలోఁటి ఎప్పటికిని వియోగమును బొందడో, ఆ యీపురుషునకు దేహాదికమందుండెడి ప్రవృత్తిచేనైనను, నివృత్తిచేనైనను, ఇష్టానిష్టను కొంచెమైనను లేదని తెలియవలెను.

శ్లో॥ ప్రవృత్తావాగ్రహోన్యాయ్యోబోధహీనస్యసర్వథా।
స్వర్గాయవాపవర్గాయయతితవ్యంయతోనృభిః॥ ౨౮౪.

టీ. బోధహీనస్య-తత్త్వజ్ఞానములేనివానికి, సర్వథా - సర్వవిధములచేతను, ప్రవృత్తౌ-ప్రవృత్తియందు, ఆగ్రహః-పూనిక, అనగా బ్రయత్నమనుట. న్యాయ్యః-తగినదగును. యతః-ఏకారణమువలన, నృభిః-జనులచేత, స్వర్గాయవా-స్వర్గముకొరకైనను, అపవర్గాయవా - మోక్షముకొరకైనను, యతితవ్యం-ప్రయత్నము జేయదగినదో.

తా. ప్ర. అయితే, జ్ఞానికివలెనజ్ఞానికిని ప్రవృత్తియందు ప్రయత్నము, ఆవశ్యకమైనదికాదుగదా?. ఉ. ఏకారణమువలన, జనులచేత స్వర్గమోక్షములకొరకు బ్రయత్నము జేయదగినదో, ఆకారణమువలన, అజ్ఞాని, సర్వవిధములచేతను ప్రవృత్తియందు బ్రయత్నము గలిగియుండవలెను.

శ్లో॥ విద్వాంశ్చేత్తాదృశాంమధ్యేతిష్ఠేత్తదనురోధతః।
కాయేనమనసావాచాకరోత్యేవాఖిలాఃక్రియాః॥ ౨౮౫.

టీ. తాదృశాం-అటువంటికర్మనిష్ఠులయొక్క, మధ్యే - మధ్యమందు, విద్వాన్-జ్ఞాని, తిష్ఠేచ్చేత్- స్థితినిబొందియున్నయెడల, తదనురోధతః= తత్-కర్మనిష్ఠులయొక్క, అనురోధతః-అనుసారముగా, అనగా నాకర్మనిష్ఠులనను సరించియనుట. కాయేన-శరీరముచేతను, మనసా - మనస్సుచేతను, వాచా-వాక్కుచేతను, అఖిలాః - సకలములైన, క్రియాః-క్రియలను, కరోత్యేవ-చేయుచున్నాడు.

తా. ప్ర. అయితే, జ్ఞానికి బ్రవృత్తియందు బ్రయత్నము యుక్తముగాదనిజెప్పితిరి. సరి. అట్లైనయెడల, కర్మనిష్ఠులయొక్క మధ్యమందు వర్తించునప్పుడు, అజ్ఞానిచే నేమిచేయదగినదో చెప్పుము?. ఉ. అట్టి కర్మనిష్ఠుల మధ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మందు జ్ఞానియున్నప్పుడు, ఆకర్మనిష్ఠుల ననుసరించి, మనోవాక్కాయముల చేత సర్వక్రియలను, ఈ జ్ఞానిచేయుచుండవలయుగాని, ఆకర్మనిష్ఠులను నివారింపజేయరాదని తెలియవలెను.

శ్లో॥ ఏషముక్షుబుభుత్సూనాంయదాతిష్ఠేత్తదాపునః।
బోధాయైషాంక్రియాస్సర్వాదూషయంస్త్యజతుస్వయం॥ ౨౮౬.

టీ. ఏషః-ఈజ్ఞాని, బుభుత్సూనాం-తత్వమునెరుగుట కిచ్ఛయించెడిజనులయొక్క, మధ్యే-మధ్యమందు, యదా-ఎప్పుడు, తిష్ఠేత్ - ఉండునో, తదా-అప్పుడు, పునః-మరల, ఏషాం-ఈముముక్షువులకు, బోధాయ - జ్ఞానోత్పత్తికొరకు, సర్వాః-సకలములైన, క్రియాః - క్రియలను, దూషయన్-దూషించుచు, స్వయమపి-తానును, త్యజతు-విడుచుగాక. అనగా విడువవలెననుట.

తా. ప్ర. అయితే, ఈజ్ఞాని, పరతత్వము నెరుగుట కిచ్ఛయించెడి జనులయొక్క మధ్యమందున్నప్పుడు, అతనిచే నేమిచేయదగినదో చెప్పుము?. ఉ. ఈజ్ఞాని, ముముక్షువులయొక్క మధ్యమందున్నప్పుడు, ఆ ముముక్షువులకు పరతత్వజ్ఞానోదయమయ్యెడికొరకు, ఆసర్వకర్మములను దూషించుచు,తానును సర్వకర్మములను విడువవలెను.

శ్లో॥ అవిద్వదనుసారేణవృత్తిర్బుద్ధస్యయుజ్యతే।
స్తనంధయానుసారేణవర్తతేతత్పితాయతః॥ ౨౮౭.

టీ. బుద్ధస్య-తత్వమునెరిగినవానికి, అవిద్వదనుసారేణ=అవిద్వత్- అజ్ఞానులయొక్క, అనుసారేణ - అనుసరణముగా, వృత్తిః-ప్రవర్తనము,యుజ్యతే-యుక్తమగును. యతః-ఏకారణమువలన, స్తనంధయానుసారేణ= స్తనంధయః-పాలుత్రాగెడి శిశువులయొక్క, అనుసారేణ-అనుసరణముగా, తత్పితా=తత్-ఆ శిశువులయొక్క, పితా-తండ్రి, వర్తతే-ప్రవర్తించుచున్నాడో.

తా. ప్ర. అయితే,జ్ఞాని,ఈప్రకారము ఏకారణమువల్ల జేయదగినదో చెప్పుము?. ఉ. జ్ఞానికి, అజ్ఞానులయందుగల దయారసముచేతను కృపావిశేషముచేతను, అజ్ఞానులయొక్క యిష్టప్రకారము ప్రవర్తించుచుండును. ప్ర. అయితే, ఇట్లుచ్చుటజూడబడెనో చెప్పుము?. ఉ. పాలుత్రాగెడి శిశువులయొక్క యిష్టప్రకారము, వారితండ్రి, ప్రవర్తించుచున్నాడు. అటువలెనే జ్ఞానియు, అజ్ఞానులయందు కృపావిశేషముగలవాడై, వారియిష్టప్రకారముగా ప్రవర్తించునని యభిప్రాయము.

అవ. శిశువుల ననుసరించి, తండ్రి, ప్రవర్తించునవెడి విషయము నే యిప్పుడు చూపుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ అధిక్షిప్తస్తాడితోవాబాలేనస్వపితాతదా।
నక్లిశ్నాతినకుప్యేతబాలంప్రత్యుతలాలయేత్॥ ౨౮౮.

టీ. బాలేన- బాలునిచేత, స్వపితా-తనతండ్రి, అధిక్షిప్తః- నిందించబడినవాడైనను, తాడితోవా-కొట్టబడినవాడైనను, తదా-అప్పుడు, నక్లిశ్నాతి-దుఃఖమునుబొందడు. నకుప్యేత - కోపమును జేసికొనడు. ప్రత్యుత- ఇంతమాత్రమేగాక, బాలం - బాలుని, లాలయేత్ - లాలించును. అనగా నూరడించుననుట.

తా. బాలునిచేత, తనతండ్రి, నిందించబడినను, తన్నబడినను, అప్పుడతడు దుఃఖకోపములను పొందకుండుటయేగాక, తనబిడ్డయందు గల దయారస విశేషముచేత, ఆబిడ్డను లాలించును.

అవ. ఈదృష్టాంతసిద్ధార్థము నిప్పుడు దార్ష్టాంతికమందు గూర్చుచున్నాడు.

శ్లో॥ నిందితస్తూయమానోవావిద్వానజ్ఞైర్ననిందతి।
నస్తౌతికింతుతేషాంస్యాద్యథాబోధస్తథాచరేత్॥ ౨౮౯.

టీ. విద్వాన్-జ్ఞాని, అజ్ఞైః - అజ్ఞానులచేత, నిందితః- నిందింపబడినవాడైనను, స్తూయమానోవా - స్తుతింపబడుచున్నవాడైనను, (స్వయం) తాను, ననిందతి- అజ్ఞానులనునిందించడు. నస్తౌతి-స్తుతించడు. కింతు-మరియేమనగా, తేషాం- ఆ యజ్ఞానులకు, యథా-ఏప్రకారము,బోధః-తత్త్వజ్ఞానము, స్యాత్-కలుగునో, తథా-ఆప్రకారము, ఆచరేత్ - ఆచరించును.

తా. జ్ఞానియగువాడు, అజ్ఞానులచేత నిందింపబడినను, స్తుతింపబడినను, తానజ్ఞానులనుగురించి, నిందాస్తుతులనుచేయడు. మరియేమనగా, ఆయజ్ఞానులకేప్రకారముగా, తత్త్వబోధగలుగునో, ఆప్రకార మాచరించుచుండును.

శ్లో॥ యేనాయంనటనేనాత్రబుధ్యతేకార్యమేవతత్।
అజ్ఞప్రబోధాన్నైవాన్యత్కార్యమస్త్యత్రతద్విదః॥ ౨౯౦.

టీ. అయం-ఈయజ్ఞాని, అత్ర-ఈలోకమందు, విదుషః- జ్ఞానియొక్క, యేన-ఏ. నటనేన-ఆచరణముచేత, బుధ్యతే- తత్త్వము నెరుగుచున్నాడో, తత్-ఆయాచరణము, కార్యమేవ-జ్ఞానిచే జేయదగినదే యగును. తద్విదః-జ్ఞానికి, అత్ర-ఈలోకమందు, అజ్ఞప్రబోధాత్ = అజ్ఞ-అజ్ఞానులను, ప్రబోధాత్- బోధించుటకంటె, కార్యం - చేయదగినది, అన్యత్ - మరియొకటి, నాస్త్యేవ-లేనేలేదు.

తా. ప్ర. అయితే, అజ్ఞాని, ఇట్లాచరించుటకు నిమిత్తమేమి?. ఉ. ఈ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యజ్ఞాని, ఈలోకమందు జ్ఞానియొక్క యేయాచరణముచేత తత్వము నెరుగునో, ఆయాచరణము జ్ఞానిచే జేయదగినదేయగును. ప్ర. సరి. అట్లైనయెడల,ఆప్రకారమే, మరియొక కార్యముగూడ, జ్ఞానిచే జేయదగినది కాదాయేమి?. ఉ. ఏకారణముచేత జ్ఞానికి, ఈలోకమందు అజ్ఞానులనుబోధించుటకంటె జేయదగినకార్యము మరియొకటిలేనేలేదో, ఆకారణముచేత, జ్ఞాని, ఆయజ్ఞానులయొక్క యిష్టప్రకారముగా ప్రవర్తించి, తత్వబోధ, చేయదగిన దగునని తెలియవలెను.

అవ. ఈ పూర్వోక్తగ్రంథముయొక్కయు, నిక జెప్పబోయెడి గ్రంథముయొక్కయు, తాత్పర్యము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ కృతకృత్యతయాతృప్తః ప్రాప్తప్రాప్యతయాపునః।
తృప్యన్నేవంస్వమనసామన్యతేఽసౌనిరంతరం॥ ౨౯౧.

టీ. అసౌ-ఈవిద్వాంసుడు, కృతకృత్యతయా=కృత-చేయబడిన,కృత్యతయా-కార్యవర్గముగలవానిభావముచేత, తృప్తస్సన్ - పూర్వోక్తప్రకారము తృప్తినిబొందినవాడగుచు, పునః-మరల, అనగా జెప్పబోయెడి ప్రకారముగా ననుట. ప్రాప్తప్రాప్యతయా=ప్రాప్త-పొందబడిన, ప్రాప్యతయా-పొందదగినఫలవర్గముగలవానిభావముచేతను, తృప్యన్-తృప్తినిబొందినవాడగుచు, స్వమనసా=స్వ-తనయొక్క, మనసా - మనస్సుచేత, నిరంతరం - సర్వదా, ఏవం-ఈప్రకారము, మన్యతే - తలచుచున్నాడు.

తా. ఈజ్ఞాని, పూర్వోక్తప్రకారము కృతకృత్యత్వముచేత తృప్తినిబొందినవాడగుచు, ఇక జెప్పబోయెడిప్రకారము ప్రాప్తప్రాప్యత్వముచేత తృప్తుడగుచు తనమనస్సుచేత (సర్వదా) ఈక్రిందజెప్పబోయెడి ప్రకారముగా దలచుచున్నాడు.

శ్లో॥ ధన్యోఽహంధన్యోఽహంనిత్యంస్వాత్మానమంజసావేద్మి।
ధన్యోఽహంధన్యోఽహంబ్రహ్మానందోవిభాతిమేస్పష్టం॥ ౨౯౨.

టీ. నిత్యం-సర్వదా, స్వాత్మానం- నాస్వరూపమగు ప్రత్యగాత్మను, అంజసా-సాక్షాత్తుగా, (యతః) ఏకారణమువలన, వేద్మి-ఎరుగుదునో, (అతః) ఆకారణమువలన, అహం-నేను, ధన్యః-కృతార్థుడనైతిని. అహం-నేను,ధన్యః-కృతార్థుడనైతిని. బ్రహ్మానందః = బ్రహ్మ- బ్రహ్మస్వరూపమగు, ఆనందః-ఆనందము, మే-నాకు, స్పష్టం-స్పష్టముగా, విభాతి- స్ఫురించుచున్నది. అతః-అందువలన, అహం - నేను, ధన్యః-కృతార్థుడనైతిని. అహం-నేను, ధన్యః-కృతార్థుడనైతిని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అజ్ఞాని, తనమనస్సుచేత నేమిదలచునో చెప్పుము?. ఉ. సర్వ దా, నాయొక్క నిజరూపమగు దేశకాలాద్యనవచ్ఛిన్న ప్రత్యగాత్మను సాక్షాత్తుగా నెరిగితిని. అందువలన నేను, కృతార్థుడ నైతిని. నేను కృతార్థుడనైతి నని, జ్ఞాని, తలచుచున్నాడు. ఆదరార్థమందు ద్విరుక్తియగును. ఇది ఆత్మజ్ఞాన లాభనిమిత్తకమగు తృప్తియగును. మరియు, బ్రహ్మస్వరూపమగు ఆనందము నాకు స్పష్టముగా స్ఫురించుచున్నది. అందువలన నేనుకృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతినని జ్ఞానితలచుచున్నాడు. ఇది ఆత్మజ్ఞాన ఫలలాభనిమిత్తకమగు తృప్తియగునని తెలియవలెను.

అవ. ఇట్లు, జ్ఞానికి ఇష్టప్రాప్తియందు తృప్తినిదెలిపి, అనిష్టము నివర్తిం చుటచేగూడ, తృప్తిని బొందుచున్నాడని యిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ధన్యోఽహంధన్యోఽహందుఃఖసాంసారికంనవీక్షేఽద్య।
ధన్యోఽహంధన్యోఽహంస్వస్యాజ్ఞానంపలాయితంక్వాపి॥ ౪౯౩.

టీ. అద్య-ఇప్పుడు, సాంసారికం-సంసారసంబంధమగు, దుఃఖం- దుః ఖమును, నవీక్షే-చూచుచున్నవాడనుగాను. (అతః) ఆకారణమువలన,అహం- నేను, ధన్యః - కృతార్థుడనైతిని. అహం- నేను, ధన్యః - కృతార్థుడనైతిని. స్వస్య-నాయొక్క, అజ్ఞానం-అనేకకర్మవాసనా సమూహముగల యజ్ఞానము, క్వాపి-ఎచ్చటనో, పలాయితం- పలాయితమాయెను. అనగా నశించెననుట. (అతః) ఆకారణమువలన, అహం- నేను, ధన్యః - కృతార్థుడనైతిని. అహం- నేను, ధన్యః-కృతార్థుడనైతిని.

తా. మరియు, ఇప్పుడు దుఃఖస్వరూపమగు సంసారమును నేనుజూచు చున్నవాడనుగాను. అందుచేత నేను కృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతి ని. దుఃఖము తోపమికి గారణమేమనగా, నాయొక్క అనేకకర్మ వాసనాస మూహముగల అజ్ఞానమునశించెను. అందుచే నేను గృతార్థుడనైతిని. నేనుకృ తార్థుడనైతినని, జ్ఞాని తలచుచున్నాడు.

అవ. ఇప్పుడు, అజ్ఞాననివృత్తిఫలంబును, కృతకృత్యత్వంబును, ప్రాప్త ప్రాప్యత్వంబును జూపుచున్నాడు.

శ్లో॥ ధన్యోఽహంధన్యోఽహంకర్తవ్యంమేనవిద్యతేకించిత్।
ధన్యోఽహంధన్యోఽహంప్రాప్తవ్యంసర్వమద్యసంపన్నం॥ ౪౯౪.

టీ. మే-నాకు, కర్తవ్యం-చేయదగినది, కించిత్ - కొంచెమైనను, నవి ద్యతే-లేదు. (అతః) అందువలన, అహం-నేను,ధన్యః-కృతార్థుడనైతిని.అహం- నేను, ధన్యః-కృతార్థుడనైతిని. ప్రాప్తవ్యం - పొందదగినఫలవర్గము, సర్వం-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అంతయు, అద్య-ఇప్పుడు, సంపన్నం- పొందబడెను. అనగా పొందబడినట్లే యాయెననుట. (అతః) అందువలన, అహం-నేను, ధన్యః- కృతార్థుడనైతిని. అహం - నేను, ధన్యః-కృతార్థుడనైతిని.

తా. మరియు, నాకుచేయదగిన కర్మోపాసనాదికము కొంచెమైనను లేనందున, నేను కృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతిని. మరియు, పొందదగిన ఫలవర్గమంతయు, ఇప్పుడు నాచేపొందబడినట్లాయెను. కనుక, నేనుకృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతినని, జ్ఞానితలంచుచున్నాడు.

అవ. ఇప్పుడు, కృతకృత్యత్వాదికముచే గలిగిన తృప్తికి నిరతిశయత్వమును జెప్పుచు, ఈతృప్తికంటె మరియొకటి చెప్పదగినది కనబడమివలన, తృప్తియే, సర్వదా స్ఫురించుచున్నదని చూపుచున్నాడు.

శ్లో॥ ధన్యోహంధన్యోహంతృప్తేర్మేకోపమాభవేల్లోకే।
ధన్యోహంధన్యోహంధన్యోధన్యఃపునఃపునర్ధన్యః॥ ౭౯.

టీ. మే-నాయొక్క: తృప్తేః-తృప్తికి, ఉపమా-పోలిక, అనగా సమానవస్తువనుట. లోకే-లోకమందు, కా-ఏద్ది, భవేత్-కలదు. అనగా నేద్దియతృప్తితోటిసమానముగాదనుట. (అతః) అందువలన, అహం-నేను, ధన్యః-కృతార్థుడనైతిని. అహం-నేను, ధన్యః-కృతార్థుడనైతిని. అహం-నేను,ధన్యః-కృతార్థుడనైతిని. అహం-నేను, ధన్యః-కృతార్థుడనైతిని. ధన్యః- కృతార్థుడనైతిని. ధన్యః-కృతార్థుడనైతిని. పునఃపునః-మాటిమాటికిని, ధన్యః-కృతార్థుడనైతిని.

తా. మరియు, నాయొక్క తృప్తికి సమానమైనవస్తువెద్దియులోకమందు లేదు. అందువలన, నేను కృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతిని. ఈతృప్తికంటె మరియొకటి చెప్పదగినది కనబడమిచేత, నేను కృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతిని. మాటిమాటికిని కృతార్థుడనైతిని. కృతార్థుడనైతిని, కృతార్థుడనైతినని, జ్ఞానితలంచుచున్నాడు.

అవ. ఈచెప్పబడిన సర్వశుభమునకును గారణభూతమగు పుణ్యరాశి పరిపాకమును స్మరించి, సంతోషించుచు, ఇవ్విధపుణ్యమును సంపాదించిన తనను స్మరించియు, సంతోషించుచున్నాడని, యిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ అహోపుణ్యమహోపుణ్యంఫలితంఫలితంధృఢం।
అస్యపుణ్యస్యసంపత్తేరహోవయమహోవయం॥ ౮౦.

టీ. అహో-ఓహో, ఆశ్చర్యార్థకము. పుణ్యం-మాపుణ్యము, దృఢం-దృఢముగా, ఫలితం-ఫలించెను. అహో- ఓహో, పుణ్యం - మాపుణ్యము, దృఢం-దృఢముగా, ఫలితం-ఫలించెను. అస్య-ఈ, పుణ్యస్య - పుణ్యముయొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్క, సంపత్తెః - సంపత్తివలన, అహో-ఓహో, వయమేవ- మేమే, అహో, ఓహో, వయం-మేము.

తా. అహో, మాపుణ్యము దృఢముగా ఫలించెను. అహో,మాపుణ్యము దృఢముగా ఫలించెను. ఈపుణ్యసంపత్తివలన, ఓహో మేమే, ఓహో మేమని, ఆశ్చర్యముగా, జ్ఞానితలచుచు సంతోషించుచున్నాడు.

అవ. ఇప్పుడు, బ్రహ్మజ్ఞానసాధనమగు వేదాంతశాస్త్రంబును, ఆశాస్త్రము నుపదేశించినట్టి, ఆచార్యునిస్మరించి, సంతోషించుచు, మరల శాస్త్రజన్యజ్ఞానతత్సుఖమలందలంచి సంతోషించుచున్నాడు.

శ్లో॥ అహోశాస్త్రమహోశాస్త్రమహోగురురహోగురుః।
అహోజ్ఞానమహోజ్ఞాన మహోసుఖమహోసుఖం॥ ౭౯౭.

టీ. శాస్త్రం-వేదాంతశాస్త్రము, అహో-ఓహోయెంతమనోహరము, శాస్త్రం - వేదాంతశాస్త్రము, అహో- ఓహోయెంతమనోహరము. గురుః- మాయాచార్యుడు, అహో-ఓహోయెంతవాడు. గురుః- మాయాచార్యుడు, అహో-ఓహోయెంతవాడు. జ్ఞానం - అద్వైతాత్మ తత్వజ్ఞానము, అహో- ఓహోయెంతమంచిది. జ్ఞానం-అద్వైతాత్మతత్వజ్ఞానము, అహో - ఓహోయెంతమంచిది. సుఖం-మాసుఖము, అహో- ఓహోయెంతగొప్పది. సుఖం- మాసుఖము, అహో-ఓహోయెంతగొప్పది.

తా. వేదాంతశాస్త్రము ఓహోయెంతమనోహరము. వేదాంతశాస్త్రము ఓహోయెంతమనోహరము. ఓహోమాగురువెంతవాడు. ఓహోమాగురువెంతవాడు. ఓహోఅద్వైతాత్మతత్వజ్ఞానమెంతమంచిది. ఓహోఅద్వైతాత్మతత్వజ్ఞానమెంతమంచిది. ఓహోమాసుఖమెంతగొప్పది. ఓహోమాసుఖమెంతగొప్పది. అనియిట్లుజ్ఞాని, ఆశ్చర్యముగా దలచుచు సంతోషించుచున్నాడని తెలియవలెను.

అవ. ఇప్పుడు, గ్రంథాభ్యాసఫలమును చెప్పుచున్నాడు.

శ్లో॥ తృప్తిదీపమిమంనిత్యంయేఽనుసందధతేబుధాః।
బ్రహ్మానందేనిమజ్జంతస్తేతృప్యంతినిరంతరం॥ ౨౯౮.

టీ. యే-ఏ, బుధాః-పండితులు, ఇమం-ఈ, తృప్తిదీపం-తృప్తిదీపమనెడి గ్రంథమును, నిత్యం-సర్వదా, అనుసందధతే- అనుసంధానముజేసెదరో, తే- ఆపండితులు, బ్రహ్మానందే-బ్రహ్మ-బ్రహ్మమనెడి, ఆనందే-ఆనందరూపమందు, నిమజ్జంతస్సంతః-మునిగినవారగుచు, నిరంతరం-సర్వదా, తృప్యంతే-తృప్తినిబొందుచున్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఏపండితులు, ఈతృప్తిదీపమందు జెప్పినప్రకారము పరతత్వాను సంధానము జేయుదురో, వారు, బ్రహ్మస్వరూపానందమందు మునిగినవార గుచు, సర్వదా, తృప్తినిబొందుచున్నారు.

* ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీభారతీ తీర్థ విద్యార ణ్యమునివర్యకృత శ్రీవేదాంతపంచదశ్యాం తృప్తిదీపస్సమాప్తః.

* గద్య. ఇది, శ్రీపరమేశ్వర గురుచరణ వరప్రసాదలబ్ధ బ్రహ్మవి ద్యావిరాజిత కాశ్యపసగోత్ర పవిత్ర మంత్రివంశపయః పారావార పరిపూ ర్ణసుధాకర లక్ష్మణామాత్యపుత్ర లక్ష్మీనారాయణామాత్య ప్రణీతంబైన ఆంధ్రి టీకాతాత్పర్యసహిత శ్రీవేదాంత పంచదశియందు తృప్తిదీపమనెడి సప్తమప్ర కరణము సంపూర్ణమాయెను.

శ్లో॥ తృప్తిదీపస్యటీకేయం రహస్యార్థప్రకాశికా।
మంత్రినారాయణాఖ్యేన కృతాకృష్ణసమర్పితా॥
ఓంతత్సత్ - సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుభమస్తు.

శ్రీకృష్ణసద్గురుపరబ్రహ్మణేనమః.

# కూటస్థదీపప్రారంభము.

అవ. ఇచ్చట, ముముక్షువునకు మోక్షసాధనంబగు బ్రహ్మాత్మైకత్వజ్ఞానము, త్వంపదార్థశోధనపూర్వకముగా గలుగుచుండుటవలన, త్వంపదార్థశోధనపరమగు కూటస్థదీపమనెడి పేరుగల గ్రంథము నారంభించుచుండెడి శ్రీవిద్యారణ్యగురుండు, ఈగ్రంథము వేదాంత ప్రకరణ మగుటవలన తత్సంబంధములగు విషయాదులచేత అనుబంధచతుష్టయము సిద్ధించెననితలచి, త్వంపదలక్ష్యార్థవాచ్యార్థులగు కూటస్థజీవులను దృష్టాంతసహితముగా భేదముచే నిష్పదు దెలుపుచున్నాడు.

శ్లో॥ ఖాదిత్యదీపితేకుడ్యే దర్పణాదిత్యదీప్తివత్।
కూటస్థభాసితోదేహోధీస్థజీవేనభాస్యతే॥ ౧.

టీ. ఖాదిత్యదీపితే=ఖ-ఆకాశమందుండెడి, ఆదిత్య-సూర్యునిచేత, అనగా నాసూర్యసంబంధియగు ఎండచేతననుట. దీపితే-ప్రకాశింపబడిన, కుడ్యే-గోడయందు, దర్పణాదిత్యదీప్తివత్=దర్పణ - అద్దములయందుగల, ఆదిత్యదీప్తివత్ - సూర్యప్రకాశనమువలె, అనగా నద్దములయందుబడిన సూర్యకిరణములచే నేర్పడిన మండలాకారప్రభలాగోడను ప్రకాశింపజేసినట్లనుట. కూటస్థభాసితః = కూటస్థ - నిర్వికారచైతన్యముచేత, భాసితః - ప్రకాశింపబడిన, దేహః-దేహము, ధీస్థజీవేన=ధీ-బుద్ధియందు, స్థ - ఉండెడి, జీవేన- చిదాభాసునిచేత, భాస్యతే - ప్రకాశింపబడుచున్నది.

తా. ఆకాశమందుండెడి ప్రసిద్ధుడగు సూర్యునియొక్క సంబంధియగు ఎండచేత సామాన్యముగాగోడ, ప్రకాశింపబడుచుండగా, అద్దములయందుబడిన సూర్యకిరణములచేత గలిగిన మండలాకారప్రభలాగోడయందుబడి, యాగోడనువిశేషముగా ప్రకాశింపజేసినట్లు, నిర్వికారియగు కూటస్థచైతన్యముచేత ప్రకాశింపబడినదేహను, బుద్ధియందుగల చిదాభాసునిచేత ప్రకాశింపబడుచున్నదని తెలియవలెను. ఇట్లుచెప్పుటచేత, సామాన్యముగాను, విశేషముగాను, గోడనుప్రకాశింపజేసెడి, సూర్యునియొక్క ప్రకాశద్వయమువలె,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేహమును ప్రకాశింపజేసెడి చైతన్యద్వయముగలదని, తెలుపబడుచున్నదని తెలియవలెను.

అవ. ఇప్పుడు గోడయందుగల మండలాకార సూర్యప్రభలవల్ల, సామాన్యసూర్యప్రభను విభజించిచూపుచున్నాడు.

శ్లో॥ అనేకదర్పణాదిత్యదీప్తీనాంబహుసంధిషు।
ఇతరావ్యజ్యతేతాసామభావేపిప్రకాశతే॥ ౨.

టీ. అనేకదర్పణాదిత్యదీప్తీనాం=అనేక-అనేకములగు, దర్పణ-అద్దములవల్లగలిగిన, ఆదిత్యదీప్తీనాం- సూర్యదీప్తులయొక్క, అనగా గోడయందచ్చటచ్చట గనబడెడిమండలాకార విశేషప్రభలయొక్కయనుట. బహుసంధిషు-బహు-అనేకములగు, సంధిషు-నడిమితావులయందు, ఇతరా- సామాన్యప్రకాశరూపమగుసూర్యప్రభ, వ్యజ్యతే-తెలియబడుచున్నది. తాసాం- ఆయద్దములవల్లగలిగిన మండలాకార విశేషప్రభలయొక్క, అభావేపి - లేమియందును, అనగా నద్దములవల్ల సూర్యకిరణములచేగలిగిన మండలాకారవిశేష ప్రభలు గోడయందుగనబడకపోయిన ననుట. (స్వయం) తాను, అనగా సామాన్యప్రకాశరూప సూర్యప్రభయనుట. ప్రకాశతే- అంతటను ప్రకాశించుచున్నది.

తా. ప్ర. అయితే, అద్దములవల్ల సూర్యదీప్తిచేతగలిగిన మండలాకార ప్రకాశమే; యాగోడయందు గనబడుచున్నదిగాని, ఆప్రకాశముకంటె నన్యమగా సూర్యప్రకాశమెద్దియు నాగోడయందు బొందబడలేదేమి?. ఉ. అనేకములగు అద్దములవల్ల సూర్యదీప్తిచేగలిగి గోడయందక్కడక్కడ మండలాకారముగా, ఏవిశేషప్రభలుగనబడుచున్నవో, ఆవిశేషప్రభలయొక్క నడిమితావులయందు, సామాన్యప్రకాశరూపమగు సూర్యప్రభయొకటి తెలియబడుచున్నది. మరియు, అద్దములు సమీపమందులేమి మొదలగు హేతువులచేత, ఆయద్దములవల్ల సూర్యకిరణములచేగలిగెడి మండలాకార విశేషప్రభలు గోడయందులేకపోయినను, సామాన్యప్రకాశరూపమగు సూర్యప్రభ, తానుగోడయందంతటను ప్రకాశించుచున్నదని తెలియవలెను.

అవ. ఈదృష్టాంతసిద్ధార్థమును,దార్ష్టాంతికమందిప్పుడుగూర్చుచున్నాడు.

శ్లో॥ చిదాభాసవిశిష్టానాంతథానేకధియామసౌ।
సంధింధియామభావంచభాసయన్ప్రవివిచ్యతాం॥ ౩.

టీ. తథా-ఆప్రకారము, చిదాభాసవిశిష్టానాం=చిదాభాస - చిత్ప్రతిబింబముతోటి, విశిష్టానాం-కూడియున్నట్టి, అనేకధియాం=అనేక - నానావిధములగు, ధియాం - బుద్ధివృత్తులయొక్క, అనగా ఘటజ్ఞానాది శబ్దవాచ్యముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక్క యనుట. సంధిం-మధ్యకాలంబును, ధియాం - ఆబుద్ధివృత్తులయొక్క, అభావంచ-లేమినియు, భాసయత్ = ప్రకాశింపజేయుచుండెడి, అసౌ-ఈకూటస్థుడు, ప్రవివిచ్యతాం - ఆబుద్ధివృత్తులకంటె భిన్నముగా నెరుగబడుగాక. అనగా నాకూటస్థునిబుద్ధిచేత విభజించి భిన్నముగా నెరుగవలెననుట.

తా. పూర్వోక్తదృష్టాంతప్రకారము చిదాభాసునితో గూడియుండెడి, ఘటజ్ఞానాది శబ్దవాచ్యములగు అనేకబుద్ధివృత్తులయొక్క నడిమికాలమును జాగ్రదాదికమందు బ్రకాశింపజేయుచున్నట్టియు, మరియు, సుషుప్త్యాదికమందు ఆబుద్ధివృత్తులయొక్క అభావమును బ్రకాశింపజేయుచున్నట్టి, ఈకూటస్థ చైతన్యమును, ఆబుద్ధివృత్తులకంటె భిన్నముగా నెరుగవలెను.

అవ. దేహములోపటనుండెడి కూటస్థచిదాభాసులకు భేదమునుజూపుట కొరకు, దేహముకంటెబాహ్యమందును, చిదాభాసబ్రహ్మముల నిప్పుడు విభజించి చూపుచున్నాడు.

శ్లో॥ ఘటైకాకారధీస్థాచిద్ఘటమేవావభాసయేత్।
ఘటస్యజ్ఞాతతాబ్రహ్మచైతన్యేనావభాస్యతే॥ ౪.

టీ. ఘటైకాకారధీస్థాచిత్ = ఘట-ఘటముయొక్క, ఏక-ముఖ్యమగు, ఆకార-ఆకారమువంటి యాకారముగల, ధీ-బుద్ధియందు, స్థా - వర్తించుచుండెడి, చిత్-చైతన్యము, అనగా చిదాభాసుడనుట. ఘటమేవ - ఒకఘటమును మాత్రమే, అవభాసయేత్-ప్రకాశింపజేయును. ఘటస్య - ఘటముయొక్క, జ్ఞాతతా-జ్ఞాతత్వమనెడి ధర్మము, అనగాఘటంబెరుగబడెననెడి వ్యవహారహేతువనుట. బ్రహ్మచైతన్యేన - ఘటకల్పనాధిష్ఠాన బ్రహ్మచైతన్యముచేత, అవభాస్యతే - ప్రకాశింపబడుచున్నది.

తా. మరియు, ఘటముయొక్క ముఖ్యమగు ఆకారమువంటి ఆకారముగల బుద్ధియందు వర్తించుచుండెడి చిదాభాసుడు,ఒకఘటమునుమాత్రమేప్రకాశింపజేయుచున్నాడు. మరియు,ఘటముయొక్క జ్ఞాతత్వమనెడి ధర్మము, (అనగా ఘటంబెరుగబడెననెడి వ్యవహారహేతువు) ఎద్దిగలదో, అది, ఘటకల్పనాధిష్ఠానమగు సాధనభూత బ్రహ్మచైతన్యముచేత ప్రకాశింపబడుచున్నదని తెలియవలెను.

శ్లో॥ అజ్ఞాతత్వేనభాతోఽయంఘటోబుద్ధ్యుదయాత్పురా।
బ్రహ్మణైవోపరిష్టాత్తుజ్ఞాతత్వేనేత్యసౌభిదా॥ ౫.

టీ. బుద్ధ్యుదయాత్=బుద్ధి-బుద్ధియొక్క, ఉదయాత్- ఉదయముకంటె, పురా-పూర్వము, అయం-ఈ, ఘటః-ఘటము, బ్రహ్మణైవ- బ్రహ్మముచేతనే,


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనగా నాధిక్యమేమియు లేదనుట.

తా. ప్ర. అయితే, అజ్ఞాతత్వమును గలిగించుటకొరకు, అజ్ఞానము శక్తివంతమైనట్లు, జ్ఞాతత్వమును గలిగించుటకొరకును బుద్ధియే శక్తివంతమై యుండగా, ఈచిదాభాసునిచేత ప్రయోజనమేమి?. ఉ. చిదాభాసునితోటిగూడనిబుద్ధిచేత జ్ఞాతత్వము గలుగనేగలుగదు. వికారియగు ఘటాదిజడపదార్థముకంటె, చిదాభాసరహితబుద్ధికి, విశేషమేమియు లేదు. అనగా చిదాభాసుడులేని కేవలబుద్ధి, ఘటాదిపదార్థమువలె, అప్రకాశరూపము గలదగుటచేత, అట్టి బుద్ధిచేత జ్ఞాతత్వము గలుగదని యభిప్రాయము.

అవ. చిదాభాసరహిత బుద్ధిచేత వ్యాపింపబడినఘటమునకు జ్ఞాతత్వాభావమును దృష్టాంతపూర్వకముగా నిప్పుడు స్పష్టము జేయుచున్నాడు.

శ్లో॥ జ్ఞాతఇత్యుచ్యతేకుంభోమృదాలిప్తోనకుత్రచిత్।
ధీమాత్రవ్యాప్తకుంభస్యజ్ఞాతత్వంనేష్యతేతథా॥ ౯.

టీ. కుత్రచిత్-లోకమందెచ్చటను, కుంభః-ఘటము, మృదా- తెలుపు నలుపుమొదలగు రూపముగల మట్టిచేత, లిప్తః- పూయబడినదగుచు, జ్ఞాతఇతి- జ్ఞాతమని, నోచ్యతే-చెప్పబడదు. తథా-ఆప్రకారము, ధీమాత్రవ్యాప్తకుంభస్య=ధీమాత్ర-కేవలబుద్ధిమాత్రముచేత, వ్యాప్త - వ్యాపింపబడిన, కుంభస్య- ఘటమునకు, జ్ఞాతత్వం-జ్ఞాతత్వము, నేష్యతే-ఇచ్ఛయింపబడదు. అనగా నంగీకరింపబడదనుట.

తా. లోకమందెచ్చటను ఘటము, తెలుపునలుపు మొదలగు రూపము గలమట్టిచేత బూయబడినదగుచు, జ్ఞాతమని చెప్పబడనట్లు, చిదాభాస రహిత బుద్ధిచేత వ్యాపింపబడిన ఘటంబునకును జ్ఞాతత్వ మంగీకరింపబడదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు ఫలితమును జెప్పుచున్నాడు.

శ్లో॥ జ్ఞాతత్వంనామకుంభేతచ్చిదాభాసఫలోదయః।
నఫలంబ్రహ్మచైతన్యం మానాత్ప్రాగపిసత్త్వతః॥ ౧౦.

టీ. తత్-ఆకారణమువలన, కుంభే-ఘటమందు, చిదాభాసఫలోదయః= చిదాభాస-చిదాభాసలక్షణముగల, ఫల-ఫలముయొక్క, ఉదయఏవ-ఉదయమే, అనగా వ్యాప్తియేయనుట. జ్ఞాతత్వంనామ- జ్ఞాతత్వమగును. బ్రహ్మచైతన్యం- ఘటకల్పనాధిష్ఠానమగు బ్రహ్మచైతన్యము, మానాత్ - ప్రమాణప్రవర్తనముకంటె, ప్రాగపి-పూర్వమందును, సత్వతః-ఉండుటవలన, ఫలం- ఘటాదిస్ఫురణము, న-కాదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఏకారణముచేత కేవలబుద్ధికి జ్ఞాతత్వమునుగలిగించుటకుసామర్థ్యములేదో, ఆకారణముచేత, ఘటమందు చిదాభాసలక్షణముగల ఫలముయొక్క వ్యాప్తియే, జ్ఞాతత్వమగును. ప్ర. సరి. అట్లైనను బ్రహ్మచైతన్యమగు ఫలముండుటవలన, చిదాభాసునితో ప్రయోజనమేమి?. ఉ. ఘటకల్పనాధిష్ఠానమగు బ్రహ్మచైతన్యము, ఫలము (అనగా ఘటాదిస్ఫురణము) గాదు. ప్ర. ఎందువలనగాదోచెప్పుము?. ఉ. చిదాభాసునితోగూడిన అంతఃకరణవృత్తిరూపమగు (ప్రమాణము) ప్రవర్తించుటకంటె బూర్వమందును, ఆఘటకల్పనాధిష్ఠానమగు బ్రహ్మచైతన్యముండుటచేతను, ప్రమాణము బ్రవర్తించుటకు బరమందు ఫలోదయమగుననెడి నియమముగలిగియుండుటచేతను, ఈ రెండుహేతువులవలన, బ్రహ్మచైతన్యము ఫలముగాదని తెలియవలెను.

అవ. ఈయర్థము, శ్లో॥ పరాగర్థప్రమేయేషు॥ అనెడి యిత్యాది సురేశ్వరాచార్యులయొక్క వార్తికమునకు విరోధమగునని శంకించుకొని, తద్వివక్ష దెలియనివానికి ఈయర్థము చోద్యముగానుండునని పరిహారము జెప్పుచు, ఆసురేశ్వరాచార్యులయొక్క వార్తికము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ పరాగర్థప్రమేయేషుయాఫలత్వేనసమ్మతా।
సంవిత్సైవేహమేయోర్థోవేదాంతోక్తిప్రమాణతః॥ ౧౧.

టీ. పరాగర్థప్రమేయేషుసత్సు=పరాక్-బాహ్యములగు, అర్థ- ఘటాదిపదార్థములు, ప్రమేయేషుసత్సు-ప్రమాణవిషయములగుచుండగా, యా-ఏసంవిత్తు, ఫలత్వేన-ప్రమాణఫలరూపముగా, సమ్మతా- అంగీకరింపబడునో, సా- ఆ, సంవిదేవ-సంవిత్తె, ఇహ-ఈవేదాంతశాస్త్రమందు, వేదాంతోక్తి ప్రమాణతః= వేదాంతోక్తి- వేదాంతవాక్యలక్షణముగల, ప్రమాణతః - ప్రమాణమువలన, మేయః-తెలియదగిన, అర్థః-వస్తువగును.

తా. బాహ్యములగు ఘటాదిపదార్థములు, ప్రమాణమునకు విషయములగుచుండగా, ప్రమాణఫలరూపముగా నంగీకరింపబడెడి, ఏసంవిత్తుగలదో, ఆసంవిత్తె, ఈవేదాంతశాస్త్రమందు వేదాంతవాక్యలక్షణ ప్రమాణముచేత, తెలియదగిన బ్రహ్మవస్తువగునని, ఈవార్తికార్థమగును. సంవిత్తనగా జ్ఞానమగును.

శ్లో॥ ఇతివార్తికకారేణచిత్సాదృశ్యంవివక్షితం।
బ్రహ్మచిత్ఫలయోర్భేదస్సహస్రాంవిశ్రుతోయతః॥ ౧౨.

టీ. ఇతి-ఈప్రకారము, వార్తికకారేణ - సురేశ్వరాచార్యునిచేత, చిత్సాదృశ్యం=చిత్-బ్రహ్మచైతన్యముయొక్క, సాదృశ్యం-సాదృశ్యము,అనగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అజ్ఞాతత్వేన - అజ్ఞాతత్వముగా, భాతః-ప్రకాశింపబడెను. ఉపరిష్టాత్తు-పిమ్మ టనో, అనగా బుద్ధ్యుదయించుచుండగా ననుట. జ్ఞాతత్వేన - జ్ఞాతత్వముగా, (భాతఇతి) ప్రకాశింపబడినదనెడి, అసావేవ-ఇదియే, భిదా-భేదమగును.

తా. ప్ర. అయితే, జ్ఞాతత్వమును బ్రకాశింపజేసెడి బ్రహ్మచైతన్య ముచేతనే ఘటప్రతీతిసంభవించుచుండగా, బుద్ధిచే బ్రయోజనమేమి?. ఉ. బుద్ధి ఉదయించుటకంటె పూర్వమందు ఈ ఘటము బ్రహ్మముచేతనే, అజ్ఞాత త్వముగా బ్రకాశింపబడెను. బుద్ధి ఉదయించినపిమ్మటనో, అఘటము బ్రహ్మ ముచేతనే, జ్ఞాతత్వముగా బ్రకాశింపబడుచున్నది. ఈ భేదసిద్ధికొరకే బుద్ధి, ప్రయోజనకారి యగుచున్నదేగాని, బుద్ధివలన మరియొక ప్రయోజనము లేద నితెలియవలెను. జ్ఞాతత్వమనగా దెలియబడుటయగును. అజ్ఞాతత్వమనగా దెలి యబడకుండుట యగును.

అవ. ప్ర. అయితే, ఒక్కటియగు ఘటమునకు, జ్ఞాతత్వ అజ్ఞాతత్వల క్షణముగల ద్వివిధరూపమెట్లు సంభవించునని శంకించుకొని, ఆ ద్వివిధరూప మును దెలుపుటకొరకు, జ్ఞాతత్వ అజ్ఞాతత్వములకు నిమిత్తములగు, జ్ఞానాజ్ఞాన ములయొక్క స్వరూపము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ చిదాభాసాంతధీవృత్తిర్జ్ఞానంలోహాంతకుంతవత్।
జాడ్యమజ్ఞానమేతాభ్యాంవ్యాప్తఃకుంభోద్విధోచ్యతే॥ ౬.

టీ. లోహాంతకుంతవత్ = లోహ - ఇనుమును, అంత-పురోభాగమందు గల; కుంతవత్-ఈటివలె, చిదాభాసాంతధీవృత్తిః = చిదాభాస- చిత్ప్రతిబిం బమే, అంత-పురోభాగమందుగల, ధీవృత్తిః-బుద్ధివృత్తి, జ్ఞానం - జ్ఞానమనిచె ప్పబడును. జాడ్యం-స్వతస్ఫూర్తిరహితత్వము, అజ్ఞానం - అజ్ఞానమనిచెప్పబ డును. ఏతాభ్యాం-ఈజ్ఞానాజ్ఞానములచేత, వ్యాప్తః- పర్యాయముగా నంతట బంధింపబడిన, కుంభః-ఘటము, ద్విధా-ద్వివిధరూపముగలదిగా, అనగాజ్ఞాత మనియు నజ్ఞాతమనియుననుట. ఉచ్యతే-చెప్పబడుచున్నది.

తా. బోధచే బ్రకాశింపబడునది బుద్ధియని, శ్రీశంకరాచార్యులచేత, వా॥ బోధేద్ధాబుద్ధిః॥ అనియిట్లు చెప్పబడుటవలన ఇనుమును పురోభాగమం దుగల ఈటెవంటి, చిదాభాసుని పురోభాగమందు గల బుద్ధివృత్తి, జ్ఞానమని చెప్పబడుచున్నది. మరియు, ఆబుద్ధియొక్క జడాంశము (అనగా స్వతస్ఫూ ర్తిరహితత్వము) అజ్ఞానమని చెప్పబడును. ఈజ్ఞానాజ్ఞానములచేత పర్యాయ ముగా నంతట వ్యాపింపబడిన ఘటము, ద్వివిధముగా జెప్పబడుచున్నది. అన గా జ్ఞానముచేత వ్యాపింపబడిన ఘటము, జ్ఞాతమనియు, అజ్ఞానముచే నావ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రింపబడిన ఘటము, అజ్ఞాతమనియుం జెప్పబడుననని యభిప్రాయము.

శ్లో॥ అజ్ఞాతో బ్రహ్మణాభాస్యోఽజ్ఞాతఃకుంభ స్తథానకిం।
జ్ఞాతత్వజననేనైవచిదాభాసపరిక్షయః॥ ౭.

టీ. అజ్ఞాతః-అజ్ఞాతమగు, కుంభః-ఘటము, బ్రహ్మణా-బ్రహ్మముచేత, (యథా) ఏప్రకారము, భాస్యః-ప్రకాశింపదగినదో, తథా - ఆప్రకారము, జ్ఞాతః-జ్ఞాతమగు, కుంభః-ఘటము, నకిం-కాదాయేమి. అనగా బ్రహ్మముచే బ్రకాశింపదగిన దగుననుట. జ్ఞాతత్వజననేనైవ=జ్ఞాతత్వ- జ్ఞాతత్వముయొక్క, జననేనైవ-ఉత్పత్తిచేతనే, చిదాభాసపరిక్షయః= చిదాభాస - చిదాభాసునియొక్క, అనగా జ్ఞానముయొక్కయనుట, పరిక్షయః-పరిక్షయమగును.

తా. ప్ర. అయితే, అజ్ఞాతఘటము, అజ్ఞానముచే వ్యాపించబడుటవలన, బ్రహ్మముచే బ్రకాశింపదగినదగుగాక. జ్ఞానముచేత వ్యాపింపజడిన (జ్ఞాతఘటము) బ్రహ్మచైతన్యముచేత బ్రకాశింపబడవలసిన పనియేమి?. ఉ. అజ్ఞాతఘట, మేప్రకారముగా బ్రహ్మచైతన్యముచేత బ్రకాశింపదగిన దగునో, ఆప్రకారము జ్ఞాతఘటంబును, బ్రహ్మచైతన్యముచే బ్రకాశింపదగినదే యగును. ప్ర. ఏకారణమువలన జ్ఞాతఘటము, బ్రహ్మచైతన్యముచేత బ్రకాశింపదగినదగునో చెప్పుము?. ఉ. జ్ఞాతత్వమనెడి ధర్మము, (అనగా ఘటమెరుగబడెననెడి వ్యవహారహేతువు) పుట్టుటచేతనే చిదాభాసుడు, (అనగాఘటజ్ఞానము) క్షయించుచున్నది. ఈజ్ఞాతత్వమనెడిధర్మము, బ్రహ్మచైతన్యముచేత బ్రకాశింపబడుటవలన, జ్ఞాతఘటంబును, బ్రహ్మముచేత బ్రకాశింపదగినదే యగునని తెలియవలెను. అనగా నజ్ఞాతత్వము జనించిన మాత్రముచేతనే అజ్ఞానము క్షయించినట్లు,జ్ఞాతత్వము జనించినమాత్రముచేతనే జ్ఞానంబును క్షయించుచుండుటచేత, అజ్ఞాతఘటమువలె, జ్ఞాతఘటంబును, బ్రహ్మచైతన్యముచేత బ్రకాశింపదగినదే యగునని యభిప్రాయము. జ్ఞాతమనగా దెలియబడినదగును. అజ్ఞాతమనగా దెలియబడనిదగును.

శ్లో॥ ఆభాసహీనయాబుద్ధ్యాజ్ఞాతత్వంనైవజన్యతే।
తాదృగ్బుద్ధేర్విశేషఃకోమృదాదేస్స్యాద్వికారిణః॥ ౮.

టీ. ఆభాసహీనయా= ఆభాస-చిదాభాసునిచేత హీనయా-హీనమగు, అనగా చిదాభాసుడులేనియనుట. బుద్ధ్యా-బుద్ధిచేత, జ్ఞాతత్వం- జ్ఞాతత్వమనెడి ధర్మము, నైవజన్యతే - కలుగనేగలుగదు. తాదృగ్బుద్ధేః - అటువంటిబుద్ధికి, అనగా చిదాభాససంబంధములేనిబుద్ధికనుట. వికారిణః-వికారియగు, ఘటాదేః-ఘటాదిజడపదార్థముకంటె, కః-ఏమి, విశేషః-ఆధిక్యము, స్యాత్-కలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రతిబింబమనుట. వివక్షితం-చెప్పబడెను. యతః - ఏకారణమువలన, సహస్ర్యాం-ఉపదేశసాహస్య్రమనెడిగ్రంథమందు, బ్రహ్మచిత్ఫలయోః=బ్రహ్మ-బ్రహ్మచైతన్యమునకును, చిత్ఫలయోః-చిదాభాసునకును, భేదః-భేదము, విశ్రుతః-వినబడుచున్నదో.

తా. ఈపూర్వోక్తవార్తికముచేత, ప్రమాణఫలత్వశబ్దమువలన, బ్రహ్మచైతన్య సదృశుడగు చిదాభాసుడు చెప్పబడెనేగాని, బ్రహ్మచైతన్యము చెప్పబడలేదు. ప్ర. అయితే, ఆవార్తికకారులగు సురేశ్వరాచార్యులకు ఇట్టియభిప్రాయముగలదని, దేనిచే దెలియబడుచున్నదో చెప్పుము?. ఉ. ఆసురేశ్వరాచార్యులయొక్క గురువులగు శ్రీశంకరాచార్యులచేత, ఉపదేశసాహస్య్రమనెడి గ్రంథమందు, బ్రహ్మమునకును, చిదాభాసునకును భేదముచెప్పబడెను. అట్లు చెప్పబడుటచేత, సురేశ్వరాచార్యులయొక్క యభిప్రాయమిట్టిదని తెలియవలెను.

శ్లో॥ ఆభాసఉదితస్తస్మాజ్జ్ఞాతత్వంజనయేద్ఘటే।
తత్పునర్బ్రహ్మణాభాస్య మజ్ఞాతత్వవదేవహి॥ ౧౩.

టీ. తస్మాత్-అందువలన, ఘటే-ఘటమందు, ఉదితః - ఉదయించిన, ఆభాసః-చిదాభాసుడు, జ్ఞాతత్వం - జ్ఞాతత్వమును, జనయేత్ - కలిగించును. తత్-ఆపుట్టినజ్ఞాతత్వము, పునః-మరల, అజ్ఞాతత్వవదేవ- అజ్ఞాతత్వమువలెనే, బ్రహ్మణా - బ్రహ్మముచేత, భాస్యం - ప్రకాశింపదగినదగును. హి- ఇదిప్రసిద్ధమనుట.

తా. ప్ర. అయితే, ఇట్లగుచుండగా ప్రకృతమందేమి?. ఉ. ఏకారణముచేత బ్రహ్మమునకును చిదాభాసునకును భేదము ప్రసిద్ధముగాగలదో, ఆకారణముచేత ఘటమందుదయించిన చిదాభాసుడు, ఆఘటమందు జ్ఞాతత్వమును గలిగించుచున్నాడు. ఆ కలిగిన జ్ఞాతత్వము, మరల నజ్ఞాతత్వమువలె, బ్రహ్మముచేతనే ప్రకాశింపదగినదగుచున్నదని తెలియవలెను.

అవ. ఈప్రకారము చెప్పబడిన బ్రహ్మచిదాభాసులయొక్క భేదమును, విషయభేదప్రదర్శనముచేత స్పష్టముజేయుచున్నాడు.

శ్లో॥ ధీవృత్త్యాభాసకుంభానాంసమూహోభాస్యతేచితా।
కుంభమాత్రఫలత్వాత్స ఏక ఆభాసతస్స్ఫురేత్॥ ౧౪.

టీ. ధీవృత్త్యాభాసకుంభానాం=ధీవృత్తి-బుద్ధివృత్తియొక్కయు, ఆభాస-చిదాభాసునియొక్కయు, కుంభానాం-ఘటముయొక్కయు, సమూహః- సమూహము, చితా-బ్రహ్మచైతన్యముచేత, భాస్యతే-ప్రకాశింపబడుచున్నది.(చిదా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భాసః) చిదాభాసుడు, కుంభమాత్రఫలత్వాత్=కుంభమాత్ర- ఒకఘటమాత్ర మందుండెడి, ఫలత్వాత్-ఫలరూపుడగుటవలన. ఏకః-ఒక్కటియగు, సః-ఆఘటము, ఆభాసతః-చిదాభాసునివలన, స్ఫురేత్-స్ఫురించును. అనగా ప్రకాశింపబడుననుట.

తా. మరియు, బ్రహ్మచైతన్యముచేత, బుద్ధివృత్తి చిదాభాసఘటముల యొక్క సమూహము ప్రకాశింపబడును. చిదాభాసుడు, ఘటమాత్రమందుండెడి ఫలరూపుడగుటవలన, ఆచిదాభాసునిచేత నాఘటమొక్కటియే ప్రకాశింపబడుచున్నదని తెలియవలెను.

అవ. ఘటము, చిదాభాసబ్రహ్మములనెడి రెంటిచేతను ప్రకాశింపబడుటయందు ఇప్పుడు లింగమును జెప్పుచున్నాడు.

శ్లో॥ చైతన్యంద్విగుణంకుంభేజ్ఞాతత్వేనస్ఫురత్యతః।
అన్యేఽనువ్యవసాయాఖ్యమాహురేతద్యథోదితం॥ ०५.

టీ. అతః-అందువలన, అనగా చిదాభాసబ్రహ్మములనెడి రెంటిచేతను ఘటము ప్రకాశింపబడుటవల్లననుట. కుంభే- ఘటమందు, జ్ఞాతత్వేన-జ్ఞాతత్వముచేత, అనగా ఘటముదెలియబడుటచేననుట. ద్విగుణం- ద్విగుణమగు, చైతన్యం-చైతన్యము, అనగా చైతన్యద్వయమనుట. స్ఫురతి - స్ఫురించుచున్నది. యథోదితం- ఈచెప్పబడిన, ఏతత్-ఈబ్రహ్మచైతన్యమును, అన్యే- ఇతరమతస్థులగు తార్కికులు, అనువ్యవసాయాఖ్యం=అనువ్యవసాయమనెడి, ఆఖ్యం-పేరుగల జ్ఞానాంతరమునుగా, ఆహుః - చెప్పుదురు.

తా. మరియు, చిదాభాసబ్రహ్మములనెడి రెంటిచేతనుఘటము ప్రకాశింపబడుటవలన ఘటమందు జ్ఞాతత్వముచేత చైతన్యద్వయము ప్రకాశించుచున్నది. మరియు, ఈచెప్పబడిన ఘటజ్ఞాతత్వమును ప్రకాశింపజేసెడి బ్రహ్మచైతన్యమును, తార్కికులు అనువ్యవసాయమనెడి పేరుగల మరియొక జ్ఞానమునుగా జెప్పుదురు.

శ్లో॥ ఘటోఽయమిత్యసావుక్తిరాభాసస్యప్రసాదతః।
విజ్ఞాతోఘటఇత్యుక్తిర్బ్రహ్మానుగ్రహతోభవేత్॥ ०६.

టీ. అయం-ఇది, ఘటఇతి-ఘటమనెడి, అసౌ-ఈ, ఉక్తిః-మాట, అనగా వ్యవహారమనుట. ఆభాసస్య-చిదాభాసునియొక్క, ప్రసాదతః-అనుగ్రహమువలన, అనగా చిదాభాసునిచేననుట. భవేత్-కలుగును. ఘటః-ఘటము, విజ్ఞాత ఇతి- తెలియబడెననెడి, ఉక్తిః-మాట, బ్రహ్మానుగ్రహతః = బ్రహ్మ- బ్రహ్మముయొక్క, అనుగ్రహతః-అనుగ్రహమువలన, అనగా బ్రహ్మముచేననుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భవేత్-కలుగును.

తా. మరియు, ఇదిఘటమనెడి వ్యవహారము చిదాభాసునిచేత గలుగుచున్నది. ఘటంబెరుగబడెననెడి వ్యవహారము బ్రహ్మమువలన గలుగుచున్నది. ఈద్వివిధ వ్యవహారభేదముచేతంగూడ, చిదాభాస బ్రహ్మములయొక్క భేదము తెలియదగినదగునని యభిప్రాయము.

అవ. ఈచెప్పబడిన ప్రకారము దేహముకంటె బాహ్యమందు, చిదాభాసబ్రహ్మములు రెండును విభజించి యెరుగబడినట్లు, దేహములోపటను చిదాభాసకూటస్థులిద్దరును విభజించి యెరుగదగినవారని, యిప్పుడు చెప్పుచున్నాడు..

శ్లో॥ ఆభాసబ్రహ్మణీ దేహాద్బహిర్యద్వద్వివేచితే।
తద్వదాభాసకూటస్థౌవివిచ్యేతాంవపుష్యపి॥ ౧౭.

టీ. దేహాత్-దేహముకంటె, బహిః - బాహ్యప్రదేశమందు, యద్వత్-ఏప్రకారము, ఆభాసబ్రహ్మణీ=ఆభాస-చిదాభాసుడును, బ్రహ్మణి-బ్రహ్మంబును, వివేచితే-వివేచనము జేయబడినవో, అనగా విభజనలక్షణముచే నెరుగబడినవోయనుట. తద్వత్-ఆప్రకారము, వపుష్యపి- దేహమందును, ఆభాసకూటస్థౌ=ఆభాస-చిదాభాసుడును, కూటస్థౌ-కూటస్థుడును, వివిచ్యేతాం - విభజనలక్షణముచే నెరుగబడుదురుగాక. అనగా దేహములోనుండెడి చిదాభాస కూటస్థులను విభజించి ప్రత్యేకముగా నెరుగవలెననుట.

తా. దేహముకంటె బాహ్యప్రదేశమందు చిదాభాస బ్రహ్మచైతన్యములే ప్రకారముగా, విభజనలక్షణముచే నెరుగబడినవో, ఆప్రకారమే దేహమందును చిదాభాసకూటస్థులను విభజించి యెరుగవలెనని తాత్పర్యము.

శ్లో॥ అహంవృత్తౌచిదాభాసః కామక్రోధాదికాసుచ।
సంవ్యాప్యవర్తతేతప్తేలోహేవహ్నిర్యథాతథా॥ ౧౮.

టీ. వహ్నిః-అగ్ని, తప్తే- అగ్నిచేదపింపబడిన, లోహే - ఇనుమునందు, సంవ్యాప్య-వ్యాపించి, యథా - ఏప్రకారము, వర్తతే - వర్తించుచున్నదో, తథా-ఆప్రకారము, చిదాభాసః- చిత్ప్రతిబింబము, అహంవృత్తౌ - నేననెడి వృత్తియందును, కామక్రోధాదికాసుచ- కామక్రోధాది వృత్తులయందును, సంవ్యాప్య-వ్యాపించి, వర్తతే - వర్తించుచున్నాడు.

తా. ప్ర. అయితే, దేహముకంటె బాహ్యమందు చిదాభాసునిచే వ్యాపింపదగిన ఘటాకారవృత్తివంటి, దేహాంతరవిషయ గోచరవృత్తి లేమివలన, ఆవృత్తిని వ్యాపించినట్టి చిదాభాసుడు గలడని యెట్లంగీకరింపబడును?. ఉ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అగ్నిచేత దపింపబడిన ఇనుమునందు అగ్నివ్యాపించియున్నట్లు, ఈ చిదాభాసుడు, (అహం=నేను) అనెడి వృత్తియందును, కామక్రోధాది వృత్తులయందును వ్యాపించి వర్తించుచున్నాడు. అనగా, దేహములోపట, ఘటాదివిషయగోచరవృత్తిలేక పోయినను, అహమాదివృత్తులుండుటవలన, ఆయహమాది వృత్తులను వ్యాపించియుండెడి చిదాభాసుడు, గలడని యంగీకరించుటకు శక్యమగునని యభిప్రాయము.

అవ. అహమాది వృత్తులే చిదాభాసునిచే బ్రకాశింప బడుచున్నవని, దృష్టాంతమును విస్తరించుటచేత, స్పష్టము జేయుచున్నాడు.

శ్లో॥ స్వమాత్రంభాసయేత్తప్తంలోహంనాన్యత్కదాచన।
ఏవమాభాససహితావృత్తయస్స్వస్వభాసికాః॥ ౧౯.

టీ. తప్తం-అగ్నిచేత దపింపబడిన, లోహం-ఇనుము,స్వమాత్రం- తననుమాత్రము, భాసయేత్ - ప్రకాశింప జేయును. అన్యత్ - ఇతరభాగమును, కదాచన-ఎప్పుడును, నభాసయేత్-ప్రకాశింప జేయజాలదు. ఏవం-ఈప్రకారము, ఆభాససహితాః=ఆభాస-చిదాభాసునితోటి, సహితాః - కూడిన, వృత్తయః-అహమాదివృత్తులు, స్వస్వభాసికాః=స్వస్వ-తమతమను,భాసికాః- ప్రకాశింపజేయునవియగును. అనగా తమతమను ప్రకాశింపజేసికొనుచున్నవనుట.

తా. మరియు, అగ్నిచేత తపింపబడిన ఇనుము, తననుమాత్రముప్రకాశింపజేసికొనునేగాని, ఇతర భాగము నెప్పటికిని ప్రకాశింపజేయజాలదు. ఈప్రకారమే, చిదాభాసునితోగూడిన అహమాదివృత్తులు, తమతమనుప్రకాశింపజేసికొనుచున్నవి. అనగా చిదాభాసునితోగూడిన అహమాది వృత్తులే, చిదాభాసునిచేత బ్రకాశింపబడుచున్నవిగాని, యితర వృత్తులు ప్రకాశింపబడవని యభిప్రాయము.

అవ. ఇట్లు చిదాభాసుని నిరూపించి, యిక కూటస్థస్వరూప నిరూపణము జేయుటకొరకు, అందు కుపయోగించెడి, వృత్త్యభావసమయము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ క్రమాద్విచ్ఛిద్యవిచ్ఛిద్య జాయంతేవృత్తయోఽఖిలాః।
సర్వాఅపివిలీయంతేసుప్తిమూర్ఛాసమాధిషు॥ ౨౦.

టీ. అఖిలాః-సకలములగు, వృత్తయః-వృత్తులు, క్రమాత్ - క్రమముగా, విచ్ఛిద్యవిచ్ఛిద్య-నశించినశించి, అనగా నొకొ్కక్కటి యణగియనుట. జాయంతే-పుట్టుచున్నవి. సర్వాఅపి - సకలవృత్తులును, సుప్తిమూర్ఛాసమాధిషు=సుప్తి-సుషుప్తియందును, మూర్ఛా-మూర్ఛావస్థయందును, సమాధిషు-సమా


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధియందును, విలీయంతే - లయమునుబొందుచున్నవి.

తా. మరియు, బుద్ధివృత్తులన్నియు, ఒక్కొకటి క్రమనుగా నశించుచు, పుట్టుచున్నవి. సుషుప్తిమూర్ఛాసమాధ్యవస్థలయందు,బుద్ధివృత్తులన్నియు,లయించుచున్నవి.

శ్లో॥ సంధయోఽఖిలవృత్తీనా మభావాశ్చావభాసితాః।
నిర్వికారేణయేనాసౌ కూటస్థఇతిచోచ్యతే॥ ౨౧.

టీ. అఖిలవృత్తీనాం=అఖిల-సకలములైన, వృత్తీనాం- వృత్తులయొక్క, సంధయః-సంధులును, అనగా నడిమికాలములనుట. అభావాశ్చ- వృత్త్యభావములును, అనగా వృత్తులులేని కాలములనుట. యేన-ఏ, నిర్వికారేణ-నిర్వికారసాక్షిచేత, అవభాసితాః - తోచబడుచున్నవో, అసౌ - ఈసాక్షి, కూటస్థ ఇతిచ - కూటస్థుడని, ఉచ్యతే - చెప్పబడుచున్నాడు.

తా. ప్ర. సరి. సమాధిమొదలగు అవస్థయందు వృత్తివిలయంబగుగాక. ఈవృత్తివిలయముచేత కూటస్థుడుగలడని యెట్లుతెలియబడునో చెప్పుము?. ఉ. ఒకబుద్ధివృత్తినశించి, మరియొకబుద్ధివృత్తి పుట్టుచుండగా, ఆరెండువృత్తుల యొక్క నడిమికాలము సంధియనబడును. అట్టి సంధికాలములును, సుషుప్తి మూర్ఛాసమాధ్యవస్థలయందు వృత్తులయొక్క అభావములును, (అనగావృత్తులులేవనియు) ఏనిర్వికార సాక్షిచైతన్యముచేత తోచబడుచున్నవో, ఆయీసాక్షిచైతన్యమే కూటస్థుడని తెలియవలెను.

శ్లో॥ ఘటేద్విగుణచైతన్యం యథాబాహ్యేతథాంతరే।
వృత్తివ్యాపితత స్తత్ర వైశద్యంసంధితోఽధికం॥ ౨౨.

టీ. బాహ్యే-బాహ్యపదార్థమగు, ఘటే-ఘటమందు, యథా-ఏప్రకారము, ద్విగుణచైతన్యం=ద్విగుణ-ద్విగుణింపబడిన, చైతన్యం - చైతన్యముగలదో, అనగా రెండుచైతన్యములుగలవోయనుట. తథా - ఆప్రకారము, అంతరే-దేహమందు, వృత్తివ్యాపి-అహంకారాదివృత్తులయందును,(ద్విగుణచైతన్యం) చైతన్యద్వయముగలదని తెలియవలెను. (యతః) ఏకారణమువలన చైతన్యద్వయముగలదో, అతః-ఆకారణమువల్ల, సంధితః - సంధికాలములవలన, తత్ర-ఆయహమాదివృత్తులయందు, వైశద్యం - స్పష్టత్వము, అధికం - అధికముగా; (దృశ్యతే) చూడబడుచున్నది.

తా. ప్ర. అయితే, ఇట్లగుచుండగా ఫలితమేమి?. ఉ. బాహ్యపదార్థమగు ఘటమందు, ఒకఘటమునుమాత్రము ప్రకాశింపజేసెడి.౧. చిదాభాస చైతన్యంబును మరియు, ఘటముయొక్క జ్ఞాతత్వమును ప్రకాశింపజేసెడి, ౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఘటకల్పనాధిష్ఠాన బ్రహ్మచైతన్యంబును, ఏప్రకారముగా నిట్లు చైతన్యద్వయముగలదో, ఆప్రకారమే దేహములోపట, అహంకారాది వృత్తులయందును, ౧. కూటస్థచైతన్యంబును, మరియు, ౨. వృత్తినిప్రకాశింపజేసెడి, ౨. చిదాభాసచైతన్యంబుంగలదని, యిట్లు చైతన్యద్వయమునెరుగవలెను. ప్ర. అయితే, ఈదేహమందు చైతన్యద్వయమున్నయెడల, అందుకు ఉపపత్తినిచెప్పుము?. ఉ. ఏకారణముచేత చైతన్యద్వయముగలదో, ఆకారణముచేత సంధికాలములవలన, ఆవృత్తులయందు స్పష్టత్వమధికముగా గనబడుచున్నదని తెలియవలెను. ఉపపత్తియనగా (సబబు) అనియర్థము.

శ్లో॥ జ్ఞాతతాజ్ఞాతతే నస్తో ఘటవద్వృత్తిషుక్వచిత్।
స్వస్యస్వేనాగృహీతత్వాత్తాభిశ్చాజ్ఞాననాశనాత్॥ ౨౩.

టీ. స్వస్య-తనకు, అనగా వృత్తికనుట. స్వేన - తనచేత, అగృహీతత్వాత్-గ్రహించుట గలుగమివలనను, అనగా జ్ఞానముచే ఘటముగ్రహింపబడినట్లు, తనచే తానుగ్రహించబడరామిచేననుట. తాభిః - ఆవృత్తులచేత, అజ్ఞాననాశనాచ్చ=అజ్ఞాన-అజ్ఞానముయొక్క, నాశనాచ్చ-నాశమువలనను, ఘటవత్-ఘటమందువలె, వృత్తిషు-బుద్ధివృత్తులయందు, క్వచిత్ - ఎప్పటికిని, జ్ఞాతతాజ్ఞాతతే=జ్ఞాతతా-జ్ఞాతత్వంబును, అజ్ఞాతతే- అజ్ఞాతత్వంబును, న స్తః-లేవు.

తా. ప్ర. అయితే, ఘటాదులయందు జ్ఞాతత్వాజ్ఞాతత్వములను ప్రకాశింపజేయుటచేత బ్రహ్మమంగీకరింపబడినట్లు, ఈవృత్తులయందును జ్ఞాతత్వాజ్ఞాతత్వములను ప్రకాశింపజేయుటచేత కూటస్థుడంగీకరింపబడడా యేమి?. ఉ. ఘటమందు జ్ఞాతత్వ అజ్ఞాతత్వములు సంభవించినట్లు, వృత్తులయందెప్పటికిని జ్ఞాతత్వాజ్ఞాతత్వములు సంభవింపవు. ప్ర. అయితే,వృత్తులయందు జ్ఞాతత్వాజ్ఞాతత్వములు సంభవింపమికి, కారణమేమి?. ఉ. జ్ఞానవ్యాప్తిచేత ఘటాదులయందు జ్ఞాతత్వము గలుగుచున్నది. అజ్ఞానవ్యాప్తిచేత ఘటాదులయందు అజ్ఞాతత్వముగలుగుచున్నది. బుద్ధివృత్తులో,స్వప్రకాశరూపత్వము గలిగియుండుటచేత, ఆవృత్తులయందు జ్ఞానము వ్యాపింపదు. అందుచేత వృత్తులయందు జ్ఞాతత్వము సంభవింపదు. మరియు, ఆవృత్తులు, తాము ఉత్పత్తియైన మాత్రముచేత, స్వగోచరాజ్ఞానము నివర్తింపజేయుటవలన, ఆవృత్తులయందు అజ్ఞానవ్యాప్తియులేదు. అందుచేత వృత్తులయందు అజ్ఞాతత్వంబును లేదని తెలియవలెను.

శ్లో॥ ద్విగుణీకృతచైతన్యేజన్మనాశానుభూతితః।
అకూటస్థంతదన్యత్తుకూటస్థమవికారతః॥ ౨౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ద్విగుణీకృత చైతన్యేసతి= ద్విగుణీకృత-రెంటిచే గుణింపబడిన, చైతన్యేసతి- చైతన్యస్థితిగలుగుచుండగా, అనగా రెండుచైతన్యములుండగా ననుట. (ఏకస్య) ఒకచైతన్యమునకు, అనగా చిదాభాసునకనుట. జన్మనాశానుభూతితః=జన్మనాశ-ఉత్పత్తివినాశములయొక్క, అనుభూతితః-అనుభవమువలన, అకూటస్థం-అకూటస్థత్వమగును. తదన్యత్తు=తత్-ఆచిదాభాస చైతన్యముకంటె, అన్యత్తు-ఇతరచైతన్యమో, అవికారతః- నిర్వికారత్వమువలన, కూటస్థం- కూటస్థత్వముగలదగును.

తా. ప్ర. అయితే, కూటస్థచిదాభాసుల కిద్దరికిని చిద్రూపము సమానత్వమును బొందుచుండగా, అందొకనికి కూటస్థభావంబును, మరియొకనికి, కూటస్థభావములేమియు నెట్లుగలిగెను?. ఉ. చిదాభాసునియందుగల ఉత్పత్తి వినాశము లనుభవింపబడుచుండుటచేత, ఆచిదాభాసునకు కూటస్థభావమును జెప్పరాదు. మరియు, రెండవచైతన్యమగు కూటస్థునకు వికారిత్వము గలిగియుండుటయందు ప్రమాణములేమిచేత, ఆ రెండవచైతన్యమునకు కూటస్థభావమే తగియున్నదని తెలియవలెను.

శ్లో॥ అంతఃకరణతద్వృత్తిసాక్షీత్యాదావనేకధా।
కూటస్థఏవసర్వత్రపూర్వాచార్యైర్వినిశ్చితః॥ ౨౨.

టీ. అంతఃకరణతద్వృత్తిసాక్షీత్యాదౌ=అంతఃకరణ - మనస్సునకును, తత్-ఆమనస్సుయొక్క, వృత్తి-వృత్తులకును, సాక్షీ-సాక్షియనెడి, ఇత్యాదౌ-ఇత్యాదివాక్యమందు, అనేకధా-అనేకవిధములుగా, కూటస్థఏవ- కూటస్థాత్మయే, సర్వత్ర-అంతటను, పూర్వాచార్యైః - పూర్వాచార్యులచేత, వినిశ్చితః-నిశ్చయింపబడెను. అనగా జెప్పబడెననుట.

తా. ప్ర. అయితే, చిదాభాసునికంటె నన్యుడగు కూటస్థునియొక్క అంగీకారము, మీచేతనే కల్పింపబడెనేమో చెప్పుడు?. ఉ. కూటస్థుడు,అంతఃకరణతద్వృత్తులకు సాక్షియనియు, చైతన్యరూపుడనియు, ఆనందరూపుడనియు, సద్రూపుడనియు, ఇట్టి నీస్వరూపభూతుడగు కూటస్థునిపొందితివో లేదో యనెడి యర్థముగల, శ్లో॥ అంతఃకరణ తద్వృత్తిసాక్షీచైతన్యవిగ్రహః। ఆనందరూపస్సత్యస్సన్కిన్నాత్మానం ప్రపద్యసే ॥ అనెడి యిత్యాది వాక్యములయందు, అనేకవిధములుగా కూటస్థుడే, సర్వస్థలములయందును పూర్వాచార్యులచేత జెప్పబడెనిని తెలియవలెను.

అవ. కూటస్థునికంటె నన్యుడగు చిదాభాసుడును, వారిచేతనేవర్ణింపబడెనని యిప్పుడు చెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ ఆత్మాభాసాశ్రయాశ్చైవంముఖాభాసాశ్రయాయథా।
గమ్యంతేశాస్త్రయుక్తిభ్యామిత్యాభాసశ్చవర్ణితః॥ ౨౬.

టీ. ముఖాభాసాశ్రయాః=ముఖ-ముఖంబును, ఆభాస - ముఖప్రతిబింబంబును, ఆశ్రయాః-అద్దము మొదలగునదియు, యథా- ఏప్రకారముగనబడుచున్నవో, ఏవం--ఈప్రకారము, ఆత్మాభాసాశ్రయాశ్చ=ఆత్మ - కూటస్థుడును, ఆభాస-చిదాభాసుడును, ఆశ్రయాశ్చ- అంతఃకరణాదికంబును, శాస్త్రయుక్తిభ్యాం-శాస్త్రయుక్తులచేత, గమ్యంతేఇతి-పొందబడుచున్నవనెడి వాక్యమందు, ఆభాసశ్చ-చిదాభాసుడును, వర్ణితః - పూర్వాచార్యులచేత వర్ణింపబడెను.

తా. మరియు, ౧. ముఖము, ౨. ఆముఖముయొక్క ప్రతిబింబము, ౩. అద్దము, ఈమూడును లోకమందు కనబడినట్లు, ౧. కూటస్థుడును, ౨. చిదాభాసుడును, ౩. అంతఃకరణాదికంబును, శాస్త్రయుక్తులచేత పొందబడుచున్నవని చెప్పెడి, ఇత్యాదివాక్యములయందు, ఆపూర్వాచార్యులచేతనే, చిదాభాసుడును వర్ణింపబడెనని తెలియవలెను. ప్ర. ఆశాస్త్రయుక్తులెవ్వి? ఉ. శ్రు॥ మనస్సాక్షీ, బుద్ధేస్సాక్షీ॥ అనెడి యిత్యాది శ్రుతి, బుద్ధికి సాక్షియగు కూటస్థుని ప్రతిపాదింపుచున్నది. మరియు, ప్రతిబింబరూపుడగు చిదాభాసుడు కల్పింపబడెనని, శ్రు॥ రూపంరూపం ప్రతిరూపోబభూవ ॥ అనెడి యిత్యాదిశ్రుతిః చిదాభాసుని ప్రతిపాదించుచున్నది. ఈకూటస్థ చిదాభాసులను దెలిపెడి శ్రుతులు, శాస్త్రమని తెలియవలెను. మరియు, వికారిత్వ అవికారిత్వ రూపమగు యుక్తి, పూర్వమే చెప్పబడెనని తెలియవలెను.

అవ. ఇప్పుడు, పూర్వవాది, చిదాభాసునిగురించి యాక్షేపము జేయుచున్నాడు.

శ్లో॥ బుద్ధ్యవచ్ఛిన్నకూటస్థోలోకాంతరగమాగమౌ।
కర్తుంశక్తోఘటాకాశ ఇవాభాసేనకింవద॥ ౨౭.

టీ. బుద్ధ్యవచ్ఛిన్నకూటస్థః= బుద్ధి - అంతఃకరణముతోటి, అవచ్ఛిన్న- అవచ్ఛేదమునుబొందిన, కూటస్థః-కూటస్థాత్మ, లోకాంతరగమాగమౌ = లోకాంతర-పరలోకాదులనుగురించి, గమాగమౌ=గమనాగమనములను, ఘటాకాశఇవ-ఘటాకాశమువలె, కర్తుం- చేయుటకొరకు, శక్తః - సమర్థుడగును. ఆభాసేన-చిదాభాసునిచేత, కిం-ప్రయోజనమేమియో, వద-చెప్పుము.

తా. ఓ అద్వైతసిద్ధాంతీ, తనయందుగల్పించబడిన బుద్ధిచేనవచ్ఛేదమునుబొందిన కూటస్థుడే, ఘటాకాశమువలెనే, బుద్ధిద్వారా, లోకాంతర గమనా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గమనములను జేయుటకు సమర్థుడగును. కనుక, చిదాభాసుని కల్పించుటచేత ప్రయోజనములేదు. అనగా చిదాభాసుని కల్పించుటచేత భారమేయగుగాని, మరియొక ప్రయోజనములేదని యభిప్రాయము.

అవ. ఇందుకుసిద్ధాంతి, అసంగుడగు కూటస్థునకు బుద్ధ్యవచ్ఛిన్నమాత్రముచేత జీవత్వము ఘటింపదనియు, అట్లుగానియెడల నధిక ప్రసంగమగునని పరిహారమును జెప్పుచున్నాడు.

శ్లో॥ శృణ్వసంగః పరిచ్ఛేదమాత్రాజ్జీవో౽భవేన్నహి।
అన్యథాఘటకుడ్యాద్యైరవచ్ఛిన్నస్యజీవతా॥ ౭౮.

టీ. శృణు - చెప్పెదవినుము. అసంగః- అసంగుడగు కూటస్థుడు, పరిచ్ఛేదమాత్రాత్-పరిచ్ఛేదమాత్రమువల్ల, జీవః-జీవుడు, నభవేద్ధి-కాడు. అన్యథా-అట్లుగానియెడల, అనగా బుద్ధిచే బరిచ్ఛిన్నుడగు కూటస్థునకు జీవత్వము గలిగెడి పక్షమందునట. ఘటకుడ్యాద్యైః=ఘట-ఘటముచేతను, కుడ్యాద్యైః-గోడమొదలగు పదార్థములచేతను అవచ్ఛిన్నస్య - అవచ్ఛేదమును బొందినబ్రహ్మచైతన్యమునకు, జీవతా - జీవత్వము ప్రాప్తించవలెను.

తా. ఓపూర్వవాదీ, నేనుజెప్పెదవినుము. అసంగుడగుకూటస్థుడు,బుద్ధిచే పరిచ్ఛిన్నత్వమునుబొందినమాత్రముచేతనే, ఆకూటస్థునకు జీవత్వముసంభవింపదు. అట్లుగాక బుద్ధ్యవచ్ఛిన్నమాత్రముచేత కూటస్థునకు జీవత్వము ప్రాప్తించుననిచెప్పిన పక్షమందు, ఘటము, గోడమొదలగు పదార్థములచే నవిచ్ఛిన్నత్వమునుబొందిన బ్రహ్మచైతన్యమునకును జీవత్వము ప్రాప్తించెనని చెప్పవలసివచ్చును. అనగా ఘటాద్యవచ్ఛిన్న బ్రహ్మచైతన్యమునకు జీవత్వముగలిగినట్లు కనబడమిచేత, బుద్ధ్యవచ్ఛిన్నకూటస్థునకును జీవత్వముగలుగదని యభిప్రాయము.

శ్లో॥ నకుడ్యసదృశీబుద్ధిస్స్వచ్ఛత్వాదితిచేత్తథా।
అస్తునామపరిచ్ఛేదేకింస్వాచ్ఛ్యేనభవేత్తవ॥ ౭౯.

టీ. బుద్ధిః-అంతఃకరణము, స్వచ్ఛత్వాత్-స్వచ్ఛత్వముగలిగియుండుట వలన, కుడ్యసదృశీ=కుడ్య-గోడతోటి, సదృశీ-సమానత్వమునుపొందినది. నేతిచేత్- కాదనియంటివేని,తథాఅస్తునామ - ఆప్రకారమగుగాక. స్వాచ్ఛ్యేన-స్వచ్ఛత్వముచేత, పరిచ్ఛేదే-పరిచ్ఛేదమందు, తవ-నీకు, కింభవేత్- ప్రయోజనమేమిగలుగును. అనగా ప్రయోజనము లేదనుట.

తా. ప్ర. అయితే, బుద్ధి, స్వచ్ఛత్వము గలదగుటచేత, ఆబుద్ధిని, గోడతో సమానమైనదానినిగా నెట్లుచెప్పవచ్చును?. ఉ. సరి. నీవుచెప్పినట్లు,బుద్ధి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వచ్ఛత్వముగలదేయగును. ఆస్వచ్ఛత్వముచేత, పరిచ్ఛేదమందు ప్రయోజన మేమియులేదు.

అవ. ఈ యర్థమునే, దృష్టాంతముచేత స్పష్టము జేయుచున్నాడు.

శ్లో॥ ప్రస్థేనదారుజస్యేనకాంస్యజస్యేనవానహి।
విక్రేతుస్తండులాదీనాంపరిమాణంవిశిష్యతే॥ ౩౦.

టీ. దారుజస్యేన- కొయ్యచే జేయబడినట్టిదైననను, కాంస్యజస్యేనవా- కంచుతో జేయబడినట్టిదైనను, ప్రస్థేన-కుంచెముచేత, విక్రేతుః- అమ్మెడివానికి, తండులాదీనాం-బియ్యము మొదలగువానియొక్క, పరిమాణం-పరిమాణము, అనగా పరిమితియనుట. నవిశిష్యతేహి - భేదమునుబొందదుగదా.

తా. కొయ్యతోనైనను, కంచుతోనైనను జేయబడిన కుంచెముచేత విక్రయించెడివానికి, ధాన్యాదులయొక్క పరిమితి, భేదింపబడదు. అనగా, మ్రానుతోటియు, కంచుతోటియు జేయబడిన కుంచెములయందు గల స్వచ్ఛత్వాస్వచ్ఛత్వములు, ధాన్యాదులయొక్క కొలయందు భేదహేతువులు గావనియభిప్రాయము. అటువలెనే, బుద్ధియొక్క స్వచ్ఛత్వము పరిచ్ఛేదమందు ప్రయోజనకారిగాదని తెలియవలెను. పరిచ్ఛేదము = అవచ్ఛేదము= గొప్పవస్తువు చిన్నదిగా దోచుట.

శ్లో॥ పరిమాణావిశేషేపిప్రతిబింబోవిశిష్యతే।
కాంస్యేయదితదాబుద్ధావప్యాభాసోభవేద్బలాత్॥ ౩౧.

టీ. కాంస్యే-కంచుకుంచెమందు, పరిమాణావిశేషేపి=పరిమాణ - కొలచేత, అవిశేషేపి-ఆధిక్యము లేకపోయినను, ప్రతిబింబః-ప్రతిబింబము, విశిష్యతేయది - ఆధిక్యతను బొందుచున్నదంటివేని, తదా-అప్పుడు, బలాత్ - నీవాక్యబలమువలన, బుద్ధావపి- బుద్ధియందును, ఆభాసః - చిదాభాసుడు, భవేత్- కలుగును.

తా. ప్ర. అయితే, కంచుకుంచెమందు ధాన్యపుకొలయొక్క ఆధిక్యతలేకపోయినను, స్వచ్ఛత్వముచేత ప్రతిబింబలక్షణమగు ఆధిక్యము గలదుగదా?. ఉ. సరి. అట్లైనయెడల, నీవాక్యబలమువలన, బుద్ధియందు చిదాభాసుడుగలుగును. అనగా కంచుకుంచెమందు ప్రతిబింబమును నీవంగీకరించినప్పుడు, బుద్ధియందుగల చిదాభాసుడును, నీచేతనే యంగీకరింపబడిన వాడగునని యభిప్రాయము.

శ్లో॥ ఈషద్భాసనమాభాసఃప్రతిబింబస్తథావిధః।
బింబలక్షణహీనస్సన్బింబవద్భాసతేసహి॥ ౩౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఈషత్-కొంచెముగా, భాసనం-ప్రకాశించుట, ఆభాసః - ఆభాసుడగును. అనగా నాభాసత్వమగుననుట. ప్రతిబింబః - ప్రతిబింబము, తథావిధః-అటువంటిదేయగును. హి-ఏకారణముచేత, సః- ఆప్రతిబింబము, బింబలక్షణహీనస్సన్ = బింబ-బింబముయొక్క, లక్షణ-లక్షణముచేత, హీనస్సన్-హీనమగుచు, అనగా బింబలక్షణములేనిదగుచుననుట. బింబవత్ - బింబమువలె, భాసతే- ప్రకాశించుచున్నదో.

తా. ప్ర. అయితే,ప్రతిబింబము నంగీకరించుటచేత, చిదాభాసుడెట్లంగీకరింపబడును?. ఉ. చిదాభాసత్వమనగా, కొంచెముగా ప్రకాశించుటయగును. మరియు, అటువంటిదే ప్రతిబింబమగును. అనగా ప్రతిబింబాభాసశబ్దములచేత జెప్పదగిన పదార్థమునకు ఏకత్వము గలిగియుండుటవలన, ప్రతిబింబాంగీకారబలముచేత, ఆభాసుడు నంగీకరింపబడిన వాడేయగునని యభిప్రాయము. ప్ర. అయితే, ప్రతిబింబమునకు ఆభాసత్వమెట్లు సిద్ధించును?. ఉ. ఏకారణముచేత ప్రతిబింబము, బింబలక్షణము లేనిదగుచు బింబమువలె ప్రకాశించుచున్నదో, ఆకారణముచేత బింబాభాసమని చెప్పబడును. అనగా ప్రతిబింబమునకు ఆభాస లక్షణత్వముండుటచేత, ఆభాసత్వము గలిగెనని యభిప్రాయము.

అవ. బింబాభాసమునకు, బింబలక్షణము లేకపోవుటనే, యిప్పుడు స్పష్టము జేయుచున్నాడు.

శ్లో॥ ససంగత్వవికారాభ్యాంబింబలక్షణహీనతా।

స్ఫూర్తిరూపత్వమేతస్యబింబవద్భాసనంవిదుః॥ ౩౩.

టీ. ఏతస్య - ఈచిదాభాసునకు, ససంగత్వవికారాభ్యాం= ససంగత్వ-ససంగత్వముచేతను, వికారాభ్యాం-సవికారముచేతను, అనగా సంగత్వవికారత్వములతో గూడుటచేసనుట. బింబలక్షణహీనతా-బింబలక్షణహీనత్వముగలిగెను. స్ఫూర్తిరూపత్వం- స్ఫురణరూపత్వమును, బింబవత్-బింబమువలె, భాసనం-ప్రకాశించుటనుగా, విదుః-విద్వాంసులు దెలిసికొనిరి.

తా. ఈ చిదాభాసునకు గల ససంగత్వ వికారములచేత, బింబభూతమగు అసంగ నిర్వికారి చైతన్యలక్షణముయొక్క హీనత్వం బీచిదాభాసునియందుగలదు. మరియు, ఈ చిదాభాసునియొక్క స్ఫురణరూపత్వమును, బింబమువలె ప్రకాశించుటనుగా పండితులు తెలిసికొనిరి. అనగా, హేతులక్షణము లేనిదగుచు, హేతువువలెదోచుచుండెడి, హేత్వాభాసమువలెనే, చిదాభాసు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డును చిద్బింబ లక్షణములేకనే, చిద్బింబమువలె ప్రకాశించుచున్నాడని తెలియవలెను.

అవ. ఇట్లు చిదాభాసునకు అప్రయోజకత్వమును నిరాకరించి, ఇప్పుడాచిదాభాసునకు బుద్ధికంటె భిన్నస్థితిని సాధించుటకొరకు, పూర్వపక్షమును జెప్పుచున్నాడు.

శ్లో॥ నహిధీభావభావిత్వాదాభాసో ౽స్తిధియఃపృథక్।
యథామృదల్పమేవో ౽క్తం ధీరప్యేవంస్వదేహతః॥ ౩౪.

టీ. యథామృత్ - మృత్తికవలె, అనగా మృత్తికయందుబుట్టిన ఘటము మృత్తికకంటె నన్యముగా భేదింపబడనట్లనుట. ధీభావభావిత్వాత్=ధీ-బుద్ధియనెడి, భావ-పదార్థమందు, భావిత్వాత్-భావింపబడుటవలన, అనగా బుద్ధియందుబుట్టుటచేననుట. ఆభాసః-చిదాభాసుడు, ధియః-బుద్ధికంటె, పృథక్-భిన్నముగా, నాస్తిహి-లేడుగదా. అనగా లేడనియంటివేనియనుట. ఉక్తం-ఈచెప్పబడినది, అల్పమేవ-స్వల్పమేయగును. అనగా నిట్లుచెప్పుటవలన ప్రయోజనము లేదనుట. ధీరపి-బుద్ధియు, స్వదేహతః-తనదేహమువలన, ఏవం- ఈప్రకారమగును. అనగా దేహముకంటె నన్యముగా బుద్ధియు లేకపోవుననుట.

తా. ప్ర. అయితే, మృత్తికయందు బుట్టిన ఘటము, ఆమృత్తికకంటె భిన్నముగాలేనట్లు, బుద్ధియందు బుట్టిన చిదాభాసుడును, ఆబుద్ధికంటె భిన్నముగా లేడుగదా?. ఉ. ఇట్లు చెప్పినయెడల, దేహముకంటె భిన్నముగా బుద్ధియులేదని చెప్పవలసివచ్చును. అనగా నిట్లుచెప్పినయెడల దేహముకంటెనన్యమగుబుద్ధియు సిద్ధించదనెడి ప్రతిబందిచేత, ఈ యాక్షేపమును సిద్ధాంతి పరిహరించెనని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, పూర్వవాది, ప్రతిబందీమోచనమునుశంకించుచున్నాడు.

శ్లో॥ దేహేమృతేపిబుద్ధిశ్చేచ్ఛాస్త్రాదస్తితథాసతి।
బుద్ధేరన్యశ్చిదాభాసః ప్రవేశశ్రుతిషుశ్రుతః॥ ౩౫.

టీ. దేహే-దేహము, మృతేపి-మృతిబొందినను, బుద్ధిః-బుద్ధి, శాస్త్రాత్-శాస్త్రమువలన, అస్తిచేత్-కలదనియంటివేని, తథాసతి-అట్లగుచుండగా, అనగా శాస్త్రముచే దేహముకంటె నన్యముగా బుద్ధియున్నయెడలననుట. బుద్ధేః-బుద్ధికంటె, అన్యః-అన్యుడగు, చిదాభాసః-జీవుడు, ప్రవేశశ్రుతిషు-ప్రవేశశ్రుతులయందు, శ్రుతః-వినబడుచున్నాడు.

తా. ప్ర. అయితే, దేహముమృతిబొందినను, దేహముకంటె నన్యమగుబుద్ధిగలదని, శ్రు॥ సవిజ్ఞానమయోభవతి॥ అనెడి యిత్యాదిశ్రుతి, చెప్పుచుం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డలేదా యేమి?. ఉ. సరి. శ్రుతిబలమువలన దేహాముకంటెనన్యమగు బుద్ధిగల దని యంగీకరించినయెడల, ప్రవేశశ్రుతులయందు చిదాభాసుడు వినబడుచుం డుటవలన ప్రవేశ శ్రుతిబలముచేత, బుద్ధికంటె నన్యుడగు చిదాభాసుడు నం గీకరింపవగినవాడే యగును.

శ్లో॥ ధీయుక్తస్యప్రవేశశ్చేన్నైతరేయేధియఃపృథక్।
ఆత్మాప్రవేశంసంకల్ప్యప్రవిష్టఇతిగీయతే॥ 3౬.

టీ. ధీయుక్తస్య=ధీ-బుద్ధితోటి, యుక్తస్య - కూడినవానికి, అనగా చిదా భాసునకనుట. ప్రవేశశ్చేత్- ప్రవేశము వినబడుచున్నదని యంటివేని, న- కాదు. ధియః-బుద్ధికంటె, పృథక్-అన్యుడగు, ఆత్మా - పరమాత్మ, అనగా కూటస్థుడనుట. ప్రవేశం-ప్రవేశమును, సంకల్ప్య-సంకల్పించి, ప్రవిష్టఇతి- ప్రవేశించినవాడాయెనని, ఐతరేయే-ఐతరేయోపనిషత్తునందు, గీయతే - చెప్ప బడెను.

తా. ప్ర. అయితే, బుద్ధ్యుపాధికుడగు జీవునకేప్రవేశము వినబడుచు న్నదిగాని, బుద్ధికంటె నన్యునకు ప్రవేశము వినబడలేదుగదా?. ఉ. బుద్ధికం టె నన్యుడగు పరమాత్మ, దేహమందు ప్రవేశించవలెనని సంకల్పించి, ప్రవే శించెనని, ఐతరేయ శ్రుతియందు వినబడుచున్నది.

అవ. ఆశ్రుత్యర్థము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ కథంత్విదంసాక్షుదేహంమదృతేస్యాదితీరణాత్।
విదార్యమూర్ధసీమానంప్రవిష్టస్సంసరత్యయం॥ 32.

టీ. అయం-ఈపరమాత్మ, అనగా కూటస్థుడనుట. సాక్షుదేహం - దే హేంద్రియములతోగూడి వర్తించెడి, ఇదం-ఈజడపదార్థరాశి, మదృతే- చేత నుడగునన్ను విడిపించి, కథంస్యాత్త్వితి - ఎట్లు నిర్వహించునని, ఈరణాత్- ఐతరేయశ్రుతి చెప్పుటవలన, మూర్ధసీమానం=మూర్ధ - కపాలత్రయముయొక్క, సీమానం-మధ్యదేశమును, విదార్య- స్వసన్నిధిమాత్రముచేత భేదించి, ప్రవిష్ట స్సన్-దేహమందు ప్రవేశించినవాడగుచు, సంసరతి- జాగ్రదాదికము ననుభ వించుచున్నాడు.

తా. ఈ పరమాత్మ, దేహేంద్రియములతోగూడి వర్తించుచుండెడి, ఈజడపదార్థరాశి, చేతనుడగు నన్నువదలి, ఎట్లును నిర్వహింపజాలదని విచా రించి, కపాలత్రయమధ్యదేశమును, స్వసన్నిధిమాత్రముచేత భేదించి, ప్రవే శించినవాడగుచు జాగ్రదాదికము ననుభవించు చున్నాడని, ఐతరేయ శ్రుతి యందు వినబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ కథంప్రవిష్టోఽసంగశ్చేత్సృష్టిర్వాస్యకథంవద।
మాయికత్వంతయోస్తుల్యం వినాశశ్చసమస్తయోః॥ ३८.

టీ. అసంగః-అసంగాత్మ, కథం-ఎట్లు, ప్రవిష్టశ్చేత్-ప్రవేశించెడివాడగునని యంటివేని, అస్య-ఈయసంగపరమాత్మకు, సృష్టిర్వా-సృష్టియైననను, కథం-ఎట్లా, వద-చెప్పుము. తయోః - ఆప్రవేశసృష్టికర్తలకిద్దరికిని, మాయికత్వం-మాయికత్వము, తుల్యం-సమానమగును. సమస్తయోః - ఆ యిద్దరికిని, వినాశశ్చ-మాయికత్వమందు హేతువును (సమానః) సమానమగును.

తా. ప్ర. అయితే, అసంగుడైన యాత్మకు, ప్రవేశము యుక్తమెట్లగును?. ఉ. ఈయసంగుడైన పరమాత్మవలన సృష్టియెట్లుగలిగెనో చెప్పుము. అనగా నీచోద్యము సృష్టియందును సమానమేననియభిప్రాయము. ప్ర. అయితే, సృష్టికర్తయగు పరమేశ్వరుడు మాయికుడగుటచేత, ఈ దోషములేదని చెప్పరాదాయేమి?. ఉ. సరి. ఈపరిహారము, ప్రవేశించెడి యాత్మయందును సమానమేయగును. అనగా, సృష్టికర్తయందువలెనే, ప్రవేశకర్తయందును మాయికత్వము సమానముగానున్నదని యభిప్రాయము. మరియు, ఈసృష్టికర్తృప్రవేశకర్తలకు మాయికత్వమందు హేతువునుసమానమేయగునని తెలియవలెను.

అవ. ఔపాధికరూపమునకు వినాశిత్వమును ప్రతిపాదించెడి, శ్రు॥ ప్రజ్ఞానఘనఏవైతేభ్యోభూతేభ్యస్సముత్థాయతాన్యేవానువినశ్యతినప్రేత్యసంజ్ఞాస్తి॥ అనెడి శ్రుతి నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ సముత్థాయైషభూతేభ్యస్తాన్యేవానువినశ్యతి।
వినష్టిమితిమైత్రేయ్యై యాజ్ఞవల్క్యఉవాచహి॥ ३९.

టీ. ఏషః-ఈయాత్మ, భూతేభ్యః - పంచభూతకార్యములగు దేహేంద్రియాదిరూపములవలన, సముత్థాయ- జీవత్వాభిమానమునుబొంది, తాన్యేవ-ఆదేహాదులు, వినష్టిం- నాశమునుబొందుచుండగా, అనువినశ్యతి - అనుసరించి నాశమును బొందుచున్నాడని, అనగా జీవత్వాభిమానమును విడుచుచున్నాడనియనుట. యాజ్ఞవల్క్యః-యాజ్ఞవల్క్యఋషి, మైత్రేయ్యై-మైత్రేయియనెడి తనభార్యకొరకు, ఉవాచహి- చెప్పెను. అనగా జెప్పినవాడాయెననుట.

తా. ఈ ప్రజ్ఞానఘనరూపుడగు ఆత్మ, ఈదేహేంద్రియాద్యుపాధులచేత నేను జీవుడననెడి యభిమానమునుబొంది, ఆదేహాదులు నశించుచుండగా, ఆదేహాదులచే జేయబడిన జీవత్వాభిమానమును విడుచుచున్నాడని, ఈ ప్రకారము సోపాధికరూపుడగు చిదాభాసుడు, మోక్షదశయందు నశించుననిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాజ్ఞవల్క్య ఋషీశ్వరుడు, మైత్రేయియనెడి తనభార్యకొరకు, జెప్పినట్లు, శ్రీబృహదారణ్యకోపనిషత్తునందు వినబడుచున్నది.

అవ. మరియు, ఆ బృహదారణ్యకోపనిషత్తునందు, శ్రు ॥ అవినాశీవా రే యమాత్మానుచ్ఛిత్తిధర్మేతి॥ అనెడి శ్రుతిచేత, ఆసోపాధికరూపుడగు చిదాభాసునికంటె భిన్నుడగు కూటస్థుడు,చూపబడెనని యిప్పుడుచెప్పుచున్నాడు.

శ్లో॥ అవినాశ్యయమాత్మేతి కూటస్థః ప్రవివేచితః।
మాత్రాసంసర్గఇత్యేవ మసంగత్వస్యకీర్తనాత్॥ ౪౦.

టీ. అయం-ఈ, ఆత్మా-ఆత్మ, అవినాశీతి- నాశములేనివాడని చెప్పెడి శ్రుతిచేత; కూటస్థః-కూటస్థుడు, ప్రవివేచితః-విభజించిచూపబడెను. (అస్య) ఈ యాత్మకు, మాత్రాసంసర్గఇతి= మాత్రా-దేహాదులతోటి, అసంసర్గఇతి-సంబంధములేదని, ఏవం-ఈప్రకారము, అసంగత్వస్య - నిస్సంగత్వముయొక్క, కీర్తనాత్-కీర్తనమువలన, అనగా నీయాత్మకు దేహాదులతోటి సంబంధములేదని చెప్పుటవలన ననుట.

తా. మరియు, ఈ యాత్మ, నాశనములేనివాడనెడి యర్థముగల, శ్రు॥ అవినాశీవారేయమాత్మానుచ్ఛిత్తిధర్మేతి॥ అనెడి బృహదారణ్యకశ్రుతిచేత,కూటస్థుడు, విభజించి చూపబడెను. మరియు, శ్రు ॥ మాత్రాసంసర్గస్త్వస్యభవతి॥ అనెడి శ్రుతిచేత ఈయాత్మకు దేహాదులతోటి సంబంధములేదని, చెప్పబడెను. అనగా, ఈ యాత్మకు నాశములేకపోవుటకు, అసంగత్వమే హేతువగుననియు బృహదారణ్యకశ్రుతియందు జెప్పబడెనని యభిప్రాయము.

శ్లో॥ జీవాపేతంవావకిలశరీరంమ్రియతేనసః।
ఇత్యత్రనవిమోక్షోర్థః కింతులోకాంతరేగతిః॥ ౪౧.

టీ. జీవాపేతం-జీవరహితమగు, అనగా జీవునిచే విడువబడినట్టి యనుట. శరీరంవావకిల-శరీరమే, మ్రియతే- మృతినిబొందుచున్నది. సః-ఆజీవుడు, నమ్రియతేతి- మృతినిబొందడని చెప్పెడి, అత్ర - ఈశ్రుతియందు, విమోక్షః-మోక్షవిషయముగాగల, అర్థః-అర్థము, న - కాదు. కింతు - మరియేమనగా, లోకాంతరే - పరలోకమందు, గతిః-గతియగును. అనగా దేహాంతరప్రాప్తి విషయముగా గలదగుననుట.

తా. ప్ర. అయితే, శ్రు॥ జీవాపేతం వావకిలేదం మ్రియతే నజీవోమ్రియతే॥ అనెడి శ్రుతిచేత, సోపాధికుడగు జీవునకును నాశములేదని ప్రతిపాదింపబడుటకు గారణమేమి?. ఉ. జీవునిచే విడువబడిన శరీరము మాత్రమే మృతినిబొందుచున్నదనియు, జీవునకు మృతిలేదనియు, ఈశ్రుతిచెప్పుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈశ్రుతి, జీవునకు దేహాంతరప్రాప్తిని జెప్పుచున్నదేగాని, మోక్షవిషయమును జెప్పలేదు. అనగా నీశ్రుతి, జీవునకు దేహాంతరప్రాప్తిని జెప్పుచున్నదేగాని, జీవునకు మోక్షదశయందు నాశములేదనెడి విషయమును చెప్పలేదని యభిప్రాయము.

శ్లో॥ నాహంబ్రహ్మేతిబుధ్యేతసవినాశీతిచేన్నతత్।
సామానాధికరణ్యస్యబాధాయామపిసంభవాత్॥ ౪౨.

టీ. సః-ఆ, వినాశీ-వినాశముగలజీవుడు, అహం - నేను, బ్రహ్మేతి-బ్రహ్మమునైతినని, నబుధ్యేతీతిచేత్ - ఎరుగనేరడని యంటివేని, బాధాయామపి-బాధయందును, సామానాధికరణ్యస్య - సామానాధికరణ్యము, సంభవాత్-సంభవించుటవలన, తత్-ఆపక్షము, న-కాదు.

తా. ప్ర. అయితే, జీవునకు వినాశముగలిగెడిపక్షమందు, వినాశికినవినాశికి దేకత్వము విరోధమగుటచేత, అట్టిజీవునకు, (అహంబ్రహ్మాస్మి) అనెడియాకారముగల, వినాశములేని బ్రహ్మతాదాత్మ్యజ్ఞానమెట్లుగలుగును?. ఉ. ముఖ్యసామానాధికరణ్యములేని హేతువుచేత వినాశముగల ఆ జీవుడు, నేను బ్రహ్మమునైతినని, బ్రహ్మరూపునిగా తన నెరుగనేరడని చెప్పరాదు. ప్ర.అదియేమి?. ఉ. ముఖ్యసామానాధికరణ్యములేకపోయినను, బాధయందు సామానాధికరణ్యము సంభవించుటవలన, జీవభావబాధచేత బ్రహ్మభావమునుబొందుటకు శక్యమగునని తెలియవలెను.

అవ. బాధసామానాధికరణ్యముచేత, వాక్యార్థజ్ఞానప్రకారము, వార్తికకారులచేత దృష్టాంతసహితముగా జెప్పబడెనని, ఈయర్థమును, ఆవార్తికకారవాక్యోదాహరణ పూర్వకముగా జూపుచున్నాడు.

శ్లో॥ యోయంస్థాణుఃపుమానేష పుంధియాస్థాణుధీరివ।
బ్రహ్మాస్మీతిధియాశేషాహ్యహంబుద్ధిర్నివర్త్యతే॥ ౪౩.

టీ. యః-ఏ, అయం-ఈ, స్థాణుః-మోడుగలదో, ఏషః-వీడు,పుమాన్-పురుషుడనెడి, పుంధియా-పురుషత్వబోధచేత, స్థాణుధీరివ-స్థాణుత్వబుద్ధి నివర్తించినట్లు, బ్రహ్మ-బ్రహ్మము, అస్మీతి - నేనైతిననెడి, ధియా - బోధచేత, ఏషా-ఈ, అహంబుద్ధిరపి=అహం- నేనుకర్తననెడి, బుద్ధిరపి-బుద్ధియు, నివర్త్యతే- నివర్తింపబడుచున్నది.

తా. వా॥ స్థాణురేషఃపుమాన్=ఈస్థాణువుగాదోచునది పురుషుడనెడి వాక్యమందు, పురుషత్వబోధచేత స్థాణుత్వబుద్ధి, నివర్తించుచున్నది. ఇది, సామానాధికరణ్యముయొక్క బాధార్థత్వమందు దృష్టాంతమగును. ఈప్రకారమే,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(అహంబ్రహ్మాస్మి) అనెడి బోధచేత నేను కర్తనైతిననెడి యిత్యాది రూపముగల సర్వసంసారబుద్ధియు నివర్తించుచున్నది.

శ్లో॥ నైష్కర్మ్యసిద్ధావప్యేవమాచార్యైస్స్పష్టమీరితం।
సామానాధికరణ్యస్యబాధార్థత్వమతోస్తుతత్॥ ౪౪.

టీ. ఏవం-ఈచెప్పబడిన ప్రకారము, ఆచార్యైః- సురేశ్వరాచార్యులచేత, నైష్కర్మ్యసిద్ధావపి - నైష్కర్మ్యసిద్ధియనెడిగ్రంథమందు, సామానాధికరణ్యస్య - సామానాధికరణ్యముయొక్క, బాధార్థత్వం - బాధార్థత్వము, స్పష్టం-స్పష్టముగా, ఈరితం-చెప్పబడెను. అతః - ఆకారణమువలన, తత్-ఆసామానాధికరణ్యబాధార్థత్వము, అస్తు- నేను బ్రహ్మమునైతిననెడి వాక్యమందగుగాక.

తా. ఈచెప్పబడినప్రకారము, వార్తికకారులగు సురేశ్వరాచార్యులచేత నైష్కర్మ్యసిద్ధియనెడిగ్రంథమందు, సామానాధికరణ్యముయొక్క బాధార్థత్వము, స్పష్టముగాజెప్పబడెను. ప్ర.సరి. ఇట్లుచెప్పుటచేత ఫలితమేమి?. ఉ. ఆకారణమువలన, (అహంబ్రహ్మాసి) అనెడి వాక్యమందు, ఆసామానాధికరణ్యముయొక్క బాధార్థత్వము గలుగునని తెలియవలెను.

శ్లో॥ సర్వంబ్రహ్మేతిజగతాసామానాధికరణ్యవత్।
అహంబ్రహ్మేతిజీవేనసమానాధికృతిర్భవేత్॥ ౪౫.

టీ. సర్వంబ్రహ్మేతి - సర్వజగంబును బ్రహ్మమగుననెడి యర్థము గల వాక్యమందు, జగతా-జగంబుతోటి, సామానాధికరణ్యవత్ - సామానాధికరణ్యమువలె, అహంబ్రహ్మేతి - నేనుబ్రహ్మమైతిననెడి వాక్యమందు, జీవేన-జీవునితోటి, సమానాధికృతిః-సామానాధికరణ్యము, భవేత్-అగును.

తా. ప్ర. అయితే, ఈప్రకారము శ్రుతులయందెచ్చటను, సామానాధికరణ్యముయొక్క బాధార్థత్వము గనబడలేదేమి?. ఉ. సర్వజగంబును బ్రహ్మమగుననెడి యర్థముగల, శ్రు॥ సర్వంహ్యేతద్బ్రహ్మ॥ అనెడి శ్రుతియందు, జగంబులోటి సామానాధికరణ్యముయొక్క బాధార్థత్వము జూడబడుచున్నది. అటువలెనే, నేనుబ్రహ్మమునైతిననెడియర్థముగల, (అహంబ్రహ్మాస్మి) అనెడివాక్యమందును జీవునితోటి, సామానాధికరణ్యముయొక్క బాధార్థత్వమగునని తెలియవలెను.

శ్లో॥ సామానాధికరణ్యస్యబాధార్థత్వంనిరాకృతం।
ప్రయత్నతోవివరణేకూటస్థస్యవివక్షయా॥ ౪౬.

టీ. కూటస్థస్య-కూటస్థునియొక్క, వివక్షయా-వివక్షచేత, అనగా కూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టస్థుని జెప్పవలెననెడి యిచ్ఛచేననుట. సామానాధికరణ్యస్య- సామానాధికరణ్యముయొక్క, బాధార్థత్వం-బాధార్థత్వము, వివరణే- వివరణమనెడి గ్రంథమందు, ప్రయత్నతః-ప్రయత్నమువలన, నిరాకృతం- నిరాకరింపబడెను. అనగా బాధసామానాధికరణ్య నిరాకరణ పూర్వకముగా ముఖ్యసామానాధి కరణ్యను జెప్పబడెననుట.

తా. ప్ర. అయితే, వివరణాచార్యులచేత, బాధసామానాధికరణ్యము నిరాకరింపబడుటకు కారణమేమి?. ఉ. ఆవివరణాచార్యులు, అహంశబ్దము చేత కూటస్థుని జెప్పుటకు ఇచ్ఛయించినవారగుచు, వివరణమనెడి గ్రంథమందు ప్రయత్నముచేత, సామానాధి కరణ్యముయొక్క బాధార్థత్వమును, నిరాకరించిరి.

అవ. కూటస్థునియొక్క వివక్షచేనని చెప్పబడినయర్థము నిప్పుడువివరించి చెప్పుచున్నాడు.

శ్లో॥ శోధిత స్త్వంపదార్థోయఃకూటస్థోబ్రహ్మరూపతాం।
తస్యవక్తుంవివరణేతథోక్తమితరత్రచ॥ ౪౭.

టీ. శోధితః-బుద్ధ్యాదులవల్ల విభజింపబడిన, త్వంపదార్థః - త్వంపదలక్ష్యార్థభూతుడగు, యః-ఏ, కూటస్థః- చెప్పబోయెడిలక్షణముగల కూటస్థుడుగలడో, తస్య-ఆకూటస్థునకు, బ్రహ్మరూపతాం-సత్యాదిలక్షణము గల బ్రహ్మరూపత్వమును, వక్తుం-చెప్పుటకొరకు, వివరణే- వివరణగ్రంథమందును, ఇతరత్రచ-ఇతరగ్రంథములందును, తథా-ఆప్రకారము, అనగా బాధసామానాధికరణ్యనిరాకరణపూర్వకముగా ముఖ్యసామానాధికరణ్యమనుట. ఉక్తం-చెప్పబడెను.

తా. బుద్ధ్యాదులవలన విభజించియెరుగబడిన, త్వంపదలక్ష్యార్థమగునట్టియు, ఇక జెప్పబడెడి లక్షణముగల ఏకూటస్థుడుగలడో, ఆకూటస్థునకుసత్యాదిలక్షణముగల బ్రహ్మరూపత్వమును జెప్పుటకొరకు, వివరణాది గ్రంథములయందు, బాధసామానాధికరణ్య నిరాకరణపూర్వకముగా ముఖ్యసామానాధికరణ్యము జెప్పబడెనని తెలియవలెను.

అవ. ఇప్పుడు, కూటస్థునకు బ్రహ్మముతో నైక్యమును సంభావించుటకొరకు, కూటస్థశబ్దముచేత దెలుపబడెడి యర్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ దేహేంద్రియాదియుక్తస్యజీవాభాసభ్రమస్యయా।
అధిష్ఠానచితిస్సైషాకూటస్థోత్రవివక్ష్యతే॥ ౪౮.

టీ. దేహేంద్రియాదియుక్తస్య = దేహ-స్థూలదేహముతోటియు, ఇం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ంద్రియ - ఇంద్రియములతోఁటియు, ఆది-మనస్సు మొదలగు వానితోఁటియు, యు క్తస్య-కూడినట్టి, అనగా శరీరద్వయములోఁటి గూడినట్టియనుట. జీవాభాస భ్రమస్య = జీవాభాస-చిదాభాసరూపమగు, భ్రమస్య-భ్రమమునకు, యా-అధిష్ఠానచితిః - ఆధార చైతన్యముగలదో, సైసా - ఆయీచైతన్యము, అత్ర-ఇక్కడ, అనగా వేదాంతములయందనుట. కూటస్థః-కూటస్థుడని, వివక్ష్యతే-చెప్పుటకిచ్ఛయింపబడుచున్నది.

తా. దేహేంద్రియాదిరూపమగు శరీరద్వయముతో గూడినట్టి చిదాభాసరూపభ్రమమునకు, ఏయధిష్ఠానచైతన్యముగలదో, ఆయధిష్ఠానచైతన్యము, వేదాంతములయందు, కూటస్థశబ్దముచేత జెప్పబడుచున్నది.

అవ. ఇప్పుడు, బ్రహ్మశబ్దార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ జగద్భ్రమస్యసర్వస్యయదధిష్ఠానమీరితం।
త్రయ్యంతేషుతదత్రస్యాద్బ్రహ్మశబ్దవివక్షితం॥ ౪౯.

టీ. సర్వస్య-సకలమగు, జగద్భ్రమస్య-జగద్భ్రాంతికి, అనగా సర్వ జగత్కల్పనమునకనుట. యత్-ఏ, అధిష్ఠానం - ఆధారచైతన్యము, త్రయ్యంతేషు-వేదాంతములయందు, ఈరితం- చెప్పబడెనో, తత్-ఆచైతన్యము, అత్ర-ఇక్కడ, బ్రహ్మశబ్దవివక్షితం = బ్రహ్మశబ్ద - బ్రహ్మశబ్దముచేత, వివక్షితం-చెప్పుటకిచ్ఛయింపబడునది, స్యాత్ - అగును.

తా. మరియు సర్వజగత్కల్పనమునకు అధిష్ఠానమగు, ఏచైతన్యము వేదాంతములయందు నిరూపింపబడెనో, ఆచైతన్యమిచ్చట, బ్రహ్మశబ్దముచేత జెప్పబడుచున్నదని తెలియవలెను.

అవ. ఇప్పుడు జీవునకు కల్పితత్వమును కైముతికన్యాయముచే సాధించుచున్నాడు.

శ్లో॥ ఏకస్మిన్నేవచైతన్యే జగదారోప్యతేయదా।
తదాతదేకదేశస్య జీవాభాసస్యకాకథా॥ ౫౦.

టీ. ఏకస్మిన్-ఒక్కటియగు, చైతన్యేఏవ-చైతన్యమందే, యదా - ఎప్పుడు, జగత్-ప్రపంచము, ఆరోప్యతే-ఆరోపించబడెనో, తదా-అప్పుడు, తదేకదేశస్య=తత్-ఆజగంబునందు, ఏకదేశస్య- ఏకదేశగతమగు, జీవాభాసస్య= చిదాభాసునియొక్క, కథా-కథ, కా - ఏమి. అనగా చిదాభాసుడు కల్పించబడెనని చెప్పవలసినపనిలేదనుట.

తా. ప్ర. అయితే, జీవునకు ఆరోపితత్వము సిద్ధించకపోవుచుండగా, జీవభ్రాంతికి అధిష్ఠానచైతన్యము కూటస్థుడని చెప్పుట యుక్తమెట్లగును?. ఉ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒక్కటియగు చైతన్యమందే సర్వజగంబును కల్పించబడినప్పుడు. ఆజగంబునందు ఒకప్రదేశమందుండెడి చిదాభాసుడు, కల్పితుడగుననెడి విషయమును చెప్పవలసినపనిలేదు. ఆజగంబుయొక్క ఏకదేశమందు చిదాభాసుడు వర్తించుచున్నాడనెడివిషయము, శ్రు॥ అనేనజీవేనాత్మనానుప్రవిశ్య॥ ఇత్యాదిశ్రుతిసిద్ధమైయున్నది.

శ్లో॥ జగత్తదేకదేశాఖ్యసమారోప్యస్యభేదతః।
తత్త్వంపదార్థౌభిన్నౌస్తోవస్తుతస్త్వేకతాచితేః॥ ౫౧.

టీ. జగత్తదేకదేశాఖ్యసమారోప్యస్య=జగత్-జగంబనునట్టియు, తత్-ఆజగంబుయొక్క, ఏకదేశ- ఏకదేశమనునట్టి, ఆఖ్య - పేర్లుగల, సమారోప్యస్య-సమారోప్యముయొక్క, భేదతః-భేదమువలన, తత్త్వంపదార్థౌ - తత్త్వంపదార్థములగు బ్రహ్మకూటస్థులు, భిన్నౌ-భిన్నములు, స్తః-అగుచున్నవి. వస్తుతస్తు-వాస్తవమువలననో, చితేః-చిత్తునకు, అనగాచైతన్యమునకనుట. ఏకతా-ఏకత్వమగును. అనగా చైతన్యమొక్కటియే యగుననుట.

తా. ప్ర. అయితే,జగంబునకు అధిష్ఠానచైతన్య మొక్కటియగుటవలన, తత్త్వంపదార్థములగు బ్రహ్మకూటస్థులకు భేదములేకపోవుచుండగా, తత్త్వంపదార్థములకు పునరుక్తిదోషముగలుగదాయేమి?. ఉ. ౧. జగంబనునట్టియు, ౨. ఆజగంబుయొక్క ఏకదేశమనునట్టి, ఉపాధిభేదమువలన, తత్త్వంపదార్థములకు భేదముగలిగియున్నట్లు తోచుచున్నదేగాని, వాస్తవముచేత చైతన్యమొక్కటియే యగును. అనగాబ్రహ్మకూటస్థశబ్దములచేత వ్యవహరింపబడెడిచైతన్యమొక్కటియేయగునని యభిప్రాయము.

శ్లో॥ కర్తృత్వాదీన్బుద్ధిధర్మాన్స్ఫూర్త్యాఖ్యాంచాత్మరూపతాం।
దధద్విభాతిపురతఆభాసోఽతోభ్రమోభవేత్॥ ౫౨.

టీ. ఆభాసః-చిదాభాసుడు. బుద్ధిధర్మాన్=బుద్ధి - అంతఃకరణముయొక్క, ధర్మాన్-ధర్మములగు, కర్తృత్వాదీన్ - కర్తృత్వభోక్తృత్వ ప్రమాతృత్వాదులను, స్ఫూర్త్యాఖ్యాం-స్ఫురణలక్షణముగల, ఆత్మరూపతాంచ-ఆత్మరూపత్వంబును, దధత్సన్-ధరించినవాడగుచు, పురతః- ఎదుట, అనగా స్పష్టముగాననుట. విభాతి-తోచుచున్నాడు. అతః-ఆకారణమువలన, ఆభాసః - చిదాభాసుడు, భ్రమః-భ్రాంతి, అనగా కల్పితుడనుట. భవేత్-అగును.

తా. ప్ర. అయితేశుక్తిరజతాదికమువలె, అధిష్ఠానారోప్య ఉభయధర్మవత్త్వము గనబడమివలన, చిదాభాసునకు కల్పితత్వమెట్లుసిద్ధించును?. ఉ. ఉపాధియగు బుద్ధిద్వారా, కల్పించబడుచుండెడి, కర్తృత్వభోక్తృత్వ ప్రమా


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తృత్వాదులను, మరియు, స్ఫురణలక్షణమగు ఆత్మరూపత్వంబును ధరించినవా డగుచు, ఈచిదాభాసుడు స్పష్టముగా నెదుట దోచుచున్నాడు. ఆకారణము వలన, ఈచిదాభాసుడు, (భ్రిమము) కల్పితుడగునని తెలియవలెను.

శ్లో॥ కాబుద్ధిఃకోయమాభాసఃకోవాత్మాత్రజగత్కథం।
ఇత్యనిర్ణయతోమోహోహేయస్సంసారఇష్యతే॥ ౫౩.

టీ. బుద్ధిః-బుద్ధి, కా-ఎద్ది. అయం-ఈ, ఆభాసః - చిదాభాసుడు, కః-ఎవడు. ఆత్మా-ప్రత్యగాత్మ, కోవా-ఎవడో. అత్ర-ఈయాత్మయందు జగత్-ప్రపంచము, కథం - ఏప్రకారముగా నుండెను. ఇతి- ఈప్రకారముగా, అనిర్ణయతః-బుద్ధ్యాదిస్వరూపనిశ్చయములేమివలన, మోహః-మోహము, హేయః-విడువదగిన, సంసారః-సంసారముగా, ఇష్యతే-పొందబడుచున్నది.

తా. ప్ర. అయితే, ఈభ్రిమంబునకుకారణమేమి?. ఉ. బుద్ధియనగా నెద్దియనియు, ఈచిదాభాసుడనగానెవ్వడనియు, కూటస్థాత్మయనగా నెవ్వడనియు, ఈయాత్మయందు జగంబేప్రకారముగా నుండెననెడి, ఇవ్విధవిచారపూర్వకముగా, బుద్ధ్యాదిస్వరూపనిశ్చయము లేకపోవుటచేత గలిగెడి మోహమే, విడువదగిన సంసారముగాబ్రవర్తించుచున్నదని తెలియవలెను.

శ్లో॥ బుద్ధ్యాదీనాంస్వరూపంయోవివినక్తిసతత్వవిత్।
సఏవముక్తఇత్యేవంవేదాంతేషువినిశ్చయః॥ ౫౪.

టీ. యః-ఏపురుషుడు, బుద్ధ్యాదీనాం- బుద్ధ్యాదులయొక్క, స్వరూపం-స్వరూపమును, వివినక్తి-విభజించియెరుగుచున్నాడో, సః-ఆపురుషుడు, తత్వవిత్-తత్వవేత్తయగును. సఏవ-వాడే, ముక్తఇతి-అవిద్యావిముక్తుడనియు, ఏవం-ఈప్రకారము, వేదాంతేషు-వేదాంతములయందు, వినిశ్చయః-నిశ్చయమగును.

తా. ప్ర. అయితే,ఈభ్రాంతిని, నివర్తింపజేయునదెద్దియో జెప్పుము?. ఉ. బుద్ధ్యాదులయొక్కస్వరూపములను విభజించి యెరిగెడివివేకమే, ఈభ్రాంతిని నివర్తింపజేయును. ఆబుద్ధ్యాదులయొక్క స్వరూపములను విభజనలక్షణముచే నెరిగెడి వివేకముగలవాడే జ్ఞానియనియు, అట్టి వివేకముచేతనే సంసారబంధమునుంచి విడువబడునని, వేదాంతములయందు నిశ్చయింపబడెనని తెలియవలెను.

శ్లో॥ ఏవంచసతిబంధస్స్యాత్కస్యేత్యాదికుతర్కజాః।
విడంబనాదృఢంఖండ్యాఃఖండనోక్తిప్రకారతః॥ ౫౫.

టీ. ఏవంచసతి-ఈప్రకారమగుచుండగా, కస్య-ఎవనికి, బంధః-బంధము, స్యాత్-అగునోయనెడి, ఇత్యాదికుతర్కజాః= ఇత్యాది - ఇదిమొదలగు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుతర్క-కుతర్కములవలన, జాః-పుట్టిన, విడంబనాః - పరిహాసవిశేషములు, ఖండనోక్తిప్రకారతః=ఖండన - ఖండనమనెడిగ్రంథముయొక్క, ఉక్తిప్రకారతః-వాక్యములప్రకారము, అనగాహర్షమిశ్రులచే జేయబడిన ఖండనగ్రంథస్థితవాక్యములచేననుట. దృఢం-దృఢముగా,ఖండ్యాః - ఖండింపదగినవగును.

తా. ఈప్రకారము బంధమోక్షములు రెండును అవివేకమూలముగా గలవైనయెడల, అద్వైత వాదమందు, బంధంబెవనికనియు, మోక్షంబెవనికనియు నిట్లు తార్కికులచే జేయబడెడి కుతర్కములను మూలముగాగల పరిహాస విశేషములను, హర్షమిశ్రులచేత జేయబడిన ఖండనమనెడి గ్రంథమందుజెప్పబడిన యుక్తులచేత ఖండించవలెను.

అవ. ఇట్లు,శ్రుతియుక్తులచేత కూటస్థుని బుద్ధ్యాదులవలనవిభజించిచూపి, పురాణములయందును, ఆకూటస్థవివేకము జేయబడెనని, ఇప్పుడాపురాణగత శ్లోకత్రయమును పఠించుచున్నాడు.

శ్లో॥ వృత్తేస్సాక్షితయావృత్తిప్రాగభావస్యచస్థితః।
బుభుత్సాయాస్తథాజ్ఞోస్మీత్యాభాతాఽజ్ఞానవస్తునః॥ ౫౬.

టీ. వృత్తేః-కామాదివృత్తికిని, వృత్తిప్రాగభావస్యచ=వృత్తి- ఆకామాదివృత్తియొక్క, ప్రాగభావస్యచ-ప్రాగభావమునకును, అనగా నాకామాదివృత్త్యుదయమునకంటె బూర్వమావృత్తియొక్క లేమికిననుట. బుభుత్సాయాః-జిజ్ఞాసకును, సాక్షితయా-సాక్షిభావముచేత, స్థితః-చిద్రూపుడగు శివుడుస్థితినిబొందుచున్నాడు. (తతఃపూర్వం) అంతకంటె బూర్వము, అజ్ఞః - వివేకము లేనివాడను, అస్మీతి-ఇతినని యనుభవింపబడుచుండెడి, అజ్ఞానవస్తునః- అజ్ఞానమునకు, సాక్షితయా సాక్షిత్వముచేత, ఆభాతా - ప్రకాశకుడగుచున్నాడు.

తా. కామాదివృత్తి, ఉదయించుచుండగా నావృత్తికి సాక్షిత్వముచేతను, మరియు, ఆకామాదివృత్తి ఉదయించుటకంటె బూర్వము, ఆవృత్తియొక్క ప్రాగభావమునకు సాక్షిత్వముచేతను, మరియు, జిజ్ఞాసగలుగుచుండగా, ఆజిజ్ఞాసకు సాక్షిత్వముచేతను, అంతకు బూర్వమెరుగనివాడనైతినని యనుభవింపబడుచుండెడి అజ్ఞానమునకు సాక్షిత్వముచేతను, ఈప్రకారముగా జ్ఞానవస్తువగు శివునకంతటను, స్థితిగలిగియున్నది.

శ్లో॥ అసత్యాలంబనత్వేనసత్యస్సర్వజడస్యతు।
సాధకత్వేనచిద్రూపస్సదాప్రేమాస్పదత్వతః॥ ౫౭.

టీ. (సచ) అజ్ఞానవస్తువగు శివుడు, అసత్యాలంబనత్వేన=అసత్య-అసత్యమగు జగంబునకు, ఆలంబనత్వేన-అధిష్ఠానత్వముచేత, సత్యః- సత్యస్వరూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుడగును. సర్వజడస్యతు=సర్వ-సకలమగు, జడస్యతు - జడపదార్థరాశికి, సాధకత్వేన-సాధకత్వముచేత, అనగా సర్వజడపదార్థరాశిని ప్రకాశింపజేయుట వలననుట. చిద్రూపః-జ్ఞానస్వరూపుడగును. సదా- సర్వకాలములయందును, ప్రేమాస్పదత్వతః=ప్రేమ-స్నేహమునకు, ఆస్పదత్వాత్ - విషయుడగుటవలన, (ఆనందరూపః) ఆనందరూపుడగును. ఈపదము పరశ్లోకమందు గలదు.

తా. మరియు, ఆప్రత్యగాత్మయనెడి శివుడు, అసత్యమగు సర్వజగంబునకు నధిష్ఠానత్వముగానుండుటచేత సత్యస్వరూపుడగును. మరియు, సర్వజడపదార్థరాశిని ప్రకాశింపజేయుటవలన సాధకుడగుటచేత, చిద్రూపుడగును. మరియు, సర్వదా ప్రేమవిషయుడగుటవలన, ఆనందరూపుడగును.

శ్లో॥ ఆనందరూపస్సర్వార్థసాధకత్వేనహేతునా।
సర్వసంబంధవత్త్వేనసంపూర్ణశ్శివసంజ్ఞితః॥ ౨౮.

టీ. ఆనందరూపః-ఆనందరూపుడగునని పూర్వశ్లోకముతో నన్వయము. సర్వార్థసాధకత్వేన=సర్వార్థ-సకలజడపదార్థరాశికి, సాధకత్వేన - సాధకత్వమనెడి, హేతునా-హేతువుచేతను, సర్వసంబంధవత్త్వేన=సర్వ- సర్వముతోటి, సంబంధవత్త్వేన-సంబంధముగలిగియుండుచేతను, శివసంజ్ఞితః- శివసంజ్ఞగలప్రత్యగాత్మ, సంపూర్ణః - పరిపూర్ణుడగును.

తా. మరియు, ఆప్రత్యగాత్మయనెడి శివుడు, సర్వజడపదార్థ వర్గమును ప్రకాశింపజేసెడివాడగుటచేత ( అనగా సర్వపదార్థ సాధకుడగుటచేత) సర్వజగంబుతో సంబంధము గలవాడగుటవలన, సంపూర్ణుడని చెప్పబడును. ఇక్కడ అనుమాన ప్రమాణముచే నెరుగవలెను. అది యెట్లనగా, వివతుడగు శివుడు, వృత్త్యాదులకు సాక్షియగుటవలన వృత్త్యాదులవలన భేదము బొందుచున్నాడనియు, ఎద్ది, వృత్త్యాదులవల్ల భేదింపబడదో, అద్ది,వృత్త్యాదికమువలెనే, వృత్త్యాదులకు సాక్షిగాదనియు, మరియు, వివతుడగుశివుడు, మిథ్యయగుజగంబునకు అధిష్ఠానమగుటవలన, అసత్యరజతమునకు అధిష్ఠానమగు శుక్తివలె,సత్యమగుటకు తగుచున్నాడనియు, మరియు, వివతుడగుశివుడు, జడపదార్థరాశిని మాత్రము ప్రకాశింపజేసెడివాడగుటవలన చిద్రూపుడగుననియు, ఎద్ది, చిద్రూపముగాదో, అద్ది, ఘటాదికమువలెనే, సర్వజడపదార్థరాశిని ప్రకాశింపజేయునదిగాదనియు, మరియు, వివతుడగుశివుడు పరప్రేమాస్పదు డగుటవలన పరమానందరూపుడగుననియు, ఎద్ది, పరమానందరూపము గలదిగాదో, అద్ది, ఘటాదికమువలెనే, పరప్రేమాస్పదంబునుగాదనియు, మరియు, వివతుడగుశివుడు, సర్వజడపదార్థరాశిని ప్రకాశింపజేసెడి వాడగుటచేత, సర్వజగంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోటి సంబంధముగలవాడగుటవలన, ఆకాశమువలె పరిపూర్ణుడగుననియు, మరియు, విమతుడగుశివుడు, సర్వమును ప్రకాశింపజేసెడివాడగుటవలన సర్వ సంబంధము గలవాడగుననియు, ఎవడు సర్వసంబంధము గలవాడుగాడో, వాడుదీపాదికమువలెనే, సర్వమును ప్రకాశింపజేసెడివాడునుంగాడని, ఇట్లు అనుమానప్రమాణము నిక్కడ గ్రహించవలెనని యభిప్రాయము.

అవ. ఈయుదాహరింపబడిన పురాణవాక్యతాత్పర్యము నిప్పుడు చెప్పు చున్నాడు.

శ్లో॥ ఇతిశైవపురాణేషుకూటస్థః ప్రవివేచితః।
జీవేశత్వాదిరహితః కేవలస్స్వప్రభశ్శివః॥ ౫౯.

టీ. ఇతి-ఈప్రకారము, శైవపురాణేషు - సూతసంహిత మొదలగు శైవపురాణములయందు, జీవేశత్వాదిరహితః - జీవేశ్వరత్వాదికల్పనారహితు డైనట్టియు, కేవలః-అద్వితీయుడైనట్టియు, స్వప్రభః- స్వప్రకాశ చైతన్యరూ పుడైనట్టియు, శివః-సర్వదా శోభాయమానుడైనట్టి, కూటస్థః - ప్రత్యగాత్మ, ప్రవివేచితః - విభజనలక్షణముచే దెలుపబడెను.

తా. ఈప్రకారముగా సూతసంహిత మొదలగు శైవపురాణములయం దు జీవేశ్వరత్వాది కల్పనారహితుడైనట్టియు. అద్వితీయుడైనట్టియు, స్వప్రకా శచైతన్యరూపుడైనట్టియు, సర్వదా శోభాయమానుడైనట్టి కూటస్థాత్మ, విభ జించి దెలుపబడెనని తెలియవలెను.

శ్లో॥ మాయాభాసేనజీవేశౌకరోతీతిశ్రుతత్వతః।
మాయికావేవజీవేశౌస్వచ్ఛౌతౌకాచకుంభవత్॥ ౬౦.

టీ. మాయా-మాయాశక్తి, ఆభాసేన-చిదాభాసునిచేత, అనగా చిత్ప్ర తిబింబరూపముచేననుట. జీవేశౌ-జీవేశ్వరులను, కరోతీతి - చేయుచున్నదని, అనగా జీవేశ్వరులను నిర్మించుచున్నదని యనుట. శ్రుతత్వతః - శ్రుతిచేవినబ డుటవలన; కాచకుంభవత్= కాచ-గాజుమట్టిచే జేయబడిన, కుంభవత్-కుం డవలె, స్వచ్ఛౌ-స్వచ్ఛత్వముగల, తౌ-ఆ, జీవేశౌ - జీవేశ్వరులు, మాయికా వేవ - మాయికులేయగుదురు.

తా. ప్ర. అయితే, పరతత్వము జీవేశ్వరత్వాది రహితమైనదని జెప్పు టకు గారణమేమి?. ఉ. మాయాశక్తి, చిదాభాసునిచేత జీవేశ్వరులను నిర్మిం చెననియు, మాయయు, నవిద్యయు బ్రహ్మమే యగుచున్నదనియుం జెప్పెడి, శ్రు॥ జీవేశావాభాసేన కరోతిమాయాచా విద్యాచస్వయమేవ భవతి॥ అనెడి శ్రుతి, మాయకును అవిద్యకును అధీనులగు చిదాభాసులకు మాయికత్వమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దెలుపుచున్నది. గనుక, ఈశ్వరజీవులిద్దరును మాయికులగుటచేత, జీవేశ్వరత్వాదికములేనిదే పరతత్వమని తెలియవలెను. ప్ర. అయితే, ఆజీవేశ్వరులిద్దరును మాయికులైనయెడల, ఆ జీవేశ్వరులకు దేహాదులకంటె విలక్షణత్వములేదుగదా?. ఉ. గాజుమట్టిచే జేయబడిన కుండవలె, స్వచ్ఛత్వముగల ఆజీవేశ్వరులిద్దరును మాయికులేయగుదురు. అనగా గాజుచే జేయబడిన కుండకు భూసామాన్య వికారమందు భేదములేకపోయినను స్వచ్ఛత్వమందు మృణ్మయములైన ఘటాదులకంటె భేదమున్నట్లు, ఈ యీశ్వర జీవులకును మాయికత్వసామాన్యమందు భేదములేకపోయినను, స్వచ్ఛత్వమందు దేహాదులకంటె విలక్షణత్వము గలిగియున్నదని యభిప్రాయము.

శ్లో॥ అన్నజన్యంమనోదేహాత్స్వచ్ఛంయద్వత్తథైవతౌ।
మాయికావపిసర్వస్మాదన్యస్మాత్స్వచ్ఛతాంగతౌ॥ ౬౧.

టీ. అన్నజన్యం=అన్న-అన్నముచేత, జన్యం-కలిగిన, మనః - మనస్సు, దేహాత్-దేహముకంటె, యద్వత్ - ఏప్రకారము, స్వచ్ఛం - స్వచ్ఛత్వమును బొందినదగునో, తథైవ-ఆప్రకారమే, తౌ-ఆజీవేశ్వరులు, మాయికావపి-మాయికులైనను, అన్యస్మాత్-ఇతరమగు, సర్వస్మాత్ - సర్వజగంబుకంటె, స్వచ్ఛతాం-స్వచ్ఛత్వమును, గతౌ-పొందినవారగుదురు.

తా. ప్ర. అయితే, ౧. ఘటమును, ౨. కాచకుంభమును, గలిగించెడి మృత్తికా విశేషములయందు భేదముండుటవలన, ఆఘటకాచకుంభములకు రెంటికిని భేదముండుట ఉచితమేయగుగాని, జగజ్జీవేశ్వరభేదహేతువగు మాయకు ఏకత్వమగుచుండగా, ఆజీవేశ్వరులకు జగంబుకంటె విలక్షణత్వము గలదని చెప్పుట, ఉచితమెట్లగును?. ఉ. ౧. దేహము, ౨. మనస్సు, ఈరెండు నన్నమువలనబుట్టినవైనను, అందు మనస్సు, ఏప్రకారముగా దేహముకంటె స్వచ్ఛత్వము గలదగునో, ఆప్రకారమే ఆజీవేశ్వరులు మాయికులైనను, ఇతర సర్వజగంబుకంటె స్వచ్ఛత్వమును బొందినవారగుదురు. అనగా దేహమనంబులు రెండును నన్నమువలనబుట్టినవైనను స్వచ్ఛత్వముచేత నారెంటికిని భేదము గలిగియున్నట్లు, మాయవలన గలిగిన జీవేశ్వరజగంబులలో, జీవేశ్వరు లిద్దరును, స్వచ్ఛత్వముచేత జగంబుకంటె భేదముగలవారగుదురని యభిప్రాయము. గాజుమట్టిచే చేయబడిన కుండ, కాచకుంభమనబడును.

శ్లో॥ చిద్రూపత్వంచసంభావ్యంచిత్తేస్వనైవప్రకాశనాత్।
సర్వకల్పనశక్తాయామాయాయాదుష్కరంనహి॥ ౬౨.

టీ. చిత్తేస్వనైవ-చిత్స్వరూపత్వముచేతనే, ప్రకాశనాత్- ప్రకాశించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుండుటవలన, చిద్రూపత్వంచ-చిద్రూపత్వంబును, సంభావ్యం-భావింపదగిన దగును. సర్వకల్పనశక్తాయాః=సర్వ- సర్వమును, కల్పన - కల్పించుటకు, శక్తాయాః-శక్తినంతమగు, మాయాయాః-మాయకు, దుష్కరం - దుష్కరమైనది, అనగా జేయుటకు శక్యముగానిదనుట. నహి-లేదుగదా.

తా. ప్ర. సరి. జీవేశ్వరులకు కాచకుంభాదులవలె స్వచ్ఛత్వముగుగాక. ఆజీవేశ్వరులకు చిద్రూపత్వమెక్కడిది?. ఉ. ఆజీవేశ్వరులిద్దరును చిద్రూపత్వముచేత ప్రకాశించుచుండుటవలన, ఆజీవేశ్వరులకు చిద్రూపత్వంబును భావింపదగినదేయగును. అనగా ననుభవమువలన, జీవేశ్వరులు చిద్రూపులని తెలియవలెను. ప్ర. అయితే, మాయికులగు జీవేశ్వరులు చిద్రూపత్వముచేత ప్రకాశించుచుండుట, యుక్తమెట్లగును?. ఉ. సర్వమును కల్పించుటకు శక్తివంతమగుమాయకు, సాధ్యముగానిదెద్దియులేదు. అనగా, నామాయకు దుర్ఘటకారిత్వముండుటచేత, నామాయ, చేతనులగు జీవేశ్వరులనుకల్పించుట, యుక్తమేయగునని తెలియవలెను.

అవ. ఈచెప్పబడినయర్థము నిప్పుడు, కైముతికన్యాయముచేత దృఢీకరించుచున్నాడు.

శ్లో॥ అస్మన్నిద్రాపిజీవేశౌచేతనౌస్వప్నగౌసృజేత్।
మహామాయాసృజత్యేతావిత్యాశ్చర్యంకిమత్రతే॥ ౬౩.

టీ. అస్మన్నిద్రాపి=అస్మత్-మనయొక్క, నిద్రాపి - నిద్రయే, స్వప్నగౌ=స్వప్న-స్వప్నమును, గౌ-పొందినట్టియు, చేతనౌ - చేతనులైన, జీవేశౌ-జీవేశ్వరులను, సృజేత్-సృష్టించును. అనగా సృష్టించుచున్నదనుట. మహామాయా-సర్వమునుకల్పించెడిమాయాశక్తి, ఏతౌ - ఈజీవేశ్వరులను, సృజతీతి-సృష్టించుచున్నదనెడి, అత్ర- ఈవిషయమందు, తే-నీకు, ఆశ్చర్యం- ఆశ్చర్యము, కిం-ఏమి. అనగా నిదియొకయాశ్చర్యవిషయముగాదనుట.

తా. మననిద్రయే, స్వప్నగతులైనట్టియు, చేతనులైన జీవేశ్వరులనుసృష్టించుచుండగా సర్వమును కల్పించెడి మహామాయాశక్తి, ఈ జీవేశ్వరులను సృష్టించెననుటయందు, నీకాశ్చర్యమేమి. ఇచ్చట నిద్రయనగా, సుషుప్తిసంబంధమగుమాయయని తెలియవలెను.

శ్లో॥ సర్వజ్ఞత్వాదికంచేశేకల్పయిత్వాప్రదర్శయేత్।
ధర్మిణంకల్పయంత్యాస్యాకోవాభారోధర్మకల్పనే॥ ౬౪.

టీ. (మాయా) మాయాశక్తి, ఈశే- ఈశ్వరునియందు, సర్వజ్ఞత్వాదికంచ-సర్వజ్ఞత్వాది ధర్మరాశినియు, కల్పయిత్వా- కల్పించి, ప్రదర్శయేత్-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చూపెను. అనగా జూపుచున్నదనుట. ధర్మిణం-ధర్మిని, కల్పయంత్యాః- కల్పనను చేసినదానికి, ధర్మకల్పనే=ధర్మ-ధర్మమును, కల్పనే-కల్పించుటయందు, భారః-భారము, కః-ఏమి, స్యాత్ - అగును. అనగా కొంచెమైనను భారము లేదనుట.

తా. ప్ర. అయితే, ఈశ్వరుడును మాయికుడైనయెడల, ఆయీశ్వరునకును, జీవునకువలె, కించిద్ జ్ఞత్వమే గలిగియుండవలయుగాని, సర్వజ్ఞత్వాదికముండరాదుగదా?. ఉ. ఆమహామాయాశక్తియే, ఈశ్వరునియందు, సర్వజ్ఞత్వాదికమును కల్పించి చూపుచున్నది. అనగా నామహామాయయే, సర్వజ్ఞత్వాదికంబునుంగూడ, కల్పించెనని తెలియవలెను. ఇందుకుఉపపత్తినిజెప్పెద వినుము. ధర్మియగు ఈశ్వరునికల్పించిన మాయాశక్తికి, ధర్మమగు సర్వజ్ఞత్వాదికమును కల్పించుటయందు కొంచెమైనను భారములేదని తెలియవలెను.

శ్లో॥ కూటస్థేప్యతిశంకాస్యాదితిచేన్మాతిశంక్యతాం।
కూటస్థమాయికత్వేతుప్రమాణంనహివిద్యతే॥ ౬౫.

టీ. కూటస్థేపి-కూటస్థాత్మయందును, అతిశంకా-అతిశంక, అనగా మాయికత్వవ్యాప్తియనుట. స్యాదితిచేత్-కలుగుననియంటివేని, మాతిశంక్యతాం-అతిశంకను జేయకుందువుగాక. అనగా కూటస్థునకు మాయికత్వము గలదని శంకింపరాదనుట. కూటస్థమాయికత్వేతు = కూటస్థ- కూటస్థునకు, మాయికత్వేతు-మాయికత్వమందో, ప్రమాణం-ప్రమాణము, నహివిద్యతే-లేనేలేదు.

తా. ప్ర. అయితే, జీవేశ్వరులకువలె, కూటస్థునకును మాయికత్వము వ్యాపింపదాయేమి? ఉ. కూటస్థునకు మాయికత్వము గలుగదు. ప్ర. అదియేమి?. ఉ. కూటస్థుడు మాయికుడనుటయందు ప్రమాణములేదు. కనుక, కూటస్థుడు మాయికుడని చెప్పరాదు. మాయచేత గల్పించబడినవాడు, మాయికుడని తెలియవలెను.

శ్లో॥ వస్తుత్వంఘోషయంత్యస్యవేదాంతాస్సకలాఅపి।
సపక్షరూపంవస్త్వన్యన్నసహంతేత్రకించన॥ ౬౬.

టీ. సకలాః - సకలమలైన, వేదాంతాఅపి - ఉపనిషత్తులును, అస్య-ఈ కూటస్థునకు, వస్తుత్వం-వస్తుస్వభావమును, ఘోషయంతి - ఘోషించుచున్నవి. అనగా జెప్పుచున్నవనుట. అత్ర-ఈకూటస్థునియొక్క పారమార్థికత్వమందు, సపక్షరూపం - ప్రతిపక్షభూతమగు, అనగా విరోధిరూపమగునట్టియనుట. అన్యత్-ఇతరమైన, వస్తు-వస్తువును, కించన- కొంచెమైనను, నసహంతే- సహింపవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే, కూటస్థునకు వాస్తవత్వమందును ప్రమాణముబొంద బడుచుండలేదుగదా?. ఉ. సకలవేదాంతములును, ఈకూటస్థునకువస్తుత్వమును ఘోషించుచున్నవి. మరియు, ఈకూటస్థునకు పారమార్థికత్వమందు, విరోధి భూతమగు అన్యవస్తువును కొంచెమైనను వేదాంతములు సహింపవు. అనగా సకలవేదాంతములును కూటస్థునకు అద్వితీయత్వమును జెప్పుచున్నవేగాని, సద్వితీయత్వమును జెప్పుటకు సహింపవని యభిప్రాయము.

శ్లో॥ శ్రుత్యర్థంవిశదీకుర్మోనతర్కాద్వచ్మికించన।
తేనతార్కికశంకానామత్రకోఽవసరోవద॥ ౬౭.

టీ. శ్రుత్యర్థం=శ్రుతి - ఉపనిషద్వాక్యములయొక్క, అర్థం-అర్థమును, విశదీకుర్మః- విశదీకరించుచున్నాము. తర్కాత్-తర్కమువలన, కించన-కొంచెమైనను, నవచ్మి-చెప్పను. అనగా జెప్పినవారముగామనుట. తేన - ఆకారణముచేత, తార్కికశంకానాం=తార్కిక- తార్కికులచే జేయబడెడి, శంకానాం-ఆక్షేపములకు, అత్ర ఇక్కడ, అవసరః-ఉచితసమయము, కః-ఎద్దియో, వద-చెప్పుము. అనగా లేదనుట.

తా. ప్ర. అయితే, కూటస్థునకు వాస్తవత్వసాధనమందును, జీవేశ్వరులకు అవాస్తవత్వమందును, శ్రుతులేపఠింపబడినవిగాని, తర్కములచేత కొంచెమైనను సాధింపబడలేదుగదా?. ఉ. మేము శ్రుత్యర్థమును విశదీకరించుటకు, ఈగ్రంథమును జేయబూనితిమి. కనుక, తర్కమువలనకొంచెమైనను జెప్పము. అందుచేత తార్కికులచేజేయబడెడి యాక్షేపములకు ఇక్కడ అవకాశము లేదు. అనగా, మేము శ్రుత్యర్థమును విశదీకరించుటకు ప్రవర్తించుటవలన, తర్కోపన్యాసమును జేయమని యభిప్రాయము.

శ్లో॥ తస్మాత్కుతర్కంసంత్యజ్యముముక్షుశ్శ్రుతిమాశ్రయేత్।
శ్రుతౌతుమాయాజీవేశౌకరోతీతిప్రదర్శితం॥ ౬౮.

టీ. తస్మాత్-అందువలన, ముముక్షుః-మోక్షేచ్ఛగలవాడు, కుతర్కం-కుత్సితతర్కమును, సంత్యజ్య-విడిపించి, శ్రుతిం-శ్రుతిని, ఆశ్రయేత్ - ఆశ్రయించును. శ్రుతౌతు-శ్రుతియందో, మాయా-మాయాశక్తి, జీవేశౌ- జీవేశ్వరులను, కరోతీతి-కల్పనము జేయుచున్నదని, ప్రదర్శితం-చూపబడును.

తా. ప్ర. అయితే, మీరిట్లు శ్రుత్యర్థమును విశదీకరించుటవలన నేమి గలుగునో జెప్పుము?. ఉ. అందువలన ముముక్షువగువాడు, కుతర్కమునువిడిపించి, శ్రుతినాశ్రయించును. ప్ర. అయితే, ముముక్షువులకు అనుసంధానము జేయదగిన శ్రుత్యర్థమెట్టిది?. ఉ. మాయాశక్తి జీవేశ్వరులనిద్దరిని కల్పించెనని,


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రుతియందు జూపబడును.

శ్లో॥ ఈక్షణాదిప్రవేశాంతాసృష్టిరీశకృతాభవేత్।
జాగ్రదాదివిమోక్షాంతస్సంసారోజీవకర్తృకః॥ ౭౯.

టీ. ఈక్షణాదిప్రవేశాంతా=ఈక్షణ-వీక్షణమే, అనగా సంకల్పమే యనుట. ఆది-ఆదిగాగలిగినట్టియు, ప్రవేశ-ప్రవేశమే, అంతా-అంతముగా గలిగినట్టి, సృష్టిః - సృష్టి, ఈశకృతా=ఈశ-ఈశ్వరునిచేత, కృతా- చేయబడినది, భవేత్-అగును. జాగ్రదాదివిమోక్షాంతః=జాగ్రత్- జాగరణావస్థయే, ఆది-ఆదిగాగలిగినట్టియు, విమోక్ష-విదేహముక్తియే, అంతః - అంత్యముగాగల, సంసారః-సంసారము, జీవకర్తృకః=జీవ-జీవుసే, కర్తృకః - కర్తనుగాగలదియగును. అనగా జీవనిర్మితంబగుననుట.

తా. మరియు, వీక్షణము ( సంకల్పము ) ఆదిగాగలిగినట్టియు, దేహమందు బ్రవేశమంతముగాగలిగినట్టిసృష్టి, ఈశ్వరునిచే జేయబడెననియు, జాగ్రత్స్వప్నసుషుప్తిబంధమోక్షలక్షణముగల సంసారమంతయు జీవునిచే నిర్మింపబడెనని, శ్రుతియందు దెలుపబడును. ఈయర్థము, తృప్తిదీపముయొక్క నాల్గవశ్లోకతాత్పర్యమందు సమగ్రముగా వ్రాయబడియున్నది. కనుక, ఆయర్థము నిక్కడ గ్రహించవలెను.

శ్లో॥ అసంగఏవకూటస్థ స్సర్వదానాస్యకశ్చన।
భవత్యసంశయస్తేన మనస్యేవంవిచార్యతాం॥ ౮౦.

టీ. కూటస్థః-కూటస్థాత్మ, సర్వదా-ఎల్లప్పుడును, అసంగఏవ - అసంగుడేయగును. అస్య-ఈకూటస్థునకు, కశ్చన-ఎద్దియు, అసంశయః-నిస్సంశయముగా, నభవతి-లేదు. తేన-అందుచేత, ఏవం-ఈప్రకారముగా, మనసి- మనస్సునందు, విచార్యతాం - విచారింపబడుగాక.

తా. మరియు, సర్వదా, కూటస్థుడసంగుడేయగుననియు, ఈకూటస్థునకు వికారమెద్దియు నిస్సంశయముగాలేదనియు, శ్రుతియందు బ్రతిపాదింపబడెను. అందుచేత ముముక్షువగువాడు ఈప్రకారము మనస్సునందు సర్వదా విచారించుచుండవలెను. అనగా కూటస్థునకు అసంగత్వాదికంబును, జననమరణాదిలక్షణముగల వ్యవహారవర్గమునకు మిథ్యాత్వంబును, శ్రుతియందు బ్రతిపాదింపబడెననియు, అందువలన ముముక్షువగువాడు, ఈయర్థమును సర్వదా విచారించవలెనని యభిప్రాయము.

అవ. అయితే, కూటస్థునకు జన్మాద్యతిశయములేదని దేనివలన దెలియబడుచున్నదనెడి యాక్షేపముచేస్కొని, శ్రుతివాక్యమువల్లననితలచి, ఆశ్రుతివా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్యము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ ననిరోధోనచోత్పత్తిర్నబద్ధోనచసాధకః।
నముముక్షుర్నవైముక్తఇత్యేషాపరమార్థతా॥ ౭౧.

టీ. నిరోధః-నాశము, న-లేదు. ఉత్పత్తిశ్చ-దేహాదిసంబంధంబును, న-లేదు. బద్ధః-సుఖదుఃఖాదిధర్మవంతుడు, న-లేదు. సాధకశ్చ- వేదాంతశ్రవణాద్యనుష్ఠానము జేయువాడును, న-లేదు. ముముక్షుః- సాధనచతుష్టయసంపన్నుడు, న-లేదు. ముక్తః-నివర్తింపబడిన అవిద్యగలవాడును, న - లేదు. ఏషా-ఇది, పరమార్థతేతి - పరమార్థమని శ్రుతి జెప్పుచున్నది. అనగా నిదియంతయు వాస్తవమందు లేదనుట.

తా. ౧. నాశంబును. ౨. దేహాదికముతోటి సంబంధంబును, 3. సుఖదుఃఖాది ధర్మవంతుడును, ౪. వేదాంతశ్రవణాద్యనుష్ఠాతయు, ౫. సాధనచతుష్టయసంపన్నుడును, ౬. నివర్తింపబడిన అవిద్యగలవాడును, (అనగాముక్తుడు) ఇదియంతయు వాస్తవమందు లేదని, ఈశ్రుతి జెప్పుచున్నది.

శ్లో॥ అవాఙ్మనసగమ్యంతంశ్రుతిర్బోధయితుంసదా।
జీవమీశంజగద్వాపిసమాశ్రిత్యప్రబోధయేత్॥ ౭౨.

టీ. శ్రుతిః-శ్రుతి, అవాఙ్మనసగమ్యం-వాఙ్మనస్సులచేత పొందదగని; అనగా నవాఙ్మనసగోచరుడైనట్టియనుట. తం-ఆపరమాత్మను, బోధయితుం-బోధించుటకొరకు, సదా-ఎల్లప్పుడును, జీవంవాపి - జీవుడైనను, ఈశంవాపి-ఈశ్వరుడైనను, జగద్వాపి-జగంబునైనను, సమాశ్రిత్య-ఆశ్రయించి, ప్రబోధయేత్-బోధించును. అనగా బోధించుచున్నదనుట.

తా. ప్ర. అయితే, శ్రుతులయందక్కడక్కడ, జీవేశ్వరాది స్వరూపమెందుకొరకు ప్రతిపాదింపబడెనో చెప్పుము?. ఉ. శ్రుతి, అవాఙ్మనసగోచరుడగు, ఆపరమాత్మను బోధించుటకొరకు, జీవుడైనను,ఈశ్వరుడైనను, జగంబునైనను (సర్వదా) ఆశ్రయించి, చక్కగాబోధించుచున్నది. అనగా నవాఙ్మనసగోచరుడగు ఆత్మను బోధించుటకొరకు శ్రుతులయందు జీవేశ్వరాది స్వరూపము ప్రతిపాదింపబడెనని తెలియవలెను.

అవ. ఇప్పుడు, సురేశ్వరాచార్యవాక్యమును పఠించుచున్నాడు.

శ్లో॥ యయాయయాభవేత్పుంసాంవ్యుత్పత్తిఃప్రత్యగాత్మని।
సాసైవప్రక్రియేహస్యాత్సాధ్వీత్యాచార్యభాషితం॥ ౭3.

టీ. యయాయయా-ఏయేప్రక్రియచేత, పుంసాం-పురుషులకు, ప్రత్యగాత్మని-ప్రత్యగాత్మయందు,వ్యుత్పత్తిః-వ్యుత్పత్తి, భవేత్-కలుగునో,సాసా-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆయా, ప్రక్రియైవ-ప్రక్రియయే, ఇహ-ఇక్కడ, అనగా శ్రుతులయందనుట. సాధ్వీతి-మంచిదగునని, ఆచార్యభాషితం=ఆచార్య - సురేశ్వరాచార్యులచేత, భాషితం - చెప్పబడెను.

తా. ప్ర. అయితే, ఏకరూపమగు పరతత్వము, శ్రుతిచేబోధింపబడెడి పక్షమందు, శ్రుతులయందు భిన్నభిన్నముగా జెప్పబడుటకు గారణమేమి?. ఉ. ఏయేప్రక్రియచేత పురుషులకు ప్రత్యగాత్మ విషయమై వ్యుత్పత్తి గలుగునో, ఆయాప్రక్రియయే, ఇచ్చటనగా వేదాంతమందు, మంచిదగునని సురేశ్వరాచార్యులు జెప్పిరి. అనగా, పరతత్వమందు భేదములేకపోయినను, ఆపరతత్వమును బోధించెడిప్రకారమందు, ఆపరతత్వము బోధింపదగినపురుషచిత్తభేదానుసారముగా బోధింపబడుచున్నదని సురేశ్వరాచార్యులు జెప్పిరని యభిప్రాయము.

శ్లో॥ శ్రుతితాత్పర్యమఖిలమబుధ్వాభ్రామ్యతేజడః।
వివేకీత్వఖిలంబుధ్వాతిష్ఠత్యానందవారిధౌ॥ ౭౪.

టీ. జడః-మందబుద్ధిగలవాడు, అఖిలం- సకలమగు, శ్రుతితాత్పర్యం=శ్రుతి-ఉపనిషత్తులయొక్క, తాత్పర్యం-అభిప్రాయమును, అబుధ్వా-తెలియక, భ్రామ్యతే-భ్రమనుబొందుచున్నాడు. వివేకీతు-వివేకియో, అఖిలం - సర్వమును, బుధ్వా-ఎరిగి, ఆనందవారిధౌ-ఆనందసముద్రమందు, తిష్ఠతి- స్థితినిబొందుచున్నాడు.

తా. ప్ర. అయితే, శ్రుత్యర్థమేకరూపమైనయెడల, ఆశ్రుత్యర్థమును ప్రతిపాదించెడివారికి, భేదబుద్ధిగలుగుటకు గారణమేమి?. ఉ. మందబుద్ధిగలవాడు, శ్రుతితాత్పర్యమునంతయు దెలియక, భ్రమించుచున్నాడు. వివేకియగువాడు, శ్రుతితాత్పర్యమునంతయు సమగ్రముగా దెలిసికొని, ఆనందసముద్రమందు స్థితినిబొందుచున్నాడు. అనగా శ్రుతితాత్పర్యమును దెలియనివారికే భేదబుద్ధి గలిగియున్నదిగాని, శ్రుతితాత్పర్యవేత్తలకు భేదబుద్ధిలేదని తెలియవలెను.

శ్లో॥ మాయామేఘోజగన్నీరం వర్షత్వేవయథాతథా।
చిదాకాశస్యనోహానిర్నవాలాభ ఇతిస్థితిః॥ ౭౫.

టీ. మేఘః-మేఘము, నీరం-జలమును, యథా - ఏప్రకారముగా, వర్షత్యేవ-వర్షించుచున్నదో, తథా-ఆప్రకారము, మాయా-మాయాశక్తి,జగత్-ప్రపంచమును, వర్షత్యేవ-వర్షించుచున్నదేను. అనగా జగంబును కల్పించుచున్నదనుట. చిదాకాశస్య=చిత్-చిత్తనెడి,ఆకాశస్య-ఆకాశమునకు, హానిః-ఉపద్రవము, నోఇతి-లేదనియు, లాభోవా-లాభమైనను, నేతి-లేదనియు,(వివే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కినః) వివేకియొక్క, స్థితిః-స్థితియగును. అనగా నిశ్చయమగుననుట.

తా. ప్ర. అయితే, వివేకియొక్క నిశ్చయమెట్టిదో చెప్పుము?. ఉ. మేఘమువంటిమాయ, వర్షమువంటి జగత్తును కురియుచున్నదనియు, అట్టి వర్షమువంటి జగంబుచేత, ఆకాశమువంటి చిదాత్మకు లాభనష్టమేమియులేదని, ఈ ప్రకారముగా వివేకియొక్క నిశ్చయమగును.

అవ. ఇప్పుడు, గ్రంథాభ్యాసఫలమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఇమంకూటస్థదీపంయోఽనుసంధత్తేనిరంతరం।
స్వయంకూటస్థరూపేణదీప్యతేఽసౌనిరంతరం॥ ౭౬.

టీ. యః-ఏవిద్వాంసుడు, ఇమం-ఈ, కూటస్థదీపం- కూటస్థదీపమును, నిరంతరం-సర్వదా, అనుసంధత్తే- అనుసంధానము జేయుచున్నాడో, అసౌ-ఈవిద్వాంసుడు, స్వయం-తాను, కూటస్థరూపేణ-కూటస్థరూపముచేత, నిరంతరం-సర్వదా, దీప్యతే - ప్రకాశించుచున్నాడు.

తా. ఏపండితుడు, ఈకూటస్థదీపమును (సర్వదా) అనుసంధానము జేయుచున్నాడో, ఆపండితుడు, తానే, కూటస్థరూపముచేత (సర్వదా) ప్రకాశించుచున్నాడు.

* ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థ విద్యారణ్యమునివర్యకృత శ్రీవేదాంతపంచదశ్యాం కూటస్థదీపస్సమాప్తః.

గద్య * ఇది, శ్రీపరమేశ్వర గురుచరణ వరప్రసాదలబ్ధబ్రహ్మవిద్యావిరాజిత కాశ్యపసగోత్రపవిత్ర మంత్రివంశపయః పారావార పరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్యపుత్ర లక్ష్మీనారాయణామాత్యప్రణీతంబైన ఆంధ్రటీకాతాత్పర్యసహిత శ్రీవేదాంతపంచదశియందు కూటస్థదీపమనెడి అష్టమప్రకరణము సంపూర్ణమాయెను.

ఓంతత్సత్ - శ్రీకృష్ణార్పణమస్తు.

శ్లో॥ ఇయంకూటస్థదీపస్య టీకాతాత్పర్యబోధినీ।
నారాయణాఖ్యవిదుషా కృష్ణపాదసమర్పితా॥



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హరిః ఓం.

శ్రీకృష్ణసద్గురుపరబ్రహ్మణేనమః.

# ధ్యానదీపప్రారంభము.

అవ. ఇచ్చటింతపర్యంతము, నిత్యానిత్యవస్తు వివేకాది సాధన చతుష్టయసంపన్నుడైనట్టియు, లెస్సగా, శ్రవణమనన నిదిధ్యాసనానుష్ఠానవంతుడగు ముముక్షువునకు, వేదాంతశాస్త్రమందు తత్త్వంపదార్థ వివేచనపూర్వకముగా గల మహావాక్యార్థమగు అపరోక్షజ్ఞానముచేత బ్రహ్మభావలక్షణముగలమోక్షము గలుగుచున్నదని ప్రతిపాదింపబడెను. అచ్చట, ఉపనిషదర్థమును వినినవానికైని బుద్ధిమాంద్యాదిరూపమగు ఒకానొక ప్రతిబంధముచేత వాక్యార్థవిషయమగు అపరోక్షజ్ఞానము ఉదయించకపోవుచుండగా, అట్టి అపరోక్షజ్ఞానమును గలిగించెడి, (ద్వారా) మోక్షఫలమును గలుగజేసెడి, ఉపాసనములను జూపుట కిచ్ఛయించినవాడగుచు, శ్రీవిద్యారణ్యగురుండు, మొదట, దృష్టాంతసహితముగా బ్రహ్మతత్త్వోపాసనముచేతను మోక్షము గలుగుచున్నదని దెలుపుచున్నాడు.

శ్లో॥ సంవాదిభ్రమవద్బ్రహ్మతత్త్వోపాస్త్యావిముచ్యతే।
ఉత్తరేతాపనీయే ఽతశ్రుతోపాస్తిరనేకథా॥ ౧.

టీ. సంవాదిభ్రమవత్ - సంవాదిభ్రమమువలె, అనగా సంవాదిభ్రమముచేత బ్రవర్తించెడి పురుషునకు ఇష్టవస్తులాభముగలిగినట్లనుట. బ్రహ్మతత్త్వోపాస్త్యా=బ్రహ్మతత్త్వ-బ్రహ్మస్వరూపముయొక్క, ఉపాస్త్యా-ఉపాసనముచేత, అనగా బ్రహ్మస్వరూపమును ధ్యానించుటచేననుట. విముచ్యతే-ముక్తినిబొందుచున్నాడు. అతః-ఆకారణమువలన, తాపనీయే- తాపనీయోపనిషత్తునందు; ఉత్తరే-ఉత్తరమందు, అనేకథా - అనేకవిధములుగా, ఉపాస్తిః-ఉపాసనము, శ్రుతా-వినబడుచున్నది. అనగా జెప్పబడెననుట.

తా. సంవాదిభ్రమముచేత బ్రవర్తించెడి పురుషునకు ఇష్టవస్తులాభము గలుగుచున్నది. ఈప్రకారము బ్రహ్మతత్త్వోపాసనముచేతను, తనచే గోరబడుచుండెడి బ్రహ్మభావలక్షణముగల మోక్షంబును గలుగుచున్నది. ప్ర. అయితే, ఆవిషయమై ప్రమాణమేమి?. ఉ. ఏకారణమువలన ఉపాసనముచే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తను మోక్షముగలుగుచున్నదో, ఆకారణమువలన తాపనీయోపనిషత్తునందు అనేకప్రకారముగా, బ్రహ్మతత్త్వోపాసనము, చెప్పబడెనని తెలియవలెను.

అవ. పూర్వశ్లోకమందు (సంవాదిభ్రమవత్) అని చెప్పబడిన అర్థమును దృష్టాంతసహితముగా విస్తరించి చెప్పుటకు, సంవాదిభ్రమను ప్రతిపాదించెడి వార్తికము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ మణిప్రదీపప్రభయోర్మణిబుద్ధ్యాభిధావతోః।
మిథ్యాజ్ఞానావిశేషేపివిశేషోర్థక్రియాంప్రతి॥ ౨.

టీ. మణిప్రదీపప్రభయోః=మణి - మణిప్రభయందును, ప్రదీపప్రభయోః--దీపప్రభయందును, మణిబుద్ధ్యా-మణిబుద్ధిచేత, అభిధావతోః - పరుగెత్తుచుండెడి పురుషులిద్దరికి, మిథ్యాజ్ఞానావిశేషేపి=మిథ్యాజ్ఞాన-మిథ్యాజ్ఞానముయొక్క, అవిశేషేపి - భేదములేకపోయినను, అనగా నిద్దరికిని మిథ్యాజ్ఞానము సమానముగా నున్నవనుట. అర్థక్రియాంప్రతి-అర్థక్రియను గురించి, విశేషః-విశేషముగలదు.

తా. మణిప్రభయందును, దీపప్రభయందును, ఏమణిబుద్ధిగలదో, ఆబుద్ధి (అదిగానిదానియందు దానిబుద్ధియగుటవలన) మిథ్యాజ్ఞానమేయగును. అయినను, మణిప్రభయందు ఏమణిబుద్ధిగలదో, ఆబుద్ధి, అర్థక్రియను గలిగించునదియగును. అనగా మణిప్రభయందు మణిబుద్ధిచేత పరుగెత్తుచుండెడి పురుషునకు మణిలాభముగలుగుచున్నదనియు, దీపప్రభయందు మణిబుద్ధిచేత పరుగెత్తుచుండెడి పురుషునకు మణిలాభముగలుగదనియు, ఈప్రకారముగా నర్థక్రియయందు వైషమ్యము గలదని యభిప్రాయము.

అవ. పూర్వోక్తవార్తికము నిప్పుడు మూడు శ్లోకములచే వ్యాఖ్యానము జేయుచున్నాడు.

శ్లో॥ దీపోపవరకస్యాంతర్వర్తతేతత్ప్రభాబహిః।
దృశ్యతేద్వార్యథాన్యత్రతద్వద్దృష్టామణేఃప్రభా॥ ౩.

టీ. అపవరకస్య-గృహాంతర్గృహముయొక్క, అంతః-లోపట, దీపః-దీపము, వర్తతే-వర్తించుచున్నది. అనగా నుండెననుట. తత్ప్రభా=తత్-ఆదీపముయొక్క, ప్రభా-కాంతి, బహిర్ద్వారి-బహిర్ద్వారప్రదేశమందు, దృశ్యతే-రత్నమువలె వర్తులముగా గనబడుచుండెను. అథ-అనంతరము, అన్యత్ర- మరియొకగృహాంతర్గృహమందు, మణేః-రత్నముయొక్క, ప్రభా-ప్రభ, తద్వత్-ఆప్రకారము, అనగా బహిర్ద్వారప్రదేశమందు దీపప్రభవలె రత్నసమానముగాననుట. దృష్టా - కనబడుచుండెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఒకానొక గృహమందు, అంతర్గృహముయొక్కలోపట, దీపముం డెను. ఆదీపముయొక్క ప్రభ, బహిర్ద్వారప్రదేశమందు రత్నమువలె వర్తులముగా గనబడుచుండెను. ఆప్రకారము మరియొక గృహమందు, అంతర్గృహముయొక్కలోపటనుండెడి రత్నముయొక్కప్రభ, బహిర్ద్వారప్రదేశమందు దీపప్రభవలెనే, రత్నసమానముగా గనబడుచుండెను.

శ్లో॥ దూరేప్రభాద్వయందృష్ట్వా మణిబుద్ధ్యాభిధావతోః।
ప్రభాయాంమణిబుద్ధిస్తుమిథ్యాజ్ఞానంద్వయోరపి॥ ౪.

టీ. దూరే-దూరమందు, ప్రభాద్వయం - ప్రభాద్వయమును, దృష్ట్వా-చూచి, మణిబుద్ధ్యా-రత్నబుద్ధిచేత, అభిధావతోః - పరుగెత్తుచుండెడి, ద్వయోరపి-పురుషులిద్దరికినీ, ప్రభాయాం-ప్రభయందు, మణిబుద్ధిస్తు- రత్నబుద్ధియో, మిథ్యాజ్ఞానం - భ్రాంతిజ్ఞానమగును.

తా. పూర్వోక్తప్రభాద్వయమును దూరమందిద్దరుపురుషులుజూచి, ఇది మణి, ఇదిమణి, అనెడి బుద్ధిచేత పరుగెత్తిరి. ఆ పురుషులిద్దరికిని ప్రభావిషయమందు బుట్టుచుండెడి మణిజ్ఞానము, భ్రాంతిరూపమగును.

శ్లో॥ నలభ్యతేమణిర్దీప ప్రభాంప్రత్యభిధావతా।
ప్రభాయాంధావతావశ్యంలభ్యేతైవమణిర్మణేః॥ ౫.

టీ. దీపప్రభాంప్రతి-దీపప్రభనుగురించి, అభిధావతా- పరుగెత్తుచుండెడి పురుషునిచేత, మణిః-రత్నము, నలభ్యతే-పొందబడదు. మణేః - రత్నముయొక్క, ప్రభాయాం-ప్రభయందు, ధావతా-మణిబుద్ధిచేత పరుగెత్తెడి పురుషునిచేత, అవశ్యం-తప్పక, మణిః-రత్నము, లభ్యేతైవ - పొందబడును.

తా. దీపప్రభయందు మణిబుద్ధిని కల్పించుకొని పరుగెత్తెడి పురుషునిచేత, మణి, పొందబడదు. మరియు, మణిప్రభయందు మణిబుద్ధిచేత పరుగెత్తెడి పురుషునిచేత, మణి, లభింపబడుచున్నదని, పూర్వోక్తవార్తికార్థమగును.

శ్లో॥ దీపప్రభామణిభ్రాంతిర్విసంవాదిభ్రమస్స్మృతః।
మణిప్రభామణిభ్రాంతిస్సంవాదిభ్రమఉచ్యతే॥ ౬.

టీ. దీపప్రభామణిభ్రాంతిః=దీప-దీపముయొక్క, ప్రభా - ప్రభయందు, మణి-రత్నమనెడి, భ్రాంతిః-భ్రమము, విసంవాదిభ్రమః - విసంవాదిభ్రమమని, స్మృతః-విద్వాంసులచే జెప్పబడెను. మణిప్రభామణిభ్రాంతిః=మణి-రత్నముయొక్క, ప్రభా-ప్రభయందు, మణి-రత్నమనెడి, భ్రాంతిః - భ్రమము, సంవాదిభ్రమః-సంవాదిభ్రమమని, ఉచ్యతే- విద్వాంసులచే జెప్పబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. సరి. ఈప్రకారము పూర్వోక్తవార్తికార్థమగుగాక. ప్రకృతమందేమి?. ఉ. దీపప్రభయందు, ఏమణిభ్రాంతిగలదో, అది, మణిలాభలక్షణార్థక్రియలేనిదగుటవలన, విసంవాదిభ్రమమని, విద్వాంసులచేత జెప్పబడెను. మరియు, మణిప్రభయందు ఏమణిబుద్ధిగలదో, అదియో, మణిలాభలక్షణార్థక్రియ గలదగుటవలన, సంవాదిభ్రమమని చెప్పబడుచున్నది.

అవ. ఇట్లు ప్రత్యక్షవిషయమందు సంవాదిభ్రమంబునుజూపి, అనుమానవిషయమందును, ఆ సంవాదిభ్రమంబు నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ బాష్పంధూమతయాబుధ్వాతత్రాంగారానుమానతః।
వహ్నిర్యదృచ్ఛయాలబ్ధస్ససంవాదిభ్రమోమతః॥ ౭.

టీ॥ బాష్పం-బాష్పమును, ధూమతయా - సామాన్య ధూమమునుగా, బుధ్వా-తెలిసి, తత్ర-ఆస్థలమందు, అంగారానుమానతః = అంగార-అగ్నియొక్క, అనుమానతః-అనుమానమువలన, అనగా ననుమానముకొరకు ప్రవర్తించెడి బురుషునకనుట. యదృచ్ఛయా-దైవగతిచేత, వహ్నిః-అగ్ని, లబ్ధోయది-పొందబడినయెడల, సః-అది, సంవాదిభ్రమః - సంవాది భ్రమమని, మతః-సమ్మతమగును.

తా. మరియు, ఒకానొకప్రదేశమందుండెడి బాష్పమునుధూమముగలదానినిగా నిశ్చయించి, తస్మాత్ప్రదేశమందు, ఈప్రదేశము ధూమము గలదగుటవలన అగ్నివంతమని నిశ్చయించి, అనుమానము కొరకు ప్రవర్తించెడిపురుషునివల్ల, అచ్చట దైవగతిచేత నగ్ని, పొందబడినయెడల, అప్పుడు బాష్పవిషయమగు ధూమజ్ఞానము, సంవాదిభ్రమమగుటకు, సమ్మతమగును. బాష్పమనగా నేదియగును. అనగా నత్యుష్ణజలము మొదలగు పదార్థములయందు గలిగెడి, ధూమమువలెనుండెడి ఆవిరి, బాష్పమని తెలియవలెను.

అవ. ఇప్పుడాగమవిషయమందు నాసంవాదిభ్రమమును జూపుచున్నాడు.

శ్లో॥ గోదావర్యుదకంగంగోదకంమత్వావిశుద్ధయే॥
సంప్రోక్ష్యశుద్ధిమాప్నోతిససంవాదిభ్రమోమతః॥ ౮.

టీ. గోదావర్యుదకం= గోదావరీ - గోదావరీనదియొక్క, ఉదకం- జలమును, గంగోదకం-గంగానదీజలమునుగా, మత్వా-తలచి, విశుద్ధయే - విశుద్ధికొరకు, సంప్రోక్ష్య- ప్రోక్షించుకొని, శుద్ధిం-పరిశుద్ధిని, ఆప్నోతి - పొందుచున్నాడు. సః - అది, సంవాదిభ్రమః - సంవాదిభ్రమంబని, మతః- సమ్మతమగును.

తా. మరియు, గోదావరీ జలమునకును విశుద్ధ హేతుత్వము ఆగమసిద్ధ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగానుండుటవలన, ఆ గోదావరీజలమును ప్రోక్షించుకొనుటచేతను విశుద్ధిగ లుగును. ఆగోదావరీజలమును విశుద్ధికొరకు, గంగాజలమునుగాదలచి ప్రోక్షించుకొని, గంగాజలప్రోక్షణముచే గలిగెడి పరిశుద్ధిని బొందుచున్నాడు. అయి నను గోదావరీజలమందు, ఏ గంగోదకబుద్ధిగలదో, ఆగంగోదకబుద్ధి, భ్రాంతి యేయగును. ఈభ్రాంతి, సంవాదిభ్రమమగుటకు సమ్మతమగునని తెలియ వలెను.

అవ. మరియొక, ఉదాహరణము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ జ్వరేణాప్తస్సన్నిపాతంభ్రాంత్యానారాయణంస్మరన్।
మృతస్స్వర్గమవాప్నోతిససంవాదిభ్రమోమతః॥ ౯.

టీ. జ్వరేణ-జ్వరముచేత, సన్నిపాతం - సన్నిపాతమనెడి దోషమును, ఆప్తః-పొందినపురుషుడు, భ్రాంత్యా-సన్నిపాతదోషప్రయుక్తభ్రమముచేత, నారాయణం-నారాయణశబ్దమును, స్మరన్-స్మరించుచు, మృతస్సన్- మృతిని బొందినవాడగుచు, స్వర్గం-స్వర్గమును, అవాప్నోతి - పొందుచున్నాడు. సః- అది, సంవాదిభ్రమః-సంవాదిభ్రమంబని, మతః-సమ్మతమగును.

తా. మరియు, జ్వరముచేత సన్నిపాతదోషమును బొందినపురుషుడు, (ఈనారాయణస్మరణము నాకు స్వర్గసాధనమనెడి) జ్ఞానములేకనే. సన్నిపా తదోషప్రయుక్తభ్రమవశమువల్ల, సాధారణ పురుషభావముచేత వైద్యాదులను వలె, నారాయణుని స్మరించుచు మృతినిబొందినవాడై, స్వర్గమునుపొందుచున్న వాడేయగును. అనిచ్ఛచేత స్పృశింపబడినను, అగ్ని, దహించుచున్నట్లు,శ్రీమ న్నారాయణదేవుడు, పాపచిత్తముగలవారిచేత స్మరింపబడినను, వారిపాపము లను నశింపజేయుచున్నాడనియు, మరియు, పాపాత్ముడగు అజామీళుడును, తనపుత్రుని (నారాయణా) యని పిలుచుచు తిట్టుచు, మృతినిబొందినవాడై,ము క్తుడాయెనని, శ్లో॥ హరిర్హరతిపాపానిదుష్టచిత్తైరపిస్మృతః।అనిచ్ఛయాపిసం స్పృష్టోదహత్యేవహిపావకః॥ ఆక్రుశ్యపుత్రమఘవాన్యదజామిళోపి నారాయ ణేతి మ్రియమాణఉపైతిముక్తిం॥ అని చెప్పెడి పురాణవాక్యములవలన, స్వర్గ ము గలుగుచున్నదని తెలియవలెను. ఇచ్చటయు, నారాయణనామమునకు పుత్ర నామత్వజ్ఞానము, భ్రాంతియేయగును. ఇట్టిభ్రాంతి, సంవాదిభ్రమంబని చెప్ప బడును.

అవ. ఈచెప్పబడిన త్రివిధసంవాది భ్రమోదాహరణములచేత సిద్ధించిన అర్థము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రత్యక్షస్యానుమానస్యతథాశాస్త్రస్యగోచరే।

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉక్తన్యాయేనసంవాదిభ్రమాస్సంతిహికోటిశః॥ ౧౦.

టీ. ప్రత్యక్షస్య-ప్రత్యక్షముయొక్క, గోచరే- విషయమందును, అనగా ప్రత్యక్షప్రమాణమందనుట. అనుమానస్య-అనుమానముయొక్క,గోచరే-విషయమందును, తథా-ఆప్రకారము, శాస్త్రస్య - శాస్త్రముయొక్క, గోచరే-విషయమందును, ఉక్తన్యాయేన=ఉక్త-చెప్పబడిన, న్యాయేన - న్యాయముచేత, సంవాదిభ్రమాః-సంవాదిభ్రమంబులు, కోటిశః - కోటులపరిమితిగా, సంతి-కలవు. హి-ఇది ప్రసిద్ధమనుట.

తా. ౧. ప్రత్యక్షవిషయమందును, ౨. అనుమాన విషయమందును. ౩. శాస్త్రవిషయమందును, ఈపూర్వోక్తప్రకారము, సంవాది భ్రమంబులు, కోటులపరిమితిగా గలిగియున్నవని తెలియవలెను.

అవ. పరపక్షమందు బాధను జూపుటచేత, పూర్వోక్తార్థము నిప్పుడు దృఢము జేయుచున్నాడు.

శ్లో॥ అన్యథామృత్తికాదారుశిలాస్స్యుర్దేవతాఃకథం।
అగ్నిత్వాదిధియోపాస్యాఃకథంవాయోషిదాదయః॥ ౧౧.

టీ. అన్యథా-మరియొకవిధమైనయెడల, అనగా సంవాదిభ్రమంబులేనియెడలననుట. మృత్తికాదారుశిలాః=మృత్తికా-మట్టియు, దారు - కొయ్యలును, శిలాః-శిలలును, దేవతాః-దేవతలు, కథం-ఎట్లు, స్యుః-అగుచున్నవి. అనగా గాజాలవనుట. యోషిదాదయః= యోషిత్-స్త్రీయే, ఆదయః - ఆదిగాగలవి, అగ్నిత్వాదిధియా-అగ్నిత్వాదిబుద్ధిచేత, కథం-ఎట్లు, ఉపాస్యాః - ఉపాసింపదగినవి. (స్యుః) గాగలవు. అనగా గాజాలవనుట.

తా. మరియు, సంవాదిభ్రమములేదనిచెప్పెడిపక్షమందు,మృత్తికాశిలాదులకు, (స్వతః) దేవతాభావములేమిచేత, ఆమృత్తికా శిలాదులు ఫలసిద్ధికొరకు, జనులచే బూజింపదగినవి కాకపోవలయును. మరియు, స్త్రీపురుష పృథివీ పర్జన్యస్వర్గలోకముల నగ్నిభావముగా నుపాసించుటవలన బ్రహ్మలోకప్రాప్తిరూపఫలముగలుగుచున్నదని పంచాగ్నివిద్యయందుగల, శ్రు॥ యోషావావ గౌతమాగ్నిఃపురుషోవావ గౌతమాగ్నిః పృథివీవావగౌతమాగ్నిః పర్జన్యోవావ గౌతమాగ్ని రసావావలోకోగౌతమాగ్నిః॥ అనెడి, యిత్యాది వాక్యములచేత జెప్పబడిన అర్థము వ్యర్థమగును. మరియు, శ్లోకమందు గల ఆదిపదముచేత మనస్సును బ్రహ్మముగా నుపాసింపవలెననియు, సూర్యుని బ్రహ్మమునుగా జెప్పవలెననియుం దెలిపెడి, శ్రు॥ మనోబ్రహ్మేత్యుపాసీత, ఆదిత్యోబ్రహ్మేత్యాదేశః॥ అనెడి యిత్యాది వాక్యములును వ్యర్థములగుననెడి యర్థముద్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హింపబడుచున్నది.

అవ. ఇప్పుడు, బహుగ్రంథములచేత నుపపాదింపబడిన సంవాదిభ్రిమంబును, బుద్ధిసౌకర్యముకొరకు సంక్షేపించి చూపుచున్నాడు.

శ్లో॥ అయథావస్తువిజ్ఞానాత్ఫలంలభ్యతఈప్సితం।
కాకతాళీయతస్సోఽయం సంవాదిభ్రమఉచ్యతే॥ ౧౨.

టీ. అయథావస్తువిజ్ఞానాత్-విపరీతజ్ఞానమువలన, ఈప్సితం-ఇచ్ఛయింపబడెడి, ఫలం-ఫలము, కాకతాళీయతః=కాకతాళీ-యన్యాయమువలన, అనగా దైవగతిచేననుట. లభ్యతే - పొందబడుచున్నది. సోఽయం-ఆ ఇది, సంవాదిభ్రమః-సంవాదిభ్రమంబని, ఉచ్యతే-చెప్పబడుచున్నది.

తా. విహితమైనదైనను, అవిహితమైనదైనను, ఏవిపరీతజ్ఞానమువలన, ఇష్టఫలము కాకతాళీయన్యాయముచేత (అనగా దైవగతిచేత) పొందబడుచున్నదో, ఆయిది, సంవాదిభ్రమంబగునని తెలియవలెను. ప్ర. సరి. కాకతాళీయన్యాయమనగానేమి?. ఉ. త్రాటిచెట్టునందు పరిపక్వముగా పండియుండెడి త్రాటిపండు నొకపురుషుడుజూచి, యాపండు నపేక్షించి చూచుచుండగా, దైవగతిచేత నొకకాకివచ్చి, ఆపండును కదలించుటచేత, ఆపండుక్రిందబడెను. ఇదియే, కాకతాళీయన్యాయమగునని తెలియవలెను.

శ్లో॥ స్వయంభ్రమోఽపిసంవాదీయథాసమ్యక్ఫలప్రదః।
బ్రహ్మతత్త్వోపాసనాపితథాముక్తిఫలప్రదా॥ ౧౩.

టీ. సంవాదీ-సంవాది, స్వయం - తాను, భ్రమోఽపి - భ్రమమైనను, యథా-ఏప్రకారము, సమ్యక్ఫలప్రదః=సమ్యక్-యథార్థవస్తువుయొక్క, ఫల-ఫలమును, ప్రదః-ఇచ్చుచున్నదో, తథా- ఆప్రకారము, బ్రహ్మతత్త్వోపాసనాపి=బ్రహ్మతత్త్వ- బ్రహ్మస్వరూపముయొక్క, ఉపాసనాపి - ధ్యానంబును, ముక్తిఫలప్రదా=ముక్తిఫల-మోక్షఫలమును, ప్రదా- ఇచ్చునదియగును.

తా. ప్ర. అయితే, యథార్థవస్తువిషయముగాని బ్రహ్మోపాసనము, యథార్థజ్ఞానముచే సాధింపదగిన ముక్తినెట్లిచ్చును?. ఉ. సంవాది, తాను భ్రమమైనను, యథార్థవస్తుఫలంబు నెట్లిచ్చుచున్నదో, అటువలెనే, బ్రహ్మతత్త్వోపాసనంబును ముక్తిఫలము నిచ్చుచున్నదని తెలియవలెను.

శ్లో॥ వేదాంతేభ్యోబ్రహ్మతత్త్వమఖండైకరసాత్మకం।
పరోక్షమవగమ్యైతదహమస్మీత్యుపాసతే॥ ౧౪.

టీ. వేదాంతేభ్యః-ఉపనిషత్తులవలన, అఖండైకరసాత్మకం = అఖండ-భేదములేని, ఏకరస-చిదేకరసమే, ఆత్మకం-స్వరూపముగాగల, అనగా సజా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తీయవిజాతీయ స్వగతభేదశూన్యమగు కేవలవస్తుమాత్రమైనట్టియనుట. బ్రహ్మతత్త్వం=బ్రహ్మ-నిర్గుణపరబ్రహ్మముయొక్క, తత్త్వం - స్వరూపమును, పరోక్షం-పరోక్షముగా, అవగమ్య-ఎరిగి, ఏతత్-ఈపరబ్రహ్మము, అహం-నేను, అస్మీతి-ఐతినని, ఉపాసతే-ఉపాసనము జేయుచున్నాడు.

తా. ప్ర. అయితే, బ్రహ్మతత్త్వము నెరిగి యుపాసనము జేయుచున్నాడో, లేక, ఎరుగక ఉపాసనము జేయుచున్నాడో చెప్పుము. ఎరిగియుపాసనము జేసెడిపక్షమందు, మోక్షసాధనమగు జ్ఞానము గలిగియుండుటచేత, ఉపాసనముజేయుట, వ్యర్థమగును. మరియు, బ్రహ్మతత్త్వము నెరుగక ఉపాసించునసెడి పక్షమందు, ఉపాసింపబడెడి విషయము నెరుగమివలన, ఉపాసనమెట్లుఘటించును?. ఉ. సజాతీయవిజాతీయ స్వగతభేదశూన్యమగు కేవలవస్తుమాత్రమైన (అనగా సఖండైకరసాత్మకమైనట్టి) నిర్గుణపరబ్రహ్మతత్త్వమును వేదాంతవాక్యములవలన పరోక్షముగా నెరిగి, ఈబ్రహ్మము, నేనైతినని యుపాసనముజేయుచున్నాడు. అనగా, మోక్షసాధనమైనట్టి, బ్రహ్మాత్మైకత్వ రూపముగల అపరోక్షజ్ఞానోదయముగాని హేతువువలన, ఉపాసనము జేయుట, వ్యర్థము గాదనియు, మరియు, శాస్త్రమువల్ల పరోక్షభావముగా బ్రహ్మం బెరుగబడుటవలన, బ్రహ్మమునకు ఉపాసనావిషయత్వము సంభవించుననియుం దెలియవలెను.

శ్లో॥ ప్రత్యగ్వ్యక్తిమనుల్లిఖ్యశాస్త్రాద్విష్ణ్వాదిమూర్తివత్।
అస్తిబ్రహ్మేతిసామాన్యజ్ఞానమత్రపరోక్షధీః॥ ౧౫.

టీ. ప్రత్యగ్వ్యక్తిం-బుద్ధ్యాదిసాక్షియగు ప్రత్యగాత్మను, అనుల్లిఖ్య-విషయీకరించక, అనగా ప్రత్యక్షముగా నెరుగజాలకనుట. శాస్త్రాత్-సత్యజ్ఞానాది వాక్యసమూహమువలన, బ్రహ్మ - నిర్గుణబ్రహ్మము, అస్తీతి-కలదని, (ఏవం) ఈప్రకారము, సామాన్యజ్ఞానం=సామాన్య - సామాన్యాకారముగా గలుగుచుండెడి, జ్ఞానం-జ్ఞానము, విష్ణ్వాదిమూర్తివత్- విష్ణ్వాదిమూర్తిప్రతిపాదకశాస్త్రజన్యజ్ఞానమువలె, అత్ర-ఈయుపాసనమందు, పరోక్షధీః- పరోక్షజ్ఞానమగును.

తా. ప్ర. అయితే, ఉపాసింపదగిన బ్రహ్మతత్త్వము గోచరింపజేసెడి పరోక్షజ్ఞానమునకు రూపమేమి?. ఉ. బుద్ధ్యాదులకు సాక్షియగు ఆనందరూప ప్రత్యగాత్మను, ప్రత్యక్షముగా నెరుగక, శాస్త్రమువలన బ్రహ్మము కలదని, ఈప్రకారము సామాన్యాకారముగా గలుగుచుండెడి జ్ఞానము,విష్ణ్వాదిమూర్తి ప్రతిపాదకశాస్త్రజన్యజ్ఞానమువలెనే, ఈ యుపాసనమందు బరోక్షజ్ఞానమని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెప్పబడెను.

శ్లో॥ చతుర్భుజాద్యవగతావపిమూర్తిమనుల్లిఖన్।
అక్షైఃపరోక్షజ్ఞానీ(స్యే)వనతదా విష్ణుమీక్షతే॥ ౧౬.

టీ. (శాస్త్రేణ) శాస్త్రముచేత, చతుర్భుజాద్యవగతావపి=చతుర్భుజాది-చతుర్భుజత్వాదివిశేషాకారముయొక్క, అవగతావపి- తెలివిగలిగినను, అనగా శాస్త్రముచేత దెలిసినవాడైననుట. అక్షైః-చక్షురాదులచేత, మూర్తిం-విష్ణ్వాదిమూర్తిని, అనుల్లిఖన్ - విషయీకరించనివాడగుచు, అనగా ప్రత్యక్షముగా జూడనివాడగుచుననుట. (పురుషః) పురుషుడు, పరోక్షజ్ఞానీస్యేవ-పరోక్షజ్ఞానియేయగును. తదా-అప్పుడు, అనగా నుపాసనకాలమందనుట. విష్ణుం - ఉపాసింపబడెడివిష్ణువును, నేక్షతే-ఇంద్రియములచేత జూడలేడు.

తా. ప్ర. అయితే, శాస్త్రమందు విష్ణ్వాదిమూర్తియొక్క చతుర్భుజత్వాది విశేషప్రతీతివల్ల, ఆజ్ఞానమునకైనను, పరోక్షత్వమెందుచేగలిగెనో జెప్పుము?. ఉ. విష్ణ్వాదిమూర్తి ప్రతిపాదక శాస్త్రముచేత విష్ణ్వాది మూర్తియొక్క చతుర్భుజత్వాదివిశేషాకారము, దెలియబడినను, చక్షురాదులచేత విష్ణ్వాదిమూర్తిని జూడనివాడగుచు, పురుషుడు పరోక్షజ్ఞానీయేయగును. ఇందుకు ఉపపత్తిని జెప్పెదనినుము. పురుషుడు, ఉపాసనాకాలమందు, ఉపాసింపబడెడివిష్ణువు నింద్రియములచేత ప్రత్యక్షముగా జూడలేడు. ఆకారణముచేత ఈజ్ఞానమునకు పరోక్షత్వము గలిగెనని తెలియవలెను.

శ్లో॥ పరోక్షత్వాపరాధేనభవేన్నాతత్వవేదనం।
ప్రమాణేనైవశాస్త్రేణ సత్యమూర్తేర్విభాసనాత్॥ ౧౭.

టీ. ప్రమాణేన - ప్రమాణభూతమగు, శాస్త్రేణైవ- శాస్త్రముచేతనే, సత్యమూర్తేః=సత్య-సత్యమగు, మూర్తేః - విష్ణ్వాదిస్వరూపము, విభాసనాత్-ప్రకాశించుచుండుటవలన, అనగా ప్రమాణభూత శాస్త్రముచేత సత్యమగు విష్ణ్వాదిస్వరూపము జెప్పబడుటచేననుట. పరోక్షత్వాపరాధేన= పరోక్షత్వ-పరోక్షభావమనెడి, అపరాధేన - అపరాధముచేత, అతత్వవేదనం-మిథ్యాజ్ఞానము, నభవేత్-కాదు.

తా. ప్ర. అయితే, విష్ణ్వాదిస్వరూపగోచరజ్ఞానము, ఆవిష్ణ్వాదిస్వరూపమును ప్రత్యక్షముగా నెరుగని హేతువుచేత, భ్రాంతిజ్ఞానముగాదాయేమి?. ఉ. పరోక్షజ్ఞానత్వము, భ్రాంతిజ్ఞానత్వమందు కారణముగాదు. మరియేమనగా, విషయముయొక్క అసత్యత్వముగలదగును. ఇచ్చటనో, ప్రమాణభూతమగు శాస్త్రముచేతనే యథార్థభూతమగు విష్ణ్వాది స్వరూపము ప్రకాశింపబ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డుటవలన, పరోక్షత్వమనెడి యపరాధము గలిగినంతమాత్రముచేత, ఈపరో క్షజ్ఞానము భ్రాంతిజ్ఞానముగాదని యభిప్రాయము.

శ్లో॥ సచ్చిదానందరూపస్యశాస్త్రాద్భానేప్యనుల్లిఖన్।
ప్రత్యంచంసాక్షిణంతత్తుబ్రహ్మసాక్షాన్నవీక్షతే॥ ౧౮.

టీ. శాస్త్రాత్-వేదాంతశాస్త్రమువలన, సచ్చిదానందరూపస్య- సత్యజ్ఞానానందస్వరూపముగల బ్రహ్మముయొక్క, భానేపి-ప్రతీతిగలిగినను, ప్రత్యంచం-సర్వాంతరుడగు, సాక్షిణం-సాక్షియగు ప్రత్యగాత్మను,అనుల్లిఖన్-ఎరుగనివాడగుచు, తత్బ్రహ్మ-ఆబ్రహ్మమును, సాక్షాత్-ప్రత్యక్షముగా, నతువీక్షతే-చూడనేలేడు. అనగా బ్రత్యక్షముగా నెరుగజాలడనుట.

తా. ప్ర. అయితే, సచ్చిదానందస్వరూపము నెరిగినట్టియు, శాస్త్రమువలన గలిగిన బ్రహ్మతత్వజ్ఞానమునకు, పరోక్షత్వ మెందుచేగలిగెనో జెప్పుము?. ఉ. బ్రహ్మము, సద్రూపమనియు, చిద్రూపమనియు, అనంతమనియు, నిత్యమనియు, శుద్ధమనియు, బుద్ధమనియు, సత్యమనియు, ముక్తమనియు, నిరంజనము = (నిర్దోషమైనదనియు) ఈసర్వంబును సద్రూపంబగు బ్రహ్మమేయగుననియు, ఈసర్వజగంబును చిద్రూపంబగు బ్రహ్మమే ప్రకాశింపజేయుచున్నదనిచెప్పెడి, శ్రు॥ సత్యంజ్ఞానమనంతం బ్రహ్మనిత్యశ్శుద్ధోబుద్ధస్సత్యోముక్తో నిరంజనస్సద్ధీదం సర్వంసత్సదితి చిద్ధీదంసర్వంప్రకాశతే॥ అనెడి యిత్యాది వేదాంతశాస్త్రమువలన సచ్చిదానందరూప బ్రహ్మముయొక్క ప్రతీతిగలిగినను, ఆబ్రహ్మమునకు ప్రత్యగాత్మరూపత్వము నెరుగనివాడగుచు, పురుషుడాబ్రహ్మమును బ్రత్యక్షముగా నెరుగనేరడు. అనగా, అపరోక్షత్వమునకు బ్రయోజకమగు ప్రత్యగ్బ్రహ్మైక్యలక్షణములేని కారణమువలన ఈశాస్త్రజన్యజ్ఞానమునకు పరోక్షత్వము గలిగెనని తెలియవలెను.

శ్లో॥ శాస్త్రోక్తేనైవమార్గేణసచ్చిదానందనిశ్చయాత్।
పరోక్షమపితద్జ్ఞానం తత్వజ్ఞానంనతుభ్రమః॥ ౧౯.

టీ. తత్-ఆ, జ్ఞానం-జ్ఞానము, పరోక్షమపి - పరోక్షత్వమును బొందినదైనను, శాస్త్రోక్తేన=శాస్త్ర-శాస్త్రమందు, ఉక్తేన - చెప్పబడిన, మార్గేణైవ-మార్గముచేతనే, సచ్చిదానందనిశ్చయాత్=సచ్చిదానంద- సత్యజ్ఞానానందరూపమును, నిశ్చయాత్-నిశ్చయమునుజేయుటవలన, తత్వజ్ఞానం - యధార్ధజ్ఞానమేయగును. భ్రమః-భ్రాంతి, నతు-కాదు.

తా. ప్ర. అయితే, అట్టిబ్రహ్మగోచరజ్ఞానము,యధార్ధజ్ఞానమెట్లగును?. ఉ. ఆజ్ఞానము, పరోక్షత్వమును బొందినదైనను, శాస్త్రముచేత జెప్పబడిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రకారముగా, బ్రహ్మమునకు సచ్చిదానందరూపమును నిశ్చయింపజేసెడి స్వభావముగలిగియుండుటవలన, యథార్థజ్ఞానమేయగును. భ్రమముగాదు.

శ్లో॥ బ్రహ్మయద్యపిశాస్త్రేషుప్రత్యక్త్వేనైవవర్ణితం।
మహావాక్యైస్తథాప్యేతద్దుర్బోధమవిచారిణః॥ ౨౦.

టీ. యద్యపి-విచారించగా, బ్రహ్మ-బ్రహ్మము, శాస్త్రేషు- వేదాంతములయందు, మహావాక్యైః-తత్త్వమస్యాది మహావాక్యములచేత, ప్రత్యక్త్వేనైవ-ప్రత్యగాత్మత్వముచేతనే, వర్ణితం-వర్ణింపబడెను. తథాపి- అట్లు వర్ణింపబడినను, ఏతత్-ఈప్రత్యగాత్మత్వము, అవిచారిణః - తత్త్వంపదార్థవిచారములేనివానికి, దుర్బోధం-ఎరుగుటకు శక్యముగానిదగును.

తా. ప్ర. అయితే, శ్రు॥ సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ॥ అనెడియిత్యాదివాక్యములచేత బ్రహ్మమునకు సచ్చిదానందరూపత్వము బోధింపబడినట్లు, శ్రు॥ తత్త్వమస్యాది మహావాక్యములచేత, ఆబ్రహ్మమునకు ప్రత్యగాత్మత్వంబును బోధింపబడినదేయగును. ఆకారణమువలన శాస్త్రజన్యజ్ఞానంబును ప్రత్యగాత్మరూపమును గ్రహించినదే యగుటచేత, అట్టి జ్ఞానమునకు అపరోక్షత్వము గలుగదాయేమి?. ఉ. ఓపూర్వవాదీ, శాస్త్రవిచారము జేయగాబ్రహ్మము, వేదాంతములయందు మహావాక్యములచేత ప్రత్యగాత్మరూపత్వముచేతనే ఉపదేశింపబడినదైనను, అన్వయవ్యతిరేకములచేత తత్త్వంపదార్థవిభజనలక్షణోపాయములేనివానికి, ఈప్రత్యగాత్మరూపత్వము నెరుగుటకు శక్యముగాదు. ఆకారణమువలన కేవలవాక్యముచేత అపరోక్షజ్ఞానము గలుగదని తెలియవలెను.

శ్లో॥ దేహాద్యాత్మత్వవిభ్రాంతౌ జాగ్రత్యాం నహఠాత్పుమాన్।
బ్రహ్మాత్మత్వేనవిజ్ఞాతుం క్షమతేమందధీత్వతః॥ ౨౧.

టీ. దేహాద్యాత్మత్వవిభ్రాంతౌ= దేహాది - దేహేంద్రియాదులయందు, ఆత్మత్వ-ఆత్మభావలక్షణము గల, విభ్రాంతౌ - విభ్రమము, జాగ్రత్యాంసత్యాం-ఎడబాయని స్థితినిబొందియుండగా, పుమాన్- పురుషుడు, మందధీత్వతః-మందబుద్ధిగలవాడగుటవలన, హఠాత్-బలాత్కరించుటవల్ల, అనగాబలాత్కారముగానను టు. బ్రహ్మ-బ్రహ్మమును, ఆత్మత్వేన - ప్రత్యగాత్మత్వముచేత, అనగా ప్రత్యగాత్మనుగానను టు. విజ్ఞాతుం-ఎరుగుటకు, నక్షమతే- సమర్థుడుగాడు.

తా. ప్ర. అయితే, యథార్థజ్ఞానము, ప్రమాణవస్త్వధీనమగుచుండగాను, మరియు, తత్త్వమస్యాదివాక్యరూపప్రమాణ స్థితియుం గలిగియుండ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాను, మరియు, బ్రహ్మాత్మైక్యలక్షణము గల వస్తుస్థితియుం గలిగియుండగా, తత్త్వంపదార్థవిచారములేకనే, ఈప్రత్యగాత్మరూపము నెరుగుటకు శక్యము గాదని యెందువలన జెప్పితిరి?. ఉ. దేహేంద్రియాదులయందు ఆత్మబుద్ధిలక్షణముగల విభ్రాంతి, దార్ఢ్యస్థితినిబొందియుండగా, బురుషుడు మందబుద్ధిగలవాడగుటవలన, అట్టిభ్రాంతిని బుద్ధిబలముచేత నిగ్రహించి,బ్రహ్మమును ప్రత్యగాత్మనుగా నెరుగుటకు సమర్థుడుగాడు. అనగా బ్రహ్మాత్మైకత్వ లక్షణముగల అపరోక్షజ్ఞానమునకు విరోధియైనట్టియు, తత్త్వంపదార్థ విచారముచేత నివర్తింపదగినట్టి, దేహేంద్రియాదులయందు ఆత్మబుద్ధి లక్షణము గల ద్వైత భ్రమంబుండుటవలన, అట్టి ద్వైతభ్రమము నివర్తించుటకొరకును, తత్త్వంపదార్థ విచారమపేక్షింపబడుచున్నదని యభిప్రాయము.

శ్లో॥ బ్రహ్మమాత్రంసువిజ్ఞేయం శ్రద్ధాళోశ్శాస్త్రదర్శినః।
అపరోక్షద్వైతబుద్ధిఃపరోక్షాద్వైతబుద్ధ్యనుత్॥ ౧౨.

టీ. అపరోక్షద్వైతబుద్ధిః=అపరోక్ష-ప్రత్యక్షత్వమునుబొందిన, ద్వైతబుద్ధిః-దేహేంద్రియాదిద్వైతజ్ఞానము, (యతః) ఏకారణమువలన, పరోక్షాద్వైతబుద్ధ్యనుత్=పరోక్ష-పరోక్షత్వమునుబొందిన, అద్వైతబుద్ధి- అద్వితీయజ్ఞానమును, అనుత్-చెరుపునదిగాదో, (అతః) ఆకారణమువలన, శాస్త్రదర్శినః-శాస్త్రదృష్టిగల, శ్రద్ధాళోః-ఆసక్తితోగూడినవానికి. బ్రహ్మమాత్రం-బ్రహ్మముమాత్రము, సువిజ్ఞేయం - లెస్సగాదెలియదగినదగును.

తా. ప్ర. అయితే, దేహేంద్రియాదిగోచరద్వైత భ్రాంతియుండగా, అద్వితీయ బ్రహ్మగోచరమగు పరోక్షజ్ఞానంబు నుదయింపజాలదుగదా? ఉ. అపరోక్షద్వైతభ్రాంతి, ఏకారణమువలన పరోక్షమగు అద్వైత జ్ఞానమునకు విరోధిగాదో, ఆకారణమువలన శాస్త్రదృష్టిగల శ్రద్ధావంతుడగు పురుషునకు బ్రహ్మముమాత్రమే తెలియదగినవస్తువగును. అనగా, అపరోక్షమగు దేహేంద్రియాది ద్వైతభ్రమంబునకు,పరోక్షమగు అద్వైతబ్రహ్మజ్ఞానము, విరోధిగామిచేత, శ్రద్ధావంతుడగుపురుషునకు శాస్త్రమువలన పరోక్షజ్ఞానము పుట్టుచున్నదేనని యభిప్రాయము.

అవ. అపరోక్షద్వైతభ్రమము, పరోక్ష యథార్థజ్ఞానమునకు విరోధిగామియందు, ఇప్పుడు దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ అపరోక్షశిలాబుద్ధిర్నపరోక్షేశతాంనుదేత్।
ప్రతిమాదిషువిష్ణుత్వేకోవావిప్రతిపద్యతే॥ ౧౩.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అపరోక్షశిలాబుద్ధిః=అపరోక్ష - ప్రత్యక్షత్వమునుబొందిన, శిలాబుద్ధిః-శిలాజ్ఞానము, పరోక్షేశతాం=పరోక్ష - పరోక్షత్వమునుబొందిన, ఈశతాం-ఈశ్వరభావమును, నను దేత్- చెరుపదు. ప్రతిమాదిషు - ప్రతిమాదులయందు, విష్ణుత్వేసతి-విష్ణుభావముగలుగుచుండగా, కోవా - ఎవడు, విప్రతిపద్యతే - విరోధమునుబొందును. అనగా శ్రద్ధగలపురుషు డెవ్వడును విరోధి గాడనుట.

తా. శిలను, ఈశ్వరునిగాభావించి పూజించెడి సమయమందు, అపరోక్షశిలాజ్ఞానము, పరోక్షమగు ఈశ్వరభావమును నశింపజేయుటలేదు. మరియు, ప్రతిమాదులయందు విష్ణుభావము గలుగుచుండగా, అందుకు సహింపక విరోధము జేసెడి వాడెవడునులేడు.

శ్లో॥ అశ్రద్ధాళోరవిశ్వాసో నోదాహరణమర్హతి।
శ్రద్ధాళోరేవసర్వత్ర వైదికేష్వధికారతః॥ ౨౪.

టీ. వైదికేషు-వేదోక్తానుష్ఠానములయందు, సర్వత్ర-అంతటను, శ్రద్ధాళోరేవ-శ్రద్ధగలవానికే, అధికారతః-అధికారముగలిగియుండుటవలన, అశ్రద్ధాళోః- శ్రద్ధలేనివానియొక్క, అవిశ్వాసః - నమ్మకములేమి, ఉదాహరణం-ఉదాహరించుటనుగురించి, నార్హతి-తగుచున్నదిగాదు.

తా. ప్ర. అయితే, ప్రతిమాదులయందు విష్ణుత్వబుద్ధిని సహింపక, విరోధము జేయుచుండెడి జనులు కొందరుగలరుగదా?. ఉ. సకల వేదోక్తానుష్ఠానములయందు శ్రద్ధగలపురుషునకే అధికారము గలిగియుండుటవలన, శ్రద్ధలేనివానియొక్క, అవిశ్వాసము, ఇచ్చట నుదహరింపదగినదికాదు. అనగా వేదోక్తానుష్ఠానములయందు నమ్మకము లేనిజనుల నిక్కడ, ఉదహరింపరాదని యభిప్రాయము.

శ్లో॥ సకృదాప్తోపదేశేన పరోక్షజ్ఞానముద్భవేత్।
విష్ణుమూర్త్యుపదేశోహినమీమాంసామపేక్షతే॥ ౨౫.

టీ. సకృదాప్తోపదేశేన=సకృత్-ఒకానొక, ఆప్త-విహితునిచేజేయబడిన, ఉపదేశేన-ఉపదేశముచేత, పరోక్షజ్ఞానం- పరోక్షజ్ఞానము, ఉద్భవేత్ - కలుగును. విష్ణుమూర్త్యుపదేశోహి=విష్ణుమూర్తి-విష్ణుశరీరముయొక్క, ఉపదేశః-ఉపదేశము, మీమాంసాం - ప్రమాణములచేత పదార్థవిచారమును, నాపేక్షతేహి- అపేక్షించదుగదా.

తా. ప్ర. అయితే, యిట్లుచెప్పుటచేత, బరోక్షజ్ఞానమం దేమిగలిగెను?. ఉ. ఒకానొకగురునిచేత జేయబడిన బ్రహ్మోపదేశముచేత, పరోక్షజ్ఞా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నము గలుగుచున్నది. మరియు, లోకమందు, విష్ణుశరీరముయొక్క యుపదేశము, ప్రమాణములచేత పదార్థవిచారము నపేక్షించదు. అనగా విచారణలేకనే, ఉపదేశమాత్రముచేత పరోక్షజ్ఞానము గలుగునని యభిప్రాయము.

శ్లో॥ కర్మోపాస్తీవిచార్యేతే అనుష్ఠేయావినిర్ణయాత్।
బహుశాఖావిప్రకీర్ణేనిర్ణేతుంకః ప్రభుర్నరః॥ ౨౮.

టీ. అనుష్ఠేయావినిర్ణయాత్=అనుష్ఠేయ-అనుష్ఠింపదగిన కర్మోపాసనములయొక్క, అవినిర్ణయాత్-నిర్ణయములేమివలన, కర్మోపాస్తీ-కర్మోపాసనములు రెండును, విచార్యేతే- విచారింపబడుచున్నవి. అనగా విచారింపబడినవనుట. బహుశాఖావిప్రకీర్ణే=బహుశాఖా - అనేకశాఖలయందు, విప్రకీర్ణే-ఎడములేక నిండియున్నకర్మోపాసనములను, అనగా ననేక శాఖలయం దచ్చటచ్చటం జెప్పబడిన కర్మోపాసనములననుట. నిర్ణేతుం-నిర్ణయించుటకు, అనగా ఒకస్థలమందు సంక్షేపముగా జేర్చిచెప్పుటకనుట. నరః-మావంటినరుడు, కః-ఎవడు, ప్రభుః-సమర్థుడగును. అనగా నెవడును సమర్థుడుగాడనుట.

తా. ప్ర. అయితే, శాస్త్రములయందు, ఎందువలన విచారములుజేయబడినవో చెప్పుము?. ఉ. అనుష్ఠింపదగిన కర్మోపాసనలయొక్క నిర్ణయములేని కారణమువలన, సందేహము గలుగుటచేత, ఆ యనుష్ఠింపదగిన కర్మోపాసనములను నిర్ణయించుటకొరకు, శాస్త్రములయందు కర్మోపాసనములు రెండును విచారింపబడినవి. ప్ర. అయితే, సందేహము గలుగుటకు గారణమేమి?. ఉ. అనేకములగు వేదశాఖలయందు అచ్చటచ్చటం జెప్పబడిన కర్మమునైనను, ఉపాసనమునైనను ఒకస్థలమందు సంగ్రహించి నిర్ణయించుటకు, మావంటినరుడెవ్వడును సమర్థుడుగాడు.

శ్లో॥ నిర్ణీతోర్థఃకల్పసూత్రైర్గ్రథితస్తావతాస్తికః।
విచారేణవినాకర్మశక్తోనుష్ఠాతుమంజసా॥ ౨౯.

టీ. నిర్ణీతః-పూర్వాచార్యులచేత నిశ్చయింపబడిన, అర్థః - అనుష్ఠాన ప్రకారము, కల్పసూత్రైః-కల్పసూత్రములచేత, గ్రంథితః-కూర్చబడెను. తావతా-అట్లుకూర్చబడుటచేత; ఆస్తికః - పూర్వాచార్యులయందు విశ్వాసము గలపురుషుడు, విచారేణవినా-విచారములేక, కర్మ-కర్మమును, అంజసా- యథావిధిగా, అనుష్ఠాతుం-అనుష్ఠానము జేయుటకు, శక్తః-సమర్థుడగును.

తా. ప్ర. అయితే, కర్మోపాసనములకు అనుష్ఠింపదగమియే, ప్రాప్తించెనుగదా?. ఉ. జైమిని మొదలగు పూర్వాచార్యులచేత నిశ్చయింపబడిన అనుష్ఠానప్రకారము, కల్పసూత్రములచేత జెప్పబడెను. ఆజైమిన్యాదిపూర్వా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చార్యులచేత అట్లు చెప్పబడుటవలననే, వారియందు విశ్వాసము గల పురుషుడు, విచారమును విడిపించియు, కర్మమును యథావిధిగా ననుష్ఠించుటకు సమర్థుడగును.

శ్లో॥ ఉపాస్తీనామనుష్ఠానమార్షగ్రంథేషువర్ణితం।
విచారాక్షమమర్త్యాశ్చ శ్రుత్వోపాసతేగురోః॥ ౨౮.

టీ. ఉపాస్తీనాం- ఉపాసనములయొక్క, అనుష్ఠానం-అనుష్ఠానప్రకారము, ఆర్షగ్రంథేషు-బ్రాహ్మవాసిష్ఠాదిమంత్రకల్పములయందు, వర్ణితం- వర్ణింపబడెను. విచారాక్షమమర్త్యాశ్చ=విచార-విచారము జేయుటకు,అక్షమ-సమర్థులుగాని, మర్త్యాశ్చ-మనుష్యులును, తత్- ఆయుపాసనమును, గురోః-గురువువలన, శ్రుత్వా-విని, అనగా దెలిసికొనియనుట. ఉపాసతే - ఉపాసనము జేయుచున్నారు.

తా. ప్ర. అయితే, ఆకల్పసూత్రములయందు ఉపాసనావిచారములేమివలన, ఆయుపాసనానుష్ఠానము సంభవింపదుగదా?. ఉ. బ్రాహ్మవాసిష్ఠాది మంత్రకల్పములయందు, ఉపాసనముయొక్క అనుష్ఠానపద్ధతి, వర్ణింపబడెను. అందువలన విచారము జేయుటకు సమర్థులుగానిమనుష్యులు కల్పములయందు జెప్పబడిన ఆయుపాసనమును గురుముఖమువలన దెలిసికొని, అనుష్ఠానము జేయుచున్నారు.

శ్లో॥ వేదవాక్యానినిర్ణేతు మిచ్ఛన్మీమాంసతాంజనః।
ఆప్తోపదేశమాత్రేణహ్యనుష్ఠానంహిసంభవేత్॥ ౨౯.

టీ. జనః-జనము, వేదవాక్యాని-వేదవాక్యములను, నిర్ణేతుం-నిర్ణయించుటకు, మీమాంసతాం - ప్రమాణములచేత పదార్థ విచారత్వమును గురించి, ఇచ్ఛతు-ఇచ్ఛను జేయుచున్నది. ఆప్తోపదేశమాత్రేణహి= ఆప్త-గురునియొక్క, ఉపదేశమాత్రేణహి- ఉపదేశమాత్రముచేతనే, అనుష్ఠానం- ఉపాసనానుష్ఠానము, సంభవేత్-కలుగును. హి-ప్రసిద్ధమనుట.

తా. ప్ర. అయితే, ఆధునికులగు గ్రంథకర్తలచేతగూడ, వేదవాక్యవిచారమెందువలన జేయబడుచున్నదోచెప్పుము?. ఉ. ఇప్పటిజనము, తమతమ బుద్ధికి సంతోషముగలుగుటకొరకే, వేదవాక్యములను నిర్ణయించుటకు విచారమును జేయుట కిచ్ఛయించుచున్నదేగాని, అనుష్ఠాన సిద్ధికొరకుగాదని తెలియవలెను. కనుక గురూపదేశమాత్రముచేత ఉపాసనానుష్ఠానము సిద్ధించును.

శ్లో॥ బ్రహ్మసాక్షాత్కృతిస్త్వేవం విచారేణవినానృణాం।
ఆప్తోపదేశమాత్రేణనసంభవతికుత్రచిత్॥ ౩౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. నృణాం-జనులకు, బ్రహ్మసాక్షాత్కృతిస్తు - బ్రహ్మసాక్షాత్కారమో, అనగా నపరోక్షజ్ఞానమనుట. విచారేణవినా - తత్త్వంపదార్థవిచారము చేతదప్ప, ఏవం-ఈప్రకారము, అనగా నుపాసనానుష్ఠానమునకు ఉపయోగియైన పరోక్షజ్ఞానమువలెననుట. ఆప్తోపదేశమాత్రేణ=ఆప్త - అప్తునియొక్క, ఉపదేశమాత్రేణ-ఉపదేశమాత్రముచేత, కుత్రచిత్ - ఎచ్చటను, నసంభవతి-సంభవింపదు.

తా. ప్ర. అయితే, ఉపదేశమాత్రముచేత బ్రహ్మోపాసనము సిద్ధించినట్లు, ఉపదేశమాత్రమువలననే బ్రహ్మసాక్షాత్కారరూపము గల అపరోక్షజ్ఞానంబును సిద్ధింపదాయేమి?. ఉ. గురువు ఉపదేశించిన మాత్రముచేత ఉపాసనా నుష్ఠానమునకు ఉపయోగించెడి పరోక్షజ్ఞానము పుట్టుచున్నది. బ్రహ్మసాక్షాత్కార రూపము గల అపరోక్షజ్ఞానమో, విచారముచేత తప్ప, గురూపదేశమాత్రముచేత ఎప్పటికిని గలుగదని చెప్పబడెను.

అవ. అందుకు కారణము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ పరోక్షజ్ఞానమశ్రద్ధా ప్రతిబధ్నాతి నేతరత్।
అవిచారోఽపరోక్షస్యజ్ఞానస్యప్రతిబంధకః॥ ౩౧.

టీ. అశ్రద్ధా-అశ్రద్ధ, పరోక్షజ్ఞానం-పరోక్షజ్ఞానమును, ప్రతిబధ్నాతి-ప్రతిబంధించుచున్నది. ఇతరత్-అవిచారము, న-ప్రతిబంధించుచున్నదిగాదు. అపరోక్షస్య-అపరోక్షమగు, జ్ఞానస్య-జ్ఞానమునకు, అవిచారః- అవిచారము, ప్రతిబంధకః - ప్రతిబంధించునదగును.

తా. ఏకారణమువలన అవిశ్వాసమే పరోక్షజ్ఞానమును ప్రతిబంధించుచున్నదో, అవిచారము ప్రతిబంధించుచున్నదిగాదో, ఆకారణమువలన, ఆయవిశ్వాసము నివర్తించుచుండగా నాకానాకప్పుడు గురూపదేశమువలననే పరోక్షజ్ఞానము ఉదయించుచున్నది. మరియు, అవిచారముచేత ప్రతిబంధింపదగిన అపరోక్షజ్ఞానమునకో, తత్త్వంపదార్థవిచారద్వారా, ఆప్రతిబంధము నివర్తించుచుండగా, ఉత్పత్తిగలుగుచున్నదేగాని, ప్రతిబంధము నివర్తించనియెడల అపరోక్షజ్ఞానోత్పత్తిగాదు. ఆకారణమువలన తత్త్వంపదార్థవిచారము జేయదగినదని యభిప్రాయము.

శ్లో॥ విచార్యాప్యపరోక్షేణబ్రహ్మాత్మానంనవేత్తిచేత్।
ఆపరోక్ష్యావసానత్వాద్భూయోభూయోవిచారయేత్॥ ౩౨.

టీ. విచార్యాపి-తత్త్వంపదార్థములను విచారించియు, అపరోక్షేణ-అపరోక్షత్వముచేత, బ్రహ్మాత్మానం=బ్రహ్మ - పరబ్రహ్మమగు, ఆత్మానం-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రత్యగాత్మను, అనగా తననునుట. నశక్తిచేత్-ఎరుగనియెడల, ఆపరోక్ష్యావసానత్వాత్=అపరోక్ష్య-అపరోక్షత్వమే, అవసానత్వాత్- అంత్యముగాగలదగుటవలన, భూయోభూయః- మరలమరల, విచారయేత్ - విచారించవలెను. అనగా తత్త్వంపదార్థ విచారము జేయవలెననుట.

తా. ప్ర. అయితే, విచారము జేయబడినను, ఎప్పుడు అపరోక్షజ్ఞానమకలుగదో, అప్పుడు, ఏమిచేయదగినదో చెప్పుము?. ఉ. తత్త్వంపదార్థములను లెస్సగా విచారించినను వాక్యార్థమగు, బ్రహ్మాత్మైకత్వమును, అపరోక్షముగానెరుగనియెడల, అపరోక్షజ్ఞానోత్పత్తియే విచారమునకు, అవధియగుటచేత, మరల మగల తత్త్వంపదార్థవిచారమేచేయదగినదగును. అనగా నపరోక్షజ్ఞానమును గలిగించుటకు విచారముతప్ప, మరియొక హేతువు లేమిచేత మరల మరల విచారమే చేయదగినదగునని యభిప్రాయము.

శ్లో॥ విచారయన్నామరణం నైవాత్మానంలభేతచేత్।
జన్మాంతరేలభేతైవ ప్రతిబంధక్షయేసతి॥ ౩౩.

టీ. ఆమరణం-మరణముగలిగెడిపర్యంతము, విచారయన్-విచారమును జేయుచు, ఆత్మానం-బ్రహ్మరూపమగు ప్రత్యగాత్మను, నైవలభేతచేత్-పొందనివాడైనయెడల. జన్మాంతరే-మరియొకజన్మమందు, ప్రతిబంధక్షయేసతి=ప్రతిబంధ-ప్రతిబంధమునకు, క్షయేసతి - నాశముగలుగుచుండగా, లభేతైవ-పొందును.,

తా. ప్ర. అయితే, మరలమరల విచారము జేయుటచేత, ఈజన్మమందు బ్రహ్మసాక్షాత్కారము గలుగకపోవుచుండగా, విచారము వ్యర్థముగాదాయేమి?. ఉ. దేహమునకు మరణముగలిగెడి పర్యంతము తత్త్వంపదార్థవిచారమును జేసినను ప్రతిబంధబాహుళ్యమువలన బ్రహ్మస్వరూపమగు ప్రత్యగాత్మనుపొందనియెడల, మరియొక జన్మమందు ప్రతిబంధము క్షయించుచుండగా, పొందుచున్నవాడేయగును. కనుక, విచారము వ్యర్థముగాదు.

శ్లో॥ ఇహవాఽముత్రవావిద్యేత్యేవంసూత్రకృతోదితం।
శృణ్వంతోప్యత్రబహవో యన్నవిద్యురితిశ్రుతిః॥ ౩౪.

టీ. ఇహవా-ఈజన్మమందైనను, అముత్రవా-పరజన్మమందైనను, విద్యేతి-అపరోక్షజ్ఞానోదయమగునని, ఏవం- పూర్వోక్తప్రకారము, సూత్రకృతా-బ్రహ్మసూత్రకారుడగు వ్యాసునిచేత, ఉదితం-చెప్పబడెను. అత్ర - ఈజన్మమందు, బహవః-అనేకులు, శృణ్వంతోపి - శ్రవణాదికమును చేసినవారైనను, అనగా తత్త్వంపదార్థవిచారమును జేసినవారైననునుట. యత్-ఏబ్రహ్మమును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవిద్యురితి- ఎరుగజాలరోయని, శ్రుతిః-శ్రుతిచెప్పుచున్నది.

తా. ప్ర. అయితే, ఈయర్థము దేనివలన దెలియబడుచున్నదో చెప్పుము?. ఉ. ప్రతిబంధక్షయమగుచుండగా, ఈ జన్మమందైనను, పరజన్మమందైనను అపరోక్షజ్ఞానోదయమగునని, పూర్వోక్తార్థము, సూత్రం ॥ ఐహికమప్యప్రసుతప్రతిబంధేతద్దర్శనాత్॥ అనెడి ఈసూత్రమందు బ్రహ్మసూత్రకారుడగు వ్యాసమహామునిచేత జెప్పబడెను. మరియు, ప్రతిబంధముగలిగియుండగా, ఈ జన్మమందు అపరోక్షజ్ఞానము గలుగదని, శ్రు॥ శృణ్వంతోప్యత్రబహవో యన్నవిద్యుః॥ అనెడి శ్రుతియుం జెప్పుచున్నది.

అవ. ఈజన్మమందు శ్రవణాదికమును జేసినవానికి, జన్మాంతరమందు అపరోక్షజ్ఞానము గలుగుచున్నదనెడి విషయమై, శ్రు॥ గర్భేనుసన్నన్వేషామవేదమహేదేవానాంజనిమానివిశ్వ॥ ఇత్యాది శ్రుత్యర్థము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ గర్భఏవశయానస్సన్ వామదేవోవబుద్ధవాన్।
పూర్వాభ్యస్తవిచారేణ యద్వదధ్యయనాదిషు॥ ౩౫.

టీ. అధ్యయనాదిషు-అధ్యయనాదులయందు, యద్వత్- ఏప్రకారమో, (తద్వత్) ఆప్రకారము, పూర్వాభ్యస్తవిచారేణ=పూర్వ- పూర్వజన్మమందు, అభ్యస్త-అభ్యసింపబడిన, విచారేణ - తత్త్వంపదార్థ విచారముచేత, వామదేవః-వామదేవుడు, గర్భఏవ-గర్భమందే, శయానస్సన్ - పండుకొనినవాడగుచు, అవబుద్ధవాన్-పరతత్వము నెరిగినవాడాయెను. అనగా బ్రహ్మసాక్షాత్కారముగలవాడాయెననుట.

తా. అధ్యయనాదులయందు వలెనే, పూర్వ జన్మమందు జేయబడిన తత్త్వంపదార్థవిచారముచేత వామదేవుడు, గర్భమందేయున్నవాడగుచు, బ్రహ్మసాక్షాత్కారరూపముగల అపరోక్షజ్ఞానమును బొందెనని, శ్రుతియందు వినబడుచున్నది.

అవ. పూర్వోక్తదృష్టాంతము నిప్పుడు వివరించి చెప్పుచున్నాడు.

శ్లో॥ బహువారమధీతేపియదానాయాతిచేత్పునః।
దినాంతరేఽనధీత్యైవ పూర్వాధీతం స్మరేత్పుమాన్॥ ౩౬.

టీ. (వేదే) వేదము, బహువారం - అనేకదినములయం దెల్లప్పుడును, అధీతేపి-చదువబడినను, యదానాయాతిచేత్-ఎప్పుడురాదో అప్పుడు, అనగా ముఖస్థముగానియప్పుడనుట. పుమాన్-పురుషుడు, దినాంతరే - మరియొకదినమందు, పునః- మరల, అనధీత్యైవ-చదువకనే, పూర్వాధీతం= పూర్వ-పూర్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మందు, అధీతం-చదువబడినదానిని, స్మరేత్- స్మరించును.

తా. వేదమనేకదినములయం దెల్లప్పుడునుచదువబడినను, ముఖస్థముగా కపోవుచుండగా, పురుషుడు మరియొకదినమందు మరలవేదమునుచదువకనే, పూర్వమందు జదువబడినదానిని స్మరించుచున్నాడు.

అవ. ఆదిపదముచేత గ్రహింపబడెడి యితర దృష్టాంతములం జెప్పుచున్నాడు.

శ్లో॥ కాలేనపరిపచ్యంతేకృషిగర్భాదయోయథా।
తద్వదాత్మవిచారోపిశనైఃకాలేనపచ్యతే॥ ౩౭.

టీ. కృషిగర్భాదయః=కృషి - కృషియు, గర్భాదయః - గర్భాదులును, యథా-ఏప్రకారము, కాలేన-కాలముచేత, పరిపచ్యంతే - పరిపక్వమునుబొందుచున్నవో, తద్వత్-ఆప్రకారము, ఆత్మవిచారోపి- ఆత్మవిచారంబును, కాలేన - తగినకాలముచేత, శనైః - మెల్లగా, పచ్యతే - పరిపక్వమును బొందుచున్నది.

తా. మరియు, కృషిగర్భాదులు, ఏప్రకారముగా యోగ్యకాలముచేత పరిపక్వమునుబొందుచున్నవో, ఆప్రకారమే, ఆత్మవిచారంబును యోగ్యకాలముచేత మెల్లగా పరిపక్వమును బొందుచున్నదని తెలియవలెను.

అవ. పరతత్వము బహుకాలము విచారింపబడినను, ప్రతిబంధబలము వలన బ్రహ్మసాక్షాత్కారముగాదనెడి ఈ యర్థము, వార్తికకారులచేత నిరూపింపబడినదని, చెప్పుచున్నాడు.

శ్లో॥ పునఃపునర్విచారేపి త్రివిధప్రతిబంధతః।
నవేత్తితత్వమిత్యేతద్వార్తికేసమ్యగీరితం॥ ౩౮.

టీ. (పురుషః) పురుషుడు, పునఃపునః- మాటిమాటికిని, అనగా బహుకాలపర్యంతమనుట. విచారేపి-పరతత్వవిచారమును జేసినను, త్రివిధప్రతిబంధతః=త్రివిధ-త్రివిధమగు, ప్రతిబంధతః- ప్రతిబంధమువలన, తత్వం-బ్రహ్మాత్మైకత్వమును, నవేత్తితి-ఎరుగడనెడి, ఏతత్--ఈయర్థము, వార్తికే- వార్తికమనెడిగ్రంథమందు, సమ్యక్-లెస్సగా, ఈరితం- సురేశ్వరాచార్యులచేత జెప్పబడెను.

తా. బహుకాలము తత్త్వంపదార్థ విచారమును జేసినను, మూడువిధములుగానుండెడి ప్రతిబంధమువలన, పురుషుడు పరతత్వము నెరుగడనెడి, ఈయర్థము, వార్తికకారులగు సురేశ్వరాచార్యులచేత వార్తికమనెడి గ్రంథమందు చక్కగా జెప్పబడినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. అవార్తికకారులయొక్క ఏడువార్తికముల నిప్పుడు క్రమముగా నుదాహరించుచున్నాడు.

శ్లో॥ కుత స్తజ్జ్ఞానమితిచే త్తద్ధిబంధపరిక్షయాత్।
అసావపిచ భూతోవా భావీవావర్తతేథవా॥ ౩౯.

టీ. తజ్జ్ఞానం- ఆజ్ఞానము, కుతఇతిచేత్- ఏకారణమువలన బుట్టుననియంటివేని, తత్-ఆజ్ఞానము, బంధపరిక్షయాత్=బంధ-ప్రతిబంధముయొక్క, పరిక్షయాత్-నాశమువలనబుట్టుచున్నది. హి-ఇదిశ్రుత్యాదిప్రసిద్ధమనుట. అసావపిచ-ఈప్రతిబంధంబును, భూతోవా-భూతప్రతిబంధమనియు, భావీవా-భావిప్రతిబంధమనియు, వర్తతేథవా-వర్తమానప్రతిబంధమనియుం జెప్పబడును.

తా. ప్ర. అయితే, పూర్వమందుదయించని యపరోక్షజ్ఞాన మిప్పుడు ఉదయించుటయందు గారణమేమి?. ఉ. ప్రతిబంధమునకు నాశముగలుగుచుండగా ఆజ్ఞానము ఉదయించుచున్నది. ఈప్రతిబంధము, ౧. భూతప్రతిబంధమనియు, (అనగా నింతకుపూర్వము గడచినదనుట.) ౨. వర్తమానప్రతిబంధమనియు, (అనగానిప్పుడు వర్తించుచున్న దనుట.) ౩. భావిప్రతిబంధమనియు, (అనగానికను జరుగగలదనుట.) ఇట్లు మూడువిధములుగా నున్నదని తెలియవలెను.

శ్లో॥ అధీతవేదవేదార్థోప్యతఏవనముచ్యతే।
హిరణ్యనిధిదృష్టాంతా దిదమేవహిదర్శితం॥ ౪౦.

టీ. అతఏవ-ప్రతిబంధస్థితివలనసే, అధీతవేదవేదార్థోపి=అధీత-చదువబడిన, వేద-వేదములును, వేదార్థోపి-వేదార్థమునుగలవాడైనను, నముచ్యతే-సంసారబంధమువలన విడువబడడు. ఇదమేవహి--ఈయర్థమే, హిరణ్యనిధిదృష్టాంతాత్-సువర్ణనిధిదృష్టాంతమువలన, దర్శితం-శ్రుతియందు జూపబడెను.

తా. ప్ర. సరి. ఇట్లు త్రివిధప్రతిబంధముండుగాక. అందుచేత నేమి?. ఉ. సకలవేదవేదార్థములను జదివినవాడైనను, ప్రతిబంధస్థితివలన మోక్షమును బొందడు. మరియు, ప్రతిబంధముండగా జ్ఞానము ఉదయించదనెడి ఈ యర్థము. సువర్ణనిధి, భూమిలోపల స్థాపింపబడియుండగా, నిధిశాస్త్రములచేత ఆసువర్ణనిధిస్థానము నెరుగనిజనులు, ఆసువర్ణనిధికి పైపైన సంచరించుచున్నవారగుచుండియు, ఆసువర్ణనిధి నెరుగనట్లు, ఈ యవిద్యావంతులగు ప్రజలందరును, పూర్వోక్తహృదయాకాశమనెడిపేరుగల బ్రహ్మమనెడి లోకమునుగురించి సుషుప్తికాలమందు ప్రతిదినమందును పోవుచుండియు, అవిద్యాదిదోషములచేత బాహ్యమునకు వెళ్ళగొట్టబడినవారగుచు, (ఈనేనిప్పుడు బ్రహ్మమ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెడి లోకభావమునుబొందినవాడనైతినని) పొందినవారుగారని, హిరణ్యనిధిదృష్టాంతముచేత, శ్రు॥ యథాహిరణ్యనిధిం నిహితమక్షేత్రజ్ఞా ఉపర్యుపరి సంచరంతోనవిందేయు ఏవమేవేమాస్సర్వాః ప్రజాః అహరహ ర్బ్రహ్మలోకంగచ్ఛంత్యేతం బ్రహ్మలోకంనవిందంత్యనృతేనహి ప్రత్యూఢాః॥ అనెడి ఛాందోగ్య శ్రుతిచేత జూపబడెనని తెలియవలెను.

శ్లో॥ అతితేనాపిమహిషీస్నేహేనప్రతిబంధతః।
భిక్షుస్తత్త్వం నవేదేతి గాథాలోకేప్రతీయతే॥ ౪౧.

టీ. భిక్షుః-సన్యాసి, అతీతేన-పూర్వమందుండెడి, మహిషీస్నేహేన=మహిషీ-ఎనుమునందుగల, స్నేహేన-స్నేహముచేత, ప్రతిబంధతోపి- ప్రతిబంధమువలనను, తత్త్వం-బ్రహ్మైకత్వలక్షణమును, నవేదేతి - ఎరుగడనెడి, గాథా-చరిత్రము, లోకే-లోకమందు, అనగా పురాణాదులయందనుట. ప్రతీయతే-ప్రసిద్ధినిబొందియున్నది. అనగా బఠింపబడుచున్నదనుట.

తా. ప్ర. అయితే, పూర్వమందు జరిగినదానికి బంధకత్వము గనబడలేదేమి?. ఉ. ఒకానొకయతి, పూర్వము గృహస్థసంబంధదశయందు, ఒకానొకయెనుమునందుస్నేహముంచి, పిమ్మట సన్యాసానంతరమందు వేదాంతశ్రవణమందు బ్రవర్తించినవాడైనను, ఆమహిషీస్నేహముచేత, గలిగిన ప్రతిబంధమువలన (ఆయెనుము యతికిస్ఫురించుటచేత) పరతత్త్వముగురునిచేత నుపదేశింపబడినను, ఎరుగనివాడాయెననెడి, ఈవిధమైనచరిత్రను, పురాణాదులయందు బఠింపబడుచున్నది. కనుక, భూతప్రతిబంధమిట్టిదని తెలియవలెను.

శ్లో॥ అనుసృత్యగురుస్స్నేహంమహిష్యాంతత్త్వముక్తవాన్।
తతోయథావద్వేదైష ప్రతిబంధస్యసంక్షయాత్॥ ౪౨.

టీ. గురుః-తత్త్వోపదేశమును జేసెడివాడు, స్నేహం-ఆయతిసంబంధమహిషీస్నేహమును, అనుసృత్య-అనుసరించి, మహిష్యాం- ఆయెనుమునందుగల, తత్త్వం-ఆయెనుమును ఉపాధిగాగల బ్రహ్మమును, ఉక్తవాన్ - చెప్పినవాడాయెను. తతః-అనంతరమందు, ఏషః-ఈయతి, ప్రతిబంధస్య- మహిషీస్నేహలక్షణప్రతిబంధము, సంక్షయాత్-క్షయించుటవలన, యథావత్-శాస్త్రోక్తప్రకారముగా, వేద-గురునిచేనుపదేశింపబడిన తత్త్వమునెరిగెను.

తా. ప్ర. అయితే, అట్టివంటివానికి జ్ఞానోత్పత్తి, ఎట్లగునోచెప్పుము?. ఉ. ఆయతికి, తత్త్వోపదేశము జేసెడిగురుడు, ఆతని సంబంధమహిషీస్నేహమును ననుసరించి, ఆయెనుమునుపాధిగా గలిగి, ఆయెనుమునందుండెడి బ్రహ్మమునుపదేశించినవాడాయెను. అంతట, ఆయతియు, తాను నేత్రములుమూసికొని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధ్యానముచేసెడికాలమందు బుద్ధికి ప్రతిబంధమువలన సాక్షాత్కరించెడియెను మునందుగల బ్రహ్మమును గురువు జెప్పిన ప్రకారము ధ్యానించుచుండగా, ఆప్రతిబంధము క్షయించెను. అట్లు ప్రతిబంధము క్షయించుటచేత, గురునిచే నుపదేశింపబడిన పరతత్వమును శాస్త్రోక్తప్రకారముగానే, యెరిగినవాడా యెను.

అవ. ఇట్లు, భూతప్రతిబంధమునుదెలిపి, వర్తమానప్రతిబంధము నిప్పు డు జూపుచున్నాడు.

శ్లో॥ ప్రతిబంధోవర్తమానో విషయాసక్తిలక్షణః।
ప్రజ్ఞామాంద్యంకుతర్కశ్చ విపర్యయదురాగ్రహః॥ ౪౩.

టీ. వర్తమానః-వర్తమానమనెడి, ప్రతిబంధః-ప్రతిబంధము, విషయా సక్తిలక్షణః=విషయ-స్రక్చందనవనితాదులయందుగల, ఆసక్తి-ఆసక్తియే, లక్ష ణః-రూపముగాగలదగును. ప్రజ్ఞామాంద్యంచ = ప్రజ్ఞా-బుద్ధియొక్క, మాం ద్యంచ-మందస్వభావంబును, అనగా బుద్ధికి తీక్ష్ణత్వము లేమియనుట. కుత ర్కశ్చ-కుత్సితతర్కంబును, అనగా శుష్కతార్కికత్వముచేత శ్రుత్యర్థమున న్యవిధముగా నూహించుటయనుట. విపర్యయదురాగ్రహశ్చ = విపర్యయ- ఆత్మకు కర్తృత్వాదిధర్మయుక్తత్వజ్ఞానలక్షణమందు, దురాగ్రహశ్చ- యుక్తి రహితనిశ్చయంబును, ప్రతిబంధః-వర్తమానప్రతిబంధమగును.

తా. మరియు, వర్తమానప్రతిబంధము, ౧. విషయాసక్తిరూపముగల దగును. మరియు, ౨. బుద్ధిమాంద్యత్వంబును, ౩. కుతర్కము జేయుటయు, అనగాశుష్కతార్కికత్వముచేత శ్రుత్యర్థమునన్యవిధముగా నూహించుటయు, ౪. ఆత్మకు కర్తృత్వాది ధర్మయుక్తత్వజ్ఞానలక్షణమందు యుక్తిరహిత నిశ్చ యంబును, ఈనాలుగును వర్తమానప్రతిబంధమని చెప్పబడును.

శ్లో॥ శమాద్యైశ్శ్రవణాద్యైశ్చతత్రతత్రోచితైఃక్షయం।
నీతేఽస్మిన్ప్రతిబంధేఽతస్స్వస్యబ్రహ్మత్వమశ్నుతే॥ ౪౪.

టీ. శమాద్యైః-శమదమాదులచేతను, శ్రవణాద్యైశ్చ - శ్రవణమనననిది ధ్యాసములచేతను, తత్రతత్ర-ఆయాసాధనములయందు, ఉచితైః- యోగ్యము లైన సాధనములచేత, అస్మిన్-ఈ, ప్రతిబంధే-ప్రతిబంధము, క్షయం - నాశ మును, నీతేసతి-పొందుచుండగా, అతః-ప్రతిబంధనాశమువలన, స్వస్య- ప్ర త్యగాత్మయగు తనకు, బ్రహ్మత్వం - బ్రహ్మత్వమును, అశ్నుతే - పొందుచు న్నాడు.

తా. ప్ర. అయితే, ఈప్రతిబంధమునకు దేనిచేత నివృత్తిగలుగునోచె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ష్వము?. ఉ. శ్రు॥ శాంతోదాంతఉపరతస్తితిక్షుస్సమాహితోభూత్వా॥ అనెడి శ్రుతిచేజెప్పబడిన, ౧. శమము, దమము, ౩. ఉపరతి, ౪. తితిక్ష ౫. సమాధి, ౬. శ్రద్ధలనెడి, ఈయారుసాధనములయందును, మరియు, శ్రు ॥ శ్రోతవ్యో మంతవ్యోనిదిధ్యాసితవ్యః॥ అనెడి శ్రుతిచేదెలుపబడిన, ౧. వేదాంతార్థశ్రవణము, ౨. మననము, ౩. నిదిధ్యాసములనెడి, ఈ సాధనములయందును, యోగ్యములైన సాధనములచేత ఆయాప్రతిబంధము నాశమును బొందుచుండగా, అట్లు ప్రతిబంధనాశమువలననే, ప్రత్యగాత్మయగుతాను, బ్రహ్మత్వమును బొందుచున్నాడు. అనగా, శమదమాదిషట్కసంపత్తిచేత విషయాసక్తిరూప ప్రతిబంధము నశించుననియు, వేదాంతార్థ శ్రవణముచేత ప్రజ్ఞామాంద్యము నశించుననియు, వేదాంతార్థమననముచేత, కుతర్కము నశించుననియు, నిదిధ్యాసముచేత విపర్యయదురాగ్రహము నశించుననియు, ఇట్లు నాలుగువిధములుగానుండెడి వర్తమానప్రతిబంధమునశించుచుండగా, అపరోక్ష జ్ఞానోదయమగునని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, భావిప్రతిబంధమును జూపుచున్నాడు.

శ్లో॥ ఆగామిప్రతిబంధశ్చవామదేవే సమీరితః।
ఏకేనజన్మనాక్షీణోభరతస్యత్రిజన్మభిః॥ ౪౫.

టీ. ఆగామిప్రతిబంధశ్చ-భావిప్రతిబంధము, అనగా జన్మాంతరహేతువగు ప్రారబ్ధవిశేషమనుట. వామదేవే-వామదేవునియందు. సమీరితః-చెప్పబడెను. (సః) ఆభావిప్రతిబంధము, (వామదేవస్య) వామదేవునకు,ఏకేన-ఒక్కటియగు, జన్మనా-జన్మముచేత, క్షీణః-నాశమునుబొందెను. భరతస్య- జడభరతునకు, త్రిజన్మభిః-మూడుజన్మములచేత, క్షీణః - నాశమునుబొందెను.

తా. భావిప్రతిబంధమనునది, మరియొకజన్మమును గలిగించుటకుహేతువగు ప్రారబ్ధకర్మవిశేషమగును. ఆభావిప్రతిబంధము వామదేవునకు ఒకజన్మముచేత క్షయించినదనియు, జడభరతునకు మూడుజన్మములచేత క్షయించినదనియుంజెప్పబడినది. అనగా, ఆభావిప్రతిబంధమునకు భోగముచేతతప్ప, మరియొకదానిచేత నివృత్తిలేమివలన, ఆభావిప్రతిబంధ నివృత్తియందు కాలనియమములేదని యిట్లువార్తికమందు సురేశ్వరాచార్యులచేత జెప్పబడెననియభిప్రాయము.

శ్లో॥ యోగభ్రష్టస్యగీతాయామతీతేబహుజన్మని।
ప్రతిబంధక్షయఃప్రోక్తోనవిచారోప్యనర్థకః॥ ౪౬.

టీ. గీతాయాం-శ్రీగీతాశాస్త్రమందు, యోగభ్రష్టస్య - యోగభ్రష్టు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకు, అనగా బ్రహ్మసాక్షాత్కారపర్యంతముతత్త్వంపదార్థ విచారములేనివా నికనుట. బహుజన్మని- అనేకజన్మసముదాయము, అతీతేసతి - గడచిపోవుచుం డగా, ప్రతిబంధక్షయః=ప్రతిబంధ-భావిప్రతిబంధమునకు, క్షయః - నాశము, ప్రోక్తః-చెప్పబడెను. విచారోపి-పరతత్వవిచారంబును, అనర్థకః- వ్యర్థత్వము నుబొందినది, న-కాదు.

తా. ప్ర. అయితే, ఒకటిరెండు జన్మములచేత క్షయించుచున్నదని, ఆభావిప్రతిబంధమునకు మీచేతనే నియతకాలత్వము జెప్పబడెనుగదా?. ఉ. బ్రహ్మసాక్షాత్కారపర్యంతము తత్వవిచారమును జేయనివానికి, అనేకజన్మ ములుగలిగినపిమ్మట, ఆభావిప్రతిబంధము క్షయించుచున్నదని, శ్రీగీతాశా స్త్రమందుజెప్పబడెను. గనుక, ఆభావిప్రతిబంధ క్షయమునకు కాలనియమము లేదని తెలియవలెను. ప్ర. అయితే, ఆభావిప్రతిబంధముచేత బ్రహ్మసాక్షా త్కారరూపముగల అపరోక్షజ్ఞానముగలుగనియెడల, తత్వవిచారము నిష్ఫల ముగలదిగాదాయేమి?. ఉ. ఆప్రతిబంధము నివర్తించినవెంటనే, అపరోక్షజ్ఞా నలక్షణఫలము గలుగుచుండుటవలన, తత్వవిచారంబును వ్యర్థత్వమునుబొంద దని తెలియవలెను.

అవ. ఆగీతాశాస్త్రమందు ప్రతిపాదింపబడిన అర్థమునుజూపుచున్నాడు.

శ్లో॥ ప్రాప్యపుణ్యకృతాంలోకానాత్మతత్వవిచారతః।
శుచీనాంశ్రీమతాంగేహేసాభిలాషోభిజాయతే॥ ౪౭.

టీ. (యోగభ్రష్టః) బ్రహ్మసాక్షాత్కారపర్యంతము తత్వవిచారము నుజేయనివాడు, ఆత్మతత్వవిచారతః=ఆత్మతత్వ - ఆత్మస్వరూపముయొక్క, విచారతః-విచారబలమువలన, పుణ్యకృతాం=పుణ్య- అశ్వమేధాది పుణ్యకర్మ ములను, కృతాం-చేసినవారియొక్క, లోకాన్-స్వర్గవిశేషములను, ప్రాప్య- పొంది, అనగా నచ్చట బహుకాలము సుఖముననుభవించియనుట. సాభిలాష శ్చేత్-ఇచ్ఛతోగూడినవాడైనయెడల, శుచీనాం - పరిశుద్ధులగు, శ్రీమతాం- శ్రీమంతులగువారియొక్క, గేహే-గృహమందు, అనగా కులమందనుట. అభి జాయతే- పుట్టుచున్నాడు.

తా. ఆయోగభ్రష్టుడు=అనగా బ్రహ్మసాక్షాత్కారపర్యంతము విచా రములేనివాడు, ఇచ్ఛతోగూడినవాడైనయెడల ఆత్మతత్వ విచారబలముచేతనే, అశ్వమేధాదియజ్ఞములను జేసిన పుణ్యపురుషులుబొందెడి స్వర్గవిశేషములను బొంది, అచ్చట బహుకాలము సుఖములననుభవించి, ఆభోగాంత్యమందు, ఈమనుష్యలోకములో మాతా పితరులవలన పరిశుద్ధులగు, శ్రీమంతులయొక్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కులమందుబుట్టుచున్నాడు.

అవ. ఇప్పుడు మరియొకపక్షమును జెప్పుచున్నాడు.

శ్లో॥ అథవాయోగినామేవ కులేభవతిధీమతాం।
నిస్పృహోబ్రహ్మతత్త్వస్యవిచారాత్తద్ధిదుర్లభం॥ ౪౨.

టీ. అథవా-అట్లుగానియెడల, నిస్పృహశ్చేత్- ఆయోగభ్రష్టుడతివిరక్తుడైనయెడల, బ్రహ్మతత్త్వస్య-బ్రహ్మస్వరూపముయొక్క, విచారాత్-విచారమును జేయుటవలన, ధీమతాం-ఆత్మతత్త్వనిశ్చయవిచారముగల, యోగినాం-చిత్తైకాగ్ర్యవంతులగు పుణ్యపురుషులయొక్క, కులేవ - కులమందే, భవతి-పుట్టుచున్నాడు. హి-ఏకారణమువలన, తత్- ఆయోగికులజన్మము, దుర్లభం-అల్పపుణ్యముచేత లభింపబడదో.

తా. అట్లుగానియెడల, ఆయోగభ్రష్టుడు, తాను అతివిరక్తుడైనయెడల, బ్రహ్మతత్త్వవిచారమువలననే, ఆత్మతత్త్వనిశ్చయవిచారముగల, చిత్తైకాగ్ర్యవంతులగు యోగులయొక్క కులమందు బుట్టుచున్నాడు. అనగా స్వర్గాదిలోకములను బొందకనే యోగికులమందు బుట్టుచున్నాడని తెలియవలెను. ప్ర. అయితే, పూర్వోక్తపక్షముకంటె, ఈపక్షమందు విశేషమేమి?. ఉ. ఏకారణమువలన, ఆయోగికులజన్మము, స్వల్పపుణ్యముచేత లభింపబడదో, ఆ కారణమువలన, ఈయోగికులజన్మము దుర్లభమని తెలియవలెను.

అవ. ఆయోగికులజన్మమునకు దుర్లభత్వము నిప్పుడు దెలుపుచున్నాడు.

శ్లో॥ తత్రతంబుద్ధిసంయోగం లభతేపౌర్వదైహికం।
యతతేచతతోభూయస్తస్మాదేతద్ధిదుర్లభం॥ ౪౫.

టీ. హి-ఏకారణమువలన, తత్ర-ఆజన్మమందు, పౌర్వదేహికం- పూర్వదేహమందుబుట్టిన, తం-ఆ, బుద్ధిసంయోగం - తత్త్వవిచారగోచరబుద్ధిసంబంధమును, లభతే-శీఘ్రముగాబొందుచున్నాడో, తతః- పూర్వజన్మమందు జేసిన ప్రయత్నముకంటె, భూయః-మరల, యతతేచ-అధికప్రయత్నమును జేయుచున్నాడో, తస్మాత్-ఆకారణమువలన, ఏతత్- ఈయోగికులజన్మము, దుర్లభం-అల్పపుణ్యముచేత పొందదగనిదగును.

తా. ఏకారణముచేత, ఆజన్మమందు పూర్వదేహమందు బుట్టిన తత్త్వవిచారగోచరమగు ఆబుద్ధిసంబంధమును శీఘ్రముగా బొందుచున్నాడో, మరియు, కేవలబుద్ధిసంబంధమాత్రలాభమేగాక, పూర్వప్రయత్నముకంటె మరల నధికప్రయత్నమును జేయుచున్నాడో, అకారణముచేత, ఈయోగికులజన్మము దుర్లభమగునని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. మరల అభ్యాసము జేయుటకు కారణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోపిసః।
అనేకజన్మసంసిద్ధస్తతోయాతిపరాంగతిం॥ ౫౦.

టీ. సః-ఆయోగభ్రష్టుడు, తేన-ఆ, పూర్వాభ్యాసేన - పూర్వాభ్యాసముచేత, అవశోపి- స్వాధీనములేనివాడైనను, హ్రియతే - ఆకర్షింపబడుచున్నాడు. అనగా ఆకర్షణమును బొందుచున్నాడనుట. (ఏవం) ఈప్రకారము, అనేకజన్మసంసిద్ధః=అనేకజన్మ- అనేకజన్మములయందు జేయబడిన ప్రయత్నముచేత, సంసిద్ధస్సన్-తత్వజ్ఞానముగలవాడగుచు, తతః- ఆతత్వజ్ఞానమువలన, పరాంగతిం- మోక్షమును, యాతి-పొందుచున్నాడు.

తా. ఆయోగభ్రష్టుడు, పూర్వజన్మమందు జేయబడిన ఆ యభ్యాసముచేత, స్వాధీనము లేనివాడైనను, ఆకర్షింపబడుచున్నాడు. ఈప్రకారముగా ననేకజన్మములయందు జేయబడిన ప్రయత్నముచేత తత్వజ్ఞాన సంపన్నుడగుచు, ఆతత్వజ్ఞానమువలన ముక్తిని బొందుచున్నాడని, ఈప్రకారముగా శ్రీగీతాశాస్త్రమందు జెప్పబడియున్నది. కనుక, భావిప్రతిబంధ నివృత్తియందు కాలనియమనులేదని తెలియవలెను.

అవ. ఇప్పుడు, మరియొక, ఆగామిప్రతిబంధమును జూపుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మలోకాభివాంఛాయాం సమ్యక్సత్యాం నిరుధ్యతాం।
విచారయేద్య ఆత్మానం నతుసాక్షాత్కరోత్యయం॥ ౫౧.

టీ. బ్రహ్మలోకాభివాంఛాయాం=బ్రహ్మలోక- సత్యలోకప్రాప్తియొక్క, అభివాంఛాయాం- ఇచ్ఛ, సమ్యక్సత్యాం - దృఢముగలదగుచుండగా, తాం-ఆయిచ్ఛను, నిరుధ్య-నిగ్రహించి, యః-ఏపురుషుడు, ఆత్మానం-బ్రహ్మస్వరూపుడగుప్రత్యగాత్మను, విచారయేత్-విచారము జేయునో, అయం-ఈపురుషుడు, నతుసాక్షాత్కరోతి-సాక్షాత్కారమును జేసికొనజాలడు.

తా. మరియు, బ్రహ్మలోకమునుబొందవలెననెడి యిచ్ఛ, దృఢముగా గలిగియుండగా, ఆయిచ్ఛను నిగ్రహించి, ఏపురుషుడు బ్రహ్మస్వరూపుడగు ప్రత్యగాత్మను విచారించునో, ఆపురుషునకు, ఆత్మసాక్షాత్కారము కానేకాదని తెలియవలెను.

శ్లో॥ వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థా ఇతిశాస్త్రతః।
బ్రహ్మలోకేసకల్పాంతే బ్రహ్మణాసహముచ్యతే॥ ౫౨.

టీ. వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాఇతి = వేదాంతవిజ్ఞాన-వేదాంతజ్ఞానముచేత, సునిశ్చిత-యథార్థముగా నిర్ణయింపబడిన, అర్థాఇతి - బ్రహ్మవస్తువుగల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారనిచెప్పెడి, శాస్త్రతః-శాస్త్రమువలన, సః- ఆపురుషుడు, బ్రహ్మలోకే-బ్రహ్మలోకమందు, కల్పాంతే-కల్ప - బ్రహ్మప్రళయదినముయొక్క, అంతే-అంతమందు, బ్రహ్మణాసహ-బ్రహ్మదేవునితోగూడ, ముచ్యతే- మోక్షమును బొందుచున్నాడు.

తా. ప్ర. అయితే, అట్టి పురుషున కెప్పటికిని ముక్తిలేదుగదా?. ఉ: వేదాంతజ్ఞానముచేత నిశ్చయింపబడిన బ్రహ్మవస్తువుగలిగినట్టియు, సన్యాస యోగమువలన పరిశుద్ధచిత్తముగల యతులు, బ్రహ్మలోకమును బొంది, అనంతర మచ్చట బ్రహ్మసాక్షాత్కారము గలవారగుచు, బ్రహ్మదేవునితోగూడ, ముక్తిని బొందుచున్నారని, శ్రు॥ వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థా స్సన్యాసయోగా ద్యతయశ్శుద్ధసత్వాః। తేబ్రహ్మలోకేతుపరాంతకాలే పరామృతాత్పరిముచ్యంతిసర్వే। బ్రహ్మణాసహతేసర్వే సంప్రాప్తేప్రతిసంచరే । పరస్యాంతేకృతాత్మానఃప్రవిశంతిపరంపదం॥ అనెడి యిత్యాది శాస్త్రము జెప్పుచున్నది.

అవ. ఇట్లుతత్వవిచారము జేయబడినను, ప్రతిబంధవశమువలన, ఈదేహమందు బ్రహ్మసాక్షాత్కారముగాదని తెలిపి, తీవ్రపాపులకు, ఆతత్వ విచారంబును దుర్లభమని యిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ కేషాంచిత్సవిచారోపి కర్మణాప్రతిబధ్యతే।
శ్రవణాయాపిబహుభిర్యో నలభ్యఇతిశ్రుతేః॥ ౫౩.

టీ. యః-ఏపరమాత్మ, బహుభిః-అనేకపురుషులచేత, శ్రవణాయాపి-వినుటకొరకును, నలభ్యఇతి- దుర్లభుడనిచెప్పెడి, శ్రుతేః-శ్రుతివలన, సః- ఆ, విచారోపి-తత్వవిచారంబును, కేషాంచిత్- కొంతమందిపురుషులకు, కర్మణా-పాపకర్మముచేత, ప్రతిబధ్యతే-ప్రతిబంధమునుబొందుచున్నది. అనగానడ్డగింపబడుచున్నదనుట.

తా. మరియు, ఆతత్వవిచారంబును, కొంతమందిపురుషులకు పాపకర్మముచేత, ప్రతిబంధింపబడుచున్నది. ప్ర. అయితే. యిందుకు ప్రమాణమేమి?. ఉ. ఏపరమాత్మ, బహుపురుషులచేత వినుటకును దుర్లభుడోయనెడి యర్థముగల: శ్రు॥ శ్రవణాయాపిబహుభిర్యోనలభ్యః॥ అనెడి శ్రుతియే ప్రమాణమగును.

అవ. ఈ చెప్పబడిన గ్రంథముచేత ప్రతిబంధస్థితి గలిగియుండగా, తత్వసాక్షాత్కారమైనను. అందుకు సాధనభూతమగు విచారమైనను గలుగదని తెలిపి, తత్వవిచారము జేయుటకు సమర్థుడుగానట్టియు, పురుషార్థమునుగోరెడిపురుషునిచే నేమిజేయవగినదనెడి యపేక్ష గలుగుచుండగా, పూర్వను,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(౫౫) ఇరువదెనిమిదవశ్లోకమందు, శ్లో॥ విచారాక్షమమర్త్యాశ్చతచ్ఛ్రిత్వోపాసనేగురోః॥ అని యెద్దిదెలుపబడెనో, దానినిప్పుడుపపాదించుచున్నాడు.

శ్లో॥ అత్యంతబుద్ధిమాంద్యాద్వా సామగ్ర్యావాప్యసంభవాత్।
యోవిచారంనలభతే బ్రహ్మోపాసీతసోఽనిశం॥ ౫౪.

టీ. అత్యంతబుద్ధిమాంద్యాద్వా=అత్యంత- మిక్కిలి, బుద్ధి-బుద్ధియొక్క, మాంద్యాద్వా=మాంద్యమువలననైనను, సామగ్ర్యాః - జ్ఞానసాధనవిచారసాధనముయొక్క, అనగా గురుశాస్త్రదేశకాలాదికముయొక్క యనుట. అసంభవాద్వా-లేమివలననైనను, యః-ఏపురుషుడు, విచారం-బ్రహ్మవిచారమును, నలభతే-పొందడో, సః-ఆపురుషుడు, అనిశం-సర్వదా, బ్రహ్మ - నిర్గుణబ్రహ్మమును, ఉపాసీత- ఉపాసనము జేయవలెను.

తా. మిక్కిలి బుద్ధిమాంద్యము చేతనైనను, తత్వవిచారము జేయుటకు సామగ్రి సంభవింపమిచేతనైనను, ఏపురుషుడు తత్వవిచారమును జేయజాలడో, వాడు, సర్వదా, నిర్గుణబ్రహ్మమును ఉపాసింపవలెను. ౧. తత్వమునుపదేశించెడిగురువు, ౨. వేదాంతశాస్త్రము, ౩. తత్వవిచారము జేయుటకు అనుకూలములైన దేశకాలాదులును, ఇవి యన్నియు, విచారమునకు సామగ్రి యని తెలియవలెను. సామగ్రియనగా సాధనములని యర్థము.

శ్లో॥ నిర్గుణబ్రహ్మతత్వస్యనహ్యుపాస్తేరసంభవః।
సగుణబ్రహ్మణీవాత్ర ప్రత్యయావృత్తిసంభవాత్॥ ౫౫.

టీ. నిర్గుణబ్రహ్మతత్వస్య= నిర్గుణ-గుణరహితమగు, బ్రహ్మ-పరబ్రహ్మముయొక్క, తత్వస్య-స్వరూపమునకు, ఉపాస్తేః- ఉపాసనముయొక్క, అసంభవః-అసంభవము, నహి-లేదు. సగుణబ్రహ్మణీవ=సగుణ- గుణసహితమగు, బ్రహ్మణీవ-బ్రహ్మమందువలె, అత్ర-ఈనిర్గుణబ్రహ్మమందు, ప్రత్యయావృత్తిసంభవాత్=ప్రత్యయ - వృత్తులయొక్క, ఆవృత్తి - నిరంతర మేకాకారముగా వర్తించుచుండుటయొక్క, సంభవాత్ - సంభవమువలన,

తా. ప్ర. అయితే, నిర్గుణమగు బ్రహ్మస్వరూపము, గుణములేనిదగుటవలన, ఆనిర్గుణబ్రహ్మతత్వోపాసన మెట్లు ఘటించును?. ఉ. సగుణబ్రహ్మము నుపాసించునప్పుడు, ఆసగుణబ్రహ్మమందు ఏప్రకారముగా నిరంతరమేకాకారవృత్తులు ప్రవహించుచున్నవో, ఆప్రకారమే, ఈనిర్గుణబ్రహ్మస్వరూపమందును నిరంతరమేకాకారవృత్తులు ప్రవహించుచున్నవి. ఆకారణమువలన నిర్గుణ బ్రహ్మస్వరూపమునకు ఉపాసనము సంభవింపదని చెప్పరాదు. అనగా, నిరంతర మేకాకారముగా బ్రవహించుచుండెడి వృత్తిరూపమే, యుపా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సనమగుటవలన, ఆయుపాసనను సగుణబ్రహ్మమందువలెనే, నిర్గుణ బ్రహ్మమందును సంభవించుచున్నదని యభిప్రాయము.

శ్లో॥ అవాఙ్మనసగమ్యం తన్నోపాస్యమితిచేత్తదా।
అవాఙ్మనసగమ్యస్య వేదనంచనసంభవేత్॥ ౫౬.

టీ. అవాఙ్మనసగమ్యం-వాఙ్మనంబులచే బొందవగనిదగు, తత్-ఆనిర్గుణబ్రహ్మము, ఉపాస్యం-ఉపాసింపదగినది, నేతిచేత్-కాదనియంటివేని,తదా-అప్పుడు, అవాఙ్మనసగమ్యస్య-వాఙ్మనంబులచేబొందదగని నిర్గుణ బ్రహ్మముయొక్క, వేదనంచ-జ్ఞానంబును, నసంభవేత్ - సంభవింపదు.

తా. ప్ర. అయితే, నిర్గుణబ్రహ్మము, అవాఙ్మానసగోచరరూపముగలదగుటవలన, ఉపాసింపదగినదెట్లగును?. ఉ. అట్లైనయెడల, అవాఙ్మానసగోచరమగు నిర్గుణబ్రహ్మముయొక్క జ్ఞానంబును సంభవింపదు. అనగా నీదోషము జ్ఞానపక్షమందును సమానమగునని యభిప్రాయము.

శ్లో॥ వాగాద్యగోచరాకార మిత్యేవంయదివేత్త్యసౌ।
వాగాద్యగోచరాకారమిత్యుపాసీతనోకుతః॥ ౫౭.

టీ. అసౌ-ఈముముక్షువు. (బ్రహ్మ) నిర్గుణబ్రహ్మము, వాగాద్యగోచరాకారమితి=వాగాది-వాఙ్మనంబులకు, అగోచర-గోచరింపని, ఆకారమితి-స్వరూపముగలదని, ఏవం-ఈప్రకారము, వేత్తియది - ఎరుగుచున్నాడని యంటివేని, వాగాద్యగోచరాకారమితి= వాగాది-వాఙ్మనంబులకు, అగోచర - గోచరింపని, ఆకారమితి-స్వరూపముగలదని, కుతః-ఎందువలన, నోపాసీత - ఉపాసింపరాదు. అనగా నుపాసింపదగుననుట.

తా. ప్ర. అయితే, నిర్గుణబ్రహ్మము. అవాఙ్మానస గోచరస్వరూపముగలదని, ఈప్రకారముగా నెరుగుటకు శక్యముగాదాయేమి?. ఉ. సరి.అట్లైనయెడల, నిర్గుణబ్రహ్మము, అవాఙ్మానసగోచరస్వరూపముగలదని, యెందుచేనుపాసించుటకు శక్యముగాదు. అనగా నీప్రకారమే యుపాసించుటకునుశక్యమగునని తెలియవలెను.

శ్లో॥ సగుణత్వముపాస్యత్వాద్యదివేద్యత్వతోపితత్।
వేద్యంచేల్లక్షణావృత్త్యాలక్షితంసముపాస్యతాం॥ ౫౮.

టీ. (బ్రహ్మణః) నిర్గుణబ్రహ్మమునకు, ఉపాస్యత్వాత్ - ఉపాస్యత్వముగలుగుటవలన, అనగా బ్రహ్మముపాసింపదగినదగుటవలన ననుట. సగుణత్వం-సగుణభావము గలుగునని యంటివేని, వేద్యత్వతోపి- జ్ఞానవిషయమగుటవలనను, అనగా జ్ఞానముచే నెరుగదగినదగుటవల్లననుట. తత్ - ఆసగుణభావ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగలుగును. లక్షణావృత్త్యా-లక్షణావృత్తిచేత, వేద్యంచేత్-ఎరుగదగినదగునని యంటివేని, లక్షితం- లక్షణావృత్తిచే దెలుపబడెడి బ్రహ్మంబు, సముపాస్య తాం- లెస్సగానుపాసింపబడుగాక.

తా. ప్ర. అయితే, బ్రహ్మమునకు ఉపాసనావిషయత్వము గలుగుచుం డగా, సగుణత్వము సంభవింపదాయేమి?. ఉ. సరి. అట్లైనయెడల, బ్రహ్మ ము జ్ఞానముచే నెరుగబడుటవలన, జ్ఞానపక్షమందును ఆసగుణత్వముసంభవిం చును. ప్ర. అయితే, లక్షణావృత్తినాశ్రయించుటవలన, బ్రహ్మము నెరుగుట చేత, జ్ఞానపక్షమందుసగుణత్వమెట్లు కలుగును?. ఉ. సరి. అట్లైనయెడలలక్ష ణావృత్తిచేత దెలియబడెడిప్రకారమే, ఉపాసనమును జేయవలెనని తెలిసికొ నుము.

అవ. శ్రుతిచేత బ్రహ్మమునకు ఉపాస్యత్వము నిషేధింపబడినదని, యిప్పుడు పూర్వవాది, ఆక్షేపించుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మవిద్ధితదేవత్వం నత్వేదంయదుపాసతే।
ఇతిశ్రుతేరుపాస్యత్వంనిషిద్ధంబ్రహ్మణోయది॥ ౫౯.

టీ. త్వం-నీవు, (తత్వం) ఏయవాఙ్మనసగమ్యమగు సత్యవస్తువు గల దో, తదేవ-దానినే, బ్రహ్మ-బ్రహ్మమునుగా, విద్ధి - తెలిసికొనుము. (పురు షాః) పురుషులు, ఇదంతు-ఇదియని, యత్-దేనిని, ఉపాసతే- ఉపాసనము జేసె దరో, (తన్నవిద్ధి) దానిని బ్రహ్మమునుగా దెలిసికొనకుము. ఇతిశ్రుతేః- ఇట్లు చెప్పెడి శ్రుతివలన, బ్రహ్మణః-బ్రహ్మమునకు, ఉపాస్యత్వం - ఉపాసనావిష యత్వము: నిషిద్ధంయది - నిషేధింపబడినదనియంటివేని.

తా. ఏయవాఙ్మనసగమ్యమగు తత్వముగలదో, అదియే బ్రహ్మమని, నీవు తెలిసికొనుమనియు, పురుషులు, ఇదియని దేని నుపాసించెదరో, అదిబ్ర హ్మముగాదని తెలిసికొనుమనియు, శ్రు॥ యన్మనసానమనుతే యేనాహుర్మనో మతంతదేవబ్రహ్మత్వంవిద్ధినేదంయదిదముపాసతే॥ అనెడి శ్రుతి, జెప్పుచున్న ది. అనగానుపాసింపబడెడి వస్తువునకు, బ్రహ్మత్వము నిషేధింపబడుచున్న దని, పూర్వవాది, ఆక్షేపించెను.

అవ. ఉపాస్యత్వంబెట్లు నిషేధింపబడెనో, ఆప్రకారమే వేద్యత్వంబు ను, బ్రహ్మమునకు నిషేధింపబడినదని చెప్పుచున్నాడు.

శ్లో॥ విదితాదన్యదేవేతిశ్రుతేర్వేద్యత్వమస్యన।
యథాశ్రుత్యైవవేద్యంచేత్తథాశ్రుత్యాప్యుపాస్యతాం॥ ౬౦.

టీ. విదితాత్-జ్ఞానముచే నెరుగబడెడిదానికంటె, అన్యదేవేతి - అన్య

మే బ్రహ్మమనిచెప్పెడి, శ్రుతేః-శ్రుతివలన, అస్య - ఈబ్రహ్మమునకు, వేద్యత్వం-జ్ఞానవిషయత్వము, న-లేదు. యథాశ్రుత్యైవ - శ్రుతిప్రకారమే, వేద్యం చేత -ఎరుగదగినదగుననియంటివేని, శ్రుత్యా-శ్రుతిచేత, తథాపి-ఆప్రకారము, ఉపాస్యతాం- ఉపాసింపబడుగాక. అనగా నుపాసింపవలెననుట.

తా. ఓపూర్వవాదీ, జ్ఞానముచేత నెరుగబడెడిదానికంటెను, ఎరుగబడనిదానికంటెను, అన్యమే బ్రహ్మమగుననిచెప్పెడి, శ్రు॥ అన్యదేవతద్విదితాదథోఅవిదితాదధి॥ అనెడి శ్రుతి, బ్రహ్మమునకు జ్ఞానవిషయత్వంబునుంగూడ, నివర్తింపజేయుచున్నది. ప్ర. అయితే, శ్రుతి, జ్ఞానముచే నెరుగబడెడిదానికంటెను, ఎరుగబడనిదానికంటె నన్యము బ్రహ్మమని, ప్రతిపాదించుచున్నయెడల, ఆప్రకారమే బ్రహ్మము నెరుగరాదాయేమి?. ఉ. శ్రుతిచెప్పిన ప్రకారమే బ్రహ్మము నెరుగదగునని యంటివేని, సరి. ఆప్రకారమే బ్రహ్మము నుపాసింపవచ్చును.

శ్లో॥ అవాస్తవీవేద్యతాచేదుపాస్యత్వంతథానకిం।
వృత్తివ్యాప్తిర్వేద్యతాచేదుపాస్యత్వేపితత్సమం॥ ౬౧.

టీ. (బ్రహ్మణః) బ్రహ్మమునకు, వేద్యతా-జ్ఞానవిషయత్వము, అవాస్తవీచేత్-వాస్తవముగాదనియంటివేని, ఉపాస్యత్వం- ఉపాసనావిషయత్వంబును, తథా-ఆప్రకారము, నకిం-కాదాయేమి. అనగా బ్రహ్మమునకు నుపాస్యత్వంబును వాస్తవముగాదనుట. వృత్తివ్యాప్తిః=వృత్తి - బ్రహ్మాకార బుద్ధివృత్తియొక్క, వ్యాప్తిః-వ్యాప్తి, వేద్యతాచేత్ - జ్ఞానవిషయత్వమని యంటివేని, తత్-ఆబ్రహ్మాకారవృత్తిత్వము, ఉపాస్యత్వేపి-ఉపాసనావిషయత్వమందును, సమం-సమానమగును.

తా. ప్ర. అయితే, జ్ఞానపక్షమందు బ్రహ్మమునకు జ్ఞానవిషయత్వము వాస్తవముగాదుగదా?. ఉ. సరి. బ్రహ్మమునకు ఉపాసనా విషయత్వంబును వాస్తవముగాదు. ప్ర. అయితే, జ్ఞానపక్షమందు బుద్ధివృత్తికి బ్రహ్మాకారత్వము గలిగియున్నట్లు, ఉపాసనమందు, ఆబ్రహ్మాకారవృత్తిత్వము లేదుగదా?. ఉ. శబ్దబలమువలన, ఆబ్రహ్మాకారవృత్తిత్వము, జ్ఞానోపాసనము లనెడి రెండుపక్షములయందును సమానమగును.

అవ. యుక్తిశూన్యములగు దూషణముతోగూడిన పరిహాసవాక్యములో, నీపక్షమందును సమానమేనని, ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ కాతేభక్తిరుపాస్తౌ తేతర్హిస్తేద్వేషస్తదీరయ।
మానాభావోనవాచోస్యాంబహుశ్రుతిషుదర్శనాత్॥ ౬౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. తే-నీకు, ఉపాస్తౌ-ఉపాసనమందు, భక్తిః-భక్తి, కాచేత్- ఏమియు నియంటివేని, ఉపాస్తౌ-ఉపాసనమందు, తే-నీకు, ద్వేషః-ద్వేషము, కః - ఏమి యో, తత్-ఆవిషయమును, ఈరయ-చెప్పుము. బహుశ్రుతిషు - అనేకశ్రుతుల యందు, దర్శనాత్-దర్శనమువలన, అనగా జెప్పబడుటచేననుట. అస్యాం- ఈనిర్గుణోపాసనమందు, మానాభావః=మాన- ప్రమాణముయొక్క, అభావః- అభావము, వాచ్యః-చెప్పదగినది, న-కాదు. అనగా ప్రమాణములేదని చెప్ప రాదనుట.

తా. ప్ర. అయితే, నిర్గుణోపాసనమందు నీకింతయిష్టమేమి?. ఉ. నిర్గు ణోపాసనమందు, నీకింతద్వేషమేమో యదిచెప్పుము. ప్ర. అయితే, నిర్గుణో పాసనమందు ప్రమాణములేదుగదా?. ఉ. అనేకోపనిషత్తులయందు నిర్గుణోపా సనము జెప్పబడుటచేత, ప్రమాణములేదని చెప్పరాదు.

అవ. బహుశ్రుతులయందు జెప్పబడెననెడియర్థమును వివరించుచున్నాడు.

శ్లో॥ ఉత్తరస్మింస్తాపనీయే శైబ్యప్రశ్నేథకాఠకే।
మాండూక్యాదౌచసర్వత్ర నిర్గుణోపాస్తిరీరితా॥ ౬౩.

టీ. తాపనీయే-తాపనీయోపనిషత్తునందు, ఉత్తరస్మిన్ - ఉత్తరమందు ను, శైబ్యప్రశ్నే-ప్రశ్నోపనిషత్తునందు పంచమప్రశ్నమందును, అథ-అనంత రము, కాఠకే-కఠవల్లియందును, మాండూక్యాదౌచ=మండూక్య - మాండూ క్యోపనిషత్తునందును, ఆదౌచ - తైత్తిరీయముండకాద్యుపనిషదాదియందును, సర్వత్ర-అంతటను, నిర్గుణోపాస్తిః-నిర్గుణబ్రహ్మముయొక్క, ఉపాస్తిః-ఉపా సనము, ఈరితా-చెప్పబడెను.

తా. శ్రు॥ దేవాహవైప్రజాపతిమబ్రువన్నణోరణీయాంసమిమమాత్మా నమోంకారంనోవ్యాచక్ష్వ ॥ అనెడి యిత్యాదివాక్యములచేత తాపనీయోపని షత్తునందు, బహువిధముగా నిర్గుణోపాసనము చెప్పబడినది. మరియు, ఏపురు షుడు మూడుమాత్రల పరిమితిగల, (ఓం) అనెడి అక్షరముచేత, ఈ పరమపు రుషుని ధ్యానము జేయునోయనెడియర్థముగల, శ్రు ॥ యఃపునరేతంత్రిమాత్రే ణోమిత్యనేనైవాక్షరేణపరంపురుషమభిధ్యాయీత॥ అనెడి వాక్యముచేత ప్ర శ్నోపనిషత్తునందు పంచమప్రశ్నమందు నిర్గుణోపాసనము చెప్పబడినది. మరి యు, కఠవల్లిశ్రుతియందు, సకలవేదములును, ఏపదమును జెప్పుచున్నవో యనెడి యర్థముగల, శ్రు॥ సర్వేవేదాయత్పదమామనంతి ॥ అనెడి వాక్యము మొదలు కొని, ఈ ఓంకారమే బ్రహ్మమనియు, ఈప్రణవోపాసనము శ్రేష్ఠమనియు, శ్రు॥ ఏతద్ధ్యేవాక్షరంబ్రహ్మ ఏతదాలంబనంశ్రేష్ఠం॥ ఇత్యాదివాక్యముచేత ప్రణవో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాసనము జెప్పబడెను. మరియు, మాండూక్యోపనిషత్తునందు, ఈ సర్వము, (ఓం) అనెడి యక్షరమగుననెడియర్థముగల, శ్రు॥ ఓమిత్యేతదక్షరమిదంసర్వం॥ అనెడి యిత్యాదివాక్యముచేత, అవస్థాత్రయమునకు అతీతమగు తురీయోపాసనమే చెప్పబడెను. మరియు, తైత్తిరీయ ముండకాద్యుపనిషత్తులయందును, ఈప్రకారమే, అంతటను నిర్గుణోపాసనము చెప్పబడినది. కనుక, నిర్గుణోపాసనమందు ప్రమాణములేదని చెప్పరాదు.

శ్లో॥ అనుష్ఠానప్రకారోఽస్యాః పంచీకరణఈరితః।
జ్ఞానసాధనమేతచ్చే న్నేతికేనాత్రవారితం॥ ౬౮.

టీ. అస్యాః-ఈనిర్గుణోపాసనముయొక్క, అనుష్ఠానప్రకారః - అనుష్ఠించెడిప్రకారము, పంచీకరణఈరితః= పంచీకరణ - పంచీకరణమని, ఈరితః- చెప్పబడెను. ఏతత్-ఈనిర్గుణోపాసనము, జ్ఞానసాధనంచేత్ = జ్ఞాన- తత్వజ్ఞానమునకు, సాధనంచేత్- సాధనమనియంటివేని, అత్ర-ఈవిషయమందు, నేతి- కాదని, కేన-ఎవనిచేత, వారితం-నివారింపబడును. అనగా నెవనిచేతను నివారింపబడదనుట.

తా. ప్ర. అయితే, నిర్గుణోపాసనము, ఎట్లు అనుష్ఠింపదగినదో చెప్పుము?. ఉ. ఈనిర్గుణోపాసనముయొక్క, అనుష్ఠానపద్ధతి, పంచీకరణమని చెప్పబడెను. ప్ర. అయితే, ఈనిర్గుణోపాసనము, జ్ఞానసాధనమేయగుగాని, ముక్తిసాధనముగాదుగదా?. ఉ. ఈనిర్గుణోపాసనమును, జ్ఞానసాధనముగానిదానినిగా, నెవ్వడునునివారింపజేయజాలఁడు. అనగా, బ్రహ్మతత్వోపాసనముచేత పురుషుడు మోక్షమునుబొందుచున్నాడని చెప్పెడిమాకు, ఈచోద్యమనుకూలమేయగునని యభిప్రాయము.

శ్లో॥ నానుతిష్ఠతికోఽప్యేతదితిచేన్నానుతిష్ఠతు।
పురుషస్యాపరాధేన కిముపాస్తిః ప్రదుష్యతి॥ ౬౯.

టీ. కోపి-ఎవడును, ఏతత్-ఈనిర్గుణోపాసనమును, నానుతిష్ఠతీతిచేత్- అనుష్ఠించుచుండలేదనియంటివేని, మానుతిష్ఠతు-అనుష్ఠించకుండుగాక. పురుషస్య-పురుషునియొక్క, అపరాధేన-తప్పితముచేత, ఉపాస్తిః - ఉపాసనము, కిం ప్రదుష్యతి-దూషింపబడునాయేమి. అనగా దూషింపబడదనుట.

తా. ప్ర. అయితే, సర్వజనులచేతను సగుణోపాసనమే అనుష్ఠింపబడుచున్నదిగాని, నిర్గుణోపాసనము అనుష్ఠింపబడలేదేమి?. ఉ. పురుషుడు నిర్గుణోపాసనము ననుష్ఠింపకుండుగాక. పురుషునియొక్క అపరాధముచేత, నిర్గుణోపాసనము దూషింపబడదు. అనగా, ప్రమాణ సిద్ధమైన నిర్గుణోపాసన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును లేదని చెప్పుట యుక్తముగాదని యభిప్రాయము.

అవ. ప్రమాణసిద్ధమైనదానిని, అనుష్ఠానము జేయమిచేత, విడువవదగమి యందు దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఇతోఽప్యతిశయంమత్వామంత్రాన్వశ్యాదికారిణః।
మూఢాజపంతుతేభ్యోఽతిమూఢాఃకృషిముపాసతాం॥ ౬౬.

టీ. మూఢాః-మూఢులు, ఇతోపి- ఈనిగుణోపాసనముకంటె, అతిశయం-అతిశయముగా, మత్వా-తలచి, వశ్యాదికారిణః = వశ్యాది- వశ్యాదికమును; కారిణః-కలుగజేసెడి, మంత్రాన్-మంత్రములను, జపంతు- జపముజేయుదురుగాక. తేభ్యః-వారికంటె,అతిమూఢాః-మిక్కిలిమూఢజనులు, కృషిం-కృషిని, ఉపాసతాం-సేవింతురుగాక.

తా. కొంతమంది మూఢులు, ఈనిగుణోపాసనముకంటె నధికముగా దలచి, వశ్యాదికమునుగలుగజేసెడిమంత్రములను జపించుచున్నారు. అంతకంటె నధికమూఢులు, కృషినిసేవించుచున్నారు. అనగా, కొందరు మూఢులు కాలాంతరమందు పొందబడెడి ఫలములుగలసగుణోపాసనములకంటె, వశ్యాదికమును గలుగజేసెడి మంత్రములయందుగల ఐహికఫలప్రదత్వము నధికముగాదలచి, ఆమంత్రజపాదికమందు బ్రవర్తించినను, వివేకులచేత సగుణోపాసనము విడువబడనట్లును, మరియు, వారికంటెనతిమూఢులు, నియమానుష్ఠానముల నపేక్షించెడి, ఆమంత్రములకంటె కృష్యాదికమందుగల ఫలము నధికముగాదలచి ఆకృష్యాదికమందు బ్రవర్తించినను, ఆయామంత్రానుష్ఠానము విడువదగినదిగానట్లును, అప్రకారమే, సాంసారిక ఫలాపేక్షగలవారికి నిగుణోపాసనానుష్ఠానము లేకపోయినను, ముముక్షువులచేత నిగుణోపాసనము విడువబడదని యభిప్రాయము.

అవ. ఇట్లుప్రాసంగికమునుముగించి, ప్రకృతము ననుసరించి చెప్పుచున్నాడు.

శ్లో॥ తిష్ఠంతుమూఢాఃప్రకృతానిర్గుణోపాస్తిరీర్యతే।
విద్యైక్యాత్సర్వశాఖాస్థాన్గుణానత్రోపసంహరేత్॥ ౬౭.

టీ. ప్రకృతాః-ఈచెప్పబడిన, మూఢాః-మూఢులు, తిష్ఠంతు- ఉందురుగాక. నిగుణోపాస్తిః=నిగుణ-నిగుణబ్రహ్మముయొక్క, ఉపాస్తిః- ఉపాసనము ఈర్యతే-చెప్పబడుచున్నది. విద్యైక్యాత్=విద్యా - నిగుణవిద్యయొక్క, ఐక్యాత్-ఏకత్వమువలన, సర్వశాఖాస్థాన్- సర్వ-సకలములగు, శాఖా-శాఖలయందు, అర్థాన్-చెప్పబడినప్రకారముగల, గుణాన్- ఉపాసింపదగిన గుణములను, అత్ర-ఈనిగుణోపాసనమందు, ఉపసంహరేత్ - ఉపసంహార

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మా జేయవలెను.

తా. ఈచెప్పబడిన సూత్రములు, అట్లుండదుగాక. నిర్గుణోపాసనము అనేకశ్రుతులయందు జెప్పబడుచున్నది. మరియు, సర్వ వేదాంతములయందు జెప్పబడిన విజ్ఞానములు, ప్రతివేదాంతమందునుగలవని న్యాయపూర్వకముగా జెప్పెడిసూత్రం॥ సర్వవేదాంతప్రత్యయంచోదనాద్యవిశేషాత్॥ అనెడిసూత్రముచేత, ఈనిర్గుణవిద్యయొక్క యేకత్వమువలన, సర్వవేదశాఖలయందుజెప్పబడిన గుణములను, ఈనిర్గుణోపాసనమందు ఉపసంహరించవలెను. అనగా బూర్వోక్తసూత్రప్రకారము, నిర్గుణోపాసనమునకు ఏకత్వముగలిగియుండుటచేత, ఆయావేదశాఖలయందు వినబడెడి యుపాసింపదగిన గుణములను, ఒకవస్తువునందు ఉపసంహరించుకొని, ఉపాసనము జేయదగినదని యభిప్రాయము.

శ్లో॥ ఆనందాదేర్విధేయస్యగుణసంఘస్యసంహృతిః।
ఆనందాదయఇత్యస్మిన్సూత్రేవ్యాసేనవర్ణితా॥ ౬౮.

టీ. విధేయస్య-గ్రహింపదగిన, ఆనందాదేః - ఆనందాదిరూపముగల, గుణసంఘస్య-గుణసంఘముయొక్క, సంహృతిః-ఉపసంహారము, అనగా సంక్షేపమనుట. ఆనందాదయఇతి- బ్రహ్మముయొక్క యానందాదిసర్వధర్మములనెడి యర్థముగల, అస్మిన్-ఈ, సూత్రే-సూత్రమందు, వ్యాసేన-వేదవ్యాసునిచేత, వర్ణితా-వర్ణింపబడెను.

తా. ఆయుపాస్యగుణములు, ౧. విధేయములనియు, ౨. నిషేధ్యములనియు, ఇట్లు రెండువిధములగును. అందు, బ్రహ్మము ఆనందమనియు, విజ్ఞానమానందమనియు, నిత్యమనియు, శుద్ధమనియు, బుద్ధమనియు, సత్యమనియు, ముక్తమనియు, నిరంజనమనియు, వ్యాపకవస్తువనియు, అద్వితీయమనియు, పరమనియు, ప్రత్యగాత్మరూపమనియు, చిదేకరసమనియుంజెప్పెడి, శ్రు॥ ఆనందోబ్రహ్మవిజ్ఞానమానందం బ్రహ్మనిత్యశ్శుద్ధోబుద్ధస్సత్యోముక్తోనిరంజనోవిభురద్వయఆనందఃపరఃప్రత్యగేకరసః॥ ఇత్యాది శ్రుతిప్రకారము, ఏవిధేయగుణములుగలవో, ఆగుణములయొక్క ఉపసంహారము, సూత్రం॥ ఆనందాదయః ప్రధానస్య॥ అనెడి అధికరణమందు,వ్యాసమునీంద్రునిచేత జెప్పబడెను. విధేయగుణములనగా గ్రహింపదగిన గుణములగును.

శ్లో॥ అస్థూలాదేర్నిషేధ్యస్యగుణసంఘస్యసంహృతిః।
తథావ్యాసేనసూత్రేస్మిన్నుక్తాతురధియాంత్వితి॥ ౬౯.

టీ. తథా-ఆప్రకారము, వ్యాసేన-వేదవ్యాసునిచేత, నిషేధ్యస్య - నిషే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధింపదగిన, అనగా ద్వైతనిషేధము జేయునట్టియనుట. అస్థూలాదేః= అస్థూల-అస్థూలశబ్దమే, ఆదేః-ఆదిగాగలిగినట్టి, గుణసంఘస్య- గుణసంఘముయొక్క, సంహృతిః-ఉపసంహారము, అక్షరధియాంత్వితి=అక్షర-ధర్మియందు, ధియాంత్వితి- ద్వైతనిషేధజ్ఞానహేతువులగు శబ్దములయొక్క యుపసంహారమనెడి యర్థముగల, అస్మిన్-ఈ, సూత్రే-సూత్రమందు, ఉక్తా-చెప్పబడెను.

తా. మరియు, బ్రహ్మము స్థూలవస్తువుగాదనియు, అణువుగాదనియు, పొట్టిదిగాదనియు, పొడవుగలదిగాదనియు, ఇదియని నిర్దేశింపదగినది గాదనియు, గ్రహింపదగినదిగాదనియు, శబ్దముగలదిగాదనియు, స్పర్శముగలదిగాదనియు, రూపముగలదిగాదనియు, నాశము లేనిదని, శ్రు॥ అస్థూలమనణ్వహ్రస్వం యత్తదనిర్దేశ్యమగ్రాహ్యం. అశబ్దస్పర్శమరూపమవ్యయం ॥ ఇత్యాది శ్రుతులచేత, ఏనిషేధింపదగినగుణములు వేదాంతములయందు అచ్చటచ్చట వినబడుచున్నవో, ఆద్వైతనిషేధజ్ఞానహేతువులగు శబ్దములచేత గ్రహింపదగినగుణములను ధర్మియగు బ్రహ్మమందు ఉపసంహారము జేయవలెనని, శ్రీబ్రహ్మసూత్రకారుడగు వేదవ్యాసమహామునీంద్రునిచేత, సూత్రం॥ అక్షరధియాంత్వవరోధస్సామాన్యతద్భావాభ్యామౌపసదవత్తదుక్తం॥ అనెడి అధికరణమందు దెలుపబడెనని తెలియవలెను.

శ్లో॥ నిర్గుణబ్రహ్మతత్వస్య విద్యాయాంగుణసంహృతిః।
నయుజ్యతేత్యుపాలంభోవ్యాసంప్రత్యేవమాంనతు॥ ౨౦.

టీ. నిర్గుణబ్రహ్మతత్వస్య - నిర్గుణ బ్రహ్మ స్వరూపముయొక్క, విద్యాయాం-విద్యయందు, గుణసంహృతిః= గుణ - గుణములయొక్క, సంహృతిః-ఉపసంహారము, నయుజ్యతేతి-యుక్తముగాదనెడి, ఉపాలంభః - దూషణయుక్తపరిహాసవాక్యసంఘము, వ్యాసంప్రత్యేవ- వ్యాసునిగురించియేయగును. మాంతు-నన్నుగురించియో, న-కాదు.

తా. ప్ర. అయితే, గుణోపసంహారము, నిర్గుణవిద్యాభావమునకువిరోధమగుటవలన, నిర్గుణబ్రహ్మవిద్యయందు గుణోపసంహారము యుక్తమెట్లగును?. ఉ. బ్రహ్మసూత్రకారుడగు వేదవ్యాసమహామునీంద్రునిచేత జెప్పబడిన గుణోపసంహారమును మేముజెప్పుటచేత, ఈదూషణ సహితపరిహాసరూపచోద్యము, వ్యాసునిగురించినదే యగుగాని, నన్ను గురించినదిగాదని యభిప్రాయము.

శ్లో॥ హిరణ్యశ్మశ్రుసూర్యాదిమూర్తీనామనుదాహృతేః।
అవిరుద్ధంనిర్గుణత్వమితిచేత్తుష్యతాంత్వయా॥ ౨౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ॰ హిరణ్యశ్మశ్రుసూర్యాదిమూర్తీనాం=హిరణ్య- హిరణ్యచ్ఛాయవంటి, శ్మశ్రు-శ్మశ్రువులుగల, సూర్యాదిమూర్తీనాం- సూర్యుడు మొదలగుమూర్తులను, అనుదాహృతేః-ఉదాహరింపమివలన, నిర్గుణత్వం-నిర్గుణభావము, అనిరుద్ధమితిచేత్-నిరోధమునుబొందదనియంటివేని, త్వయా-నీచేత, తుష్యతాం-సంతోషింపబడుగాక॰ అనగా నీవుసంతోషింతువుగాకయనుట॰

తా॰ ప్ర॰ అయితే, హిరణ్యఛాయవంటి శ్మశ్రుత్వాది గుణవిశిష్టసూర్యాదిమూర్తులను జెప్పమిచేత, ఇది నిర్గుణోపాసనమగుటకువిరోధమేమి?॰ ఉ॰ సరి॰ అట్లైనయెడల, ఇది నిర్గుణోపాసనమే యగునని, నీవు సంతోషింపుము.

శ్లో॥ గుణానాంలక్షకత్వేన నతత్త్వేంతః ప్రవేశనం।

ఇతిచేదస్త్వేవమేవబ్రహ్మతత్త్వముపాస్యతాం॥ ౭౨.

టీ॰ లక్షకత్వేన - లక్షకత్వముచేత, గుణానాం - ఆనందాదిగుణములకు, తత్త్వే-బ్రహ్మస్వరూపమందు, అంతః-లోపట, ప్రవేశనం - ప్రవేశము, నేతిచేత్-లేదనియంటివేని, అస్తు-అగుగాక॰ ఏవమేవ - ఈప్రకారమే, బ్రహ్మతత్వం-నిర్గుణబ్రహ్మస్వరూపము, ఉపాస్యతాం- ఉపాసింపబడుగాక॰ అనగా నీప్రకారమే నిర్గుణబ్రహ్మస్వరూపము నుపాసింపవలెననుట.

తా॰ ప్ర॰ అయితే, ఆనందాదివిధేయగుణములను, అస్థూలాది నిషేధ్యగుణముల నుపాసించుచున్నయెడల, ఆగుణములకు, నిర్గుణబ్రహ్మస్వరూపమందు, లోపట ప్రవేశములేకపోవుచుండగా, ఆగుణవిశిష్టత్వముచేత బ్రహ్మమునకుడపాస్యత్వ మెట్లుసంభవించును?॰ ఉ॰ ఆయానందాది గుణములకు, నిర్గుణబ్రహ్మస్వరూపమందు లోపట ప్రవేశములేకపోయినను, ఆగుణములకు లక్షకత్వముసంభవించుటవలన, ఆ గుణములచేత లక్షితమగుబ్రహ్మము, ఉపాసింపదగినదగునని యభిప్రాయము॰

అవ॰ అట్లు ఉపాసనప్రకారమునే, యిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ ఆనందాదిభిరస్థూలాదిభిశ్చాత్మాత్రలక్షితః।

అఖండైకరసస్సోహమస్మీత్యేవముపాసతే॥ ౭౩.

టీ॰ అత్ర-ఈశ్రుతులయందు, (యః) ఏ, అఖండైకరసః- సజాతీయవిజాతీయస్వగత భేదశూన్యుడగు, ఆత్మా-ప్రత్యగాత్మ, ఆనందాదిభిః-ఆనందాది విధేయగుణములచేతను, అస్థూలాదిభిశ్చ - అస్థూలాది నిషేధ్యగుణములచేతను, లక్షితః-తెలుపబడుచున్నాడో, సః-ఆప్రత్యగాత్మ, అహమస్మీతి - నేనైతినని, ఏవం-ఈప్రకారము, (ముముక్షవః) ముముక్షువులు, ఉపాసతే - ఉపాసనము జేయుచున్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఈపూర్వోక్తశ్రుతులయందు, అఖండైకరసరూపుడగు (అసగాసజాతీయవిజాతీయస్వగతభేదములేనట్టి,) ఏ పరమాత్మ, ఆనందాదివిధేయగుణములచేతను, అస్థూలాది నిషేధ్యగుణములచేతను, దెలుపబడుచున్నాడో, ఆపరమాత్మ, నేనైతినని, ఈప్రకారముగా ముముక్షువులు ఉపాసనము జేయుచున్నారు.

శ్లో॥ బోధోపాస్త్యోర్విశేషఃక ఇతిచేదుచ్యతే శ్రుణు।
వస్తుతంత్రోభవేద్బోధః కర్తృతంత్రముపాసనం॥ ౭౩.

టీ. బోధోపాస్త్యోః=బోధ- జ్ఞానమునకును, ఉపాస్త్యోః - ఉపాసనమునకును, విశేషః-భేదము, క ఇతిచేత్- ఏమనియంటివేని, ఉచ్యతే - చెప్పబడుచున్నది. శ్రుణు-వినుము. బోధః-జ్ఞానము, వస్తుతంత్రః=వస్తు-వస్తువుయొక్క, తంత్రః-అధీనముగలది, భవేత్-అగును. ఉపాసనం- ధ్యానము, కర్తృతంత్రం=కర్తృ-పురుషునియొక్క, తంత్రం-అధీనముగలది, భవేత్-అగును.

తా. ప్ర. అయితే, ఈప్రకారమగుచుండగా, విద్యోపాసనములకు రెంటికిని భేదమేమి?. ఉ. జ్ఞానము, వస్తువుయొక్కయధీనము గలదగును. ధ్యానము, పురుషునియొక్క అధీనముగలదగును. కనుక, వస్తుతంత్ర కర్తృతంత్రములచేత జ్ఞానోపాసనములకు రెంటికిని భేదము గలిగియున్నదని తెలియవలెను.

అవ. ఇతర భేదసిద్ధికొరకు, బోధకుహేత్వాదికమును రెండు శ్లోకములచే జూపుచున్నాడు.

శ్లో॥ విచారాజ్జాయతేబోధోనిచ్ఛాయన్ననివర్తయేత్।
స్వోత్పత్తిమాత్రాత్సంసారేదహత్యఖిలసత్యతాం॥ ౭౪.

టీ. అనిచ్ఛా-అనిచ్ఛ, అనగా బోధలేక పోవుగాకయనెడి ఈరూపము గలయిచ్ఛయనుట. యం- ఏబోధను, ననివర్తయేత్ - నివారింపజేయజాలదో, (సః) ఆబోధః-బోధ, విచారాత్-వస్తుతత్వవిచారమువలన, జాయతే- పుట్టుచున్నది. స్వోత్పత్తిమాత్రాత్=స్వ-తనయొక్క, ఉత్పత్తిమాత్రాత్ - జననమాత్రమువలన, సంసారే-సంసారమందు, అఖిలసత్యతాం=అఖిల-సకలప్రపంచముయొక్క, సత్యతాం-సత్యత్వమును, దహతి-నాశము జేయుచున్నది.

తా. వస్తుతత్వవిచారమువలన జ్ఞానముబుట్టుచున్నది. ఇదియునుంగాక, వస్తుతత్వవిచారమువలన బుట్టుచుండెడిజ్ఞానమును, (ఈజ్ఞానములేకపోవుగాక)యనెడి ఈరూపముగల, (అనిచ్ఛ) నివారింపజేయజాలదు. మరియు, బ్రహ్మవస్తువిచారమువలన బుట్టుచుండెడిజ్ఞానము, తనయుత్పత్తిమాత్రముచేత సంసా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రమంతు సర్వప్రపంచమునకు దోచుచుండెడి సత్యత్వమును నశింపజేయుచు న్నది.

శ్లో॥ తావతాకృతకృత్యస్సన్నిత్యతృప్తిముపాగతః।
జీవన్ముక్తిమనుప్రాప్య ప్రారబ్ధక్షయమీక్షతే॥ ౭౬.

టీ. తావతా-తత్త్వజ్ఞానోత్పత్తిమాత్రముచేత, కృతకృత్యస్సన్ = కృత-చేయబడిన, కృత్యస్సన్-కార్యవర్గముగలవాడగుచు, నిత్యతృప్తిం= నిత్యా-సర్వదా, తృప్తిం-తృప్తిని, అనగా నిరతిశయసుఖముననుట. ఉపాగతస్సన్-పొందినవాడగుచు, జీవన్ముక్తిం-జీవన్ముక్తిని, అనగా జీవించియుండియే సంసారబంధవిముక్తిననుట. అనుప్రాప్య-పొంది, ప్రారబ్ధక్షయం=ప్రారబ్ధ- ప్రారబ్ధకర్మముయొక్క, క్షయం-నాశమును, ఈక్షతే- చూచుచున్నాడు. అనగా గోరుచున్నాడనుట.

తా. మరియు, బ్రహ్మతత్త్వజ్ఞానోత్పత్తిమాత్రముచేత, కృతకృత్యుడగుచు, నిత్యతృప్తిని బొందినవాడగుచు, జీవన్ముక్తినిబొంది, ప్రారబ్ధ కర్మక్షయమును గోరుచున్నాడు.

అవ. ఇట్లు, ఉపాసనముకంటె అపరోక్షజ్ఞానమునకు భేదమునుజూపి, ఇప్పుడు జ్ఞానముకంటె నుపాసనమునకు నితరభేదము సిద్ధించెడికొరకు, ఆయుపాసననును జూపుచున్నాడు.

శ్లో॥ ఆప్తోపదేశంవిశ్వస్య శ్రద్ధాళురవిచారయన్।
చింతయేత్ప్రత్యయైరన్యైరనంతరితవృత్తిభిః॥ ౭౭.

టీ. శ్రద్ధాళుః-శ్రద్ధగలవాడు, ఆప్తోపదేశం=ఆప్త- గురునియొక్క, ఉపదేశం-ఉపాసింపదగిన బ్రహ్మస్వరూపమును ప్రతిపాదించెడి వాక్యసమూహమును, విశ్వస్య-నమ్మి, అవిచారయన్-విచారమును జేయనివాడగుచు, (ఉపాస్యతత్త్వం) ఉపాసించుటకు యోగ్యమగు బ్రహ్మస్వరూపమును, అన్యైః-ఇతరములగు, ప్రత్యయైః- విజాతీయఘటాదివిషయములచేత, అనంతరితవృత్తిభిః=అనంతరిత-విడువబడిన, వృత్తిభిః - సజాతీయవృత్తులచేత, చింతయేత్-ధ్యానించవలెను. అనగా నుపాసనము జేయుచుండుననుట.

తా. గురునివలన ఉపాసింపదగిన బ్రహ్మస్వరూపమును ప్రతిపాదించెడివాక్యసంఘమునునమ్మి, విచారము జేయనివాడగుచు, ఉపాసింపదగిన బ్రహ్మస్వరూపమును, విజాతీయములగు ఘటాది విషయముచేత విడువబడిన, సజాతీయములగు ఆనందాదిగుణగోచరవృత్తులచేత ధ్యానించుచుండవలెను.

శ్లో॥ యావచ్చింత్యస్వరూపత్వాభిమానస్స్వస్య జాయతే।

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తావద్విచింత్య పశ్చాచ్చ తథైవామృతి ధారయేత్॥ ౭౮.

టీ. స్వస్య-తనకు, యావత్ - ఎంతకాలమునకు, చింత్యస్వరూపత్వాభిమానః=చింత్య-చింతింపదగిన బ్రహ్మముయొక్క, స్వరూపత్వ - స్వరూపత్వముయొక్క, అభిమానః-అభిమానము, జాయతే-కలుగుచున్నదో, తావత్- అంతపర్యంతము, విచింత్య-చింతించి, అనగా ధ్యానించియనుట. పశ్చాచ్చ- తదనంతరంబును, తథైవ-ఆప్రకారమే, ఆమృతి-మరణపర్యంతము, ధారయేత్-ధరించవలెను.

తా. ప్ర. అయితే, ఇట్లు ఎంతకాలపర్యంతము చింతించవలెనో చెప్పుము? ఉ. ఆనందాది గుణగోచరవృత్తులచేత, ధ్యానింపబడెడి బ్రహ్మస్వరూపముయొక్క అభిమానము, తనకెంతకాలమునకు గలుగునో, అంతపర్యంతము ధ్యానించి, తదనంతరముగూడ, తనకుగలిగిన బ్రహ్మస్వరూపాభిమానమును మరణపర్యంతము, చిత్తమందు ధరించియుండవలెను.

అవ. ఉపాసకునకు ఉపాసింపబడెడి వస్తువుయొక్క రూపత్వాభిమానము గలుగుననెడి విషయము నుదాహరణ ప్రదర్శనముచేసిప్పుడు స్పష్టముచేయుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మచారీభిక్షమాణో యుతస్సంవర్గవిద్యయా।
సంవర్గరూపతాంచిత్తే ధారయిత్వాహ్యభిక్షత॥ ౭౯.

టీ భిక్షమాణః-భిక్షాటనముజేయుచుండెడి, బ్రహ్మచారీ- బ్రహ్మచారియగు, (కశ్చిత్) ఒకానొకయతి, సంవర్గవిద్యయా- సంవర్గవిద్యతోటి, యుతస్సన్-కూడినవాడగుచు, చిత్తే-చిత్తమందు, సంవర్గరూపతాం-సంవర్గరూపత్వమును, అనగా ప్రాణరూపముననుట. ధారయిత్వా-ధరించి, అభిక్షత-భిక్షాటనము జేసినవాడాయెను.

తా. ఒకానొక, సంవర్గత్వ గుణవిశిష్టుడగు, (అనగా ప్రాణోపాసకుడగు) బ్రహ్మచారి, భిక్షాహారార్థము కొరకువచ్చి, అభిప్రతారియనెడి పేరుగల రాజుయొక్క యెదుట, తనయొక్క సంవర్గరూపత్వము చిత్తమందు ధరింపబడినట్లు ప్రకటీకరించినవాడాయెనని ఛాందోగ్యశ్రుతియందు, శ్రు॥ మహాత్మనశ్చతురో దేవ ఏకస్సోఽజ్జగార భువనస్య గోపాః. తంకాపేయ నాభి పశ్యంతిమర్త్యా, అభిప్రతారిన్ బహుధావసంతం॥ అనెడి మంత్రముచేత వినబడుచున్నది. కనుక మృతిపర్యంతము, బ్రహ్మస్వరూపత్వాభిమానమును చిత్తమందు ధరించుటకు శక్యమగునని యభిప్రాయము.

అవ. మృతిపర్యంతము బ్రహ్మరూపత్వాభిమానమును ధరించుటయం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దు నిమిత్తమునుజూపుచు, (౭౫) డెబ్బదియైదవ శ్లోకమందు జెప్పబడిన బోధ ధర్మముకంటె, ఉపాసనమునకు భేదము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ పురుషస్యేచ్ఛయాకర్తుమకర్తుం కర్తుమన్యథా।
శక్యోపాస్తిరతో నిత్యంకుర్యాత్ప్రత్యయసంతతిం॥ ౮౦.

టీ. ఉపాస్తిః-ధ్యానము, పురుషస్య - ఉపాసనము జేసెడి వానియొక్క, ఇచ్ఛయా-ఇచ్ఛచేత, కర్తుం-చేయుటకును, అకర్తుం-చేయకుండుటకును, అన్యథా- మరియొకవిధముగా, కర్తుం-చేయుటకును, శక్యా-శక్యమైనదగును. అతః- ఆకారణమువలన, అనగా నుపాసనము పురుషునియొక్క యిచ్ఛకధీనమైనద గుటచేననుట. నిత్యం-సర్వదా, ప్రత్యయసంతతిం=ప్రత్యయ-ఆనందాదిసజా తీయగుణగోచరవృత్తులయొక్క, సంతతిం-సంతానమును, అనగా నుపాసన మననుట. కుర్యాత్-చేయవలెను.

తా. ఉపాసనము, ఉపాసకునియొక్క యిచ్ఛచేత జేయుటకును, చేయ కుండుటకును, మరియొక విధముగా జేయుటకును శక్యమైన దగును. ఇట్లు పురుషునియొక్క యిచ్ఛకు అధీనమైనదగుటచేత; ఉపాసనమును సర్వదాచే యవలెనని యభిప్రాయము.

శ్లో॥ వేదాధ్యాయీహ్యప్రమత్తోఽధీతేస్వప్నేఽభివాసితః।
జపితాతుజపత్యేవతథాధ్యాతాపివాసయేత్॥ ౮౧.

టీ. అప్రమత్తః-అప్రమత్తుడగు, వేదాధ్యాయీ-సర్వదా అధ్యయనశీ లుడగుపురుషుడు, అభివాసితః-దృఢవాసన గలిగియుండుటవలన, అనగా దృ ఢవాసనచేననుట. స్వప్నే-స్వప్నావస్థయందు, అధీతే-అధ్యయనము జేయుచు న్నాడు. హి-ఇది ప్రసిద్ధమనుట. అప్రమత్తః-అప్రమత్తుడగు, జపితా- సర్వ దా జపశీలుడగు పురుషుడును, అభివాసితః-దృఢవాసన గలిగియుండుటవలన, అనగా దృఢవాసనచేననుట. స్వప్నే-స్వప్నావస్థయందు, జపత్యేవ- జపముజే యుచున్నవాడేయగును. తథా-ఆప్రకారము, ధ్యాతాపి-ఉపాసకుడును,అప్ర మత్తస్సన్-అప్రమత్తుడగుచు, స్వప్నే-స్వప్నావస్థయందు, వాసయేత్- ధ్యాన మును నివసింపజేయవలెను.

తా. ప్ర. అయితే, ఈ పూర్వోక్తప్రకారము (సర్వదా) ఆనందాది గుణములచేత లక్షితమగు, అఖండైకరసాత్మ, వేనైతినని చింతించుటవలన, ఏమి గలుగునో జెప్పుము?. ఉ.అప్రమత్తుడగు, సర్వదా అధ్యయనశీలపురుషుడు దృ ఢవాసనచేత స్వప్నాదులయందు నధ్యయనము జేసినట్లును, మరియు, అప్రమ త్తుడగు సర్వదా జపశీలపురుషుడు దృఢవాసనచేత స్వప్నాదులయందు జపము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేసినట్లును, ఈప్రకారముగా నుపాసకుడును వాసనాదార్ఢ్యతవలన స్వప్నాద్యవస్థయందును ధ్యానమును జేయునని తెలియవలెను.

అవ. స్వప్నాదికమందు ధ్యానమనువర్తించుటకు కారణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ విరోధిప్రత్యయంత్యక్త్వానైరంతర్యేణభావయన్।
లభతేవాసనావేశాత్స్వప్నాదావపిభావనాం॥ ౮౨.

టీ. (ఉపాసకః) ఉపాసకుడు, విరోధిప్రత్యయం=విరోధి - ఇతరమగు, ప్రత్యయం-ఘటాదివిషయమును, త్యక్త్వా-విడిపించి, నైరంతర్యేణ - నిరంతరముగా, భావయన్-ధ్యానము జేయుచున్నవాడగుచు, వాసనావేశాత్-సంస్కారసామర్థ్యమువలన, స్వప్నాదావపి-స్వప్నాద్యవస్థయందును, భావనాం-ధ్యానమును, లభతే - పొందుచున్నాడు.

తా. ఉపాసకుడు, విజాతీయమగు ఘటాదివిషయమును తలచక, ఆనందాదిగుణములచేత లక్షితమగు బ్రహ్మము, నేనైతినని నిరంతరముగా ధ్యానించుచు, సంస్కారసామర్థ్యమువలన, స్వప్నాద్యవస్థయందును, ధ్యానమును జేయుచున్నాడని తెలియవలెను.

శ్లో॥ భుంజానోఽపినిజారబ్ధమాస్థాతిశయతోఽనిశం।
ధ్యాతుంశక్తోనసందేహోవిషయవ్యసనీయథా॥ ౮३.

టీ. (ఉపాసకః) ఉపాసకుడు, నిజారబ్ధం = నిజ-స్వకీయమగు, ఆరబ్ధం-ప్రారబ్ధకర్మమును, భుంజానోఽపి - అనుభవించుచున్నవాడైనను, ఆస్థాతిశయతః- ఆస్థాతిశయమువలన, విషయవ్యసనీయథా=విషయ - పరపురుషసమాగమమందు, వ్యసనీయథా - కామజనితవ్యసనముగలస్త్రీవలె, అనిశం - సర్వదా, ధ్యాతుం-ధ్యానించుటకు, శక్తః- సమర్థుడగును. సందేహః - సంశయము, న-లేదు.

తా. ప్ర. అయితే, ప్రారబ్ధకర్మవశమువలన విషయసుఖముల ననుభవించెడి యుపాసకునకు, నిరంతరముగా భావనాసిద్ధి, యెట్లుగలుగును?. ఉ. ఉపాసకుడు, తన ప్రారబ్ధకర్మవశమువలన గలిగెడి సుఖదుఃఖముల ననుభవించుచున్నవాడైనను, ఆస్థాతిశయముచేత, (పరపురుషునియందు కామజనిత వ్యసనముగల స్త్రీవలె,) సర్వదా, ధ్యానించుటకు సమర్థుడగును.

అవ. ఈ దృష్టాంతమును వివరించి చెప్పుచున్నాడు.

శ్లో॥ పరవ్యసనినినారీవ్యగ్రాపిగృహకర్మణి।
తదేవాస్వాదయత్యంతఃపరసంగరసాయనం॥ ౮४.

టీ. పరవ్యసనినీ=పర-పరపురుషునియందు, వ్యసనినీ- కామజన్యవ్యసన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగల, నారీ-స్త్రీ, గృహకర్మణి=గృహ- గృహవిషయమగు, కర్మణి- కార్యవర్గమును జేయుటయందు, వ్యగ్రాపి- సామర్థ్యముగలదైనను, అంతః - మనస్సులోపట, తత్-ఆ, పరసంగరసాయనం = పరసంగ - పరపురుష సంభోగముచేతగలిగెడి, రసాయనం-సుఖవిశేషమును, ఆస్వాదయతి- చింతనము జేయుచున్నది.

తా. పరపురుషసంగమమందు కామజనితవ్యసనముగలవనిత, గృహవిషయకార్యములను జేయుటయందు సామర్థ్యముగలదైనను, పరపురుష సంగముచేత గలిగెడి ఆ సుఖవిశేషమునే, సర్వదా చింతించుచుండును.

శ్లో॥ పరసంగంస్వాదయంత్యా అపినోగృహకర్మతత్।
కుంఠీభవేదపిత్వేతదాపాతేనైవవర్తతే॥ ౮౫.

టీ. పరసంగం=పర-పరపురుషునియొక్క, సంగం - సంభోగమును, స్వాదయంత్యాః-సర్వదాచింతనము జేయుచుండెడి స్త్రీవలన, తత్- ఆ, గృహకర్మాపి-గృహకర్మంబును, నోకుంఠీభవేత్-చెడదు. ఐనను, అనగా నట్లుచెడకున్ననుట. ఏతత్-ఈగృహకర్మమునుగురించి, ఆపాతేనైవ - ఆపాతముచేతనే, వర్తతే-వర్తించుచున్నది. అనగా గృహకృత్యమును కొంచెముగా జేయుచున్నదనుట.

తా. ప్ర. అయితే, పరపురుష సంగమమునే చింతించుచున్నయెడల, గృహకృత్యము చెడదాయేమి? ఉ. పరపురుషసంగమమును సర్వదా చింతించుచుండెడి స్త్రీవలన, గృహకర్మంబును చెడదు. అట్లు చెడకున్నను, ఆస్త్రీ, ఈ గృహకృత్యమునుగురించి, ఆపాతముచేత ప్రవర్తించుచున్నది.

అవ. ఆపాతముచేత ప్రవర్తించుచున్నదని చెప్పినయర్థము నిప్పుడు వివరించుచున్నాడు.

శ్లో॥ గృహకృత్యవ్యసనినీయథాసమ్యక్కరోతితత్।
పరవ్యసనినీతద్వన్నకరోత్యేవసర్వధా॥ ౮౬.

టీ. గృహకృత్యవ్యసనినీ=గృహకృత్య- గృహకార్యములయందు, వ్యసనినీ- వ్యసనముగలవనిత, తత్-ఆగృహకార్యవర్గమును. యథా-ఏప్రకారము, సమ్యక్-లెస్సగా, కరోతి - చేయుచున్నదో, తద్వత్-ఆప్రకారము, పరవ్యసనినీ-పర-పరపురుషునియందు, వ్యసనినీ- కామజనితవ్యసనముగల వనిత, సర్వధా-సర్వవిధములచేతను, నకరోత్యేవ- చేయనేచేయదు.

తా గృహకార్యములయందు వ్యసనముగలవనిత, ఆ గృహకార్యవర్గము ప్రకారము లెస్సగా జేయుచున్నదో, ఆప్రకారము పరపురుషునియందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కామజనిత వ్యసనముగలవనిత, సర్వవిధములచేతను జేయనే జేయదు. అనగా కొంచెముగా జేయునని యభిప్రాయము.

అవ. ఈ దృష్టాంతసిద్ధార్థమును దార్ష్టాంతికమందు గూర్చుచున్నాడు.

శ్లో॥ ఏవంధ్యానైకనిష్ఠోపి లేశా లౌకికమాచరేత్।
తత్త్వవిత్త్వవిరోధిత్వాల్లౌకికంసమ్యగాచరేత్॥ ౮౭.

టీ. ఏవం-ఈదృష్టాంతప్రకారము, ధ్యానైకనిష్ఠోపి = ధ్యాన- ఉపాసనమందు, ఏకనిష్ఠోపి-ఏకనిష్ఠగలవాడును, లౌకికం-లౌకికవ్యవహారమును, లేశాత్-కొంచెముగా, ఆచరేత్- ఆచరించును. అనగా జేయుననుట. తత్త్వవిత్తు-జ్ఞానియో, లౌకికం-లౌకికవ్యవహారమును, అవిరోధిత్వాత్- జ్ఞానమునకు విరోధము కానిదగుటవలన, సమ్యక్-విశేషముగా, ఆచరేత్ - చేయును.

తా. ఈదృష్టాంతప్రకారము, ధ్యాననిష్ఠుడును లౌకిక వ్యవహారమును కొంచెముగా జేయును. ప్ర. అయితే, జ్ఞానియు, లౌకికవ్యవహారమును కొంచెముగా నాచరించునో, లేక, విశేషముగా నాచరించునో చెప్పుము? ఉ. విషయ వ్యవహారము, తత్త్వజ్ఞానమునకు విరోధిగామిచేత, ఆ లౌకిక వ్యవహారమును, జ్ఞాని, విశేషముగా నాచరించునని తెలియవలెను.

అవ. ఆవిరోధముగామినే, ఇప్పుడు చూపుచున్నాడు.

శ్లో॥ మాయామయఃప్రపంచోయు మాత్మాచైతన్య రూపధృత్।
ఇతిబోధేవిరోధఃకోలౌకికవ్యవహారిణః॥ ౮౮.

టీ. అయం-ఈ, ప్రపంచః-జగంబు, మాయామయ ఇతి-మాయామయ మనునట్టియు, ఆత్మా-ప్రత్యగాత్మ, చైతన్యరూపధృదితి=చైతన్యరూప- చేతన రూపమును, ధృదితి-ధరించినవాడనెడి యీరూపముగల, బోధేసతి-జ్ఞానముగలిగియుండగా, లౌకికవ్యవహారిణః=లౌకిక- లోకసంబంధమగు, వ్యవహారిణః-వ్యవహారముగలవానికి, విరోధః-విరోధము, కః-ఏమి. అనగా లౌకిక వ్యవహారము జ్ఞానికి విరోధముగాదనుట.

తా. ఈ ప్రపంచమంతయు మాయామయమనునట్టియు,ఆత్మ, చైతన్య రూపుడనునట్టి ఈరూపముగల జ్ఞానముగలిగియుండగా, లౌకిక వ్యవహారము నాచరించెడి జ్ఞానికి విరోధమేమియులేదు.

అవ. విరోధములేమినే, స్పష్టీకరించుచున్నాడు.

శ్లో॥ అపేక్షతేవ్యవహృతిర్న ప్రపంచస్యవస్తుతాం।
నాపాత్మజాడ్యంకింత్వేషా సాధనాన్యేవకాంక్షతే॥ ౮౯.

టీ. వ్యవహృతిః-వ్యవహారము, ప్రపంచస్య - జగంబునకు, వస్తుతాం-


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వస్తుత్వమును, నాపేక్షతే-అపేక్షించదు. ఆత్మజాడ్యమపి= ఆత్మ-తనకు, జాడ్యమపి-జడస్వభావంబును, న-లేదు. కింతు-మరియేమనగా, ఏషా - ఈవ్యవహారము, సాధనాన్యేవ-సాధనములనే, కాంక్షతి-అపేక్షించుచున్నది.

తా. వ్యవహారము, ప్రపంచమునకు వస్తుత్వమున పేక్షించదు. మరియు, తనకు జడస్వభావంబునులేదు. మరియేమనగా, ఈ వ్యవహారము సాధనములనుమాత్రమపేక్షించుచున్నది. కనుక, జ్ఞానికి వ్యవహారమువిరోధముగాదు. అనగా వ్యవహారము, ప్రపంచమునకు వస్తుత్వము నపేక్షించినను, తనకు జడస్వభావముగలిగియున్నను, విరోధియగుననియు, అట్టి యపేక్షాస్థితులు లేమిచేత జ్ఞానికి వ్యవహారము విరోధిగాదని యభిప్రాయము.

అవ. ఆవ్యవహారసాధనము లెవ్వియనగా జెప్పుచున్నాడు.

శ్లో॥ మనోవాక్కాయతద్బాహ్యపదార్థాస్సాధనానితాన్।
తత్త్వవిన్నోపమృద్నాతివ్యవహారోఽస్యనోకుతః॥ ౯౦.

టీ. మనోవాక్కాయ తద్బాహ్యపదార్థాః= మనః - మనస్సును, వాక్-వాక్కును, కాయ-దేహంబును, తత్ - ఆ మనోవాగ్దేహములకంటె, బాహ్య-బాహ్యములగు, పదార్థాః- గృహక్షేత్రాదులును, సాధనాని - వ్యవహారసాధనములగును. తత్త్వవిత్-జ్ఞాని, తాన్-ఆవ్యవహారసాధనములను, నోపమృద్నాతి-నివారింపజేయలేడు. అస్య-ఈజ్ఞానికి, వ్యవహారః-వ్యవహారము, కుతః- ఎందువలన, నో-లేదు. అనగానుండుననుట.

తా. మనోవాగ్దేహములును, ఆ మనోవాగ్దేహములకంటె బాహ్యమందుండెడి గృహక్షేత్రాదులును, వ్యవహారమునకు సాధనములగును. జ్ఞానియగువాడు, ఆవ్యవహారసాధనములను నివారింపజేయలేడు. అందువలన ఈజ్ఞానికి వ్యవహారమెందుకు గలుగదో చెప్పుము.

శ్లో॥ ఉపమృద్నాతిచిత్తంచేద్ధ్యాతాసౌనతుతత్త్వవిత్।
నబుద్ధింమర్దయన్దృష్టోఘటతత్త్వస్యవేదితా॥ ౯౧.

టీ. చిత్తం-చిత్తమును, ఉపమృద్నాతిచేత్ - పీడించుచున్నాడని యంటివేని, అసౌతు-వీడో, ధ్యాతా-ధ్యానము జేసెడివాడేయగుగాని, తత్త్వవిత్-జ్ఞాని, న-కాడు. ఘటతత్త్వస్య-ఘటస్వరూపమును, వేదితా - ఎరిగెడివాడు, బుద్ధిం-బుద్ధిని, మర్దయన్-పీడించుచు, అనగా చిత్తైకాగ్ర్యమును జేయుచుననుట. దృష్టః - చూచుచున్నవాడుగాడు.

తా. ప్ర. అయితే, జ్ఞానిచేత విషయములు మర్దింపబడకున్నను, చిత్తామర్దనము జేయదగినది కాదాయేమి?. ఉ. అట్లు చిత్తమును పీడించెడివాడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉపాసకుడేయగుగాని జ్ఞానిగాడు. ప్ర. అయితే, జ్ఞానిచేత చిత్తము పీడింపబడదనెడి ఈవిషయ మెచ్చట గనబడుచున్నదో చెప్పుము?. ఉ. ఘటస్వరూపము నెరిగెడి పురుషుడు బుద్ధినిపీడించుచు (అనగాజిత్తైకాగ్ర్యము జేయుచు) అనుభవింపబడినవాడులేడు.

శ్లో॥ సకృత్ప్రత్యయమాత్రేణఘటశ్చేద్భాసతేసదా।
స్వప్రకాశోఽయమాత్మాకింఘటవచ్చనభాసతే॥ ౯౨.

టీ. ఘటః-ఘటము, సకృత్ప్రత్యయమాత్రేణ=సకృత్- ఒకానొక-ప్రత్యయమాత్రేణ- విషయమాత్రనుచేత, సదా-ఎల్లప్పుడును, భాసతేచేత్ - ప్రకాశించుచున్నదనియంటివేని, స్వప్రకాశః-స్వప్రకాశమానుడగు, అయం- ఈ, ఆత్మా-ప్రత్యగాత్మ, ఘటవచ్చ-ఘటమువలెను, నభాసతేకిం- ప్రకాశించుచున్నవాడుగాడాయేమి. అనగా నధిక స్పష్టముగా ప్రకాశించుచున్నదనుట.

తా. ప్ర. అయితే, ఘటమునకు స్థూలత్వముచేత స్పష్టత్వము గలిగియుండుటవలన, ఆ ఘటమును జూచుటయందు చిత్తైకాగ్ర్య మపేక్షింపబడదు. బ్రహ్మమునకు స్థూలత్వములేమిచేత, ఆ బ్రహ్మమును దెలియుటయందు, ఆచిత్తైకాగ్ర్య మపేక్షింపబడునుగదా?. ఉ. ఒకానొక విషయమాత్రముగా బ్రకాశించెడి ఘటమువలె, స్వయంప్రకాశమానుడగు ఈప్రత్యగాత్మ, ప్రకాశింపడాయేమి. అనగా నాయాత్మకు స్వప్రకాశత్వముచేత ఘటముకంటెనధికస్పష్టత్వము గలిగియుండుటవలన, ఆయాత్మజ్ఞానమందు చిత్తనిగ్రహ మపేక్షింపబడదని యభిప్రాయము.

శ్లో॥ స్వప్రకాశతయాకింతేతద్బుద్ధిస్తత్త్వవేదనం।
బుద్ధిశ్చక్షణనాశ్యేతిచోద్యంతుల్య ఘటాదిషు॥ ౯౩.

టీ. స్వప్రకాశతయా- స్వప్రకాశత్వముచేత, తే-నీకు, కిం- ప్రయోజనమేమి. అనగా బ్రయోజనములేదనియుననుట. తద్బుద్ధిః-తత్- ఆబ్రహ్మవిషయకమగు, బుద్ధిః-బుద్ధివృత్తి, తత్త్వవేదనం-తత్త్వజ్ఞానమనియు, బుద్ధిశ్చ - బుద్ధివృత్తియు, క్షణనాశ్యేతి- క్షణ - క్షణముచేత, నాశ్యేతి - నశింపదగినదగుననెడి, చోద్యం-ఆక్షేపము, ఘటాదిషు ఘటాదులయందు, తుల్యం- సమానమగును.

తా. ప్ర. అయితే బ్రహ్మమునకు స్వప్రకాశత్వము గలిగియున్నను, ఆబ్రహ్మము నెరిగెడి బుద్ధివృత్తికే, తత్త్వజ్ఞానత్వము గలిగియుండుట వలనను, మరియు, ఆబుద్ధివృత్తి, ప్రతిక్షణమందును నశించుచుండుటచేతను, ఆబుద్ధివృత్తిని మాటిమాటికిని బ్రహ్మమందు స్థాపించుటయైన నపేక్షింపబడదాయేమి?. ఉ. ఈచోద్యమంతయు ఘటాదులయందును సమానమేయగును. అనగానీయా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్షేపప్రకారము ఘటజ్ఞానంబునకును క్షణికత్వము సంభవించునని యభిప్రాయము. క్షణికత్వమనగా క్షణకాలముండుటయగును.

శ్లో॥ ఘటాదౌ నిశ్చితే బుద్ధిర్నశ్యత్యేవ యదా ఘటః।
ఇష్టో నేతుం తదా శక్య ఇతి చేత్సమమాత్మని॥ ౯౪.

టీ. ఘటాదౌ-ఘటాదివిషయము, నిశ్చితేసతి - నిశ్చయింపబడుచుండగా, బుద్ధిః-బుద్ధి, నశ్యత్యేవ-నశించుచున్నదేయగును. ఘటః ఘటము, యదా-ఎప్పుడు, ఇష్టః-ఇచ్ఛయింపబడునో, తదా-అప్పుడు, ఆనేతుం-పొందుటకు, అనగా వ్యవహరించుటకనుట. శక్య ఇతిచేత్ - శక్యమగుననియంటివేని, ఆత్మని-ఆత్మయందు, సమం-సమానమగును.

తా. ప్ర. అయితే, ఘటాదిజ్ఞానమునకు క్షణికత్వము గలిగియున్నను, ఒకానొకప్పుడు నిశ్చయింపబడిన ఘటాదివిషయమును సర్వదా వ్యవహరించుటకు శక్యమగుటవలన, ఆ ఘటాదిజ్ఞానవిషయమై చిత్తస్థిరత్వమును సంపాదించుట, అప్రయోజకముగాదాయేమి? ఉ. సరి. అట్లైనయెడల, ఇది యాత్మయందును సమానమేయగును.

అవ. ఆత్మయందుసమానమగునని చెప్పబడిన యర్థమును వివరించుచున్నాడు.

శ్లో॥ నిశ్చిత్య సకృదాత్మానం యదాపేక్షా తదైవ తం।
వక్తుం మంతుం తథా ధ్యాతుం శక్నోత్యేవ హి తత్త్వవిత్॥ ౯౫.

టీ. తత్త్వవిత్-జ్ఞాని. సకృత్-ఒకసారి, ఆత్మానం - ప్రత్యగాత్మను, నిశ్చిత్య-నిశ్చయించి, అనగా నెరిగియనుట. యదా-ఎప్పుడు, అపేక్షా - ఇష్టముకలుగునో, తదైవ- అప్పుడే, తం-ఆయాత్మను, వక్తుం - చెప్పటకును, మంతుం-ఎరుగుటకును, తథా - ఆప్రకారము, అనగా తానెరిగిన ప్రకారమనుట. ధ్యాతుం- ధ్యానము జేయుటకును, శక్నోత్యేవ - సమర్థుడేయగును.

తా. జ్ఞానియు, ఒకసారి ప్రత్యగాత్మనెరిగి, తనకెప్పుడిష్టమగునో అప్పుడు, ఆప్రత్యగాత్మను, తానెరిగినప్రకారము (యథార్థముగా) చెప్పటకును, ఎరుగుటకును, ధ్యానించుటకును సమర్థుడేయగును. అనగాజ్ఞానియు, ఆత్మనెరుగుటయందు చిత్తస్థిరత్వమును సంపాదించుట, అప్రయోజకమే యగునని యభిప్రాయము.

శ్లో॥ ఉపాసక ఇవ ధ్యాయన్ లౌకికం విస్మరేద్యది।
విస్మరత్యేవ సా ధ్యానాద్విస్మృతిర్న తు వేదనాత్॥ ౯౬.

టీ. (తత్త్వవిచ్చ) జ్ఞానియు, ఉపాసక ఇవ - ఉపాసకునివలె, ధ్యాయన్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధ్యానము జేయుచు, లౌకికం లోకవ్యవహారమును, విస్మరేద్యది-మరువవలెనని యంటివేని, ధ్యానాత్-ధ్యానమువలన, విస్మరత్వేన-మఱపుగలుగుటచేత, స్యా-త్, విస్మృతిః-విస్మృతిగలుగును. అనగా ధ్యానమువలన విస్మృతి గలుగును నుట. వేదనాత్తు-జ్ఞానమువలననో, న-విస్మృతిగలుగదు.

తా. ప్ర. అయితే, ఉపాసకునివలెజ్ఞానియు, ఆత్మానుసంధానవశము వలన జగదనుసంధానరహితుడై కనబడుచుండవలదాయేమి?. ఉ. ఆజగదను సంధానరాహిత్యము, ధ్యానముతోగూడినదే యగుగాని, జ్ఞానముతోగూడినది గాదు. అనగా, ఉపాసకుడు ధ్యానమువలన జగంబును మరచుచున్నాడనియు, జ్ఞాని, మరువడనియుం దెలియవలెను. విస్మృతియనగా, జగంబును స్మరింప కుండుటయగును.

శ్లో॥ ధ్యానంత్వైచ్ఛికమేతస్య వేదనాన్ముక్తిసిద్ధితః।
జ్ఞానాదేవతు కైవల్యమితిశాస్త్రేషుడిండిమః॥ ౯౭.

టీ. ధ్యానంతు-ధ్యానమో, ఐచ్ఛికం - ఇచ్ఛకధీనమైన దగును. అనగా బురుషుని ఇష్టప్రకారముగా జేయదగినదగుననుట. ఏతస్య - ఈ బ్రహ్మము యొక్క, వేదనాత్- జ్ఞానమువలన, ముక్తిసిద్ధితః - మోక్షము సిద్ధించుచున్నద నుట. జ్ఞానాదేవతు-జ్ఞానమువలననే, కైవల్యమితి- మోక్షముగలుగుచున్నదని, శాస్త్రేషు - వేదాంతశాస్త్రములయందు, డిండిమః- ఢమారావాద్యమగును. అనగా వేదాంతశాస్త్రసిద్ధాంతమగుననుట.

తా. ప్ర. అయితే, జ్ఞానిచేగూడ. మోక్షసిద్ధికొరకు బ్రహ్మధ్యానము జేయదగినదేయగుగదా?. ఉ. ధ్యానము,పురుషునియొక్క యిష్టప్రకారముగా జేయదగినదగును. ఈబ్రహ్మజ్ఞానమువలన ముక్తిసిద్ధించుచున్నదనియు, ఆపర మాత్మనెరిగి మృత్యువునతిక్రమించుచున్నాడనియు, మోక్షపదమును బొందుట కు జ్ఞానమార్గముతప్ప, మరియొకమార్గము లేదనియు,ఆపరమాత్మనెరిగి, సర్వ బంధములచేత విడువబడుచున్నాడని, శ్రు॥ జ్ఞానాదేవతుకైవల్యం ప్రాప్యతే యేనముచ్యతే. తమేవంవిదిత్వాతిమృత్యుమేతి. నాన్యఃపంథావిద్యతేయనాయ, జ్ఞాత్వాదేవంముచ్యతేసర్వపాశైః॥ అనెడి యిత్యాది శ్రుతులు జెప్పుచున్నవి. కనుక, మోక్షముకొరకు ధ్యానము జేయదగినదిగాదని యభిప్రాయము.

శ్లో॥ తత్వవిద్యదినధ్యాయే త్ప్రవర్తేతతదాబహిః।
ప్రవర్తతాంసుఖేనాయంకోబాధోస్యప్రవర్తనే॥ ౯౮.

టీ. తత్వవిత్- జ్ఞాని, నధ్యాయేద్యది - ధ్యానము జేయనియెడల, తదా- అప్పుడు, బహిః-బాహ్యమందు, ప్రవర్తేతచేత్ - ప్రవర్తించునని యంటివేని,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అయం-ఈజ్ఞాని, సుఖేన-సుఖముగా, ప్రవర్తతాం- బాహ్యమందు ప్రవర్తించుగాక. అస్య-ఈజ్ఞానికి, ప్రవర్తనే-ప్రవర్తనమందు, బాధః-బాధ, కః- ఏమి. అనగా బాధలేదనుట.

తా. ప్ర. అయితే, జ్ఞానికిధ్యానము నంగీకరించనియెడల, అతనికిసర్వదా బాహ్యప్రవర్తనముగలుగదాయేమి?. ఉ. ఈజ్ఞాని, సుఖముగాబాహ్యమందుప్రవర్తించుగాక. ఈజ్ఞానికి బాహ్యప్రవర్తనముచేత బాధయేమియులేదు. అనగా నీజ్ఞానికి బాహ్యప్రవర్తనముచేత బాధకములేమివలన, ఆబాహ్యప్రవర్తన మంగీకరింపబడునని యభిప్రాయము.

శ్లో॥ అతిప్రసంగ ఇతిచేత్ప్రసంగం తావదీరయ।
ప్రసంగోవిధిశాస్త్రంచేన్నతత్తత్త్వవిదంప్రతి॥ ౯౯.

టీ. అతిప్రసంగఇతిచేత్- ప్రసంగాతిక్రమణము గలుగునని యంటివేని, తావత్-అచ్చట, అనగా జ్ఞానివిషయమైయనుట. ప్రసంగం- ప్రసంగమును, ఈరయ- చెప్పుము. విధిశాస్త్రం- విధినిషేధప్రతిపాదకశాస్త్రము,ప్రసంగశ్చేత్-ప్రసంగమగుననియంటివేని, తత్- ఆవిధినిషేధప్రతిపాదకశాస్త్రము, తత్త్వవిదంప్రతి- జ్ఞానినిగురించి, న-లేదు.

తా. ప్ర. అయితే, జ్ఞానికి బాహ్యప్రవర్తనము నంగీకరించిన యెడల, అతిప్రసంగము గలుగదాయేమి?. ఉ. ప్రసంగమెదియో జెప్పుము. అనగా ప్రసంగమును నిరూపించుటకు శక్యముగామివలన, జ్ఞానికి అతిప్రసంగము గలుగదని యభిప్రాయము. ప్ర. అయితే, విధినిషేధ ప్రతిపాదకశాస్త్రము, ప్రసంగశబ్దముచేత జెప్పబడుచుండగా, ప్రసంగమును నిరూపించుటకు శక్యముగాదని యెట్లుచెప్పితిరి?. ఉ. ఆవిధినిషేధప్రతిపాదకశాస్త్రము, అజ్ఞానివిషయమైనదేయగుగాని, జ్ఞానివిషయమైనదిగాదు. అనగా నజ్ఞానినిగురించిచెప్పినదేయగుగాని, జ్ఞానినిగురించి చెప్పినదిగాదని యభిప్రాయము.

అవ. విధినిషేధశాస్త్రమునకు అయజ్ఞానివిషయత్వము నే జూపుచున్నారు.

శ్లో॥ వర్ణాశ్రమవయోవస్థాభిమానోయస్యవిద్యతే।
తస్యైవచనిషేధాశ్చవిధయస్సకలా అపి॥ ౧౦౦.

టీ. వర్ణాశ్రమవయోవస్థాభిమానః=వర్ణ-బ్రాహ్మణాదివర్ణంబును, ఆశ్రమ-బ్రహ్మచర్యాద్యాశ్రమంబును, వయః-వయస్సును, అవస్థా - అవస్థయు, అభిమానః-అభిమానంబును, యస్య-ఏపురుషునకు, విద్యతే-గలదో, తస్యైవ-ఆపురుషునకే, సకలాః-సకలములైన, నిషేధాశ్చ- నిషేధములును, విధయశ్చాపి-విధులునుగలవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. బ్రాహ్మణాదివర్ణంబును, బ్రహ్మచర్యాద్యాశ్రమంబును, వయస్సును, అవస్థలును, అభిమానంబును, ఏపురుషునకుగలవో, వానికే సకలనిధినిషేధములు గలిగియున్నవని తెలియవలెను. అనగా నజ్ఞానికే వర్ణాశ్రమాదులు గలిగియుండుటచేత, సకలనిధినిషేధములును అజ్ఞానికే గలిగియున్నవని తెలియవలెను.

శ్లో॥ వర్ణాశ్రమాదయోదేహే మాయయాపరికల్పితాః।
నాత్మనోబోధరూపస్యేత్యేవంతస్యవినిశ్చయః॥ ౧౦౧.

టీ. మాయయా-మాయచేత, దేహే - దేహమందు, వర్ణాశ్రమాదయః-వర్ణాశ్రమాదులన్నియు, పరికల్పితాఇతి-కల్పించబడినవనియు, బోధరూపస్య-బోధరూపుడగు, ఆత్మనః-ఆత్మకు, నేతి-లేవనియు, ఏవం- ఈప్రకారముగా, తస్య- అజ్ఞానియొక్క, వినిశ్చయః- నిశ్చయమగును.

తా. ప్ర. అయితే, జ్ఞానియు దేహమునుధరియించియుండుటచేత,అజ్ఞానికిని వర్ణాశ్రమాద్యభిమానము గలిగియుండలేదాయేమి?. ఉ. మాయచేత దేహమందు వర్ణాశ్రమాదులన్నియుం గల్పించబడినవనియు,బోధరూపుడగు ఆత్మకు, (తనకు) ఆవర్ణాశ్రమాదిక మెద్దియులేదనియు, జ్ఞానియొక్క నిశ్చయమగును. కనుక, జ్ఞాని, దేహమును ధరించియున్నను, అతనికి వర్ణాశ్రమాద్యభిమానములేదని తెలియవలెను.

అవ. జ్ఞానికిచేయదగినది లేదనుటయందుశాస్త్రప్రమాణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ సమాధిమథకర్మాణిమాకరోతుకరోతువా।
హృదయేనాస్తసర్వాస్థోముక్తఏవోత్తమాశయః॥ ౧౦౨.

టీ. యః-ఏపురుషుడు, హృదయేన-బుద్ధిచేత, అస్తసర్వాస్థస్సన్=అస్తనిడువబడిన, సర్వ-సకలములగు, ఆస్థస్సన్- ఆసక్తివిశేషములుగలవాడగుచు, ఉత్తమాశయః=ఉత్తమ-నిర్మలమగు, ఆశయః- జ్ఞానముగలవాడో, (సః) వాడు, మాకరోతు-కర్మములనుచేయకుండుగాక . కరోతువా-కర్మములనుచేయుగాక. అనగా కర్మములను జేసినను జేయకున్ననుట. ముక్తఏవ - ముక్తుడేయగును. (అతః) ఆకారణమువలన, సమాధిమథకర్మాణి-సమాధి - సమాధిచేత, మథ-నాశమునుబొందిన, కర్మాణి-కర్మములగును.

తా. ప్ర. అయితే, జ్ఞానియొక్క నిశ్చయమునట్లుండనిమ్ము. అజ్ఞాని, చేయదగినదానిని శాస్త్రము ప్రతిపాదించుచుండలేదాయేమి?. ఉ. ఏ పురుషుడు, బుద్ధిచేత సకలాసక్తివిశేషములను నిశ్శేషముగా విడిచినవాడగుచు, నిర్మలజ్ఞానముగలవాడగునో, ఆపురుషుడు, కర్మములను చేసినను చేయకున్ననుము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్తుడేయగును. కనుకనే, అతనికర్మములన్నియు సమాధిచేత నాశమును బొందు చున్నవని, శాస్త్రము చెప్పుచున్నది. అనగా, ఆశాస్త్రంబును జ్ఞానికి జేయదగి నదిలేదని బోధించుచున్నదని యభిప్రాయము.

అవ. జ్ఞానికి జేయదగినది లేదనుటయందు మరియొక వాక్యము నుదాహ రించుచున్నాడు.

శ్లో॥ నైష్కర్మ్యేణనతస్యార్థస్తస్యార్థోస్తినకర్మభిః।
నసమాధానజప్యాభ్యాం యస్యనిర్వాసనంమనః॥ ౧౦౩.

టీ. యస్య-ఏపురుషునియొక్క, మనః-మనస్సు, నిర్వాసనం- వాసనలు లేనిదగునో, తస్య-ఆపురుషునకు, నైష్కర్మ్యేణ- కర్మత్యాగముచేత, అర్థః- ప్రయోజనము, న- లేదు. తస్య-ఆ పురుషునకు, కర్మభిః- కర్మములచేత, అన గా కర్మములను జేయుటచేననుట. అర్థః-ప్రయోజనము, నాస్తి - లేదు. సమా ధానజప్యాభ్యాం=సమాధాన- సమాధిచేతను, జప్యాభ్యాం- జపముచేతను, న- ప్రయోజనములేదు.

తా. మరియు, ఏ పురుషునియొక్క మనస్సు, వాసనాశూన్యము గలదగు నో, ఆ పురుషునకు కర్మత్యాగముచేత ప్రయోజనములేదనియు, కర్మములంజే యుటచేతను ప్రయోజనములేదనియు, సమాధిజపములచేతను, ప్రయోజనము లేదని ఈవాక్యము చెప్పుచున్నది.

శ్లో॥ ఆత్మాసంగస్తతోన్యత్స్యాదింద్రజాలంహిమాయికం।
ఇత్యచంచలనిర్ణీతేః కుతోమనసివాసనా॥ ౧౦౪.

టీ. ఆత్మా-ప్రత్యగాత్మ, అసంగ ఇతి-అసంగుడనియు, తతః- ఆప్రత్య గాత్మకంటె, అన్యత్- ఇతరమగు జగంబంతయు, మాయికం- మాయచేనిర్మిం పబడిన, ఇంద్రజాలంహి- ఇంద్రజాలమువంటిదగునసుడి, ఇతి- ఈప్రకారము గాగల, అచంచలనిర్ణీతేః=అచంచల-చాంచల్యములేని, నిర్ణీతేః- నిర్ణయముగల వానియొక్క, మనసి- మనస్సునందు, వాసనా - వాసన, కుతః - ఎక్కడిది. అనగా లేదనుట.

తా. ప్ర. అయితే, జ్ఞానులు వాసనానివృత్తికొరకు, ధ్యానమును జేయ వలయునుగదా?. ఉ. ఆత్మ, అసంగుడనియు, ఆయాత్మకంటె నన్యమగుజగం బంతయు, మాయాకల్పితమగుటచేత ఇంద్రజాలమువంటిదని, ఈప్రకారము స్థిరనిర్ణయముగల జ్ఞానియొక్క మనస్సునందు, వాసనలేనేలేదు. అనగా దృఢజ్ఞా నము గలవానికి వాసనే లేదని యభిప్రాయము.

శ్లో॥ ఏవంనాస్తిప్రసంగోపి కుతోఽస్యాతిప్రసంజనం।

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రసంగోయస్యతస్యైవశంక్యేతాతిప్రసంజనం॥ ౧౦౫:

టీ. ఏవం-ఈపూర్వోక్తప్రకారము, అస్య-ఈజ్ఞానికి, ప్రసంగోపి- ప్రసంగంబును, అనగా విధినిషేధశాస్త్రమనుట. నాస్తి- లేదు. అతిప్రసంజనం-అతిప్రసంజనము, అనగా విధినిషేధశాస్త్రాతిక్రమణమనుట. కుతః- ఎక్కడిది. అనగాలేదనుట. ప్రసంగః-విధినిషేధశాస్త్రము, యస్య-ఎవనికిగలదో,తస్యైవ-వానికే, అతిప్రసంజనం-విధినిషేధశాస్త్రాతిక్రమణము, శంక్యేత- శంకింపదగినదగును.

తా. ప్ర. సరి. ఈప్రకారమగుగాక. ఇట్లుచెప్పుటచేత ప్రకృతమందేమిగలిగెను?. ఉ. ఈపూర్వోక్తప్రకారము, ప్రసంగశబ్దముచేత జెప్పదగినవిధినిషేధశాస్త్రము, ఈజ్ఞానికిలేదు. అట్లులేకపోవుచుండగా, జ్ఞానికి, అతిప్రసంగశబ్దముచే జెప్పదగినశాస్త్రాతిక్రమణదోషము గలుగదు. ప్ర. అయితే, అతిప్రసంగశబ్దముచే జెప్పదగిన శాస్త్రాతిక్రమణదోష మెవనికిగలదో జెప్పుము?. ఉ. విధినిషేధశాస్త్రమెవనికిగలదో, వానికే శాస్త్రాతిక్రమణదోషంబును గలుగును.

శ్లో॥ విధ్యభావాన్నబాలస్యదృశ్యతేతిప్రసంజనం।
స్యాత్కుతోఽతిప్రసంగోస్యవిధ్యభావేసమేసతి॥ ౧౦౬.

టీ. బాలస్య-బాలునకు, విధ్యభావాత్ = విధి-విధినిషేధశాస్త్రముయొక్క, అభావాత్-అభావమువలన, అతిప్రసంజనం - శాస్త్రాతిక్రమణదోషము, నదృశ్యతే-కనబడలేదు. అస్య-ఈజ్ఞానికి, విధ్యభావే= విధి - విధిశాస్త్రముయొక్క, అభావే-అభావము, సమేసతి- సమానమగుచుండగా, అతిప్రసంగః-శాస్త్రాతిక్రమణము, కుతః-ఎందువలన, స్యాత్-కలుగును.

తా. ప్ర. అయితే, విధిశాస్త్రములేనివానికి, శాస్త్రాతిక్రమణదోషములేదని యెచ్చట జూడబడెనో చెప్పుము?. ఉ. బాలునకు విధిశాస్త్రములేమిచేత, శాస్త్రాతిక్రమణదోషము గనబడుచుండలేదు. ఈప్రకారమే జ్ఞానికిని విధిశాస్త్రములేమిచేత, అతనికి శాస్త్రాతిక్రమణదోషము దేనిచేతం గలుగదని తెలియవలెను.

శ్లో॥ నకించిద్వేత్తిబాలశ్చేత్సర్వంవేత్త్యేవతత్త్వవిత్।
అల్పజ్ఞస్యైవవిధయస్సర్వేస్యుర్నాన్యయోర్ద్వయోః॥ ౧౦౭.

టీ. బాలః-బాలుడు, కించిత్-కొంచెమైనను,నవేత్తిచేత్- ఎరుగడనియంటివేని, తత్త్వవిత్-జ్ఞాని, సర్వం-సర్వమును, వేత్త్యేవ - ఎరిగినవాడే యగును. అల్పజ్ఞస్యైవ- అల్పజ్ఞునకే, అనగా కొంచెము దెలిసినవానికనుట. సర్వే- సక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లములగు, విధయః-విధులు, స్యుః - అగుచున్నవి. అన్యయోః - ఇతరులగు, ద్వయోః-అజ్ఞ సర్వజ్ఞుల కిద్దరికిని, నస్యుః-లేవు.

తా. ప్ర. అయితే, బాలునకు విధిలేమికి ప్రయోజకమగు అజ్ఞత్వము న్నట్లు, జ్ఞానికి అజ్ఞత్వములేదుగదా?. ఉ. జ్ఞానికి అజ్ఞత్వము లేకపోయినను విధి లేమికి ప్రయోజకమగు సర్వజ్ఞత్వముగలదు. కనుక, బాలునకువలెనే, జ్ఞానికిని విధిశాస్త్రములేదని తెలియవలెను. ప్ర. అయితే, శాస్త్రవిధికి అధికారమెవని కో చెప్పుము?. ఉ. అల్పజ్ఞునకే సర్వవిధులుగలవనియు, తక్కిన అజ్ఞసర్వజ్ఞులకు విధియెద్దియు లేదనియుం దెలియవలెను.

శ్లో॥ శాపానుగ్రహసామర్థ్యంయస్యాసౌతత్త్వవిద్యది।
తన్నశాపాదిసామర్థ్యం ఫలంస్యాత్తపసోయతః॥ ౧౦౮.

టీ. శాపానుగ్రహసామర్థ్యం=శాప-శపించుటకును, అనుగ్రహ-అనుగ్రహించుటకును, సామర్థ్యం-సామర్థ్యము, యస్య - ఎవనికిగలదో, అసౌ-వీడు,తత్త్వవిద్యది- జ్ఞానియగుననియంటివేని, తత్-అది, న-కాదు. యతః- ఏకారణమువలన, శాపాదిసామర్థ్యం- శాపాదిసామర్థ్యము, తపసః-తపస్సుయొక్క, ఫలం-ఫలము, స్యాత్-అగునో.

తా. ప్ర. అయితే, వ్యాసాదిమునులవలె శాపానుగ్రహసామర్థ్యము గలవాడే జ్ఞానియని చెప్పవలెనుగదా?. ఉ. అట్లుచెప్పరాదు. ప్ర. అట్లుచెప్పరామికి గారణమేమి? ఉ. శాపానుగ్రహసామర్థ్యము, తపస్సుయొక్కఫలమగుననియు, జ్ఞానఫలముగాదనియుం దెలియవలెను.

శ్లో॥ వ్యాసాదేరపిసామర్థ్యందృశ్యతేతపసోబలాత్।
శాపాదికారణాదన్యత్తపోజ్ఞానస్యకారణం॥ ౧౦౯.

టీ. తపసః-తపస్సుయొక్క, బలాత్-బలమువలన, వ్యాసాదేరపి- వ్యాసాదిమునివర్గమునకును, సామర్థ్యం-సమర్థత్వము, దృశ్యతే - కనబడుచున్నది. శాపాదికారణాత్=శాపాది-శాపానుగ్రహములనుజేయుటకు, కారణాత్-కారణమగుతపస్సుకంటె, అన్యత్-ఇతరమగు, తపః-తపస్సు, జ్ఞానస్య - బ్రహ్మాత్మజ్ఞానమునకు, కారణం - హేతువగును.

తా. ప్ర. అయితే, తత్త్వవేత్తలగు వ్యాసాదులకును శాపానుగ్రహసామర్థ్యము కనబడుచుండలేదా యేమి?. ఉ. తపోబలమువలన, జ్ఞానులగు వ్యాసాదులకును శాపానుగ్రహసామర్థ్యము గనబడుచున్నది. ప్ర. అయితే తపస్సుచేత బ్రహ్మమును దెలిసికొనుమనిచెప్పెడి, శ్రు॥ తపసాబ్రహ్మవిజిజ్ఞాసస్వ అనెడి యిత్యాదిశ్రుతివలన, తపస్సులేనివానికి తత్త్వజ్ఞాన మెట్లు ఘటిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చును?. ఉ. శాపాదికారణమగు తపస్సుకంటె, అన్యమగు తపస్సు, జ్ఞానమున కు కారణముగానుండుటచేత, శాపాది సామర్థ్యములేనివానికిని తత్వజ్ఞానము గలుగునని తెలియవలెను.

శ్లో॥ ద్వయంయస్యాస్తితస్యైవ సామర్థ్యజ్ఞానయోర్జనిః।
ఏకైకంతుతపఃకుర్వన్నేకైకంలభతేఫలం॥ ౧౧౦.

టీ. యస్య-ఎవనికి, ద్వయం-ద్వివిధతపస్సు, అస్తి- కలదో, తస్యైవ-వానికే, సామర్థ్యజ్ఞానయోః=సామర్థ్య - శాపాదిసామర్థ్యము యొక్కయు, జ్ఞానయోః-తత్వజ్ఞానముయొక్కయు, జనిః-ఉత్పత్తి, అనగాస్థితియనుట. అస్తి-కలదు. ఏకైకంతు-ఒక్కొకవిధమగు, తపః-తపస్సును, కుర్వన్ - చేయుచు, ఏకైకం- ఒక్కొకవిధముగల, ఫలం-ఫలమును, లభతే - పొందుచున్నాడు.

తా. ప్ర. అయితే, వ్యాసాదులకు తత్వజ్ఞానంబును, శాపాదికమునుగలుగజేసెడి సామర్థ్యంబును, ఈరెండునుం గనబడుటకు గారణమేమి?. ఉ. ౧. శాపాదిసామర్థ్యమునుగలిగించెడి తపంబును, ౨. జ్ఞానమును గలిగించెడి తపంబును, ఈద్వివిధతపస్సు, ఏ పురుషునకుగలదో, వానికేశాపాదిసామర్థ్య తత్వజ్ఞానంబులు రెండునుగలిగియున్నవని తెలియవలెను. అనగా వ్యాసాది మునులకు ఉభయవిధతపంబుండుటచేత, శాపాదిసామర్థ్యతత్వజ్ఞానంబులురెండునుం గలిగియున్నవని యభిప్రాయము.

శ్లో॥ సామర్థ్యహీనోనింద్యశ్చేద్యతిభిర్విధివర్జితః।
నింద్యంతేయతయోప్యన్యైరనిశంభోగలంపటైః॥ ౧౧౧.

టీ. విధివర్జితః=విధి- విధినిషేధశాస్త్రముచేత, వర్జితః-విడువబడినజ్ఞాని, అనగా విధినిషేధములులేనిజ్ఞానియనుట. సామర్థ్యహీనస్సన్ - శాపాదిసామర్థ్యములేనివాడగుచు, యతిభిః-క్రియాపరులగు యతులచేత, నింద్యశ్చేత్- నిందింపదగినవాడగుననియంటివేని, భోగలంపటైః=భోగ - విషయసుఖములను, లంపటైః-కోరుచుండెడి, అన్యైః- ఇతరులచేత, యతయోపి - యతులును, అనిశం- సర్వదా, నింద్యంతే- నిందింపబడుచున్నారు.

తా. ప్ర. అయితే, జ్ఞాని, శాపాదిసామర్థ్యములేనివాడై, శాస్త్రవిధిలేనివాడగుచుండగా, అతనిని విహితకర్మముల ననుష్ఠించెడి యతులు నిందింపరాదేమి?. ఉ. సర్వదా స్రక్చందన వనితాదిభోగములను గోరుచుండెడి జనులు, ఆ క్రియాపరులగుయతులను సర్వదా నిందించుచున్నారు.

శ్లో॥ భిక్షావస్త్రాదిరక్షేయుఃర్యదితేభోగతోనస్యదే।

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అహోయతిత్వమేతేషాం వైరాగ్యభరమంథరం॥ ౧౧౨.

టీ. తే- ఆక్రియాపరులగుయతులు, భోగతుష్టయే=భోగ-భోగముచేత, తుష్టయే-సంతోషము గలిగెడికొరకు, భిక్షావస్త్రాది=భిక్షా - యాచించుటచేత లభించిన, వస్త్రాది-వస్త్రాదికమును, రక్షేయుర్యది-రక్షించుకొనెదరని యంటి వేని, ఏతేషాం- ఈయతులయొక్క, వైరాగ్యభరమంథరం= వైరాగ్య-వైరాగ్య ముయొక్క, భర-అతిశయమును, మంథరం- సూచింపజేసెడి, యతిత్వం-యతి భావము, అహో-ఏమనిచెప్పవచ్చును. అనగా వారి యతిత్వమే చెడుననుట.

తా. ప్ర. అయితే, ఈ యతులును భోగముచేత సుఖమును బొందుట కొరకు స్రక్చందనాదివిషయములను సంపాదించుకొనజాలరాయేమి?. ఉ. అట్లు విషయసుఖములను బొందుటకొరకు, ఆ యతులు విషయములను సంపాదించు కొనెడి పక్షమందు, ఓహో వారియొక్క వైరాగ్యాతిశయమును సూచింప జేసెడి యతిభావము చెడుననెడి యభిప్రాయముతోటి, సిద్ధాంతి నవ్వెనని తెలియవలెను.

శ్లో॥ వర్ణాశ్రమపరాన్మూఢానిందంత్విత్యుచ్యతేయది।
దేహాత్మమతయో బుద్ధంనిందంత్వాశ్రమవాసినః॥ ౧౧౩.

టీ. మూఢాః- మూఢులు, వర్ణాశ్రమపరాణ్- వర్ణాశ్రమపరులగుయతు లను, నిందంత్వితి-నిందింతురుగాకయని, ఉచ్యతేయది- చెప్పబడినయెడల,దేహా త్మమతయః= దేహ-దేహమందు, ఆత్మమతయః - ఆత్మబుద్ధిగల, ఆశ్రమవాసి నః- యతులు, బుద్ధం-జ్ఞానిని, నిందంతు- నిందింతురుగాక. అనగా వారుజేసెడి నిందచేత జ్ఞానికిని లోపము లేదనుట.

తా. ప్ర. అయితే, విషయభోగలంపటులచేతను పామరులచేతం జేయ బడుచుండెడి నిందచేత క్రియాపరులైన పెద్దలగు యతులకు హానియేమి?. ఉ. సరి. అట్లైనయెడల, దేహాభిమానవంతులైన క్రియాపరులగు యతులచేతంజే యబడుచుండెడి నిందచేత జ్ఞానికిని హానిలేదని తెలిసికొనుము.

అవ. ఇట్లు ప్రాసంగికమునుముగించి, ప్రకృతమునసుసరించిచెప్పుచున్నాడు.

శ్లో॥ తదిత్థంతత్వవిజ్ఞానేసాధనానుపమర్దనాత్।
జ్ఞానినాచరితుంశక్యంసమ్యగ్రాజ్యాదిలౌకికం॥ ౧౧౪.

టీ. తత్- ఆకారణమువలన, ఇత్థం - ఈ చెప్పబడినప్రకారము, తత్వ విజ్ఞానేసతి-బ్రహ్మస్వరూపజ్ఞానము గలుగుచుండగా, సాధనానుపమర్దనాత్= సాధన- లౌకికవ్యవహార సాధనములగు మనస్సు మొదలగువానిని, అనుపమర్ద నాత్- పీడింపమివలన, జ్ఞానినా- జ్ఞానిచేత, రాజ్యాది - రాజ్యపరిపాలనాదిక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మగు, లౌకికం - లోకవ్యవహారమును, సమ్యక్-లెస్సగా, ఆచరితుం - చేయు టకు, శక్యం- సాధ్యమగును.

తా. ఆకారణముచేత ఈ పూర్వోక్తప్రకారము తత్వజ్ఞానము గలుగు చుండగా లౌకికవ్యవహారసాధనములగు మనస్సు మొదలగువానినిపీడింపమీవ లన, జ్ఞానిచేత రాజ్యపరిపాలనాది లౌకిక కర్మమును జేయుటకు శక్యమగునని తెలియవలెను.

శ్లో॥ మిథ్యాత్వబుద్ధ్యాతత్రేచ్ఛా నాస్తిచేత్తర్హిమాస్తుతత్।
ధ్యాయన్వాథవ్యవహరన్యథారబ్ధంవసత్వయం॥ ౧౧౫.

టీ. మిథ్యాత్వబుద్ధ్యా- మిథ్యాత్వజ్ఞానముచేత, తత్ర - ఆజగంబునందు, ఇచ్ఛా-కోరిక, నాస్తిచేత్-జ్ఞానికి లేదంటివేని, తత్-ఆ సంకల్పము, మాస్తు-లేక పోవుగాక. అయం-ఈజ్ఞాని, ధ్యాయన్వా-ధ్యానమును జేయుచున్నైనను, అథ- లేక, వ్యవహరన్- వ్యవహారమును జేయుచున్నైనను, యథారబ్ధం- ప్రారబ్ధకర్మ ప్రకారము, వసతు-ఉండుగాక. అనగా ప్రవర్తించుననుట.

తా. ప్ర. అయితే, జ్ఞానికి ప్రపంచ మిథ్యాత్వజ్ఞానముచేత ఆప్రపం చమందు ఇచ్ఛయే గలుగదుగదా? ఉ. సరి. ఇచ్ఛ, యుదయించకపోయినను, ఈజ్ఞాని, ధ్యానము జేయుచున్నైనను, లేక తన ప్రారబ్ధకర్మప్రకారము, లోక వ్యవహారమును జేయుచున్నైనను ప్రవర్తించుచుండును. కనుక, జ్ఞానికి లోక వ్యవహారము గూడదని చెప్పరాదు.

అవ. ఇప్పుడు ఉపాసకునకు జ్ఞానికంటె భేదమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఉపాసకస్తుసతతంధ్యాయన్నేవవసేద్యతః।
ధ్యానేనైవకృతంతస్య బ్రహ్మత్వంవిష్ణుతాదివత్॥ ౧౧౬.

టీ. ఉపాసకస్తు ఉపాసకుడో, సతతం-సర్వదా, ధ్యాయన్నేవ- ధ్యాన ముచేయుచునే, వసేత్-ఉండును. యతః- ఏకారణమువలన, విష్ణుతాదివత్- తనయందు ధ్యానముచేత సంపాదింపబడిన విష్ణుత్వాదికమువలె, ధ్యానేనైవ- ధ్యానముచేతనే, తస్య-ఆ యుపాసకునకు, బ్రహ్మత్వం - బ్రహ్మభావము, కృతం- చేయబడినదో, అనగా సంపాదింపబడినదో యనుట.

తా. ఉపాసకుడో, సర్వదా ధ్యానము జేయుచునేయుండును. ఇందుకు ఉపపత్తిని జెప్పెద వినుము. ఏకారణమువలన, ఆ యుపాసకునియొక్క బ్రహ్మ భావము ధ్యానముచేతనే సంపాదింపబడెనో, ప్రమాణముచేత యథార్థముగా నెరుగబడలేదో, ఆకారణమువలన, ఈ యుపాసకునియొక్క బ్రహ్మత్వము పారమార్థికనుగాదని తెలియవలెను. ప్ర. ఇందుకు దృష్టాంతమేమి?. ఉ. తన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యంమ ధ్యానముచేత సంపాదింపబడిన విష్ణుత్వాదికము పారపార్థికముగానట్లు, ధ్యానముచే సంపాదింపబడిన తనయొక్క బ్రహ్మత్వంబును పారమార్థికముగాదని యభిప్రాయము. పారమార్థికమనగా సత్యమని యర్థము.

శ్లో॥ ధ్యానోపాదానకంయత్తద్ధ్యానాభావేవిలీయతే।
వాస్తవీబ్రహ్మతానైవజ్ఞానాభావేవిలీయతే॥ ౧౧౭.

టీ. యత్-ఏబ్రహ్మత్వము, ధ్యానోపాదానకం = ధ్యాన- ధ్యానమును, ఉపాదానకం-ఉపాదానకారణముగాగలదో, తత్ - ఆబ్రహ్మత్వము, ధ్యానాభావేసతి=ధ్యాన-ధ్యానముయొక్క, అభావేసతి-అభావమగుచుండగా, అనగా ధ్యానము లేకపోవుచుండగా ననుట. విలీయతే - లీనమును బొందుచున్నది. వాస్తవీ-వాస్తవమగు, బ్రహ్మతా-బ్రహ్మభావము, జ్ఞానాభావేసతి= జ్ఞాన-జ్ఞానముయొక్క, అభావేసతి-అభావమగుచుండగా, అనగా జ్ఞానము లేకపోవుచుండగాననుట. నైవవిలీయతే - లీనమునుబొందదు.

తా. ప్ర. అయితే, ఆ యుపాసకునియొక్క బ్రహ్మత్వముధ్యానముచేత సంపాదింపబడినదైనను, ఆ బ్రహ్మత్వమునకు సత్యత్వము గలుగదాయేమి? ఉ. ఉపాసకునియొక్క బ్రహ్మభావము ధ్యానమును కారణముగా గలదగుటచేత, ధ్యానము లేకపోవుచుండగా, ఆ యుపాసకునియొక్క బ్రహ్మభావము లయించుచున్నది. అనగా ధ్యానముచే సంపాదింపబడిన వాగ్దేనుత్వాదికము, ధ్యానమునకపాయము గలుగుచుండగా దోచుచుండమిచేత, ఉపాసకునియొక్క బ్రహ్మత్వమునకు సత్యత్వములేదని యభిప్రాయము. ప్ర. అయితే, ఈ యుపాసకునియొక్క బ్రహ్మత్వముకంటె, జ్ఞానముచే ప్రకాశింపబడిన జ్ఞానియొక్క బ్రహ్మత్వమునకు భేదమేమి? ఉ. ఏకారణముచేత బ్రహ్మత్వము వాస్తవమో, ఆ కారణముచేత, జ్ఞానికి జ్ఞాపకజ్ఞానములేకపోవుచుండగా, తనయొక్క బ్రహ్మభావము లయించదని యభిప్రాయము.

అవ. బ్రహ్మత్వము వాస్తవమగుటవలననే, జ్ఞానముచేబుట్టినది కానేగాదని చెప్పుచున్నాడు.

శ్లో॥ తతోభిజ్ఞాపకంజ్ఞానంననిత్యంజనయత్యదః।
జ్ఞాపకాభావమాత్రేణనహి సత్యంవిలీయతే॥ ౧౧౮.

టీ. (యతః) ఏకారణమువలన, అదః- ఈ బ్రహ్మత్వము, నిత్యం-సత్యమైనదో, తతః-ఆకారణమువలన, జ్ఞానం-జ్ఞానము, అభిజ్ఞాపకమేవ - ఆబ్రహ్మత్వమును దెలియజేయునదియేయగు గాని, నజనయతి - పుట్టించుచున్నదిగాదు. అనగా జ్ఞానము బ్రహ్మత్వమును గలిగించునది గాదనుట. జ్ఞాపకాభావమా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రేణ-జ్ఞాపక-జ్ఞాపకముయొక్క, అభావమాత్రేణ - అభావమాత్రముచేత, అన
గా జ్ఞాపకజ్ఞానము లేనిమాత్రముచేననుట. సత్యం - సత్యమగుబ్రహ్మత్వము,
నహినిలీయతే- లయింపదుగదా.

తా. ఏకారణమువలన ఈ బ్రహ్మత్వము సత్యమైనదో, ఆకారణమువ
లన జ్ఞానము ఆ బ్రహ్మత్వమును దెలుపునదియేయగుగాని, పుట్టించునదిగాదు.
ఇందుకు ఉపపత్తిని వ్యతిరేకముఖముగా జెప్పెదవినుము. తన బ్రహ్మత్వముయొ
క్క జ్ఞాపకము లేనిమాత్రముచేత, సత్యమగు బ్రహ్మత్వము లయించదు. అన
గా జ్ఞానియొక్క బ్రహ్మభావము జ్ఞానముచేత బుట్టినదైనయెడల, జ్ఞానము నశిం
చుచుండగా తానులయించవలెననియు, అట్లు లయమును పొందుచుండమిచేత
బ్రహ్మత్వము జ్ఞానముచే బుట్టినదిగాదనియుం దెలియవలెను.

శ్లో॥ అస్త్యేవోపాసకస్యాపివాస్తవీబ్రహ్మతేతిచేత్।
పామరాణాంతిరశ్చాంచవాస్తవీబ్రహ్మతానకిం॥ ౧౧౯.

టీ. ఉపాసకస్యాపి-ఉపాసకునకును, వాస్తవీ-వాస్తవమగు, బ్రహ్మతా-
బ్రహ్మభావము, అస్త్యేవేతిచేత్- కలదేననియంటివేని, పామరాణాం- పామరజ
నులకును, తిరశ్చాంచ- పశ్వాది తిర్యగ్జంతువులకును, బ్రహ్మతా-బ్రహ్మభావ
ము, వాస్తవీ-వాస్తవముగలది, నకిం- కాదాయేమి? అనగా సర్వజంతువులకును
వాస్తవబ్రహ్మభావము గలదనుట.

తా. ప్ర. అయితే, జ్ఞానికివలె ఉపాసకునకును వాస్తవమైన బ్రహ్మత్వ
ముగలదుగదా? ఉ. సరి. పామరజనులకును పశ్వాది తిర్యగ్జంతువులకు వాస్తవ
మైన బ్రహ్మత్వముగలదు. అనగా నుపాసకునకుమాత్రమేగాక, సర్వజంతువు
లకును వాస్తవమైన బ్రహ్మత్వము గలిగియుండుటచేత, ఉపాసకునకు వాస్తవ
మైన బ్రహ్మత్వముగలదని చెప్పుటవలన బ్రయోజనను లేదని యభిప్రాయము.

శ్లో॥ అజ్ఞానాదపుమర్థత్వముభయత్రాపితత్సమం।
ఉపవాసాద్యథాభిక్షావరంధ్యానంతథాన్యతః॥ ౧౨౦.

టీ. అజ్ఞానాత్- ఎరుగమివలన, అపుమర్థత్వం - పురుషార్థములేమి, ఉభ
యత్రాపి - రెంటియందును, తత్ - అది అనగా బురుషార్థము లేమియనుట.
సమ-సమానమగును. ఉపవాసాత్ - ఉపవాసమును జేయుటకంటె, భిక్షా-
భిక్షు, అనగా భక్షించుటయనుట. యథా-ఏప్రకారము, వరం- శ్రేష్ఠమగునో,
తథా- ఆప్రకారము, అన్యతః-ఇతరానుష్ఠానములకంటె, ధ్యానం- నిర్గుణోపా
సనము, వరం-శ్రేష్ఠమగును.

తా. ప్ర. అయితే, పామరాదులకు వాస్తవ బ్రహ్మత్వమున్నను, ఆబ్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హ్మత్వము నెరుగమివలన పురుషార్థమునకు ఉపయోగముగలదిగాదుగదా? ఉ. సరి. అట్లైనయెడల, ఈ యుపాసకుడును వాస్తవమగు తనబ్రహ్మము నెరుగమిచేత, ఆ బ్రహ్మత్వము పురుషార్థమునకు ఉపయోగించదని తెలిసికొనుము. ప్ర. అయితే, ఇట్టి నిర్గుణోపాసన మెందుకొరకు జెప్పబడెను? ఉ. ఉపహాసమును జేయుటకంటె భిక్షాన్నభోజనము శ్రేష్ఠమెట్లగునో, అటువలెనే, ఇతరానుష్ఠానములకంటె ఈ నిర్గుణోపాసనము శ్రేష్ఠమగుటచేత జెప్పబడినదని తెలియవలెను.

అవ. ఇతరానుష్ఠానములకంటె శ్రేష్ఠత్వమునే ఇప్పుడు చూపుచున్నాడు.

శ్లో॥ పామరాణాంవ్యవహృతేర్వరంకర్మాద్యనుష్ఠితిః।
తతోపిసగుణోపాస్తిర్నిర్గుణోపాసనాతతః॥ ౧౨౮.

టీ. పామరాణాం - కేవలమూఢజనులయొక్క, వ్యవహృతేః-వ్యవహారముకంటె, కర్మాద్యనుష్ఠితిః=కర్మ-స్నానసంధ్యావందనాది కర్మములయొక్కయు, ఆది-యజ్ఞాదులయొక్కయు, అనుష్ఠితిః-అనుష్ఠానము, వరం-శ్రేష్ఠమైనదగును. తతః - ఆ కర్మాద్యనుష్ఠానముకంటెను, సగుణోపాస్తిః-సగుణోపాసనము, వరం-శ్రేష్ఠమగును. తతః-ఆసగుణోపాసనముకంటె, నిర్గుణోపాసనా=నిర్గుణ-నిర్గుణబ్రహ్మముయొక్క, ఉపాసనా-ధ్యానము, వరం- శ్రేష్ఠమగును.

తా. కేవల పామర జనులయొక్క వ్యవహారముకంటె, పుణ్యతీర్థయాత్రాస్నాన సంధ్యావందన జపయజ్ఞాది పుణ్యకర్మానుష్ఠానము శ్రేష్ఠమైనదగును. ఆపుణ్యకర్మానుష్ఠానముకంటె సగుణోపాసనము శ్రేష్ఠమైనదగును. ఆసగుణోపాసనముకంటె నిర్గుణబ్రహ్మోపాసనము శ్రేష్ఠమైనదగును. కనుక, నిర్గుణోపాసనము జెప్పబడినదని తెలియవలెను.

అవ. ఈ చెప్పబడినవానికి ఉత్తరోత్తర శ్రేష్ఠత్వమందు కారణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ యావద్విజ్ఞానసామీప్యంతావచ్ఛ్రైష్ఠ్యంవివర్ధతే।
బ్రహ్మజ్ఞానాయతేసాక్షాన్నిర్గుణోపాసనంశనైః॥ ౧౨౯.

టీ. యావత్-ఎంతమాత్రము, విజ్ఞానసామీప్యం = విజ్ఞాన-జ్ఞానముయొక్క, సామీప్యం-సమీపత్వముగలదో, తావత్ - అంతమాత్రము, శ్రైష్ఠ్యం-శ్రేష్ఠత్వము, వివర్ధతే-వృద్ధిబొందుచున్నది. నిర్గుణోపాసనం = నిర్గుణ-నిర్గుణబ్రహ్మముయొక్క, ఉపాసనం-ధ్యానము, శనైః-మెల్లగా, సాక్షాత్ - సాక్షాత్తుగా, బ్రహ్మజ్ఞానాయతే- బ్రహ్మజ్ఞానమువలె ఆచరించుచున్నది. అనగా బ్రహ్మజ్ఞానరూపమగుచున్నదనుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఈపూర్వోక్తకర్మాద్యుపాసనములకు, ఎంతమాత్రము విజ్ఞానమున కుసమీపత్వము గలిగియున్నదో, అంతమాత్రము శ్రేష్ఠత్వము వృద్ధిబొందుచున్న ది. ప్ర. అయితే, కర్మాద్యనుష్ఠానసగుణోపాసనముల కన్నిటికంటె నిర్గుణో పాసనమునకు శ్రేష్ఠత్వము గలుగుటకు గారణమేమి? ఉ. ఈనిర్గుణో పాసనము మెల్లగా (సాక్షాత్తుగా) బ్రహ్మజ్ఞానమువలె జేయుచున్నది. అనగా బ్రహ్మజ్ఞాన మును గలిగించుచుండుటచేత శ్రేష్ఠమాయెనని యభిప్రాయము.

అవ. ఈచెప్పబడినయర్థమును దృష్టాంతప్రదర్శన పూర్వకముగా దృఢీక రించుచున్నాడు.

శ్లో॥ యథాసంవాదివిభ్రాంతిః ఫలకాలే ప్రమాయతే।
విద్యాయతే తథోపాస్తిర్ముక్తికాలేతిపాకతః॥ ౧౨౩.

టీ. సంవాది విభ్రాంతిః-సంవాదిభ్రమము, ఫలకాలే - ఫలకాలమందు యథా-ఏప్రకారము, ప్రమాయతే - యథార్థ జ్ఞానమువలె జేయుచున్నదో,అన గా యథార్థజ్ఞానరూపమగుచున్నదోయనుట. తథా- ఆప్రకారము, ఉపాస్తిః- నిర్గుణబ్రహ్మోపాసనము, అతిపాకతః- మిక్కిలిపరిపక్వమునుబొందుటవలన, ముక్తికాలే-మోక్షకాలమందు, విద్యాయతే - జ్ఞానమువలె ఆచరించుచున్నది. అనగా జ్ఞానరూపమగుచున్నదనుట.

తా. మరియు, సంవాదిభ్రమముఫలకాలమందు ఏప్రకారముగాయథా ర్థజ్ఞానరూపమగుచున్నదో, ఆప్రకారమే నిర్గుణబ్రహ్మోపాసనంబును అతివరి పక్వమును బొందుటచేత ముక్తికాలమందు జ్ఞానరూపమగుచున్నదని తెలియ వలెను.

శ్లో॥ సంవాదిభ్రమతఃపుంసః ప్రవృత్తస్యాన్యమానతః।
ప్రమేతిచే త్తథోపాస్తిర్మాంతరేకారణాయతాం॥ ౧౨౪.

టీ. సంవాదిభ్రమతః-సంవాదిభ్రమమువలన, ప్రవృత్తస్య - ప్రవర్తిం చెడి, పుంసః-పురుషునకు, అన్యమానతః-అన్యప్రమాణమువలన, ప్రమేతిచేత్- యథార్థజ్ఞానము గలుగుచున్నదనియంటివేని, తథా - ఆప్రకారము, ఉపాస్తిః- నిర్గుణోపాసనము, అంతరే-మరియొకవిషయమందు (మధ్యమందు) మాకారణా యతాం-కారణమువలె నాచరించునది కాకపోవుగాక. అనగా నిర్గుణోపాస ము అపరోక్షజ్ఞానమందే కారణముకాగలదనుట.

తా. ప్ర. అయితే, సంవాది భ్రమముచేత బ్రవర్తించెడి పురుషునకు ఇంద్రియార్థసన్నికర్షణమువలన (అనగా నన్యప్రమాణమువలన) యథార్థజ్ఞాన ముగలుగుచున్నదేగాని, యాసంవాదిభ్రమము, తానే, యథార్థజ్ఞానమగుచు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్నదిగాదుగదా? ఉ. సరి. ఆప్రకారమే నిదిధ్యాసనరూపమగు నిర్గుణోపాసనంబును సద్వాక్యజన్యమగు అపరోక్షజ్ఞానమందు కారణము కాగలదని తెలిసికొనుము.

శ్లో॥ మూర్తిధ్యానస్యమంత్రాదేరపికారణతాయది।
అస్తునామతథాప్యత్రప్రత్యాసత్తిర్విశిష్యతే॥ ౧౨౫.

టీ. మూర్తిధ్యానస్య- మూర్తిధ్యానమునకును, మంత్రాదేరపి - మంత్రజపాదికమునకును, కారణతాయది-అపరోక్షజ్ఞానకారణత్వము గలుగుననియంటివేని, అస్తునామ-అగుగాక సమ్మతించితిని. తథాపి-అట్లైనను, అత్ర- ఈనిర్గుణోపాసనమందు, జ్ఞానంప్రతి-తత్త్వజ్ఞానమునుగురించి, ప్రత్యాసత్తిః-సామీప్యము, విశిష్యతే-ఆధిక్యతను బొందుచున్నది.

తా. ప్ర. అయితే, ఈప్రకారము మూర్తిధ్యాన మంత్రజపాదికము, (చిత్తైకాగ్ర్యద్వారా) అపరోక్షజ్ఞానసాధనము కాదాయేమి? ఉ. సరి. అగును. అనగా నదియు నంగీకరింపబడునని తెలియవలెను. ప్ర. అయితే, నిర్గుణోపాసనమందు అతిశయమేమి? ఉ. మూర్తిధ్యానాదికము, (చిత్తైకాగ్ర్యద్వారా) అపరోక్షజ్ఞానసాధనమైనను, ఈ నిర్గుణోపాసనమందు జ్ఞానమును గురించి, సామీప్యముగలదు. గనుక, మూర్తిధ్యానాదిసర్వసాధనములకంటె, ఈనిర్గుణోపాసనము శ్రేష్ఠమైనదని తెలియవలెను.

అవ. జ్ఞానసామీప్య ప్రకారమునే ఇప్పుడు చూపుచున్నాడు.

శ్లో॥ నిర్గుణోపాసనంపక్వం సమాధిస్స్యాచ్ఛనైస్తతః।
యస్సమాధిర్నిరోధాఖ్యస్సోఽనాయాసేనలభ్యతే॥ ౧౨౬.

టీ. నిర్గుణోపాసనం=నిర్గుణ-నిర్గుణబ్రహ్మముయొక్క, ఉపాసనం-ధ్యానము, పక్వంసత్-పరిపక్వస్థితినిబొందుచు, శనైః-మెల్లగా, సమాధిః - సవికల్పకసమాధి, స్యాత్-అగును. తతః-ఆసవికల్పకసమాధివలన, నిరోధాఖ్యః- నిరోధమనెడి పేరుగల, యః-ఏ, సమాధిః-నిర్వికల్పకసమాధిగలదో, సః-ఆనిర్వికల్పకసమాధి, అనాయాసేన-సులభముగా, లభ్యతే-పొందబడుచున్నది.

తా. ఈ నిర్గుణోపాసనమెప్పుడు పరిపక్వమగునో, అప్పుడు సవికల్పకసమాధియగును. ఆసవికల్పక సమాధిని నిరోధము జేయుచుండగా, సూత్రం॥ సర్వనిరోధాన్నిర్బీజస్సమాధిః॥ అనెడి బ్రహ్మసూత్రమందు జెప్పబడిన లక్షణముగల, ఏ, (నిరోధమనెడి) నిర్వికల్పకసమాధిగలదో, ఆనిర్వికల్పక సమాధి, అనాయాసముగా లభింపబడుచున్నది.

శ్లో॥ నిరోధలాభేపుంసోంతరసంగంవస్తుశిష్యతే।

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పునఃపునర్వాసితేస్మిన్వాక్యాజ్జాయేతతత్త్వధీః॥ ౧౨౬.

టీ. నిరోధలాభేసతి=నిరోధ-నిర్వికల్పకసమాధియొక్క, లాభేసతి-లాభము గలుగుచుండగా, పుంసః-పురుషుని యొక్క, అంతః-స్వరూపమందు, అసంగం-నిస్సంగమగు, వస్తు-ఆత్మవస్తువు, శిష్యతే - శేషించుచున్నది. అస్మిన్-ఈయసంగవస్తువు, పునఃపునః-మాటిమాటికి, వాసితేసతి - భావింపబడుచుండగా, వాక్యాత్-తత్త్వమస్యాదిలక్షణవాక్యమువలన, తత్త్వధీః = తత్త్వ- నేను బ్రహ్మమునైతిననెడి ఇవ్విధాకారలక్షణముగల పరతత్త్వముయొక్క, ధీః-జ్ఞానము, జాయేత-పుట్టును. అనగా బుట్టుచున్నదనుట.

తా. ప్ర. సరి. ఈ ప్రకారము నిర్వికల్పక సమాధిలాభము గలుగుగాక. అందుచేనేమి? ఉ. నిర్వికల్పకసమాధిలాభము గలుగుచుండగా, పురుషునియొక్క స్వరూపమందు సంగరహితమగు ఆత్మవస్తువు, శేషించుచున్నది. ప్ర. సరి. అట్లు అసంగాత్మవస్తువు శేషించుటచేత ప్రయోజనమేమి? ఉ. ఈయసంగాత్మవస్తువును మాటిమాటికి భావించుచుండగా, తత్త్వమస్యాదిలక్షణముగల వాక్యమువలన (అహంబ్రహ్మాస్మి) అనెడి ఇవ్విధమగు ఆకారము గల పరతత్త్వజ్ఞానము గలుగుచున్నది.

అవ. ఆ తత్త్వజ్ఞాన స్వరూపమునే ఇప్పుడు విశదీకరించుచున్నాడు.

శ్లో॥ నిర్వికారాసంగనిత్యస్వప్రకాశైకపూర్ణతాః।
బుద్ధౌఝటితిశాస్త్రోక్తా ఆరోహంత్యవివాదతః॥ ౧౨౭.

టీ. శాస్త్రోక్తాః=శాస్త్ర-వేదాంతశాస్త్రమందు, ఉక్తాః - చెప్పబడిన, నిర్వికారాసంగ నిత్యస్వప్రకాశైకపూర్ణతాః=నిర్వికార - నిర్వికారత్వంబును, అసంగ-అసంగత్వంబును, నిత్య-సత్యత్వంబును, స్వప్రకాశ-స్వప్రకాశత్వంబును, ఏక-అద్వితీయత్వంబును, పూర్ణతాః-పరిపూర్ణత్వంబును, అనగా నీచెప్పబడిన ఆత్మధర్మములనుట. అవివాదతః-అవివాదముగా, బుద్ధౌ - బుద్ధియందు, ఝటితి-అతివేగముగానే, ఆరోహంతి - పుట్టుచున్నవి.

తా. ఇట్లు (అహంబ్రహ్మాస్మి) అనెడి ఇవ్విధాకారముగల పరతత్త్వజ్ఞానోదయమగుచుండగా, వేదాంతశాస్త్రమందు జెప్పబడిన, ఆత్మధర్మములగు, ౧. నిర్వికారత్వము, ౨. అసంగత్వము, ౩. నిత్యత్వము, ౪. స్వప్రకాశత్వము, ౫. అద్వితీయత్వము, ౬. పరిపూర్ణత్వము, ఇవియన్నియు అవివాదముగా బుద్ధియందు అతివేగముగానే బుట్టుచున్నవనియుం దెలియవలెను.

శ్లో॥ యోగాభ్యాసస్యైతదర్థోఽమృతబిందావిదిషుశ్రుతః।

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏవంచదృష్టద్వారాపి హేతుత్వాదన్యతోవరం॥ ౧౨౯.

టీ. యోగాభ్యాసస్య-నిర్గుణోపాసకునకు, ఏతదర్థః - ఈయర్థము, అనగా నపరోక్షజ్ఞానోదయమగుచున్నదనెడి విషయమనుట. అమృతబింద్వాదిషు= అమృతబిందు - అమృతబిందువే, ఆదిషు - ఆదిగా గల యుపనిషత్తులయందు, శ్రుతః-వినబడుచున్నది. ఏవంచసతి - నిర్గుణోపాసననునకు నపరోక్షజ్ఞానసామీప్యము సంభవించుచుండగా, దృష్టద్వారాపి - నిర్వికల్పకసమాధిలాభద్వారముచేతను, అపిశబ్దమువలన నదృష్టద్వారముచేతననియుం గ్రహించవలెను. హేతుత్వాత్-అపరోక్షజ్ఞానమునకు సాధనమగుటవలన, అన్యతః- సగుణోపాసనాదులకంటె, వరం-శ్రేష్ఠమగును.

తా. ప్ర. అయితే, నిర్వికల్పసమాధివశమువలన అపరోక్షజ్ఞానము ఉదయించుచున్నదనెడి ఇయ్యర్థమందు ప్రమాణమేమి? ఉ. నిర్గుణోపాసకునకుఅపరోక్షజ్ఞానము ఉదయించుచున్నదనెడి ఈయర్థము, అమృతబింద్వాది శ్రుతులయందు వినబడుచున్నది. కనుక, అమృతబిందువు మొదలగు ఉపనిషత్తులన్నియుం ప్రమాణములగునని తెలియవలెను. ప్ర. సరి. ఇట్లు చెప్పుటచేత ఫలమేమి? ఉ. ఈప్రకారము నిర్గుణోపాసనమునకు నపరోక్షజ్ఞాన సామీప్యముగలుగుచుండగా నానిర్గుణోపాసనము, నిర్వికల్పకసమాధి లాభద్వారముచేతను, అదృష్టద్వారముచేతను అపరోక్షజ్ఞాన సాధనమగుటవలన, సగుణోపాసనాదులకంటె, ఈనిర్గుణోపాసనను శ్రేష్ఠమైనదని దెలియవలెను.

అవ. ఇటు నిర్గుణోపాసనమునకు అపరోక్షజ్ఞాన సాధనత్వము సిద్ధించియుండగా, ఆ నిర్గుణోపాసనమును విడిపించి ఇతర కార్యములయందు ప్రవర్తించెడివారికి వృథాశ్రమంబగునని లౌకిక న్యాయమును జూపుచు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఉపేక్ష్యతత్తీర్థయాత్రా జపాదీనేవకుర్వతాం।
పిండంసముత్సృజ్యకరంలేఢీతిన్యాయ ఆపతేత్॥ ౧౩౦.

టీ. తత్=ఆ నిర్గుణోపాసనమును, ఉపేక్ష్య-ఉపేక్షజేసి, అనగా నిర్గుణోపాసనమును జేయదగిన బుద్ధియుండియు నుపేక్షించియనుట. తీర్థయాత్రాజపాదీనేవ=తీర్థయాత్రా-తీర్థయాత్రలను, జపాదీనేవ - జపాదులనే, కుర్వతాం-చేసెడివారికి, పిండం-చేతియందున్న యన్నపుముద్దను, సముత్సృజ్య-విడిపించి, కరం-ముంజేతిని, లేఢీతి-నాకుచున్నాడనెడి, న్యాయః - లౌకికన్యాయము, ఆపతేత్-పడును. అనగా సంభవించుననుట.

తా. ఆ నిర్గుణోపాసనమును జేయక ఉపేక్షించి తీర్థయాత్రా జపాదుల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నే జేయుచుండెడివారు, (అరఁటిలియందుగల అన్నపుముద్దను విడిపించి తుంజే లినినాకెననెడి) లౌకిక న్యాయము గలవారగుదురు.

శ్లో॥ ఉపాసకానామప్యేవం విచారత్యాగతో యది।
బాధంతస్మాద్విచారస్యాసంభవేయోగఈరితః॥ ౧౩౧.

టీ. విచారత్యాగతః=విచార-తత్త్వంపదార్థవిచారముయొక్క, త్యాగతః-పరిత్యాగమువలన, అనగా తత్త్వంపదార్థవిచారమును విడుచుటచేతనను టం. ఉపాసకానామపి-నిర్గుణోపాసకులకును, ఏవంయది-ఈప్రకారము లౌకిక న్యాయము గలుగుననియంటివేని, బాధం-కలుగును. (యస్మాత్) ఏకారణము వలన పూర్వోక్తన్యాయప్రసంగము గలుగుచున్నదో, తస్మాత్- ఆకారణము వలన, విచారస్య-తత్త్వంపదార్థవిచారముయొక్క, అసంభవేసతి- సంభవింపకపోవుచుండగా, యోగః-నిర్గుణోపాసనము, ఈరితః - చెప్పబడెను.

తా. ప్ర. అయితే, ఆత్మతత్త్వవిచారమును విడిపించి, నిర్గుణోపాసనమును జేసెడివారికిని, ఈ న్యాయము సమానముగా వ్యాపింపదాయేమి? ఉ. సరి. తత్త్వంపదార్థవిచారమును జేయక, నిర్గుణోపాసనమును జేసెడివారికిని ఈన్యాయము సమానమేయగును. ప్ర. అయితే నిర్గుణోపాసనమెందువలన ప్రతిపాదింపబడెను? ఉ. ఏకారణముచేత బూర్వోక్తలౌకిక న్యాయప్రసంగము గలుగుచున్నదో, ఆ కారణముచేత, తత్త్వంపదార్థవిచారము సంభవింపకపోవుచుండగా నుపాసనాయోగము జెప్పబడెనని తెలియవలెను.

అవ. ఆత్మతత్త్వవిచారము గలుగమికి గారణము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ బహువ్యాకులచిత్తానాం విచారాత్తత్త్వధీర్నహి।
యోగోముఖ్యస్తతస్తేషాంధీదర్పస్తేననశ్యతి॥ ౧౩౨.

టీ. బహువ్యాకులచిత్తానాం=బహు-బహువిధమగు, వ్యాకుల-దుఃఖాదికముగల, చిత్తానాం-చిత్తముగలవారికి, విచారాత్- తత్త్వంపదార్థవిచారము వలన, తత్త్వధీః - పరతత్త్వజ్ఞానము, నహి-కలుగనేకలుగదు. తతః-ఆకారణము వలన, తేషాం అట్టిజనులకు, యోగః-ఉపాసనాయోగము, ముఖ్యః-ముఖ్యమైనదగును. తేన-ఆధ్యానయోగముచేత, ధీదర్పః=ధీ-బుద్ధియొక్క, దర్పః- గర్వము, నశ్యతి-నాశమును బొందుచున్నది.

తా. బహువ్యాకులచిత్తముగలవారికి తత్త్వంపదార్థవిచారమువలన అపరోక్షజ్ఞానముగలుగదు. ఆ కారణమువలన ఆట్టిజనులకు ధ్యానయోగము ముఖ్యమైనదగును. అనగా నేకారణమువలన తత్త్వంపదార్థవిచారము సంభవింపదో, ఆకారణమువలన పూర్వోక్తప్రకారము నిర్గుణ బ్రహ్మధ్యానయోగము జేయద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గినదగునని యభిప్రాయము. ప్ర. అయితే, బహువ్యాకులచిత్తముగలవారికి ఈ ధ్యానయోగము ముఖ్యమగుటకు గారణమేమి? ఉ. ఆధ్యానయోగముచేత ఏకారణమువలన చిత్తగర్వము నశించుచున్నదో, ఆ కారణమువలన, అట్టిజనులకు ఈయోగము ముఖ్యమైనదని తెలియవలెను.

అవ. ఈప్రకారము వ్యాకులచిత్తముగలవారికి యోగముముఖ్యమైనదని దెలిపి, అవ్యాకులములేనివారికి తత్వవిచారమే ముఖ్యమైనదని చెప్పుచున్నాడు.

శ్లో॥ అవ్యాకులధియాం మోహమాత్రేణాచ్ఛాదితాత్మనాం।
సాంఖ్యనామా విచారస్స్యాన్ముఖ్యో ఝడితిసిద్ధిదః॥ ౧౩౩.

టీ. అవ్యాకులధియాం=అవ్యాకుల-వ్యాకులత్వములేని, ధియాం-బుద్ధిగలిగినట్టియు, మోహమాత్రేణ-అజ్ఞానమాత్రముచేత, ఆచ్ఛాదితాత్మనాం= ఆచ్ఛాదిత-కప్పబడిన, ఆత్మనాం-మనస్సుగలవారికి, సాంఖ్యనామా=సాంఖ్య-సాంఖ్యమనెడి, నామా-పేరుగల, విచారః-తత్వవిచారము, ముఖ్యః - ముఖ్యమైనది, స్యాత్-అగును. ఝడితి-శీఘ్రముగా, సిద్ధిదః=సిద్ధి - జ్ఞానసిద్ధిని, దః-ఇచ్చునదియగును.

తా. మరియు, వ్యాకులములేక, అజ్ఞానమాత్రముచేత కప్పబడిన మనస్సుగలవారికి, సాంఖ్యశబ్దముచేత జెప్పదగినతత్వవిచారము ముఖ్యమైనదగును. ప్ర. ఎందుచేనిదిముఖ్యమైనదగునోచెప్పుము? ఉ. ఈతత్వవిచారము శీఘ్రముగానపరోక్షజ్ఞాన సిద్ధినిగలిగించుచున్నది. ఆకారణముచే నిదిముఖ్యమైనదని తెలియదగును.

అవ. యోగసాంఖ్యములకు రెంటికిని తత్వజ్ఞానద్వారముచేత ముక్తిసాధనత్వము గలదనుటయందు, గీతావాక్యమును ప్రమాణముగా బలికించుచున్నాడు.

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి॥ ౧౩౪.

టీ. సాంఖ్యైః-తత్వవిచారమును జేసెడివారిచేత, యత్-ఏ, స్థానం-మోక్షపదము, ప్రాప్యతే-పొందబడుచున్నదో, తత్-అపరమపదము, యోగైరపి-ధ్యానయోగులచేతను, ప్రాప్యతే-పొందబడుచున్నది. సాంఖ్యంచ- తత్వవిచారమును, యోగంచ-నిర్గుణధ్యానయోగమును, (ఫలతః) ఫలమువలన, ఏకం-ఒక్కటినిగా, యః-ఏపురుషుడు, పశ్యతి చూచుచున్నాడో, సః-ఆపురుషుడు, పశ్యతి-శాస్త్రార్థమును యథార్థముగా జూచినవాడగును.

తా. సాంఖ్యులచేత, ఏపరమపదము పొందబడుచున్నదో, అపరమప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దము ధ్యానయోగులచేతను బొందబడుచున్నది. సాంఖ్యయోగములను రెం టిని, ఫలముచేత ఒక్కటిసిగా నెవడుజూచుచున్నాడో, వాడుశాస్త్రార్థమును యథార్థముగా జూచినవాడగునని, శ్రీగీతాశాస్త్రమందు భగవంతునిచే జెప్ప బడెను.

అవ. కేవలము గీతావాక్యమేగాక, ఆగీతావాక్యమునకు మూలభూతమ గు శ్రుతియుంగలదని, ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ తత్కారణంసాంఖ్యయోగాభిపన్నమితిహిశ్రుతిః।
యస్తుశ్రుతేర్విరుద్ధస్సఆభాససాంఖ్యయోగయోః॥ ౧౩౫.

టీ. సాంఖ్యయోగాభిపన్నం=సాంఖ్య- తత్త్వవిచారముచేతను, యోగ- ఉపాసనాయోగముచేతను, అభిపన్నం - అంగీకరింపబడెడి, అనగా సాంఖ్య యోగములచేత బొందబడెడియనుట. తత్-అజ్ఞానము, కారణమితి- మోక్షకా రణమగునని, శ్రుతిర్హి-శ్రుతియుంజెప్పుచున్నది. సాంఖ్యయోగయోః- సాంఖ్య యోగములయందు, యస్తు-ఏనరుడు, శ్రుతేః-శ్రుతికి, విరుద్ధః-విరోధముగలవా డగునో, సః-ఆనరుడు, ఆభాసః-ఆభాసుడగును. అనగా బాధింపబడుచున్నా డనుట.

తా. మరియు, సాంఖ్యయోగములచేత బొందబడెడి జ్ఞానముమోక్షసా ధనమగుచున్నదని, శ్రు॥ తత్కారణం సాంఖ్యయోగాభిపన్నం॥ అనెడి శ్రుతి యుంజెప్పుచున్నది. ప్ర. అయితే, సాంఖ్యయోగములు రెండును, తత్త్వజ్ఞాన ద్వారముగా ముక్తిసాధనములగునని యంగీకరించినయెడల, ఆ సాంఖ్యయోగ మతస్థులయొక్క శాస్త్రమందు ప్రతిపాదింపబడిన తత్త్వములను అంగీకరింపరా దాయేని? ఉ. ఏనరుడు సాంఖ్యయోగములయందు శ్రుతికి విరుద్ధముగలవాడ గునో వాడుబాధింపబడుచున్నాడు. అనగా సాంఖ్యయోగ మతశాస్త్రముల యందు, చెప్పబడిన యభిప్రాయములు వేదాంతవిరోధములగుటచేత, అంగీక రింపబడవని యభిప్రాయము. శ్రుతియందును, గీతావాక్యము మొదలగు స్మృ తులయందును జెప్పబడెడి సాంఖ్యశబ్దమునకు, తత్త్వంపదార్థ విచారమనియు, యోగశబ్దమునకు ఉపాసనమనియు నర్థమును గ్రహించవలెను.

శ్లో॥ ఉపాసనంనాతిపక్వమిహయస్యపరత్రసః।
మరణేబ్రహ్మలోకేవాతత్త్వంవిజ్ఞాయముచ్యతే॥ ౧౩౬.

టీ యస్య-ఏపురుషునకు, ఇహ-ఈజన్మమందు, ఉపాసనం - నిర్గుణబ్ర హ్మోపాసనము, అతిపక్వం-మిక్కిలి పరిపక్వమును బొందినది, న-కాదో, సః-ఆపురుషుడు, పరత్ర-పిమ్మట, మరణే-మరణకాలమందైనను, బ్రహ్మలోకే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వా-సత్యలోకమందైనను. తత్త్వం-బ్రహ్మాత్మైకత్వలక్షణమును, విజ్ఞాయ - అప రోక్షముగా తెలిసి, ముచ్యతే - మోక్షమును బొందుచున్నాడు.

తా. ప్ర. అయితే, నిర్గుణోపాసనము జేసెడివానికి, తత్త్వజ్ఞానముగలు గుటకుంపై బూర్వమే, మరణముగలుగుచుండగా మోక్షము సిద్ధించదుగదా? ఉ. ఏపురుషునకు ఈజన్మమందు నిర్గుణోపాసనము పరిపక్వమునుబొందదో, ఆపురు షునకు మరణకాలమందైనను, బ్రహ్మలోకమందైనను బ్రహ్మాత్మైకత్వజ్ఞాన ముగలుగుటచేత మోక్షమునుబొందుచున్నాడని తెలియవలెను.

అవ. మరణకాలమందు జ్ఞానమువలన ముక్తిలాభవిషయమై ప్రమాణ మును జెప్పుచున్నారు.

శ్లో॥ యంయంవాపిస్మరన్ భావంత్యజత్యంతేకళేబరం।
తంతమేవైతియచ్చిత్తస్తేనయాతీతిశాస్త్రతః॥ ౧౩౭.

టీ. అంతే-మరణకాలమందు, యచ్చితః - ఏదేవతయందు చిత్తముగల వాడో, తేన-ఆదేవతతోటి, యాతీతి-పొందుచున్నాడని చెప్పెడి, శాస్త్రతః- శాస్త్రమువలన, యంయంవాపి- ఏయే, భావం-దేవతావిశేషమును, స్మరన్- స్మరించుచు, కళేబరం-దేహమును, త్యజతి - విడుచుచున్నాడో, తంతమేవ- ఆయాదేవతావిశేషమునే, ఏతి - పొందుచున్నాడు.

తా. మరణకాలమందు పురుషుడు, ఏయే దేవతా విశేషమును స్మరిం చుచు దేహమును విడుచుచున్నాడో, ఆయాదేవతను బొందుచున్నాడని, ఈగీ తావాక్యము చెప్పుచున్నది. మరియు, ఈయర్థమునే, శ్రు॥ యచ్చిత్తస్తేనైషప్రా ణమాయాతి ప్రాణస్తేజసాయుక్తః సహాత్మనా యథాసంకల్పితలోకంనయతి॥ అనెడి శ్రుతివాక్యంబును జెప్పుచున్నది.

శ్లో॥ అంత్యప్రత్యయతోనూనం భావిజన్మతథాసతి।
నిర్గుణప్రత్యయోపిస్యాత్సగుణోపాసనేయథా॥ ౧౩౮.

టీ. అంత్యప్రత్యయతః=అంత్య-మరణకాలమందు స్మరింపబడెడి, ప్రత్య యతః-విషయమువలన, భావిజన్మ-పరజన్మము, నూనం - నిశ్చయముగా, గలు గును. తథాసతి-అట్లుగుచుండగా, అనగా నంత్యప్రత్యయమువలన పరజన్మని శ్చయమగుచుండగా ననుట. సగుణోపాసనేయథా-సగుణోపాసనమందువలె, అనగా సగుణోపాసకునకు మరణకాలమందు పూర్వాభ్యాసవశమువలన సగు ణబ్రహ్మాకారప్రత్యయమేప్రకారమూ గలుగుచున్నదోయనుట. (ఏవం) ఈప్ర కారము, నిర్గుణప్రత్యయోపి-నిర్గుణప్రత్యయంబును, అనగా నిర్గుణోపాసకున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కునను నిర్గుణబ్రహ్మగోచర ప్రత్యయమనుట. స్యాత్-కలుగును. అనగా- బుట్టగ లదనుట.

తా. ప్ర. అయితే, ఈయుదాహరింపబడిన శ్రుతిస్మృతివాక్యములచేత అంత్యప్రత్యయమువలన పరజన్మముగలుగగలదనిచెప్పబడనేగాని నిర్గుణోపాసకునకు మరణకాలమందు జ్ఞానమువలన ముక్తికలుగునని చెప్పబడలేదుగదా?ఉ. సరి. పూర్వోక్తశ్రుతిస్మృతులచేత అంత్యప్రత్యయమువలన పరజన్మము గలుగుననియేచెప్పబడినది. ప్ర. అయితే,నిర్గుణోపాసకునకు మరణకాలమందు జ్ఞానమువలన మోక్షముగలుగుచున్నదనెడి విషయమై, ఈశ్రుతిస్మృతులను రెంటిని ప్రమాణముగా నెట్లు ఉపదేశించితిరి? ఉ. అట్లు అంత్యప్రత్యయమువలన పరజన్మనిశ్చయము గలుగుచుండగా, సగుణోపాసకునకు ఏప్రకారముగా మరణకాలమందు పూర్వాభ్యాస వశమువలన సగుణబ్రహ్మాకారప్రత్యయముగలుగుచున్నదో, ఈప్రకారమే నిర్గుణోపాసకునకును పూర్వాభ్యాస వశమువలన మరణకాలమందు నిర్గుణబ్రహ్మగోచరప్రత్యయము గలుగగలదని తెలియవలెను. అంత్యప్రత్యయమనగా, తాను పూర్వమభ్యసించుచుండెడి యాయాదేవతాది విషయాకారవృత్తిజ్ఞానమని తెలియవలెను.

శ్లో॥ నిత్యనిర్గుణరూపం తన్నామమాత్రేణగీయతాం।
అర్థతో మోక్షఏవైషసంవాదిభ్రమవన్మతః॥ ౧౩౯.

టీ. తత్-ఆబ్రహ్మము, నిత్యనిర్గుణరూపం=నిత్య - సత్యరూపమనియు, నిర్గుణరూపం-నిర్గుణరూపమనియు, నామమాత్రేణ - నిత్యనిర్గుణ శబ్దమాత్రముచేత, గీయతాం-చెప్పబడుగాక. అర్థతః-నిత్యనిర్గుణశబ్దార్థమువలన, ఏషః- ఈ, మోక్షఏవ- మోక్షరూపమే యగును. సంవాదిభ్రమవత్ - సంవాదిభ్రమమువలె, మతః - సమ్మతమగును.

తా. ప్ర. అయితే, నిర్గుణోపాసకునకు నిర్గుణప్రత్యయాభ్యాసవశమువలన నిర్గుణబ్రహ్మప్రాప్తియేగలుగుగాని, ముక్తిగలుగదుగదా? ఉ. సంవాదిభ్రమము, నామమాత్రముచేత భ్రమమని చెప్పబడునేగాని, వాస్తవమువలన యథార్థజ్ఞానమెట్లగునో, అటువలెనే, ఆబ్రహ్మము, నిత్యమనియు, నిర్గుణమనియు నామమాత్రముచేత జెప్పబడునేగాని, ఆనిత్యనిర్గుణ శబ్దార్థము ఈమోక్షరూపమేయగును. మరియు నిట్లుస్వరూపస్థితియేముక్తియని, వా॥ స్వరూపావస్థిర్ముక్తిః॥ అని ముక్తిలక్షణము చెప్పబడినది. అనగా బ్రహ్మప్రాప్తియనెడిశబ్దమునకును, ముక్తియనెడి శబ్దమునకును నామమాత్రముచేత భేదముగలిగియున్నదేగాని, అర్థమువలన భేదములేదని యభిప్రాయము.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ తత్సామర్థ్యాజ్జాయతేధీర్మూలావిద్యానివర్తకా।
అవిముక్తోపాసనేన తారకబ్రహ్మబుద్ధివత్॥ ౧౪౦.

టీ. అవిముక్తోపాసనేన- సగుణబ్రహ్మోపాసనముచేత, తారకబ్రహ్మబుద్ధివత్=తారకబ్రహ్మ-సగుణబ్రహ్మముయొక్క, బుద్ధివత్ - జ్ఞానముబుట్టుచున్నట్లు, తత్సామర్థ్యాత్= తత్ - ఆనిర్గుణోపాసనముయొక్క, సామర్థ్యాత్-సామర్థ్యమువలన, మూలావిద్యానివర్తకా=మూల - సంసారకారణమగు, అవిద్యా-అజ్ఞానమును, నివర్తకా-నివర్తింపజేయునట్టి, ధీః-అపరోక్షజ్ఞానము, జాయతే- పుట్టుచున్నది.

తా. ప్ర. అయితే, మానసక్రియారూపమగు నిర్గుణోపాసనము, ముక్తిసాధనమని చెప్పుట, విరుద్ధముగాదాయేమి? ఉ. సగుణబ్రహ్మోపాసన సామర్థ్యమువలన సగుణబ్రహ్మవిద్య బుట్టుచున్నట్లు, నిర్గుణబ్రహ్మోపాసనా సామర్థ్యమువలన నిర్గుణబ్రహ్మజ్ఞానము బుట్టుచున్నది. అనగా నానిర్గుణోపాసనమువలన బుట్టెడిజ్ఞానము మోక్షసాధనమని చెప్పబడుటచేత విరోధములేదని యభిప్రాయము.

శ్లో॥ సోకామోనిష్కామ ఇత్యశరీరోనిరింద్రియః।
అభయంహీతిముక్తత్వం తాపనీయే ఫలంశ్రుతం॥ ౧౪౧.

టీ. సః- ఆనిర్గుణోపాసకుడు, కామస్సన్ - మోక్షకామి యగుచు, నిష్కామఇతిహి - ఇతరకామము లేనివాడగుచు మోక్షమును బొందుచున్నాడనియు, అశరీరః-శరీరములేనివాడగుచు, నిరింద్రియస్సన్ - ఇంద్రియములులేనివాడగుచును, అభయంహీతి- సంసారభయరహిత మోక్షమును బొందుచున్నాడని, ముక్తత్వం-మోక్షరూపమగు, ఫలం-ఫలము, తాపనీయే - తాపనీయోపనిషత్తునందు, శ్రుతం - వినబడుచున్నది.

తా. ప్ర. అయితే, నిర్గుణోపాసనమునకు మోక్షము ఫలమనుటయందు ప్రమాణమేమి? ఉ. నిష్కాముడగుచు మోక్షకామియగు నిర్గుణోపాసకుడు, ఆప్తకాముడగుచు, ఆత్మకాముడగుచున్నాడనియు, అతని ప్రాణము లిచ్చటనే లయించుచున్నవనియు, ఆనిర్గుణోపాసకుడు బ్రహ్మమేయగుచు మోక్షమునుబొందుచున్నాడనియు, మరియు, ఆ నిర్గుణోపాసకుడు శరీరము లేనివాడగుచు నింద్రియములులేనివాడగుచు, ప్రాణములేనివాడగుచు, మనంబులేనివాడగుచు సచ్చిదానందస్వరూపమాత్రుడగుచు, స్వరాట్టు, అగుచున్నాడనియు, మరియు, ఏపురుషుడు చిన్మయరూపమగు ప్రణవము నెరుగునో, వాడు పర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మేశ్వరుడగుచున్నాడని చెప్పెడి, శ్రు ॥ సోకామోనిష్కామ ఆప్తకామ ఆత్మ
కామోనతస్యప్రాణా ఉత్క్రామంత్యత్రైవ సమవలీయంతే. బ్రహ్మైవసన్
బ్రహ్మాప్యేతి. అశరీరోనిరింద్రియో ఽప్రాణోహ్యమనాస్సచ్చిదానంద మాత్ర
స్సస్వరాడ్భవతి. యఏవంవేదచిన్మయోహ్యయమోంకారశ్చిన్మయ మిదం సర్వం
తస్మాత్పరమేశ్వర ఏవైకఏవభవత్యేత దమృతభయమే తద్బ్రహ్మాభయంవై
బ్రహ్మభవతి. యఏవంవేదేతిరహస్యం। ఇత్యాదివాక్యములచేత తాపనీయోప
నిషత్తునందు నిర్గుణోపాసకునకు మోక్షముఫలరూపముగా వినబడుచున్నది.
కనుక, తాపనీయోపనిషత్తు ప్రమాణమగును.

శ్లో॥ ఉపాసనస్యసామర్థ్యాద్విద్యోత్పత్తిర్భవేత్తతః।
నాన్యఃపంథాఇతిహ్యేతచ్ఛాస్త్రంనైవవిరుధ్యతే॥ ౧౪౨.

టీ. ఉపాసనస్య-నిర్గుణోపాసనముయొక్క, సామర్థ్యాత్-సామర్థ్యము
వలన, విద్యోత్పత్తిః-విద్యా- జ్ఞానముయొక్క, ఉత్పత్తిః- ఉదయము, భవేత్-
అగును. తతః-ఆకారణమువలన, అన్యః - మోక్షప్రాప్తికి జ్ఞానమార్గముకంటె
నన్యమగు, పంథా-మార్గము, నేతి-లేదనిచెప్పెడి, ఏతత్-ఈ, శాస్త్రం- శ్రుతి
వాక్యము, నైవవిరుధ్యతేహి - విరోధమును బొందదు.

తా. ప్ర. అయితే, నిర్గుణోపాసనచేత ముక్తిగలిగెడి పక్షమందు, మో
క్షమును బొందుటకు జ్ఞానమార్గముతప్ప, మరియొకమార్గములేదనిచెప్పెడి, శ్రు॥
నాన్యః పంథావిద్యతేయనాయ ॥ అనెడి శ్రుతికి విరోధముగాదా యేమి? ఉ.
ఈనిర్గుణోపాసనముయొక్క సామర్థ్యమువలన అపరోక్ష జ్ఞానోదయమగును.
ఆకారణముచేత, శ్రు। నాన్యః పంథావిద్యతేయనాయ॥ అనెడి ఈశాస్త్రమున
కును విరోధములేదు. అనగా నీనిర్గుణోపాసనము జ్ఞానద్వారముగా ముక్తిని
చ్చుచున్నదని చెప్పబడుటచేత పూర్వోక్త శాస్త్ర విరోధములేదని యభిప్రా
యము.

శ్లో॥ నిష్కామోపాసనాన్ముక్తిస్తాపనీయేసమీరితా।
బ్రహ్మలోకస్సకామస్యశైబ్యప్రశ్నేసమీరితః॥ ౧౪౩.

టీ. నిష్కామస్సన్- బ్రహ్మలోకాది కామను లేనివాడగుచు, ఉపాస
నాత్-నిర్గుణోపాసనమును జేయుటవలన, ముక్తిః - మోక్షము, తాపనీయే-తా
పనీ యోపనిషత్తునందు, సమీరితా-చెప్పబడెను. సకామస్య.- కామియైనిర్గు
ణోపాసనను జేసెడివానికి, బ్రహ్మలోకః- సత్యలోకప్రాప్తి గలుగునని, శైబ్య
ప్రశ్నే-శైబ్యప్రశ్నోపనిషత్తునందు, సమీరితః - చెప్పబడెను.

తా. నిష్కాముడగుచు నిర్గుణోపాసనమును జేసెడివానికి మరణకాలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మందు జ్ఞానద్వారా, ముక్తిగలుగుచున్నదని, తాపనీయోపనిషత్తునందు జెప్పబడెను. ఆతాపనీయోపనిషద్వాక్యము పూర్వమే యుదాహరింపబడెనని తెలియవలెను. మరియు, సకాముడగుచు సగుణోపాసనమును జేసెడివానికి, బ్రహ్మలోకప్రాప్తియగునని శైబ్యప్రశ్నోపనిషత్తునందు జెప్పబడినది.

అవ. ఇప్పుడు, శైబ్యప్రశ్నోపనిషద్వాక్యార్థమును పఠించుచున్నాడు.

శ్లో॥ యదుపాస్తే త్రిమాత్రేణ బ్రహ్మలోకే స నీయతే,
స ఏతస్మాజ్జీవఘనాత్పరం పురుషమీక్షతే॥ ౧౪౪.

టీ. యః- ఏపురుషుడు, త్రిమాత్రేణ - మూడుమాత్రలు పరిమితిగా, ఉపాస్తే- ప్రణవోపాసనమును జేయుచున్నాడో, సః-ఆపురుషుడు, బ్రహ్మలోకే- బ్రహ్మలోకమందు, నీయతే- నీతినిబొందుచున్నాడు. సః- ఆనిర్గుణోపాసకుడు, ఏతస్మాత్- ఈ, జీవఘనాత్- జీవసమష్టిరూపుడగు హిరణ్యగర్భునికంటె, పరం- పరుడగు, పురుషం - నిరుపాధిక చైతన్య రూప పరమాత్మను, ఈక్షతే- బ్రహ్మలోకమందు సాక్షాత్కరించుకొనుచున్నాడు.

తా. మరియు, ఏపురుషుడు సకాముడగుచు ఈ పరమాత్మను, మూడు మాత్రలుపరిమితిగల, (ఓం) అనెడి ఏకాక్షరముచే నుపాసనము జేయుచున్నాడో, ఆపురుషుడు, కుసుమముచేత సర్పము విడువబడినట్లు సకలపాపములచేత విడువబడుచు మహాతేజోవంతుడై బ్రహ్మలోకమును బొందుచున్నాడని, శైబ్యప్రశ్నోపనిషత్తునందు, శ్రు॥ యః పునరేతం త్రిమాత్రేణోమిత్యనేనైవాక్షరేణ పరంపురుషమభిధ్యాయీత స తేజసి సూర్యే సంపన్నో యథాపాదోదరస్త్వచా వినిర్ముచ్యత ఏవం హవై స పాప్మనా వినిర్ముక్తస్స సామభిరున్నీయతే బ్రహ్మలోకం॥ అనెడివాక్యముచేత సకామునకు బ్రహ్మలోకప్రాప్తి, వినబడుచున్నది. ప్ర. అయితే, శైబ్యప్రశ్నోపనిషత్తునందు సకామునకు బ్రహ్మలోకగతియే వినబడుచున్నదిగాని, ఆబ్రహ్మలోకమందు తత్వసాక్షాత్కారము గలుగునట్లువినబడ లేదుగదా? ఉ. బ్రహ్మలోకగతుడగు ఆయుపాసకుడు ఈ సమష్టి రూపుడగు హిరణ్యగర్భునికంటె పరుడగు నిరుపాధికచైతన్య రూప పరమాత్మను సాక్షాత్కరించుకొనుచున్నాడని, శ్రు॥ స ఏతస్మాజ్జీవ ఘనాత్పరాత్పరం పురిశయం పురుషమీక్షతే ॥ అనియిట్లు శైబ్య ప్రశ్నోపనిషత్తునందు వినబడుచున్నది. కనుక, (౧౩౬) నూటముప్పదియారవ శ్లోకమందు జెప్పబడిన ప్రకారము, నిర్గుణోపాసకుడు, మరణకాలమందైనను, బ్రహ్మలోకమందైనను బ్రహ్మసాక్షాత్కారముగలవాడై (అనగా నపరోక్షజ్ఞానవంతుడై) మోక్షమును బొందుచున్నాడని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇదియునుంగాక, సూత్రం॥ అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణ ఉభయథాఽదోషా తత్క్రతుశ్చ ॥ అనెడి బ్రహ్మసూత్రమందు కామానుసారముచేత ఫలప్రాప్తి గలుగుచున్నదని ప్రతిపాదింపబడిన కారణమువలనను, సకామునకు బ్రహ్మలోకగమనము గలుగుననియుం జెప్పుచున్నాడు.

శ్లో॥ అప్రతీకాధికరణే తత్క్రతున్యాయ ఈరితః।

బ్రహ్మలోకఫలంతస్మాత్సకామస్యేతివర్ణితం॥ ౧౪౫.

టీ. అప్రతీకాధికరణే - అప్రతీకాధికరణమందు, తత్క్రతున్యాయః= తత్- ఆబ్రహ్మముయొక్క, క్రతున్యాయః-క్రతున్యాయము, ఈరితః- చెప్పబడెను. తస్మాత్-అందువలన, సకామస్య- సకామునకు, బ్రహ్మలోకఫలమితి- బ్రహ్మలోకఫలము గలుగునని, వర్ణితం- వర్ణింపబడెను.

తా. మరియు, ఉత్తరమీమాంసా శాస్త్రమందు గల అప్రతీకాధికరణమందు, బ్రహ్మక్రతు న్యాయము జెప్పబడెను. ఆకారణముచేతను సకామునకు బ్రహ్మలోకఫలము గలుగునని తెలియవలెను.

శ్లో॥ నిర్గుణోపాస్తిసామర్థ్యాత్తత్రైతత్త్వమవేక్షతే।

పునరావర్తతేనాయం కల్పాంతేచవిముచ్యతే। ౧౪౬.

టీ. (సః) ఆసకాముడు, నిర్గుణోపాస్తిసామర్థ్యాత్=నిర్గుణోపాస్తి-నిర్గుణోపాసనముయొక్క, సామర్థ్యాత్-సామర్థ్యమువలన, తత్ర- ఆబ్రహ్మలోకమందు, తత్త్వం- పరతత్త్వమును, అవేక్షతే - చూచుచున్నాడు. అనగా నపరోక్షజ్ఞానవంతుడగుచున్నాడనుట. అయం - ఈసకాముడు, పునః- మరల, నావర్తతే- సంసారమునకు రాడు. అనగా మరియొక జన్మమును బొందడనుట. కల్పాంతేచ-బ్రహ్మప్రళయమందు, విముచ్యతే- మోక్షమునుబొందుచున్నాడు.

తా. ప్ర. అయితే, ఆ సకామునకు తత్త్వజ్ఞానము దేనివలన గలుగునో చెప్పుము?. ఉ. ఆసకాముడు, తానుచేసిన నిర్గుణోపాసనసామర్థ్యముచేత, బ్రహ్మలోకమందు బ్రహ్మసాక్షాత్కారమును బొందుచున్నాడు. మరియు, ఆసకాముడు, బ్రహ్మలోకమునుండి సంసారమునకు రాడనియు, బ్రహ్మప్రళయమందు బ్రహ్మదేవునితోగూడ ముక్తినిబొందుచున్నాడని, శ్రు ॥ ఇమంమానవమావర్తంనావర్తంతే. నచపునరావర్తతే. బ్రహ్మణాసహతే సర్వేసంప్రాప్తే ప్రతిసంచరే। పరస్యాంతేకృతాత్మానః ప్రవిశంతిపరంపదం॥ ఇత్యాదిశ్రుతిస్మృతులు జెప్పుచున్నవని తెలియవలెను.

అవ. ఇప్పుడు ప్రణవోపాసన ప్రసంగమువలన,బుద్ధియందుండెడి ఆధిక్యమును...

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వికోపాసనమును జూపుచున్నాడు.

శ్లో॥ ప్రణవోపాస్తయః ప్రాయో నిర్గుణా ఏవ వేదగాః।
క్వచిత్సగుణతాప్యుక్తా ప్రణవోపాసనస్యహి॥ ౧౪౭.

టీ. వేదగాః-వేదమును బొందియుండెడి, అనగా వేదోక్తములైనట్టియ నుట. ప్రణవోపాస్తయః- ప్రణవోపాసనములు, ప్రాయః- తరచుగాను, నిర్గుణా ఏవ - నిర్గుణములే యగును. ప్రణవోపాసనస్య - ప్రణవోపాసనమునకు, సగుణతాపి - సగుణత్వంబును, క్వచిత్ - ఒకానొక స్థలమందు, ఉక్తా - చెప్పబడెను.

తా. వేదోక్తములగు ప్రణవోపాసనములు తరచుగా నిర్గుణములేయగును. ఒకానొకస్థలమందు, ప్రణవోపాసనమునకు సగుణత్వంబును జెప్పంబడెను.

అవ. ఆద్వివిధత్వమందు బ్రమాణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ పరాపరబ్రహ్మరూప ఓంకార ఉపవర్ణితః।
పిప్పలాదేనమునినా సత్యకామాయపృచ్ఛతే॥ ౧౪౮.

టీ. పిప్పలాదేన - పిప్పలాదుడనెడి పేరుగల, మునినా- మునిచేత, పృచ్ఛతే-అడిగిన, సత్యకామాయ - సత్యకామునికొరకు, బ్రహ్మరూపః= బ్రహ్మ- బ్రహ్మముయొక్క, రూపః-రూపమగు, ఓంకారః - ప్రణవము, పరాపరః= పర-పరమనియు, అనగా నిర్గుణంబుననుట. అపరః - అపరమనియు, అనగా సగుణంబుననుట. ఉపవర్ణితః - వర్ణింపబడెను.

తా. శ్రు॥ ఏతద్వై సత్యకామ పరంచాపరంచ బ్రహ్మయదోంకార స్తస్మాద్విద్వానేతేనైవాయతనేనైకతరమన్వేతి॥ అనెడి శ్రుతియందు, బ్రహ్మరూపమగు ఓంకారము పరాపర రూపము గలదనియు, విద్వాంసు డగువాడు ఈ ద్వివిధములో నొకవిధమును బొందుచున్నాడని, పిప్పలాదుడనెడి మునిచేత సత్యకాముడనెడి శిష్యునికొరకు చెప్పబడెను. అనగా సగుణ నిర్గుణ రూపత్వము బ్రతిపాదింపబడెనని యభిప్రాయము.

అవ. కఠవల్లియందు యమునిచేతంగూడ, శ్రు। ఏతదాలంబనంజ్ఞాత్వా॥ అనెడి ఇత్యాదివాక్యములచేత బ్రణవద్వైవిధ్యము జెప్పబడెనని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏత దాలంబనంజ్ఞాత్వాయో యదిచ్ఛతితస్యతత్।
ఇతిప్రోక్తంయమేనాపి పృచ్ఛతేనచికేతసే॥ ౧౪౯.

టీ. యః-ఏపురుషుడు, ఏతత్-ఈ, ఆలంబనం- బ్రహ్మరూప ప్రణవమును, జ్ఞాత్వా-తెలిసికొని, యత్-దేనిని, ఇచ్ఛతి-కోరుచున్నాడో, తస్య- వానికి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తదితి-అది పొందబడుచున్నదని, యమేనాపి-యమునిచేతను, పృచ్ఛతే-అడిగిన, నచికేతసే- నచికేతునికొరకు, ప్రోక్తం- చెప్పబడెను.

తా. మరియు, శ్రు ॥ ఏతదాలంబనంజ్ఞాత్వాయో యదిచ్ఛతి తస్యతత్॥ అనెడి ఇత్యాదివాక్యమువలన, కఠవల్లిశ్రుతియందు యమునిచేతను శిష్యుడైన నచికేతునికొరకు, ఈ ప్రణవోపాసనముయొక్క ద్వివిధత్వము చెప్పబడినదని తెలియవలెను.

అవ. ఈచెప్పబడిన అర్థము నుపసంహారము జేయుచున్నాడు.

శ్లో॥ ఇహవామరణేచాస్య బ్రహ్మలోకేథవాభవేత్।
బ్రహ్మసాక్షాత్కృతిస్సమ్య గుపాసీనస్యనిర్గుణం॥ ౧౫౦.

టీ. నిర్గుణం-నిర్గుణబ్రహ్మమును, సమ్యక్ - శాస్త్రోక్తప్రకారము లెస్సగా, ఉపాసీనస్య-ఉపాసనము జేసెడివానికి, ఇహవా-ఈజన్మమందైనను, మరణేవాచ-మరణకాలమందైనను, అథవా-లేక, బ్రహ్మలోకే-బ్రహ్మలోకమందైనను, బ్రహ్మసాక్షాత్కృతిః-బ్రహ్మసాక్షాత్కారము, అనగా నపరోక్షజ్ఞానమనుట. భవేత్ - అగును.

తా. ఈ పూర్వోక్తప్రకారము నిర్గుణ బ్రహ్మమును శాస్త్రోక్తప్రకారను లెస్సగా నుపాసనము జేసెడివానికి, ఈజన్మమందైనను మరణకాలమందైనను, లేక, బ్రహ్మలోకమందైనను బ్రహ్మసాక్షాత్కారరూపముగల అపరోక్షజ్ఞానము గలుగునని తెలియవలెను.

అవ. విచారమువలన బ్రహ్మతత్వజ్ఞానమును సంపాదించుటకు సమర్థుడుగానివానికి, నిర్గుణబ్రహ్మధ్యానమందు అధికారము గలదనెడి ఈయర్థము, ఆత్మగీతయందు స్పష్టముగా జెప్పబడినదని ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ అర్థోయమాత్మగీతాయా మపిస్పష్టముదీరితః।
విచారాక్షమఆత్మాన ముపాసీతేతిసంతతం॥ ౧౫౧.

టీ. విచారాక్షమః=విచార - తత్వంపదార్థ విచారమును జేయుటకు, అక్షమః-సమర్థుడుగానివాడు, సంతతం- సర్వదా, ఆత్మానం-పరమాత్మను, ఉపాసీతేతి- ఉపాసనము జేయవలెననెడి, అయం - ఈ, అర్థః- అర్థము, ఆత్మగీతాయామపి- ఆత్మగీతయందును, స్పష్టం - స్పష్టముగా, ఉదీరితః - చెప్పబడినది.

తా. మరియు, తత్వంపదార్థ విచారమును జేయుటకు సమర్థుడుగాని పురుషుడు, ప్రత్యగాత్మరూపపరబ్రహ్మమును (సర్వదా) ఉపాసనము జేయవలెననెడి, ఈ యర్థము, ఆత్మగీతయందును స్పష్టముగా జెప్పబడినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఆయాత్మగీతావాక్యములనే ఇప్పుడు, మూటినుదహరించు చున్నాడు.

శ్లో॥ సాక్షాత్కర్తు మశక్తోపిచింతయేన్మామశంకితః।
కాలేనానుభవారూఢో భవేదాఫలితోధ్రువం॥ ౧౫౨.

టీ. సాక్షాత్కర్తుం - సాక్షాత్కరించుకొనుటకు, అశక్తోపి-శక్తిలేనివాడై నను, అశంకితస్సన్- సంశయములేనివాడగుచు, మాం- పరమాత్మనగునన్ను, చింతయేత్- ధ్యానించవలెను. కాలేన - పరిపక్వకాలముచేత, ఆఫలితస్సన్- ఫలింపబడిన కోరికగలవాడగుచు, అనుభవారూఢః - బ్రహ్మసాక్షాత్కారము గలవాడు, ధ్రువం-నిశ్చయముగా, భవేత్ - అగును.

తా. బ్రహ్మమును సాక్షాత్కరించుకొనుటకు శక్తిలేనివాడు, నిస్సంశయము గలవాడగుచు, (అహంబ్రహ్మాస్మి) అనియిట్లు నన్ను ధ్యానించవలెను. అట్లు ధ్యానించుచు పరిపక్వకాలముచేత సత్యముగా బ్రహ్మసాక్షాత్కారము గలవాడగును.

అవ. ధ్యానమునకు యథార్థ జ్ఞానోపాయము గలిగియుండుటయందు దృష్టాంతము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ యథాఽగాధనిధేర్లబ్ధౌనోపాయఃఖననంవినా।
మల్లాభేపితథాస్వాత్మచింతాంముక్త్వానచాపరః॥ ౧౫౩.

టీ. అగాధనిధేః = అగాధ-మిక్కిలిలోతునందు స్థాపింపబడిన, నిధేః-నిధియొక్క, లబ్ధౌ-పొందుటయందు, అనగా నిధినిబొందుటయందనుట. ఖననం వినా-త్రవ్వుటతప్ప, ఉపాయః-మరియొకయుపాయము, యథా- ఏప్రకారము, న-లేదో, తథా-ఆప్రకారము, మల్లాభేపి=మత్-నాయొక్క, లాభేపి-లాభమందును, స్వాత్మచింతాం=స్వాత్మ - తనస్వరూపముయొక్క, చింతాం - ధ్యానమును; ముక్త్వా-విడిపించి, అపరః-మరియొకయుపాయము, న- లేదు.

తా. మిక్కిలి లోతునందు స్థాపింపబడిన సువర్ణనిధిని బొందుటయందు, త్రవ్వుటనుదప్ప, మరియొకయుపాయములేనట్లు, పరబ్రహ్మమగునన్నుబొందుటయందును, తనస్వరూపమును ధ్యానించుటనుతప్ప, మరియొకయుపాయమెద్దియులేదని తెలియవలెను.

అవ. వ్యతిరేకముచే జెప్పబడిన, ఈయర్థమును, అన్వయ ముఖముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ దేహోపలమపాకృత్య బుద్ధికుద్దాలకాత్పునః।
ఖాత్వామనోభవంభూయోగృహ్ణీయాన్మాంనిధింపుమాన్॥ ౧౫౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. పుమాన్-పురుషుడు, దేహాఖ్యం=దేహ - శరీరమనెడి, ఉపలం-ఱాతిని, అపాకృత్య-పెల్లగించి, పునః- మరల, బుద్ధికుద్దాలకాత్ = బుద్ధి-బుద్ధియనెడి, కుద్దాలకాత్- కుద్దాలకమనెడి ఆయుధమువలన, ఖాత్వా- త్రవ్వి, మనోభవం=మనః-మనస్సునందు, భవం-ఉదయించునట్టియు, భూయః- శ్రేష్ఠమైన, నిధిం-నిధియనెడి, మాం-నన్ను, గృహ్ణీయాత్ - గ్రహించవలెను.

తా. పురుషుడు, దేహమనెడి ఱాతిని పెల్లగించి, మరల బుద్ధియనెడికుద్దాలకముచేత త్రవ్వి, మనస్సునందు బుట్టునట్టి శ్రేష్ఠమగునిధివంటినన్ను, గ్రహించవలెనని, ఈప్రకారమాత్మగీతయందు జెప్పబడెనని తెలియవలెను.

అవ. జ్ఞానమందు అసమర్థుడైన వానికి, ధ్యానమందధికారముగలదనెడి విషయమైవాక్యాంతరము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ అనుభూతేరభావేపి బ్రహ్మాస్మీత్యేవచింత్యతాం।
అప్యసత్ప్రాప్యతేధ్యానా న్నిత్యాప్తంబ్రహ్మకింపునః॥౧౫౫.

టీ. అనుభూతేః-బ్రహ్మానుభవము, అభావేపి - లేకపోయినను, బ్రహ్మాస్మీత్యేవ-బ్రహ్మము నైతిననియే, చింత్యతాం- చింతింపబడుగాక. అనగా చింతింపవలెననుట. ధ్యానాత్-ధ్యానమువలన, అసదపి- తనకుపూర్వములేనిదేవత్వాదికంబును, ప్రాప్యతే-పొందబడుచున్నది. నిత్యాప్తం = నిత్య- సర్వదా, ఆప్తం- పొందబడియుండెడి, బ్రహ్మ-బ్రహ్మమునుగురించి, కింపునః-మరలనేమిచెప్పవలెను. అనగా ధ్యానమువలన స్వస్వరూపభూతబ్రహ్మమును బొందుచున్నాడని చెప్పవలసినపని లేదనుట.

తా. మరియు, బ్రహ్మానుభవము (అనగానపరోక్షజ్ఞానము) లేకపోయినను, (అహంబ్రహ్మాస్మి) అనియిట్లు ధ్యానించవలెను. మరియు, ఉపాసకునకు పూర్వములేని దేవత్వాదికంబును ధ్యానమువలన బొందబడుచున్నదిగదా. అట్లు తనకుబూర్వమందులేని దేవత్వాదికమే ధ్యానముచేత బొందబడుచున్నప్పుడు, స్వస్వరూపత్వముచేత సర్వదాపొందబడియుండెడి సర్వాత్మకబ్రహ్మమును, ధ్యానమువలన ఉపాసకుడు పొందుచున్నాడని చెప్పవలసిన పనిలేదని, ఈవాక్యము చెప్పుచున్నది.

అవ. బ్రహ్మధ్యానఫలము, ప్రత్యక్షసిద్ధమగుటవలనను, ధ్యానము చేయదగినదని ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ అనాత్మబుద్ధిశైథిల్యం ఫలంధ్యానాద్దినేదినే।
పశ్యన్నపీనచేద్ధ్యాయేత్కో౽న్యోఽస్మాత్పశుర్వద॥ ౧౫౬.

టీ. (యః) ఏపురుషుడు, ధ్యానాత్-నిర్గుణబ్రహ్మధ్యానమువలన, దినే



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దినే-ప్రతిదినమందును, అనాత్మబుద్ధిశైథిల్యం = అనాత్మబుద్ధి- అనాత్మబుద్ధియొక్క, శైథిల్యం-శైథిల్యరూపమగు, ఫలం-ఫలమును, పశ్యన్నపి - చూచుచున్నవాడగుచు, నధ్యాయేచ్చేత్-ధ్యానమును జేయనియెడల, అస్మాత్ - వీనికంటె, అపరః-మరియొకటియగు, పశుః-పశువు, కః-ఏదియో, వద- చెప్పుము.

తా. ఏపురుషుడు, నిర్గుణబ్రహ్మధ్యానమువలన ప్రతిదినమందును అనాత్మబుద్ధిశైథిల్యరూపమగు ఫలమును జూచుచున్నవాడగుచుండియు, ధ్యానమును జేయడో, వీనికంటె ఇతరమైన పశువెద్దియో చెప్పుము. అనగా వీడేపశువని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, ఈయుపపాదింపబడిన అర్థమును సంక్షేపించి చూపుచున్నాడు.

శ్లో॥ దేహాభిమానంవిధ్వస్యధ్యానాదాత్మానమద్వయం।
పశ్యన్మర్త్యోఽమృతోభూత్వాహ్యత్రబ్రహ్మసమశ్నుతే॥ ౧౫౭.

టీ. ధ్యానాత్- బ్రహ్మధ్యానమువలన, దేహాభిమానం=దేహ-మరణశీల దేహమందు, అభిమానం-నేననెడి యభిమానమును, విధ్వస్య-విడిపించి, అద్వయం-అద్వితీయుడగు, ఆత్మానం - తనను, పశ్యన్-చూచుచు, మర్త్యః-మరణశీలుడగు పురుషుడు, అమృతోభూత్వా-అమృతరూపుడై, అత్ర- ఈదేహమందు, బ్రహ్మ- బ్రహ్మమును, సమశ్నుతేహి - పొందుచున్నాడు.

తా. మర్త్యుడు, నిర్గుణ బ్రహ్మధ్యానమువలన మరణశీలమగు దేహమందు నేననెడి యభిమానమును విడుచుటచేత, తాను అమృతరూపుడై, ఈశరీరమందే, తనయొక్క నిజరూపమగు అద్వితీయ సచ్చిదానందలక్షణ పరబ్రహ్మమును బొందుచున్నాడు.

అవ. ఈధ్యానదీపాను సంధానఫలము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ధ్యానదీపమిమంసమ్యక్పరామృశతియోనరః।
ముక్తసంశయఏవాయం ధ్యాయతిబ్రహ్మసంతతం॥ ౧౫౮.

టీ. యః-ఏ, నరః-నరుడు, ఇమం- ఈ, ధ్యానదీపం - ధ్యానదీపమును, సమ్యక్-లెస్సగా, పరామృశతి-విమర్శించుచున్నాడో, అయం- ఈపురుషుడు, ముక్తసంశయ ఏవ=ముక్త-విడువబడిన, సంశయఏవ- సంశయముగలవాడగుచునే, సంతతం-సర్వదా, బ్రహ్మ-బ్రహ్మమును, ధ్యాయతి - ధ్యానము జేయుచున్నాడు.

తా. ఏనరుడు, ఈ ధ్యానదీపమనెడి గ్రంథార్థమును లెస్సగావిమర్శిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చి మెరుగుచున్నాడో, ఆయానరుడు, సంశయము లేనివాడగుచు (సర్వదా) నిర్గుణబ్రహ్మమును ధ్యానను జేయగలడు.

ఇతి, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీభారతీ తీర్థ విద్యారణ్య మునివర్యకృత ధ్యానదీప స్సమాప్తః.

గద్య. ఇది శ్రీపరమేశ్వర గురుచరణ వరప్రసాదలబ్ధ బ్రహ్మవిద్యా విరాజిత కాశ్యపసగోత్ర పవిత్ర మంత్రివంశ పయఃపారావార పరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్య పుత్ర లక్ష్మీనారాయణామాత్య ప్రణీతంబైన ఆంధ్ర టీకాతాత్పర్యసహిత శ్రీవేదాంత పంచదశియందు, ధ్యానదీప మనెడి నవమ ప్రకరణము సంపూర్ణమాయెను.

ఓంతత్సత్ - శ్రీకృష్ణార్పణమస్తు.

శ్లో॥ ధ్యానదీపస్యటీకేయం రహస్యార్థప్రబోధినీ।

మంత్రినారాయణాఖ్యేన కృతాకృష్ణసమర్పితా॥



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుభమస్తు.

శ్రీకృష్ణసద్గురు పరబ్రహ్మణేనమః.

# నాటకదీపప్రారంభము.



అవ. ఇప్పుడు, శ్రీవిద్యారణ్యగురుండు, తాను జేయబూనిన గ్రంథము నకు నిర్విఘ్నముగా పరిపూర్తిగలుగుటకొరకు, ఇష్టదేవతాతత్వాను స్మరణలక్షణముగల మంగళము నాచరించుచు, మందాధికారులకు అనాయాసముగా నిష్ప్రపంచ బ్రహ్మాత్మజ్ఞానము సిద్ధించెడికొరకు, ( అధ్యారోపాపవాదముల చేత నిష్ప్రపంచరూపమగు బ్రహ్మముబోధింపబడుచున్నదనియు, తత్వజ్ఞానులచేత తమశిష్యులకు, బోధ, సిద్ధించెడికొరకు, ఆబ్రహ్మమును బోధించెడిక్రమము కల్పించబడెననియుంజెప్పెడి) శ్లో ॥ అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే। శిష్యాణాం బోధసిద్ధ్యర్థం తత్వజ్ఞైః కల్పితఃక్రమః॥ అనెడి న్యాయమననుసరించి, అచ్చట, ఆత్మయందు అధ్యారోపమును జెప్పుచున్నాడు.

శ్లో॥ పరమాత్మాద్వయానందః పూర్ణఃపూర్వస్వమాయయా।
స్వయమేవజగద్భూత్వా ప్రావిశజ్జీవరూపతః॥ ౧.

టీ. పూర్వే - సృష్టికింబూర్వమందు, అద్వయానందః = అద్వయ-స్వగతాదిభేదములేనట్టి, ఆనందః- పరమానందరూపుడగునట్టియు, పూర్ణః- పరిపూర్ణుడైనట్టి, పరమాత్మా-పరబ్రహ్మము, స్వమాయయా-స్వ-తనయందుండెడి, మాయయా - మాయాశక్తిచేత, స్వయమేవ- తానే, జగత్ - ప్రపంచము, భూత్వా-అయి, అనగా జగదాకారమునుబొందియనుట. (తత్ర) ఆజగంబునందు, జీవరూపతః - జీవరూపత్వమువలన, ప్రావిశత్-ప్రవేశించెను. అనగా ప్రవేశించిన వాడాయెననుట.

తా. శ్రు ॥ సదేవసోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం విజ్ఞానమానందంబ్రహ్మ. పూర్ణమదఃపూర్ణం॥ అనెడి ఇత్యాది శ్రుతిప్రకారము, సృష్టికంబూర్వమందు సజాతీయవిజాతీయ స్వగతభేదములు లేనట్టియు, పరమానందరూపుడైనట్టియు, పరిపూర్ణుడగు, ఏపరమాత్మగలడో, ఆపరమాత్మ, శ్రు ॥ మాయాంతుప్రకృతింవిద్యాన్మాయినంతుమహేశ్వరం॥ అనెడి శ్రుతియందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జెప్పబడిన, తనయందుగల మాయాశక్తిచేత, శ్రు॥ తదాత్మానగ్గ్స్వయమకురు తసచ్చత్యచ్చాభవత్ ॥ అనెడి శ్రుతిప్రకారము, తానే, జగదాకారమును బొంది, శ్రు॥ తత్సృష్ట్వాతదేవాను ప్రావిశత్. అనేనజీవేనాత్మనానుప్రవిశ్య॥ అనెడి ఇత్యాది శ్రుతిప్రకారము, ఆసృష్టింపబడిన జగంబునందు జీవరూపమువలన ప్రవేశించినవాడాయెను.

శ్లో॥ విష్ణ్వాద్యుత్తమదేహేషు ప్రవిష్టో దేవతాఽభవత్।
మర్త్యాద్యధమదేహేషు స్థితో భజతిదేవతాం॥ ౨.

టీ. (సః) ఆపరమాత్మ, విష్ణ్వాద్యుత్తమదేహేషు=విష్ణ్వాది- విష్ణువు మొదలగు, ఉత్తమదేహేషు-శ్రేష్ఠదేహములయందు, ప్రవిష్టస్సన్ - ప్రవేశించినవాడగుచు, దేవతా-దేవత, అనగాబూజింపదగినవాడనుట. అభవత్ - ఆయెను. మర్త్యాద్యధమదేహేషు = మర్త్యాది-మనుష్యులు మొదలగు, అధమదేహేషు-హీనదేహములయందు, స్థితస్సన్-స్థితినిబొందినవాడగుచు, దేవతాం- విష్ణ్వాది దేవతను, భజతి-సేవించుచున్నాడు. అనగా బూజకుడాయెననుట.

తా. ప్ర. అయితే, ఒక్కడగు పరమాత్మకు, సర్వశరీరములయందును బ్రవేశముగలిగిన పక్షమందు పూజ్య పూజకాది భావముచేత దోచుచుండెడి ఉత్తమాధమ భావము విరోధమును బొందదాయేమి?. ఉ. ఆపరమాత్మ,విష్ణ్వాది ఉత్తమదేహములయందుబ్రవేశించినవాడగుచు, దేవత, (పూజింపదగినవాడు) ఆయెను. మనుష్యులు మొదలగు హీనదేహములయందు బ్రవేశించినవాడై, పూజకుడు, (అనగావిష్ణ్వాది దేవతను పూజించెడివాడు) ఆయెను. అనగా నీయుత్తమాధమభావము, శరీరోపాధి నిమిత్తకమైనదేగాని, ఆత్మకు స్వాభావికముగామిచేత విరోధము లేదని యభిప్రాయము.

అవ. ఇట్లు ఆత్మయందు ప్రపంచాధ్యారోపమును సంక్షేపముచేతజూపి,దానియపవాదము నిష్ప్రపంచసాధనసహితముగా సంక్షేపించి జూపుచున్నాడు.

శ్లో॥ అనేకజన్మభజనాత్ స్వవిచారంచికీర్షతి।
విచారేణవినష్టాయాం మాయాయాంశిష్యతేస్వయం॥ ౩.

టీ. అనేకజన్మభజనాత్ = అనేక - అనేకజన్మములయందు, భజనాత్-భజనమువలన, అనగా ననేకజన్మములయందనుష్ఠింపబడిన కర్మములనుబ్రహ్మసమర్పణరూపభజనముచేననుట. స్వవిచారం = స్వ - బ్రహ్మరూపుడగు తనయొక్క, విచారం- విచారమును, అనగా జ్ఞానసాధనమగు శ్రవణాదికమువనుట. చికీర్షతి-చేయుట కిచ్ఛయించుచున్నాడు. విచారేణ- తన విచారజనితజ్ఞానముచేత, మాయాయాం- తనయద్వయానందత్వాది రూపమును మరగుపర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చినమాయ, వినష్టాయాంసత్యాం-నివృత్తిని బొందుచుండగా, స్వయం- తానే, అనగా నద్వయానంద పూర్ణపరమాత్మయే యనుట. శిష్యతే - శేషించుచున్నాడు.

తా. మరియు, అనేకజన్మములయందు అనుష్ఠింపబడిన విహితకర్మములను బ్రహ్మసమర్పణరూపముగా భోగించుటవలన బ్రహ్మరూపుడగు తనయొక్క జ్ఞానసాధన శ్రవణమననాదికమును జేయుటకు బురుషు డిచ్ఛయించుచున్నాడు. తదనంతరము, తనవిచారజనితజ్ఞానముచేత తనయొక్క యద్వయానందత్వాదిరూపమును కప్పినట్టియు, అజ్ఞాన అవిద్యాదిశబ్దములచే జెప్పదగినట్టి మాయ, నివర్తింపబడుచుండగా, అద్వయానందపూర్ణ పరమాత్మయగు తానే, శేషించుచున్నాడు.

శ్లో॥ అద్వయానందరూపస్య సద్వయత్వంచదుఃఖితా।
బంధఃప్రోక్తస్స్వరూపేణ స్థితిర్ముక్తిరితీర్యతే॥ ౪.

టీ. అద్వయానందరూపస్య-అద్వితీయానందరూపునకు, సద్వయత్వం చ-ద్వైతముతోటికూడికయు, దుఃఖితాచ - దుఃఖిత్వంబును, బంధః- సంసారబంధమని, ప్రోక్తః-చెప్పబడును. స్వరూపేణ-స్వరూపముతోటి, స్థితిః-ఉనికి, ముక్తిరితి-మోక్షమని; ఈర్యతే - చెప్పబడుచున్నది.

తా. ప్ర. అయితే, ఆబ్రహ్మము నే నైతిననియెరిగి, పురుషుడుసర్వబంధములచే విడువబడుచున్నాడని చెప్పెడి, శ్రు॥ తద్బ్రహ్మాహమితిజ్ఞాత్వాసర్వబంధైఃప్రముచ్యతే॥ అనెడి ఇత్యాదిశ్రుతులచేతబంధనివృత్తిలక్షణముగలమోక్షము జ్ఞానఫలమగునని చెప్పబడుచుండగా, మీరిప్పుడు, పరమాత్మ, శేషించుటయే జ్ఞానఫలమునుగా జెప్పుటచేత విరోధముకాదాయేమి? ఉ. అద్వితీయబ్రహ్మమందు వాస్తవమైన బంధమునైనను మోక్షమునైననునిరూపించుటకు శక్యముగామిచేత, దుఃఖిత్వాదిభ్రాంతియే, బంధమనియు, అట్టిభ్రమనివృత్తియే, స్వరూపావస్థితిలక్షణముగల మోక్షమనియుం జెప్పబడుటవలన, శ్రుతి విరోధములేదు. కనుక, అద్వితీయానందరూపుడగు పరమాత్మకు, దేహేంద్రియాది ద్వైతముతోటికూడికయు, దుఃఖిత్వాదిభ్రాంతియు, సంసారబంధమనిచెప్పబడును. మరియు, స్వరూపస్థితియే ముక్తియని చెప్పబడునని తెలియవలెను.

శ్లో॥ అవిచారకృతోబంధో విచారేణనివర్తతే।
తస్మాజ్జీవపరాత్మానౌ సర్వదైవవిచారయేత్॥ ౫.

టీ. అవిచారకృతః = అవిచార - అవిచారమువలన, కృతః-చేయబడిన, అనగా నాత్మతత్వవిచారము లేమిచేగలిగినట్టిదనుట. బంధః-బంధము, విచా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రేణ-ఆత్మతత్వవిచారముచేత, నివర్తతే- నివృత్తిని బొందుచున్నది. తస్మాత్-ఆకారణమువలన, జీవపరాత్మానౌ-జీవపరమాత్మలను, సర్వదైవ - సర్వదా, విచారయేత్ - విచారించవలెను.

తా. ప్ర. అయితే, కర్మముచేతనే జనకాదులు సంసిద్ధిని బొందిరని చెప్పెడి, శ్లో॥ కర్మణైవహిసంసిద్ధిమాస్థితా జనకాదయః॥ అనెడి స్మృతివలన, మోక్షమునకు కర్మసాధనత్వ మంగీకరింపబడుచుండగా, ఈయాత్మతత్వవిచారజనితజ్ఞానముచేత ప్రయోజనమేమి? ఉ. విచారములేమిచేతకల్పించబడిన బంధము, విచారముచేత నివర్తించుచున్నది. అనగా, విచారమును జేయుటకంటె పూర్వకాలమందు అభావోపలక్షితమగు అజ్ఞానముచేత గల్పించబడిన బంధమునకు, విచారజన్యజ్ఞానమువలనదప్ప, మరియొకదానివలన నివృత్తిసంభవింపదని యభిప్రాయము. మరియు, ఉదాహరింపబడిన స్మృతియందు గల సంసిద్ధి శబ్దముచేత చిత్తశుద్ధియే చెప్పబడెనుగాని, మోక్షము చెప్పబడలేదని తెలియవలెను. ప్ర. అయితే, ఏవిషయమగు విచారముచేత బంధము నివర్తించును? ఉ. ఆకారణమువలన, జీవాత్మ పరమాత్మల నిద్దరినిసాక్షాత్కారపర్యంతమువిచారము జేయవలెను.

అవ. ఆ యిద్దరిలో, జీవస్వరూపనిరూపణమును జేయుచున్నాడు.

శ్లో॥ అహమిత్యభిమంతాయః కర్తాసౌతస్యసాధనం।
మనస్తస్యక్రియేఅంతర్బహిర్వృత్తీక్రమోత్థితే॥ ౬.

టీ. యః- ఏచిదాభాసవిశిష్టమగు అహంకారము, అహమితి - దేహాదుల యందునేనని, అభిమంతా- అభిమానమును జేయుచున్నదో, అసౌ-ఈయహంకారము, కర్తా-కర్తృత్వాదిధర్మవిశిష్టుడగు జీవుడగును. తస్య - ఆజీవునకు, మనః-మనస్సు, సాధనం-కరణమగును. తస్య - ఆమనస్సునకు, క్రమోత్థితే-క్రమ-క్రమముగా, ఉత్థితే- పుట్టెడి, అంతర్బహిర్వృత్తీ-అంతః-దేహములోపటవర్తించునట్టియు, బహిః-దేహముకంటె వెలుపటవర్తించునట్టి, వృత్తీ-వృత్తులురెండును, క్రియే-క్రియలగును.

తా. చిదాభాసవిశిష్టమగు ఏయహంకారము వ్యవహారదశయందు (నేననెడి) అభిమానమునుజేయుచున్నదో, ఆయీయహంకారము, కర్తృత్వాదిధర్మవిశిష్టుడగు జీవుడగును. ప్ర. అయితే, ఆ జీవునకు కరణమెద్ది? ఉ. కామాదివృత్తులంగల అంతఃకరణముయొక్క భాగమగుమనస్సు, ఆజీవునకు కరణము, (సాధనము) అగును. ప్ర. అయితే, కరణమునకు క్రియావ్యాప్తత్వముగలిగియుండును. కనుక, ఆ కరణమునకుక్రియయెద్ది? ఉ. క్రమముగా బుట్టుచు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧. దేహమునకు అంతరమందు వర్తించుచుండునట్టియు, ౨. దేహమునకు బాహ్యమందు వర్తించుచుండునట్టి, వృత్తులు రెండును, ఆకరణమగు మనస్సునకు క్రియలగును.

అవ. ఈద్వివిధవృత్తులయొక్క స్వరూపమును, విషయంబును విభాగించిచూపుచున్నాడు.

శ్లో॥ అన్తర్ముఖాహమిత్యేషా వృత్తిఃకర్తారముల్లిఖేత్।
బహిర్ముఖేదమిత్యేషా బాహ్యంవస్త్విదముల్లిఖేత్॥ ౭.

టీ. అహమితి- నేననెడి రూపముగల, ఏషా-ఈ, అంతర్ముఖా - అంతర్ముఖమగు, వృత్తిః-వృత్తి, కర్తారం-కర్తను, ఉల్లిఖేత్-తెలుపును. ఇదమితి- ఇదియనెడిరూపముగల, ఏషా-ఈ, బహిర్ముఖా-బహిర్ముఖవృత్తి, బాహ్యం - దేహముకంటె బాహ్యమందు వర్తించుచుండెడి, అనగానిదియనెడి భావముచేతనిర్దేశింపబడుచుండునట్టియనుట. వస్తు-ఘటాదివస్తువును, ఉల్లిఖేత్-తెలుపును. అనగా నెరుగుననుట.

తా. నేననెడి యాకారముగల ఈ యంతర్ముఖవృత్తి, కర్తను దెలుపుచున్నది. ఇది యనెడి యాకారముగల ఈబహిర్వృత్తి, దేహముకంటెబాహ్యమందు వర్తించుచుండెడి, అనగా (నిదియనుటచేత నిర్దేశింపబడుచుండెడి) ఘటాదిపదార్థమును అవిశిష్టముగా (ప్రత్యేకముగా) దెలుపును.

శ్లో॥ ఇదమోయేవిశేషాస్స్యుర్గంధరూపరసాదయః।
అసాంకర్యేణతాన్విద్యాత్ ఘ్రాణాదీంద్రియపంచకం॥ ౮.

టీ. ఇదమః-ఇదియని నిర్దేశింపబడెడి ఘటాదిపదార్థముయొక్క, గంధరూపరసాదయః=గంధ-గంధంబును, రూప-రూపంబును, రసాదయః - రసాదులగు, యే-ఏ, విశేషాః-విశేషములు, అనగా ధర్మములనుట. స్యుః కలవో, తాన్- ఆ ధర్మములను, ఘ్రాణాదీంద్రియపంచకం=ఘ్రాణ - ఘ్రాణేంద్రియమే, ఆది-ఆదిగాగల, ఇంద్రియపంచకం - ఇంద్రియపంచకము, అసాంకర్యేణ ప్రత్యేకముగా, విద్యాత్ - తెలిసికొనును.

తా. ప్ర. అయితే, మనంబుచేతనే సర్వవ్యవహారము సిద్ధించుచుండగా చక్షురాదీంద్రియవర్గమునకు వ్యర్థత్వము సంభవింపదాయేమి? ఉ. మనంబుచేత నిదియని నిర్దేశింపబడెడి ఘటాదివస్తువునందుగల శబ్దస్పర్శరూపరసగంధములలో నొక్కొకటిని ప్రత్యేకముగా, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములనెడి పంచేంద్రియములలో నొక్కొకటి క్రమముగాగ్రహించుచున్నది. కనుక, చక్షురాది ఇంద్రియవర్గమునకు వ్యర్థత్వము సంభవింపదు. అనగా మనంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేత, (ఇదియని) ఘటాదిపదార్థసామాన్యరూపముమాత్రము గ్రహింపబడుచు న్నదేగాని, ఆఘటమునొక్క విశేషమగు గంధాదికము గ్రహింపబడనికారణ మువలన, ఆగంధాదికమును గ్రహించుటయందు ఘ్రాణాది ఇంద్రియ పంచక ము ఉపయోగించుచున్నదని యభిప్రాయము.

అవ. ఇట్లు సాధనసహిత జీవస్వరూపమును నిరూపించి, పరమాత్మ నిర్వ్యపు నిరూపించుచున్నాడు.

శ్లో॥ కర్తారంచక్రియాంతద్వద్వ్యావృత్తవిషయానపి।
స్ఫోరయేదేకయత్నేనయోఽసౌసాక్ష్యత్రచిద్వపుః॥ ౯.

టీ. కర్తారం-అహంకారరూపమును, క్రియాంచ- మనోవృత్తిరూపము ను, తద్వత్-ఆప్రకారము, వ్యావృత్తవిషయానపి=వ్యావృత్త-అన్యోన్యవిలక్షణ ములగు, విషయాన్-గంధాదులను, ఏకయత్నేన-ఒక్కసారియే, యః - ఏపర మాత్మ, చిద్వపుశ్శేవసన్ చిద్రూపుడేయగుచు, స్ఫోరయేత్- ప్రకాశింపజేయు చున్నాడో, అసౌ-ఈపరమాత్మ, అత్ర-ఈవేదాంతశాస్త్రమందు, సాక్షీ- సా క్షియని చెప్పబడుచున్నాడు.

తా. ౧. పూర్వోక్తకర్తను (అనగా నహంకారరూపమును) ౨. క్రియ ను (అనగానేనిదియనినిర్దేశించెడి మనోవృత్తిరూపమును) ౩. ఘ్రాణాదీంద్రి యముచేత గ్రహింపబడుచు అన్యోన్యభేదము గల గంధాది విషయములను, ఒక్కసారియే, ఏపరమాత్మ చిద్రూపుడేయగుచుప్రకాశింపజేయుచున్నాడో, ఆయీ పరమాత్మ, వేదాంతశాస్త్రమందు సాక్షియని చెప్పబడును.

అవ. సాక్షి, ఒక్కటేసారి సర్వమును స్ఫురింపజేయుటను స్పష్టముగా జూపుచున్నాడు.

శ్లో॥ ఈక్షేశ్రుణోమిజిఘ్రామిస్వాదయామిస్పృశామ్యహం।
ఇతిభాసయతేసర్వంనృత్యశాలాస్థదీపవత్॥ ౧౦.

టీ. అహం-నేను, ఈక్షే-రూపమును జూచుచున్నాను. శ్రుణోమి- శబ మునువినుచున్నాను. జిఘ్రామి-గంధమునాఘ్రాణము జేయుచున్నాను. స్వాద యామి-రుచినెరుగుచున్నాను. స్పృశామీతి - స్పర్శమునెరుగుచున్నాననెడి, సర్వం-సర్వమును, అనగాద్రష్టృదర్శనదృశ్యలక్షణముగలత్రిపుటిననుట.నృత్య శాలాస్థదీపవత్-నృత్యశాలా-నాట్యగృహమందు, స్థ-ఉండెడి, దీపవత్ - దీప మువలె, భాసయతే - ప్రకాశింపజేయుచున్నాడు.

తా. నేను రూపమును జూచుచున్నానననట్టియు, నేను శబ్దమునువిను చున్నానననట్టియు, నేను గ్రంధము నాఘ్రాణించుచున్నానననట్టియు, నేను


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రుచి నెరుగుచున్నాననునట్టియు, నేను స్పర్శము నెరుగుచున్నాననునట్టి, ద్రష్టృ వర్శన దృశ్యలక్షణముగల త్రిపుటిని, ఒక్కసారే ఈసాక్షి, నాట్యశాలయందుండెడి దీపమువలె నిర్వికారి స్వభావముచేత ప్రకాశింపజేయుచున్నాడు.

అవ. ఈ దృష్టాంతమును స్పష్టీకరించుచున్నాడు.

శ్లో॥ నృత్యశాలాస్థితోదీపః ప్రభుంసభ్యాంశ్చనర్తకీం।
దీపయేదవిశేషేణతదభావేపిదీప్యతే॥ ౧౧.

టీ. నృత్యశాలాస్థితః=నృత్యశాలా- నాట్యశాలయందు, స్థితః - స్థితిని బొందియుండెడి, దీపః-దీపము, ప్రభుం-ప్రభువును, సభ్యాంశ్చ- సభయందుగల పురుషులను, నర్తకీం-నాట్యమాడెడిస్త్రీని, అవిశేషేణ-ప్రభ్వాదివిశేషమును ప్రకాశింపజేసెడికొరకు వృద్ధ్యాదివికారములేకనే, దీపయేత్-ప్రకాశింపజేయును. తదభావేపి=తత్-ఆప్రభువు మొదలగు జనముయొక్క, అభావేపి-లేమియందును, అనగా నాప్రభ్వాదిజనము లేకపోవుచుండగాననుట. దీప్యతే-ఆదీపము స్వయముగా ప్రకాశించుచున్నది.

తా. నాట్యశాలయందుండెడి దీపము, అచ్చటగల ప్రభ్వాది విశేషమును ప్రకాశింపజేసెడికొరకు వృద్ధ్యాదివికారమును బొందకనే, ప్రభువును, సభయందుగల పురుషులను, నాట్యమాడెడిస్త్రీని, ప్రకాశింపజేయుచున్నది. మరియు, ఆప్రభువు మొదలగు జనములేకపోయినను, ఆదీపము స్వయముగా ప్రకాశించుచున్నది.

అవ. ఈ యర్థమును దార్ష్టాంతికమందు గూర్చుచున్నాడు.

శ్లో॥ అహంకారంధియంసాక్షీవిషయానపిభాసయేత్।
అహంకారాద్యభావేపిస్వయంభాత్యేవపూర్వవత్॥ ౧౨.

టీ. సాక్షీ-ప్రత్యగాత్మ, అహంకారం-అహంకారమును, ధియం- బుద్ధిని, విషయానపి-విషయములను, భాసయేత్-ప్రకాశింపజేయుచున్నాడు. అహంకారాద్యభావేపి=అహంకారాది - అహంకారాదికముయొక్క, అభావేపి- లేమియందును, అనగా సుషుప్త్యాద్యవస్థయందు అహంకారాదికము లేకపోవుచుండగా ననుట. స్వయం-ఆసాక్షి, పూర్వవత్-పూర్వమువలె, భాత్యేవ- ప్రకాశించుచున్నవాడే యగును.

తా. ఈదృష్టాంతప్రకారమే, సాక్షియు, వృద్ధ్యాది వికారములేకనే, అహంకారమును, బుద్ధిని, శబ్దస్పర్శాదివిషయములను ప్రకాశింపజేయుచున్నాడు. మరియు, సుషుప్త్యాద్యవస్థయందు అహంకారాదికము లేకపోయినను, ఆసాక్షి, పూర్వమువలెనే నిర్వికారిత్వముచేత స్వయముగా ప్రకాశించుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ నిరంతరంభాసమానేకూటస్థేజ్ఞప్తిరూపతః।
తద్భాసాభాస్యమానేయంబుద్ధిర్నృత్యత్యనేకధా॥ ౧౩.

టీ. కూటస్థే-నిర్వికారుడగుసాక్షి, జ్ఞప్తిరూపతః-స్వప్రకాశచైతన్యరూపమువలన, నిరంతరం-సర్వదా, భాసమానేసతి- స్ఫురించుచుండగా, ఇయం-ఈ, బుద్ధిః-బుద్ధి, తద్భాసా-తత్-ఆసాక్షియొక్క, భాసా- స్వరూపచైతన్యము చేత, భాస్యమానైవసతీ-ప్రకాశింపబడుచున్నదేయగుచు, అనేకధా - అనేకప్రకారముగా, అనగా నిదిఘటంబిదివస్త్రంబనెడి ఇత్యాది జ్ఞానాకారముగా ననుట. నృత్యతి- నాట్యమును జేయుచున్నది. అనగా వికారమును బొందుచున్నదనుట.

తా. ప్ర. అయితే, ప్రకాశరూపమగుబుద్ధికే, అహంకారాది సర్వవస్తువును ప్రకాశింపజేయడము సంభవించియుండగా, ఆబుద్ధికంటె నన్యుడగు సాక్షిని కల్పించుటచేత ప్రయోజనమేమి? ఉ. నిర్వికారియగుసాక్షి, స్వప్రకాశచైతన్యరూపముచేత (సర్వదా) స్ఫురించుచుండగా, ఈబుద్ధి,ఆసాక్షియొక్క స్వరూపచైతన్యముచేత ప్రకాశింపబడుచున్నదేయగుచు: ఇది ఘటమనియునిది వస్త్రమనియు, ఇత్యాదిజ్ఞానాకారత్వముచేత అనేక విధముగా వికారమును బొందుచున్నది. అనగా, ఏకారణమువలన బుద్ధికి వికారిత్వముచేత జడభావము గలిగియుండుటవలన (స్వతఃస్ఫురణము) లేదో, ఆకారణమువలన ఆబుద్ధి కంటె నన్యుడగుచు సర్వపదార్థములను ప్రకాశింపజేసెడి సాక్షినంగీకరింపవలెనని యభిప్రాయము.

అవ. ఈచెప్పబడిన యర్థమును, శిష్యులయొక్క బుద్ధిసౌకర్యముకొరకు నాటకత్వముచేత దెలుపుచున్నాడు.

శ్లో॥ అహంకారఃప్రభుస్సభ్యావిషయానర్తకీమతిః।
తాలాదిధారిణ్యక్షాణిదీపస్సాక్ష్యవభాసకః॥ ౧౪.

టీ. అహంకారః-అహంకారము, ప్రభుః-ప్రభువువంటిదగును. విషయాః-శబ్దస్పర్శాదివిషయములు, సభ్యాః - సభయందుగల పురుషులవంటివగును. మతిః-బుద్ధి, నర్తకీ-నాట్యము జేసెడిస్త్రీవంటిదగును. అక్షాణి- శ్రోత్రాది ఇంద్రియములు, తాలాదిధారిణి = తాలాది-తాళము మొదలగు పనిముట్లను, ధారిణి-ధరించినవగును. అనగా తాళము మొదలగు నాట్యసాధనములను ధరించిన జనులవంటివగుననుట.

తా. విషయభోగలాభనష్టాభిమాన ప్రయుక్తసుఖదుఃఖము గలిగియుండుటవలన, అహంకారమునకు నృత్యాభిమానియగు ప్రభువుతోటి తుల్యత్వము-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును, గతః-పొందిన, స్వల్పః-స్వల్పమగు, ఆతపః-ఎండ, అచలఏవ- చాంచల్యములేనిదేయగును. తత్ర-ఆయెండయందు హస్తే-చేయి, నర్త్యమానేసతి-పురుషునిచేత కదలింపబడుచుండగా, ఆతపః - చలనములేనియెండ, యథా-ఏప్రకారము, నృత్యతీవ-చలించుచున్నట్లు కనబడుచున్నదో. అనగా చలింపదనుట.

తా. ప్ర. అయితే, ప్రకాశింపజేసెడి వస్తువునందు ప్రకాశింపబడుచుండెడి పదార్థముయొక్క చాంచల్యారోప మెచ్చటగనబడుచున్నదో చెప్పుము? ఉ. కిటికీవలన గృహములోనికి వ్యాపించిన స్వల్పమగు ఎండ, చలనములేకనేవర్తించుచుండును. ఆయెండయందు బురుషునిచేతహస్తము, ఈతట్టునకా తట్టునకు చలింపబడుచుండగా, చలనములేనియాయెండ, చలించుచున్నట్లు కనబడుచుండునేగాని, చలించుచున్నదిగాదు.

అవ. దార్ష్టాంతికమును జెప్పుచున్నాడు.

శ్లో॥ నిజస్థానస్థితస్సాక్షీబహిరంతర్గమాగమౌ।
అకుర్వన్బుద్ధిచాంచల్యాత్కరోతీవతథాతథా॥ ౧౯.

టీ. నిజస్థానస్థితః-నిజస్థాన-స్వస్థానమందు, స్థితః - స్థితినిబొందియుండెడి, సాక్షీ-పరమాత్మ, బహిః-వెలుపటను, అంతః-లోపటను, గమాగమౌ-గమనాగమనములను, అకుర్వన్-చేయనివాడగుచు, బుద్ధిచాంచల్యాత్= బుద్ధి-బుద్ధియొక్క, చాంచల్యాత్-చంచలత్వమువలన, తథాతథా - ఆయాప్రకారము, అనగా బుద్ధిచాంచల్యప్రకారము గమనాగమనములననుట. కరోతీవ-చేయుచున్నవానివలె గనబడుచున్నాడు. అనగా గమనాగమనములను జేయుచున్నవాడుగాడనుట.

తా. ఈదృష్టాంతప్రకారము, నిజస్థానమందుండెడి సాక్షి, బాహ్యాంతర గమనాగమనములను జేయనివాడగుచు, బుద్ధిచే జేయబడెడి గమనాగమనములను జేయుచున్నవానివలె దోచుచున్నాడేగాని, వాస్తవమువలన సాక్షి, చాంచల్యములేనివాడేయగునని యభిప్రాయము.

శ్లో॥ నబాహ్యోనాంతరస్సాక్షీబుద్ధేర్దేశౌహితావుభౌ।
బుద్ధ్యాద్యశేషసంశాంతౌ యత్రభాత్యస్తితత్రసః॥ ౨౦.

టీ. హి-ఏకారణమువలన, ఉభౌ-రెండైన, తౌ - ఆ బాహ్యాంతరములు, బుద్ధేః-బుద్ధియొక్క, దేశౌ-దేశములగునో, (తతః) ఆకారణమువలన, సాక్షీ-పరమాత్మ, బాహ్యః-బాహ్యదేశముగలవాడు, న-కాడు. ఆంతరః-ఆంతరముగలవాడు, న-కాడు. యత్ర-ఏస్థలమందు, బుద్ధ్యాద్యశేషసంశాంతౌసత్యాం-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుద్ధ్యాది- బుద్ధీంద్రియాదులకు, అశేష-నిశ్శేషమగు, సంశాంతౌసత్యాం-సంశాంతిగలుగుచుండగా, అనగా బుద్ధీంద్రియాదులయొక్క వ్యాపారము దోచకుండగాననుట. సః-ఆసాక్షి, భాతి-స్వప్రకాశత్వముచే ప్రకాశించుచున్నాడో, తత్ర-ఆస్థలమందు, సః-ఆసాక్షి, అస్తి-కలడు.

తా॰ ప్ర॰ అయితే (నిజస్థానమందుండెడిసాక్షి) అనియిట్లు చెప్పుటచేత, ఆసాక్షికి బాహ్యదిదేశస్థితియే, చెప్పబడు నేమోచెప్పుము? ఉ॰ సాక్షి, బాహ్యదేశమందుండెడివాడైనను, అంతరదేశమందుండెడివాడైననుకాడు. ప్ర॰ అటుండమికి గారణమేమి? ఉ॰ ఆబాహ్యాంతరములనెడి రెండుదేశములును, బుద్ధియొక్క దేశములగునేగాని, సాక్షియుండెడి దేశములుగావు. ప్ర॰ అయితే, నిజస్థానశబ్దముచేత జెప్పబడెడి, సాక్షియొక్క దేశమెద్ది? ఉ॰ ఏస్థలమందుబుద్ధీంద్రియాది సర్వవ్యాపారము తోచకపోవుచుండగా, ఆసాక్షి, స్వప్రకాశత్వముచేత ప్రకాశించుచున్నాడో, ఆస్థలమందు సాక్షిగలడని తెలియవలెను.

శ్లో॥ దేశఃకోపినభాసేతయదితర్హ్యదేశభాక్।
సర్వదేశప్రక్లృప్త్యైవసర్వగత్వంనతుస్వతః॥ ౨౧.

టీ॰ కః-ఏ, దేశోపి-దేశంబును, నభాసేతయదితర్హి - తోచలేదనియంటివేని, అదేశభాక్=అదేశ-దేశరాహిత్యమును, భాక్-పొందినవాడు, అస్తు- అగుగాక. సర్వదేశప్రక్లృప్త్యైవ=సర్వదేశ-సర్వదేశములయొక్క, ప్రక్లృప్త్యైవ-ప్రక్లృప్తిచేతనే, అనగా లేమిచేతనేయనుట. సర్వగత్వం - సర్వగతత్వమగును. స్వతస్తు-స్వాభావికనో, న-కాదు.

తా. ప్ర॰ అయితే, సర్వవ్యవహారము లేకపోవుచుండగా నేదేశంబునంగీకరింపబడనప్పుడు, నిజస్థానమందు సాక్షియున్నాడని యెందుకు జెప్పితిరి? ఉ. నాయభిప్రాయమునుజెప్పెదవినుము. సర్వవ్యవహారము సంశాంతినిబొందుచుండగా దేశమంగీకరింపబడనప్పుడు, ఆసాక్షి, దేశాభావమునుబొందినవాడే యగును. అనగా దేశాదికల్పనాధిష్ఠానుడగు సాక్షికి, తనకంటె నన్యమైనదేశాపేక్ష, లేదని యభిప్రాయము. ప్ర. అయితే, దేశాదికము లేకపోవుచుండగా శాస్త్రమందు జెప్పబడిన సర్వగతత్వ సర్వసాక్షిత్వాదికము విరోధమును బొందదాయేమి? ఉ. సర్వదేశాభావముచేతనే, సాక్షికి సర్వగతత్వము గలుగుచున్నది. ప్ర. అయితే, సర్వగతత్వము సాక్షికి స్వాభావికముగా లేదాయేమి? ఉ. ఆసాక్షి, అద్వితీయుడగుటవలనను, అసంగుడగుటవలనను, సర్వగతత్వము సాక్షికి వాస్తవముగాదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలదు. మరియు, శబ్దస్పర్శాది విషయములు సమీపమందు వర్తించుచున్నను, విషయభోగ లాభనష్టాభిమాన ప్రయుక్తసుఖదుఃఖము లేమిచేత, ఆవిషయములకు సభ్యపురుషులతోఁటి తుల్యత్వముగలిగియున్నది. మరియు, బుద్ధికి నానావిధ వికారము గలిగియుండుటచేత, ఆ బుద్ధికి, నాట్యమాడెడి స్త్రీతోఁటితుల్యత్వము గలిగియున్నది. మరియు, ఇంద్రియములు, బుద్ధివికారములకు అనుకూలవ్యాపారములం జేయుచుండుటచేత, ఆశ్రోత్రాది ఇంద్రియములకు, తాళము మొదలగు నాట్యసాధనములను ధరియించిన జనులతోఁటి తుల్యత్వముగలిగియున్నది. మరియు, సాక్షి, ఈయహంకారాది సర్వమును ప్రకాశింప జేయుచుండుటవలన, ఆసాక్షికి దీపముతోఁటి తుల్యత్వము గలిగియున్నదని ఈప్రకారముగా దెలియవలెను.

శ్లో॥ స్వస్థానసంస్థితోదీపః సర్వతోభాసయేద్యథా।
స్థిరస్థాయీతథాసాక్షీబహిరంతఃప్రకాశయేత్॥ ౧౫.

టీ. స్వస్థానసంస్థితః=స్వస్థాన-తనయొక్కస్థానమందు, సంస్థితః-స్థితిని బొందియుండెడి, దీపః-దీపము, సర్వతః- అంతటను, అనగా తనసమీపమందుండెడి పదార్థములనన్నిటి ననుట. యథా-ఏప్రకారము, భాసయేత్- ప్రకాశింపజేయునో, తథా-ఆప్రకారము, స్థిరస్థాయీ - స్థిరస్థాయియగు, సాక్షీ-ప్రత్యగాత్మ, బహిః-దేహముకంటె వెలుపటను, అంతః - దేహమునకు లోపటను, ప్రకాశయేత్ - ప్రకాశింపజేయును.

తా. ప్ర. అయితే, సాక్షి, అహంకారాదికమును ప్రకాశింపజేయునెడల, ఆయహంకారాదికముతోఁటి సంబంధించుటకొరకు గమనాగమనరూపవికారవంతము, ఆసాక్షికిగలుగదాయేమి? ఉ. దీపము గమనాది వికారములేనిదగుచు, స్వదేశమందున్నదగుచునే, తనసమీపమందుండెడి సర్వపదార్థములనే ప్రకారముగా ప్రకాశింపజేయుచున్నదో,ఆప్రకారమేసాక్షియు, స్థిరస్థాయియగుచు, బాహ్యాభ్యంతరములను ప్రకాశింపజేయుచున్నాడు. బాహ్యాభ్యంతరములను ప్రకాశింపజేయుచున్నాడని చెప్పుటచేత, సర్వమును ప్రకాశింపజేయుచున్నాడనెడి యర్థమును గ్రహించవలెను.

శ్లో॥ బహిరంతర్విభాగోఽయందేహాపేక్షోనసాక్షిణి।
విషయాబాహ్యదేశస్థాదేహస్యాంతరహంకృతిః॥ ౧౬.

టీ. బహిః=వెలుపటననునట్టియు, అంతః-లోపటననునట్టియు, అయం-ఈ, విభాగః-భేదము, దేహాపేక్షః=దేహ-శరీరమును, అపేక్షః-అపేక్షించినదగును. సాక్షిణి-ప్రత్యగాత్మయందు, న-లేదు. విషయాః- విషయములు, బాహ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశస్థాః= బాహ్యదేశ - బాహ్యప్రదేశమందు, స్థాః - స్థితినిబొందినవగును. అహంకృతిః- అహంకారము, దేహస్య-శరీరమునకు, అంతః-లోపటనుండునది యగును.

తా. ప్ర. అయితే, శ్రు॥ అపూర్వమన పరమనంతరమబాహ్యం॥ అనెడిశ్రుతిచేత సాక్షికి బాహ్యాంతరవిభాగము లేదని చెప్పబడుచుండగా, ఆసాక్షికి బాహ్యాంతరములను బ్రకాశింపజేసెడి యభిమానము నెట్లుచెప్పవచ్చును? ఉ. ఈబాహ్యాంతరవిభాగము, దేహము నపేక్షించినదే యగుగాని, సాక్షికలేదు. ప్ర. అయితే, బాహ్యత్వము దేనికో, ఆంతరత్వము దేనికో జెప్పుము? ఉ. శబ్దస్పర్శాదివిషయములు, దేహముకంటె బాహ్యమందున్నవగును. అహంకారము, దేహమునకు లోపటనుండునదియగునని తెలియవలెను.

శ్లో॥ అంతస్థాధీస్సహైవాక్షైర్బహిర్యాతిపునఃపునః।
బాహ్యబుద్ధిస్థచాంచల్యంసాక్షిణ్యారోప్యతేవృథా॥ ౧౭.

టీ. అంతస్థా-దేహములోపటనుండెడి, ధీః-బుద్ధి, అక్షైః- చక్షురాదిఇంద్రియములతో, సహైవ-కూడనే, పునఃపునః-మాటిమాటికి, బహిః - బాహ్యప్రదేశమును, యాతి-పొందుచున్నది. బాహ్యబుద్ధిస్థచాంచల్యం=బాహ్యబుద్ధి-బాహ్యబుద్ధియందు, స్థ- ఉండెడి, చాంచల్యం - చంచలస్వభావము, వృథా-వ్యర్థముగా, సాక్షిణి-సాక్షియందు, ఆరోప్యతే కల్పింపబడుచున్నది.

తా. ప్ర. అయితే, (నేనుఘటమునుచూచుచున్నాను) అనెడి వ్యవహారమందు, (నేనని) లోపట నహంకారసాక్షిత్వముచేత, (ప్రథమతః) ప్రకాశించుచుండెడిసాక్షికె, అనంతరమందు (ఘటమును జూచుచున్నానని) ఘటాకారవృత్తిస్ఫురణరూపముచేత బాహ్యగమనానుభవముగలిగియుండగా, (౧౫) పదియేనవశ్లోకమునందు, నిర్వికారియగుసాక్షి, బాహ్యాంతరములను బ్రకాశింపజేసెడివాడగునని చెప్పబడిన అర్థము యుక్తమెట్లగును? ఉ. ద్రష్టృగ్రాహకత్వముచేత దేహములోపట నుండెడి బుద్ధి, రూపాదికమును గ్రహించెడికొరకు చక్షురాదీంద్రియద్వారముగా మాటిమాటికిని బాహ్యస్థలమునకు బోవుచున్నది. అట్లుపోవుచుండగా, ఆబుద్ధియందుగల బాహ్యచాంచల్యము, ఆబుద్ధిని బ్రకాశింపజేసెడి సాక్షియందువ్యర్థముగా నారోపింపబడుచున్నది. అందువలన సాక్షికి చాంచల్యమువాస్తవముగాదని తెలియవలెను.

శ్లో॥ గృహాంతరగతస్స్వల్పోగవాక్షాదాతపోచలః।
తత్రహస్తేననృత్యేనృత్యతీవాతపోయథా॥ ౧౮.

టీ. గవాక్షాత్-కిటికివలన, గృహాంతరగతః= గృహాంతర - గృహాంతర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. సర్వగతత్వమువలె, సర్వసాక్షిత్వంబును వాస్తవముగాదని చెప్పుచున్నాడు.

శ్లో॥ అంతర్బహిర్వా సర్వంవాయం దేశంపరికల్పయేత్।
బుద్ధిస్తద్దేశగస్సాక్షీతథావస్తుషుయోజయేత్॥ ౨౨.

టీ. బుద్ధిః-బుద్ధి, అంతః - ఆంతరమైనను, బహిర్వా - బాహ్యమైనను, సర్వంవాపి-సర్వమగు, యం-ఏ, దేశం-దేశమును, పరికల్పయేత్ - కల్పించునో, సాక్షీ-పరమాత్మ, తద్దేశగః=తద్దేశ-ఆదేశమును, గః-పొందినవాడగును. తథా-ఆప్రకారము, వస్తుషు-వస్తువులయందు, యోజయేత్- ఊహించవలెను. అనగా నెరుగవలెననుట.

తా. బుద్ధి, బాహ్యాంతర సర్వరూపమగు ఏదేశమును కల్పించుచున్నదో, ఆదేశమును (సాక్షి) పొందినవాడగును. ఆప్రకారమే వస్తువులయందు నూహించి యెరుగవలెను.

అవ. వస్తువులయందు ఊహించియెరిగెడిప్రకారమునే వివరించి చెప్పుచున్నాడు.

శ్లో॥ యద్యద్రూపాదికల్ప్యేతబుద్ధ్యాతత్తత్ప్రకాశయన్।
తస్యతస్యభవేత్సాక్షీ స్వతోవాగ్బుద్ధ్యగోచరః॥ ౨౩.

టీ. (పరమాత్మా) పరమాత్మ, బుద్ధ్యా-బుద్ధిచేత, యద్యత్ ఏయే, రూపాది-రూపాదికము, కల్ప్యేత-కల్పింపబడుచున్నదో, తత్తత్- ఆయారూపాదికనును, ప్రకాశయన్-ప్రకాశింపజేయుచు, తస్యతస్య- ఆయారూపాదికమునకు, సాక్షీ-సాక్షి, భవేత్-అగును. స్వతః-స్వయముగా, వాగ్బుద్ధ్యగోచరః=వాక్-ఇంద్రియములకును, బుద్ధి-బుద్ధికిని, అగోచరః- అగోచరుడగును. అనగా నవాఙ్మనసగోచరుడగుననుట.

తా. బుద్ధిచేత, ఏయేరూపాదికము కల్పించబడునో, ఆయారూపాదికమును పరమాత్మ, ప్రకాశింపజేయుచు ఆయారూపాదికమునకు సాక్షియగుచున్నాడు. ప్ర. అయితే, ఆసాక్షికినిజరూపమేమి? ఉ. ఆసాక్షి, అవాఙ్మనసగోచరుడగును. అనగా నవాఙ్మనసగోచరత్వమే సాక్షికి నిజరూపమనియభిప్రాయము.

శ్లో॥ కథంతాదృఙ్మయాగ్రాహ్య ఇతిచేన్నైవగృహ్యతాం।
సర్వగ్రహోపసంశాంతౌ స్వయమేవావశిష్యతే॥ ౨౪.

టీ. తాదృక్-అటువంటిసాక్షి, అనగా నవాఙ్మనసగోచరుడగు సాక్షియనుట. మయా - ముముక్షువగునాచేత, కథం - ఎట్లు, గ్రాహ్య ఇతిచేత్-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్రహింపదగినవాడగునని యంటివేని, నైవగృహ్యతాం - గ్రహింపబడకుండు గాక. సర్వగ్రహోపసంశాంతౌ సత్యాం= సర్వగ్రహ - సర్వద్వైతమునకు, ఉపసంశాంతౌసత్యాం- ఉపశాంతిగలుగుచుండగా, అనగా సర్వవ్యవహార సంక్షయమగుచుండగానుటు. స్వయమేవ- పరమాత్మయగు తానే, అవశిష్య తే-శేషించుచున్నాడు.

తా. ప్ర. అయితే, సాక్షి, అవాఙ్మానసగోచరుడైనయెడల, ముముక్షు వగు నాచేతగ్రహింపబడడుగదా? ఉ. ఆసాక్షి, ముముక్షువుచేత గ్రహింప బడకుండుట, మాకుసమ్మతమేయగును. ప్ర. అయితే, విచారజన్యజ్ఞానముచేత మాయ, నివర్తింపబడుచుండగా, పరమాత్మయగుతానే శేషించుచున్నాడని, మూడవశ్లోకమందు మీచేజెప్పబడిన అర్థమెట్లు సిద్ధించును? ఉ. సర్వద్వైతవ్య వహారమునకు క్షయము గలుగుచుండగా, పరమాత్మయగు తానే మిగులుచు న్నాడు. అనగా స్వస్వరూపముకంటె నన్యమగు ద్వైతమునకు మిథ్యాత్వనిశ్చ యముచేత అద్వైతము తోచకపోవుచుండగా, సస్వరూపభూతుడగు పరమాత్మ యే సత్యత్వముచేత శేషించుచున్నాడేగాని, ఆపరమాత్మయగుసాక్షి, గ్రహిం పబడెడివాడుగాడని యభిప్రాయము.

శ్లో॥ నతత్రమానాపేక్షాస్తి స్వప్రకాశస్వరూపతః।
తాదృగ్వ్యుత్పత్త్యపేక్షాచేచ్ఛ్రుతింపఠగురోర్ముఖాత్॥ ౨౫.

టీ. స్వప్రకాశస్వరూపతః- స్వప్రకాశస్వరూపమువలన, అనగా స్వ ప్రకాశస్వరూపము గలిగియుండుటచేననుట. తత్ర-ఆపరమాత్మయందు, మా నాపేక్షా=మాన-ప్రమాణముయొక్క, అపేక్షా-అపేక్ష, నాస్తి - లేదు. తాదృ గ్వ్యుత్పత్త్యపేక్షాచేత్=తాదృక్-అటువంటి, అనగా స్వప్రకాశత్వమువలన నాపరమాత్మయందు ప్రమాణమపేక్షింపబడదనెడియనుట. వ్యుత్పత్తి - వ్యుత్ప త్తియొక్క, అపేక్షాచేత్-ఇష్టముగలిగినయెడల, గురోః - ఆచార్యునియొక్క, ముఖాత్- నోటివలన, శ్రుతిం-శ్రుతిని, పఠ-పఠింపుము.

తా. ప్ర. అయితే, ఈచెప్పబడిన న్యాయముచేత, తనస్వరూపభూతు డగు పరమాత్మ, శేషించుచున్నవాడైనను, ఆపరమాత్మయొక్క అపరోక్షత్వ ముకొరకు, ఒకానొక ప్రమాణమపేక్షింపబడదాయేమి? ఉ. ఆపరమాత్మయం దు ప్రమాణమపేక్షింపబడదు. ప్ర. అందుకుహేతువేమి? ఉ. ఆపరమాత్మ, స్వప్రకాశ స్వరూపుడగుటవలన, ప్రమాణ మపేక్షింపబడదని తెలియవలెను ప్ర. అయితే, ఆత్మకుస్వప్రకాశత్వముచేత (స్వతః) స్ఫూర్తిగలిగియుండగా ప్రమాణమపేక్షింపబడదనెడి వ్యుత్పత్తిసిద్ధికొరకైనను ప్రమాణమపేక్షింపబడ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దాయేమి? ఉ. ఆత్మకుస్వప్రకాశత్వముచేత (స్వతః) స్ఫురణముగలిగియుండ గా ప్రమాణమపేక్షింపబడదనెడి వ్యుత్పత్తిసిద్ధికొరకు ప్రమాణమునపేక్షించితి వేని, ఈవిషయమై శ్రుతియే ప్రమాణమగును. కనుక, గురుముఖమువలన శ్రుతి నిపఠించి, తెలిసికొనుము.

అవ. ఇట్లు ఉత్తమాధికారికి ఆత్మానుభవోపాయమునుదెలిపి, మందా ధికారికి, ఆయాత్మానుభవోపాయము నిప్పుడు చూపుచున్నాడు.

శ్లో॥ యదిసర్వగ్రహత్యాగోఽశక్యస్తర్హిధియంవ్రజ।
శరణంతదధీనోఽంతర్బహిర్వైషోఽనుభూయతాం॥ ౨౬.

టీ. సర్వగ్రహత్యాగః=సర్వగ్రహ- సకలద్వైతవ్యవహారముయొక్క, త్యాగః-పరిత్యాగము, అశక్యోయదితర్హి-శక్యముగానియెడల, ధియం-బుద్ధిని, శరణం-రక్షకునిగా, వ్రజ-ఆశ్రయింపుము. తదధీనః=తత్ - ఆబుద్ధికి, అధీనః- అధీనుడగు, ఏషః-ఈపరమాత్మ, అంతః-దేహములోపటను, బహిర్వై- దేహ మునకువెలుపటను, అనుభూయతాం- అనుభవింపబడుగాక.

తా. మరియు, సర్వద్వైతవ్యవహారమును విడుచుటకు శక్యముగానియె డల, బుద్ధికి శరణాగతుడవుగమ్ము. ప్ర. అయితే, బుద్ధినాశ్రయించుటచేత ఫల మేమి? ఉ. బుద్ధిచేత, నేయే, బాహ్యమైనదైనను ఆంతరమైనను ద్వైతముక ల్పించబడుచున్నదో, ఆయాద్వైతమునకు సాక్షిత్వముచేత, తదధీనుడగుపర మాత్మ, ఆప్రకారమే యనుభవింపబడును.

ఇతి, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీభారతీ తీర్థ విద్యారణ్య మునివర్యకృత నాటకదీపస్సమాప్తః.

గద్య. ఇది శ్రీపరమేశ్వర గురుచరణ వరప్రసాదలబ్ధ బ్రహ్మవిద్యా విరాజిత కాశ్యపసగోత్ర పవిత్ర మంత్రివంశ పయఃపారావార పరిపూర్ణసు ధాకర లక్ష్మణామాత్య పుత్ర లక్ష్మీనారాయణామాత్య ప్రణీతంబైన ఆంధ్రి టీకాతాత్పర్యసహిత శ్రీవేదాంత పంచదశియందు నాటకదీప మనెడి దశమ ప్రకరణము సంపూర్ణమాయెను.

శ్లో॥ టీకానాటకదీపస్య పదతాత్పర్యబోధినీ।
నారాయణాఖ్యవిదుషా కృష్ణపాదసమర్పితా॥

ఓంతత్సత్ - శ్రీకృష్ణార్పణమస్తు.

దీపికాపంచకము - సంపూర్ణము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శ్రీరస్తు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

—※—

※అద్వైతానందస్థితవిషయసూచిక.※



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లోకసంఖ్య. విషయసూచిక.



—*—

* విద్యానందస్థిత విషయసూచిక. *



—*—

*విషయానందస్థితవిషయసూచిక. *



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

—※—

ఈగ్రంథమును గురించి కొత్తపట్టణనివాసులగు, బ్రహ్మశ్రీ, ముక్తినూతలపాటి సీతారామ కవివరులొసంగిన చాటుధార?—

సీ. శ్రీసచ్చిదానంద※సింధుబంధురరస మగ్నాయమానస※న్మానసుండు।
షడ్భావవైకృత※షట్త్రింశదతిసూక్ష్మ తన్మూలకారణతత్వవేది।
ఆత్మబంధాబంధ※నాదికారణతత్వవిజ్ఞానసంవిద※భిజ్ఞతరుడు।
తత్త్వమస్యాదిప※దచతుష్టయాద్వైతపరమార్థసారైక※భవ్యమూర్తి।
కాశ్యపసగోత్రజుండుల※క్ష్మణసుతుండు।
పిచ్చమాంబోదరాఽమృతా※బ్ధిహిమకరుడు।
జపతపోధ్యానయోగనిష్ఠాగరిష్ఠు।
డార్యజనమాన్యగుణధుర్యుడైనయట్టి॥

క. ఘనషట్సహస్రికులకమ। లనళినమిత్రుండుమంత్రి※లక్ష్మీనారా।
యణవిద్వత్కవియూనా। ననినిబుధసమాజమెల్ల※నానందింప॥

గీ. శ్రీమమపనిషదర్థాగ్ర※సీమపంచ। దశికిబ్రతిపదభావార్థ※విశదతదగ।
నాంధ్రటీకరచించెన※ధ్యాత్మనిదులు। గైకొనిప్రమోదమతినిబ※హూకరింప॥

☞ ఇట్లు, ము. సీతారామశాస్త్రిలు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుభమస్తు.

శ్రీకృష్ణసద్గురు పరబ్రహ్మణేనమః.

బ్రహ్మానందమందు

# యోగానంద ప్రారంభము.



అవ. ఇప్పుడు, శ్రీవిద్యారణ్యగురుండు, తాను జేయుట కిచ్ఛయించిన గ్రంథమునకు నిర్విఘ్నపరిపూర్తిగలిగెడికొరకు, తత్వజ్ఞానమునకు విఘ్నకారియగు పాపమునివర్తించెడి నిమిత్తమై, ఇష్టదేవతాస్వరూపానుసంధానమంగళము నాచరించుచు, శిష్యప్రవృత్తిసిద్ధికొరకు ప్రయోజన సహితవస్తువును దెలుపుచు గ్రంథారంభమును జేయుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మానందం ప్రవక్ష్యామి జ్ఞాతే తస్మిన్నశేషతః।
ఐహికాముష్మికానర్థ వ్రాతం హిత్వా సుఖాయతే॥ ౧.

టీ. బ్రహ్మానందం=బ్రహ్మ-బ్రహ్మమగు, ఆనందం-ఆనందమును, ప్రవక్ష్యామి- చెప్పుచున్నాను. తస్మిన్ - ఆబ్రహ్మానందము, జ్ఞాతేసతి- ఎరుగబడుచుండగా, ఐహికాముష్మికానర్థవ్రాతం=ఐహిక - ఈలోకమందుగలిగినట్టియు, ఆముష్మిక-పరలోకమందుగలిగినట్టియు, అనర్థ-దుఃఖములయొక్క, వ్రాతం- సమూహమును, అశేషతః-నిశ్శేషముగా, హిత్వా- విడిపించి, సుఖాయతే - సుఖరూపమగు బ్రహ్మమేయగుచున్నాడు.

తా. ఏమందబుద్ధిగల జనులు, నిర్విశేషపరబ్రహ్మమును సాక్షాత్కరించుకొనుటకు సమర్థులుగారో, వారు, సవిశేషనిరూపణములచేత ననుగ్రహింపబడుచున్నారని. శ్లో॥ నిర్విశేషం పరబ్రహ్మసాక్షాత్కర్తుమనీశ్వరాః। యేమందాస్తేనుకంప్యంతే సవిశేషనిరూపణైః॥ అనెడివాక్యము జెప్పుచున్నది. మరియు, సవిశేషబ్రహ్మరూపులగు దేవతలయొక్క స్వరూపమునకు నిర్విశేషబ్రహ్మరూపత్వము జెప్పబడుటవలనను. మరియు, శ్రు॥ ఆనందో బ్రహ్మ॥ అనెడి యిత్యాదిశ్రుతులచేత బ్రహ్మమునకు ఆనందరూపత్వము జెప్పుటవలనను, మూలమందు మొట్టమొదట (బ్రహ్మానందం) అనియిట్లు గ్రంథారంభమును జేయుటవలన ఆనందరూపమగు బ్రహ్మముయొక్క వాచకశబ్దప్రయోగముచేత (మనంబుచే దేనిని ధ్యానించుచున్నాడో, దానిని వాక్కుచేత జెప్పుచున్నాడని, చెప్పెడి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రు॥ యద్విమనసాధ్యాయతీతచ్ఛాచాధ్వదతి॥ అనెడి శ్రుతిప్రోక్తన్యాయమువలన, బ్రహ్మానుసంధానలక్షణముగల మంగళాచరణం బీగ్రంథమునకు సిద్ధించినదని తెలియవలెను. మరియు, బ్రహ్మము, సర్వవేదాంతములచేత బ్రతిపాదింపబ డుటవలన, ఆవేదాంతప్రకరణరూపమగు ఈగ్రంథమునకును ఆబ్రహ్మమేవిష యమగుటచేత, మూలమందు మొట్టమొదట బ్రహ్మశబ్దప్రయోగమువలన, విష యంబును సూచింపబడినదని తెలియవలెను. మరియు, ఈశ్లోకము యొక్క ఉత్త రార్థమందు, దుఃఖనివృత్తి ఇష్టప్రాప్తిరూపమగు ప్రయోజనద్వయము, మొదట నేజెప్పబడెను. మరియు, (బ్రహ్మానందం అనెడిపదమునకు బ్రహ్మమగుఆనంద మని యర్థమగును. వాచ్యవాచకములకు అభేదోపచారముగలిగియుండుటవలన, ఆబ్రహ్మమగు ఆనందమును బ్రతిపాదించెడి ఈగ్రంథంబును బ్రహ్మానందమని చెప్పబడును. గనుక, (బ్రహ్మానందంప్రవక్ష్యామి) అనియిట్లు శ్రీవిద్యారణ్య గురునిచే బ్రయోగింపబడెనని తెలియవలెను. ఆప్రతిపాద్య ప్రతిపాదకరూప మగు బ్రహ్మానందము దెలియబడుచుండగా, ఇహలోకమందుగల దేహపుత్రా దులయందు (నేనునాది) యనెడి యభిమానముతోగూడిన ఆధ్యాత్మిక ఆధిభౌ తిక ఆధిదైవిక దుఃఖసమూహంబును, పరలోకమందుగల, ఆత్రివిధదుఃఖసమూ హంబును, నిశ్శేషముగావిడచి, పురుషుడు సుఖరూపమగు బ్రహ్మమేయగు చున్నాడు.

అవ. బ్రహ్మజ్ఞానము దుఃఖనివృత్తి ఇష్టప్రాప్తులను గలిగించుటకు హే తువైయున్నదనెడిఃవిషయమై, యనేకశ్రుతిస్మృతివాక్యములు బ్రమాణములుగా నున్నవనిచూపుటకిచ్ఛయించినవాడగుచు, (బ్రహ్మవేత్త, పరమపదమునుబొం దుచున్నాడనియు, ఆత్మవేత్త, దుఃఖమునుదాటుచున్నాడనియు, ఓభగవంతుడ వగు సనత్కుమారా, నేను సంసారదుఃఖమునుబొందియున్నాననియు, నన్ను సంసారదుఃఖముయొక్కగట్టును బొందింపజేయుమనెడి యర్థము గల) శ్రు॥ బ్రహ్మవిదాప్నోతిపరం౹శ్రుతం హ్యేవమేవభగవద్దృశేభ్యః రతిశోక మాత్మ విత్, సోహంభగవశ్శోచామి, తంమాభగవాన్ శోకస్యపారంతారయత్॥ అనె డిశ్రుతివాక్యద్వయార్థము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మవిత్పరమాప్నోతి శోకంతరతిచాత్మవిత్।
రసోబ్రహ్మరసంలబ్ధ్వానందీభవతినాన్యథా॥ ౨.

టీ. బ్రహ్మవిత్=బ్రహ్మ- నిర్గుణపరబ్రహ్మమును, విత్ - ఎరిగినవాడు, పరం-నిరతిశయానందరూపబ్రహ్మమును, ఆప్నోతి- పొందుచున్నాడు. ఆత్మ విత్-ఆత్మశబ్దముచే జెప్పదగినయాత్మను, అనగా దేశకాలవస్తువులచేత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బరిచ్ఛేదములేని ఆత్మననుట. విత్-ఎరిగినవాడు, శోకం-తమోమూలమగుసంసా రమును, తరతి-దాటుచున్నాడు. అనగా నతిక్రమించుచున్నాడనుట. రసః- ఆనందరూపుడగుఆత్మ, రసం-ఆనందరూపమగు, బ్రహ్మ-బ్రహ్మమును, లబ్ధ్వా- పొంది, అనగా (అహంబ్రహ్మాస్మి) అనెడిజ్ఞానముచేత బొందియనుట. ఆనం దీ-అపరిచ్ఛిన్ననిరతిశయసుఖవంతుడు, భవతి - అగుచున్నాడు. అన్యథా-మరి యొకసాధనానుష్ఠానముచేత, న- నిరతిశయసుఖవంతుడుగాడు.

తా. బ్రహ్మవేత్తయగువాడు, నిరతిశయానంద రూపబ్రహ్మమునుబొం దుచున్నాడనియు, భూమశబ్దముచేజెప్పదగిన దేశకాలవస్తుపరిచ్ఛేదములేని ఆత్మ నెరిగినవాడు, శోకమును (అనగా తమోమూలసంసారమును) అతిక్రమించుచు న్నాడని, పూర్వోక్తశ్రుతులుచెప్పుచున్నవి. ప్ర. అయితే, కనుదహరింపబడిన తైత్తిరీయకశ్రుతివాక్యమందు బ్రహ్మజ్ఞానమునకు పరప్రాప్తి హేతుత్వమే దెలి యబడుచున్నదిగాని, ఆనందప్రాప్తిహేతుత్వముదెలియబడలేదుగదా? ఉ. ఆతై త్తిరీయకశ్రుతియొక్క ప్రకరణాదియందు శ్రు॥ సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ, తస్మాద్వా ఏతస్మాదాత్మనఆకాశస్సంభూతః॥ అనెడివాక్యమందు బ్రహ్మాత్మ శబ్దములచేత జెప్పబడిన, ఏయానందరూపఆత్మగలదో, ఆయీ యాత్మ, ఆనం దరూపబ్రహ్మమును (అహంబ్రహ్మాస్మి) అనెడిజ్ఞానముచేత బొంది, అపరిచ్ఛి న్ననిరతిశయసుఖవంతుడగుచున్నాడని, శ్రు॥ రసోవైసః, రసగ్గ్ హ్యేవాయంల బ్ధ్వానందీభవతి। అనెడి తైత్తిరీయకశ్రుతివాక్యమే జెప్పుచున్నది. ఈ చెప్పబడిన యర్థమును వ్యతిరేకప్రదర్శనముచేత దృఢీకరించెదను వినుము. బ్రహ్మాత్మైక త్వజ్ఞానమునువిడచి, మరియొకసాధనానుష్ఠానముచేత బురుషుడు నిరతిశయసు ఖవంతుడుగాడని తెలిసికొనుము.

అవ. ఇట్లు అన్వయముఖముచేత ఇష్టప్రాప్తిదుఃఖనివృత్తులను బ్రతిపాదిం చెడివాక్యములంజూపి, ఇప్పుడు, అన్వయవ్యతిరేకములచేత అనర్థనివృత్తిని బ్రతి పాదించెడి వాక్యవ్యాఖ్యానమును పఠించుచున్నాడు.

శ్లో॥ ప్రతిష్ఠాం విందతేస్వస్మిన్ యదాస్యాదథసోఽభయః।
కురుతేఽస్మిన్నంతరంచేదథతస్యభయంభవేత్॥ 3.

టీ. యదా-ఏకాలమందు, (యః-ఏముముక్షువు) స్వస్మిన్-పరమాత్మయ గుతనయందు, ప్రతిష్ఠాం-సంశయవిపర్యయ రాహిత్యముచేత (బ్రహ్మైవాహమస్మి) అనియిట్లుస్థితిని, విందతే-పొందుచున్నాడో, అథ-అప్పుడే, సః - ఆవిద్వాంసు డు, అభయః-భయరహితమోక్షరూపా ద్వితీయ బ్రహ్మమును బొందినవాడు, స్యాత్-అగును. అస్మిన్-ఈప్రత్యగభిన్నబ్రహ్మమందు, అంతరం-భేదమును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనగా నుపాస్యోపాసకాదిలక్షణమననుట. కురుతేచేత్ - చూచినయెడల, అన
గా గల్పించినయెడలననుట. అథ-అప్పుడే,తస్య-ఆభేదదృష్టిగలవానికి, భయం-
సంసారప్రయుక్తదుఃఖము, భవేత్-కలుగును.

తా. ఏకాలమందు ఈముముక్షువు, 'ఈవిద్వదనుభవగమ్యమగునట్టియు,
ఇంద్రియములకు అగోచరమగునట్టియు, స్వరూపతచేత స్వకీయత్వరహితమైన
ట్టియు, శబ్దముచేత పేరులేనట్టియు, ఆధారములేనట్టి, (అనగా స్వమహిమయం
దున్నట్టి) అద్వితీయబ్రహ్మమందు, భేదములేనట్లు, సంశయవిపర్యయరాహిత్య
ముచేత, (అహంబ్రహ్మాస్మి) అనెడిరూపముగలస్థితిని గురూపదేశాదికముచేత
శ్రవణాదికముచేసిపొందుచున్నాడో, బ్రహ్మము నెరిగినవాడు బ్రహ్మమేయగు
చున్నాడనిచెప్పెడి, శ్రు॥ బ్రహ్మవేదబ్రహ్మైవభవతి॥ అనెడి శ్రుతిప్రకారము
అప్పుడే, ఈవిద్వాంసుడు, భయరహితమోక్షరూపాద్వితీయబ్రహ్మమును,బొం
దినవాడగుచున్నాడని, శ్రు॥ యదాహ్యేవైష ఎతస్మిన్నదృశ్యేనాత్మ్యే నిరుక్తే
నిలయనేఽభయంప్రతిష్ఠాంవిందతే. అథసోభయంగతోభవతి॥ అనెడి వాక్య
ము అన్వయముఖముచేత బ్రహ్మజ్ఞానమునకు దుఃఖనివృత్తిహేతుత్వమును దెలు
చున్నది. మరియు, ఏపురుషుడు, ఏకాలమందు ఈపూర్వోక్తప్రత్యగభిన్న
హ్మమందు కొంచెమైననుపాస్యోపాసకాది లక్షణభేదమును జూచుచున్నా
, అప్పుడే, యాభేదదృష్టిగలవానికి సంసారప్రయుక్తదుఃఖము గలుగుచున్న
శ్రు॥ యదాహ్యేవైషఏతస్మిన్నుదరమంతరంకురుతే. అథతస్య భయంభ
వతి॥ అనెడి వాక్యము వ్యతిరేకముఖముచేత బ్రహ్మజ్ఞానమునకు దుఃఖనివృత్తి
హేతుత్వమునుదెలుపుచున్నదని తెలియవలెను.

అవ. భేదదృష్టిగలవారికి భయముగలుగుచున్నదనెడి ఈయర్థమును దృఢీ
కరించుటకొరకు, బ్రహ్మైకత్వజ్ఞానరహితులగు వాయ్వాదులకు భయప్రద
ర్శనపరమగు, శ్రు॥ భీషాస్మాద్వాతః పవతే॥ అనెడి యిత్యాది మంత్రార్థముని
ప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ వాయుస్సూర్యోవహ్నిరింద్రో మృత్యుర్జన్మాంతరేంతరం।
కృత్వాధర్మంవిజానంతో ప్యస్మాద్భీత్యాచరంతిహి॥ ౪.

టీ. వాయుః-వాయువును, సూర్యః-సూర్యుడును, వహ్నిః- అగ్నియు,
ఇంద్రః-ఇంద్రుడును, మృత్యుః- మృత్యువును, జన్మాంతరే-పూర్వజన్మమందు,
ధర్మం-ఇష్టాపూర్తాదిలక్షణమును, విజానంతోపి- జ్ఞానపూర్వకముగాననుష్ఠించి
నవారైనను, అంతరం-ప్రత్యగ్బ్రహ్మములకుభేదమును, కృత్వా-చేసి, అనగా
జూచియనుట. అస్మాత్-ఈబ్రహ్మమువలన, భీత్యా - భయముచేత, అస్మిక్-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈవాయ్వాదిజన్మమందు, చరంతి-తమతమవ్యాపారములయందు సర్వదాప్రవర్తించుచున్నారు. హి-ఇది శ్రుతిప్రసిద్ధమనుట.

తా. జగన్నియామకత్వముచేతబ్రసిద్ధులగు౧. వాయువు, ౨. సూర్యుడు, ౩. అగ్ని, ౪. ఇంద్రుడు, ౫. మృత్యువు, అనెడి ఈపంచదేవతలును, పూర్వజన్మమందు ఇష్టాపూర్తాదిలక్షణముగల ధర్మమును జ్ఞానపూర్వకముగా ననుష్ఠానము జేసినవారైనను, ప్రత్యగాత్మబ్రహ్మములకు భేదమునుజూచి, ఈబ్రహ్మము వలనభయముచేత, ఇప్పుడీవాయ్వాదిజన్మమందు, తమతమ వ్యాపారములయందు (సర్వదా) ప్రవర్తించుచున్నారని, శ్రుతిజెప్పుచున్నది. ఈప్రకారమే కఠశ్రుతియందునుయమునిచేత, శ్రు॥ భయాదస్యాగ్నిస్తపతిభయాత్తపతిసూర్యః భయాదింద్రశ్చవాయుశ్చమృత్యుర్ధావతిపంచమః॥ అని చెప్పబడినదని గ్రహించవలెను.

శ్లో॥ ఆనందంబ్రహ్మణోవిద్వాన్నబిభేతికుతశ్చన।
ఏతమేవతపేనైషా చింతాకర్మాగ్నిసంభృతా॥ ౫.

టీ. (పురుషః) పురుషుడు, బ్రహ్మణః - బ్రహ్మముయొక్క, ఆనందం-స్వరూపభూతానందమును, విద్వాన్-అపరోక్షత్వముచేనెరిగినవాడగుచు, కుతశ్చన-దేనివలనను, అనగానైహికభయహేతువగు వ్యాధ్యాదికముచేతను పరలోకభయహేతువగు పాపాదికముచేతననుట. నబిభేతి-భయమును బొందడు. కర్మాగ్నిసంభృతా=కర్మ-పుణ్యపాపమనెడి, అగ్ని-అగ్నిచేత, సంభృతా-సంపాదింపబడిన, ఏషా-ఈ, అనగా బుణ్యమును జేయనివాడనైతిననునట్టియు బాపము నెందుకు జేసితిననునట్టి ఈరూపముగలయనుట. చింతా-చింత, ఏతమేవ-ఈతత్వజ్ఞానినే, నతపేత్-దుఃఖింపజేయజాలదు. అనగాన జ్ఞానియగువాడు అకృతాకృతపుణ్యపాపచింతచేత సర్వదా తపింపబడుచుండుననుట.

రా. ప్ర. అయితే, ఈయుదాహరింపబడిన, శ్రు॥ తరతిశోకమాత్మవిత్॥ అనెడి యిత్యాదివాక్యములయందు బ్రహ్మానందజ్ఞానమునకు దుఃఖనివృత్తిహేతుత్వము స్పష్టముగాదెలియబడలేదుగదా? ఉ. పురుషుడు బ్రహ్మముయొక్క స్వరూపభూతానందము నపరోక్షత్వముచే నెరిగినవాడగుచు, ఐహిక భయహేతువగువ్యాధ్యాదికముచేతనైనను, పరలోకభయహేతువగు పాపాదికముచేతనైననుభయమునుబొందడని, శ్రు॥ ఆనందంబ్రహ్మణోవిద్వాన్నబిభేతికుతశ్చన॥ అనెడియిత్యాదిశ్రుతిజెప్పుచున్నది. ఈశ్రుతియందు (ఆనందంబ్రహ్మణః = బ్రహ్మముయొక్కఆనందమని) బ్రహ్మమునకును ఆనందమునకును జెప్పబడిన భేదము, రాహువుయొక్కశిరంబనెడి, వాక్యం। రాహోశ్శిరః॥ ఇత్యాదివాక్యములవలె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నౌపచారికమేగాని, వాస్తవభేదములేదని తెలియవలెను. ప్ర. అయితే, తత్వవేత్తకు, పాపాదికమువలన భయములేదనెడి ఈయర్థము, దేనివలన దెలియబడుచున్నదో చెప్పుము?. ఉ. చేయబడనిపుణ్యమగ్నివలె బురుషునకు దుఃఖహేతువగును. చేయబడినపాపంబు నగ్నివలెబురుషునకు దుఃఖహేతువగును. కనుక,కృతాకృతపాపపుణ్యములచేత సంపాదింపబడిన ఈచింత, (అనగా బుణ్యమును జేయనివాడనైతిననునట్టియు, పాపము నెందుకు జేసితిననునట్టి ఈ రూపము గల చింత) ఈతత్వజ్ఞానినే దుఃఖింపజేయజాలదని, శ్రు॥ ఏతగ్ంహవావనతపతి॰ కిమహాగ్ంసాధునాకరవం. కిమహంపాపమకరవం॥ అనెడి శ్రుతిజెప్పుచున్నది. కృతాకృతపాపపుణ్యచింత, తత్వజ్ఞానినే దుఃఖింపజేయజాలదని చెప్పుటచేత, అజ్ఞానియగువాడు,ఆచింతచేత సర్వదాపరితపింపబడుచున్నాడని తెలియవలెను.

అవ. పుణ్యపాపములు రెండును జ్ఞానినితపింపజేయమియందు హేతుప్రదర్శనపరశ్రుతి వ్యాయార్థము నిప్పుడుపఠించుచున్నాడు.

శ్లో॥ ఏవంవిద్వాన్ కర్మణీద్వేహిత్వాత్మానంస్మరేత్సదా।
కృతేచకర్మణీస్వాత్మరూపేణైవైవపశ్యతి॥ ౬.

టీ. విద్వాన్-విద్వాంసుడు, ఏవం-ఈచెప్పబడినప్రకారము, ద్వే-రెండైన, కర్మణీ-పుణ్యపాపములను, హిత్వా-విడచి, సదా-ఎల్లప్పుడును, ఆత్మానం-తానగుపరమాత్మను, స్మరేత్-స్మరించును. కృతే-చేయబడిన, కర్మణీచ-పుణ్యపాపములను,ఏషః-ఈవిద్వాంసుడు,స్వాత్మరూపేణైవ-తనరూపనుగానే, పశ్యతి-చూచుచున్నాడు. అనగా స్వస్వరూపముకంటె భిన్నముగా బుణ్యపాపములం జూడడనుట.

తా. ఏ యొకానొకపురుషుడు, ఈచెప్పబడినప్రకారము * అనగానీపురుషునియందు నాసూర్యునియందు నన్నిభూతములయందునే యాత్మగలడో, యాయాత్మ, ఒక్కడేననెడియర్థముగల,శ్రు॥ సయశ్చాయంపురుషేయశ్చాసావాదిత్యేసఏకః॥ అనెడియిత్యాదిశ్రుతియందు జెప్పబడినప్రకారముగా*ఎరిగినవాడగుచు, ప్రవర్తించుచున్నాడో, ఆపురుషుడుఈపుణ్యపాపములను రెంటిని విడచి, బ్రహ్మముకంటెనభిన్నమగు ప్రత్యగాత్మను (సర్వదా) స్మరించునని, శ్రు॥ సయఏవంవిద్వానేతే ఆత్మానగ్ స్పృణుతే॥ అనెడి శ్రుతిజెప్పుచున్నది. అనగా నేకారణమువలన పుణ్యపాపములు రెండును మిథ్యయనెడి యనుసంధానముచేత, ఆపుణ్యపాపములు రెండును జ్ఞానిచేవిడువబడినవో, ఆకారణమువలన, ఆపుణ్యపాపవిషయకచింతయే జ్ఞానికిలేకపోవుచుండగా, ఆపుణ్యపాపనిమిత్తకమగు దుఃఖముజ్ఞానికిలేనేలేదని యభిప్రాయము. మరియు, ఈవిద్వాం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుమ, దేహేంద్రియాదిప్రవర్తనముచేత గలిగిన ఈపూర్వోక్త పుణ్యపాపరూపకర్మములను రెంటిని, * ఇదియంతయు ఆత్మయగుననెడి యర్థము గల, శ్రు॥ ఇదగ్ంసర్వంయదయమాత్మా॥ అనెడి ఇత్యాదిశ్రుతియందు జెప్పబడినప్రకారము * తనరూపముగానే జూచుచున్నాడో, ఆకారణమువలన పుణ్యపాపములు రెండును, జ్ఞానికి దుఃఖహేతువులుగావని, శ్రు॥ ఉభేహ్యేవైష ఏతేఆత్మానగ్ స్పృణుతే॥ అనెడిశ్రుతి, జెప్పుచున్నది. అనగాజ్ఞాని, బుణ్యపాపములను రెంటిని, తనకంటె నభిన్నముగాజూచుటచేత, ఆపుణ్యపాపములురెండును జ్ఞానికి దుఃఖహేతువులుగావనియుం దెలియవలెను.

అవ. హృదయగ్రంథ్యాదినివృత్తినిదెలిపెడి ముండకాది శ్రుతిస్థితవాక్యము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ భిద్యతేహృదయగ్రంధిశ్ఛిద్యంతేసర్వసంశయాః।
క్షీయంతేచాస్యకర్మాణి తస్మిన్‌దృష్టేపరావరే॥ ౭.

టీ. పరావరే=పర-హిరణ్యగర్భాదిపదంబును, అవరే-హీనముగాగలిగినట్టియు, అనగా హిరణ్యగర్భాదిపదంబుకంటె పరమాత్మరూపము శ్రేష్ఠమైనదనుట. తస్మిన్-ఆపరమాత్మ, దృష్టేసతి - సాక్షాత్కరించబడుచుండగా, అస్య-ఈబ్రహ్మసాక్షాత్కారముగలవానికి, హృదయగ్రంధిః = హృదయ-బుద్ధియొక్క, గ్రంధిః-గ్రంధి, అనగాబుద్ధికిని చిదాత్మకును గ్రంధివలె దృఢసంశ్లేషరూపముగలిగియుండుటవలన నన్యోన్యాధ్యాసమనుట. భిద్యతే- పగులగొట్టబడుచున్నది. అనగానశించుచున్నదనుట. సర్వసంశయాః-సకలసంశయములను, ఛిద్యంతే=ఛేదింపబడుచున్నవి. కర్మాణి-పుణ్యపాపలక్షణముగల సంచితకర్మములు, క్షీయంతే-వినాశమును బొందుచున్నవి.

తా. ప్ర. అయితే, కల్పకోటిశతములచేతనైనను,అనుభవింపబడకకర్మముక్షయించదనిచెప్పెడి, శ్లో॥ నాభుక్తంక్షీయతే కర్మకల్పకోటిశతైరపి॥ అనెడి శాస్త్రస్థితివలన ననాదిగా నీసంసారమందు బహుజన్మములవలన సంపాదింపబడినట్టియు, లెక్కకుమించినట్టియు, అప్రసిద్ధత్వముచేత ఆత్మత్వముగా ననుసంధానము జేయుటకు యోగ్యములుగానట్టియు, పుణ్యపాపలక్షణముగల కర్మములుండగా, ఆకర్మవిషయమగుచింత, జ్ఞానికిలేకపోవుటెట్లు? ఉ. హిరణ్యగర్భాదిపదముకంటె శ్రేష్ఠమైనట్టి, ఆపరమాత్మ,సాక్షాత్కరింపబడుచుండగా, ఈసాక్షాత్కారముగలవానికి హృదయగ్రంధిభేదింపబడుచున్నదనియు, యథార్థముగా సాక్షాత్కరింపబడిన బ్రహ్మవస్తువునందు సంశయ విపర్యయ విషయత్వము కనబడమివలన ఆత్మ, దేహాదులకంటె వ్యతిరిక్తుడగునా కాడో, దేహాది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యతిరిక్తుడైనను కర్తృత్వాదిధర్మయుక్తుడగునోకాడో, ఆత్మకుకర్తృత్వములేకపోయినను, ఆయాత్మకు బ్రహ్మముకంటె భేదముగలదోలేదో, అభేదమైనను ఆబ్రహ్మజ్ఞానము కర్మాదిసహితమైనదగుచు ముక్తిసాధనమగునో, లేక, కేవలజ్ఞానము ముక్తిసాధనమగునో * యనెడి ఇత్యాదిసంశయములన్నియు, చీల్చివేయబడుచున్నవనియు, మరియు, కర్మములకు మూలకారణమగు అజ్ఞానమునశించుటచేత, పుణ్యాపాపలక్షణముగల సంచితకర్మములన్నియు నశించుచున్నవని, శ్రు॥ భిద్యతేహృదయగ్రంథి శ్ఛిద్యంతేసర్వసంశయాః। క్షీయంతేచాస్యకర్మాణితస్మిన్దృష్టేపరావరే॥ అనెడిముండకాదిశ్రుతి స్థితవాక్యము జెప్పుచున్నది. అనగా, నాసంచితకర్మములు, తమకు మూలకారణమగు అజ్ఞానముతోగూడ, తత్వజ్ఞానముచేత నశింపబడుటవలన, జ్ఞానికిచింతనుగలిగింపజాలవనియభిప్రాయము. బుద్ధికిని చిదాత్మకును (గ్రంథివలె) దృఢసంశ్లేషరూపముగలిగియుండుటవలన, హృదయగ్రంథియనగా, నన్యోన్యాధ్యాసమని యర్థము.

అవ. ముక్తికి కర్మాదిసాధనాంతరమును నిషేధించుచు జ్ఞానసాధనత్వమును బ్రతిపాదించెడి, శ్వేతాశ్వతరవాక్యార్థము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ తమేవవిద్వానత్యేతి మృత్యుంపంథానచేతరః।
జ్ఞాత్వాదేవంపాశహానిః క్షీణైఃక్లేశైర్నజన్మభాక్॥ ౮.

టీ. తం-ఆపూర్వోక్తపరమాత్మను, విద్వానేవ- ఎరిగినవాడే, మృత్యుం-సంసారమును, అత్యేతి-అతిక్రమించుచున్నాడు. ఇతరః-జ్ఞానముకంటెనితరమగు, అనగాజ్ఞానముతోగూడిన కర్మరూపముగలిగినట్టిదైనను, కేవలకర్మరూపముగలిగినట్టిదైనననుట. పంథా-మార్గము, అనగామోక్షోపాయమనుట. నచ-లేనేలేదు. దేవం-స్వప్రకాశరూపప్రత్యగభిన్నబ్రహ్మమును, జ్ఞాత్వా-అపరోక్షభావముచేననుభవించి, (స్థితస్య) ఉండెడివానికి, పాశహానిః=పాశ - కామక్రోధాదిరూప సర్వబంధములయొక్క, హానిః-హానిగలుగుచున్నది. క్లేశైః-పాశశబ్దమే పేరుగలరాగాదులతోటి వ్యసనములు, క్షీణైః-, నాశమునుబొందుచుండగా, జన్మభాక్=జన్మ-పరజన్మమును, భాక్-పొందెడివాడు, న-కాడు. అనగా భావిజన్మమునకు హేతువగు కర్మారంభయోగములేమివలన భావిజన్మము జ్ఞానికిలేదనుట.

తా. ప్ర. అయితే, శ్రు॥ కుర్వన్నేవేహకర్మాణిజిజీవిషేచ్ఛతగ్ంసమాః। ఏవంత్వయినాన్యథేతోఽస్తినకర్మలిప్యతేనరే । విద్యాంచావిద్యాంచయస్తద్వేదోభయగ్ంసహ।అవిద్యయామృత్యుంతీర్త్వావిద్యయాఽమృతమశ్నుతే॥ ఇత్యాదిశ్రుతులును, శ్లో॥ కర్మణైవహిసంసిద్ధిమాస్థితాజనకాదయః । యథాన్నంమథు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంయుక్తం మధుచాన్నేనసంయుతం। ఏవంతపశ్చవిద్యాచ సంయుక్తంభేషజం మహత్॥ అనెడి ఇత్యాదిస్మృతులును జ్ఞానసహితకర్మము ముక్తిహేతువగునని చెప్పుచుండగా, కేవలజ్ఞానము ముక్తిహేతువగునని, యెట్లుచెప్పితిరి? ఉ. నీచే నుదాహరించబడినవాక్యమందుగల భేషజశబ్దమునకు, పాపనివృత్తిపరత్వముగ లిగియుండుటవలనను, సంసిద్ధిశబ్దముచేత జ్ఞానసాధనచిత్తశుద్ధి చెప్పబడుటవలనను, విద్యాశబ్దముచేత ఉపాసనము విధింపబడుటవలనను, కర్మము, ముక్తి సాధనముగానేరదు. మరియు, బూర్వోక్తపరమాత్మనెరిగినవాడే మృత్యుయుక్త సంసారము నతిక్రమించుచున్నాడనియు, కేవలజ్ఞానమే ముక్తిసాధనమగునని యు, జ్ఞానసహితకర్మమైనను, కేవలకర్మమైనను మోక్షమార్గముగాదని, శ్రు॥ తమేవవిద్వానత్యేతిమృత్యుంపంథానచేతరః॥ అనెడిశ్వేతాశ్వతరవాక్యము ముక్తికిజ్ఞానసాధనముతప్ప,మరియొకసాధనములేదని జెప్పుచున్నది. ప్ర. అయితే, ఈయుదాహరింపబడిన శ్రుతులయందు అన్వయవ్యతిరేకములచేత నిహలోకమందుబుట్టెడి దుఃఖనివృత్తియే, ప్రాధాన్యముగా చెప్పబడెనేగాని, పరలోకసంబంధదుఃఖనివృత్తి చెప్పబడలేదుగదా? ఉ. పరలోకసంబంధదుఃఖము, భావిజన్మపూర్వకముగా గలదగుటవలన, స్వప్రకాశరూప ప్రత్యగభిన్న పరబ్రహ్మము నపరోక్షముగా ననుభవించియుండెడివానికి కామక్రోధాది సర్వపాశములయొక్క హానిగలుగుచున్నదనియు, ఆపాశశబ్దములచే జెప్పదగిన రాగాదులతోటి వ్యసనములు నశించుచుండగా, భావిజన్మమునకుహేతువగు కర్మారంభయోగము లేమివలన, జ్ఞానికిభావిజన్మములేదని, శ్రు॥ జ్ఞాత్వాదేవం సర్వపాశాపహానిః క్షీణైః క్లేశైర్జన్మమృత్యుప్రహాణిః॥ అనెడి శ్వేతాశ్వతరవాక్యము, భావిజన్మసహిత పరలోకసంబంధదుఃఖము జ్ఞానికిలేదని ప్రతిపాదించుచున్నది. గనుక, జ్ఞానికైహికదుఃఖంబు నాముష్మిక దుఃఖంబును లేదని తెలియవలెను.

శ్లో॥ దేవంమత్వాహర్షశోకౌజహాత్యత్రైవధైర్యవాన్।
నైనంకృతాకృతేపుణ్యపాపేతాపయతఃక్వచిత్॥ ౯.

టీ. ధైర్యవాన్-బ్రహ్మచర్యాదిసాధనసంపన్నుడు, దేవం - చిదానందాదిలక్షణముగల పరమాత్మను, మత్వా-ఎరిగి, అత్రైవ- ఈజన్మమందే, హర్షశోకౌ-విషయలాభాలాభనిమిత్తక సుఖదుఃఖములను రెంటిని, జహాతి- విడుచుచున్నాడు. కృతాకృతే=కృత-చేయబడినవైనను, అకృతే - చేయబడనివైనను, పుణ్యపాపే=పుణ్య-పుణ్యమైనను, పాపే - పాపమైనను, క్వచిత్- ఎప్పటికిని, ఏనం-ఈజ్ఞానిని, తాపయతః-తపింపజేయునవి, న-కావు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే, ఇష్టానిష్టప్రాప్తిపరిహారముకొరకు జ్ఞానులకును బ్రవృత్తిగనబడుచుండుటవలన, (ఆత్మవేత్తదుఃఖమునుతరించుచున్నాడని) పూర్వము జెప్పబడినఫలము, శాస్త్రముచేత వినబడుచున్నదేగాని యనుభవింపబడుచుండలేదుగదా? ఉ. బ్రహ్మచర్యాదిసాధనసంపన్నుడు పరతత్వజ్ఞానముచేత చిదానందాదిస్వరూపలక్షణముగల పరమాత్మనపరోక్షముగానెరిగి, ఈజన్మమందేవిషయలాభాలాభనిమిత్తక సుఖదుఃఖములను విడుచుచున్నాడని, శ్రు॥ అధ్యాత్మయోగాధిగమేనదేవంమత్వాధీరోహర్షశోకౌజహాతి॥ అనెడి కఠశ్రుతివాక్యము దృఢాపరోక్షజ్ఞానులకు ఇష్టానిష్టప్రాప్తిపరిహారముకొరకు బ్రవృత్తిలేదని ప్రతిపాదించుచున్నది. కనుక, ఆత్మవేత్త దుఃఖమును తరించుచున్నాడని చెప్పబడిన ఫలమనుభవసిద్ధమేయగును. మరియు, పూర్వము అయిదవశ్లోకమందుజెప్పబడిన యర్థమందు విశేషమునుజెప్పెడి యాజ్ఞవల్క్య బ్రాహ్మణవాక్యముగలదు. ప్ర. అదియెట్లు? ఉ. పూర్వమైదవశ్లోకమందు జేయబడనిపుణ్యంబును, చేయబడినపాపంబును, జ్ఞానికి తాపహేతువులుగావని చెప్పబడెను. ఈయర్థమందువిశేషమేమనగా చేయబడినపుణ్యమైనను జేయబడని పుణ్యమైనను, చేయబడనిపాపమైనను చేయబడినపాపమైనను, జ్ఞానికితాపహేతువు గాజాలదని, శ్రు॥ నైనంకృతాకృతేతపతఇతి॥ అనియిట్లు యాజ్ఞవల్క్యబ్రాహ్మణవాక్యము జెప్పుచున్నది. ఈయర్థమెట్లనగా, తాపమనునది, చిత్తవికారభేదమగును. కనుక, పుణ్యము జేయబడినదగుచు సుఖలక్షణముగలవికారమును గలుగజేయుచున్నది. మరియునాపుణ్యము జేయబడనిదగుచు దుఃఖలక్షణముగల వికారమును గలుగజేయుచున్నది. అందుకువిపరీతముగా, పాపము జేయబడనిదగుచు సుఖలక్షణముగల వికారమునుగలుగజేయుచున్నది. మరియు నాపాపము జేయబడినదగుచు దుఃఖలక్షణముగల వికారమును గలుగజేయుచున్నది. జ్ఞానికో, నేనవిక్రియబ్రహ్మరూపుడనెడి తత్వజ్ఞానముండుటచేత బూర్వోక్తద్వివిధవికారహేతువు లెప్పటికిని గలుగజాలవని తెలియవలెను.

శ్లో॥ ఇత్యాదిశ్రుతయోబహ్వ్యఃపురాణైస్స్మృతిభిస్సహ।
బ్రహ్మజ్ఞానేఽనర్థహానిమానందంచాప్యఘోషయన్॥ ౧౦.

టీ. బహ్వ్యః-అనేకములగు, ఇత్యాదిశ్రుతయః - ఇత్యాదిశ్రుతులు, పురాణైః-పురాణములతోటియు, స్మృతిభిస్సహ-స్మృతులతోగూడ, అనగా శ్రుతిస్మృతిపురాణములనుట. బ్రహ్మజ్ఞానే-బ్రహ్మజ్ఞానమందు, అనర్థహానిం-అనర్థ-దుఃఖముయొక్క, హానిం-నివృత్తినియు,ఆనందంచాపి-ఆనందంబును, అఘోషయన్-ఘోషించుచున్నవి. అనగా బ్రహ్మజ్ఞానముచేత దుఃఖనివృత్త్యానంద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాప్తులుగలుగుచున్నవని ఘోషించుచున్నవనుట.

తా. ప్ర. అయితే, బ్రహ్మజ్ఞానముచేత దుఃఖనివృత్త్యానందప్రాప్తులుగలుగుచున్నవనిచెప్పటకు, ఈయుదాహరింపబడిన వాక్యములుతప్ప, ఇతరవాక్యములులేవాయేమి? ఉ. శ్రు॥ ఇహచేదవేదీదథసత్యమస్తి నచేదిహావేదీన్మహతీవినష్టిః॰ యఏతద్విదురమృతాస్తే భవంత్యథేతరే దుఃఖమేవాపయంతి. తద్యోయోదేవానాం ప్రత్యబుధ్యత సఏవతదభవత్ నిచాయ్యతంమృత్యుముఖాత్ప్రముచ్యతే॥ అనెడియిత్యాదిశ్రుతులును, తనను సర్వభూతములయందున్న వానినిగాను, తనయందు సర్వభూతములున్నవనియుం జూచుచు, స్వారాజ్యమును బొందుచున్నాడని, శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతానిచాత్మని। సంపశ్యన్నాత్మయాజీవైస్వారాజ్యమధిగచ్ఛతి॥ అనెడి యిత్యాదిస్మృతులును, మరియు, క్షేత్రజ్ఞునకు పరమాత్మజ్ఞానమువలన పరమపదము గలుగుచున్నదని చెప్పెడి, శ్లో॥ క్షేత్రజ్ఞస్యాత్మవిజ్ఞానాద్విశుద్ధిఃపరమామతా॥ అనెడి యిత్యాదిపురాణవాక్యములన్నియుం బ్రమాణములగును. ప్ర. అయితే, ఈయుదాహరింపబడిన శ్రుతిస్మృతిపురాణవాక్యములకు తాత్పర్యమేమి?॰ ఉ॰ ఈయుదాహరింపబడిన శ్రుతిస్మృతిపురాణవాక్యములన్నియు, బ్రహ్మజ్ఞానముచేత దుఃఖనివృత్తియగుననియు, ఆనందముగలుగుననియు ఘోషించుచున్నవి.

అవ. ఆనందభేదదర్శనపూర్వకముగా బ్రహ్మానందనిర్వచనమును దెలుపుచున్నాడు.

శ్లో॥ ఆనందస్త్రివిధోబ్రహ్మానందోవిద్యాసుఖంతథా।
విషయానందఇత్యాదౌబ్రహ్మానందోవివిచ్యతే॥ ౧.౧.

టీ. ఆనందః-ఆనందము, బ్రహ్మానందః-బ్రహ్మానందమనియు, విద్యాసుఖం-విద్యానందమనియు, తథా-అప్రకారము, విషయానందఇతి-విషయానందమనియు, త్రివిధః-మూడువిధములుగలదగును. ఆదౌ-మొదట,అనగాసధ్యాయత్రయముచేసనుట. బ్రహ్మానందః-బ్రహ్మానందము, వివిచ్యతే-విభజించిచూపబడుచున్నది॰

తా॰ ప్ర. అయితే, బ్రహ్మానందమని చెప్పటచేత, ఆనందపదమునకు బ్రహ్మపదముతోటి విశేషణమువలన మరియొకయానందము గలదని తెలియబడుచున్నది. గనుక, ఆయానందంబెన్నివిధములంగలవో, యెటువంటివోచెప్పుము? ఉ. ఆయానందమును, ౧. బ్రహ్మానందమనియు, ౨. విద్యానందమనియు, ౩. విషయానందమనియు, నిట్లుత్రివిధముగాదెలియవలెను. ఆయానందత్రయమందు, విద్యానందవిషయానందములకు రెంటికిని బ్రహ్మానందము మూలమగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టవలన, ఆబ్రహ్మానందము మొదటిమూడధ్యాయములచేత విభజించిచూపబడు చున్నది.

అవ. అందుమొదట, తైత్తిరీయశ్రుతి పర్యాలోచనము జేయుచుండగానానందరూపబ్రహ్మను తెలియబడుచున్నదనెడి యభిప్రాయముతోటి, భృగువల్లి యొక్కయర్థమును సంక్షేపముచే నిప్పుడు చూపుచున్నాడు.

శ్లో॥ భృగుఃపుత్రఃపితుశ్శ్రుత్వా వరుణాద్బ్రహ్మలక్షణం।
అన్నప్రాణమనోబుద్ధీం స్త్యక్త్వానందంవిజగ్మివాన్॥ ౧౨.

టీ. భృగుః-భృగువనెడిపేరుగల, పుత్రః-పుత్రుడు, వరుణాత్- వరుణుడనెడిపేరుగల, పితుః-తండ్రివలన, బ్రహ్మలక్షణం-బ్రహ్మస్వరూపమును, శ్రుత్వా-విని, అన్నప్రాణమనోబుద్ధీః-అన్న-అన్నమయకోశంబును, ప్రాణ-ప్రాణమయకోశంబును, మనః- మనోమయకోశంబును, బుద్ధీః - విజ్ఞానమయకోశంబును, త్యక్త్వా-విడచి, అనగానాకోశములకు బ్రహ్మత్వములేదని నిశ్చయించియనుట. ఆనందం-బింబరూపమగు ఆనందమును, విజగ్మివాన్ - బ్రహ్మత్వముచే నెరిగినవాడాయెను.

తా. భృగువనెడిపేరుగలపుత్రుడు, వరుణుడనెడిపేరుగల తండ్రివలన, ఏయానందమువలన ఈభూతములన్నియుంబుట్టుచున్నవో, అట్లుబుట్టిన భూతములు ఏయానందముచేత జీవించుచున్నవో, సుషుప్తికాలమందు ఏయానందమందు లయించుచున్నవో, ఆయానందమును విచారించుట కిచ్ఛయింపుమని యు, అదియేబ్రహ్మమనియుంజెప్పెడి, శ్రు ॥ యతోవా ఇమానిభూతానిజాయంతే యేనజాతానిజీవంతి. యత్ప్రయంత్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ,తద్బ్రహ్మ॥ అనియిట్లు బ్రహ్మరూపమునువిని, అన్నమయాదికోశములయందు, ఆబ్రహ్మలక్షణముసంభవింపమిచేత ఆకోశములకు బ్రహ్మత్వములేదనినిశ్చయించి, ఆనందమయకోశమందు పంచమావయవత్వముచేత, శ్రు ॥ బ్రహ్మపుచ్ఛంప్రతిష్ఠా॥ అనెడిశ్రుతివలనవినబడుచుండెడి బింబభూతమగు ఆనందమునుబ్రహ్మలక్షణయోజనతోటి బ్రహ్మత్వముచేనెరిగినవాడాయెను. అనగా నాయానందబింబమునకు బ్రహ్మత్వమును నిశ్చయించెనని యభిప్రాయము.

అవ. ఆయోజనాప్రకారమునుజూపెడి వాక్యార్థను నిప్పుడుపరించుచున్నాడు.

శ్లో॥ ఆనందాదేవభూతాని జాయంతే తేనజీవనం।
తేషాంలయశ్చతత్రాతో బ్రహ్మానందోనసంశయః॥ ౧౩.

టీ. భూతాని-ప్రాణులు, ఆనందాదేవ-గ్రామ్యధర్మనిమిత్తకానందమువలననే, జాయంతే-పుట్టుచున్నవి. తేన-విషయభోగాదినిమిత్తకమగు నాయా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నందముచేత,జీవనం-జీవనమును, (ప్రాప్నువంతి) బొందుచున్నవి. అనగా జీవించుచున్నవనుట. తేషాం-ఆప్రాణులకు, లయశ్చ-లయంబును, తత్ర - ఆయానందమందగును. అనగాసుషుప్తికాలసంబంధమగు స్వరూపభూతానందమందే యగుననుట. అతః-ఆకారణమువలన, ఆనందః-ఆనందము, బ్రహ్మ-బ్రహ్మమగును. సంశయః-సంశయము, న-లేదు.

తా. ప్ర. అయితే, ఆనందబింబమందు బ్రహ్మలక్షణముగలదని యెట్లు తెలిసికొనెనో చెప్పుము?. ఉ. గ్రామ్యధర్మనిమిత్తకమగు ఆయానందముచేతనే ప్రాణులుబుట్టుచున్నవనియు, విషయభోగాదినిమిత్తకమగు ఆయానందముచేతనే ప్రాణులుజీవించుచున్నవనియు, మరియు, ఆప్రాణులయొక్క లయంబును సుషుప్తికాలసంబంధమగు స్వరూపభూతానందమందే గలుగుచున్నదని చెప్పెడి, శ్రు॥ ఆనందాద్ధ్యేవ ఖల్విమానిభూతానిజాయంతే, ఆనందేనజాతానిజీవంతి, ఆనందంప్రయంత్యభిసంవిశంతి॥ అనెడియిత్యాదివాక్యమువలన ఆభృగువు విచారించి, యాయానందబింబమునకు బ్రహ్మత్వమునునిశ్చయించినవాడాయెనని తెలియవలెను. సుషుప్త్యయందానందానుభవముకంటె నితరానుభవంబవ్వనికెని లేనికారణమువలన నానందము బ్రహ్మమేయగుననియు, ఈసౌషుప్తానందానుభవము సర్వానుభవసిద్ధమగుటవలన, ఈయర్థమందు సంశయముజేయదగదని యభిప్రాయము.

అవ. ఇట్లు,తైత్తిరీయశ్రుతిపర్యాలోచనచేత బ్రహ్మమునకు ఆనందరూపత్వమునుజూపి, ఛాందోగ్యశ్రుతిపర్యాలోచనచేత నానందరూపత్వమును జూపుట కిచ్ఛయించినవాడగుచు, సనత్కుమారనారదసంవాదరూపమగు సప్తమాధ్యాయమందుండెడి భూమరూపబ్రహ్మమును ప్రతిపాదించెడి వాక్యార్థమునిప్పుడు సంక్షేపముచే జెప్పుచున్నాడు.

శ్లో॥ భూతోత్పత్తేఃపురాభూమాత్రిపుటీద్వైతవర్జనాత్।
జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపా।త్రిపుటీప్రళయేహినో॥ ౧౪.

టీ. భూతోత్పత్తేః-భూత-ఆకాశాదిభూతతత్కార్యములయొక్క, ఉత్పత్తేః-ఉత్పత్తికంటె, పురా-పూర్వము, త్రిపుటీద్వైతవర్జనాత్=త్రిపుటీ-జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపమనెడి, ద్వైత-ద్వైతముయొక్క, వర్జనాత్-లేమివలన, భూమా-దేశకాలవస్తువులవలన పరిచ్ఛేదములేనిపరమాత్మ, (ఆసీత్) ఉండెను. ప్రళయే-ప్రళయకాలమందు, జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపా - జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపమగు, త్రిపుటీ-త్రిపుటి, అనగాజ్ఞాతృజ్ఞానజ్ఞేయములనెడి మూడాకారములుగల ద్వైతమనుట. నో-లేదు. హి-ఈయర్థము సర్వవేదాంతసమ్మతమనుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఏపరమాత్మయందన్యము జూడబడదో, అన్యమువినబడదో, అన్య మెరుగబడదో, ఆపరమాత్మ భూమశబ్దముచేత జెప్పదగిన దగునని యర్థము గల, శ్రు॥ యత్రనాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతిసభూమా॥ అనెడి ఛాందోగ్యశ్రుతి, జెప్పుచున్నది. కనుక,ఆకాశాదిభూతములును, ఆభూతకార్యములగు జరాయుజాండజాదిచతుర్విధశరీరములును బుట్టుటకంటెబూర్వము (అనగాసృష్టికిబూర్వమందు, జ్ఞాతృజ్ఞానజ్ఞేయములనెడి మూడాకారములు గల త్రిపుటియనెడిద్వైతములేమివలన, న్యాయం॥ భావానయనే ద్రవ్యానయనం॥ అనెడిన్యాయముచేత, దేశమువల్లనైనను కాలమువల్లనైనను వస్తువువల్లనైనను పరిచ్ఛేదశూన్యమగుభూమశబ్దముచేజెప్పదగిన పరమాత్మయే యుండెను. మరియు, చెప్పబోయెడిజ్ఞాత్రాదిరూపముగల త్రిపుటి, ప్రళయకాలమందులేదనెడి ఈవిషయము, సర్వవేదాంతసమ్మతమగునని తెలియవలెను.

అవ. ఇప్పుడు, జ్ఞాత్రాదిస్వరూపమును జూపుచున్నాడు.

శ్లో॥ విజ్ఞానమయ ఉత్పన్నో జ్ఞాతా జ్ఞానంమనోమయః।
జ్ఞేయాశ్శబ్దాదయోనైత త్త్రయముత్పత్తితఃపురా॥ ౧౫.

టీ. ఉత్పన్నః-పరమాత్మవలనబుట్టిన, విజ్ఞానమయః - విజ్ఞానమయకోశము, అనగా బుద్ధ్యుపాధికజీవుడనుట. జ్ఞాతా-ఎరిగెడివాడగును. మనోమయః-మనోమయకోశము, అనగామనస్సునందు ప్రతిబింబరూపమునుబొంది మనోమయశబ్దముచే జెప్పదగిన చైతన్యమనుట. జ్ఞానం-జ్ఞానమగును. శబ్దాదయః- శబ్దస్పర్శరూపరసగంధములైదును, జ్ఞేయాః - తెలియదగినవగును. ఏతత్ - ఈ, త్రయం-మూడు, ఉత్పత్తితః-పుట్టుటకంటె, పురా-పూర్వము, న-లేవు. అనగా నీమూడును కార్యములగుటవలననుత్పత్తికంటె బూర్వము కారణవ్యతిరేకముగాలేవనుట.

తా. పరమాత్మవలనబుట్టిన బుద్ధ్యుపాధికజీవుడు (అనగా విజ్ఞానమయకోశము) ౧. జ్ఞాతయగును. మరియు, మనస్సునందు ప్రతిబింబరూపమునుబొంది మనోమయకోశశబ్దముచే జెప్పదగినచైతన్యము, ౨. జ్ఞానమగును. మరియు, ప్రసిద్ధములగు శబ్దస్పర్శరూపరసగంధములనెడి విషయములైదును, ౩. జ్ఞేయములగును. ఈమూడును కార్యమగుటవలన ఉత్పత్తికంటెబూర్వము, కారణవ్యతిరేకముగా లేవనితెలియవలెను.

అవ. ఇప్పుడు, ఫలితమును జెప్పుచున్నాడు.

శ్లో॥ త్రయాభావేతునిర్ద్వైతః పూర్ణఏవానుభూయతే।
సమాధిసుషుప్తిమూర్ఛాసు పూర్ణస్సృష్టేఃపురాతథా॥ ౧౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. సమాధిసుప్తిమూర్ఛాసు=సమాధి- సమాధియందును, సుప్తి-సుషుప్తియందును, మూర్ఛాసు-మూర్ఛయందును, త్రయాభావేసతిత్రు= త్రయ-జ్ఞాత్రాదిత్రయముయొక్క, అభావేసతిత్రు-అభావమగుచుండగానో, అనగా జ్ఞాతృజ్ఞానజ్ఞేయములుమూడును లేకపోవుచుండగానోయనుట. నిర్ద్వైతః - ద్వైతము లేని, పూర్ణఏవ-పరిపూర్ణుడగు ఆత్మయే, అనుభూయతే - అనుభవింపబడుచున్నాడు. తథా-ఆప్రకారము, సృష్టేః-సృష్టికంటె, పురా-పూర్వము, పూర్ణః-ఆత్మపరిపూర్ణత్వము గలవాడగును.

తా. సమాధిసుషుప్తిమూర్ఛావస్థలయందు, జ్ఞాతృజ్ఞానజ్ఞేయములుమూడును లేకపోవుచుండగా, ద్వైతరహితుడగు పూర్ణుడైనఆత్మయే, అనుభవింపబడుచున్నాడు. అనగా సమాధిసుప్తిమూర్ఛలయందుండిలేచినవానికి, ద్వైతముకనబడలేదనెడిస్మరణముదప్ప, మరియొకటి సంభవింపమిచేత, ఆసుషుప్త్యాదికమునను భవించినవానికి అద్వైతసిద్ధిగలిగియున్నది. ఇచ్చట, విద్వదనుభవమునుజూపుటకొరకు, సమాధి, గ్రహింపబడెననియు, సర్వజనానుభవమును దెలిపెడికొరకు సుషుప్తిమూర్ఛలురెండును గ్రహింపబడినవని తెలియవలెను. ప్ర. సరి. సమాధిసుషుప్తిమూర్ఛలయందు అద్వైతసిద్ధి గలుగుగాక. ప్రకృతమందు లాభమేమి? ఉ. ఏప్రకారముగా సుషుప్త్యాదికమందు పరిచ్ఛేదమును గలిగించెడి ద్వైతములేమివలన: ఆత్మ,పరిపూర్ణుడాయెనో, ఆప్రకారముగా సృష్టికి బూర్వమందును పరిచ్ఛేదమునుగలిగించెడి ద్వైతములేమివలన ఆత్మ, పరిపూర్ణుడగునని తెలియవలెను.

అవ. బ్రహ్మమునకు పూర్ణత్వముగలిగినను ఆనందరూపత్వమందులాభమేమనెడి శంకజేసికొని, అన్వయవ్యతిరేకములచేత భూమశబ్దవాచ్యుడగు పరమాత్మకు సుఖరూపత్వమునుజూపెడి వాక్యార్థము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ యోభూమాససుఖంనాల్పే సుఖంత్రేధావిభేదిని।
సనత్కుమారఃప్రాహైవం నారదాయాతిశోకినే॥ ౧౭.

టీ.యః-ఏ, భూమా-పరిచ్ఛేదములేనిపరమాత్మగలడో, సః - ఆపరమాత్మ, సుఖం-ఆనందమగును. అనగా సద్వితీయవస్తువునందు దుఃఖహేతువులేమివలన సుఖరూపుడేయగుననుట. త్రేధావిభేదిని=త్రేధా - త్రివిధమగు, విభేదిని-భేదముగల, అనగా జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపనుగలయనుట. అల్పే-పరిచ్ఛిన్నవస్తువునందు, అనగా ద్వైతమందనుట. సుఖం-సుఖము, న-లేదు. ఏవం-ఈప్రకారము, సనత్కుమారః-సనత్కుమారుడనెడిదేవర్షుని, అతిశోకినే - అధికదుఃఖముగల, నారదాయ-శిష్యుడైన నారదమునికొరకు, ప్రాహ-చెప్పెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. పూర్వోక్త భూమశబ్దవాచ్యుడగు, ఏయఖండ పరమాత్మగలడో, ఆయద్వితీయ పరమాత్మయందు దుఃఖహేతువులేనందున, ఆయఖండపరమాత్మ, సుఖరూపుడేయగుననియు, జ్ఞాతృజ్ఞానజ్ఞేయములనెడి త్రివిధభేదముగల పరిచ్ఛిన్నవస్తువునందు (అనగాద్వైతమనెడిఖండవస్తువునందు,) సుఖములేదని, ఈప్రకారము సనత్కుమారుడనెడిగురుడు, శిష్యుడైన నారదునికొరకు చెప్పినట్లు, శ్రు॥ యోవైభూమాతత్సుఖంనాల్పే సుఖమస్తి॥ అనెడి ఛాందోగ్య శ్రుతియందు వినబడుచున్నది. ప్ర. అయితే, నారదుడు శిష్యుడగుటకు గారణమేమి? ఉ. ఆనారదుడు అధికదుఃఖముగలవాడై, సనత్కుమారునకు శిష్యుడాయెనని తెలియదగును.

అవ. ఆనారదున కధికదుఃఖముగలుగుటకు గారణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ సపురాణాన్ పంచవేదాన్ శాస్త్రాణివివిధానిచ।
జ్ఞాత్వాప్యనాత్మవిత్త్వేన నారదోతిశుశోచహ॥ ౧౮.

టీ. నారదః-నారదుడు, సపురాణాన్ - పురాణములతోగూడి వర్తించుచుండెడి, పంచవేదాన్- పంచవేదములను, వివిధాని - నానావిధములగు, శాస్త్రాణిచ-తర్కవ్యాకరణాదిశాస్త్రములను, జ్ఞాత్వాపి- తెలిసియు, అనాత్మవిత్త్వేన- ఆత్మజ్ఞానములేమిచేత, అతిశుశోచహ - అతిశయముగా దుఃఖమును బొందినవాడాయెను.

తా. ఆనారదుడు, సర్వపురాణములను పంచవేదములను, తర్కవ్యాకరణాది నానావిధశాస్త్రములందెలిసియు, ఆత్మజ్ఞానములేనికారణముచేత అధిక దుఃఖమును బొందినవాడాయెను.

శ్లో॥ వేదాభ్యాసాత్పురాతాపత్రయమాత్రేణశోకితా।
పశ్చాత్త్వభ్యాసవిస్మారభంగగర్వైశ్చశోకితా॥ ౧౯.

టీ. వేదాభ్యాసాత్= వేద- వేదములను, అభ్యాసాత్ - అభ్యసించుటకంటె, పురా-పూర్వము, తాపత్రయమాత్రేణ- ఆధ్యాత్మికాధిభౌతికాధి దైవికములనెడి తాపత్రయమాత్రముచేత, శోకితా-దుఃఖిత్వము, (ఆసీత్) ఉండెను. పశ్చాత్తు-పిమ్మటనో, అభ్యాసవిస్మారభంగగర్వైశ్చ=అభ్యాస- పాఠాద్యావర్తనముచేతను, విస్మార-పఠించినదానినిమరచుటచేతను, భంగ- తనకంటెనధికునిచేత తిరస్కారమునుపొందుటచేతను, గర్వైశ్చ- న్యూనదర్శనమువలన స్వాధిక్యబుద్ధిచేతను, శోకితా - దుఃఖిత్వముగలిగెను.

తా. ప్ర. అయితే, వేదశాస్త్రవిషయకజ్ఞానము, దుఃఖమును నివర్తింపజేయునదియగుననెడి ప్రసిద్ధిగలిగియుండగా, అట్టివేదశాస్త్రవిషయకజ్ఞానము,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అధికదుఃఖహేతువెట్లగును? ఉ. అనారదుడు, వేదముల నభ్యసింపకమునుపు, ౧. ఆధ్యాత్మికము, ౨. ఆధిభౌతికము, 3. ఆధిదైవికమనెడి, లక్షణముగలతాప త్రయముచేతనే, దుఃఖముగలవాడాయెను. అటుపిమ్మటనో, ౧. వేదపాఠా ద్యావర్తనముచేతను, ౨. పఠింపబడినదానిని మరచుటచేతను, 3. తనకంటె నధికునిచేత తిరస్కారమునుబొందుటచేతను, ౪. హీనునిజూచుటవలన తనకా ధిక్యబుద్ధిగలుగుటచేతను (అనగాగర్వముచేతననుట) ఈకారణములచేత దుఃఖ వంతుడాయెనని తెలియవలెను.

శ్లో॥ సోహంవిద్వాన్ప్రశోచామిశోకపారంనయాద్యమాం।
ఇత్యుక్తస్సుఖమేవాస్య పారమిత్యభ్యధాదృషిః॥ ౨౦.

టీ. హేవిద్వాన్-ఓసనత్కుమారా, సోహం-ఆనేను, ప్రశోచామి- అనా త్మవిత్త్వముచే మిక్కిలిగాబరితపించుచున్నాను. అద్య-ఇప్పుడు, మాం-నన్ను, శోకపారం=శోక- సంసారదుఃఖసముద్రముయొక్క, పారం- అవతలిగట్టును గురించి, నయ-పొందింపుము. ఇతి-ఈప్రకారము, ఉక్తస్సన్-చెప్పబడినవాడ గుచు, ఋషిః-సనత్కుమారుడు, అస్య - ఈసంసారదుఃఖ సముద్రమునకు, పారం-గట్టు, సుఖమేవ-సుఖరూపబ్రహ్మమేయగునని, అభ్యధాత్- చెప్పెను.

తా. ప్ర. అయితే, ఈప్రకారముగా సర్వజ్ఞుడైన నారదునకును అతి దుఃఖిత్వముగలిగెనని దేనివలనదెలియబడుచున్నదో చెప్పుము? ఉ. ఓమహాత్ము డవగు సనత్కుమారా, సకలవేదశాస్త్రములంజదివినట్టి యానేను, ఆత్మజ్ఞాన ములేమిచేత మిక్కిలిగాబరితపించుచున్నానని, శ్రు॥ సోహంభగవశ్శోచామి॥ అనియిట్లు నారదుడుచెప్పకొని, అనన్నుసంసారదుఃఖసముద్రముయొక్కగట్టు ను, ఆత్మజ్ఞానమనెడితెప్పచేత బొందింపజేసి కృతార్థబుద్ధిని గలిగింపుమని, శ్రు। తంమాభగవాన్ శోకస్యపారంతారయతు॥ అనియిట్లు నారదుడు దుఃఖని వృత్త్యుపాయమునడుగగా, అప్పుడు సనత్కుమారుడు భూమశబ్దముచే జెప్పద గిన సుఖరూపబ్రహ్మమే యెరుగబడుచున్నదగుచు దుఃఖనివృత్త్యుపాయమగు నని, శ్రు॥ సుఖంత్వేవవిజిజ్ఞాసితవ్యం॥ అనెడి వాక్యము మొదలుకొని, ఉత్తర గ్రంథ సందర్భముచేత జెప్పబడినట్లు, ఛాందోగ్య శ్రుతియందు గల సప్తమా ధ్యాయమందు వినబడుచున్నదని తెలియవలెను.

శ్లో॥ సుఖంవైషయికంశోక సహస్రేణావృతత్వతః।
దుఃఖమేవేతిమత్వాహ నాల్పే స్తిసుఖమిత్యసౌ॥ ౨౧.

టీ. అసౌ-ఈసనత్కుమారుడు, వైషయికం - విషయములవల్ల గలిగెడి, సుఖం-సుఖము, శోకసహస్రేణ=శోక-దుఃఖములయొక్క, సహస్రేణ- సహస్ర


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముచేత, అనృతత్వాత్-పొందగబడుటవలన, అనగాకూడియుండుటచేత ననుట. దుఃఖమేవేతి- దుఃఖమునుగాదలచి, అల్పే-ద్వైతమందు, సుఖం- సుఖము, నేతి- లేదని, ఆహ-చెప్పెను.

తా. ప్ర. అయితే, స్త్రీపుష్పాదులవలనగలిగెడి సుఖము లనేకములుండగా, ద్వైతమందుసుఖనులేదనిచెప్పట, యుక్తమెట్లగును? ఉ. స్త్రీపుష్పాది విషయములవలన గలిగెడిసుఖము, అనేకదుఃఖములతో గూడియుండుటచేత, విషముతోగూడియుండెడియన్నము బహుదుఃఖరూపత్వమును గలిగియున్నట్లు, ఆస్త్రీపుష్పాది జన్యవిషయసుఖంబును బహుదుఃఖరూపమునుగా నిశ్చయించి, ద్వైతమందుసుఖము లేదని సనత్కుమారుడు జెప్పినవాడాయెను.

అవ. ఇప్పుడుపూర్వవాది, ద్వైతమందు సుఖాభావము నంగీకరించి, అద్వైతమందు నాసుఖాభావమునా శంకించుచున్నాడు.

శ్లో॥ నను ద్వైతేసుఖంమాభూదద్వైతేప్యస్తినోసుఖం।
అస్తిచేదుపలభ్యేతతథాచత్రిపుటీభవేత్॥ ౨౨.

టీ. నను-ఓయీ, ద్వైతే-ద్వైతమందు, సుఖం-సుఖము, మాభూత్-లేకపోవుగాక. అద్వైతేపి-అద్వైతమందును, సుఖం-సుఖము, నోఅస్తి-లేదు. అస్తి చేత్-ఉన్నయెడల, ఉపలభ్యేత-పొందబడవలెను. అనగా ననుభవింపబడవలెన నుట. తథాచ-అట్లనుభవింపబడుచుండగా, త్రిపుటీ-త్రిపుటి, అనగా జ్ఞాతృ జ్ఞానజ్ఞేయరూపమనుట. భవేత్ - ఉండును.

తా. ఓఅద్వైతసిద్ధాంతీ, ద్వైతమందు సుఖములేకపోయినం బోనిమ్ము. ఆసుఖము అద్వైతమందునులేదు. అద్వైతమందు సుఖమున్నయెడల అనుభవింప బడవలెను. అనుభవింపబడమిచేత, అద్వైతమందు సుఖములేదని చెప్పటకు, అనుభవములేకపోవుటయే ప్రమాణమగును. మరియు, అద్వైతమందు సుఖమ నుభవింపబడుచున్నదనియంటివేని, అట్లనుభవింపబడుచుండగా, జ్ఞాతృజ్ఞాన జ్ఞేయరూపమగు త్రిపుటి (అనగాద్వైతము) ఉండుటచేత అద్వైతహానియగును. అనగా ననుభవమునకు అనుభవించెడివానితోటియు, అనుభవింపదగినదాని తోటియు అపేక్షగలిగియుండుటవలన, అద్వైతహానిగలుగునని పూర్వవాది యాక్షేపించెనని యభిప్రాయము.

అవ. ఇందుకు సిద్ధాంతి, సమాధానమును జెప్పుచున్నాడు.

శ్లో॥ మాస్త్వద్వైతేసుఖంకింతు సుఖమద్వైతమేవహి।
కింమానమితిచేన్నాస్తిమానాకాంక్షాస్వయంప్రభే॥ ౨౩.

టీ. అద్వైతే-అద్వైతమందు, సుఖం-ఆనందము, మాస్తు- లేకపోవుగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. కింతు-మరియేమనగా, అద్వైతమేవహి-అద్వైతమే, సుఖం-ఆనందమగును. మానం-ప్రమాణము, కిమితిచేత్-ఎద్దియనియంటివేని, స్వయంప్రభే-స్వప్రకాశమానవస్తువునందు, మానాకాంక్షా-ప్రమాణప్రశ్నము, నాస్తి-లేదు.

తా. ఓపూర్వవాదీ, నీవుజెప్పినప్రకారము, అద్వైతముసుఖమున కాధారమైనదికాకపోవుగాక. ప్ర. అయితే, అద్వైతముసుఖమున కాధారముగామి కిగారణమేమి?. ఉ. ఏకారణముచేత అద్వైతమేసుఖమగునో, ఆకారణముచేత అద్వైతము సుఖాధికరణము. (అనగాసుఖమున కాధారమైనది) గాదనితెలియవలెను. ప్ర. అయితే, అద్వైతమేసుఖమనుటయందు ప్రమాణమేమి? ఉ. స్వయముగా ప్రకాశించుచుండెడి వస్తువునందు ప్రమాణాపేక్షలేదు. అనగా ననువాదపూర్వకముగా నాయద్వైతమునకు స్వప్రకాశత్వము గలిగియుండుటవలన, ప్రమాణప్రశ్నమే యుక్తముగాదని యభిప్రాయము. అనువాదమనగా నొకప్రమాణముచే నొకచోటజెప్పబడినదానిని మరియొకచోట మరలజెప్పట.

శ్లో॥ స్వప్రభత్వే భవద్వాక్యం మానం యస్మాద్భవానిదం।
అద్వైతమభ్యుపేత్యాస్మిన్సుఖం నాస్తీతి భాషసే॥ ౨౪.

టీ. యస్మాత్-ఏకారణమువలన, భవాన్-నీవు, ఇదం- ఈ, అద్వైతం-అద్వైతరూపమును, అభ్యుపేత్య- అంగీకరించి, అస్మిన్ - ఈయద్వైతమందు, సుఖం-సుఖము, నాస్తీతి-లేదని, భాషసే- సంభాషింపుచున్నావో, (తస్మాత్) ఆకారణమువలన, స్వప్రభత్వే- స్వప్రకాశత్వమందు, భవద్వాక్యం=భవత్-నీయొక్క, వాక్యం-వాక్యము, మానం- ప్రమాణమగును.

తా. ప్ర. అయితే, అద్వైతమునకు స్వప్రకాశరూపత్వమందు ప్రమాణమేమి? ఉ. నీవాక్యమే ప్రమాణమగును. ప్ర. నావాక్యమెద్ది? ఉ. ఏకారణమువలన నీచేత ప్రమాణమపేక్షింపబడకనే, అద్వైతమంగీకరింపబడి, సుఖమే యాక్షేపింపబడెనో, ఆకారణమువలన అద్వైతము స్వప్రకాశరూపముగలదని తెలియవలెను.

శ్లో॥ నాభ్యుపైమ్యహమద్వైతం త్వద్వచోనూద్యదూషణం।
వచ్మిచేత్తదాబ్రూహికిం నాసీద్ద్వైతతఃపురః॥ ౨౫.

టీ. అహం-నేను, అద్వైతం- అద్వైతమును, నాభ్యుపైమి- అంగీకరించినవాడనుగాను. త్వద్వచః-త్వత్-నీయొక్క, వచః- వాక్యమును, అనూద్య-అనుసరించి, అనగాపట్టియనుట. దూషణం - అద్వైతదూషణమును, వచ్మితి చేత్- చెప్పుచున్నాననియంటివేని, తదా-అప్పుడు, అనగా నట్లైనయెడల ననుట. ద్వైతతః-ద్వైతముబుట్టుటకంటె, అనగాసృష్టికంటెననుట. పురః-పూర్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము, కిమాసీత్-ఏమియుండెనో, బ్రూహి - చెప్పుము.

తా. ప్ర. ఓ అద్వైతసిద్ధాంతీ, నాచేత నద్వైత మంగీకరింపబడలేదు. మరియేమనగా నీచేజెప్పబడిన అద్వైతమునననుసరించి దూషించితిని. అందుచేత నావాక్యమువలన నీకద్వైతసిద్ధియెట్లుగలుగును? ఉ. నీచేజేయబడినదూషణము, వికల్పముచేత సహింపరానిదగుటవలన అద్వైతము నంగీకరింపమియుక్తముగాదు. ప్ర. అదియెట్లు? ఉ. ద్వైతముబుట్టుటకంటె (అనగాసృష్టికంటె) బూర్వమందేమియుండెనో చెప్పుము.

అవ. (కిం=ఏమి) అనెడిశబ్దముచే సూచింపబడిన వికల్పమును జూపుచున్నాడు.

శ్లో॥ కిమద్వైతముతద్వైతమన్యావాకోటిరంతిమః।
అప్రసిద్ధోనద్వితీయోఽనుత్పత్తేశ్శిష్యతేఽగ్రిమః॥ ౨౮.

టీ. అద్వైతం-సృష్టికిపూర్వమందద్వైతము, కిం-ఉండెనో, ఉత-లేక, ద్వైతంకిం-ద్వైతముండెనో, అన్యా- మరియొకటియగు, కోటిర్వాకిం - కక్షయుండెనోచెప్పుము. అనగానద్వైతద్వైతవిలక్షణపక్షము గలదియుండెనేమో చెప్పుమనుట. అంతిమః-మూడవపక్షము, అనగాద్వైతాద్వైతవిలక్షణరూపమనుట. అప్రసిద్ధః-ప్రసిద్ధముగలదిగాదు. అనగా లోకమందు గనబడలేదనుట. అనుత్పత్తేః-పుట్టమివలన, ద్వితీయః-రెండవపక్షము, అనగా ద్వైతరూపమనుట. న-లేదు. (అతః) ఆకారణమువలన, అగ్రిమః - మొదటిపక్షమగు అద్వైతరూపము, శిష్యతే-శేషించుచున్నది. అనగా సృష్టికి బూర్వమందద్వైతతత్వమే గలదనుట.

తా. ఓపూర్వవాదీ, సృష్టికిబూర్వమందు, ౧. అద్వైతరూపముండెనో, లేక, ౨. ద్వైతరూపముండెనో, లేక, ౩. ద్వైతాద్వైతములకంటె నన్యమగు రూపముండెనోచెప్పుము. అందుద్వైతాద్వైతములకంటె నన్యరూపము లోకమందు గనబడమిచేత, మూడవపక్షముగలదనిచెప్పరాదు. మరియు, సృష్టికిబూర్వమందు ద్వైతమున్నదనియుంజెప్పరాదు. ప్ర. అట్లుచెప్పరామికి హేతువేమి?. ఉ. సృష్టియేద్వైతమగుటవలన, సృష్టికిబూర్వమందు ద్వైతమునకు ఉత్పత్తిలేదు. ఆకారణమువలన, సృష్టికిబూర్వమందు అద్వైతతత్వమేగలదని తెలియవలెను.

శ్లో॥ అద్వైతసిద్ధిర్యుక్త్యైవ నానుభూత్యేతిచేద్వద।
నిర్దృష్టాంతాసదృష్టాంతావాకోట్యంతరమత్రనో॥ ౨౯.

టీ. యుక్త్యైవ-యుక్తిచేతనే, అద్వైతసిద్ధిః- అద్వైతసిద్ధి గలిగెననియు, అనుభూత్యా-అనుభవముచేత, నేతిచేత్-అద్వైతముసిద్ధించలేదనియంటి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేని, (యుక్తిః) యుక్తి, నిర్దృష్టాంతా-దృష్టాంతరహితమైనదో, సదృష్టాంతా వా-దృష్టాంతసహితమైనదో, వద-చెప్పుము. అత్ర-ఈవిషయమై, అనగా యుక్తినివికల్పముజేసెడి విషయమందనుట. కోట్యంతరం-మరియొకకక్ష- అనగామరియొకపక్షమనుట. నో-లేదు.

తా. ప్ర. అయితే, ఈచెప్పబడినప్రకారము అద్వైతముయుక్తిచేతనే సిద్ధించుచున్నదిగాని, యనుభవనుచేత సిద్ధించుచున్నదిగాదుగదా? ఉ. ఓపూర్వవాదీ, యుక్తిచేతనే యద్వైతసిద్ధిగలిగెనని, నీచేజెప్పబడెను. నీవుచెప్పినది వికల్పముచేత సహింపరానిదగుటవలన, యుక్తినివికల్పించెదనువినుము. నీచేజెప్పబడెడియుక్తి, ౧. దృష్టాంతములేనిదో, ౨. దృష్టాంతముగలదో చెప్పుము. ఇచ్చటయుక్తినివికల్పించెడివిషయమై, ఈరెండు పక్షములుతప్ప, మరియొకపక్షములేమిచేత, ఈవికల్పము, హీనత్వముగలదిగాదని తెలియవలెను.

శ్లో॥ నానుభూతిర్నదృష్టాంత ఇతియుక్తిస్తుశోభతే।
సదృష్టాంతత్వపక్షేతు దృష్టాంతంవదమేమతం॥ ౨౮.

టీ. అనుభూతిః- అనుభవము, న-లేదు. దృష్టాంతః-దృష్టాంతము, నేతి-లేదనెడి, యుక్తిస్తు-యుక్తియో, శోభతే-ప్రకాశించును. అనగాదృష్టాంతము లేదనెడిమాట యుక్తమైనదిగాదనుట. సదృష్టాంతత్వపక్షేతు= సదృష్టాంతత్వ-దృష్టాంతభావముతోగూడిన, పక్షేతు-పక్షమందో, మే-నాకు, మతం- సమ్మతమగు, దృష్టాంతం-దృష్టాంతమును, వద - చెప్పుము.

తా. మరియు, అనుభవములేదనియు, దృష్టాంతము లేదనియుం జెప్పెడి యుక్తి, శోభించదు. అనగాయుక్తిచేతనే అద్వైతసిద్ధిగలిగెనని చెప్పెడివానిచే ననుభవమంగీకరింపబడలేదనియు, మరియు, యుక్తియో, దృష్టాంతమునుజూపుటతప్ప, మరిదేనినిసాధింపుచున్నవాడుగాడనియు, ఆకారణమువలన దృష్టాంతములేదనెడిమాట, యుక్తముగాదనెడి యభిప్రాయముతోటి, పరిహాససహితముగా శ్రీవిద్యారణ్యగురుండు, (దృష్టాంతములేని యుక్తియనెడి) ప్రథమపక్షమును నిరాకరించెనని యభిప్రాయము. మరియు, ఓపూర్వవాదీ, (దృష్టాంతముగలయుక్తియనెడి) రెండవపక్షమందు ఉభయవాదులచే నంగీకరింపబడెడి దృష్టాంతమును చెప్పుము.

శ్లో॥ అద్వైతఃప్రళయోద్వైతానుపలంభేనసుప్తివత్।
ఇతిచేత్సుప్తిరద్వైతేత్యత్రదృష్టాంతమీరయ॥ ౨౯.

టీ. ద్వైతానుపలంభేన=ద్వైత-ద్వైతముయొక్క, అనుపలంభేన-స్మృతిహేతుకజ్ఞానములేమిచేత, అనగా సలుకలేమిచేననుట. ప్రళయ - ప్రళయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము, సుప్తివత్-సుషుప్తివలె, అద్వైత ఇతిచేత్ - అద్వైతమగునని యంటివేని, సుప్తిః-సుషుప్తి, అద్వైతేతి- అద్వైతమగుననెడి, అత్ర- ఈవిషయమందు, దృష్టాంతం-దృష్టాంతమును, ఈరయ - చెప్పుము.

తా. ప్ర. అయితే, ఓఅద్వైతసిద్ధాంతీ, దృష్టాంతముచేతనే అద్వైతమునుసాధించెదనువినుము. ప్రళయము, ద్వైతస్మృతిహేతుక జ్ఞానవంతముగామివలన ద్వైతములేనిదగుటకు దగుచున్నదనియు, ఎద్దియెదిద్వైతస్మృతిహేతుక జ్ఞానవంతముగాదో, అద్దియద్ది, సుషుప్తివలె ద్వైతము లేనిదగుచున్నదని, ఇట్లు అనుమానప్రమాణపూర్వక దృష్టాంతముచేత అద్వైతమును సాధింపరాదాయేమి? ఉ. సరి. అయితే, సుషుప్తి, అద్వైతమగుననెడి ఈవిషయమందు దృష్టాంతమునుజెప్పుము. అనగా, నీప్రకారమద్వైతమును సాధించెడివానికి, ౧. తనసుషుప్తిదృష్టాంతమగునో, లేక, ౨. పరసుషుప్తిదృష్టాంతమగునోయనియిట్లుద్వివిధముగావికల్పముచేసి, తనసుషుప్తి దృష్టాంతమయ్యెడిపక్షమందు, తనసుషుప్తికిపరసుషుప్తి, ప్రత్యక్షసిద్ధమగుటచేత, ఆపరసుషుప్తిసిద్ధించెడికొరకు, సుషుప్తి అద్వైతమగుననెడి విషయమందు మరియొకదృష్టాంతమునుజెప్పుమని, సిద్ధాంతియడిగెనని తెలియవలెను.

శ్లో॥ దృష్టాంతః పరసుప్తిశ్చేదహో తే కౌశలం మహత్।
యస్స్వసుప్తిం న వేత్త్యస్య పరసుప్తౌ తు కా కథా॥ ౩౦.

టీ. పరసుప్తిః= పర- పరునియొక్క, సుప్తిః-సుషుప్తి, దృష్టాంతశ్చేత్-దృష్టాంతమగుననియంటివేని, అహో-ఓహో, తే-నీయొక్క, కౌశలం-నేర్పరితనము, మహత్-గొప్పదగును. యః-ఏనీవంటివాడు, స్వసుప్తిం=స్వ-తనయొక్క, సుప్తిం-సుషుప్తిని, నవేత్తి-ఎరుగడో, అస్య- నీవంటివానికి, పరసుప్తౌతు-పరసుషుప్తియందో, కాకథా-ఏమిచెప్పవలెను. అనగా పరసుషుప్తిజ్ఞానముగలుగుచున్నదని చెప్పవలసినపనిలేదని సిద్ధాంతిపరిహాసము జేసెననుట.

తా. ప్ర. అయితే, అద్వైతమును సాధించెడికొరకు దృష్టాంతముగా జెప్పబడిన నాసుషుప్తికి, పరసుషుప్తియే దృష్టాంతమగునుగదా? ఉ. ఓపూర్వవాదీ, నీనేర్పరితనము, మిక్కిలిగొప్పదగును. ఏనీవు, నీసుషుప్తియొక్క యనుభవము నంగీకరింపమిచేత, నీసుషుప్తినే నీవెరుగవో, అట్టినీకు బరసుషుప్తిజ్ఞానముగలుగుచున్నదని, ఇకనేమిజెప్పవలయును. అనగా బరసుషుప్తి, నీకు ప్రత్యక్షముగామిచేత, నీచేతనాపరసుషుప్తి, దృష్టాంతము జేయబడుటకు యుక్తముగాదనెడి యభిప్రాయముతోటి, శ్రీవిద్యారణ్యగురుండు పూర్వోక్తప్రకారము పరిహాసము జేసెనని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ నిశ్చేష్టత్వాత్పరస్సుప్తోయథాహమితిచేత్తదా।
ఉదాహర్తుస్సుషుప్తేస్తేస్వప్రభత్వంబలాద్భవేత్॥ ౩౧.

టీ. సుప్తః-సుషుప్తియందు, యథాహం-నావలె; పరః- పరుఁడు, నిశ్చేష్టత్వాదితిచేత్-నిశ్చేష్టత్వముగలిగియుండుటవలన ననియంటివేని, తదా - అప్పుడు, ఉదాహర్తుః-సుషుప్తినిదృష్టాంతీకరించెడి, తే-నీయొక్క, సుషుప్తేః- సుషుప్తికి, స్వప్రభత్వం- స్వప్రకాశత్వము, బలాత్-సుషుప్త్యుదాహరణసామర్థ్యమువలన, భవేత్-కలుగును.

తా. ప్ర. అయితే. విమతుఁడగుపరుఁడు, ప్రాణాదికముగలవాఁడగుచు నిశ్చేష్టత్వముగలవాఁడగుటవలన, నావలెనే, సుషుప్తిని బొందినవాఁడగుటకు దగుచున్నాఁడని, యిట్లు అనుమానప్రమాణముచేత, పరసుషుప్తిసిద్ధిగలుగుచుండలేదాయేమి? ఉ. సరి. అట్లైనయెడల నన్నుగురించి, సుషుప్తిని దృష్టాంతీకరించెడినీయొక్కసుషుప్తికి స్వప్రకాశత్వము, సుషుప్త్యుదాహరణ సామర్థ్యమువలననే గలుగును.

శ్లో॥ నేంద్రియాణినదృష్టాంతస్తథాప్యంగీకరోషితాం।
ఇదమేవస్వప్రభత్వంయద్జ్ఞానంసాధనైర్వినా॥ ౩౨.

టీ. ఇంద్రియాణి-సుషుప్తినిగ్రహించెడియింద్రియములు, న- లేవు. దృష్టాంతః-సరియైనదృష్టాంతము, న-లేదు. తథాపి-అట్లైనను, అనగా నట్లులేకపోయిననుట. తాం-ఆసుషుప్తిని, అంగీకరోషి - అంగీకరించితివి. సాధనైర్వినా-జ్ఞానసాధనములులేకనే, యద్జ్ఞానం - ఏప్రకాశనముగలదో, తదిదమేవ-ఆయిదియే, (సుషుప్తౌ) సుషుప్తియందు, స్వప్రభత్వం-స్వప్రకాశత్వమగును.

తా. ప్ర. అయితే, ఏబలమువలనసుషుప్తికెట్లు స్వప్రకాశత్వము గలుగునోచెప్పుము? ఉ. ఓపూర్వవాదీ, ఆసుషుప్తికాలమందు ఇంద్రియములు, తమకారణమందు లయించుటవలననప్పుడు సుషుప్తినిగ్రహించెడి యింద్రియములులేవు. మరియు, అప్రసిద్ధమగు పరసుషుప్తిని దృష్టాంతముగా జెప్పుటవలన సరియైనదృష్టాంతంబునులేదు. అట్లులేకపోయినను, ఆసుషుప్తినంగీకరించితివి. ఈప్రకారమంగీకరించుచుండగా, జ్ఞానసాధనములేకనే, ఏప్రకాశనము గలదో, ఆయిదియే సుషుప్తియందు స్వప్రకాశత్వమగునని తెలియవలెను. ఇచ్చట ననుమానప్రమాణమును గ్రహించవలెను. ప్ర. అదియెట్లు? ఉ. విమతమగుసుషుప్తి, జ్ఞానసాధనములులేకపోయినను ప్రకాశించుచుండుటవలన, సాంఖ్యులకుసమ్మతమగు ఆత్మవలెను, ప్రభాకరులకుసమ్మతమగు సంవేదనమువలెను, శాక్యులకుసమ్మతమగు స్వాత్మవలెను, స్వప్రకాశత్వముగలదగునని, ఇట్లనుమాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రమాణముచే నెరుగవలెను.

అవ. ఇట్లు ప్రళయమునకు దృష్టాంతత్వముచే నుదాహరింపబడిన సుషుప్తికి అద్వైతత్వస్వప్రకాశత్వములనుసాధించి, ఆసుషుప్తియందు సుఖమునుసాధించుటకొఱకు పూర్వపక్షియొక్క యాకాంక్షనుస్థాపించుచు ప్రత్యుత్తరమును జెప్పుచున్నాడు.

శ్లో॥ స్తాంవాఽద్వైతస్వప్రభత్వేవదసుప్తౌసుఖంకథం।
శృణునదుఃఖంతదానాస్తితతస్తేశిష్యతేసుఖం॥ ౩౩.

టీ. అద్వైతస్వప్రభత్వే=అద్వైత-అద్వైతత్వంబును, స్వప్రభత్వే- స్వప్రకాశత్వంబును, స్తాం-ఉండుగాక. సుప్తౌ-సుషుప్తియందు, సుఖం - ఆనందము, కథం-ఎట్లుగగలదో, వద-చెప్పుము. శృణు-చెప్పెదవినుము. తదా- అప్పుడు, అనగాసుషుప్తికాలమందనుట. దుఃఖం-దుఃఖము, నాస్తి-లేదు. తతః - అందువలన, తే-నీకు, సుఖం-సుఖము, శిష్యతే-శేషించుచున్నది. అనగా సుషుప్తియందు సుఖముగలదని తెలియవలెననుట.

తా. ప్ర. అయితే, సుషుప్తియందు, ౧. అద్వైతభావంబును, ౨. స్వప్రకాశత్వంబునుండుగాక. ఆసుషుప్తియందు సుఖమెట్లుగలదో చెప్పుము? ఉ. చెప్పెదనువినుము. ఆసుషుప్తియందు దుఃఖములేనికారణమువలన, అప్పుడు నీకు సుఖమేగలదని తెలియవలెను. అనగాసుఖదుఃఖములకు రెంటికిని ప్రకాశాంధకారములకువలె పరస్పరవిరోధిత్వము గలిగియుండుటచేత, ఆసుషుప్తియందు సుఖవిరోధియగు దుఃఖములేమివలన సుఖమేగలదని యంగీకరింపదగినదని యభిప్రాయము.

శ్లో॥ అంధస్సన్నప్యనంధస్స్యాద్విద్ధోఽవిద్ధస్తథారోగ్యపి।
అరోగీతిశ్రుతిఃప్రాహతచ్చసర్వజనావిదుః॥ ౩౪.

టీ. అంధస్సన్నపి- అంధుడగుచుండియు, అనంధః- అంధత్వములేనివాడు, స్యాదితి-అగుననియు, విద్ధోపి-యుద్ధాదికమందు గాయము గలవాడైనను, అవిద్ధఇతి వ్రణబాధలేనివాడగుననియు, ఉత్తరోగ్యపి=ఉత్థ - ప్రకోపింపబడిన, రోగ్యపి-వ్యాధిగలవాడైనను, అరోగీతి-వ్యాధిలేనివాడగునని, శ్రుతిః-వేదవాక్యము, ప్రాహ-చెప్పెను. అనగాజెప్పుచున్నదనుట. తత్-ఆయర్థమును, సర్వజనాశ్చ-సర్వజనులును, విదుః-ఎరుగుదురు. అనగా నాశ్రుత్యర్థము సర్వజనానుభవసిద్ధముగా నున్నదనుట.

తా. ప్ర. అయితే, సుషుప్తియందు దుఃఖములేనివిషయమై ప్రమాణమేమి? ఉ. శ్రుత్యనుభవములు రెండును బ్రమాణములగును. ప్ర. ఆశ్రుత్యనుభవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు రెండు నేవ్వి? ఉ. అంధుడైనను సుషుప్తియందు అంధుడుగాడనియు, యు ద్ధాదికమందు గాయముగలవాడైనను సుషుప్తియందు వ్రణబాధ లేనివాడగునని యు, రోగవంతుడైనను సుషుప్తియందు రోగము లేనివాడగుచున్నాడని, శ్రు॥ తస్మాద్వా ఏతం సేతుంతీర్త్వాంధ స్సన్ననంధో భవతి విద్ధస్సన్నవిద్ధోభవత్యుప తాపీసన్ననుపతాపీభవతి. తద్యద్యపీదం భగవశ్శరీరమంధం భవత్యనంధస్స భవతి॥ అనెడి యిత్యాదిశ్రుతి, దేహాభిమాన ప్రయుక్తములగు అంధత్వాదిదో షములను సుషుప్తి, నివారింపజేయుచున్నదని చెప్పుచున్నది. మరియు, వ్యా ధ్యాదికముచేత పీడింపబడుచుండెడివానికిని, ఆవ్యాధ్యాదిదుఃఖానుభవము సు షుప్తియందులేదనెడి ఈవిషయము సర్వజన ప్రసిద్ధమగును.

శ్లో॥ నదుఃఖాభావమాత్రేణ సుఖంలోష్టశిలాదిషు।
ద్వయాభావస్యదృష్టత్వా దితిచేద్విషమంవచః॥ ౩౫.

టీ. లోష్టశిలాదిషు=లోష్ట-మట్టిగెడ్డయందును, శిలాదిషు- రాయిమొద లగువానియందును, ద్వయాభావస్య= ద్వయ - సుఖదుఃఖములయొక్క, అభావ స్య-లేమి, దృష్టత్వాత్- కనబడుచుండుటవలన, దుఃఖాభావమాత్రేణ=దుఃఖ- దుఃఖముయొక్క, అభావమాత్రేణ-అభావమాత్రముచేత, సుఖం - సుఖమును, నేతిచేత్- కల్పింపరాదనియంటివేని, వచః - ఈలోష్టాదివాక్యము, విషమం- దార్ష్టాంతికము ననుసరించినదికాదు.

తా. ప్ర. అయితే, మట్టిగెడ్డయందును, శిలాదులయందును సుఖదుఃఖ ములు రెండును కనబడకపోవుటవలన, ఎచ్చట దుఃఖములేదో యచ్చట సుఖము గలదనెడివాక్యమునకు వ్యాప్తిలేమిచేత, సుషుప్తియందు దుఃఖములేనిమాత్రము వలన సుఖమునుకల్పించుటకు శక్యమెట్లగును? ఉ. ఈలోష్టశిలాది దృష్టాంత వాక్యము, దార్ష్టాంతికము ననుసరించినదికాదు.

అవ. ఈదృష్టాంతమునకు అనుకూలత్వము లేమిని దెలుపుచున్నాడు.

శ్లో॥ ముఖదైన్యవికాసాభ్యాం పరదుఃఖసుఖోహనం।
దైన్యాద్యభావతోలోష్టే దుఃఖాద్యూహోనసంభవేత్॥ ౩౬.

టీ. పరదుఃఖసుఖోహనం= పర-పరునియొక్క, దుఃఖ - దుఃఖముయొ క్కయు, సుఖ-సుఖముయొక్కయు, ఊహనం-ఊహ, ముఖదైన్యవికాసాభ్యాం= ముఖ-ముఖముయొక్క, దైన్య-దీనత్వముచేతను, వికాసాభ్యాం - వికాసముచే తను, (భవతి) అగుచున్నది. లోష్టే - మట్టిగెడ్డయందు, దైన్యాద్యభావతః= దైన్యాది- దీనత్వము మొదలగువానియొక్క, అభావతః-లేమివలన, దుఃఖాద్యూ హః=దుఃఖాది-దుఃఖాదికముయొక్క, ఊహః- ఊహ, నసంభవేత్-కలుగదు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. నీవు విషణ్ణముఖము గలవాడ వగుటవలన సంప్రతిపన్ను నివలె దుఃఖి యనియు, నీవు ప్రసన్నముఖము గలవాడ వగుటవలన సంప్రతిపన్ను నివలె సుఖి యనియు, ఇట్లు అన్యునియందుగల సుఖదుఃఖములయొక్క యూహ, ముఖదైన్య వికాసములనెడి గురుతులచేత యథాక్రమముగా గలుగుచున్నది. ప్ర. సరి. లోకమందిట్లగుగాక. ప్రకృతమందులాభ మేమి? ఉ. మట్టిగెడ్డ మొదలగువాని యందు ముఖదైన్యాదిరూపమగు గురుతులేమివలన సుఖదుఃఖములయొక్క యూహయే సంభవింపదు. ఆకారణముచేత, ఆమట్టిగెడ్డ మొదలగుదానియందు దుఃఖము లేదనియైనను నిశ్చయించుటకు శక్యముగాదు.

అవ. ఇప్పుడు పరునియొక్క సుఖదుఃఖములకంటె స్వకీయ సుఖదుఃఖములకు వైషమ్యమును జూపుచున్నాడు.

శ్లో॥ స్వకీయసుఖదుఃఖేతు నోహనీయేతతస్తయోః।
భావో వేద్యోనుభూత్యైవ తదభావోపినాన్యతః॥ 3౭.

టీ. (యతః) ఏకారణమువలన, స్వకీయసుఖదుఃఖేతు=స్వకీయ - తన సంబంధములగు, సుఖదుఃఖేతు-సుఖదుఃఖములో, ఊహనీయే- అనుమానాదికముచే నూహింపదగినవి, న-కావో, తతః- ఆకారణమువలన, తయోః-ఆసుఖదుఃఖములయొక్క, భావః-స్థితి, అనుభూత్యైవ-అనుభవముచేతనే, అనగా ప్రత్యక్షముచేతననుట. వేద్యః - తెలియదగినదగును. తదభావోపి=తత్- ఆసుఖదుఃఖములయొక్క, అభావోపి-లేమియు, అన్యతః-అనుమానాదికమువలన, న-తెలియదగినదిగాదు. అనగా ప్రత్యక్షముచేతనే తెలియదగినదగుననుట.

తా. మరియు, ఏకారణముచేత దనయందుండెడి సుఖదుఃఖములు అనుభవసిద్ధములగుటవలన అనుమానప్రమాణముచేత నూహింపదగినవికావో, ఆకారణముచేత, తనసుఖదుఃఖములయొక్క స్థితి, అనుభవముచేతనే (అనగా ప్రత్యక్షముచేతనే) దెలియదగినదగును. మరియు, తనసుఖదుఃఖములయొక్క లేమియు, ప్రత్యక్షముగా దెలియబడుచున్నదేగాని, అనుమానాది ప్రమాణమువలన తెలియబడదు.

అవ. ఫలితము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ తథాసతిసుషుప్తావదుఃఖాభావోనుభూతితః।
విరోధిదుఃఖరాహిత్యాత్సుఖంనిర్విఘ్నమిష్యతాం॥ 3౮.

టీ. తథాసతి-అట్లగుచుండగా, అనగా స్వకీయసుఖాదిక మనుభవముచే నెరుగదగినదగుచుండగాననుట. సుషుప్తౌచ-తనసుషుప్తియందును గల, దుఃఖాభావః=దుఃఖ-దుఃఖముయొక్క, అభావః-లేమి, అనుభూతితః- అనుభవమువల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న, (సిద్ధః) సిద్ధమగును. విరోధిదుఃఖరాహిత్యాత్ = విరోధి - సుఖనిరోధియగు, దుఃఖ-దుఃఖముయొక్క, రాహిత్యాత్ - లేమివలన, నిర్విఘ్నం-బాధలేని, సుఖం-ఆనందము, అభ్యుపేయతాం - సుషుప్తియం దంగీకరింపబడుగాక. అనగా సుషుప్తియందు బాధలేనిసుఖముగలదని యంగీకరింపవలెననుట.

తా. ప్ర. అయితే, ఇట్లుచెప్పుటచేత ఫలితమేమి?. ఉ. స్వకీయసుఖదుఃఖాదిక మనుభవముచే నెరుగదగినదగుచుండగా, స్వకీయ సుషుప్తియందునుం గల దుఃఖరాహిత్యంబును అనుభవముచేతనే సిద్ధమైనదగును. ప్ర. సరి. దుఃఖములేమిచేతను సుషుప్తియందులాభమేమి? ఉ. సుషుప్తియందు సుఖవిరోధియగు దుఃఖములేమివలన, బాధలేనిసుఖముగలదని యంగీకరింపవలెనని తెలియవలెను.

శ్లో॥ మహత్తరప్రయాసేన మృదుశయ్యాదిసాధనం।
కుతస్సంపాద్యతేసుప్తౌ సుఖంచేత్తత్రనోభవేత్॥ ౩౯.

టీ. తత్ర-ఆ. సుప్తౌ-సుషుప్తియందు, సుఖం-ఆనందము, నోభవేచ్చేత్-లేనియెడల, మహత్తరప్రయాసేన = మహత్తర- మిక్కిలియధికమగు, ప్రయాసేన- ప్రయాసముచేత, మృదుశయ్యాదిసాధనం = మృదు-మెత్తని, శయ్యాది-పాన్పు మొదలగు, సాధనం- సుఖసాధనము, కుతః- ఏకారణమువలన, సంపాద్యతే- సంపాదింపబడుచున్నది.

తా. మరియు, ఆసుషుప్తియందు సుఖములేనియెడల మహత్తరప్రయాసముచేత బహువిధధనవ్యయశరీర పీడనాదికముతోటిమెత్తనిపాన్పు, తలగడ, మొదలగుసుఖసాధనము, మరియేకారణముచేతను సంపాదింపబడనేరదు. అనగా జనము, నిద్రించుటకు మెత్తనిపాన్పు మొదలగు సుఖసాధనమును సంపాదించుకొనుచుండుటచేత, సుషుప్తియందుపరమసుఖముగలదని యభిప్రాయము.

అవ. అర్థాపత్తివలన విపరీతార్థమును శంకించుకొని, సమాధానమును, జెప్పుచున్నాడు.

శ్లో॥ దుఃఖనాశార్థమేవైతదితిచేద్రోగిణస్తథా।
భవత్వరోగిణస్త్వేతత్సుఖాయైవేతినిశ్చిను॥ ౪౦.

టీ. ఏతత్ - ఈపాన్పు మొదలగు సుఖసాధనము, దుఃఖనాశార్థమేవేతిః చేత్ = దుఃఖ-సుషుప్తియందుగల దుఃఖముయొక్క, నాశార్థమేవేతిచేత్ - నాశనముకొరకే సంపాదింపబడుచున్నదని యంటివేని, తథా - ఆప్రకారము, రోగిణః-రోగవంతులు, భవతు- అగుదురుగాక. అనగా సంపాదించుకొనెదరనుటు. అరోగిణఃతు-వ్యాధిలేనివారో, ఏతత్ ఈపాన్పు మొదలగు సుఖసాధనమును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుఖార్థమేవేతి - సుఖముకొరకే సంపాదించుకొనుచున్నారని, నిశ్చిను - నిశ్చయింపుము.

తా. ప్ర. అయితే, ఈపాన్పు మొదలగు సుఖసాధనమును, దుఃఖమునశించుటకొరకే సంపాదించుకొనుచున్నారని చెప్పరాదాయేమి?. ఉ. రోగవంతులగు జనులకు రోగాదికముచేత దుఃఖము గలుగుచుండగా, ఆదుఃఖమునశించెడికొరకు, పాన్పు మొదలగు సుఖసాధనమును సంపాదించుకొనుచున్నారని చెప్పవచ్చును. రోగము లేనివారికి నివర్తింపదగిన దుఃఖము లేమివలన, పాన్పు మొదలగు సుఖసాధనమును సుఖముకొరకే సంపాదించుకొనుచున్నారని తెలియబడుచున్నది.

శ్లో॥ తర్హిసాధనజన్యత్వాత్సుఖంవైషయికంభవేత్।
భవత్యేవాత్రనిద్రాయాః పూర్వంశయ్యాసనాదిజం॥ ౪౧.

టీ. తర్హి-అట్లైనయెడల, సాధనజన్యత్వాత్ = సాధన - పాన్పు మొదలగు సుఖసాధనముచేత, జన్యత్వాత్-పుట్టుటవలన, సుఖం-ఆత్మస్వరూపమగు సుఖము, వైషయికం- విషయసంబంధమైనది, భవేచ్చేత్- అగుననియంటివేని, అత్ర-ఇచ్చట, నిద్రాయాః-నిద్రకంటె, అనగా నిద్రవచ్చుటకంటె ననుట. పూర్వం- పూర్వముగలసుఖము, శయ్యాసనాదిజం= శయ్యాసనాది-శయ్యాసనాదికమువలన, జం-పుట్టినది, భవత్యేవ - అగునేగాక.

తా. ప్ర. అయితే, సుషుప్తిసంబంధమగుసుఖము, పాన్పు మొదలగుసాధనమువలన బుట్టినదైనయెడల, ఆసౌషుప్తసుఖము, ఆత్మస్వరూపమని చెప్పినమాటకు బాధగలుగదాయేమి? ఉ. నిద్రవచ్చుటకంటె పూర్వకాల సంబంధమగుసుఖమును, ౧. విషయజన్యమనిచెప్పెదవో, లేక, ౨. నిద్రాకాలసంబంధసుఖమును విషయసుఖమనిచెప్పెదవో చెప్పుము. నిద్రవచ్చుటకంటె బూర్వకాలసంబంధమగుసుఖము, పాన్పు మొదలగు సుఖసాధనమువలన బుట్టినదగుటచేత, ఆసుఖము విషయసుఖమేయగునని తెలియవలెను.

అవ. ద్వితీయవికల్పము నిప్పుడు నిరాకరించుచున్నాడు.

శ్లో॥ నిద్రాయాంతుసుఖంయత్తజ్జన్యతేకేనహేతునా।
సుఖాభిముఖధీరాదౌ పశ్చాల్లీయేత తేసుఖే॥ ౪౨.

టీ. నిద్రాయాంతు-నిద్రయందో, యత్- ఏ, సుఖం - సుఖముగలదో, తత్-ఆసుఖము, కేనహేతునా- ఏహేతువుచేత, జన్యతే-పుట్టుచున్నది. అనగా నేసాధనముచేతనుం బుట్టినదిగాదనుట. ఆదౌ-నిద్రకంటె బూర్వకాలమందు, (జీవః) జీవుడు, సుఖాభిముఖధీః=సుఖ- శయ్యాదిజన్యసుఖమునకు, అభిముఖ-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఎదురుగాగల, ధీః-బుద్ధిగలవాడగుచున్నాడు. పశ్చాత్-పిమ్మట, అనగానిద్రా కాలమందనుట. పరే- శ్రేష్ఠమగు, సుఖే-స్వరూపసుఖమందు, మజ్జేత్ - లీనుడగును.

తా. మరియు, నిద్రయందు ఏసుఖముగలదోయది, ఏహేతువుచేతంగలిగినదిగాదు. అనగా సుషుప్తియందు పాన్పు మొదలగువానియొక్క యనుసంధానములేమివలన, ఆశయ్యాదికముచేత సౌషుప్తికసుఖము గలిగినది గాదనియు, అందుచేత ద్వితీయపక్షముగూడదని యభిప్రాయము. ప్ర. అయితే, నిద్రయందు నిరుపాధికసుఖమున్న యెడల, ఆసుఖము విషయసుఖమువలె ననుభవింపబడలేదేమి? ఉ. నిద్రకంటె బూర్వకాలమందుజీవుడు, శయ్యాదిజన్యసుఖమునకు ఎదురుగాగల బుద్ధిగలవాడగుచు, పిమ్మట నిద్రాకాలమందు స్వస్వరూపభూతపరమసుఖమందులీనుడగును. అనగా, అనుభవించెడివాడు, ఆనిద్రాకాలమందు ఆసుఖమందు లీనుడగుటవలన విషయసుఖమువలె, ఆసౌషుప్తిక సుఖమనుభవింపబడలేదని యభిప్రాయము.

అవ. సంక్షేపముగా జెప్పిన ఈయర్థమును, మూడుశ్లోకములచే విస్తరింపజేయుచున్నాడు.

శ్లో॥ జాగ్రద్వ్యాపృతిభిశ్శ్రాన్తో విశ్రమ్యాథవిరోధిని।
అపనీతేస్వస్థచిత్తోఽనుభవేద్విషయే సుఖం॥ ౪౩.

టీ. జీవః-జీవుడు, జాగ్రద్వ్యాపృతిభిః = జాగ్రత్ - జాగరణావస్థయందు, వ్యాపృతిభిః-చేయబడుచుండెడి వ్యాపార విశేషములచేత, శ్రాంతస్సన్- బడలికగలవాడగుచు, విశ్రమ్య-విశ్రమించి, అనగా మెత్తనిపాన్పు మొదలగువానియందు శయనించియనుట. అథ - అనంతరము, విరోధిని, వ్యాపారజనితదుఃఖము, అపనీతేసతి-నివారింపబడుచుండగా, స్వస్థచిత్తోభూత్వా-వ్యాకులములేనిమనస్సుగలవాడై, విషయే- పాన్పు మొదలగువానియందు గలుగుచుండెడి, సుఖం-సుఖమును, అనుభవేత్-అనుభవించును. అనగా సాక్షాత్కరించుకొనును.

తా. జీవుడు, జాగరణావస్థయందు జేయబడుచుండెడి వ్యాపారవిశేషములచేత శ్రమగలవాడగుచు, మెత్తని పాన్పు మొదలగువానియందు శయనించుటచేత విశ్రమించి, ఆపిమ్మట, వ్యాపారజనితదుఃఖము నివారింపబడుచుండగా, వ్యాకులములేనిమనస్సుగలవాడై పాన్పు మొదలగువిషయమందు గలుగుచుండెడి సుఖమననుభవించును.

అవ. విషయసుఖ స్వరూపమునుజూపుచు, పరమ సుఖమందు లీనుడగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టకు నిమిత్తముగా, ఆవిషయసుఖానుభవమందును శ్రమను జూపుచున్నాడు.

శ్లో॥ ఆత్మాభిముఖధీవృత్తౌ స్వానందః ప్రతిబింబతి।
అనుభూయైనమత్రాపి త్రిపుట్యా శాంతిమాప్నుయాత్॥ ౪౪.

టీ. ఆత్మాభిముఖధీవృత్తౌ=ఆత్మా- ప్రత్యగాత్మకు, అభిముఖ-ఎదురుగా గల, ధీవృత్తౌ-బుద్ధివృత్తియందు, స్వానందః-స్వరూపభూతానందము, ప్రతిబింబతి-ప్రతిబింబించుచున్నది. అత్రాపి-ఇచ్చటను, అనగా నీకాలమందుననుట. ఏనం- ఈవిషయానందమును, అనుభూయ-అనుభవించి, త్రిపుట్యా - త్రిపుటిచేత; అనగా ననుభవిత్రనుభవానుభావ్యలక్షణముచేననుట. శాంతిం-శ్రమను, ఆప్నుయాత్ - పొందును.

తా. ప్ర. అయితే, విషయసుఖమెట్టిదో చెప్పుము? ఉ. పూర్వము జాగరణావస్థయందు విషయసంపాదనాదికముచేత దుఃఖమననుభవించి, ఆదుఃఖనివృత్తికొరకు మెత్తనిపాన్పు మొదలగు సుఖసాధనమందు శయనించినవానియొక్క బుద్ధి, అంతర్ముఖమగును. అట్టియంతర్ముఖ బుద్ధివృత్తియందు స్వరూపభూతానందము, తనయెదుటనుండెడియద్దమందు ముఖము ప్రతిబింబించినట్లు ప్రతిబింబించుచున్నది. ఇదియే విషయానందమగును. ఈకాలమందును, జీవుడీవిషయానందమననుభవించి, త్రిపుటిచేత శ్రమనుబొందును. ౧. అనుభవించెడివాడును, ౨. అనుభవంబును, ౩. అనుభవింపబడునదియు, ఈమూడును త్రిపుటియని చెప్పబడును.

శ్లో॥ తచ్ఛ్రమస్యాపనుత్త్యర్థం జీవో ధావేత్పరాత్మని।
తేనైక్యం ప్రాప్య తత్రత్యో బ్రహ్మానందస్స్వయం భవేత్॥ ౪౫.

టీ. తచ్ఛ్రమస్య=తత్-ఆత్రిపుటినిజూచుటచేతగలిగిన, శ్రమస్య-శ్రమమును, అపనోదాయ-పోగొట్టుకొనుటకొరకు, జీవః - ఆజీవుడు, పరమాత్మని, ఆనందరూపబ్రహ్మమందు, ధావేత్- శీఘ్రముగాబొందును. తేన- ఆబ్రహ్మముతోటి, ఐక్యం-తాదాత్మ్యమును, ప్రాప్య- పొంది, స్వయం - తాను, తత్రత్యః-ఆసుషుప్తియందుండెడి, బ్రహ్మానందః-బ్రహ్మానందము, భవేత్- అగును.

తా. ప్ర. అయితే, అందుచేనచ్చటనేమి? ఉ. ఆత్రిపుటినిజూచుటచేత గలిగెడిశ్రమను పోగొట్టుకొనుటకు, ఆజీవుడే ఆనందరూపబ్రహ్మమందుశీఘ్రముగా స్థితినిబొందుచున్నాడు. ఇట్లు ఆబ్రహ్మముతో నైక్యమునుబొంది, శ్రు॥ సతా సోమ్యతదా సంపన్నో భవతి॥ అనెడి శ్రుతిప్రకారము, తానును ఆసుషుప్తియందుండెడి బ్రహ్మానందమగుచున్నాడు.

అవ. ఈయుపపాదింపబడిన సౌషుప్తానందమందు శకున్యాది బహుదృ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ష్టాంతములు శ్రుతిచే జెప్పబడినవిగలవని ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ దృష్టాంతాశ్శకునిశ్శ్యేనఃకుమారశ్చమహానృపః।
మహాబ్రాహ్మణఇత్యేతేసుప్త్యానందే శ్రుతీరితాః॥ ౪౬.

టీ. శకునిః-శకునియనెడిపక్షియు, శ్యేనః-డేగయు, కుమారశ్చ-బాలుడును, మహానృపః- సార్వభౌముడును. మహాబ్రాహ్మణఇతి - బ్రహ్మవేత్తయనెడి, ఏతే-ఈ, దృష్టాంతాః-పంచదృష్టాంతములును, సుప్త్యానందే=సుప్తి-సుషుప్తియందుండెడి, ఆనందే-ఆనందవిషయమై, శ్రుతీరితాః-శ్రుతి=శ్రుతిచేత, ఈరితాః - చెప్పబడినవి.

తా. ౧. శకునియనెడిపక్షియు, ౨. డేగయు, ౩. బాలుడును, ౪. సార్వభౌముడును, ౫. మహాబ్రాహ్మణుడు=అనగా బ్రహ్మవేత్తయనెడి ఈనైదు దృష్టాంతములును, సుషుప్తియందుగల ఆనందవిషయమై, శ్రుతిచేజెప్పబడినవగును. అనగా నీనైదుదృష్టాంతములచేత సుషుప్తియందుగల ఆనందముజెప్పబడుటచేత, ఆసుషుప్తియందుసుఖములేదనెడిమతము నిరాకరింపబడెనని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, శకునిదృష్టాంతమును ప్రతిపాదించెడి శ్రుత్యర్థమును రెండుశ్లోకములచే సంక్షేపముగా జూపుచున్నాడు.

శ్లో॥ శకునిస్సూత్రబద్ధస్సన్ దిక్షువ్యాపృత్యవిశ్రమం।
అలబ్ధ్వాబంధనస్థానంహస్తస్తంభాద్యుపాశ్రయేత్॥ ౪౭.

టీ. శకునిః-శకునియనెడిపక్షి, సూత్రబద్ధస్సన్- సూత్ర- ఆధారసూత్రముచేత, బద్ధస్సన్-బంధింపబడినదగుచు, దిక్షు - తూర్పుమొదలగు దిక్కులయందు, వ్యాపృత్య - వ్యాపారముచేసి, అనగా నాహారాదిగ్రహణముకొరకు సంచరించియనుట. విశ్రమం-విశ్రమమును, అనగా విశ్రమస్థానము ననుట. అలబ్ధ్వా-పొందక, బంధనస్థానం - బంధనస్థానమగు, హస్తస్తంభాది=హస్త-చేతినియు, స్తంభాది- స్తంభాదికమును, ఉపాశ్రయేత్ - ఆశ్రయించును.

తా. ప్ర. అయితే, ఆశకునిదృష్టాంతమెట్లు? శ్రు ॥ సయథాశకునిస్సూత్రేణ ప్రతిబద్ధోదిశందిశంపతిత్వాఽన్యత్రాయతన మలబ్ధ్వాబంధనమేవోపశ్రయతే. ఏవమేవఖలుసోమ్యతన్మనోదిశందిశంపతిత్వాఽన్యత్రాయ తనమలబ్ధ్వా ప్రాణమేవోపశ్రయతే. ప్రాణబంధనంహిసోమ్యమనః॥ అనెడి ఛాందోగ్య శ్రుతివాక్యప్రకారము, చేయిస్తంభము మొదలగు స్థలమందు ఆధారసూత్రముచేత బంధింపబడిన శకునియనెడిపక్షి, ఆహారాదికమును గ్రహించెడి కొరకు, తూర్పుమొదలగుదిక్కులయందు సంచారముజేసి, ఆదిక్కులయందు విశ్రమిం

CC-0. Jangamwadi Math Collection, Digitized by eGangotri

చుటకు ఆధారస్థానమును బొందజాలక, బంధనస్థానమగు హస్తాదికము నెట్లా శ్రయించునో.

శ్లో॥ జీవోపాధిమన స్తద్వద్ధర్మాధర్మఫలా ప్తయే।
స్వప్నేజాగ్రతిచభ్రాంత్వా క్షీణేకర్మణిలీయ తే॥ ౭౮.

టీ. తద్వత్- ఆప్రకారము, జీవోపాధిమనః = జీవ- జీవునకు, ఉపాధి- ఉపాధిభూతమగు, మనః-మనస్సు, ధర్మాధర్మఫలా ప్తయే= ధర్మ-పుణ్యలక్షణ ముయొక్కయు, అధర్మ-పాపలక్షణముయొక్కయు, ఫల - ఫలములను, ఆప్త యే-పొందుటకొరకు, స్వప్నే-స్వప్నావస్థయందును, జాగ్రతిచ-జాగరణావస్థ యందును, భ్రాంత్వా-భ్రమించి, అనగా సంచరించియనుట. కర్మణి - కర్మ ము, క్షీణేసతి- క్షయించుచుండగా, లీయతే-లయించుచున్నది.

తా. ఆప్రకారమే, జీవునకు ఉపాధిభూతమగుమనంబునుపుణ్యపాపము లయొక్కఫలములగు సుఖదుఃఖముల ననుభవించెడికొరకు, స్వప్నజాగ్రదవస్థల యందు అచ్చటచ్చటసంచరించి, భోగమునిచ్చెడి కర్మముక్షయించుచుండగా, తనకుఉపాదానకారణమగు అజ్ఞానమందు లయించుచున్నది. అనగా నామనం బులయించుచుండగా నామనోసహితుడగుజీవుడు పరమాత్మయే యగుచున్నా డని పూర్వోక్తశ్రుత్యభిప్రాయము.

అవ. ఇప్పుడు, శ్యేనదృష్టాంతమునుదెలిపెడి, బృహదారణ్యవాక్యార్థము ను సంక్షేపించి చెప్పుచున్నాడు.

శ్లో॥ శ్యేనోవేగేననీడైకలంపటశ్శయితుంవ్రజేత్।
జీవస్సుప్త్యై తథాధావేద్బ్రహ్మానందైకలంపటః॥ ౭౯.

టీ. నీడైకలంపటః=నీడ-గూడునందు, ఏక-ముఖ్యమైన, లంపటః - అభి లాషగల, శ్యేనః-డేగ, శయితుం-శయనించుటకు, వేగేన - శీఘ్రముగా, వ్ర జేత్-వెళ్ళును. తథా- ఆప్రకారము, జీవః - మనోపాధికుడగు చిదాభాసుడు, బ్రహ్మానందైకలంపటః= బ్రహ్మానంద-బ్రహ్మానందమందు, ఏక - ముఖ్యమైన, లంపటస్సన్- అభిలాషవంతుడగుచు, సుప్త్యై - నిద్రకొరకు, (హృదయాకా శం) హృదయాకాశమునుగురించి, ధావేత్-శీఘ్రముగాపరుగెత్తును.

తా. ప్ర. సరి. శ్యేనదృష్టాంతమెట్లు? ఉ. డేగనైనను గరుడపక్షినైన నను, ప్రసిద్ధాకాశమందు సంచరించి శ్రమగలదగుచు రెండురెక్కలనుము డుచుకొని, శ్రమనుపోగొట్టుకొనెడి నిమిత్తమె శయనించుటకొరకు తనగూడు నందు ప్రవేశించుటకు అభిలాషగలదై, శీఘ్రముగా గూడునం దేప్రకారము ప్రవేశించునో, ఆప్రకారమే మనోపాధికుడగు జీవుడైన చిదాభాసుడును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మానందమందభిలాషగలవాడగుచు, నిద్రించుటకొఱకు శీఘ్రముగా హృదయాకాశమును బొందుచున్నాడని, శ్రు॥ తద్యథాస్మిన్నాకాశే శ్యేనోవాసుపర్ణోవా విపరిపత్యశ్రాంతస్సంహత్యపక్షౌ స్వాలయాయైవధ్రియత ఏవమేవాయంపురుషఏతస్మా ఆనందాయధావతి యత్రసుప్తోనకంచనకామం కామయతేనకంచనస్వప్నంపశ్యతి॥ అనెడి బృహదారణ్యకవాక్యము జెప్పుచున్నది.

అవ. కుమారాది దృష్టాంతత్రయమును జూపెడి, శ్రు ॥ సయథాకుమారోవామహారాజోవా మహాబ్రాహ్మణోవాఽతిఘ్నీమానందస్యగత్వా శయీతైవమేవైవఏతచ్ఛేతే॥ అనెడిబాలాకిబ్రాహ్మణవాక్యమును మూడుశ్లోకములచేత వ్యాఖ్యానము జేయుచున్నాడు.

శ్లో॥ అతిబాల స్తనంపీత్వామృదుశయ్యాగతోహసన్।
రాగద్వేషాద్యనుత్పత్తే రానందైకస్వభావభాక్॥ ౨౦.

టీ. అతిబాలః-అతిబాలుడు, స్తనం-స్తనమును, అనగాస్తన్యముననుట. పీత్వా-త్రాగి, మృదుశయ్యాగతస్సన్=మృదు-మెత్తని, శయ్యా-పాన్పును, గతస్సన్-పొందినవాడగుచు, హసన్-నవ్వుచు, రాగద్వేషాద్యనుత్పత్తేః=రాగద్వేషాది-రాగద్వేషాదులయొక్క, అనుత్పత్తేః - ఉత్పత్తిలేమివలన, అనగా రాగద్వేషాదులు లేమిచేననుట. ఆనందైకస్వభావభాక్= ఆనంద - ఆనందమే, ఏక-ముఖ్యమైన, స్వభావ-స్వభావమును, భాక్ - పొందినవాడగును.

తా. శిశువు, కంఠపర్యంతము స్తన్యపానముచేసి, మృదుత్వాదిగుణముగలపాన్పునందు పండుకొనినవాడగుచు, నాదియనెడి ఇత్యాది జ్ఞానశూన్యత్వముచేత రాగద్వేషాదులులేనివాడై, సుఖమూర్తిగానే స్థితిని బొందుచున్నాడు.

శ్లో॥ మహారాజస్సార్వభౌమస్సంతృప్తస్సర్వభోగతః।
మానుషానందసీమానంప్రాప్యానందైకమూర్తిభాక్॥ ౨౧.

టీ. సార్వభౌమః- సార్వభౌముడగు, మహారాజః - మహారాజు, మానుషానందసీమానం=మానుషానంద - మనుష్యానందములయొక్క, సీమానం- అంతమును, ప్రాప్య-పొంది, సర్వభోగతః-సర్వభోగములవలన, సంతృప్తస్సన్-తృప్తిగలవాడగుచు, ఆనందైకమూర్తిభాక్ = ఆనంద ఆనందమే, ఏక - ముఖ్యమైన, మూర్తి - స్వరూపమును, భాక్-పొందినవాడగును.

తా. మరియు, సార్వభౌముడగుమహారాజు, విశదబుద్ధి గలవాడైనను సర్వమానుషానందములతోగూడిన వాడగుటవలన, తృప్తిగలవాడై ప్రార్థింపదగినదిలేమిచేత రాగాదిరహితుడగుచు, ఆనందమూర్తిగానే స్థితినిబొందుచున్నాడు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ మహావిప్రో బ్రహ్మవేదీ కృతకృత్యత్వలక్షణాం।
విద్యానందస్యపరమాం కాష్ఠాంప్రాప్యావతిష్ఠతే॥ ౫౨.

టీ. (యథా) ఏప్రకారము, బ్రహ్మవేదీ - ప్రత్యగభిన్న బ్రహ్మసాక్షాత్కారవంతుడగు, మహావిప్రః - మహాబ్రాహ్మణుడు, కృతకృత్యత్వలక్షణాం- కృతకృత్యత్వలక్షణము గలిగినట్టియు, విద్యానందస్య- విద్యానందముయొక్క, పరమాం-శ్రేష్ఠమగు, కాష్ఠాం-దశను, ప్రాప్య-పొంది, అవతిష్ఠతే- స్థితినిబొందుచున్నాడో, (తథా) ఆప్రకారము, సుప్తోపి-సుషుప్తినిబొందినవాడును, ఆనందరూపః-ఆనందరూపనుగలవాడగుచు, తిష్ఠతి- స్థితినిబొందుచున్నాడు.

తా. మరియు, ప్రత్యగభిన్న బ్రహ్మసాక్షాత్కారవంతుడగు మహాబ్రాహ్మణుడు, (నేనుకృతకృత్యుడననెడి) ఈరూపముగల విద్యానందముయొక్క పరమావధియగు జీవన్ముక్తత్వమును బొందినవాడగుచు, ఏప్రకారముగా పరమానందస్వరూపస్థితిని బొందుచున్నాడో, ఆప్రకారము సుషుప్తినిబొందినవాడును ఆనందరూపస్థితిని బొందుచున్నాడని తెలియవలెను.

అవ. ఈదృష్టాంతత్రయోదాహరణతాత్పర్యము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ముగ్ధబుద్ధాతిబుద్ధానాం లోకేసిద్ధాసుఖాత్మతా।
ఉదాహృతానామన్యేతు దుఃఖినోనసుఖాత్మకాః॥ ౫౩.

టీ. ఉదాహృతానాం- ఉదాహరింపబడినవారిలో, లోకే- లోకమందు, ముగ్ధబుద్ధాతిబుద్ధానాం-ముగ్ధ-వివేకశూన్యులలో నతిబాలునకును, బుద్ధ- వివేకులలో సార్వభౌమునకును, అతిబుద్ధానాం - అతివివేకులలో నానందాత్మసాక్షాత్కారవంతునకును, సుఖాత్మతా-సుఖరూపత్వము, సిద్ధా-సిద్ధమగును. అన్యేతు- ఇతరులో, దుఃఖినః- దుఃఖవంతులగుదురు. సుఖాత్మకాః - సుఖరూపులు, న-కారు.

తా. ప్ర. అయితే, ఈకుమారాదులు ముగ్గురుమాత్రము శ్రుతిచేదృష్టాంతీకరింపబడుటకును, ఇతరులుదృష్టాంతీకరింపబడమికిని గారణమేమి?. ఉ.లోకమందువివేకశూన్యులయందు నతిబాలుడుసుఖియనియు, వివేకులయందుసార్వభౌముడు సుఖియనియు, అతివివేకులయందు ఆనందాత్మ సాక్షాత్కారవంతుడే సుఖియగుననియు, ఇతరులో, సర్వదారాగాదికమును గలిగియుండుటవలన, సుఖవంతులుగారని, పూర్వోక్తకుమారాది దృష్టాంతములు మూడును శ్రుతిచే నుదాహరింపబడినవని యభిప్రాయము.

అవ. దార్ష్టాంతిక శ్రుతివాక్య తాత్పర్యము నిప్పుడు చెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ కుమారాదివదేవాయం బ్రహ్మానందైకతత్పరః।
స్త్రీపరిష్వక్తవద్వేదనబాహ్యంనాపిచాంతరం॥ ౫౪.

టీ. అయం- ఈసుషుప్తినిబొందినపురుషుడు, కుమారాదివదేవ-అతిబా లాదికమువలెనే, బ్రహ్మానందైకతత్పరః=బ్రహ్మ-బ్రహ్మస్వరూపమగు, ఆనం ద-ఆనందమునందు, తత్పరః-ఆసక్తుడగుచు, అనగా బ్రహ్మానందమును బొంది నవాడగుచుననుట. స్త్రీపరిష్వక్తవత్ = స్త్రీ- ప్రియస్త్రీతోటి, పరిష్వక్తవత్- ఆలింగనమును బొందినవానివలె, బాహ్యం- బాహ్యమును, నవేద - ఎరుగడు. ఆంతరమపిచ- అంతరంబును, న-ఎరుగడు.

తా. ప్ర. సరి. ఈచెప్పబడినవారు సుఖవంతులగుదురు. అందుచేబ్రక్ళ తమంమలాభమేమి? ఉ. అతిబాలసార్వభౌమ బ్రహ్మవేత్తలుముగ్ధురును, ఏప్ర కారముగా నానందవంతులగుదురో, ఆప్రకారం బీసుషుప్తినిబొందినవాడును, బ్రహ్మానందమును బొందినవాడగుచున్నాడు. మరియు, లోకమందు కామియ గువాడు ప్రియస్త్రీతోటి ఆలింగనమును బొందినవాడగుచు బాహ్యాభ్యంతర విషయజ్ఞానము లేమివలన సుఖమూర్తియగునట్లు, ఈజీవుడు సుషుప్తియందు పర మాత్మతో నైక్యమునుబొందినవాడగుచు, బాహ్యాదివిషయజ్ఞానము లేమివలన, యానందరూపుడే యగుచున్నాడని, శ్రు॥ తద్యథాప్రియయాస్త్రియాసం పరి ష్వక్తోనబాహ్యంకించనవేదనాంతరమేవమేవాయం పురుషః ప్రాజ్ఞే ఆత్మనాసం పరిష్వక్తోబాహ్యంకించన వేదనాంతరం ॥ అనెడి జ్యోతిర్బ్రాహ్మణవాక్యము చెప్పుచున్నది.

అవ. ఇచ్చట దృష్టాంతదార్ష్టాంతికవాక్యములయందుగల బాహ్యాభ్యం తరశబ్దములకు వివక్షితార్థమును క్రమముగా నిప్పుడు చూపుచున్నాడు.

శ్లో॥ బాహ్యంరథ్యాదికంవృత్తం గృహకృత్యంయథాంతరం।
తథాజాగరణంబాహ్యం నాడీస్థస్స్వప్నఆంతరః॥ ౫౫.

టీ. రథ్యాదికం- రథ్యాదికమగు, వృత్తం-వృత్తాంతము, యథా- ఏప్ర కారము, బాహ్యం-బాహ్యమగునో, గృహకృత్యం - గృహకృత్యము, యథా- ఏప్రకారము, అంతరం-అంతరమగునో, తథా-ఆప్రకారము, జాగరణం- జా గరణము, బాహ్యం-బాహ్యమగును. నాడీస్థః- జాగ్రద్వాసనచేత నాడీమధ్య మందుస్ఫురించెడి, ఆంతరః- అంతరప్రపంచము, స్వప్నః - స్వప్నమని చెప్ప బడును.

తా. ఏప్రకారముగా రథ్యాదికమగు వృత్తాంతము బాహ్యమగునో, గృ హకృత్యమాంతరమగునో, ఆప్రకారమే జాగరణము బాహ్యమగుననియు, జా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్రదార్ధ్వాసనచేత నాడీమధ్యమందుస్ఫురించెడి యాంతరప్రపంచము స్వప్నమని యుం జెప్పబడును.

అవ. జీవుడు, సుషుప్తియందు బ్రహ్మానందరూపముగా స్థితినిబొందుచున్నాడనెడి ఈవిషయమందు,యుక్తిప్రదర్శనపరమగు, శ్రు॥ అత్రపితాఽపితా భవతి॥ అనెడి యిత్యాదిశ్రుతి తాత్పర్యము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ పితాపిసుప్తావపితేత్యాదౌ జీవత్వవారణాత్।
సుప్తౌబ్రహ్మైవనోజీవ స్సంసారిత్వాఽసమీక్షణాత్॥ ౫౬.

టీ. సుప్తౌ-సుషుప్తియందు, పితాపి- తండ్రియు, అపితేత్యాదౌ-తండ్రి గాడనిచెప్పెడి యిత్యాదిశ్రుతివాక్యమందు, జీవత్వవారణాత్=జీవత్వ-జీవభావ ముయొక్క, వారణాత్-నివారణమువలన, అనగా జీవత్వము నివారింపబడుట చేననుట. సుప్తౌ-సుషుప్తియందు, బ్రహ్మైవ-బ్రహ్మమేయగును. జీవత్వాసమీక్షణాత్=జీవత్వ - జీవభావముయొక్క, అసమీక్షణాత్ - అదర్శనమువలన, జీవః-జీవుడు, నో-కాడు.

తా. మరియు, ఈసుషుప్తియందు, అధ్యాసము జేసెడి పితృత్వాది జీవధర్మములు, శ్రు॥ అత్రపితాఽపితాభవతి॥ అనెడి యిత్యాదిశ్రుతిచేతనే నివారింపబడుటవలన, సుషుప్తియందు బ్రహ్మమేయగును. మరియు, సుషుప్తియందు జీవత్వము స్ఫురింపకపోవుచుండగా బ్రహ్మస్వరూపమే శేషించుచున్నదని తెలియవలెను.

అవ. ఇప్పుడు, సమనంతరవాక్యతాత్పర్యమును వ్యాఖ్యానము జేయుచున్నాడు.

శ్లో॥ పితృత్వాద్యభిమానోయస్సుఖదుఃఖాకరస్సహి।
తస్మిన్నపగతేతీర్ణస్సర్వాన్ శోకాన్ భవత్యయం॥ ౫౭.

టీ. పితృత్వాద్యభిమానః- పితృభావాదిదేహాభిమానము, యః- ఎద్దిగలదో, సహి-అదియే, సుఖదుఃఖాకరః= సుఖదుఃఖ - సుఖదుఃఖములకు, ఆకరః-మూలమగుసంసారమగును. తస్మిన్- ఆసంసారము, అపగతేసతి - లేకపోవుచుండగా, అయం-ఈపురుషుడు, సర్వాన్- సకలములగు, శోకాన్-దుఃఖములను, తీర్ణః-దాటినవాడు, భవతి - అగుచున్నాడు.

తా. ప్ర. అయితే, సుషుప్తియందు పితృత్వాద్యభిమానము లేకపోయినను, సుఖిత్వాదిసంసారము లేదాయేమి? ఉ. పితృత్వాది దేహాభిమానమెద్దిగలదో, అదియేసుఖదుఃఖములకు మూలమగు సంసారమగును. గనుక, ఆదేహాభిమానము లేకపోవుచుండగా నీపురుషుడు సర్వదుఃఖములను దాటుచున్నాడని,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రు॥ తీర్ణోహితదాసర్వాన్ శోకాన్ హృదయస్యభవతి ॥ అనెడి సమనంతర శ్రుతివాక్యము జెప్పుచున్నది. అనగా సంసారము దేహాభిమానమును మూలము గాగలదగుటవలన, ఆదేహాభిమానము సుషుప్తియందు లేమిచేత సంసారంబును లేదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు కైవల్యశ్రుత్యర్థమును పఠించుచున్నాడు.

శ్లో॥ సుషుప్తికాలేసకలేవిలీనేతమసావృతః।
సుఖరూపముపైతీతిబ్రూతేహ్యాథర్వణీశ్రుతిః॥ ౫౮.

టీ. సుషుప్తికాలే-సుషుప్తికాలమందు, సకలే - జాగ్రదాదిలక్షణముగల ప్రపంచము, విలీనేసతి- ప్రకృతియందు విలయమును బొందుచుండగా, తమసా-ఆప్రకృతిచేత, ఆవృతః-కప్పబడినజీవుడు, సుఖరూపం - బ్రహ్మమును, ఉపైతీతి-పొందుచున్నాడని, ఆథర్వణీశ్రుతిః - కైవల్యశ్రుతివాక్యము, బ్రూతేహి-చెప్పుచున్నదేను.

తా. ప్ర. అయితే, ఈయుదాహరింపబడిన శ్రుతివాక్యములచేత సుషుప్తియందు సుఖప్రాప్తి, మొదటనే చెప్పబడలేదేమి? ఉ. సుషుప్తికాలమందు జాగ్రదాదిలక్షణముగల సకలప్రపంచంబును, తనకు ఉపాదానకారణభూతమగు తమఃప్రధానప్రకృతియందు విలయమునుబొందుచుండగా, జీవుడాప్రకృతిచేత గప్పబడినవాడగుచు సుఖరూపమగు బ్రహ్మమునుబొందుచున్నాడని,ఈకైవల్యశ్రుతిచెప్పుచున్నది. గనుక, సుషుప్తియందుగల సుఖప్రాప్తిని, కైవల్యశ్రుతిమొదటనే దెలుపుచున్నదని యభిప్రాయము.

అవ. ఈయర్థము కేవలశ్రుతిప్రసిద్ధమేగాక, సర్వానుభవసిద్ధమైయున్నదని, ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ సుఖమస్వాప్సమత్రాహంనచైకించిదవేదిషం।
ఇతిసుప్తేసుఖాజ్ఞానేపరామృశతిచోత్థితః॥ ౫౯.

టీ. ఉత్థితః-సుషుప్తినుంచిమేల్కొనిలేచినవాడు, అత్ర - ఈసుషుప్తియందు, అహం-నేను, సుఖం-సుఖముగా, అస్వాప్సమితి - నిద్రించితిననియు, కించిద్వై- కొంచెమైనను, నావేదిషమితిచ - ఎరుగకుంటినని, సుప్తే-సుషుప్తియందుగల, సుఖాజ్ఞానే=సుఖ-సుఖంబును, అజ్ఞానే - అజ్ఞానంబును, అనగా సుఖాజ్ఞానములను రెంటినినుట. పరామృశతి - స్మరించుచున్నాడు.

తా. మరియు, సుషుప్తినుంచి మేల్కొనిలేచినవాడు, నేనింతకాలము సుఖముగా నిద్రించితిననియు, ఈసుషుప్తియందు కొంచెమైన నెరుగకుంటినని, ఈ ప్రకారముగా నిద్రాకాలసంబంధములగు సుఖాజ్ఞానములను రెంటిని స్మరించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నాడు. గనుక, సుషుప్తియందు సుఖముగలదని తెలియబడుచున్నది.

శ్లో॥ పరామర్శోఽనుభూతేఽస్తీత్యాసీదనుభవస్సదా।
చిదాత్మత్వాత్స్వతోభాతి సుఖమజ్ఞానధీస్తతః॥ ౬౦.

టీ. అనుభూతే- అనుభవవిషయమందు, పరామర్శః - స్మరణజ్ఞానము, అస్తీతి-కలదనెడియీహేతువువలన, తదా - ఆసుషుప్తికాలమందు, అనుభవః-సుఖాజ్ఞానానుభవము, ఆసీత్-ఉండెను. సతః-సద్వస్తువుయొక్క, సుఖం - స్వరూపభూతానందము, చిదాత్మత్వాత్ - స్వప్రకాశ చిద్రూపముగలదగుటవలన, భాతి-స్ఫురించుచున్నది. తతః- ఆస్వప్రకాశసుఖబలమువలన, అజ్ఞానధీః= అజ్ఞాన-సుఖమునావరించెడి యజ్ఞానముయొక్క, ధీః-ప్రతీతిగలుగుచున్నది.

తా. ప్ర. అయితే, స్మరణజ్ఞానమప్రమాణమగుటవలన, ఆస్మరణజ్ఞానబలముచేత సుషుప్తియందుగల సుఖసిద్ధియెట్లుగలుగును? ఉ. అనుభవింపబడినవిషయమందు స్మరణజ్ఞానము గలుగునేగాని, అనుభవింపబడని విషయమందు స్మరణజ్ఞానముగలుగదనెడి ఈహేతువువలన, ఆసుషుప్తియందు సుఖాజ్ఞానానుభవముగలదని తెలియవలెను. ప్ర. అయితే, సుషుప్తియందు జ్ఞానసాధనములగు మనస్సహితేంద్రియములన్నియు, విలయమును బొందుటచేత, అనుభవసిద్ధియెట్లుగలుగును? ఉ. అయితే సుషుప్తియందు, ౧. సుఖానుభవ సాధనములేదనిచెప్పెదవో, లేక, ౨. సుషుప్తియందుగల అజ్ఞానానుభవసాధనములేదనిచెప్పెదవోచెప్పుము. సద్వస్తువుయొక్క స్వరూపభూతసుఖము, స్వప్రకాశచిద్రూపత్వముగలదగుటచేత, ఆసుఖానుభవము, ఇతరసాధనాపేక్షనపేక్షింపదు. గనుక, మొదటిపక్షముగూడదు. మరియు, అట్టిస్వప్రకాశసుఖబలమువలననే, ఆసుఖమునాదరించిన అజ్ఞానముయొక్క ప్రతీతిసిద్ధించుచున్నది. గనుక, ద్వితీయపక్షంబునుంగూడదని తెలియవలెను.

శ్లో॥ బ్రహ్మవిజ్ఞానమానందమితివాజసనేయినః।
పఠంత్యతస్స్వప్రకాశంసుఖంబ్రహ్మైవనేతరత్॥ ౬౧.

టీ. వాజసనేయినః-వాజసనేయులు, బ్రహ్మ - బ్రహ్మము, విజ్ఞానం-విజ్ఞానరూపముగలదనియు, ఆనందమితి- ఆనందరూపముగలదనియు, పఠంతి-పఠించుచున్నారు. అతః-ఆకారణమువలన, స్వప్రకాశం-స్వప్రకాశరూపముగల, సుఖం-ఆనందము, బ్రహ్మైవ - బ్రహ్మమేయగును. ఇతరత్-ఇతరమైనది, న - కాదు.

తా. ప్ర. అయితే, సుషుప్తియందుగల సుఖమునకు, స్వప్రకాశసుఖత్వముగలిగియున్నను. ప్రమాణము లేమివలన (౫౯) వ శ్లోకమునందు జెప్పబడిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మరూపత్వము సంభవింపదుగదా? ఉ. బ్రహ్మము విజ్ఞానరూపముగలదని యు, ఆనందరూపముగలదని, శ్రు॥ విజ్ఞానమానందంబ్రహ్మ॥ అనియిట్లు బృహ దారణ్యకశ్రుతివాక్యము చెప్పుచున్నది. అందుచేత సుషుప్తియందు స్వప్రకాశ రూపముగల సుఖము, బ్రహ్మమేయగుగాని ఇతరమైనదిగాదని తెలియవలెను.

శ్లో॥ యదజ్ఞానంతత్రలీనౌతౌవిజ్ఞానమనోమయౌ।
తయోర్హి విలయావస్థా నిద్రాజ్ఞానంచసైవహి॥ ౬౨.

టీ. యత్-ఏ, అజ్ఞానం-అజ్ఞానముగలదో, తత్ర-ఆయజ్ఞానమందు, తౌ- ఆరెండైన, విజ్ఞానమనోమయౌ-విజ్ఞానమనోమయకోశములు, లీనౌ - లయించు చున్నవి. హి-ఏకారణమువలన, తయోః-ఆవిజ్ఞానమనోమయములయొక్క, విల యావస్థా- విలయావస్థ, నిద్రా-నిద్రయనిచెప్పబడునో, సైవహి- ఆనిద్రయే, అజ్ఞానంచ- అజ్ఞానమనియుం జెప్పబడును.

తా. ప్ర. అయితే, అనుభవస్మరణములు రెండును, ఏకాధికరణత్వని యమముగలవగుటచేత (నేనుసుఖముగా నింతకాలమునిద్రించితిననియు, నేను సుషుప్తియందు కొంచెమైన నెరుగకుంటిననిఁ) ఇట్లు సుషుప్తియందుగల సుఖాజ్ఞా నములు రెండును విజ్ఞానమయశబ్దవాచ్యుడగు జీవునిచేత స్మరింపబడుచుండుట వలన, ఆజీవుడే, సుషుప్తియందుగల సుఖాదికముననుభవించుచున్నాడని చెప్ప రాదాయేమి? ఉ. నేనుసుషుప్తియందు కొంచెమైన నెరుగకుంటిననెడి స్మరణ ముచేదప్ప, మఱియొకవిధముచే దెలియబడనిదగుచుండెడి, యేయజ్ఞానముగల దో, ఆయజ్ఞానమందు, ప్రమాతృప్రమాణత్వముచేత ప్రసిద్ధములగు, విజ్ఞానమ నోమయకోశములు రెండును, విజ్ఞానత్వ మనోమయత్వాకారమును విడిపించి, తమకు కారణమగు అజ్ఞానరూపముగా స్థితినిబొందుచున్నవి. అందుచేత,ఆవిజ్ఞా నమయోపాధికుడగుజీవుడు, సుషుప్తియందుగల సుఖాజ్ఞానముల ననుభవించు చుండలేదని తెలియవలెను. అనగానాజీవునకు నుపాధిగ్రైనెనట్టియు, అజ్ఞానకా ర్యమైనట్టి విజ్ఞానమయంబజ్ఞానమందు విలయమునుబొందుటచేత, విజ్ఞానమయ శబ్దవాచ్యుడగుజీవుడు, సుషుప్తియందుగల సుఖాదుల ననుభవించుచున్నవాడు గాడని యభిప్రాయము. ఇందుకు ఉపపత్తినిజెప్పెదవినుము. వా ॥ విజ్ఞానవిరతి స్సుప్తిః॥ అనిచెప్పబడిన ప్రకారము ఆవిజ్ఞాన మనోమయములయొక్క విలయా వస్థ, నిద్రయనిచెప్పబడుచున్నది. ప్ర- అయితే, ఆవిజ్ఞానమనోమయములురెం డును నిద్రయందేవిలయమును బొందుచున్నవని చెప్పందగదాయేమి? ఉ. ఆనిద్ర యే, విద్వాంసులచేత నజ్ఞానమని వ్యవహరింపబడుచున్నది. గనుక, ఆవిజ్ఞాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనోమయములు రెండును అజ్ఞానమంచే విలయమును బొందుచున్నవని తెలియవలెను.

శ్లో॥ విలీనఘృతవత్పశ్చాత్స్యాద్విజ్ఞానమయోఘనః।
విలీనావస్థఆనందమయశబ్దేనకథ్యతే॥ ౬౩.

టీ. విలీనఘృతవత్ = విలీన- లీనమునుబొందిన, ఘృతవత్ - నేయివలె, పశ్చాత్-పిమ్మట, విజ్ఞానమయః-విజ్ఞానమయకోశము, ఘనః- ఘనీభవించినది, స్యాత్-అగును. విలీనావస్థః= విలీన-విజ్ఞానమయము విలయమునుబొందిన, అవస్థః-అవస్థ, ఆనందమయశబ్దేన - ఆనందమయ శబ్దముచేత, కథ్యతే - చెప్పబడుచున్నది.

తా. ప్ర. అయితే, సౌషుప్తసుఖాద్యనుభవకాలమందు లేని విజ్ఞానమయమునకు ప్రబోధగలుగుచుండగా, ఆసుషుప్తియందుగల సుఖాదిస్మరణంబెట్లుగలుగును? ఉ. అగ్నిసంబంధాదికముచేత లీనమునుబొందిననేయి, పిమ్మట వాయ్వాదిసంబంధవశమువలన, ఏప్రకారముగా ఘనీభవించుచున్నదో,ఆప్రకారమే జాగ్రదాదులయందు భోగమునిచ్చెడి కర్మముయొక్క క్షయవశమువలన నిద్రారూపముచేత లీనమునుబొందిన యంతఃకరణము, మరల భోగప్రద కర్మవశమువలన ప్రబోధయందు విజ్ఞానాకారముగా ఘనీభవించుచున్నది. అందుచేత నాయంతఃకరణోపాధికుడగు ఆత్మయు, విజ్ఞానమయత్వముచేత ఘనీభవించుచున్నాడు. ఆయాత్మయే, పూర్వము విలయావస్థ నుపాధిగాగలవాడగుచు, ఆనందమయశబ్దముచేత జెప్పబడుచున్నాడని తెలియవలెను. అనగా విలయావస్థయందును, ఆవిజ్ఞానమయ స్వరూపమునకు నాశములేమివలన, విలయావస్థనుపాధిగాగల ఆనందమయరూపముచేత ననుభవించెడి ధర్మంబును, మరియు, విజ్ఞానశబ్దముచే జెప్పదగినఘనీభావము నుపాధి గలిగియుండుటచేత స్మరించెడిధర్మంబును, ఈరెండు నొక్కడగుఆత్మకు ఘటించునని యభిప్రాయము.

అవ. విజ్ఞానమయము విలయమును బొందిన అవస్థ, ఆనంద మయమని చెప్పబడినయర్థమునే, యిప్పుడు స్పష్టీకరించు చున్నాడు.

శ్లో॥ సుప్తిపూర్వక్షణేబుద్ధి వృత్తిర్యాసుఖబింబితా।
సైవతద్బింబసహితా లీనానందమయస్తతః॥ ౬౪.

టీ. సుప్తిపూర్వక్షణే=సుప్తి-సుషుప్తికి, పూర్వక్షణే - పూర్వక్షణమందు, యా-ఏయంతర్ముఖియగు, బుద్ధివృత్తిః-బుద్ధివృత్తి, సుఖబింబితా= సుఖ-స్వరూపభూతసుఖముయొక్క, బింబితా- ప్రతిబింబయుక్తమగుచున్నదో, తతః - అనం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తరమందు, తద్బింబసహితా=తద్బింబ- ఆప్రతిబింబముతోఁటి, సహితా- కూడి నట్టి, సైవ-ఆబుద్ధివృత్తియే,లీనాసతీ-నిద్రారూపముగా లీనమునుపొందినదగుచు, ఆనందమయః - ఆనందమయమని చెప్పబడుచున్నది.

తా. సుషుప్తికి బూర్వక్షణమందు, ఏయంతర్ముఖియగుబుద్ధివృత్తి,స్వరూపభూతసుఖ ప్రతిబింబయుక్తమగుచున్నదో, అనంతరమందు ఆప్రతిబింబసహితమగు ఆవృత్తియేనిద్రారూపముగా లయించినదగుచు, ఆనందమయమని చెప్పబడుచున్నది.

అవ. ఇట్లు ఆనందమయ స్వరూపమునుజూపి, ఆయానందమయమునకే ప్రబోధకాలమందు విజ్ఞానమయరూపముచేత స్మర్తృత్వము సిద్ధించెడికొఱకు, ఆసుషుప్తికాలమందు సుఖానుభవమును దెలుపుచున్నాడు.

శ్లో॥ అంతర్ముఖోయఆనంద మయోబ్రహ్మసుఖంతదా।
భుఙ్క్తేచిద్బింబయుక్తాభి రజ్ఞానోత్పన్నవృత్తిభిః॥ ౬౫.

టీ. అంతర్ముఖః - సుఖప్రతిబింబ సహితాంతర్ముఖబుద్ధివృత్తిజనిత సంస్కారసహితా జ్ఞానోపాధిగల, యః-ఏ, ఆనందమయః - ఆనందమయుఁడుగలఁడో, (సః) ఆయానందమయుఁడు, తదా-ఆసుషుప్తికాలమందు, బ్రహ్మసుఖం-స్వరూపభూతసుఖమును, చిద్బింబయుక్తాభిః = చిత్ - ప్రత్యగాత్మయొక్క, బింబ-ప్రతిబింబమగు చిదాభాసునితోఁటి, యుక్తాభిః-కూడియున్నట్టి, అజ్ఞానోత్పన్నవృత్తిభిః=అజ్ఞాన - అజ్ఞానమువలన, ఉత్పన్న-పుట్టిన, వృత్తిభిః - సుఖాది గోచరవృత్తులచేత, అనగా సత్వపరిణామ విశేషములచేననుట. భుఙ్క్తే - అనుభవించుచున్నాఁడు.

తా. మరియు, సుఖప్రతిబింబసహితమగు అంతర్ముఖబుద్ధి వృత్తిజనిత సంస్కారముతోఁగూడినట్టి యజ్ఞానోపాధికుఁడగు, ఏయానందమయుఁడుగలఁడో, ఆయానందమయుఁడు, ఆసుషుప్తికాలమందు స్వరూపభూత బ్రహ్మసుఖమును, చిదాభాససహితములైనట్టియు, అజ్ఞానమువలన బుట్టినట్టి సుఖాదిగోచర సత్వపరిణామవిశేషములగు వృత్తులచేత, అనుభవించుచున్నాఁడు.

శ్లో॥ అజ్ఞానవృత్తయస్సూక్ష్మా విస్పష్టాబుద్ధివృత్తయః।
ఇతివేదాంతసిద్ధాంతపారగాఃప్రవదంతిహి॥ ౬౬.

టీ. అజ్ఞానవృత్తయః=అజ్ఞాన=అవిద్యయొక్క, వృత్తయః- వృత్తులు, సూక్ష్మాః-సూక్ష్మములగును. బుద్ధివృత్తయః=బుద్ధి - బుద్ధియొక్క, వృత్తయః-వృత్తులు, విస్పష్టాః - మిక్కిలిస్పష్టత్వమును బొందినవగును. ఇతి - ఈప్రకారము,


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేదాంత సిద్ధాంతపారగాః - వేదాంత సిద్ధాంత పారగులు, ప్రవదంతిహి- చెప్పుదురు.

తా. ప్ర. అయితే, జాగరణమందువలె, ఆసుషుప్తియందు నేనుసుఖము ననుభవించుచున్నాననెడి యభిమానమేకారణముచే గలుగలేదో చెప్పుము? ఉ. ఆసుషుప్తియందుగల అజ్ఞానవృత్తులు, జాగరణమందుగల బుద్ధివృత్తులవలె స్పష్టత్వముగలనిగాక, సూక్ష్మములగుటవలన, నేనుసుఖము ననుభవించు చున్నాననెడి యభిమానమప్పుడు గలుగలేదని తెలియవలెను. ప్ర. అయితే, ఇది దేనివలన దెలియబడుచున్నదో చెప్పుము? ఉ. ఈప్రకారముగా, వేదాంత సిద్ధాంత రహస్యవేత్తలగు మునులు జెప్పుదురు.

శ్లో॥ మాండూక్యతాపనీయాది శ్రుతిష్వేతదతిస్ఫుటం।
ఆనందమయభోక్తృత్వం బ్రహ్మానందేచభోగ్యతా॥ ౬౭.

టీ. ఏతత్ - ఈవిషయము, మాండూక్యతాపనీయాదిశ్రుతిషు = మాండూక్య- మాండూక్యోపనిషత్తునందును, తాపనీయాదిశ్రుతిషు - తాపనీయాది శ్రుతులయందును, అతిస్ఫుటం-మిక్కిలిస్పష్టముగా జెప్పబడియున్నది. (అతః) ఆకారణమువలన, ఆనందమయభోక్తృత్వం-ఆనందమయ- ఆనందమయునకు, భోక్తృత్వం- భోక్తృత్వంబును, బ్రహ్మానందే - బ్రహ్మానందమందు, భోగ్యతాచ - భోగ్యత్వంబునుం గలదు.

తా. ప్ర. అయితే, ఆనందమయాత్మ, సూక్ష్మములగు అవిద్యావృత్తుల చేత బ్రహ్మానందము ననుభవించు చున్నాడనుటయందు ప్రమాణమేమి? ఉ. ఈవిషయము, మాండూక్యతాపనీయాది శ్రుతులయందు, అతిస్ఫుటముగా జెప్పబడియున్నది. కనుక, ఆనందమయాత్మ, భోక్తయగుననియు, బ్రహ్మానందను భోగ్యమగుననియుం దెలియవలెను. భోక్తయనగా ననుభవించెడివాడగును. భోగ్యమనగా ననుభవింపదగినదగును.

అవ. ఇప్పుడు, మాండూక్యాదిశ్రుతిగతవాక్యార్థమును పఠించుచున్నాడు.

శ్లో॥ ఏకీభూతస్సుషుప్తస్థః ప్రజ్ఞానఘనతాంగతః।
ఆనందమయఆనందభుక్చేతోమయవృత్తిభిః॥ ౬౮.

టీ. సుషుప్తస్థః - సుషుప్తియందుండెడి, అనగాసుషుప్త్యభిమానియైనట్టి యనుట. ఏకీభూతః- విజ్ఞానాద్యుపాధివిలయముచేత నేకాకారత్వమునుబొందిన, ఆనందమయః-ఆనందమయాత్మ, ప్రజ్ఞానఘనతాం - ప్రజ్ఞానఘనత్వమును, గతస్సన్-పొందినవాడగుచు, చేతోమయవృత్తిభిః = చేతోమయ-చైతన్యప్రచురములగు, అనగాచిత్ప్రతిబింబ సహితములైనట్టియనుట. వృత్తిభిః- వృత్తుల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేత, ఆనందభుక్=ఆనంద- స్వరూపభూతానందమును, భుక్ - అనుభవించెడి వాడగును.

తా॥ సుషుప్త్యభిమానియైనట్టియు, విజ్ఞానాద్యుపాధివిలయముచేత నేకాకారత్వమును బొందినట్టియు, ప్రజ్ఞానఘనత్వమును బొందినట్టి ఆనందమయాత్మ, చిత్ప్రతిబింబసహిత వృత్తులచేత స్వరూపభూతానందమును అనుభవించుచున్నాడని, శ్రు॥ సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో హ్యానందభుక్చేతోముఖః॥ ఇత్యాదిమాండూక్యాది శ్రుతిచెప్పుచున్నది.

అవ॥ ఆమాండూక్య శ్రుతివాక్యమందు గల, (ఏకీభూతః) అనెడి పదముయొక్కయర్థము నిప్పుడు చెప్పుచున్నాడు॥

శ్లో॥ విజ్ఞానమయముఖ్యైర్యో రూపైర్యుక్తః పురాధునా।
సలయేనైకతాం ప్రాప్తో బహుతండులపిష్టవత్॥ ౬౫.

టీ. యః-ఏయాత్మ, పురా - పూర్వము, అనగా జాగరణావస్థయందనుట॥ విజ్ఞానమయముఖ్యైః-విజ్ఞానమయము మొదలగు, రూపైః - ఆకారవిశేషములతోటి, యుక్తః-కూడియుండెనో, సః-ఆయాత్మ, అధునా - ఇప్పుడు, అనగా సుషుప్తికాలమందనుట॥ లయేన-విజ్ఞానమనంబు మొదలగు ఉపాధివిలయముచేత, ఏకతాం - ఏకాకారత్వమును, ప్రాప్తస్సన్- పొందినవాడగుచు, బహుతండులపిష్టవత్=బహు - అనేకములగు, తండుల- బియ్యపుగింజలవలన గలిగిన, పిష్టవత్- పిండివలె, (భవతి) అగుచున్నాడు॥

తా. ఏయాత్మ, పూర్వముజాగరణావస్థయందు, ఆయీయాత్మ, విజ్ఞానమయుడగుననియు, మనోమయుడగుననియు, ప్రాణమయుడగుననియు, చక్షుర్మయుడగుననియు, శ్రోత్రమయుడగుననియు, పృధివీమయుడగుననియు, ఆపోమయుడగుననియు, వాయుమయుడగుననియు, ఆకాశమయుడగుననియు, తేజోమయుడగుననియు, అతేజోమయుడగుననియు, కామమయుడగుననియు, అకామమయుడగుననియు, క్రోధమయుడగుననియు, అక్రోధమయుడగుననియుంజెప్పెడి, శ్రు॥ సవాఅయమాత్మాబ్రహ్మ విజ్ఞానమయోమనోమయః ప్రాణమయశ్చక్షుర్మయశ్శ్రోత్రమయః పృథివీమయ ఆపోమయోవాయుమయ ఆకాశమయస్తేజోమయో అతేజోమయః కామమయోఽకామమయః క్రోధమయోఽక్రోధమయః। ఇత్యాది శ్రుతిచే జెప్పబడిన ఆకారవిశేషములతోటి కూడినవాడాయెనో, ఆయాత్మయే, ఇప్పుడు సుషుప్తియందు విజ్ఞానమనంబు మొదలగు ఉపాధివిలయముచేత, అనేకములగు బియ్యపుగింజలవలన గలిగెడి పిండివలె, ఏకాకారత్వమునుబొందినవాడగుచున్నాడని తెలియవలెను॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. పూర్వోక్తశ్రుతియందుగల ప్రజ్ఞానఘనశబ్దార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రజ్ఞానానిపురాబుద్ధివృత్తయోఽథఘనోఽభవేత్।
ఘనత్వంహిమబిందూనాముదగ్దేశేయథాతథా॥ ౭౦.

టీ. ఉదగ్దేశే- ఉత్తరదేశమందు, హిమబిందూనాం = హిమ-మంచుయొక్క, బిందూనాం-బిందువులకు, ఘనత్వం - ఘనభావము, యథా - ఏప్రకారమో, తథా-ఆప్రకారము, పురా-పూర్వముగల, అనగా జాగ్రదాదికమందున్నట్టియనుట. ప్రజ్ఞానాని- ప్రజ్ఞానములు, అనగా ఘటాది గోచరబుద్ధివృత్తులనుట. అథ-సుషుప్తికాలమందు, ఘనః-చిద్రూపముచే నేకరూపము, అభవత్-అయినది.

తా. పూర్వము జాగ్రదాదికమందు ప్రజ్ఞానశబ్దముచే జెప్పదగిన, ఏఘటాదిగోచరబుద్ధివృత్తులుగలవో, ఆ బుద్ధివృత్తులు సుషుప్తికాలమందు ఘటాదివిషయము లేకపోవుచుండగా, చిద్రూపముచే నేకరూపమగును. ఇందుకు దృష్టాంతము జెప్పెదవినుము. ఉత్తరదేశమందు మంచునీటిబిందువులు ఘనీభవించినట్లు, అనగా నేకాకారముగా గెడ్డకట్టినట్లు, జాగ్రదాదికమందుగల ఘటాదిగోచర బుద్ధివృత్తులును, సుషుప్తికాలమందు ఘనీభవించుచున్నవని తెలియవలెను.

అవ. ఇప్పుడు, ప్రజ్ఞానఘనశబ్దార్థనిరూపణ ప్రసంగమువలన లభించిన అర్థమను కొంచెమును జెప్పుచున్నాడు.

శ్లో॥ తద్ఘనత్వంసాక్షిభావందుఃఖాభావంప్రచక్షతే।
లౌకికాస్తార్కికాయావద్దుఃఖవృత్తివిలోపనాత్॥ ౭౧.

టీ. లౌకికాః-లౌకికులును, తార్కికాః- తార్కికులును, యావద్దుఃఖవృత్తివిలోపనాత్ = యావద్దుఃఖవృత్తి - సర్వదుఃఖ వృత్తులయొక్క, విలోపనాత్- విలయమువలన, తద్ఘనత్వం=తత్ - ఆఘటాదిగోచరబుద్ధివృత్తులయొక్క, ఘనత్వం-ఘనత్వమగు, అనగా చిద్రూపముచే నేకరూపమైనట్టియనుట. సాక్షిభావం- సాక్షిత్వమును, దుఃఖాభావం=దుఃఖ-దుఃఖనుయొక్క, అభావం-లేమినిగా, ప్రచక్షతే - చెప్పుచున్నారు.

తా. వేదాంతములయందు సాక్షిత్వముచేత జెప్పబడెడి, యేయీప్రజ్ఞానఘనత్వముగలదో, అదియే శాస్త్రసంస్కారములేని లౌకికులును, శాస్త్రిలగుతార్కికాదులును దుఃఖాభావమును-గా జెప్పుదురు. ప్ర. వారట్లు జెప్పుటకు గారణమేమి? ఉ. సర్వదుఃఖవృత్తులును, సుషుప్తికాలమందు విలయమును బొందుచున్నవి. గనుక, అట్లు చెప్పుదురని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. పూర్వముదాహరింపబడిన శ్రుతియందు గల, చేతోముఖశబ్దార్థము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ అజ్ఞానబింబితాచిత్స్యాన్ముఖమానందభోజనే।
భుక్త్వంబ్రహ్మసుఖంత్యక్త్వాబహిర్యాత్యథకర్మణా॥ ౬౨.

టీ. ఆనందభోజనే=ఆనంద - సౌషుప్త బ్రహ్మానందమును, భోజనే-భుజియించుటయందు, ముఖం-సాధనము, అజ్ఞానబింబితా=అజ్ఞాన-అజ్ఞానవృత్తియందు, బింబితా-ప్రతిబింబించిన, అనగా బ్రతిబింబరూపముగా నున్నట్టియనుట. చిత్-చైతన్యము, స్యాత్-అగును. (జీవః) ఆనందమయ రూప జీవుడు, కర్మణా-పుణ్యపాపలక్షణ కర్మముచేత,అనగా కర్మపాశముచేననుట. భుక్తం-అనుభవింపబడిన, బ్రహ్మసుఖం-బ్రహ్మానందమును, త్యక్త్వా- విడిపించి, అథ-పిమ్మట, బహిః-బాహ్యమును, అనగా జాగ్రదాదికముననుట. యాతి= పొందుచున్నాడు. అనగా జాగ్రదాదికమునకు బోవుచున్నాడనుట.

తా. మరియు, సౌషుప్తబ్రహ్మానందము ననుభవించుటయందు, అజ్ఞానవృత్తియందు ప్రతిబింబించిన చైతన్యమే సాధనమగును. ప్ర. అయితే, సుషుప్తియందు ఆనందమయరూప జీవునిచేత బ్రహ్మానంద మనుభవింపబడినయెడల, ఆబ్రహ్మానందమును దేనిచేత విడిపించి దుఃఖభూమియైన బాహ్యమందుండెడి జాగ్రదాదికమునుగురించి వచ్చుచున్నదో చెప్పుము?. ఉ. ఆయానందమయరూప జీవుడు, పుణ్యపాపలక్షణ పాశబద్ధుడగుటవలన, ఆకర్మముచేత ప్రేరేపింపబడినవాడగుచు, బ్రహ్మానందము సాక్షాత్కరింపబడినదైనను ఆబ్రహ్మానందమును విడిపించి, పిమ్మట జాగ్రదాదికమునుగురించి బోవుచున్నాడని తెలియవలెను.

అవ. ఇప్పుడు, కైవల్యశ్రుతివాక్యమును పఠించుచు, దానియభిప్రాయమును జెప్పుచున్నాడు.

శ్లో॥ కర్మజన్మాంతరేఽభూద్యత్తద్యోగాద్బుధ్యతేపునః।
ఇతికైవల్యశాఖాయాం కర్మజోబోధ ఈరితః॥ ౬౩.

టీ. జన్మాంతరే- పూర్వజన్మమందు. యత్-ఏ, కర్మ-ధర్మాధర్మలక్షణకర్మముగలదో, తద్యోగాత్-తత్ - ఆకర్మముయొక్క, యోగాత్-సంబంధమువలన, పునః-మరల, బుధ్యతేతి- జాగ్రదాదికమును బొందుచున్నాడని, కైవల్యశాఖాయాం-కైవల్యోపనిషత్తునందు, కర్మజః- కర్మముచేగలిగెడి, బోధః-జాగ్రదాద్యనుభవము,అనగాజాగ్రదాదిప్రాప్తియనుట. ఈరితః-చెప్పబడెను.

తా. ప్ర. అయితే, ఈయర్థము దేనిచేదెలియబడుచున్నదో చెప్పుము?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. పూర్వజన్మమందు ఏపుణ్యాపాపలక్షణ కర్మముగలదో, ఆ కర్మసంబంధము వలన, నానందమయజీవుడే మరల జాగ్రదాదికమును బొందుచున్నాడని, శ్రు॥ పునశ్చజన్మాంతరకర్మయోగాత్సఏవజీవస్స్వపితిప్రబుద్ధః॥ అనియిట్లు కైవల్య శ్రుతివాక్యమందు వినబడుచున్నది.

అవ. సుషుప్తియందు బ్రహ్మానంద మనుభవింప బడుచున్నదనెడి విష యమై,. ఇప్పుడు లింగమును చెప్పుచున్నాడు.

శ్లో॥ కించిత్కాలంప్రబుద్ధస్య బ్రహ్మానందస్యవాసనా।
అనుగచ్ఛేద్యతస్తూష్ణీమాస్తేనిర్విషయస్సుఖీ॥ ౭౪.

టీ. యతః- ఏకారణమువలన, (ప్రబోధాదౌ) - జాగ్రదాదియందు, నిర్విషయోపి- విషయానుభవము లేనివాడైనను, సుఖీసన్ - సుఖవంతుడగుచు, తూష్ణీం-ఊరక, ఆస్తే-స్థితినిబొందుచున్నాడో, (అతః) ఆకారణమువలన, ప్రబుద్ధస్య-జాగరణమునుబొందినవానికి, కించిత్కాలం - స్వల్పకాల పర్యంతము, బ్రహ్మానందస్య- బ్రహ్మానందముయొక్క, వాసనా - సంస్కారము, అనుగచ్ఛేత్-అనుసరించిపోవుచున్నది. అనగా వచ్చుచున్నదనుట.

తా. మరియు, జాగరణమును బొందినవానికిని స్వల్పకాల పర్యంతము సుషుప్తియందనుభవింపబడెడి బ్రహ్మానందముయొక్క సంస్కారముగలిగియున్నది. ప్ర. దేనివలన నిది తెలియబడుచున్నదో చెప్పుము? ఉ. ఏకారణముచేత జాగ్రదాదియందు పురుషుడు విషయానుభవము లేనివాడైనను సుఖముగలవాడగుచు, తూష్ణీంభావమును బొందుచున్నాడో, ఆకారణముచేత సుషుప్తియందనుభవింపబడిన బ్రహ్మానందముయొక్క సంస్కారము జాగ్రదాదియందు గలదని తెలియవలెను.

శ్లో॥ కర్మభిః ప్రేరితఃపశ్చాన్నానాదుఃఖానిభావయన్।
శనైర్విస్మరతిబ్రహ్మానందమేషోఖిలోజనః॥ ౭౫.

టీ. ఏషః-ఈ, అఖిలః-సకలమగు, జనః-జనము, కర్మభిః - కర్మముల చేత, ప్రేరితస్సన్- ప్రేరేపింపబడినదగుచు, పశ్చాత్ - పిమ్మట, నానాదుఃఖాని-నానావిధదుఃఖములను, భావయన్ - అనుసంధానము జేయుచు, అనగా ననుభవించుచుననుట. శనైః - మెల్లగా, బ్రహ్మానందం - బ్రహ్మానందమును, విస్మరతి- మరచుచున్నది.

తా. ప్ర. అయితే, ప్రాణివర్గమంతయు, సుషుప్తియం దనుభవింపబడి బ్రహ్మానందముయొక్క సంస్కారవంతమగు తూష్ణీంభావమందెందుచే నుండ లేదో చెప్పుము? ఉ. ఈసర్వప్రాణివర్గంబును, పూర్వోక్తకర్మములచేత ప్రేరే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సింపబడినదగుచు, పిమ్మట నానావిధ దుఃఖములననుభవించుచు, మెల్లగాసుషుప్తియందనుభవింపబడిన బ్రహ్మానందమును మరచుచున్నది.

అవ. ఇక బ్రహ్మానందవిషయమై ద్వేషము చేయరాదని ఇప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రాగూర్ధ్వమపినిద్రాయాః పక్షపాతోదినేదినే।
బ్రహ్మానందేనృణాంతేన ప్రాజ్ఞోస్మిన్ వివదేతకః॥ ౭౬.

టీ. దినేదినే- ప్రతిదినమందు, నిద్రాయాః - నిద్రయొక్క, ప్రాక్-పూర్వంబును, ఊర్ధ్వమపి-పిమ్మటను, నృణాం-జనులకు, బ్రహ్మానందే-బ్రహ్మానందమందు, పక్షపాతః- స్నేహముగలదు. తేన - ఆకారణముచేత, అస్మిన్-ఈ ఆనందమందు, ప్రాజ్ఞః-ప్రజ్ఞగలవాడు, కః-ఎవడు, వివదేత- వివాదమును బొందును. అనగా ద్వేషించెడివాడెవ్వడును లేడనుట.

తా. ప్రతిదినమందును మనుష్యులకు నిద్రారంభమందును, నిద్రాంత్యమందును బ్రహ్మానందమందు స్నేహముగలదు. ప్ర. అట్లు స్నేహముగలదనిచెప్పుటకుగారణమేమోచెప్పుము?. ఉ. ఏకారణముచేత జనులునిద్రాదియందు మెత్తనిపాన్పు మొదలగు సుఖసాధనములను సంపాదించుచున్నారో, మరియు, ఆనిద్రాంత్యమందు ఆమృదుశయ్యాది సుఖసాధనమును విడుచుటకునశక్తులై తూష్ణీంభావమును బొందుచున్నారో, ఆకారణముచేత, ఈ ఆనందములేదని బుద్ధిమంతుడెవ్వడును వివాదమును బొందడని తెలియవలెను.

అవ. ఇప్పుడు, పూర్వవాది, ఒకచోద్యమును జేయుచున్నాడు.

శ్లో॥ ననుతూష్ణీంస్థితౌబ్రహ్మానందశ్చేద్భాతిలౌకికాః।
అలసాశ్చరితార్థాస్స్యుశ్శాస్త్రేణగురుణాత్రకిం॥ ౭౭.

టీ. నను- ఓయీ,తూష్ణీంస్థితౌ- తూష్ణీంస్థితియందు, బ్రహ్మానందః- బ్రహ్మానందము, భాతిచేత్-స్ఫురించుచున్నయెడల, లౌకికాః - లౌకికులును, అలసాశ్చ-మందబుద్ధిగలవారును, చరితార్థాః=చరిత-ఆచరింపబడిన, అర్థాః-పురుషార్థముగలవారు, అనగా కృతార్థులనుట. స్యుః-అగుదురు. అత్ర- ఈబ్రహ్మానందానుభవవిషయమై, శాస్త్రేణ-వేదాంతశాస్త్రముచేతను, గురుణా- ఆచార్యునిచేతను, కిం-ప్రయోజనమేమి. అనగా ప్రయోజనములేదనుట.

తా. ప్ర. అయితే, ఓ అద్వైతసిద్ధాంతీ, గురుశుశ్రూషాదికముచేతను, వేదాంతశాస్త్రాభ్యాసముచేతను లభింపదగిన బ్రహ్మానందానుభవము, తూష్ణీంస్థితినిబొందినమాత్రముచేత లభించెడి పక్షమందు, శాస్త్రసంస్కారములేనిలౌకికులును, అలసులును కృతార్థులగుదురని చెప్పవలసివచ్చును. అప్పుడు గురు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుశ్రూసాదిపూర్వకముగా జేయబడెడి వేదాంతశ్రవణ మననాదికము వ్యర్థము గాదాయేమి? అనియిట్లు పూర్వవాది యాక్షేపించెనని తెలియవలెను.

అవ. ఇప్పుడు, సిద్ధాంతి ప్రత్యుత్తరమును జెప్పుచున్నాడు.

శ్లో॥ బాఢంబ్రహ్మేతివిద్యాశ్చే త్కృతార్థాస్తావతైవతే।
గురుశాస్త్రేవినాత్యంతంగంభీరంబ్రహ్మవేత్తికః॥ ౭౮.

టీ. బాఢం-సరియగుగాక. బ్రహ్మేతి - ఈయానందము బ్రహ్మమని, విద్యాశ్చేత్-ఎరిగినయెడల, తావతైవ-అట్లెరుగుటచేతనే, తే-వారు,కృతార్థాః-కృతార్థులగుదురు. కః - ఏ పురుషుడు, గురుశాస్త్రే - గురుశాస్త్రములను, వినా-విడచి, అత్యంతం-నాశరహితమైనట్టియు, గంభీరం-అవాఙ్మానసగోచరమైనట్టి, బ్రహ్మ-బ్రహ్మమును, వేత్తి- ఎరుగగలడు. అనగా నెవ్వడు నెరుగజాలడనుట.

తా. ఓపూర్వవాదీ, నీవు జెప్పినది నిశ్చయమేయగును. అయినను, ఈ యానందము బ్రహ్మమని యెరుగుటచేతనే కృతార్థులగుదురు. మరియు, అవాఙ్మానసగోచరమైనట్టియు, సర్వజ్ఞ సర్వాత్మరూపమగు బ్రహ్మమును, గురుశాస్త్రములనువిడచి, మరియేయుపాయముచేత నెవ్వడు నెరుగజాలడు. అనగా నిది బ్రహ్మానందమనెడి జ్ఞానముగలుగుచుండగా కృతార్థత్వముగలుగుననియు, అట్టిజ్ఞానము గురుశుశ్రూసాదికముచేతదప్ప, మరిదేనిచేతం గలుగనే గలుగదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు ※ అనువాదపూర్వకముగా బరిహాసముతో ప్రత్యుత్తరమును జెప్పుచున్నాడు.

శ్లో॥ జానామ్యహంత్వదుక్త్యాద్యకుతోమేనకృతార్థతా।
శృణ్వత్రత్వాదృశోవృత్తం ప్రాజ్ఞంమన్యస్యకస్యచిత్॥ ౭౯.

టీ. అహం-నేను, త్వదుక్త్యా = త్వత్ - నీయొక్క, ఉక్త్యా-వాక్యముచేత, అద్య-ఇప్పుడు, జానామి-బ్రహ్మమునెరిగితిని. కుతః - ఏకారణమువలన, మే-నాకు, కృతార్థతా - కృతార్థత్వము, అనగా కృతార్థత్వబుద్ధియనుట. నేతి చేత్-కలుగలేదనియంటివేని, అత్ర-ఈవిషయమై, ప్రాజ్ఞంమన్యస్య- పండితుడననితలచినట్టి, త్వాదృశః - నీవంటి, కస్యచిత్- ఒకానొకనియొక్క, వృత్తం- వృత్తాంతమును, శృణు - చెప్పెద వినుము.

---

※ అనువాదము = ఒకప్రమాణముచే నొకచోట జెప్పబడియున్నదానిని మరియొకచోట మరల జెప్పుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే, ఇప్పుడు నీవాక్యమువలన బ్రహ్మానందమా నెరిగినట్టినాకు, కృతార్థత్వబుద్ధి, లభింపబడలేదేమి? ఉ. ఈవిషయమై, నేనుపండితుడననితలచినట్టి నీవంటి యొకానొక పురుషునియొక్క వృత్తాంతమును జెప్పెద వినుము.

అవ. ఆవృత్తాంతమునే, ఇప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ చతుర్వేదవిదేదేయమితిశృణ్వన్నవోచత।
వేదాశ్చత్వార ఇత్యేవం వేద్మిమేదీయతాంధనం॥ ౮౦.

టీ. (కశ్చిత్) ఒకానొకడు, చతుర్వేదవిదే=చతుర్వేద - నాలుగువేదములను, విదే-ఎరిగినవానికొరకు, దేయమితి- ఈధనమివ్వదగినదనెడివాక్యమును, శృణ్వన్-వినినవాడగుచు, వేదాః-వేదములు, చత్వారఇతి - నాలుగని, ఏవం-ఈప్రకారము, వేద్మి-ఎరుగుదును. మే- నాకు, ధనం - ధనము, దీయతామితి-ఇచ్చెదవుగాకయని, అవోచత- చెప్పెను.

తా. ఒకానొకడు, చతుర్వేదముల నెరిగినవానికి, ఈబహుధనమివ్వదగినదగుననెడి ఇవ్విధవాక్యమునువిని, వేదములు నాలుగనెడి ఈవాక్యముచేతనే, నేనెరుగుదుననియు, అందువలన నాకు ధనమిమ్మనియుం జెప్పెను. అటువలెనే నీవునని యభిప్రాయము.

శ్లో॥ సంఖ్యామేవైషజానాతి నతువేదానశేషతః।
యదితర్హిత్వమప్యేవం నాశేషంబ్రహ్మవేత్సిహి॥ ౮౧.

టీ. ఏషః-వీడు, సంఖ్యామేవ - వేదసంఖ్యనే, జానాతి - ఎరుగును. వేదాన్-వేదములను, అశేషతస్తు- నిశ్శేషముగానో, నయది - ఎరుగడనియంటివేని, తర్హి-అట్లైనయెడల, త్వమపి-నీవును, ఏవం - ఈప్రకారము, బ్రహ్మ-బ్రహ్మమును, అశేషం - సంపూర్ణముగా, నవేత్సిహి-ఎరుగవు.

తా. ప్ర. అయితే, వేదములు నాలుగని యెరిగినవాడు, వేదగతసంఖ్యనేయెరుగునుగాని, వేదములయొక్క స్వరూపము నెరుగడుగదా? ఉ. సరి. అట్లైనయెడల చతుర్వేదముల నెరిగితినని తలచినవానివలె, నీవును సంపూర్ణముగా బ్రహ్మము నెఱుగనే యెఱుగవు.

అవ. ఇప్పుడు, పూర్వవాది, యొక యాక్షేపమును జేయుచున్నాడు.

శ్లో॥ అఖండైకరసానందే మాయాతత్కార్యవర్జితే।
అశేషత్వసశేషత్వవార్తావసరఏవకః॥ ౮౨.

టీ. మాయాతత్కార్యవర్జితే=మాయా- మాయయు, తత్ - ఆమాయయొక్క, కార్య-కార్యములును, వర్జితే-లేనట్టి, అఖండైకరసానందే=అఖండ-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సజాతీయవిజాతీయస్వగతభేదశూన్యమగు, ఏకరస - చిద్రూపమగు, ఆనందే- బ్రహ్మమందు, అశేషత్వసశేషత్వవార్తావసరఏవ- అశేషత్వ - సంపూర్ణత్వము యొక్కయు, సశేషత్వ- సంపూర్ణత్వములేమియొక్కయు, వార్తా-వార్తకు,అవసరఏవ- అవకాశమే, కః-ఏది. అనగా నవకాశము లేదనుట.

తా. ప్ర. అయితే, వేదసంఖ్యకంలెం వేదస్వరూపభేదము వలె మాయ.తత్కార్యరహితమైనట్టియు, సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యమగు ఆనందరూపబ్రహ్మమందు, తెలియబడకుండెడి యంశము లేమివలన సంపూర్ణ జ్ఞానము లేదనెడిమాట కవకాశమెట్లు గలుగును?

అవ. ఇప్పుడు, బ్రహ్మజ్ఞానమందును సంపూర్ణత్వాదికమును జూపుట కొరకు, బ్రహ్మము నెరుగుదునని జెప్పెడివానిని వికల్పించి యడుగుచున్నాడు.

శ్లో॥ శబ్దానేవపఠస్యాహో తేషామర్థంచపశ్యసి।
శబ్దపాఠేర్థబోధస్తేసంపాద్యత్వేనశిష్యతే॥ ౭౩.

టీ. శబ్దానేవ-అఖండైకరసాద్వితీయ సచ్చిదానందాది శబ్దములనే, పఠసి-పఠించితివో, ఆహో-లేక, తేషాం-ఆశబ్దములయొక్క, అర్థంచ- అర్థమును, అనగా స్వగతాదిభేదశూన్యత్వాదికము ననుట. పశ్యసి - ఎరిగితివోచెప్పుము. శబ్దపాఠే- శబ్దములనుమాత్రము జదివినపక్షమందు, తే- నీకు, అర్థబోధః-అర్థజ్ఞానము, సంపాద్యత్వేన-సంపాదింపదగినదిగా, శిష్యతే - శేషించుచున్నది.

తా. ఉ. ఓయి పూర్వవాదీ, నీవు, ౧. అఖండైకరసమద్వితీయ సచ్చిదానందరూప మిత్యాదిశబ్దములనే పఠించితివో, లేక, ౨. ఆశబ్దములయొక్కయర్థమగు స్వగతాదిభేదశూన్యత్వాదికము నెరిగితివోచెప్పుము. శబ్దములనుమాత్రము పఠించిన పక్షమందు, నీకు అర్థజ్ఞానము సంపాదింపదగినదిగా శేషించుచున్నది. గనుక, మొదటిపక్షమందు జ్ఞానమునకు సంపూర్ణత్వములేదని తెలిసికొనుము.

అవ. ద్వితీయపక్షమందును జ్ఞానసంపూర్ణత్వము లేదని, ఇప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ అర్థేవ్యాకరణాద్బుద్ధేసాక్షాత్కారోవశిష్యతే।
స్యాత్కృతార్థత్వధీర్యావత్తావద్గురుముపాస్వభో॥ ౭౪.

టీ. భో-ఓయీ, వ్యాకరణాత్-వ్యాకరణమువలన, అర్థే-అర్థము, బుద్ధేసతి - తెలియబడుచుండగా, అనగా వేదాంతశాస్త్రాదికముచేత బరోక్షజ్ఞానము గలుగుచుండగాననుట. సాక్షాత్కారః- బ్రహ్మసాక్షాత్కారము, అవశిష్యతే-శేషించుచున్నది. యావత్ - ఎంతకాలమునకు; కృతార్థత్వధీః - కృతా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్థత్వబుద్ధి, స్యాత్-కలుగునో, తావత్- అంతపర్యంతము, గురుం- ఆచార్యున్, ఉపాస్స్వ - ఉపాసింపుము.

తా. ఓయిపూర్వవాదీ, వ్యాకరణ వేదాంత శాస్త్రాదికముచేత శబ్దార్థమునెరిగి పరోక్షజ్ఞానము సంపాదింపబడినను, సంశయాది నిరాసముచేత బ్రహ్మమును సాక్షాత్కరించుకొనుట, శేషించుచున్నది. ప్ర. అయితే, జ్ఞానమునకు సంపూర్ణత్వ మెప్పుడుగలుగునో చెప్పుము? ఉ. ఎంతకాలమునకు కృతార్థత్వబుద్ధిగలుగునో, అంతపర్యంతము, గురుమూర్తినుపాసింపుము. అనగా నేను గృతార్థుడనైతినని బుద్ధి, ఎప్పుడుగలుగునో, అప్పుడు జ్ఞానమునకు సంపూర్ణత్వముగలిగెనని దెలియదగినదని యభిప్రాయము.

అవ. ఇట్లు ప్రాసంగికమును ముగించి, ప్రకృతము ననుసరించి చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆస్తామేతద్యత్రయత్రసుఖంస్యాద్విషయైర్వినా।
తత్రసర్వత్రవిద్ధ్యేతాంబ్రహ్మానందస్యవాసనాం॥ ౮౫.

టీ. ఏతత్- ఈవిషయము, ఆస్తాం-ఉండుగాక. యత్రయత్ర- ఏయేకాలమందు, అనగాతూష్ణీంభావాదికమందనుట. విషయైర్వినా - విషయములచేతగాక, అనగా స్త్రీపుష్పాది విషయానుభవములేకనేయనుట. సుఖం-సుఖము, స్యాత్-కలుగునో, తత్రసర్వత్ర - ఆయాకాలమందంతటను, ఏతాం - ఈ, బ్రహ్మానందస్య- బ్రహ్మానందముయొక్క, వాసనాం - వాసననుగా, విద్ధి-తెలిసికొనుము.

తా. ఈప్రసంగ మట్లుండుగాక. ఏయేకాలమందు తూష్ణీం భావాదికమందు, విషయానుభవములేకనే సుఖముగలుగునో, ఆయాసుఖము విషయమువలన గలిగినదిగామిచేతను, సామాన్యాహంకారముచేత గప్పబడుటవలనను, వాసనానందమునుగా దెలియవలెను.

అవ. ఇటు బ్రహ్మానంద వాసనానందములనుజూపి, ఇప్పుడానందత్రైవిధ్య నియమనముకొరకు, నలుబదినాల్గవశ్లోకమందు జెప్పబడిన విషయానందమునే మరల జెప్పుచున్నాడు.

శ్లో॥ విషయేష్వపిలబ్ధేషు తదిచ్ఛోపరమేసతి।
అంతర్ముఖమనోవృత్త్యా వానందఃప్రతిబింబతి॥ ౮౬.

టీ. లబ్ధేషు - లభింపబడిన, విషయేష్వపి - విషయములయందును, తదిచ్ఛోపరమేసతి=తత్- ఆయావిషయములయొక్క, ఇచ్ఛా-కోరిక, ఉపరమే-సతి-శమించుచుండగా, అంతర్ముఖమనోవృత్త్యా = అంతర్ముఖ - అంతర్ముఖియగు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనోవృత్తౌ-మనోవృత్తియందు, ఆనందః-ఆనందము, ప్రతిబింబతి- ప్రతిబింబిం చుచున్నది.

తా. మరియు, స్త్రీపుష్పాది విషయలాభమువలన, ఆయా విషయేచ్ఛ, యెప్పుడు శమించునో, అప్పుడప్పుడు మనంబంతర్ముఖ మగుచుండగా, నామ నంబునందు, ఏస్వాత్మానందమః ప్రతిబింబించుచున్నదో, ఇదియే విషయానం దమగునని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, ఫలితమును జెప్పుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మానందోవాసనాచ ప్రతిబింబ ఇతిత్రయం।

అంతరేణజగత్యస్మిన్నానందోనాస్తికశ్చన॥ ౭౭.

టీ. బ్రహ్మానందః - బ్రహ్మానందంబును, వాసనాచ - వాసనానందంబు ను, ప్రతిబింబఇతి- విషయానందమనెడి, త్రయం- మూటిని, అనగా నానంద త్రయమనుట. అంతరేణ-తప్ప, అస్మిన్--ఈ, జగతి - జగంబునందు, ఆనం దః-ఆనందము, కశ్చన- ఎద్దియు, నాస్తి - లేదు.

తా. పూర్వోక్తప్రకారముగా, స్వప్రకాశత్వముచేత సుషుప్తియందు దోచుచుండెడి, ౧. ఏబ్రహ్మానందముగలదో, మరియు, తూష్ణీంస్థితియందు స్త్రీ పుష్పాదివిషయానుభవము లేకనే తోచుచుండెడి, ౨. ఏవాసనానందము గల దో, మరియు, అభీష్టవిషయలాభమువలన నంతర్ముఖమగు మనంబునందు బ్రతి బింబించిన, ౩. ఏవిషయానందముగలదో, ఈమూడానందములుతప్ప, మరి యొక యానందంబీజగంబునందు లేదని తెలియవలెను. ప్ర. అయితే, పదునొకం డవశ్లోకమందు, ౧. బ్రహ్మానందమనియు, ౨. విద్యానందమనియు, ౩. విష యానందమనియు, ఇట్లానందములు మూడు జెప్పబడెను. ఇప్పుడో, తద్విలక్ష ణములగు బ్రహ్మానందవాసనానంద విషయానందములు మూడు జెప్పబడెను. అందుచేత పూర్వోత్తరవిరోధము లేదాయేమి? మరియు, పూర్వోక్తద్వివిధానం దత్రయముకంటె, తొంభదియెనిమిదవశ్లోకమందు, ౧. నిజానందంబును,నూట యిరువదొకశ్లోకమందు, ౨. ముఖ్యానందంబునుం జెప్పబడుచున్నవి. మరియు, ద్వితీయాధ్యాయమగు, పన్నెండవప్రకరణమందు నాల్గవశ్లోకములో, ఈచెప్ప బడినవానికంటె నన్యమగు ఆత్మానంద మొకటి చెప్పబడుచున్నది. మరియు, మూడవయధ్యాయమగు త్రయోదశప్రకరణమందు మొదటి శ్లోకములో, యో గానంద మొకటి చెప్పబడుచున్నది. మరియు,మూడవయధ్యాయమగు త్రయో దశప్రకరణమందు నూటముప్పైయెదవశ్లోకములో నద్వైతానంద మొకటి చెప్పబడు చున్నది. ఇట్లనేకానందములు జెప్పబడుచుండగా, ఈశ్లోకమందు బ్రహ్మానంద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాసనానంద విషయానందములకంటె మరియొక ఆనందంబీజగంబునందులేదని యెట్లుచెప్పితిరి?. ఉ. నాల్గవయధ్యాయమగు పదునాల్గవ ప్రకరణమందు రెండ వశ్లోకములో జెప్పబడెడిప్రకారము, విద్యానందము విషయానందమువలెనే, అంతఃకరణవృత్తి విశేషరూపము గలదగుటచేత, ఆవిద్యానందము విషయానం దమం దణగియుండును. మరియు, ౧. నిజానందము, ౨. ముఖ్యానందము, ౩. ఆత్మానందము, ౪. యోగానందము, ౫. అద్వైతానందము, ఈయైదును బ్ర హ్మానందముకంటె నన్యములుగామిచేత, నాయైదానందములును బ్రహ్మానంద మం దణగియున్నవి. అదియెట్లనగా జెప్పెదవినుము. ఈయధ్యాయమందు తొం బదియెనిమిదవ శ్లోకమందు యోగలక్షణోపాయముచేత బొందదగినదని చెప్ప బడిన నిజానందమే, నూరవశ్లోకమందు జెప్పబడినప్రకారము, ఆనిజానందము బ్రహ్మానందముకంటె నభిన్నమగుటవలన, బ్రహ్మానందముకంటె భేదింపబడ దు. మరియు, అప్రకారమే ముఖ్యానందంబును బ్రహ్మానందమేయగును. అది యెట్లనగా, నెనుబదియెనిమిదవశ్లోకమందు జెప్పబడెడిప్రకారము,అముఖ్యభూ తములగు విషయానంద వాసనానందములను రెంటిని గలిగించిన బ్రహ్మానం దమే, నూటయిరువదొకశ్లోకమందు ముఖ్యానందమని చెప్పబడుటవలన, ము ఖ్యానందము బ్రహ్మానందమేయగునని తెలియవలెను. మరియు, ఆత్మానందా ద్వైతానందములురెండును బ్రహ్మానందములోనణగియున్నవి. అదియెటనగా, మూడవయధ్యాయమగు త్రయోదశప్రకరణాదియందుగల మొదటిశ్లోకప్రకార ము, ప్రథమాధ్యాయమందు యోగానందత్వముచేత జెప్పబడిన బ్రహ్మానంద మునకే, యోగానందశబ్దముచేత ననువాదపూర్వకముగా నాత్మానందత్వము నుదెలిపి, పిమ్మటద్వైతసహితమైనట్టి, ఈయాత్మానందమునకు బ్రహ్మత్వ మెట్లుగలుగుననెడి ప్రశ్నపూర్వకముగా, సద్వితీయాత్మానందమునకు బ్ర హ్మత్వము బ్రతిపాదింపబడెను. గనుక, ఆత్మానందము, బ్రహ్మానందమే య గును. మరియు, అద్వైతానందమునకు బ్రహ్మత్వమును బ్రతిపాదించుటచేత, నాయద్వైతానందము బ్రహ్మానందమేయగును. ఆకారణమువలన, ఈశ్లోక మందు జెప్పబడినప్రకారము, ౧. బ్రహ్మానందము, ౨. వాసనానందము, ౩. విషయానందము లనెడి ఈ ఆనందములు మూడేగలవని తెలియవలెను. ప్ర. అయితే, రెండవయధ్యాయమగు పన్నెండవ ప్రకరణములోని మొదటిశ్లోకమం దు జెప్పబడిన నిజానందమును, బ్రహ్మానంద వాసనానందములకంటె భేదము గానిర్దేశింపరాదుగదా? ఉ. ఒక్కటియగు బ్రహ్మానందమే, జగత్కారణత్వో పాధియొక్క యునికిలేమలభేదముచేత భేదముగా దెలుపబడుచున్నది. అదియె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టనగా, బ్రహ్మానందనిరూపణ సమయమందు, ఈ ఆనందమువలననే భూతసమూ లుబుట్టుచున్నవనిజెప్పెడి, శ్రు॥ ఆనందాద్ధ్యేవఖల్విమాని భూతానిజాయంతే॥ అనెడి యిత్యాదివాక్యముచేత, బ్రహ్మమునకు జగత్కారణత్వమును జెప్పుట వలన, మాయాసంబంధములేని బ్రహ్మమునకు జగత్కారణత్వము గూడమి చేత బ్రహ్మానందమునకు మాయాసహితత్వముగలదని దెలియబడుచున్నది. మరియు, నిజానందనిరూపణకాలమందును, తొంబదియేనిమిది మొదలగు శ్లోకములప్రకారము, సకారణమగు అహంకారముయొక్క విలయమును జెప్పుటవలన, నిజానందమునకు మాయాసంబంధము లేదు. కనుక, నిజానందమును బ్రహ్మానంద వాసనానందములకంటె భేదముగా జెప్పరాదని శంకింపదగదని యభిప్రాయము.

శ్లో॥ తథాచవిషయానందో వాసనానందఇత్యమూ।
ఆనందౌజనయన్నాస్తేబ్రహ్మానందస్స్వయంప్రభః॥ ౧౮.

టీ. తథాచ- ఆప్రకారమగుచుండగా, అనగానిట్లానందత్రైవిధ్యముగ లుగుచుండగాననుట. స్వయంప్రభః - స్వయంప్రకాశమానమగు, బ్రహ్మానందః- బ్రహ్మానందము, విషయానందః- విషయానందమనునట్టియు, వాసనానందఇతి-వాసనానందమనునట్టి, అమూ- ఈ, ఆనందౌ - ఆనందములను, జనయన్-పుట్టించుచు, ఆస్తే - స్థితినిబొందుచున్నది.

తా. ప్ర. అయితే, ఈయధ్యాయమందు, బ్రహ్మానందవివేచనమే ప్రస్తుతమగుటవలన, ఇతరములగువాసనానంద విషయానందములను బ్రతిపాదించుటచేత విరోధములేదాయేమి? ఉ. ఈప్రకారమానందత్రైవిధ్యమగుచుండగా, ఏస్వప్రకాశానందము, విషయానంద వాసనానందములను గలిగించుచున్నదో, ఆ ఆనందమును బ్రహ్మానందమునుగా నెరుగవలెను. అనగా విషయానందవాసనానందములు రెండును బ్రహ్మానందమువలన బుట్టినవగుటచేత, ఆయితరానందద్వయజ్ఞానము ప్రస్తుతమందుపయోగము గలిగియుండుటవలన, నావిషయానందవాసనానందముల సీయధ్యాయమందు జెప్పుటచేత ప్రకరణవిరోధములేదని యభిప్రాయము.

అవ. వృత్తానుసంకీర్తన పూర్వకముగా నుత్తరగ్రంథమును దెలుపుచున్నాడు.

శ్లో॥ శ్రుతియుక్త్యనుభూతిభ్యః స్వప్రకాశచిదాత్మకే।
బ్రహ్మానందేసుప్తికాలేసిద్ధేసత్యన్యథాశృణు॥ ౧౯.

టీ. శ్రుతియుక్త్యనుభూతిభ్యః = శ్రుతి-శ్రుతులవలనను, యుక్తి-యుక్తు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లవలనను, అనుభూతిభ్యః- అనుభవమువలనను, సుప్తికాలే - సుషుప్తికాలమం దు, స్వప్రకాశచిదాత్మకే- స్వయంప్రకాశ చిద్రూపమైనట్టి, బ్రహ్మానందే- బ్రహ్మానందము, సిద్ధేసతి-సిద్ధించుచుండగా, అన్యథా - మరియొకవిధముగా, అనగా జాగరణావస్థయందుననుట. శృణు- బ్రహ్మానందము నెరిగెడి యుపాయ మును జెప్పెదవినుము.

తా. పూర్వోక్తగ్రంథసందర్భముచేత సుషుప్తికాలమందు జాగ్రదాది లక్షణ సకలప్రపంచము లయించుచుండగా, జీవుడు అజ్ఞానముచేత కప్పబడి నవాడగుచు సుఖరూపబ్రహ్మమును బొందుచున్నాడని పూర్వము జెప్పబడిన, శ్రు॥ సుషుప్తికాలే సకలేవిలీనేతమోభిభూతస్సుఖరూపమేతి॥ అనెడి,౧. ఇత్యా దిశ్రుతులచేతను, మరియు, నింతకాలము నేను సుఖముగానిద్రించితిననెడి స్మ రణము, అనుభవములేకనే మరియొకవిధముగా గలుగదని జెప్పబడిన, ౨. యిత్యాదియుక్తులచేతను, మరియు, ౩. అర్థాపత్తిచే గల్పింపబడిన సుషుప్త్య నుభవముచేతను, ఈమూటిచేతను సుషుప్తియందు గల స్వప్రకాశరూపమగు బ్రహ్మానందము, సాధింపబడెను. ఇకమీదట, జాగరణావస్థయందు నేబ్రహ్మా నందమునెరిగెడి యుపాయముజెప్పబడునో, ఆయుపాయమును జెప్పెదవినుము.

అవ. ఈచెప్పబడిన బ్రహ్మానందము నెరిగెడియుపాయమునే చూపుట కు, అందుకుపోద్ఘాతముగా సనిమిత్తమగు జీవునియొక్క యవస్థాద్వయప్రాప్తి నిజాపుచున్నాడు.

శ్లో॥ యఆనందమయస్సుప్తౌసవిజ్ఞానమయాత్మతాం।
గత్వాస్వప్నంప్రబోధంవాప్రాప్నోతిస్థానభేదతః॥ ౯౦.

టీ. సుప్తౌ-సుషుప్తికాలమందు, యః-ఏ, ఆనందమయః- ఆనందమయా త్మగలడో, సః-అయానందమయాత్మ, విజ్ఞానమయాత్మతాం- విజ్ఞానమయా త్మత్వమును, గత్వా-పొంది, స్థానభేదతః- చెప్పబోయెడి స్థానవిశేషయోగము వలన, స్వప్నం- స్వప్నమునైనను, ప్రబోధంవా - జాగరణమునైనను, ప్రా ప్నోతి - పొందుచున్నాడు.

తా. సుషుప్తికాలమందు, విలీనావస్థ, ఆనందమయత్వముచేత జెప్పబడు నని చెప్పబడిన, యేఆనందమయాత్మగలడో. ఆయానందమయాత్మ, విజ్ఞా నశబ్దముచే జెప్పబడెడి బుద్ధ్యుపాధివంతుడగుటచేత విజ్ఞానమయత్వమునుబొం ది, చెప్పబోయెడి స్థానవిశేషయోగముచేత స్వప్నమునైనను, జాగరణమునై నను కర్మానుసారముగా బొందుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇప్పుడు, జాగ్రదాద్యవస్థల కుపయోగించెడి స్థానములను జూపుచున్నాడు.

శ్లో॥ నేత్రేజాగరణంకంఠే స్వప్నస్సుప్తిర్హృదంబుజే।
ఆపాదమస్తకం దేహంవ్యాప్యజాగర్తిచేతనః॥ ౯౧.

టీ. నేత్రే - నేత్రమందు, అనగా జీవుడు దేహమందంతట వ్యాపించియున్నప్పుడనుట. జాగరణం-జాగ్రదవస్థయగును. కంఠే-కంఠమందు, స్వప్నః-స్వప్నావస్థయగును. హృదంబుజే=హృత్ - హృదయమనెడి, అంబుజే - పద్మమందు, సుప్తిః-సుషుప్త్యవస్థయగును. చేతనః-జీవుడు, దేహం- స్థూలశరీరమును, ఆపాదమస్తకం - పాదము మొదలుకొని శిరస్సుపర్యంతము, వ్యాప్య- వ్యాపించి, జాగర్తి- జాగరణమును జేయుచున్నాడు.

తా. మరియు, జీవుడు, నేత్రమందున్నప్పుడు, అనగా స్థూలశరీరమందంతటనున్నప్పుడు, జాగరణమగును. మరియు, కంఠప్రదేశమందున్నప్పుడు, స్వప్నావస్థనుబొందుచున్నాడు. మరియు, హృదయకమలమందున్నప్పుడు, సుషుప్త్యవస్థలనుబొందుచున్నాడని తెలియవలెను.

అవ. దేహమును వ్యాపించియుండుననిచెప్పుటచేత వివక్షితార్థమును దృష్టాంతప్రదర్శనముచే నిప్పుడు స్పష్టము జేయుచున్నాడు.

శ్లో॥ దేహతాదాత్మ్యమాపన్నస్తప్తాయఃపిండవత్తతః।
అహంమనుష్యఇత్యేవంనిశ్చిత్యైవావతిష్ఠతే॥ ౯౨.

టీ. తప్తాయఃపిండవత్ = తప్త-కాల్చబడిన, అయఃపిండవత్- ఇనుపముద్దవలె, దేహతాదాత్మ్యం=దేహ-శరీరముతోటి, తాదాత్మ్యం-అన్యోన్యాధ్యాసమును, ఆపన్నస్సన్-పొందినవాడగుచు, తతః - ఆకారణమువలన, అహంమనుష్యఇతి - నేనుమనుష్యుడనని, ఏవం - ఈప్రకారము, నిశ్చిత్యైవ - నిశ్చయించియే, అవతిష్ఠతే - స్థితినిబొందుచున్నాడు.

తా. మరియు, కొలిమియందు అగ్నిహోత్రముచేత కాల్చబడినయినుపముద్దవలె, జీవుడు, దేహముతోటి యన్యోన్యాధ్యాసమును పొందినవాడగును. ప్ర. అయితే, జీవుడు దేహముతోటి యన్యోన్యాధ్యాసమునుబొందెననుటయందు ప్రమాణమేమి? ఉ. అన్యోన్యాధ్యాసమును బొందుటచేతనే, జీవుడు నేను మనుష్యుడనని సంశయాధిరహితజ్ఞానముచేత గ్రహించి, వ్యవహరించుచున్నాడు.

అవ. దేహతాదాత్మ్యాభిమాన హేతువుగల యవస్థాంతరములనే చూపుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ ఉదాసీనస్సుఖీదుఃఖీత్యవస్థాత్రయమేత్యసౌ।
సుఖదుఃఖేకర్మకార్యేత్వౌదాసీన్యంస్వభావతః॥ ౯౩.

టీ. అసౌ- ఈజీవుడు, ఉదాసీనఇతి-నేనుదాసీనుడననియు, సుఖీతి-సుఖిననియు, దుఃఖీతి- దుఃఖిననియు, అవస్థాత్రయం = అవస్థా - అవస్థలయొక్క, త్రయం-మూటిని, ఏతి-పొందుచున్నాడు. సుఖదుఃఖే-సుఖదుఃఖములు రెండును, కర్మకార్యే- కర్మకార్యములగును. ఔదాసీన్యంతు - ఉదాసీనత్వమో, స్వభావతః-స్వభావమువలన గలిగినదగును.

తా. మరియు, అట్లుదేహతాదాత్మ్యాభిమానమును బొందినయీజీవుడు, ౧. నేనుదాసీనుడననియు, ౨. నేనుసుఖిననియు, ౩. నేను దుఃఖిననియు, ఇట్లుమూడవస్థలం బొందుచున్నాడు. ఆమూటిలో సుఖదుఃఖములు రెండును కర్మకార్యములగును. మూడవదగు ఉదాసీనత్వము, స్వభావముచే గలిగినదగును.

అవ. నిమిత్తభేదమువలన, నాసుఖదుఃఖములకు ద్వైవిధ్యమును జెప్పుచున్నాడు.

శ్లో॥ బాహ్యభోగాన్మనోరాజ్యాత్సుఖదుఃఖేద్విధామతే।
సుఖదుఃఖాంతరాళేషుభవేత్తూష్ణీమవస్థితిః॥ ౯౪.

టీ. బాహ్యభోగాత్ = బాహ్య - స్త్రీపుష్పాదిబాహ్యవిషయములయొక్క, భోగాత్ - భోగమువలనను, మనోరాజ్యాత్ - మనోరాజ్యమువలనను అనగా సర్వదా స్త్రీపుష్పాదివిషయములను జింతించుటచేతననుట. సుఖదుఃఖే-సుఖదుఃఖములు రెండును, ద్విధామతే - ద్వివిధములగుటకు సమ్మతములగును. సుఖదుఃఖాంతరాళేషు = సుఖదుఃఖ - సుఖదుఃఖములయొక్క, అంతరాళేషు-మధ్యకాలములయందు, అనగా సుఖవృత్తియణగి దుఃఖవృత్తి బుట్టుటకంటె మధ్యమమందనుట. తూష్ణీం - ఊరక, అవస్థితిః - స్థితినిబొందినవాడు, భవేత్-అగును.

తా. మరియు, బాహ్యములగు స్త్రీపుష్పాది విషయభోగముచేతను, మనోరాజ్యముచేతను, ఆసుఖదుఃఖములు రెండునుద్వివిధములగును. ప్ర. అయితే, ఉదాసీనత్వమెప్పుడు గలుగునోచెప్పుము? ఉ. సుఖవృత్తియణగి, దుఃఖవృత్తిబుట్టుటకంటె బూర్వమందు, ఏమధ్యకాలముగలదో, ఆమధ్యకాలమందు, పురుషుడు, తూష్ణీంభావమును బొందుచున్నాడు. అదియే, ఉదాసీనత్వమగును.

అవ. దేనికొరకు జాగ్రదాదికం బుపన్యాసమ జేయబడెనో, దానినిప్పుడు చూపుచున్నాడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ నకాపిచింతామే స్త్యద్యసుఖమాస ఇతిబ్రువన్।
ఔదాసీన్యేనిజానందభావంవక్త్యఖిలోజనః॥ ౯౫

టీ. అఖిలః-సకలమగు, జనః - జనము, మే - నాకు, అద్య - ఇప్పుడు, చింతా- గృహాదివిషయమగుచింత, కాపి-ఎద్దియు, నాస్తి- లేదు. సుఖం-సుఖము గా, ఆసయితి-స్థితినిబొందుచున్నానని, బ్రువన్- చెప్పుచు, ఔదాసీన్యే-ఉదాసీనకాలమందు, నిజానందభావం = నిజానంద - స్వరూపానందముయొక్క, భావం - స్ఫూర్తిని, వక్తి - చెప్పుచున్నది.

తా. మరియు, సర్వజనంబును, ఇప్పుడు నాకుగృహాదివిషయమగుచింత తనకెద్దియులేదు. ఆకారణమువలన సుఖముగా నున్నానని చెప్పుచు,ఉదాసీనత్వకాలమందును, స్వరూపానందస్ఫూర్తిని చెప్పుచున్నది. ఆకారణమువలనజాగరణావస్థయందును నిజానందస్ఫురణముగలదని తెలియదగినదగునని యభిప్రాయము.

శ్లో॥ అహమస్మీత్యహంకారసామాన్యాచ్ఛాదితత్వతః।
నిజానందోనముఖ్యోయంకింత్వసౌతస్యవాసనా॥ ౯౬.

టీ. అహం-నేను, అస్మీతి-ఇతినని,అహంకారసామాన్యాచ్ఛాదితత్వతః= అహంకారసామాన్య- సామాన్యాహంకారముచేత, ఆచ్ఛాదితత్వతః- కప్పబడుటవలన, అయం-ఈ, నిజానందః - నిజానందత్వము, ముఖ్యః-ముఖ్యానందము, అనగా బ్రహ్మానందమనుట. న-కాదు. కింతు-మరియేమనగా, అసౌ-ఇది, తస్య- ఆబ్రహ్మానందముయొక్క, వాసనా - వాసనయగును.

తా. ప్ర. అయితే, ఔదాసీనకాలమగు తూష్ణీంభావాదికమందు స్ఫురించుచుండెడి యానందము, నిజానందభావమైనయెడల, ఆనిజానందము బ్రహ్మానందమగుటవలన, పూర్వోక్తవాసనానందముగాదుగదా? ఉ. నేను దేవదత్తుడనైతినని నెడి ఇత్యాదివిశేషములేనట్టి, ఐతిననెడి ఈరూపముగల సామాన్యాహంకారముచేత కప్పబడుటవలన, ఇదిముఖ్యమగు బ్రహ్మానందముగాదు. ప్ర. అయితే, ఆనిజానందభావమునకు రూపమేమి? ఉ. ఈనిజానందభావము,ఆబ్రహ్మానందముయొక్క వాసనయగును. అనగా వాసనానందమగునని యభిప్రాయము.

అవ. ముఖ్యానందముకంటె నన్యమగు వాసనానందముండుటయందు, దృష్టాంతము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ నీరపూరితభాండస్య బాహ్యేశైత్యంనతజ్జలం।
కింతునీరగుణస్తేననీరసత్తానుమీయతే॥ ౯౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. నీరపూరితభాండస్య= నీర- జలముచేత, పూరిత - నిండింపబడిన, భాండస్య-ఘటముయొక్క, బాహ్యే - బాహ్యమందు, అనగా బహిర్భాగస్పర్శనముచేత లభింపబడుచుండునట్టియనుట. (యత్) ఏ, శైత్యం - చల్లదనము గలదో, తత్-ఆచల్లదనము, జలం - ఘటములోపలనుండెడి జలము, న-కాదు. కింతు-మరియేమనగా, నీరగుణః= నీర- ఘటములోపలనుండెడి జలముయొక్క, గుణః- గుణమగును. తేన - ఆనీటిగుణముచేత, నీరసత్తా=నీర- ఘటములోపటనుండెడిజలముయొక్క, సత్తా-స్థితి, అనుమీయతే- ఊహింపబడుచున్నది. అనగా ననుమానప్రమాణముచేత దెలియబడుచున్నదనుట.

తా. మరియు, జలముచేతనిండింపబడిన ఘటముయొక్క బహిర్భాగస్పర్శనముచేత లభింపబడుచుండెడి, ఏశైత్యముగలదో, ఆశైత్యమునందు ద్రవత్వములేమివలన నదిజలముగాదు. ప్ర. అయితే, యదియేమి? ఉ. ఆశైత్యము ఘటమందుగల నీటిగుణమగును. ప్ర. అయితే, ఆశైత్యము నీటిగుణమనియెట్లు తెలియబడునో చెప్పుము? ఉ. ఆశైత్యముచేత, ఘటమందు గల జలంబనుమాన ప్రమాణమువలన నూహించి తెలియబడుచున్నది. ప్ర. ఆయనుమానప్రమాణ మెట్లు? ఉ. ఘటమందుపొందబడుచుండెడి ※ విమతమగు శైత్యము, శైత్యసామాన్యమగుటవలన జలమందు పొందబడుచుండెడి శైత్యమువలె, జలజన్యమగుటకుదగుచున్నదని, ఇట్లనుమానప్రమాణముచే దెలియవలెను.

శ్లో॥ యావద్యావదహంకారో విస్మృతోభ్యాసయోగతః।
తావత్తావత్సూక్ష్మదృష్టే ర్నిజానందోనుమీయతే॥ ౯౮.

టీ. అభ్యాసయోగతః - నిరోధసమాధ్యభ్యాసయోగమువలన, అహంకారః-అహంకారము, యావద్యావత్ - ఎంతయెంతమాత్రము, విస్మృతః- విస్మృతినిబొందునో, అనగా వృత్తినిలయమును బొందునోయనుట. తావత్తావత్- అంతయంతమాత్రము, సూక్ష్మదృష్టేః- సూక్ష్మదృష్టివలన, అనగా చిత్తసూక్ష్మత్వముచేననుట. నిజానందః - నిజానందము, అనుమీయతే - అనుమానప్రమాణముచే నెరుగబడుచున్నది.

తా. ప్ర. సరి. ఇట్లుచెప్పుటచేత ప్రకృతమందులాభమేమి? ఉ. ఆవాసనానందమునకును ముఖ్యానందము ననుసరించినరూపకత్వము గలిగెనని తెలియవలెను. ప్ర. అదియెట్లు? ఉ. పండితుడు, ఇంద్రియములను విషయములవలన మరలించి మనస్సునందుంచవలెననియు, ఆయింద్రియసహితవృత్తిశూన్యమ

※ విమతము= వాది ప్రతివాదు లిద్దరు వివాదపడుచుండెడి విషయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నస్సును బుద్ధియం దుంచవలెననియు, ఆయింద్రియ మనస్సహితబుద్ధిని, యహం కారమందు (మహత్తత్వమందు) ఉంచవలెననియు, అయింద్రియమనోబుద్ధి సహితహంకారమను ప్రత్యగాత్మయందుంచవలెననిజెప్పెడి, శ్రు॥ యచ్ఛేద్వాఙ్మనసీప్రాజ్ఞస్తద్యచ్ఛేద్ జ్ఞానఆత్మని। జ్ఞానమాత్మనిమహతినియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాంతరాత్మని॥ అనెడిశ్రుతిచే జెప్పబడిన నిరోధసమాధ్యభ్యాసయోగముచేత, ఎంతయెంతమాత్రము, అహమాదివృత్తివిలయవశమువలన చిత్తమునకు సూక్ష్మత్వము గలుగుచున్నదో, అంతయంతమాత్రము, నిజానందము స్ఫురించుచుండుననియనుమానప్రమాణముచేత నూహించవలెను. ప్ర. ఆయనుమానంబెట్లు? ఉ. అహంకారసంకోచవిశేషముతోగూడిన క్షణములయందు, ద్వితీయాదిక్షణభాగమెద్దిగలదో, ఆద్వితీయాదిక్షణభాగము, అహంకార సంకోచవిశేషముతోగూడిన కాలముగలదగుటవలన అహంకారసంకోచముతోగూడిన మొదటిక్షణమువలెనే, పూర్వక్షణముకంటె నధికనిజానందము నావిర్భవింపజేయునది యగునని, ఇట్లనుమానప్రమాణముచే నూహించి తెలియవలెను. ఇచ్చటసంకోచమనగా నహమాదివృత్తివిలయమని యర్థము.

శ్లో॥ సర్వాత్మనావిస్మృతస్సన్సూక్ష్మతాంపరమాంవ్రజేత్।
అలీనత్వాన్ననిద్రైషాతతోదేహోపినోపతేత్॥ ౯౯.

టీ॰ (అహంకారః) అంతఃకరణము, సర్వాత్మనా - బొత్తిగా, విస్మృతస్సన్-విస్మృతినిబొందినదగుచు, అనగా వృత్తిశూన్యము గలదగుచుననుట. పరమాం - శ్రేష్ఠమైన, అనగా నధికమైనట్టియనుట. సూక్ష్మతాం - సూక్ష్మత్వమును, వ్రజేత్-పొందును. అలీనత్వాత్ - అంతఃకరణములయింపమివలన, ఏసా-ఈస్థితి, నిద్రా-నిద్ర, న - కాదు. తతః - ఆకారణమువలన, దేహోపి-దేహంబును, నోపతేత్ - పడదు.

తా॰ ప్ర. అయితే, బుద్ధిసూక్ష్మత్వమున కవధియెద్ది? ఉ. అహంకారముబొత్తిగా వృత్తిశూన్యముగలదగుచు, అధికసూక్ష్మత్వమును బొందుచున్నది. అనగా బ్రహ్మసాక్షాత్కారమే బుద్ధిసూక్ష్మత్వమున కవధియనియభిప్రాయము. ప్ర. అయితే, అట్టియహంకారస్థితి, నిద్రకాదాయేమి? ఉ. ఆకాలమందుసర్వవృత్తులు లయించినను, అంతఃకరణస్వరూపము లయింపమిచేతను, మరియు, అంతఃకరణము కారణరూపముగా నుండుటయే సుషుప్తియని, శ్రీశంకరాచార్యులచే జెప్పబడుటవలనను, ఈస్థితి,నిద్రగాదని తెలియవలెను. ప్ర. అయితే, యిదినిద్రగాదనుటకు దగినహేతువేమి? ఉ. ఏసుషుప్త్యాదికమందు అహంకారవిలయముగలదో, ఆయాయవస్థయందు దేహము భూమిమీదపడుట, కన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడుచున్నది. ఈ బ్రహ్మనిష్ఠయందో, దేహము భూమిమీదబడమివలన, అహం కారము లయించలేదని తెలియబడుచున్నది.

అవ. ఫలితము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ నద్వైతంభాసతేనాపి నిద్రాతత్రాస్తియత్సుఖం।
సబ్రహ్మానంద ఇత్యాహ భగవానర్జునంప్రతి॥ ౧౦౦.

టీ. (యత్ర) ఏకాలమందు, ద్వైతం-ద్వైతము, నభాసతే - తోచదో, నిద్రాపి-నిద్రయు, న-లేదో, తత్ర-ఆకాలమందు, యత్-ఏ, సుఖం- సుఖము, అస్తి-కలదో, సః-అది, బ్రహ్మానందఇతి- బ్రహ్మానందమని, భగవాన్ - భగవంతుడగు కృష్ణదేవుడు, అర్జునంప్రతి - అర్జుననిగురించి, ఆహ-చెప్పెను.

తా. కనుక, ఏకాలమందు ద్వైతము స్ఫురించదో, నిద్రయురాదో, ఆకాలమందు పొందబడుచుండెడి యేసుఖముగలదో, అది బ్రహ్మానందమగును. ప్ర. అయితే, ఇది బ్రహ్మానందమని దేనివలన దెలియబడుచున్నదోచెప్పుము? ఉ. ఇది బ్రహ్మానందమని శ్రీభగవంతుడగు కృష్ణదేవుడు, తనశిష్యుడైన యర్జుననిగురించి శ్రీభగవద్గీతాశాస్త్రముయొక్క షష్ఠాధ్యాయమందు జెప్పినవాడాయెను.

అవ. ఆగీతాశాస్త్రమందేశ్లోకనుచే జెప్పెనని శంకించుకొని, ఈ యర్థమును దెలిపెడి, యాభగవద్వాక్యముల నేనిమిదింటి నిప్పుడర్థక్రమానుసారముగా బఠించుచున్నాడు.

శ్లో॥ శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యాధృతిగృహీతయా।
ఆత్మసంస్థంమనఃకృత్వానకించిదపిచింతయేత్॥ ౧౦౧.

టీ. ధృతిగృహీతయా-ధైర్యయుక్తమగు, బుద్ధ్యా- సాధనభూతబుద్ధిచేత, శనైశ్శనైః - మెల్లమెల్లగా, అనగా విచారించక దబ్బునచేయకనుట. ఉపరమేత్- మనోనిగ్రహమును జేయవలెను. మనః-మనస్సును, ఆత్మసంస్థం= ఆత్మ-ప్రత్యగాత్మయందు, సంస్థం - మంచిస్థితినిబొందినదానినిగా, కృత్వా - చేసి, కించిదపి- కొంచెమైనను, నచింతయేత్ - చింతింపరాదు.

తా. ఓయర్జునా, ధైర్యముతోగూడినట్టి సాధనభూతబుద్ధిచేత మెల్లమెల్లగా మనోనిగ్రహమును జేయవలెను. విచారింపక దబ్బున చేయరాదు. ప్ర. అయితే, యెంతపర్యంతమిట్లు మనోనిగ్రహమును జేయవలెనో చెప్పుము? ఉ. శ్రు॥ ఆత్మవేదగ్ంసర్వం సతతోన్యత్కించిదస్తి॥ అనెడి శ్రుతిప్రకారము, ఇది యంతయు ఆత్మయే యగుననియు, ఆయాత్మకంటె నన్యమైనది కొంచెమైనను లేదనెడి ఈరూపము మనస్సునకు గలిగెడిపర్యంతను మనంబు నాత్మయందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్థితినిబొందినదానినిగా జేసి, మరిదేనిని కొంచెమైనను చింతింపకుండవలెను. ఇది యోగమునకు పరమావధియగును.

శ్లో॥ యతో యతో నిశ్చరతిమనశ్చంచలమస్థిరం।
తతస్తతోనియమ్యైతదాత్మన్యేవవశంనయేత్॥ ౧౦౨.

టీ. చంచలం- అత్యంతచలనస్వభావముగలిగినట్టియు. అస్థిరం- ఒకవిషయమందు నియతముగానుండనట్టి, మనః-మనస్సు, యతో యతః - ఏయేశబ్దాదినిమిత్తమువలన, నిశ్చరతి-పోవుచున్నదో, తతస్తతః- ఆయాశబ్దాదికమువలన, నియమ్య-నిగ్రహించి, ఏతత్-ఈమనస్సును, ఆత్మన్యేవ - ప్రత్యగాత్మయందే వశం-వశమును, నయేత్ - సంపాదించవలెను. అనగా నాత్మ వశ్యత్వమును జేయవలెననుట.

తా. ప్ర. అయితే, ఈయోగమును సంపాదించుటకు ప్రవర్తించెడి యోగి, మొదట నేమిచేయవలెనో చెప్పుము? ఉ. మనస్సు, అత్యంత చలనస్వభావము గలది గనుకనే యొకవిషయమందు నియతస్థితి లేనిదగును. ఇవ్విధమనంబెప్పుడెప్పు డేయేశబ్దస్పర్శాది నిమిత్తమువలన బాహ్యాగమనమును బొందుచుండునో, యప్పుడప్పుడాయాశబ్దస్పర్శాది విషయములను మిథ్యాత్వాదిదోషదర్శనముచేత నాభాసములనుగాజేసి, వైరాగ్య భావనా పూర్వకముగా నాయాశబ్దాదులనుండి మరలించి (నిగ్రహించి) ఈమనస్సు నాత్మవశ్యముగాజేయవలెను. ఈప్రకారముగా యోగము నభ్యసించి, అభ్యాస బలమువలన, ఆత్మయందే మనంబు శాంతిని బొందుచున్నది. అనగా మనంబు విక్షేపములేనిదగుచున్నదని యభిప్రాయము.

శ్లో॥ ప్రశాంతమనసంహ్యేనంయోగినంసుఖముత్తమం।
ఉపైతిశాంతరజసం బ్రహ్మభూతమకల్మషం॥ ౧౦౩.

టీ. శాంతరజసం=శాంత- క్షీణించిన, రజసం-మోహాదిక్లేశరజముగలిగినట్టియు, ప్రశాంతమనసం=ప్రశాంత - బొత్తిగా విక్షేపములేని, మనసం-మనంబుగలిగినట్టియు, బ్రహ్మభూతం - బ్రహ్మస్వరూపుడైనట్టియు, అనగా జీవన్ముక్తుడనుట. అకల్మషం-అధర్మాదికములేనట్టి, ఏనం-ఈ, యోగినం-యోగిని, ఉత్తమం- శ్రేష్ఠమైన, అనగా క్షయిత్వసాతిశయత్వాది దోషము లేనట్టియనుట. సుఖం-సుఖము, ఉపైతి - పొందుచున్నది.

తా. ప్ర. అయితే, మనఃప్రశాంతి గలుగుచుండగా లాభమేమి? ఉ. క్షీణించిన మోహాదిక్లేశరజముగలవాడగుటచేతనే, బొత్తిగా విక్షేపములేనిమనంబు గలిగినట్టియు, ఇదియంతయు బ్రహ్మమనెడి నిశ్చయవంతుడగుటచేత జీవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్మృత్యుక్తమైనట్టియు, అధర్మాదికము లేనట్టి, ఈయోగినిగురించి క్షయిత్వసాతిశయత్వాదిదోషములేని పరమసుఖము బొందుచున్నది. అనగా నీయోగి, నిరతిశయానందరూపుడగుచున్నాడని యభిప్రాయము.

అవ. ఈ యర్థమును దెలిపెడి యా భగవద్వాక్యములనే పఠించుచున్నాడు.

శ్లో॥ యత్రోపరమతేచిత్తం నిరుద్ధంయోగసేవయా।
యత్రచైవాత్మనాత్మానంపశ్యన్నాత్మనితుష్యతి॥ ౧౦౪.

టీ. చిత్తంచితము, యత్ర- ఏకాలమందు, యోగసేవయా- యోగానుష్ఠానముచేత, నిరుద్ధంసత్ - సర్వవిషయజాతమునుంచి నివారింపబడినదగుచు, ఉపరమతే - ఉపరతిని బొందుచున్నదో, యత్రచ - ఏకాలమందు, ఆత్మనా- సమాధిపరిశుద్ధాంతఃకరణముచేత, ఆత్మానం - పరంజ్యోతిస్స్వరూపచైతన్యమును, పశ్యన్-చూచుచు, అనగా బొందినవాడగుచుననుట. ఆత్మన్యేవ-తనయందే, తుష్యతి - తృప్తినిబొందుచున్నాడో, అనగా విషయములయందు తృప్తిని బొందడోయనుట.

తా. మరియు, చిత్తంబేకాలమందు పూర్వోక్త యోగానుష్ఠానముచేత సర్వవిషయసమూహమునుంచి నివారింపబడినదగుచు నుపరతిని (ప్రశాంతిని) బొందుచున్నదో, మరియు, నేకాలమందు సమాధి పరిశుద్ధాంతః కరణముచేత పరంజ్యోతిస్స్వరూప చైతన్యమును బొందినవాడగుచు, తనయందే తృప్తిని బొందుచున్నాడు.

శ్లో॥ సుఖమాత్యంతికంయత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియం।
వేత్తియత్రనచైవాయంస్థితశ్చలతితత్త్వతః॥ ౧౦౫.

టీ. యత్ర-ఏకాలమందు, అయం-ఆత్మయందుండెడియీయోగి, ఆత్యంతికం- అనంతమైనట్టియు, బుద్ధిగ్రాహ్యం=బుద్ధి - ఇంద్రియాపేక్షలేకనే బుద్ధిచేత, గ్రాహ్యం- గ్రహింపబడుచుండునట్టియు, అతీంద్రియం - ఇంద్రియగోచరాతీతమైనట్టి, అనగా విషయజనితముగానట్టియనుట. యత్ -ఏసుఖముగలదో, తత్-ఆ, సుఖం- ఇటువంటిసుఖమును, వేత్తి- అనుభవించుచున్నాడో, (కించ) ఇదియునుంగాక, స్థితః - ఆత్మయందుండెడి యీయోగి, తత్త్వతః- ఆయాత్మస్వరూపమువలన, నైనచలతిచ - చలింపడో.

తా. మరియు, నేకాలమందు ఆత్మయందుండెడి యీయోగి, అనంతమైనట్టియు, ఇంద్రియాపేక్షలేకనే బుద్ధిచేత గ్రహింపదగినట్టియు, ఇంద్రియగోచరాతీతమైనట్టి (అనగా విషయజనితముగానట్టియనుట.) ఏసుఖముగలదో,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆయాలాటిసుఖము ననుభవించుచున్నాడో, ఇదియనుంగాక, ఆత్మస్థితుడగు ఈయోగి, ఆయాత్మస్వరూపమునుంచి చలింపడో.

శ్లో॥ యంలబ్ధ్వాచాపరంలాభంమన్యతేనాధికంతతః।
యస్మిన్ స్థితోనదుఃఖేనగురుణాపివిచాల్యతే॥ ౧౦౬.

టీ. యం - ఏపరమాత్మను, లబ్ధ్వా- పొంది, తతః- ఆయాత్మలాభము కంటె, అపరం - మరియొక, అధికం-అధికమైనట్టి, లాభం- లాభమును, నమన్యతే-తలచడో, అనగా కోరడోయనుట. యస్మిన్ - ఏయాత్మతత్వమందు, స్థితః-స్థితినిబొందినయోగి, గురుణా - అధికమగు, దుఃఖేనాపి - దుఃఖముచేతనైనను, అనగా శస్త్రాభిఘాతాదిలక్షణముచేననుట. నవిచాల్యతే- ప్రహ్లాదునివలెచలింపడో.

తా. ఇదియనుంగాక, ఏయాత్మనుబొంది, యాత్మలాభముకంటెనధికమైన మరియొకలాభములేదనిచెప్పెడి, శ్లో॥ ఆత్మలాభాన్నపరంవిద్యతే॥ అనెడిస్మృతిప్రకారము మరియొకలాభమును కోరడో, మరియు, నేయాత్మతత్వస్థితుడగుయోగి, శస్త్రాభిఘాతాదిలక్షణముగల మహత్తర దుఃఖముచేతనైనను ప్రహ్లాదునివలె చలనమునుబొందడో.

అవ. ఈయుపపాదింపబడిన యోగము నిప్పుడు దెలుపుచున్నాడు.

శ్లో॥ తంవిద్యాద్దుఃఖసంయోగవియోగంయోగసంజ్ఞితం।
సనిశ్చయేనయోక్తవ్యోయోగోఽనిర్విణ్ణచేతసా॥ ౧౦౭.

టీ. తం-ఆ, అనగా నీపైనచెప్పబడినట్టియనుట. దుఃఖసంయోగవియోగం=దుఃఖ-దుఃఖములతోటి, సంయోగ-సంయోగముచేత, వియోగం- వియోగమును, యోగసంజ్ఞితం = యోగ-యోగమనెడి, సంజ్ఞితం- సంజ్ఞగలదానినిగా, విద్యాత్-తెలియవలెను. సః - ఆ, యోగః-యోగను, నిశ్చయేన- నిశ్చయముగల, అనగా ప్రయత్నముగలయనుట. అనిర్విణ్ణచేతసా = అనిర్విణ్ణ-నిర్వేదరహితమగు, అనగా శ్రమలేనట్టియనుట. చేతసా-చిత్తముచేత, యోక్తవ్యః- అనుష్ఠింపదగినదగును.

తా. నూటయొకటవ శ్లోకము మొదలుకొని, యెన్నివిశేషణములతోగూడుకొనినట్టి, యాత్మావస్థావిశేషమగు, ఏయోగము చెప్పబడినదో, ఆ, దుఃఖములచేత సంయోగముతోటి వియోగమును బొందినదానిని విపరీతలక్షణచేత యోగమనెడి సంజ్ఞగలదానినిగా దెలియవలెను. మరియు నివ్విధయోగానుష్ఠానమందు జేయదగిన విశేషమును కొంచెము జెప్పెదవినుము. ఆపూర్వోక్త యోగమును ప్రయత్నముగల శ్రమరాహిత్యబుద్ధిచేత ననుష్ఠించవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇప్పుడీచెప్పబడినట్టి యర్థము నుపసంహారము జేయుచున్నాడు.

శ్లో॥ యుంజన్నేవంసదాత్మానం యోగీవిగతకల్మషః।
సుఖేనబ్రహ్మసంస్పర్శమత్యంతంసుఖమశ్నుతే॥ ౧౦౮.

టీ. విగతకల్మషః=విగత-నశించిన, కల్మషః- పాపముగలిగినట్టి,యోగీ-యోగానుష్ఠాత, సదా-ఎల్లప్పుడును, ఆత్మానం- పరమాత్మను, ఏవం-ఈపూర్వోక్తప్రకారముగా, యుంజన్ - అనుసంధానము జేయుచున్నవాడగుచు, సుఖేన- అనాయాసముచేత, బ్రహ్మసంస్పర్శం - బ్రహ్మస్వరూప భూతమైనట్టియు, అత్యంతం- నాశములేని నిరతిశయమగు, సుఖం- సుఖమును, అశ్నుతే-పొందుచున్నాడు.

తా. యోగమునకు విఘ్నకారియగు పాపము లేనట్టియోగి, సర్వదా. ఆత్మను ఈపూర్వోక్తప్రకారముచేత ననుసంధానము జేయుచున్నవాడగుచు, అనాయాసముగా బ్రహ్మస్వరూపభూతమగు నాశములేని నిరతిశయసుఖమును బొందుచున్నాడని, శ్రీభగవంతుడగు కృష్ణదేవుడు శ్రీగీతాశాస్త్రమష్టమాధ్యాయమందు అర్జుననకు జెప్పెనని తెలియవలెను.

అవ. శ్రమరాహిత్యముచేత జేయబడుచుండెడి యోగాభ్యాసము ఫలపర్యంతముగలదగుచున్నదనెడి విషయమును దృష్టాంతసహితముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ ఉత్సేకఉదధేర్యద్వత్కుశాగ్రేణైకబిందునా।
మనసోనిగ్రహస్తద్వద్భవేదపరిఖేదతః॥ ౧౦౯.

టీ. కుశాగ్రేణ-దర్భకొనచేత, ఏకబిందునా - ఒకబిందువుతోటి, ఉదధేః-సముద్రోదకముయొక్క, ఉత్సేకః- ఉత్సేకము, అనగా సముద్రోదకమునొక్కొక బిందువుగాదర్భకొనచేనెత్తి బాహ్యప్రదేశమును తడుపుటయనుట. అపరిఖేదతః - శ్రమరాహిత్యమువలన, యద్వత్ - ఏప్రకారముగా, భవేత్-కాలాంతరమందగునో, తద్వత్ - ఆప్రకారము, మనసః - మనస్సుయొక్క, నిగ్రహః-నిగ్రహము, అపరిఖేదతః - శ్రమరాహిత్యమువలన, అనగాశ్రమరాహిత్యతచేత జేయబడుచుండగాననుట. భవేత్ - అగును. అనగా కాలాంతరమందు సిద్ధించుననుట.

తా. దర్భకొనచేత నొక్కొక బిందువునుగా సముద్రజలమునెత్తి, శ్రమరాహిత్యముచేత బాహ్యప్రదేశమును తడుపుచుండగా నాకార్యము, దీర్ఘకాలమందెట్లగునో, అటువలెనే మనస్సుయొక్క నిగ్రహంబును శ్రమరాహిత్యముచేత జేయబడుచుండగా దీర్ఘకాలమందు సిద్ధించగలదు. శ్రీవిద్యారణ్యగురుం


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డీయర్థమును, (టిట్టిభముయొక్క) లకుముకిపిట్టయొక్క యుపాఖ్యానమును మనస్సునందుంచుకొని చెప్పెనని తెలియవలెను.

అవ. ఈయర్థము కేవలభగవద్గీతయందేగాక, మైత్రాయణీయశాఖయందును జెప్పబడినదని యిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ బృహద్రథస్య రాజర్షేశ్శాకాయన్యో మునిస్సుఖం।
ప్రాహ మైత్రాఖ్యశాఖాయాం సమాధ్యుక్తిపురస్సరం॥ ౧౧౦.

టీ. మైత్రాఖ్యశాఖాయాం - మైత్రాయణీయనామక యజుశ్శాఖా భేదమందు, శాకాయన్యః- శాకాయన్యుడనెడి, మునిః - ఋషి, బృహద్రథస్య- బృహద్రథుడనెడి, రాజర్షేః-రాజర్షికి, సుఖం-బ్రహ్మానందమును, సమాధ్యుక్తిపురస్సరం- సమాధ్యభిధానపూర్వకమగునట్లుగా, ప్రాహ- చెప్పెను.

తా. మరియు, మైత్రాయణీయమనెడి యజుశ్శాఖాభేదమందు శాకాయన్యుడనెడి యొకమునీంద్రుడు, తనకుశిష్యత్వముచేత బ్రాప్తించిన బృహద్రథుడనెడి రాజర్షికి, బ్రహ్మానందమును సమాధ్యభిధాన పూర్వకమగునట్లుగా జెప్పినవాడాయెను.

అవ. ఏప్రకారముగాజెప్పెననెడి శంకజేసికొని, ఆశాకాయన్యమునిచెప్పిన మంత్రముల నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ యథానిరింధనో వహ్నిస్స్వయోనావుపశామ్యతి।
తథావృత్తిక్షయాచ్చిత్తం స్వయోనావుపశామ్యతి॥ ౧౧౧.

టీ. నిరింధనః- దహింపబడినకట్టెలుగల, వహ్నిః-అగ్ని, స్వయోనౌ= స్వ-తనయొక్క, యోనౌ - కారణమందు, అనగా తేజోమాత్రమందనుట. యథా - ఏప్రకారముగా, ఉపశామ్యతి- ఉపశాంతినిబొందుచున్నదో, తథా- ఆప్రకారము, చిత్తమపి-అంతఃకరణంబును, వృత్తిక్షయాత్ - నిరోధసమాధ్యభ్యాసముచేత రాజసాదిసకలవృత్తినాశమువలన, స్వయోనౌ = స్వ - తనయొక్క, యోనౌ-కారణమగుసత్వమాత్రమందు, ఉపశామ్యతి - ఉపశాంతినిపొందుచున్నది. అనగా సత్వమాత్రశేషము గలదగుచున్నదనుట.

తా. దహింపబడిన కాష్ఠములుగల యగ్నిహోత్రము, జ్వాలాదినిశ్శేషాకారమునువిడిచి, తనకు కారణమగు తేజోమాత్రరూపమందేప్రకారముగా స్థితిని బొందుచున్నదో, ఆప్రకారమే యంతఃకరణంబును నిరోధసమాధ్యభ్యాసముచేత రాజసాది సకలవృత్తినాశమువలన, తనకుకారణమగు సత్వగుణప్రధానమందు ఉపశాంతిని బొందుచున్నది. అనగా సత్వప్రధానమాత్రశేషముగలదగుచున్నదని యభిప్రాయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ స్వయోనావుపశాంతస్యమనసస్సత్యకామినః।
ఇంద్రియార్థవిమూఢస్యానృతాఃకర్మవశానుగాః॥ ౧౧౨.

టీ. సత్యకామినః=సత్య - ఆత్మవిషయమందు, కామినః- కామముగలిగినట్టియు, స్వయోనౌ=స్వ- తనయొక్క, యోనౌ - కారణమగుసత్త్వమందు, ఉపశాంతస్య- ఉపశాంతినిబొందినట్టియు, ఇంద్రియార్థవిమూఢస్య = ఇంద్రియార్థ- శబ్దాదివిషయములయందు, విమూఢస్య - జ్ఞానశూన్యమగు, మనసః- మనంబునకు, కర్మవశానుగాః= కర్మవశ- కర్మవశమును, అనుగాః - అనుసరించిప్రాప్తించెడి సాధనసహిత సుఖాదులు, అనృతాః - మాయికత్వజ్ఞానముచేత మిథ్యాభూతములగుచున్నవి.

తా. ప్ర. అయితే, అట్లు సత్త్వమాత్రమం దుపశాంతిని బొందుటచేత ఫలమేమి? ఉ. ఆత్మవిషయమందు కామముగలిగినట్టిదగుటచేత, తనకు కారణమగు సత్త్వమందు ఉపశాంతిని బొందినదగుటవలన శబ్దాదివిషయములయందు జ్ఞానశూన్యమగు మనంబునకు కర్మవశముచే ప్రాప్తించెడి సాధనసహిత సుఖాదులు, మాయికత్వజ్ఞానముచేత మిథ్యాభూతము లగుచున్నవని తెలియవలెను.

శ్లో॥ చిత్తమేవహిసంసారస్తత్ప్రయత్నేనశోధయేత్।
యచ్చిత్తస్తన్మయోమర్త్యోగుహ్యమేతత్సనాతనం॥ ౧౧౩.

టీ. సంసారః - సంసారము, చిత్తమేవ- చిత్తమేయగును. హి - సుషుప్త్యాదికమందు చిత్తవిలయమగుచుండగా భోగము గనబడమిచేత నీయర్థముసర్వానుభవ ప్రసిద్ధమనుట. తత్- ఆచిత్తమును, ప్రయత్నేన - అభ్యాస వైరాగ్యాదిలక్షణములచేత, శోధయేత్- శోధించవలెను. అనగా రజస్తమోరాహిత్యముచేత నైకాగ్ర్యమును జేయవలెననుట. (యః- ఏ) మర్త్యః-దేహి, యచ్చిత్తః=యత్-పుత్రాదివిషయమందు, చిత్తః-చిత్తముగలవాడగునో, (సః) ఆదేహి, తన్మయః-తన్మయుడగును. ఏతత్ - ఈవిషయము, సనాతనం - అనాదిసిద్ధమగు, గుహ్యం - అతిరహస్యమగును.

తా. ప్ర. అయితే, చిత్తము జగంబునకు ఉపాదానకారణముగామిచేత, చిత్తము ఉపశాంతినిబొందుచుండగా జగంబు మిథ్యయగుననియెట్లుచెప్పవచ్చును? ఉ. విచారించగా చిత్తము జగంబునకు నుపాదానకారణముగాకపోయినను, ఆజగంబుయొక్క భోగ్యభోగత్వములకు చిత్తమే కారణమగును. ప్ర. ఇందుకు ప్రమాణమేమి?. ఉ. సుషుప్త్యాదికమందు చిత్తవిలయమగుచుండగా, అచ్చట భోగముగనబడమియు, జాగ్రదాదికమందు చిత్తవిలయము గామిచేత నచ్చట భోగము గనబడుటయు, ఈ సర్వజనానుభవమే ప్రమాణమగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మరియు, నేకారణముచేత సంసారము చిత్తరూపముగలదో, యాకారణము చేత నాచిత్తమునే యభ్యాసవైరాగ్యాది లక్షణములచేత శోధింపవలెను. (రజస్తమోగుణరాహిత్యముచేత నైకాగ్ర్యమును జేయవలెను) ప్ర. అయితే,ఆత్మయొక్క విముక్తికొరకు నాత్మయే శోధింపదగినదగుగాని, చిత్తమును శోధించవలసినపనియేమి? ఉ. ఏదేహి, యేపుత్రాది విషయమందు చిత్తముగలవాడగునో, ఆదేహి, యాపుత్రాదివిషయమందు గల సాకల్య వైకల్యములను తనయందే యారోపణము జేసికొనుటవలన నాపుత్రాది రూపము గలవాడగును. ఈయర్థంబనాదిసిద్ధమైనట్టి యతిరహస్యమగును. అనగా స్వాభావికముగా బరిశుద్ధుడగు ఆత్మకు, ఏకారణమువలన, శ్రు॥ యతీవవేలాయతీవ॥ అనెడి శ్రుతిప్రకారము చిత్తసంబంధముచేతనే సంసారిత్వము ప్రాప్తించెనో, ఆకారణమువలన చిత్తమునుశోధించుటచేత (రజస్తమోరాహిత్యముచే నైకాగ్ర్యమును జేయుటవలన) ఆత్మకు సంసారము నివర్తించునని యభిప్రాయము.

శ్లో॥ చిత్తస్యహిప్రసాదేన హంతికర్మశుభాశుభం।
ప్రసన్నాత్మాత్మనిస్థిత్వా సుఖమక్షయ్యమశ్నుతే॥ ౧౧౪.

టీ. చిత్తస్య-చిత్తముయొక్క, ప్రసాదేన - నిర్మలత్వముచేత, శుభాశుభం=శుభ- పుణ్యరూపముగలిగినట్టియు, అశుభం-పాపరూపముగలిగినట్టియు, కర్మ-కర్మరాశిని, హంతి- నాశనముజేయుచున్నాడు. హి - ఇదిశ్రుతిప్రసిద్ధమనుట. ప్రసన్నాత్మా = ప్రసన్న - నిర్మలమగు, ఆత్మా - చిత్తముగలవాడు, ఆత్మని-స్వస్వరూపబ్రహ్మమందు, స్థిత్వా- ఉండి, అనగా నాబ్రహ్మమేనేననెడినిశ్చయముచేత దృశ్యవర్గమును విడిపించి చిన్మాత్రరూపముగా స్థితినిబొంది యనుట. అక్షయ్యం - నాశములేని, సుఖం - సుఖమును, అశ్నుతే - పొందుచున్నాడు.

తా. ప్ర. అయితే, యనాది సంసారమందు పరంపరగా సంపాదింపబడిన సుఖదుఃఖ ప్రదపుణ్యపాపకర్మస్థితిగలిగియుండగా,చిత్తశోధనముచేసైనను ఆత్మకుసంసారనివృత్తియెట్లుగలుగును? ఉ. పురుషుడు నిర్మల చిత్తముచేత సకలపుణ్యపాపకర్మరాశిని నశింపజేయుచున్నాడు. మరియు, నెండుగడ్డిపఱకలును, దూదియు నగ్నియందువేయబడి దహింపబడినయట్లు,ఈబ్రహ్మవేత్తయొక్క పుణ్యపాపకర్మములన్నియు జ్ఞానాగ్నిచేత దహింపబడుచున్నవని, శ్రు॥ తద్యథేషికాతూలమగ్నౌప్రోతం ప్రదూయేతైవంహాస్యసర్వేపాప్మానః ప్రదూయంతే॥ అనెడి యిత్యాదిశ్రుతులును, శ్లో॥ ఉపపాతకేషుసర్వేషు పాతకేషు మహత్సుచ। ప్రవిశ్యరజనీపాదం బ్రహ్మధ్యానంసమాచరేత్॥ ఇత్యాదిస్మృతు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లుం జెప్పుచున్నవి. ప్ర. అయితే, అందుచే ప్రయోజనమేమో చెప్పుము? ఉ. నిర్మలచిత్తముగలవాఁడు, స్వస్వరూపమగు అద్వితీయానంద లక్షణ బ్రహ్మమందుండి (అనగా నాబ్రహ్మమే నేననెడినిశ్చయముచేత దృశ్యజాతమును విడిపించి చిన్మాత్రరూపముగానుండి) నాశములేని, యేస్వరూప భూతి బ్రహ్మానందముగలదో, దానినిబొందుచున్నాడని, మైత్రాయణీయ శాఖయందు జెప్పబడెనని తెలియవలెను.

అవ. ఈచెప్పబడిన శ్లోకార్థమునే దృష్టాంతోక్తి పూర్వకముగా దృఢీకరించుచున్నాడు.

శ్లో॥ సమాసక్తంయథాచిత్తం జంతోర్విషయగోచరే।
యద్యేవంబ్రహ్మణిస్యాత్తత్కోనముచ్యేతబంధనాత్॥ ౧౧౫.

టీ. జంతోః-ప్రాణియొక్క, చిత్తం-చిత్తము, విషయగోచరే- ఇంద్రియసంచారభూమియందు, యథా-ఏప్రకారము, సమాసక్తం - స్వాభావికముచేత లెస్సగా నాసక్తిగలదగునో, ఏవం-ఈప్రకారము, (తదేవ) ఆచిత్తమే, బ్రహ్మణి-ప్రత్యగభిన్న పరమాత్మయందు, స్యాద్యది - ఆసక్తిగలదైనయెడల, బంధనాత్- సంసారమువలన, కః- ఎవడు, నముచ్యేత-విడువబడడు. అనగా సర్వజనంబును .విడువబడుననుట.

తా. ప్రాణియొక్కచిత్తము, ఇంద్రియసంచారభూమియం దేప్రకారము స్వాభావికముగా మిక్కిలినాసక్తిగలదగునో, ఆప్రకారమాచిత్తమేప్రత్యగభిన్నబ్రహ్మమందాసక్తిగలదైనయెడల, సర్వజనంబును సంసారమువలనవిడువబడినవారే యగుదురు.

అవ. ఈయర్థమును దృఢీకరించెడికొరకు, మనంబుయొక్కయవాంతరభేదమును జెప్పుచున్నాడు.

శ్లో॥ మనోపిహిద్వివిధంప్రోక్తం శుద్ధంచాశుద్ధమేవచ।
అశుద్ధంకామసంపర్కాచ్ఛుద్ధంకామవివర్జితం॥ ౧౧౬.

టీ. మనః-మనంబు, శుద్ధం-శుద్ధమనియు, అశుద్ధమేవచ- అశుద్ధమనియు, ద్వివిధం-ద్వివిధముగా, ప్రోక్తంహి- చెప్పబడెను. కామసంపర్కాత్=కామ-కామక్రోధాదికముతోటి, సంపర్కాత్-కూడికవలన, అశుద్ధం అశుద్ధమనిచెప్పబడును. కామవివర్జితం=కామ - కామక్రోధాదికముచేత, వివర్జితం- విడువబడినది, అనగాకామక్రోధాదికములేనిమనంబనుట. శుద్ధం-శుద్ధమనిచెప్పబడును.

తా. మరియు, మనంబు, ౧. శుద్ధమనియు, ౨. అశుద్ధమనియు నిట్లు ద్వివిధముగాజెప్పబడెను. ప్ర. అట్లు చెప్పబడుటకు కారణమేమి? ఉ. కామక్రో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధాదికములతోటి సంబంధముగలమనంబు, అశుద్ధమని చెప్పబడును. కామక్రోధాదులను విడచినమనంబు, శుద్ధమని చెప్పబడును.

అవ. ఆద్వివిధమనంబునకు క్రమముగా సంసారమోక్ష హేతుత్వమును జూపుచున్నాడు.

శ్లో॥ మనఏవమనుష్యాణాం కారణంబంధ మోక్షయోః।
బంధాయవిషయాసక్తంముక్త్యైనిర్విషయంస్మృతం॥ ౧౧౭.

టీ. మనుష్యాణాం- జనులకు, మనఏవ - మనంబే, బంధమోక్షయోః- బంధమోక్షములకు, కారణం-హేతువగును. విషయాసక్తం=విషయ- శబ్దాదులయందు, ఆసక్తం - ఆసక్తిగలమనంబు, బంధాయ - బంధముకొరకును, నిర్విషయం- విషయాసక్తముగానిమనంబు, ముక్త్యై - మోక్షముకొరకును, స్మృతం-కారణముగా జెప్పబడెను.

తా. జనులకు మనంబే, బంధమోక్షములకు కారణమగును. అందువిషయాసక్తమగు మనంబు, బంధమునకు గారణమగుననియు, విషయాసక్తముగానిమనంబు మోక్షకారణమగుననియుం జెప్పబడెను.

అవ. ౧౧౪ వ శ్లోకమందు, శ్లో॥ ప్రసన్నాత్మాత్మనిస్థిత్వా సుఖమక్షయ్యమశ్నుతే॥ అని చెప్పబడిన యర్థమును, స్వయముగా వర్ణించెడిశ్రుతి నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ సమాధి నిర్ధూతమలస్య చేతసోనివేశితస్యాత్మని యత్సుఖం భవేత్ । నశక్యతేవర్ణయితుంగిరా తదా స్వయంతదంతఃకరణేన గృహ్యతే॥ ౧౧౮.

టీ. ఆత్మని- ప్రత్యక్స్వరూపమందు, నివేశితస్య-స్థాపించబడినట్టియు, సమాధినిర్ధూతమలస్య=సమాధి - ప్రత్యగ్బ్రహ్మైక్యగోచరప్రత్యయావృత్తిచేత, నిర్ధూత-నిశ్శేషముగానివారింపబడిన, మలస్య- రజస్తమోమలముగల, చేతసః-చిత్తమునకు, యత్ - ఏ, సుఖం.ఆనందము, భవేత్-కలుగునో, తదా-ఆసమాధియందుబుట్టినట్టి, (తత్సుఖం) ఆసుఖమును, గిరా - వాక్కు-చేత, వర్ణయితుం-వర్ణించుటకు, నశక్యతే - శక్యముగాదు. స్వయం - స్వరూపభూతమగు. తత్సుఖం - ఆయానందము, అంతఃకరణేన - అంతఃకరణముచేత, గృహ్యతే- గ్రహింపబడుచున్నది.

తా. ప్రత్యక్స్వరూపమందుంచబడినట్టియు, ప్రత్యగ్బ్రహ్మైక్యగోచరప్రత్యయావృత్తిరూపమగు సమాధిచేత నిశ్శేషముగా నివారింపబడిన రజస్తమోదోషముగల (అనగా రజస్తమోదోషములేని) చిత్తమునకు,ఆసమాధియందే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సుఖముబుట్టుచున్నదో, ఆసమాధియందుగలిగెడి యాసుఖము లౌకికసుఖము గామిచేత వాక్కుచేతవర్ణించుటకు శక్యముగాదు. మరియేమనగా స్వరూప భూతమైనట్టి యాసుఖమంతఃకరణముచేతనే గ్రహింపబడుచున్నదని, ఈశ్రుతి జెప్పుచున్నది.

శ్లో॥ యద్యప్యసౌచిరంకాలంసమాధిర్దుర్లభోనృణాం।
తథాపిక్షణికోబ్రహ్మానందం నిశ్చాయయత్యసౌ॥ ౧౧౯.

టీ. యద్యపి- విచారించగా, అసౌ-ఈసమాధి, నృణాం-జనులకు, చిరం కాలం-బహుకాలము, అనగా సర్వదాయనుట. దుర్లభః- దుర్లభమగును. అన గాఈసమాధియందు చిరకాలపర్యంతము జనులుండజాలరనుట. తథాపి-అట్లైనను, క్షణికః-క్షణికమగు, అసౌ-ఈసమాధి, బ్రహ్మానందం - బ్రహ్మానందము ను, నిశ్చాయయతి - నిశ్చయింపజేయుచున్నది.

తా. ప్ర. అయితే, ఈసమాధి, జనులకు దుర్లభమగుటవలన, దీనిచేత బ్రహ్మానందనిశ్చయమెట్లుగలుగును? ఉ. ఈసమాధి, జనులకు సర్వదా సంభ వింపకపోయినను, ఒకానొకక్షణమందు సంభవించుటవలన, అట్టి క్షణికసమా ధిచేత నీబ్రహ్మానందమును నిశ్చయించుటకు శక్యమగును.

శ్లో॥ శ్రద్ధాళుర్వ్యసనీయోత్రనిశ్చినోత్యేవసర్వథా।
నిశ్చితేతుసకృత్తస్మిన్ విశ్వసిత్యన్యదాప్యయం॥ ౧౨౦.

టీ. అత్ర-ఈసమాధియందు, సర్వథా-అవశ్యము, నిశ్చినోత్యేవ-బ్రహ్మా నందనిశ్చయమును చేయుచున్నవాడేయగును. వ్యసనీయః - వ్యసనముగల.శ్ర ద్ధాళుః-శ్రద్ధావంతుడు, తస్మిన్- ఆబ్రహ్మానందము, సకృత్- ఒక్కమాఱుక్షణి కసమాధియందు, నిశ్చితేసతితు - నిశ్చయింపబడుచుండగానో, అయం-ఒకమా ఱునిశ్చయముగల వీడు, అన్యదాపి- ఇతరకాలములయందును, విశ్వసితి-ఆనం దముగలదని విశ్వాసముజేయుచున్నాడు.

తా. ప్ర. అయితే, ఆత్మదర్శనముకొఱకు శ్రవణాదికమందు బ్రవర్తిం చెడివారైనంగొందరు, ఆనందనిశ్చయశూన్యులగుచు, బహిర్ముఖులే యగుచు వర్తించుచున్నారేమి? ఉ. ఈసమాధియందవశ్యము వ్యసనము గల శ్రద్ధావం తుడు, బ్రహ్మానందనిశ్చయమును జేయుచున్నవాడే యగును. ఆబ్రహ్మానంద మొకమాఱు క్షణికసమాధియందు నిశ్చయింపబడుచుండగా, ఈనిశ్చయముగ లవాడు, ఇతరకాలమందును ఆనందముగలదని నమ్ముచున్నాడు. కనుక,శ్రద్ధా దిరహితులకు బ్రహ్మానందనిశ్చయము లేకపోయినను శ్రద్ధాదికముగలవారికి బ్ర హ్మానందనిశ్చయము గలుగుచున్నదేనని యభిప్రాయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ తాదృక్పుమానుదాసీన కాలేప్యానందవాసనాం।
ఉపేక్ష్యముఖ్యమానందంభావయత్యేవతత్పరః॥ ౧౨౧.

టీ. తాదృక్- అటువంటి, పుమాన్-పురుషుడు, అనగా శ్రద్ధాదిపూర్వకముగా నాకమారు బ్రహ్మానంద నిశ్చయము గలవాడనుట. ఉదాసీనకాలేపి- ఔదాసీన్యదశయందును, ఆనందవాసనాం - ఆనందవాసనను, ఉపేక్ష్య - ఉపేక్షించి, తత్పరస్సన్- ముఖ్యానందమందు తాత్పర్యముగలవాడగుచు, ముఖ్యం- ముఖ్యమగు, అనగా స్వరూపభూతమైనట్టియనుట. ఆనందమేవ- బ్రహ్మానందమునే, భావయతి - భావించుచున్నాడు.

తా. ప్ర. సరి. అందువలన ఫలమేమి? ఉ. అట్లు శ్రద్ధాది పూర్వకముగానాకనూరు బ్రహ్మానందనిశ్చయముగలవాడు, ఔదాసీన్యదశయందు పొందబడుచుండెడి పూర్వోక్తవాసనానందము నుపేక్షించి, ముఖ్యమగు బ్రహ్మానందమందు తాత్పర్యముగలవాడై ఆబ్రహ్మానందమునే భావించుచున్నాడు.

అవ. ఇట్లు వ్యవహారకాలమందు నిజానందమును భావించు చున్నాడనెడి ఈలిషయమై దృష్టాంతము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ పరవ్యసనినీనారీవ్యగ్రాపిగృహకర్మణి।
తదేవాస్వాదయత్యంతః పరసంగరసాయనం॥ ౧౨౨.

టీ. పరవ్యసనినీ= పర-పరపురుషునియందు, వ్యసనినీ- కామజన్యవ్యసనముగల, నారీ- స్త్రీ, గృహకర్మణి = గృహ-గృహవిషయకమగు, కర్మణి-కార్యవర్గమును జేయుటయందు, వ్యగ్రాపి-సామర్థ్యముగలదైనను, అంతః-మనంబులోపల, తత్-ఆ, పరసంగరసాయనం = పరసంగ - పరపురుష సంభోగముచేతగలిగెడి, రసాయనం - సుఖవిశేషమును, ఆస్వాదయతి - చింతనము జేయుచున్నది.

తా. పరపురుష సంగమమునందు కామజనితవ్యసనముగల వనిత, గృహవిషయకార్యములను జేయుటయందు సామర్థ్యముగలదైనను, పరపురుష సంగమముచేతగలిగెడి యాసుఖవిశేషమునే, సర్వదా చింతించుచుండును.

అవ. ఈదృష్టాంతార్థమును దార్ష్టాంతికమందు గూర్చుచున్నాడు.

శ్లో॥ ఏవంతత్త్వేపరేశుద్ధేధీరోవిశ్రాంతిమాగతః।
తదేవాస్వాదయత్యంతర్బహిర్వ్యవహరన్నపి॥ ౧౨౩.

టీ. ఏవం - ఈదృష్టాంతప్రకారము, ధీరః- బ్రహ్మచర్యాదిసాధనసంపన్నుడగు పండితుడు, శుద్ధే-నిర్మలమగు, పరేతత్త్వే-పరతత్త్వమందు, విశ్రాంతిం- విశ్రమమును, ఆగతస్సన్ - పొందినవాడగుచు, బహిః - బాహ్యమందు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యవహరన్నపి- వ్యవహారముజేయుచున్నవాడైనను, అంతః - మనంబులోపల, తదేవ - ఆబ్రహ్మానందమునే, ఆస్వాదయతి - భావించుచున్నాడు.

తా. ఈదృష్టాంతప్రకారము, బ్రహ్మచర్యాది సాధనసంపన్నుడగుపండితుడు, పరిశుద్ధమగు పరతత్వమందు విశ్రాంతిని బొందినవాడగుచు, బాహ్యమందు వ్యవహరించుచున్నవాడైనను మనంబులోపల, ఆనిజానందమగు బ్రహ్మానందమునే సర్వదా భావించుచున్నాడు.

అవ. ఇప్పుడు, పూర్వశ్లోకస్థిత ధీరశబ్దార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ధీరత్వమక్షప్రాబల్యేప్యానందాస్వాదవాంఛయా।
తిరస్కృత్యాఖిలాక్షాణితచ్చింతాయాంప్రవర్తనం॥ ౧౨౪.

టీ. అక్షప్రాబల్యేపి=అక్ష-ఇంద్రియములకు, ప్రాబల్యేపి- పురుషాకర్షణసామర్థ్యముగలిగియున్నను. ఆనందాస్వాదవాంఛయా = ఆనందాస్వాద-స్వరూపసుఖానుసంధానమందు, వాంఛయా - ఇచ్ఛచేత, అఖిలాక్షాణి = అఖిల-సకలములైన, అక్షాణి-శ్రోత్రాదీంద్రియములను, తిరస్కృత్య - తిరస్కరించి, తచ్చింతాయాం=తత్-ఆబ్రహ్మానందముయొక్క, చింతాయాం- అనుసంధానమందు, ప్రవర్తనం-ప్రవర్తించుట, ధీరత్వం- ధీరశబ్దార్థమగును.

తా. శ్రోత్రాదీంద్రియములకు విషయాభిముఖ్యముచేత బురుషు నాకర్షించెడి సామర్థ్యముగలిగియున్నను, స్వరూపానందాను సంధానమందు గలయిచ్ఛచేత, నాశ్రోత్రాదిసకలేంద్రియములను నిగ్రహించి యానందానుసంధానమందే ప్రవర్తించుచుండునట్లుచేయుట, ధీరత్వమగునని తెలియవలెను.

అవ. విశ్రాంతిశబ్దమునకు వివక్షితార్థమును దృష్టాంత సహితముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ భారవాహీశిరోభారంముక్త్వాస్తేవిశ్రమంగతః।
సంసారవ్యాపృతిత్యాగేతాదృగ్బుద్ధిస్తువిశ్రమః॥ ౧౨౫.

టీ. (యథా) ఏప్రకారముగా లోకమందు, భారవాహీ=భార- బరువును, వాహీ-మోసెడిపురుషుడు, శిరోభారం=శిరః- తనశిరంబునందుగల,భారం-బరువును, ముక్త్వా-విడచి, విశ్రమం-విశ్రాంతిని, గతస్సన్ - పొందినవాడగుచు, ఆస్తే-స్థితినిబొందుచున్నాడో, తథా - ఆప్రకారము, సంసారవ్యాపృతిత్యాగేసతి=సంసార - కర్తృత్వ భోక్తృత్వాది జీవధర్మరాశిని, త్యాగేసతి-విడుచుచుండగా, తాదృక్-అటువంటి, బుద్ధిస్తు- బుద్ధియే, విశ్రమః- విశ్రమము


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గును. అనగా విశ్రాంతిశబ్దార్థమగుననుట.

తా. మరియు, ఏప్రకారముగా లోకమందు బరువును మోసెడి పురుషుడు, శ్రమహేతువగు తన శిరస్సునందుగల బరువును విడిపించి, శ్రమలేనివాడగుచు వర్తించుచున్నాడో, యాప్రకారమే సంసారవ్యాపారమును విడచుచుండగా, నేను శ్రమలేనివాడనైయున్నానని గలిగెడి, యేబుద్ధిగలదో, యదియే విశ్రాంతిశబ్దార్థమగును.

అవ. ఇప్పుడు, ఫలితార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ విశ్రాంతింపరమాంప్రాప్తస్స్వౌదాసీన్యేయథాతథా।
సుఖదుఃఖదశాయాంచతదానందైకతత్పరః॥ ౧౭౮.

టీ. పరమాం - నిరతిశయమగు, విశ్రాంతిం - విశ్రాంతిని, ప్రాప్తః- పొందినవాడో, (స్వస్య) తనయొక్క, ఔదాసీన్యే- ఉదాసీనదశయందు, అనగా తూష్ణీంభావమందనుట. యథా - ఏప్రకారము పరమానందానుసంధానమందు తాత్పర్యముగలవాడగుచున్నాడో, తథా - ఆప్రకారము, సుఖదుఃఖదశాయాంచ=సుఖదుఃఖ- సుఖదుఃఖహేతువగు, దశాయాంచ- కాలమందును, తదానందైకతత్పరః= తదానంద- ఆపరమానందమందే, ఏక-ముఖ్యమైన,తత్పరః - తాత్పర్యముగలవాడగుచున్నాడు.

తా. పూర్వోక్తలక్షణముగల నిరతిశయ విశ్రాంతినిబొందినపురుషుడు, తనయొక్క యౌదాసీన్యదశయందే ప్రకారముగా పరమానందానుసంధానమందు తాత్పర్యముగలవాడగుచున్నాడో, యాప్రకారమే, సుఖదుఃఖహేతుప్రాప్తికాలమందును, ఆసుఖదుఃఖానుసంధానమును విడిపించి, నిజానందానుసంధానమందే తాత్పర్యముగలవాడగుచున్నాడని తెలియవలెను.

అవ. విషయసుఖమందు జ్ఞానికియిచ్ఛగలుగదని, దృష్టాంత పూర్వకముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ అగ్నిప్రవేశహేతౌధీశ్శృంగారేయాదృశీతథా।
ధీరస్యేతివిషయేఽనుసంధానవిరోధినీ॥ ౧౭౯.

టీ. అగ్నిప్రవేశహేతౌసతి = అగ్ని-అగ్నియందు, ప్రవేశ-ప్రవేశముజేయుటకు, హేతౌసతి- నిమిత్తముగలుగుచుండగా, శృంగారే - అలంకారమందు, యాదృశీ-ఏలాటి, ధీః-బుద్ధిగలుగునో, తథా-ఆప్రకారము, ధీరస్య-పండితునకు, అనుసంధానవిరోధిని = అనుసంధాన-బ్రహ్మానుసంధానమునకు, విరో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఘిని-విరోధియగు, విషయే- విషయసుఖమందు, (తాదృశీ) అటువంటిబుద్ధి, అన గావైరబుద్ధియనుట. ఉదేతి - ఉదయించుచున్నది.

తా. ప్ర. అయితే, దుఃఖము ప్రతికూలమగుటచేత నాదుఃఖానుసంధానాభిలాష, జ్ఞానికిలేకపోయినను, పురుషులచేత గోరబడుచుండెడి విషయసుఖంబు అనుకూలమగుటచేత నావిషయసుఖానుసంధానాభిలాష,జ్ఞానికిలేకపోవు టెట్లు? ఉ. శీఘ్రముగా దేహమును విడువవలెననెడి యిచ్ఛ, దృఢముగా గలిగియుండగా నగ్నిప్రవేశము జేసెడివానికి నలంకారాదికమం దేప్రకారముగా వైరబుద్ధిగలుగుచున్నదో, ఆప్రకారమే వైరాగ్యాది సాధనసంపన్నుడగువివేకికిని బ్రహ్మానుసంధాన విరోధియగు విషయసుఖమందు నప్రీతిగలుగుచున్నదని తెలియవలెను. అనగా నావిషయసుఖము, విషయసంపాదనాదిద్వారా, బుద్ధికెమిక్కిలిగా బహిర్ముఖత్వమును గలిగించుటచేత నిజానందానుసంధానవిరోధియగుటవలన, విషయసుఖేచ్ఛయు వివేకికి గలుగదని యభిప్రాయము.

శ్లో॥ అవిరోధిసుఖేబుద్ధిఃస్వానందేచగమాగమౌ।
కుర్వంత్యాస్తేక్రమాదేషాకాకాక్షివదితస్తతః॥ ౧౨౮.

టీ. ఏసా-ఈ, బుద్ధిః-బుద్ధి, అవిరోధిసుఖే-అవిరోధి- బ్రహ్మానుసంధానమునకు విరోధిగాని, సుఖే - అప్రయత్నవిషయసుఖమందును, ఆనందేచ- బ్రహ్మానందమందును, క్రమాత్ - క్రమముగా, కాకాక్షివత్ = కాక - కాకియొక్క, అక్షివత్- నేత్రమువలె, ఇతస్తతః- ఈతట్టునకాతట్టునకు, గమాగమౌ- గమనాగమనములను, కుర్వంతీసతీ - చేయుచున్నదగుచు, ఆస్తే - స్థితినిబొందుచున్నది.

తా. ప్ర. అయితే, బ్రహ్మానందవిరోధియగు విషయసుఖేచ్ఛ, జ్ఞానికిలేకపోవుగాక, అప్రయత్నముచేత సులభముగా లభించునట్టియు, బహిర్ముఖత్వహేతువుగాని విషయసుఖమందు జ్ఞానికియిచ్ఛ, గలుగుచుండలేదాయేమి? ఉ. బ్రహ్మానుసంధానమునకు విరోధిగాని విషయసుఖము గలుగుచుండగా, ఈజ్ఞానియొక్కబుద్ధి, ఆవిషయసుఖమందును, బ్రహ్మానందమందును, క్రమముగాకాకికన్నువలె, ఈతట్టునకాతట్టునకును గమనాగమనములను జేయుచుండును.

అవ. ఈదృష్టాంతమును వివరించి చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏకైవదృష్టిఃకాకస్యవామదక్షిణనేత్రయోః।
యాత్యాయాత్యేవమానందద్వయేతత్త్వవిదోమతిః॥ ౧౨౯.

టీ. కాకస్య-కాకమునకు, వామదక్షిణనేత్రయోః = వామ - ఎడమకం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టియందును, దక్షిణనేత్రయోః - కుడికంటియందును, దృష్టిః - దృష్టి, అనగా దర్శనసాధనమగు చక్షురింద్రియంబనుట, ఏకైవ - ఒక్కటియే, యాత్యాయాతి - గమనాగమనములను జేయుచున్నది. ఏవం- ఈప్రకారము, తత్త్వవిదః-జ్ఞానియొక్క, మతిః - బుద్ధి, ఆనందద్వయే = ఆనంద - బ్రహ్మానంద విషయానందములనెడి, ద్వయే- రెంటియందును, యాత్యాయాతి- గమనాగమనములను జేయుచున్నది.

తా. కాకమునకేప్రకారముగా దర్శనసాధనమగు చక్షురింద్రియమొక్కటియే, యెడమకుడికన్నులయొక్క గోళకస్థానములయందు పర్యాయముగా గమనాగమనములను జేయుచున్నదో, ఆప్రకారమే, వివేకియొక్కబుద్ధియు బ్రహ్మానంద విషయానందములయందు పర్యాయముగా గమనాగమనములను జేయుచున్నది.

అవ. దార్ష్టాంతికమును వివరించి చెప్పుచున్నాడు.

శ్లో॥ భుంజానోవిషయానందం బ్రహ్మానందంచతత్త్వవిత్।
ద్విభాషాభిజ్ఞవద్విద్యాదుభౌలౌకికవైదికౌ॥ ౧౩౦.

టీ. లౌకికవైదికౌ- లౌకికవైదికములగు, ఉభౌ - రెండైన, విషయానందం-విషయానందమును, బ్రహ్మానందంచ-బ్రహ్మానందమును, భుంజానః-అనుభవించుచుండెడి, తత్త్వవిత్-జ్ఞాని, ద్విభాషాభిజ్ఞవత్=ద్విభాషా - రెండుభాషలను, అభిజ్ఞవత్ - తెలిసినవానివలె, విద్యాత్-విషయానందబ్రహ్మానందములను దెలిసినవాడగును.

తా. బ్రహ్మవేత్త, విషయములననుభవించుచు నావిషయజన్యమగు లౌకికసుఖమైన, ౧. విషయానందమును, ఉపనిషద్వాక్యముచేత లభింపబడినవైదికసుఖమగు, ౨. బ్రహ్మానందమును, రెండు భాషలను తెలిసినవానివలె నెరిగినవాడగునని తెలియవలెను.

శ్లో॥ దుఃఖప్రాప్తౌనచోద్వేగోయథాపూర్వంయతోద్విదృక్।
గంగామగ్నార్ధకాయస్యపుంసశ్శీతోష్ణధీర్యథా॥ ౧౩౧.

టీ. యతః-ఏకారణమువలన, (వివేకీ) జ్ఞాని, ద్విదృక్ - లౌకికవైదికవ్యవహారవేత్తయో, (అతః) ఆకారణమువలన, దుఃఖప్రాప్తౌచ- దుఃఖప్రాప్తియందును, అనగా దుఃఖముప్రాప్తించుచుండగా ననుట. యథాపూర్వం - పూర్వమవివేకదశయందువలె, ఉద్వేగః - దుఃఖనిమిత్తక మనోవికారము, న - లేదు. గంగామగ్నార్ధకాయస్య = గంగా- గంగయందు, మగ్న - మునిగిన, అర్ధకా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యస్య- సగము దేహముగల, పుంసః - పురుషునకు, శీతోష్ణధీః=శీత - చల్లదన ము నెరిగెడిబుద్ధియు, ఉష్ణధీః - ఉష్ణము నెరిగెడిబుద్ధియు, యథా-ఏప్రకారముగ లిగియుండునో.

తా. ప్ర. అయితే, దుఃఖానుభవ దశయందు మనో వికారముచేత విక్షేపము గలుగుచుండగా, జ్ఞానికి నిజానందానుభవ మెట్లు గలుగును? ఉ. ఏకారణముచేత వివేకియగువాడు, లౌకికవైదికవ్యవహారములను రెంటిని యెరి గినవాడో, యాకారణముచేత వివేకమువలన నప్పుడవివేకజన్య మనోవికారవి క్షేపాదికమంతయు బాధింపబడుచున్నందున దుఃఖప్రాప్తియందును పూర్వపు జ్ఞానదశయందువలె, నవివేకజన్య విక్షేపాదికమునుబొందడు. ఆహేతువువలన దుఃఖానుభవకాలమందును నిజానందాను సంధానము జేయుటచేత విరోధము లేదు. ప్ర. అయితే, ఏకకాలమందుసుఖదుఃఖానుసంధానము జేసెడిదానివిషయమై దృష్టాంతమేమి? ఉ. గంగయందు సగము దేహము తడిసినవానికి, ఏకకాలమం దు శీతోష్ణబుద్ధిగలిగియున్నట్లు; జ్ఞానికిని యేకకాలమందు దుఃఖానుభవకాల మందును నిజానందానుసంధానము గలిగియుండునని తెలియవలెను.

అవ. ఫలితార్థము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఇత్థంజాగరణేతత్త్వవిదోబ్రహ్మసుఖంసదా।
భాతితద్వాసనాజన్యేస్వప్నేతద్భాసతేతథా॥ ౧౩౨.

టీ. ఇత్థం- ఈపూర్వోక్తప్రకారము, జాగరణే - జాగరణావస్థయందు, సదా-ఎల్లప్పుడు, అనగా సుఖదుఃఖానుభవ దశయందును, తూష్ణీంస్థితియందున నుట. తత్త్వవిదః-జ్ఞానికి, బ్రహ్మసుఖం- బ్రహ్మానందము, భాతి - స్ఫురించుచు న్నది. తద్వాసనాజన్యే=తద్వాసనా - జాగ్రద్వాసనచేత, జన్యే- కలుగుచుం డెడి, స్వప్నే-స్వప్నావస్థయందు, తత్-ఆబ్రహ్మానందము,తథా-ఆప్రకారము, అనగా జాగ్రదవస్థయందువలెననుట. భాసతే - స్ఫురించుచున్నది.

తా. ఈపూర్వోక్తప్రకారముగా జాగరణావస్థయందు సుఖదుఃఖానుభ వకాలమందును, తూష్ణీంస్థితియందును, జ్ఞానికి బ్రహ్మసుఖము స్ఫురించుచుండు ను. మరియు, స్వప్నము, జాగ్రద్వాసనాజన్యమగుటచేత నాస్వప్నావస్థయం దును ఆబ్రహ్మసుఖము జాగ్రదవస్థయందువలెనే జ్ఞానికి స్ఫురించుచుండును.

శ్లో॥ అవిద్యావాసనాప్యస్తీత్యత స్తద్వాసనోత్థితే।
స్వప్నేమూర్ఖవదేవైషసుఖందుఃఖంచవీక్షతే॥ ౧౩౩.

టీ. అవిద్యావాసనాపి= అవిద్యా- అజ్ఞానముయొక్క, వాసనాపి- వాస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నయు, అస్తి-స్వప్నమందుగలదు. ఇత్యతః- ఈహేతువువలన, తద్వాసనోత్థితే- తద్వాసనా-ఆయవిద్యావాసనవలన, ఉత్థితే-కలిగిన, స్వప్నే - స్వప్నావస్థయందు, ఏషః- ఈజ్ఞాని, మూఢవదేవ - అవివేకివలెనే, సుఖం - సుఖమును, దుఃఖంచ- దుఃఖమునున్ను, వీక్షతే - చూచుచున్నాడు.

తా. ప్ర. అయితే, ఆనందానుభవవాసనచేతనే స్వప్నముబుట్టెడిపక్షమందు, ఆస్వప్నమందానందమే స్ఫురించుచుండవలెనుగదా? ఉ. కేవలానంద వాసనాబలమువల్లనే స్వప్నము గలుగుచుండలేదు. మరియేమనగా యవిద్యా వాసనాబలముచేతంగూడ స్వప్నముబుట్టుచున్నది. గనుక, ఆస్వప్నమందు అవిద్యావాసనయునుండుటచేత, నాస్వప్నావస్థయందు ఈజ్ఞాని, యవివేకివలెసుఖ దుఃఖముల ననుభవించుచుండునని తెలియవలెను.

అవ. ఈగ్రంథసందర్భముచేత జెప్పబడిన యర్థము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మానందాభిధేగ్రంథే బ్రహ్మానందప్రకాశకం।
యోగిప్రత్యక్షమధ్యాయేప్రథమేస్మిన్నుదీరితం॥ ౧౩౪.

టీ. బ్రహ్మానందాభిధే=బ్రహ్మానంద - బ్రహ్మానందమనెడి, అభిధే-పేరుగల, గ్రంథే-అధ్యాయపంచకమందు, అస్మిన్-ఈ, ప్రథమే- మొదటిదగు, అధ్యాయే-అధ్యాయమందు, బ్రహ్మానందప్రకాశకం= బ్రహ్మానంద-బ్రహ్మానందమును, ప్రకాశకం- ప్రకాశింపజేయునట్టి, యోగిప్రత్యక్షం=యోగి-యోగులకు, ప్రత్యక్షం - అనుభవరూపము, ఉదీరితం - చెప్పబడెను.

తా. బ్రహ్మానంద మనెడి పేరుగల యధ్యాయ పంచక గ్రంథమందు, ఈప్రథమాధ్యాయములో, సుషుప్త్యవస్థయందును, ఔదాసీన్యకాలమందును, సమాధ్యవస్థయందును, సుఖదుఃఖదశయందును స్వప్రకాశచిద్రూప బ్రహ్మానందమును ప్రకాశింపచేయునట్టి, యోగికి అనుభవరూపమగు ప్రత్యక్షము చెప్పబడెను. ఉపనిషద్వాక్యాదుల నిచ్చట జూపుటచేత, యోగి ప్రత్యక్షమనెడిపదము, శ్రీవిద్యారణ్యగురునిచే బ్రయోగించబడెనని తెలియవలెను.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థ
విద్యారణ్యమునివర్య విరచిత బ్రహ్మానందే యోగా
నందనామక మేకాదశ ప్రకరణం సమాప్తం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గద్య. ఇది శ్రీపరమేశ్వరగురు చరణ వరప్రసాదలబ్ధ బ్రహ్మవిద్యా
విరాజిత కాశ్యపసగోత్ర పవిత్ర మంత్రివంశ పయఃపారావార
పరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్య పుత్ర లక్ష్మీనారాయణా
మాత్య ప్రణీతంబైన ఆంధ్రటీకాతాత్పర్య సహిత
శ్రీవేదాంతపంచదశియందు బ్రహ్మానందనామక
గ్రంథస్థిత యోగానందమనెడి
ఏకాదశ ప్రకరణము
సంపూర్ణము.

—※—

శ్లో॥ యోగానందస్యటీకేయ మీశ్వరాంఘ్రిసమర్పితా।
నారాయణాఖ్యవిదుషా పదతాత్పర్యబోధినీ॥
ఓం తత్సత్ శ్రీపరమేశ్వరార్పణమస్తు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుభమస్తు.

శ్రీకృష్ణసద్గురు పరబ్రహ్మణేనమః.

బ్రహ్మానందమందు

# ఆత్మానంద ప్రారంభము.



అవ. ఈప్రకారముగా శ్రీవిద్యారణ్యగురుండు ప్రథమాధ్యాయమందు, వివేకికి యోగముచేత నిజానందానుభవప్రకారమునుజూపి, మూఢబుద్ధిగలిగి బ్రహ్మానందము నెరుగుట కిచ్ఛయించెడువానికి, పదార్థవివేచనముఖముచేత బ్రహ్మానందానుభవప్రకారమును జూపుటకొఱకు, ఇప్పుడాత్మానందశబ్దముచే జెప్పదగిన గ్రంథమును బ్రారంభింపుచున్నవాడగుచు, శిష్యప్రశ్నము నవతరింపజేయుచున్నాడు.

శ్లో॥ నన్వేవంవాసనానందాద్బ్రహ్మానందాదపీతరం।
వేత్తుయోగీనిజానందం మూఢస్యాత్రాస్తికాగతిః॥ ౧.

టీ. నను- ఓయీ, యోగీ - యోగముగలవాడు, ఏవం - ఈపూర్వోక్త ప్రకారము, వాసనానందాత్ - వాసనానంధముకంటెను, బ్రహ్మానందాదపి- బ్రహ్మానందముకంటెను, ఇతరం - అన్యమగు, నిజానందం - నిజానందమును, వేత్తు-అనుభవించుగాక. అత్ర-ఈయానందప్రాప్తివిషయమై, మూఢస్య-వివేకహీనునకు, గతిః-గతి, కా - ఏమి, అస్తి - కలదు.

తా. ప్ర. ఓమహాత్మా, శ్రీవిద్యారణ్యగురుమూర్తీ, ఈపూర్వాధ్యాయోక్తప్రకారముగా యోగవంతుడు వాసనానందముకంటెను, బ్రహ్మానందముకంటెనన్యమగు నిజానందమననుభవించును. ఈబ్రహ్మానందప్రాప్తి, మూఢునకెట్లుగలుగునో చెప్పుము?

అవ. ఇట్లుశిష్యునిచేత బ్రశ్నజేయబడిన శ్రీవిద్యారణ్యగురుండు, అతిమూఢునకు విద్యాధికారమేలేదని, ప్రత్యుత్తరమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ధర్మాధర్మవశాదేష జాయతాంమ్రియతామపి।
పునఃపునర్దేహలక్షైః కింనోదాక్షిణ్యాతోవద॥ ౨.

టీ. ఏవః-ఈయతిమూఢుడు, ధర్మాధర్మవశాత్ = ధర్మ - పుణ్యవశము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలనను, అధర్మవశాత్ - పాపవశమువలనను, పునఃపునః- మరలమరల, దేహలక్షైః-దేహలక్షలచేత, అనగా నపరిమిత శరీరములచేతననుట. జాయతాం-పుట్టుచుండుగాక. మ్రియతామపి - చచ్చుచుండుగాక. నః-మాయొక్క, దాక్షిణ్యతః-సామర్థ్యమువలన, కిం-ప్రయోజనమేమో, వద-చెప్పుము.

తా. ఓయిశిష్యుడా, ఈయతిమూఢుడు, అనాదిగా నీసంసారమందు గడచినజన్మములయందు జేయబడిన పుణ్యపాపలక్షణకర్మరాశివశముచేత,ననేకజన్మములనుబొందుచు చచ్చుచుండుగాక. మాయొక్క దాక్షిణ్యముచేత ప్రయోజనమేమి. అనగా ప్రయోజనములేదని యభిప్రాయము.

శ్లో॥ అస్తినోనుజిఘృక్షుత్వా ద్దాక్షిణ్యేనప్రయోజనం।
తర్హిబ్రూహిసమూఢఃకింజిజ్ఞాసుర్వాపరాఙ్ముఖః॥ ౩.

టీ. వః-మీకు, అనుజిఘృక్షుత్వాత్- శిష్యులనుద్ధరించవలెననెడియిచ్ఛ గలిగియుండుటవలన, దాక్షిణ్యేన-సామర్థ్యముచేత, ప్రయోజనం - ప్రయోజనము, అస్తి-కలదు. తర్హి-అయితే, సః-ఆ, మూఢః-మూఢుడు, జిజ్ఞాసుర్వా కిం-పరతత్వము నెరుగుట కిచ్ఛయించెడివాడో, పరాఙ్ముఖోవాకిం - బహిర్ముఖుడో, బ్రూహి - చెప్పుము.

తా. ఓమహాత్మా, శ్రీవిద్యారణ్యగురుమూర్తీ, మీకు శిష్యులనుద్ధరించవలెననెడియనుగ్రహము గలిగియుండుటచేత, మీదాక్షిణ్యమువలన ప్రయోజనముగలదని శిష్యుడుప్రార్థించెను. ఈప్రకారము శిష్యునివాక్యమును శ్రీవిద్యారణ్యగురుండువిని,-ఓశిష్యుడా, అయితే, ఆమూఢుడు, ౧. పరతత్వము నెరుగుట కిచ్ఛయించెడివాడో, లేక, ౨. బహిర్ముఖుడో చెప్పుమని వికల్పించి యడిగెను.

శ్లో॥ ఉపాస్తింకర్మవాబ్రూయాద్విముఖాయయథోచితం।
మందప్రజ్ఞంతుజిజ్ఞాసుమాత్మానందేనబోధయేత్॥ ౪.

టీ. విముఖాయ-బహిర్ముఖునికొరకు, యథోచితం-యథోచితమగు, అనగా యోగ్యతనతిక్రమించనట్టియనుట. ఉపాస్తిం - ఉపాసనమునైనను, కర్మవా-కర్మమునైనను, బ్రూయాత్- చెప్పవలెను. మందప్రజ్ఞం=మంద-జడమైన, ప్రజ్ఞం-బుద్ధిగలిగినట్టి, జిజ్ఞాసుం - పరతత్వము నెరుగుట కిచ్ఛయించెడివానిని, ఆత్మానందేన - ఆత్మానందముచేత, బోధయేత్- బోధించవలెను.

తా. ఓశిష్యుడా, మూఢునకెట్టిదైనగతి జెప్పదగునని యడిగితివి. ఆమూఢుడు, ౧. రాగముగలవాడో, ౨. విరక్తుడో చెప్పుము. తత్వజ్ఞానాపేక్షలేనియూరాగముగలవాడు, బ్రహ్మలోకాదికామముగలవాడైనయెడల, యోగ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మగు ఉపాసనమును జెప్పవలెను. మరియు, ఆమూఢుడు స్వర్గాదికామముగల వాడైనయెడల, యజ్ఞాది పుణ్యకర్మములం జేయుమని చెప్పవలెను. మరియు, ఆమూఢుడు పరతత్వము నెరుగుట కిచ్ఛయించెడివాడైనను, ౧. అతివివేకియో, ౨. మందప్రజ్ఞగలవాడో చెప్పుము. అతివివేకియైన యెడల, పూర్వాధ్యాయము నందు జెప్పబడిన ప్రకారముగా యోగముచేత బ్రహ్మసాక్షాత్కారమగును. మందబుద్ధిగలవానికి, బ్రహ్మసాక్షాత్కారోపాయమును జెప్పెదనినును. ఏపురుషుడు మందబుదిగలవాడగుచు, పరతత్వము నెరుగవలెననెడి యిచ్ఛగలవాడగునో, వానిని, ఆత్మానందనుచేతబోధించి, కృతార్థుని జేయవలెను.

శ్లో॥ బోధయామాస మైత్రేయీం యాజ్ఞవల్క్యోనిజప్రియాం।
న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియ ఇతీరయన్॥ ౫.

టీ. యాజ్ఞవల్క్యః-యాజ్ఞవల్క్యఋషీశ్వరుడు, నిజప్రియాం = నిజ-తనయొక్క, ప్రియాం-భార్యయగు, మైత్రేయీం- మైత్రేయియనెడి స్త్రీని, అరే-ఓమైత్రేయీ, పతిః-భర్త, పత్యుః భార్యయొక్క, అర్థే- ప్రయోజనమందు, ప్రియః - ప్రియుడు, నవేతి-కాదని, ఈరయన్ - చెప్పుచు, బోధయామాస-బోధించినవాడాయెను.

తా. ప్ర. అయితే, ఈప్రకారమెవనిచేనెవడు బోధింపబడెనో చెప్పుము? ఉ. యాజ్ఞవల్క్యడనెడి పేరుగలయజుశ్శాఖావిశేషప్రవర్తకుడగు ఒకానొకఋషి, మైత్రేయియనెడి తనభార్యను, (భార్యయొక్క ప్రయోజనముకొరకు భర్తప్రియుడుగాడనెడి యర్థముగల) శ్రు॥ నవా అరే పత్యుః కామాయపతిః ప్రియోభవతి॥ అనెడి యిత్యాదివాక్యములచేత బోధించినవాడాయెను.

అవ. ఆత్మ, పరప్రేమాస్పదుడగుటచేత బరమానంద రూపుడగునని, (౩౨) వ శ్లోకమందుజెప్పబోయెడిప్రకారము, పరప్రేమాస్పదత్వహేతువుచేత నాత్మకు బరమానందరూపత్వమును సాధించుట కిచ్ఛగలవాడై, మొదట పరప్రేమాస్పదత్వ హేతువును సమర్థించుటకొరకు, పూర్వోదాహృతవాక్యమును కనుపరచి ఆప్రకరణమందుగల సకలపర్యాయ వాక్యతాత్పర్యము నిప్పుడుచెప్పుచున్నాడు.

శ్లో॥ పతిర్జాయాపుత్రవిత్తేపశుబ్రాహ్మణబాహుజాః।
లోకాదేవావేదభూతేసర్వంచాత్మార్థతఃప్రియం॥ ౬.

టీ. పతిః-భర్తయు, జాయా-భార్యయు, పుత్రవిత్తే = పుత్ర- పుత్రుడును, విత్తే-ధనంబును, పశుబ్రాహ్మణబాహుజాః-పశు-పశువును, బ్రాహ్మణ-బ్రాహ్మణుడును, బాహుజాః-క్షత్రియుడును,లోకాః-లోకములును, దేవాః-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేవతలును, వేదభూతే=వేద-వేదంబును, భూతే - పృథివ్యాదిభూతంబును, స ర్వంచ-సర్వజగంబును, ఆత్మార్థతః=ఆత్మ-భోక్తయగుతనకు, అర్థతః-ప్రయో జనకారియగుటవలన, ప్రియం- ప్రీతియగుచున్నది.

తా. భర్తయు, భార్యయు, పుత్రులును, ధనంబును, పశువులును, బ్రా హ్మణులును, క్షత్రియులును, లోకములును, దేవతలును, వేదములును, పృథి వ్యాదిభూతములును, సర్వభోగ్యరాశియు, భోక్తయగు ఆత్మకు (తనకు) ప్ర యోజనకారియగుటవలన, ప్రీతివిషయత్వమును బొందుచున్నది. అనగాభర్తృ భార్యాదిభోగ్యరాశియంతయు, భోక్తకు శేషమగుటవలన, భోక్తయొక్క సం బంధముచేతనే ప్రియమగుచున్నదిగాని, భోక్తృసంబంధముగానియెడల స్వ రూపముచేత ప్రియముగాదని యభిప్రాయము. భోగ్యమనగా భోగింపదగిన వస్తువగును. శేషమనగా భోగ్యవస్తువగును.

అవ. పూర్వము ఉదాహరింపబడిన, శ్రు॥ నవా అరేపత్యుఃకామాయప తిఃప్రియోభవతి, ఆత్మనస్తుకామాయపతిః ప్రియోభవతి॥ అనెడివాక్యముయొ క్క తాత్పర్యము నిప్పుడు విభజించి చూపుచున్నాడు.

శ్లో॥ పత్యావిచ్ఛా యదాపత్న్యాస్తదాప్రీతింకరోతిసా।
క్షుదనుష్ఠానరోగాద్యైస్తదానేచ్ఛతితత్పతిః॥                    ౭.

టీ. యదా - ఎప్పుడు, పత్న్యాః - భార్యకు, పత్యౌ - భర్తయందు, ఇచ్ఛా-కామము (భవతి) కలుగుచున్నదో,తదా-అప్పుడు,సా-ఆభార్య, ప్రీతిం- స్నేహమును, కరోతి-చేయుచున్నది (యదా) ఎప్పుడు, తత్పతిః=తత్ - ఆస్త్రీ యొక్క, పతిః-భర్త, క్షుదనుష్ఠానరోగాద్యైః = క్షుత్ - ఆకలిని, అనుష్ఠాన- అనుష్ఠించుటచేతను, రోగాద్యైః-రోగాదులతోటియు (యుక్తః) కూడినవాడ గునో, తదా-అప్పుడు, నేచ్ఛతి - కోరడు.

తా. ఏకాలమందు భార్యకు భర్తృవిషయమందు కామము గలుగునో, అప్పుడు ఆభార్య, భర్తతోటి స్నేహమును చేయుచున్నది. మరియు ఏకాల మందుభర్త, ఆకలి రోగము మొదలగు ఇచ్ఛాశూన్యహేతువులతో కూడినవాడైన యెడల, అప్పుడు, ఆభార్యను కామింపడు.

అవ. ఇందువలన గలుగు ఫలితమును జెప్పుచున్నాడు.

శ్లో॥ నపత్యుర్థేసాప్రీతిఃస్వార్థఏవకరోతితాం।
పతిశ్చాత్మనఏవార్థేనజాయార్థేకదాచన॥                    ౮.

టీ. సా- ఆ, ప్రీతిః-స్నేహము, పత్యురర్థే=పత్యుః-భర్తయొక్క, అర్థే ప్రయోజనవిషయమందు, న-కాదు, స్వార్థఏవ - తనప్రయోజనమందే, తాం-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆస్నేహమును, కరోతి-చేయుచున్నది. పతిశ్చ - భర్తయు, ఆత్మనః- తనయొక్క, అర్థేఏవ-ప్రయోజనమందే (ప్రీతింకరోతి) స్నేహమును జేయుచున్నాడు. జాయాయాః అర్థే=జాయాయా-భార్యయొక్క, అర్థే-ప్రయోజనమందు, కదాచన - ఎప్పుడును, న-స్నేహమును జేయడు.

తా. ప్ర. అయితే ఇట్లగుచుండగా ఫలితమేమి? ఉ. భార్యచే జేయబడెడిస్నేహము భర్తయొక్క ప్రయోజనముకొరకుగాదు. మరియేమనగాతనయొక్క ప్రయోజనముకొరకే భర్తతోటి స్నేహమును జేయుచున్నదని తెలియవలెను. మరియు, భర్త, భార్యయొక్క ప్రయోజనముకొరకు భార్యయందు స్నేహమును జేయడనియు, తనప్రయోజనముకొరకే భార్యయందు స్నేహము జేయుచున్నాడనియు జెప్పెడి శ్రు॥ నవా అరేజాయాయైః కామాయజాయాప్రియాభవత్యాత్మనస్తు కామాయజాయాప్రియాభవతి॥ అనెడి మైత్రేయశాఖాస్థిత ఇత్యాదివాక్యము మొదలుకొని, సర్వభోగ్యరాశియొక్క ప్రయోజనముకొరకు సర్వభోగ్యరాశియు స్నేహవిషయముగాదనియు, భోక్తయగు తనకు సర్వభోగ్యప్రపంచము స్నేహవిషయమగుచున్నదనియుం జెప్పెడి శ్రు॥ నవా అరేసర్వస్యకామాయ సర్వంప్రియంభవతి ఆత్మనస్తుకామాయ సర్వంప్రియం భవతి॥ అనెడి వాక్యాంతరమువరకుగల వాక్యతాత్పర్యమును గ్రమముగా జెప్పెదవినుము. భర్తయు భోక్తయగు తన ప్రయోజనముకొరకే భార్యయందు స్నేహము జేయుచున్నాడుగాని భార్యయొక్క ప్రయోజనముకొరకు యెప్పటికిని స్నేహము జేయుటలేదు.

శ్లో॥ అన్యోన్యప్రేరణేప్యేవం స్వేచ్ఛయైవప్రవర్తనం॥ ౯.

టీ. అన్యోన్యప్రేరణేపి=అన్యోన్య-భర్తృభార్యలిద్దరొకరొకరు, ప్రేరణేపి- కామించుటయందును, ఏవం-ఈపూర్వోక్తప్రకారము, స్వేచ్ఛయైవ-తనయిచ్ఛచేతనే, అనగా స్వప్రయోజనముచేతనే యనుట. ప్రవర్తనం- ప్రవర్తనమగును.

తా. ప్ర. అయితే, భార్యాభర్తలలో నొక్కొకరి కామము, స్వప్రయోజనముకొరకైనను, ఏకకాలమం దిరువురకు నొకరొకరిమీద గలిగెడి కామము, ఉభయప్రయోజనముకొరకు గాదాయేమి? ఉ. ఏకకాలమందిరువురకు నొకరొకరిమీద కామము గలిగినను పూర్వోక్తప్రకారము స్వేచ్ఛచేతనే ప్రవర్తనము గల్గుచున్నది. అనగా నేకకాలమందు భర్తృభార్యలకిద్దరికి నొకరొకరిమీద గలిగెడి కామంబును, తన తన ప్రయోజనముకొరకే యగుగాని, ఇతర ప్రయోజనముకొరకుగాదని యభిప్రాయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. స్వేచ్ఛచేత ప్రవర్తించుటను జూపుచున్నాడు.

శ్లో॥ శ్మశ్రుకంటకవేధేన బాలోరుదతితత్పితా।
చుంబత్యేవనసాప్రీతిర్బాలార్థేస్వార్థఏవహి॥ ౧౦.

టీ. బాలః-బాలకుడు, శ్మశ్రుకంటకవేధేన=శ్మశ్రు - మీసములు అనే, కంటక-ముండ్లయొక్క, వేధేన- బాధచేత (తండ్రియొక్కమీసములు గ్రుచ్చుకొనెడి బాధచేత) రుదతి- దుఃఖించుచున్నాడు. తత్పితా-వానియొక్కతండ్రి, చుంబత్యేవ- ముద్దుగొనుచున్నవాడేను. సా-ఆ, ప్రీతిః-ప్రీతి, బాలార్థే=బాల-బాలునియొక్క, అర్థే - ప్రయోజనమునందు, న-కాదు. స్వార్థఏవహి=స్వ-తనయొక్క, అర్థఏవహి - ప్రయోజనవిషయమందే యగును.

తా. తండ్రిచేత జేయబడుచుండెడి, పుత్రముఖమును ముద్దుబెట్టుకొనుటమొదలగు విషయము, పుత్రునియొక్క సంతోషముకొరకుగాదు. అట్లుముద్దుబెట్టుకొనుటచేత తండ్రియొక్క మీసములు బాలునియొక్క ముఖమునందు గ్రుచ్చుకొనెడి బాధవలన బాలునిసంతోషముకొరకు గాదనియు, తండ్రియొక్క సంతోషము కొరకేననియుం దెలియవలయును.

అవ. చేతనులగు భర్తృభార్యాపుత్రాదులయందు చేయబడెడి ప్రీతికి, స్వప్రయోజనత్వ, పరప్రయోజనత్వ సందేహముకలుగుటవలన, అచేతనత్వముచేత, ఇచ్ఛయేలేని, ధనవిషయమునకు అట్టిసందేహమేలేదని శ్రీవిద్యారణ్యగురుండుతలచి, ఓమైత్రేయీ, ధనముయొక్కసంతోషముకొరకు ధనముప్రీతివిషయత్వమును బొందుచుండలేదనియు, తనయొక్కసంతోషముకొరకే ధనము ప్రీతివిషయత్వమును బొందుచున్నదనియుంజెప్పెడి, శ్రు॥ నవాఅరేవిత్తస్య కామాయవిత్తం ప్రియంభవత్యాత్మనస్తుకామాయవిత్తంప్రియంభవతి॥ అనెడివాక్యముయొక్క తాత్పర్యము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ నిరిచ్ఛంరత్నాదివిత్తంయత్నేనపాలయన్।
ప్రీతింకరోతిసాస్వార్థేవిత్తార్థత్వంనశంకితం॥ ౧౧.

టీ. నిరిచ్ఛం- ఇచ్ఛనుచేయనిద్దైన, రత్నాదివిత్తమపి= రత్న-రత్నములే, ఆది- మొదలుగాగల, విత్తమపి- ధనమునున్నూ, యత్నేన - ప్రయత్నముచేత, పాలయన్- కాపాడుచున్నవాడగుచు, ప్రీతిం - స్నేహమును, కరోతి- జేయుచున్నాడు. సా-ఆప్రీతి, స్వార్థే=స్వ-తనయొక్క, అర్థే-ప్రయోజనమందే యగును. విత్తార్థత్వం=విత్త- ధనముయొక్క, అర్థత్వం - ప్రయోజనమునుగూర్చి, నశంకితం - సందేహింపబడదు.

తా. మరియు, ఇచ్ఛనుచేయని రత్నాదిధనమునుగూడా, పురుషుడుయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్నముచేత, కాపాడుచు ఆరత్నాది ధనమందు ప్రీతిని జేయుచున్నాడు. అట్లు జేసెడి ప్రీతిపురుషుని ప్రయోజనముకొరకే యగుచున్నదిగాని, ధనముయొక్క ప్రయోజనముకొరకు చేయబడుచున్నదని సందేహింపరాదు.

అవ. చేతనత్వమందును బరువునువహించుట మొదలగు ఇచ్ఛలేనిపశువిష యమయిన శ్రు॥ నవాఅరేపశూనాం॥ అనెడి వాక్యముయొక్క తాత్పర్యము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ అనిచ్ఛతిబలీవర్దేవివాహయిషతేబలాత్।
ప్రీతిస్సావణిగర్థైవ బలీవర్దార్థతాకుతః॥ ౧౨.

టీ. బలీవర్దే-వృషభము, అనిచ్ఛత్యపి - బరువుమోయుట కిచ్ఛలేని దైనను, బలాత్-బలాత్కారమువలన, వివాహయిషతే-వహించుటకు ఇచ్ఛయించుచున్నది. సా-ఆ, ప్రీతిః-ప్రీతి, వణిగర్థైవ=వణిక్ - వర్తకునియొక్క, అర్థైవ-ప్రయోజనముకొరకేగలదియగును. బలీవర్దార్థతా=బలీవర్ద- వృషభముయొక్క, అర్థతా-ప్రయోజనత్వముగలది, కుతః - ఎట్లుఅగును.

తా. వృషభము, బరువుమోయుటకిచ్ఛలేనిదైనను బలాత్కారమువలన వహించుటకు ఇచ్ఛయించుచున్నది. ఆప్రీతివర్తకునియొక్క ప్రయోజనముకొరకు గలదియగునేగాని, వృషభముయొక్క ప్రయోజనముకొరకు గలది యెప్పటికినికాదు.

అవ. శ్రు॥ నవాఅరేబ్రహ్మణఃకామాయ, అనేవాక్యముయొక్క తాత్పర్యమును జెప్పుచున్నాడు.

శ్లో॥ బ్రాహ్మణ్యంమేఽస్తిపూజ్యోఽహమితితుష్యతిపూజయా।
అచేతనాయానోజాతేస్సంతుష్టిఃపుంసఏవసా॥ ౧౩.

టీ. మే-నాకు, బ్రాహ్మణ్యం - బ్రాహ్మణత్వము, అస్తి-కలదు, అహం-నేను, పూజ్యః=పూజింపదగినవాడనగుదును. ఇతి-ఈలాగున, పూజయా-పూజచేత, తుష్యతి- సంతోషించుచున్నాడు. సా-ఆ, సంతుష్టిః-సంతోషము, అచేతనాయాః - జడమగు, జాతేః - బ్రాహ్మణజాతికి, న-కాదు, పుంసఏవ- పురుషునకే యగును.

తా. బ్రాహ్మణ్యనిమిత్తకమగు పూజచేత నేనుబ్రాహ్మణుడనసెడి అభిమానముగలవాడే సంతోషమునుబొందుచున్నాడు. అట్టిపూజచేత అచేతనమగు బ్రాహ్మణజాతికి సంతోషము గలదని జెప్పరాదు.

అవ. శ్రు॥ నవాఅరేక్షత్రస్య॥ ఈమొదలుగాగల వాక్యముయొక్క తాత్పర్యమును జెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ క్షత్రియోఽహం తేనరాజ్యంకరోమీత్యత్ర రాజతా।
నజాతేర్వైశ్యజాత్యాదౌ యోజనాయేదమీరితం॥ ౧౪.

టీ. అహం-నేను, క్షత్రియః-రాజునగుదును. తేన-అందుచేత, రాజ్యం-ప్రభుత్వమును, కరోమి-చేయుచున్నాను. ఇతి-ఈలాగున, అత్ర-ఇచ్చట, రాజతా-రాజభావము, జాతేః-జడమగు క్షత్రియజాతికి, న-లేదు. ఇదం-ఈయర్థము, వైశ్యజాత్యాదౌ=వైశ్య- కోమటియొక్క, జాత్యాదౌ- కులాదికమందు; యోజనాయ-అన్వయించుటకొరకు, ఈరితం - పలుకబడెను.

తా. నేనుక్షత్రియుడ నగుదుననియు, అందుచే రాజ్యమును చేయుచున్నాననెడి, లోకవ్యవహారమందు, రాజ్యమననుభవించెడి సుఖమును క్షత్రియత్వజాతి గలవానికేగలదని జెప్పవలయుగాని, జడమగు క్షత్రియత్వజాతికిగలదని జెప్పరాదని, శ్రు ॥ నవా అరే క్షత్రస్య॥ అనెడి వాక్యము చెప్పుచున్నది. ఇటుచెప్పుటచేత నిట్టియర్థమును వైశ్యజాత్యాదికమందు నూహించి, యెరుగవలెను.

అవ. శ్రు॥ నవాఅరేలోకానాం కామాయ ॥ ఈమొదలగు వాక్యముల యొక్క తాత్పర్యమును జెప్పుచున్నాడు.

శ్లో॥ స్వర్గలోకబ్రహ్మలోకౌస్తాంమమేత్యభివాంఛనం।
లోకయోర్నోపకారాయస్వభోగాయైవ కేవలం॥ ౧౫.

టీ. మమ-నాకు, స్వర్గలోక బ్రహ్మలోకౌ = స్వర్గలోక - స్వర్గలోకంబును, బ్రహ్మలోకౌ-బ్రహ్మలోకంబును, స్తాం-కలుగుగాక, ఇతి - ఈలాటి, అభివాంఛనం-కోరిక, లోకయోః - స్వర్గలోక బ్రహ్మలోకములయొక్క, ఉపకారాయ-ప్రయోజనముకొరకు, న- కాదు, కేవలం- ముఖ్యముగాను, స్వభోగాయైవ=స్వ-తనయొక్క, భోగాయైవ- అనుభవముకొరకే యగును.

తా. నాకు, స్వర్గలోక బ్రహ్మలోకంబులు గలుగుగాకయనెడి కోరిక, ఆస్వర్గలోక, బ్రహ్మలోకములయొక్క, ప్రయోజనముకొరకుగాదు. మరియేమనిన, ముఖ్యముగా తనయొక్క భోగముకొరకే యగునని తెలియవలెను. ఈశ్లోకమందు, స్వర్గలోక బ్రహ్మలోకములనెడి, లోకద్వయమును చెప్పుటచేత, నాలోకద్వయప్రాప్తికలుగుటకు, ఉపాదానకారణమైన కర్మోపాసనా లక్షణముగల సాధనద్వయమును,సంపాదించి సకలలోకములను జూపబడినట్లాయెనని తెలియవలెను.

శ్లో॥ ఈశవిష్ణ్వాదయోదేవాః పూజ్యంతేపాపనష్టయే।
నతన్నిష్పాపదేవార్థం తత్తుస్వార్థంప్రయుజ్యతే॥ ౧౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఈశవిష్ణ్వాదయః= ఈశ- శివుడును. విష్ణు - విష్ణువును, ఆదయః- మొదలుగాగల, దేవాః-దేవతలు, పాపనష్టయే=పాప - పాపముయొక్క, నష్టయే-నివృత్తికొరకు, పూజ్యంతే- పూజింపబడుచున్నారు. తత్- ఆపూజ, నిష్పాపదేవార్థం=నిష్పాప-పాపశూన్యులగు, దేవార్థం - దేవతలకొరకు, న - కాదు. తత్తు-ఆపూజయో, స్వార్థం-పూజ జేసెడి తనకొరకు, ప్రయుజ్యతే - ప్రయోజనమును బొందుచున్నది.

తా. మరియు, రుద్రుడును, విష్ణుండును, బ్రహ్మమొదలుగాగలదేవతలు పాపనివృత్తికొరకు, పూజింపబడుచున్నారు. ఆపూజస్వతఃపాపశూన్యులగు దేవతలయొక్క ప్రయోజనముకొరకు జేయుటలేదు. మరియేమనగా, ఆపూజ, పూజించెడి తనయొక్క ప్రయోజనముకొరకే ఉపయోగించుచున్నదని తెలియవలెను.

శ్లో॥ ఋగాదయోహ్యధీయంతేదుర్బ్రాహ్మణ్యానవాప్తయే।
నతత్ప్రసక్తంవేదేషుమనుష్యేషుప్రసజ్యతే॥ ౧౭.

టీ. ఋగాదయః - ఋగ్వేదాదులు, దుర్బ్రాహ్మణ్యానవాప్తయే= దుర్బ్రాహ్మణ్య - దౌర్బ్రాహ్మణ్యముయొక్క, అనవాప్తయే - పొందమికొరకు, అధీయంతే- అధ్యయనము జేయబడుచున్నవి. హి - ఇది ప్రసిద్ధము, తత్- ఆదౌర్బ్రాహ్మణ్యత్వమును బొందమి, వేదేషు-వేదములయందు, నప్రసక్తం- సంబంధింపబడదు. మనుష్యేషు - వేదాధికారులయందు, ప్రసజ్యతే-ప్రయోజనమును బొందుచున్నది.

తా. మరియు, ఋగ్వేదాదులు, దౌర్బ్రాహ్మణ్యత్వమును పొందమికొరకు అధ్యయనము జేయబడుచున్నవి. [ఆదౌర్బ్రాహ్మణ్యత్వమును] (వ్రాత్యత్వమును) బొందమి, వేదములయందు, సంబంధింపబడదు. మనుష్యులలో వేదాధికారులగు బ్రాహ్మణాదులయందు ప్రయోజనమును బొందుచున్నదని తెలియవలెను.

శ్లో॥ భూమ్యాదిపంచభూతానిస్థానతృట్పాకశోషణైః।
హేతుభిశ్చావకాశేనవాంఛంత్యేషాంనహేతవః॥ ౧౮.

టీ. (సర్వేప్రాణినః) సమస్త ప్రాణులును, స్థానతృట్పాకశోషణైః= స్థాన-స్థితినిచ్చుటయు, తృట్- దప్పిదీర్చుటయు, పాక - పక్వము జేయుటయు, శోషణైః-ఎండించుటయనునట్టియు, అవకాశేనచ - అవకాశము నిచ్చుటయనునట్టి, హేతుభిః-నిమిత్తములచేత, భూమ్యాదిపంచభూతాని= భూమ్యాది-భూమిమొదలగు, పంచభూతాని-పంచభూతములను, వాంఛంతి- అపేక్షించుచున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏషాం-ఈపృథివ్యాదిభూతములకు, హేతవః - పూర్వోక్త ప్రయోజన నిమిత్తములు, న-లేవు.

తా. సమస్తప్రాణులును, స్థితినిచ్చుటయనెడి నిమిత్తముచేత, భూమిని అపేక్షించుచున్నారు. దప్పిదీర్చుట యనెడి నిమిత్తముచేత, జలమును అపేక్షించుచున్నారు. వంటజేయుటయనెడి నిమిత్తముచేత, అగ్నిని అపేక్షించుచున్నారు. తడినిశోషింపజేయుట యనెడి నిమిత్తముచేత, వాయువును అపేక్షించుచున్నారు. అవకాశము ఇచ్చుటయనెడి నిమిత్తముచేత, ఆకాశమును అపేక్షించుచున్నారు. ఈపృథివ్యాది పంచభూతములకును పూర్వోక్త ప్రయోజన నిమిత్తములగు అపేక్షలులేవని తెలియవలెను.

శ్లో॥ స్వామిభృత్యాదికంసర్వఃస్వోపకారాయవాంఛతి।
తత్తత్కృతోపకారస్తుతస్యతస్యనవిద్యతే॥ ౧౯.

టీ. (సర్వోజనః) సమస్తజనంబును, స్వామి భృత్యాదికం = స్వామి-ప్రభువును, భృత్యాదికం - భృత్యుడుమొదలగు, సర్వం- సర్వజనమును, స్వోపకారాయ=స్వ-తమయొక్క, ఉపకారాయ- ప్రయోజనముకొరకు, వాంఛతి-అపేక్షించుచున్నది. తత్తత్కృతోపకారస్తు= తత్తత్ - ఆరాజభృత్యాదికముకొరకు, కృత-చేయబడెడి, ఉపకారస్తు-ప్రయోజనమో, తస్యతస్య - ఆయారాజభృత్యాదికమునకు, నవిద్యతే - కాదు.

తా. మరియు, సందరును, రాజభృత్యాది సర్వజనంబును తమతమప్రయోజనముకొరకు నపేక్షించుచున్నారు. ఆరాజభృత్యాదికము కొరకు జేయబడెడి యుపకారంబును, తమతమ సౌఖ్యనిమిత్తముకొరకే యగుగాని, ఆరాజభృత్యాదిసౌఖ్యనిమిత్తముకొరకుగాదని తెలియవలెను. అనగా రాజాదిజనము తమతమప్రయోజనముకొరకే భృత్యాదికమునకు ధనాదిద్రవ్యమునిచ్చుచున్నారుగాని, భృత్యాదిజనప్రయోజనముకొరకిచ్చుటలేదని యభిప్రాయము.

శ్లో॥ సర్వవ్యవహృతిష్వేవమనుసంధాతుమీదృశం।
ఉదాహరణబాహుళ్యం తేనస్వాంవాసయేన్మతిం॥ ౨౦.

టీ. ఏవం-ఈప్రకారము, సర్వవ్యవహృతిషు=సర్వ-సమస్తములగు,వ్యవహృతిషు-భోజనాదివ్యవహారములయందు, అనుసంధాతుం - అనుసంధానము జేయుటకొరకు, ఈదృశం-ఈలాటి, ఉదాహరణబాహుళ్యం = ఉదాహరణ-భర్తృభార్యాదిరూప ఉదాహరణముయొక్క, బాహుళ్యం - బహుళత్వము, [ఉక్తం] శ్రుతియందుచెప్పబడెను. తేన-ఆకారణముచేత, మతిం-బుద్ధిని,స్వాం-భోక్తయగు తనయందు మిక్కిలి ప్రీతిగలదానినిగా, వాసయేత్ - నివసింపజే


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యవలెను.

తా. ప్ర. అయితే ఇట్లు వేదమందు అనేకోదాహరణములు ఎందుకొరకు జూపబడెను?

ఉ. ఇచ్ఛాపూర్వకములగు భోజనాదిసర్వవ్యవహారములయందును, భోక్తయగుతనకు సర్వప్రపంచము ప్రీతివిషయత్వమును బొందుచున్నదనిజెప్పెడి, శ్రు. ఆత్మనస్తుకామాయ సర్వంప్రియంభవతి. అనెడి శ్రుతిప్రకారము అనుసంధానము జేయుటకొరకు, భర్తృభార్యాదులయందు ప్రీతినిజూపెడి పూర్వోక్తఉదాహరణవిశేషములు శ్రుతియందుజెప్పబడెనని తెలియవలెను. ఆకారణముచేత సర్వభోగ్యప్రపంచంబును భోక్తయగు తనకు శేషమగుటవలన, బుద్ధికి భోగ్యపదార్థములయందుగల ప్రీతినిమరలించి భోక్తయగు తనయందు బుద్ధినిమిక్కిలి ప్రీతిగలదానినిగా జేయవలయునని యభిప్రాయము.

అవ. ఇప్పుడు రెండుశ్లోకములచే ప్రీతిస్వరూపమును ప్రశ్నోత్తరరూపముగా దెలుపుచున్నాడు.

శ్లో॥ అథకేయంభవేత్ప్రీతి శ్శ్రూయతే యానిజాత్మని।
రాగోపథ్వాదివిషయే శ్రద్ధాయాగాదికర్మణి॥ ౨౧.

శ్లో॥ భక్తిస్స్యాద్గురుదేవాదావిచ్ఛాత్వప్రాప్తవస్తుని।
తర్హ్యస్తుసాత్వికీవృత్తిస్సుఖమాత్రానువర్తినీ॥ ౨౨.

టీ. నిజాత్మని-తనస్వరూపమందు, యా-ఏ, ప్రీతిః-ప్రేమ, శ్రూయతే-వినబడుచున్నదో, ఇయం-ఈప్రీతి, అథకా-యెటువంటిది. రాగః - కామము, పథ్వాదివిషయే - స్త్రీమొదలగు విషయమందు, స్యాత్-అగును. శ్రద్ధా-ఆసక్తి, యాగాదికర్మణి-యజ్ఞాదిక్రియయందు, స్యాత్-అగును. భక్తిః-భక్తి, గురుదేవాదౌ=గురు- మాతాపిత్రాది గురుజనమందును, దేవాదౌ-శివకేశవాదిదేవతలయందును, స్యాత్ - అగును. ఇచ్ఛాతు-కోరికయో, అప్రాప్తవస్తుని= అప్రాప్త-సంప్రాప్తముగాని, వస్తుని- వస్తువునందు,స్యాత్-అగును. (ఇతిచేత్) ఇట్లంటివేని. తర్హి-సరి యంగీకరించితిని, సుఖమాత్రానువర్తిని=సుఖమాత్ర - సౌఖ్యమునుమాత్రము, అను - అనుసరించి, వర్తినీ - ప్రవర్తించుచుండెడి, సాత్వికీ-సత్వగుణ పరిణామరూపమగు, వృత్తిః - బుద్ధివృత్తి, (ప్రీతిః) ప్రీతి, అస్తు-అగుగాక.

తా. ప్ర. అయితే భర్తృభార్యాదిభోగ్య ప్రపంచమంతయు భోక్తయగు ఆత్మకు శేషమగుటచేత, ప్రీతివిషయత్వమునుజెప్పుటవలన, ఆత్మకు పరమప్రీతివిషయత్వమెట్లు జెప్పబడునో, జెప్పుము. మరియు స్త్రీమొదలగు విషయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మందు రాగముగలుగునేగాని యజ్ఞాదికమందు గలుగదు. శ్రద్ధయో, యజ్ఞాదులయందుగలుగునేగాని, స్త్రీమొదలగు విషయమందుగలుగదు, భక్తియో, గురుదేవాదులయందుగలుగునేగాని, ఇతరవిషయములయందు గలుగదు. ఇచ్ఛయో, లభింపబడని వస్తువిషయమందు గలుగునేగాన్ని, ఇతర విషయమందు గలుగునని జెప్పరాదు. గనుక, ప్రీతి, సర్వవిషయత్వముగలది గామిచేత, ప్రీతిని నిరూపించుటకు శక్యముకానేకాదు గదా? ఉ. సరి. ఈనాలుగుపక్షముల ప్రకారము గాక మరియొకపక్షప్రకారము ఉత్తరమును జెప్పెదవినుము. ప్రీతికి పూర్వోక్తప్రకారము రాగశ్రద్ధాభక్తీచ్ఛా స్వరూపంబులు లేకపోవుచుండగా సుఖమాత్రముననుసరించి వర్తించెడి సత్వగుణపరిణామ రూపముగల చిత్తవృత్తియే ప్రీతియగునని తెలసికొనుము.

అవ. ఆప్రీతి, ఇచ్ఛగాదని ప్రశ్నోత్తర రూపంబుగా జెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రాప్తేనష్టేపిసద్భావాదిచ్ఛాతోవ్యతిరిచ్యతే।
సుఖసాధనతోపాధేరన్నపానాదయఃప్రియాః॥ ౨౩.

టీ. (ప్రీతిః) ప్రీతి, ప్రాప్తే-సుఖాదిప్రాప్తియందును, నష్టేపి- సుఖాదివిషయనాశనమందును, సద్భావాత్ - ఉండుటవలన, ఇచ్ఛాతః-ఇచ్ఛకంటె, వ్యతిరిచ్యతే- భేదింపబడుచున్నది. అన్నపానాదయః=అన్న-ఆహారంబును, పాన-జలంబును, ఆదయః - మొదలగు విషయములు, సుఖసాధనతోపాధేః = సుఖ-సుఖమే, సాధనతా - సాధనత్వముగాగల, ఉపాధేః-ఉపాధివలన, ప్రియాః-ప్రీతివిషయత్వమును బొందుచున్నది.

తా. ప్ర. అయిలే ఆప్రీతి, ఇచ్ఛయేయగుగదా? ఉ. ఇచ్ఛ యనునది, సంప్రాప్తముగాని సుఖాదిమాత్రవిషయముగలదగుచున్నది. ఈప్రీతియో,సుఖవిషయములభించినప్పుడును, నష్టమగునప్పుడును, నిలచియుండుటవలన, ఇచ్ఛకంటె అన్యమైనదగుచున్నది.

ప్ర. అయితే సౌఖ్యసాధనోపాధివలన నన్నపానాదులయందువలె నాత్మయందును ప్రీతిగనుపడుటచేత, ఆత్మయు అన్నాదిపదార్థమువలె ప్రీతివిషయత్వముగలది యగునని జెప్పరాదాయేమి?

శ్లో॥ ఆత్మానుకూల్యాదన్నాదిసమశ్చేదమునాకృతః।
అనుకూలయితవ్యస్స్యాదైకస్మినుకర్తృతా॥ ౨౪.

టీ. ఆత్మా-ప్రత్యగాత్మ, ఆనుకూల్యాత్ - అనుకూలత్వమువలన, అనగా ఇష్టత్వమువల్లననుట. అన్నాదిసమశ్చేత్ - అన్నాదిపదార్థముతో సమానుడనియంటివేని, అమునా-సుఖసాధనమగుటచే ననుకూలుడగు నీయాత్మచేత,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనుకూలయితవ్యః- అనుకూలింపచేయదగినవాడు, అనగా సుఖింపజేయదగిన వాడనుట. అత్ర-ఈలోకమందు, కః-ఎవడు, స్యాత్-అగును. అనగా నెవ్వడు లేడనుట. ఏకస్మిన్- ఒకవస్తువునందు, కర్మకర్తృతా- కర్మత్వకర్తృత్వద్వయము, న-సంభవింపదు.

తా. ప్ర. మరియు వివాదాస్పదుడగు ఆత్మ అన్నపానాదులవలె నిష్టుడైనందున సుఖసాధనమగుటకు తగుచున్నాడని అనుమానప్రమాణముచేత నిశ్చయింపరాదాయేమి? ఉ. అన్నపానాదులయందు భోగ్యత్వము ఉపాధిగానున్నది. అనగా నన్నపానాదులు భోగ్యములైనందున సుఖసాధనములైనవిగాని ప్రియత్వముచేతగాదు. ఆత్మ, భోగ్యుడైనయెడల, మరియొకభోక్తకావలసియుండును. ఈలోకమందు ఆత్మకంటెనన్యుడైనభోక్త, లేమిచేత, ఆత్మ, అన్నపానాదులవలె సుఖసాధనముగానేరదు. ప్ర. అయితే, ఆత్మ, తానే, ౧. సుఖసాధనంబును, ౨. సుఖభోక్తయును గాగూడదాయేమి? ఉ. ఒకయాత్మకే ఏకకాలమందు ౧. ఉపకార్యత్వరూపమగు భోక్తృత్వంబును, ౨. ఉపకారకత్వరూపమగు భోగసాధనత్వంబును ఈరెండు ధర్మములు గలవని చెప్పుటచేత, న్యాయవిరోధమగునని తెలియవలెను.

శ్లో॥ సుఖేవైషయికేప్రీతిమాత్రమాత్మాత్వతిప్రియః।
సుఖేవ్యభిచరత్యేషానాత్మనివ్యభిచారిణీ॥ ౨౫.

టీ. వైషయికే-విషయజన్యమగు, సుఖే - సుఖమందు, ప్రీతిమాత్రం-ప్రీతిమాత్రమే యగును. ఆత్మాతు- ప్రత్యగాత్మయో, అతిప్రియః-నిరతిశయప్రీతివిషయుడగును. ఏషా-ఈప్రీతి, సుఖే- విషయజన్యసుఖమందు, వ్యభిచరతి-మరియొకవిషయమునుగురించి పోవుచున్నది. ఆత్మని- ప్రత్యగాత్మయందు,వ్యభిచారిణీ - మరియొక విషయమునుగూర్చి పోవునది, న-కాదు. అనగా ఆత్మయందుగల ప్రీతి మరియొకవిషయసుఖము నపేక్షించదనుట.

తా. ప్ర. అయితే, ఆత్మకు అన్నాదికమునకువలె సుఖసాధనత్వములేకపోయినను, సుఖమువలె, ఆత్మ, భోక్తకుశేషత్వము కారాదాయేమి? ఉ. విషయజన్యమగు సుఖమందు, ప్రీతిమేకలముగాని, నిరతిశయప్రియములేదు. ప్రత్యగాత్మయో, నిరతిశయప్రీతివిషయుడగుటవలన, సుఖమువలె భోక్తకు శేషత్వమునుబొందడని తెలియవలెను. ప్ర. అయితే ఈరెండుపక్షములయందును తగినకారణమేమి? ఉ. విషయసుఖమందుగల ప్రీతి మరియొక విషయసుఖమునుగూర్చిపోవుచున్నది. అందుచే విషయసుఖమందు ప్రీతిమాత్రమే యగును. ప్రత్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాత్మయందుగల ప్రీతి, మరియొక విషయసుఖాపేక్షగలదిగామిచేత నిరతిశయత్వము గలదియగునని తెలియవలెను.

అవ. విషయసుఖగోచరప్రీతికి, వ్యభిచారంబును, ఆత్మయందుగల ప్రీతికి, అవ్యభిచారంబునుం జూపుచున్నాడు.

శ్లో॥ ఏకంత్యక్త్వాన్యదాదత్తే సుఖంవైషయికంసదా।
నాత్మాత్యాజ్యోనచాదేయ స్తస్మిన్వ్యభిచరేత్కథమ్॥ ౯౬.

టీ. (ప్రీతిః) విషయసుఖమందుగలప్రీతి, సదా-ఎల్లప్పుడును, ఏకం- ఒకటియగు, వైషయికం-విషయజన్యమైనట్టి, సుఖం-సుఖమును, త్యక్త్వా- విడిపించి, అన్యత్-మరియొకవిషయసుఖమును, ఆదత్తే- గ్రహించుచున్నది. ఆత్మా-ప్రత్యగాత్మ, త్యాజ్యః - విడువదగినవాడు, న-కాడు. ఆదేయశ్చ- గ్రహింపదగినవాడును, న-కాడు. తస్మిన్ - ఆఆత్మయందు, కథం - యెట్లు, వ్యభిచరేత్ - వ్యభిచరించును. అనగా ఆత్మయందుగల ప్రీతి, మరియొక విషయసుఖమును గురించి పోదనుట.

తా. మరియు విషయసుఖమందుగల ప్రీతి, సర్వదా, ఒక్కొక్క విషయసుఖమును విడిపించి, మరియొక విషయ సుఖమును గ్రహించు చుండును. ఆత్మ, విషయసుఖమువలె, విడుచుటకును, గ్రహించుటకును, అయోగ్యుడగుటవలన, విడువధగినవాడును,గ్రహించధగినవాడునుంగాడు. ప్ర. సరి. ఇట్లు చెప్పుటచేత ప్రయోజనమేమి? ఉ. ఆత్మయందుగలప్రీతి మరియొక సుఖమును కోరమిచేత, నిరతిశయత్వముగలదియగునని, యెరుగవలెను.

శ్లో॥ హానాదానవిహీనేస్మిన్నుపేక్షాచేత్తృణాదివత్।
ఉపేక్షితుస్స్వరూపత్వాన్నోపేక్ష్యత్వంనిజాత్మనః॥ ౯౭.

టీ. హానాదానవిహీనే=హాన-విడుచుటయు, ఆదాన - గ్రహించుటయు, విహీనే-లేని, అస్మిన్ - ఈప్రత్యగాత్మయందు, తృణాదివత్- గడ్డిపోరకమొదలగు వానికివలె, ఉపేక్షాచేత్ - ఉదాసీనత్వముగలుగునని అంటివేని, ఉపేక్షితుః-ఉపేక్ష జేసెడివానియొక్క, స్వరూపత్వాత్ - స్వరూపమగుటవలన, నిజాత్మనః- తనస్వరూపమగు ప్రత్యగాత్మకు, ఉపేక్ష్యత్వం - ఉపేక్షా విషయత్వము, న-కలుగదు.

తా. ప్ర. అయితే ఆత్మ, విడుచుటకును, గ్రహించుటకును, విషయుడుకాకపోయినను, తృణాదికమువలె, ఉపేక్షావిషయుడు కారాదాయేమి? ఉ. తృణాదికమువలె, ఉపేక్షావిషయత్వమును పొందుటకు, ఆత్మ, అయోగ్యుడౌటవలన, అట్టి ఆత్మకు, తృణాదికమునకువలె, ఉపేక్షావిషయత్వంబును సంభవిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పడు. ప్ర. అదియెట్లు? ఉ. ఉపేక్షజేసెడివానికి, యేఅవినాశిస్వరూపము గల దో, అట్టిస్వరూపము (ఆత్మ) తనస్వరూపుడగుట వలననే తనకంటే, అన్య మగు, తృణాదికమునకువలె, ఆత్మకుడపేక్షావిషయత్వము, సంభవింపదని తెలి యవలెను.

శ్లో॥ రాగక్రోధాభిభూతానాంముమూర్షావీక్ష్యతేక్వచిత్।
తతోద్వేషాద్భవేత్త్యాజ్య ఆత్మేతియదితన్నహి॥ ౨౮.

టీ. రాగక్రోధాభిభూతానాం-రాగ- రాగముచేతను, క్రోధ-క్రోధము చేతను, అభిభూతానాం - తిరస్కరింపబడినవారికి, క్వచిత్ - ఒకానొకప్పు డు, ముమూర్షా-మరణేచ్ఛ, వీక్ష్యతే - కనుపడుచున్నది. తతః - ఆకారణమువ లన, ఆత్మా-ప్రత్యగాత్మ- ద్వేషాత్- ద్వేషమువలన, త్యాజ్యః - విడువదగిన వాడు, భవేదితి- అగునని, ఉచ్యతేయది- చెప్పబడినయెడల, తత్-అది, నహి- కాదు, అనగా నట్లుకాదనుట.

తా. ప్ర. అయితే, రాగద్వేషాదికముగల జనులకు కొందరికి, ఒకా నొకప్పుడు, చావవలెననెడి ఇచ్ఛకలుగుచున్నది. ఏకారణమువలన, అట్లు మర ణేచ్ఛకలుగుచున్నదో, ఆకారణమువలన, ఆత్మయందు, ద్వేషము సంభవించు టచేత, ఆత్మయు, వృశ్చికాదికమువలె విడువదగినవాడగుచుండగా, అట్టిఆత్మ విడుచుటకు విషయుడుగాడని యెట్లుచెప్పితిరి? ఉ. అట్లు రాగద్వేషముగలవా రికే మరణేచ్ఛకలుగుచుండగా వారిచేత విడువబడునది దేహమే యగుగాని, ఆత్మగాదు.

అవ. ఈయర్థమునే యిప్పుడు స్పష్టము జేయుచున్నాడు.

శ్లో॥ త్యక్తుంయోగ్యస్యదేహస్యనాత్మతాత్యక్తురేవసా।
నత్యక్తర్యస్తిసద్వేషస్త్యాజ్యేద్వేషేతుకాక్షతిః॥ ౨౯.

టీ. త్యక్తుం-విడుచుటకు, యోగ్యస్య-ఉచితమైన, దేహస్య-స్థూలదేహ మునకు, ఆత్మతా-ఆత్మభావము, న-లేదు. సా-ఆయాత్మభావము, త్యక్తురేవ- దేహమును విడిచెడివానికే యగును. అనగా దేహమునకంటే నన్యుడగు జీవు నకే గలదనుట. సః-ఆ, ద్వేషః-ద్వేషము, త్యక్తరి-దేహమును విడిపించెడివా నియందు, నాస్తి-లేదు. త్యాజ్యేతు- విడువదగిన దేహమందో, ద్వేషేసత్యపి- ద్వేషముకలుగుచుండగా (మమ) ఆత్మకు త్యాగములేదని వాదించెడి నాకు, క్షతిః-నష్టము, కా-యేమి, అనగా నాకు బాధలేదనుట.

తా. విడుచుటకు, యోగ్యమగు, దేహమునకు, ఆత్మభావములేదు. ప్ర. అయితే ఆత్మభావమెవనికి? ఉ. దేహమును విడిపించెడి (దేహాతిరిక్తజీవునకే)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆత్మభావముకలదు. ప్ర. సరి దేహమునకంటె అన్యుడగు జీవునకు ఆత్మత్వము గుగాక. ఇట్లుచెప్పుటచేత ప్రకృతమందు లాభమేమి?

ఉ. ఆత్మయందు ద్వేషములేమిచేత ఆత్మకుత్యాజ్యత్వములేదనెడి లాభముగలిగెను. ప్ర. అయితే ఆత్మయందు విద్వేషములేకపోవుగాక, దేహమందు కనుపడుచున్నదేగదా? ఉ. దేహమందు ద్వేషముకలుగుచుండగా ఆత్మకుత్యాజ్యత్వములేదని వాదించెడి నాకు నష్టమేమియులేదు.

అవ. ఆ-ఈప్రకారం ఓమైత్రేయీ, భార్యయొక్క ప్రీతికొరకు భర్తప్రీతివిషయుడుగాదనిచెప్పెడి, శ్రు॥ నవాఅరేపత్యుఃకామాయ॥ అనెడి వాక్యము మొదలుకొని (ఆత్మయొక్క) తనయొక్క ప్రీతికొరకు సర్వము ప్రీతివిషయత్వమును బొందుచున్నదనిచెప్పెడి, శ్రు॥ ఆత్మనస్తుకామాయసర్వంప్రియంభవతి॥ అనెడివాక్యమే అంతముగా గల శ్రుతియొక్క తాత్పర్య పర్యాలోచనచేత (ఆత్మకు) నిరతిశయప్రీతివిషయత్వమునుచూపి, యిప్పుడు యుక్తివలనగూడ అనిరతిశయత్వమును జూపుచున్నాడు.

శ్లో॥ ఆత్మార్థత్వేనసర్వస్యప్రీతేశ్చాత్మాహ్యతిప్రియః।
సిద్ధోయథాపుత్రమిత్రాత్పుత్రఃప్రియతరస్తథా॥ ౩౦.

టీ. పుత్రమిత్రాత్=పుత్ర-పుత్రునియొక్క, మిత్రాత్ - స్నేహితునికంటె, పుత్రః-పుత్రుడు, యథా- ఏప్రకారము, ప్రియతరః - అధికప్రీతివిషయుడగునో, తథా- ఆప్రకారము, సర్వస్య - భర్తృభార్యాది సర్వభోగ్యప్రపంచమునకు, ఆత్మార్థత్వేన = ఆత్మా-ఆత్మయొక్క, అర్థత్వేన - ప్రయోజకత్వముచేత, ప్రీతేశ్చ- ప్రీతికలిగియుండుటవలన, అనగా సర్వభోగ్యప్రపంచము ప్రీతివిషయత్వమును బొందుటచేతననుట. ఆత్మా- భోక్తయగుతాను, అతిప్రియః - నిరతిశయ ప్రీతివిషయుడు, సిద్ధోహి-ప్రసిద్ధముగా నగును.

తా. సుఖసహిత తత్ సాధనజాతమయినట్టి భర్తృభార్యాది సర్వభోగ్యరాశియు, (ఆత్మకు) తనకు ప్రయోజనకారియగుటచేత ప్రీతివిషయత్వమునుబొందుటవలనను, (ఆత్మా) తాను అధికప్రీతివిషయుడగుననెడియర్థము సిద్ధమాయెను. ఈయర్థము దృష్టాంతప్రదర్శనముగా స్పష్టమునుజేసెద వినుము. లోకమందు పుత్రునియొక్కమిత్రభూతుడగు, అనగా (పుత్రద్వారా ప్రీతివిషయుడైనట్టి) యజ్ఞదత్తునికంటె, (అవ్యవధానముగా ప్రీతివిషయుడైనట్టి) దేవదత్తుడు తండ్రియగువిష్ణుదత్తునకు అధిక ప్రీతివిషయుడేప్రకారమగునో ఆప్రకారము (తన) ఆత్మసంబంధియగుటచేత ప్రీతివిషయత్వమునుబొందిన భర్తృభార్యాది సర్వభోగ్యరాశికంటె (ఆత్మ) తానులధిక ప్రీతివిషయుడగునని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు ఆత్మయందు శ్రుతియుక్తులచేత ప్రతిపాదింపబడిన నిరతిశయప్రీతిని స్వానుభవ ప్రదర్శనముచేత దృఢీకరించుచున్నాడు.

శ్లో॥ మానభూవమహంకింతు భూయాసంసర్వదేత్యసౌ।
ఆశీస్సర్వస్యదృష్టేతి ప్రత్యక్షాప్రీతిరాత్మని॥ ३౧.

టీ. అహం-నేను, మానభూవం-లేనివాడనుకాను. అనగా నాకెప్పటికి నాశము లేకపోవుగాకయనుట. కింతు- మరియేమనగా, సర్వదా - యెల్లప్పుడును, భూయాసం - ఉండువాడనగుదునుగాక. అనగా నాకు సర్వదా స్థితికలుగుగాకయనుట. ఇతి - ఈప్రకారము, అసౌ - ఈ, ఆశీః- ప్రార్థన, సర్వస్య- సర్వప్రాణివర్గమునకు, దృష్టా-కనుపడుచున్నది. ఇతి-ఈప్రకారము, ఆత్మని- ఆత్మయందు, ప్రీతిః - నిరతిశయస్నేహము, ప్రత్యక్షా-అనుభవసిద్ధమగును.

తా. నాకెప్పటికి నాశనము లేకపోవుగాకయనియు, మరియేమనగా నాకు శాశ్వతస్థితికలుగుగాకయనియు, ఈరూపముగల ప్రార్థన సర్వప్రాణివర్గముయొక్క సంబంధినిగాకనుపడుచున్నది. ప్ర. ఇట్లుచెప్పుటచేతఫలితమేమి? ఏకారణమువలన సర్వప్రాణివర్గముచేత ప్రార్థింపబడుచున్నదో, ఆకారణమువలన ఆత్మయందుగల నిరతిశయప్రీతి ప్రత్యక్షప్రమాణసిద్ధముగా నున్నది.

అవ. ఈపూర్వోక్త అభిప్రాయమును శ్లాఘ్యపూర్వకముగా మతాంతరమును దూషించుటకొరకు ప్రారంభించుచున్నాడు.

శ్లో॥ ఇత్యాదిభిస్త్రిభిఃప్రీతౌ సిద్ధాయామేవమాత్మని।
పుత్రభార్యాదిశేషత్వమాత్మనఃకైశ్చిదీరితమ్॥ ३౨.

టీ. ఇత్యాదిభిః=ఇతి-అనుభవమునునట్టియు, ఆదిభిః - శ్రుతియుక్తులనునట్టి లక్షణములుగల, త్రిభిః-మూడుప్రమాణములచేత, ఏవం - పూర్వోక్తప్రకారముగా, ఆత్మని - ఆత్మయందు, ప్రీతౌ - నిరతిశయప్రీతి, సిద్ధాయామపి- సిద్ధించియున్నను, కైశ్చిత్-శ్రుతి తాత్పర్యము తెలియనికొందరిచేత, ఆత్మనః- ఆత్మకు, పుత్రభార్యాదిశేషత్వం= పుత్రభార్యాది - పుత్రభార్యాదులనుగురించి, శేషత్వం-అప్రధానత్వము, అనగా ముఖ్యత్వముగామియనుట. ఈరితం- చెప్పబడెను.

తా. అనుభవ శ్రుతియుక్తి లక్షణములు గల మూడు ప్రమాణములచేత ఈపూర్వోక్తప్రకారముగా ఆత్మయందు నిరతిశయప్రీతి సిద్ధించియున్నను శ్రుతితాత్పర్యము తెలియని కొందరిచేత ఆత్మకు పుత్రభార్యాది శేషత్వము (అనగా పుత్రాదులనుగురించి తనకు అప్రధానత్వము) చెప్పబడెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ ఏతద్వివక్షయాపుత్రే ముఖ్యాత్మత్వంశ్రుతీరితం।
ఆత్మావైపుత్రనామేతి తచ్ఛోపనిషదిస్ఫుటం॥        ౩౩.

టీ. ఏతద్వివక్షయైవ-ఈవివక్షచేతనే, పుత్రే- పుత్రునియందు, ముఖ్యాత్మత్వం-ప్రాధాన్యత్వము, ఆత్మావై-ఆత్మయే, అనగా తానేయనుట. పుత్రనామేతి-పుత్రరూపత్వముబొందుచున్నాడని, శ్రుతీరితం=శ్రుతి-శ్రుతిచేత, ఈరితం-చెప్పబడెను. తచ్చ-ఆయర్థంబును, ఉపనిషది - ఉపనిషత్తునందు, స్ఫుటం-స్ఫుటముగాచెప్పబడెను.

తా. ప్ర. అయితే, ఈయర్థంబు దేనిచేనెరుగబడుచున్నదో జెప్పను? ఉ. అటుశ్రుతితాత్పర్యము తెలియనికొంతమందిచేత చెప్పబడెనదైడి లౌకికవ్యవహారమే, తానే పుత్రరూపుడగుచున్నాడనిచెప్పెడి, శ్రు॥ ఆత్మావైపుత్రనామాసి॥ అనెడి ఇత్యాదిశ్రుతిచేత పుత్రునకు ముఖ్యాత్మత్వము చెప్పబడెను. మరియు ఆపుత్రునకు ముఖ్యాత్మత్వము ఐతరేయోపనిషదాదికమందు స్ఫుటముగా జెప్పబడియున్నది.

అవ. అవాక్యార్థమును పఠించుచున్నాడు.

శ్లో॥ సోస్యాయమాత్మాపుణ్యేభ్యః కర్మభ్యఃప్రతిధీయతే।
అథాస్యేతరఆత్మాయం కృతకృత్యఃప్రమీయతే॥        ౩౪.

టీ. అస్య-ఈతండ్రికి, సోయం-ఆ ఈ, పుత్రరూపత్వము కలుగుచున్నది. ఆత్మ-పుత్రరూపుడగుతాను, పుణ్యేభ్యః - ధర్మలక్షణముగల, కర్మభ్యః-కర్మములకొరకు, అనగా పుణ్యకర్మానుష్ఠానములకొరకనుట. పిత్రా- తండ్రిచేత, ప్రతిధీయతే - బదులుగా స్థాపించబడుచున్నాడు. అథ - అనంతరమందు, అస్య-ఈతండ్రియొక్క, అయం-ఈ, అనగా ప్రత్యక్షముగాకనుపడుచుండెడియనుట. ఇతరః-పుత్రునికంటెనన్యమగు, ఆత్మా-శరీరము, కృతకృత్యః=కృత-అనుష్ఠింపబడిన, కృత్యః-పుణ్యముకలదగుచు, ప్రమీయతే- మృతినిపొందుచున్నది. అనగా పితృరూపుడగు ఆత్మమృతిని పొందుచున్నాడనుట.

తా. ఈతండ్రికి పుత్రరూపము, శ్రు॥ పురుషేహవాయమాదితోగర్భోభవతి॥ అనెడివాక్యముచేత ప్రకరణాదికమందు దేహమందు గర్భత్వముచే చెప్పబడెను. మరియు ఆపుత్రరూపత్వము అతిశయముగా కాపాడదగినదని, శ్రు॥ ఆయంసోగ్రఏవకుమారంజన్మనోగ్రేఽధిభావయతి॥ అనెడిశ్రుతిచేతచెప్పబడెను. తండ్రిచేత పుత్రరూపుడగుఆత్మ [తాను] పుణ్యకర్మానుష్ఠానముకొరకు బదులుగా స్థాపింపబడుచున్నాడు. అనంతరము ప్రత్యక్షముగాకనుపడుచున్నట్టియు మృతిమిచేత గ్రసింగబడియున్నట్టియు పుత్రునికంటె నన్యమగు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యూతండ్రియొక్క దేహము తానుచేయబడిన పుణ్యము కలదియగుచు వృద్ధిని పొందుచున్నది.

అవ. ఈచెప్పబడిన యర్థమును దృఢీకరించుటకొరకు పుత్రరహితునకు పుణ్యలోకములేదనిదెలిపెడి, శ్రు॥ నాపుత్రస్యలోకోస్తి॥ అనెడి వాక్యముయొక్క అర్థమును చెప్పుచున్నాడు.

శ్లో॥ సత్యప్యాత్మనిలోకోస్తినాపుత్రస్యాతఏవహి।
అనుశిష్టంపుత్రమేవలోక్యమాహుర్మనీషిణః॥ ౩౭.

టీ. అతఏవ-అందువల్లనే, అనగా పుత్రునికి ముఖ్యాత్మత్వము గలుగుట చేతనేననుట. ఆత్మని-తండ్రియగుతాను, సత్యపి-స్థితినిపొందియున్నను, అపుత్రస్య - పుత్రరహితునకు, లోకః-పరలోకము, నాస్తి-లేదు. హి - ఈయర్థంబు పురాణాదులయందు ప్రసిద్ధంబనుట. మనీషిణః - శాస్త్రాభిప్రాయమును తెలిసినవారు, అనుశిష్టం - మంత్రముచేత శిక్షింపబడెడి, పుత్రమేవ - పుత్రునే, లోక్యం - లోకముకొరకు హితమయినవానినిగా, అనగా పరలోకసాధనముగాననుట. ఆహుః - చెప్పుదురు.

తా. ఏకారణమువలన పుత్రునకు ముఖ్యాత్మత్వముకలదో, ఆకారణముచేత తండ్రియగుతాను స్థితినిపొందియున్నను పుత్రరహితుడగు తండ్రికి పరలోకములేదు. ఈయర్థము పురాణాదులయందు ప్రసిద్ధమగును. వ్యతిరేకముఖముగా చెప్పబడిన ఈయర్థమును అన్వయముఖముగా ప్రతిపాదించెడి, శ్రు॥అనుశిష్టంపుత్రంలోక్యమాహుః॥ అనెడివాక్యముయొక్క అర్థము చెప్పెదవినుము. శాస్త్రతాత్పర్యము తెలిసినవారు నీవుబ్రహ్మమనిదెలిపెడి, శ్రు॥ త్వంబ్రహ్మ॥ అనిపరశ్లోకమందుచెప్పబొయ్యెడి యిత్యాది మంత్రములచేత శిక్షింపబడినపుత్రునే పరలోకసాధనముగా చెప్పుదురు.

అవ. ఇప్పుడు ఇహలోకసౌఖ్యంబుగూడ పుత్రునివల్లనే కలుగుచున్నదని ప్రతిపాదించెడి, శ్రు॥ సోయంమనుష్యలోకః పుత్రేణైవ జయ్యోనాన్యేనకర్మణా॥ అనెడి వాక్యార్థము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ మనుష్యలోకోజయ్యస్స్యాత్పుత్రేణైవేతరేణనో।
ముమూర్షుశ్శంస్తిమేతుత్పుత్రంత్వంబ్రహ్మేత్యాదిమంత్రకైః॥ ౩౮.

టీ. మనుష్యలోకః-మనుష్యలోకము, అనగా మనుష్యలోక సుఖమనుట. పుత్రేణైవ-పుత్రునిచేతనే, జయ్యః-జయింపదగినది, అనగా సంపాదింపదగినదనుట. స్యాత్-అగును. ఇతరేణ-కర్మాదీతరసాధనముచేత, నో-కలుగదు. ముమూర్షుః-మృత్యువును బొందుటకిచ్ఛయించెడితండ్రి, త్వం- నీవు, బ్రహ్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్యాదిమంత్రక్తైః - బ్రహ్మమగుదువని చెప్పెడి యిత్యాది మంత్రములచేత, పుత్రం-పుత్రుని, మంత్రయేత్ - ఆజ్ఞాపించును. అనగా పుత్రునకు ఉనుశాసనము జేయుననుట.

తా. మనుష్యలోకసుఖముపుత్రునిచేతనే సంపాదింపదగినదగుగాని ఇతరకర్మాదిసాధనముచేత కలుగనేకలుగదు. అనగా పుత్రరహితుడగు వానియొక్క ధనాదికము దుఃఖముకలిగించుటకు కారణమగుచున్నదని అభిప్రాయము. మరియు, పూర్వశ్లోకమందు, వా॥ అనుశిష్టంపుత్రంలోక్యం॥ అనెడి వాక్యమందు పుత్రానుశాసనముచెప్పబడెను. ఇప్పుడు ఆపుత్రానుశాసనము చేయుటకు సమయంబును ఆమంత్రంబులు దెలిపెదవినుము. నీవు బ్రహ్మమగుమవనియు, నీవుయజ్ఞమగుమవనియు, నీవు లోకమగుమవనియుంజెప్పెడి, శ్రు। త్వంబ్రహ్మ, త్వంయజ్ఞఃత్వంలోకః॥ అనెడి ఈమూడుమంత్రములచేతను తండ్రి తనమరణకాలమందు పుత్రునకు అనుశాసనముచేయునని దెలియవలెను.

అవ. ఈపూర్వశ్లోకములయందు చెప్పబడిన అర్థము నిపుడు దెలుపుచున్నాడు.

శ్లో॥ ఇత్యాదిశ్రుతయఃప్రాహుః పుత్రభార్యాదశేషతాం।
లౌకికాఅపిపుత్రస్యప్రాధాన్యమనుమన్వతే॥ ౩౭.

టీ. ఇత్యాదిశ్రుతయః=ఇత్యాది-ఈమొదలైన, శ్రుతయః-శ్రుతులు ఆత్మనః-ఆత్మకు, అనగా తనకనుట. పుత్రభార్యాదిశేషతాం= పుత్రభార్యాది-పుత్రభార్యాదులనుగురించి, శేషతాం-అముఖ్యత్వమును, ప్రాహుః-చెప్పుచున్నవి. లౌకికాఅపి-లౌకికులును, పుత్రస్య-పుత్రునకు, ప్రాధాన్యం- ముఖ్యత్వమును, అనుమన్వతే - తలచుచున్నారు. అనగా జెప్పుదురనుట.

తా. ఈచెప్పబడినట్టి ఇత్యాదిశ్రుతులన్నియు ఆత్మకు (తనకు) పుత్రభార్యాదులనుగురించి అముఖ్యత్వమును జెప్పుచున్నవి. ఈయర్థము కేవలముశ్రుతిసిద్ధమాత్రమేగాక లోకప్రసిద్ధమైయున్నది. జెప్పెదవినుము. లౌకికులును పుత్రునకు ముఖ్యత్వమును జెప్పుచున్నారు.

అవ. ఆయర్థమునే దెలుపుచున్నాడు.

శ్లో॥ స్వస్మిన్మృతేపిపుత్రాదిర్జీవేద్విత్తాదినాయథా।
తద్ధేవయత్నంకురుతే ముఖ్యఃపుత్రాదయస్తతః॥ ౩౮.

టీ. స్వస్మిన్-తండ్రిమొదలగుతాను, మృతేపి - మృతినిబొందినను, పుత్రాదిః-పుత్రభార్యానిజనము, విత్తాదినా= విత్త-ధనముచేతను, ఆదినా - భూమ్యాదికముచేతను, యథా-యేప్రకారము, జీవేత్-జీవనమునుబొందునో, తద్ధ

వ-ఆప్రకారమే, యత్నం-ప్రయత్నమును, కురుతే - చేయుచున్నాడు. తతః-ఆకారణమువలన, పుత్రాదయః-పుత్రభార్యాదులు, ముఖ్యాః-ముఖ్యత్వముగల వారగుదురు.

తా. తండ్రిమొదలగుతాను మృతినిబొందినను ఈలోకమందుండెడి పుత్రభార్యాదిబంధుజనము ధనక్షేత్రాదులచేత ఏప్రకారముగా జీవనము చేసెదరో, ఆప్రకారమే ప్రయత్నమునుజేసి ధనాదికము సంపాదించుచున్నాడు. ప్ర. ఇట్లుచెప్పుటచేత ఫలితమేమి? ఉ. ఏకారణమువలన తండ్రిమొదలగు జనము తనప్రయాసమునోర్చియు పుత్రాదులకు జీవనోపాయమును సంపాదించుచున్నారో, ఆకారణమువలన పుత్రాదులు ముఖ్యులగుదురు. అనగాపుత్రాదులు ముఖ్యాత్మత్వముగలవారగుదురని అభిప్రాయము.

అవ. ఇట్లువేదలోకప్రసిద్ధులచేత చూపబడిన పుత్రాదులకు ముఖ్యాత్మత్వమును అంగీకరించి సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ బాఢమేతావతానాత్మాశేషోభవతికస్యచిత్।
గౌణమిథ్యాముఖ్యభేదైరాత్మాయంభవతిత్రిధా॥ ౩౯.

టీ. బాఢం- ఈపూర్వోక్తప్రకారము పుత్రాదులకు ముఖ్యాత్మత్వము నంగీకరించితిని. ఏతావతా-ఇంతమాత్రముచేత, ఆత్మా-తాను, కస్యచిత్- ఎవనికేని, శేషః-అముఖ్యుడు, నభవతి-కాడు, అయం-ఈ, ఆత్మా-తాను, గౌణమిథ్యాముఖ్యభేదైః = గౌణ- గౌణమనునట్టియు, మిథ్యా - మిథ్యయనునట్టియు, ముఖ్య-ముఖ్యమనునట్టి, భేదైః - భేదములచేత, త్రిధా - మూడువిధములుగా, భవతి - అవుచున్నాడు.

తా. సరి. ఈపూర్వోక్తప్రకారము వేదలోకప్రసిద్ధులచేత జూపబడినపుత్రాదులకు ముఖ్యాత్మత్వము నంగీకరించితిమి. ప్ర. అయితే అట్లు అంగీకరించినయెడల (ఆత్మకు) ప్రతిపాదింపబడిన శేషిత్వము (అనగాముఖ్యత్వము) లోపించుకొనదాయేమి? ఉ. పూర్వోక్తప్రకారము వేదలోకప్రసిద్ధిచేత పుత్రాదులకు ముఖ్యాత్మత్వము కలదనిచెప్పుటమాత్రమువలనే ఆత్మ (తాను) ఎవ్వనికిని శేషుడు (అముఖ్యుడు) కాడు. ప్ర. ఇట్లు ప్రతిజ్ఞచేయుట మాత్రముచేతనే అర్థసిద్ధిగలుగదుగదా? ఉ. ఈఆత్మ (తాను) ౧. గౌణాత్మయనియు, ౨. మిథ్యాత్మయనియు, ౩. ముఖ్యాత్మయనియు, ఇట్లు మూడువిధములుగా చెప్పబడుచున్నాడు. అనగా నెచ్చనెచ్చట నేయే వ్యవహారమందెవనెవనికి ఆత్మత్వము చెప్పబడునో, ఆయాఆత్మకు అచ్చటచ్చట ముఖ్యాత్మత్వము జూపుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొరకు దృష్టాంతముగా ఆత్మ మూడువిధములుగా చెప్పబడుచున్నాడని అభిప్రాయము.

అవ. ఆత్రివిధమందు పుత్రాదులకు గౌణాత్మత్వమును జూపుటకొరకు లోకమందు గౌణప్రయోగమును ఉదాహరించుచున్నాడు.

శ్లో॥ దేవదత్తస్తుసింహోఽయమిత్యైక్యంగౌణమేతయోః।
భేదస్యభాసమానత్వా త్పుత్రాదేరాత్మతాతథా॥    ౪౦.

టీ. అయం-ఈ, దేవదత్తస్తు - దేవదత్తుడో, సింహఇతి - సింహమనెడి వ్యవహారమందు, ఏతయోః-ఈదేవదత్తసింహములకు, భేదస్య- భేదము, భాసమానత్వాత్- తోచుచుండుటవలన, ఐక్యం-ఆరెంటికిగల ఏకత్వము, గౌణం-ఔపచారికమగును. తథా-ఆప్రకారము, పుత్రాదేః- పుత్రభార్యాదికమునకు, ఆత్మతా- గౌణాత్మత్వమగును.

తా. ఈదేవదత్తుడు సింహమగుననెడి యేయైక్యముగలదో, ఆయైక్యముగౌణమగును. ప్ర. అందుకుకారణమేమి? ఉ. ఆదేవదత్తసింహములకు రెంటికిని భేదముప్రత్యక్షముగా గనపడుచుండుటచేత ఆరెంటికిగల యైక్యము గౌణమేయగును. ఆప్రకారమే పుత్రాదులకు గౌణాత్మత్వము గలుగునేగాని ముఖ్యాత్మత్వము గలుగనేరదు.

అవ. ఇపుడు మిథ్యాత్మను జూపుచున్నాడు.

శ్లో॥ భేదోఽస్తిపంచకోశేషుసాక్షిణోనతుభాత్యసౌ।
మిథ్యాత్మతాతఃకోశానాంస్థాణోశ్చోరాత్మతాయథా॥ ౪౧.

టీ. పంచకోశేషు-ఆనందమయాదిపంచకోశములయందు, భేదః - భేదము, అస్తి-కలదు, అసౌ-ఈభేదము, సాక్షిణస్తు-సాక్షికో, నభాతి-స్ఫురించలేదు. అతః-ఆకారణమువలన, స్థాణోః-స్తంభమునకు, చోరాత్మతా- చోరరూపత్వము, యథా-ఏప్రకారము మిథ్యయగనో (తథా) ఆప్రకారము, కోశానాం-పంచకోశములకు, మిథ్యాత్మతా- మిథ్యాభావమగును.

తా. ఆనందమయ విజ్ఞానమయ మనోమయ ప్రాణమయాన్నమయములనెడి పంచకోశములయందును సాక్షికంటే (ప్రత్యగాత్మకంటే) భేదమున్నను తోచుటలేదు. ఆకారణమువల్ల చోరునికంటే భిన్నమగు స్థాణువునకు చోరరూపత్వము ఏప్రకారముగా మిథ్యయగునో, ఆప్రకారము పంచకోశములకును మిథ్యాభావమగునని తెలియవలెను.

అవ. ఇటు గౌణమిథ్యాత్మలను రెంటినిజూపి ఇప్పుడు సాక్షికిముఖ్యాత్మత్వమును జెప్పుచున్నాడు.

H222

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ నభాతిభేదోనాఽప్యస్తి సాక్షిణోఽప్రతియోగినః।
సర్వాంతరత్వాత్తస్యైవ ముఖ్యమాత్మత్వమిష్యతే॥ ౪౨.

టీ. అప్రతియోగినః-దేనికివిరోధిగాని, అనగా సర్వాత్మకత్వముగలయ నుట. సాక్షిణః-ప్రత్యగాత్మకు, భేదః-భేదము, నభాతి-తోచలేదు, భేదః-భేద ము, నాస్త్యపి-లేదు. తస్యైవ-ఆసాక్షికే, సర్వాంతరత్వాత్-సర్వ - దేహపు త్రాదిసర్వముకంటె, అంతరత్వాత్ - అంతరత్వము గలిగియుండుటవలన, ముఖ్యం-ప్రాధాన్యమగు, ఆత్మత్వం-ఆత్మభావము, ఇష్యతే - ఇచ్ఛయింపబడు ను. అనగా నంగీకరింపబడుననుట.

తా. సాక్షిరూపుడగు ప్రత్యగాత్మకు గౌణాత్మయగు పుత్రాదికము నకువలె దేనివల్లను భేదముతోచలేదు. మరియు మిథ్యాత్మయగు దేహాదికమున కువలె భేదములేదు.

ప్ర. అట్లు సాక్షికి భేదములేకపోవుటకు కారణమేమి? ఉ. సాక్షియగు ప్రత్యగాత్మ దేనికిని విరోధిగామిచేత (సర్వాత్మకత్వముగలిగియుండుటచేత) గౌణాత్మమిథ్యాత్మలకువలె సాక్షికిభేదములేదని తెలియవలెను. అది యెట్లనగా చెప్పెదవినుము. గౌణాత్మయగు పుత్రాదికమునకును, మిథ్యాత్మయగుదేహాది కమునకును, తననుగురించి విరోధికలిగియున్నట్టిప్రకారము సాక్షియగుప్రత్య గాత్మకువస్తుభూతమగు విరోధియెద్దియులేదు. అనగా సర్వము మాయాకల్పిత మగుటచేత సాక్షికి వాస్తవవిరోధి యెద్దియులేదని యభిప్రాయము. ప్ర.అయి తేసాక్షికి భేదములేమిచేత సాక్షికి గౌణమిథ్యాత్మత్వములు రెండును లేకపోవు గాక. మరిదేనిచేత ముఖ్యాత్మత్వముగలుగునో చెప్పుము? ఉ. దేహపుత్రాదిస ర్వముకంటె సర్వసాక్షియగు ప్రత్యగాత్మ సర్వాంతరత్వముచేత స్ఫురించు చుండుటవలన నట్టిసాక్షికే ముఖ్యాత్మత్వము పండితులచే నంగీకరింపబడుచు న్నది. ఇచ్చట అనుమానప్రమాణముచేత నూహించి యెరుగవలెను. ప్ర. అది యెట్లు? ఉ. వివాదుడగుసాక్షి, సర్వాంతరుడగుటవలన ముఖ్యాత్మయగుటకుత గుచున్నాడు. ఎవడు అహంకారాదికమువలె ముఖ్యాత్మగాడో, వాడుసర్వాం తరుండునుంగాడు. ఇట్లు అనుమాన ప్రమాణముచేనూహించి సాక్షికి ముఖ్యా త్మత్వము నెరుగవలెను.

శ్లో॥ సత్యేవం వ్యవహారేషు యేషుయస్యాత్మతోచితా।
తేషుతస్యైవ శేషిత్వం సర్వస్యాన్యస్య శేషతా॥ ౪౩.

టీ. ఏవంసతి-ఇట్లాత్మత్రైవిధ్యమగుచుండగా, ఏషు-ఏ, వ్యవహారేషు- పాలన పోషణ బ్రహ్మాత్మత్వాను సంధానాది వ్యవహారములయందు, యస్య-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏపుత్రాదికమునకు, ఆత్మతా-ముఖ్యాత్మత్వము, ఉచితా - తగినదో, తేషు-ఆవ్యవహారములయందు, తస్యైవ- ఆపుత్రాదికమునకే, శేషిత్వం - ముఖ్యాత్మత్వముగలుగును. అన్యస్య- అన్యమగు, సర్వస్య - సర్వంబునకు, అనగా ముఖ్యాత్మత్వముగలవానికంటె నన్యమగు సర్వంబునకనుట. శేషతా-అముఖ్యత్వముగలుగును.

తా. ప్ర. సరి. ఆత్మత్రైవిధ్యముకలుగుగాక. శ్రుతిచేత పుత్రాదికమునకు ముఖ్యాత్మత్వము చెప్పబడుటయందు ప్రయోజనమేమి? ఉ. ఇట్లు ఆత్మత్రైవిధ్యము గలుగుచుండగా ఏలౌకిక వైదిక లక్షణములు గల పాలన పోషణ బ్రహ్మాత్మత్వానుసంధానాది వ్యవహారవిశేషములయందు ఏపుత్రాదికమునకైనను, దేహాదికమునకైనను, సాక్షికైనను, ముఖ్యాత్మత్వము తగియుండునో, అట్టివ్యవహారములయందు ఆపుత్రాదికమునకైనను, దేహాదికమునకైనను,సాక్షికైనను, ముఖ్యాత్మత్వంబును, అముఖ్యాత్మకంటె అన్యమగు సర్వంబునకును అముఖ్యత్వంబునుం జెప్పవలయు.

అవ. ఈయర్థమునే అయిదు శ్లోకములచేత సమగ్రముగా దెలుపుచున్నాడు.

శ్లో॥ ముమూర్షోర్గృహరక్షాదౌ గౌణాత్మైవోపయుజ్యతే।
నముఖ్యాత్మానమిథ్యాత్మాపుత్రశ్శేషీభవత్యతః॥ ౪౪.

టీ. ముమూర్షోః - మృత్యువును పొందనిచ్ఛయించినవానికి, గృహరక్షాదౌ-గృహరక్షకత్వాదికర్మవిశేషమందు, గౌణాత్మైవ- పుత్రభార్యాదిగౌణాత్మయే, ఉపయుజ్యతే- ఉపయోగమునుపొందుచున్నది. ముఖ్యాత్మా- సాక్షి, న-ఉపయోగమునుపొందదు. మిథ్యాత్మా-దేహము, న- ఉపయోగమునుపొందదు. అతః-ఆకారణమువలన, పుత్రః-పుత్రుడు, శేషీ - ముఖ్యాత్మ, భవతి-అగుచున్నాడు.

తా. చావనిచ్ఛయించినవానికి గృహమును రక్షించుటమొదలగు కర్మవిశేషమందు పుత్రభార్యాదిరూపగౌణాత్మ, అటుపిమ్మట జీవించియుండునదైడికారణముచేత అట్టిగౌణాత్మయే, ఉపయోగమును పొందుచున్నదిగాని, ముఖ్యాత్మయగుసాక్షి, నిర్వికారియగుటచేత నుపయోగించదు. మరియు, మిథ్యాత్మయగుదేహంబు మృత్యువును పొందుటకు సిద్ధముగానుండుటచేత అట్టిదేహంబును గృహరక్షణాదికర్మవిశేషమందు నుపయోగమునుపొందదు. ఆకారణముచేత మృత్యువునుపొందనిచ్ఛయించినవానికి పుత్రాదికమే ముఖ్యాత్మయగుటకు తగుచున్నదని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇందుకు దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ అధ్యేతావహ్నిరిత్యత్ర సన్నప్యగ్నిర్నగృహ్యతే।
అయోగ్యత్వేనయోగ్యత్వాద్వటురేవాత్రగృహ్యతే॥ ౪౫.

టీ. వహ్నిః-అగ్ని, అధ్యేతేతి - అధ్యయనము చేయునది యగున నెడి, అత్ర-ఈప్రయోగమందు, అగ్నిః-అగ్ని, సన్నపి- స్వరూపముచేత సమీపమందున్నను. అయోగ్యత్వేన-యోగ్యత్వములేమిచేత, నగృహ్యతే-అగ్నిశబ్దార్థత్వముచేత గ్రహించబడదు. అత్ర-ఈప్రయోగమందు,వటురేవ-వటుడే, యోగ్యత్వాత్-అధ్యయనను జేయుటకుయోగ్యుడగుటవలన, గృహ్యతే - అగ్నిశబ్దముచేత గ్రహించబడుచున్నాడు.

తా. ఈఅగ్ని, అధ్యయనముచేయునది యగున నెడి, వా॥ అయమధ్యేతా వహ్నిః॥ అనెడి ఈప్రయోగమందుస్వరూపముచేత అగ్నిహోత్రము సమీపమందున్నను, అధ్యయనముచేయుటకు యోగ్యత్వము లేనికారణమువలన ఆయగ్ని శబ్దము అగ్నిశబ్దార్థత్వముచేత గ్రహింపబడదు. మరియేమనగా, అధ్యయనము జేయుటయందు యోగ్యుడగు ఏవటువుగలడో, ఆవటువే, యిక్కడఅగ్ని శబ్దముచేత గ్రహించబడుచున్నాడని తెలియవలెను.

అవ. ఇట్లుగౌణాత్మకు ముఖ్యస్థలమును ఉదాహరించిచూపి ఇపుడు మిథ్యాత్మకు ప్రాధాన్యస్థలమును ఉదాహరించుచున్నాడు.

శ్లో॥ కృశోహంపుష్టిమాప్స్యామీత్యాదౌ దేహాత్మతోచితా।
నపుత్రంవినియుఙ్క్తేఽత్రపుష్టిహేత్వన్నభక్షణే॥ ౪౬.

టీ. అహం - నేను, కృశః - శుష్కించినవాడనైతిని. పుష్టిం - పుష్టిని, ఆప్స్యామి-సంపాదించగలను. ఇత్యాదౌ - ఇత్యాది లోకవ్యవహారమందు, దేహాత్మతా=దేహ-దేహమునకు, ఆత్మతా-ముఖ్యాత్మత్వము, ఉచితా-తగినదగును. అత్ర-ఇచ్చట, పుష్టిహేత్వన్నభక్షణే= పుష్టిహేతు - పుష్టికి కారణమగు, అన్నభక్షణే-అన్నమునుభక్షించుటయందు, పుత్రం-పుత్రుని, నవినియుఙ్క్తే-నియమింపడు.

తా. మరియు, నేను శుష్కించినవాడనైనందున అన్నభక్షణాదికముచేత పుష్టినిసంపాదించగలననెడి ఇత్యాదిలోకవ్యవహారమందు అన్నమునుభక్షించుటకు యోగ్యమైన దేహమునకే ముఖ్యాత్మత్వమును చెప్పవలయును. ఎందుచేతననగా, ఇక్కడ తనకు పుష్టిహేతువగు అన్నభక్షణాది వ్యవహారమందు పుత్రుని నియమించుటలేదు. గనుక, ఇచ్చటదేహమునకు ముఖ్యాత్మత్వము గలుగునని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ తపసాస్వర్గమేష్యామీ త్యాదౌకర్త్రాత్మతోచితా।
అనపేక్ష్యవపుర్భోగంచరేత్కృఛ్ఛ్రాదికంతతః॥       ౪౭.

టీ. తపసా-తపస్సుచేత, స్వర్గం-స్వర్గమును, ఏష్యామి - పొందగలను. ఇత్యాదౌ-ఇత్యాది వ్యవహారమందు, కర్త్రాత్మతా = కర్తృ - విజ్ఞానమయున కు, ఆత్మతా - ముఖ్యాత్మత్వముగలుగును. తతః - ఆకారణమువలన, వపుర్భోగం = వపుః- దేహమునకు, భోగం - సుఖమును, అనపేక్ష్య- కోరక, కృఛ్ఛ్రాదికం = కృఛ్ఛ్ర-కృఛ్ఛ్రమె, ఆదికం - ఆదిగాగలతపస్సును, చరేత్ - ఆచరించును. అనగా కృఛ్ఛ్రచాంద్రాయణాది తపస్సును చేయుననుట.

తా. మరియు తపస్సుచేసి స్వర్గమును సంపాదించగలననెడి, ఇత్యాది వ్యవహారమందు విజ్ఞానమయశబ్దవాచ్యునకే, ముఖ్యాత్మత్వమును చెప్పవలయుగాని, దేహాదికమునకు ముఖ్యాత్మత్వమును చెప్పందగదు. మరియు ఏకారణముచేత నిచ్చట దేహమునకు ముఖ్యాత్మత్వమును చెప్పందగదో, ఆకారణముచేత దేహభోగమును విడిపించి, కర్తకు ప్రయోజనమును గలిగించునట్టి కృఛ్ఛ్రచాంద్రాయణాది తపస్సు చేయుచున్నాడు.

శ్లో॥ మోక్ష్యేహమిత్యత్రయుక్తంచిదాత్మత్వంతదాపుమాన్।
తద్వేత్తిగురుశాస్త్రాభ్యాం నతుకించిచ్చికీర్షతి॥       ౪౮.

టీ. అహం-నేను, మోక్ష్యే-మోక్షమునుపొందుచున్నాను. ఇత్యత్ర-అనెడియీవ్యవహారమందు, చిదాత్మత్వం=చితు-సాక్షికి, ఆత్మత్వం-ముఖ్యాత్మత్వము, యుక్తం-తగినదగును. తదా-అప్పుడు, పుమాన్-పురుషుడు, గురుశాస్త్రాభ్యాం- గురుశాస్త్రములచేత, తత్ - ఆబ్రహ్మమును, వేత్తి - యెరుగుచున్నాడు. కించిత్తు-కొంచెమైనను, నచికీర్షతి - చేయుటకిచ్ఛ ఇంచడు.

తా. మరియు పురుషుడు ఎపుడుశమదమాదులను సంపాదించి ముక్తిని పొందగలనని తలచునో, అప్పుడు గురూపదేశ మహావాక్యాగజన్యమైనట్టి అపరోక్షజ్ఞానముచేత నేను విజ్ఞానమయాది (కర్త్రాది) స్వరూపుడను గాననియు, సత్యజ్ఞానానంద స్వరూపపరబ్రహ్మమునైతినని కర్మమును చేయుట కిచ్ఛలేనివాడై చిద్రూపుడగు పరమాత్మ నెరుగుచున్నాడు. అట్టిపురుషునకు చిద్రూపమునే ముఖ్యాత్మనుగా చెప్పవలయునుగాని, విజ్ఞానమయాదికమును ముఖ్యాత్మగా చెప్పందగదు. బ్రహ్మముసత్యజ్ఞానానంద స్వరూపముగలదనియు, విజ్ఞానమానందరూపమనియు, అంతరములేనిదనియు, బాహ్యములేనిదనియు,సర్వస్వరూపమనియు, ప్రజ్ఞానఘనరూపముగలదని, శ్రు॥ సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ, విజ్ఞానమానందంబ్రహ్మ, అనంతరోబాహ్యఃకృత్స్నః ప్రజ్ఞానఘనఏవ। ఇత్యా


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దశ్రుతిచెప్పుచున్నది.

అవ. ఈవుదహరింపఁబడిన త్రివిధాత్మలకు వ్యవహార విశేషములయందు యోగ్యత్వముచేత ముఖ్యాత్మత్వముగలుగున నెడివిషయమై ఇప్పుడు దృష్టాంతము ను చెప్పుచున్నాడు.

శ్లో॥ విప్రక్షత్రాదయోయద్వద్బృహస్పతిసవాదిషు।
వ్యవస్థితా స్తథాగౌణమిథ్యాముఖ్యాయథోచితమ్॥ ౪౯.

టీ. విప్రక్షత్రాదయః=విప్ర-బ్రాహ్మణుఁడును, క్షత్రాదయః-క్షత్రియ వైశ్యులును, బృహస్పతిసవాదిషు - బృహస్పతి సవనాదులయందు, యద్వత్- ఏప్రకారము, వ్యవస్థితాః - స్థాపింపబడుదురో, అనగా నధికారులగుదురో యనుట. తథా-ఆప్రకారము, గౌణమిథ్యాముఖ్యాః = గౌణ- గౌణాత్మయు, మిథ్యా-మిథ్యాత్మయు, ముఖ్యాః-ముఖ్యాత్మయు, యథోచితం-ఆయాస్థలము లయందు యోగ్యత్వము ననుసరించి ముఖ్యత్వమును పొందుచున్నవి.

తా. శ్రు॥ బ్రాహ్మణో బృహస్పతి సవేనయజతే॥ అనెడుస్థలమందు బృహస్పతి సవనమందు బ్రాహ్మణునకే యేప్రకారము అధికారముగలదో, క్షత్రియవైశ్యులకు అధికారములేదో అట్లును, శ్రు॥ రాజా రాజసూయేన యజతే॥ అనెడు స్థలమందు రాజసూయమనెడు యజ్ఞమందు క్షత్రియునకే యేప్రకారము అధికారముగలదో, బ్రాహ్మణవైశ్యులకు అధికారములేదో అట్లును, శ్రు॥ వైశ్యోవైశ్యస్తోమేనయజేతే॥ అనెడు స్థలమందు వైశ్యస్తోమమనెడు జన్నమందు వైశ్యునకే యేప్రకారమధికారముగలదో, బ్రాహ్మణ క్షత్రియులకు అధికారములేదో అట్లును, ఈప్రకారమే గౌణాత్మయగు పుత్రాదికమునకును,మిథ్యాత్మయగు దేహాదికమునకును, ముఖ్యాత్మయగు సాక్షికిని, ఈమూటకిని తమకుదగిన వ్యవహారములయందు ముఖ్యత్వము గలుగుచున్నదని తెలియవలెను.

అవ. ఇప్పుడు ఫలితమును జెప్పుచున్నాడు.

శ్లో॥ తత్రతత్రోచితాప్రీతి ర్వాత్మన్యేవాతిశాయినీ।
అనాత్మనితుతచ్ఛేషే ప్రీతిరన్యత్రనోభయమ్॥ ౫౦.

టీ. తత్రతత్ర - ఆయావ్యవహారమందు, ఉచితే - ఉపయోగిత్వముచేత ప్రధానభూతమైనట్టి, ఆత్మన్యేవ - ఆత్మయందే, ప్రీతిః-ప్రేమ, అతిశాయినిమిక్కిలి అతిశయమగును. తచ్ఛేషే=తత్ - ఆముఖ్యాత్మకంటె, శేషే- శేషభూతమగు, అనగా ముఖ్యత్వముగానియనుట. అనాత్మని - ముఖ్యాత్మవ్యతిరిక్తమగువస్తువునందు, ప్రీతిః-ప్రీతిమాత్రమగును. అన్యత్ర - ముఖ్యాముఖ్యాత్మలకంటె నన్యవస్తువునందు, ఉభయం-ఉభయవిధమగుప్రేమ, న-లేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ఏయేవ్యవహారమందు ఏయేఆత్మముఖ్యత్వమునకు తగుచున్నాదో, ఆయావ్యవహారమందు ఉపయోగిత్వముచేత ముఖ్యభూతమగు ఆత్మయందే నిరతిశయప్రీతిగలదు. అట్టిముఖ్యాత్మకంటె వ్యతిరిక్తమగు (అనగా ఆత్మకుశేషభూతవస్తువునందు) ప్రీతిమాత్రమే కలదుగాని నిరతిశయప్రీతిలేదు. మరియు ముఖ్యాముఖ్యాత్మలకంటె అన్యవస్తువునం దుభయవిధమగు ప్రీతియులేదని తెలియవలెను.

అవ. (అన్యత్ర) అనెడిపదముచేత తెలుపబడెడి అన్యశబ్దార్థమునకు మధ్యమందు కలిగిన భేదమును ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఉపేక్ష్యం ద్వేష్యమిత్యన్యద్ద్వేధామార్గతృణాదికం।
ఉపేక్ష్యంవ్యాఘ్రసర్పాది ద్వేష్యమేవం చతుర్విధం॥ ౫౧.

టీ. అన్యత్- అన్యశబ్దార్థమగు వస్తువు, ఉపేక్ష్యం - ఉపేక్షావిషయమనియు, ద్వేష్యం-ద్వేషవిషయమనియు, ఇతి-ఈప్రకారము, ద్వేధా - రెండువిధములుగలది యగును. మార్గతృణాదికం = మార్గ-మార్గమందుగల, తృణాదికం-గడ్డిపోరక మొదలగు వస్తువు, ఉపేక్ష్యం-ఉపేక్షావిషయమగును. వ్యాఘ్రసర్పాది=వ్యాఘ్ర-పెద్దపులియు, సర్పాది-సర్పవృశ్చికాది జంతువర్గంబును, ద్వేష్యం-ద్వేషవిషయమగును. ఏవం - ఈప్రకారము, చతుర్విధం - చతుర్విధమగును.

తా. ముఖ్యాముఖ్యాత్మలకంటే (అనగాఆత్మతచ్ఛేషములకంటె) అన్యశబ్దముచేత చెప్పబడెడి వస్తువు, ౧. ఉపేక్షావిషయమనియు, ౨. ద్వేషవిషయమనియు, ఇట్లు రెండువిధములు గలదియగును. ఆరెండువిధములు చెప్పెదవినుము. మార్గమును బొందియుండెడి గడ్డిపోరక మట్టిగడ్డ మొదలగు వస్తువు ఉపేక్షావిషయమగును. తనకు ఉపద్రవమును కలిగించెడి వ్యాఘ్రసర్ప వృశ్చికాదివస్తువు ద్వేషవిషయమగును. ఈప్రకారము లోకమందు చతుర్విధవస్తువు కలిగియున్నదని తెలియవలెను.

అవ. ఆచాతుర్విధ్యమునే ఇపుడు జూపుచున్నాడు.

శ్లో॥ ఆత్మాశేషఉపేక్ష్యంచద్వేష్యంచేతిచతుర్ష్వపి।
నవ్యక్తినియమఃకింతుతత్తత్కార్యాత్తథాతథా॥ ౫౨.

టీ. ఆత్మేతి-ఆత్మయనునట్టియు, శేషఇతి - శేషమనునట్టియు, ఉపేక్ష్యంచేతి- ఉపేక్షావిషయమనునట్టియు, ద్వేష్యంచేతి - ద్వేషవిషయమనునట్టి, చతుర్ష్వపి- నాలుగు విధములయందును, వ్యక్తినియమః-వ్యక్తినియమము, న-లేదు. కింతు- మరియేమనగా, తత్తత్కార్యాత్ = తత్తత్-ఆయావస్తువుయొక్క, కార్యాత్-ప్రయోజనాదికార్యమువలన, తథాతథా- ఆయాప్రకారము గచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ౧ ఆత్మ ౨ తచ్ఛేషము ౩ ఉపేక్షావిషయము ౪ ద్వేషవిషయము, అని ఇట్లులోకమందు వస్తువు చతుర్విధముగానున్నది. ప్ర. అయితే, ఆత్మాది చతుర్విధవస్తువులకును నిరతిశయప్రీతి మొదలగునవి నియమముగా కలిగియుండునా ఏమి? ఉ. ౧ వీడేనిరతిశయప్రీతివిషయుడగుననియు, ౨ వీడేప్రీతివిషయుడగుననియు, ౩ ఇదియే ఉపేక్షావిషయమనియు ౪ ఇదియే ద్వేషవిషయమనియు అన్యముకాదనియు, ఇట్టినియమముగలిగియుండలేదు. ప్ర. అయితే మరియెట్లు? ఉ. ఆయావస్తువుయొక్క ప్రయోజనాది కార్యవిశేషమువలన ప్రీతివిషయత్వాదిరూపము గలదగుచున్నదని తెలియవలెను.

అవ. అంతటను నియమములేదని తెలియుటకొరకు ప్రసిద్ధముగా ద్వేషవిషయమగు వ్యాఘ్రమునందు ద్వేషాభావమును జూపుచున్నాడు.

శ్లో॥ స్యాద్వ్యాఘ్రస్సమ్ముఖో ద్వేష్యో హ్యుపేక్ష్యస్తుపరాఙ్ముఖః।
లాలనాదనుకూలశ్చేద్వినోదాయైతి శేషతాం॥ ౫౩.

టీ. వ్యాఘ్రః-పులి, సమ్ముఖస్సన్- తనను భక్షించుటకొరకు యెదురుగావచ్చుచున్నదగుచు, ద్వేష్యః- ద్వేషవిషయము, స్యాత్-అగును. పరాఙ్ముఖస్సన్-తనకుకనుపడక పోవుచుండగా, ఉపేక్ష్యః-ఉపేక్షావిషయము, స్యాద్ధి-అగునుగదా. లాలనాత్ - లాలనమువలన, అనుకూలః - అనుకూలము, స్యాచ్చేత్ - అయినయెడల, వినోదాయ - వినోదముకొరకు, శేషతాం - ప్రియత్వమును, ఏతి - పొందుచున్నది.

తా. వ్యాఘ్రము తనను భక్షించుటకొరకు నెదురుగా వచ్చినపుడు ఆ వ్యాఘ్రము ద్వేషవిషయమగుచున్నది. ఆవ్యాఘ్రమే, తనకు కనబడకపోవుచుండగా ఉపేక్షావిషయమగుచున్నది. మరియు ఆవ్యాఘ్రమే లాలించుటవలన తనకు అనుకూలమైనయెడల వినోదముకొరకు శేషత్వమును పొందుచున్నది. అనగా తనకు ప్రయోజనకారియగుటచేత ప్రియత్వమును పొందుచున్నదని అభిప్రాయము.

శ్లో॥ వ్యక్తీనాంనియమోమాభూల్లక్షణాత్తువ్యవస్థితిః।
ఆనుకూల్యంప్రాతికూల్యం ద్వయాభావశ్చలక్షణం॥ ౫౪.

టీ. వ్యక్తీనాం-వ్యక్తులకు, నియమః - నియమము, మాభూత్-లేకపోవుగాక. లక్షణాత్తు-లక్షణమువలన, వ్యవస్థితిః-స్థితి, (స్యాత్ - అగును) ఆనుకూల్యం-అనుకూలత్వము. లక్షణం-ప్రియత్వలక్షణమగును. ప్రాతికూల్యం - ప్రతికూలత్వము, లక్షణం-ద్వేష్యలక్షణమగును. ద్వయాభావశ్చ = ద్వయ-ఆనుకూల్యప్రాతికూల్యములయొక్క, అభావశ్చ- లేమి, లక్షణం-ఉపేక్షాలక్షణమగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే ఒకవస్తువునకు ప్రియద్వేష్యోపేక్ష్యత్వముల నెడిధర్మత్రయము నంగీకరించినయెడల వ్యవహారస్థాపన చేయునుగదా? ఉ. ఈవస్తువే ప్రియమనునట్టియు, ఈవస్తువే ద్వేష్యమనునట్టియు, ఈవస్తువే ఉపేక్షావిషయమనునట్టి, ఈరూపముగల వ్యక్తినియమము లేకపోయినను లక్షణవశమువలనవ్యవహారస్థితిచెడదు. ప్ర. ఆలక్షణమేమి? ఉ. అనుకూలత్వము ప్రియలక్షణమగును. ఇదివ్యావర్తకధర్మముగలదగును. మరియు ప్రతికూలత్వము, ద్వేష్యలక్షణమగును. మరియు, ఆనుకూల్య ప్రాతికూల్య రూపద్వయముయొక్క లేమి, ఉపేక్షావిషయకలక్షణమగును.

అవ. ఇంతవరకుచెప్పిన గ్రంథసందర్భముచేత ప్రతిపాదింపబడిన అర్థమును సులభముగా తెలియుటకొరకు సంక్షేపముచేసి చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆత్మా ప్రేయాన్ ప్రియశ్శేషో ద్వేష్యోపేక్ష్యే తదన్యయోః।
ఇతివ్యవస్థితో లోకో యాజ్ఞవల్క్యమతంచతత్ ॥ ౫౫.

టీ. ఆత్మా-ప్రత్యగాత్మ, ప్రేయాన్-అధికప్రీతివిషయుడగును. శేషః-తనకుభోగసాధన పదార్థము, ప్రియః-ప్రీతివిషయమగును. తదన్యయోః=తత్-ఆప్రత్యగాత్మతచ్ఛేషములకంటె, అన్యయోః - అన్యములగురెంటికి, అనగా వ్యాఘ్రమునకును మార్గస్థిత తృణాదిరూప పదార్థమునకుననుట. ద్వేష్యోపేక్షే-ద్వేష్య - ద్వేషవిషయంబును ఉపేక్షే - ఉపేక్షావిషయంబునగును. ఇతి-ఈప్రకారము, లోకః - లోకము, వ్యవస్థితః - స్థితినిపొందియున్నది. తత్-అది, యాజ్ఞవల్క్యమతంచ = యాజ్ఞవల్క్య - యాజ్ఞవల్క్యాచార్యునకు, మతంచ - సమ్మతంబునగును.

తా. ప్రత్యగాత్మ, ౧ అధికప్రీతివిషయుడగును. మరియు తనకుభోగసాధన పదార్థము, (శేషము) ౨ ప్రీతివిషయమగును. మరియు వ్యాఘ్రసర్పాదికము, ౩ ద్వేషవిషయమగును. మరియు, మార్గమందుండెడి గడ్డిపొరక మొదలగురూపముగల పదార్థము, ౪ ఉపేక్షావిషయమగు, ఈప్రకారముగాలోకము స్థితినిపొందినదగును. అనగా ఈచెప్పబడిన నాలుగువిధములకంటే నన్యమగువస్తువు కొంచెమైనను లేదని అభిప్రాయము. మరియు, ప్రత్యగాత్మాదికమునకు అధికప్రీతివిషయత్వాదిక మెద్దిచెప్పబడెనో, అది యాజ్ఞవల్క్యాచార్యునకు సమ్మతమగును. అనగా శ్రుతిసమ్మతమగునని యభిప్రాయము.

అవ. ఇట్లాత్మకు చెప్పబడిన అధికప్రీతివిషయత్వము కేవలమైత్రేయీబ్రాహ్మణమందేగాక. పురుషవిధబ్రాహ్మణమందును చెప్పబడెననెడి అభిప్రాయముతోటి శ్రుత్యర్థమును చెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ అన్యత్రాపిశ్రుతిః ప్రాహ పుత్రాద్విత్తాత్తథాత్మనః।
సర్వస్మాదాంతరం తత్త్వం తదేతత్ప్రేయ ఈరితమ్॥ ౫౬.

టీ. తథా-ఆప్రకారము, పుత్రాత్ - పుత్రునికంటెను, విత్తాత్ - ధనముకంటెను, సర్వస్మాత్ - ఇతరసర్వముకంటెను, ఆంతరం - లోగానున్నట్టి, తదేతత్-ఆఈ, ఆత్మనః - ప్రత్యగాత్మయొక్క, తత్త్వం- పారమార్థికస్వరూపము, ప్రేయః - మిక్కిలి ప్రీతివిషయమయినదగునని, ఈరితం-చెప్పబడెను. అన్యత్రాపి- మరియొక బ్రాహ్మణమందును, శ్రుతిః- శ్రుతి, ప్రాహ-చెప్పెను.

తా. మరియు పురుషవిధ బ్రాహ్మణమందును పూర్వోక్త ప్రకారమే శ్రుతిచెప్పుచున్నది. అదియెటులనగా సృష్టికి పూర్వమందు అద్వితీయపరమాత్మ వినబడుచున్నాడో, అట్టి పరమాత్మయే ఇప్పుడు సృష్టికాలమందు దేహమందుండి ప్రత్యగాత్మశబ్దముచేత చెప్పబడుచున్నాడు. పుత్రధనాది సర్వప్రపంచమునకంటెను లోపలనున్నట్టి ఆఈప్రత్యగభిన్నపరమాత్మయొక్క పారమార్థికస్వరూపము మిక్కిలి ప్రీతివిషయమయినదగునని, శ్రు॥ తదేతత్ప్రేయః పుత్రాత్ప్రేయో విత్తాత్ప్రేయో ఽన్యస్మాత్సర్వస్మాదంతరతరం యదయమాత్మా॥ అనేడి పురుషవిధబ్రాహ్మణమందుగల ఈశ్రుతి చెప్పుచున్నది.

శ్లో॥ శ్రౌత్యావిచారదృష్ట్యాయం సాక్ష్యేవాత్మా నచేతరః।
కోశాన్పంచ వివిచ్యాంతర్వస్తుదృష్టిర్విచారణా॥ ౫౭.

టీ. శ్రౌత్యా-శ్రుత్యర్థపర్యాలోచనరూపమగు, విచారదృష్ట్యా-విచారదృష్టిచేత, సాక్షీ-సాక్షియగు, అయమేవ- ఈప్రత్యగాత్మయే, ఆత్మా-ముఖ్యాత్మయగును. ఇతరశ్చ- పుత్రాదికము, న-ముఖ్యాత్మకాదు. పంచ-అయిదైన, కోశాన్-కోశములను, వివిచ్య-విభజనజేసి, అంతః- లోపలనుండునట్టి, వస్తుదృష్టిః - వస్తుప్రత్యగభిన్నపరమాత్మవస్తువుయొక్క, దృష్టిః - చూపు, అనగా ననుభవమనుట. విచారణా - విచారణయగును.

తా. ప్ర. సరి. ఇట్లు శ్రుతియందు చెప్పబడుగాక. ప్రస్తుతమందు లాభమేమి? ఉ. శ్రుత్యర్థపర్యాలోచనరూపమగు విచారదృష్టిచేత ప్రత్యగాత్మయగుసాక్షికే, ముఖ్యాత్మత్వము కలదుగాని పుత్రాదికమునకు ముఖ్యాత్మత్వము లేదు. ప్ర. సరి. విచారణదృష్టియనగానేమి? ఉ. అన్నమయాది పంచకోశములను తైత్తిరీయశ్రుతియందు చెప్పబడిన ప్రకారముగా బుద్ధిచేత ప్రత్యగాత్మకంటె భిన్నము జేసి సర్వాంతరమందున్నట్టి ప్రత్యగాత్మయొక్క అనుభవము (అహంబ్రహ్మాస్మీత్యాకారకజ్ఞానము) విచారదృష్టియగును.

అవ. సర్వాంతరస్థితవస్తువుయొక్క దర్శనప్రకారమునే చెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ జాగరస్వప్నసుప్తీనా మాగమాపాయభాసనమ్।
యతోభవత్యసావాత్మా స్వప్రకాశచిదాత్మకః॥ ౫౮.

టీ. జాగరస్వప్నసుప్తీనాం=జాగర-జాగ్రతావస్థయొక్కయు, స్వప్న-స్వప్నావస్థయొక్కయు, సుప్తీనాం- సుషుప్త్యవస్థయొక్కయు, ఆగమాపాయభాసనం=ఆగమ- రాకయొక్కయు, అపాయ - పోకయొక్కయు, భాసనం- ప్రకాశము, అనగా స్ఫురణమనుట. యతః - ఏనిత్యచైతన్యరూపమువలన, భవతి- కలుగుచున్నదో, అసౌ- ఈచైతన్యరూపసాక్షి, స్వప్రకాశచిదాత్మకః= స్వప్రకాశ - స్వయముగా ప్రకాశించెడి, చిదాత్మకః - జ్ఞానస్వరూపుడగు, ఆత్మా- ప్రత్యగాత్మయగును.

తా. జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి మూడు అవస్థలయొక్క మధ్యమందు ఉత్తరోత్తరమగు అవస్థ, రావడముయొక్కయు పూర్వాపూర్వమగు అవస్థని వర్తించడముయొక్కయు, (ఈ రెంటియొక్క) స్ఫురణము ఏనిత్యచైతన్యరూపుడగు సాక్షివలన గలుగుచున్నదో, ఆనిత్యచైతన్యరూపుడగుసాక్షి, స్వయంప్రకాశమాన చిద్రూపుడగు ప్రత్యగాత్మయగునని తెలియవలెను.

అవ. పూర్వము (౫౬) శ్లోకమందు సంగ్రహముగా చెప్పబడిన ప్రత్యర్థము నిప్పుడు విశదముగా డెలుపుచున్నాడు.

శ్లో॥ శేషాఃప్రాణాదివిత్తాంతా ఆసన్నాస్తారతమ్యతః।
ప్రీతి స్తథా తారతమ్యాత్తేషు సర్వేషువీక్ష్యతే॥ ౫౯.

టీ. శేషాః-శేషభూతములగు, ప్రాణాదివిత్తాంతాః=ప్రాణ-ప్రాణమే, ఆది-మొదలుగాగలిగినట్టియు, విత్త ధనమే, అంతాః - అంతముగాగలిగినట్టిపదార్థములు, తారతమ్యతః- తారతమ్యముచేత, ఆసన్నాః - ఆత్మసమీపవర్తనముగలదియగుచున్నవి. తథా- ఆప్రకారము, తేషు-ఆశేషభూతములగు, సర్వేషు-ప్రాణాదిసర్వపదార్థములయందును, తారతమ్యాత్ - తారతమ్యమువలన, ప్రీతిః-ప్రేమ, వీక్ష్యతే - సర్వజనులచేత జూడబడుచున్నది.

తా. సాక్షికంటె నన్యములై శేషభూతములయినట్టియు ఇకమీద చెప్పబడెడి ప్రాణమే ఆదిగాగలిగినట్టియు ధనమే అంతముగాగల పదార్థములు తారతమ్యముచేత ఆత్మసమీపమందు వర్తింపుచున్నవి. ఇట్లు ఆత్మసమీపమందు వర్తించుచున్నవని చెప్పుటకు నిమిత్తమును చెప్పెదవినుము. ఏప్రకారముగా తారతమ్యముచేత ప్రాణాదిపదార్థములకు ఆంతరత్వము కలిగియున్నదో,ఆప్రకారమే యాప్రాణాదిపదార్థములయందు తారతమ్యమువలన సర్వజనులచేతను ప్రీతిజూడబడుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ప్రీతియొక్క తారతమ్యముచేత అనుభవమునే విశదము చేయుచున్నాడు.

శ్లో॥ విత్తాత్పుత్రః ప్రియః పుత్రాత్పిండః పిండాత్తథేంద్రియం।
ఇంద్రియాచ్చ ప్రియః ప్రాణః ప్రాణాదాత్మా ప్రియః పరః॥ ౬౦.

టీ. విత్తాత్- ధనముకంటె, పుత్రః - పుత్రుడు, ప్రియః- ప్రీతివిషయుడగును. పుత్రాత్- పుత్రునికంటె, పిండః-తనదేహము, ప్రియః-ప్రీతివిషయమగును. పిండాత్- దేహముకంటె, ఇంద్రియం-చక్షురాది ఇంద్రియము, తథా- ఆప్రకారమే యగును. అనగా ప్రీతివిషయమగుననుట. ఇంద్రియాచ్చ- ఇంద్రియముకంటెను, ప్రాణః-ప్రాణము, ప్రియః - ప్రీతివిషయమగును. ప్రాణాత్- ప్రాణముకంటె, ఆత్మా-ప్రత్యగాత్మ, పరః-నిరతిశయమైన, ప్రియః- ప్రీతివిషయుడగును.

తా. సర్వప్రాణులును పుత్రాదులకు ఆపదగలిగినప్పుడు అట్టియాపదను నివారింపచేయుటకొరకు ధనవ్యయమును జేయుచున్నారు. అందుచేత ధనముకంటె పుత్రుడు ప్రీతివిషయుడగును. మరియు, తనదేహము రక్షించుకొనుటకొరకు ఒకానొకప్పుడు పుత్రాదికమునుగూడ ఇచ్చుచున్నారు. అందుచేత పుత్రాదికముకంటె తనదేహము ప్రీతివిషయమగును. మరియు ఇంద్రియనాశపరిహారముకొరకు దెబ్బలుమొదలగువానిచేత దేహపీడ నంగీకరించుచున్నారు. అందుచేత దేహముకంటె చక్షురాది ఇంద్రియము ప్రీతివిషయమగును. మరియు ఉరిదీయుటమొదలగు నిమిత్తములచేత మరణము ప్రాప్తించునపుడు అట్టిమరణమును నివారింపజేసికొనుటకొరకు చక్షురాది ఇంద్రియవైకల్యమునుగూడ అంగీకరించుచున్నారు. అందుచేత ఇంద్రియముకంటె ప్రాణము ప్రీతివిషయమగును. ఆకారణముచేతనే, ధనపుత్ర స్వదేహేంద్రియ ప్రాణములకు ఉత్తరోత్తరముగా అధికప్రియత్వము సర్వానుభవసిద్ధమైయున్నది. మరియు ప్రత్యగాత్మకు నిరతిశయప్రీతివిషయత్వము విద్వాంసులకు ననుభవసిద్ధముగా నున్నది.

అవ. ఇట్లు ఆత్మకు నిరతిశయప్రీతివిషయత్వము ప్రమాణసిద్ధమైయున్నను జ్ఞానికిని అజ్ఞానికిని గల విరోధమును నివర్తింపజేయుటకు శ్రుతిచేత వారిద్దరికిగల విరోధము జూపబడెనని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏవం స్థితే వివాదోఽత్ర ప్రతిబుద్ధవిమూఢయోః।
శ్రుత్యోదాహృతస్తత్రాత్మా ప్రేయానిత్యేవ నిర్ణయః॥ ౬౧.

టీ. ఏవం-ఈప్రకారము, స్థితేసతి-ఆత్మకు నిరతిశయప్రీతివిషయత్వస్థితి కలుగుచుండగా, అత్ర- ఈవిషయమందు, ప్రతిబుద్ధవిమూఢయోః= ప్రతిబుద్ధ-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్ఞానికిని, విమూఢయోః-అజ్ఞానికిని, వివాదః-వివాదము, శ్రుత్యా - శ్రుతిచేత, ఉదాహారి- ఉదాహరింపబడెను. తత్ర - ఆశ్రుతియందు, ఆత్మైవ - ప్రత్యగాత్మయే, ప్రేయానితి - నిరతిశయప్రీతివిషయుడగునని, నిర్ణయః- నిర్ణయము.

తా. ఇట్లు ఆత్మకునిరతిశయ ప్రీతివిషయత్వ స్థితికలుగుచుండగా ఈవిషయమై జ్ఞానికిని అజ్ఞానికిని వివాదము గలిగియున్నట్లు శ్రుతిచేత నుదాహరింపబడెను. ప్ర. అయితే ఆశ్రుతియందు నిర్ణయింపబడిన అర్థమేమి? ఉ. ఆశ్రుతిచేత ప్రత్యగాత్మయే నిరతిశయ ప్రీతివిషయుడగునని ప్రతిపాదింపబడినందున ప్రత్యగాత్మయే నిరతిశయప్రీతివిషయుడగునని నిర్ణయించితిమి.

అవ. ఆనిరోధమునే ఇపుడు చూపుచున్నాడు.

శ్లో॥ సాక్ష్యేవదృశ్యాదన్యస్మాత్ప్రియానిత్యాహతత్త్వవిత్।
ప్రేయాన్పుత్రాదిరేవమం భోక్తుంసాక్షీతిమూఢధీః॥ ౬౨.

టీ. తత్త్వవిత్-జ్ఞాని, అన్యస్మాత్-ఇతరమగు, దృశ్యాత్- దృశ్యముకంటె, అనగా (ప్రపంచముకంటెననుట) సాక్ష్యేవ- ప్రత్యగాత్మయే, ప్రేయానితి-నిరతిశయప్రీతివిషయుడగునని, ఆహ-చెప్పెను. మూఢధీః-అజ్ఞాని, పుత్రాదిరేవ-పుత్రభార్యాదిరూపప్రపంచమే, ప్రేయాన్- నిరతిశయ ప్రీతివిషయమగుననియు, సాక్షీ - ప్రత్యగాత్మ, ఇమం - ఈపుత్రభార్యాది రూపప్రపంచమును, భోక్తుమితి- అనుభవించుటకొరకగునని, ఆహ- చెప్పెను.

తా. ఇతరమగు ప్రపంచముకంటె ప్రత్యగాత్మనిరతిశయ ప్రీతివిషయుడగునని జ్ఞానిచెప్పెను. ఇందుకు విరుద్ధముగానజ్ఞాని పుత్రభార్యాది రూప ప్రపంచమే పరమప్రీతివిషయమగుననియు, ఈపుత్రభార్యాదిరూప ప్రపంచమును అనుభవించుటకొరకు సాక్షిప్రవర్తింపు చున్నాడనియుం జెప్పెను.

అవ. ప్రత్యగాత్మకంటె నన్యమగుదానికి ప్రీతివిషయత్వమును జెప్పెడివాదికి విభజించి ప్రత్యుత్తరమును జెప్పుటకు ఆవాదినే విభజించి యిప్పుడుజూపుచున్నాడు.

శ్లో॥ ఆత్మనోన్యంప్రియంబ్రూతే శిష్యశ్చప్రతివాద్యపి।
తస్యోత్తరంవచోబోధశాపౌకుర్యాత్తయోఃక్రమాత్॥ ౬౩.

టీ. శిష్యశ్చ-శిష్యుడును, ప్రతివాద్యపి-ప్రతివాదియు, ఆత్మనః-ప్రత్యగాత్మకంటె, అన్యం-అన్యమగు పుత్రభార్యాదిరూపప్రపంచమును, ప్రియం-ప్రీతివిషయత్వమునుగా, బ్రూతే-చెప్పుచున్నాడు. తయోః- ఆశిష్యప్రతివాదుల యొక్క, తస్య- ఆవాక్యమునకు, ఉత్తరం-ప్రత్యుత్తరరూపమగు, వచః-వాక్య


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము, క్రమాత్-క్రమముగా, బోధశాపౌ = బోధ- బోధరూపంబును, శాపౌ- శాపరూపంబును, కుర్యాత్- కలుగచేసెను.

తా. శిష్యుడును ప్రతివాదియు ప్రత్యగాత్మకంటెనన్యమగు, పుత్రభార్యాదిరూప ప్రపంచమును ప్రీతివిషయత్వమునుగా జెప్పుచున్నాడు. ఆశిష్య ప్రతివాదులు చెప్పిన పూర్వోక్తవాక్యమునకు ప్రత్యుత్తరరూపమగు వాక్యము క్రమముగా, అనగా శిష్యునకు బోధరూపంబును ప్రతివాదికి శాపరూపంబు నగునని అభిప్రాయము.

అవ. ఆత్మకంటె నన్యమగు పుత్రభార్యాదిరూపప్రపంచమునకు ప్రీతి విషయత్వమును జెప్పెడివానికి ప్రతివచన ప్రదానరూపమగు, శ్రు॥ ప్రియం త్వాంరోత్స్యతి॥ అనెడి శ్రుత్యర్థమును బలికించుచున్నాడు.

శ్లో॥ ప్రియంత్వాంరోత్స్యతీత్యేవ ముత్తరంవక్తితత్వవిత్।
స్వోక్తప్రియస్యదుష్టత్వం శిష్యోవేత్తివివేకతః॥ ౬౪.

టీ. తత్వవిత్-బ్రహ్మవేత్త, (హేశిష్య) ఓశిష్యుడా, (హేప్రతివాదిన్) ఓప్రతివాదీ, ప్రియం-నీకుసమ్మతమగు పుత్రభార్యాది ప్రీతివిషయము, త్వాం- నిన్ను, రోత్స్యతీతి-దుఃఖింపజేయగలదని, ఏవం - ఈప్రకారము, ఉత్తరం- ప్రతివచనమును, వక్తి-చెప్పుచున్నాడు. అనగాజెప్పెననుట. శిష్యః-శిష్యుడు, స్వోక్తప్రియస్య=స్వ-తనచేత, ఉక్త-చెప్పబడిన, ప్రియస్య- పుత్రాదిరూపము నకు, వివేకతః - చెప్పబొయ్యెడి దోషవిచారమువలన, దుష్టత్వం- దుష్టస్వభా వమును, అనగా దుఃఖత్వముననుట. వేత్తి - ఎరుగుచున్నాడు.

తా. బ్రహ్మజ్ఞాని, ఓశిష్యుడా, ఓప్రతివాదీ, నీకుసమ్మతమగు పుత్రాది రూపప్రీతివిషయము, తానునశించుటచేత శిష్యుడవగు నిన్నుగాని, ప్రతివాది వగు నిన్నుగాని, దుఃఖింపజేయగలదనెడి యర్థముగల, శ్రుతి॥ ప్రియంత్వాం రోత్స్యతి॥ అనెడివాక్యముచేత ప్రత్యుత్తరమును చెప్పెను. ప్ర. అయితే, ఈయొకవాక్యమే శిష్యప్రతివాదులకిద్దరికెని ప్రత్యుత్తరమెట్లగునోచెప్పుము? ఉ. ఈశ్లోకము మొదలుకొని నాలుగున్నరశ్లోకపర్యంతము చెప్పబొయ్యెడి యర్థము ను శిష్యునిగూరించి ప్రత్యుత్తరమునుగా దెలిసికొనుము. ప్ర. అదియెట్లు? ఉ. పూర్వోక్తప్రతివచనరూపవాక్యముచేత శిష్యుడు తనచేత జెప్పబడినపుత్రాది రూప ప్రీతివిషయమును చెప్పబొయ్యెడి దోషవిచారమువలన దుఃఖస్వభావము నుగా నెరుగుచున్నాడు.

అవ. ఆదోష విచారమునే మూడుశ్లోకములచే నిప్పుడు చూపుచు న్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ అలభ్యమాన స్తనయః పితరౌ క్లేశయేచ్చిరమ్।
లబ్ధోపిగర్భపాతేన ప్రసవేనచబాధతే॥ ౬౫.

టీ. అలభ్యమానః-లభింపని, అనగా పుట్టనియనుట. తనయః - పుత్రుడు, పితరౌ-తల్లిదండ్రులను, చిరం-బహుకాలము, క్లేశయేత్ - దుఃఖింపజేయును. లబ్ధోపి-లభింపబడినను, గర్భపాతేన- గర్భముపోవుటచేతను, ప్రసవేనచ-పుట్టుటచేతను, పితరౌ- తల్లిదండ్రులను, బాధతే - బాధించుచున్నాడు. అనగా దుఃఖింపజేయుచున్నాడనుట.

తా. పుట్టనిపుత్రుడు తల్లిదండ్రులను సర్వదా దుఃఖింపచేయుచున్నాడు. అనగా పుత్రుడు కలుగమిచేత తల్లిదండ్రులు దుఃఖించుచున్నారని అభిప్రాయము. మరియు పుత్రుడు లభించుటకు నిమిత్తకమగు గర్భము కలిగినపక్షమందు ఆగర్భమందు లభించబడిన పుత్రుడు గర్భస్రావముచేత తలిదండ్రులను దుఃఖింపజేయుచున్నాడు. మరియు గర్భస్రావముగాక గర్భమునిలిచియున్నపక్షమందు పదియవమాసములో ప్రసవకాలమందు అట్టి పుత్రుడు తల్లిదండ్రులను దుఃఖింపజేయుచున్నాడు.

శ్లో॥ జాతస్యగ్రహరోగాదికుమారస్యచమూర్ఖతా।
ఉపనీతేప్యవిద్వత్వమనుద్వాహశ్చపండితే। ౬౬.

టీ. జాతస్య-పుట్టినపుత్రునకు, గ్రహరోగాది= గ్రహ - బాలగ్రహంబును, రోగాది-రోగాదికంబును గలుగును. కుమారస్య- కుమారునకు, మూర్ఖతాచ- మూర్ఖత్వంబును గలుగును. ఉపనీతేపి- ఉపనయనమును పొందినవాడైనను, అవిద్వత్వం-చదువులేమియుంగలుగును. పండితేపి - విద్యగలవాడైనను. అనుద్వాహశ్చ - వివాహములేమియుం గలుగును.

తా. మరియు ఆపుట్టిన పుత్రునకు బాలగ్రహరోగాదికముంగలుగును. అని తప్పించుకొని బ్రతికినయెడల కుమారునకు మూర్ఖత్వము అనగా చెప్పిన ప్రకారము చేయనిస్వభావము గలుగును. మరియు ఉపనయనమైనను విద్యాశూన్యత్వము కలుగును. విద్యగలవాడయినను వివాహము కాకపోవుటయుం గలదు.

శ్లో॥ పునశ్చపరదారాది దారిద్ర్యంచకుటుంబినః।
పిత్రోర్దుఃఖస్యనాస్త్యంతో ధనీచేన్మ్రియతేతదా॥ ౬౭.

టీ. పునశ్చ- మరియు, పరదారాది - పరభార్యాదికమునందాసక్తికలుగును. కుటుంబినః-పుత్రభార్యాది కుటుంబవంతునకు, దారిద్ర్యంచ - దరిద్రస్వభావముంగలుగును. ధనీచేత్ - ధనవంతుడయినయెడల, తదా - అప్పుడు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ్రియతే-మృతిపొందుచున్నాడు. పిత్రోః-తల్లిదండ్రులకు, దుఃఖస్య-దుఃఖము యొక్క, అంతః - అంతము, నాస్తి-లేదు.

తా. మరియు ఆపుత్రునకు వివాహమయినను పరధన పరభార్యాద్యాస క్తుడగును. మరియు భార్యాపుత్రాది కుటుంబవంతుడయినయెడల దరిద్రుడగు టయుంగలదు. మరియు ఆపుత్రుడు దరిద్రుడుగాక ధనవంతుడయినయెడలమృ తిపొందుటయుంగలదు. ఈప్రకారము తల్లిదండ్రులకు అంతములేని దుఃఖము కలుగుచున్నది. ఈచెప్పబడిన పుత్రగతదోష విచారమును.భార్యాదిసర్వవిష యమందును యోచించి దెలిసికొనవలయు.

శ్లో॥ ఏవం వివిచ్యపుత్రాదౌ ప్రీతింత్యక్త్వానిజాత్మని।
నిశ్చిత్యపరమాంప్రీతింవీక్షతేతమహర్నిశం॥ ౬౮.

టీ. ఏవం-ఈప్రకారము, (శిష్యః) శిష్యుడు,వివిచ్య - పుత్రాదివిషయ రాశియందుగలదోషములను విభజించియెరిగి, పుత్రాదౌ-పుత్రాదివిషయరాశి యందు, ప్రీతిం-ప్రీతిని, త్యక్త్వా-విడిచి, నిజాత్మని - ప్రత్యగాత్రుడగు సాక్షి యందు, పరమాం-నిరతిశయమగు, ప్రీతిం-ప్రీతిని, నిశ్చిత్య-నిశ్చయించి, తం- ఆప్రత్యగాత్మను, అహర్నిశం-రాత్రింబగలు, అనగా సర్వదాయనుట. వీక్షతే- చూచుచున్నాడు. అనగా ననుసంధానము జేయుచున్నాడనుట.

తా. ఈప్రకారము శిష్యుడు పుత్రాది విషయరాశియందుగల దోషము లను విభజించియెరిగి ఆపుత్రాదివిషయరాశియందు ప్రీతినివిడిపించి ప్రత్యగాత్రు డగు సాక్షియందు నిరతిశయమగు ప్రీతినినిశ్చయించి ఆప్రత్యగాత్మను సర్వ దా అనుసంధానము జేయుచున్నాడు. పూర్వము జ్ఞానిచేత ప్రత్యుత్తరరూప ముగాజెప్పబడిన, శ్రు॥ ప్రియంత్వాంరోత్స్యతి॥ అనెడివాక్యము ఈపూర్వో క్తప్రకారము శిష్యునకు బోధరూపమాయెనని తెలియవలెను.

అవ. శ్రు॥ ప్రియంత్వాంరోత్స్యతి॥ అనెడి ఈవాక్యమునకే ప్రతివాదిని గురించి శాపరూపత్వము ప్రకటించుచున్నాడు.

శ్లో॥ ఆగ్రహాద్బ్రహ్మవిద్వేషాదపిపక్షమముంచతః।
వాదినోనరకఃప్రోక్తోదోషశ్చబహుయోనిషు॥ ౬౯.

టీ. ఆగ్రహాత్-పుత్రాదికమందుగల ప్రీతినిసర్వవిధములచే విడువనెడి రూపవంతమగు కోపమువలనను, బ్రహ్మవిద్వేషాదపి-ఈజ్ఞానిచేచెప్పబడినదా నిని ఘటింపచేయనివ్వనెడిరూపముగల ద్వేషమువలనను, పక్షం-పుత్రాదిప్రీ తివిషయత్వాదికపక్షమును, అముంచతః-విడువని, వాదినః - ప్రతివాదికి, నరకః- నరకంబును, బహుయోనిషు-బహు-అనేకములగు, యోనిషు - యోనులయం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డు, దోషశ్చ- ఇష్టవియోగానిష్టప్రాప్తియు, ప్రోక్తః- చెప్పబడెను.

తా. పుత్రాదికమందుగల ప్రీతినిసర్వవిధములచే విడువననెడి రూపవంతమగు కోపమువలనను, ఈజ్ఞానిచే జెప్పబడినదానిని ఘటింపజేయనివ్వననెడి రూపముగల ద్వేషమువలనను, పుత్రాదికమందుగల ప్రీతివిషయత్వాదికమును విడువని ప్రతివాదికి నరకప్రాప్తియు, ఆప్రకారమే మనుష్య పశ్వాద్యనేక జన్మములయందు పుత్రభార్యాది ఇష్టవియోగంబును, రోగాద్యనిష్టప్రాప్తిరూపంబునుంగల దోషము చెప్పబడునని, శ్రు॥ ప్రియంత్వాంరోత్స్యతి॥ అనెడి వాక్యంబువలన జ్ఞానిచేత శపింపబడెను.

అవ. జ్ఞానిచేచెప్పబడిన ఒకవాక్యముననే, శిష్యునిగురించి ఉపదేశరూపత్వంబును, ప్రతివాదినిగురించి శాపరూపత్వంబును ఇట్టి విరుద్ధార్థంబులు రెండు నెట్లుఘటించునని శంకించుకొని, ఉత్తరమిచ్చెదుజ్ఞానికి ఈశ్వర రూపత్వము గలిగియుండుటవలన, అతని యభిప్రాయానుసారముగా పూర్వోక్త విరుద్ధార్థములురెండును ఘటింపగలవనితలచి, ఆయర్థమును ప్రతిపాదించెడినే నీశ్వరుండ నట్లేజరుగుననెడి యర్థముగల సమనంతర శ్రుతివాక్య తాత్పర్యము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మవిద్బ్రహ్మరూపత్వా దీశ్వరత్వేనవర్ణితం।
యద్వత్తత్తద్వదేవస్యాత్తచ్ఛిష్యప్రతివాదినోః॥   ౨౦.

టీ. బ్రహ్మవిత్- బ్రహ్మవేత్త, బ్రహ్మరూపత్వాత్ - బ్రహ్మస్వరూపుడగుటవలన, ఈశ్వరత్వేన-ఈశ్వరరూపముగా, యద్వత్-యేప్రకారము,వర్ణితం-వర్ణించబడెనో, (తద్వత్) - ఆప్రకారము, తచ్ఛిష్యప్రతివాదినోః=తత్- ఆజ్ఞానియొక్క, శిష్య - శిష్యునకును, ప్రతివాదినోః - ప్రతివాదికిని, తత్తత్- ఆయాఇష్టానిష్టరూపఫలము, తద్వదేవ-ఆప్రకారమే, అనగాజ్ఞానిచేసంకల్పించిన ప్రకారమనుట. స్యాత్ - కలుగును.

తా. బ్రహ్మవేత్త, బ్రహ్మస్వరూపుడగుటవలన ఈశ్వరరూపుడుగానే ప్రకారము వర్ణింపబడెనో, ఆప్రకారము ఆజ్ఞానియొక్క శిష్యప్రతివాదులకు నిద్దరికిని ఆయాఇష్టానిష్టరూపఫలము జ్ఞానిసంకల్పప్రకారముకలుగును. కనుక, శ్రు॥ ప్రియంత్వాంరోత్స్యతి॥ అనెడియొకవాక్యముననే, బోధశాపరూప విరుద్ధార్థద్వయమెట్లుఘటించునని శంకింపరాదని తాత్పర్యము. అనగా నేకారణమువలన బ్రహ్మజ్ఞానియగు తనకు బ్రహ్మత్వానుభవమువలన ఈశ్వరరూపము కలదో, ఆకారణమువలన జ్ఞానిచేత నేయే శిష్యప్రతివాదులనుగురించి యేయే ఇష్టానిష్టరూపఫలము చెప్పబడుచున్నదో, ఆయా ఇష్టానిష్టరూపఫలము జ్ఞాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక్క- శిష్యప్రతివాదులకు అజ్ఞాని సంకల్పప్రకారమవశ్యమకలుగునని యభి ప్రాయము.

అవ. వ్యతిరేక ముఖముగా నీపయినచెప్పబడిన యర్థమును అన్వయముఖముగా ప్రతిపాదించెడి, శ్రు॥ ఆత్మానమేవప్రియముపాసీత. సయ ఆత్మానమేవప్రియముపాస్తే. నహాస్యప్రియంప్రమాయుకంభవతీతి॥ అనెడి సమనంతర శ్రుతివాక్యార్థము నిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ యస్తుసాక్షిణమాత్మానం సేవతేప్రియముత్తమం।
తస్యప్రేయానసావాత్మానశ్యతికదాచన॥ ౭౧.

టీ. యస్తు-ఏశిష్యాదిపురుషుడు, ఆత్మానం - ప్రత్యగాత్మయైనట్టియు, ఉత్తమం- నిరతిశయమైన, ప్రియం - ప్రీతివిషయుడైనట్టి, సాక్షిణం - సాక్షిని, సేవతే- సేవించుచున్నాడో, అనగా స్మరించుచున్నాడో యనుట. తస్య-ఆశిష్యాది పురుషునకు, ప్రేయాన్- నిరతిశయ ప్రీతివిషయత్వమునకు సమ్మతుడగు, అసౌ-ఈ, ఆత్మా-ప్రత్యగాత్మ, కదాచన-యెప్పటికిని, ననశ్యతి - నాశమునుపొందదు. అనగా ప్రతివాదికి సమ్మతమగు పుత్రాది ప్రీతివిషయమువలె నశించదనుట.

తా. పుత్రభార్యాదిరూపమగు అనాత్మను ప్రీతివిషయత్వముగావాదించెడి ప్రతివాదికంటె అన్యుడగు యేశిష్యాది పురుషుడు ప్రత్యగాత్మయగుసాక్షినే (తననే) నిరతిశయప్రీతివిషయునిగా సదాస్మరించుచున్నాడో, ఆశిష్యాది పురుషునకు నిరతిశయ ప్రీతివిషయత్వమునకు సమ్మతుడగు ఈప్రత్యగాత్మ, ప్రతివాదికి సమ్మతమగు పుత్రాదిప్రీతివిషయము నశించినట్లు ఈయాత్మ,ఎప్పటికిని నాశమునుబొందక సర్వదా ఆనందరూపుడగుచు ప్రకాశించుచుండునని అభిప్రాయము.

అవ. ఇట్లుఆత్మకు పరప్రేమాస్పదత్వ హేతువును సాధించి ఇప్పుడు ఫలితమును జెప్పుచున్నాడు.

శ్లో॥ పరప్రేమాస్పదత్వేనపరమానందరూపతా।
సుఖవృద్ధిఃప్రీతివృద్ధౌ సార్వభౌమాదిషుశ్రుతా॥ ౭౨.

టీ. (ఆత్మనః-ప్రత్యగాత్మకు) పరప్రేమాస్పదత్వేన= పర- నిరుపాధికమైన, ప్రేమ - స్నేహమునకు, ఆస్పదత్వేన - విషయత్వముచేత, పరమానందరూపతా=పరమ - నిరుపాధికమైన, ఆనందరూపతా - ఆనంద రూపత్వమగును. సార్వభౌమాదిషు-చక్రవర్తిమొదలగు వారియందు, ప్రీతివృద్ధౌసత్యాం-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రీతి-ప్రేమకు, వృద్ధౌసత్యాం- వృద్ధికలుగుచుండగా, సుఖవృద్ధిః - సుఖవృద్ధి, శ్రుతా- వినబడుచున్నది.

నా. ప్రత్యగాత్మ నిరతిశయస్నేహమునకు విషయుడగుటచేత పరమానందరూపుడగును. ఇచ్చట ననుమాన ప్రమాణమును గ్రహించవలెను. ప్ర. అదియెటు? ఉ. ఆత్మనిరతిశయ ప్రేమవిషయుడగుటవలన పరమానందరూపుడగుననియు, ఎద్ది, పరమానందరూపవంతనుకాదో, అద్ది ఘటాదికమువలె నిరతిశయప్రేమ విషయముకాదని ఇట్లు అనుమానప్రమాణముచేత నెరుగవలెను. ఈఘటదృష్టాంతను కేవలవ్యతిరేక దృష్టాంతమగును. మరియు ఏకారణమువలన సార్వభౌముడుమొదలుకొని బ్రహ్మదేవుని పర్యంతముగల పదవిశేషములయందు ఎచ్చటెచ్చట ప్రీతివృద్ధిబొందుచున్నదో, అచ్చటచ్చట సుఖాభివృద్ధిగలదని తైత్తిరీయబృహదారణ్యకశ్రుతులయందు జెప్పబడెను. ఆకారణముచేత ప్రీతికి నిరతిశయత్వముకలుగుచుండగా ఆనందమునకును నిరతిశయత్వము గలుగుననియెరుగుటకు శక్యమగునని తెలియవలెను. అనగా నిరతిశయప్రీతివిషయత్వహేతువగు ఆత్మకు పరమానందరూపత్వ సాధనమునందు సామర్థ్యము గోచరించుటకొరకు ప్రీతివృద్ధియందు సుఖవృద్ధిని ఉదాహరణముగా సార్వభౌమాది పదవిశేషములు జెప్పబడెనని యభిప్రాయము.

శ్లో॥ చైతన్యవత్సుఖంచాస్యస్వభావశ్చేచ్చిదాత్మనః।
ధీవృత్తిష్వనువర్తేతసర్వాస్వపిచితిర్యథా॥ ౭౩.

అవ. పూర్వవాది ఆక్షేపించుచున్నాడు.

టీ. అస్య-ఈ, చిదాత్మనః-ఆత్మకు, చైతన్యవత్-జ్ఞానమువలె, సుఖంచ-ఆనందంబును, స్వభావశ్చేత్- స్వాభావికమైనయెడల, అనగా స్వరూపముగానున్నయెడలననుట. చితిర్యథా- జ్ఞానమువలె, సర్వాసు- సకలములయిన, ధీవృత్తిష్వపి- బుద్ధివృత్తులయందును, అనువర్తేత-అనుసరించి వర్తించవలెను.

తా. ప్ర. ఓఅద్వైతసిద్ధాంతీ, ఈప్రత్యగాత్మకు జ్ఞానమువలె ఆనందంబును స్వరూపమయినయెడల (చైతన్యమువలె) జ్ఞానమువలె సకల బుద్ధివృత్తులయందునానందంబు అనుసరించి వర్తించవలెను. అట్లు వర్తించుటలేమిచేతఆత్మకు పరమానందరూపత్వమునుజెప్పుటయుక్తమెట్లగుననిపూర్వవాదిఆక్షేపించెను.

అవ. ఇప్పుడు సిద్ధాంతి దృష్టాంత పూర్వక సమాధానమును జెప్పుచున్నాడు.

శ్లో॥ మైవముష్ణప్రకాశాత్మాదీపస్తస్యప్రభాగృహే।
వాప్నోతినోష్ణతాతద్వచ్చితేరేవానువర్తనమ్॥ ౭౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఏవం-ఈప్రకారము, మా-ఆక్షేపించరాదు. దీపః-దీపను, ఉష్ణప్రకాశాత్మా= ఉష్ణ-ఉష్ణంబును, ప్రకాశ - ప్రకాశంబును, ఆత్మా-స్వరూపము కలదియగును. తస్య-ఆదీపముయొక్క, ప్రభా-కాంతి, గృహే- గృహమందు, వ్యాప్నోతి- వ్యాపించుచున్నది. ఉష్ణతా-ఉష్ణస్వభావము, న - వ్యాపించుటలేదు తద్వత్-ఆప్రకారము, చితేరేవ- జ్ఞానమునకే, అనువర్తనం-బుద్ధివృత్తులయం దనువర్తించుటయగును.

తా. ఉ. ఓపూర్వవాదీ నీవిట్లు ఆక్షేపించరాదు. ఎందుచేతనగా ఉష్ణప్రకాశ స్వరూపముగల దీపముయొక్క కాంతిగృహమందు వ్యాపించుచున్న దేగాని ఆదీపముయొక్క ఉష్ణస్వభావము గృహమందు వ్యాపించుచుండలేదు. అటువలెనే జ్ఞానానంద స్వరూపుడగు ప్రత్యగాత్మయొక్క జ్ఞానస్వరూపము మాత్రమే బుద్ధివృత్తులయందు వర్తించుచున్నదేగాని ఆనందంబు వర్తించుచుండలేదు. ఇంతమాత్రముచేత ఆత్మకు పరమానందరూపత్వములేదని ఆక్షేపించుట యుక్తముగాదు.

శ్లో॥ గంధరూపరసస్పర్శేష్వపిసత్సుయథాపృథక్।
ఏకాక్షేణైక ఏవార్థో గృహ్యతేనేతరస్తథా॥ ౭౫.

టీ. గంధరూపరసస్పర్శేషు=గంధ-గంధంబును, రూప- రూపంబును, రస-రసంబును, స్పర్శేషు - స్పర్శంబును, సత్స్వపి - ఒకవస్తువునందున్నను, యథా-ఏప్రకారము, పృథక్- ప్రత్యేకముగా, ఏకాక్షేణ - ఒక ఇంద్రియము చేత, ఏకః-వకటయగు, అర్థఏవ - విషయమే, గృహ్యతే - గ్రహించబడుచున్నదో, ఇతరః - ఇతరవిషయము, న-గ్రహించబడలేదో, తథా- ఆప్రకారమే యానందంబునగును.

తా. ప్ర. అయితే, (చిదానందములకు) అనగా జ్ఞానానందములకు భేదస్థితిలేకపోవుచుండగా జ్ఞానసహితబుద్ధివృత్తియందే ఆనంద స్ఫురణంబును గలుగవలయుగదా? ఉ. అట్లునియమములేని విషయమై దృష్టాంతము జెప్పెదవినుము. శబ్ద స్పర్శ రూప రస గంధములు అయిదును, ఒకవస్తువునందు మిశ్రమముగానున్నను ఒక్కొక ఇంద్రియముచేత ఒక్కొకవిషయమే గ్రహించబడునుగాని మరియొకవిషయము గ్రహించబడుటలేదు. అటువలెనే రాజస తామస చిత్తవృత్తులయందు ఆత్మస్వరూపములగు జ్ఞానానందములలో జ్ఞానమునకుమాత్రమే స్ఫురణము గలిగియుండునుగాని ఆనందమునకు స్ఫురణము గలిగియుండదు.

శ్లో॥ చిదానందౌనైవభిన్నౌగంధాద్యాస్తువిలక్షణాః।
ఇతిచేత్తద్భేదోపిసాక్షిణ్యన్యత్రవావద॥ ౭౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. చిదానందౌ=చిత్-జ్ఞానంబును, ఆనందౌ - ఆనందంబును, భిన్నా-భేదస్థితికలవి. నైవ-కానేకావు. గంధాద్యాస్తు - గంధరసాదులో, విలక్షణాః-భిన్నములగును. ఇతిచేత్ - ఇట్లుంటివేని, తదభేదోపి=తత్ - ఆజ్ఞానానంధముల యొక్క, అభేదోపి - అభేదంబును, సాక్షిణివా - సాక్షియందో, అన్యత్రవా-బుద్ధివృత్తులయందో, వద - చెప్పుము.

తా. ప్ర.-అయితే చిదానందములు భిన్నస్థితిగలవికావు. శబ్దస్పర్శరూపరసగంధములో, భిన్నస్థితి గలవియగును. ఇట్లగుచుండగా, భిన్నములుగాని చిదానందములకు భిన్నములుగల గంధరసాది విషయదృష్టాంతంబు యుక్తమెట్లగును?. ఉ. చిదానందములకైక్యము ఆత్మస్వరూపమందో, లేక బుద్ధివృత్తులయందో, జెప్పుము. అనగా పూర్వవాదిజేసిన దృష్టాంత దార్ష్టాంతికములకుగల విరోధమును పరిహరించుటకొరకు దార్ష్టాంతికమందు చిదానందములకభేదము స్వాభావికమో, లేక ఉపాధినిమిత్తకమోయని సిద్ధాంతి వికల్పనుజేసెనని యభిప్రాయము.

శ్లో॥ ఆద్యేగంధాదయోప్యేవమభిన్నాఃపుష్పవర్తినః।
అక్షభేదేనతద్భేదేవృత్తిభేదాత్తయోర్భిదా॥ ౭౭.

టీ. ఆద్యే - ప్రథమపక్షమందు, అనగా సాక్షియందు చిదానందములకుభేదములేని పక్షమందనుట. పుష్పవర్తినః - పుష్పమందు వర్తించుచుండెడి, గంధాదయోపి- గంధాది పంచవిషయములును, ఏవం- చిదానందములవలెనే, అభిన్నాః - భేదములేనివగును. అక్షభేదేన= అక్ష - గంధాదులను గ్రహించెడి ఇంద్రియములయొక్క, భేదేన-భేదముచేతను, తద్భేదేసతి = తత్- ఆగంధాదులకు, భేదేసతి-భేదముపొందబడుచుండగా, వృత్తిభేదాత్= వృత్తి-రాజససాత్వికవృత్తులయొక్క, భేదాత్- భేదమువలన, తయోః- ఆచిదానందములకు, భిదా-భేదము కలుగగలదు.

తా. ప్రథమపక్షమందు దృష్టాంతదార్ష్టాంతికములకు సామ్యమునుచెప్పెదవినుము. సాక్షియందు చిదానందమునకు భేదములేదనెడి మొదటిపక్షమందు పుష్పమందువర్తించెడి గంధాదిపంచవిషయములును చిదానందములవలెనే ఇతరపరిహారముచేత నొకదానిని విడిపించుటకు శక్యముగామివలన పరస్పరము భేదములేనివగుచున్నవి. మరియు రెండవపక్షమందు సామ్యముచెప్పెదవినుము. గంధాదులంగ్రహించెడి ఘ్రాణాది ఇంద్రియములయొక్క భేదముచేత ఆయాగంధాదులకు భేదముకలుగుచుండగా నాప్రకారమే చిదానందములను స్పష్టముగా దెలుపుటకు హేతువులగు రాజస సాత్విక వృత్తిభేదమువలన నాచి


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దానందములకును భేదముకలుగగలదు. గనుక దృష్టాంత దార్ష్టాంతికములకు విరోధములేదని తెలియవలెను.

శ్లో॥ సత్వవృత్తౌచిత్సుఖైక్యంతద్వృత్తేర్నిర్మలత్వతః।
రజోవృత్తేస్తుమాలిన్యాత్సుఖాంశోఽత్రతిరస్కృతః॥ ౭౮.

టీ॰ తద్వృత్తేః=తత్-ఆ, వృత్తేః-సాత్వికవృత్తికి, నిర్మలత్వతః - నిర్మలత్వముగలిగియుండుటవలన, సత్వవృత్తౌ- సాత్వికవృత్తియందు, చిత్సుఖైక్యం= చిత్-జ్ఞానమునకును, సుఖ-ఆనందమునకును, ఐక్యం - ఏకత్వముగలదు. రజోవృత్తేః-రాజసవృత్తికి, మాలిన్యాత్- మలినత్వముగలిగియుండుటవలన, అనగా స్వచ్ఛత్వములేమిచేననుట. అత్ర - ఈరాజసవృత్తియందు, సుఖాంశః - ఆనందాంశము, తిరస్కృతః - తిరస్కరింపబడుచున్నది. అనగా స్ఫురించదనుట.

తా. ప్ర. అయితే చిదానందముల కైక్యమెచ్చటకలదో చెప్పుము? ఉ. పుణ్యకర్మచేత స్థాపింపబడెడి సత్వగుణపరిణామరూపియగు బుద్ధివృత్తియందు చిదానందములకు ఏకత్వముగలుగుచున్నది. అనగా సాత్వికవృత్తియందు చిదానందములు రెండును స్ఫురించుచున్నవని యభిప్రాయము. ప్ర. అట్లు స్ఫురించుటకు కారణమేమి? ఉ. ఆసాత్వికవృత్తి నిర్మలమైనదగుటచేత నట్టివృత్తియందు చిదానందములు రెండును స్ఫురించుచున్నవని తెలియవలెను. ప్ర. అయితే చిదానందములకు భేదమెచ్చటకలుగునో చెప్పుము? ఉ. రాజసవృత్తి మాలిన్యము గలదగుటచేత (అనగా స్వచ్ఛత్వములేనిదగుటచేత) ఈరాజసవృత్తియందు ఆనందము స్ఫురించుచుండలేదని తెలియవలెను.

అవ. ఆనందాంశమున్నను తిరస్కరింపబడుటయందు దృష్టాంతమును చెప్పుచున్నాడు.

శ్లో॥ తింత్రిణీఫలమత్యమ్లంలవణేనయుతంయదా।
తదామ్లస్యతిరస్కారాదీషదమ్లంయథాతథా॥ ౭౯.

టీ. అత్యమ్లం - మిక్కిలి పుల్లదనముగల, తింత్రిణీఫలం - చింతపండు, యదా-ఎప్పుడు, లవణేన- ఉప్పుతోటి, యుతం - కూడినదగుచున్నదో, తదా- అప్పుడు, అమ్లస్య-పులుసునకు, తిరస్కారాత్ - తిరస్కారముగలుగుటవలన, ఈషత్-కొంచముగా, అమ్లం-పులుసు, యథా - ఏప్రకారము కనుపడుచున్నదో, తథా-ఆప్రకారము.

తా. మిక్కిలి పుల్లదనముగలచింతపండు ఉప్పుతోటికూడినప్పుడు పులుసునకు తిరస్కారముగలుగుటవలన కొంచముగా నెట్లుపులుసుకనుపడుచున్న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దో, ఆప్రకారమే రాజసవృత్తియందు ఆనందము స్ఫురించుచుండలేదని యభి ప్రాయము.

అవ. ఇప్పుడు గూఢాభిసంధిని శంకించుచున్నాడు.

శ్లో॥ నను ప్రియతమత్వేన పరమానందతాత్మని।
వివేక్తుం శక్యతామేవం వినా యోగేన కిం భవేత్॥ ౮౦.

టీ. నను-ఓయి, ఏవం-ఈపూర్వోక్తప్రకారము, ప్రియతమత్వేన- నిరతిశయప్రీతివిషయత్వముచేత, ఆత్మని - ప్రత్యగాత్మయందు, పరమానందతా- పరమానందరూపత్వమును, వివేక్తుం-విభజించియెరుగుటకు, శక్యతాం-సాధ్యమవుగాక. (తథాపి) అట్లైనను, యోగేనవినా- యోగముచేత తప్ప, అనగా యోగములేక నేయనుట. కింభవేత్-ఏమికలుగును. అనగా ముక్తికలుగదనుట.

తా. ప్ర. ఓ అద్వైతసిద్ధాంతీ, ఈపూర్వోక్తప్రకారము ఆత్మకు పరప్రేమాస్పదత్వహేతువుచేత గౌణమిథ్యాత్మరూపములవలన ప్రియ ఉపేక్ష్యద్వేష్యలక్షణములచేత పరమానందరూపత్వమును విభజించి యెరుగుటకు శక్యమైనను, యోగము అపరోక్షజ్ఞానద్వారాముక్తిహేతువగునని పూర్వాధ్యాయమందు చెప్పబడియుండుటచేత, ఈప్రకరణమందు చెప్పబడిన వివేకము ముక్తిహేతువుకాదుగదాయని పూర్వవాదిగూఢమగు అభిసంధిని శంకించెను.

అవ. ఆగూఢాభిసంధికి సిద్ధాంతి ఉత్తరమును చెప్పుచున్నాడు.

శ్లో॥ యద్యోగేన తదేవేతి వదామో జ్ఞానసిద్ధయే।
యోగః ప్రోక్తో వివేకేన జ్ఞానం కిన్నోపజాయతే॥ ౮౧.

టీ. యోగేన-యోగముచేత, యత్ - ఏయపరోక్షజ్ఞానముకలుగునని చెప్పబడెనో, తదేవేతి-ఆయపరోక్షజ్ఞానమే వివేకముచేత గలుగుచున్నదని, వదామః-చెప్పెదము. యోగః-యోగము, జ్ఞానసిద్ధయే - జ్ఞానసిద్ధికొరకు, ప్రోక్తః- చెప్పబడెను. వివేకేన - పంచకోశవివేకముచేత, జ్ఞానం- జ్ఞానము, కిన్నోపజాయతే- కలుగదాయేమి. అనగా కలుగుచున్నదనుట.

తా. ఉ. ఓపూర్వవాదీ, యోగమునకు ఏప్రకారముగా నపరోక్షజ్ఞానహేతుత్వముకలదో, ఆప్రకారమే వివేకమునకును అపరోక్షజ్ఞాన హేతుత్వము కలదు. ఈప్రత్యుత్తరంబును గూఢాభిసంధి గలదిగానున్నదని తెలియవలెను. ఓపూర్వవాదీ, నీవుచేసిన చోద్యమునకును నేనుచెప్పిన పరిహారమునకును అభిసంధిని ప్రకటీకరించెదవినుము. పూర్వాధ్యాయమందు యోగము అపరోక్షజ్ఞానసాధనత్వముగా నేప్రకారము చెప్పబడెనో, ఆప్రకారమే ఈయధ్యాయమందు చెప్పబడిన గౌణాద్యాత్మవివేకద్వారా, పంచకోశవివేకముచేతను ద్ధ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్ఞానముగలుగుచున్నదే యగుననని తెలియవలెను.

అవ. ఈవిషయమై ప్రమాణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానంతద్యోగైరపిగమ్యతే।
ఇతిస్మృతంఫలైకత్వం యోగినాంచవివేకినామ్॥ ౮౨.

టీ. సాంఖ్యైః-ఆత్మానాత్మవివేకులచేత, యత్-ఏమోక్షరూపస్థానము, ప్రాప్యతే- పొందబడుచున్నదో, తత్ - ఆమోక్షరూపస్థానము, యోగైరపి- యోగులచేతంగూడ, గమ్యతేతి - పొందబడుచున్నదని, యోగినాం- యోగులకును, వివేకినాంచ- వివేకులకును, ఫలైకత్వం = ఫల- మోక్షలక్షణఫలముయొక్క, ఏకత్వం-ఏకత్వము, స్మృతం - చెప్పబడెను.

తా. ప్ర. అయితే ఇందుకు ప్రమాణమేమి? ఉ. ఆత్మానాత్మ వివేకుల చేత ఏమోక్షరూపస్థానము పొందబడుచున్నదో, ఆస్థానము యోగులచేతం గూడ పొందబడుచున్నదని, ఈప్రకారముగా శ్రీభగవంతుడు గీతాశాస్త్రమందు వివేకులకును యోగులకును జ్ఞానద్వారా, మోక్షలక్షణ ఫలముయొక్క యేకత్వమును చెప్పినవాడాయెను.

శ్లో॥ అసాధ్యఃకస్యచిద్యోగః కస్యచిత్ జ్ఞాననిశ్చయః।
ఇత్థంవిచార్యమార్గౌద్వౌ జగాదపరమేశ్వరః॥ ౮౩.

టీ. కస్యచిత్-ఒకానొకనికి, అనగా కొంతమందికనుట. యోగః-యోగము, అసాధ్యః-సాధ్యముకానిదగును. కస్యచిత్ - ఒకానొకనికి, అనగాకొంతమందికనుట. జ్ఞాననిశ్చయః-జ్ఞాననిశ్చయము, అసాధ్యః-అసాధ్యమైనదగును. ఇత్థం-ఈప్రకారము, పరమేశ్వరః-భగవంతుడు, విచార్య-ఆలోచించి,ద్వౌ-రెండైన, మార్గౌ-యోగవివేకమార్గములను, జగాద - చెప్పెను.

తా. ప్ర. అయితే వివేకయోగములకు రెంటికిని ఫలంబొక్కటియే యైనయెడల, నీరెంటిలోనొకదానినే శాస్త్రములయందు ప్రతిపాదించుటయు క్తమగుగాని, రెంటిని ప్రతిపాదించుట యుక్తమెట్లగును? ఉ. కొంతమందికి యోగముసాధ్యముకానిదగును. మరికొంతమందికి ఆత్మానాత్మవిచారము సాధ్యముకానిదగును. ఈప్రకారము శ్రీభగవంతుడు ఆలోచించి జ్ఞానయోగ మార్గములను రెంటినిచెప్పినవాడాయెను. అనగా నధికారిభేదమువలన రెంటిని ప్రతిపాదించుట యుక్తమేయగుననని యభిప్రాయము.

శ్లో॥ యోగేకోతిశయస్సత్ర జ్ఞానముక్తంసమంద్వయోః।
రాగద్వేషాద్యభావశ్చతుల్యోయోగివివేకినోః॥ ౮౪.

టీ. యోగే-యోగమందు, అతిశయః-ఆధిక్యము, కః-ఏమి. అనగా లేద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుట. తత్ర- ఆయోగమందు, ఉక్తం- చెప్పబడిన, జ్ఞానం - అపరోక్షజ్ఞానము, ద్వయోః - వివేకయోగములనెడి రెంటియందును, సమం - సమానమగును. రాగద్వేషాద్యభావశ్చ= రాగద్వేషాది - రాగద్వేషాదులయొక్క, అభావశ్చ- లేమియు, యోగివివేకినోః=యోగి-యోగికిని, వివేకినోః - ఆత్మానాత్మవిభజన లక్షణవివేకముగల వానికిని, తుల్యః - సమానమగును.

తా. ప్ర. అయితే, మిక్కిలి కష్టసాధ్యమైన యోగమునకు నిరాయాసముచేత సులభముగాలభించెడి వివేకముకంటె ఆధిక్యమునుచెప్పందగుగదా? ఉ. ఆయాధిక్యము, ౧. అపరోక్షజ్ఞానమునుపుట్టించుటచేతనో, లేక, ౨. రాగద్వేషాదులు నివర్తించుటకు హేతువుగా నుండుటచేతనో, లేక ౩. ద్వైతవిస్మృతికారణనుచేతనో, చెప్పుము. పూర్వోక్తగీతావాక్యమందుసాంఖ్యులనెడి ఆత్మానాత్మవివేకులకును, యోగులకును, అపరోక్షజ్ఞానలక్షణఫలమగు మోక్షము సమానముగా చెప్పబడుటచేత, నీయోగమందు మొదటిపక్షమున నాధిక్యమేమియు లేదు. మరియు, యోగివివేకులకు నుభయులకును రాగద్వేషాదులయొక్క లేమియు సమానముగానుండుటచేత నీయోగమందు రెండవపక్షమున నాధిక్యమేమియులేదని తెలిసికొనుము.

అవ. వివేకికి రాగాద్యభావమును ప్రతిపాదించుచున్నాడు.

శ్లో॥ నప్రీతిర్విషయేష్వస్తి ప్రేయానాత్మేతిజానతః।
కుతో రాగః కుతో ద్వేషః ప్రాతికూల్యమపశ్యతః॥ ౮౫.

టీ. ఆత్మా-ప్రత్యగాత్మ, ప్రేయానితి- నిరతిశయప్రీతివిషయుడని, జానతః-ఎరిగినవానికి, విషయేషు- భోగ్యవస్తువులయందు, ప్రీతిః-ఆసక్తి, నాస్తి- లేదు. ప్రాతికూల్యం-ప్రతికూలత్వమును, అపశ్యతః - చూడనివానికి, అనగా ప్రాతికూల్యజ్ఞానశూన్యునకనుట. ద్వేషః-ద్వేషము, కుతః-ఎక్కడిది. రాగః- కోరిక, కుతః- ఎక్కడిది. అనగా లేదనుట.

తా. ప్రత్యగాత్మ పరమప్రీతివిషయుడగునని యెరిగినపురుషునకు విషయములయందు ప్రీతికలుగదు. రాగహేతువగు ఆనుకూల్యజ్ఞానములేమిచేత విషయములయందు రాగముకలుగదు. మరియు, ద్వేషహేతువగు ప్రాతికూల్యజ్ఞానము లేమిచేత వివేకికివిషయములయందు ద్వేషంబునుంగలుగదని తెలియవలెను.

శ్లో॥ దేహాదేః ప్రతికూలేషు ద్వేషస్తుల్యో ద్వయోరపి।
ద్వేషంకుర్వన్నయోగీచేదవివేక్యపి తాదృశః ౮౬.

టీ. దేహాదేః - దేహాదికమునకు, ప్రతికూలేషు- ప్రతికూలములగువృశ్చికాదులయందు, ద్వేషః-ద్వేషము, ద్వయోరపి - ఇద్దరికిని, తుల్యః - సమానమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గును. ద్వేషం-ద్వేషమును, కుర్వన్ - చేయుచుండెడివాడు, యోగీ- యోగి, నచేత్- కాదనియంటివేని, తాదృశః - అటువంటివాడు, అనగా ద్వేషమును చేసెడివాడనుట, అవివేక్యపి - వివేకములేనివాడునగును.

తా. ప్ర. అయితే వ్యవహారదశయందు వివేకికి దేహాదికమునకు నుపద్రవమునుకలిగించెడి వృశ్చికాదులయందు ద్వేషముకనబడుచుండదా యేమి? ఉ. దేహాదులకు ఉపద్రవమును కలిగించెడి వృశ్చికాదులయందు గల ద్వేషము యోగి వివేకులకిద్దరికిని సమానముగనున్నది. మరియు ప్రతికూలములగు వృశ్చికాదులయందు ద్వేషమును కలిగించుకొనెడివానికి మీచేత యోగిత్వమే అంగీకరింపబడనియెడల అట్టి ద్వేషమును కలిగించుకొనెడివాడు వివేకియుకాడని మేమంగీకరించుచున్నాము.

శ్లో॥ ద్వైతస్యప్రతిభానంతు వ్యవహారేద్వయోస్సమమ్।
సమాధౌనేతిచేత్తద్వ న్నద్వైతత్వంవివేకినః॥ ౧౭.

టీ. ద్వైతస్య- ద్వైతముయొక్క, ప్రతిభానంతు - స్ఫురణమో, వ్యవహారే- వ్యవహారదశయందు, ద్వయోః-వివేకియోగులకిద్దరికిని, సమం- సమానమగును. సమాధౌ-సమాధిదశయందు, (యోగినః) యోగికి, నేతిచేత్-ద్వైతస్ఫురణము లేదనియంటివేని, తద్వత్ - ఆప్రకారమాత్మానాత్మ విభజనలక్షణవివేకదశయందును, వివేకినః- వివేకికి, ద్వైతత్వం - ద్వైతభావము, న-లేదు.

తా. ప్ర. అయితే, వివేకికి ద్వైతస్ఫురణము గలదనునట్టియు యోగికి ద్వైతస్ఫురణములేదనునట్టి నుందుచెప్పబడిన మూడవపక్షమందు యోగికివివేకికంటె ఆధిక్యమునుచెప్పరాదాయేమి? ఉ. సరి. అద్వైతస్ఫురణము వివేకివ్యవహారదశయందు చెప్పెదవో లేక ఆత్మానాత్మవిభజనలక్షణ (వివేక) దశయందుచెప్పెదవో చెప్పుము. వ్యవహారదశయందు గలదనిచెప్పెదవేని యోగికిని వ్యవహారదశయందు ద్వైతస్ఫురణము వివేకికివలెనే సమానముగనున్నది. ప్ర. అయితే సమాధిదశయందుయోగికి ద్వైతస్ఫురణములేదుగదా?ఉ. యోగికి సమాధిదశయందు ద్వైతస్ఫురణము లేకుండినట్లు, శ్రుతియుక్తులచేత ఆత్మానాత్మవిచారణచేసెడి వివేకికిని వివేకదశయందు ద్వైతస్ఫురణములేదని తెలియవలెను.

శ్లో॥ వివక్ష్యతేతదస్మాభిరద్వైతానందనామకే।
అధ్యాయేహితృతీయేతత్సర్వముపస్థితిమంగళం॥ ౧౮.

టీ. తత్-అద్వైతస్ఫురణములేమి,అద్వైతానందనామకే-అద్వైతానంద-అద్వైతానందమనెడి,నామకే-పేరుగల, తృతీయే-మూడవదియగు, అధ్యాయే-అధ్యాయమందు, అస్మాభిః-మాచేత, వివక్ష్యతేహి-చెప్పబడుచున్నది. అతః-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆకారణమువలన, సర్వమపి- సకలంబును, అతిమంగళం- మిక్కిలిశుభమగును. అనగా యోగికిగల శుభమంతయు వివేకికింగలదనుట.

తా. ప్ర. అయితే, ఆద్వైతస్ఫురణరాహిత్యము వివేకికిలేకపోవుటెట్లు? ఉ. వివేకికిద్వైతస్ఫురణము లేనివిధము అద్వైతానందమనెడి పేరుగల ఇకమీదనూచేత చెప్పబొయ్యెడి మూడవ అధ్యాయమందు తెలియబడగలదు గనుక యోగికిగల శుభమంతయు వివేకికిని గలదని తెలియవలెను.

శ్లో॥ సదాపశ్యన్నిజానందమపశ్యన్నిఖిలంజగత్।
అర్థాద్యోగీతిచేత్తర్హి సంతుష్టోవర్ధతాంభవాన్॥ ౮౯.

టీ. సదా- ఎల్లప్పుడును, నిజానందం - నిరుపాధికమైన ఆనందమును, పశ్యన్-చూచుచు, అనగా ననుభవించుచుననుట. నిఖిలం-సకలమగు,జగత్-ప్రపంచమును, అపశ్యన్-చూడనివాడు, అనగా ద్వైతవ్యవహారము లేనివాడనుట. అర్థాత్-ఈవాక్యార్థమువలన, యోగీతిచేత్ - యోగియగుననియంటివేని, భవాన్-నీవు, సంతుష్టస్సన్- సంతోషించినవాడవగుచు, వర్ధతాం - వృద్ధిపొందుదువుగాక. అనగా దీర్ఘాయుష్మంతుడవగుమనుట.

తా. ప్ర. ఆయితే ఓఅద్వైతసిద్ధాంతీ ద్వైతస్ఫురణము లేమితోగూడిన ఆత్మజ్ఞానవంతునకే యోగిత్వముగలుగవలయుంగదా? ఉ. సరి. నీయిష్టప్రకారము సర్వదా స్వస్వరూప భూతానందాత్మానుభవముగలవాడగుచు జగత్స్ఫురణములేనివాడే యోగియగునని తెలుసుకొనుము. నీవిప్పుడు వాస్తవమును చెప్పుటచేత దీర్ఘాయుష్మంతుడవైవర్ధిల్లుము. అనగా నీవిప్పుడు చెప్పినయోగిలక్షణము మాకునుసమ్మతమేయగునని శ్రీవిద్యారణ్యగురుండు దీవించెనని తెలియవలెను.

అవ. అధ్యాయతాత్పర్యము నిప్పుడు సంక్షేపముచేసి చూపుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మానందాభిధేగ్రంథేమందానుగ్రహసిద్ధయే।
ద్వితీయాధ్యాయఏతస్మిన్నాత్మానందోవివేచితః॥ ౯౦.

టీ. ఏతస్మిన్- ఈ, బ్రహ్మానందాభిధే = బ్రహ్మానంద - బ్రహ్మానందమనెడి, అభిధే-పేరుగల, గ్రంథే - అధ్యాయపంచకమందు, మందానుగ్రహసిద్ధయే=మంద- మందబుద్ధిగలజనులయందు, అనుగ్రహ - అనుగ్రహముయొక్క, సిద్ధయే-సిద్ధికొరకు, అనగా మందజనుల నుద్ధరించెడికొరకనుట. ఆత్మానందః- ఆత్మానందమనెడి, ద్వితీయాధ్యాయః - రెండవయధ్యాయము, వివేచితః- తెలుపబడెను.

తా. ఈబ్రహ్మానందమనెడి (అధ్యాయ పంచకముగల) గ్రంథమందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మందబుద్ధిగల జనులనుద్ధరించెడికొరకు ఆత్మానందమనెడి రెండవ యధ్యాయము దెలుపబడెను.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీభారతీ తీర్థ
విద్యారణ్యముని విరచిత బ్రహ్మానందే ఆత్మానందనామకం
ద్వాదశ ప్రకరణం సమాప్తం.

గద్య. ఇది శ్రీపరమేశ్వరగురు చరణ వరప్రసాదలబ్ధ బ్రహ్మవిద్యా
విరాజిత కాశ్యపసగోత్ర పవిత్ర మంత్రివంశ పయఃపారావార
పరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్య పుత్ర లక్ష్మీనారాయణా
మాత్య ప్రణీతంబైన ఆంధ్రటీకాతాత్పర్య సహిత
శ్రీవేదాంతపంచదశియందు బ్రహ్మానందనామక
గ్రంథస్థితాత్మానందమనెడి
ద్వాదశ ప్రకరణము
సంపూర్ణము.

—*—

ఓం తత్సత్ శ్రీపరమేశ్వరార్పణమస్తు.

శ్లో॥ ఆత్మానందస్యటీకేయం పదభావప్రబోధినీ।
మంత్రినారాయణాఖ్యేన హ్యర్పితాబ్రహ్మచారిణే॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుభమస్తు.

శ్రీపరమేశ్వర సద్గురుపరబ్రహ్మణేనమః.

# అద్వైతానందప్రారంభము.



శ్లో॥ యోగానందఃపురోక్తోయ స్సఆత్మానంద ఇష్యతాం।
కథంబ్రహ్మత్వమేతస్యసద్వయస్యేతిచేచ్ఛృణు॥ ౧.

టీ. యః-ఏ, యోగానందః-యోగానందము,పురా- పూర్వము, ఉక్తః-చెప్పబడెనో, సః-అది, ఆత్మానందః-ఆత్మానందమని, ఇష్యతాం-అంగీకరింపబడునుగాక. సద్వయస్య-ద్వితీయవస్తువుతో జేరియున్న, ఏతస్య-ఈఆత్మానందమునకు, బ్రహ్మత్వం-బ్రహ్మభావము. కథం - యెట్లుసిద్ధించును. ఇతిచేత్-ఇటంటివేని, శృణు - వినుము.

తా. ప్ర. అయితే, ఆనందము, ౧. బ్రహ్మానందమనియు,౨. విద్యానందమనియు, ౩. విషయానందమని యిట్లు, ప్రథమాధ్యాయమందు ఆనందములు మూడేనని ప్రతిజ్ఞచేసి, ద్వితీయాధ్యాయమందు ఆమాటికంటె నన్యమగు నాత్మానందనిరూపణము చేయుటచేత పూర్వోక్తమైనదానికి విరోధముగలుగ దాయేమి? ఉ. ప్రథమాధ్యాయములో ఏయోగానందము చెప్పబడెనో, దానిని ఆత్మానందముగా నంగీకరింపవలెను. అనగా ప్రతిజ్ఞచేయబడిన బ్రహ్మానందమే యోగజనితవృత్త్యుపాధికమైనప్పుడు యోగానందమనియు,నిరుపాధికమైనప్పుడు నిజానందమనియు నెట్లువ్యవహరింపబడుచున్నదో, ఆప్రకారమే గౌణాత్మముఖ్యాత్మ మిథ్యాత్మవివేచనముచేత గలుగు చిత్తవృత్తితోకూడినప్పు డాత్మానందమని వ్యవహరింపబడుచుండుటచేత పూర్వమందు చెప్పిన ప్రతిజ్ఞా విరోధములేదని యభిప్రాయము. ప్ర. అయితే, సజాతీయమగు పుత్రభార్యాది గౌణాత్మకంబెను, మరియు దేహేంద్రియాది మిథ్యాత్మకంబెను. మరియు విజాతీయములగు నాకాశాదులకంటెనన్యముగాక వానితోగూడియున్న ఆత్మానందమునకు ప్రథమాధ్యాయమందు చెప్పబడిన అద్వితీయ యోగానందరూపత్వమెట్లుసంభవించును? ఉ. చెప్పెదనినుము. అనగా సజాతీయముగా నభిమతమగు పుత్రభార్యాదిరూపగౌణాత్మయు, దేహేంద్రియాది మిథ్యాత్మయును, తైత్తిరీయశ్రుతియందు చెప్పబడిన ప్రపంచములో నంతర్భూతమైనందువలననివి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యును, ఆకాశాదిప్రపంచంబును ఆత్మానందముకంటె భిన్నముగా లేని హేతువువలన నద్వితీయబ్రహ్మరూపత్వ మాత్మానందమునకు ఘటించుననేడియభిప్రాయముతోట శ్రీవిద్యారణ్యగురుండు బహుమానసహితముగా నుత్తరమును చెప్పెనని యభిప్రాయము.

శ్లో॥ ఆకాశాదిస్వదేహాంతం తైత్తిరీయశ్రుతీరితం।
జగన్నాస్త్యన్యదానందా దద్వైతబ్రహ్మతాతతః॥ ౨.

టీ. తైత్తిరీయశ్రుతీరితం=తైత్తిరీయ-తైత్తిరీయశ్రుతిచేత, ఈరితం - చెప్పబడిన, ఆకాశాదిస్వదేహాంతం=ఆకాశ-ఆకాశమే, ఆది- ఆదిగాగలిగినట్టియు, స్వ-తనయొక్క, దేహ- దేహమే, అంతం-అంతముగాగల, జగత్ - ప్రపంచము, ఆనందాత్ - ఆత్మానందముకంటె, అన్యత్ - వేరుగా, నాస్తి - లేదు. తతః- అందువలన, అద్వైతబ్రహ్మతా= అద్వైత - ద్వైతరహితమైన, బ్రహ్మతా- బ్రహ్మరూపత్వము కలదు.

తా. అయిూప్రత్యగభిన్నపరమాత్మవలన ఆకాశాదిజగంబు బుట్టినదని చెప్పెడి, శ్రు॥ తస్మాద్వాఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః॥ ఇత్యాది తైత్తిరీయశ్రుతిచే జెప్పబడినజగంబు, తనకు కారణభూతమైన ఆత్మానందముకంటె నేహేతువువలన భిన్నముగాలేదో ఆహేతువువలన సర్వప్రపంచకారణమైన ఆత్మానందమునకు అద్వితీయ బ్రహ్మస్వరూపత్వము గలిగియున్నదని తెలియవలెను.

అవ. ఇప్పుడు తైత్తిరీయ శ్రుత్యర్థమును పఠించుచున్నాడు.

శ్లో॥ ఆనందాదేవతజ్జాతం తిష్ఠత్యానందఏవతత్।
ఆనందఏవలీనంచేత్యుక్తానందాత్కథంపృథక్॥ ౩.

టీ. తత్-ఆజగత్తు, ఆనందాదేవ - ఆనందమువల్లనే, జాతం- పుట్టినది, తత్-ఆజగత్తు, ఆనందఏవ - ఆనందమందే, తిష్ఠతి- స్థితినిపొందుచున్నది. ఆనందఏవ- ఆనందమందే, లీనంచ- లయించుచున్నది. ఇతి-ఇట్లగుచుండగా, ఉక్తానందాత్=ఉక్త - పయినచెప్పబడిన, ఆనందాత్ - ఆనందముకంటె, కథం-యెట్లు, పృథక్- వేరగును. అనగా వేరుగాదనుట.

తా. ప్ర. అయితే పైన ఉదహరించబడిన శ్రుతివాక్యమందు ఆత్మకు కారణత్వము వినబడుచున్నదేకాని ఆనందమునకు కారణత్వము వినబడలేదు కదా? ఉ. ఈభూతవర్గమంతయు ఆనందమువల్లనే పుట్టుచున్నదనియు, మరియు ఈభూతవర్గమంతయు నానందమందే స్థితినిపొందుచున్నదనియు, ఆనందమందేలయించుచున్నదని, శ్రు ॥ ఆనందాద్ధ్యేవఖల్విమాని భూతానిజాయంతే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆనంధేనజాతానిజీవంతి॰ ఆనందంప్రయంత్యభిసంవిశంతీతి। అనెడి తైత్తిరీయక శ్రుతివాక్యమందు ఆనందమే సర్వజగత్కారణముగా చెప్పబడుచున్నది. ఇటు చెప్పబడుచుండగా పూర్వోక్తానందముకంటె జగంబు భిన్నము కానేరదు. ఇచ్చట ననుమానప్రమాణముచే నెరుంగవలెను. ప్ర. అదియెట్లు? ఉ. వివత మగు జగంబానందకార్యమగుటవలన నానందముకంటె భేదింపబడదు. మృత్తికాకార్యమగు ఘటాదికము మృత్తికకంటె భేదింపబడనియట్లు, ఎద్దియెద్దికార్యమో యద్ది, దానికారణముకంటె భేదింపబడదని యిట్లనుమాన ప్రమాణముచే నెరుగవలెను.

శ్లో॥ కులాలాద్ఘట ఉత్పన్నో భిన్న శ్చేతినశంక్యతాం।
మృద్వ దేషహ్యుపాదానం నిమిత్తంనకులాలవత్॥ ౪.

టీ. కులాలాత్-కుమ్మరివలన, ఉత్పన్నః-పుట్టిన, ఘటః-ఘటము, భిన్న శ్చేతి- ఆకుమ్మరికంటె భిన్నమయినదగునని, నశంక్యతాం - ఆక్షేపింపరాదు. హి-ఏకారణమువలన, ఏషః-ఈయాత్మ, మృద్వత్ - మృత్తికవలె, ఉపాదానం- ఉపాదానకారణమగునో, కులాలవత్ - కుమ్మరివలె, నిమిత్తం- నిమిత్తకారణము, న-కాదో.

తా. ప్ర. అయితే, కుమ్మరివలన బుట్టినఘటం బాకుమ్మరికంటె భిన్నముగా గనబడుచున్నట్లు, ఆత్మవలన బుట్టినజగంబు నాత్మకంటెభిన్నమగుటకు దగియుండుటవలన, మీచే ముందుచెప్పబడినహేతువు నియతస్థితిని బొందనేరదుగదా? ఉ. అట్లుశంకింపందగదు. ప్ర. అదియేమి? ఉ. నీచేజెప్పబడిన ఘట దృష్టాంతమందు కుమ్మరివాడు నిమిత్తకారణమగును. ఇచ్చటనో ఈయాత్మ ఘటమునకు నుపాదానకారణమైనమృత్తికవలె నుపాదానకారణమేయగుగాని, కుమ్మరివలె నిమిత్తకారణముకాదు.

శ్లో॥ స్థితిర్లయశ్చకుంభస్య కులాలేస్తోనహిక్వచిత్।
దృష్టౌతౌమృదితద్వత్స్యా దుపాదానంతయోఃశ్రుతేః॥ ౫.

టీ. హి-ఏకారణమువలన, కుంభస్య- ఘటముయొక్క, స్థితిః-స్థితియును, లయశ్చ-వినాశంబును, కులాలే-కుమ్మరివానియందు, క్వచిత్ - ఎప్పటికిని, నస్తః-లేవో, అతః-ఆకారణమువలన, తౌ - ఆస్థితిలయములురెండును, మృది-మృత్తికయందు, దృష్టౌ-చూడబడుచున్నవి. తద్వత్-ఆప్రకారమే, తయోః-ఆజగత్స్థితిలయములకు, శ్రుతేః - ఆనందహేతుకత్వము వినబడుచుండుటవలన, (ఆనందః) ఆనందము, ఉపాదానం - ఉపాదానకారణమగును.

తా. ప్ర. అయితే, ఘటమునకు కుమ్మరివాడు ఉపాదానకారణముగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మికి హేతువేమి? ఉ. ఏకారణమువలన ఘటముయొక్క స్థితిలయములు రెండును కుమ్మరివాని నాధారముగా గలవికావో, ఆకారణమువలన కుమ్మరివాడు ఉపాదానకారణముగాడు. ప్ర. అయితే ఆస్థితిలయములు రెండు నెచ్చట గలదోచెప్పుము? ఉ. ఆఘటముయొక్క స్థితిలయములు రెండు నాఘటమునకు నుపాదానకారణమగు మృత్తికయందే ప్రత్యక్షముచేత గనబడుచున్నవి. అందుచేత ఘటమునకు మృత్తికయే యుపాదానకారణమగును. ప్ర. సరి. ఘటముయొక్క స్థితిలయములు రెండును మృత్తికయందుండుగాక. ఇట్లుచెప్పుటచేత బ్రకృతమందు లాభమేమి? ఉ. ఏప్రకారముగాఘటమునకుమృత్తిక ఉపాదానకారణమగునో, ఆప్రకారమే జగంబునకును ఆనందము ఉపాదాన కారణమగును. ప్ర. ఆవిషయమై హేతువేమి? ఉ. పూర్వోక్తమగు, శ్రు ॥ ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతానిజాయంతే॥ అనెడి తైత్తిరీయకశ్రుతిచేత జగత్తుయొక్కస్థితిలయములకు రెంటికి నానందహేతుకత్వము వినబడుచుండుటవలన, ఆనందమే జగంబునకు ఉపాదానకారణమగునని తెలియవలెను.

అవ. ఆనందమునకు స్వాభిమతమైన ఉపాదానత్వమును జెప్పుటకొరకు నుపాదానత్వములోని యవాంతరభేదములం జెప్పుచున్నాడు.

శ్లో॥ ఉపాదానంత్రిధాభిన్నంవివర్తిపరిణామిచ।
ఆరంభకంచతత్రాంత్యౌననిరంశేఽవకాశినౌ॥ ౬.

టీ. ఉపాదానం-ఉపాదానకారణము, వివర్తి - వివర్తోపాదానమనియు, పరిణామిచ - పరిణామ్యుపాదానమనియు, ఆరంభకంచ - ఆరంభకోపాదానమనియు, త్రిధా-మూడువిధములుగా, భిన్నం- భేదమునుగలిగియున్నది. తత్ర-ఆమూడువిధములలో, అంత్యౌ-పరిణామ్యారంభములు రెండును, నిరంశే- నిరవయవవస్తువునందు, అవకాశినౌ- అవకాశముగలవి, న-కావు. అనగా వర్తింపజాలవనుట.

తా. మరియు ఉపాదానకారణమనునది, ౧. వివర్తమనియు, ౨. పరిణామకమనియు, ౩. ఆరంభకమనియు నిట్లు మూడువిధములుగా వ్యవహరింపబడుచున్నది. ఆమూటిలో పరిణామారంభకములు రెండును నిరవయవవస్తువునందు సంభవింపవని తెలియవలెను. అనగా శ్రీవిద్యారణ్యగురుండు వివర్తమును శేషింపజేయుటకొరకు నారంభపరిణామ పక్షములను రెంటిని దూషించెనని యభిప్రాయము.

అవ. ఆరెంటికి నవకాశములేమినే జూపుటకొరకు నారంభవాదియొక్కమతము నిప్పుడు దెలుపుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ ఆరంభవాదినోఽన్యస్మాదన్యస్యోత్పత్తిమూచిరే।
తంతోః పటస్యనిష్పత్తే ర్భిన్నౌతంతుపటౌఖలు॥ ౭.

టీ. ఆరంభవాదినః-వైశేషికాదులు, అన్యస్మాత్ - కార్యముకంటె భిన్నమగుకారణమువలన, అన్యస్య - కారణముకంటె భిన్నమగు కార్యముయొక్క, ఉత్పత్తిం-జన్మమును, ఊచిరే-చెప్పిరి, తంతోః - నూలువలన, పటస్య-వస్త్రముయొక్క, నిష్పత్తేః- ఉత్పత్తికి, దర్శనాత్ - దర్శనముకలిగియుండుటవలన, తంతుపటౌ=తంతు-నూలును, పటః-వస్త్రంబును, భిన్నౌఖలు - భిన్నంబులుగదా.

తా. ఆరంభవాదులగు వైశేషికాదులు తంతువులవలన వస్త్రము పుట్టుచుండుటచేత కారణముకంటే భిన్నమగుకార్యము, తనకంటె భిన్నమగుకారణమువలన బుట్టుచున్నదని చెప్పుచున్నారు. ప్ర. అయితే ఇంతమాత్రముచేత కార్యకారణములకు భేదమెట్లుసిద్ధించెను? ఉ. కార్యకారణములగు వస్త్రతంతువులురెండును పరస్పరవిరుద్ధ పరిమాణములు కలిగియుండుట వలనను పరస్పరవిరుద్ధార్థక్రియావంతములై యుండుటవలనను పరస్పరముగా భేదము గలదు. అనగా తంతువులు గుండ్రములై అనేకములై కప్పుకొనుటమొదలగు కార్యములకుపయోగించకయుండుటవలనను, పటముదీర్ఘవిస్తృతమైయేకమై ఆచ్ఛాదనాదికార్యములకుపయోగించుచుండుటవలన నాతంతువస్త్రములు రెండును భిన్నములేయగునని యభిప్రాయము.

అవ. ఇపుడు పరిణామస్వరూపమును జెప్పుచున్నాడు.

శ్లో॥ అవస్థాంతరతాపత్తిరేకస్యపరిణామితా।
స్యాత్క్షీరందధిమృత్కుంభః సువర్ణంకుండలంయథా॥ ౮.

టీ. ఏకస్య- ఒకవస్తువునకు, అవస్థాంతరతాపత్తిః = అవస్థాంతరతా-ఇతరావస్థయొక్క, ఆపత్తిః-ప్రాప్తి, పరిణామితా - పరిణామిత్వము, స్యాత్-అగును. క్షీరం-పాలు, దధి- పెరుగగుటయు, మృత్- మృదువైనమట్టి, కుంభః-కుండయగుటయు, సువర్ణం-బంగారము, కుండలం - కర్ణాభరణ మగుటయు, యథా- ఏప్రకారమో, (తథా) ఆప్రకారము.

తా. ఒకవస్తువు పూర్వావస్థనువిడిపించి మరియొక అవస్థనుబొందుట, పరిణామమని చెప్పబడును. ప్ర. ఇందుకు నుదాహరణమేమి? ఉ. పాలుపెరుగగుటయు, మృత్తిక ఘటమగుటయు, సువర్ణము కుండలమగుటయు నిందుకుదాహరణములగును. ఈదృష్టాంతములయందు పాలు మొదలగు వస్తువులు తమతమ ద్రవత్వ పిండత్వాద్యవస్థలను (అనగా క్షీరాదివ్యవహారయోగ్యత్వములను)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరిత్యజించి కఠినత్వపృథుబుధ్నోదరాకారత్వావ్యవస్థలనుపొంది దధిఘటాది వ్యవహారయోగ్యత్వమును పొందుచున్నవి. గనుక నివి పరిణామకారణము లన బడుచున్నవని తెలియవలెను.

అవ. ఇప్పుడు వివర్తలక్షణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ అవస్థాంతరభానంతు వివర్తోరజ్జుసర్పవత్।
నిరంశేప్యస్త్యసావ్యోమ్నితలమాలిన్యకల్పనాత్॥ ౯.

టీ. రజ్జుసర్పవత్=రజ్జు-త్రాటియందు, సర్పవత్ - సర్పమువలె, అవస్థాంతరభానం=అవస్థాంతర - మరియొకరీతియొక్క, భానం- ప్రకాశము, వివర్తః-వివర్తమనబడును. వ్యోమ్ని- ఆకాశమందు, తలమాలిన్యకల్పనాత్= తల- అధోముఖేంద్ర నీలకటాహతుల్యత్వంబును, మాలిన్య - మలినత్వంబును, కల్పనాత్- కల్పనముండుటవలన, అసౌ - ఈవివర్తము, నిరంశేపి - నిరవయవవస్తువునందును, అస్తి - కలదు.

తా. ఇచట మూలమందుగల (తు) శబ్దము, ఆరంభపరిణామ పక్షముల కంటె నీవివర్తపక్షమునకుగల వైషమ్యమును దెలుపుచున్నది. పూర్వావస్థను విడువకనే మరియొకయవస్థయొక్క ప్రకాశమువివర్తమనబడును. ప్ర. ఇందుకు దృష్టాంతమేమి? ఉ. రజ్జురూపముగానున్న ద్రవ్యము, రజ్జ్వాకారమును విడువకనే సర్పరూపముగా ప్రకాశించుటయే వివర్తమని చెప్పబడును. ప్ర. అయితే వివర్తమును బొందుచున్న రజ్జ్వాదికమునకు సావయవత్వము గనబడు చుండగా నిరవయవమగు బ్రహ్మమందు ఆవివర్తంబును ఘటింపదుగదా? ఉ. తార్కికులచేత నిరవయవమని యంగీకరింపబడిన ఆకాశమందు అధోముఖేంద్రనీలకటాహత్వ మలినత్వముల నాకాశ స్వరూపమను నెరుగనివారారోపించు చున్నారు. కనుక నిరవయవద్రవ్యమందుగూడ వివర్తకారణత్వము సంభవించ గలదని తెలియవలెను.

అవ. ఫలితార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ తతోనిరంశఆనందే వివర్తోజగదిష్యతాం।
మాయాశక్తిఃకల్పికాస్యాదైంద్రజాలికశక్తివత్॥ ౧౦.

టీ. తతః-అందువలన, జగత్- ప్రపంచము, నిరంశే-నిరవయవమయిన, ఆనందే-ఆనందాత్మకబ్రహ్మమునందు, వివర్తః-కల్పించబడినదని, ఇష్యతాం- అంగీకరింపబడునుగాక. ఐంద్రజాలికశక్తివత్= ఐంద్రజాలిక - ఇంద్రజాలవేత్తయొక్క, శక్తివత్-శక్తివలె, మాయాశక్తిః - మాయయనెడిశక్తి, కల్పికా- ప్రపంచమును కల్పించునది, స్యాత్ - అగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. నిరవయవవస్తువునందును కల్పనము సంభవించుటవలన ప్రపంచము నిరవయవమయిన ఆనందస్వరూప బ్రహ్మమందు కల్పించబడినదని అంగీకరింపందగినదగును. ప్ర. అయితే ఆనందస్వరూపా ద్వితీయబ్రహ్మమందు కల్పనాహేతువు మరియొకటి లేమిచేత నట్టిబ్రహ్మమందు జగత్కల్పనము యుక్తమెట్లగును? ఉ. ఇంద్రజాలవేత్తయందుండెడి మణిమంత్రాది రూపమగు శక్తి, ఆకాశనగరాదికమును కల్పించునట్లు, బ్రహ్మమందుగల మాయాశక్తియు ప్రపంచమును కల్పించునది యగునని తెలియవలెను.

అవ. ఆనందస్వరూపబ్రహ్మముకంటె నన్యమయిన మాయాశక్తినంగీకరించినయెడల సద్వితీయత్వము (అనగానద్వైతభంగము) కలుగునని కొందరు తలంచెదరని శంకించుకొని, ఆమాయాశక్తి అనిర్వచనీయమగుటచేత మిథ్యయని (అనగా సత్యముకాదని) చెప్పుటకొఱకు ముందుచెప్పబోయెడి అగ్నిమొదలగు వస్తువునందుగల లౌకికశక్తిని శక్తిమత్పదార్థమునకంటె భిన్నాభిన్నత్వములచేత నిరూపించుటకు శక్యముకాదని చూపుచున్నాడు.

శ్లో॥ శక్తిశ్శక్తాత్పృథఙ్నాస్తితద్వద్దృష్టేర్నచాభిదా।
ప్రతిబంధస్యదృష్టత్వాచ్ఛక్త్యభావేతుకస్యసః॥ ౧౧.

టీ. శక్తిః-శక్తి, శక్తాత్ - శక్తిమత్పదార్థముకంటె, పృథక్- వేరుగా, నాస్తి- లేదు. తద్వత్ - ఆప్రకారము, అనగా నభేదముగా ననుట. దృష్టేః- కనుపడుచుండుటవలన, (పృథఙ్నాస్తి) భిన్నముగాలేదు. ప్రతిబంధస్య- ప్రతిబంధము, దృష్టత్వాత్ - కనబడుచుండుటవలన, అభిదా - అభేదంబును, అనగా నైక్యంబుననుట. నచ-లేనేలేదు. శక్త్యభావేతు - శక్తిలేనియెడలనో, సః- ఆప్రతిబంధము, కస్య- దేనికి, అనగా ప్రతిబంధమునకు నిర్విషయత్వము గలుగుననుట.

తా. అగ్నియందుండెడి కాల్చుటమొదలగు శక్తి, తచ్ఛక్తివంతమగు నగ్న్యాది స్వరూపముకంటె భిన్నముగాలేదు. ప్ర. ఎందువలనలేదో చెప్పుము? ఉ. ఆశక్తి, అగ్న్యాది స్వరూపముకంటె నన్యముగా గనపడని హేతువుచేత భిన్నముగాలేదని తెలియవలెను. మరియు నగ్న్యాది స్వరూపముతో నైక్యము పొందినదిగామిచేత నగ్న్యాదిస్వరూపమే శక్తియగుననియుంజెప్పరాదు. ప్ర. అశ్లైక్యత్వమును జెప్పమీకి గారణమేమి? ఉ. మణిమంత్రాదులచేత నగ్నిశక్తికార్యమగు స్ఫోటాదికము కనబడని కారణమువలన శక్తిని అగ్నిస్వరూపముకంటె నన్యముగానే చూడవలెనని యభిప్రాయము. ప్ర. అయితే స్ఫోటాది శక్తికార్యము మణిమంత్రాదులచే గనబడకుండుగాక. శక్తిని నగ్నిస్వరూపము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తోటి భేదములేదని చెప్పినయెడల దోషమేమి. ఉ. ప్రత్యక్షసిద్ధముగానుండెడి అగ్న్యాదిస్వరూపమునకు ప్రతిబంధము సంభవింపమివలన నాయగ్నిస్వరూపమునకంటె నన్యమగుశక్తినంగీకరించనియెడల ప్రతిబంధము నిర్విషయమగునని తెలియవలెను.

శ్లో॥ శక్తేః కార్యానుమేయత్వాదకార్యే ప్రతిబంధనం।
జ్వలతోఽగ్నేరదాహేస్స్యాన్మంత్రాదిప్రతిబంధతా॥ ౧౨.

టీ. శక్తేః-శక్తి, కార్యానుమేయత్వాత్=కార్య- కార్యముచేత, అనుమేయత్వాత్-ఊహించెడి తెలియదగినదగుటవలన, అకార్యేసతి- కార్యముపుట్టనిదగుచుండగా, ప్రతిబంధనం- ప్రతిబంధము, (అవగమ్యతే) తెలియబడుచున్నది. జ్వలతః-మండుచున్న, అగ్నేః-అగ్నికి, అదాహేసతి - దహనాదిలక్షణకార్యముకలుగకపోవుచుండగా, మంత్రాదిప్రతిబంధతా=మంత్రాది- మంత్రాదులచేత, ప్రతిబంధతా - ప్రతిబంధత్వము, స్యాత్ - అగును.

తా. ప్ర. అయితే ఇంద్రియగోచరనుగాని శక్తికి ప్రతిబంధముగలదని యెరుగుటకు శక్యమెట్లగును? ఉ. శక్తి, ఇంద్రియగోచరముకానిదైనను ఏహేతువువలన కార్యలింగముచేత తెలియదగినదగునో, ఆహేతువువలన కారణమునందు కార్యముపుట్టకపోవుచుండగా ప్రతిబంధము తెలియదగిన దగును. ప్ర. ఇందుకు దృష్టాంతమేమి? ఉ. లోకమందు స్వరూపముచేత మండుచుండెడి అగ్నిమాత్రమువలన దహనాది లక్షణముగల కార్యముపుట్టని దగుచుండగా మణిమంత్రాదులచేత దహనశక్తికి ప్రతిబంధము గలిగెనని తెలియబడుచున్నది.

అవ. ఇట్లు స్వరూపప్రమాణములచేత లౌకికశక్తి నుపన్యసించి ఇపుడు మాయాశక్తిగలదనుటయందు, శ్రు. తేధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాత్మశక్తింస్వగుణైర్నిగూఢాం॥ అనెడి శ్వేతాశ్వతరోపనిషద్వాక్యార్థమునిపుడు పఠించుచున్నాడు.

శ్లో॥ దేవాత్మశక్తింస్వగుణైర్నిగూఢాంమునయోవిదన్।
పరాస్యశక్తిర్వివిధాక్రియాజ్ఞానబలాత్మికా॥ ౧౩.

టీ. మునయః-మునులు, స్వగుణైః=స్వ- తమయొక్క, గుణైః - కార్యభూతస్థూలసూక్ష్మ శరీరములచేత, నిగూఢాం - ఆవరింపబడియున్న, దేవాత్మశక్తిం=దేవ - ప్రత్యగభిన్నస్వప్రకాశమాన పరమాత్మయొక్క, ఆత్మశక్తిం-మాయాశక్తిని, అవిదన్-తెలిసికొనిరి. అనగా సాక్షాత్కారము చేసికొనిరనుట. అస్య-ఈపరమాత్మయొక్క, పరా-ఉత్కృష్టమైన, శక్తిః - మాయాశక్తి, క్రియాజ్ఞానబలాత్మికా = క్రియా - క్రియయు, జ్ఞాన - జ్ఞానంబును, బలం-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇచ్ఛయు, ఆత్మికా - స్వరూపముగా గలదిగనుకనే, వివిధా - నానావిధము గానున్నది.

తా. మునులు జగత్కారణమును తెలియగోరినవారగుచు స్వభావకాలాదులు జగత్కారణములగుననెడి పాదములయందు దోషబాహుళ్యమును జూచినవారై జగత్కారణమును దెలియవలెననెడి ఇచ్ఛచేత ధ్యానయోగము నవలంబించి స్వప్రకాశచిద్రూపుడైన ప్రత్యగభిన్న పరబ్రహ్మముయొక్క మాయాశక్తిని తనకార్యములగు స్థూలసూక్ష్మశరీరములచేత గప్పబడియున్నదానినిగా ప్రత్యక్షముగాజూచిరని పూర్వోక్తమంత్రముచెప్పుచున్నది. మరియునీప్రత్యగభిన్న బ్రహ్మముయొక్క సర్వజగత్కారణ భూతమగు ఉత్కృష్టశక్తి, క్రియాజ్ఞానేచ్ఛా స్వరూపముగలదగుటచేత నానావిధముగా వినబడుచున్నదని శ్వేతాశ్వతరోపనిషత్తునందు, శ్రు. పరాస్యశక్తి ర్వివిధైవశ్రూయతే స్వాభావికీజ్ఞానబలక్రియాచ. అనెడి మరియొక మంత్రంబును జెప్పుచున్నది.

అవ. మాయాప్రతిపాదక వాసిష్ఠశ్లోకముల నిప్పుడుపఠించుచున్నాడు.

శ్లో॥ ఇతివేదవచః ప్రాహవసిష్ఠశ్చతథాబ్రవీత్।
సర్వశక్తింపరంబ్రహ్మ నిత్యమాపూర్ణమద్వయం॥ ౧౪.

టీ. ఇతి- ఈప్రకారము, వేదవచః - ఉపనిషద్వాక్యము, ప్రాహ-చెప్పెను. వసిష్ఠశ్చ-వసిష్ఠమహామునియు, తథా-ఆప్రకారము, అబ్రవీత్- చెప్పెను. పరంబ్రహ్మ - పరబ్రహ్మము, నిత్యం-వినాశములేనిదియు, ఆపూర్ణం - సర్వవ్యాపకమయినదియు, అద్వయం - అద్వితీయమైనదియు, సర్వశక్తి-నానావిధశక్తివంతంబునగును.

తా. ప్ర. అయితే, ఈవాక్యములు రెండు నెచ్చటివోచెప్పుము? ఉ. పరమేశ్వరునకు జగత్కారణత్వోపయుక్తముగా మాయాశక్తి గలదని చెప్పుచుండెడి పూర్వోక్త శ్వేతాశ్వతరోపనిషద్వాక్యములు రెండును వేదవాక్యములగును. ఈమాయాశక్తి, కేవలశ్రుతిప్రసిద్ధమేగాక స్మృతిప్రసిద్ధముగలదియునగును. ప్ర. అదియెట్లు? ఉ. ఏప్రకారముగా శ్రుతి, విచిత్రమైన మాయాశక్తి గలదనిచెప్పెనో, ఆప్రకారమే వసిష్ఠమహామునియు యోగవాసిష్ఠమనెడి గ్రంథమందు విచిత్రమగు మాయాశక్తిని చెప్పినవారాయెను. ప్ర. ఆచెప్పినవిధమెట్లు? ఉ. ఆవాసిష్ఠవాక్యములం జెప్పెదవినుము. ఆపరబ్రహ్మము వినాశములేనిదియు సర్వవ్యాపకమైనట్టియు నద్వితీయస్వరూపముగలదియునగును. ఇది బ్రహ్మమునకు పారమార్థికస్వరూపమని తెలియవలెను. మరియు నాబ్రహ్మము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సర్వశక్తివంతమగును. ఇది బ్రహ్మమునకు సోపాధిక రూప మగునని తెలియ వలెను.

శ్లో॥ యయోల్లసతిశక్త్యాసౌ ప్రకాశమధిగచ్ఛతి।
చిచ్ఛక్తిః పరబ్రహ్మణో రామ శరీరేషూపలభ్యతే॥ ౧౫.

టీ. తత్పరంబ్రహ్మ- ఆపరబ్రహ్మము, యయా-ఏ, శక్త్యా - మాయా శక్తిచేత, ఉల్లసతి- వికసించునో, తదా-అప్పుడు, అసౌ - ఈశక్తి, ప్రకాశం- అభివ్యక్తిని, అనగాస్పష్టత్వమననుట. అధిగచ్ఛతి- పొందుచున్నది. హేరామ- ఓరామా, చిచ్ఛక్తిః-చైతన్యమనెడుశక్తి, శరీరేషు - దేహాదిశరీరములయందు, ఉపలభ్యతే - చూడబడుచున్నది.

తా. ఆపరబ్రహ్మ మెప్పుడెప్పుడు ఏయేమాయాశక్తిరూపముగా వివర్తమునుబొందునో, అప్పుడప్పుడామాయాశక్తి స్పష్టత్వమును బొందుచున్నది. ఆస్పష్టత్వమును బొందెడివిధము నిక రెండుశ్లోకములచే జూపుచున్నారు. ఓదశరథరామా, దేవతిర్యఙ్మనుష్యాది శరీరములయందు నాబ్రహ్మముయొక్క చేతనత్వవ్యవహార హేతుభూతమగు (చిచ్ఛక్తి) కనబడుచున్నది.

శ్లో॥ స్పందశక్తిశ్చవాతేషు దార్ఢ్యశక్తిస్తథోపలే।
ద్రవశక్తిస్తథాంభస్సు దాహశక్తిస్తథానలే॥ ౧౬.

టీ. వాతేషు-గాడ్పులయందు, స్పందశక్తిః- చలనకారణభూతశక్తియు, తథా-ఆప్రకారము, ఉపలే- రాతియందు, దార్ఢ్యశక్తిః - కాఠిన్యశక్తియును, తథా-ఆప్రకారము, అంభస్సు - జలములయందు, ద్రవశక్తిః- ద్రవించునట్టిశక్తియును, తథా-ఆప్రకారము, అనలే-అగ్నియందు, దాహశక్తిః - దహనశక్తియు, (ప్రకాశమధిగచ్ఛతి) స్పష్టత్వమునుబొందుచున్నది.

తా. ఓదశరథరామా, గాడ్పులయందు చలనహేతువగుశక్తియు, రాతియందు కాఠిన్యశక్తియు, జలములయందు ద్రవశక్తియు, నగ్నియందు దహనశక్తియు, స్పష్టత్వమును బొందుచున్నవి. ఇట్లు స్పందాదిశక్తులుప్రకాశమును (అనగా స్పష్టత్వమును) బొందుచున్నవని చెప్పుటచేత నప్రకాశదశయందుగూడ జగత్సత్త, బ్రహ్మమందుగలదని తెలుపబడినదని తెలియవలెను.

అవ. అప్రకాశితజగంబుగూడ బ్రహ్మమందుండెడి విషయమై దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ శూన్యశక్తిస్తథాకాశే నాశశక్తిర్వినాశిని।
యథాం డేంతర్మహాసర్పో జగదస్తితథాత్మని॥ ౧౭.

టీ. తథా- ఆప్రకారము, ఆకాశే-ఆకాశమందు, శూన్యశక్తిః-శూన్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రూపమైనశక్తియు, వినాశిని- నశించెడివస్తువునందు, నాశశక్తిః- నశించెడిశక్తియు నభివ్యక్తమగుచున్నది. అండే- గ్రుడ్డునందు, అంతః-లోపల, మహాసర్పః-గొప్పసర్పము, యథా-ఏప్రకారముగా, అస్తి-కలదో, తథా - ఆప్రకారము, ఆత్మని-పరమాత్మునందు, జగత్ - ప్రపంచము, అస్తి-కలదు.

తా. మఱియు నాకాశమందు శూన్యశక్తియు నశించెడి వస్తువునందు నాశశక్తియుం గలిగియున్నది. ఓరామా, మహాసర్పము దాను జన్మించకము నుపు గ్రుడ్డులో సూక్ష్మరూపముగానున్నట్లు పూర్వము చెప్పబడిన స్పందాది శక్తిరూపమగు నీప్రపంచమంతయు (అభివ్యక్తిని) అనగా స్పష్టత్వమునుబొందక ముందును పరమాత్మునందు సూక్ష్మరూపముగా నున్నదని తెలియవలెను.

అవ. విచిత్ర ప్రపంచము బ్రహ్మమందుండెడి విషయమై దృష్టాంతము ను జెప్పుచున్నాడు.

శ్లో॥ ఫలపత్రలతాపుష్ప శాఖావిటపమూలవాన్।
నను బీజే యథా వృక్ష స్తథేదం బ్రహ్మణి స్థితం॥ ౧౮.

టీ. నను-ఓయిరామా, ఫలపత్రలతాపుష్పశాఖావిటపమూలవాన్=ఫల-పండును, పత్ర-ఆకులును, లతా-తీగలును, పుష్ప-పువ్వులును, శాఖా-కొమ్మలును, విటప- పెద్దకొమ్మలును, మూలవాన్- వేళ్లుగల, వృక్షః-వృక్షము, బీజే-విత్తనమందు, యథా - ఏప్రకారము, అస్తి - కలదో, తథా - ఆప్రకారము, ఇదం- ఈప్రపంచము, బ్రహ్మణి - పరమాత్మయందు, స్థితం - స్థితినిబొందుచున్నది.

తా. ఓయిరామా పత్రఫలలతా పుష్పాది విచిత్రావయవములం గల మహావృక్షము విత్తనమందణగియున్నటు, ఆకాశాది వివిధవిచిత్రపదార్థవర్గము తోగూడిన నీప్రపంచమంతయు బరమాత్మయందణగియున్నదని తెలియవలెను.

శ్లో॥ క్వచిత్ కాశ్చిత్ కదాచిచ్చ తస్మాదుద్యంతి శక్తయః।
దేశకాలవిచిత్రత్వాత్ క్ష్మాతలాదివ శాలయః॥ ౧౯.

టీ. దేశకాల విచిత్రత్వాత్ = దేశకాల - దేశకాలములయొక్క, విచిత్రత్వాత్- వైచిత్ర్యమువలన, అనగా నానావిధత్వముచేత ననుట. క్వచిత్-ఒకానొకదేశమందును, కదాచిచ్చ - ఒకానొకకాలమందును, కాశ్చిత్-కొన్ని, శక్తయః-స్పందాదిశక్తులు, తస్మాత్- ఆపరమాత్మవలన, క్ష్మాతలాత్ - భూమిలోనుండి, శాలయఇవ- వరిమొక్కలవలె, ఉద్యంతి - ఆవిర్భవించుచున్నవి.

తా. ప్ర. అయితే, స్పందాది పూర్వోక్తసర్వశక్తులు నేకకాలమం దభివ్యక్తిని బొందమికిగారణమేమి? ఉ. సర్వబీజములు భూమియందు చల్లబడియు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్నను ఆబీజములలో గొన్నిమాత్ర మొకానొక దేశవిశేషమందును కాలవిశేష మందుసంకురించుచున్నట్లు స్పందదహనాది పూర్వోక్త శక్తులన్నియు బరమాత్మయందు నిత్యసిద్ధములైయున్నను ఒక్కొకదేశ విశేషమందు నొక్కొకకాల విశేషమందు కొన్నికొన్ని శక్తులుమాత్రమే యావిర్భవించుచున్నవని తెలియ నగును.

అవ. ఇప్పుడు జగంబునకు కల్పనామాత్ర రూపత్వమును జూపుటకొరకు నాజగంబునుగల్పించెడి మనోరూపమును జూపుచున్నాడు.

శ్లో॥ సఆత్మాసర్వగోరామ నిత్యోదితమహావపుః।
యన్మనాఙ్మననీంశక్తిం ధత్తేతన్మన ఉచ్యతే॥ ౨౦.

టీ. హేరామ-ఓరామా, నిత్యోదిత మహావపుః=నిత్య-సర్వదా, ఉదిత-ప్రకాశించుచున్నట్టి, మహత్ - అపరిచ్ఛిన్నమైన, వపుః - స్వరూపముగలవాడును, సర్వగః- సర్వగతుడైనట్టి, సః-ఆ, ఆత్మా-పరమాత్మ, యత్ - ఏకాలమందు, మనాక్- కొంచెముగా, మననీం - తననుంబరునిం దెలియజేయునట్టి, శక్తిం-శక్తిని, ధత్తే-ధరించునో, తత్ - అప్పుడు, మనః - మనంబని, ఉచ్యతే-చెప్పబడును.

తా. ఓయిదశరథరామా, సర్వకాల సర్వదేశ సర్వావస్థలయందును బ్రకాశించుచు దేశకాలవస్తువులచేత బరిచ్ఛేదములేని స్వరూపముగలిగి సర్వగతుడైయున్న యాపరమాత్మ యేకాలమందు కొంచెముగా దననుంబరునిం దెలియజేయునట్టి రూపముగల మాయాపరిణామ రూపశక్తిని ధరించునో, ఆకాలమందు మనంబని వ్యవహరింపబడును.

అవ. ఇప్పుడు, జగత్కల్పనాప్రకారమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఆదౌమన స్తదనుబంధవిమోక్షదృష్టీ పశ్చాత్ప్రపంచ రచనాభు
వనాభిధానా। ఇత్యాదికాస్థితిరియంహిగతాప్రతిష్ఠావాఖ్యా
యికాసుభగబాలజనోదితేవ॥ ౨౧.

టీ. హేసుభగ-ఓసుందరుడవగురామా, ఆదౌ-మొదట, మనః- మనంబు, (భవతి) అగుచున్నది. తదను-తదనంతరము, బంధవిమోక్షదృష్టీ = బంధ-బంధకల్పనయు, విమోక్షదృష్టీ - మోక్షకల్పనయు, (భవతః) అగుచున్నవి. పశ్చాత్ - పిమ్మట, భువనాభిధానా = భువన-లోకమనెడి, అభిధానా - పేరుగల, ప్రపంచరచనా = ప్రపంచ - పర్వతపత్తన నదీసముద్రాదికముయొక్క, రచనా-కల్పనము, (భవతి) అగుచున్నది. ఇత్యాదికా - ఈవిధమైన, ఇయం-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ, స్థితిః-జగత్స్థితి, బాలజనోదితా= బాలజన - బాలజనముకొరకు, ఉదితా- చెప్పబడెడి, ఆఖ్యాయికేవ - కథవలె, ప్రతిష్ఠాం - స్థైర్యమును, గతాహి- పొందినదిగదా.

తా. ఓసుందరుడవగురామా, మొట్టమొదట మననశక్తి ప్రకాశించుట చేత మనంబును, పిమ్మట బంధమోక్షకల్పనంబులు నటుపిమ్మట, బంధకల్పన ములోనే భువనమనెడిపేరుగల పర్వతపత్తన నదీసముద్రాది ప్రపంచకల్పనం బునుం గలుగుచున్నది. ఇవ్విధముగా నేర్పడినట్టి ఈజగంబు కల్పితమగుట చేత మిథ్యయైనను బాలురకు దాదిచేత జెప్పబడెడికథవలె స్థిరత్వమునుబొం దుచున్నది. అనగా వాస్తవముగా భావింపబడుచున్నదని యభిప్రాయము.

అవ. వాసిష్ఠరామాయణమందుగల యాకథను పఠించుచున్నాడు.

శ్లో॥ బాలస్యహివినోదాయ ధాత్రీవక్తిశుభాంకథాం।
క్వచిత్సంతిమహాబాహో రాజపుత్రాస్త్రయశ్శుభాః॥ ౨౨.

టీ. ధాత్రీ- దాది, బాలస్య- బాలునియొక్క, వినోదాయ - వినోదము కొరకు, అనగా మనస్సంతోషముకొరకనుట. శుభాం-యోగ్యమయిన,కథాం- కథను, వక్తిహి- చెప్పెనుగదా. హేమహాబాహో- ఓశ్లాఘ్యభుజములుగలబా లుడా, క్వచిత్- ఒకానొకస్థలమందు. శుభాః - యోగ్యులైన, త్రయః- ముగ్గు రగు, రాజపుత్రాః - రాజకుమారులు, సంతి- కలరు.

తా. ఓయిరామా, దాది, బాలునియొక్క వినోదముకొరకు యోగ్యమ గు ఒకకథనుజెప్పెను. ఆకథనుచెప్పెదవినుము. ఓశ్లాఘ్యభుజములుగలబాలుడా, ఒకానొకస్థలమందు యోగ్యులైన ముగ్గురు రాజకుమారులు గలరు.

శ్లో॥ ద్వౌనజాతౌతథైకస్తు గర్భఏవనచస్థితః।
వసంతితేధర్మయుక్తాః అత్యంతాసతిపత్తనే॥ ౨౩.

టీ. ద్వౌ-ఇద్దరు, జాతౌ-పుట్టినవారు, న-కారు. తథా- ఆప్రకారము, ఏకస్తు-మరియొకడో, గర్భఏవ - గర్భమందే, స్థితశ్చ - ఉన్నవాడును, న- కాడు. తే-ఆముగ్గురు, ధర్మయుక్తాస్సంతః = ధర్మ - ధర్మములోటి, యుక్తా స్సంతః-కూడినవారగుచు, అత్యంతాసతి=అత్యంత- మిక్కిలి, అసతి - శూన్య మయిన, పత్తనే-నగరమందు, వసంతి - నివసించియుండిరి.

తా. ఓబాలుడా, ఆముగ్గురిలో నిద్దరు పుట్టినవారుకారు. మరియొకడో గర్భమందున్నవాడుకాడు. ధర్మయుక్తులగు నాముగ్గురురాజపుత్రులు నత్యంత శూన్యపట్టణమందు నివసించియుండిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ స్వకీయాచ్ఛూన్యనగరాన్నిర్గత్యవిమలాశయాః।
గచ్ఛంతోఽగగనేవృక్షాన్దదృశుఃఫలశాలినః॥ ౨౪.

టీ. విమలాశయాః=విమల-పరిశుద్ధమైన, ఆశయాః- చిత్తముగలయా ముగ్గురు, స్వకీయాత్- తమసంబంధమైన, శూన్యనగరాత్ - అత్యంతశూన్యపట్టణమునుంచి, నిర్గత్య-వెలుదేరి, గచ్ఛంతః - పోవుచున్నవారగుచు, గగనే- ఆకాశమందు, ఫలశాలినః = ఫల - ఫలములచేత, శాలినః - ఒప్పుచుండెడి, వృక్షాన్ - వృక్షములను, దదృశుః - చూచిరి.

తా. ఓబాలుడా, నిర్మలచిత్తులగు నాముగ్గురురాజపుత్రులును తమశూన్యపట్టణమునుంచి బయలుదేరివెళ్లుచు నాకాశమందు ఫలవంతములగు వృక్షములను చూచిరి.

శ్లో॥ భవిష్యన్నగరేతత్ర రాజపుత్రాస్త్రయోఽపితే।
సుఖమధ్యస్థితాఃపుత్రమృగయావ్యవహారిణః॥ ౨౫.

టీ. హేపుత్ర-ఓబాలుడా, త్రయః-ముగ్గురైన, తే-ఆ,రాజపుత్రాఅపి- రాజపుత్రులును, తత్ర-ఆ, భవిష్యన్నగరే=భవిష్యత్ - ఇకమీదకలుగబోయెడి, నగరే-పట్టణమందు, మృగయావ్యవహారిణః=మృగయా- వేటతోటి, వ్యవహారిణః-పనిగలవారగుచు, సుఖం-సుఖముగా, అధ్యస్థితాః - ఉండిరి.

తా. ఓబాలుడా, ఆరాజపుత్రులుముగ్గురును ఇకమీద కలుగబోయెడిపట్టణమందు వేటాడుటయందు పనిగలవారై సుఖముగానుండిరి.

శ్లో॥ ధాత్ర్యేతికథితారామబాలకాఖ్యాయికాశుభా।
నిశ్చయంసయయౌబాలోనిర్విచారణయాధియా॥ ౨౬.

టీ. హేరామ-ఓరామా,ఇతి-ఈప్రకారము,ధాత్ర్యా-దాదిచేత,శుభా- మంచిదయిన, బాలకాఖ్యాయికా=బాలక-బాలునికొరకు, ఆఖ్యాయికా-కథ, కథితా-చెప్పబడెను. సః-ఆ,బాలః-బాలుడు, నిర్విచారణయా-ఆలోచనలేని, ధియా-బుద్ధిచేత, నిశ్చయం- వాస్తవత్వమును, యయౌ-పొందెను.

తా. ఓరామా ఈప్రకారముగా నాదాదిచేత బాలునికొరకు మంచికథ చెప్పబడెను. ఆబాలుడు వివేకములేనిబుద్ధిచేత నాకథనునిశ్చయముగానమ్మెను.

అవ. ఈదృష్టాంతసిద్ధార్థమును దార్ష్టాంతికమందు నన్వయించుచున్నాడు.

శ్లో॥ ఇయంసంసారరచనా విచారోజ్ఝితచేతసాం।
బాలకాఖ్యాయికేవత్తథావస్థితిముపాగతా॥ ౨౭.

టీ. ఇయం-ఈ, సంసారరచనా=సంసార - సంసారముయొక్క, రచ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నా-కల్పనము, విచారోజ్ఝితచేతసాం=విచార-ఆలోచనముచేత, ఉజ్ఝిత- విడువబడిన, చేతసాం-చిత్తముగలవారికి, బాలకాఖ్యాయికేవ = బాలక-బాలునకు జెప్పిన, ఆఖ్యాయికేవ- కథవలె, ఇత్థం-ఈప్రకారముగా, అవస్థితిం - స్థితిని, అనగా స్థిరత్వముననుట. ఉపాగతా - పొందినదాయెను.

తా. ఓదశరథరామా, ఈసంసారకల్పనంబాలోచనలేని చిత్తముగలవారికి నీపైనబాలునకు జెప్పబడినకథవలె నిర్విఘ్నముగా స్థితిని పొందియున్నదని తెలిసికొనుము.

అవ. వసిష్ఠునిచే జెప్పబడినయర్థము నుపసంహారము జేయుచున్నాడు.

శ్లో॥ ఇత్యాదిభిరుపాఖ్యానైర్మాయాశక్తేశ్చ విస్తరం।
వసిష్ఠఃకథయామాస సైవశక్తిర్నిరూప్యతే॥ ౨౯.

టీ. వసిష్ఠః-వసిష్ఠమహాముని, ఇత్యాదిభిః - ఇదిమొదలగు, ఉపాఖ్యానైః-కథలచేత, మాయాశక్తేశ్చ-మాయాశక్తియొక్క, విస్తరం- విస్తారమును, అనగా వైభవముననుట. కథయామాస-చెప్పినవాడాయెను. సా-ఆ,శక్తిరేవ-శక్తియే, నిరూప్యతే - ఈక్రింవనిరూపింపబడుచున్నది.

తా. వసిష్ఠమహామునీంద్రుడు, ఇది మొదలగు ఉపాఖ్యానములచేత మాయాశక్తియొక్క వైభవమును జెప్పినవాడాయెను. ఆమాయాశక్తియే ఈక్రింద మాచేత స్పష్టముగా నిరూపింపబడుచున్నది. అనగా శ్రీవిద్యారణ్యమునిసింహుండు మాయాశక్తి గలదనుటయందు వాసిష్ఠవాక్యముఁం బ్రమాణముగా నుపన్యసించి, ఆమాయననిర్వచనీయమని చెప్పుటకు బ్రతిజ్ఞచేసెనని యభిప్రాయము.

శ్లో॥ కార్యాదాశ్రయతశ్చైషాభవేచ్ఛక్తిర్విలక్షణా।
స్ఫోటాంగారౌదృశ్యమానౌశక్తిస్తత్రానుమీయతే॥ ౩౦.

టీ. ఏషా-ఈ, శక్తిః-మాయాశక్తి, కార్యాత్- తనకార్యమగుజగంబుకంటెను, ఆశ్రయతశ్చ- తనకాధారమగు బ్రహ్మముకంటెను, విలక్షణా- విపరీత స్వభావముగలది, భవేత్-అగును. స్ఫోటాంగారౌ=స్ఫోట- బొబ్బలెత్తుట మొదలగు కార్యంబును, అంగారౌ- అగ్నియు, దృశ్యమానౌ - ప్రత్యక్షముగా గనబడుచున్నవి. తత్ర-దానియందు, అనగా కార్యమందనుట. శక్తిః - శక్తి, అనుమీయతే - ఊహించి తెలిసికొనబడుచున్నది.

తా. ఈమాయాశక్తి, తనకార్యభూతజగంబుకంటెను తనకాశ్రయమగు బ్రహ్మముకంటెను విలక్షణంబగును. ఈయర్థమును దృష్టాంతముచే స్పష్టీకంచెద వినుము. అగ్నియందుగల దహనశక్తియొక్క కార్యము స్ఫోటము (అన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గా బొబ్బలెత్తుట మొదలగునది) యగును. మరియు నాదహనశక్తికాశ్రయము తేజోరూపమగు నగ్నియగును. ఈ రెండును బ్రత్యక్షసిద్ధములగును. ఆయగ్ని యందుగల యుష్ణశక్తిమాత్రము దానికార్యమువలన తెలియదగినదగును. ఆహేతువుచేత నాయుష్ణశక్తి, స్ఫోటాగ్నులకంటె విలక్షణమగునని తెలియవలెను.

అవ. ఈచెప్పబడిన న్యాయమును మృచ్ఛక్తియందు నన్వయించుచున్నాడు.

శ్లో॥ పృథుబుధ్నోదరాకారో ఘటః కార్యోఽత్రమృత్తికా।
శబ్దాదిభిః పంచగుణైర్యుక్తాశక్తిస్త్వతద్విధా॥ ౩౦.

టీ. పృథుబుధ్నోదరాకారః = పృథు-స్థూలమైనట్టియు, బుధ్న - గుండ్రమైన, ఉదర-పొట్టవంటి, ఆకారః - స్వరూపముగల, ఘటః- కుండ, కార్యః- శక్తికార్యమగును. అత్ర-ఇచ్చట, శబ్దాదిభిః=శబ్ద-శబ్దమే, ఆదిభిః-ఆదిగాగలిగిన, పంచగుణైః=పంచ-ఐదైన, గుణైః-ధర్మములతోటి, యుక్తా-కూడియున్న, మృత్తికా - మట్టి, ఆశ్రయః - శక్తికాధారవస్తువగును. శక్తిస్తు - శక్తియో, అతద్విధా-అట్టిదిగాదు. అనగా ఘటమృత్తికలకంటె విలక్షణమగుననుట.

తా. స్థూలమైనట్టియువర్తులమైన ఉదరముగల యాకారమువంటి యాకారముగల యేఘటముగలదో ఆఘటం బిక్కడ కార్యమగును. మరియు, శబ్దస్పర్శరూపరస గంధములనెడి నైదుగుణములతో గూడినమృత్తిక, శక్తికాశ్రయవస్తువగును. ఆమృత్తికయందుగల ఘటకల్పనాశక్తియో, తనకార్యమగు ఘటస్వరూపముకంటెను, తనకాశ్రయమగు మృత్తికా స్వరూపముకంటెను విలక్షణమగును.

అవ. ఆవిలక్షణత్వమునే చూపుచున్నాడు.

శ్లో॥ నపృథ్వాదర్నశబ్దాదిశక్తావస్తుయథాతథా।
అతఏవహ్యచింత్యైషానవిర్వచనమర్హతి॥ ౩౧.

టీ. శక్తా- శక్తియందు, పృథ్వాదిః - స్థూలత్వాది కార్యధర్మము, న-లేదు. శబ్దాదిః- శబ్దస్పర్శాద్యాశ్రయధర్మంబును, న-లేదు. యథా - ఏటువంటిదో, తథా-అటువంటిది, అస్తు - అగుగాక. అనగా నేదోయొకవిధము గలదగుననుట. హి - ఏకారణమువలన, ఏషా - ఈశక్తికార్యాశ్రయములకంటె విలక్షణమగునో, అతఏవ-ఆకారణమువలననే, అచింత్యా= చింతించుటకుశక్యముగాదు. నిర్వచనం = నిరూపణమునుగురించి, నార్హతి=తగినదిగాదు.

తా. శక్తియందు పృథుబుధ్నోదరాదికార్య ధర్మము (అనగా ఘటధర్మము) లేదు. మరియు శబ్దస్పర్శరూపరసగంధవర్గంబగు ఆశ్రయధర్మంబును(అన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గా మృత్తికాధర్మంబును) శక్తియందులేదు. ఆహేతువుచేత(శక్తి) విలక్షణమైన దగునని తెలియవలెను. ప్ర. అయితే, యాశక్తియెటువంటిదో చెప్పుము? ఉ. ఆశక్తి, యెట్టిదో యట్టిదేయగును. ప్ర. అయితే యిట్లుచెప్పుటచేత సిద్ధించిన యర్థమేమి? ఉ. ఏహేతువుచేత తనకార్యాశ్రయములకంటె విలక్షణమైన దగునో యాహేతువుచేత నీశక్తి, చింతించుటకు శక్యముగానిదగునని తెలియవలెను. ప్ర. అయితే, అచింత్యత్వమే (అనగాచింతించుటకు శక్యముగామియే) ఆశక్తికి స్వరూపమగునని చెప్పరాదాయేమి? ఉ. చెప్పరాదు.

ప్ర. అదియేమి? ఉ. భేదముచేతగాని యభేదముచేతగాని యచింత్యత్వాదికమగు మరియేరూపముగానైనను శక్తి, నిరూపణము జేయుటకు దగినదిగాదని తెలియవలెను.

శ్లో॥ కార్యోత్పత్తేఃపురాశక్తిర్నిగూఢామృద్యవస్థితా।
కులాలాదిసహాయేన వికారాకారతాంవ్రజేత్॥ ౩౨.

టీ. శక్తిః=మృచ్ఛక్తి, కార్యోత్పత్తేః= కార్య - ఘటముయొక్క, ఉత్పత్తేఃఉత్పత్తికంటె, పురా=పూర్వము, మృది=మృత్తికయందు, నిగూఢా=దాగినదగుచు, అవస్థితా=స్థితినిబొందియున్నది. కులాలాదిసహాయేన= కులాల కుమ్మరివానియొక్కయు, ఆది-దండచక్రాదులయొక్కయు, సహాయేన - సహాయముచేత, వికారాకారతాం=వికార - ఘటాదికముయొక్క, ఆకారతాం- స్వరూపత్వమును, వ్రజేత్ - పొందును.

తా. ప్ర. అయితే, కారణస్వరూపమగు మృత్తికకంటె నన్యమగుశక్తి యున్నయెడల, నది కారణస్వరూపమగు మృత్తికవలె బ్రకాశించుచుండదేమి? ఉ. మృచ్ఛక్తి, ఘటాదికార్యము బుట్టుటకంటె బూర్వము మృత్తికయందణగియున్నది. అందుచేత మృత్తికా స్వరూపమువలె గనబడుచుండలేదు. ప్ర. ప్ర. అయితే, అట్లణగియుండెడి పక్షమందు బిమ్మటంగూడ నాశక్తికి, ప్రకాశముగలుగదని చెప్పరాదాయేమి? ఉ. ఆశక్తి, మృత్తికయందణగియున్నదైనను కవ్వముమొదలగు నిమిత్తకారణములచేత వెన్నమొదలగు పదార్థవర్గము ప్రకాశమునుబొందినట్లు, కులాలదండచక్రాదినిమిత్తకారణములచేత నామృచ్ఛక్తి (కార్యద్వారా) ప్రకాశించుచున్నదని తెలియవలెను.

శ్లో॥ పృథుత్వాదివికారాంతంస్పర్శాదించాపిమృత్తికాం।
ఏకీకృత్యఘటంప్రాహుర్విచారవికలాజనాః॥ ౩౩.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. విచారవికలాః - విచారములేని, జనాః జనులు, పృథుత్వాది= పృథుత్వ-స్థూలత్వమే, ఆది - ఆదిగాగలిగినట్టి, వికారాంతం - కార్యస్వరూపంబును, స్పర్శాదిం- స్పర్శశబ్దాదిధర్మవర్గముగల, మృత్తికాంచాపి - మృత్తికను, ఏకీకృత్య- ఏకముగా జేసి, ఘటం ఘటమునుగా, ప్రాహుః-చెప్పుదురు.

తా. ప్ర. అయితే, కారణమగు మృత్తికకంటె నన్యమగు శక్తికార్యంబున్నయెడల, కార్యకారణములయొక్క భేదముతోపమికిగారణమేమి? ఉ. అవివేకజనులు పృథుబుధ్నోదరత్వాది స్వరూపముగల, ౧. కార్యమగుఘటంబును శబ్దస్పర్శరూపరసగంధములనెడి ధర్మములంగల ౨. కారణమగు మృత్తికను ఈరెంటిని నొకటిగాదలచి, ఘటమని చెప్పుచున్నారు. కనుక భేదముతోచుటకు హేతువగు విచారములేమిచేత బూర్వోక్తకార్య కారణములకుం గల భేదము ప్రకాశించలేదని తెలియవలెను.

శ్లో॥ కులాలవ్యాపృతేఃపూర్వం యోమృదంశస్సనోఘటః।
పశ్చాత్తుపృథుబుధ్నాదిమత్త్వేయుక్తాహికుంభతా॥ ౨౪॥

టీ. కులాలవ్యాపృతేః=కులాల - కుమ్మరివానియొక్క, వ్యాపృతేః-వ్యాపారముకంటె, పూర్వం - పూర్వమందు, యః-ఏ, మృదంశః-మృత్తికగలదో, సః ఆమృత్తిక, ఘటః-ఘటము, నో-కాదు. పశ్చాత్తు-పిమ్మటనో, పృథుబుధ్నాదిమత్త్వేసతి=పృథు-స్థూలత్వంబును, బుధ్న-వర్తులత్వంబును, ఆది - ఉదరత్వంబును, మత్త్వేసతి- గలుగుచుండగా, కుంభతా ఘటత్వము, యుక్తా-ఉచితమగును. హి - ఇది ప్రసిద్ధమనుట.

తా. ప్ర. అయితే, ఈచెప్పబడిన ఘటవ్యవహారంబు అవిచారమూలముగా గలదగుటకు గారణమేమి? ఉ. కుమ్మరివానియొక్క వ్యాపారముకంటె బూర్వమందు ఘటరూపముగాని యేమృత్తికగలదో, యామృత్తికకు ఘటరూపముగా వ్యవహారముగలుగుటవలన నట్టిఘటవ్యవహారం బవిచారమూలముగలదియేయగును. ప్ర. సరి. కుమ్మరివానియొక్క వ్యాపారముకంటె బూర్వమందుండెడి మృత్తికకు ఘటరూపత్వములేమి నిశ్చయమేయగును. అయితే, ఘటత్వము దేనికి గలదోచెప్పుము? ఉ. కుమ్మరివానియొక్క వ్యాపారాంతరమందుగలుగుచుండెడి పృథుబుధ్నోదరాకారమునకే ఘటశబ్దవాచ్యత్వంబు దగినదగును. ప్ర. అట్లగుటకు గారణమేమి? ఉ. ఆపృథుబుధ్నోదరాకారము సంభవించినపిమ్మట నాపృథుబుధ్నోదరాకారమునకే ఘటశబ్దప్రయోగంబు గనబడుచుండుటవలన నదియేఘటశబ్దముచేత జెప్పందగినదగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ సఘటోనమృదోభిన్నోవియోగేసత్యనీక్షణాత్।
నాప్యభిన్నఃపురాపిండదశాయామనవేక్షణాత్॥ ౩౭.

టీ. మృదః-మృత్తికయొక్క, వియోగేసతి - వియోగంబు గలుగుచుండ గా, సః-ఆ, ఘటః-ఘటము, అనీక్షణాత్- కనబడమివలన, (మృదః) మృత్తికకంటె, భిన్నః-వేరైనది, న-కాదు. పురా-పూర్వము, పిండదశాయాం- మృత్తికముద్దగానున్న సమయమందు (సఘటః) ఆఘటము, అనవేక్షణాత్- కనబడమివలన, అభిన్నోపి - భిన్నంబుగానిదియు, న-కాదు.

తా. ప్ర. అయితే, పారమార్థికమగు (అనగా వాస్తవమగు) ఘటమును అనిర్వచనీయశక్తికార్యమునుగా జెప్పుట యుక్తమెట్లగును? ఉ. ఆఘటమునకు పారమార్థికత్వంబు సిద్ధించదు. ప్ర. అదియెట్లు? ఉ. ఘటమునందుగల మృత్తికనుభిన్నముగా జేసి చూచినయెడల ఘటస్వరూపంబు గనబడమిచేత నాఘటము మృత్తికకంటె భిన్నమైనదిగాదు. మరియు, పూర్వము మృత్తిక ముద్దగానున్న సమయమందు ఘటంబు గనబడమివలన నామృత్తికకంటె ఘటంబభిన్నమనియుం జెప్పరాదు. అనగా మృత్తికనే ఘటమనియుం జెప్పరాదని యభిప్రాయము. కనుక. ఘటము పారమార్థికస్వరూపముగలదికాదని తెలియవలెను.

అవ. ఫలితార్థము నిప్పుడు చెప్పుచున్నారు.

శ్లో॥ అతోఽనిర్వచనీయోఽయంశక్తివత్తేనశక్తిజః।
అవ్యక్తత్వేశక్తిరుక్తావ్యక్తత్వేఘటనామభృత్॥ ౩౮.

టీ. అతః-అందువలన, అయం-ఈఘటము, అనిర్వచనీయః- నిర్వచనను జేయుటకు శక్యముగానిదగును. అనగా పారమార్థికముగాదనుట. తేన- ఆకారణముచేత, శక్తిజః-శక్తి- శక్తివలన, జః-పుట్టినకార్యము, శక్తివత్-శక్తివంటిదేయగును. అవ్యక్తత్వే-స్పష్టత్వమునుబొందనిదశయందు, అనగానింద్రియాదులకు గోచరించని కాలమందనుట. శక్తిః - శక్తియని, ఉక్తా - చెప్పబడినది. వ్యక్తత్వే - స్పష్టత్వమునుబొందిన దశయందు. ఘటనామభృత్= ఘటమనెడి, నామ- పేరును, భృత్ - పొందినదగును.

తా. మృత్తికకంటె ఘటమును భిన్నముగానైన నభిన్నముగానైనం జెప్పుటకు శక్యముగాని హేతువువలన ఘటము నిరూపించదగినదికాదు. అందుచేత శక్తివలన బుట్టినకార్యమంతయు శక్తివలె ననిర్వచనీయమగునేగాని పారమార్థికస్వరూపము గలదిగాదని తెలియవలెను. ప్ర. అయితే, శక్తికార్యములకు రెంటికి ననిర్వచనీయత్వము గలిగెడిపక్షమందు శక్తియనియుం గార్యమనియు నిట్టి భేదవ్యవహారమెందుకుగలిగెనో చెప్పుము? ఉ. స్పష్టత్వమును బొందనిదశ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యందు శక్తిశబ్దముచేతను, స్పష్టత్వమును బొందినదశయందు ఘటాదిశబ్దముచేతను వ్యవహరింపబడుచున్నది. అనగా స్పష్టత్వాస్పష్టత్వ దశాభేదమునుబట్టి భేదవ్యవహారము గలిగెనేగాని యనిర్వచనీయత్వ పారమార్థికత్వ భేదముంబట్టి యట్టిభేదవ్యవహారము గలుగలేదని యభిప్రాయము.

శ్లో॥ ఐంద్రజాలికనిష్ఠాపిమాయానవ్యజ్యతేపురా।
పశ్చాద్గంధర్వసేనాదిరూపేణవ్యక్తిమాప్నుయాత్॥ ౩౭.

టీ. ఐంద్రజాలికనిష్ఠా=ఐంద్రజాలిక - ఇంద్రజాలవిద్య జేసెడి వానియందుగల, మాయాపి - మాయయు, పురా-మణిమంత్రాదిప్రయోగముకంటెబూర్వమందు, నవ్యజ్యతే-స్పష్టత్వమునుబొందలేదు. పశ్చాత్-పిమ్మట, గంధర్వసేనాదిరూపేణ=గంధర్వసేనా - గంధర్వసేనయే, ఆది- ఆదిగాగల, రూపేణ-రూపముచేత, వ్యక్తిం-స్పష్టత్వమును, ఆప్నుయాత్ - పొందును.

తా. ప్ర. అయితే, పూర్వమభివ్యక్తముగాని (అనగా స్పష్టత్వముగాలేని) మాయాశక్తి, పిమ్మట స్పష్టత్వమునుబొందుచున్నదనెడి ఈయర్థంబులౌకికమాయయందు ప్రసిద్ధముగా గనబడుచుండలేదేమి? ఉ. కనబడుచున్నది. ప్ర. అదియెట్లు? ఉ. ఐంద్రజాలికునియందు గల మాయాశక్తి, మణిమంత్రాదులం బ్రయోగించకమునుపు ప్రకాశించనిదగుచు (అనగా స్పష్టత్వమునుబొందనిదగుచు) పిమ్మట గంధర్వసేనాదిరూపముగా బ్రకాశమునుబొంది సర్వజనంబునకు స్పష్టముగా గనబడుచున్నది.

అవ. శక్తికార్యమగు ఘటాదికమునకు మిథ్యాత్వంబును, శక్తికినాధారమగు మృత్తికాదికమునకు సత్యత్వంబునగుననెడి ఈయర్థంబు ఛాందోగ్య శ్రుతియందుం జెప్పబడెనని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏవంమాయామయత్వేనవికారస్యానృతాత్మతాం।
వికారాధారమృద్వస్తుసత్యత్వంచాబ్రవీచ్ఛ్రుతిః॥ ౩౮.

టీ. ఏవం-ఈప్రకారము, శ్రుతిః - ఛాందోగ్యశ్రుతి, మాయామయత్వేన- మాయాజన్యమగుటచేత, వికారస్య - ఘటాదికార్యమునకు, అనృతాత్మతాం-మిథ్యాత్వంబును, వికారాధారమృద్వస్తుసత్యత్వంచ=వికార-ఘటాదికార్యమునకు, ఆధార-ఆశ్రయమైన, మృద్వస్తు-మృత్తికకు, సత్యత్వంచ- వాస్తవత్వంబును, అబ్రవీత్ - చెప్పెను.

తా. మరియు, ఘటాదికార్యరూపంబంతయు మాయాకార్యం బగుటచేత నాఘటాదికార్యవర్గంబునకు మిథ్యాభావంబును, ఘటాదికార్యవర్గంబున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాధారభూతంబగు మృత్తికకు సత్యత్వంబునగుననని, శ్రు॥ వాచారంభణంవికారోనామధేయంమృత్తికేత్యేవసత్యం॥ ఇత్యాది ఛాందోగ్యశ్రుతిచెప్పుచున్నది.

అవ. ఇప్పుడు, ఆశ్రుత్యర్థమును పఠించుచున్నాడు.

శ్లో॥ వాఙ్నిష్పాద్యంనామమాత్రంవికారోనాస్యసత్యతా।
స్పర్శాదిగుణయుక్తాతు సత్యాకేవలమృత్తికా॥ ౩౯.

టీ. వికారః-ఘటాదికార్యవర్గము, వాఙ్నిష్పాద్యం= వాక్-వాగింద్రియముచేత, నిష్పాద్యం- వ్యవహరింపదగిన, నామమాత్రం-నామధేయమాత్రమేగలదియగును. అస్య-ఈవికారరూప ఘటాదికమునకు, సత్యతా - సత్యత్వము, అనగా పారమార్థికత్వమనుట. న-లేదు. స్పర్శాదిగుణయుక్తా = స్పర్శాది- స్పర్శాదిగుణములతోఁటి, యుక్తా- కూడియున్న, కేవలమృత్తికాతు - కేవలమృత్తికయో, సత్యా-సత్యమగును. అనగా పారమార్థికవస్తువగుననుట.

తా. వాగింద్రియముచేత నుచ్చరింపదగిన ఘటంబనెడి నామధేయము మాత్రమే ఈఘటాదికార్యవర్గమునకు రూపమగుగాని, నామధేయముకంటె నన్యమగుపారమార్థికరూపములేదు. మరియేమనగా నాఘటాది కార్యవర్గమునకాధారభూతమగు మృత్తికయే సత్యమగునని తెలియవలెను.

అవ. శక్తితత్కార్యములు అసత్యమగుటకును ఆరెంటికి నాధారంబగు మృత్తిక సత్యమగుటకు గారణమును జెప్పుచున్నాడు.

శ్లో॥ వ్యక్తావ్యక్తేతదాధారఇతినిష్పాద్యయోర్ద్వయోః।
పర్యాయఃకాలభేదేనతృతీయస్త్వనుగచ్ఛతి॥ ౪౦.

టీ. వ్యక్తావ్యక్తే=వ్యక్త-ఘటాదికార్యంబును, అవ్యక్తే-తత్కారణభూతశక్తియు, తదాధారః=తత్-ఆకార్యశక్తులకు రెంటికి, ఆధారః-ఆశ్రయభూతమృత్తికయు, ఇతి-ఈ, త్రిషు మూటియందు, ఆద్యయోః - మొదటజెప్పబడిన, ద్వయోః-కార్యశక్తులకు రెంటికి, కాలభేదేన=కాల-కాలములయొక్క, భేదేన-భేదముచేత, పర్యాయః - క్రమస్థితిగలిగియున్నది. తృతీయస్తు-మూడవదియగు మృత్తికయో, అనుగచ్ఛతి - కార్యశక్తులగు రెంటియందు ననువర్తించియున్నది. అనగా కాలత్రయమందును వర్తించియున్నదనుట.

తా. మరియు, ౧. ఘటాదికార్యంబును, ౨. తత్కారణ భూతంబగు శక్తియు, ౩. ఘటతచ్ఛక్తులకు నాధారంబగు మృత్తిక యనునట్టి ఈమూటిమధ్యమందు మొదటజెప్పి చూపినట్టి కార్యశక్తులయొక్కసంబంధములగు ఏరెండుకాలములుగలవో, యారెండుకాలములయొక్క భేదముచేత నాకార్యశక్తులకు రెంటికిని భేదముండుటవలన నారెంటికిని గ్రమముగా స్థితినిజెప్పవలయు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ను. అనగా ఘటంబున్నప్పుడు శక్తిలేదనియు శక్తియున్నప్పుడు ఘటము లేదనియుం దెలియవలెను. అందుచేత శక్తితత్కార్యంబులు రెండును మిథ్యలగును. మరియు మూడవదియగు (ఘటతచ్ఛక్తులకాధారమైన) మృత్తికమాత్రంబా రెంటియందు ననువర్తనముగలిగియుండుటచేత సత్యవస్తువగును. అనగా, శక్తికార్యములనెడి రెంటిలో నొక్కొకదానికి నొక్కొకకాలమందు స్థితిగలిగియుండుటచేత నారెండును మిథ్యలగుననియు, ఆశక్తి తత్కార్యములకు నాధారభూతమగు మృత్తిక, కాలత్రయమం దనువర్తనముగలిగియుండుటచేత సత్యమగుననియుం దెలియవలెను.

అవ. ఇప్పుడు వికారమునకు మిథ్యాత్వవిషయమై మూడు హేతువులం జెప్పుచున్నాడు.

శ్లో॥ నిస్తత్త్వంభాసమానంచవ్యక్తముత్పత్తినాశభాక్।
తదుత్పత్తౌతస్యనామవాచానిష్పాద్యతేనృభిః॥ ౪౮.

టీ. వ్యక్తం - ఘటాదికార్యవర్గము, నిస్తత్త్వం-వాస్తవముగ లేనిదగుచు, భాసమానంచ - అపాతముగ ప్రకాశించుచున్నదై, ఉత్పత్తినాశభాక్= ఉత్పత్తినాశ ఉత్పత్తివినాశములను, భాక్ - పొందుచున్నది. తదుత్పత్తౌసత్యాం=తత్- ఆఘటాది కార్యముయొక్క, ఉత్పత్తౌసత్యాం - ఉత్పత్తిగలుగుచుండగా, తస్య-దానికి, నామ-నామధేయము, నృభిః-మనుష్యులచేత, వాచా- వాగింద్రియములోటి, నిష్పాద్యతే - కల్పింపబడుచున్నది.

తా. వ్యక్తశబ్దముచేత జెప్పతగిన ఘటాదికార్యవర్గంబు స్వరూపముచేత లేనిదగుచు ప్రకాశించుచున్నది. అప్రకారమే యుత్పత్తివినాశములం గలదగుచు గనబడుచున్నది. ఉత్పత్త్యనంతరము జనులచేత వాగింద్రియ జన్యమగు (ఘటాది) నామధేయమేస్వరూపముగలదిగా వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ వ్యక్తేనష్టేపినామైతన్నృవక్త్రేష్వనువర్తతే।
తేననామ్నానిరూప్యత్వాద్వ్యక్తంతద్రూపముచ్యతే॥ ౪౯.

టీ. వ్యక్తే-కార్యస్వరూపము, నష్టేపి-నశించినను, ఏతత్- ఈకార్యాభిన్నమగు, నామ-నామధేయము, నృవక్త్రేషు = నృ- జనులయొక్క, వక్త్రేషు- ముఖములయందు, అనువర్తతే - అనువర్తించుచున్నది. వ్యక్తం - ఘటాదికార్యము, తేన- ఆ, నామ్నా - నామధేయముచేత, నిరూప్యత్వాత్ - వ్యవహరింపదగినదగుటవలన, తద్రూపం=తత్ - ఆనామధేయముయొక్క, రూపం-రూపమేస్వరూపముగా గలదని, ఉచ్యతే - చెప్పబడుచున్నది.

తా. మరియు, ఘటాదికార్యస్వరూపమునశించినను ఈఘటాదికార్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముఖంబై నభిన్నంబగునామధేయను మనుష్యులయొక్క నోషలయందనువర్తిం చుచున్నది ప్ర. సరి. అటనువర్తించుచున్నదని చెప్పుటవలన ఫలమేమి? ఉ. ఘటాదికార్యవర్గము వాక్కుచేత వ్యవహరింపబడుచుండెడి ఘటాదిశబ్దము చేత నిరూపింపదగినదగుటవలన (అనగా వ్యవహరింపదగినదగుటవలన) నాఘ టాదినామమే స్వరూపముగాగల దగునని చెప్పబడును. ఇచ్చట ననుమానప్ర మాణముచే దెలియవలెను. ప్ర. అదియెట్లు? ఉ. ఘటశబ్దంబు ఘటశబ్దముచేత వ్యవహరింపబడుటవలన నేప్రకారము ఘటశబ్దమే స్వరూపముగా గలదగుట కుదగుచున్నదో, అప్రకారమే విమతంబగు ఘటంబును ఘటశబ్దముచేత వ్యవ హరింపబడుచుంటుటవలన ఘటశబ్దమే స్వరూపముగా గలదగుటకు దగుచున్న దని యనుమానప్రమాణముచే నెరుగవలెను.

అవ. ఇట్లుమూడుహేతువులను సాధించి, ఇప్పు డనుమాన ప్రమాణరచ నాప్రకారమును సూచింపుచున్నాడు.

శ్లో॥ నిస్తత్వాద్వినాశిత్వాద్వాచారంభణనామతః।
వ్యక్తస్యనతుతద్రూపంసత్యంకించిన్మృదాదివత్॥ ౪౩.

టీ. నిస్తత్వాత్- వాస్తవస్వరూపములేనిదగుటవలనను, వినాశిత్వాత్- వినాశంబుగలదగుటవలనను, వాచారంభణనామతః-వాచా - వాగింద్రియము చేత, ఆరంభణ-పుట్టిన, నామతః- నామమాత్రమే స్వరూపముగా గలదగుట వలన, వ్యక్తస్య-ఘటాదికార్యముయొక్క, తత్ - ఆపృథుబుధ్నోదరాద్యాకా రమైన, రూపం-రూపము, కించిత్-కొంచెమైనను, మృదాదివత్-మృత్తికమొద లగుదానివలె, సత్యం-వాస్తవమైనది, నతు-కాదు.

తా. ఘటాదిరూపకార్యముయొక్క యేపృథుబుధ్నోదరాకారరూపము గలదో, ఆరూపము, ౧. నిస్తత్వమగుటవలనను, ౨. వినాశంబు గలదగుటవల నను, ౩. వాగింద్రియ జన్యశబ్దమాత్ర స్వరూపముగలదగుటవలనను మృత్తిక వలెసత్యముగాదు. ఈమృత్తికాదృష్టాంతము వైధర్మ్యదృష్టాంతమగును. ఇచ్చ ట మూడుహేతువులయందు ననుమాన ప్రమాణముచే నెరుంగవలెను. ప్ర. అదియెట్లు? ఉ. ౧. ఘటాదిరూపకార్యంబు నిస్తత్వమగుటవలన నసత్యంబగు టకుదగుచున్నదనియు, నెద్దియసత్యముగాదోయద్ది, ఘటాదికమునకు ఉపాదా నకారణమగు మృత్తికవలె నిస్తత్వము గానేరదని యెరుంగవలెను. ఈదృష్టాం తము కేవలవ్యతిరేక దృష్టాంతమగును. ఈమొదటి హేతువునందు ననుమాన ముచే నెరిగినట్లితరములగు రెండుహేతువులయందు ననుమానముచే నెరుంగవ లెను. ప్ర. అదియెట్లు? ఉ. ౨. ఘటాదిరూపకార్యంబు వినాశము గలదగుటవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లన నసత్యంబగుటకు దగుచున్నదనియు, నెద్దియసత్యముగాదో యద్ది, ఘటాదికమునకు ఉపాదానకారణమగు మృత్తికవలె వినాశముగలది గానేరదని యెరుంగవలెను. ౩. మరియు, ఘటాదిరూపకార్యంబు వాగింద్రియ జన్యశబ్దమాత్రస్వరూపముగలదగుటవలన నసత్యంబగుటకు దగుచున్నదనియు, నెద్దియసత్యముగాదో యద్ది ఘటాదికమునకు ఉపాదానకారణమగు మృత్తికవలె వాగింద్రియజన్యశబ్దమాత్ర స్వరూపము గలది గానేరదని, ఈప్రకారము మూడుహేతువులయందు ననుమానప్రమాణముచే నెరుంగవలెను.

అవ. ఇట్లు వికారమునకు నసత్యత్వము నుపపాదించి ఇప్పుడు దానికధిష్ఠానమైన మృత్తికకు సత్యత్వమును బ్రతిపాదించుచున్నాడు.

శ్లో॥ వ్యక్తకాలేతతఃపూర్వమూర్ధ్వమప్యేకరూపభాక్।
సతత్వమవినాశంచ సత్యంమృద్వస్తుకథ్యతే॥ ౪౪.

టీ. వ్యక్తకాలే= వ్యక్త - కార్యముయొక్క, కాలే - స్థితికాలమందును, తతః-ఆకార్యోత్పత్తికంటె, పూర్వం-పూర్వకాలమందును, ఊర్ధ్వమపి-కార్యవినాశానంతరకాలమందును, ఏకరూపభాక్=ఏక- ఒక్కటియగు, రూప-స్వరూపమును, భాక్-పొందినదియు, అనగా నేకాకారమైనట్టియుననుట. సతత్వం-వాస్తవరూపముతోగూడి వర్తించుచున్నట్టియు, అవినాశంచ - కార్యముతోగూడ నశించకయుండెడి, మృద్వస్తు-మృత్తికయనెడి పదార్థము, సత్యం-యథార్థమని, కథ్యతే - చెప్పబడుచున్నది.

తా. మరియు ఘటాది కార్యస్థితికాలమందును, నాఘటాది కార్యోత్పత్తికంటె బూర్వకాలమందును, మరియు నాఘటాదికార్యము నశించినపిమ్మట నేకాకారముగా నున్నట్టియు, వాస్తవరూపముతోగూడ వర్తించుచున్నట్టియు, వికారమగు ఘటాదికార్యముతోటింగూడ నాశమునుబొందని యేమృత్తికాది వస్తువుగలదో, ఆవస్తువు సత్యమని చెప్పబడును. ఇచ్చట ననుమానమును బ్రయోగించవలెను. ప్ర. అదియెట్లు? ఉ. వివతమగు మృత్తికావస్తువు తత్వమగుటవలన నాత్మవలె సత్యంబగుటకు దగుచున్నదనియు నెద్దిసతత్వముగాదో యద్ది ఆత్మవలె సత్యంబునుంగాదని ఈప్రకారముగా నితరస్థలములయందుననుమానప్రమాణముచే నెరుంగవలెను.

అవ. ఘటాదికార్యవర్గం బసత్యమైనయెడల శుక్తికాది జ్ఞానముచేత రజతాదికము నివర్తించినట్లు నివర్తింపదగినదగునని ( పూర్వవాది ) ఆక్షేపించుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ వ్యక్తంఘటోవికారశ్చే త్యేతైర్నామభిరీరితః।
అర్థశ్చేదనృతఃకస్మాన్నమృద్బోధేనివర్తతే॥ ౪౫.

టీ. వ్యక్తం-వ్యక్తమనియు, ఘటః - ఘటమనియు, వికారశ్చ - వికారమని, ఇతి-ఈప్రకారము, ఏతైః-ఈ, నామభిః - శబ్దములచేత, ఈరితః- చెప్పబడిన, అర్థః - కార్యరూపపదార్థము, అనృతశ్చేత్ - మిథ్యయైనయెడల, మృద్బోధేసతి=మృత్ - కారణమగు మృత్తికయొక్క, బోధేసతి - జ్ఞానముగలుగుచుండగా, కస్మాత్ - ఏహేతువువలన, ననివర్తతే - నివర్తించదు. అనగాఘటజ్ఞానము నివర్తించుననుట.

తా. ప్ర. ఓఅద్వైతసిద్ధాంతీ, ౧. వ్యక్తము, ౨. ఘటము, ౩. వికారము అనెడి ఈమూఁడుశబ్దములచేత వ్యవహరింపబడుచుండెడి యేకార్యరూపపదార్థంబుగలదో, యాపదార్థముకారణమగుమృత్తికకంటె నన్యముగాలేదనియంగీకరించినయెడల మృత్తికాలక్షణ కారణజ్ఞానము గలిగినవెంటనే యాకార్యమునకు నివృత్తిగలుగదాయేమి?

అవ. అట్లు కార్యజ్ఞాననివృత్తి, మాకును సమ్మతమేనని సిద్ధాంతి పరిహరించుచున్నాడు.

శ్లో॥ నివృత్తఏవయస్మాత్తేతత్సత్యత్వమతిర్గతా।
ఈదృఙ్నివృత్తి రేవాత్రబోధజానత్వభాసనం॥ ౪౬.

టీ. యస్మాత్ - ఏహేతువువలన, తే నీకు, తత్సత్యత్వమతిః= తత్-ఆఘటముయొక్క, సత్యత్వమతిః-వాస్తవత్వబుద్ధి,గతా-నివర్తించినదో, (తస్మాత్) ఆహేతువువలన, నివృత్తఏవ - ఘటంబు నివర్తించినదేయగును. అత్ర-ఇచ్చట, అనగా సోపాధికభ్రమస్థలమందనుట. ఈదృగేవ-సత్యత్వబుద్ధినాశనరూపమే, బోధజా = బోధ-అధిష్ఠానయాథాత్మ్యజ్ఞానముచేత, జా - కలిగిన, నివృత్తిః-నివృత్తియగును. అభాసనంతు - ఘటస్వరూపాప్రకాశమో, న-కాదు.

తా. ఉ. ఓపూర్వవాదీ, ఏకారణమువలన నీకుఘటాదివిషయంబగుసత్యత్వబుద్ధినశించెనో యాకారణమువలన నాఘటము నశించినదేయగును.

ప్ర. అయితే, శుక్తికాదికమందారోపింపబడిన రజతాదికమందు శుక్తికాదిజ్ఞానముగలిగినపిమ్మట (పై ఘటదృష్టాంతమందువలె) రజతముయొక్క సత్యత్వబుద్ధిమాత్రము నివర్తించి రజతస్వరూపంబు ప్రకాశించుచుండలేదు. మరియేమనగా రజతస్వరూపంబుగూడ స్ఫురించకపోవుచున్నది ఆప్రకారమే పైఘటదృష్టాంతమందును ఘటస్వరూపంబుగూడ స్ఫురించక పోవలదాయేమి? ఉ. శుక్తిరజతాది స్థలంబునందు నిరుపాధికభ్రమంబగుటచేత నచట రజతస్వరూప



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్ఫురణంబు లేకపోవుచున్నది. ఇచ్చట ఘటాదిజ్ఞానము సోపాధిక భ్రమంబగు టచేత ఘటసత్యత్వబుద్ధి నాశనరూపమే యధిష్ఠానమగు మృత్తికయొక్క యాథాత్మ్యజ్ఞానజన్యమయిన నివృత్తియగునని యంగీకరింపవలెనేగాని ఘటాదిస్వరూపము స్ఫురింపమిగా నేరదు.

శ్లో॥ పుమానధోముఖోనీరేభాతోప్యస్తినవస్తుతః।

తటస్థమర్త్యవత్తస్మిన్నై వాస్థాకస్యచిత్క్వచిత్॥ ౪౭.

టీ. పుమాన్-పురుషుడు, అధోముఖస్సన్ - తలక్రిందుగలవాడగుచు, నీరే-జలమందు, భాతోపి - ప్రకాశించుచున్నవాడైనను, వస్తుతః - వాస్తవముగా, నాస్తి-లేడు. తస్మిన్ - ఆతలక్రిందుగా గనబడెడి పురుషునియందు, తటస్థమర్త్యవత్- దరియందు నిలచియున్నపురుషునియందువలె, ఆస్థా - ఆదరము, అనగా సత్యత్వాభిమానంబనుట. కస్యచిత్- ఎవనికైని, క్వచిత్ - ఎచ్చటను, నైవ- లేనేలేదు.

తా. ప్ర. అయితే, ఇట్లులోకమం దెచ్చట జూడబడెనో చెప్పుము? ఉ. జలమందు బురుషుడు అధోముఖనుగాదోచుచున్నను వాస్తవముగాలేడు. అందుకు నుపపత్తిని జెప్పెదవినుము. జలమందు తలక్రిందుగా గనబడుచుండెడి యాపురుషునియందు గట్టునందుగల పురుషునియందువలె సత్యత్వాభిమానంబు లోకమందేదేశమందైన నేకాలమందైన నెవ్వనికింగలుగదు.

శ్లో॥ ఈదృగ్బోధేపుమర్థత్వం మతమద్వైతవాదినాం।

మృద్రూపస్యాపరిత్యాగాద్వివర్తత్వంఘటేఃస్థితం॥ ౪౮.

టీ. ఈదృక్- ఈలాటి, బోధేసతి- బోధగలుగుచుండగా, పుమర్థత్వం-పురుషార్థసిద్ధి, అద్వైతవాదినాం- అద్వైతవాదులకు, మతం- సమ్మతమగును. మృద్రూపస్య - మృత్తికాస్వరూపమును, అపరిత్యాగాత్-పరిత్యాగము జేయమివలన, ఘటే-ఘటమందు, వివర్తత్వం-వివర్తత్వము, స్థితం కలదు.

తా. ప్ర. అయితే ఆరోపించబడిన పదార్థముయొక్క మిథ్యాత్వజ్ఞానమాత్రముచేతనే పురుషార్థము సిద్ధించునా యేమి?

ఉ. అద్వైతవాదమందు ఆనందస్వరూపుడైన ఆత్మకంటె నన్యమయిన సర్వప్రపంచము మిథ్యయనెడి నిశ్చయజ్ఞానము గలుగుచుండగా అద్వితీయానందానుభవ లక్షణము గల పరమ పురుషార్థము సిద్ధించుచున్నదని తెలియవలెను.

ప్ర. అయితే రజతము శుక్తివివర్తమైనట్లు ఘటము మృత్తికావివర్తమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నెడి విషయము స్థిరమయినయెడల మృత్తికాజ్ఞానముచేత ఘటసత్యత్వబుద్ధిని వర్తించును. అట్లుఘటము మృత్తికావివర్తమనెడివిషయ మిప్పుడెట్లుసిద్ధించెను? ఉ. ఘటావస్థయందుగూడ మృత్తికాస్వరూపము పరిత్యాగముగాని హేతువు చేత (అనగా మృత్తికాస్వరూపములోనుచుండుటచేత) ఘటము మృద్వివర్తమ నెడి యర్థము సిద్ధించెను.

శ్లో॥ పరిణామేపూర్వరూపంత్యజేత్తత్క్షీరరూపవత్।
మృత్సువర్ణేనివర్తేతే ఘటకుండలయోర్నహి॥ ౪౯.

టీ. పరిణామే - పరిణామమందు, తత్ - ఆపరిణామము నొందినవస్తువు, పూర్వరూపం- మనుపటియాకారమును, క్షీరరూపవత్-క్షీరాకారమునువలె, త్యజేత్- విడుచును. ఘటకుండలయోః = ఘట-ఘటమందును, కుండలయోః-కుండలాభరణమందును, మృత్సువర్ణే=మృత్-మృత్తికయు, సువర్ణే - బంగారం బును, నహినివర్తేతే - నివర్తించుటలేదుగదా?

తా. ప్ర. అయితే, ఘటమందు మృద్రూపపరిత్యాగ రాహిత్యంబుగలిగియున్నను ఆఘటమునకు మృత్పరిణామత్వంబును జెప్పందగదా యేమి? ఉ. ఏక్షీరాదివస్తువునందు దధిరూపమగు పరిణామము గనబడుచున్నదో, యాదధిరూపపరిణామమందు పూర్వరూప పరిత్యాగము గనబడుచున్నది. అనగాక్షీరముల యొక్క పరిణామమైనపెరుగు క్షీరరూపమును విడిపించినదగుచు మరల క్షీరభావమును బొందుటకయోగ్యమయియున్నదని యభిప్రాయము. ప్ర.అయితే, వివర్తమందు పూర్వరూప పరిత్యాగంబెచటలేదో చెప్పుము? ఉ. మృత్సువర్ణంబులు రెండును తమ వివర్తంబులగు ఘటకుండలాదులయందు దెలియబడుచున్నవి. ఆఘటకుండలాదులు తమతమ యాకారమునువిడచి మరల మృత్సువర్ణాకారములం బొందుటకు దగియుండుటచేత నారెండును వివర్తములగుట కుందగుచున్నవని నిశ్చయింపవచ్చును.

శ్లో॥ ఘటేభగ్నేనమృద్భావః కపాలానామవేక్షణాత్।
మైవంచూర్ణేస్తిమృద్రూపంస్వర్ణరూపంత్వతిస్ఫుటం॥ ౫౦.

టీ. కపాలానాం-పెంకులయొక్క. అవేక్షణాత్-దర్శనమువలన, ఘటే-ఘటము, భగ్నేసతి-పగులుచుండగా, అనగా నశించుచుండగా ననుట. మృద్భావః-మృత్తికారూపము, న-లేదు. ఏవం - ఈప్రకారముగా, మా- శంకింపవలదు. మృద్రూపం- మృత్తికారూపమగు, చూర్ణః - చూర్ణము, అస్తి - కలదు. స్వర్ణరూపంతు-బంగారురూపమో, అతిస్ఫుటం - మిగుల స్పష్టమగును.

తా. ప్ర. అయితే, ఘటంబునశించుచుండగా పెంకులు గనబడుచుండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టచేతను మృద్రూపసంబుగనబడమివలనను, ఆఘటంబునకు మృద్వివర్తత్వంబు నెట్లుచెప్పంబడును? ఉ. ఆఘటరూపము భగ్నమగుచుండగా నయ్యేడిపెంకు లుమరల నాశమగుచుండగా నట్టిచూర్ణమందు మృద్రూపంబుప్రాప్తమగుచున్నది. కనుక, ఘటను మృద్వివర్తమనిచెప్పుటయందు బాధలేదు. మరియు, కటక కుండలాద్యాభరణరూపములు నశించినప్పుడు సువర్ణంబతిస్పష్టముగా గనబడు చుండుటచేత సువర్ణతద్వికారనులయం దీలాటిచోద్యమున కవకాశమే లేదని తెలియవలెను.

శ్లో॥ క్షీరాదౌపరిణామోస్తుపునస్తద్భావవర్జనాత్।
ఏతావతామృదాదీనాం దృష్టాంతత్వంనహీయతే॥ ౫౧.

టీ. పునః-మరల, తద్భావవర్జనాత్ = తద్భావ - క్షీరరూపముయొక్క, వర్జనాత్- లేమివలన, క్షీరాదౌ-క్షీరాదివస్తువునందు, పరిణామః-పరిణామము, అస్తు - అగుగాక. ఏతావతా- ఇంతమాత్రముచేత, మృదాదీనాం- మృత్సువర్ణాదిద్రవ్యములకు, దృష్టాంతత్వం - వివర్తదృష్టాంతభావము, నహీయతే - నశించదు.

తా. ప్ర. అయితే, పూర్వమెనిమిదవశ్లోకమందు బరిణామమునకుదృష్టాంతముగా జెప్పబడిన క్షీరమృత్సువర్ణములలో నిప్పుడు మృత్సువర్ణములను వివర్తదృష్టాంతమందంగీకరించితిరి. ఆప్రకారమే క్షీరమునుంగూడ వివర్తదృష్టాంతమందంగీకరింపరాదాయేమి? ఉ. క్షీరవ్రీహియవాదులు దధ్యంకురాది రూపముగ బరిణమించినపిమ్మట నాదధ్యాదులు నశించినప్పుడు మరల క్షీరవ్రీహియవాది రూపములం బొందనేరవు. ఆకారణమువలన క్షీరము పరిణామవాదదృష్టాంతముగా దగియున్నది. ప్ర. సరి. క్షీరమువలెనే మరియొకయవస్థం బొందుచుండెడి మృత్సువర్ణములకును వివర్తదృష్టాంతత్వ మెట్లు సంభవించును? ఉ. మరియొకయవస్థనుబొందినంతమాత్రదోషముచేత మృత్సువర్ణములకు వివర్తదృష్టాంతత్వమునశింపదు. అనగా క్షీరము పూర్వరూపపరిత్యాగ పూర్వకముగా నవస్థాంతరమునుబొందుటచేత నట్టిక్షీరమునకు పరిణామకారణత్వమే జెప్పంబడగినదనియు, మృత్సువర్ణములకు మరియొకయవస్థాప్రాప్తిగలిగినను పూర్వరూపమును విడువమిచేత నామృత్సువర్ణములకు వివర్తకారణత్వముంజెప్పవచ్చునని యభిప్రాయము.

శ్లో॥ ఆరంభవాదినఃకార్యేమృదోద్వైగుణ్యమాపతేత్।
రూపస్పర్శాదయఃప్రోక్తాః కార్యకారణయోఃపృథక్॥ ౫౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఆరంభవాదినః-ఆరంభవాదియొక్క, (మతే) మతమందు, కార్యే- ఘటాదికార్యంబునందు, మృదః - మృత్తికాద్రవ్యమునకు, ద్వైగుణ్యం- ద్విగుణత్వము, ఆపతేత్ - సంభవించును. కార్యకారణయోః - కార్యకారణములయందు, రూపస్పర్శాదయః - రూపస్పర్శాదిగుణంబులు, పృథక్-వేరువేరుగా, ప్రోక్తా- చెప్పబడినవి.

తా. ప్ర. అయితే, మృత్సువర్ణంబులకు బరిణామవివర్తంబులను రెంటి నంగీకరించినట్లు, ఆరంభకత్వంబును గూడ యంగీకరింపరాదా యేమి? ఉ. మృత్సువర్ణాదిద్రవ్యములవలన ఘటకటకాదికార్యముల నారంభింప (పుట్టింప) బడునని చెప్పుచున్న వైశేషికాదులయొక్క మతంబునందు మృదాదిద్రవ్యము, కార్యాకార్యముగాను కారణాకారముగాను ద్విగుణత్వమును బొందవలసి యుండును. అట్లగుచుండగా మృత్పిండాదులయందుగల గురుత్వదీర్ఘత్వాది గుణంబులుగూడ మృదాదులచేత గార్యమారంభింపబడినపిమ్మట ద్విగుణత్వమును బొందవలసియుండును. అనగా మృదాదులు ఘటాదుల నారంభింపకమును పెంతగురుత్వాదిగుణముగలవై యుండునో, ఘటాదులంబుట్టించి తమయందున సమవాయిసంబంధములో జేర్చుకొనియున్న పిమ్మట ద్విగుణింపబడిన గురుత్వాదిగుణములంగలవై యుండవలసియుండునని యభిప్రాయము. ప్ర. అట్లెందుచే తనో చెప్పుము? ఉ. కారణంబు కార్యమునుబుట్టించునప్పుడు కారణమందు గల శుక్లాదిగుణంబులు కార్యమందుదమతో సమానములైన గుణాంతరములం బుట్టించుననియు నందుచేత గార్యకారణములయందుగల శుక్లాదిగుణములు భిన్నములగునని యావైశేషికాదులే యంగీకరించియున్నారు. ఆహేతువుచేత గురుత్వాదిద్వైగుణ్యము కార్యంబునందుసంభవింపవలెను. ఇట్టి విరోధంబారంభవాదమందుండుటచేత నాయారంభవాద మగ్రాహ్యమగుటవలన మృత్సువర్ణాదుల కారంభకత్వమును జెప్పందగదు.

శ్లో॥ మృత్సువర్ణమయశ్చేతి దృష్టాంతత్రయమారుణిః।
ప్రాహాతో వాసయేత్కార్యానృతత్వం సర్వవస్తుషు॥ ౫౩.

టీ. ఆరుణిః - అరుణపుత్రుడగు ఉద్దాలకుడు, మృత్ - మృత్తికయు, సువర్ణం - బంగారంబును, అయశ్చ - ఇనుమును, ఇతి - ఈప్రకారముగా, దృష్టాంతత్రయం = దృష్టాంత-దృష్టాంతములయొక్క, త్రయం- మూటిని, అనగా మూడుదృష్టాంతములననుట. ప్రాహ-చెప్పెను. అతః - అందువలన, సర్వవస్తుషు-సకలపదార్థములయందు, కార్యానృతత్వం = కార్య-వికారముయొక్క, అనృతత్వం- మిథ్యాత్వమును, వాసయేత్ - దృఢపరచుకొనవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. అయితే, మృత్సువర్ణాంబులు రెండునుమాత్రమే వివర్తవాదమం దు దృష్టాంతములాయేమి? ఉ. అరుణఋషియొక్కపుత్రుడగు ఉద్దాలకుడు, శ్రు॥ యథాసోమ్యైకేనమృత్పిండేన॥ అనెడివాక్యము నారంభించి, శ్రు॥ కార్ష్ణాయ సమిత్యేవసత్యం॥ అనెడివాక్యాంతమువరకుగల గ్రంథసందర్భంబుచేత కార్య వర్గంబంతయు మిథ్యయని దెలుపుటకొరకు, ౧. మృత్తిక, ౨. సువర్ణము, ౩. ఇనుము, ఈమూటిని దృష్టాంతముగా జెప్పియున్నాడు. ప్ర. ఇట్లెందునిమిత్తమై దృష్టాంతత్రయమును జెప్పెనో చెప్పుము? ఉ. మృత్సువర్ణాయఃపిండములయందు కార్యములగు ఘటకటకఖడ్గాదులు అసత్యములనియుం దత్కారణ వస్తువులగు మృదాదులే సత్యములనియుం దెలియబడుచుండుటచేత లోకములో సర్వభూ తభౌతికములయందునుంగల కార్యవర్గంబంతయు మిథ్యయగుననియుం గారణ మేసత్యవస్తువగుననెడి దృఢజ్ఞానమునుసంపాదించుటకొరకు బూర్వోక్తదృష్టాం తత్రయంబు జెప్పబడెను.

శ్లో॥ కారణజ్ఞానతః కార్య విజ్ఞానంచాపిసోఽవదత్।
సత్యజ్ఞానేఽనృతజ్ఞానం కథం తత్రోపపద్యతే॥ ౪౮.

టీ. సః-ఆఉద్దాలకుడు, కారణజ్ఞానతః=కారణ - కారణవస్తువుయొక్క, జ్ఞానతః-జ్ఞానమువలన, కార్యవిజ్ఞానంచాపి= కార్య- కార్యములయొక్క, విజ్ఞా నంచాపి-జ్ఞానమునుగూడ, అవదత్ - చెప్పెను. అత్ర- ఈలోకమందు, సత్య జ్ఞానేసతి=సత్య-సత్యవస్తువుయొక్క, జ్ఞానేసతి- జ్ఞానముగలుగుచుండగా,అనృ తజ్ఞానం = అనృత-మిథ్యావస్తువులయొక్క, జ్ఞానం- విజ్ఞానము, కథం - ఎట్లు, ఉపపద్యతే - యుక్తమగును.

తా. ప్ర. అయితే, కార్యవర్గమంతయు మిథ్యయనెడి యనుసంధా నంబైన నెందుకొరకు జెప్పబడెనో చెప్పుము? ఉ. ఓచంద్రునివంటి ప్రియదర్శ నుడా, యొకమృత్పిండమును దెలియుటచేత తద్వికారములైన ఘటాదికా ర్యంబులన్నియు నేప్రకారముగా దెలియబడునో యనెడి యర్థంబుగల, శ్రు॥ యథాసోమ్యైకేనమృత్పిండేనసర్వం మృణ్మయంవిజ్ఞాతంస్యాత్॥ ఇత్యాది వా క్యముచేత నాయుద్దాలకమునీంద్రుడు కారణజ్ఞానమువలన గార్యవిజ్ఞానంబును గలుగుననిచెప్పెను. అనగా గారణజ్ఞానమువలన గార్యజ్ఞానము సిద్ధించెడికొ రకు జెప్పబడెనని తెలియవలెను. ప్ర. అయితే, మృత్సువర్ణాదిరూపంబగుపా రమార్థికకారణవస్తువును దెలిసినంతమాత్రముచేత దానికంటె విలక్షణమయి యున్న ఘటాదికార్యంబు దెలియబడునని చెప్పుట యుక్తమెట్లగును?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ సమృత్కస్యవికారస్యకార్యతా లోకదృష్టితః।
వాస్తవోఽత్రమదంశోఽస్యబోధఃకారణబోధతః॥ ౫౫.

టీ. సమృత్కస్య - మృత్తికతోగూడియుండెడి, వికారస్య- ఘటాదిద్రవ్యమునకు, కార్యతా-కార్యత్వము, లోకదృష్టితః - లోకవ్యవహారమువలన, ప్రసిద్ధా-ప్రసిద్ధముగానున్నది. అత్ర-ఈఘటమందు, మృదంశః - మృత్తికాభాగము, వాస్తవః - యథార్థమగును. అస్య- ఈవాస్తవాంశముయొక్క, బోధః-జ్ఞానము, కారణబోధతః - కారణజ్ఞానమువలన, (భవతి) కలుగుచున్నది.

తా. ఉ. అధిష్ఠానభూత మృత్తికతోకూడినదియు నారోపింపజడినదియనగు ఘటాదివికారద్రవ్యమే కార్యమని లోకమందు ప్రసిద్ధముగా వ్యవహరింపబడుచున్నది. సరి. వ్యవహరింపబడుగాక. ఇట్లు చెప్పుటచేత గారణజ్ఞానంబువలన గార్యజ్ఞానంబు సంభవింపదని చేయబడిన యాక్షేపమునకుబరిహారమేమి చెప్పబడెనో చెప్పుము? ఉ. కార్యమందుగల మిథ్యాంశజ్ఞానంబుగలుగకపోయినను ఈఘటాదికార్యమందే వాస్తవమగు మృత్తికాంశముగలదో, ఆయీవాస్తవమృదంశజ్ఞానము కారణ జ్ఞానమువలన గలుగుచున్నది. అనగా ఘటాదికార్యంబు, సత్యమిథ్యాంశద్వయరూపము గలదగుటవలన గారణజ్ఞానముచేత గార్యమందుగల సత్యాంశజ్ఞానంబు గలుగుచున్నదని యభిప్రాయము. ఈయర్థముచేత నీయాక్షేపంబు పరిహరింపబడెనని తెలియవలెను.

శ్లో॥ అనృతాంశోనబోద్ధవ్యస్తద్బోధానుపయోగతః।
తత్వజ్ఞానంపుమర్థంస్యాన్నానృతాంశావబోధనం॥ ౫౬.

టీ. తద్బోధానుపయోగతః = తద్బోధ-ఆకార్యజ్ఞానముయొక్క, అనుపయోగతః - ఉపయోగములేమివలన, అనృతాంశః - మిథ్యాంశము, బోద్ధవ్యః-బోధింపదగినది, న - కాదు. తత్వజ్ఞానం = తత్వ - సత్యవస్తువుయొక్క, జ్ఞానం- తత్వజ్ఞానము, పుమర్థం=పుం - పురుషునకు, అర్థం - ప్రయోజనముగలది, స్యాత్-అగును. అనృతాంశావబోధనం = అనృతాంశ - మిథ్యాంశముయొక్క, అవబోధనం - జ్ఞానము, న-పురుషార్థవంతముగాదు.

తా. ప్ర. అయితే, కార్యమందుగల సత్యాంశమగు మృదాదికమునుబోధించినట్లు మిథ్యాంశంబును బోధింపదగినది కాదాయేమి? ఉ. మిథ్యాంశజ్ఞానమువలన బ్రయోజనములేమిచేత నాఘటాదికార్యమందుగల మిథ్యాంశంబుబోధింపబడదు. ప్ర. ప్రయోజనంబులేక పోవుటెట్లు? ఉ. తత్వవస్తువుయొక్క (అనగా బాధింపబడని వస్తువుయొక్క) జ్ఞానము,పురుషునకు బ్రయోజనకారి యగుచున్నది. మరియు వికారముయొక్క (అనగా మిథ్యాంశము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యొక్క) జ్ఞానంబు ప్రయోజనకారి గాకపోవుటమాత్రమేగాక దుఃఖమునుగూడ గలిగించుచున్నది. ప్ర. అదియెట్లు? ఉ. రజ్జుసర్ప జ్ఞానమునందు మిథ్యయగు సర్పజ్ఞానముచేత భయకంపాది దుఃఖప్రాప్తియు, తత్వంబగు రజ్జుజ్ఞానముచేత దుఃఖనివృత్తిరూపంబగు బురుషార్థంబునుం గనబడుచున్నదని తెలియవలెను.

అవ. ఇప్పుడు పూర్వవాది యొకవిధముగా చోద్యమును జేయుచున్నాడు.

శ్లో॥ తర్హి కారణవిజ్ఞానా త్కార్యజ్ఞానమితీరితే।
మృద్బోధాన్మృత్తికాబుద్ధేత్యుక్తంస్యాత్కోఽత్రవిస్మయః॥ ౫౭.

టీ. తర్హి-అయితే, కారణవిజ్ఞానాత్ = కారణ - మృదాదికారణవస్తువుయొక్క, విజ్ఞానాత్ - ఎరుకవలన, కార్యజ్ఞానమితి = కార్య - ఘటాదికార్యములయొక్క, జ్ఞానమితి - జ్ఞానముకలుగుచున్నదని, ఈరితేసతి - చెప్పబడుచుండగా, మృద్బోధాత్ = మృత్-మృత్తికయొక్క, బోధాత్ - జ్ఞానమువలన, మృత్తికా-మృత్తు, బుద్ధేతి - తెలియబడినదగునని, ఉక్తం - చెప్పబడెను. అత్ర-ఈయర్థమందు, కః-ఏమి, విస్మయః - ఆశ్చర్యము, స్యాత్ - అగును. అనగా నాశ్చర్యమేమియు లేదనుట.

తా. ప్ర. ఓయద్వైతసిద్ధాంతీ, కారణమగు మృదాదివస్తుజ్ఞానమువలన గార్యంబగు ఘటాదివస్తువునందుగల మృదాదిసత్యాంశజ్ఞానంబు గలుగుచున్నదని మీరుచెప్పితిరి. ఇట్లు చెప్పుటచేత మృద్జ్ఞానమువలన మృత్తుయొక్కజ్ఞానంబుగలుగునని చెప్పబడినట్లాయెను. ఇట్లగుచుండగా శబ్దమువల్లనే చమత్కారముగలిగినదిగాని యర్థమువల్ల చమత్కారము గలుగలేదని పూర్వవాదియాక్షేపించెను. అనగా గారణజ్ఞానంబువలన గార్యజ్ఞానము గలుగుచున్నదనెడి ఈవాక్యము వినెడివారిబుద్ధియందు చమత్కారహేతువుకాగలదనెడి యభిప్రాయముతోటి మీచేజెప్పబడెనెగాని యదిసంభవింపనేరదని యభిప్రాయము.

అవ. అందుకు సిద్ధాంతి యిప్పుడు పరిహారమును జెప్పుచున్నాడు.

శ్లో॥ సత్యంకార్యేషువస్త్వంశః కారణాత్మేతిజానతః।
విస్మయోఽమాస్త్విహాఽజ్ఞస్య విస్మయః కేనవార్యతే॥ ౫౮.

టీ. సత్యం-నీవుచెప్పినది వాస్తవమేయగును. కార్యేషు-ఘటాదికార్యములయందుగల, వస్త్వంశః = వస్తు - మృదాదిసత్యవస్తువుయొక్క, అంశః-అంశము, కారణాత్మేతి - కారణస్వరూపమేయగునని, జానతః - ఎరిగిననీవంటివానికి, ఇహ- ఈవిషయమందు, విస్మయః - చమత్కారము, మాస్తు - లేకపోవుగాక. అజ్ఞస్య - తెలియనివానికిగలిగెడి, విస్మయః - ఆశ్చర్యము, కేన-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఎవనిచేత, వార్యతే - నివారింపబడును. అనగా నెవ్వనిచేతను నివారింపబడదనుట.

తా. ఓపూర్వవాదీ, ఘటాదికార్యంబులయందు వర్తించుచుండెడి మృదాది వాస్తవాంశము కారణస్వరూపమేనని యెరిగిన నీవంటివానికి మాచేతం జెప్పబడిన కారణజ్ఞానమువలన కార్యజ్ఞానంబు గలుగుచున్నదనెడి వాక్య మాశ్చర్యమును గలిగింపనేరదు. ఇట్టివివేకము లేనివానికింగలిగెడి యాశ్చర్యము నెవ్వండును నివారింపజేయజాలడు.

అవ. మూఢునకాశ్చర్యముగల్గునని చెప్పబడినయర్థమునే విస్తరించి చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆరంభీపరిణామీచ లౌకికశ్చైకకారణే।
జ్ఞాతేసర్వమతింశ్రుత్వాప్రాప్నువంత్యేవవిస్మయం॥ ౫౯.

టీ. ఆరంభీ-ఆరంభవాదియు,పరిణామీచ-పరిణామవాదియు, లౌకికశ్చ-ప్రాకృతజనుడును, ఏకకారణే=ఏక- ఒకటియగు, కారణే-కారణవస్తువు, జ్ఞాతేసతి-తెలియబడుచుండగా,సర్వమతిం=సర్వ-సకలకార్యవర్గముయొక్క,మతిం-జ్ఞానమును, శ్రుత్వా-విని, విస్మయం - ఆశ్చర్యమును, ప్రాప్నువంత్యేవ-పొందుచున్నవారేయగుదురు.

తా. సమవాయ్య సమవాయి నిమిత్తములనెడి కారణములవలన భిన్నమగుకార్యము జన్మించుటనుజెప్పెడి వైశేషికుడారంభవాది యనబడును. మరియు కారణము తనపూర్వాకారమును పరిత్యజించి మరియొకరూపమునః బొందుట పరిణామమనబడును. అట్టి పరిణామవాదమును వాదించెడి సాంఖ్యుడు పరిణామ వాదియనబడును. మరియు నీరెండు విధములం దెలియక వ్యవహారమాత్రాసక్తుడగువాడు లౌకికుడనబడును. ఈముగ్గురకు నేకకారణవస్తుజ్ఞానంబువలన ననేకకార్యవర్గజ్ఞానంబు గలుగుచున్నదనెడివాక్యమును వినుటచేత నాశ్చర్యమూ గలుగుచున్నదేయగును. ప్ర. సరి. సమవాయికారణమనగా నేమి? ఉ. ఘటమునకు మృత్తికయు, వస్త్రమునకు నూలును ఇత్యాదివస్తువే సమవాయికారణమగును. ప్ర. అయితే, వేదాంతులు జెప్పెడి ఉపాదాన కారణమునకును తార్కికులుజెప్పెడి సమవాయి కారణమునకును భేదమేమి? ఉ. వేదాంతులుకార్యము కారణముకంటె నభిన్నమని చెప్పుదురు. తార్కికులో కారణముకంటె గార్యము భిన్నమని చెప్పుదురు. ఇదియే భేదమగును. ప్ర. సరి. అసమవాయి కారణమనగానేమి? ఉ. మృత్తికయందుగల అనేకాణువులయొక్క సంయోగంబును, నూలుయొక్క సంయోగంబును (అనగా ఇత్యాదిసంబం


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

థము) అసమవాయికారణమని చెప్పంబడును. ప్ర. సరి. నిమిత్తకారణమన గానేమి? ఉ. కుమ్మరియు దండచక్రాదులును, సాలెవాఁడును వాని పనిముట్లు మొదలగునవి నిమిత్తకారణమగునని తెలియవలెను.

శ్లో॥ అద్వైతేధీయుఖీకర్తుమేవాత్రైకస్యబోధతః।
సర్వబోధశ్శ్రుతోనైవనానాత్వస్యవివక్షయా॥ ౬౦.

టీ. అద్వైతే-అద్వితీయ సద్రూపాత్మయందు, శిష్యం- శిష్యుని, అభిముఖీకర్తుమేవ - అభిముఖునిగాఁ జేయుటకొరకే, అత్ర - ఈఛాందోగ్యశ్రుతియందు, ఏకస్య- ఒకకారణవస్తువుయొక్క, బోధతః- జ్ఞానంబువలన, సర్వబోధః= సర్వ-సర్వకార్యములయొక్క, బోధః- విజ్ఞానము, శ్రుతః - వినబడుచున్నది. నానాత్వస్య - భేదముయొక్క, వివక్షయా - ప్రతిపాదనేచ్ఛచేత, నైవశ్రుతః- వినబడలేదు. అనఁగా ననేకకార్యములయొక్క విజ్ఞానసిద్ధ్యర్థంబువినబడ లేదనుట.

తా. ప్ర. అయితే, ఏకమృత్పిండజ్ఞానముచేత తద్వికారంబగు ఘటాది సర్వకార్యవర్గంబు నేప్రకారముగా దెలియబడుచున్నదో యనెడి యర్థముగల, శ్రు॥ యథాసోమ్యైకేనమృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతంస్యాత్॥ అనెడి ఛాందోగ్యశ్రుతివాక్యమందు న్యాయముగా వినబడుచుండెడి యర్థమునువిడిపించి, ఈపూర్వోక్తప్రకారము వ్యాఖ్యానము జేయుటకు గారణమేమి? ఉ. సజాతీయవిజాతీయ స్వగతభేద రహితంబగు సద్రూపాత్మక బ్రహ్మంబునందు శిష్యునభిముఖముగా జేయుటకొరకే ఈఛాందోగ్యశ్రుతియందు నొక కారణవస్తువుయొక్క జ్ఞానంబువలన సర్వకార్యములయొక్క విజ్ఞానంబు జెప్పం బడెను. అయినను అనేకకార్యములయొక్క విజ్ఞానసిద్ధ్యర్థంబుగా నట్లు చెప్ప బడలేదని తెలియవలెను. అనఁగా ననేకకార్యములయొక్క విజ్ఞానం బావశ్యక మనెడి తాత్పర్యముతో బోధించలేదని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, ఏకకారణ విజ్ఞానముచేత సర్వకార్యవర్గ విజ్ఞానంబుగలుగునెడి విషయమై దృష్టాంతమును జూపునట్టియు, ఓచంద్రునివంటి ప్రియదర్శనుడా, ఒకమృత్పిండజ్ఞానముచేత తద్వికారములగు ఘటాది కార్యంబులన్నియు నెట్లు తెలియబడుచున్నవోయనెడి యర్థముగల, శ్రు॥ యథాసోమ్యైకేన మృత్పిండేన సర్వంమృణ్మయం విజ్ఞాతంస్యాత్॥ అనెడి వాక్యంబున కర్థనిరూపణపూర్వకముగా దార్ష్టాంతికమును జూపునట్టియు,ఆయుపదేశింపదగినవస్తువునుగూర్చి యడుగబడితివనియు, ఏయుపదేశ్య బ్రహ్మమును వినుటచేత వినబడనిదంతయు వినబడుచున్నదో ఏబ్రహ్మమును మననము జేయుటచేత మనన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నము జేయబడనిదంతయు వననము జేయబడుచున్నదో, ఏబ్రహ్మము నెరుగుట చేత నెరుగబడనిదంతయు నెరుగబడుచున్నదోయనెడియర్థంబుగల, శ్రు॥ ఉతత మాదేశమప్రాక్ష్యో యేనా శ్రుతంశ్రుతం భవత్యమతంమత మవిజ్ఞాతంవిజ్ఞాతం॥ అనెడి వాక్యార్థమునుజూపుచు బ్రకృతమందు ఫలితమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఏకమృత్పిండవిజ్ఞానాత్సర్వమృణ్మయధీర్యథా।
తథైకబ్రహ్మబోధేనజగద్బుద్ధిర్విభావ్యతాం॥ ౬౧.

టీ. ఏకమృత్పిండ విజ్ఞానాత్ = ఏక-ఒకటియగు, మృత్పిండ - మృత్తికా పిండముయొక్క, విజ్ఞానాత్ - విజ్ఞానంబువలన, సర్వమృణ్మయధీః= సర్వ-సకలములగు, మృణ్మయ - మృద్వికారములగు ఘటశరావాదులయొక్క, ధీః-విజ్ఞానము, యథా-ఏప్రకారము గలుగుచున్నదో, తథా-ఆప్రకారము, ఏకబ్రహ్మబోధేన=ఏక-ఒకటియగు, బ్రహ్మ - పరబ్రహ్మముయొక్క, బోధేన- విజ్ఞానముచేత, జగద్బుద్ధిః=జగత్ - ప్రపంచముయొక్క, బుద్ధిః-జ్ఞానము, విభావ్యతాం-తెలియబడుగాక.

తా. లోకమందు ఘటశరావాది ద్రవ్యములకు ఉపాదానకారణమగు ఒకమృత్పిండజ్ఞానంబువలన తద్వికారములగు సర్వఘటాదులయొక్క జ్ఞానంబే ప్రకారముగా గలుగుచున్నదో, ఆప్రకారమే సర్వంబునకు ఉపాదాన కారణమగు అద్వితీయబ్రహ్మముయొక్క జ్ఞానంబువలన తత్కార్యంబగు సర్వప్రపంచజ్ఞానంబు గలుగుచున్నదని తెలియదగినది.

శ్లో॥ సచ్చిత్సుఖాత్మకంబ్రహ్మనామరూపాత్మకంజగత్।
తాపనీయేశ్రుతంబ్రహ్మసచ్చిదానందలక్షణం॥ ౬౨.

టీ. బ్రహ్మ- బ్రహ్మము, సచ్చిత్సుఖాత్మకం= సత్-సత్యంబును, చిత్-జ్ఞానంబును, సుఖ-ఆనందంబును, ఆత్మకం-స్వరూపముగాగలదగును. జగత్-ప్రపంచము, నామరూపాత్మకం = నామ- నామధేయంబును, రూప - రూపంబును, ఆత్మకం-స్వరూపమునుగాగలదగును. తాపనీయే - ఉత్తరతాపనీయోపనిషత్తునందు, బ్రహ్మ- బ్రహ్మము, సచ్చిదానందలక్షణం = సత్ - సత్యంబును, చిత్-జ్ఞానంబును, ఆనంద - ఆనందంబును, లక్షణం-స్వరూపలక్షణములంగలదిగా, శ్రుతం- వినబడుచున్నది.

తా. ప్ర. అయితే, బ్రహ్మజగంబులయొక్క స్వరూపములుదెలియబడకుండగా బ్రహ్మజ్ఞానంబువలన జగంబుయొక్క విజ్ఞానంబుగలుగుచున్నదనితెలియుటకు శక్యమెట్లగును? ఉ. ఆబ్రహ్మజగంబులయొక్క స్వరూపములం జెప్పెదవినుము. బ్రహ్మము, సత్యజ్ఞానానంద స్వరూపంబుగలదగును.ప్రపంచంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నామరూపములే స్వరూపముగా గలదగును. అనగా ఘటాది నామములును పృథుబుధ్నోదరాది రూపములును ప్రపంచమునకు స్వరూపమగునని యభిప్రాయము. ప్ర. అయితే, బ్రహ్మము సత్యజ్ఞానానంద స్వరూపము గలదగుననుట యందు ప్రమాణమేమి? ఉ. తాపనీయాది శ్రుతులు ప్రమాణములగును. నృసింహోత్తరతాపనీయోపనిషత్తునందు ఆథర్వణికులచేత, శ్రు॥ బ్రహ్మైవేదంసర్వం సచ్చిదానందమాత్రం॥ అనెడి ఇత్యాది ప్రదేశములయందు బ్రహ్మమునకు సచ్చిదానందరూపంబు జెప్పబడెను.

అవ. ఆదిశబ్దముచేత వివక్షితములైన శ్రుత్యంతరములం జూపుచున్నాడు.

శ్లో॥ సద్రూపమారుణిః ప్రాహ ప్రజ్ఞానంబ్రహ్మబహ్వృచః।
సనత్కుమారఆనందమేవమన్యత్రగమ్యతాం॥ ౬౩.

టీ. ఆరుణిః- అరుణపుత్రుడగు ఉద్దాలకుడు, సద్రూపం - సత్యస్వరూప బ్రహ్మమును, ప్రాహ-చెప్పెను. బహ్వృచః - ఋగ్వేదులు, ప్రజ్ఞానం- ప్రకృష్టజ్ఞానమును, బ్రహ్మ-బ్రహ్మమునుగా, (ప్రాహుః) చెప్పిరి. సనత్కుమారః- సనత్కుమారుడు, ఆనందమేవ - ఆనందమునే బ్రహ్మమునుగా, ప్రాహ-చెప్పెను. ఏవం - ఈప్రకారముగా, అన్యత్ర - ఇతర వేదాంతములయందు, గమ్యతాం - తెలియఁబడుగాక.

తా. మరియు సామవేదంబులోని ఛాందోగ్యోపనిషత్తునందు ఉద్దాలకమునీంద్రునిచేత, ఓ ప్రియదర్శనుడా, సృష్టికి బూర్వమందు ఈ ప్రపంచమంతయు సద్రూపముగానుండెననెడి యర్థంబుగల, శ్రు॥ సదేవసోమ్యేదమగ్రఆసీత్॥ అనెడి ఇత్యాదివాక్యముచేత సద్రూపమగు బ్రహ్మంబు నిరూపింపబడెను. (సత్) అనగా కాలత్రయమందును వినాశంబులేని బ్రహ్మవస్తువని తెలియవలెను. మరియు నాప్రకారమే ఋగ్వేదములోని ఐతరేయోపనిషత్తునందు జ్ఞానము నిత్యమనియు జ్ఞానమే బ్రహ్మమనెడి యర్థముగల, శ్రు॥ ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞానంబ్రహ్మ॥ అనెడివాక్యముచేత బ్రహ్మమునకు జ్ఞానస్వరూపంబు జూపబడెను. జ్ఞానమనగా స్వయంప్రకాశమానత్వమని తెలియవలెను. ఈప్రకారము పూర్వోదాహృతఛాందోగ్య శ్రుతియందే సనత్కుమారుడనెడి గురుండు నారదుడనెడి శిష్యునికొరకు, శ్రు॥ భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః॥ అనెడి వాక్యముచేత భూమయే తెలియదగినదగునని యుపదేశించుటకు బ్రారంభించి, ఎద్ది భూమయో యద్ది యానందమనెడి యర్థంబుగల, శ్రు॥ యోవైభూమాతత్సుఖం॥ అనెడి వాక్యముచేత భూమశబ్దమనెడి పేరుగల బ్రహ్మమునకు నానందరూపత్వమును జెప్పినవాడాయెను. ఈపూర్వోక్త వాక్యత్రయమందుగల పదముల నేక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాక్యము జేయగా బ్రహ్మము సత్యజ్ఞానానంద స్వరూపంబు గలదగునని సిద్ధించుచున్నది. మరియు నీప్రకారమే తైత్తిరీయాదిశ్రుతులయందు, శ్రు॥ ఆనందో బ్రహ్మేతివ్యజానాత్॥ అనెడి ఇత్యాదివాక్యములచేత బ్రహ్మమునకు ఆనంద రూపత్వాదికంబు జెప్పంబడెనని చూడదగినది.

అవ. సచ్చిదానందములయందువలె నామరూపములయందును శ్రుతిని జూపుచున్నాడు.

శ్లో॥ విచిత్యసర్వరూపాణి కృత్వానామానితిష్ఠతి।
అహంవ్యాకరవాణీమే నామరూపే ఇతిశ్రుతీ॥ ౬౪.

టీ. సర్వరూపాణి- సకలరూపములను, విచిత్య-నిర్మించి, నామాని- నామములను, కృత్వా-కల్పించి. తిష్ఠతి- స్థితినిబొందియున్నాడు. అహం - నేను, ఇమే-ఈ రెండగు, నామరూపే - నామరూపములను, వ్యాకరవాణీతి-విస్తారముగా జేయుచున్నానని, శ్రుతీ - శ్రుతిద్వయంబు జెప్పుచున్నది.

తా. మరియు, బుద్ధిప్రేరకుడగు బరమేశ్వరుడు సకల రూపములను నిర్మించి నామరూపములం గల్పించి వానితో వ్యవహరించుచున్నాడని, శ్రు॥ సర్వాణిరూపాణి విచిత్యధీరోనామాని కృత్వాభివదన్యదాస్తే॥ అనెడి శ్రుతి జెప్పుచున్నది. మరియు, నేనీజీవరూపముతో బ్రవేశించి ఈనామరూపములను రెంటినివిస్తరింపజేయుచున్నానని, శ్రు॥ అనేనజీవే నాత్మనానుప్రవిశ్య నామరూపేవ్యాకరవాణి॥ అనెడి శ్రుతిజెప్పుచున్నది. అనగా నీశ్రుతులు రెండును సృష్టింపబడుచుండెడి నామరూపములు రెంటిను జగంబునందున్నవని తెలుపుచున్నవని యభిప్రాయము.

అవ. ఈయర్థమందే మరియొకశ్రుతి నుదాహరించుచున్నాడు.

శ్లో॥ అవ్యాకృతంపురాసృష్టే రూర్ధ్వంవ్యాక్రియతేద్విధా।
అచింత్యశక్తిర్మాయైషాబ్రహ్మణ్యవ్యాకృతాభిధా॥ ౬౫.

టీ. (ఇదం) ఈజగంబు, సృష్టేః- సృష్టికంటె, పురా - పూర్వమందు, అవ్యాకృతం - స్పష్టత్వమును బొందని నామరూపంబులుగలదిగా నుండెను. ఊర్ధ్వం-సృష్ట్యవసరమందు, ద్విధా-ద్వివిధముగా, అనగా వాచ్యవాచకభావముగాననుట. వ్యాక్రియతే- వికారమునొందుచున్నది. అచింత్యశక్తిః = అచింత్య-చింతించుటకు శక్యముగాని, శక్తిః-శక్తులుంగల, బ్రహ్మణి - పరబ్రహ్మమందుండెడి, ఏసా-ఈ, మాయా-అజ్ఞానము, అవ్యాకృతాభిధా = అవ్యాకృత-అవ్యాకృతమనెడి, అభిధా - పేరుగలదగుచున్నది.

తా. మరియు సృష్టికిపూర్వమందీజగంబంతయు నవ్యక్తనామరూపాత్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కముగానుండెననియు, పిమ్మటననగా సృష్ట్యవసరమందు రూపనామములనెడి రెండువిధములంగలిగి వికారమునుబొందెనని ఇట్లు సృష్టింపబడిన జగంబునకు నామరూపములే స్వరూపమని, శ్రు॥ తద్ధేదంతర్హ్యవ్యాకృతమాసీత్తన్నామరూపాభ్యామేవవ్యాక్రియతాసౌ నామాయమిదంరూపం॥ అనెడి బృహదారణ్యకశ్రుతిజెప్పుచున్నది. ప్ర. అయితే, ఈశ్రుతియందుగల అవ్యాకృత శబ్దమునకు నర్థంబేమి? ఉ. బ్రహ్మమందు చింతింప నశక్యమగు యేమాయాశక్తిగలదో ఈమాయాశక్తి, పూర్వోక్తబృహదారణ్యకశ్రుతియందు గల అవ్యాకృతశబ్దము చేత జెప్పబడుచున్నది.

అవ. పూర్వోక్తశ్రుతియందుగల, శ్రు॥ తన్నామరూపాభ్యామేవవ్యాక్రియతే॥ అనెడివాక్యార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ అవిక్రియబ్రహ్మనిష్ఠా వికారంయాత్యనేకధా ।
మాయాంతుప్రకృతింవిద్యాన్మాయినంతుమహేశ్వరం॥ ౬౬.

టీ. అవిక్రియబ్రహ్మనిష్ఠా-అవిక్రియ - వికారములేని, బ్రహ్మ- పరబ్రహ్మమందు, నిష్ఠా-వర్తించుచుండెడి, (సా) ఆమాయాశక్తి, అనేకధా - బహువిధములుగా, వికారం-వికారమును, యాతి - పొందుచున్నది. మాయాంతు-మాయనో, ప్రకృతిం - జగదుపాదానకారణముగా, విద్యాత్ - తెలియవలెను. మాయినంతు - మాయాధిష్ఠితనో, మహేశ్వరం - మాయానియామకునిగా, విద్యాత్ - తెలియవలెను.

తా. నిర్వికారమగు పరబ్రహ్మమందు వర్తించుచుండెడి యామాయాశక్తి, భూతభౌతిక ప్రపంచరూపముచేత బహువిధములుగా వికారమును పొందుచున్నది. ప్ర. అయితే, బ్రహ్మమందు మాయాశక్తి వర్తించుచున్నదనుట యందు ప్రమాణమేమి? ఉ. పూర్వోక్తమాయను జగదుపాదానకారణమైన ప్రకృతినిగా నెరుగవలెననియు నామాయకు నాశ్రయత్వముచేత నామాయావంతుడైన( మాయిని) మాయానియామకుడగు మహేశ్వరునిగా నెరుగవలెనని, శ్రు॥ మాయాంతుప్రకృతింవింద్యాన్మాయినంతుమహేశ్వరం॥ అనెడి శ్వేతాశ్వతరమంత్రము జెప్పుచున్నది. ఈశ్రుతియందుగల తుకారద్వయము మాయామహేశ్వరులకు భేదమును తెలుపుచున్నది.

అవ. ఇప్పుడు మాయాసహిత బ్రహ్మముయొక్క ప్రథమ కార్యమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఆద్యోవికారఆకాశస్సోస్తిభాత్యపిచప్రియః।
అవకాశస్తస్యరూపంతన్మిథ్యావతుత్రయం॥ ౬౭.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అద్యః-మొదటిదైన, వికారః - కార్యము, ఆకాశః - ఆకాశంబగును. సః-ఆయాకాశము, అస్తి- ఉన్నదనియు, భాత్యపిచ-ప్రకాశించుచున్నదనియు, ప్రియశ్చ- ఇష్టమైనదనియుం జెప్పబడును. అనగా సచ్చిదానందరూపముగల దగుననుట. తస్య - ఆయాకాశముయొక్క, రూపం- నిజరూపము, అవకాశః- అవకాశంబగును. తత్-ఆయాకాశస్వరూపము, మిథ్యా- మిథ్యయగును. అనగా నసత్యమనుట. తత్- ఆ. త్రయంతు-మూడో, అనగా సచ్చిదానందములనుట. న- మిథ్యారూపములుగావు.

తా. మాయాసహిత పరబ్రహ్మముయొక్క కార్యములలో మొదటి కార్యమాకాశంబగును. ప్ర. అయితే, ఆయాకాశమునకు కారణంబువలన వచ్చినరూపమేమి? ఉ. ౧. (ఆకాశమున్నది) అనెడి వ్యవహారమందు ఉన్నదనెడి వ్యవహారహేతువెద్దిగలదో యదియే సద్వస్తుస్వభావమగును. ౨. ఆకాశము తోచుచున్నదనెడి వ్యవహారముండుటచేత బ్రహ్మముయొక్క చిద్రూపధర్మ మాయాకాశమందున్నదని తెలియవలెను. ౩. ఆకాశము ఇష్టమైనదనెడి వ్యవహారముండుటచేత బ్రహ్మమందుగల ఆనందధర్మ మాయాకాశమందు గలదని తెలియబడుచున్నది. ఇట్లు కారణమగు బ్రహ్మముయొక్క సచ్చిదానందస్వరూపములు మూడును కార్యమగు ఆకాశమందున్నవని తెలియవలెను. ప్ర. అయితే,ఆయాకాశముయొక్క నిజరూపమేమి? ఉ. అవకాశమగును. మరియు నాయవకాశరూపము మిథ్యయగును. ఆయాకాశమందుగల బ్రహ్మస్వరూపమగు సచ్చిదానందములు మూడును వాస్తవంబగును.

శ్లో॥ నవ్యక్తేఃపూర్వమస్త్యేవనపశ్చాచ్చాపినాశతః।
ఆదావంతేచయన్నాస్తివర్తమానేపితత్తథా॥ ౬౮.

టీ. వ్యక్తేః-ఉత్పత్తికంటె, పూర్వం- పూర్వమందు, నాస్త్యేవ - లేనే లేదు. నాశతః-నశించుటకంటె, పశ్చాచ్చాపి-పిమ్మటను, న-లేదు. ఆదౌ-ఆదియందును, అంతేచ - అంత్యమందును, యత్-ఎద్ది, నాస్తి-లేదో, తత్ - అది, వర్తమానేపి - వర్తమానమందును, తథా-ఆప్రకారమేయగును. అనగాలేనిదే యగుననుట.

తా. ప్ర. అయితే, ఆయాకాశముయొక్క చతుర్థరూపంబు (అవకాశస్వరూపంబు) మిథ్యయగుటకు గారణమేమి? ఉ. ఉత్పత్తికంటె బూర్వమందును నశించిన పిమ్మట నాయవకాశరూపంబు లేనిదే యగును. ప్ర. అయితే, యుత్పత్తివినాశంబులకు మధ్యమందు దోచుచుండెడి యాకాశ స్వరూపంబగు అవకాశంబు మిథ్యయెట్లగును? ఉ. ఆదియందును అంత్యమందు నెద్దిలేనిదగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నో యద్ది వర్తమానకాలమందును లేనిదేయగునని తెలియవలెను.

అవ. ఈయర్థమందు శ్రీకృష్ణవాక్యమును బ్రమాణీకరించుచున్నారు.

శ్లో॥ అవ్యక్తాదీనిభూతానివ్యక్తమధ్యానిభారత।
అవ్యక్తనిధనాన్యేవేత్యాహకృష్ణోఽర్జునంప్రతి॥ ౬౯.

టీ. హేభారత - ఓయియర్జునా, భూతాని- మనుష్యాది భూతంబులు, అవ్యక్తాదీని=అవ్యక్త-లేమిని, ఆదీని - ఆదియందుగలవగుచును, వ్యక్తమధ్యాని= వ్యక్త - ఉనికిని, మధ్యాని - మధ్యకాలమందు గలవగుచును, అవ్యక్తనిధనాన్యేవ=అవ్యక్త- లేమినియు, నిధనాన్యేవ - నాశంబునంత్యమందుగలవే యగుచున్నవి. ఇతి ఇట్లని, కృష్ణః శ్రీపరమేశ్వరుడు, అర్జునంప్రతి- అర్జునునిగూర్చి, ఆహ - చెప్పెను.

తా. ఓభరతకులమందు బుట్టినయర్జునా, మనుష్యాదిభూతంబులన్నియు నాదికాలమందు బుట్టమిచేత లేనివగుచు మధ్యకాలమందు గనబడుచు నంత్యకాలమందు నశించుటచేత మరల లేకపోవుచున్నవని శ్రీకృష్ణభగవంతుడు తన శిష్యుడైన యర్జుననుగురించి శ్రీగీతాశాస్త్రమందు జెప్పినవాడాయెను. కనుక, ఆకాశస్వరూపంబగు అవకాశము లేనిదేయగునని తెలియవలెను.

శ్లో॥ మృద్వత్తేసచ్చిదానందా అనుగచ్ఛంతిసర్వదా।
నిరాకాశేసదాదీనామనుభూతిర్నిజాత్మని॥ ౭౦.

టీ. మృద్వత్-మృత్తికవలె, తే-ఆ, సచ్చిదానందాః- సత్యజ్ఞానానందంబులుమూడును, సర్వదా - ఎల్లప్పుడు, అనుగచ్ఛంతి-అనుసరించుచున్నవి. నిరాకాశేసతి- ఆకాశము లేకపోవుచుండగా, అనగా నాకాశరూపమును బుద్ధిచేత పరిత్యజించి స్మరించబడకుండగాననుట, నిజాత్మని- తనమనంబునందు, సదాదీనాం- సచ్చిదానందములయొక్క, అనుభూతిః - అనుభవంబుగలదు.

తా. ప్ర. అయితే, ఆకాశస్వరూపంబగు అవకాశమందు సచ్చిదానందములు మూడునుండుటయందు బ్రమాణమేమి? ఉ. అనుభవమే ప్రమాణమగును. ప్ర. ఆయనుభవమెద్ది? ఉ. ఘటాదులయందేప్రకారముగా గాలత్రయమందును మృత్తిక వర్తించుచున్నదో, ఆప్రకారమే యాకాశమందు సచ్చిదానందములు మూడును సర్వదా వర్తించుచున్నవి. ప్ర. అయితే, ఆకాశమందవకాశమొకటి తప్ప, సచ్చిదానందంబు లనువర్తించుచున్నవెట్లనుభవింపబడుచున్నవోచెప్పుము? ఉ. ఆకాశస్వరూపంబగు అవకాశమునుస్మరించక (అనగా బుద్ధిచేత బరిత్యజించి) భావించిచూచునప్పుడాయవకాశస్థిత సచ్చిదానందములయొక్క యనుభవంబు తనమనంబునందు దోచగలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఆయర్థమునే యుపపాదించుచున్నాడు.

శ్లో॥ అవకాశేవిస్మృతేథ తత్రతత్కింభాతి తేవద।

శూన్యమేవేతిచేదస్తు నామతాదృగ్విభాతిహి॥ ౭౧.

టీ. అవకాశే- అవకాశరూపంబు, విస్మృతేసతి - మరచిపోబడుచుండ గా, అథ-పిమ్మట, తత్ర-అచ్చట, అనగా నవకాశమందనుట. తే- నీకు, కిం- ఏది, భాతి-ప్రకాశించుచున్నదో, వద-చెప్పుము. శూన్యమేవ-శూన్యమే, భాతీతిచేత్-తోచుచున్నదని యంటివేని, అస్తునామ - శబ్దమువలనశూన్యమగుగాక. తాదృక్ - అటువంటిది, అనగా నవకాశాభావమనెడి విశేషణమునకు విశేష్యంబనెడి యొకానొక వస్తువనుట. విభాతి - ప్రకాశించుచున్నది. హి-ఇది లోకప్రసిద్ధంబనుట.

తా. ఓపూర్వవాదీ, ఆకాశంబునకు నసాధారణ స్వరూపంబగు అవకాశమును బుద్ధిచేత బరిత్యజించి స్మరించనిసమయమందచ్చట నీకేద్ది బ్రకాశించుచుండునో జెప్పుము. ప్ర. అవకాశ స్వరూపంబును బుద్ధిచేతవిడిపించి స్మరించని సమయమందచ్చటశూన్యమే ప్రకాశించుచున్నదని చెప్పరాదాయేమి? ఉ. సరి. అచ్చట శబ్దమువలన శూన్యమేయగుగాక. అర్థంబువలననో యవకాశాభావమనెడి విశేషణమునకు విశేష్యత్వముచేత నొకానొక వస్తువు గలదని యంగీకరింపవలెను. విశేష్యములేని విశేషణంబులోకమందులేదు. అనగా (ఘటాభావవద్భూతలం = భూతలంబు ఘటాభావముగలది) అనెడి ప్రయోగమందు ఘటాభావమనెడి విశేషణమునకు భూతలంబే ప్రకారముగా విశేష్యమగునో, యాప్రకారమే యవకాశాభావమనెడి విశేషణంబునకు విశేష్యముగా నొకవస్తువచ్చటగలదని యంగీకరింపదగినదగునని తెలియవలెను.

శ్లో॥ తాదృక్త్వాదేవతత్సత్వ మౌదాసీన్యేనతత్సుఖం।

అనుకూల్యప్రాతికూల్య హీనంయత్తన్నిజంసుఖం॥ ౭౨.

టీ. తాదృక్త్వాదేవ- అవకాశాభావమునకు విశేష్యముగా దోచుచుండునట్టి దగుటవలననే, తత్-అది, సత్వం - సద్రూపమగును. అనగా సద్వస్తువగుననుట. తత్-ఆసద్వస్తువు, ఔదాసీన్యేన-ఉదాసీనత్వముచేత, సుఖం-ఆనందస్వరూపంబుగలదగును. యత్-ఏద్ది, అనుకూల్యప్రాతికూల్యహీనం = అనుకూల్య- అనుకూలత్వముచేతను, ప్రాతికూల్య - ప్రతికూలత్వముచేతను, హీనం- రహితమైనదగునో, అనగా నానుకూల్య ప్రాతికూల్యలక్షణ విషయము గాకయుండునోయనుట. తత్-అది, నిజం-స్వీయమయిన, సుఖం- ఆనందమగును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తా. ప్ర. సరి. ఈప్రకారంబగుగాక. ప్రకృతమందులాభమేమి? ఉ. అవకాశాభావమునకు విశేష్యముగా దోచుచుండునట్టి వస్తువునకు సమాప్తంబు జెప్పదగినదగును. మరియు నావిశేష్యముగాదోచుచుండెడి సద్వస్తువౌదాసీన్యవిషయమగుటవలన నాసద్వస్తువు సుఖస్వరూపంబు గలదగును. ప్ర. అయితే, ఔదాసీన్యమనగానేమి? ఉ. అనుకూల్య ప్రాతికూల్యలక్షణ విషయముగా నిదియౌదాసీన్యమగునని తెలియవలెను. ప్ర. అయితే, అనుకూలత్వము లేనిదానికి సుఖస్వరూపం బెట్లుసిద్ధించును? ఉ. ఎద్ది, అనుకూల్యప్రాతికూల్యలక్షణ విషయముగానిదగునో యద్ది, నిజానందంబగును.

అవ. ఈయర్థమునే ఇప్పుడుపపాదించుచున్నాడు.

శ్లో॥ అనుకూల్యేహర్షధీస్స్యాత్ప్రాతికూల్యేతుదుఃఖధీః।
ద్వయాభావేనిజానందో నిజదుఃఖంనతుక్వచిత్॥ ౭౩.

టీ. అనుకూల్యేసతి - అనుకూలత్వము గలుగుచుండగా, హర్షధీః సుఖబుద్ధి, స్యాత్-కలుగును. ప్రాతికూల్యేసతితు - ప్రతికూలత్వంబు గలుగుచుండగా, దుఃఖధీః-దుఃఖబుద్ధి, స్యాత్-కలుగును. ద్వయాభావేసతి= ద్వయ - అనుకూలత్వ ప్రతికూలత్వములయొక్క, అభావేసతి - లేమిగలుగుచుండగా, నిజానందః=నిజ-స్వరూపముయొక్క, ఆనందః - ఆనందము, స్యాత్ - కలుగును. నిజదుఃఖంతు=నిజ-స్వరూపముయొక్క, దుఃఖంతు- దుఃఖమో, క్వచిత్ - ఎచ్చటను, న-లేదు.

తా. స్త్రీపుష్ప చందనాది వస్తువులును వ్యాఘ్రసర్పాదులును అనుకూలముగా దోచినప్పుడు సుఖబుద్ధియుం బ్రతికూలముగా దోచినప్పుడు దుఃఖబుద్ధియుంగలుగును. ఈసుఖదుఃఖంబులు రెండును అంతఃకరణవృత్తులే యగుగాని స్వస్వరూప సంబంధ ధర్మంబులుగావు. అట్టి యనుకూలత్వ ప్రతికూలత్వవిషయము లేకపోవుచుండగా నిజానందంబనుభవింపబడుచున్నది. అనగా నానుకూల్యప్రాతికూల్య విషయములేకపోవుచుండగా సుషుప్తి సమాధి దశలయందు నిజానందంబు స్ఫురించుచున్నదని యభిప్రాయము. ప్ర. అయితే, ఆనుకూల్య ప్రాతికూల్య విషయము లేకపోవుచుండగా సుషుప్త్యాదిదశయందు నిజానందంబుగలుగుచున్నట్లు నిజదుఃఖంబు గలుగుచున్నదని చెప్పరాదాయేమి? ఉ. దుఃఖము స్వరూపధర్మముగానున్నట్లు శ్రుతిస్మృత్యనుభవ ప్రసిద్ధముగామిచేతనిజదుఃఖములేదని తెలియవలెను.

శ్లో॥ నిజానందేస్థిరేహర్ష శోకయోర్వ్యత్యయఃక్షణాత్।
మనసఃక్షణికత్వేనతయోర్మానసతేష్యతాం॥ ౭౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. నిజానందే= నిజ-స్వస్వరూపచిదాత్మయొక్క, ఆనందే - స్వరూపభూతసుఖము, స్థిరేపి-నిత్యమైనను, మనసః-మనస్సుయొక్క, క్షణికత్వేన-క్షణికత్వముచేత, హర్షశోకయోః-సుఖదుఃఖంబులకు, క్షణాత్-నిమేషకాలమువలన, వ్యత్యయః - వినిమయను గలుగుచున్నది. అనగా నొకక్షణమందు సుఖవృత్తియు మరియొకక్షణమందు దుఃఖవృత్తియుం గలిగి లయించుచుండు ననుట. (అతః) ఆకారణమువలన, తయోః - ఆసుఖదుఃఖములకు, మానసతా-మనస్సంబంధిత్వము, ఇష్యతాం- అంగీకరింపబడుగాక.

తా. ప్ర. అయితే నిజానందంబు నిత్యంబగుటవలన సర్వదాసుఖమేగలిగియుండవలెగాని దుఃఖముగలిగియుండరాదుగదా? ఉ. నిజానందంబు నిత్యమైనను దానిని గ్రహించునట్టి మనోవృత్తి క్షణికమగుటచేత నామనస్సంబంధంబులగు సుఖదుఃఖంబులును క్షణికములేయగునని తెలియవలెను. ఇచ్చట మనంబునకు గలిగెడిదుఃఖంబు స్వరూపసంబంధంబు గలదిగాదనెడి యభిప్రాయనునుంగూడ గ్రహించవలెను.

అవ. దృష్టాంతసిద్ధార్థమును దార్ష్టాంతికమందన్వయించుచున్నాడు.

శ్లో॥ ఆకాశేప్యేవమానందస్సత్తాభానేతుసమ్మతే।
వాయ్వాదిదేహపర్యంతంవస్తుష్వేవంవిభావ్యతాం॥ ౨౫.

టీ. ఏవం-ఈప్రకారముగా, అనగా విజ్ఞానాత్మయందు జెప్పబడినప్రకారముగాననుట. ఆకాశేపి - ఆకాశమందును, ఆనందః - ఆనందంబుగలదు. సత్తాభానేతు - సత్తా-సద్రూపంబును, భానేతు- ప్రకాశంబును, అనగాసచ్చిద్రూపంబులనుట. సమ్మతే - సమ్మతములగును. అనగా నీచే నంగీకరింపబడినవనుట. ఏవం- ఈప్రకారము, వాయ్వాదిదేహపర్యంతం=వాయు- వాయువే, ఆది- ఆదిగాగలిగినట్టియు, దేహ - శరీరమే, పర్యంతం - అంతముగాగల, వస్తుషు- పదార్థములయందు, విభావ్యతాం-తెలిసికొనబడుగాక. అనగా దెలిసికొనవలెననుట.

తా. విజ్ఞానాత్మయందు జెప్పబడినప్రకారముగా నాకాశంబునందు నానందంబుగలదు. మరియు నాకాశమందుగల సచ్చిద్రూపంబులు రెండును నీచే తనంగీకరింపబడుటవలన నారెంటిని మేమిప్పుడుపపాదించవలసిన పనిలేదు. గనుక, ఈచెప్పబడినప్రకారమాకాశంబునందు బ్రహ్మస్వరూప సచ్చిదానందములుగలవని తెలియవలెను. ఇట్లాకాశమందంగీకరించబడిన సచ్చిదానందంబులు మూడును వాయురగ్నిజలభూమ్యోషధ్యన్న శరీరములయందుగలవని బుద్ధిచేత దెలిసికొనవలెను. అనగా నాకాశమందు బ్రతిపాదింపబడిన యర్థంబంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యు వాయ్వాదిశరీరాంతమువరకుగల వస్తువులయందు గ్రహింపదగిన దగునని యభిప్రాయము.

అవ. ఇప్పుడు, రెండుశ్లోకములచే నచ్చట వాయ్వాదులయొక్క యసాధారణధర్మములం జూపుచున్నాడు.

శ్లో॥ గతిస్పర్శౌవాయురూపంవహ్నేర్దాహప్రకాశనే।
జలస్యద్రవతాభూమేః కాఠిన్యంచేతినిర్ణయః॥ ౭౬.

టీ. గతిస్పర్శౌ=గతి-చలనంబును, స్పర్శౌ - స్పర్శంబును, వాయురూపం=వాయు-వాయువుయొక్క, రూపం- స్వరూపమగును. అనగా నసాధారణ ధర్మములగుననుట. వహ్నేః-అగ్నికి, దాహప్రకాశనే=దాహ-ఉష్ణత్వంబును, ప్రకాశనే - తేజంబును, జలస్య-జలమునకు, ద్రవతా-ద్రవత్వంబును, అనగా రసంబుననుట. భూమేః-భూమికి, కాఠిన్యంచ-కఠినత్వంబును, ఇతి- ఈప్రకారముగా నసాధారణధర్మములుగలవని, నిర్ణయః-నిర్ణయంబగును.

తా. గతిస్పర్శములు రెండును వాయువుయొక్క (స్వరూపము) అనగా నసాధారణధర్మములగును. మరియు నుష్ణప్రకాశములు రెండు నగ్నియొక్క యసాధారణధర్మములగును. మరియు ద్రవత్వంబు జలముయొక్క యసాధారణధర్మంబగును. మరియు కాఠిన్యము భూమియొక్క యసాధారణ ధర్మంబగునని ఈప్రకారముగా నిర్ణయింపబడెను.

శ్లో॥ అసాధారణఆకాశ ఓషధ్యన్నవపుష్వపి।
ఏవంవిభావ్యంమనసా తత్తద్రూపంయథోచితం॥ ౭౭.

టీ. అసాధారణే-అసాధారణధర్మముగల, ఆకాశే - ఆకాశమందును, ఓషధ్యన్నవపుష్వపి=ఓషధి- వ్రీహ్యాద్యోషధులయందును, అన్న-అన్నమందును, వపుష్వపి - దేహమందును, తత్తద్రూపం= తత్తత్ - ఆయాపదార్థముయొక్క, రూపం-అసాధారణాకారము, ఏవం-ఈప్రకారముగా, మనసా-మనంబుచేత, యథోచితం- ఉచితమగునట్లు, విభావ్యం - ఊహించదగినదగును.

తా. మరియు నసాధారణాకారంబుగల ( అనగా నవకాశ స్వరూపంబుగల ) ఆకాశమందును వ్రీహ్యాద్యోషధులయందును అన్నాదిభోగ్యపదార్థములయందును శరీరాదికమందును ఆయాపదార్థమునకు దగినట్టి యసాధారణాకారము నీప్రకారమే మనంబుచేత నూహించి తెలియదగినదగును.

అవ. ఫలితార్థమును చెప్పుచున్నాడు.

శ్లో॥ అనేకధావిభిన్నేషు నామరూపేషుచైకధా।
తిష్ఠంతిసచ్చిదానందావిసంవాదోనకస్యచిత్॥ ౭౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అనేకధా- అనేకప్రకారములుగా, విభిన్నేషు - భేదమునుబొందియుండెడి, నామరూపేషుచ - ఆకాశ వాయ్వాది నామరూపంబులయందును, సచ్చిదానందాః-సత్యజ్ఞానానందములు, ఏకధా - ఏకవిధముగా, తిష్ఠంతి- స్థితిని బొందుచున్నవి. అత్ర-ఈవిషయమందు, కస్యచిత్-ఎవనికిని, విసంవాదః-విరోధము, న-లేదు.

తా. అనేకవిధములుగా భేదమునుబొందియుండెడి యాకాశవాయ్వాదినామరూపంబులయందును సచ్చిదానందములు ఏకవిధముగానున్నవి. ఈవిషయమం దెవనికిని విరోధములేదు.

శ్లో॥ నిస్తత్త్వే నామరూపే ద్వే జన్మనాశయుతేచ తే।
బుద్ధ్యా బ్రహ్మణివీక్షస్వ సముద్రే బుద్బుదాదివత్॥ ౭౯.

టీ. నిస్తత్త్వే-వాస్తవస్వరూపములేని, నామరూపే - నామరూపంబులు, ద్వేచ-రెండును, జన్మనాశయుతే=జన్మ-ఉత్పత్తితోటియు, నాశ - వినాశంబుతోటియు, యుతే- కూడియున్నవగును. తే - ఆనామరూపములను రెంటిని, సముద్రే - సముద్రమందు, బుద్బుదాదివత్ - నీటిబుగ్గలు మొదలగువానినివలె, బుద్ధ్యా-బుద్ధిచేత, బ్రహ్మణి-బ్రహ్మమునందు, వీక్షస్వ-చూడుము.

తా. ప్ర. అయితే, ప్రత్యక్షాదిప్రమాణములచేత దోచుచుండెడి నామరూపంబులకు గతియేమి? ఉ. ఆనామరూపంబులు రెండును కల్పితములగుటవలన వాస్తవస్వరూపములేనివగును. అనగా నానామరూపములకు గల్పితత్వమే గతియగునని తెలియవలెను. ప్ర. అయితే ఆనామరూపములు రెండును కల్పితములని చెప్పటకు గారణమేమి? ఉ. ఉత్పత్తి వినాశములతోగూడియుండుటయే కారణమగును.

శ్లో॥ సచ్చిదానందరూపేస్మిన్పూర్ణే బ్రహ్మణివీక్షితే।
స్వయమేవావజానంతినామరూపే శనైశ్శనైః॥ ౮౦.

టీ. సచ్చిదానందరూపే- సత్యజ్ఞానానంద స్వరూపము గలిగినట్టియు, పూర్ణే- సర్వపరిపూర్ణమయినట్టియు, అస్మిన్ - ఈయపరోక్షరూపంబగు, బ్రహ్మణి-పరబ్రహ్మము, వీక్షితేసతి- చూడబడుచుండగా, నామరూపే - నామరూపములు రెండును, స్వయమేవ-స్వయముగానే, శనైశ్శనైః-తిన్నతిన్నగా, అవజానంతి - అనాదరణమును బొందుచున్నవి. అనగా స్ఫురించకపోవుచున్నవనుట.

తా. ప్ర. అయితే, నామరూపములు రెండును కల్పితములగుననిచెప్పటచేత లాభమేమి? సచ్చిదానందాద్వితీయాపరోక్షరూప పరబ్రహ్మము బుద్ధి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేత జూడబడుచుండగా కల్పితనామరూపములు రెంటను స్వయముగా వేరిన్నతిన్నగా ననాదరణమును బొందుచున్నవి. అనగా స్ఫురించకపోవుచున్నవని యభిప్రాయము.

అవ. దృఢమయిన బ్రహ్మవిద్య, ద్వైతనుయొక్క యనాదరణపూర్వకముగా గలుగుచుండుటవలన వేదాంత శ్రవణాదికమును జేసినట్లు ద్వైతముయొక్క యనాదరణంబును జేయదగిన దగునని చెప్పుచున్నాడు.

శ్లో॥ యావద్యావదవజ్ఞాస్యాత్తావత్తావ త్తదీక్షణం।
యావద్యావద్వీక్ష్యతేతత్తావత్తావదుభేత్యజేత్॥ ౮౧.

టీ. యావద్యావత్- ఎంతెంతమాత్రము, అవజ్ఞా- అనాదరణము, అనగా ద్వైతమిథ్యాత్వబుద్ధియనుట. స్యాత్-కలుగునో. తావత్తావత్ - అంతంతమాత్రము, తదీక్షణం=తత్-ఆసచ్చిదానంద స్వరూపబ్రహ్మముయొక్క, ఈక్షణం-జ్ఞానము, అనగా సాక్షాత్కారమనుట. స్యాత్-కలుగును. తత్-ఆబ్రహ్మము, యావద్యావత్- ఎంతెంతమాత్రముగా, అనగా నెంతెంత దృఢముగాననుట. వీక్ష్యతే- చూడబడునో, అనగా నెరుగబడునోయనుట. తావత్తావత్-అంతంతమాత్రముగా, ఉభే - నామరూపములను రెంటిని, త్యజేత్ - విడువవలెను.

తా. మరియు, ఎంతెంతమాత్రము ద్వైతముయొక్క యనాదరణము అనగా (మిథ్యాత్వబుద్ధి) గలుగునో యంతంతమాత్ర మాసచ్చిదానంద స్వరూపబ్రహ్మముయొక్క జ్ఞానము (అనగా సాక్షాత్కారము) గలుగును. మరియు నాబ్రహ్మం బెంతెంత దృఢముగా నెరుగబడుచున్నదో యంతంతమాత్రను ప్రపంచముయొక్క నామరూపములను రెంటిని విడువవలెను. అనగా ద్వైతమిథ్యాజ్ఞానంబెంతదృఢముగానుండునో యంతబ్రహ్మజ్ఞానంబును దృఢముగానుండుగాన బ్రపంచమథ్యాత్మజ్ఞానము నవశ్యము సంపాదించవలెనని యభిప్రాయము.

అవ. బ్రహ్మభ్యాసద్వైత మిథ్యాత్వాభ్యాసములకు ఫలమును చెప్పుచున్నాడు.

శ్లో॥ తదభ్యాసేనవిద్యాయాం సుస్థితాయామయంపుమాన్।
జీవన్నేవభవేన్ముక్తో వపురస్తుయథాతథా॥ ౮౨.

టీ. తదభ్యాసేన = తత్ - ఆబ్రహ్మ ప్రపంచా నాదరణములయొక్క, అభ్యాసేన - అభ్యాసముచేత, అనగా మాటిమాటికి జింతించుటచేతననుట. విద్యాయాం బ్రహ్మతత్వజ్ఞానము, సుస్థితాయాంసత్యాం - దార్ఢ్యస్థితినిబొం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుచుండగా, అయం - ఈ, పుమాన్-పురుషుడు, జీవన్నేవ- బ్రతికియుండియే, ముక్తః-సంసారబంధవిముక్తుడు, భవేత్-అగును. వపుః-శరీరము, యథాతథా-ఏలాగైనను, అస్తు - అగుగాక.

తా. ఆబ్రహ్మాభ్యాస ప్రపంచానాదరణాభ్యాసములం జేయుటచేత బ్రహ్మతత్వజ్ఞానంబు దృఢస్థితిని బొందియుండగా నాబ్రహ్మజ్ఞానియగు బురుషుడు, తనశరీరము వ్యవహారపరతంత్రమైయున్నను, లేక, సమాధి పరతంత్రమైయున్నను బ్రతికియుండియే మోక్షమును బొందుచున్నాడు.

అవ. ఇప్పుడు బ్రహ్మాభ్యాస స్వరూపమును జెప్పుచున్నాడు.

శ్లో॥ తచ్చింతనంతత్కథనమన్యోన్యంతత్ప్రబోధనం।
ఏతదేకపరత్వంచబ్రహ్మాభ్యాసంవిదుర్బుధాః॥ ౮౩.

టీ. తచ్చింతనం=తత్-ఆప్రత్యగ్బ్రహ్మస్వరూపముయొక్క, చింతనం-ధ్యానంబును, తత్కథనం - ఆబ్రహ్మస్వరూప విషయక సంభాషణంబును, అన్యోన్యం-గురుశిష్యాది సంవాదద్వారా, తత్ప్రబోధనం - ఆబ్రహ్మస్వరూపబోధనంబును, ఏతదేకపరత్వంచ=ఏతత్- ఈప్రత్యగభిన్నపరబ్రహ్మమందు, ఏక-ముఖ్యమైన, పరత్వంచ - పరత్వబుద్ధియు, అనగా చిత్తైకాగ్ర్యరూపనిదిధ్యాసమనుట. బ్రహ్మాభ్యాసం - బ్రహ్మాభ్యాసమునుగా, బుధాః-పండితులు, విదుః- తెలిసికొనిరి.

తా. ఆప్రత్యగ్బ్రహ్మ స్వరూపమును ధ్యానించుటయు, ఆబ్రహ్మస్వరూపమును గురించి సంభాషించుకొనుటయు, గురుశిష్యాది సంవాదద్వారముగా నాబ్రహ్మస్వరూపమును దెలిసికొనుటయు, (ఏతదేకపరత్వంబును) అనగా నీప్రత్యగభిన్న పరబ్రహ్మమందు చిత్తైకాగ్ర్యరూప నిదిధ్యాసంబును ఈచెప్పబడిన విషయములను బ్రహ్మాభ్యాసమునుగా విద్వాంసులుదెలిసికొనిరి. గనుక, ఇదియే బ్రహ్మాభ్యాసమగును.

శ్లో॥ వాసనానేకకాలీనాదీర్ఘకాలంనిరంతరం।
సాదరంచాభ్యస్యమానేసర్వథైవనివర్తతే। ౮౪.

టీ. దీర్ఘకాలం - చిరకాలము, నిరంతరంచ- సర్వదా, అనగా నవిచ్ఛిన్నమునుగాననుట. సాదరం-శ్రద్ధతోటి, అభ్యస్యమానేసతి-తత్వజ్ఞానమభ్యసింపబడుచుండగా, వాసనా - ప్రపంచవాసన, అనేక కాలీనాపి - బహుకాలమునుంచి యున్నదైనను, సర్వథైవ- సర్వవిధములచేతను, నివర్తతే-నివర్తించుచున్నది.

తా. ప్ర. అయితే, అనాదికాలమునుంచి దోచుచుండెడి ద్వైతముకా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాకస్వము గలుగుచుండెడి బ్రహ్మతత్వజ్ఞానాభ్యాసముచేత నెట్లునివర్తించును? ఉ. చిరకాలము నిరంతరను శ్రద్ధతోటి తత్వజ్ఞాన మభ్యసింపబడుచుండగా నట్టియభ్యాసనుచేత ద్వైతవాసన బహుకాలమునుంచి యున్నదైనను నిశ్శేష ముగా నివర్తించుచున్నదేయగును.

శ్లో॥ మృచ్ఛక్తివద్బ్రహ్మశక్తిరనేకానన్ృతాన్ సృజేత్।
యద్వాజీవగతానిద్రాస్వప్నశ్చాత్రనిదర్శనం॥ ౮౫.

టీ॰ బ్రహ్మశక్తిః=బ్రహ్మ-పరబ్రహ్మంబుయొక్క, శక్తిః-మాయాశక్తి, మృచ్ఛక్తివత్=మృత్ - మృత్పిండముయొక్క, శక్తివత్- శక్తివలె, అనేకాన్-అనేకములైన, అనృతాన్-మిథ్యావస్తువులను, సృజేత్- సృజించును. యద్వా-అట్లుగానియెడల, అత్ర - ఈయర్థమందు, జీవగతా-జీవునియందుగల, నిద్రా-నిద్రాశక్తియు, అనగానవిద్యయనను‌ట. స్వప్నశ్చ-స్వప్నంబును, నిదర్శనం-దృష్టాంతమగును.

తా॰ ప్ర॰ అయితే, అద్వితీయంబగు బ్రహ్మంబనేకాకారముగానుండెడి జగంబునకు హేతువగునని చెప్పుట యుక్తమెట్లగును? ఉ॰ మృత్పిండముయొక్క శక్తి, ఘటశరావాద్యనేకవికారములను సృష్టించినట్లు బ్రహ్మముయొక్క మాయాశక్తియు నాకాశాద్యనేకాకార మిథ్యాకార్యములను సృష్టించెను. అనగా మాయాసహిత బ్రహ్మమునకు జగద్ధేతుత్వము సంభవింపవచ్చునని యభిప్రాయము. ప్ర॰ అయితే, మృత్పిండశక్తి మృత్పిండమువలె సత్యంబగుటచేత ననేకకార్యములకు హేతువైనను బ్రహ్మశక్తియగుమాయ బ్రహ్మమువలె సత్యత్వంబుగలదిగామిచేత ననేక కార్యంబులకు హేతువుగానేరదు. అందుచేత నీవిషమదృష్టాంతమునుజెప్పుట యుక్తమెటుగును? ఉ॰ సరి॰ మరియొక దృష్టాంతమును జెప్పెదము వినుము. ఈయర్థమందు జీవునియందుగల నిద్రాశక్తియు స్వప్నంబును దృష్టాంతమగునని తెలిసికొనుము.

అవ. దృష్టాంతార్థమును విశదీకరించుచున్నాడు.

శ్లో॥ నిద్రాశక్తిర్యథాజీవేదుర్ఘటస్వప్నకారిణీ।
బ్రహ్మణ్యేషాస్థితామాయాసృష్టిస్థిత్యంతకారిణీ॥ ౮౬.

టీ. జీవే-జీవునియందుగల, నిద్రాశక్తిః-నిద్రారూపమగుశక్తి, యథా-ఏప్రకారముగా, దుర్ఘటస్వప్నకారిణీ = దుర్ఘట - ఘటింప యోగ్యముగాని, స్వప్న - స్వప్నపదార్థములను, కారిణీ-సృష్టించుచున్నదో, తథా - ఆప్రకారముగా, బ్రహ్మణి-బ్రహ్మమందు,స్థితా-ఉన్నట్టి, ఏషా-ఈ,మాయా మాయా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శక్తి, సృష్టిస్థిత్యంతకారిణీ=సృష్టి-జగత్సృష్టినియు, స్థితి- స్థితినియు, అంత-జగత్సంహారంబును, కారిణీ - చేయుచున్నది.

తా. జీవునియందుగల నిద్రాశక్తి, ప్రబోధదశయందు నివర్తించుచుండుటచేత మిథ్యారూపియగును. ఆనిద్రాశక్తి స్వప్నమందు దుర్ఘటములైన రథగజాది పదార్థముల నేప్రకారముగా సృష్టించుచున్నదో యాప్రకారమే బ్రహ్మమందుండెడి మాయాశక్తి మిథ్యాత్వముగలదైయును ఆకాశాద్యనేకపదార్థములను సృష్టించుచున్నదని తెలియవలెను.

అవ. మాయయొక్క దుర్ఘటకారిత్వము నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ స్వప్నేవియద్గతింపశ్యేత్స్వమూర్ధ్నశ్ఛేదనంయథా।
మహూర్తేవత్సరౌఘంచమృతపుత్రాదికంపురం॥ ౮౭.

టీ. స్వప్నే-స్వప్నమందు, యథా-ఏప్రకారముగా, వియద్గతిం- ఆకాశగమనంబును, స్వమూర్ధ్నః=స్వ-తనయొక్క, మూర్ధ్నః-శిరంబుయొక్క, ఛేదనం-ఛేదనంబును, ముహూర్తే- రెండుగడియల పరిమితిగల కాలమందు, వత్సరౌఘంచ= వత్సర-సంవత్సరములయొక్క, ఓఘంచ - సముదాయంబును, మృతపుత్రాదికం= మృత - మృత్యువునుబొందిన, పుత్రాదికం-పుత్రమిత్రాదులంగల, పురం-నగరంబును, పశ్యేత్ - చూచునో.

తా. పురుషుడు స్వప్నమందు ఆకాశగమనంబును, తన శిరంబుయొక్క ఛేదనంబును, ఒకముహూర్తకాలములో ననేకసంవత్సర సమూహంబును, మృతపుత్ర మిత్రాదులంగల నగరంబు నేప్రకారముగాజూచునో యాప్రకారమే మాయాశక్తియు నాకాశాదిపదార్థములను జూపుచున్నదని తెలియవలెను.

అవ. స్వప్నము దుర్ఘటకార్యములం గనబరచుటయందు హేతువును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఇదంయుక్తమిదంనేతివ్యవస్థాతత్రదుర్లభా।
యథాయథేక్ష్యతేయద్యత్తత్తద్యుక్తంతథాతథా॥ ౮౮.

టీ. తత్ర-ఆస్వప్నమందు, ఇదం-ఇది, యుక్తం - ఉచితమనియు, ఇదం-ఇది, నేతి-ఉచితముగాదనునట్టి, వ్యవస్థా - నియతి, దుర్లభా - దుర్లభమగును. అనగా లేదనుట. యద్యత్ - ఏదియేది, యథాయథా - ఏయేప్రకారముగా, ఈక్ష్యతే-చూడబడుచున్నదో, తత్తత్ - అదియది, తథాతథా- ఆయాప్రకారముగా, యుక్తం - ఉచితమైయుండును.

తా. స్వప్నమందిదియుక్తమగుననియు నిదియుక్తముగాదనునట్టి వివేకము లేదు. ఆహేతువుచేత నేయేపదార్థమేయేప్రకారముగా జూడబడుచున్నదో


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాయాపదార్థ మాయాప్రకారముగానే యుచితమైయుండును. మరియు నాస్వప్నమందు ఆకాశగమనస్వ శిరచ్ఛేదనాద్య సంభావితార్థము లనుభవింప బడుచుండుటచేత లేదనిచెప్పరాదు. కనుక, స్వప్నము అఘటన ఘటనాసామర్థ్యవంతమగునని తెలియవలెను.

అవ. ఈచెప్పబడిన యర్థమును కైముతికన్యాయముచేత స్పష్టము జేయుచున్నాడు.

శ్లో॥ ఈదృశోమహిమాదృష్టోనిద్రాశక్తేర్యథాతథా।
మాయాశక్తేరచింత్యోఽయంమహిమేతికిమద్భుతం॥ ౭౯.

టీ. నిద్రాశక్తేః-నిద్రాశక్తికి, ఈదృశః-ఇటువంటి, మహిమా - ప్రభావము: యథా- ఏప్రకారము, దృష్టః- చూడబడుచున్నదో, తథా - ఆప్రకారము, మాయాశక్తేః-మాయాశక్తియొక్క, అయం-ఈ, మహిమా- ప్రభావము, అచింత్యఇతి- చింతింపశక్యముగానిదనుటయందు, కిమద్భుతం - ఆశ్చర్యమేమి. అనగా నాశ్చర్యము లేదనుట.

తా. పరిచ్ఛిన్న స్వభావుడగు జీవునియందుగల నిద్రాశక్తియే, దుర్ఘటానేక కార్యనిర్మాణ సామర్థ్యంబుగలదైయుండగా నపరిచ్ఛిన్న స్వభావుడగు పరమేశ్వరునియందుగల మాయాశక్తి సకలజగన్నిర్మాణాది సామర్థ్యము గలదగునని చెప్పవలసిన పనిలేదు.

అవ. ప్రయత్నాదికములేని పరబ్రహ్మమందుగల మాయాశక్తి, జగద్రచనాహేతువగుటయందు దృష్టాంతము నిప్పుడు జెప్పుచున్నాడు.

శ్లో॥ శయానేపురుషేనిద్రా స్వప్నంబహువిధంసృజేత్।
బ్రహ్మణ్యేవంనిర్వికారేవికారాన్కల్పయత్యసౌ॥ ౮౦.

టీ. శయానే-నిద్రించుచున్న, పురుషే- పురుషునియందుగల, నిద్రా- నిద్రాశక్తి, బహువిధం-నానావిధంబగు, స్వప్నం- స్వప్నవస్తువును, సృజేత్- సృష్టించును. ఏవం-ఈప్రకారముగా, నిర్వికారే-వికారశూన్యమైన, బ్రహ్మణి బ్రహ్మమందుగల, అసౌ-ఈమాయాశక్తి, వికారాన్- కార్యములను, కల్పయతి- కల్పించుచున్నది.

తా. చికీర్షాప్రయత్నాది వికారములనన్నిటినివిడిచి కేవలుడై నిద్రించుచున్నజీవునియందుగల నిద్రాశక్తి నానావిధ రథగజాది స్వప్నపదార్థములను సృష్టించుచున్నది. అటువలెనే నిర్వికారమగు పరబ్రహ్మమందు గల ఈమాయాశక్తియు నానావిధకార్యవర్గమును కల్పించుచున్నదని తెలియవలెను.

అవ. మాయచేత సృష్టింపబడిన పదార్థములను జూపుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ ఖానిలాగ్నిజలోర్వ్యండలోకప్రాణిశిలాదికాః।
వికారాః ప్రాణిధీష్వంతశ్చిచ్ఛాయా ప్రతిబింబితా॥ ౯౧.

టీ. ఖానిలాగ్నిజలోర్వ్యండలోకప్రాణిశిలాదికాః= ఖ-ఆకాశంబును, అనిల-వాయువును, అగ్ని-తేజంబును, జల-జలంబును, ఉర్వీ-భూమియు, అండ-బ్రహ్మాండంబును, లోక-స్వర్గాదిలోకంబులును, ప్రాణి- దేవమనుష్యాదిజంతువర్గంబును, శిలా-పాషాణాదులే, ఆదికాః-మొదలుగాగల, వికారాః- కార్యంబులు, (జాతాః) పుట్టినవగును. ప్రాణిధీషు= ప్రాణి - చేతనవస్తువులయొక్క, ధీషు-బుద్ధులయందు, అంతః-లోపల, చిచ్ఛాయా-చిత్- కూటస్థచైతన్యముయొక్క, ఛాయా-ఛాయ, ప్రతిబింబితా - ప్రతిఫలించుచున్నది. అనగా బ్రతిబింబమేర్పడుచున్నదనుట.

తా. పృథివ్యప్తేజోవాయు రాకాశములనెడి పంచభూతంబులును, బ్రహ్మాండలోకములనెడి భౌతికంబులును, దేవమనుష్యాదిప్రాణివర్గంబును, శిలాదార్వాదిజడవస్తువులును మాయాశక్తివలన బుట్టినవగును. ప్ర. అయితే, సర్వజగంబునకును పాంచభౌతికత్వసామ్యముగలుగుచుండగా గొన్నివస్తువులకుమాత్రమే జడస్వభావంబుగలుగుటకు గారణమేమి? ఉ. ప్రాణులయొక్క శరీరములయందుగల అంతఃకరణములయందు కూటస్థచైతన్యచ్ఛాయ, ప్రతిఫలించుటవలన నవి చేతనములని వ్యవహరింపబడుచున్నవి. శిలాదార్వాదులయందట్టిబుద్ధిప్రతిబింబములులేమిచేత నవి జడములని (అనగా నచేతనములని) వ్యవహరింపబడుచున్నవి.

శ్లో॥ చేతనాచేతనేష్వేషు సచ్చిదానందలక్షణం।
సమానం బ్రహ్మభిద్యేతే నామరూపే పృథక్పృథక్॥ ౯౨.

టీ. ఏషు ఈ, చేతనాచేతనేషు - చరాచరములయందు, సచ్చిదానందలక్షణం- సత్యజ్ఞానానందస్వరూపలక్షణముగల, బ్రహ్మ-బ్రహ్మను, సమానం-అధిష్ఠానత్వముచేత సమానముగానున్నది. నామరూపే - నామరూపంబులురెండును, పృథక్పృథక్ - వేరువేరుగా, భిద్యేతే- భేదమును బొందుచున్నవి.

తా. ప్ర. అయితే, చేతనాచేతనవిభాగను చిదూపబ్రహ్మనుచేత జేయబడినదయగునని చెప్పరాదాయేమి? ఉ. ఈచేతనాచేతనములయందంతటను సచ్చిదానందలక్షణపరబ్రహ్మను సర్వమునకు నుపాదానకారణత్వముచేత సమానముగానున్నది. నామరూపములుమాత్రము వేరువేరుగా భేదింపబడుచున్నవి. అనగా చేతనాచేతనవిభాగము బ్రహ్మనుచేత జేయబడినదిగాద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నియమం జీవాభాసునియొక్కయునికిలేములచేతనే చేయబడినదగుననియుం దెలియవలెను.

శ్లో॥ బ్రహ్మణ్యేతేనామరూపే పటేచిత్రమివస్థితే।
ఉపేక్ష్యనామరూపేద్వే సచ్చిదానందధీర్భవేత్॥ ౯౩.

టీ. ఏతే-ఈ, నామరూపే- నామరూపములురెండును, పటే - వస్త్రమందు, చిత్రమివ- చిత్తరువువలె, బ్రహ్మణి-బ్రహ్మమందు, స్థితే - స్థితినిబొంది యున్నవి. ద్వే-రెండైన,నామరూపే-నామరూపంబులను, ఉపేక్ష్య-ఉపేక్షించి, సచ్చిదానందధీః=సచ్చిదానంద- సచ్చిదానందములయందు, ధీః-బుద్ధి, భవేత్- కలుగవలెను.

తా. ప్ర. అయితే, బ్రహ్మము చేతనాచేతనములయందు సమానముగా నుండుటకు గారణమేమి? ఉ. వస్త్రమందు చిత్తరు ఉన్నట్లు బ్రహ్మమందు నామరూపాత్మకజగంబు కల్పించబడెను. అనగా బ్రహ్మము సర్వకల్పనములకు నాధారవస్తువుగానుండుటవలన సర్వగతమైయున్నదని యభిప్రాయము. ప్ర. అయితే, ఆబ్రహ్మమెట్లుదెలియబడునో జెప్పుము? ఉ. బ్రహ్మమందు గల్పించబడిన నామరూపాత్మక సర్వప్రపంచమును బుద్ధిచేతనుపేక్షించిచూచినయెడల సచ్చిదానందరూపంబగు సర్వాధిష్ఠానపరబ్రహ్మ మెరుగబడుచున్నది.

అవ. ఈచెప్పబడిన యర్థమందు దృష్టాంతమునుజెప్పుచున్నాడు.

శ్లో॥ జలస్థేఽధోముఖేస్వస్యదేహేదృష్టేప్యుపేక్ష్యతం।
తీరస్థఏవదేహేస్వేతాత్పర్యంస్యాద్యథాతథా॥ ౯౪.

టీ. స్వస్య-తనయొక్క, దేహే-శరీరను, జలస్థే-నీటియందు బ్రతిబింబించినదగుచు, అధోముఖే-తలక్రిందుగా, దృష్టేపి-కనబడుచున్నను, తం-ఆజలప్రతిబింబితాధోముఖ శరీరమును, ఉపేక్ష్య - ఉపేక్షించి, తీరస్థే - గట్టునందున్నట్టి, స్వే-తనదగు, దేహఏవ - శరీరమందే, తాత్పర్యం - అభిప్రాయము, యథా-ఏప్రకారము, స్యాత్ - కలుగునో, తథా-ఆప్రకారము గలుగును.

తా. నీటిగట్టునందుండి జలమందుజూచెడి పురుషునకు దనదేహము నీటియందు తలక్రిందుగలదిగా గనబడుచున్నను, బురుషుడాయధోముఖ శరీరమందాసక్తిని విడిపించి గట్టునందుండెడి తద్విపరీతశరీరమందు మమత్వబుద్ధిగలవాడెట్లగునో ఆప్రకారమే బ్రహ్మమందుగల్పించబడిన నామరూపాత్మక జగంబును మిథ్యయని బుద్ధిచేత విడిపించినయెడల సర్వాధిష్ఠానమగు బ్రహ్మముదెలియబడుచున్నదని తెలియవలెను.

అవ. సర్వజనప్రసిద్ధమైన మరియొకదృష్టాంతము నిప్పుడు చెప్పుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ సహస్రశోమనోరాజ్యే వర్తమానేసదైవతత్।
సర్వైరుపేక్ష్యమయద్వదుపేక్షానామరూపయోః॥ ౯౫.

టీ. మనోరాజ్యే - మనంబునందనుభవింపబడెడి సామ్రాజ్యము, సహస్రశః-వేలకొలది, వర్తమానేపి-ఉన్నప్పటికిని, తత్-ఆమనోరాజ్యము, సదైవ-ఎల్లప్పుడును, సర్వైః-సర్వజనులచేతను, యద్వత్-ఏప్రకారము, ఉపేక్ష్యతే-ఉపేక్షింపబడుచున్నదో, అనగావిడువబడుచున్నదోయనుట. (తద్వత్) ఆప్రకారము, నామరూపయోః-నామరూపములయందు, ఉపేక్షా-ఉపేక్ష,(కర్తవ్యా) చేయదగినదగును.

తా. మనోరథమాత్రముచేత గల్పించబడిన సామ్రాజ్యాది ఫలములయందు సర్వజనులచేత నేప్రకారముగా నుపేక్ష జేయబడుచున్నదో ఆప్రకారమే బ్రహ్మమందు గల్పింపబడిన నామరూపాత్మక చేతనాచేతనరూప సర్వజగంబునందు నుపేక్ష జేయదగినదగునని తెలియవలెను.

అవ. ప్రపంచము బహువిధముగానున్నదనుటయందు దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ క్షణేక్షణేమనోరాజ్యంభవత్యేవాన్యథాన్యథా।
గతంగతంపునర్నాస్తివ్యవహారోబహిస్తథా॥ ౯౬.

టీ. క్షణేక్షణే - ప్రతిక్షణమందును, మనోరాజ్యం- మనోరథకల్పితైశ్వర్యము, అన్యథాన్యథా- వేరువేరువిధముగా, భవత్యేవ- అగుచున్నదేయగును. గతం - గడచిపోయినది, గతం - గడచిపోయినదే యగును. పునః - మరల, నాస్తి-లేదు. బహిః-వెలుపటి, వ్యవహారః-వ్యవహారంబును, తథా - ఆప్రకారమేయగును.

తా. మనోరథైశ్వర్యములోని విషయములు ప్రతిక్షణమందును చిత్రవిచిత్రముగానుండి గడిచినవిషయము మరల రానేరదు. ఇకదార్ష్టాంతికమును జెప్పెదము వినుము. జాగరితావస్థయందును ఆత్మవ్యతిరిక్తపదార్థంబులునత్యంతవిచిత్రముగానుండి గడచిపోయినవి మరల వచ్చుటలేదు.

అవ. ఈయర్థమునే వివరించి చెప్పుచున్నాడు.

శ్లో॥ నబాల్యంయౌవనేలబ్ధం యౌవనంస్థావిరేతథా।
మృతఃపితాపునర్నాస్తినాయాత్యేవగతందినం॥ ౯౭.

టీ. బాల్యం-బాల్యావస్థ, యౌవనే-యౌవనదశయందు, నలబ్ధం- పొందబడదు. యౌవనం-యౌవనావస్థ, స్థావిరే-ముదిమియందును, తథా-ఆప్రకారమేయగును. అనగా బొందబడదనుట. మృతః మృతిబొందిన, పితా-తండ్రి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పునః-మరల, నాస్తి-లేదు. గతం - గడిచిపోయిన, దినం - దినము, నాయా త్యేవ- రానేరాదు.

తా. మరియు బాల్యావస్థ, యౌవనదశయందు బొందబడదు. యౌవనావస్థ వార్ధకదశయందు (అనగా ముసలితనమందు) బొందబడదు. చచ్చిపోయినతండ్రి మరలవచ్చుటలేదు. గడిచిపోయినదినము మరల రానేరాదు.

అవ. ద్వైతమునకు ప్రతిపాదింపబడిన క్షణికత్వమును ( మిథ్యాత్వమును ) ఉపసంహారము జేయుచున్నాడు.

శ్లో॥ మనోరాజ్యాద్విశేషఃకః క్షణధ్వంసినిలౌకికే।
అతోస్మిన్ భాసమానేపితత్సత్యత్వధియంత్యజేత్॥ ౯౮.

టీ. క్షణధ్వంసిని=క్షణ క్షణకాలములో, ధ్వంసిని- నశించెడి, లౌకికే- లోకసిద్ధవిషయమునందు, మనోరాజ్యాత్- మనోరథసంకల్పితవిషయముకంటె, విశేషః-ఆధిక్యము, కః - ఏమిగలదు. అనగా లేదనుట. అతః - అందువలన, అస్మిన్ - ఈలోకసిద్ధవస్తువు, భాసమానేపి - ప్రకాశించుచున్నను, తత్సత్యత్వధియం=తత్ - ఆవస్తువునందు, సత్యత్వధియం - సత్యత్వబుద్ధిని, త్యజేత్- విడువవలెను.

తా. ఈలోకమునందు గృహక్షేత్రపుత్ర కళత్రాది వస్తుజాతంబు క్షణమాత్రపుకాలమువంటికాలములో నశించిపోవుచుండగా మనమందరను ప్రత్యక్షముగా జూచుచున్నాము. ప్ర. అయితే, లోకసిద్ధవస్తువునకు క్షణికత్వమును సాధించుటచేత ప్రయోజనమేమి? ఉ. అట్లు క్షణికత్వమును సాధించుటచేత నీలోకసిద్ధవస్తువు మనోరాజ్యముకంటె నాధిక్యముగలదిగాదు. కనుక గృహక్షేత్రపుత్ర కళత్రాది వస్తుజాతము ప్రత్యక్షముగా దోచుచున్నను వానిని సత్యముగా దలచరాదనిదోచుటయే ప్రయోజనముగును.

శ్లో॥ ఉపేక్షితేలౌకికేధీర్నిర్విఘ్నాబ్రహ్మచింతనే।
నటవత్కృతిమాస్థాయనిర్వహత్యేవలౌకికం॥ ౯౯.

టీ. లౌకికే లోకసిద్ధవస్తువు, ఉపేక్షితేసతి - ఉపేక్షింపబడుచుండగా, బ్రహ్మచింతనే - బ్రహ్మవిచారమునందు, ధీః-బుద్ధి, నిర్విఘ్నా-నిరంకుశత్వము గలది, స్యాత్-అగును. నటవత్ - నటునివలె, కృతిం - సంకల్పమును, ఆస్థాయ- పొంది, లౌకికం - లోకవ్యవహారమును, నిర్వహత్యేవ-నిర్వహించుచున్నవాడేయగును.

తా. ప్ర. అయితే, లౌకికవస్తువు నుపేక్షజేయుచుండగాలాభమేమి?ఉ. లోకవస్తువునుపేక్షజేయుచుండగా బ్రహ్మానుసంధానమునందు బుద్ధి నిరంకుశ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగా బ్రవర్తించును. అనగా బ్రహ్మమునందు బుద్ధిస్థిరముగా నిల్పుటయే లాభమగునని తెలియవలెను. ప్ర. అయితే, లోకవస్తువును స్మరించక బ్రహ్మమందు స్థిరబుద్ధిగలజ్ఞానికిదేహపోషణాది వ్యవహారమెట్లు సిద్ధించును? ఉ. నటుడు ద్రవ్యమందాసక్తచిత్తుడైయుండియు బూర్వాభ్యాసమువలన దనచేత బరిగ్రహింపబడిన భూమికాచరిత్రమును బ్రమాదములేకుండునట్లెట్లు అభినయించునో, ఆప్రకారమే బ్రహ్మజ్ఞానియు బూర్వాభ్యాసవృత్తినవలంబించి లోకవ్యవహారమును నిర్వహించగలడు.

అవ. జ్ఞానిబుద్ధి,వ్యవహారవంతమైనను ఆబుద్ధిచేత సాధింపబడెడిస్వరూపంబు నిర్వికారమగుననెడి యర్థమును దృష్టాంతసహితముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రవహత్యపినీరేధః స్థిరాపౌఢశిలాయథా।
నామరూపాన్యథాత్వేపికూటస్థం బ్రహ్మనాన్యథా॥ ౧౦౦.

టీ. నీరే-జలము, ప్రవహత్యపి-పైనప్రవహించుచున్నను, అధః- క్రిందనున్న, పౌఢశిలా-గొప్పబండ, యథా - ఏప్రకారము, స్థిరా-నిశ్చలమైయుండునో, తథా ఆప్రకారము, నామరూపాన్యథాత్వేపి-నామరూప - నామరూపములకు, అన్యథాత్వేపి - మరియొకవిధము గలిగియున్నను, కూటస్థం- నిర్వికారమైన, బ్రహ్మ-బ్రహ్మము, అన్యథా - మరియొకవిధముగలది, న-కాదు.

తా. ప్ర. అయితే, జ్ఞానికివ్యవహారము నంగీకరించినయెడల వికారిత్వముగలుగదాయేమి? ఉ. పైభాగమందు జలంబల్లోలకల్లోలముగా బ్రవహించుచున్నను దానిక్రిందనున్న గొప్పనల్లనిపాషాణమేప్రకారను నిశ్చలముగానుండునో, ఆప్రకారమే నామరూపాదులచేత బుద్ధివికారవంతముగానున్నను తదాధారంబగు బ్రత్యగాత్మ, నిర్వికారముగానే యుండును. అనగా నూర్ధ్వభాగమందు జలముబ్రవహించుచున్నను క్రిందనుండెడి నల్లని పెద్దరాయి యేప్రకారముగా చలించదో ఆప్రకారమే బుద్ధివికారముగలదైనను జ్ఞానివికారముగలవాడు గాడయని యభిప్రాయము.

శ్లో॥ నిశ్ఛిద్రేదర్పణేభాతివస్తుగర్భంబృహద్వియత్।
సచ్ఛిద్ధనేతథానానాజగద్గర్భమిదంవియత్॥ ౧౦౧.

టీ. నిశ్ఛిద్రే-సందులేని, దర్పణే-అద్దమందు, వస్తుగర్భం=వస్తు-అనేకవిధవస్తువర్గమును, గర్భం-మధ్యమందుగలదియు, బృహత్ - విపులమైనదియునగు, వియత్-ఆకాశము, యథా ఏప్రకారము, భాతి ప్రకాశించుచున్నదో, తథా-ఆప్రకారము, నానాజగద్గర్భం= నానా - నానావిధముగల, జగత్ - ప్రపంచమును, గర్భం-మధ్యమందుగల, ఇదం-ఈ, వియత్-ఆకాశము, సచ్ఛిద్ధనే సత్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్ఞానఘనస్వరూపబ్రహ్మమందు, భాతి - ప్రకాశించుచున్నది.

తా. ప్ర. అయితే, అఖండమగు బ్రహ్మమందు దద్విపరీతలక్షణజగం బెట్లుదోచునో చెప్పుము? ఉ. సందులేని యద్దమందు నానావిధ వస్తువర్గమును మధ్యమందుగల విశాలమగు ఆకాశంబే ప్రకారముగా దోచుచుండునో ఆప్రకారమే నానావిధప్రపంచమును మధ్యమందు గల యాకాశము సత్యజ్ఞానానందస్వరూపబ్రహ్మమందు దోచుచున్నది. అనగా రంధ్రములేని యద్దమందు సావకాశవస్తువేప్రకారముగా గనబడుచుండునో యాప్రకారమే ఈజగంబు బ్రహ్మమందు దోచుచున్నదని యభిప్రాయము.

అవ. సచ్చిదానందపూర్వకముగా జగత్ప్రతీతి గలుగుచున్నదనెడియర్థమును దృష్టాంతసహితముగా నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ అదృష్ట్వాదర్పణం నైవతదంతస్థేక్షణంతథా।
అమత్వాసచ్చిదానందం నామరూపమతిఃకుతః॥ ౧౦౨.

టీ. దర్పణం-అద్దమును, అదృష్ట్వా-చూడక, తదంతస్థేక్షణం= తత్-ఆయద్దముయొక్క, అంతస్థ-లోపలప్రతిబింబరూపముగా గనబడుచుండెడి వస్తువులయొక్క, ఈక్షణం-దర్శనము, నైవ- కలుగనేకలుగదు. తథా - ఆప్రకారము, సచ్చిదానందం- సత్యజ్ఞానానందరూపమును, అమత్వా-తెలియక, నామరూపమతిః=నామరూప- నామరూపములయొక్క, మతిః-జ్ఞానము, కుతః-ఎక్కడిది. అనగా లేదనుట.

తా. ప్ర. అయితే, అదృశ్యమగు బ్రహ్మమందు జగత్ప్రతీతి యెట్లు గలుగును? ఉ. అద్దము ముందుగా గనబడుచుండుటచే దానిలో ప్రతిబించితవస్తువులు గనబడుచున్నదిగాని, అద్దముగనబడనియెడల దానిలో ప్రతిబించితవస్తువులును గనబడజాలవు. ఆప్రకారమే మొదట సచ్చిదానందములు దెలియబడుచుండుటచేత నాసచ్చిదానందములయందు గల్పించబడిన నామరూపాత్మకములగు ఘటాదివస్తువులు దెలియబడుచున్నవిగాని, సచ్చిదానందములు దెలియబడనియెడల వానియందు గల్పించబడిన నామరూపాత్మక ఘటాదివస్తువులు దెలియబడనేరవు. అనగా మృత్తికయందు గల్పించబడిన ఘటమునుజూచెడి విషయమందు మృత్తికాదర్శనపూర్వకముగా ఘటదర్శనమగుచున్నట్లు సచ్చిదానంద స్ఫురణపూర్వకముగా జగత్ప్రతీతి గలుగుచున్నదని యభిప్రాయము.

శ్లో॥ ప్రథమంసచ్చిదానందే భాసమానేఽథతావతా।
బుద్ధింనియమ్యనైవోర్ధ్వం ధారయేన్నామరూపయోః॥ ౧౦౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ప్రథమం- మొదటను, సచ్చిదానందే - సచ్చిదానంద స్వరూపబ్రహ్మము. భాసమానేసతి- స్ఫురించుచుండగా, అథ - పిమ్మట, తావతా-అంతమాత్రముతో, బుద్ధిం-బుద్ధివృత్తిని, నియమ్య-నిరోధించి, ఊర్ధ్వం-పైన, అనగా నటుపిమ్మటననుట. నామరూపయోః-నామరూపములయందు, నైవధారయేత్-ధరించనేరాదు. అనగా నామరూపములయందు బుద్ధినుంచరాదనుట.

తా. ప్ర. అయితే, నామరూపంబులు రెండును స్ఫురించుచుండుటవలన నిర్విషయ బ్రహ్మస్ఫురణం బెట్లుగలుగును? ఉ. అజ్ఞానోపాయమును జెప్పెదనినుము. మొదట సచ్చిదానంద స్వరూపబ్రహ్మము స్ఫురించుచుండగా నాబ్రహ్మస్వరూపమాత్రమందు బుద్ధినుంచి, పిమ్మట నామరూపములయందు బుద్ధిని బొత్తుగానుంచరాదు. అనగా సచ్చిదానంద స్వరూపబ్రహ్మమందు గల్పింపబడిన నామరూపాత్మక ప్రపంచవిషయమై సచ్చిదానందమాత్రమును బుద్ధిచేత గ్రహించి నామరూపములయొక్క బుద్ధినిధరించకయున్నయెడల నిర్విషయమగు సచ్చిదానందస్వరూపబ్రహ్మము మాత్రము బుద్ధికి స్ఫురించుననియు నిదియేనిర్విషయబ్రహ్మసాక్షాత్కారోపాయ మగుననియు నభిప్రాయము.

అవ. ఫలితార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఏవంచనిర్జగద్బ్రహ్మ సచ్చిదానందలక్షణం।
అద్వైతానంద ఏతస్మిన్విశ్రామ్యంతుజనాఃస్థిరం॥ ౧౨౪.

టీ. ఏవంచ-ఈప్రకారముగా, సచ్చిదానందలక్షణం=సత్-సత్యంబును, చిత్-జ్ఞానంబును, ఆనంద - ఆనందంబును, లక్షణం - స్వరూపలక్షణము గల, బ్రహ్మ-బ్రహ్మము, నిర్జగత్-నిష్ప్రపంచముగలదగును. ఏతస్మిన్-ఈ, అద్వైతానందే-అద్వైతానందమందు. జనాః-ముముక్షువులు, స్థిరం - నిశ్చలముగా, విశ్రామ్యంతు - విశ్రమింతురుగాక.

తా. ఈపూర్వోక్తోపాయ ప్రకార మనుసంధానను జేయుచుండగా నిష్ప్రపంచమగు బ్రహ్మము సచ్చిదానందస్వరూపలక్షణముగలదగును. ఈయద్వైతానందమందు ముముక్షువులు నిశ్చలముగా విశ్రమింతురుగాక.

అవ. ఇప్పుడధ్యాయార్థము నుపసంహరించుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మానందాభిధేగ్రంథే తృతీయోఽధ్యాయఈరితః।
అద్వైతానందఏవస్యా జ్జగన్మిథ్యాత్వచింతయా॥ ౧౨౫.

టీ. బ్రహ్మానందాభిధే=బ్రహ్మానంద- బ్రహ్మానందమనెడి, అభిధే - పేరుగల, గ్రంథే-గ్రంథమందు, తృతీయః-మూడవదగు, అధ్యాయః- పరిచ్ఛేదము, ఈరితః-చెప్పబడినది, జగన్మిథ్యాత్వచింతయా=జగత్ - ప్రపంచముయొక్క,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మిథ్యాత్వ-మిథ్యతారూపమగు, చింతయా - విచారముచేత, అద్వైతానంద ఏవ-నిష్ప్రపంచపరిపూర్ణబ్రహ్మానందమే, స్యాత్- చిత్తవృత్తియందు ప్రత్యక్షముగా స్ఫురించును.

తా. బ్రహ్మానందమనెడిపేరుగల యధ్యాయపంచకగ్రంథమందు మూడవయధ్యాయము చెప్పబడెను. ప్రపంచముయొక్క మిథ్యాత్వానుసంధానలక్షణవిచారముచేత నిష్ప్రపంచపరిపూర్ణబ్రహ్మానందమే చిత్తవృత్తియందుప్రత్యక్షముగా స్ఫురించుచుండును.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమద్విద్యారణ్య
ముని విరచితే బ్రహ్మానందే అద్వైతానందనామక
త్రయోదశ ప్రకరణం సమాప్తం.

గద్య. ఇది శ్రీపరమేశ్వరగురు చరణ వరప్రసాదలబ్ధ బ్రహ్మవిద్యా
విరాజిత కాశ్యపసగోత్ర పవిత్ర మంత్రివంశ పయఃపారావార
పరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్య పుత్ర లక్ష్మీనారాయణా
మాత్య ప్రణీతంబైన ఆంధ్రటీకాతాత్పర్య సహిత
శ్రీవేదాంతపంచదశియందు బ్రహ్మానందనామక
గ్రంథస్థితాద్వైతానందమనెడి
త్రయోదశ ప్రకరణము
సంపూర్ణము.

—*—

శ్లో॥ అద్వైతానందటీకేయ మద్వయబ్రహ్మబోధినీ।
నారాయణాఖ్యవిదుషా సర్వేశ్వరసమర్పితా॥

ఓం తత్సత్ శ్రీపరమేశ్వరార్పణమస్తు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుభమస్తు.

శ్రీపరమేశ్వర సద్గురుపరబ్రహ్మణేనమః.

# విద్యానంద ప్రారంభము.



అవ. ఇప్పుడు, పూర్వోక్తగ్రంథమునకును ఇక జెప్పబోయెడి గ్రంథమునకును సంబంధమును జెప్పుచున్నాడు.

శ్లో॥ యోగేనాత్మవివేకేన ద్వైతమిథ్యాత్వచింతయా।
బ్రహ్మానందం పశ్యతోథ విద్యానందో నిరూప్యతే॥ ౧.

టీ. యోగేన-యోగానందగ్రంథార్థాను సంధానముచేతను, ఆత్మవివేకేన-ఆత్మానందగ్రంథోక్తాత్మవివేచనాను సంధానముచేతను, ద్వైతమిథ్యాత్వచింతయా-ద్వైతమిథ్యాత్వ - అద్వైతానందగ్రంథార్థముయొక్క, చింతయా-అనుసంధానముచేతను, బ్రహ్మానందం = బ్రహ్మ - బ్రహ్మముయొక్క, ఆనందం- స్వరూపభూతమగు ఆనందమును, పశ్యతః- చూచుచుండెడివానికి, అనగా ననుభవించెడి వానికనుట. అథ- అనంతరము, విద్యానందః - విద్యానందము, నిరూప్యతే - నిరూపింపబడుచున్నది.

తా. యోగానందమందు జెప్పబడినప్రకారము యోగానుసంధానముచేతను, ఆత్మానందమందు జెప్పబడినప్రకారము ఆత్మవివేకాను సంధానముచేతను, అద్వైతానందమందు జెప్పబడినప్రకారము ద్వైతమిథ్యాత్వానుసంధానముచేతను, బ్రహ్మానందము ననుభవించెడివానికి పిమ్మట విద్యానందమిప్పుడు నిరూపింపబడుచున్నది.

శ్లో॥ విషయానందవద్విద్యానందో ధీవృత్తిరూపకః।
దుఃఖాభావాదిరూపేణ ప్రోక్త ఏష చతుర్విధః॥ ౨.

టీ. విద్యానందః - విద్యానందము, విషయానందవత్- విషయానందమువలె, ధీవృత్తిరూపకః=ధీవృత్తి - బుద్ధివృత్తియే, రూపకః- స్వరూపముగాగలదగును. ఏషః - ఈవిద్యానందము, దుఃఖాభావాదిరూపేణ= దుఃఖ-దుఃఖముయొక్క, అభావ-లేమియే, ఆది - ఆదిగాగల, రూపేణ - రూపముచేత, చతుర్విధః - నాలుగువిధములుగా, ప్రోక్తః - చెప్పబడినది.

తా. ప్ర. అయితే, విద్యానందస్వరూపమేమి? ఉ. విద్యానందంబువిష

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యానందమువలె బుద్ధివృత్తిని స్వరూపముగా గలదగును. ఆవిద్యానందమునకు అవాంతరభేదమును జెప్పెదవినుము. ఈవిద్యానందము, దుఃఖాభావాది రూపముచేత చతుర్విధముగా జెప్పంబడినది.

శ్లో॥ దుఃఖాభావశ్చ కామాప్తిః కృతకృత్యోహమిత్యసౌ।
ప్రాప్తప్రాప్యోహమిత్యేవం చాతుర్విధ్యముదాహృతం॥ ౩.

టీ. అహం-నేను, దుఃఖాభావశ్చ=దుఃఖ- దుఃఖముయొక్క, అభావశ్చ- లేమినిగలవాడననియు, కామాప్తిశ్చ= కామ-సర్వకామములయొక్క, ఆప్తిశ్చ- ప్రాప్తింగలవాడననియు, కృతకృత్యఇతి = కృత-చేయబడిన, కృత్యఇతి-కార్యవర్గమును గలవాడననియు, అహం-నేను, ప్రాప్తప్రాప్యశ్చేతి= ప్రాప్త - పొందబడిన, ప్రాప్యశ్చేతి - ఫలవర్గంబుగలవాడనని, ఏవం- ఈప్రకారముగా, అసౌ- ఈవిద్యానందము, చాతుర్విధ్యం - నాలుగువిధములం గలదిగా, ఉదాహృతం- జెప్పంబడినది.

తా. ప్ర. ఆచాతుర్విధ్య మెద్దిగనూచెప్పుము? ఉ. ౧. నేను దుఃఖములేనివాడననియు, ౨. సర్వకామప్రాప్తుండననియు, ౩. నేను కృతకృత్యుండననియు, ౪. నేను ప్రాప్తప్రాప్యుండనని ఈప్రకారము నీవిద్యానందము చతుర్విధములం గలదిగా శ్రుతిచేతం జెప్పంబడుచు జ్ఞానిచేత ననుభవింపబడుచున్నది.

శ్లో॥ ఐహికంచాముష్మికంచేత్యేవందుఃఖంద్విధేరితం।
నివృత్తిమైహికస్యాహబృహదారణ్యకంవచః॥ ౪.

టీ. దుఃఖం-దుఃఖము, ఐహికంచ-ఇహలోకమందు గలుగునట్టిదనియు, ఆముష్మికంచేతి- పరలోకమందు గలుగునట్టిదనియు, ఏవం - ఈప్రకారను, ద్విధా-రెండువిధములంగలదిగా, ఈరితం - చెప్పబడినది. బృహదారణ్యకం- బృహదారణ్యోపనిషత్సంబంధమగు, వచః- వాక్యము, ఐహికస్య - ఇహలోకజన్యదుఃఖముయొక్క, నివృత్తిం-లేమిని, ఆహ - జ్ఞానికి జెప్పుచున్నది.

తా. ఓపూర్వవాదీ, పూర్వోక్త చతుర్విధములం గల విద్యానందములో మొదటివిధమగు, దుఃఖాభావమును (అనగా జ్ఞానికిదుఃఖములేనివిధమును) దెలిపిచూపుటకొరకు నివర్తింపదగిన దుఃఖమును విభజించి చెప్పెదనువినుము. దుఃఖము, ౧. ఐహికమనియు, ౨. ఆముష్మికమనియు, ఈప్రకారము ద్వివిధముగా జెప్పంబడుచున్నది. ఆరెంటిలో నైహికదుఃఖము జ్ఞానికి నివర్తింపబడుచున్నదని బృహదారణ్యోపనిషద్వాక్యము జెప్పుచున్నది.

అవ. ఆబృహదారణ్యశ్రుతివాక్యము నిప్పుడు పఠించుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ ఆత్మానంచేద్విజానీయా దయమస్మీతిపూరుషః।
కిమిచ్ఛన్కస్యకామాయ శరీరమనుసంజ్వరేత్॥ ౫.

టీ. పూరుషః-పురుషుడు, అయం-ఈస్వప్రభానందరూప పరమాత్మ, అస్మీతి-నేనైతినని, ఆత్మానం- తనను, విజానీయాచ్చేత్ - ఎరిగినయెడల, కిమిచ్ఛన్-ఏఫలమునిచ్ఛయించినవాడగుచు, కస్య - ఏభోక్తయొక్క, కామాయ-ప్రీతికొరకు, శరీరం - దేహము, (తప్యమానంసత్) తపించుచుండగా, అనుసంజ్వరేత్ - తపించునోయని యాక్షేపార్థకము. అనగా బరమార్థమందు భోగ్యరూపమగు మాయాకల్పితమైన ద్వైతముదోపమిచేత దపించడన్నట.

తా. పురుషుడు స్వయంప్రభానంద రూపుడగు ఈకూటస్థుడ నేనైతినని, తానైన పరమాత్మ నెరిగినయెడల నవ్వడేమిఫలమునిచ్ఛయించుచున్నవాడగుచు, ఏభోక్తయొక్క ప్రీతికొరకు దేహము తపించుచుండగా నట్టిదేహము ననుసరించి తపించునోయని యాక్షేపార్థకము. అనగా నాపరమార్థదశయందు భోక్తృభోగ్యరూపమగు మాయాకల్పితమైన ద్వైతము దోపమిచేత దపించడని ఈశ్రుతియొక్క యభిప్రాయమగును. కనుక ఈశ్రుతిప్రకారమప రోక్షజ్ఞానికి ఐహికదుఃఖము లేదని తెలియవలెను.

అవ. ఆత్మయందు దుఃఖసంబంధమును జూపుటకొరకాత్మభేదమును జెప్పుచున్నాడు.

శ్లో॥ జీవాత్మాపరమాత్మాచేత్యాత్మాద్వివిధఈరితః।
చిత్తాదాత్మ్యాత్త్రిభిర్దేహైర్జీవస్సన్భోక్తృతాంవ్రజేత్॥ ౬.

టీ. ఆత్మా- ఆత్మవస్తువు, జీవాత్మా - జీవాత్మయనియు, పరమాత్మా చేతి-పరమాత్మయనియు, ద్వివిధః-రెండువిధములుగా, ఈరితః-చెప్పబడెను. త్రిభిః-మూడైన, దేహైః-శరీరములతోటి, చిత్తాదాత్మ్యాత్=చిత్- చైతన్యమునకు, తాదాత్మ్యాత్- ఏకత్వభ్రాంతిగలుగుటవలన, జీవస్సన్ - జీవుడగుచు, భోక్తృతాం - భోక్తృత్వమును, వ్రజేత్ - పొందును.

తా. ఆత్మవస్తువు, ౧. జీవాత్మయనియు, ౨. పరమాత్మయనియు నిట్లు రెండువిధములుగా జెప్పబడుచున్నది. ప్ర. అయితే, ఆత్మకు జీవత్వము గలుగుటకు నిమిత్తమేమి? ఉ. ఆత్మచైతన్యమునకు స్థూల సూక్ష్మ కారణములనెడి మూడుశరీరములతోటి (అవినేననెడి) ఏకత్వభ్రాంతిగలుగుచుండగా (చిత్తునకు) అనగా చైతన్యమునకు భోక్తృత్వము గలుగుచున్నది. ఆభోక్తయే జీవుడని చెప్పబడుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ పరాత్మాసచ్చిదానందస్తాదాత్మ్యంనామరూపయోః।
గత్వాభోగ్యత్వమాపన్నస్తద్వివేకేతునోభయం॥ ౭.

టీ. పరాత్మా-పరమాత్మ, సచ్చిదానందః - సత్యజ్ఞానానందస్వరూపుడగును. నామరూపయోః - నామరూపములయొక్క, తాదాత్మ్యం - ఏకత్వమును, గత్వా-పొంది, అనగా బరమాత్మ నామరూప కల్పనమున కధిష్ఠానముగానుండుట చేత నానా మరూపాత్మకజగంబుతో నేకత్వమును బొందియనుట. భోగ్యత్వం- భోగ్యరూపమును, ఆపన్నః- పొందినవాడగును. తద్వివేకేతు= తత్- ఆశరీరత్రయజగంబులవలన, వివేకేసతితు - భేదము దెలియబడుచుండగా, ఉభయం- భోక్తృభోగ్యరూపద్వయమును, న - లేదు.

తా. ప్ర. అయితే, పరమాత్మకు స్వరూపమేమి? ఉ. ఆపరమాత్మ, సచ్చిదానందస్వరూపుడగును. ప్ర. అయితే, ఆపరమాత్మకు భోగ్యరూపత్వప్రాప్తియెట్లుగలిగెనో తత్ప్రకారమును జెప్పుము? ఉ. ఆపరమాత్మ, నామరూపాత్మకజగత్కల్పనమునకు అధిష్ఠానముగానుండుటచేత నానామరూపాత్మకజగంబులతోటి యేకత్వమును బొందుచున్నాడు. ప్ర. అయితే, వాస్తవమందు భోక్తృత్వభోగ్యత్వములులేమికి గారణమేమి? ఉ. స్థూలసూక్ష్మ కారణముల నెడి శరీరత్రయమువలనను, నామరూపాత్మకజగంబువలనను భేదముదెలియబడుచుండగా భోక్తృభోగ్యములు రెండునులేవు. అనగా జీవాత్మ, శరీరత్రయమునకంటె నన్యమగునని నెడి భేదజ్ఞానము గలుగుచుండగా జీవునకు భోక్తృత్వము నివర్తించుననియు, మరియు, సచ్చిదానందస్వరూప పరమాత్మ, నామరూపాత్మక జగంబుకంటె నన్యమగునని నెడి భేదజ్ఞానము గలుగుచుండగా నాపరమాత్మకు భోగ్యరూపత్వము నివర్తించుననియుం దెలియవలెను.

అవ. ఈచెప్పబడిన యర్థమును వివరించి చెప్పుచున్నాడు.

శ్లో॥ భోగ్యమిచ్ఛన్భోక్తురర్థేశరీరమనుసంజ్వరేత్।
జ్వరాస్త్రిషుశరీరేషు స్థితానత్వాత్మనోజ్వరాః॥ ౮.

టీ. (మనుష్యః) నరుడు, భోక్తుః-జీవుడగుతనయొక్క, అర్థే-ప్రయోజనవిషయమై, భోగ్యం-భోగ్యవస్తువును, ఇచ్ఛన్-ఇచ్ఛయించుచు, శరీరమను-దేహమునను సరించి, సంజ్వరేత్ - దుఃఖించును. త్రిషు - మూడైన, శరీరేషు-దేహములయందు, జ్వరాః- జ్వరములు, అనగా దుఃఖములనుట. స్థితాః-కలవు. ఆత్మనస్తు-ఆత్మకో, జ్వరాః-దుఃఖములు, న - లేవు.

తా. మనుష్యుడు భోక్తయగు తనయొక్క ప్రయోజనముకొరకు భోగ్యవస్తువు నిచ్ఛయించుచున్నవాడగుచు శరీరమునను సరించి దుఃఖించుచున్నా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డు. స్థూలసూక్ష్మకారణములనెడి మూడుశరీరములయందును జ్వరములు గలవు. ఆత్మకు ఏజ్వరంబులులేవు.

శ్లో॥ వ్యాధయోధాతువైషమ్యేస్థూలదేహేస్థితా జ్వరాః।
కామక్రోధాదయస్సూక్ష్మేద్వయోర్బీజంతుకారణే॥ ౯.

టీ. ధాతువైషమ్యేసతి = ధాతు- ధాతువులకు, వైషమ్యేసతి-భేదముగలుగుచుండగా, స్థూలదేహే-స్థూలశరీరమందు, స్థితాః-ఉండెడి, వ్యాధయః-రోగములు, జ్వరాః-జ్వరములగును. సూక్ష్మే-లింగశరీరమందు, కామక్రోధాదయః- కామ-కామంబును, క్రోధ-క్రోధంబును, ఆదయః-ఆదిగాగలవి, జ్వరాః- జ్వరములగును. ద్వయోః- స్థూలసూక్ష్మశరీరములకు, బీజంతు - హేతువే, కారణే-కారణశరీరమందు, (జ్వరః) జ్వరంబగును.

తా. ప్ర. అయితే, ఏశరీరమందు ఏజ్వరంబు గలదో చెప్పుము? ఉ. ధాతువైషమ్యము గలుగుచుండగా స్థూలశరీరమందుండెడి వ్యాధులు జ్వరంబులగును. మరియు, ౧. కామము, ౨. క్రోధను, ౩. లోభము, ౪. మోహము, ౫. మదను, ౬. మాత్సర్యము, ౭. ఈర్ష్య, ౮. దంభము, ౯. దర్పము, ౧౦. అసూయ, ౧౧. ఇచ్ఛాదులు సూక్ష్మశరీరమందుగల జ్వరంబులగును. ఈస్థూలసూక్ష్మశరీరంబులు రెండునుం గలుగుటకు బీజము కారణశరీరమగుటచేత నట్టి బీజమే కారణశరీరమందుగల జ్వరంబగునని తెలియవలెను.

అవ. ఇప్పుడు పూర్వముదాహరింపబడిన శ్రుతితాత్పర్యమును జెప్పెడి నెపముచేత బూర్వోక్తార్థమునే విశదము జేయుచున్నాడు.

శ్లో॥ అద్వైతానందమార్గేణపరాత్మనివివేచితే।
అపశ్యన్వాస్తవంభోగ్యంకిన్నామేచ్ఛేత్పరాత్మవిత్॥ ౧౦.

టీ. అద్వైతానందమార్గేణ=అద్వైతానంద- అద్వైతానందగ్రంథమందు జెప్పబడిన, మార్గేణ-మార్గముచేత, పరాత్మని - పరమాత్మ, వివేచితేసతి-విభజించియెరుగబడుచుండగా, పరాత్మవిత్=పరాత్మ - పరమాత్మను, విత్-తెలుసుకొనినవాడు, వాస్తవం - వాస్తవమగు, భోగ్యం - భోగ్యమును, అపశ్యన్-చూడనివాడగుచు, కిన్నామ-దేనిని, ఇచ్ఛేత్ - ఇచ్ఛయించును. అనగా దేనినిచ్ఛయించడనుట.

తా. తృతీయాధ్యాయమగు అద్వైతానందగ్రంథ ప్రకారముగా మాయాకార్యములగు నామరూపములకంటె సచ్చిదానంద స్వరూపుడగు పరమాత్మ, భేదముచేత నెరుగబడుచుండగా బురుషుడుసర్వప్రపంచమునుమిథ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యని తెలిసినవాడగుచు ఏభోగ్యము నిచ్ఛయించునని యాక్షేపార్థకము. అనగా భోగ్యము నిచ్ఛయించడని యభిప్రాయము.

అవ. మరియు నాత్మానందమందు చెప్పబడిన ప్రకారముగా జీవాత్మ స్వరూపంబగు అసంగకూటస్థ చైతన్యము నిశ్చయింపబడుచుండగా కామించెడివాడు లేమిచేత జ్ఞానికి జ్వరాదిసంబంధము లేదని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆత్మానందోక్తరీత్యాస్మిన్ జీవాత్మన్యవధారితే।
భోక్తానైవాస్తి కోప్యత్ర శరీరే తు జ్వరః కుతః॥ ౧౧.

టీ. ఆత్మానందోక్తరీత్యా = ఆత్మానంద - ఆత్మానందమందు, ఉక్త- చెప్పబడిన, రీత్యా-ప్రకారముగా, అస్మిన్-ఈ, జీవాత్మని = జీవ - జీవునకు, ఆత్మని-స్వరూపంబగు కూటస్థ చైతన్యము, అవధారితేసతి - ఎరుగబడుచుండగా, భోక్తా-భోగము ననుభవించెడివాడు, నాస్త్యేవ-లేనేలేడు. అత్ర - ఈ, శరీరే- దేహమందు, కోపి - ఎద్దియైనను, జ్వరః-జ్వరము, కుతః - ఎక్కడిది, అనగా లేదనుట.

. . . తా. మరియు నాత్మానందమనెడి గ్రంథప్రకారము జీవాత్మ స్వరూపంబగు అసంగ కూటస్థచైతన్య మెరుగబడుచుండగా కామించెడివాడు (అనగాభోక్త) లేమిచేత నీశరీరమందు ఏజ్వరంబును లేదు. అనగా జ్ఞానికి జ్వరాది సంబంధము లేదని యభిప్రాయము. ఇట్లు జ్ఞానికి ఐహిక దుఃఖము లేదని తెలియవలెను.

అవ. ఇకను జ్ఞానికి ఆముష్మిక దుఃఖము లేదని నిరూపించుచున్నాడు.

శ్లో॥ పుణ్యపాపద్వయే చింతా దుఃఖమాముష్మికం భవేత్।
ప్రథమాధ్యాయ ఏవోక్తం చింతా నైనం తపేదితి॥ ౧౨.

టీ. పుణ్యపాపద్వయే= పుణ్యపాప - పుణ్యపాపములనెడి, ద్వయే-రెంటియందుగల, చింతా-చింత, ఆముష్మికం - పరలోక సంబంధంబగు, దుఃఖం- దుఃఖము, భవేత్-అగును. చింతా- పుణ్యపాపవిషయకచింత, ఏనం - ఈజ్ఞానిని, నతపేదితి - తపింపజేయజాలదని, ప్రథమాధ్యాయఏవ - యోగానందమందే, ఉక్తం- చెప్పబడెను.

తా. మరియు, అకృతకృత పుణ్యపాపములనెడి రెంటియందుగల చింత ఆముష్మికదుఃఖమని చెప్పంబడును. ఈపుణ్యపాప విషయచింత, జ్ఞానిని తపింపజేయజాలదని పూర్వము యోగానందమనెడి (౧౧) ప్రకరణమందు అయిదవ శ్లోకమందును తొమ్మిదవశ్లోకమందున్ను జెప్పబడినది. కనుక, జ్ఞానికి ఆముష్మిక దుఃఖము లేదని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇప్పుడు జ్ఞానికి ఆగామి కర్మవిషయకచింతలేదని చెప్పుచున్నాడు.

శ్లో॥ యథాపుష్కరపర్ణేస్మిన్నపామశ్లేషణంతథా।
వేదనాదూర్ధ్వమాగామికర్మణోఽశ్లేషణంబుధే। ౧౩.

టీ. అస్మిన్-ఈ, పుష్కరపర్ణే-తామరాకునందు, అపాం-నీటియొక్క, అశ్లేషం-సంబంధములేమి, యథా ఏప్రకారమో, తథా - ఆప్రకారము, వేదనాత్-బ్రహ్మతత్వజ్ఞానంబువలన, ఊర్ధ్వం-ఇకమీదట, అస్మిన్ బుధే - ఈజ్ఞానియందు, ఆగామికర్మణః - ఆగామికర్మముయొక్క, అశ్లేషణం - సంబంధము లేమియగును.

తా. ప్ర. అయితే, జ్ఞానికి ప్రారబ్ధకర్మవిషయక చింతలేక పోవుగాక. ఆగామికర్మవిషయమగు చింతయైనను లేదాయేమి? ఉ. తామరాకునందు నీటి సంబంధ మేప్రకారములేదో యాప్రకారము (అహం బ్రహ్మాస్మి) అనెడి యాకారముగల అపరోక్షజ్ఞానము గలిగియుండుట వలన జ్ఞానియందు ఆగామి కర్మసంబంధములేదని, శ్రు॥ తద్యథాపుష్కరపలాశే॥ అనెడి ఇత్యాదిశ్రుతి చేత జ్ఞానికి ఆగామి కర్మసంబంధ నిరాకరణమువలన తద్విషయ చింతలేదని తెలియవలెను.

అవ. ఇప్పుడు జ్ఞానికి సంచిత కర్మవిషయమగు చింతలేదని చెప్పుచు న్నాడు.

శ్లో॥ ఇషీకాతృణతూలస్యవహ్నిదాహఃక్షణాద్యథా।
తథాసంచితకర్మాస్యదగ్ధంభవతివేదనాత్॥ ౧౪.

టీ. ఇషీకాతృణతూలస్య=ఇషీకాతృణ- లేతయెండుగడ్డిపరకలును, తూలస్య-దూదియు, క్షణాత్-నిమేషకాలములో, వహ్నిదాహః= వహ్ని-అగ్నివలన, దాహః-దహనము, యథా - ఏప్రకారముకాగలదో, తథా - ఆప్రకారము, అస్య-ఈజ్ఞానియొక్క, సంచితకర్మ= సంచిత - సంపాదించి దాచిపెట్టబడిన, కర్మ-కర్మరాశి, వేదనాత్- తత్వజ్ఞానంబువలన, దగ్ధం- దహింపబడినది, అనగా నాశమును బొందినదనుట. భవతి - అగుచున్నది.

తా. మరియు, లేతయెండుగడ్డిపరకలును దూదియు నగ్నియందు వేయ బడినవగుచు ఏప్రకారముగా క్షణమాత్రకాలములో భస్మమగుచున్నవో, ఆప్రకారమే ఈజ్ఞానియొక్క ధర్మాధర్మ లక్షణాపరిమిత సంచిత కర్మరాశి యంతయు బ్రహ్మతత్వజ్ఞానమువలన నశించుచున్నదని, శ్రు ॥ తద్యథైషీకాతూలమగ్నౌప్రోతం ప్రదూయేతైవం హాస్యసర్వేపాప్మానః ప్రదూయంతే। అనెడి యిత్యాది శ్రుతిచెప్పుచున్నది. అనగా దశముడు మృతిబొందెనని భ్రాంతిచేత



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దలచినప్పుడు గలిగిన రోదనాద్యజ్ఞానకార్యమంతయు నేనేదశమునడనైతిననెడి జ్ఞానముచేత నెట్లునివర్తించుచున్నదో, అటువలెనే తానుగానిదేహేంద్రియాద్యులయందు భ్రాంతిచేత నేననియభిమానించి యజ్ఞానదశయందు చేసినకర్మమంతయు (అహంబ్రహ్మాస్మి) అనెడి యాకారముగల స్వస్వరూపాపరోక్షయథార్థజ్ఞానోదయమైనతోడనే అట్టిజ్ఞానముచేత సంచితకర్మమంతయు నశించునని యభిప్రాయము.

అవ. ఈయర్థమందు గీతావాక్య ద్వయమును బ్రమాణముగా పఠించుచున్నాడు.

శ్లో॥ యథైధాంసిసమిద్ధోగ్ని ర్భస్మసాత్కురుతేర్జున।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేతథా॥ ౧౫.

టీ. హే అర్జున- ఓయియర్జునుడా, సమిద్ధః - ప్రజ్వలించుచుండెడి, అగ్నిః-అగ్నిహోత్రము, ఏధాంసి - ఎండుకట్టెలను, యథా - ఏప్రకారము, భస్మసాత్-భస్మీభూతముగా, కురుతే-చేయుచున్నదో, తథా- ఆప్రకారము, జ్ఞానాగ్నిః=జ్ఞాన-బ్రహ్మజ్ఞానమనెడి, అగ్నిః-అగ్నిహోత్రము, సర్వకర్మాణి-సర్వకర్మములను, భస్మసాత్ - భస్మీభూతముగా, కురుతే - చేయుచున్నది. అనగా సంచితకర్మరాశిని నశింపజేయుననుట.

తా. ఓయిఅర్జునా, దేదీప్యమానముగామండుచుండెడి యగ్నిహోత్రము ఎండుకట్టలనేప్రకారముగా భస్మమగునట్లు దహించుచున్నదో ఆప్రకారమే బ్రహ్మజ్ఞానమనెడి యగ్నిహోత్రము జ్ఞానియొక్క సంచితకర్మముల నన్నిటిని నశింపజేయుచున్నది.

శ్లో॥ యస్యనాహంకృతోభావో బుద్ధిర్యస్యనలిప్యతే।
హత్వాపిస ఇమాంల్లోకాన్నహంతిననిబధ్యతే॥ ౧౬.

టీ. యస్య-ఏపురుషునకు, అహం - నేను, కృతః - చేసినవాడననెడి, భావః-అభిమానము, న-లేదో, యస్య - ఏపురుషునియొక్క, బుద్ధిః-బుద్ధి, నలిప్యతే-కర్మఫలాసక్తముగాదో, సః-ఆపురుషుడు, ఇమాన్-ఈ, లోకాన్-జనులను, హత్వాపి-చంపినను, నహంతి- చంపినవాడుగాడు. ననిబధ్యతే-కర్మముచేత బంధింపబడెడివాడునుంగాడు.

తా. ఓయియర్జునా, ఏపురుషునకు నేనుకర్మమును జేయుచున్నాననెడి యభిమానములేదో, మరియు నేపురుషునియొక్కబుద్ధి, కర్మఫలాసక్తిగలదిగాదో అట్టియపరోక్షజ్ఞాని, దేహము ననుసరించి ఈజనుల నందరిని జంపినను స్వస్వరూపభూతావిక్రియ బ్రహ్మవిజ్ఞానము గలవాడగుటవలన బరమార్థదృష్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేత జంపినవాడుగాడనియు నట్టికర్మబద్ధుండునుం గాడని దెలిసికొనవలెనని శ్రీభగవంతుడు అర్జునునకు జెప్పెనని తెలియవలెను.

అవ. ఈయర్థమందే ఛాందోగ్యశ్రుతివాక్యార్థమును బఠించుచున్నాడు.

శ్లో॥ మాతాపిత్రోర్వధస్స్తేయం భ్రూణహత్యాన్యదీదృశం।
నముక్తింనాశయేత్పాపం ముఖకాంతిర్ననశ్యతి॥ ౧౭.

టీ. మాతాపిత్రోః-తలిదండ్రులయొక్క, వధః-వధయు, అనగా దల్లిదండ్రులజంపుటయనుట. స్తేయం-దొంగలించుటయు, భ్రూణహత్యా=భ్రూణ-శిశువును, హత్యా-చంపుటయు, అన్యత్ - ఇతరమగు, ఈదృశం - ఈలాటి, పాపం-మహత్తరపాపవర్గము, అనగా బ్రహ్మహత్యాది పాపమనుట. ముక్తిం-మోక్షమును, ననాశయేత్ - నశింపజేయజాలదు. ముఖకాంతిః=ముఖ-ముఖముయొక్క, కాంతిః-తేజంబు, ననశ్యతి - నాశమునుబొందదు.

తా. మరియు, మాతృవధయు పితృవధయు దొంగిలించుటయు శిశుహత్య బ్రహ్మహత్యాది మహత్తరపాపవర్గమును ప్రారబ్ధవశమువలన జ్ఞానిచేసినను, అట్టిపాపముచేతజ్ఞానిబద్ధుడుగామివలన నట్టియపరిమితమహత్తర పాపకర్మరాశిముక్తిని నశింపజేయజాలదనియు నట్టిపాపముచేత జ్ఞానియొక్క ముఖకాంతియైనను నశింపదని, శ్రు। నమాతృవధేన నపితృవధేననస్తేయేన నభ్రూణహత్యయానాస్యపాపంచ నచనుకుష్ఠోముఖంత్వు నీలంవా ॥ అనెడి ఇత్యాది శ్రుతిచెప్పుచున్నది. కనుక, జ్ఞానికి ఈప్రకారముగా దుఃఖములేదని తెలియవలెను.

అవ. ఇకను జ్ఞానికింగల సర్వకామప్రాప్తి నిరువది శ్లోకములచే దెలుపుచున్నాడు.

శ్లో॥ దుఃఖాభావవదేవాస్య సర్వకామాప్తిరీరితా।
సర్వాన్కామానసావాప్త్వాహ్యమృతోభవదిత్యతః॥ ౧౮.

టీ. అస్య-ఈజ్ఞానికి, దుఃఖాభావవదేవ - దుఃఖములేదని చెప్పిన ప్రకారమే, సర్వకామాప్తిః=సర్వకామ - సకలకామములయొక్క, ఆప్తిః - ప్రాప్తి, ఈరితా - శ్రుతిచేత చెప్పబడెను. అతః - ఈహేతువువలన, అసౌ - ఈజ్ఞాని, సర్వాన్-సకలములైన, కామాన్ - కామములను, అప్త్వా - పొంది, అమృతః-బ్రహ్మస్వరూపుడు, అభవదితి - ఆయెనని, హి- శ్రుతిప్రసిద్ధమగును.

తా. జ్ఞానికిదుఃఖములేదని శ్రుతిచేజెప్పబడినప్రకారమే జ్ఞానికి సర్వకామప్రాప్తియు, శ్రుతిచేత జెప్పబడుచున్నది. అదియెట్లనగా, ఈజ్ఞాని సర్వకామములంబొంది అమృతస్వరూపుడాయెనని ఐతరేయశ్రుతి చెప్పుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇప్పుడు ఛాందోగ్యశ్రుతివాక్యార్థమును బఠించుచున్నాడు.

శ్లో॥ జక్షన్ క్రీడన్ రతిం ప్రాప్తః స్త్రీభిర్యానైస్తథేతరైః।
శరీరం న స్మరేత్ప్రాణః కర్మణా జీవయేదముం॥ ౧౯.

టీ. స్త్రీభిః-స్త్రీలతోటియు, యానైః-ప్రయాణికులతోటియు, తథా-ఆప్రకారము, ఇతరైః - ఇతరజనులతోటియు, జక్షన్-భక్షించుచును. క్రీడన్-క్రీడించుచును, రతిం-రతిని, ప్రాప్తస్సన్-పొందినవాడగుచు, శరీరం - శరీరమును, న స్మరేత్-స్మరించడు. ప్రాణః-ప్రాణము, కర్మణా - ప్రారబ్ధకర్మముచేత, అముం-ఈజ్ఞానిని, జీవయేత్ - జీవింపజేయును.

తా. మరియు ఈజ్ఞాని, స్త్రీలతోటివైనను బ్రయాణికులతోటివైనను జ్ఞానులతోటివైనను అజ్ఞానులతోటి వైనను భక్షించుచును క్రీడించుచును రమించుచును జనుల సమీపమందుండెడి తనదేహమును స్మరించడనియు, ప్రాణంబు బ్రారబ్ధకర్మముచేత ఈజ్ఞానినిజీవింపజేయుచున్నదని, శ్రు॥ జక్షన్ క్రీడన్ రమమాణః స్త్రీభిర్వా యానైర్వా జ్ఞానిభిర్వా ఽజ్ఞానిభిర్వావయస్యైర్వానోపజనం స్మరన్నిదంశరీరం॥ అనెడి ఛాందోగ్యశ్రుతి జెప్పుచున్నది.

అవ. ఈయర్థమందే తైత్తిరీయకశ్రుతివాక్యమును బఠించుచున్నాడు.

శ్లో॥ సర్వాన్ కామాన్ సహాప్నోతి నాన్యవజ్జన్మకర్మభిః।
వర్తంతే శ్రోత్రియేభోగా యుగపత్క్రమవర్జితాః॥ ౨౦.

టీ. (జ్ఞానీ) బ్రహ్మతత్త్వజ్ఞాని, సర్వాన్ - సకలములయిన, కామాన్ సహ-భోగములంగూడ, ఆప్నోతి - పొందుచున్నాడు. కర్మభిః - సంచితకర్మములచేత, అన్యవత్-అజ్ఞానికివలె, జన్మ-మరియొకజన్మము, న-జ్ఞానికిలేదు. శ్రోత్రియే-జ్ఞానియందు, భోగాః-భోగములు, క్రమవర్జితాస్సంతః - క్రమములేనివగుచు, యుగపత్ - ఏకకాలమందు, అనగా నొకసారిగాననుట, వర్తంతే-వర్తించుచున్నవి.

తా. మరియు నాజ్ఞాని, సర్వకామములంగూడ పొందుచున్నాడని తైత్తిరీయకశ్రుతి జెప్పుచున్నది. ప్ర. అయితే, జ్ఞానికి, కర్మఫలభోగము నంగీకరించినయెడల జన్మంబునుంగలుగదాయేమి? ఉ. జ్ఞానియొక్క సంచిత కర్మములన్నియు జ్ఞానముచేత దహింపబడుటవలన సంచితకర్మములచేత నజ్ఞానికి జన్మముగలిగినట్లు జ్ఞానికిజన్మముగలుగదు. మరియు, సర్వభోగంబులును కాలక్రమములేనివగుచు ఏకకాలమందే శ్రోత్రియసుఖియగు జ్ఞానియందు వర్తించుచున్నవని తైత్తిరీయకశ్రుతి జెప్పుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇప్పుడు, తైత్తిరీయక బృహదారణ్యక వాక్యార్థమును సంక్షేపము జేసి పఠించుచున్నాడు.

శ్లో॥ యువారూపీచవిద్యావాన్నీరోగోదృఢచిత్తవాన్।
సైన్యోపేతస్సర్వపృథ్వీం విత్తపూర్ణాంప్రపాలయన్॥ ౨౧.

శ్లో॥ సర్వైర్మానుష్యకైర్భోగైస్సంపన్నస్తృప్తభూమిపః।
యమానందమవాప్నోతి బ్రహ్మవిచ్చతమశ్నుతే॥ ౨౨.

టీ. యువా-యౌవనవంతుడును, రూపీచ-సౌందర్యవంతుడును, విద్యావాన్-విద్యావంతుడును, నీరోగః - వ్యాధిలేనివాడును, దృఢచిత్తవాన్-ధైర్యచిత్తుండును, సైన్యోపేతః=సైన్య - సైన్యముతోటి, ఉపేతః-కూడియుండెడివాడును, విత్తపూర్ణాం=విత్త - ధనముతోటి, పూర్ణాం - నిండియుండెడి, సర్వపృథ్వీం-సర్వభూమిని, ప్రపాలయన్- పరిపాలించుచు,

టీ. సర్వైః-సకలములైన, మానుష్యకైః - మనుష్యలోకమందు సంభవించెడి, భోగైః-భోగములతోటి, సంపన్నస్సన్ - సంపన్నుడగుచు, అనగా సర్వమనుష్యభోగములం గలవాడగుచు ననుట. తృప్తభూమిపః = తృప్త-తృప్తినిబొందిన, భూమిపః-సార్వభౌముడు, యం - ఏ, ఆనందం-సుఖమును, అవాప్నోతి - పొందుచున్నాడో, తం-ఆసుఖమును, బ్రహ్మవిచ్చ - బ్రహ్మజ్ఞానియు, అశ్నుతే - పొందుచున్నాడు.

తా. మరియు, యౌవనవంతుడును మంచిరూపవంతుడును విద్యావంతుడును వ్యాధిలేనివాడును దృఢచిత్తముగలవాడును సైన్యములో గూడియుండి ధనముచేత నిండియుండెడి సర్వభూమిని పరిపాలించునట్టియు, సర్వమనుష్యభోగములంగల సార్వభౌముండు ఏయానందమునుబొందుచున్నాడో,ఆయానందమును శ్రోత్రియుడగు బ్రహ్మజ్ఞానియుంబొందుచున్నాడు. ప్ర. అయితే, సార్వభౌముడు మొదలుకొని బ్రహ్మదేవుని పర్యంతముగల సర్వజీవులయందు గల యానందంబులన్నియు జ్ఞానియందెట్లు సంభవింపగలవో చెప్పుము? ఉ. బ్రహ్మదేవాది సర్వజీవనిష్ఠానందంబులన్నియు జ్ఞానిచేత నపహరించబడిన బ్రహ్మాంశత్వముగలవగుటచేత నాయానందంబులన్నియు జ్ఞానియందు సంభవింపుచున్నవి. అనగా సర్వజీవానందంబులును పరబ్రహ్మముయొక్క స్వరూపభూతమగు ఆనందాంశమును ఉపాదానకారణముగాగలవగుటచేత నట్టి యానందంబులన్నియు బ్రహ్మజ్ఞానియందుగలవని యభిప్రాయము.

శ్లో॥ మర్త్యభోగేద్వయోర్నాస్తికామస్తృప్తిరతస్సమా।
భోగాన్నిష్కామతైకస్య పరస్యాపివివేకతః॥ ౨౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ద్వయోః-సార్వభౌమజ్ఞానులకిద్దరికి, మర్త్యభోగే - మనుష్యలోక భోగమందు, కామః-కోరిక, నాస్తి-లేదు. అతః - ఆకారణమువలన, తృప్తిః-తృప్తి, సమా-సమమగును. ఏకస్య-సార్వభౌమునకు, భోగాత్- విషయభోగమువలన, నిష్కామతా-నిష్కామత్వముగలదు. అనగాగామంబులేదనుట. పరస్యాపి- జ్ఞానికిని, వివేకతః-వివేకమువలన, (నిష్కామతా) కామము లేదు.

తా. ప్ర. అయితే, సార్వభౌమజ్ఞానులకిద్దరికిని విషయప్రాప్తిసామ్యముయొక్క లేమివలన ఆనందసామ్యమెట్లుగలుగును? ఉ. వారికిద్దరికిని విషయాపేక్షయొక్క లేమి, సమానముగానుండుటవలన నానందప్రాప్తి సామ్యముగలిగియున్నది. ప్ర. అదియెట్లు? ఉ. ఆసార్వభౌమజ్ఞానులకిద్దరికిని మనుష్యలోక భోగమందు కామములేని కారణముచేత తృప్తి సమానముగా నున్నది. ప్ర. అయితే, సార్వభౌమజ్ఞానులకిద్దరికిని తృప్తి సమానముగా నుండుటకు గారణమేమి? ఉ. ఆసార్వభౌమునకు విషయభోగనిమిత్తక కామముగలుగకమునుపే విషయభోగము లభించుచున్నది. కనుక సార్వభౌమునకు కామము లేదు. మరియు శ్రోత్రియుడగు జ్ఞానికిని వివేకమువలన విషయాపేక్షరూపముగల (కామము) లేదు. ఆకారణముచేత వారికిద్దరికిని తృప్తిసమానముగా నున్నదని తెలియవలెను.

అవ. (వివేకమువలన) అని చెప్పబడిన యర్థమును వివరించి చెప్పుచున్నాడు.

శ్లో॥ శ్రోత్రియత్వాద్వేదశాస్త్రైర్భోగ్యదోషానవేక్షతే।
రాజాబృహద్రథోదోషాం స్తాన్ గాథాభిరుదాహరత్॥ ౨౪.

టీ. శ్రోత్రియత్వాత్ - శ్రోత్రియుడగుటవలన, అనగా వివేకవంతుడగుటచేతననుట. వేదశాస్త్రైః - వేదశాస్త్రములచేత, భోగ్యదోషాన్= భోగ్య-భోగ్యవస్తువునందుగల, దోషాన్-దోషములను, అవేక్షతే - చూచుచున్నాడు. బృహద్రథః - బృహద్రథుడనెడి, రాజా - రాజు, అనగా రాజర్షియనుట. తాన్-ఆ, దోషాన్-దోషములను, గాథాభిః-కథలచేత, ఉదాహరత్-ఉదాహరించెను.

తా. మరియు జ్ఞాని, శ్రోత్రియుడగుటవలన వేదశాస్త్రములచేత విషయభోగమందుగల దోషములంజూచుచున్నాడు. ప్ర. అయితే, విషయదోషంబులు ఏశాఖయందెవనిచేత నిరూపింపబడినవో చెప్పుము? ఉ. బృహద్రథుడనెడి రాజుచేత మైత్రాయణీయమనెడిశాఖయందు ఆభోగ్యదోషములు చెప్పబడినవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ దేహదోషాంశ్చిత్తదోషాన్ భోగ్యదోషాననేకశః।
శునావాంతే పాయసే నో కామ స్తద్వద్వివేకినః॥ ౨౫.

టీ. దేహదోషాన్ - దేహ-శరీరమందుగల, దోషాన్ - దోషములను, చిత్తదోషాన్-చిత్తమందుగలదోషములను, భోగ్యదోషాన్=భోగ్య - భోగ్య వస్తువర్గమందుగల, దోషాన్-దోషములను, అనేకశః - అనేక విధంబులుగా, (ఉదాహరత్) ఉదహరించెను. శునా- కుక్కచేత, వాంతే - వాంతిజేయబడిన, పాయసే-పాయసాన్నమందు, కామః-కోంక, నో-ఆకుక్కకుగలుగదు. తద్వత్-ఆప్రకారము, వివేకినః - జ్ఞానికిగలుగదు.

తా. ప్ర. ఆదోషములెవ్వి? ఉ. దేహమందుగల దోషములును చిత్తమందుగల దోషములును, భోగ్యవస్తువర్గమందుగల దోషంబులును అనేక విధములు నామైత్రాయణీయ శాఖయందు బృహద్రథునిచేత జెప్పబడినవి. మరియు జ్ఞానికి కామము గలుగని విషయమై దృష్టాంతమును జెప్పెదను వినుము. కుక్కచేత వాంతిజేయబడిన పాయసాన్నమందు ఆకుక్కకు కోరికెట్లు గలుగదో ఆప్రకారమే బహువిధదోషములు గలిగియుండుటచేత గామింపదగదని జ్ఞానిచేత నిశ్చయింపబడిన భోగ్యవస్తువునందును జ్ఞానికి కామము గలుగదని తెలియవలెను.

అవ సార్వభౌమునికంటె జ్ఞానికి ఆధిక్యమును జెప్పుచున్నాడు.

శ్లో॥ నిష్కామత్వేసమేప్యత్ర రాజ్ఞస్సాధనసంచయే।
దుఃఖమాసీద్భావినాశాదితిభీరనువర్తతే॥ ౨౬.

టీ. (ఉభయోశ్చ) ఇద్దరికిని, అత్ర-ఈమనుష్యభోగమందు, నిష్కామత్వే-నిష్కామత్వము, సమేపి-సామ్యముగానున్నను, రాజ్ఞః- సార్వభౌమునకు, సాధనసంచయే-సాధనసమూహమందు, అనగా సాధనసాధ్యమగు సార్వభౌమత్వమందనుట. దుఃఖం-దుఃఖము, ఆసీత్-కలదు. భావినాశాదితిభీః - భావి-భవిష్యత్కాలమందు, నాశాదితి - నాశమువలనగలిగెడి, భీః-భయంబు, అనువర్తతే - అనువర్తించుచున్నది.

తా. మరియు, సార్వభౌమ జ్ఞానులకిద్దరికిని ఈమర్త్య భోగమందు నిష్కామత్వము సమానముగానున్నను సార్వభౌమునకు తన సార్వభౌమత్వము, ౧. సాధనములచేత సంపాదింపదగినదగుననెడి దోషంబును, ౨. పిమ్మట భవిష్యత్కాలమందు తన సార్వభౌమత్వము నశించునేమోయనెడి భయంబునుంగలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ నోభయం శ్రోత్రియస్యాత స్తదానందోఽధికోఽన్యతః।
గంధర్వానందఆశాఽస్తి రాజ్ఞో నాస్తి వివేకినః॥ ౨౭.

టీ. శ్రోత్రియస్య- జ్ఞానికి, ఉభయం - పూర్వోక్త దోషద్వయము, న-లేదు. అతః ఈకారణమువలన, తదానందః=తత్- అజ్ఞానియొక్క, ఆనందః-సుఖము, అన్యతః - సార్వభౌమానందముకంటె, అధికః- శ్రేష్ఠమైనదగును. రాజ్ఞః - సార్వభౌమునకు, గంధర్వానందే = గంధర్వ - గంధర్వునియొక్క, ఆనందే-సుఖమందు, ఆశా-కోరిక, అస్తి-కలదు. వివేకినః-జ్ఞానికి, న-ఆశలేదు.

తా. సార్వభౌమునియందుగల యట్టిదోషద్వయంబును శ్రోత్రియుడగు జ్ఞానియందులేమిచేత సార్వభౌమునకుగల యానందముకంటె జ్ఞానికింగలయానందంబధికమైనదగును. మరియు జ్ఞానికి మరియొక యాధిక్యతయుం గలదు. ప్ర. అదియెద్ది? ఉ. సార్వభౌమునకు గంధర్వానందమందు ఆశగలదు. అట్టియాశ, జ్ఞానికిలేదు. కనుక, సార్వభౌమునియొక్క యానందముకంటె శ్రోత్రియుడగు జ్ఞానియొక్క యానందంబధికమైనదగునని తెలియవలెను.

అవ. ఇప్పుడు గంధర్వానందము ద్వివిధంబని చూపుటకొరకు శ్లోకద్వయముచేత గంధర్వభేదమును జెప్పుచున్నాడు.

శ్లో॥ అస్మిన్ కల్పే మనుష్యస్సన్ పుణ్యపాకవిశేషతః।
గంధర్వత్వం సమాపన్నో మర్త్యగంధర్వ ఉచ్యతే॥ ౨౮.

టీ. అస్మిన్- ఈ, కల్పే - కల్పమందు, మనుష్యస్సన్ - మనుష్యదేహమును బొందినవాడగుచు, పుణ్యపాకవిశేషతః = పుణ్య - పుణ్యముయొక్క, పాక-పరిపక్వముయొక్క, విశేషతః-విశేషమువలన, గంధర్వత్వం - గంధర్వదేహమును, సమాపన్నః - పొందినవాడు, మర్త్యగంధర్వః-మర్త్యగంధర్వుడని, ఉచ్యతే - చెప్పబడుచున్నాడు.

తా. మరియు, ఈకల్పమందు మనుష్యుడగుచు బుణ్యకర్మ పరిపాకవశమువలన గంధర్వదేహమును బొందినవాడు మర్త్యగంధర్వుడని చెప్పబడును. ప్ర. సరి. కల్పమనగానేమి? ఉ. చెప్పెదను. వినుము. (౪౩,౨౦,౦౦౦) నలుబదిమూడులక్షలు నిరువదివేలును సంవత్సరములంగలది యొక మహాయుగమనబడును. మహాయుగమనగా కృతత్రేతద్వాపరకలియుగములనెడి నాల్గింటి సముదాయంబగును. అందు కృతయుగప్రమాణము, ౧౭,౨౮,౦౦౦ సంవత్సరములును, త్రేతాయుగ ప్రమాణము, ౧౨,౯౬,౦౦౦ సంవత్సరములును, ద్వాపరయుగ ప్రమాణము, ౮,౬౪,౦౦౦ సంవత్సరములును, కలియుగప్రమాణము, ౪,౩౨,౦౦౦ సంవత్సరములునగును. అట్టిమహాయుగములు ౭౧కి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒక మన్వంతరమగును. అట్టి మన్వంతరములు (౧౪) అయినయెడల బ్రహ్మదే వునకు ఒక దినములో పగటికాలము (అనగా అహస్సు) అగును. అదియేకల్ప మనబడును. సంధికాలములంజేర్చగా నొక కల్పమునకు (౧౦౦౦) వేయి మహా యుగములగును. ఇట్టి కల్పములు రెండైనయెడల బ్రహ్మదేవునకు ఒక అహో రాత్రము (దినము) అగును. బ్రహ్మదేవునియొక్క యహోరాత్రములో పగ టికాలమందే సృష్టిగలదనియు రాత్రికాలమందు సృష్టిలేదనియుం దెలియవలె ను. అట్టి దినములు ౩౬౦ చేత బ్రహ్మదేవునకు ఒక సంవత్సరమగును. ఇట్టి నూరు సంవత్సరములాయువుగలవాడు బ్రహ్మదేవుడగును. బ్రహ్మదేవునకు అట్టి శతసంవత్సరములలో నిప్పటివరకు ౫౦ సంవత్సరములు గతించినవి. ౫౧ వ సంవత్సరములో బ్రథమకల్పమందు (స్వాయంభువస్వారోచిష ఉత్తమ తామసరైవత చాక్షుషులు) అనెడి (౬) యారుమనువులు గతించిరి. ఇప్పుడు సప్తమంబగు వైవస్వతమన్వంతరములో, (౨౮) ఇరువదియెనిమిదవ మహాయు గములో గలియుగము జరుగుచున్నదని తెలియవలెను.

శ్లో॥ పూర్వకల్పేకృతాత్పుణ్యా త్కల్పాదావేవచేద్భవేత్।
గంధర్వత్వంతాదృశోఽత్ర దేవగంధర్వ ఉచ్యతే॥ ౨౯.

టీ. పూర్వకల్పే - గడచిపోయిన కల్పమందు, కృతాత్ - చేయబడిన, పుణ్యాత్-పుణ్యమువలన, కల్పాదావేవ - ఈవర్తమానకల్పాదియందే, గంధ ర్వత్వం-గంధర్వభావము, అనగా గంధర్వదేహమనుట. భవేచ్చేత్ - కలిగిన యెడల, తాదృశః-అట్టిగంధర్వుడు, అత్ర- ఈలోకమందు, దేవగంధర్వః-దేవ గంధర్వుడని, ఉచ్యతే - చెప్పబడుచున్నాడు.

తా. మరియు, పూర్వకల్పమందు జేయబడిన ధర్మలక్షణము గల పుణ్య మువలన నిప్పుడు జరుగుచుండెడి కల్పాదియందే గంధర్వత్వమును బొందినయె డల, అట్టివాడు ఈలోకమందు దేవగంధర్వుడని చెప్పబడుచున్నాడు.

అవ. చిరలోకపిత్రానందమును జూపుటకొరకు చిరలోక పితరులను, దేవానందము త్రివిధమని తెలుపుటకొరకు దేవభేదంబునుంజెప్పుచున్నాడు.

శ్లో॥ అగ్నిష్వాత్తాదయోలోకే పితరశ్చిరవాసినః।
కల్పాదావేవదేవత్వం గతా ఆజానదేవతాః॥ ౩౦.

టీ. లోకే-పితృలోకమందు, చిరవాసినః= చిర - బహుకాలమునుంచి, వాసినః - నివసించియుండెడి, అగ్నిష్వాత్తాదయః=అగ్నిష్వాత్త- అగ్నిష్వాత్తుడే, ఆదయః-ఆదిగాగల, పితరః - పితృదేవతలుంగలరు. కల్పాదావేవ- ఈకల్పాది



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యందే, దేవత్వం- దేవభావమును, అనగా దేవశరీరమునను. గతాః-పొం దినవారు, ఆజానదేవతాః-ఆజానదేవతలని చెప్పబడుదురు.

తా. మరియు, పితృలోకమందు బహుకాలమునుంచి నివసించియుం డెడి అగ్నిష్వాత్తుడు మొదలగు పితృదేవతలుంగలరు. మరియు, ఈవర్తమానక ల్పాదియందే దేవత్వమును బొందియుండెడివారు ఆజానదేవతలని చెప్పబ డుదురు.

శ్లో॥ అస్మిన్ కల్పేఽశ్వమేధాది కర్మకృత్వా మహత్పదం।
అవాప్యాజానదేవైర్యాః పూజ్యాస్తాః కర్మదేవతాః॥ ౩౧.

టీ. అస్మిన్-ఈ, కల్పే-కల్పమందు, అశ్వమేధాదికర్మ=అశ్వమేధ అశ్వ మేధమే, ఆది ఆదిగాగల, కర్మ-పుణ్యకర్మమును, కృత్వా-చేసి, మహత్- అధి కమగు, పదం-స్థానమును, అవాప్య-పొంది, యాః- ఏదేవతలు, ఆజానదేవైః- ఆజానదేవతలచేత, పూజ్యాః - పూజింపదగినవారో, ననగా బూజింపబడుదు రోయనుట. తాః - ఆదేవతలు, కర్మదేవతాః - కర్మదేవతలని చెప్పబడు చున్నారు.

తా. మరియు, ఈకల్పమందు అశ్వమేధము మొదలగు పుణ్యకర్మమును జేసి యూర్ధ్వలోకమందు మహత్పదమునుబొంది, ఆజానదేవతలచేత బూజింప బడెడివారు కర్మదేవతలని చెప్పబడుచున్నారు.

శ్లో॥ యమాగ్నిముఖ్యా దేవాస్స్యుర్జ్ఞాతావింద్రబృహస్పతీ।
ప్రజాపతిర్విరాట్ప్రోక్తో బ్రహ్మా సూత్రాత్మనామకః॥ ౩౨.

టీ. యమాగ్నిముఖ్యాః = యమ - యముడును, అగ్ని - అగ్నిదేవుడే, ముఖ్యాః-ఆదిగాగల, దేవాః-దేవతలు, స్యుః-కలరు. ఇంద్రబృహస్పతీ=ఇంద్ర- దేవేంద్రుడును, బృహస్పతీ- బృహస్పతియు, జ్ఞాతౌ- ప్రసిద్ధులగుదురు. ప్రజా పతిః- ప్రజాపతియనెడిదేవుడు, విరాట్- విరాట్టు, ప్రోక్తః - చెప్పబడును. బ్రహ్మా- బ్రహ్మదేవుడు, సూత్రాత్మనామకః = సూత్రాత్మ - సూత్రాత్ముడ నెడి, నామకః-పేరుగలవాడగును. అనగా సమష్టిలింగశరీరోపాధికుడగుహిర ణ్యగర్భుడగు ననుట.

తా. మరియు, యముడును అగ్నిదేవుడు మొదలగు పెక్కండ్రు దేవ తలుంగలరు. మరియు, ఇంద్రబృహస్పతులిద్దరును లోకప్రసిద్ధులగుదురు. మరి యు, ప్రజాపతియనెడి దేవముఖ్యుడు సమష్టిస్థూలశరీరోపాధికుడగు విరాట్పు రుషునిగా దెలియవలెను. బ్రహ్మదేవుని సమష్టిలింగ శరీరోపాధికుడగు సూ త్రాత్మునుగా దెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. సార్వభౌమాది సూత్రాత్మపర్యంతముగల్గువారలు శ్రోత్రియుడగు జ్ఞానికంటె తక్కువైనవారలగుదురని తెలుపుటకొఱకు జెప్పుచున్నాడు.

శ్లో॥ సార్వభౌమాదిసూత్రాంతా ఉత్తరోత్తరకామినః।
అవాఙ్మనసగమ్యోఽయ మాత్మానంద స్తతఃపరః॥ 33.

టీ. సార్వభౌమాదిసూత్రాంతాః=సార్వభౌమ- సార్వభౌముడే, ఆది- ఆదిగాగలిగినట్టియు, సూత్ర - బ్రహ్మదేవుడే, అంతాః - అంతముగా గలిగిన వారు, ఉత్తరోత్తరకామినః=ఉత్తరోత్తర - పైపైపదవిశేషములను, కామినః- కోరెడివారగుదురు. (యతః) ఏకారణమువలన, అయం - ఈ, ఆత్మానందః- ఆత్మానందము, అవాఙ్మనసగమ్యః - వాఙ్మనంబులచేత బొందదగినదికాదో, (అతః) ఈకారణమువలన, పరః-అధికమైనదగును.

తా. సార్వభౌమగంధర్వపితృదేవదేవ యమాగ్నిబృహస్పతీంద్ర ప్రజాపతిబ్రహ్మదేవాదులందరు ఉత్తరోత్తరపదవిశేషములం గోరుచున్నారు. అనగా సార్వభౌమాది బ్రహ్మపదపర్యంతంబుగలవారలకు ఉత్తరోత్తర క్రమంబుగా శతశతభాగంబు లధికసుఖంబుగలదని, శ్రు॥ సఏకోమానుషఆనంద, స్తతశ్శతగుణోగంధర్వాదీనాం॥ అనెడి ఇత్యాదిశ్రుతి జెప్పుచుండుటచేత సార్వభౌమగంధర్వాదులందరును తమతమకంటె నధికసుఖముగల దేవాదిపదవిశేషములం గోరుచున్నారని తెలియవలెను. ఈచెప్పబడినట్టి యందరికంటెనధికమగు ఆనందమును జెప్పెదనువినుము. ఏకారణమువలన ఈయాత్మానందము అవాఙ్మనసగోచరమగునో, ఆకారణమువలన బ్రహ్మాదులకుంగల సర్వానందములకంటె నీయాత్మానందం బధికమైనదగునని తెలియవలెను.

అవ. సర్వానందంబులును జ్ఞానియందుగలవని యిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ తైస్తైః కామ్యేషు సర్వేషు సుఖేషు శ్రోత్రియో యతః।
నిస్పృహస్తేన సర్వేషా మానందాస్సంతి తస్య తే॥ 3౪.

టీ. సర్వేషు-సకలములగు, కామ్యేషు - కామ్యంబులయిన, సుఖేషు- సుఖములయందు, తైస్తైః- ఆయావిషయసుఖములతోటి, యతః-ఏకారణమువలన, శ్రోత్రియః జ్ఞాని, నిస్పృహః-ఇచ్ఛలేనివాడగునో, తేన - ఆకారణంబుచేత, సర్వేషాం-సర్వజీవులయొక్క, తే-ఆ, ఆనందాః-ఆనందంబులు, తస్య- ఆజ్ఞానికి, సంతి - కలవు.

తా. మరియు, బ్రహ్మాది సర్వజీవ కామ్యసుఖములయందు ఏకారణము చేత జ్ఞానికపేక్షలేదో, ఆకారణంబుచేత పూర్వోక్త సర్వజీవానంద విశేషంబులును శ్రుతిసిద్ధబ్రహ్మతత్త్వజ్ఞానియగు శ్రోత్రియునకుంగలవని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఈయుపపాదింపబడిన యర్థమునుపసంహారము జేయుచున్నాడు.

శ్లో॥ సర్వకామాప్తిరేషోక్తాయద్వాసాక్షిచిదాత్మనా।
స్వదేహవత్సర్వదేహేష్వపిభోగానవేక్షతే॥ ౩౫.

టీ. ఏషా-ఈ, ఉక్తా-చెప్పబడినది, సర్వకామాప్తిః = సర్వకామ-సర్వకామంబులయొక్క, ఆప్తిః - ప్రాప్తియగును. యద్వా - మరియొకపక్షమందు, సాక్షిచిదాత్మనా=సాక్షి - తనయానందాకారబుద్ధికి సాక్షియగు, చిదాత్మనా-చిదాత్మచేత, స్వదేహవత్ = స్వ-తనయొక్క, దేహవత్-దేహమందువలె సర్వదేహేష్వపి=సర్వ-సకలములగు, దేహేష్వపి- దేహములయందును, భోగాన్-భోగములను, అవేక్షతే - చూచుచున్నాడు.

తా. (౧౮) శ్లోకము మొదలుకొని ఇంతవరకుం జెప్పబడిన యర్థముచేత జ్ఞానికిగల సర్వకామప్రాప్తి జెప్పబడినదని తెలియవలెను. మరియొకపక్షముగా జ్ఞానికి సర్వకామప్రాప్తిం జెప్పెదమువినుము. ప్ర. అదియెట్లు? ఉ. జ్ఞానియగువాడు, తనదేహమందు ఆనందాకారబుద్ధికి సాక్షిగానుండుటచేత ఏప్రకారం బానందియగుచున్నాడో, ఆప్రకారమే సర్వదేహములయందుండెడి సర్వబుద్ధులకును సాక్షిగానుండుటచేత సర్వదేహ కామభోగములం గలవాడగుచున్నాడని తెలియవలెను.

శ్లో॥ అజ్ఞస్యాప్యేతదస్త్యేవనతుతృప్తిరబోధతః।
యోవేదసోఽశ్నుతేసర్వాన్ కామానిత్యబ్రవీచ్ఛ్రుతిః॥ ౩౬.

టీ. అజ్ఞస్య-మూఢునకు, అబోధతః-జ్ఞానంబులేమివలన, ఏతత్- ఈసర్వకామప్రాప్తి, హాస్త్యేవ-లేనేలేదు. తృప్తిస్త్వపి- తృప్తియు; న-లేదు. యః-ఏపురుషుడు, వేద-పంచకోశరూప గుహాస్థిత ప్రత్యగభిన్న బ్రహ్మను నెరుగుచున్నాడో, సః- ఆపురుషుడు, సర్వాన్ - సకలములగు, కామాన్ - కామములను, అశ్నుతఇతి - పొందుచున్నాడని, శ్రుతిః - తైత్తిరీయకశ్రుతి, అబ్రవీత్-చెప్పెను.

తా. ప్ర. అయితే, ఈచెప్పబడిన ప్రకారము అజ్ఞానికిని సర్వానందప్రాప్తికలదుగదా? ఉ. సర్వదేహములయందుగల సర్వబుద్ధులకును నేను సాక్షిననెడిరూపముగల (అపరోక్షజ్ఞానము) అజ్ఞానికిలేమిచేత నాయజ్ఞానికి సర్వకామప్రాప్తియు తృప్తియులేదని తెలియవలెను. ప్ర. ఈయర్థమందు ప్రమాణమేమి? ఉ. పంచకోశరూపగుహయందుగల ప్రత్యగ్రూపపరబ్రహ్మమును ఏపురుషుడెరుగుచున్నాడో, ఆపురుషుడు సర్వకామములం బొందుచున్నాడని,శ్రు॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుహాయాంనిహితం బ్రహ్మయోవేదసోశ్నుతే సర్వాన్ కామాన్॥ అనేడి తైత్తిరీయకశ్రుతి, చెప్పుచున్నది.

అవ. ఈసర్వకామప్రాప్తి విషయమై తృతీయప్రకారము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ యద్వాసర్వాత్మతాంస్వస్యసామ్నాగాయతిసర్వదా।
అహమన్నంతథాన్నాదశ్చేతిసామహ్యధీయతే॥ ౩౭.

టీ. యద్వా - మరియొకపక్షమందు, స్వస్య - తనయొక్క, సర్వాత్మతాం-సర్వాత్మత్వమును, సర్వదా-ఎల్లప్పుడును, సామ్నా-సామవాక్యముచేత, గాయతి- గానము జేయుచున్నాడు. అహం-నేను, అన్నమితి - భోగ్యమగునన్నియు, తథా-ఆప్రకారము, అన్నాదశ్చేతి- భోక్తనగుదుననియు, సామ-సామవేదవాక్యము, అధీయతేహి - చెప్పుచున్నది.

తా. మరియొక ప్రకారముగా జ్ఞానికిసర్వకామప్రాప్తిని జెప్పెద వినుము. నేను కామరూపినై ఈసర్వలోకములయందు సంచరించుచు సర్వభోగముల ననుభవించుచున్నాననియు, భోగ్యంబును భోక్తయు నేనే యగుదునని, శ్రు॥ ఇమాన్ లోకాన్ కామాన్నీ కామరూప్యనుసంచరన్. అహమన్నమహమన్నమహమన్న మహమన్నాదోహమన్నాదో హమన్నాదః. అనేడి సామవేదవాక్యముచేత, జ్ఞానియగువాడు బ్రహ్మలోక స్థితిదశయందు దన సర్వాత్మకత్వమును గానముచేయుచున్నాడని వినబడుచున్నది. కనుక, జ్ఞానికి బ్రహ్మలోక స్థితిదశయందైనను సర్వకామప్రాప్తిగలదని తెలియవలెను.

అవ. పూర్వోక్తగ్రంథముచేత సిద్ధించిన యర్థమును సంక్షేపించి చెప్పుచున్నాడు.

శ్లో॥ దుఃఖాభావశ్చకామాప్తిరుభే హ్యేవంనిరూపితే।
కృతకృత్యత్వమన్యచ్చ ప్రాప్తప్రాప్యత్వమీక్ష్యతాం॥ ౩౮.

టీ. దుఃఖాభావః=దుఃఖ-దుఃఖముయొక్క, అభావః- లేమియు, కామాప్తిశ్చ= కామ-సర్వకామంబులయొక్క, ఆప్తిశ్చ-ప్రాప్తియు, ఉభే - రెండును, ఏవం-ఈప్రకారము, నిరూపితేహి - నిరూపింపబడెనుగదా, కృతకృత్యత్వం= కృత-చేయబడిన, కృత్యత్వం - కార్యవర్గభావంబును, అన్యచ్చ - మరియొకటియగు, ప్రాప్తప్రాప్యత్వం = ప్రాప్త-పొందబడిన, ప్రాప్యత్వం ఫలవర్గభావంబును, ఈక్ష్యతాం - చూడబడుగాక.

తా. ౧. దుఃఖాభావంబును,౨. సర్వకామప్రాప్తియు నీరెండునుజ్ఞానియందుగలవని ఈపూర్వోక్తప్రకారము నిరూపణము జేసి తెలిపితిమి. ఇకనుజ్ఞా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నియంబుగల ౩. కృతకృత్యత్వంబును, ౪. ప్రాప్తప్రాప్యత్వంబునుం దెలుప వలెను.

శ్లో॥ ఉభయంతృప్తిదీపేహిసమ్యగస్మాభిరీరితం।
తఏవాత్రానుసంధేయాః శ్లోకాబుద్ధివిశుద్ధయే॥ ౩౯.

టీ. ఉభయం-రెండును, అనగా కృతకృత్యత్వ ప్రాప్తప్రాప్యత్వంబుల నుట. అస్మాభిః-మాచేత, తృప్తిదీపే-తృప్తిదీపమందు, సమ్యక్-లెస్సగా, ఈరితం హి-చెప్పంబడెనుగదా? తే-ఆ, శ్లోకాఏవ-శ్లోకములే, అత్ర- ఇచ్చట, బుద్ధివిశుద్ధయే=బుద్ధి- బుద్ధియొక్క, విశుద్ధయే- పరిశుద్ధికొరకు, అనుసంధేయాః-అనుసంధానంబు జేయదగినవగును.

తా. కృతకృత్యత్వ ప్రాప్తప్రాప్యత్వములనెడి రెండును మాచేతదృప్తదీపమనెడి సప్తమప్రకరణమందు జక్కగాజెప్పబడినవి. ఆశ్లోకములనే ఇక్కడ బుద్ధియొక్క పరిశుద్ధికొరకు ననుసంధానము జేయవలెను.

అవ. ఆకృతకృత్యత్వమునే యిప్పుడు స్పష్టముగా జెప్పుచున్నాడు.

శ్లో॥ ఐహికాముష్మికవ్రాతసిద్ధ్యై ముక్తేశ్చసిద్ధయే।
బహుకృత్యంపురాస్యాభూత్తత్సర్వమధునాకృతం॥ ౪౦.

టీ. అస్య-ఈవిద్వాంసునకు, పురా-జ్ఞానోత్పత్తికంటె బూర్వము, ఐహికాముష్మికవ్రాతసిద్ధ్యై=ఐహిక - ఇహలోకసంబంధమైనట్టియు, ఆముష్మిక-పరలోకసంబంధమైనట్టి, వ్రాత - ఇష్టవస్తురాశియొక్క, సిద్ధ్యై - సిద్ధికొరకును, ముక్తేశ్చ- మోక్షముయొక్క, సిద్ధయే-సిద్ధికొరకును, బహు బహువిధముగా, కృత్యం-చేయతగినది, అభూత్-ఉండెను. అధునా ఇప్పుడు, అనగా తత్వజ్ఞానోదయమైనపిమ్మటననుట. తత్సర్వం-అదియంతయు,కృతం-చేయబడినట్లాయెను.

తా. ఈవిద్వాంసునకు తత్వజ్ఞానోదయమునకంటె బూర్వము ఈలోకమందు ఇష్టప్రాప్తికొరకును, అనిష్టనివృత్తికొరకును కృషివాణిజ్యాది కర్మముచేయదగినదైయుండెను. మరియు స్వర్గాదిపుణ్యలోకసిద్ధికొరకు, యాగోపాసనాదికము చేయదగినదైయుండెను. మరియు, మోక్షసాధనమగు తత్వజ్ఞానసిద్ధికొరకు వేదాంతశ్రవణాదికము చేయదగినదైయుండెను. ఇప్పుడనగా తత్వజ్ఞానోదయమైనపిమ్మటనో, సాంసారికఫలేచ్ఛలేమిచేతను, మరియు, బ్రహ్మానందము సాక్షాత్కరించుటచేతను, ఆకృషియాగవేదాంత శ్రవణాదికమంతయు జేయబడినట్లాయెను. అనగా నికమీద ననుష్ఠింపదగినదిలేనందున, చేయదగినదంతయుం జేయబడినట్లాయెనని యభిప్రాయము. ఇదియేకృతకృత్యత్వమగును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇట్లు కృతకృత్యత్వమును దెలిపి, తత్ఫలభూతమగు తృప్తి నిప్పుడు జూపుచున్నాడు.

శ్లో॥ తదేతత్కృతకృత్యత్వం ప్రతియోగిపురస్సరం।
అనుసందధదేవాయ మేవంతృప్యతెనిత్యశః॥ ౪౧.

టీ. అయం- ఈవిద్వాంసుడు, తదేతత్- ఆఈ, కృతకృత్యత్వం-కృతకృత్యత్వమును, ప్రతియోగిపురస్సరం - ప్రతియోగ్యనుసంధానపూర్వకముగా, అనుసందధత్ - అనుసంధానముజేయుచు, ఏవం - ఈచెప్పబోయెడిప్రకారము, నిత్యశః-సర్వదా, తృప్యత్యేవ- తృప్తినిబొందుచున్నవాడేయగును.

తా. ఈవిద్వాంసుడు, ఆయాకృతకృత్యత్వమును ప్రతియోగ్యనుసంధానపూర్వకముగా ననుసంధానము జేయుచున్నవాడగుచు ఇక జెప్పబోయెడి ప్రకారము సర్వదా తృప్తిబొందుచున్నాడు.

అవ. ఆయనుసంధానమునే దెలుపుచు అందు ఐహికసుఖార్థులకంటె విలక్షణత్వము నిప్పుడు తనకుజూపుచున్నాడు.

శ్లో॥ దుఃఖినోజ్ఞాస్సంసరంతు కామంపుత్రాద్యపేక్షయా।
పరమానందపూర్ణోహం సంసరామికిమిచ్ఛయా॥ ౪౨.

టీ. దుఃఖినః-దుఃఖవంతులగు, అజ్ఞాః-మూఢులు, పుత్రాద్యపేక్షయా= పుత్రాది-పుత్రభార్యాదికమందుగల, అపేక్షయా-అపేక్షచేత, కామం- మిక్కిలిగా, సంసరంతు - సంసారమునుబొందుదురుగాక. పరమానందపూర్ణః-పరమానందపూర్ణుడనగు, అహం-నేను, కిమిచ్ఛయా-ఏయిచ్ఛచేత, అనగాదేనిని చ్ఛయించుటచేత ననుట. సంసరామి - సంసారమును బొందెదనని యాక్షేపార్థకము. అనగా నేకోరికయు నాకు లేమిచేత నేను సంసారమును బొందననుట.

తా. దుఃఖవంతులగుమూఢులు, పుత్రభార్యాదులయందుగల అపేక్షచేత అధిక సంసారమునుబొందుదురు. పరమానందపూర్ణుడనగు నాకు ఏయిచ్ఛయు లేనందున, నేను సంసారమును బొందను.

అవ. స్వర్గాదికముకొరకు కర్మాద్యనుష్ఠానమును జేసెడివారికంటె విలక్షణత్వము నిప్పుడు తనకు జూపుచున్నాడు.

శ్లో॥ అనుతిష్ఠంతుకర్మాణి పరలోకయియాసవః।
సర్వలోకాత్మకఃకస్మా దనుతిష్ఠామికింకథం॥ ౪౩.

టీ. పరలోకయియాసవః=పరలోక - పరలోకమును, యియాసవః-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పొందుటకిచ్ఛయించెడిజనులు, కర్మాణి - కర్మములను, అనుతిష్ఠంతి-చేయుచున్నారు. సర్వలోకాత్మకః = సర్వలోక- సర్వలోకములకు, ఆత్మకః-స్వరూపముగాగలనేను, కస్మాత్- ఎందువలన, కథం-ఎట్లు, కిం-దేనిని, అనుతిష్ఠామి-అనుష్ఠానము జేసెదనని ఆక్షేపార్థకము. అనగానేను, దేనిని జేయననుట.

తా. మఱియు, పరలోకములను పొందుటకిచ్ఛయించెడిజనులు, కర్మోపాసనానుష్ఠానమును జేయుచున్నారు. నేను సర్వలోక స్వరూపుడ నగుటచేత ఏమియుం జేయనక్కరలేదు.

శ్లో॥ వ్యాచక్షతాం తేశాస్త్రాణి వేదానధ్యాపయంతువా।
యేఽత్రాధికారిణో మేతు నాధికారోఽక్రియత్వతః॥ ౮౪.

టీ. అత్ర-ఈలోకమందు, యే - ఏజనులు, అధికారిణః - అధికారవంతులో, తే-ఆజనులు, శాస్త్రాణి - శాస్త్రములను, వ్యాచక్షతాం - చెప్పుదురుగాక, వేదాన్వా-వేదములనైనను, అధ్యాపయంతు - అధ్యయనము జేయింతురుగాక. మేతు-నాకో, అక్రియత్వతః - నిష్క్రియత్వమువలన, అధికారః-అధికారము, న-లేదు.

తా. ప్ర. అయితే, నీయొక్క ప్రయోజనముకొరకు నీకు ప్రవర్తనము లేకపోయినను, పరులయొక్క ప్రయోజనముకొరకైనను నీకుప్రవర్తనము గలుగదాయేమి? ఉ. ఈలోకమందు అధికారులగుజనులు తమశిష్యులచేత శాస్త్రాధ్యయనమునైనను, వేదాధ్యయనమునైనను చేయించుచుందురు. నేను నిష్క్రియాస్వరూపుడనగుటవలన, పరులచేత వేదశాస్త్రాధ్యయనము జేయించెడి యధికారము నాకులేదు. అనగా నాకధికారములేమిచేత పరప్రయోజనము కొరకైనను నాకు ప్రవర్తనము లేదని యభిప్రాయము.

శ్లో॥ నిద్రాభిక్షేస్నానశౌచే నేచ్ఛామినకరోమిచ।
ద్రష్టారశ్చేత్కల్పయంతి కింమేస్యాదన్యకల్పనాత్॥ ౮౫.

టీ. (అహం) నేను, నిద్రాభిక్షే=నిద్రా-నిద్రను, భిక్షే-భిక్షను, నేచ్ఛామి-ఇచ్ఛయించుచుండెడి వాడనుగాను, స్నానశౌచే= స్నాన - స్నానమును, శౌచే-పారిశుద్ధ్యమును, నకరోమిచ-చేయుచుండెడివాడనుంగాను, ద్రష్టారః-చూచెడివారు, కల్పయంతిచేత్ - కల్పించుచున్నారని యంటివేని, అన్యకల్పనాత్=అన్య- ఇతరులయొక్క, కల్పనాత్-కల్పనమువలన, మే-నాకు,కింస్యాత్-ఏమిబాధయగును. అనగా నాకు ఎవ్విధబాధయు లేదనుట.

తా. ప్ర. అయితే, నీదేహసంరక్షణకొరకు భిక్షాహరణాదికంబును, పరలోకసిద్ధికొరకు స్నానజపాదికంబును, నీచేత జేయబడుచుండగా నీకునిష్క్రి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈతత్వ మెట్లుసిద్ధించెను? ఉ. నేను వాస్తవముచేత, నిద్రాభిక్షములనిచ్ఛయించె డివాడనుగాను. స్నానశౌచములను జేసెడివాడనుంగాను. మరియు, నిద్రాభిక్షాదులను నేనిచ్ఛయించినట్లును స్నానశౌచాదికమును నేను జేసినట్లును చూచెడిజనులు కల్పించెదరనియంటివేని అన్యులచేత జేయబడిన కల్పనవలన నాకేమియు బాధలేదు. అనగా పూర్వోక్తనిద్రాభిక్షాద్యపేక్షయు, స్నానజపాదికర్మానుష్ఠానంబును, నాదృష్టిచేత నాకు లేనేలేదనియు, అవి నాకు గలిగియున్నట్లు అన్యులచేతనే కల్పించబడెననియు ఆయన్యకల్పనచేత నాకు బాధలేదనియు నభిప్రాయము.

అవ. అన్యకల్పనచేత బాధలేదనుటయందు దృష్టాంతమును జెప్పుచున్నాడు.

శ్లో॥ గుంజాపుంజాదిదహ్యేత నాన్యారోపితవహ్నినా।
నాన్యారోపితసంసార ధర్మానేవమహంభజే॥ ౪౮.

టీ. అన్యారోపితవహ్నినా=అన్య - అన్యులచేత, ఆరోపిత - కల్పించబడిన, వహ్నినా-అగ్నిచేత, గుంజాపుంజాది=గుంజా - పూసగురివిందపొదయు, పుంజాది-ధాన్యపురాశిమొదలగునదియు, నదహ్యేత - దహింపబడదు. ఏవం-ఈప్రకారము, అహం-నేను, అన్యారోపితసంసారధర్మాన్= అన్య - ఇతరులచేత, ఆరోపిత- కల్పించబడిన, సంసారధర్మాన్ - సాంసారిక ధర్మములను, నభజే - పొందను.

తా. ప్ర. అయితే, అన్యకల్పనచేతగూడ బాధగలదుగదా? ఉ. అన్యులచే నారోపింపబడిన అగ్నిచేత పూసగురివిందమొదలగు పొదలును, ధాన్యపురాశి మొదలగునదియు దహింపబడనట్లు, అన్యులచే నాయందు కల్పించబడెడి సాంసారికధర్మములను నేనుపొందను.

శ్లో॥ శృణ్వంత్వజ్ఞాతతత్వాస్తే జానన్కస్మాచ్ఛృణోమ్యహం।
మన్యంతాంసంశయాపన్నా నమన్యేహమసంశయః॥ ౪౯.

టీ. అజ్ఞాతతత్వాః=అజ్ఞాత-ఎరుగబడని, తత్వాః- జీవబ్రహ్మైక్యలక్షణముగల, అనగా బ్రహ్మసాక్షాత్కారములేనియనుట. తే - ఆముముక్షువులు, శృణ్వంతు-వేదాంతార్థమును విందురుగాక, అనగా వేదాంతశ్రవణమును జేయవలెననుట. అహం-నేను, జానన్-పరతత్వము నెరిగినవాడనగుచు, కస్మాత్-ఎందువలన, శృణోమి- వినెదను. అనగా వేదాంత శ్రవణమును జేయననుట. సంశయాపన్నాః= సంశయ- సందేహమును, ఆపన్నాః-పొందినవారు,మన్యం


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తాం-మననము జేయుదురుగాక. అసంశయః - సంశయములేని, అహం- నేను, నమన్యే- మననము జేయను.

తా. ప్ర. అయితే, నీకు, ఇతరఫలేచ్ఛలేకపోవుచుండగా, నీవు కర్మానుష్ఠానమును జేయకున్నను, తత్వసాక్షాత్కారముకొరకు వేదాంతశ్రవణాదికము జేయదగినదేయగుగదా? ఉ. జీవబ్రహ్మైక్యలక్షణముగల పరతత్వము నెరుగనిముముక్షువులు, వేదాంతార్థ శ్రవణమును జేయుదురు. నేను బ్రహ్మసాక్షాత్కారముగలవాడనగుటచేత వేదాంతార్థశ్రవణమును జేయను. మరియు, జీవబ్రహ్మైక్యలక్షణపరతత్వవిషయమై తత్వమీప్రకారమో, లేక మరియొకవిధమో యనెడిరూపముగల సంశయవంతులు వేదాంతార్థమును మననము జేయుదురు. నేను నిస్సంశయుడనగుటచేత మననమును జేయను.

శ్లో॥ విపర్యస్తోనిదిధ్యాసేత్కింధ్యానమవిపర్యయాత్।
దేహాత్మత్వవిపర్యాసం నకదాచిద్భజామ్యహం॥ ౪౮.

టీ. విపర్యస్తః - విపరీతభావనను జేయువాడు, నిదిధ్యాసేత్- నిదిధ్యాసమును జేయవలెను. అవిపర్యయాత్- విపరీతభావములేమివలన, ధ్యానం-నిదిధ్యాసము, కిం - చేయవలసినపనియేమి, అనగా జేయననుట. దేహాత్మత్వవిపర్యాసం= దేహ - దేహమందు, ఆత్మత్వ- ఆత్మత్వబుద్ధిలక్షణముగల, విపర్యాసం- విపరీతభావనను, అహం- నేను, కదాచిత్-ఎప్పటికిని, నభజామి-పొందను.

తా. ప్ర. అయితే, వేదాంతశ్రవణమననములతోటి నీకావశ్యకములేకపోయినను, విపరీతభావమును పోగొట్టుకొనుటకొరకు నిదిధ్యాసమైనను నీచేత జేయదగినదికాదా యేమి? ఉ. దేహాదికమందు ఆత్మత్వబుద్ధిలక్షణముగల విపరీతభావమును జేసెడివాడు, ఆవిపరీతభావము నశించెడికొరకు (అహంబ్రహ్మస్మి) అనెడి చింతనారూపముగల నిదిధ్యాసమును జేయవలెను. అట్టి విపరీతభావము లేకపోవుచుండగా, నిదిధ్యాసరూపధ్యానమును జేయవలసినపనిలేదు. దేహాదికమందు ఆత్మత్వబుద్ధిలక్షణముగల విపరీతభావమును నేనెప్పటికిని బొందను. అనగా దేహాదికమందు ఆత్మత్వబుద్ధిలక్షణముగల విపరీతభావము నాకులేమిచేత ఆనిదిధ్యాసముగూడ నాచే ననుష్ఠింపదగినదిగాదని యభిప్రాయము.

శ్లో॥ అహంమనుష్యఇత్యాది వ్యవహారోవినాప్యముం।
విపర్యాసంచిరాభ్యస్తవాసనాతోఽవకల్పతే॥ ౪౯.

టీ. అముం-ఈ, విపర్యాసం- విపరీతభావమును, వినాపి - విడచినను, చిరాభ్యస్తవాసనాతః=చిర - బహుకాలమునుంచి, అభ్యస్త-అభ్యసింపబడిన, వాసనాతః - వాసనావశమువలన, అహం- నేను, మనుష్యః-మనుష్యుడననెడి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇత్యాదివ్యవహారః - ఇత్యాదిరూపక వ్యవహారము, అవకల్పతే - కల్పించబడుచున్నది.

తా. ప్ర. అయితే, మీకు విపర్యయము లేనియెడల నేను మనుష్యుడననెడి వ్యవహారము మీకెట్లుఘటించును? ఉ. ఈవిపరీతభావనను విడచినను బహుకాలమునుంచి యభ్యసింపబడిన వాసనావశముచేత నేను మనుష్యుడననెడి ఇత్యాది వ్యవహారము కల్పించబడుచున్నదని తెలిసికొనుము.

శ్లో॥ ప్రారబ్ధకర్మణిక్షీణే వ్యవహారోనివర్తతే।
కర్మాక్షయేప్యసౌనైవశామ్యేద్ధ్యానసహస్రతః॥ ౫౦.

టీ. ప్రారబ్ధకర్మణి- ప్రారబ్ధకర్మము, క్షీణేసతి- క్షయమునుబొందుచుండగా, వ్యవహారః - నేనుమనుష్యుడననెడి వ్యవహారము, నివర్తతే- నివృత్తిని బొందుచున్నది. కర్మాక్షయేపి = కర్మ - ప్రారబ్ధకర్మముయొక్క, అక్షయేపి- క్షయాభావమందో, అసౌ-ఈవ్యవహారము, ధ్యానసహస్రతః - ధ్యానసహస్రమువలన, నైవశామ్యేత్ - నాశనమును పొందనేపొందదు.

తా. ప్ర. అయితే, ఈవ్యవహారముయొక్క నివృత్తిసిద్ధికొరకు మీచేత ధ్యానము సంపాదింపదగినదే యగుగదా? ఉ. ప్రారబ్ధకర్మము క్షయించుచుండగా, ఈమనుష్యత్వాది వ్యవహారము నివర్తించుచున్నది. ప్రారబ్ధకర్మము క్షయించనియెడల ధ్యానసహస్రముచేతనైనను ఈవ్యవహారము నివర్తింపదు.

శ్లో॥ విరళత్వంవ్యవహృతేరిష్టంచేద్ధ్యానమస్తుతే।
అబాధికాంవ్యవహృతింపశ్యన్ ధ్యాయామ్యహంకుతః॥ ౫౧.

టీ. వ్యవహృతేః-మనుష్యత్వాదివ్యవహారముయొక్క,విరళత్వం-వెలితి, అనగా నబాహుళ్యత్వమనుట. ఇష్టంచేత్-ఇష్టమైనయెడల, తే-నీకు, ధ్యానం-ధ్యానము, అస్తు-అగుగాక. అహం- నేను, వ్యవహృతిం- వ్యవహారమును, అబాధికాం- బాధకముగానిదానినిగా, పశ్యన్ - చూచుచు, కుతః - ఎందువలన, ధ్యాయామి - ధ్యానముజేసెదను. అనగా ధ్యానముజేయననుట.

తా. ప్ర. అయితే, ప్రారబ్ధకర్మనిమిత్తకమగు వ్యవహారముయొక్క అబాహుళ్యతకొరకైనను, మీచేత ధ్యానము జేయదగినదికాదాయేమి? ఉ. నీవు వ్యవహారముయొక్క అబాహుళ్యత్వమును గోరితివేని ధ్యానమును జేయుము. నేను వ్యవహారమును బాధకముగానిదానినిగాజూచుచు, ఎందువలన ధ్యానించెదను. అనగా వ్యవహారము నాకుబాధకముగాగనబడుచుండుటచేత దానినివృత్తికొరకు నాచేత ధ్యానమనుష్ఠింపదగినదిగాదని యభిప్రాయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ విక్షేపోనాస్తియస్మాన్మే నసమాధి స్తతోమమ।
విక్షేపోవాసమాధిర్వా మనసస్స్యాద్వికారిణః॥ ౫౨.

టీ. యస్మాత్ - ఏకారణమువలన, మే - నాకు, విక్షేపః - విక్షేపము, నాస్తి-లేదో, తతః-ఆకారణమువలన, మమ-నాకు, సమాధిః-సమాధి, న-లేదు. విక్షేపోవా- విక్షేపమైనను, సమాధిర్వా - సమాధియైనను, వికారిణః - వికారియగు, మనసః - మనస్సునకు, స్యాత్-అగును.

తా. ప్ర. అయితే, మీచేతధ్యానము జేయదగినదిగాకపోయినను, విక్షేపము నశించెడికొరకు మీచేత సమాధి జేయదగినదికాదా యేమి? ఉ. ఏకారణముచేత నాకు విక్షేపములేదో ఆకారణముచేత నాకు సమాధిలేదు. మరియు, విక్షేపమైనను సమాధియైనను వికారియగుమనస్సునకగును. అనగా, విక్షేపసమాధులు రెండును మనోధర్మములగుటవలన, విక్షేపమును నివారింపజేసెడి సమాధియందును నిర్వికారుడనగు నాకధికారములేదని యభిప్రాయము.

అవ. ఈచెప్పబడిన కృతకృత్యత్వము నిప్పుడు ముగింపుచున్నాడు.

శ్లో॥ నిత్యానుభవరూపస్య కోవామేఽనుభవఃపృథక్।
కృతంకృత్యంప్రాపణీయం ప్రాప్తమిత్యేవనిశ్చయః॥ ౫౩.

టీ. నిత్యానుభవరూపస్య=నిత్య-సర్వదా, అనుభవరూపస్య - అనుభవరూపుడనగు, మే-నాకు, పృథక్ - అన్యమయిన, అనుభవః - అనుభవము, కోవా-ఎద్దియోజెప్పుము. కృత్యం - చేయదగినది, కృతమితి - చేయబడెననియు, ప్రాపణీయం- పొందదగినది, ప్రాప్తమిత్యేవ - పొందబడెననియే, నిశ్చయః- నానిశ్చయమగును.

తా. ప్ర. అయితే, సమాధిఫలమగు అనుభవము మీచేత సంపాదింపదగినదియగుగదా? ఉ. సర్వదా అనుభవరూపుడనగునాకు, అన్యమయినఅనుభవములేదు. అనగా నాయనుభవము నాస్వరూపమగుటచేత, అది సంపాదింపదగినదికాదని యభిప్రాయము. నాచేత జేయదగినకార్యవర్గమంతయు జేయబడినట్లాయెననియు, పొందదగినఫలవర్గమంతయు పొందబడెననియే నానిశ్చయమగును. ఇదియే కృతకృత్యత్వమని తెలియవలెను.

శ్లో॥ వ్యవహారోలౌకికోవా శాస్త్రీయోవాన్యథాపివా।
మమాకర్తురలేపస్య యథారబ్ధంప్రవర్తతాం॥ ౫౪.

టీ. లౌకికోవా-భిక్షాహారాదిరూపమయినను, శాస్త్రీయోవా- జపసమాధ్యాదిరూపమయినను, అన్యథాపివా - హింసాదిరూపమైన, వ్యవహారః-వ్యవహారము, అకర్తుః- అకర్తనైనట్టియు, అలేపస్య - భోక్తృత్వములేనట్టి, మమ-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాకు అరబ్ధంయథా - ప్రారబ్ధకర్మము నతిక్రమించక, ప్రవర్తతాం - ప్రవర్తించుగాక.

తా. ప్ర. అయితే, ఈప్రకారము మీకంతటను కర్తృత్వము లేకపోవుచుండగా, మీకు అనియతవృత్తిత్వము ప్రాప్తించదాయేమి? ఉ. కర్తృత్వభోక్తృత్వరహితుడనగు నాకు ప్రారబ్ధకర్మము నతిక్రమించక, భిక్షాహారాది లౌకిక వ్యవహారమైనను జపసమాధ్యాది శాస్త్రీయ వ్యవహారమైనను, ప్రతిషిద్ధరూప హింసాది వ్యవహారమైనను గలుగుట మాకిష్టమేయగును. అనగా ప్రారబ్ధవశముచేత ప్రాప్తించెడి అనియతవృత్తిత్వము గలిగినను గలుగనిమ్మని యభిప్రాయము.

అవ. ఇట్లు వస్తుతత్వమునుదెలిపి, ప్రౌఢవాదముచే నిప్పుడుచెప్పుచున్నాడు.

శ్లో॥ అథవాకృతకృత్యోపి లోకానుగ్రహకామ్యయా।
శాస్త్రీయేణైవమార్గేణ వర్తేహంకామమక్షతిః॥ ౫౫.

టీ. అథవా-మరియొకపక్షమందు, అహం-నేను, కృతకృత్యోపి- కృతార్థుడనైనను, లోకానుగ్రహవాంఛయా= లోక - ప్రాణులయందు, అనుగ్రహవాంఛయా - అనుగ్రహేచ్ఛచేత, శాస్త్రీయేణ - శాస్త్రసమ్మతమగు, మార్గేణైవ- మార్గముచేతనే, కామం-మిక్కిలిగా, వర్తే - ప్రవర్తించెదను. అక్షతిః-బాధలేదు.

తా. మరియు, నేనుకృతకృత్యుడనైనను మరియొకపక్షమందు ప్రాణులయందు అనుగ్రహేచ్ఛచేత శాస్త్రసమ్మతమార్గముచేతనే మిక్కిలిగా ప్రవర్తించెదను. అందుచేత బాధలేదు.

శ్లో॥ దేవార్చనస్నానశౌచ భిక్షాదౌవర్తతాంవపుః।
తారంజపతువాక్తద్వత్పఠత్వామ్నాయమస్తకం॥ ౫౬.

టీ. వపుః-శరీరము, దేవార్చనస్నానశౌచభిక్షాదౌ=దేవార్చన- దేవతార్చనము జేయుటయందును, స్నాన - స్నానము జేయుటయందును, శౌచ-శుచిత్వమందును, భిక్షాదౌ-భిక్షాహరణాదికమందు, వర్తతాం - ప్రవర్తించుగాక. వాక్-నోరు, తారం-ప్రణవమును, పఠతు- పఠించుగాక. తద్వత్ - ఆప్రకారముగా, ఆమ్నాయమస్తకం - వేదాంతశాస్త్రమును, పఠతు-పఠించుగాక. అనగా పఠించుననుట.

తా. ప్ర. అయితే, శాస్త్రీయమార్గమందే మీరు ప్రవర్తనము నంగీకరించినయెడల ఆయభిమానప్రయుక్తవికారము మీకు కలుగదాయేమి?

ఉ. దేవతార్చనమును జేయుటయందును, స్నానమును చేయుటయందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ను, శుచిత్వమందును, భిక్షాహరణాదికమందును దేహము ప్రవర్తించును. మరి యు, నోరు, ప్రణవమునైనను, వేదాంత శాస్త్రమునైనను పఠించుచుండును.

శ్లో॥ విష్ణుంధ్యాయతుధీర్యద్వా బ్రహ్మానందేపిలీయతాం।
సాక్ష్యహంకించిదప్యత్రనకుర్వేనాపికారయే॥ ౫౭.

టీ. ధీః-బుద్ధి, విష్ణుం-విష్ణుదేవుని, ధ్యాయతు-ధ్యానించుగాక. యద్వా-లేక, బ్రహ్మానందే=బ్రహ్మ-బ్రహ్మస్వరూపమగు, ఆనందే- ఆనందమందు, విలీయతాం-లీనమును పొందుగాక. అత్ర-ఈబుద్ధ్యాది వ్యవహారవిషయమై, సాక్షీ-సాక్షినగు, అహం-నేను, కించిదపి-కొంచెమైనను, నకుర్వే- చేయుచుండెడివాడనుంగాను. నాపికారయే - చేయించుచుండెడి వాడనుంగాను.

తా. మరియు, నాబుద్ధి విష్ణువును ధ్యానము జేయుచుండును. లేక, బ్రహ్మానందమందు లయించును. ఈబుద్ధికి సాక్షినగు నేను, కొంచెమైనను చేసినవాడనుంగాను. చేయించినవాడనుంగాను.

అవ. ఈపూర్వోక్తగ్రంథముయొక్కయు, నిక జెప్పబోయెడి గ్రంథముయొక్కయు, తాత్పర్యము నిప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ కృతకృత్యతయాతృప్తః ప్రాప్తప్రాప్యతయాపునః।
తృప్యన్నేవంస్వమనసామన్యతేఽసౌనిరంతరం॥ ౫౮.

టీ. అసౌ-ఈవిద్వాంసుడు, కృతకృత్యతయా=కృత-చేయబడిన, కృత్యతయా- కార్యవర్గముగలవానిభావముచేత, తృప్తస్సన్- పూర్వోక్తప్రకారము తృప్తినిబొందినవాడగుచు, పునః-మరల, అనగా జెప్పబోయెడి ప్రకారముగా ననుట, ప్రాప్తప్రాప్యతయా=ప్రాప్త-పొందబడిన, ప్రాప్యతయా - ఫలవర్గముగలవానిభావముచేతను, తృప్యన్- తృప్తిని బొందినవాడగుచు, స్వమనసా=స్వ-తనయొక్క, మనసా-మనస్సుచేత, నిరంతరం- సర్వదా, ఏవం-ఈప్రకారము, మన్యతే - తలచుచున్నాడు.

తా. ఈజ్ఞాని, పూర్వోక్తప్రకారము కృతకృత్యత్వముచేత తృప్తినిబొందినవాడగుచు, ఇకజెప్పబోయెడిప్రకారము ప్రాప్తప్రాప్యత్వముచేత తృప్తుడగుచు తనమనస్సుచేత (సర్వదా) ఈక్రిందజెప్పబోయెడి ప్రకారముగా దలచున్నాడు.

శ్లో॥ ధన్యోఽహంధన్యోఽహంనిత్యంస్వాత్మానమంజసావేద్మి।
ధన్యోఽహంధన్యోఽహంబ్రహ్మానందోవిభాతిమేస్పష్టం॥ ౫౯.

టీ. నిత్యం-సర్వదా, స్వాత్మానం- నాస్వరూపమగు ప్రత్యగాత్మను,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అంజసా-సాక్షాత్తుగా, (యతః) ఏకారణమువలన, వేద్మి-ఎరుగుదునో, (అతః) ఈకారణమువలన, అహం - నేను, ధన్యః - కృతార్థుడనైతిని. అహం-నేను, ధన్యః-కృతార్థుడనైతిని. బ్రహ్మానందః=బ్రహ్మ - బ్రహ్మరూపమగు, ఆనందః-ఆనందము, మే-నాకు, స్పష్టం-స్పష్టముగా, విభాతి- స్ఫురించుచున్నది. అతః-ఇందువలన, అహం-నేను, ధన్యః- కృతార్థుడనైతిని. అహం - నేను, ధన్యః-కృతార్థుడనైతిని.

తా. ప్ర. అజ్ఞాని, తనమనస్సుచేత నేమిదలచునో చెప్పుము? ఉ. సర్వదా నాయొక్కనిజరూపమగు దేశకాలాద్యనవచ్ఛిన్న ప్రత్యగాత్మను సాక్షాత్తుగా నెరిగితిని. అందువలన నేను కృతార్థుడనైతిని, నేను కృతార్థుడనైతినని జ్ఞాని తలచుచున్నాడు. ఆదరార్థమంమ ద్విరుక్తియగును. ఇది ఆత్మజ్ఞానలాభనిమిత్తకమగు తృప్తియగును. మరియు, బ్రహ్మస్వరూపమగు ఆనందము నాకు స్పష్టముగా స్ఫురించుచున్నది. అందువలన నేను కృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతినని జ్ఞానితలచుచున్నాడు. ఇది ఆత్మజ్ఞాన ఫలలాభనిమిత్తకమగు తృప్తియగునని తెలియవలెను.

అవ. ఇటు, జ్ఞానికి ఇష్టప్రాప్తియందు తృప్తినిదెలిపి, అనిష్టము నివర్తించుటచేతంగూడ తృప్తిని బొందుచున్నాడని ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ధన్యోఽహంధన్యోఽహందుఃఖం సాంసారికంనవీక్షేఽద్య।
ధన్యోఽహంధన్యోఽహంస్వస్యాజ్ఞానంపలాయితంక్వాపి॥ ౬౦.

టీ. అద్య-ఇప్పుడు, సాంసారికం-సంసారసంబంధమగు, దుఃఖం- దుఃఖమును, నవీక్షే-చూచుచున్నవాడనుగాను. (అతః) ఈకారణమువలన, అహం-నేను, ధన్యః - కృతార్థుడనైతిని. అహం - నేను, ధన్యః - కృతార్థుడనైతిని. స్వస్య-నాయొక్క, అజ్ఞానం - అనేకకర్మవాసనాసమూహముగల యజ్ఞానము, క్వాపి- ఎచ్చటనో, పలాయితం- పలాయితమాయెను. అనగా నశించెననుట. (అతః) ఈకారణమువలన, అహం- నేను, ధన్యః - కృతార్థుడనైతిని. అహం-నేను, ధన్యః - కృతార్థుడనైతిని.

తా. మరియు, ఇప్పుడు దుఃఖస్వరూపమగు సంసారమును నేనుజూచుచున్నవాడనుగాను. అందుచేత నేను కృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతిని. దుఃఖము లోపమికి గారణమేమనగా, నాయొక్క అనేకకర్మవాసనాసమూహముగల అజ్ఞానమునశించెను. అందుచేత నేను కృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతినని జ్ఞానితలచుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇప్పుడు, అజ్ఞాననివృత్తిఫలంబును, కృతకృత్యత్వంబును, ప్రాప్త ప్రాప్యత్వంబును జూపుచున్నాడు.

శ్లో॥ ధన్యోఽహంధన్యోఽహంకర్తవ్యంమేనవిద్యతేకించిత్।
ధన్యోఽహంధన్యోఽహంప్రాప్తవ్యంసర్వమద్యసంపన్నం॥ ౬౧.

టీ. మే-నాకు, కర్తవ్యం- చేయదగినది, కించిత్ - కొంచెమైనను. నవిద్యతే-లేదు. (అతః) ఇందువలన, అహం-నేను,ధన్యః-కృతార్థుడనైతిని. అహం-నేను. ధన్యః-కృతార్థుడనైతిని. ప్రాప్తవ్యం - పొందదగిన ఫలవర్గము, సర్వం-అంతయు, అద్య-ఇప్పుడు, సంపన్నం - పొందబడెను. అనగా పొందబడినట్లేయాయెననుట. (అతః) ఇందువలన, అహం-నేను, ధన్యః - కృతార్థుడనైతిని. అహం-నేను, ధన్యః-కృతార్థుడనైతిని.

తా. మరియు, నాకు చేయదగిన కర్మోపాసనాదికము కొంచెమైననులేనందున నేను కృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతిని. మరియు, పొందదగినఫలవర్గమంతయు ఇప్పుడు నాచేపొందబడినట్లాయెను. కనుక, నేను కృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతినని జ్ఞానితలంచుచున్నాడు.

అవ. ఇప్పుడు, కృతకృత్యత్వాదికముచే గలిగిన తృప్తికి నిరతిశయత్వమును జెప్పుచు ఈతృప్తికంటె మరియొకటి చెప్పదగినది కనబడమివలన తృప్తియే సర్వదా స్ఫురించుచున్నదని చూపుచున్నాడు.

శ్లో॥ ధన్యోఽహంధన్యోఽహంతృప్తేర్మేకోపమాభవేల్లోకే।
ధన్యోఽహంధన్యోఽహంధన్యోధన్యఃపునఃపునర్ధన్యః॥ ౬౨.

టీ. మే-నాయొక్క, తృప్తేః-తృప్తికి, ఉపమా-పోలిక, అనగా సమానవస్తువనుట. లోకే-లోకమందు, కా-ఎద్ది, భవేత్-కలదు. అనగా నెద్దియు తృప్తితోటి సమానముగాదనుట. (అతః) ఇందువలన, అహం-నేను, ధన్యః- కృతార్థుడనైతిని. అహం-నేను, ధన్యః - కృతార్థుడనైతిని. అహం - నేను, ధన్యః-కృతార్థుడనైతిని. అహం-నేను, ధన్యః - కృతార్థుడనయితిని. ధన్యః-కృతార్థుడనయితిని. పునఃపునః- మాటిమాటికిని, ధన్యః- కృతార్థుడనైతిని.

తా. మరియు, నాయొక్కతృప్తికి సమానమైనవస్తువెద్దియు లోకమందు లేదు. అందువలన, నేనుకృతార్థుడనయితిని. నేనుకృతార్థుడనయితిని. ఈతృప్తికంటె మరియొకటి చెప్పదగినది కనబడమిచేత, నేనుకృతార్థుడనయితిని. నేను కృతార్థుడనయితిని. మాటిమాటికిని కృతార్థుడనయితిని. కృతార్థుడనయితిని. కృతార్థుడనయితినని జ్ఞానితలంచుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఈచెప్పబడిన సర్వశుభమునకును గారణభూతమగు పుణ్యరాశి పరిపాకమును స్మరించి సంతోషించుచు, ఇవ్విధపుణ్యమును సంపాదించిన తననుస్మరించియు సంతోషించుచున్నాడని ఇప్పుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ అహోపుణ్యమహోపుణ్యం ఫలితంఫలితందృఢం।
అస్యపుణ్యస్యసంపత్తే రహోవయమహోవయం॥ ౬౩.

టీ. అహో-ఓహో, ఆశ్చర్యార్థకము. పుణ్యం-మాపుణ్యము, దృఢం-దృఢముగా, ఫలితం-ఫలించెను. అహో - ఓహో, పుణ్యం - మాపుణ్యము, దృఢం-దృఢముగా, ఫలితం-ఫలించెను. అస్య-ఈ, పుణ్యస్య - పుణ్యముయొక్క, సంపత్తేః-సంపత్తివలన, అహో-ఓహో, వయమేవ - మేమే, అహో-ఓహో, వయం-మేము.

తా. అహో, మాపుణ్యము దృఢముగా ఫలించెను. అహో మాపుణ్యము దృఢముగాఫలించెను. ఈపుణ్యసంపత్తివలన, ఓహో మేమే, ఓహో మేమని, ఆశ్చర్యముగా జ్ఞానితలచుచు సంతోషించుచున్నాడు.

అవ. ఇప్పుడు, బ్రహ్మజ్ఞానసాధనమగు వేదాంత శాస్త్రంబును, ఆశాస్త్రము నుపదేశించినట్టి ఆచార్యునిస్మరించి సంతోషించుచు, మరలశాస్త్రజన్యజ్ఞానతత్సుఖములందలంచి సంతోషించుచున్నాడు.

శ్లో॥ అహోశాస్త్రమహోశాస్త్ర మహోగురురహోగురుః।
అహోజ్ఞానమహోజ్ఞాన మహోసుఖమహోసుఖం॥ ౬౪.

టీ. శాస్త్రం- వేదాంతశాస్త్రము, అహో, ఓహో యెంతమనోహరము. శాస్త్రం - వేదాంతశాస్త్రము; అహో - ఓహో యెంతమనోహరము. గురుః-మాయాచార్యుడు, అహో-ఓహోయెంతవాడు. గురుః- మాయాచార్యుడు, అహో-ఓహోయెంతవాడు. జ్ఞానం - అద్వైతాత్మతత్వవిజ్ఞానము, అహో- ఓహోయెంతమంచిది. జ్ఞానం-అద్వైతాత్మతత్వవిజ్ఞానము, అహో-ఓహోయెంతమంచిది. సుఖం-మాసుఖము, అహో - ఓహో,యెంతగొప్పది. సుఖం మాసుఖము, అహో - ఓహోయెంతగొప్పది.

తా. వేదాంతశాస్త్రము ఓహోయెంతమనోహరము. వేదాంతశాస్త్రము ఓహోయెంతమనోహరము. ఓహోమాగురువెంతవాడు. ఓహో మాగురువెంతవాడు. ఓహో అద్వైతాత్మతత్వవిజ్ఞానమెంతమంచిది. ఓహోఅద్వైతాత్మతత్వవిజ్ఞానమెంతమంచిది. ఓహోమాసుఖమెంతగొప్పది. ఓహో మాసుఖమెంతగొప్పది. అనియిట్లు జ్ఞాని ఆశ్చర్యముగా దలచుచు సంతోషించుచున్నాడని తెలియవలెను.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ ఇప్పుడధ్యాయార్థము నుపసంహారము జేయుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మానందాభిధే గ్రంథే చతుర్థోఽధ్యాయ ఈరితః।
విద్యానంద స్తదుత్పత్తి పర్యంతోఽభ్యాస ఇష్యతాం॥ ౬౫.

టీ. బ్రహ్మానందాభిధే- బ్రహ్మానంద - బ్రహ్మానందమనెడి, అభిధే-పేరు గల, గ్రంథే - అధ్యాయపంచకమందు, విద్యానందః - విద్యానందమనెడి, చతుర్థః- నాల్గవదగు, అధ్యాయః - అధ్యాయము, ఈరితః - చెప్పంబడినది. తదుత్పత్తిపర్యంతః = తత్-అవిద్యానందంబుయొక్క, ఉత్పత్తిపర్యంతః - ఉదయపర్యంతము, అనగా విద్యానందము గలిగెడి పర్యంతంబనుట. అభ్యాసః- బ్రహ్మాభ్యాసము, ఇష్యతాం - అంగీకరింపబడుగాక. అనగా బ్రహ్మాభ్యాసమును జేయవలెననుట.

తా. ఈప్రకారముగా బ్రహ్మానందంబనెడి యధ్యాయపంచక గ్రంథమందు విద్యానందమనెడి చతుర్థాధ్యాయంబు జెప్పబడినది. ఆవిద్యానందంబు దయించెడి పర్యంతము బ్రహ్మాభ్యాసమును జేయవలెనని తెలియవలెను.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థ విద్యారణ్య
మునివర్య విరచిత బ్రహ్మానందే విద్యానందనామకం
చతుర్దశ ప్రకరణం సమాప్తం.

గద్య. ఇది శ్రీపరమేశ్వరగురు చరణ వరప్రసాదలబ్ధ బ్రహ్మవిద్యా
విరాజిత కాశ్యపసగోత్ర పవిత్ర మంత్రివంశపయః పారావార
పరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్య పుత్ర లక్ష్మీనారాయణా
మాత్య ప్రణీతంబైన ఆంధ్రటీకాతాత్పర్య సహిత
శ్రీవేదాంతపంచదశియందు బ్రహ్మానందనామక
గ్రంథస్థిత విద్యానందమనెడి
చతుర్దశ ప్రకరణము
సంపూర్ణము.

—*—

ఓం తత్సత్ శ్రీపరమేశ్వరార్పణమస్తు.

శ్లో॥ విద్యానందనందస్యటీకేయం పదతాత్పర్యబోధినీ।
నారాయణాఖ్యవిదుషా శివపాదసమర్పితా॥



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శుభమస్తు.

శ్రీపరమేశ్వర సద్గురుపరబ్రహ్మణేనమః.

# విషయానంద ప్రారంభము.



అవ. ఈపంచమాధ్యాయమందు బ్రతిపాదింపబడెడి యర్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ అథాత్రవిషయానందో బ్రహ్మానందాంశరూపభాక్।
నిరూప్యతేద్వారభూత స్తదంశత్వంశ్రుతిర్జగౌ॥ ౧.

టీ. అథ-అనంతరము, అత్ర-ఈప్రకరణమందు, ద్వారభూతః - బ్రహ్మానందమునకు ద్వారభూతముగానున్నట్టియు, బ్రహ్మానందాంశరూపభాక్=బ్రహ్మానంద-బ్రహ్మానందముయొక్క, అంశరూప- అంశత్వమును, భాక్ - పొందినదియనగు, విషయానందః - విషయానందంబు, నిరూప్యతే-నిరూపింపబడుచున్నది. తదంశత్వం=తత్- ఆబ్రహ్మానందముయొక్క, అంశత్వం - అంశత్వమును, శ్రుతిః-శ్రుతి, జగౌ - చెప్పెను.

తా. తదనంతర మిప్పుడీప్రకరణమందు బ్రహ్మానందాంశత్వమును బొందినట్టి విషయానందంబు నిరూపింపబడును. ప్ర. అయితే, విషయానందంబు లోకసంబంధముగలదగుచుండగా మోక్షశాస్త్రమందు నిరూపణము జేయుట యుక్తమెట్లగును? ఉ. ఆవిషయానందంబునకు లౌకికప్రసిద్ధత్వముగలిగియున్నను బ్రహ్మానందముయొక్క యేకదేశముగలదగుటచేత బ్రహ్మజ్ఞానమునకునుపయోగిగానుండుటవలన మోక్షశాస్త్రమందు నిరూపింపబడుచున్నది. అనగా బ్రహ్మానందమునకు ద్వారముగనుండుటవలన నిరూపింపబడుచున్నదని యభిప్రాయము. ప్ర. అయితే, విషయానందము బ్రహ్మానందముయొక్క ఏకదేశముగలదనుటయందు బ్రమాణమేమి? ఉ. విషయానందము బ్రహ్మానందముయొక్క అంశమని శ్రుతిజెప్పుచున్నది. కనుక, శ్రుతియేప్రమాణమగును.

అవ. ఆశ్రుత్యర్థమునే యిప్పుడు పఠించుచున్నాడు.

శ్లో॥ ఏషోస్యపరమానందో యోఽఖండైకరసాత్మకః।
అన్యానిభూతాన్యేతస్య మాత్రామేవోపభుంజతే॥ ౨.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. అస్య-ఈప్రత్యగభిన్న పరబ్రహ్మముయొక్క, యః-ఏ, ఏషః-ఈ, పరమానందః- స్వరూపభూత పరమానందంబుగలదో (సః) ఆపరమానందం బు, అఖండైకరసాత్మకః - స్వగతాదిభేదశూన్య కేవల వస్తుమాత్రస్వరూపం బుగల దగును. అన్యాని- ఇతరములగు, భూతాని-ప్రాణులు, ఏతస్య - ఈబ్ర హ్మానందంబుయొక్క, మాత్రామేవ - లేశత్వమునే, ఉపభుంజతే- అనుభవిం చుచున్నవి.

తా. ఈపరబ్రహ్మముయొక్క ఏస్వరూపభూత పరమానందంబుగల దో, యాపరమానందంబు సజాతీయవిజాతీయ స్వగతభేదశూన్యమగు కేవలవ స్తుమాత్రస్వరూపంబుగలదగును. ఇతరప్రాణులు ఈబ్రహ్మానందంబుయొక్క లేశత్వము నే యనుభవించుచున్నారని శ్రుతిచెప్పుచున్నది. అనగా సర్వప్రాణు లు ననుభవించెడి యేవిషయానందంబుగలదో యావిషయానందము బ్రహ్మా నందముయొక్క లేశమగునని యభిప్రాయము.

అవ. ఇప్పుడు విషయానందంబు బ్రహ్మానందముయొక్క లేశమగునని చూపుటకొరకు తదుపాధిభూతములకు అంతఃకరణవృత్తులను విభజించి తెలుపు చున్నాడు.

శ్లో॥ శాంతా ఘోరా స్తథామూఢా మనసోవృత్తయస్త్రిధా।
వైరాగ్యంక్షాంతిరౌదార్య మిత్యాద్యాశ్శాంతవృత్తయః॥ ౩.

టీ. మనసః-మనంబుయొక్క, వృత్తయః-వృత్తులు, శాంతాః- సాత్విక ములనియు, ఘోరాః-రాజసములనియు, తథా-ఆప్రకారము, మూఢాః-తామ సములని, త్రిధా- మూడువిధములుగానున్నవి. వైరాగ్యం-విరక్తియు, క్షాంతిః- ఓర్పును, ఔదార్యం-ఉదారత్వంబును, ఇత్యాద్యాః-ఇవిమొదలగునవి, శాంత వృత్తయః-సాత్వికవృత్తులగును. అనగా సత్వగుణసంభవ వృత్తులగుననుట.

తా. మనంబుయొక్క వృత్తులు, ౧. సాత్వికములనియు, ౨. రాజసము లనియు, ౩. తామసములని ఇట్లు త్రివిధముగా జెప్పంబడుచున్నవి. ప్ర. అయితే, అందుసాత్వికవృత్తులెవ్వి? ఉ. విషయభోగవిరక్తియు, ఓర్పును,ఉదా రత్వంబు మొదలగు ఇత్యాది వృత్తులు సాత్వికవృత్తులగును.

శ్లో॥ తృష్ణాస్నేహౌరాగలోభా విత్యాద్యా ఘోరవృత్తయః।
సమ్మోహోభయమిత్యాద్యాః కథితామూఢవృత్తయః॥ ౪.

టీ. తృష్ణా-పేరాసయు, స్నేహః-స్నేహంబును,అనగా విషయములయం దుప్రీతియనుట. రాగలోభౌ=రాగ - కామంబును, లోభా- పరధనమందపేక్ష యు, ఇత్యాద్యాః- ఇవిమొదలగు వృత్తులు, ఘోరవృత్తయః - రాజసవృత్తుల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గును. అనగా రజోగుణ సంభవ వృత్తులగుననుట. సమ్మోహః - సమ్మోహంబును, అనగా జేయదగినదానిని మరచుటయనుట. భయం-భీతియు, ఇత్యాద్యాః- ఇవిమొదలగునవి. మూఢవృత్తయః - తామసవృత్తులని, కథితాః-చెప్పబడినవి.

తా. ౧. పేరాసయు, ౨. స్నేహము, ౩. రాగము, ౪. లోభము, మొదలగువృత్తులు రాజసవృత్తులగును. మరియు, ౧. మోహము, ౨. భయము మొదలగువృత్తులు తామసవృత్తులగునని చెప్పబడినవి.

శ్లో॥ వృత్తిష్వేతాసుసర్వాసుబ్రహ్మణశ్చిత్స్వభావతా।
ప్రతిబింబతిశాంతాసు సుఖంచప్రతిబింబతి॥ ౫.

టీ. ఏతాసు-ఈచెప్పబడిన, సర్వాసు - సకలంబులగు, వృత్తిషు-వృత్తులయందు, బ్రహ్మణః-జ్ఞానానందస్వరూప పరబ్రహ్మముయొక్క, చిత్స్వభావతా- జ్ఞానస్వరూపము, ప్రతిబింబతి- ప్రతిబింబించుచున్నది, శాంతాసు-సాత్వికవృత్తులయందు, సుఖంచ - బ్రహ్మముయొక్క యానందస్వరూపంబును, ప్రతిబింబతి - ప్రతిబింబించుచున్నది.

తా. ఈపైనచెప్పబడిన సాత్వికరాజసతామసములనెడి సకలమనోవృత్తులయందును చిదానందస్వరూప పరబ్రహ్మముయొక్క చిత్స్వరూపంబు ప్రతిబింబించుచున్నది. సాత్వికవృత్తులయందుమాత్రము బ్రహ్మముయొక్కయానందస్వరూపంబుగూడ ప్రతిబింబించుచున్నది.

అవ. ఈచెప్పబడినయర్థమందు శ్రుతివాక్యార్థమును పఠించుచున్నాడు.

శ్లో॥ రూపంరూపంబభూవాసౌ ప్రతిరూప ఇతిశ్రుతిః।
ఉపమాసూర్యకేత్యాది సూత్రయామాససూత్రకృత్॥ ౬.

టీ. అసౌ- ఈపరమాత్మ, రూపంరూపం ప్రతి- సర్వదేహమునుగురించి ప్రవేశించిన వాడగుటవలన, ప్రతిరూపః- ప్రతిరూపముగలవాడు, బభూవేతి- ఆయెనని, శ్రుతిః-కఠశ్రుతిచెప్పుచున్నది. సూర్యకేత్యాది - జలస్థితసూర్యప్రతిబింబాదులవంటిదనునట్టి, ఉపమా - సామ్యము, అనగా సామ్యమునుట. సూత్రకృత్- బ్రహ్మసూత్రకారుడు, సూత్రయామాస- సూత్రము జేసిన వాడాయెను.

తా. ఈపరమాత్మ, సర్వదేహములనుగూర్చి ప్రవేశించిన వాడగుటవలన ప్రతిరూపముగలవాడాయెనని ఈకఠశ్రుతి చెప్పుచున్నది. మరియు, ద్వైతప్రతిషేధపూర్వకమగు ఉపదేశమువలన నుపాధికృత భేదరూపంబు జలస్థితసూర్యప్రతిబింబాదులవంటిదనునట్టి సామ్యము బ్రహ్మసూత్రకారునిచేత, సూ।

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అతఏవచోపమాసూర్యకాదివత్, అనెడి సూత్రమందు స్వీకరింపబడెను.

శ్లో॥ ఏకఏవహిభూతాత్మా భూతేభూతేవ్యవస్థితః।
ఏకధాబహుధాచైవ దృశ్యతేజలచంద్రవత్॥ ౭.

టీ. ఏకఏవహి - ఒక్కడగు, భూతాత్మా - పరమాత్మ, భూతేభూతే- ప్రతిదేహమందు, వ్యవస్థితస్సన్ - స్థితినిబొందినవాడగుచు, జలచంద్రవత్-జల చంద్రునివలె, ఏకధా - ఒకడుగాను, బహుధాచైవ - పెక్కండ్రుగాను, దృశ్యతే - కనబడుచున్నాడు.

తా. ఒక్కండగు బరమాత్మ, బ్రతిభూతమందునున్నవాడగుచు జలచంద్రునివలె ఒక్కండుగాను పెక్కండ్రుగాను గనబడుచున్నాడనిమరియొకశ్రుతి చెప్పుచున్నది. అనగా మనోవృత్తులయందు బ్రహ్మస్వరూప చిదానందములు ప్రతిఫలించుననుటయందు నీరెండు వాక్యములును బ్రమాణముగా గ్రహింపబడెనని తెలియవలెను.

శ్లో॥ జలేప్రవిష్టశ్చంద్రోఽయమస్పష్టఃకలుషేజలే।
విస్పష్టోనిర్మలేతద్వద్ద్వేధాబ్రహ్మాపివృత్తిషు॥ ౮.

టీ. జలే-జలమందు, ప్రవిష్టః - ప్రవేశించినట్టి, అనగా జలమందుబ్రతిబింబరూపముగా గనబడునట్టియనుట. అయం-ఈ, చంద్రః-చంద్రుడు, కలుషే-మలినముగల, జలే-జలమందు. అస్పష్టః- అస్పష్టత్వమునుబొందుచున్నాడు. అనగా స్పష్టముగా గనబడడనుట. నిర్మలే - నిర్మలమగుజలమందు, విస్పష్టః- మిగుల స్పష్టత్వమును బొందుచున్నాడు. అనగా మిక్కిలిస్పష్టముగా గనబడుచున్నాడనుట. తద్వత్ - ఆప్రకారము, బ్రహ్మాపి - బ్రహ్మంబును, వృత్తిషు- సాత్వికాదివృత్తులయందు, ద్వేధా - ద్వివిధముగా గనబడుచున్నది.

తా. ప్ర. అయితే, స్వరూపముచేత నొక్కటియగు ఆనందంబు మలినవృత్త్యుపాధి సంబంధంబువలన నామలిన వృత్తులయందు స్ఫురించదనియు, సాత్వికవృత్తులయందు స్ఫురించునని ఇట్లు విభజించిచెప్పుట యుక్తమెట్లగును? ఉ. ఒక్కడగుచంద్రుడు మలినజలమందు బ్రతిబింబించి యస్పష్టముగా గనబడుచున్నాడు. ఆచంద్రుడే నిర్మలజలమందు స్పష్టముగాగనబడుచున్నాడు. ఆప్రకారమే చిదానందస్వరూప బ్రహ్మంబును రాజససాత్వికాది వృత్తులయందు ద్వివిధముగా దోచుచున్నాడని తెలియవలెను.

అవ. ఆయర్థమునే యుపపాదించుచున్నాడు.

శ్లో॥ ఘోరమూఢాసుమాలిన్యాత్సుఖాంశశ్చతిరోహితః।
ఈషన్నైర్మల్యతస్తత్ర చిదంశప్రతిబింబనం॥ ౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ. ఘోరమూఢాసుచ=ఘోర- రాజసవృత్తులయందును, మూఢాసుచ- తామసవృత్తులయందును, మాలిన్యాత్ - మలినత్వము గలిగియుండుటవలన, సుఖాంశః- బ్రహ్మమునుయొక్క యానందరూపము, తిరోహితః మరుగుబడెను. అనగా స్ఫురించదనుట. తత్ర- ఆరాజసతామసవృత్తులయందు, ఈషత్- కొంచెము, నైర్మల్యతః- నిర్మలత్వముగలిగియుండుటవలన, చిదంశప్రతిబింబనం= చిదంశ-జ్ఞానరూపముయొక్క. ప్రతిబింబనం- ప్రతిబింబత్వము, అనగా స్ఫురణంబనుట. (భవతి) కలుగుచున్నది.

తా. రాజసతామసవృత్తులయందు మాలిన్యముగలిగియుండుటవలనఆవృత్తులయందు బ్రహ్మముయొక్క యానందస్వరూపము తిరోహితత్వమును బొందుచున్నది. మరియు నారాజస తామసవృత్తులయందు గొంచెము నిర్మలత్వంబు గలిగియుండుటవలన నావృత్తులయందు బ్రహ్మముయొక్క చిత్స్వరూపంబు ప్రతిబింబించి స్ఫురించుచున్నదని తెలియవలెను.

శ్లో॥ యద్వాపినిర్మలేనీరే వహ్నేరౌష్ణ్యస్యసంక్రమః।
నప్రకాశస్యతద్వత్స్యాచ్చిన్మాత్రోద్భూతిరేవచ॥ ౧౦.

టీ. యద్వాపి-మరియొకపక్షమందు, నిర్మలే- మలినములేని, నీరే - జలమందు, వహ్నేః-అగ్నియొక్క, ఔష్ణ్యస్య - ఉష్ణస్వభావమునకు, సంక్రమః- మేళనముగలుగుచున్నది. ప్రకాశస్య-తేజోరూపమునకు, న- మేళనముగలుగలేదు. తద్వత్-ఆప్రకారము రాజసతామస వృత్తులయందు, చిన్మాత్రోద్భూతిరేవచ=చిన్మాత్ర - చిద్రూపమునకుమాత్రము, ఉద్భూతిరేవచ - ఆవిర్భావము గలుగుచున్నది. అనగా చిద్రూపంబునకు స్ఫురణముగలిగియున్నదనుట.

తా. ప్ర. అయితే, చంద్రునకు ఉపాధియగు జలమునకు ద్వివిధత్వము గలిగియుండుటవలన మలినజలమందు చంద్రస్వరూపాంశము స్ఫురించుటయుక్తమగును. ప్రకృతమందో, ఉపాధిభూతమగు అంతఃకరణమునకు ఏకత్వంబు గలిగియుండుటవలన నాయంతఃకరణంబునందు చిదానందస్వరూప బ్రహ్మముయొక్క చిద్రూపముమాత్రము స్ఫురించుట యుక్తమెటగును? ఉ. మరియొక దృష్టాంతమును జెప్పెదవినుము. నిర్మలజలమందు అగ్నియొక్క యుష్ణస్వభావముమాత్రము మిళితమై వ్యాపించి స్ఫురించుచున్నదిగాని, తేజోరూపముజలమందు మిళితమైవ్యాపించి స్ఫురించుచుండుటలేదు. ఆప్రకారమే రాజసతామసవృత్తులయందు చిదానందరూప బ్రహ్మముయొక్క చిద్రూపాంశము మాత్రము స్ఫురించుచున్నదిగాని, ఆనందాంశము స్ఫురించుటలేదని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అవ. ఇప్పుడు శాంతవృత్తులయందు చిదానందములు రెంటను స్ఫురించుచున్నవనుటయందు మరియొక దృష్టాంతమును చెప్పుచున్నాడు.

శ్లో॥ కాన్తేతావౌష్ణ్యప్రకాశౌ ద్వా ఉద్భవంగచ్ఛతో యథా।
శాంతాసుసుఖచైతన్యే తథైవోద్భూతిమాప్నుతః॥ ౧౧.

టీ. కాన్తేతు- ఎండుకట్టెయందు, ఔష్ణ్యప్రకాశౌ= ఔష్ణ్య-ఉష్ణత్వంబును, ప్రకాశౌ-ప్రకాశత్వంబును, ద్వౌ-రెండును, ఉద్భవం- స్ఫురణమును, యథా- ఏప్రకారము, గచ్ఛతః-పొందుచున్నవో, తథైవ- ఆప్రకారమే, శాంతాసు-సాత్వికవృత్తులయందు, సుఖచైతన్యే=సుఖ - ఆనందంబును, చైతన్యే-జ్ఞానంబును, ఉద్భూతిం - స్ఫురణమును, ఆప్నుతః పొందుచున్నవి.

తా. మరియు, ఎండుకట్టెయందు అగ్నిధర్మములగు ఉష్ణప్రకాశనులు రెండు నేప్రకారముగా స్ఫురించుచున్నవో, ఆప్రకారముగానే బ్రహ్మము యొక్క చిదానందస్వభావములు రెండును సాత్వికవృత్తులయందు స్ఫురించుచున్నవని తెలియవలెను.

శ్లో॥ వస్తుస్వభావమాశ్రిత్యవ్యవస్థాతూభయోస్సమా।
అనుభూత్యనుసారేణ కల్ప్యతేహినియామకం॥ ౧౨.

టీ. వ్యవస్థాతు - ఈచెప్పబడిన వస్తుధర్మవిచిత్రస్ఫురణరూపభేద వ్యవహారమో, వస్తుస్వభావం=వస్తు - వస్తువుయొక్క, స్వభావం - స్వరూపమును, ఆశ్రిత్య-ఆశ్రయించి, ఉభయోః - దృష్టాంతదార్ష్టాంతికములయందు, సమా-సమానమగును. అనుభూత్యనుసారేణ=అనుభూతి - అనుభవముయొక్క, అనుసారేణ-అనుసారముగా, నియామకం హేతువు, కల్ప్యతే - కల్పించబడుచున్నది. హి- ఇదిసర్వసమ్మతంబనుట.

తా. ప్ర. అయితే, ఈప్రకారముగా వస్తుధర్మ విచిత్రస్ఫురణరూపభిన్నవ్యవహారము దేనివలన జేయబడుచున్నదో చెప్పుము? ఉ. వస్తుస్వభావము నాశ్రయించి దృష్టాంత దార్ష్టాంతికములనెడి రెండుస్థలములయందును ఈచెప్పబడిన వస్తుధర్మవిచిత్రస్ఫురణరూపభిన్న వ్యవహారము సమానముగా నున్నది. ప్ర. అయితే ఆవ్యవస్థయందు హేతువెద్ది? ఉ. అనుభవము ననుసరించి హేతువుకల్పించబడుచున్నది. ఇట్లనుభవప్రకారము హేతువు కల్పించబడుట సర్వసమ్మతమగును.

అవ. అనుభవమునే జూపుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ న ఘోరాసు న మూఢాసు సుఖ్యానుభవ ఈక్ష్యతే।
శాంతాస్వపి క్వచిత్కశ్చి త్సుఖాతిశయ ఈక్ష్యతాం॥ ౧౩.

టీ. ఘోరాసు- రాజసవృత్తులయందు, సుఖ్యానుభవః=సుఖీ - సుఖిత్వముయొక్క, అనగా నేను సుఖినైతినని యనుట, అనుభవః - అనుభవము, నేక్ష్యతే- చూడబడుచుండలేదు. మూఢాసు - తామసవృత్తులయందు, సుఖ్యానుభవః=సుఖీ-సుఖిత్వముయొక్క, అనుభవః-అనుభవము, నేక్ష్యతే - చూడబడ లేదు. శాంతాస్వపి - సాత్త్విక వృత్తులయందును, క్వచిత్ - ఒకానొక పురుషుని యందు, కశ్చిత్-ఒకానొకటియగు, సుఖాతిశయః-సుఖవిశేషము, ఈక్ష్యతాం-చూడబడుగాక.

తా. ప్ర. అయితే, ఆయనుభవమెద్దియో చెప్పుము? ఉ. రాజసతామసవృత్తులయందు (నేనుసుఖినైతి) ఆకారముగల సుఖిత్వానుభవము గనబడుచుండలేదు. మరియు సాత్త్వికవృత్తులయందు ఆనందస్ఫురణంబుగలదు. ఆయానందస్ఫురణంబు ఒకానొకపురుషునియందు ఒకానొకసుఖాతిశయమగుచున్నదని దెలియవలెను.

అవ. రాజసతామస వృత్తులయందు సుఖాభావమునే స్పష్టముగా జూపుచున్నాడు.

శ్లో॥ గృహక్షేత్రాదివిషయే యదా కామో భవేత్తదా।
రాజసస్యాస్య కామస్య ఘోరత్వాత్తస్య నో సుఖం॥ ౧౪.

టీ. గృహక్షేత్రాదివిషయే = గృహక్షేత్రాది- గృహక్షేత్రాది రూపము గల, విషయే-విషయమందు, యదా-ఎప్పుడు, కామః- కోరిక, భవేత్ - కలుగునో, తదా-అప్పుడు, రాజసస్య-రజోగుణసముద్భూతమగు, అస్య-ఈ, కామస్య- కామమునకు, ఘోరత్వాత్ - ఘోరరూపము గలిగియుండుటవలన, తస్య-ఆకామమునకు, సుఖం-ఆనందరూపము, నో-లేదు.

తా. ప్ర. అయితే, రాజసతామసవృత్తులకు సుఖరూపములేనివిధంబును జెప్పుము? ఉ. పురుషునకు గృహక్షేత్రాది విషయమం దెప్పుడు కామంబుగలుగునో అప్పుడు రజోగుణమువలన బుట్టిన ఈకామము ఘోరరూపంబు గలదగుటవలన నాకామంబునకు సుఖరూపములేదని తెలియవలెను.

శ్లో॥ సిద్ధ్యేన్నవేత్యస్తి దుఃఖ మసిద్ధౌ తద్వివర్ధతే।
ప్రతిబంధే భవేత్క్రోధో ద్వేషో వా ప్రతికూలతః॥ ౧౫.

టీ. సిద్ధ్యేత్-గృహక్షేత్రాదివిషయము సిద్ధించునో, నవేతి - సిద్ధించదో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యని తలచుటయందు, దుఃఖం-దుఃఖము, అస్తి-కలదు. అసిద్ధౌసత్యాం-సిద్ధించ కపోవుచుండగా, తత్ - ఆదుఃఖంబు, వివర్ధతే - వృద్ధిబొందుచున్నది. ప్రతిబంధేసతి - గృహక్షేత్రాదివిషయసుఖమునకు ప్రతిబంధంబు గలుగుచుండగా, క్రోధః-క్రోధము, భవేత్ - కలుగును. ప్రతికూలతః-ప్రతికూలంబగుటవలన, ద్వేషోవా - ద్వేషంబైనంగలుగును.

తా. మరియు, నాగృహక్షేత్రాదివిషయసుఖము సిద్ధించునో సిద్ధించదో యని తలంచుటయందు దుఃఖంబుగలదు. ఆగృహాదివిషయసుఖము సిద్ధించకపోవుచుండగా నాదుఃఖమువృద్ధియగుచున్నది. మరియు, నాగృహక్షేత్రాదివిషయ సుఖంబునకు ప్రతిబంధముగలుగుచుండగా క్రోధంబుగలుగును. సుఖములేకపోవుటకు మరియొక కారణమును జెప్పెదవినుము. ఆగృహక్షేత్రాది విషయంబు ప్రతికూలంబగుటవలన ద్వేషమైనంగలుగును. అనగా నాద్వేషంబునందు ప్రతికూలదుఃఖంబుయొక్క స్థితివలన సుఖములేదని యభిప్రాయము.

శ్లో॥ అశక్యశ్చేత్ప్రతీకారో వివాదస్స్యాత్సతామసః।
క్రోధాదిషుమహద్దుఃఖం సుఖశంకాపిదూరతః॥ ౧౬.

టీ. ప్రతీకారః- పరిహారము, అశక్యశ్చేత్ - శక్యముగానిదైనయెడల, వివాదః-కలహము, స్యాత్-కలుగును. సః - ఆవివాదము, తామసః-తమోగుణమువలనబుట్టినదగును. క్రోధాదిషు - క్రోధద్వేషవివాదాదులయందు, సుఖశంకాపి- సుఖశంకయు, దూరతః - దూరంబగుటవలన, మహత్ - అధికమగు, దుఃఖం - దుఃఖముగలదు.

తా. మరియుం దానుగోరినట్టి గృహక్షేత్రాదివిషయము పరునకులభించుటవలన దనకు ప్రతికూలమగుటచేత బరునియందుగలిగెడి ద్వేషమునుబరిహరించుటకు శక్యముగానియెడల నప్పుడు పరునితోటి వివాదంబుగలుగును. ఆవివాదము తమోగుణంబువలన బుట్టినదగుటచేత నావివాదమందు సుఖంబులేదు. ఈపూర్వోక్తక్రోధద్వేషాదులయందు సుఖముగలదేమో యనెడి సంశయమేలేమివలన నాక్రోధాదులయందు అధికదుఃఖంబుగలదని తెలియవలెను.

శ్లో॥ కామ్యలాభేహర్షవృత్తి శ్శాంతాతత్రమహత్సుఖం।
భోగేమహత్తరంలాభ ప్రసక్తావీషదేవహి॥ ౧౭.

టీ. కామ్యలాభేసతి=కామ్య-కామ్యవస్తువుయొక్క, లాభేసతి-లాభము గలుగుచుండగాగలిగెడి, హర్షవృత్తిః-సంతోషవృత్తి, శాంతా - సాత్వికవృత్తియగును. తత్ర ఆసాత్వికవృత్తియందు, మహత్సుఖం- అధికసుఖంబుగలదు. భోగేసతి - కామ్యవస్తుభోగముగలుగుచుండగా, అనగా కామ్యవస్తువనుభవింప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడుచుండగాననుట. మహత్తరం - మిక్కిలియధిక సుఖంబుగలుగును. లాభప్ర సక్తౌసత్యాం=లాభ-కామ్యవస్తులాభముయొక్క, ప్రసక్తౌసత్యాం-ప్రసక్తిగ లుగుచుండఁగా, అనగా దనకు కామ్యలాభముఁగలుగునని ప్రసంగము గలిగి నప్పుడనుట. (సుఖం) సుఖము, ఈషదేవహి-కొంచముగానే కలుగును.

తా. మరియు, గృహక్షేత్రాది కామ్యలాభంబు గలుగుచుండగా గలి గెడి హర్షవృత్తిసాత్వికవృత్తియగును. ఆసాత్వికవృత్తియందు అధిక సుఖంబుగ లదు. మరియు నట్లులభింపబడిన గృహక్షేత్రాది కామ్యవస్తువుయొక్క భోగ ముగలుగుచుండగా మిక్కిలియధికమగు సుఖంబుగలదు. మరియు, గృహక్షే త్రాది కామ్యవస్తువు తనకులభించుననెడి ప్రసంగము గలిగినప్పుడు సుఖము కొంచెముఁగా గలుగుచున్నది.

శ్లో॥ మహత్తమంవిరక్తౌతు విద్యానందేతదీరితం।
ఏవంక్షాంతౌతథౌదార్యే క్రోధలోభవివర్జనాత్॥ ౧౪.

టీ. విరక్తౌతు-వైరాగ్యమందో, మహత్తమం మిక్కిలియధికమగు పరమ సుఖంబుగలదు. తత్-ఆసుఖంబు, విద్యానందే - విద్యానందమందు, ఈరితం- చెప్పబడెను క్షాంతౌ- ఓర్పునందును, తథా-ఆప్రకారము, ఔదార్యే-ఉదార త్వమందును, క్రోధలోభవివర్జనాత్ = క్రోధలోభ- క్రోధలోభంబులయొక్క, వివర్జనాత్ - లేమివలన, ఏవం - ఈప్రకారమే యగును. అనగా సుఖముగల దనుట.

తా. మరియు, వైరాగ్యదశయందు మిక్కిలియనేకంబగు పరమసుఖంబు గలదు. మరియు ఓర్పునందును ఔదార్యమందును క్రోధలోభములు లేనికార ణంబువలన సుఖంబుగలదని తెలియవలెను.

శ్లో॥ యద్యత్సుఖంభవేత్తత్తద్బ్రహ్మైవప్రతిబింబనాత్।
వృత్తిష్వంతర్ముఖాస్వస్య నిర్విఘ్నంప్రతిబింబనం॥ ౧౫.

టీ. యద్యత్- ఏయే, సుఖం-సుఖంబు, భవేత్-కలుగునో, తత్తత్- అది యదే, ప్రతిబింబనాత్ - ప్రతిబింబించుటవలన, బ్రహ్మైవ- బ్రహ్మమేయగుచు న్నది. వృత్తిషు - మనోవృత్తులు అంతర్ముఖాసు సతీషు - అంతర్ముఖములగు చుండగా, అస్య-ఈబ్రహ్మముయొక్క, ప్రతిబింబనం- ప్రతిబింబించుట, నిర్వి ఘ్నం- నిరాటంకముగానగును. అనగా దప్పక ప్రతిబింబమేర్పడుననుట.

తా. ఏయేసుఖముగలుగుచున్నదో ఆయాసుఖమంతయు బ్రతిబింబించు టవలన బ్రహ్మమేయగుచున్నదని తెలియవలెను. మరియుం గామ్యలాభాదిక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము గలుగుచుండగా మనోవృత్తులంతర్ముఖములైనప్పుడు ఆమనోవృత్తులయందు ఈబ్రహ్మముయొక్క ప్రతిబింబముదప్పక గలుగుచున్నది.

అవ. ఇప్పుడంతటను బ్రహ్మస్వరూపానుభవంబు జూపుటకొరకు నా బ్రహ్మస్వరూపమును స్మరించుచున్నాడు.

శ్లో॥ సత్తాచితిస్సుఖంచేతి స్వభావాః బ్రహ్మణస్త్రయః।
మృచ్ఛిలాదిషు సత్తైవ వ్యజ్యతే నేతరద్ద్వయం॥ ౨౦.

టీ. సత్తా-సత్యత్వంబును, చితిః-జ్ఞానంబును, సుఖమితి-ఆనందంబనెడి, త్రయశ్చ - మూడును, బ్రహ్మణః-పరబ్రహ్మముయొక్క, స్వభావాః-స్వరూపములగును. మృచ్ఛిలాదిషు- మృచ్ఛిలాదులయందు, సత్తైవ-సత్స్వభావమే, వ్యజ్యతే- స్ఫురించుచున్నది. ఇతరత్-ఇతరమగు, ద్వయం-రెండును, న-స్ఫురణమునుబొందుటలేదు.

తా. ౧. సత్యత్వము, ౨. జ్ఞానము, ౩. ఆనందమనెడి ఈమూడును బ్రహ్మముయొక్క స్వరూపములగును. ఆమూటిలో మృచ్ఛిలాదులయందు సద్రూపత్వముమాత్రమే స్ఫురించు చున్నదిగాని తక్కిన చిదానందరూపములు రెండును స్ఫురించుటలేదు.

శ్లో॥ సత్తాచితిర్ద్వయంవ్యక్తం ధీవృత్త్యోర్ఘోరమూఢయోః।
శాంతవృత్తౌత్రయంవ్యక్తం మిశ్రంబ్రహ్మేత్థమీరితం॥ ౨౧.

టీ. ఘోరమూఢయోః= ఘోర - రాజసములనునట్టియు, మూఢయోః- తామసములనునట్టి, ధీవృత్త్యోః - బుద్ధివృత్తులయందు, సత్తా - సద్రూపంబును, చితిః-చిద్రూపంబనెడి, ద్వయం-రెండును, వ్యక్తం- స్ఫురించుచున్నవి. శాంతవృత్తౌ-సాత్వికవృత్తియందు, త్రయం - సచ్చిదానందములుమూడును, వ్యక్తం- స్ఫురించుచున్నవి. ఇత్థం-ఈప్రకారము, మిశ్రం-ప్రపంచసహితమగు, బ్రహ్మ- బ్రహ్మము, ఈరితం - చెప్పబడెను.

తా. మరియు, మనస్సునందుగల రాజసతామస వృత్తులయందు బ్రహ్మస్వరూపసచ్చిదానందములలో సచ్చిద్రూపములు రెండుమాత్రము స్ఫురించుచున్నవి. సాత్వికవృత్తియందు బ్రహ్మరూపములగు సచ్చిదానందములు మూడును స్ఫురించుచున్నవని తెలియవలెను. ఈప్రకారముగా మిశ్రబ్రహ్మము చెప్పబడెను.

శ్లో॥ అమిశ్రంజ్ఞానయోగాభ్యాం తౌచపూర్వముదీరితౌ।
ఆద్యేధ్యాయేయోగచింతా జ్ఞానమధ్యాయయోర్ద్వయోః॥

టీ. జ్ఞానయోగాభ్యాం=జ్ఞాన-జ్ఞానముచేతను, యోగాభ్యాం - యోగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముచేతను, అమిశ్రం-నిష్ప్రపంచమనెడి బ్రహ్మము, (ఈరితం) చెప్పబడెను. తౌచ-అజ్ఞానయోగములు రెండును, పూర్వం-పూర్వమందు, ఉదీరితౌ- చెప్పబడినవి. ఆద్యే-మొదటిదగు, అధ్యాయే-అధ్యాయమందు, అనగా యోగానందమనెడి ఏకాదశప్రకరణమందనుట. యోగచింతా- యోగచింత, (ఈరితా) చెప్పబడినది. ద్వయోః-మరి రెండగు, అధ్యాయయోః - అధ్యాయములయందు, అనగా నాత్మానందాద్వైతానందములనెడి ద్వాదశ త్రయోదశప్రకరణములయందనుట. జ్ఞానం - బ్రహ్మజ్ఞానను చెప్పబడెను.

తా. ప్ర. అమిశ్రబ్రహ్మను దేనివలన దెలియబడునో చెప్పుము? ఉ. అమిశ్రమనెడి మరియొకపేరుగల నిర్గుణబ్రహ్మము జ్ఞానయోగముల వలన దెలియబడును. ఆజ్ఞానయోగములు రెండును బూర్వమే మాచేత జెప్పబడినవి. ప్ర. ఎచ్చట జెప్పబడినవో చెప్పుము? ఉ. బ్రహ్మానందమనెడి యధ్యాయ పంచకగ్రంథమందు మొదటి యధ్యాయమగు యోగానందమనెడి (ఏకాదశ) ప్రకరణమందు యోగము జెప్పంబడినది. తదనంతరమందు గల ఆత్మానంద అద్వైతానందములనెడి రెండధ్యాయములయందు (అనగా ద్వాదశత్రయోదశ ప్రకరణములయందు) జ్ఞానము చెప్పబడినదని తెలియవలెను.

శ్లో॥ అసత్తాజాడ్యదుఃఖే ద్వే మాయారూపత్రయంత్విదం।
అసత్తానరశృంగాదౌ జాడ్యంకాష్ఠశిలాదిషు॥ ౨౩.

టీ. అసత్తా-అభావంబును, అనగాలేమియనుట. జాడ్యదుఃఖే= జాడ్య-జడస్వభావంబును, దుఃఖే-దుఃఖములనెడి, ద్వే- రెండును, ఇదం - ఇది, మాయారూపత్రయం=మాయా- మాయాశక్తియొక్క, రూపత్రయం - రూపత్రయంబగును. నరశృంగాదౌ=నర-మనుష్యునియొక్క, శృంగ-కొమ్మె, ఆదౌ-ఆదిగాగల కేవలాభావమందు, అసత్తా-లేమియగును. కాష్ఠశిలాదిషు= కాష్ఠ-కొయ్యయు, శిలా శిలయు, ఆదిషు-మొదలుగాగలపదార్థములయందు,జాడ్యం-జడస్వభావముగలదు.

తా. ప్ర. అయితే, సచ్చిదానందత్రయము బ్రహ్మస్వరూపమైనయెడల మాయయొక్క రూపమెద్ది? ఉ. ౧. అసత్యము= (అనగామిథ్యాత్వమనుట) ౨. జడత్వము, ౩. దుఃఖము, ఈమూడును మాయకు రూపములగును. ప్ర. ఆమూటిలోనెద్ది యెచ్చటంగలదో చెప్పుము? ఉ. మనుష్యునికొమ్ము వంధ్యాపుత్రుడు మొదలగు కేవల అభావమందు అసత్యత్వంబును, దారుశిలాద్యచేతనపదార్థవర్గమందు జడస్వభావంబునుంగలదని తెలియవలెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ ఘోరమూఢధియోర్దుఃఖ మేవంమాయావిజృంభితా।
శాంతాదిబుద్ధివృత్త్యైక్యా న్మిశ్రంబ్రహ్మేతి కీర్తితం॥ ౨౪.

టీ. ఘోరమూఢధియోః-ఘోర-రాజసబుద్ధియందును, మూఢధియోః-తామసబుద్ధియందును, దుఃఖం-దుఃఖముగలదు. ఏవం-ఈప్రకారము, మాయా-మాయాశక్తి, విజృంభితా - సర్వజగంబును వ్యాపించి ప్రకాశించుచున్నది. శాంతాదిబుద్ధివృత్త్యైక్యాత్=శాంత-సాత్వికమే, ఆది- ఆదిగాగల, బుద్ధివృత్తి-బుద్ధివృత్తులతోటి, ఐక్యాత్-ఏకత్వంబువలన, బ్రహ్మ - బ్రహ్మము, మిశ్రమితి-ప్రపంచసహితమైనదని, కీర్తితం - చెప్పబడెను.

తా. మరియు, రాజసతామసబుద్ధి తద్వృత్తులయందు మాయారూపంబగు దుఃఖముగలదని తెలియవలెను. ప్ర. అయితే, సాత్వికాది వృత్తులయందు బ్రహ్మమునకు మిశ్రత్వముగలుగుటకు కారణమేమి? ఉ. సాత్విక రాజసతామసబుద్ధివృత్తులతోటి ఏకత్వము గలిగియుండుటవలన బ్రహ్మము మిశ్రమని చెప్పబడుచున్నది.

శ్లో॥ ఏవంస్థితేత్రయోబ్రహ్మ ధ్యాతుమిచ్ఛేత్పుమానసౌ।
నృశృంగాదిముపేక్షేత శిష్టంధ్యాయేద్యథాయథం॥ ౨౫.

టీ. ఏవం-ఈప్రకారము, త్రయః- మాయారూపత్రయము, స్థితేసతి-స్థితినిబొందుచుండగా, పుమాన్-పురుషుడు, బ్రహ్మ- బ్రహ్మమును, ధ్యాతుం-ధ్యానము జేయుటకు, ఇచ్ఛేత్-ఇచ్ఛయించును. అసౌ-ఈముముక్షువు, నృశృంగాదిం- మనుష్యుని కొమ్ము మొదలగు అభావమును, ఉపేక్షేత - ఉపేక్షించవలెను. శిష్టం-శేషించినదానిని, యథాయథం - తగినట్లు, ధ్యాయేత్-ధ్యానించవలెను.

తా. ప్ర. అయితే, ఇశ్లోకముకొరకు జెప్పబడెనో చెప్పుము? ఉ. ఈప్రకారము మాయారూపత్రయ స్థితిగలుగుచుండగా బురుషుడు బ్రహ్మమును ధ్యానించుట కిచ్ఛయించును. అనగా బ్రహ్మధ్యానంబుకొరకు జెప్పబడెననియభిప్రాయము. ప్ర. అయితే, ఎట్లు ధ్యానించవలెనో చెప్పుము? ఉ. మనుష్యునికొమ్ము మొదలగు మిథ్యారూపమును పేక్షించి (అనగా విడిపించి) ఇతరస్థలములయందు దగినట్లు బ్రహ్మమును ధ్యానించవలెను.

శ్లో॥ శిలాదౌనామరూపేద్వే త్యక్త్వాసన్మాత్రచింతనం।
త్యక్త్వాదుఃఖంఘోరమూఢ ధియోస్సచ్చిద్వ్యచింతనం॥ ౨౬.

టీ. శిలాదౌ - రాయిమొదలగు జడపదార్థ వర్గమందు, నామరూపే-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నామరూపముల నెడి, ద్వే-రెంటిని, త్యక్త్వా - విడిపించి, సన్మాత్రచింతనం= సన్మాత్ర-సద్రూపముయొక్క, చింతనం- ధ్యానమును, ( కుర్యాత్ ) చేయవలెను. ఘోరమూఢధియోః=ఘోర- రాజసబుద్ధియందును, మూఢధియోః- తామసబుద్ధియందును, దుఃఖం-దుఃఖరూపమును, త్యక్త్వా-విడిపించి, సచ్చిద్విచింతనం=సత్- సద్రూపములయొక్కయు, చిత్-జ్ఞానరూపముయొక్కయు, విచింతనం-ధ్యానమును, (కుర్యాత్) చేయవలెను.

తా. ప్ర. అయితే, ఇతరస్థలములయందు దగినట్లు బ్రహ్మమును ధ్యానించవలెనని చెప్పబడెను. ఎచ్చట నెట్లు ధ్యానము జేయదగినదో చెప్పుము? ఉ. శిలాదిజడపదార్థవర్గమందు నామరూపములను రెంటిని విడిపించి బ్రహ్మస్వరూపమగు సద్రూపమునుమాత్రము చింతించవలెను. మరియు రాజస తామస బుద్ధులయందు గల దుఃఖరూపమును విడిపించి బ్రహ్మస్వరూపములగు సచ్చిద్రూపములను రెంటిని చింతించవలెను.

శ్లో॥ శాంతాసుసచ్చిదానందాం స్త్రీనప్యేవంవిచింతయేత్।
కనిష్ఠమధ్యమోత్కృష్టా స్తిస్రశ్చింతాః క్రమాదిమాః॥ ౨౭.

టీ. శాంతాసు-సాత్వికవృత్తులయందు, సచ్చిదానందాన్ - సత్యజ్ఞానానందములనెడి, త్రీనపి-మూటినియు, ఏవం-ఈప్రకారము. విచింతయేత్- ధ్యానించవలెను. ఇమాః-ఈ, తిస్రః-మూడగు, చింతాః- ధ్యానములు, క్రమాత్- క్రమముగా, కనిష్ఠమధ్యమోత్కృష్టాః=కనిష్ఠ-స్వల్పముగాను, మధ్యమ- మధ్యమముగాను, ఉత్కృష్టాః - అధికముగానుం జేయదగినవగును.

తా. మరియు సాత్వికవృత్తులయందు బ్రహ్మస్వరూపంబులగు సచ్చిదానందములను మూటినిం జింతించవలెను. ప్ర. అయితే, ఈసచ్చిదానందవిషయకధ్యానములు మూడును సమానముగా జేయదగినవగునాయేమి? ఉ. కావు. ప్ర. మరియెట్లు? ఉ. శిలాది జడపదార్థవర్గమందుగల సద్రూపమును స్వల్పముగా ధ్యానించవలెననియు, రాజసతామస బుద్ధివృత్తులయందుగల సచ్చిద్రూపములను మధ్యమముగా ధ్యానించవలెననియు, సాత్వికవృత్తులయందు సచ్చిదానందములను మూటినధికముగా ధ్యానించవలెననియుం దెలియవలెను.

అవ. ఇప్పుడు, నిర్గుణ బ్రహ్మధ్యానమం దధికారములేనివారి ననుగ్రహించెడికొరకు మిశ్రబ్రహ్మధ్యానమం దధికారముగలద నెడి యభిప్రాయముతో జెప్పుచున్నాడు.

శ్లో॥ మందస్యవ్యవహారేపి మిశ్రబ్రహ్మణిచింతనం।
ఉత్కృష్టంవక్తుమేవాత్ర విషయానంద ఈరితః॥ ౨౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టీ॰ మందస్య- మందబుద్ధిగలవానికి, వ్యవహారేపి - వ్యవహారమందును, మిశ్రబ్రహ్మణి-మిశ్ర - ప్రపంచసహితమగు, బ్రహ్మణి- బ్రహ్మమందు, చింతనం-ధ్యానము, ఉత్కృష్టం-శ్రేష్ఠమైనదని, వక్తుమేవ- చెప్పుటకొరకే, అత్ర-ఈప్రకరణమందు, విషయానందః-విషయానందము, ఈరితః- చెప్పబడినది.

తా॰ మరియు, మందబుద్ధిగలవానికి, (అనగా నిర్గుణబ్రహ్మధ్యానమును జేయజాలనివానికి) వ్యవహారమందును మిశ్రబ్రహ్మధ్యానమును జేయుట శ్రేష్ఠమగునని చెప్పుటకొరకే ఈపదియేనవ ప్రకరణమందు విషయానందము జెప్పబడినదని తెలియవలెను.

అవ॰ ఇట్లు బుద్ధివృత్తిసహిత ధ్యానత్రయమును జెప్పి, ఇప్పుడు బుద్ధివృత్తిరహితధ్యానమును జెప్పుచున్నాడు.

శ్లో॥ ఔదాసీన్యేతుధీవృత్తేః శైథిల్యాదుత్తమోత్తమం।
చింతనంవాసనానందే ధ్యానముక్తంచతుర్విధం॥ ౨౯.

టీ॰ ఔదాసీన్యే-ఉదాసీనకాలమందుస్ఫురించెడి, వాసనానందేతు- వాసనానందమందో, చింతనం- బ్రహ్మధ్యానము, ధీవృత్తేః- బుద్ధివృత్తియొక్క, శైథిల్యాత్-శిథిలత్వమువలన, ఉత్తమోత్తమం - శ్రేష్ఠమైనదగును. అనగా బూర్వోక్తధ్యానత్రయముకంటె నధికమైనదగుననుట. (ఏవం) ఈప్రకారముగా, చతుర్విధం - నాలుగువిధములంగల, ధ్యానం - బ్రహ్మస్వరూపచింతనను, ఉక్తం- చెప్పబడినది.

తా॰ సుఖదుఃఖములంగలిగించెడి అనుకూల్య ప్రాతికూల్యవిషయ వృత్తిలేనికాలము, ఉదాసీనదశయని చెప్పబడును. అట్టి యౌదాసీన్యదశయగు తూష్ణీంభూతావస్థయందు స్ఫురించెడి వాసనానందముగల కాలమందు బుద్ధివృత్తులణగుటచేత నప్పుడుచేయబడెడి బ్రహ్మధ్యానము, పూర్వోక్తమగు వృత్తిసహిత ధ్యానత్రయముకంటె నధికమైనదగునని తెలియవలెను. ఈప్రకారముగా విషయానందమందు చతుర్విధధ్యానము జెప్పబడెనని యెరుంగవలెను. యోగానందమందుగల తొంబదియారవశ్లోకమువలన వాసనానంద స్వరూపంబును, తొంబదినాల్గవశ్లోకమువలన నుదాసీనత్వకాలమునుం దెలియవలెను.

శ్లో॥ నధ్యాన జ్ఞానయోగాభ్యాం బ్రహ్మవిద్యైవసాఖలు।
ధ్యానేనైకాగ్ర్యమాపన్నే చిత్తేవిద్యాస్థిరీభవేత్॥ ౩౦.

టీ॰ జ్ఞానయోగాభ్యాం-జ్ఞాన - ఆత్మానాత్మవివేకముచేతను, యోగాభ్యాం-యోగముచేతను, అనగా నేకాదశ ద్వాదశ త్రయోదశ ప్రకరణముల చేత ననుట. ధ్యానం-ధ్యానము, న - నిరూపింపబడలేదు. సా - అది, అనగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేకాదశ ద్వాదశ త్రయోదశ ప్రకరణములచేత నిరూపింపబడిన యర్థమనుట, బ్రహ్మవిద్యైవఖలు - బ్రహ్మవిద్యయేయగునుగదా, ధ్యానేన- చింతనముచేత, ఐకాగ్ర్యం-ఏకాగ్రత్వమును, ఆపన్నే-పొందినట్టి, చిత్తే- చిత్తమందు, విద్యా- బ్రహ్మజ్ఞానము, స్థిరీ-స్థిరత్వముగలది, భవేత్ - అగును.

తా. ప్ర. అయితే, ఈచెప్పబడిన సచ్చిదానందములయొక్క చింతనము, తొమ్మిదవప్రకరణమగు ధ్యానదీపమందు నిరూపింపబడిన ధ్యానములోని యవాంతర భేదంబగునాయేమి? ఉ. యోగజ్ఞానములందెలిపెడి ఏకాదశద్వాదశత్రయోదశ ప్రకరణములచేత నిరూపింపబడినయర్థమే ఈపదియేనవ ప్రకరణమందును నిరూపింపబడినదేగాని, ధ్యానము నిరూపింపబడలేదని తెలియవలెను. ప్ర. అయితే, ఈవిషయానందమందు జెప్పబడినయర్థమేమి? ఉ. ఆనేకాదశ ద్వాదశ త్రయోదశ ప్రకరణములయందు బ్రతిపాదింపబడిన బ్రహ్మవిద్యయే ఇచ్చటంగూడ నిరూపింపబడినదని తెలియవలెను. ప్ర. అయితే, ఈబ్రహ్మవిద్య, ఎట్లు ఉదయించదగినదగునో చెప్పుము? ఉ. పూర్వోక్తసచ్చిదానందచింతన రూపధ్యానముచేత జిత్తైకాగ్ర్యము గలుగుచుండగా నట్టి చిత్తమందు బ్రహ్మవిద్య ఉదయించినదగుచు స్థిరముగా నిల్చుచున్నది.

శ్లో॥ విద్యాయాంసచ్చిదానందా అఖండైకరసాత్మతాం।
ప్రాప్యభాంతినభేదేన భేదకోపాధివర్జనాత్॥ ౩౧.

టీ. విద్యాయాం-జ్ఞానదశయందు, సచ్చిదానందాః = సత్- సద్రూపంబును, చిత్-జ్ఞానరూపంబును, ఆనందాః - ఆనందరూపంబును, అఖండైకరసాత్మతాం=అఖండ-భేదములేని, ఏకరసాత్మతాం - ఏకాకారత్వమును, అనగా సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యమగు కేవల వస్తుమాత్ర రూపత్వమననుట. ప్రాప్య-పొంది, భాంతి - ప్రకాశించుచున్నవి. భేదకోపాధివర్జనాత్= భేదక-భేదమును గలిగించెడి, ఉపాధి- ఉపాధులయొక్క, వర్జనాత్-లేమివలన, భేదేన - భేదముగా, న-ప్రకాశింపవు.

తా. ప్ర. అయితే, ఈబ్రహ్మవిద్యకు విద్యాత్వముగలుగుటయందు హేతువేమి? ఉ. విద్యాదశయందు బ్రహ్మస్వరూపములగు సచ్చిదానందములు మూడును సజాతీయ విజాతీయ స్వగతభేదములేని కేవలవస్తుమాత్ర రూపత్వమును బొంది ప్రకాశించుచుండుటయే విద్యాత్వమందు హేతువగును. మరియు, ఆవిద్యాదశయందు భేదములు గలిగించెడి యుపాధులు లేనికారణమువలన నాసచ్చిదానందములు మూడును భేదముగా బ్రకాశింపవు.

అవ. భేదమునుగలిగించెడి యాయుపాధులనే జెప్పుచున్నాడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ శాంతాఘోరాశ్శిలాద్యాశ్చ భేదకోపాధయోమతాః।
యోగాద్వివేకతోవైషా ముపాధీనామపాకృతిః॥ ౩౨.

టీ. శాంతాః-సాత్వికవృత్తులును, ఘోరాః - రాజసవృత్తులును, శిలాద్యాశ్చ-శిలాదులును, మతాః-సమ్మతములగు, భేదకోపాధయః=భేదక- భేదమునుగలిగించెడి, ఉపాధయః- ఉపాధులగును. యోగాత్-యోగానుష్ఠానమువల్లనైనను, వివేకతోవా- ఆత్మానాత్మవిభజనలక్షణ వివేకమువలనైనను, ఏషాం-ఈ, ఉపాధీనాం- ఉపాధులకు, అపాకృతిః - నివారణముకలుగును.

తా. ప్ర. అయితే, సచ్చిదానందములకు భేదమును గలిగించెడి యా యుపాధులెవ్వి? ఉ. ౧. సాత్వికవృత్తులును, ౨. రాజసతామసవృత్తులును, ౩. శిలాదులును, ఇవి సచ్చిదానందములకు భేదమునుగలిగించెడి యుపాధులగును. ప్ర. అయితే, ఈయుపాధులనేయుపాయముచేత బరిహరింపవచ్చునో చెప్పుము? ఉ. యోగానుష్ఠానముచేతనైనను ఆత్మానాత్మ విభజనలక్షణము గల వివేకము చేతనైనను ఈయుపాధులు నివరించుచున్నవి.

అవ. ఇప్పుడు ఫలితార్థమును జెప్పుచున్నాడు.

శ్లో॥ నిరుపాధిబ్రహ్మతత్త్వే భాసమానేస్వయంప్రభే।
అద్వైతేత్రిపుటీనాస్తిభూమానందోతఉచ్యతే॥ ౩౩.

టీ. స్వయంప్రభే-స్వప్రకాశరూపముగలిగి, భాసమానే- ప్రకాశించుచున్నట్టియు, నిరుపాధిబ్రహ్మతత్త్వే = నిరుపాధి - ఉపాధిలేని, బ్రహ్మతత్త్వే-బ్రహ్మస్వరూపమగు, అద్వైతే-ద్వైతరాహిత్యవస్తువునందు, త్రిపుటీ=త్రి-జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములనెడి, పుటీ- ఆకారములంగలది, నాస్తి-లేదు. అతః- ఈత్రిపుటి లేమివలన, భూమానందఇతి= భూమ-భూమశబ్దముచేత జెప్పదగిన, ఆనందఇతి-ఆనందమగునని, ఉచ్యతే - చెప్పబడుచున్నది.

తా. స్వప్రభానందరూపముచేత సర్వదాస్ఫురించుచున్నట్టి ఉపాధిలేని పరబ్రహ్మస్వరూపంబగు అద్వైతమందు త్రిపుటిలేదు. ఈహేతువువలన దేశకాలవస్తువులచేత బరిచ్ఛేదములేనట్టి భూమశబ్దముచేతం జెప్పదగిన పరమాత్మవస్తురూపమగుపరమానందమే సర్వంబగునని శ్రుతులచేత జెప్పబడుచున్నదని తెలియవలెను. త్రిపుటియొక్క-స్వరూపము యోగానందమనెడి ఏకాదశప్రకరణమందుగల పదియేనవశ్లోకమునందు జెప్పబడియున్నది. దానింజూచి తెలిసికొనవలెను.

అవ. గ్రంథము నిప్పుడు ఉపసంహరించుచున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్లో॥ బ్రహ్మానందాభిధే గ్రంథే పంచమోఽధ్యాయ ఈరితః।
విషయానంద ఏతేన ద్వారేణాంతః ప్రవిశ్యతాం॥ ౩౪.

టీ. బ్రహ్మానందాభిధే = బ్రహ్మానంద - బ్రహ్మానందమనెడి, అభిధే- పేరుగల, గ్రంథే-అధ్యాయపంచకమునందు, విషయానందః- విషయానందమనెడి, పంచమః-ఐదవదగు, అధ్యాయః-పరిచ్ఛేదము, ఈరితః - చెప్పబడినది. ఏతేన- ఈవిషయానందమనెడి, ద్వారేణ-ద్వారముచేత, అంతః-బ్రహ్మానందములోనికి, ప్రవిశ్యతాం - ప్రవేశము జేయబడుగాక. అనగా ప్రవేశించవలెననుట.

తా. బ్రహ్మానందమనెడి పేరుగల యధ్యాయపంచకగ్రంథమందు విషయానందమనెడి ఈపంచమాధ్యాయము జెప్పబడినది. ద్వారభూతమగు ఈవిషయానందముచేత బ్రహ్మానందములోనికి బ్రవేశించవలెను.

శ్లో॥ ప్రీయాద్ధరిహరోఽనేన బ్రహ్మానందేన సర్వదా।
పాయాచ్చ ప్రాణినస్సర్వాన్ స్వాశ్రితాన్ శుద్ధమానసాన్॥ ౩౫.

టీ. హరిహరః- హరిహరరూపుడగు పరమేశ్వరుడు, అనేన-ఈ, బ్రహ్మానందేన-బ్రహ్మానందముచేత, ప్రీయాత్-ప్రీతివలన, స్వాశ్రితాన్=స్వ-తనను, ఆశ్రితాన్-ఆశ్రయించినట్టియు, శుద్ధమానసాన్=శుద్ధ - పరిశుద్ధమగు, అనగా రాజసతామసరూపమలినము లేనట్టియనుట. మానసాన్ - మనంబుగలిగియుండునట్టి, సర్వాన్-సమస్తములగు, ప్రాణినః - జీవులను, సర్వదాచ - ఎల్లప్పుడును, పాయాత్ - రక్షించుగాక.

తా. హరిహరరూపముగానుండెడి శ్రీమహేశ్వరుడు ఈబ్రహ్మానందముచేత ప్రీతిపూర్వకముగా దననాశ్రయించినట్టియు రాగద్వేషాది రాహిత్యముచేత పరిశుద్ధాంతఃకరణులగుసర్వజీవులను (సర్వదా) రక్షించుచుండుగాక.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీభారతీతీర్థ విద్యారణ్య మునివర్య విరచితాయాం శ్రీవేదాంత పంచదశ్యాం బ్రహ్మానందే విషయానందనామకం పంచదశ ప్రకరణం సమాప్తం.

సమాప్తశ్చేయం పంచదశీ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గద్య. ఇది శ్రీపరమేశ్వరగురు చరణ వరప్రసాదలబ్ధ బ్రహ్మవిద్యా
విరాజిత కాశ్యపసగోత్ర పవిత్ర మంత్రివంశపయః పారావార
పరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్య పుత్ర లక్ష్మీనారాయణా
మాత్య ప్రణీతంబైన ఆంధ్రటీకాతాత్పర్య సహిత
శ్రీవేదాంతపంచదశియందు బ్రహ్మానందనామక
గ్రంథస్థిత విషయానందమనెడి
పంచదశ ప్రకరణము
సంపూర్ణము.

—*—

శ్లో॥ విషయానందటీకేయం పదతాత్పర్యబోధినీ।
నారాయణాఖ్యవిదుషా పరమేశసమర్పితా॥
ఓం తత్సత్ శ్రీపరమేశ్వరార్పణమస్తు.



శ్రీగురోవాసుదేవప్రసీద.

ఈగ్రంథమును గురించి, పండిత సార్వభౌములును శతావధానులును, అలుకూరు గ్రామనివాసులునగు గొల్లాపిన్ని - మల్లికార్జున శాస్త్రిలవారొసంగిన యభిప్రాయము.

అధ్యక్షలుసనమాధానేన చేతసా పరంపదం సమీహమానైర్నిరంతరం హృదంతరేసమంతతో నిదిధ్యాసితుముత్సుకైరారురుక్షుభిస్సంప్రార్థితేన వేదాంతశాస్త్రార్ణవ కర్ణధారాయితేన విద్వజ్జనసన్నుతేన, మంత్రి - లక్ష్మీనారాయణాఖ్యావతా సంఖ్యావతా సంఖ్యాపితా శ్రీమద్వేదాంత పంచదశ్యాన్ధ్రటీకాసతాత్పర్యా రామకృష్ణపండిత విరచిత వ్యాఖ్యానుసారిణీ మయాతత్రతత్రవ్యలోకి. ఇయమేతన్నిరంతగద్రష్టౄణాం బాలానాముక్తవక్తవ్యవివదిష్యమాణాది భేదాభావవత్తయా కరతలామలకవత్పరాత్మ విద్యామాదధతీసతీయ థానిరపేక్షితభూయోగ్రంథజాలం ముక్తిమాదిశతీతిమన్మనః.

శ్లో॥ హృద్యాపద్యార్థతాత్పర్యబోధినీపాపశోధనీ।
యశోధనైస్సద్భిరపి శోధనీయానవాభవేత్॥

ఇట్లు,
అలుకూరు, } గొల్లాపిన్ని - మల్లికార్జునశాస్త్రి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri